చతుర్వేదాంతర్గత

# ఉపనిషత్ ఉద్యానవనము

**సంపుటి - 6 (రెండు భాగములు)**
**(మంగళ శ్లోక - తాత్పర్య - అధ్యయన సమేతంగా)**
**సామవేదాంతర్గత (1), అథర్వణవేదాంతర్గత (9)**
**- "10" ఉపనిషత్తులు -**


అధ్యయన విద్యార్థి

**- యేలేశ్వరపు హనుమ రామకృష్ణ**



ప్రథమ ముద్రణ : **20-10-2021**

ప్రతులు : 500

వెల : రూ. 500/-

పబ్లిషర్

**శ్రీమతి యేలేశ్వరపు కనకదుర్గ**

D.No. 2/8, Siva Temple Street,
Kuchipudi - 521 136 Krishna Dist. A.P. India

ప్రతులకు

**Cell : +91 79956 97330** (యేలేశ్వరపు ప్రశాంత్)

Cover Page Designed By

**M/s. Aravinda Graphics,** Eluru, Cell : 98486 44882

***DTP & Printed By*** and ***also For copies***

**BRUNDAVANAM SAI KUMAR**

Hasitha Graphics & Printers
Rose Gardens, Eluru-534 001 W.G. Dist
Cell : 97042 75472, 94942 75472

# ముందుమాటలు

**శ్రీ వేదాంతం రాధేశ్యామ్**,
M.A. in Telugu, Diploma in Kuchipudi Dance, Honorary Doctorate.
కూచిపూడి నాట్య ఆచార్యులు మఱియు దర్శక ప్రదర్శకులు,
కళా నీరాజన పురస్కారం, కేంద్ర సంగీత నాటక అకాడమీ అవార్డు, హంస రాష్ట్ర అవార్డు, ఉత్తమ ఉపాధ్యాయ, జీవన సాఫల్య పురస్కారం మొదలగు అనేక అవార్డుల, సన్మానముల గ్రహీతలు.
కూచిపూడి గ్రామము - 521136
05-July–2021

ఉపనిషత్ విజ్ఞాన ఉద్యానవనమును తిలకించి, పులకించి, ఆనందించితిని. సర్వము బ్రహ్మమయమని తెలుసుకొంటిని. పరమాత్మయే (నా) ఆత్మ అని తెలుసుకొంటిని.

"ఉపనిషత్ ఉద్యానవనం, 6వ సంపుటి" యందు అన్ని ఉపనిషత్తులు మా అన్నగార్లైన శ్రీ యేలేశ్వరపు హనుమ రామకృష్ణ గారు, మఱియు, వారి సుపుత్రుడు చి,, యేలేశ్వరపు ప్రశాంత్ చక్కగా ప్రకటితము చేసిరి. చాలా సంతోషం!

❖ ❖ ❖

**శ్రీమతి డాక్టర్ మొవ్వ జయలక్ష్మి**,
M.B.B.S., F.C.G.P., and Diploma in Music
శ్రీదేవి క్లినిక్,
కూచిపూడి - 521136
02-August–2021

శ్రీ యేలేశ్వరపు హనుమ రామకృష్ణ గారు మా కుటుంబమునకు ఆప్తులు, చిరకాల మిత్రులు మఱియు నాకు సోదర తుల్యులు.

వారు ఆధ్యాత్మిక చింతనాపరులు, బహుముఖ ప్రజ్ఞాశాలి. వారు జీవితమంతయు ఎంతో కృషి చేసి అధ్యాత్మిక గ్రంథములను సరళ తెలుగులో అనువదించి, గొప్ప సంపదను సామాన్య పాఠకులకు సైతము కరతలామలకము చేసిరి.

వారు ఉద్యోగ విరమణ చేసిన పిదప వారి స్వగ్రామమైన కూచిపూడిలో స్థిరపడిన తరువాత, తరచూ మేము వేదాంత విషయములు సంభాషించుకుంటూ ఉండేవారము. ఆధ్యాత్మిక విషయాలలో నాకు ఏమైనా సందేహాలు ఉన్న ఎడల రామకృష్ణ గారు నివృత్తి చేసెడివారు. వారి అకాల మరణము వారి కుటుంబమునకు, వారి అభిమానులమైన మాలాంటి వారికి శరాఘాతము.

వారు "ఉపనిషత్ ఉద్యానవనం" పేరిట వేదముల ద్వారా మనకు లభ్యమైన 108 ఉపనిషత్తులను ఆరు భాగములుగా పాఠకుల సౌలభ్యము కొఱకు రచించి, ప్రచురించ సంకల్పించిరి. అందు ఐదు సంపుటములు ప్రచురించిరి. చివరిదైన ఆరవ సంపుటముకై కృషి చేయుచూ వారు కైవల్య ప్రాప్తి పొందిరి.

వారి ఏకైక పుత్రుడు చి,, ప్రశాంత్ వారి తండ్రిగారి వారసత్వము పుణికిపుచ్చుకొని, రామకృష్ణగారు వ్యాఖ్యానించిన ఉపనిషత్తులతో పాటు మిగిలిన ఉపనిషత్తులను చక్కగా, వివరంగా అనువదించి ఈ యజ్ఞమును పూర్తిగావించి ధన్యులైనారు. తండ్రికి తగ్గ తనయులుగా నిరూపించినారు.

చి,, ప్రశాంత్, వారి తల్లిగారు శ్రీమతి కనకదుర్గ గారు సకుటుంబసమేతముగా ఆయురారోగ్యములతో, అష్టైశ్వర్యములతో వర్థిల్లాలని భగవంతుని ప్రార్థించుచున్నాను.

❖ ❖ ❖

**శ్రీ డాక్టర్ యేలేశ్వరపు హనుమంత రావు**,
M.Sc., M.Phil., Ph.D.
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత,
(Retired) Professor & HoD in the Dept of Chemistry,
Andhra Loyola College,
Vijayawada - 520011
22-August–2021

*ఓం. సర్వే జీవాః సుఖైః దుఃఖైః, మాయాజాలేన వేష్టితాః ||*
జీవులందరూ సుఖదుఃఖములనే మాయాజాలములో చుట్టుకొనబడియున్నారు. అనగా, సంసార బంధాలను పెనవేసుకొనియున్నారు.

శ్రీ యేలేశ్వరపు హనుమ రామకృష్ణ గారు మా పెదనాన్న కొడుకు, నాకు అన్నగారు. దానికంటే, నాకు దైవం! నాకు ఊహ తెలిసినాక జ్ఞానోదయము చేసిన తొలి గురువు!

పైన చెప్పినట్లు భవబంధాలను అనుభవిస్తూ, ఉద్యోగ బాధ్యతలు నిర్వహిస్తూనే వాల్మీకి మహర్షి విరచిత "యోగవాసిష్ఠము" అను సంస్కృత మహద్గ్రంథమునకు సరళ వ్యావహారిక తెలుగు భాషలో, సంపూర్ణ వచనానువాదముగా "శ్రీ వసిష్ఠ రామ సంవాదము" అను గ్రంథమును పన్నెండు సంవత్సరములు కృషి చేసి రచించినారు. ఆ ఒక్క కార్యక్రమముతోనే వారు ధన్యజీవులైనారు.

నేను చిన్నతనములో మహాకవి కాళిదాసు చరిత్ర చదివియున్నాను. కాళిదాసులో అమ్మవారి దయతో వచ్చిన మార్పులాంటిదే నేను చిన్నతనము నుండి చూస్తున్న మా అన్నయ్యలోని ఆధ్యాత్మిక మార్పు అని అనుకుంటూ ఉంటాను. దానికి తోడు మా పూర్వీకులు అయిన వారి తండ్రి గారు శ్రీ యేలేశ్వరపు లక్ష్మీనారాయణ గారు, తాతగార్లు శ్రీ యేలేశ్వరపు రామకృష్ణయ్య భాగవతార్లు గారు, శ్రీ యేలేశ్వరపు ఆంజనేయులు గారి ద్వారా ఈ జ్ఞాన బీజము సంక్రమించినది.

అన్నయ్య తన చిన్నతనమునుండి ఎన్నో కుటుంబ కష్టములు అనుభవిస్తూ ఆంధ్రా బ్యాంకులో ఒక clerkగా ఉద్యోగము ప్రారంభించి, తనదైన శైలితో ఉద్యోగమునకు అధిక ప్రాధాన్యము ఇస్తూ, ఉద్యోగములో ఉన్నత శిఖరాలు అధిరోహించి, దానితో సమాంతరంగా వేదాంత ధోరణిని సాగిస్తూ, పూర్వ జన్మ సుకృతము వలన, భగవంతుని దయచే, మఱియు గురువుల కృప వలన ఆయనలోని ఆధ్యాత్మిక మార్పునకు యోగవాసిష్ఠముచే అంకురార్పణ జరిగినది. అప్పటినుండి అనేక రచనలు చేసి, వేదములలోని 108 ఉపనిషత్తులకు శ్లోక-తాత్పర్య-వ్యాఖ్యాన సహితముగా "ఉపనిషత్ ఉద్యానవనం" అను గ్రంథ రచన కొనసాగించి ఆరు సంపుటములుగా ప్రచురిస్తూ, చివరి సంపుటము వ్రాయుచూ వారు శివైక్యం చెందినారు.

ఈ బృహత్తర కార్యక్రమము మధ్యలో ఆగిపోకూడదని వారి కుమారుడు చి,, యేలేశ్వరపు ప్రశాంత్ (M.Tech in Computer Science & Engineering, IIT Kanpur) చిన్న వయస్సులో ఆ బాధ్యతను తన భుజములపై వేసుకొని, తను చేస్తున్న విలువైన Software ఉద్యోగమును ప్రక్కన పెట్టి, తండ్రి అడుగుజాడలలో పయనిస్తూ, కూచిపూడి స్వగ్రామములోనే ఉంటూ ఈ బృహత్తర కార్యక్రమమును పరమేశ్వరుని అనుగ్రహముతో దిగ్విజయము చేసినందుకు ఆ చిరంజీవికి నా ఆశీస్సులు, హృదయపూర్వక శుభాభినందనలు. అందరికీ తేలికగా అర్థం కావాలి అనే సంకల్పంతో అత్యంత సులభ శైలిలో తెలుగు మఱియు కొన్ని అవసరమైన చోట్ల ఆంగ్ల పదజాలము వాడుచూ తండ్రీకొడుకులు వ్రాసిన ఈ మహత్తర గ్రంథము ప్రశంసనీయము.

మన ప్రాచీన భారతీయ సంస్కృతికి రాను రాను దూరమవుతున్న నేటి సమాజానికి అత్యంత సులభమైన వాడుక పదజాలముతో, అందరూ చదువుటకు వీలుగా ఉన్న ఈ మహత్తర, దివ్యమైన, అద్భుతమైన ప్రయత్నము చేసినందులకు మా అన్నగారు శ్రీ యేలేశ్వరపు హనుమ రామకృష్ణ గారి పాదపద్మములకు నా శిరస్సు వంచి నమస్కరిస్తున్నాను. ఈ విశేషమైన కృషిలో వారి సతీమణి శ్రీమతి కనకదుర్గ గారి సహకారము మరువలేము.

ఈ కఠినతరమైన బాధ్యతను అత్యంత విజయవంతముగా పూర్తి చేసిన చి,, ప్రశాంత్‌కు ఆయురారోగ్యములను ప్రసాదించి, అతను కూడా తన ఉద్యోగమును నిర్వహించుకుంటూ, సంసార వ్యవహారాలను సమన్వయించుకుంటూ, భవిష్యత్తులో తండ్రివలె ఇటువంటి బృహత్తర కార్యములు చేయునట్లు సర్వేశ్వరుని ప్రార్థిస్తున్నాను.

❖ ❖ ❖

**శ్రీ యేలేశ్వరపు రామకృష్ణ ప్రసాద్**,
B.Com.
[Retired] Assistant Mananger (Accounts),
Andhra Pradesh State Civil Supplies Corporation, Vijayawada
22-August–2021

మా పెదనాన్న పెద్దమ్మలు అయిన శ్రీ యేలేశ్వరపు లక్ష్మీ నారాయణ, ఆదిలక్ష్మీ కామేశ్వరమ్మ గార్లకు జన్మించిన కారణజన్ముడు మా అన్నయ్య శ్రీ యేలేశ్వరపు హనుమ రామకృష్ణ గారు. అంతే కాదు, ఆయన నాకు గురువు.

నాకు, నా తమ్ముడికి రామకృష్ణ మఱియు హనుమంతరావు అని మా తల్లిదండ్రులు మాకు నామకరణం చేసారు. మా పేర్లు రెండు కలిపి మా అన్నయ్య అని మేము చాలా సందర్భాలలో ముచ్చటించుకునేవాళ్ళము. మా సోదరులిద్దరికీ మా హనుమ రామకృష్ణ అన్నయ్య ఆత్మ వంటివారు. అట్లాగే, మా అన్నయ్య మా ఇద్దరినీ తన ఆత్మవలె చూసుకునేవారు.

మా అన్నయ్య యేలేశ్వరపు వంశానికి ఒక గుర్తింపు తెచ్చినారు. అన్నయ్యకు వృత్తి ఆంధ్రా బ్యాంకు, ప్రవృత్తి వేదాంత రచనలు చెయ్యటం. ఆయనకు ప్రవృత్తి మా పూర్వీకుల నుండి సంక్రమించినది. కాళిదాసును అమ్మవారు కటాక్షించినట్లు మా అన్నయ్యకు వృత్తికి విరుద్ధమైన సంస్కృతాంధ్రముల అక్షర వ్యాసంగము కూచిపూడి బాలా త్రిపుర సుందరి అమ్మవారి కరుణా కటాక్షముల అనుగ్రహముచే వచ్చినది అని మా భావన.

శ్రీ హనుమ రామకృష్ణ గారి రచనలు - శ్రీ వసిష్ఠ రామ సంవాదం (యోగవాసిష్ఠం) నాలుగు సంపుటములు , భగవద్గీత అధ్యయన పుష్పం, శ్రీ కృష్ణ ఉద్ధవ సంవాదం (ఉద్ధవగీత), గొల్లకలాపము - కూచిపూడి నాట్య వేద ఆత్మయజ్ఞము, గానసౌరభాలు, నారద భక్తి సూత్రములు, ఉపనిషత్ ఉద్యానవనం (108 ఉపనిషత్తులకు శ్లోక-తాత్పర్య-వ్యాఖ్యానములు) ఆరు సంపుటములు.

వారు “ఉపనిషత్ ఉద్యానవనం” సంపుటములు ఏలూరులోని ఆర్.ఆర్.పేట సాయిబాబా గుడి ఆవరణలో ఆవిష్కృతం చేయుచుండెడివారు. అందు రెండు భాగములకు నేను కూడా ప్రత్యక్షముగా ఉండి, వేదిక మీద ఆయన ప్రక్కన కూర్చుని, వక్తగా మాట్లాడే భాగ్యం కలగడం నా పూర్వ జన్మ సుకృతం.

మా అన్నయ్య ప్రేమ స్వరూపుడు, సత్వగుణ సంపన్నుడు. ఇతరులను నిస్వార్థంగా ప్రేమించటం, ఆర్ద్రతతో భగవంతుని స్మరించటం, ఎప్పుడూ సత్యమునే ఆచరించటం ఆయన వద్ద నుండి నేర్చుకున్నాను.

అన్నయ్య యొక్క పరంపరను మన చి,, ప్రశాంత్ కొనసాగించి, ఉపనిషత్ ఉద్యానవనం చివరి భాగమును పూర్తిచేసి పితృ ఋణమును తీర్చుకొనినాడు. అన్నయ్య అనుభూతులు పదిలపరచుకొని ఆయన నేర్పిన బాటనే అనుసరిస్తాను. అన్నయ్యా! నీకు హృదయపూర్వక శ్రద్ధాంజలి ఘటించుచున్నాను.

❖ ❖ ❖

**శ్రీ కుక్కల గిరి వేంకట సూర్య ప్రసాద్**,
B.Tech [Computer Science & Engineering]
Senior Principal Architect at OpenText, Hyderabad
09-August–2021

మా గురువర్యులు మరియు ఆచార్యులు కీ.శే. శ్రీ వై.హెచ్.రామకృష్ణ గారు తెలుగు ప్రజలకు అందించిన ఈ “ఉపనిషత్ ఉద్యానవనం” ముముక్షువులకు, సాధకులకు ఉపనిషత్తుల అధ్యయనము కొఱకు అత్యంత విలువైన సంపదగా భావిస్తున్నాను. సంస్కృతంలో ఉన్న మహత్తరమైన జ్ఞానాన్ని సామాన్యులకు కూడా సులువుగా అర్థమయ్యేలా లభించడం తెలుగు ప్రజల అదృష్టం.

గురువు గారి ఉపదేశాలు మఱియు వారి నడవడిక నా జీవితాన్ని ఎంతగానో ప్రభావితం చేసాయి. ఇలాంటి జ్ఞాన సంపన్నులు, సంఘ సేవకులు పుట్టిన తెలుగు జాతిలో పుట్టడం నా అదృష్టం.

గురువుగారి ఆధ్యాత్మిక పరంపరను అందిపుచ్చుకున్న వారి కుమారులు శ్రీ వై. ప్రశాంత్ గారు వారి తండ్రిగారి రచనా సేవ కొనసాగించటం అభినందనీయం. తనకు కళాశాల నుండి నేను ప్రాణమిత్రుడను అయినందుకు గర్విస్తున్నాను.

❖ ❖ ❖

**శ్రీ డాక్టర్ భాగవతుల భాస్కర రామ శర్మ,**
M.Sc., Ph.D.
Professor of Mathematics,
IIT HOME, Nagpur, Maharashtra State
02-Aug–2021 (Vijayawada)

నా "నుడి"

*జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః।*
*నాస్తి తేషాం యశఃకాయే జరామరణజం భయం॥*

కీ.శే. వై.హెచ్.రామకృష్ణ గారు కారణజన్ములు.

వారికి నాకు ఉన్న సాన్నిహిత్యం చాలా గొప్పది. బాంధవ్య రీత్యా వారు నాకు మేనత్త కొడుకు. నా చిన్నతనం నుండి అనేక విషయాలలో నన్ను ఉత్తేజపరచిన వ్యక్తిగా నేను ఆయనను ఎల్లప్పుడు గుర్తుంచుకుంటాను.

మొదట్లో సంస్కృత భాషతో ఎక్కువగా పరిచయం లేని ఆయన దైవ ప్రేరణతో సంస్కృత పాండిత్యం సంపాదించుకొని ఆధ్యాత్మిక గ్రంథ రచన సాగించటం నాకు పరమాశ్చర్యకరమైన విషయం. గ్రంథ రచన ప్రారంభించినప్పటి నుండి ప్రతిదినము తెల్లవారు ఝామున మూడు గంటలకు లేచి వ్రాసుకునేవారు. మరలా ఉదయం తొమ్మిది గంటలకు ఆంధ్రా బ్యాంకులో తన విధులకు వెళ్లేవారు. ఆయన నుండి అనేక ఆధ్యాత్మిక విషయాలు, సమయ వినియోగం వంటి లక్షణాలు నేను నేర్చుకోగలిగాను.

పూజ్యులు శ్రీ విద్యాప్రకాశానంద గిరి స్వామి (శ్రీ శుకబ్రహ్మాశ్రమం, ఏర్పేడు, శ్రీకాళహస్తి) గారి భగవద్గీత ఉపన్యాసములు రామకృష్ణగారిని, నన్ను కూడా ఆధ్యాత్మికంగా ఎంతో ప్రభావితం చేసాయి. నేను రామకృష్ణ గారితో తరచూ స్వాముల వారి ఉపన్యాసములలోని అంశాలు చర్చిస్తూ సత్సాంగ ఫలం పొందేవాడిని.

రామకృష్ణ గారి "శ్రీ వసిష్ఠ రామ సంవాదం (యోగ వాసిష్ఠం)" గ్రంథమును శ్రీ రామకృష్ణ మఠం, హైదరాబాదు వారు ప్రచురించటం ముదావహం. ఉపనిషత్ ఉద్యానవనం చదివి, అందులోని అంశాలను వారితో అనేకసార్లు చర్చలు చేపట్టే భాగ్యం నాకు దక్కింది. వృత్తి రీత్యా బ్యాంకు ఉద్యోగి అయినప్పటికీ, పూర్వ జన్మ ఫలం చేత ప్రవృత్తి రీత్యా ఆధ్యాత్మిక గ్రంథ రచయిత కాగల్గిరి.

"ఉపనిషత్ ఉద్యానవనం"లో 5 సంపుటములను పూర్తి చేసి ప్రచురించి, 6వ సంపుటంలో కొంత భాగమును వ్రాసిన పిదప వారు శివైక్యం చెందిరి. తదుపరి, వారి తనయుడు చి,, యేలేశ్వరపు ప్రేమ్ ప్రశాంత్ తండ్రిగారి అనుగ్రహం వలన మిగిలిన భాగమును పూరించి, వారి ఆశయం మేరకు 6వ సంపుటమును సంపూర్ణంగా పాఠకులకు అందిస్తున్నారు. వృత్తి రీత్యా Software ఉద్యోగి అయిన ప్రశాంత్ ప్రవృత్తి రీత్యా తండ్రిగారి వారసత్వాన్ని పుణికిపుచ్చుకొని, సంస్కృత భాషను అభివృద్ధి పరచుకొని, ఉపనిషత్తుల అనువాదం హృద్యంగా పూర్తి చేసారు. వారి తండ్రిగారి బాణీ యథాతథంగా అందించగలిగారు.

ప్రస్తుత (6వ) సంపుటియందు 10 ఉపనిషత్తులు అందించబడుచున్నవి. అవి ఛాందోగ్యోపనిషత్తుతో మొదలై శాండిల్యోపనిషత్తుతో పూర్తవుచున్నవి. అన్ని శ్లోకాలు అర్థ తాత్పర్య సహితములై సామాన్యులకు కూడా అవగతమగు విధంగా విరాజిల్లుచున్నవి. ఈ ప్రయత్నం చేసిన చి,, ప్రశాంత్‌కు తండ్రిగారి ఆశీస్సులు, పాఠక లోకం యొక్క మన్ననలు లభించు గాక! కూచిపూడి పరదేవతలైన శ్రీ బాలా త్రిపుర సుందరి మఱియు శ్రీ రామలింగేశ్వర స్వామి వార్ల ఆశీస్సులు ఈ చిరంజీవికి లభించి ఆగామి కాలంలో మరిన్ని రచనలు చేపట్టు గాక!

**యేలేశ్వరపు వంశస్థం**
**జ్ఞాన దీపిత భాస్కరం**
**నమామి రామకృష్ణాఖ్యం**
**ఆధ్యాత్మిక ప్రదీపకం ॥**

మంగళం మహత్! శ్రీశ్రీశ్రీశ్రీ!

❖ ❖ ❖

**శ్రీమతి జొన్నవిత్తుల బాలా త్రిపుర సుందరి**,
భాషా ప్రవీణ, (విశ్రాంత) తెలుగు ఉపాధ్యాయిని,
కూచిపూడి.
28-July–2021

నాకు తెలిసిన శ్రీ వై.హెచ్. రామకృష్ణ గారు -

మహనీయులైన ఆధ్యాత్మిక తత్త్వవేత్తల కోవకు చెందిన గొప్ప వ్యక్తి. వారు వృత్తి రీత్యా బ్యాంకు ఉద్యోగి, ప్రవృత్తి రీత్యా తాత్విక చింతనాపరులు. వేదాంత ఉపన్యాసకులు. అనువాద గ్రంథ రచయిత.

శ్రీమత్ భగవద్గీత లోని 6వ అధ్యాయము (ఆత్మ సంయమ యోగము)లో “యోగ సాధకుడు దురదృష్ట వశమున ఆత్మ సాక్షాత్కార స్థితిని పొందక చ్యుతుడు అయినచో ఆ సాధకునికి ఏ గతి ప్రాప్తించును?” అని అర్జునుడు పరిప్రశ్నించగా, శ్రీ కృష్ణ భగవానుడు - “సాధకుడు తన సాధన నుండి చ్యుతుడు అయినప్పటికినీ యోగభ్రష్టుడు కాడు, సాధన వ్యర్థం కాదు! అది మరు జన్మమున యోగసాధనకు పూర్వరంగమగును. ఆ సాధనా బలముతో యోగసాధన కొనసాగించి ఆత్మ సంయోగ స్థితిని పొందును” అని ప్రవచించిరి.

హనుమ రామకృష్ణ గారు పైరీతిగా పూర్వ జన్మ సాధన తోడు రాగా, ఈ జన్మమున ఆధ్యాత్మ చింతనా వాతావరణము గల కుటుంబములో జన్మించిరని నేను అనుకుంటాను. వారి ఇంటిలో వారి అమ్మమ్మగారు, అమ్మగారు, ఇరుగుపొరుగు మహిళలు అందరూ కలిసి నిత్యం భాగవతాది పురాణ గ్రంథములను పఠించటం, భక్తి పాటలు పాడటం, నోములు, వ్రతాలు చేయటం జరుగుతూ ఉండేది. వారి తాతగారు యేలేశ్వరపు రామకృష్ణయ్య గారు గొప్ప ఆధ్యాత్మికవేత్త అని, హరికథా గానం చేసేవారని, కవి అని వినియున్నాను.

హనుమ రామకృష్ణ గారు కష్టపడి బాగా చదువుకొని వృద్ధిలోకి వచ్చినారు. వారు నాకు పరిచయమయే నాటికి ప్రథమ శ్రేణిలో పట్టభద్రులై ఉద్యోగ ప్రయత్నములో ఉన్నారు. అనతి కాలంలో ఉద్యోగం రావటంలో కూచిపూడి విడచి వెళ్లారు. అప్పటివరకు సంస్కృత పరిజ్ఞానం, ఆధ్యాత్మిక చింతన అంతగా కలవారు కారు. కాలగమనంలో గత జన్మ వాసనా ప్రేరణ, భగవదనుగ్రహము, సాధుపుంగవులైన ఉత్తమ గురువుల ఆశ్రయ అనుగ్రహములు, పెద్దల ఆశీస్సులు సంపూర్ణముగా లభించటంతో ఒక ప్రక్క ఉద్యోగ బాధ్యతలు నిర్వహిస్తూనే, అకుంఠిత దీక్షతో, నిర్విరామ కృషితో సంస్కృతాంధ్రములందు పట్టు సాధించి, ఆధ్యాత్మిక గ్రంథములను కూలంకుషంగా అధ్యయనం చేసి, అవగాహన చేసుకొని, యోగనిష్ఠులై ఆత్మ జ్ఞానమును, ఆత్మ సాక్షాత్కారమును పొందిరని నేను భావిస్తున్నాను.

ఆత్మానుభూతిని సాధించుకున్న హనుమ రామకృష్ణ గారు తన తోటి మానవులను కూడా ఆధ్యాత్మిక చింతనవైపుకు మరల్చి, వారందరికీ ఆత్మజ్ఞాన బోధన చేయాలనే సదుద్దేశ్యంతో యోగవాసిష్ఠం, భగవద్గీత, ఉద్ధవ గీత మొదలగు సంస్కృత గ్రంథములను అలతి అలతి పదాలతో సరళంగా, సుబోధకంగా, భావయుక్తంగా, విమర్శనాత్మకంగా వచన రూపమున ఆంధ్రానువాదము చేసిరి. ఆధ్యాత్మిక వేత్తల ప్రశంసలు పొందిరి. అంతటితో తృప్తి చెందక రేయింబవళ్ళు శ్రమించి వేదశాఖలైన 108 ఉపనిషత్తులను సైతం వాటి అమృతసారమును సులభ గ్రాహ్యమగునట్లు వచన రూపమున తెలుగులోకి అనువదించి, వ్యాఖ్యానించి గ్రంథస్థం చేసి వేదాంత అధ్యయనపరులకు అందించినారు.

పదవీ విరమణ అనంతరం స్వస్థలమైన కూచిపూడికి వచ్చిన తరువాత, వారు సత్సంగములను ఏర్పరచి, ఆధ్యాత్మిక ప్రవచనములను చేయుచూ గ్రామస్థుల ఆధ్యాత్మిక పురోగతికి కృషి చేసారు. దేవాలయ ఉత్సవములలోను, సాంస్కృతిక కార్యక్రమములలోను పాల్గొనేలా యువతను ప్రోత్సహించేవారు. దానధర్మాలు చేస్తూ పేదలను, దీనులను ఆదుకొనేవారు. ఆయన గొప్ప స్నేహశీలి. నిగర్వి. నిరాడంబరులు. నిత్య సంతుష్టులు. ఎంతోమందికి మార్గదర్శకులు. సిద్ధ యోగపురుషులు. పదిమంది యోగక్షేమాలు కోరుకొనే మహామనిషి.

ఊహించనిరీతిగా హఠాత్తుగా పరలోకగతులై బ్రహ్మైక్యమును పొంది వారు ఆప్తులందరికీ దుఃఖమును మిగిల్చిరి. స్ఫూర్తిదాయకమైన వారి బోధనలు, రచనలు సదా అందరికీ అనుసరణీయములు.

బ్రహ్మజ్ఞాన సంపన్నులైన రామకృష్ణ గారికి నా భక్తిపూర్వక నివాళులు.

❖ ❖ ❖

**శ్రీ పసుమర్తి నారాయణ మూర్తి**,
[విశ్రాంత] సంస్కృత ఉపాధ్యాయులు, కూచిపూడి.
22-Aug–2021

శ్రీ హనుమ రామకృష్ణ గారు సుప్రసిద్ధ అనువాద రచనా చతురులు, బహుముఖ ప్రజ్ఞాశాలి, అనితర సాధ్య వాక్పటిమ సిద్ధులు.

"శ్రీ వసిష్ఠ రామ సంవాదం" పేరుతో యోగవాసిష్ఠమును తెలుగులో వచనానువాదము చేసినారు."అధ్యయన పుష్పం" అను పేరుతో భగవద్గీత, ఉద్ధవగీత, నారద భక్తి సూత్రములు, వేదాంగములలో 108 ఉపనిషత్తులను సరళశైలిలో తెనుగున అనువదించి ప్రఖ్యాత వ్యాఖ్యాతగా ప్రసిద్ధికెక్కినారు.

వీరు భగవద్గీతను ఉపదేశిస్తున్నప్పుడు నేను ప్రత్యక్షముగా విన్నాను. అక్కడ విన్నవారు అలౌకిక ఆనందం పొందవలసినదే! అదీ వారి వేదాంత వాక్పటిమ! అది భగవద్దత్తవరం. వీరు తెలుగులో అనువదించిన వేదాంత గ్రంథములు చదివినచో వేదాంతులై చరించవలసినదే! భారతీయ వేదాంతాన్ని శిఖరాయమాన స్థాయికి తెసుకెళ్లిన వీరు నిత్య స్మరణీయులు.

ఉపనిషత్తులలోని మహావాక్యములు కొన్ని - "అహం బ్రహ్మాఽస్మి", "తత్త్వమసి", "అయం ఆత్మా బ్రహ్మ", "బ్రహ్మ సత్యం, జగత్ మిథ్యా", "జీవ ఏవ బ్రహ్మ, బ్రహ్మ ఏవ జీవ, నా అన్యత్ అస్తి". ఇవి ఆత్మ జ్ఞానాన్ని మనకు గోచరింపచేస్తాయి. అలాంటి 101 ఉపనిషత్తులను పాఠకుల సౌలభ్యం కొఱకు వీరు శ్లోకములకు సంధులు విడదీసి, అర్థ తాత్పర్యములతో విశదపరచటమే కాక వ్యాఖ్యానములు కూడా వ్రాసినారు. వారి హఠాన్మరణము తరువాత వారి కుమారుడు చి,, ప్రశాంత్ మిగిలిన 7 ఉపనిషత్తులకు శ్లోకతాత్పర్యములు వ్రాసినారు. తద్వారా తండ్రి ఆత్మకి శాంతి చేకూర్చినారు.

మా బావగారైన రామకృష్ణ గారు చిన్నతనము నుండి నాకు మిత్రులు. వారు అమరజీవి. వారు జీవించియున్నచో ఇంకా అనేక మహద్గ్రంథములు అనువాదము చేసియుండెడివారు. తండ్రి యొక్క లక్ష్యము నెరవేర్చిన వారి చిరంజీవికి నా శుభాశీస్సులు.

❖ ❖ ❖

**శ్రీమతి కావూరి లక్ష్మీ సరస్వతి**,
ఉపాధ్యాయురాలు, కూచిపూడి.
21-Aug–2021

కీర్తిశేషులు శ్రీ యేలేశ్వరపు హనుమ రామకృష్ణ గారు నాకు బావగారు, పితృసమానులు. ప్రాతఃస్మరణీయులైన శ్రీ రామకృష్ణ గారు నాకు ఒక మంచి ఆధ్యాత్మిక గురువు. సహజంగా దైనందిక జీవితంలో వేదాంతాన్ని బోధించే ఆయన తాను అదే మార్గాన్ని ఆచరిస్తూ చెప్పటం వలన నాకు, నాలాంటి మరెందరికో ఆయన ధర్మ మార్గదర్శకులు. నా చిన్నప్పటి నుండి ఆయనను దగ్గరగా చూడటం వలన ఆయన గొప్పతనాన్ని తెలుసుకునే అదృష్టం నాకు దక్కింది.

ఆయన నిగర్వి. నిరాడంబరంగా, స్నేహంగా, వాత్సల్యంగా ఉంటూ ప్రతి ప్రాణిలోను పరమాత్మను ఆయన దర్శించే విధానం మనకందరికీ ఆచరణీయం. మనకు ఎవరికి కష్టమొచ్చినా అది తన కష్టంగా భావించి, సమయస్ఫూర్తితో దానిని మనమే పరిష్కరించుకునే సూచన చేసి, ఆ కష్టాన్నే మనం తపస్సుగా మార్చుకునే గమనం చూపించేవారు. ఉదాహరణకు, ఎవరైనా పరులు నిందించారని నేను బాధపడుతుంటే, ఆయన నాతో "నీవెప్పుడైనా ఇతరులను నిందించి ఉన్నావేమో, వారు కూడా ఇలాగే బాధపడి ఉంటారుగా? ఆ దుష్ఫలితం ఇలా తీరిపోయిందనుకొని సంతోషించు!" అనేవారు. ఇంకా ఇలా చెప్పేవారు - "మనం ముష్టివేస్తే బిచ్చగాడు తీసుకోలేదనుకో అది తిరిగి మనకే మిగులుతుంది కదా! అలాగే ఆ నిందలు నీవు స్వీకరించకు, తిరిగి వారికే చేరతాయి". ఈ మాటలు విన్న వెంటనే క్షణంలో బాధ తగ్గిపోయేది. ఇలా ఎన్నెన్నో మంచి మాటలు చెప్పేవారు. బహుశా ఆయన ప్రవర్తన మెచ్చుకొనే కాబోలు భగవంతుడు ఇంత త్వరగా ఆయనను పిలిపించుకున్నట్టున్నాడు. ఆయన భౌతికంగా లేకపోవటం మా అందరికీ తీరని లోటయ్యింది. కానీ మానసికంగా ఆయనను తలచుకోని రోజే ఉండదు.

శ్రీ హనుమ రామకృష్ణ గారు ఎంతో ప్రయాసతో కూడి వ్రాయుచున్న "ఉపనిషత్ ఉద్యానవనం" అనే గ్రంథం పూర్తి అయ్యే సమయంలో ఆయన హఠాన్మరణం చెందిరి. అప్పుడు గ్రంథంలో చివరిదైన 6వ సంపుటం ప్రశ్నార్థకమైంది. కానీ, ఆ వేదమాత ఆయన ఏకైక పుత్రుడు, ప్రాణ సమానుడైన చి,, ప్రశాంత్‌ని ప్రేరేపించి ఆ పని పూర్తిచేసుకుంది. మహానుభావులు జన్మించిన వారి వంశం ఆచంద్రార్కం పుత్రపౌత్రాభివృద్ధిగా వర్ధిల్లాలి. చి,, ప్రశాంత్ ఈ ప్రేరణతో ముందు ముందు మరెన్నో మంచి రచనలతో వారి తండ్రిగారు లేని లోటును భర్తీ చేయాలని, అందుకు భగవంతుని కృప ఆ కుటుంబముపై సర్వదా ఉండాలని త్రికరణ శుద్ధిగా కోరుకుంటున్నాను.

❖ ❖ ❖

## గురుదేవులు శ్రీ యేలేశ్వరపు హనుమరామకృష్ణ గారితో
## ఆత్మీయ అనురాగ అనుబంధము
## వారి శిక్షణ - క్రమశిక్షణ అనుసరణీయం

**గురుదేవులు కీ॥శే॥ శ్రీ యేలేశ్వరపు హనుమ రామకృష్ణగారికి, అమ్మగారు శ్రీ కనకదుర్గమ్మ గారికి పాద ప్రణామములు.**

గురువుగారితో నాకు 25 సంవత్సరాల అనుబంధము. వారు నామీద చూపిన ఆప్యాయత, అనురాగము, వాత్సల్యము, ప్రేమ అనిర్వచనీయం. నేను డి.టి.పి. మరియు ప్రింటింగ్ ప్రెస్ నిర్వహిస్తాను. నాకు 23 సంవత్సరములు వయస్సులో వారితో పరిచయం ఏర్పడినది. వారి పుస్తకాలు దాదాపు అన్నీ నేనే చేసి ముద్రించి ఇచ్చేవాడిని. మొదట్లో నా వయస్సు చిన్నది అవడం వలన ఆ పుస్తకముల ప్రాముఖ్యత నాకు తెలిసేది కాదు. నాకు అంత ఆధ్యాత్మిక జ్ఞానము కూడా లేదు.

2011లో ఒక చిన్న ఫంక్షన్‌కు గురువుగారు మా ఇంటికి వచ్చారు. నన్ను ఆశీర్వదించి ఇలా అన్నారు. "ఉపనిషత్తులు వ్రాస్తున్నాను. ఇది చాలా పెద్ద కార్యక్రమము. ఈ పని చేయటం ఎంతో అదృష్టం. ఇది మహర్షుల ఆదేశము. దీనిని నువ్వు చేయాలి అన్నారు". దేవుని దయ, గురువుల ఆశీస్సుల వలన నాకు ఈ అవకాశం వచ్చింది. ఈ పని చేయడం కోసం ఎంతో సమయం కేటాయించాలి. ఆర్థికంగా కూడా ఎంతో ఖర్చు చేయాలి. లాభాపేక్ష లేకుండా గురువుగారు తక్కువ ధరకే ఈ పుస్తకాలను ఆసక్తిగల ఎంతో మందికి అందించారు. నేను కూడా కమర్షియల్‌గా చేయకుండా, సేవా భావంతోనే చేయడం అందుకు నా కుటుంబ ఆర్థిక స్థితిగతులు కూడా సహకరించడం నిజంగా దైవ సంకల్పమే అని చెప్పవచ్చును.

ప్రతి రోజు ఉదయం 5 గంటలకు గురువుగారు నాకు ఫోన్ చేసి, ఉత్సాహపరిచి, పని వేగంగా జరిగేలా చూసేవారు. ఇంత ఖర్చుతో కూడిన పనిని చేస్తున్నా, అమ్మగారు కనకదుర్గమ్మ గారు (పబ్లిషర్) కూడా ఆనందంతో సహకరించేవారు. మా అమ్మాయిని ఎప్పుడూ ఆశీర్వదించేవారు. ఇప్పుడు మా అమ్మాయి చదువు పూర్తయి సాఫ్ట్‌వేర్ జాబ్ చేస్తున్నది. నాకు మనుమడు పుడతాడని, ఈ పుస్తకాలు చూసి ఇంత పెద్ద గ్రంథాలు ఎలా చేశావని అడుగుతాడని చమత్కరించేవారు. రీడర్స్ అనేక మందితో గురువుగారికి అనుబంధము. వారు అడిగే సందేహాలకు ఎంతో ఓపికగా ఫోన్లో సమాధానములు చెప్పేవారు. వివరించేవారు.

రెండు భాగాలు పూర్తయిన తరువాత నుండి అనేక మంది దేశ, విదేశాల నుండి ఫోన్లు చేసి ఈ గ్రంథములు అద్భుతంగా డి.టి.పి., మరియు ముద్రణ చేసినందుకు ప్రశంసిస్తూ ఉండేవారు. అప్పుడు నాకు ఈ గ్రంథాల విశిష్ఠత, ప్రాముఖ్యత, విలువ అర్థమైనది.

శ్రీ వై.హెచ్. రామకృష్ణ గారు చివరి భాగం పూర్తి అవుతున్న సమయంలో పరమపదించారు. అయినప్పటికీ వారి కుమారుడు శ్రీ యేలేశ్వరపు ప్రశాంత్ గారు వారి సమయాన్ని వెచ్చించి ఎంతో అవగాహనతో ఈ యజ్ఞాన్ని పూర్తి చేయడం విశేషం. ఈ 6వ సంపుటి చదవాలని ఎంతో మంది ఎదురు చూస్తున్నారు. వారందరి అభిలాషను తీర్చిన శ్రీ ప్రశాంత్ గారికి శుభాభినందనలు. ధన్యవాదములు.

తీర్థయాత్రలు చేస్తే పాప ప్రక్షాళన జరుగుతుంది అని అంటారు. గంగ, యమున, సరస్వతి నదులలో స్నానం చేస్తే పుణ్యఫలం లభిస్తుందని చెపుతారు. శ్రీ యేలేశ్వరపు హనుమ రామకృష్ణ గారు వ్రాసిన యోగ వాసిష్ఠము, ఉద్ధవగీత, భగవద్గీత, 108 ఉపనిషత్తులు (6 భాగములు) చదివితే అంతకు మించిన పుణ్యము, జ్ఞానము కలుగుతాయి. ఆధ్యాత్మిక గ్రంథాలు ప్రతి ఒక్కరి జీవితానికి భక్తిని, ముక్తిని, జ్ఞానశక్తిని, ఆత్మసంతృప్తిని ప్రసాదిస్తాయి. ఆ శక్తి ఉపనిషత్ గ్రంథాలలో పుష్కలంగా ఉన్నాయి. అందుచేత ప్రతి ఒక్కరు ఈ గ్రంథాలు చదువవలసిన అవసరము ఉన్నది.

హృదయ దేవాలయంలో దైవాన్ని చూడటం కష్టమే. కాని అటువంటి భాగ్యాన్ని పొందిన గురుదేవులు వై.హెచ్. రామకృష్ణగారి జీవితం ధన్యము. నేటి యువతకు మార్గదర్శకము. భవిష్యత్ తరాలకు వారి గ్రంథాలు ఎంతో స్ఫూర్తి.

**– బృందావనం సాయి కుమార్,**

**హసిత గ్రాఫిక్స్ అండ్ ప్రింటర్స్, ఏలూరు**

ఏలూరు

01-సెప్టెంబరు-2021

# గురు నమస్కారము

గురుదేవులగు

శ్రీశ్రీశ్రీ విద్యాప్రకాశానందగిరి స్వామి వారికి (శుకబ్రహ్మాశ్రమము – శ్రీకాళహస్తి)

శ్రీశ్రీశ్రీ మళయాళస్వామి వారికి (వ్యాసాశ్రమము – యేర్పేడు)

శ్రీశ్రీశ్రీ యేలేశ్వరపు రామకృష్ణయ్య గారికి (హరిదాసు, కూచిపూడి – అస్మత్ పితామహులు)

ఇంకా ఎందరో మార్గదర్శకులు. వారందరికీ నమో నమో నమో నమః।

**కృతజ్ఞతలు** – మాతృ పితృదేవతలు శ్రీ ఆదిలక్ష్మి కామేశ్వరమ్మ, లక్ష్మీనారాయణ దంపతులకు పాదాభివందనము. శ్రీమతి కనకదుర్గను జీవిత భాగస్వామిగా ప్రసాదించిన జగన్మాతకు నమస్కారములు. వారి తోడు **'అమూల్యము'.**

# కృతి సమర్పణ

ఎవ్వరైతే....,

- ఈ సమస్త జగత్తుకు ఆధారుడై, సమస్తము తానే అయి ఉన్నారో,
- ప్రపంచములోని మతములన్నీ ఏ సర్వాత్మకుడగు పరమాత్మయొక్క తత్త్వమును ఎలుగెత్తి గానము చేయుచున్నాయో, ఎవరిగురించి సమస్త ఋషులు, మునులు, ప్రవక్తలు, గురువులు **శృణ్వన్తి మన్వే! "అదిగో! చూడండి"** – అని గొంతెత్తి ఘోషిస్తున్నారో,
- ఏ తత్త్వ పురుషుని గురించి గురుదేవులగు ఆచార్యులు స్వానుభవమును రంగరించి **"అదియే నీవు – తత్త్వమసి"** అని విడమర్చి చెప్పుచుండగా, శ్రవణము చేస్తున్న మనమంతా **'సో౽హమ్'** భావమును వృద్ధి చేసుకుంటున్నామో,
- ఏ అమృత స్వరూపుని గురించి తత్త్వవేత్తలు ఆత్మానందభరితులై యుక్తియుక్తంగా చెప్పుచుండగా, వేదాంతర్గతమగు 'ఉపనిషత్' వాఙ్మయము శ్రవణము చేసినవారిచే శ్రుతులుగా మనందరికీ ప్రసాదించబడిందో,
- శివుడు, విష్ణువు, నారాయణుడు, పద్మభవుడు, రాముడు, కృష్ణుడు, లలిత, అల్లా, యహెూవా, బుద్ధదేవ, మౌల సాయి, మహావీర, నానక్, అమ్మ ఈ విధంగా ఏ "అనంతుడు ఆద్యంత రహితుడు" అగు పరమాత్మ **అసంఖ్యాక నామరూపములుగా** ప్రపంచములోని జనులందరిచే ఉపాసించబడుచూ, ఆరాధించబడుచూ, ప్రేమించబడుచూ ఉన్నారో,
- గురువులు–ఏ కేవలానంద ఆత్మ పురుషుని తమ శిష్యులలో దర్శిస్తూ, శిష్యులకు తత్త్వబోధ చేస్తూ ఉండగా, **శిష్యులు – తమయందే వేంచేసియున్న ఆ పరమాత్మ తమకు అభిన్నమని తెలుసుకొని బ్రహ్మానందభరితులగుచున్నారో,**
- ఏ పరాత్పరుడు ఒక చీమ నుండి సృష్టికర్త అగు బ్రహ్మదేవుని వరకు, మనందరి దృశ్యానుభవములకు ఆవల గల మన బుద్ధికి సాక్షి అయి వెలుగొందుచున్నారో, (యా బ్రహ్మాది పిపిలీకాంత తనుషః ప్రోక్తా జగత్ సాక్షిణా)।
- ఏ పరంధాముడు అనేకమంది ధ్యాత–వక్త–రచయితల స్వరూపుడై ఉపనిషత్తు వాఙ్మయమును, వ్యాఖ్యానములను తరతరాలుగా అందిస్తూ మానవాళికి ఇప్పటికే మహెూపకారము చేసి ఉన్నారో,
- ఏ మహత్ అహంకారుడు సమస్త జీవులలో "నేను – నేను" అను ప్రదర్శనముతో ఈ విశ్వ దృశ్యములు అసంఖ్యాక రీతులుగా ఆస్వాదించుచూ, నన్ను తన మాయతో భ్రమింపజేస్తూ, ఇంతలోనే నేను శరణు వేడుచుండగా సర్వ స్వరూపుడై నా బుద్ధికి అనుభవుడగుచున్నారో,

- ఏ తురీయ స్వరూపుడు మహర్షుల స్వరూపుడై ఈ బుద్ధిని ప్రేరేపిస్తూ, సమస్త పాతక దేవతల స్వరూపుడై నన్ను ఈ మహత్తరమైన **'ఉపనిషత్ ఉద్యానవనము'** అను మహా యజ్ఞమును నిర్వర్తింపజేస్తూ, నాపై అనుగ్రహముతో నాయొక్క **"జన్మ జన్మల అజ్ఞాన అంధకారము"** అనే నిబిడాంధకారము (చిమ్మచీకటిని) తొలగిస్తూ ఉన్నారో...,
- ఎవరిని గురించి వేదోపనిషత్తులు విస్తారంగా చెప్పియుండి కూడా "మేము చెప్పలేము" - అని వెనుతిరిగి నమస్కరిస్తున్నాయో...,

**అట్టి జగత్ స్వరూపునికి, జగదతీతునికి, జగదానందునికి, జగత్ సంమోహ మోహినీ స్వరూపునికి, అవాక్‌మానసగోచరునికి నమస్కరిస్తూ, సమస్తము ఆ పరాత్పరునికి, పరంధామునికి, "లోకకళ్యాణమగు గాక!" అని మనన పూర్వకంగా సమర్పిస్తున్నాను.**

## కృతజ్ఞతలు

ఉపనిషత్ మంగళశ్లోకములు, సంధులు విడదీసి వ్రాయటములో, ప్రూఫ్ రీడింగ్‌లో తమవంతు సహకారము అందించిన -

- శ్రీమతి కావూరి లక్ష్మీ సరస్వతికి, వారి పతిదేవుడు నా తమ్ముడు శ్రీ కావూరి పూర్ణచంద్ర శర్మ (కూచిపూడి)కి
- శ్రీమతి మల్లాది సుభద్రకు, వారి పతిదేవుడు నా తమ్ముడు శ్రీ రాజేంద్ర ప్రసాద్ (లబ్బీపేట, విజయవాడ)కు,
- ఇ-మెయిల్ Texts ప్రింటింగ్‌లో హృదయపూర్వక సహకారము అందిస్తున్న - నా బావమరిది శ్రీ భాగవతుల శరత్‌చంద్ర (శర్మాస్ స్టూడియో, కూచిపూడి)కు, వారి సతీమణి శ్రీమతి శిరీషకు,
- మా బావగారు శ్రీ పసుమర్తి నారాయణమూర్తి (విద్యాప్రవీణ) - కూచిపూడి, వారి సతీమణి, మా చెల్లెలు శ్రీమతి సీతారామలక్ష్మికి,
- శ్రీమతి జొన్నవిత్తుల బాలా త్రిపుర సుందరి గారికి (భాషాప్రవీణ, కూచిపూడి),
- శ్రీ కుక్కల గిరి వేంకట సూర్యప్రసాద్ గారికి (సాఫ్ట్‌వేర్ ఇంజనీర్, హైద్రాబాద్),
- శ్రీ బండారు వేంకటేశ్వరరావు గారికి (సాఫ్ట్‌వేర్ ఇంజనీర్, కాలిఫోర్నియా, అమెరికా)

శుభాశీస్సులు। శుభాకాంక్షలు। వీరందరికి ఆచంద్రార్కం వంశాభివృద్ధిరస్తు। భక్తి జ్ఞాన వైరాగ్య సిద్ధిరస్తు। వేదమాత కరుణా కటాక్ష వీక్షణ ప్రాప్తిరస్తు।

ఇంతకుముందు రచింపబడిన ఈ గ్రంథములు మాకు ఎంతో సహకారికములు అయినవి.

ఛాందోగ్యోపనిషత్ - స్వామి తత్త్వవిదానంద సరస్వతి

ఛాందోగ్యోపనిషత్ - శ్రీ రాయసం వీరేశ్వర శర్మ

ఉపనిషత్ కల్పతరువు - శ్రీ గట్టి సత్యనారాయణ గుప్త

ఎందరో ఈ యజ్ఞములో పాలుపంచుకొంటున్నారు. వారందరికి వేదమాత చల్లటి చూపు ప్రసరించును గాక!

ఎంతో నేర్పు - ఓర్పులతో డి.టి.పి. ముద్రణలలో పరిశ్రమిస్తున్న చిరంజీవి బృందావనం సాయికుమార్, హసితా గ్రాఫిక్స్ అండ్ ప్రింటర్స్ - ఏలూరు, కవర్ పేజి సుందరంగా తీర్చిదిద్దుతున్న చిరంజీవి పి. సుబ్రహ్మణ్యం, అరవింద గ్రాఫిక్స్ - ఏలూరు వీరిరువురికి శుభాశీస్సులు. ఈ కార్యక్రమము ద్విగిజయంగా కొనసాగటానికి చి॥ బి. సాయికుమార్‌ను ఋషిపుంగవులు నాకు తోడుగా ప్రసాదించారు. ఈ మహత్తర అవకాశమును మా ఇద్దరికి ప్రసాదించిన పరమేశ్వరునికి - శరణు। శరణు।

**శివార్పణమస్తు। శ్రీమన్నారాయణార్పణమస్తు। శ్రీకృష్ణార్పణమస్తు।**

**ఆత్మార్పణమస్తు। ఓం తత్ సత్ బ్రహ్మార్పణమస్తు।**

**ఓం శాంతిః శాంతిః శాంతిః॥**

**భగవత్ భక్తజన-యోగజన-జ్ఞానజన-చరణ కమలోపాసకుడు - అధ్యయన విద్యార్థి**

**యేలేశ్వరపు హనుమ రామకృష్ణ** B.Com., C.A.I.I.B.,

(Retd, Chief Manager - Andhra Bank)

D.No. 2/8, "Sri Vasista Rama Nilayam", Siva Temple Street, **Kuchipudi - 521 136** Krishna Dist. A.P. India

Website: www.yhramakrishna.com

**ఉపనిషత్తులు ఎవ్వరికైనా అర్థమౌతాయా?**
**అందరికీ తప్పక అర్థమౌతాయి.**

అవును. ఎవ్వరికైనా అర్థమౌతాయి. ఎందుకంటే అవి చెప్పుచున్నది మనలోని ప్రతి ఒక్కరికి చెందినట్టి – నిత్య సత్యమైనది, జగద్దృశ్యమునకు ఆవలిదైనట్టిది, సహజము అగు **ఆత్మస్వరూపము** (One's own true, ever active and beyond the world "SELF"). అయితే, **"జాగ్రత్ స్వప్న సుషుప్తి, జన్మ – పునర్జన్మలచే పరిమితము కానట్టి నన్ను నేను తెలుసుకోవాలి"** – అను ఉత్సాహముతో కూడిన సంసిద్ధత తగినంతగా ఉండాలి. ఏ విద్యకైనా అభిరుచి, ఉత్సాహము, పట్టుదల, సాహసము ఉండాలి కదా! లేకుంటే ఎట్లా లభిస్తుంది?

***ఒక దృష్టాంతము.***

ఒక పెద్ద మనిషి వద్దకు వచ్చి, ఆ ప్రక్కింటాయన **"మీ గురించి ఈ రోజు వార్తా పత్రికలలో అనేక విషయాలు వ్రాసారే! సంతోషము. మీకు అభినందనలు"** – అని చెప్పి వెళ్లిపోయారు.

అప్పుడు ఆ పెద్దమనిషి అన్ని పనులు ప్రక్కకు పెట్టి **"ఓహో! నా గురించి వార్తా పత్రికలో వ్రాసారా! ఏమని వ్రాసారు?"** ... అని ఆ పత్రిక చూడాలని, అది లభించే చోటికి పరుగులు ఎత్తసాగాడు.

ఎందుకు? తనకు తాను అతి ప్రియము కాబట్టి. (బ్ర॥శ్రీ॥ సముద్రాల లక్ష్మణయ్య గారు వారి "నివేదన"లో ఉదహరించిన దృష్టాంతము).

**ఆత్మనస్తు కామాయ, సర్వమిదం ప్రియం భవతి।**

ఉపనిషత్తులు మనయొక్క ఆత్మ సౌందర్యము, ఔన్నత్యముల (The beauty and divinity of one's own Absolute Self) గురించి చెప్పుతూ ఉంటే, ఆ సమాచారము ఎందుకు మనకు అర్థము కాదు? ఎందుకు ఆనందము కాదు? (Why is it not interesting to us?) అందుచేత ఉపనిషత్తులు అధ్యయనము చేయటము ఎవ్వరికైనా ఆనందకరమే। సాధ్యమే। సులభమే। శ్రద్ధ, ఆసక్తి, గురుభక్తి ఉండాలేగాని, ఉపనిషత్తుల అధ్యయనమునకు సమస్త జనులు అర్హులే.

-----

## వేదోపనిషత్ - అంతర్గత

# శాంతి - మంగళ శ్లోకములు

| | |
|---|---|
| ఓం<br>**1.** శివనామ ని(వి)భావితే<br>అంతరంగే, మహతి జ్యోతిషి<br>మాననీమయాఽర్థే<br>దురితాని అపయాన్తి దూరదూరే<br>ముహురాయాన్తి<br>మహాన్తి మంగళాని। | ఏ **పరమశివము** మహత్తరమై - అఖండజ్యోతి ప్రకాశ స్వరూపమై సర్వజీవుల హృదయాంతరంగములలో సదా వెలుగొందుచున్నదో- అట్టి పరమార్థమగు **శివ బ్రహ్మమును** స్తుతించుచున్నాము.<br>- మేము ఆరాధించు తత్త్వము మాయొక్క సర్వ దురితములను మా నుండి తొలగించును గాక!<br>**- మహత్తరము, మంగళ ప్రదము అగు పరబ్రహ్మ స్థానమునకు మమ్ములను తిరిగి చేర్చును గాక!** |
| **2.** స్మృతే సకల కల్యాణ భాజనం<br>యత్ర జాయతే<br>పురుషస్యమ్ అజమ్,<br>నిత్యమ్ వ్రజామి శరణమ్।<br>హరిః ఓం॥ | సర్వ శుభములను చేకూర్చు కళ్యాణ భాజనుడు, జన్మరహితుడు, నిత్యుడు - అగు ఏ పరమ పురుషుని స్మృతులన్నీ గానం చేస్తూ చూపుచున్నాయో,... **అట్టి ఓంకార స్వరూప శ్రీహరియగు విష్ణు భగవానుని మమ్ములను మాయనుండి దాటించుటకై శరణు వేడుచున్నాము.** |
| **3.** ఓం వాక్ మే మనసి ప్రతిష్ఠితా।<br>మనో మే వాచి ప్రతిష్ఠితమ్।<br>ఆవిః ఆవీః మ(మే) ఏధి<br>వేదస్య మ (మే) ఆణీస్థః।<br>శ్రుతం మే మా ప్రహాసీః।<br>అనేన అధీతేన,<br>అహో రాత్రాన్ సందధామి।<br>ఋతమ్ వదిష్యామి।<br>సత్యమ్ వదిష్యామి।<br>తత్ మాం అవతు ।<br>తత్ వక్తారమ్ అవతు।<br>అవతు మాం।<br>అవతు వక్తారమ్॥<br>ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥ | **ఓం కార పరబ్రహ్మమును స్మరించుచున్నాము.**<br>నా వాక్కు - నేను పలుకు పలుకులు నా మనస్సునందు సుస్థిరమై, ప్రతిష్ఠితమై ఉండును గాక!<br>నాయొక్క మనస్సు వాక్కునందు నెలకొని, ప్రతిష్ఠితమగును గాక! **మనస్సు ఒక తీరుగా, వాక్కు మరొక తీరుగా ప్రవర్తనము కలిగి ఉండకుండును గాక!**<br>ఓ పరంజ్యోతి స్వరూప పరమాత్మా! నా అజ్ఞానాంధకారమును పోగొట్టుటకై విజ్ఞాన దీపమును వెలిగించండి! మా మనో-వాక్కులు విజ్ఞానము కొరకై సమర్థమగును గాక!<br>మేము గురువుల నుండి, గ్రంథములనుండి ఎరుగుచున్నదంతా మాయందు సుస్పష్టము- సుస్థిరము అగును గాక!<br>వినుచున్నదంతా యథా - అర్థసహితంగా బుద్ధి-హృదయములలో ప్రవేశించి వికసించి ఉండును గాక!<br>అనేక రీతులుగా అధ్యయనము చేస్తున్న ఆత్మతత్త్వ విశేషాలు మేము రాత్రింబవళ్ళు - ఎల్లప్పుడు బుద్ధితో 'అవగతము' తో కూడుకొని అనుసంధానము చేయుచుండెదము గాక! ఋక్కులు (వేదోపనిషత్తులు, వేదవేత్తలు, ఆత్మవేత్తలు) చెప్పుచున్న ఋతమునే పలికెదము గాక! యథార్థమునే పలికెదము గాక! 'సత్' స్వరూపమగు చిదానంద పరబ్రహ్మము గురించియే చెప్పుకొను చుండెదము గాక!<br>**సర్వరక్షకుడగు ఆ పరబ్రహ్మ భగవానుడు** - నాకు, (వక్తారుడై నాకు బ్రహ్మ తత్త్వమును బోధిస్తున్న) గురుజనులకు కూడా - సదా రక్షకుడై ఉండును గాక!<br>నాకు, ఆచార్యవర్యులకు సర్వదా సర్వ సమృద్ధములు ప్రసాదిస్తూ... పరిపోషించుచుండును గాక!<br>**ఆధి - ఆత్మిక, ఆధి - దైవిక, ఆధి - భౌతిక త్రితాపములు ప్రశాంతమగు ఆత్మయందు ఆత్మత్వము పొంది సశాంతించును గాక!** |

**4.** **ఓం పూర్ణమ్ అదః।**
**పూర్ణమ్ ఇదమ్।**
**పూర్ణాత్ పూర్ణమ్ ఉదచ్యతే।**
**పూర్ణస్య పూర్ణమ్ ఆదాయ,**
**పూర్ణమేవ అవశిష్యతే॥**
**ఓం శాంతిః శాంతిః శాంతిః॥**

'పరాత్పర' స్వరూపమగు ఆ బ్రహ్మము సర్వదా (సర్వకాల - సర్వ అవస్థలయందు) సదా పూర్ణము. (The Experiencer of the Experiences is complete by Himself).

'ఇహాత్మ' స్వరూప విభాగ విశేషములగు జీవాత్మ (The Experiencer) - జగత్తు (All that being experienced) లు కూడా పూర్ణమే!

పూర్ణమగు 'పరాత్మ' నుండియే పూర్ణమగు 'ఇహాత్మ' (జలంలో తరంగముల వలె) బయల్వెడలి సంప్రదర్శితమగుచున్నది.

(మట్టి నుండి కుండలు, బంగారము నుండి ఆభరణములు, జలము నుండి తరంగములు బయల్వెడలుచున్నప్పటికీ మట్టి - బంగారము - జలము సర్వదా యథాతథమై యున్న విధంగా) ....,

.... పూర్ణమగు పరమాత్మ నుండి జాగ్రత్ - స్వప్న - సుషుప్తి అనుభవి స్వరూపుడగు జీవాత్మ బయల్వెడలి, సంప్రదర్శితుడగుచూ ఉన్నారు.

(సర్వజీవుల) స్వస్వరూపమగు పరమాత్మ (లేక) పరబ్రహ్మము సర్వదా యథాతథమే! పూర్ణమే!

**భ్రమాత్మకములగు తాపత్రయములు అట్టి ఓంకార పరబ్రహ్మమునందు సశాంతించునవై ఉండును గాక!**

---

**5.** హరిః ఓం॥
సహ నా(నౌ) అవతు
సహ నౌ భునక్తు।
సహ వీర్యం కరవావహై।
తేజస్వినా (నౌ)
అధీతమ్ అస్తు।
మా విద్విషావ హై॥
ఓం శాంతిః శాంతిః శాంతిః॥

**ఓంకార సర్వాత్మ స్వరూపుడగు శ్రీహరికి నమస్కరిస్తున్నాము.**

శిష్య - ఆచార్యులమగు మనమిరువురము సర్వజగద్రక్షకుడగు ఆ పరమాత్మచే సదా **సంరక్షింపబడెదము** గాక!

సర్వజీవ పరిపోషకుడగు ఆ పరంధాముడు శిష్య - ఆచార్యులమగు మన ఇరువురిని **పరిపోషించును** గాక!

(గురు శిష్యులమగు) మనము ఇరువురము **ధైర్య - ఉత్సాహ - సాహసములచే వీర్యవంతులమై బ్రహ్మతత్త్వ - అధ్యయనమునందు పరిశ్రమించెదము గాక!** నిర్వర్తించెదము గాక! ఆ పరబ్రహ్మతత్త్వము మనపట్ల తేజోవంతమై స(సు)-ఫలప్రదమగును గాక!

(శిష్యునకు వినటము రాదు - ఆచార్యులకు చెప్పటము రాదు - ఇత్యాది) అల్ప భావములకు లోనై శిష్య - ఆచార్యులమగు మనమిరువురము పరస్పరము ద్వేషించుకొనకుండెదము గాక! ప్రేమించుకొనెదము గాక! మన ఇరువురి మధ్య ఆప్యాయత - ప్రపత్తులు వెల్లివిరియును గాక!

**దృశ్య - ద్రష్ట - దర్శన త్రయములు ఆత్మరూపమునందు సశాంతించినవగును గాక!**

---

**6.** ఓం
శం నో మిత్రః శం వరుణః।
శం నో భవతు అర్యమా।
శం న ఇంద్రో బృహస్పతిః
శం నో విష్ణుః ఉరుక్రమః॥
నమో బ్రహ్మణే।
నమస్తే వాయో।
త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాఽసి।
త్వాం ఏవ ప్రత్యక్షం బ్రహ్మ-
అవాదిష్యామ్। (బ్రహ్మవదిష్యామి)।

(పంచ ప్రాణములలోని 'ప్రాణము'నకు, 'పగలు'కు అభిమాన దేవతయగు) **మిత్ర భగవానుడు....,**

- ('అపానము'నకు, 'రాత్రి కాలము'నకు అభిమాన దేవతయగు) **వరుణ భగవానుడు...,**

- (దృష్టితత్త్వాభిమాని, పితృలోకములో శ్రేష్ఠుడు అగు) **అర్యమభగవానుడు...,**

- (త్రిలోకములలోని / ఈ దేహములోని ఇంద్రియ తత్త్వముల అభిమాని, అధి దేవత అగు) ..... **ఇంద్రభగవానుడు...,**

- (దేవతలకు గురువు, బుద్ధ్యభిమాన దేవత అగు) **బృహస్పతి భగవానుడు...,**

- (త్రివిక్రమావతారంలో త్రిపాదములతో భూమి - ఆకాశములను, అహంకార తత్త్వమును కొలచి వేసిన) ఉరుక్రమ బిరుదాంకితుడగు **విష్ణు భగవానుడు మాకు శుభములను, మనో ప్రశాంతతలను ప్రసాదించును గాక!**

| | | |
|---|---|---|
| | ఋతం అవాదిష్యామ్‌। (ఋతం వదిష్యామి)।<br>సత్యం అవాదిష్యామ్‌। (సత్యం వదిష్యామి)।<br>తత్ మామ్ ఆవీత్। (తన్మామవతు)।<br>తత్ వక్తారమ్ ఆవీత్। (తద్వక్తారమవతు)।<br>ఆవీత్ (అవతు) మాం।<br>ఆవీత్ (అవతు) వక్తారమ్।<br>ఓం శాంతిః। శాంతిః। శాంతిః।। | ఓ వాయు భగవాన్! ప్రాణస్వరూపా! ప్రాణేశ్వరా! సర్వ స్వరూపము - సర్వసాక్షి అగు పరబ్రహ్మమా! సర్వాత్మకుడా! ఆత్మదేవా! సర్వస్థితుడవగు మీకు భక్తి పూర్వకంగా నమస్కరిస్తున్నాము.<br>మిమ్ములను 'ప్రత్యక్ష బ్రహ్మము'గా (దృశ్యజగత్తును/విశ్వేశ్వరుడుగా) దర్శించుచున్నాము. స్తుతించుచున్నాము.<br>ఋగ్వేదములోని ఋక్కులచే, సర్వవేదములచే అభివర్ణించబడుచున్న 'ఋతము' అగు పరమాత్మను స్తుతించుచున్నాము.<br>'సత్' స్వరూప పరబ్రహ్మము గురించిన సత్యమును స్తుతించుచున్నాము.<br>అట్టి పరబ్రహ్మము నన్ను, నాకు తత్త్వజ్ఞానము బోధిస్తున్న ఆచార్యుల వారిని సదా రక్షించును గాక! ఉభయులను కాపాడును గాక!<br>**భూర్ భువర్ సువర్ త్రిలోక సర్వభేదములు నిర్మల పరబ్రహ్మ స్వరూపమునందు సశాంతించినవగు గాక!** |
| **7.** | ఓం<br>అహం వృక్షస్య రేః ఇవ।<br>కీర్తిః పృష్ఠం గిరేః ఇవ।<br>ఊర్ధ్వ పవిత్రో వాజినీవ,<br>'స్వమ్' అమృతమస్మి।<br>ద్రవిణగ్ం సవర్చసమ్,<br>సుమేధాః అమృతో అక్షితః।<br>ఇతి త్రిశంకోః వేద అనువచనమ్।।<br>ఓం శాంతిః। శాంతిః। శాంతిః।। | ఈ 'సంసారము' అను వృక్షమునకు 'ఆధారము' అయి ఉన్న 'రేః' - చైతన్య స్ఫూర్తి నేనే!<br>పర్వతముయొక్క శిఖరాగ్రమువలె నా 'కీర్తి'యే వేద-ఉపనిషత్ వాఙ్మయ పర్వత శిఖరముపై ప్రకాశమానమై యున్నది.<br>ఊర్ధ్వ పవిత్రత (ఘనత)గా సర్వత్రా ఉన్నది - నాలోని నేనైన ఆత్మయే! ఆకాశంలో ఎల్లప్పుడూ ప్రకాశించే సూర్యునికి ఉదయాస్తమయములు లేని తీరుగా నేను స్వయముగా... **జన్మ - మృత్యువులకు చెందనట్టి, సంబంధించనట్టి 'అమృత స్వరూపుడను' అయియే ఉన్నాను.**<br>ఈ దృశ్యమంతా నాకు సంపద అయినట్టి బ్రహ్మ వర్చస్సుచే సృష్టికళా విశేష సమన్వితుడను.<br>ఇదంతా నా చిదానందము! ఎరుకరూపము. వేదో వీక్షణము! బుద్ధి ప్రదర్శన చమత్కారము! ఇక నేనో, మార్పు చేర్పులకు ఆవల, దృష్టికి ఆవల ... కేవల దృక్-అమృత-ఆనంద స్వరూపుడను!<br>ఇతి త్రిశంకు మహర్షి ప్రవచిస్తూ బోధించు వేద ప్రమాణముతో కూడిన అనువచనము. **దృశ్య - జీవ - ఈశ్వర భేదమంతా ఆత్మానందమునందు సశాంతించినవగును గాక!** |
| **8.** | ఓం<br>యః (యం) ఛందసాం<br>ఋషభో విశ్వరూపః,<br>ఛందోభ్యో అధి అమృతాత్<br>సంబభూవ,<br>స మే ఇన్ద్రో మేధయా స్పృణోతు।<br>అమృతస్య దేవ ధారణో భూయాసమ్।<br>శరీరమ్ మే విచర్షణమ్।<br>జిహ్వా మే మధు మత్తమా।<br>కర్ణాభ్యాం భూరి విశ్రువమ్।<br>బ్రహ్మణః కోశోసి<br>మేధయా పిహితః। | ఏ ప్రణవ నాదమును వేదములు ప్రప్రథమంగా పలుకుచున్నాయో, ఈ విశ్వమంతా ఎద్దానికి తన రూపమే అయి ఉన్నదో...,<br>ఏ 'ఓం' కారము అమృత రూపమై, ఆత్మరూపమై వేద వాఙ్మయము నుండి ప్రవచన - నిర్వచన రూపంగా ప్రకటించబడుచున్నదో...,<br>అట్టి మహత్తర ఆత్మ తత్త్వము నా ఇంద్రియములను, మేధస్సును (బుద్ధిని) విజ్ఞానరూపమై స్పృశించును గాక!<br>నేను ఇంద్రుడంతటి మేధస్సు కలిగియుండెదను గాక! ఓ ఆత్మదేవా! నేను అమృతరూపమగు బ్రహ్మజ్ఞాన 'ధారణ' పొందినవాడను అయ్యెదను గాక!<br>ఈ నా శరీరము బ్రహ్మతత్త్వము యొక్క శ్రవణ - మనన - నిదిధ్యాసల నిమిత్తమై అర్హము, ఆరోగ్యవంతము, ప్రజ్ఞాసమన్వితము అయి ఉండును గాక!<br>నా ఈ నాలుక - బ్రహ్మతత్త్వ విశేషాలను పలుకు మాధుర్యము కలిగి ఉండును గాక!<br>ఈ నా చెవులు ఆచార్యుల వద్ద నుండి బ్రహ్మతత్త్వ ప్రవచన వాక్యములు విరివిగా వినుటకు యోగ్యమై ఉండును గాక!<br>సంసార రూపములైనట్టి పంచకోశములకు సంబంధించిన బుద్ధిచే, మాయందు అంతరంగమున అనునిత్య ప్రకాశమైయున్న **పరబ్రహ్మము** కప్పబడినదై ఉన్నది. |

| | | |
|---|---|---|
| | శ్రుతం మే గోపాయ॥<br>ఓం శాంతిః శాంతిః శాంతిః॥ | ఓ ఆత్మ దేవా! మీ గురించి వినుచున్న మాటలచే (గురువాక్యములచే - వేదాంత సిద్ధాంతములచే), మీరు వినబడుచున్నవారై మమ్ములను గోపాయ - కాపాడండి! **మా యొక్క స్థూల - సూక్ష్మ - కారణ దేహములు ఆత్మ రూపము సంతరించుకొని, ఆత్మగా సశాంతించునవై ఉండును గాక!** |
| **9.** | ఓం<br>ఆప్యాయన్తు మమ అంగాని<br>వాక్ ప్రాణః చక్షుః శ్రోత్రమ్ అథో బలమ్<br>ఇంద్రియాణి చ సర్వాణి।<br>సర్వమ్ బ్రహ్మ – ఔపనిషదమ్। (బ్రహ్మోపనిషదౌ)<br>మా అహమ్ బ్రహ్మ నిరాకుర్యామ్।<br>మా మా బ్రహ్మ నిరాకరోత్।<br>అనిరాకరణమ్ అస్తు।<br>అనిరాకరణమ్ మే అస్తు<br>తత్ ఆత్మని నిరతే<br>య ఉపనిషత్సు ధర్మాః,<br>తే మయి సన్తు।<br>తే మయి సన్తు॥<br>ఓం శాంతిః శాంతిః శాంతిః॥ | ఓంకార సంజ్ఞా సర్వతత్త్వ స్వరూపుడవగు ఓ పరమాత్మా! ఇది మా విన్నపము! వినండి. ఉపనిషత్తులచే చేతులెత్తి ప్రకటించబడుచున్న **బ్రహ్మము (లేక) సర్వాత్మకుడగు** పరమాత్మ మా యొక్క సర్వ అంగములను, వాక్కును, ప్రాణమును, కళ్ళను, చెవులను (కాళ్ళు-చేతులు, నడతలు, పనులు, మాటలు, శక్తి, చూపు, వినుచున్నవి - వీటన్నిటినీ) - బ్రహ్మోపాసనకై ఆప్యాయము, మధురము చేసి, సిద్ధము చేయును గాక!<br>- బ్రహ్మము (బ్రహ్మజ్ఞానము) నన్ను నిరాకరించకుండును గాక!<br>- నేను బ్రహ్మజ్ఞానమును నిరాకరించకుండుదును గాక! బ్రహ్మము - మేము పరస్పరము ఆదరణ, ఆప్యాయత కలిగి ఉండెదము గాక!<br>ఉపనిషత్తులు చెప్పు ఆత్మ ధర్మము గురించిన సమాచారము - విశేషముల అధ్యయనమునందు మేము నిరతులమై ఉండెదము గాక!<br>అట్టి పరబ్రహ్మము మమ్ము కాపాడును గాక! రక్షించును గాక!<br>**భూత - వర్తమాన - భవిష్యత్ త్రికాల కల్పనా విశేషమైనట్టిదంతా ఆత్మ స్వరూపవమై, ఆత్మయందు లయించి - 'శాంత - ఆత్మత్వము'ను సంతరించుకొనును గాక!** |
| **10.** | ఓం<br>భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః।<br>భద్రం పశ్యేమ అక్షభిః యజత్రాః।<br>స్థిరైః అంగైః తుష్టువాగ్ంసః తనూభిః।<br>వ్యసేమ దేవ హితం యత్ ఆయుః।<br>స్వస్తి నః ఇంద్రః వృద్ధశ్రవాః।<br>స్వస్తి నః పూషా విశ్వవేదాః।<br>స్వస్తి నః తార్క్ష్యో అరిష్టనేమిః।<br>స్వస్తి నః బృహస్పతిః దదాతు॥<br>ఓం శాంతిః శాంతిః శాంతిః॥<br>భద్రం మే అపివాతాయ మనః॥<br>ఓం శాంతిః శాంతిః శాంతిః॥ | ఓ దేవతలారా! మీరు ప్రసాదించిన ఈ చెవులతో మేము భద్రమగు (శుభ ప్రదమగు) దాని గురించియే (బ్రహ్మ తత్త్వమునే) వినుచుండెదము గాక! యజన (యజ్ఞ - యాగ - యోగ ప్రయత్న) శీలురమగు మేము భద్రమైన దానినే (సర్వము బ్రహ్మముగా) చూచుచుండెదము గాక!<br>బలము - కలిగియున్న అంగములతో ఆరోగ్యవంతము అగు శరీరముతో - దేవతలచే ప్రసాదించబడిన ఆయుష్షును దేవతల హితముగా (దేవతలకు ప్రియముగా) - గడుపుచుండెదము గాక!<br>ఔన్నత్యముతో కూడిన వినికిడిగల, లోకాధిపతి అగు **ఇంద్ర భగవానుడు**, విశ్వతత్త్వము ఎరిగిన **సూర్యభగవానుడు**, దోషములను తొలగించి మమ్ములను పవిత్రులుగా తీర్చిదిద్దుదురు గాక! బుద్ధి కుశలుడగు **బృహస్పతి భగవానుడు** మాకు అనుగ్రహమును ప్రసాదించెదరు గాక! మాకు స్వస్థత కలుగజేయుదురు గాక!<br>మా మనస్సులకు ప్రాణేశ్వరులగు వాయు దేవులవారు శుభము, భద్రము కలుగజేయుదురు గాక! **ఓం శాంతిః శాంతిః శాంతిః॥** |
| **11.** | యో బ్రహ్మాణమ్ విదధాతి పూర్వమ్,<br>యో వై వేదాంశ్చ ప్రహిణోతి, తస్మై<br>తగ్ం అహమ్ ఆత్మబుద్ధి ప్రకాశమ్,<br>ముముక్షుర్వై శరణమ్<br>అహమ్ ప్రపద్యే॥<br>ఓం శాంతిః శాంతిః శాంతిః॥ | - ఏ పరబ్రహ్మము ఈ జగత్తుకు మునుముందే ఉన్నదై, ఈ జగత్ రూపముగా విస్తరించినదై ఉన్నదో,<br>- ఏది వేద - ఉపనిషత్తులచే 'తత్త్వమ్' శాస్త్రముగా స్తుతించబడుచున్నదో,<br>**- అట్టి ఆత్మ నా బుద్ధికి ప్రకాశమానమగుటకై...,**<br>**ముముక్షువునై ఆచార్యులను, బ్రహ్మజ్ఞులను, వేదాంత శాస్త్రమును శరణు వేడుచున్నాను.**<br>**సర్వము శాంతాత్మయందు సశాంతించును గాక!** |

శ్లో॥ ఓం మంగళమ్ గురుదేవాయ మహనీయ గుణాత్మనే
సర్వలోక శరణ్యాయ సాధురూపాయ మంగళమ్॥
ఓం శాంతిః శాంతిః శాంతిః॥

# ⌘ విషయ సూచిక ⌘

## సంపుటి - 1

ఋగ్వేదాంతర్గత



శుక్లయజుర్వేదాంతర్గత

# ⌘—————— విషయ సూచిక ——————⌘

## సంపుటి - 2

### కృష్ణయజుర్వేదాంతర్గత-అనుష్ఠాన పాఠము



### కృష్ణయజుర్వేదాంతర్గత-ఉపనిషత్తులు (22)

# ⌘ విషయ సూచిక ⌘

## సంపుటి - 3

### కృష్ణయజుర్వేదాంతర్గత-ఉపనిషత్తులు (10)



### సామవేదాంతర్గత-ఉపనిషత్తులు (8)

# ⌘ విషయ సూచిక ⌘

## సంపుటి - 4

### సామవేదాంతర్గత-ఉపనిషత్తులు (7)



### అథర్వణవేదాంతర్గత-ఉపనిషత్తులు (14)

# ⌘——— విషయ సూచిక ———⌘

## <u>సంపుటి - 5</u>

### అథర్వణవేదాంతర్గత-ఉపనిషత్తులు (8)



### శుక్లయజుర్వేదాంతర్గత-ఉపనిషత్తు (1)

## బృహదారణ్యకోపనిషత్

# ⌘ విషయ సూచిక ⌘

## సంపుటి - 6 (మొదటి భాగము)



## సంపుటి - 6 (రెండవ భాగము)

సామవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 16 ఛాందోగ్యోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్



## 1-1. ప్రథమ ప్రపాఠకః - ప్రథమః ఖండః - ఉద్గీథ విద్య

ఉద్గాత = యజ్ఞ విధియందు 'సామగానము' నిర్వర్తించువారు.
ఉద్గాతము = పాడటము - సామగానము చేయటము.
ఉద్గీథము = సామవేదాంగ - గానామృత విభాగ
ఉపాసన / గానము / ప్రకటనము / సాధనా మార్గము.

**1. ఓం ఇతి ఏతత్ అక్షరం ఉద్గీథం ఉపాసీత। ఓం ఇతి హి ఉద్గాయతి।**

వేద విభాగములైనట్టి - సంహిత, బ్రాహ్మణ, ఆరణ్యక, ఉపనిషత్తులచే ఏ "ఏకము, అక్షరము" అగు తత్త్వము 'ఓం ఇతి' అని ఉద్గాతము (ప్రకటనము) చేయబడుతోందో, ఎలుగెత్తి గానము చేయబడుచున్నదో - అట్టి పరమాత్మతత్త్వ సంజ్ఞాక్షరమును ఉద్గీథము (కర్మల ప్రయత్నముల ద్వారా) చేయుచున్నాము. ఉపాసించు చున్నాము. నమస్కరిస్తున్నాము.

అట్టి ఓంకారమే సమస్త హృదయములలో గానామృతమై వెలుగొందుచున్నది.

**తస్య ఉపవ్యాఖ్యానమ్।**

అట్టి 'ఓం'కార అక్షరార్థమగు పరబ్రహ్మము అనిర్వచనీయము, అవాక్‌మానసగోచరము. అయినప్పటికీ - అద్దాని సామీప్యతను (స్వానుభవ అనుక్షణ-అనునిత్యము సిద్ధించటానికై) వ్యాఖ్యానించు కుంటున్నాము.

---

**2. ఏషాం భూతానం పృథివీ రసః।**

పృథివి రసస్వరూపమై యున్నది.

ఈ భౌతిక జీవులందరు పృథివి (భూమి) యొక్క రసస్వరూపులు. పృథివియొక్క రసమునుండే సమస్త దేహములు రూపుదిద్దుకుంటున్నాయి.

---

**పృథివ్యా ఆపో రసః।**

ఈ పృథివి జలముయొక్క రసస్వరూపము. జలముయొక్క సారమే పృథివీ రూపము.

| | | |
|---|---|---|
| | **అపాం ఓషధయో రసః।** | ఓషధులే జలము రూపము సంతరించుకుంటున్నాయి. ఓషధుల రసరూపము, (లేక) సారరూపము - 'జలము'. |
| | **ఓషధీనాం పురుషో రసః।** | ఓషధులు పురుషుని రసరూపము. ఓషధుల రసస్వరూపము (సారరూపము) పురుషుడు. |
| | **పురుషస్య వాక్ రసో<br>వాచ ఋక్ రసః।** | పురుషుని యొక్క రస రూపము 'వాక్కు'. వాక్కు ఋక్ యొక్క రసము। |
| | **ఋచః సామ రసః।** | అట్టి వచనములు - వాక్కుల సారరూపమే ఋగ్వేదములో గానము చేయబడుచున్న 'ఋక్కులు'. |
| | **సామ్న - ఉద్గీథో రసః।** | ఋక్కుల (మంత్రముల) సారము -స్తుతిరూపమగు సామగానములు. ఉద్గీథము (ప్రవచనముల వర్ణనముల) సారమే సామగానములు. |
| **3.** | **స ఏష రసానాగ్ం<br>రసతమః, పరమః<br>పరార్థ్యో అష్టమో<br>యత్ ఉద్గీథః।** | అట్టి సామవేద-సామగానముల రస స్వరూపము (సారము-The Essence) - తమము (Superlative), పరమము (The Finest), పరతత్త్వము అగు ఏ "ఓం"కారార్థ (కేవల స్వరూప) తత్త్వమే (ఏడు భూమికలకు ఆవల గల) తురీయాతీతము. అట్టి ఆత్మయే 'ఓం' అక్షరార్థముగా ప్రవచనము, వ్యాఖ్యానము, గానము చేయదగిన పరబ్రహ్మ తత్త్వము. |
| **4.** | **కతమా కతమత్ ఋక్?<br>కతమత్ కతమత్ సామ?<br>కతమః కతమ ఉద్గీథ?<br>ఇతి విమృష్టం భవతి॥** | ఏది ఏది ఋక్కుల సారము?<br>ఏది ఏది సామగానముల సారము?<br>ఏది ఏది ఉద్గీథము?<br>అనునది ఇక్కడ విశ్లేషణపూర్వకంగా వివరించుకుంటున్నాము. |
| **5.** | **వాక్ ఏవ ఋక్। ప్రాణః సామ।<br>'ఓం' ఇతి ఏతత్ అక్షరం ఉద్గీథః।<br>తద్వా ఏతత్ మిథునం - యత్ వాక్ చ,<br>ప్రాణః చ, ఋక్ చ, సామ చ॥** | "వాక్కు" (Speaking) ఋక్ స్వరూపము. ప్రాణము-సామగానము (సామము).<br>అట్టి వాక్-ప్రాణములు అక్షరమగు 'ఓం'గా వ్యాఖ్యానించబడుతోంది. అట్టి వాక్ - ప్రాణముల పరస్పర ఏకత్వము, ఋక్-సామముల ఏకరస స్వరూపమే "మిథునము" (The Couple Association). |
| **6.** | **తత్ ఏతత్ మిథునం ఓం ఇతి<br>ఏతత్ అస్మిన్ అక్షరే సంసృజ్యతే॥<br><br>యదా వై మిథునౌ సమాగచ్ఛత<br>ఆపయతో వై తావన్యోన్యస్య కామమ్॥** | అట్టి వాక్-ప్రాణముల మిథునము (కలయిక) అక్షరమగు తత్త్వముచే స్వకీయముగా కల్పన చేయబడుతోంది. అక్షరమగు 'ఓం'కారము నందు వాక్-ప్రాణముల మిథునము (సంయోగము) అగుచున్నది.<br>అది ప్రకృతి-పురుషుల (Me-I am) అన్యోన్యముల వలె పరస్పర ఇచ్ఛలచే పూర్ణము సంతరించుకోవటముగా జరుగుతోంది. అట్టి మిథున స్థానమగు ఏకము, అక్షర ఓంకార తత్త్వమును ఉపాసిస్తున్నాను. |
| **7.** | **ఆపయితా హ వై<br>కామానాం భవతి।<br>య ఏతత్ ఏవం విద్వాన్ -<br>అక్షరం "ఉద్గీథం" ఉపాస్తే।** | ఎవ్వరైతే అట్టి ఇహ-పరముల, జీవాత్మ-పరమాత్మల, వాక్-ప్రాణముల మిథునమును (పరస్పర ఇచ్ఛాపూర్వక స్వామ్యత్వమును, ఏకత్వమును) అక్షరమును దర్శించుచూ, గమనిస్తూ, ఉపాసిస్తూ ఉంటారో **వారే విద్వాంసులు.** అట్టి అక్షర ఉద్గీథము (ఆత్మోపాసన) చేయుచున్నవాడు - కోరుకొన్నది కోరుకొన్నట్లుగా పొందగలడు. సమస్తము తానే అయి ఉన్న ఆత్మయొక్క తత్త్వమును సంతరించుకోగలడు. |

**8. తత్ వా ఏతత్ "అనుజ్ఞాక్షరం"।**
**యత్ హి కించ అనుజానాతి –**
**ఓం ఇతి ఏవ తదా హ**
**ఏషో ఏవ సమృద్ధిః యత్ అనుజ్ఞా।**

సర్వ దైవ ఉపాసనలు అనుజ్ఞ స్వీకారరూపంగా 'ఓం' అని ప్రారంభమౌతున్నాయి. "స్వామీ! మిమ్మల్ని పూజిస్తున్నాను. అనుజ్ఞ ప్రసాదించండి!" - అని పలుకుచుండగా అనుజ్ఞ వృద్ధి చెందుచున్నది. అందుకని 'ఓం'ను సమృద్ధి ప్రవచనంగా స్వీకరించబడుతోంది.

**సమర్థయితా హ వై కామానాం భవతి,**
**య ఏతత్ ఏవం విద్వాన్**
**అక్షరం ఉద్గీథమ్ ఉపాస్తే॥**

ఎవ్వరైతే సర్వ దైవ-పితృ కార్యములందు 'ఓం' అను అనుజ్ఞాక్షరము పలికి ఉపాసనకు, యజ్ఞవిధికి సంకల్పించి ఉంటాడో- అట్టివాడు తత్ పరమాత్మను గానం చేస్తూ సమర్థుడు అగుచున్నాడు. అక్షరమగు 'ఓం'కారమును ఉపాసించిన అట్టివానికి సర్వకామములు నెరవేరగలవు.

**9. తేన ఇయం త్రయీ విద్యా వర్తతే।**
**'ఓం' ఇతి ఆశ్రావయతి।**
**'ఓం' ఇతి శగ్ంం సత్య –**
**'ఓం' ఇతి ఉద్గాయతి।**
**ఏతస్య ఏవ అక్షరస్య అపచిత్యై।**
**మహిమ్నా రసేన॥**

'ఓం' కారముతో కార్యక్రమములు ప్రారంభించుచుండగా 'త్రయీవిద్య' (ధర్మార్థకామముల)యొక్క ప్రతీతి సిద్ధిస్తుంది.

యజ్ఞమును నిర్వర్తింపజేస్తున్న పర్యవేక్షకుడగు అధ్వర్యుడు 'ఓం' అని వినిపిస్తూ కార్యక్రమము యొక్క శ్రావ్యమునకు 'నాంది' పలుకుచున్నారు.

'ఓం' అని కార్యక్రమము యొక్క శుభ ప్రయోజనములకై 'శం - సత్యం - ఓం' అని ఎలుగెత్తి గానము చేయుచున్నారు.

అట్టి ఏకము - అక్షరము అగు ఓంకారోచ్చారణ మహిమ వలన సమస్త కర్మలు, కర్మవిభాగములు ప్రవర్తమానము అగుచున్నాయి.

**10. తేన ఉభౌ కురుతో యత్ చ తత్ ఏవం వేద,**
**యత్ చ న వేద।**
**నానా తు విద్యా చ అవిద్యా చ॥**

'ఓం' కారము యొక్క ఏకాక్షర తాత్త్వికార్థము తెలిసి కొందరు, అట్టి రహస్యార్థము తెలియకుండానే మరికొందరు కర్మలు నిర్వర్తిస్తూ ఉన్నారు. పరమాత్మ తత్త్వము తెలిసి - విద్యాపూర్వకంగా, మరికొందరు అవిద్యాపూర్వకంగా (ఓంకారము యొక్క ముఖ్యోద్దేశ్యము తెలియకుండానే) ఓంకార మంత్రమును ఉపాసిస్తున్నారు.

**యత్ ఏవ విద్యయా కరోతి, శ్రద్ధయా ఉపనిషదా,**
**తత్ ఏవ వీర్యవత్తరం భవతి।**
**ఇతి ఖలు ఏతస్య ఏవ అక్షరస్య**
**ఉపవ్యాఖ్యానం భవతి॥**

"ఓంకారము" యొక్క అంతరార్థమగు వ్యక్తావ్యక్త పరమాత్మ యొక్క ముఖ్యార్థమును తెలుసుకొని, అట్టి పరమాత్మతో 'సామీప్యత' భావించుకుంటూ కర్మలు నిర్వర్తిస్తారో, అట్టి వారు వీర్యవంతులు అగుచున్నారు. ఉత్తమోత్తమ ప్రయోజనం సిద్ధించుకుంటున్నారు.

ఇతి - ఓంకారము యొక్క ఉపవ్యాఖ్యానము.

**ఇతి ఛాందోగ్యోపనిషత్ - ప్రథమ అధ్యాయే ప్రథమ ఖండః**

## 1-2. ప్రథమ ప్రపాఠకః - ద్వితీయ ఖండః

**(ఓం ప్రాణేశాయ నమః। అంగీరస ఋషయే నమః। బృహస్పతి ఋషయే నమః।
ఆయాస్యు ఋషయే నమః। బక ఋషయే నమః। ఉద్గాత నమః)**

### అధ్యాత్మ ఉద్గీథము

| | | |
|---|---|---|
| **1.** | **దేవ, అసురా హ వై యత్ర సంయేతిర<br>ఉభయే ప్రాజాపత్యాస్తద్ధ,<br>దేవా ఉద్గీథమ్ అజహ్రుః।<br>అనేన ఏనాత్ అభిభవిష్యామ ఇతి॥** | ఒకానొకప్పుడు ప్రజాపతి పుత్రులు అయినట్టి దేవతలు, అసురులు తమలో తాము వైరము పెంచుకొని యుద్ధమునకు దిగారు. దేవతలు అసురులపై విజయము పొందటానికై ఉద్గీథోపాసనను ఓంకారోపాసనతో ప్రారంభించారు. ఆత్మశక్తిని ఉపాసించసాగారు. |
| **2.** | **తే హ "నాసిక్యం ప్రాణం"<br>ఉద్గీథం ఉపాసాంచక్రిరే।<br>తగ్ంం హ అసురాః పాప్మనా వివిధుః।** | వారు ఇక్కడ ఆత్మదేవతను ఉపాసించి ప్రాణవాయువు ముక్కు ద్వారా ప్రవేశించు నాసేంద్రియమును అవలంబిస్తూ ఉన్న ఆత్మశక్తిని ఉద్గీథము చేయసాగారు (ఉపాసించసాగారు).<br>కానీ అసురులు ఆ స్థానమునందు ప్రవేశము పొంది పాప భావములను ప్రవేశింపజేసి వేధించసాగారు. |
| | **తస్మాత్ తేన ఉభయం జిఘ్రతి - సురభి<br>చ దుర్గన్ధి చ - పాప్మనా హి ఏష విద్ధః** | అందుచేతనే ఘ్రాణేంద్రియములలో సుగంధ - దుర్గంధ - మిశ్రమముల యొక్క ఉభయ కర్మల అనుభవము ఏర్పడసాగింది.<br>"వాసన చూడగలిగినవి - వాసన చూడకూడనివి" ఏర్పడి పాపములు ఏర్పడసాగాయి. (ఆత్మను ఏమరచునట్లు చేసేవే పాపములు).<br>(అందుచేత - దేవతలు అసురులను నిరోధించలేకపోయారు) |
| **3.** | **అథ హ 'వాచం' ఉద్గీథం ఉపాసాంచక్రిరే।<br>తాగ్ంం హ అసురాః పాప్మనా వివిధుః** | దేవతలు వాక్కును అవలంబించి ఉద్గీథోపాసన చేయసాగారు। అక్కడికి అసురులు కూడా ప్రవేశించి పాపకర్మలను ప్రవేశింపజేయ సాగారు. |
| | **తస్మాత్ తయా ఉభయం<br>వదతి, సత్యం చ, అనృతం చ<br>పాప్మనా హి ఏషా విద్ధా॥** | అందుకు ఫలితంగా వాక్కులో సత్యము, అనృతము (అసత్యము) ప్రవేశించి పాప వాక్కు కూడా (దుష్ట దూషణ నిషిద్ధ వాక్కు కూడా) ప్రవేశము పొందింది.<br>(అందుచేత దేవతలు అసురులను ఓడించలేకపోయారు) |
| **4.** | **అథ హ "చక్షుః" ఉద్గీథం<br>ఉపాసాంచక్రిరే।<br>తద్ధ అసురాః పాప్మనా వివిధుః తస్మాత్<br>తేన ఉభయం పశ్యతి<br>దర్శనీయం చ, అదర్శనీయం చ<br>పాప్మనా హి ఏతత్ విద్ధమ్।** | దేవతలు చక్షువులను ఉద్గీథము (ఉపాసన / ప్రత్యుత్సాహము) చేసి చూపుశక్తిని ప్రవర్తింపజేయసాగారు. ఇంతలోనే అసురులు "చూపు"లో పాపదృష్టిని ప్రవేశింపజేశారు.<br>అందుచేత కంటిలోంచి బహిర్గతమగుచున్న చూపు - చూడతగిన వాటిపై చూడకూడని వాటిపై కూడా ప్రసరించసాగాయి. "నిర్దోష-దోష" దర్శనములు సృష్టిలో ఏర్పడటం జరుగసాగింది.<br>ఈ విధంగా "పుణ్య-పాపములు, మంచి చెడులు" - అను ద్వంద్వము ఏర్పడుతోంది. మంచితోబాటే చెడును చూడాలనే ఇష్టము వెంటనుండసాగింది.<br>దేవతలు చూపుతో పరమాత్మను మాత్రం ఉపాసించుకోలేక పోయారు. |

| | | |
|---|---|---|
| **5.** | **అథ హ 'శ్రోత్రం' ఉద్గీథమ్<br>ఉపాసాంచక్రిరే।<br>తద్ధ అసురాః పాప్మనా వివిధుః।<br>తస్మాత్ తేన ఉభయగ్ం శృణోతి –<br>శ్రవణీయం చ, అశ్రవణీయం చ।<br>పాప్మనా హి ఏతత్ విద్ధమ్।** | అప్పుడు దేవతలు ఆత్మోపాసనచే 'వినికిడి'ని కల్పించి ఉత్తేజితం చేసి ప్రదర్శించసాగారు. అప్పుడు ఆ చోట అసురులు పాపము (దోషపూరితము) అగు గుణమును వినికిడిలో ప్రవేశింపజేశారు. అప్పుడు "వినతగినవి - వినకూడనివి" ఉభయము ఏర్పడినవయ్యాయి.<br>ఈ విధంగా వినతగినవి - వినకూడనవి కూడా వినికిడి వెంటనంటి ఉండి, వినికిడిని తాడనము పొందించసాగాయి.<br>(దేవతలు అసురుల అడ్డంకులను తొలగించలేకపోయారు. పరమాత్మయందు వినికిడి నిలుపలేకపోయారు) |
| **6.** | **అథ హ "మన" ఉద్గీథం<br>ఉపాసాంచక్రిరే।<br>తద్ధ అసురాః పాప్మనా వివిధుః।<br>తస్మాత్ తేన ఉభయం సంకల్పయతే,<br>"సంకల్పనీయం" చ, "అసంకల్పనీయం" చ।<br>పాప్మనా హి ఏతత్ విద్ధమ్।** | అప్పుడు దేవతలచే 'మనస్సు' అనబడేది ఉపాసించబడగా, సంకల్పముల - ఆలోచనల రూపమగు 'మనస్సు' - ప్రవర్తించసాగింది. ఇంతలో అసురులు ఆలోచనలలో పాపము (దోషమును) తెచ్చి ప్రకాశింపజేసారు.<br>అప్పుడు 'సంకల్పన' అనునది 'సంకల్పించతగినవి - సంకల్పించకూడనివి' ఉభయము ప్రవర్తించసాగింది.<br>ఈ విధంగా మంచి చెడుల ద్వంద్వము ప్రవర్తించసాగింది.<br>**ఈ విధంగా ద్వంద్వములు దేవతల కార్యక్రమములను వశం చేసుకొని, దివ్యతత్త్వములను చాటు చేయసాగాయి.** |
| **7.** | **అథ హ య ఏవ అయం "ముఖ్యః ప్రాణః"<br>తమ్ ఉద్గీథం ఉపాసాంచక్రిరే।<br>తగ్ం హ అసురా ఋత్వా విదధ్వంసుః।<br>యథా అశ్మానం ఆఖణమ్ ఋత్వా విధ్వగ్ంసేత।** | అప్పుడు దేవతల ఆత్మోపాసన యజ్ఞోపాసనలనుండి "ముఖ్యప్రాణము" అను ప్రాణశక్తి సముత్పన్నము అవసాగింది.<br>అప్పుడు ఆ ముఖ్యప్రాణములోనికి అసురులు పాపము (దోషమును) ప్రవేశింపజేయాలని తలచారు. ప్రయత్నించారు. కానీ వారికి అది ఏమాత్రము సాధ్యము కాలేదు.<br>అప్పుడు అసురులు దేవతలను ఓడించలేక - ఒక మట్టి బెడ్డను బండరాయితో కొట్టినప్పుడు - ఆ మట్టిబెడ్డ వలె తామే చెల్లాచెదరు అయిపోయారు - విధ్వంసము పొందారు. |
| **8.** | **ఏవం యథా అశ్మానం ఆఖణం ఋత్వా విధ్వగ్ంసత,<br>ఏవగ్ం హ ఏవ స విధ్వగ్ంసతే।<br>య ఏవం విది, పాపం కామయతే,<br>యః చ ఏనం అభిదాసతి, స ఏషో అశ్మా ఆఖణః।** | ఏవిధంగా అయితే పాఱతో కొట్టబడిన మట్టిగడ్డ ముక్కలు అయిపోతుందో, ఆ విధంగా ముఖ్యప్రాణముయొక్క ఉపాసనచే పాపములు, దూషణములు అనే అసుర స్వభావములు, దుష్ట సంకల్పములు ఆతనిని తాకలేవు. అవి ముక్కలు ముక్కలుగా అయిపోయి నశించగలవు.<br>గొడ్డలికి బండరాయి పగలని విధంగా దూషణము మొదలైన సాంసారిక సందర్భములలో ఆతడు పగలని రాయి వలె ఉండగలడు. (అశ్మానం = రాయి; ఆఖణం = పాఱ, గొడ్డలి) |
| **9.** | **నైవైతేన (న ఏవ ఏతేన) సురభి,<br>న దుర్గంధి విజానాతి<br>అపహత పాప్మా హి ఏషః।<br>తేన యత్ అశ్నాతి యత్ పిబతి,<br>తేన ఇతరాన్ ప్రాణాన్ అవతి।** | **ప్రాణోపాసన : ఎవడు తినటము, త్రాగటము మొదలైన వాటితో ముఖ్యప్రాణమును సేవించు భావనతో నిర్వర్తిస్తాడో - అట్టివాడు సువాసన - దుర్వాసనలకు పరిమితుడు కాడు. తినకూడనివి, త్రాగకూడనివి అగు పాపములను (దోషములను) జయించివేస్తాడు.**<br>**తినటము, త్రాగటము, వినటము మొదలైన వాటిచే బంధించబడడు. 'ప్రాణ-అపాన' సంయమ అభ్యాసముచే ముఖ్యప్రాణస్వరూపుడై - పాపరూపులగు అసురులను జయిస్తాడు. ముఖ్యప్రాణస్వరూపముచే దేహములలో ప్రాణముయొక్క ప్రవేశము-నిష్క్రమణములను తన** |

| | | |
|---|---|---|
| | **ఏతము ఏవ అంతతో అవిత్వా ఉత్క్రామతి వ్యాదదాతి ఏవ అంతత ఇతి।** | **స్వాధీనమునందు కలిగియుండి, క్రమంగా ఆవల గల ఆత్మతత్త్వమును అవధరించగలడు. ముఖ్యప్రాణోపాసనను ఇంద్రియముల ద్వారా అర్చించుచున్న భావన కలవాడు, జన్మ-కర్మల పట్ల పారతంత్ర్యము జయించి స్వాతంత్ర్యుడు (Independent) కాగలడు.** |
| **10.** | **తగ్ం హ అంగిరా ఉద్గీథమ్ ఉపాసాంచక్ర ఏతము ఏవ అంగిరసం మన్యంతే, అంగానాం యత్ రసః।** | "ఈ విధంగా ఇంద్రియములను ప్రాణదేవతా - ఉపాసనగా భావించి వర్తించి, ఆత్మతత్త్వమును సిద్ధించుకోవటము" అను ఆత్మతో సంయోగాభ్యాసమును అంగిరస మహాముని లోకములకు బోధించియున్నారు.<br>అందుచేత ఈ ఉద్గీథము (ఉపాసన) - 'అంగిరసము' అని చెప్పబడుతోంది.<br>అంగములను రసస్వరూపముగా తీర్చిదిద్ది రసస్వరూపమగు ప్రాణదేవతను ఉపాసించటము కాబట్టి 'అంగిరసము'. ప్రాణములు దేహ అంగములకు సర్వస్వము కాబట్టి 'అంగిరసము'. |
| **11.** | **తేన తగ్ం హ బృహస్పతిః ఉద్గీథం ఉపాసాంచక్ర ఏతము ఏవ బృహస్పతిమ్ మన్యంతే వాగ్ఘి బృహతీ తస్యా ఏష పతిః॥** | "ఈ విధంగా బృహస్పతి ప్రాణదేవతను సేవించుటయందు ఇంద్రియములను నియమించు భావన" - అను ఉద్గీథము (సేవ)ను ఉపాసించారు. (ఇంద్రియ) దేవతలకు గురుస్థానము అలంకరించారు.<br>ప్రాణమునకు 'బృహస్పతి' అని సార్థక నామము. విస్తారము - పెద్దది (బృహత్) అగు వాక్కుకు ప్రాణదేవతయే పతి కాబట్టి ప్రాణము (ఇంద్రియ దేవతలకు పతి అయి) - 'బృహస్పతి'గా అభివర్ణించబడుతోంది. |
| **12.** | **తేన తగ్ం హ ఆయాస్య ఉద్గీథం ఉపాసాంచక్ర ఏతము ఏవ ఆయాస్యం మన్యంత–ఆస్యాద్యదయతే।** | అట్టి ఇంద్రియములచే ప్రాణోపాసనను ఆయాస్యఋషి ఉద్గీథము చేస్తూ ఉపాసించారు. ప్రాణము ఆయాస్యము (నోరు) నుండి రాకపోకలు చేస్తూ ఉండటంచేత ప్రాణము 'ఆయాస్యము (రాక-పోకలు-గలది)'గా చెప్పబడి ఉపాసించబడుతోంది. అద్దాని ఋషి ఆయాస్యుడు. |
| **13.** | **తేన తగ్ం హ బకో దాల్భ్యో విదాంచకార। స హ నైమిశీయానామ్ ఉద్గాతా బభూవ। స హ స్మైభ్యః కామాన్ ఆగాయతి॥** | దాల్భ్యుని కుమారుడు బకఋషి కూడా స్వానుభవంగా "ఇంద్రియములతో ప్రాణోపాసన" - అను ఉద్గాథమును తెలుసుకొని ఉపాసించారు. ఆయన నైమిశారణ్యంలో తపస్సు చేయు మునులకు, ఋషులకు ఉద్గాత (Trainer) అయినారు. "మీరు కోరుకొన్నది లభించగలదు" అను ఫలశృతిని ప్రాణ ఉద్గీథోపాసన గురించి ప్రవచించారు. |
| **14.** | **ఆగాతా హ వై కామానాం భవతి। య ఏతత్ ఏవం విద్వాన్ అక్షరం ఉద్గీథం ఉపాస్త ఇతి అధ్యాత్మమ్।** | ఎవ్వరైతే ప్రాణోపాసనను అక్షర (ఓంకార) ఆత్మోపాసనముగా ఉద్గీథోపాసన నిర్వర్తిస్తారో - వారు కోరుకున్నవి లభించగలవు.<br>ఇతి అధ్యాత్మమ్। ఇంద్రియములను ప్రాణదేవతా సమర్పణగా ఉపాసించటమే అధ్యాత్మజ్ఞానము అయి ఉన్నది. |

**ఇతి ఛాందోగ్యోపనిషత్ - ప్రథమాధ్యాయే ద్వితీయః ఖండః**

# 1-3. ప్రథమ ప్రపాఠకః - తృతీయః ఖండః

## (ఉద్గీథము = గానము)
## ఉద్గీథము యొక్క అధిదైవిక రూపోపాసన

| | మూలము | అర్థము |
|---|---|---|
| **1.** | **అథ అధిదైవతం।<br>య ఏవ అసౌ తపతి<br>తమ్ ఉద్గీథం ఉపాసీత।<br>ఉద్యన్వా ఏష ప్రజాభ్య ఉద్గాయతి।** | ఇక ఇప్పుడు ఉద్గీథము (అక్షరగానము) యొక్క "అధిదైవికమైన రూపమును ఉపాసించటము" గురించి చెప్పుకుంటున్నాము.<br>ఆకాశంలో దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న సూర్యుని సామగానరూపంగా ఉపాసించటము అధిదైవికోపాసన.<br>అట్టి సూర్యుడు "ఉదయించటము" అనే ఉద్యమముచే జనులందరిని ఉద్గానముగా చేస్తున్నారు. |
| | **ఉద్యగ్ంస్తమో భయం<br>అపహంతి, అపహన్తా హ వై భయస్య<br>తమసో భవతి, య ఏవం వేద।** | సూర్యుడు సమస్త జీవులకు చీకటి భయమునుండి విముక్తి ప్రసాదిస్తున్నారు. 'భయము' అనే చీకటి తొలగటానికై అట్టి సూర్యభగవానుని ఉద్గీథోపాసన చేయుదురు గాక। సూర్యుని స్వయం ప్రకాశ తత్త్వమును ఎరిగినవారు, ఉపాసించువారు అజ్ఞాన చీకటినుండి బయటపడి ఆత్మసూర్యుని యందు ప్రవేశించగలరు.<br>**(భాస్కరాయ విద్మహే, మహద్యుతికరాయ ధీమహి। తన్నో ఆదిత్య ప్రచోదయాత్)।** |
| **2.** | **సమాన ఉ ఏవ అయం చ<br>అసౌ చ ఉష్ణో<br>అయం ఉష్ణో అసౌ।** | ఆకాశంలో సూర్యుడు ప్రకాశిస్తూ, ఉష్ణమును ప్రసాదిస్తూ ఉన్నట్లే, దేహములో ప్రాణము సూర్యునివలె ప్రకాశిస్తూ ఉష్ణమును ప్రసాదిస్తోంది. (ఈవిధంగా) సాదృశంగా సమాన రూపములే। గుణము దృష్ట్యా ఒక్కటే. ఉభయము ఉష్ణమే! |
| | **'స్వర' ఇతి ఇమం ఆచక్షతే<br>స్వర ఇతి "ప్రత్యాస్వర"<br>ఇతి। అముం తస్మాత్ వా<br>ఏతం ఇమం, అముం చ,<br>ఉద్గీథమ్ ఉపాసీత।** | ప్రాణమునకు "స్వర" అని మరొక పేరు.<br>సూర్యునికి - "స్వర ప్రత్యాస్వర" అని పేరు.<br>అందుచేత దేహములో ప్రాణభగవానుని, ఆకాశంలో సూర్యభగవానుని ఇరువురియొక్క 'సామ్య - తేజో' రూపములను సామగానాలతో స్తుతిస్తూ ఉపాసించెదము గాక। |
| **3.** | **అథ ఖలు 'వ్యానమ్'<br>ఏవ ఉద్గీథం ఉపాసీత।<br>యత్ వై ప్రాణ ఇతి, స "ప్రాణో"।<br>యత్ అపాన ఇతి సః అపానః।<br>అథ యః ప్రాణ - అపానయోః<br>సంధిః, సః "వ్యానః"** | ఇప్పుడిక "వ్యానము" రూపమును ఉద్గీథోపాసన (గానోపాసన-praying by singing) చేసెదము గాక।<br>లోనికి వాయువును తెచ్చుచున్న 'శక్తి'యే- **'ప్రాణము'.**<br>లోనుండి బయటకు వెళ్లుటకు వాయువును కదలించు శక్తి - **'అపానము'.**<br>ప్రాణ - అపానముల సంధిలో స్థానము పొందియుండు వాయుశక్తి **'వ్యానము'.** |
| | **యో వ్యానః, సా 'వాక్'।<br>తస్మాత్ అప్రాణన్ అనపానన్<br>వాచమ్ అభివ్యాహరతి॥** | ఏది వ్యానమో అదియే 'వాక్కు' రూపముగా అగుచున్నది. మనము మాట్లాడుచూ ఉన్నప్పుడు ఉచ్ఛ్వాస - ప్రశ్వాస ప్రక్రియలను ఆపితేనే మాట్లాడగలుగుతాము. అందుచేత వ్యానమే (ప్రాణ అపానముల సంధియే) 'వాచము' రూపమగుచూ, మాటలు వెలువడుచున్నాయి - అని చెప్పబడుతోంది. |
| **4.** | **యా వాక్ స ఋక్।<br>తస్మాత్ అప్రాణన్, న అనపానన్<br>ఋచం అభివ్యాహరతి। య ఋక్ తత్ సామ।** | - ఏది వాక్కుయో, అదియే ఋక్కు (స్తోత్ర మంత్రము)<br>- ఋక్కులు పలుకుచున్నవాడు ప్రాణ - అపానముల కదలని స్థితికి తెచ్చి మాత్రమే - పలుకగలుగుచున్నాడు.<br>ఏది ఋక్‌యో అదియే సామము (గానము, ఉద్గీథము). |

| | | |
|---|---|---|
| | తస్మాత్ – అప్రాణన్ న అపానన్ న సామ గాయతి। యత్ సామ, స ఉద్గీథః తస్మాత్ అప్రాణన్, న అనపానన్ ఉద్గాయతి। | అనగా 'ప్రాణ - అపానము'లను చలన రహితము చేసినప్పుడే సామగానము సిద్ధిస్తోంది. ఏది సామమో అదియే (ఓంకారాక్షరోపాసన రూపమగు) ఉద్గీథము.<br>అందుచేత ఉద్గీథము (సామగానము) ప్రాణ - అపానములు కదలిక త్యజించినపుడే జరుగుచున్నది. ఆ రెండిటి నిశ్చలమగు మధ్యస్థానమే ఉద్గానము (లేక) పైకి గానము చేయుటము. |
| **5.** | అతో యాని అన్యాని వీర్యవన్తి కర్మాణి యథా అగ్నేః మంథనమ్ ఆజేః సరణం దృఢస్య ధనుష ఆయమనం "అప్రాణన్ న అనపానగ్ంస్తాని కరోతి। | సామగానము చేస్తున్నప్పుడే కాకుండా, తదితరమైన ఆయా అనేక పనులు దేహముతో చేస్తూ ఉన్నప్పుడు ప్రాణ-అపానములు రహితం అయినప్పుడే (సమస్థితికి వచ్చినప్పుడే) నిర్వర్తించబడుచున్నాయి.<br>ఉదాహరణకు చెక్కలను రాపిడి చేసి మంధనము చేయుటము, దూరంగా ఉన్న ఒక చోటికి వెళ్ళాలనే లక్ష్యంగా పరుగులు తీయటము, గట్టిగా ధనస్సును లాగి బాణము ఎక్కుబెట్టటము -ఈ ఈ మొదలైన కర్మలన్నిటిలో ప్రాణ-అపానములు నిర్వ్యాపారము (Non Functional) అయి ఉంటాయి. |
| | ఏతస్య హి ఏతోః వ్యానం ఏవ ఉద్గీథం ఉపాసీత। | అందుచేత ప్రాణ - అపానములు కదలిక చేయనట్టి 'వ్యానప్రాణము'ను ఉద్గీథోపాసన చేయుచుండెదరు గాక। |
| **6.** | అథ ఖలు ఉద్గీథ "అక్షరాణి" ఉపాసీత। | ఇక - మనము "ఉద్గీథ" యొక్క అక్షరములను (వర్ణములను, "ఉత్-గీ-థ"లను) విశ్లేషించెదము గాక! - (నామ అక్షరాణి ఇత్యర్థః। - ఉద్గీథలోని అక్షరములు - విచారణ చేస్తున్నాము). |
| | ఉద్గీథ ఇతి ప్రాణ ఏవ ఉత్ (కిం తు) ప్రాణేన హి ఉత్తిష్ఠతి। | "ఉద్గీథ" పదములో ("ఉత్-గీ-థ"లలో) "ఉత్" అనగా "ప్రాణము", ఎందుకంటే ప్రాణశక్తిచేతనే ఒకడు లేచి నిలబడగలుగుతాడు. |
| | వాక్ 'గీ'ః। | వాక్కును "గీ"। వాక్కును 'గిర' అని కూడా పిలుస్తారు. |
| | వాచో హ 'గిర' ఇతి – ఆచక్షతే। | "అన్నము" - 'థమ్" |
| | అన్నం 'థమ్'। | థమ్ = అంతటా స్థితి కలిగియున్నది. |
| | అన్నే హి ఇదగ్ం సర్వగ్ం స్థితమ్। | సర్వము అన్నమునుండే ప్రతిష్ఠితమై ఉండటముచేత అన్నమునకు 'థమ్' అని (ఉద్గీథను) అర్థము చెప్పుచున్నారు. |
| **7.** | ద్యౌః ఏవ 'ఉత్'।<br>అన్తరిక్షం 'గీః। పృథివీ 'థమ్'।<br>ఆదిత్య ఏవ ఉత్।<br>వాయుః 'గీః।<br>అగ్నిః 'థగ్ం'। | **"ఉత్-గీ-థమ్"**<br>ద్యౌః = (ద్యులోకము, స్వర్గలోకము) - "ఉత్"। పైన ఉండటంవలన ఉత్ - ద్యౌః)<br>అంతరిక్షము = గీః। లోకములు తనయందు ఇముడ్చుకోవటంచేత అంతరిక్షమే గిరణము - "గీః"।<br>పృథివి = థమ్। ప్రాణులకు స్థానము అగుచుండటంచేత పృథివియే అన్నము - థమ్<br>ఆదిత్యుడు = 'ఉత్'। సూర్యుడు ఆకాశంలో పైన ఉండటంచేత ఆదిత్యుడే ఉత్<br>వాయువు = గీః। అగ్ని మొదలైన దేవతలను తనయందు ఇముడ్చుకోవటంచేత వాయువుయే 'గీః'<br>అగ్ని = థమ్। యజ్ఞములో సమస్త కర్మలకు అధిష్ఠానం అవటంచే అగ్నియే 'థమ్'। |

| | | |
|---|---|---|
| | సామవేద ఏవ 'ఉత్'।<br>యజుర్వేదః 'గీః'।<br>ఋగ్వేదః థమ్।<br>దుగ్ధే అస్మై వాక్ దోహం,<br>యో వాచో దోహో,<br>అన్నవాన్ అన్నాదో భవతి।<br>య ఏతాని ఏవం<br>విద్వాన్ ఉద్గీథ అక్షరాణి<br>ఉపాస్త ఉద్గీథ ఇతి। | సామవేదము - స్వర్గలోకముతో సమానంగా 'ఉత్'। సామము చెప్పబడుతోంది కాబట్టి 'ఉత్'<br>యజుర్వేదము - 'స్వాహా' అను మంత్రముతో హవిస్సును దేవతలు స్వీకరిస్తున్నారు కాబట్టి 'గీ'<br>ఋగ్వేదము - సామ ఋక్కునందు అధిష్ఠించి ఉండటంచేత "థమ్"<br>ఎవ్వరైతే "ఉద్గీథము"ను పైన మనం చెప్పుకున్న తీరులుగా ఉపాసిస్తాడో, అట్టివాని వాక్కు పాలవలె మాధుర్యము సంతరించుకోగలదు. అట్టివాడు అన్నవంతుడు, అన్నాదుడు (కలిగినవాడు, ఇచ్చువాడు) కాగలడు. 'ఉద్గీథాక్షరములు ఈ విధంగా ఉపాసించువాడు "ఉత్తమ అనుభవి" అగుచున్నాడు.<br>(The Finest will have its admission into his zone of experience) |
| **8.** | అథ ఖలు ఆశీః సమృద్ధిః<br>ఉపసరణాని ఇతి ఉపాసీత।<br><br>యేన సామ్నా స్తోష్యన్ స్యాత్<br>తత్ సామ ఉపధావేత్। | **ఉద్గీథము - కామసిద్ధి**<br>ఇప్పుడు మనము - తాను అనుకున్నవి జరగటానికి, కోరికలు ఈడేరటానికి, సమృద్ధి పొందటానికి - ఎట్లా ఉద్గీథోపాసన చేయాలో చెప్పుకుందాము.<br>సామము (వాక్కు సంగీతము)తో ఏ దేవతను ఉపాసిస్తూ ఉన్నారో, ఆ దేవతా సామమును - ఉత్పత్తి, ఛందస్సు మొదలైన విశేషములతో భావన చేయాలి. మననము చేయాలి. |
| **9.** | యస్యాం ఋచి తామ్ ఋచం।<br>యత్ ఆర్షేయం తం ఋషిం।<br>యాం దేవతాం అభిష్టోష్యన్ స్యాత్<br>తాం దేవతాం ఉపధావేత్। | ఆ సామము ఏ ఋక్కు (గానము వాక్కునందు) అధిష్ఠితమైయున్నదో ఆ ఋక్కును కూడా (ఆ శబ్దార్థము కూడా) - అద్దాని దేవత, ఛందస్సు మొదలైన వాటితో చేర్చి భావన చేయాలి.<br>ఏ ఆర్షమునందు ఉన్నదో - ఆ ఋషిని (ఉద్గాతను) స్తుతించుచూ, ఆ దేవతను కూడా భావన చేయుదురు గాక। |
| **10.** | యేనత్ ఛందసా స్తోష్యన్ స్యాత్,<br>తత్ 'ఛన్దః' ఉపధావేత్।<br>ఏన స్తోమేన స్తోష్యమాణః స్యాత్<br>తగ్ంం స్తోమం ఉపధావేత్॥ | ఏ మంత్రమును ఏ ఛందస్సుతో స్తుతించబోవుచున్నారో - ఆ ఛందస్సును స్తుతిస్తూ (మననము చేస్తూ) ఉద్గీథ గానము చేయాలి.<br>ఏ స్తోమను (సామయందలి ఆ దేవతను స్తుతించే సంఖ్యా విశేషమును) స్తుతిస్తున్నారో - ఆ వేద - ఉపాంగ - సంఖ్యా విశేషములను కూడా భావన చేయాలి. ఆ దేవతను (స్తోమను) భావన చేస్తూ ఉద్గీథము నిర్వర్తించెదరు గాక। |
| **11.** | యాం దిశం అభిష్టోష్యన్ స్యాత్<br>తాం దిశం ఉపధావేత్। | ఉద్గాత (యజ్ఞవిధిలో సామగానముతో పరమాత్మను స్తుతించుచున్న వాడు) ఏ దిక్కుగా స్తుతిస్తున్నాడో (ఉద్గీథము చేయుచున్నాడో) ఆ 'దిక్కు'ను కూడా ధ్యానించెదరు గాక। ఆ దిక్కుగా ఆత్మను మననము చేసెదరు గాక। |
| **12.** | ఆత్మానం అన్తత<br>ఉపసృత్య స్తువీత। కామం ధ్యాయన్।<br>న ప్రమత్తో అభ్యాశో హ యదస్మై<br>స కామః సమృధ్యేత<br>యత్ కామః స్తువీత ఇతి,<br>యత్కామః స్తువీత ఇతి॥ | ఆ తరువాత స్వకీయమగు జీవాత్మత్వమునకు ఆవలగల పరమాత్మ (లేక) కేవలాత్మతత్త్వమును సమీపించి సర్వలోక సంబంధమైన కోరికలను త్యజించినవాడై ధ్యానము చేయును గాక।<br>అప్రమత్తుడై (Non-Lazy, Non-drowsy) అయి అట్టి ఉపాసన నిర్వర్తించు గాక।<br>అట్టివాడు సకాముడైతే, ఆతడు ఏ సమృద్ధి కోరుకొని ధ్యానిస్తాడో - అట్టి కోరుకొన్నవన్నీ లభించగలవు.<br>కోరుకొన్నవి కోరుకొన్న రీతిగా త్వరితముగా పొందబడగలవు. |

ఇతి ఛాందోగ్యోపనిషత్ - ప్రథమాధ్యాయే తృతీయః ఖండః

## 1-4. ప్రథమ ప్రపాఠకః - చతుర్థః ఖండః

### ఓంకార ఉద్గీథము

| | | |
|---|---|---|
| 1. | 'ఓం' ఇతి ఏతత్<br>అక్షరం ఉద్గీథం ఉపాసీత। | 'ఓం' యొక్క పరాకాష్ఠార్థమైనట్టి అక్షరము (బ్రహ్మము) యొక్క గానమును ఉపాసించెదము గాక. |
| | 'ఓం' ఇతి హి<br>ఉద్గాయతి, తస్య ఉపవ్యాఖ్యానమ్। | అట్టి 'ఓం' అని ఏది గానము చేయబడుచున్నదో - అద్దాని గురించి ఉపాఖ్యానము (వ్యాఖ్యానము) చేసుకొంటున్నాము. |
| 2. | దేవా వై మృత్యోః బిభ్యతః। | ఒక సందర్భములో దేవతలు మృత్యువు గురించిన భయమును పొందసాగారు. |
| | త్రయీం విద్యాం ప్రావిశగ్ంస్తే<br>ఛందోభిః అచ్ఛాదయన్ యత్<br>ఏభిః అచ్ఛాదయగ్ం<br>తత్ ఛందసాం ఛందస్త్వమ్॥ | త్రయీ విద్యలయినట్టి వేదములలో చెప్పబడిన ధర్మ - అర్థ - కామముల గురించిన మంత్రములను ఆశ్రయించారు. వేద ఛందస్సులచే (ఆయా త్రైవిద్యా కార్యక్రమములచే) ఆచ్ఛాదనము (En-covered, en-compassed) పొందారు.<br>వేదమంత్రములలో సూచించబడిన కర్మల విభాగమును బాగుగా అనుష్ఠించసాగారు. వేదములలో ధర్మార్థకామ విభాగములు ఆశ్రయించారేగాని, వేద హృదయమగు పరమాత్మతత్త్వము ఏమిటో వారు అప్పుడు దృష్టిలో పెట్టుకోలేదు. |
| 3. | తాను తత్ర మృత్యుః<br>యథా మత్స్యమ్ ఉదకే<br>పరిపశ్యేత్ – ఏవం పరి అపశ్యత్।<br>ఋచి సామ్ని యజుషి, తే ను<br>విదిత్వ ఊర్ధ్వా ఋచః<br>సామ్నో యజుషః 'స్వరం' ఏవ ప్రావిశన్। | సకల సంహారరూపిణియగు మృత్యుదేవత దేవతల కొరకై వెతుకసాగింది. వారు వేదోపాసనలలోని ధర్మార్థకామముల చాటుగా కనిపించనే కనిపించారు. నిర్మలమైన నీటిలో చేపలు కనబడుతూ ఉంటాయి చూచారా! నిర్మల జలంలోని చేపలను చూచు విధంగా తమను మృత్యుదేవత చూస్తూ ఉన్నదని, త్రైవిద్యోపాసనచే మృత్యువు తమచే జయింపబడలేదని ఆ దేవతలు గమనించారు. త్రైవిద్యా మంత్రములు (ఋక్=శాస్త్రీయ స్తుతి మంత్రములు, యజుః = యజ్ఞ - యాగ ప్రాధాన్యములగు యజుర్వేద మంత్రములు, స్తుతి ప్రాధాన్యములగు సామవేద మంత్రములు) తమను మృత్యు పరిధులనుండి బయటకు తేలేవని గమనించారు.<br>అప్పుడు ఋక్-యజుః-సామవేదములలోని 'స్వరము' రూపము, ఏకాక్షరము అగు 'ఓం'కారార్థమును అధ్యయనము చేయసాగారు. ఉపాసించసాగారు. 'ఓం' కారమును సమస్త విధానములలో మొదట - చివరగా ఏర్పరచుకొని త్రైవిద్యను ఉపాసించసాగారు. |
| 4. | యదా వా ఋచం<br>ఆప్నోతి 'ఓం' ఇతి ఏవ<br>అతి స్వరతి ఏవగ్ం।<br>సామ ఏవం యజుః<br>ఏష ఉ స్వరో | అందుచేతనే ఋగ్వేద ఋచములు పఠిస్తూ ఉన్నప్పుడు 'ఓం' అను అక్షరతత్త్వార్థ స్వరముతో ప్రారంభించటం జరుగుతోంది. సర్వాత్మకమగు పరాత్మను జ్ఞాపకం పెట్టుకొని ఋగ్వేద ఋక్కులు గానం చేయబడుచున్నాయి.<br>అట్లాగే యజుర్వేద మంత్రములను, సామవేద మంత్రములను కూడా 'ఓం' కార ఉచ్చస్వరముతో ప్రారంభించసాగారు. 'ఆత్మోపాసన'ను జోడించి మంత్రోపాసన ప్రారంభిస్తున్నారు. |

**యత్ ఏతత్ అక్షరం।**
**ఏతత్ అమృతం। అభయం।**
**తత్ ప్రవిశ్య, దేవా అమృతా**
**అభయా – అభవన్।**

ఆ విధంగా ఏ 'ఓం'తో ఋక్ - యజు - సామములను, త్రైవిద్యను - దేవతలు అధ్యయనము ప్రారంభించారో, అట్టి **'ఓం'** యొక్క పరమార్థము:-

ఏదైతే జన్మ-కర్మ మొదలైనవాటిచే తరుగుదల - పెరుగుదల పొందటంలేదో - 'అక్షరము'। - క్షరము లేనిదో - అది అద్వితీయమగు 'పరమాత్మ' లేక 'పరబ్రహ్మము'నకు సంజ్ఞ. కాబట్టి అభయము. రెండవది ఉంటే కదా భయము? (ద్వితీయం వై భయం భవతి)!

అట్టి అక్షరము - అద్వితీయము అగు కేవల సాక్షీరూపమగు **'ఆత్మ'** యందు ప్రవేశించి దేవతలు అమృత స్వరూపులైనారు. అభయమును సిద్ధించుకొన్నారు.

---

**5.** **స య ఏతత్ ఏవం విద్వాన్**
**అక్షరం ప్రణౌతి,**
**ఏతత్ ఏవ అక్షరగ్ం**
**'స్వరం' అమృతం, అభయం ప్రవిశతి।**
**తత్ ప్రవిశ్య యత్ అమృతా**
**దేవాః తత్ అమృతో భవతి॥**

ఏ నిత్యానిత్య వివేకియగు విద్వాంసుడైతే - అట్టి ప్రణవమగు అక్షరమును, సమన్వయిస్తూ, దర్శిస్తూ, ఉపాసిస్తూ ఉంటాడో - అట్టివాడు అక్షరము ('ఓం'కార) స్వరరూపము, అమృతము, అభయము అగు పరస్వరూపము నందు ప్రవేశిస్తాడు. దేవతలవలెనే అమృత స్వరూపుడౌతాడు. అమృత తుల్యుడౌతాడు. తానే అభయము - నిత్యము - సహజము అగు అఖండ ఆత్మానంద స్వరూపుడై విరాజిల్లుతాడు.

**ఇతి ఛాందోగ్యోపనిషత్ - ప్రథమాధ్యాయే చతుర్థఖండః**

## 1-5. ప్రథమ ప్రపాఠకః - పంచమః ఖండః

### ('ఓం'కార) ప్రణవమే ఉద్గీథము

### (ఉద్గాతం = గానము చేయటము)

| | | |
|---|---|---|
| **1.** | **అథ ఖలు య ఉద్గీథః**<br>**స ప్రణవో। యః ప్రణవః**<br>**స ఉద్గీథ - ఇతి। అసౌ వా**<br>**ఆదిత్య ఉద్గీథ। ఏష ప్రణవః ।**<br>**'ఓం' ఇతి హి ఏష స్వరన్ ఏతి॥** | ఏది సామగాన (స్తోత్ర) సంబంధమైన ఉద్గీథమో, అదియే 'ప్రణవము'. ఏది ప్రణవమో, అదియే ఉద్గీథము కూడా।<br>ప్రణవమే సూర్యుడు.<br>అట్టి ఏకాక్షరమగు ఆత్మ 'ఓం' స్వరముయొక్క ఉపాసనచే అనుభవమగుచున్నది. 'అన్నము' కూడా అదియే. 'అనుభవి - అనుభవము' - ఈ రెండూ ప్రణవ స్వరూపముగా ఉద్గీథోపాసన (గానోపాసన)తో ఉపాసించబడుచున్నాయి. ఏకరూపముగా దర్శించబడుచున్నాయి.<br>సూర్యుడు 'ఓం' - ప్రణవము ఉద్గీథము (గానము) చేస్తూనే ఆకాశంలో స్వయంప్రకాశకుడై సంచరిస్తున్నారు. |
| **2.** | **ఏతము ఏవ అహమ్**<br>**అభ్యగాసిషం,**<br>**తస్మాత్ మమ త్వమ్ ఏకో అసి ఇతి**<br>**హ-కౌషీతకిః పుత్రం**<br>**ఉవాచ - రశ్మీగ్ం స్త్వం**<br>**పర్యావర్తయాత్ బహవో**<br>**వై తే భవిష్యన్తి ఇతి "అధి దైవతమ్"।** | సూర్యుడు తన కుమారుడైనట్టి కౌషీతకీ మహర్షికి ఈ విధంగా బోధించారు.<br>**"ప్రియపుత్రికా! కౌషీతకీ! నేను ప్రణవ గానము చేస్తూ ఆకాశంలో స్వయం ప్రకాశకుడినై సర్వత్రా వెలుగును నింపుచున్నాను. నీవు <u>నన్ను ఆత్మతత్త్వ పురుషుడు</u>గాను, నా కిరణములను ఉద్గీథముగాను భావించి ఉపాసించుము. నా తేజస్సు ఏకమే అయినప్పటికీ అనేక రూపములుగా పర్యావర్తనము అగుచున్న తీరుగా, <u>ఏకము-అక్షరము అగు ఆత్మయే అనేకముగా పర్యావర్తనమై ప్రదర్శనమౌతోంది".</u>**<br>సూర్యుడు చెప్పినట్లు ఉపాసించిన (ప్రజాపతి) కౌషీతకీ మహర్షి తన కుమారునితో "నాయనా! కావున నీవు నాకు ఒక్కడివే పుత్రుడవు.<br>దేవతలు సూర్యుని కిరణములను ఉద్గీథోపాసనకు విషయము (ఉపాస్యము)గా భావించి ధ్యానిస్తున్నారు. నీవు అట్లే నిర్వర్తించు. నీకు బహు సంతానము కలుగును" - అని బోధించారు. |
| **3.** | **అథ అధ్యాత్మం।**<br>**య ఏవ అయం ముఖ్యః ప్రాణః**<br>**తం ఉద్గీథం ఉపాసీత -**<br>**'ఓం' ఇతి హి ఏష స్వరన్ ఏతి॥** | **<u>అధ్యాత్మము</u>**<br>ఇప్పుడిక "అధ్యాత్మము" గురించి చెప్పుకుందాము.<br>**అధ్యాత్మము:** ఇది తన శరీరమును, తదితర శరీరములను ఉపాసించటము. అయితే భౌతిక రూపంగా కాదు. దేహములన్నీ ముఖ్యప్రాణ ప్రదర్శనా రూపముగా భావన చేయటము - ఉద్గీథోపాసన చేయటము, ('ఓం') ప్రణవోపాసన (లేక) 'స్వరోపాసన' అగుచున్నది. నోటితో ఉచ్చరించే ప్రణవమే ప్రాణము. |
| **4.** | **ఏతము ఏవ అహమ్**<br>**అభ్యగాసిషం। తస్మాత్**<br>**మమ త్వమ్ ఏకో అసి ఇతి**<br>**హ కౌషీతకిః పుత్రం**<br>**ఉవాచ - ప్రాణాగ్ంస్త్వం**<br>**భూమానం అభిగాయతాత్**<br>**బహవో వై మే భవిష్యంతి ఇతి॥** | కౌషీతకీ మహర్షి ఇంకా ఈ విధంగా చెప్పుచున్నారు.<br>నేను ప్రాణమును ప్రణవ స్వరూపంగాను, "ఈ ప్రాణమే నాకు పుత్రుడు"- గాను భావిస్తూ "ఆత్మా వై పుత్ర నామాసి" అను స్తుతి నిర్వర్తిస్తూ ఉన్నాను.<br>"ప్రాణమును పుత్రునిగాను భావించి, బహుసంతతి ప్రసాదించటానికై ప్రాణములను ఉద్గీథోపాసనగా చేస్తున్నాను.<br>ప్రాణమే ప్రణవ స్వరూపంగా, బహు (అధికము)గా భావించుటము నిర్వర్తించబడుచున్నప్పుడు సర్వజీవులు నాకు మమప్రాణస్వరూపంగా అనుభవమగుచున్నారు". |

| | | |
|---|---|---|
| **5.** | **అథ ఖలు య ఉద్గీథః స ప్రణవః।**<br>**యః ప్రణవః స ఉద్గీథః।**<br>**ఇతి హెూతృషదనాత్ హ ఏవ అపి**<br>**దురుద్గీతమ్ అనుసమాహరతి – ఇతి।**<br>**అనుసమాహరతి ఇతి॥** | ఏది ఉద్గీథమో (స్తుతిగానమో) అదియే ప్రణవము.<br>ఏది ప్రణవమో, (ప్రాణశక్తియో) - అదియే ఉద్గీథము కూడా!<br>ఈ విధంగా ఆధ్యాత్మికంగా శరీరములనే ప్రాణస్వరూపంగా, ప్రాణములనే ప్రణవముగా ఏకరూపం చేసి ఉద్గీథము చేస్తున్నప్పుడు వేదమంత్రములను పలుకుటలో ఉచ్చారణ దోషములు ఉన్నప్పటికీ కూడా (ప్రాణమే - ప్రణవము, ప్రాణమే దేహము - అను గానముచే) - అట్టి పలుకు దోషములు సమాహరతము (దోషము తొలగుట) పొందబడగలవు. |

**ఇతి ఛాందోగ్యోపనిషత్ - ప్రథమాధ్యాయే పంచమ ఖండః**

---

## 1–6. ప్రథమ ప్రపాఠకః – షష్ఠః ఖండః – పరమపురుషుడే ఉద్గీథము

| | | |
|---|---|---|
| **1.** | **ఇయం ఏవః అగ్నిః సామ।**<br>**తత్ ఏతత్ ఏతస్యామ్**<br>**ఋచి అధి ఊఢగ్ం సామ।**<br>**తస్మాత్ ఋచి అధి ఊఢగ్ం సామగీయతే।**<br>**ఇయం ఏవ సా అగ్నిః।**<br>**అమః తత్ సామ॥** | ఈ అగ్నియే 'సామము'.<br>అట్టి సామము 'ఋచమ్' పై ఆధారము.<br>**'సా'** = భూమి (Basis)<br>**'అమ'** = అగ్ని.<br>ఈ విధంగా అగ్నియే సామవేదము.<br>అగ్ని ప్రాణరూపము.<br>గానము ప్రాణశక్తియొక్క క్రియా ప్రదర్శనము.<br>ప్రాణమునకు ఆధారము ఋచము (ఆత్మ).<br>ఇదంతా అగ్ని (ప్రాణ) స్వరూపమై 'సామము'గా ప్రదర్శనమగుచున్నది.<br>(ఊఢము = పొందబడినది, మోయబడినది.<br>అధ్యూఢము = ఒకటిచే మరొకటి పొందబడినది - మోయబడినది) |
| **2.** | **అన్తరిక్షం ఏవ ఋక్।**<br>**వాయుః సామ।**<br>**తత్ ఏతత్ ఏతస్యాత్**<br>**ఋచః అధ్యూఢగ్ం సామ।**<br>**తస్మాత్ ఋచః అధ్యూఢగ్ం**<br>**సామ గీయతే, అన్తరిక్షం ఏవ సా వాయుః।**<br>**అమః తత్ సామ॥** | అంతరిక్షమే → 'ఋక్కు'<br>వాయువు → 'సామము'<br>అట్టి సామము ఋక్‌పై ఆధారము.<br>ఋక్కుపై ఆధారితమై సామము గానము చేయబడుతోంది.<br><u>సా</u> = ఆకాశము<br><u>అమ</u> = వాయువు<br>ఆకాశము + వాయువు యొక్క కలయికయే(రమయే) - "సామ" |
| **3.** | **ద్యౌః ఏవ 'ఋక్'।**<br>**ఆదిత్యః 'సామ' ।**<br>**తదేతత్ ఏతస్యామ్**<br>**ఋచః అధ్యూఢగ్ం**<br>**సామ। తస్మాత్ ఋచః**<br>**అధ్యూఢగ్ం సామ గీయతే**<br>**ద్యౌః ఏవ – సా ఆదిత్యః ।**<br>**అమః తత్ "సామ"॥** | ద్యులోకము (స్వర్గలోకము) - 'ఋక్'<br>ఆదిత్యుడు (సూర్యుడు) - సామము<br>- అట్టి సామము (ఆదిత్యుడు) ఋక్‌పై ఆధారము.<br>- 'ఋక్' ఆధారముగా సామము గానము చేయబడుతోంది.<br>**"సా"** = స్వర్గము (ద్యులోకము)<br>**"అమ"** = సూర్యుడు (ఆదిత్యుడు)<br>ద్యులోకము (దివ్యలోకము/స్వర్గలోకము) + ఆదిత్యుడు → ఈ రెండిటి కలయికయే "సామము"। |

| | | |
|---|---|---|
| **4.** | **నక్షత్రాణి ఏవ ఋక్।<br>చంద్రమాః సామ।<br>తత్ ఏతత్ ఏతస్యామ్<br>ఋచః అధ్యూఢగ్ం 'సామ'।<br>తస్మాత్ ఋచః అధ్యూఢగ్ం<br>సామ గీయతే నక్షత్రాణి<br>ఏవ సా చంద్రమా<br>అమః – తత్ సామ॥** | నక్షత్ర మండలము - "ఋక్"<br>చంద్రుడు - 'సామము'<br>అట్టి సామము → ఋక్‌పై ఆధారితము<br>అందుచేత 'ఋక్' ఆధారంగానే సామము గానము చేయబడుతోంది.<br>**"సా"** = నక్షత్రమండలము<br>**"అమ"** = చంద్రుడు<br>నక్షత్రమండలము + చంద్రుడు<br>సా (ఋక్) + (అమ) ఈ రెండూ కలిస్తేనే 'సామ'. |
| **5.** | **అథ యత్ ఏతత్ ఆదిత్యస్య<br>శుక్లం భాః స ఏవ ఋక్।<br>అథ యత్ నీలం, పరః కృష్ణం తత్ సామ।<br>తత్ ఏతత్ ఏతస్యామ్ ఋచః అధ్యూఢగ్ం సామ।<br>తస్మాత్ ఋచః అధ్యూఢగ్ం సామ గీయతే॥** | ఆదిత్యుని కాంతి - శుక్లము (తెలుపు) 'సా'<br>ఆదిత్యుని నీలము, పరము అగు కృష్ణము (నలుపు) - "అమ"<br>ఈ శుక్లము, కృష్ణముల చేరిక → 'సామ'.<br>తెలుపు నలుపుపై ఆధారము.<br>'ఋచము'పై ఆధారము కలదై 'సామ'గానము (అధ్యఢగ్ం = ఆధారమై ఉన్నది)<br>తెలుపుపై నలుపువలె 'ఋక్' పై 'సామ' గానము చేయబడుతోంది.<br>(ఋక్ = Lyric, సామ = Music) |
| **6.** | **అథ యత్ ఏవ ఏతత్ ఆదిత్యస్య శుక్లం,<br>భాః స ఏవ 'సా' అథ యత్ నీలం<br>పరః (పరా) కృష్ణం। తత్ అమః తత్ 'సామ'।<br>అథ య ఏషో అంతర ఆదిత్యే<br>హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్య<br>శ్మశ్రుః హిరణ్య కేశ<br>ఆప్రణఖాత్, సర్వ ఏవ సువర్ణః॥** | ఆదిత్యునియందు ఏ శుక్లము (తెలుపు) భాసిస్తోందో - అదియే నీలము, నలుపుగా రూపు కలిగి ఉంటోంది.<br>సూర్యునిలో ప్రకాశమానుడగుచున్నవాడే "పురుషుడు".<br>ఆ పురుషుడు (Worker of the Universe) 'ఆదిత్యుడు'గాను, హిరణ్మయుడుగాను (కూడా) చెప్పబడుచున్నాడు.<br>అట్టి హిరణ్మయపురుషుడు బంగారు కేశములతో, బంగారు రంగుతో ప్రకాశమానుడుగా ఉపాశ్య - ఉపదేశ్య రూపముగా అభివర్ణించ బడుచున్నారు. |
| **7.** | **తస్య యథా కప్యాసం<br>పుండరీకం ఏవం అక్షిణీ।<br>తస్య 'ఉత్' ఇతి నామ।<br>స ఏష సర్వేభ్యః పాప్మభ్య<br>ఉదిత ఉత్ ఏతి హ వై<br>సర్వేభ్యః పాప్మభ్యో య ఏవం వేద।** | సమస్త కల్పకు పురుషకారుడు, ఆధారుడు అగు ఆ హిరణ్యగర్భ పురుషుడు<br>- ఎరుపు రంగుతో ప్రకాశించు తామరపువ్వు వంటి కనులతో,<br>- 'ఉత్' శబ్దార్థుడై అజ్ఞానమాలిన్యము నుండి బయటకు తెచ్చువాడై సముద్ధరించువాడై,<br>- సమస్త పాప దోషముల నుండి బయటపడటానికి మార్గదర్శకుడై, పాపములు పోగొట్టువాడై యోగజ్ఞులచే దర్శించబడి, సాధక జనుల కొరకై సారూప్యముగా ప్రసాదించబడుచున్నారు.<br>ఇది ఎరుగుచున్నవారు సర్వ దోషముల నుండి విడివడుచున్నాడు. |
| **8.** | **తస్య ఋక్ చ సామ చ, గేష్ణౌ।<br>తస్మాత్ ఉద్గీథః। తస్మాత్ త్వ ఏవ ఉద్గాత।<br>ఏతస్య హి గాతా।<br>స ఏష యే చ ఆముష్మాత్పరాంచో లోకాః।<br>తేషాం చేష్టే దేవకామానాం చ<br>ఏతి అధిదైవతమ్॥** | ఆ పరమపురుషుడే ఋగ్వేద యజుర్వేదములు గృహముగా కలవారు.<br>- ఆయనయే ఉద్గీథము (స్తోత్ర గాన స్వరూపము) కూడా!<br>- ఆయనయే గానము చేయు ఉద్గాత, ఉద్గాతను ఆహ్వానిస్తున్న యజ్ఞకర్త కూడా।<br>- ఆయనయే గానలహరి।<br>- ఆయనయే ఆముష్మిక (పరలోక) ప్రయోజనరూపుడు.<br>- ఆయనయే దేవతలు కోరుకొనే పరాకాష్ఠతత్త్వుడు. లోకములకు కూడా ఆవలివాడు.<br>ఇదియే **'అధిదైవతము'**. |

**ఇతి ఛాందోగ్యోపనిషత్ - ప్రథమాధ్యాయే షష్ఠః ఖండః**

## 1-7. ప్రథమ ప్రపాఠకః - సప్తమః ఖండః - పరమ పురుష సామ ఉపాసన

| | | |
|---|---|---|
| **1.** | **అథ అధ్యాత్మం।**<br>**వాక్ ఏవ "ఋక్"। ప్రాణః సామ।**<br>**తత్ ఏతత్ ఏతస్యామ్ ఋచః అధ్యూఢగ్ం సామ।** | ఈ శరీరమునకు సంబంధించిన సాధనా వ్యవస్థయే 'అధ్యాత్మము'.<br>- వాక్కు (Speaking)యే - 'ఋక్'.<br>- ప్రాణమే - 'సామము'.<br>అట్టి సామము (శబ్ద సంగీత సౌందర్యము) ఋక్కుపై(సత్యవాక్కు - ఆత్మతత్త్వము)పై ఆధారపడి గానం చేయబడుతోంది. |
| | **తస్మాత్ ఋచః అధ్యూఢగ్ం సామ గీయతే।**<br>**వాక్ ఏవ 'సా' ప్రాణో 'అమః' - తత్ సామః॥** | అందుచే అట్టి ఋక్కునకు (పరమసత్యమగు ఆత్మతత్త్వమునకు) ఆధారమై సామము గానము చేయబడుచున్నది.<br>వాక్కుయే 'సా'<br>ప్రాణము - 'అమ'<br>తత్ పరమాత్మ స్వరూపమే సామగానము. వాక్కు - ప్రాణముల కలయికయే 'సామ'. |
| **2.** | **చక్షుః ఏవ ఋక్। ఆత్మా సామ।**<br>**తత్ ఏతత్ ఏతస్యామ్ ఋచః అధ్యూఢగ్ం సామ।**<br>**తస్మాత్ ఋచః అధ్యూఢగ్ం సామ గీయతే।**<br>**చక్షుః ఏవ 'సా' ఆత్మా అమః తత్ సామ॥** | చక్షువులు (కన్ను) - 'ఋక్కు'<br>చూచువాడు / నేత్రేంద్రియము → 'సామ'<br>కన్నుపై చూపు ఆధారపడు విధంగా - ఋక్కుపై సామ ఆధారితము. ఋక్కు ఆధారంగానే సామము గానము చేయబడుతోంది.<br>నేత్రములు, చూపు ఏకరూపమే.<br>నేత్రము (కన్ను) → 'సా'<br>ఆత్మ (నేత్రేంద్రియము) → 'అమ'<br>ఈ నేత్రము - జీవాత్మల కలయికయే సామ। |
| **3.** | **శ్రోత్రం ఏవ "ఋక్" మనః 'సామ'।**<br>**తత్ ఏతత్ ఏతస్యామ్ ఋచః అధ్యూఢగ్ం సామ।**<br>**తస్మాత్ ఋచః అధ్యూఢగ్ం సామ గీయతే।**<br>**శ్రోత్రం ఏవ 'సా'। మనో - అమః।**<br>**తత్ సామ॥** | శ్రోత్రము (చెవి) (వినికిడి) - 'ఋక్కు'.<br>మనస్సు - 'సామ'<br>అట్టి సామము ఋక్కుపై ఆధారపడి యున్నది.<br>చెవి - 'సా'।<br>మనస్సు - 'అమ'<br>చెవి మనస్సుల కలయికయే 'సామ' |
| **4.** | **అథ యత్ ఏతత్ అక్ష్ణః (ఋక్-అక్షః)**<br>**శుక్లం। భాః స ఏవ ఋక్ అథ యత్ నీలం పరః**<br>**కృష్ణం తత్ సామ।**<br>**తత్ ఏతత్ ఏతస్యామ్**<br>**ఋచ అధ్యూఢగ్ం సామ।** | నేత్రములోని శుక్ల (తెలుపు) విభాగముగా భాసించుచున్నది - 'ఋక్కు'.<br>తెలుపుకు వేరుగా నీల - నలుపులతో కూడిన నల్లని విభాగము - 'సామ'<br>సామము (గానము) ఋక్కు నుండి (మంత్రము - వాఙ్మయము నుండి) బయల్వెడలుచున్నది. అనగా సామము ఋక్కుపై ఆధారపడి ఉన్నది. కంటిలో తెల్లటి విభాగముపై (విస్తరణవలె) నల్లటి విభాగము చోటుపొందుచున్నది. |
| | **తస్మాత్ 'ఋక్'చ అధ్యూఢగ్ం సామ గీయతే।**<br>**అథ యత్ ఏవ ఏతత్ అక్ష్ణః**<br>**శుక్లం భాః స ఏవ 'సా'।**<br>**అథ యత్ నీలం పరః**<br>**తత్ 'అమ'। తత్ సామ।** | 'ఋక్కు'ను ఆధారము చేసుకొని సామము గానము చేయబడుతోంది.<br>ఈ విధంగా కంటిలో తెల్లగా ప్రకాశమానమై యున్నది - **'సా'**.<br>నీలమునకు పరమై నలుపు విభాగము - **'అమ'**.<br>ఆ రెండిటి కలయికయే **'సామ'**. |

| | మూలము | భావము |
|---|---|---|
| **5.** | **అథ య ఏషో అంతః అక్షిణి పురుషో<br>దృశ్యతే స ఏవ ఋక్ తత్ సామ<br>తత్ ఉక్థం- తత్ యజుః తత్ బ్రహ్మ।<br>తస్య ఏతస్య తత్ ఏవ రూపం<br>యత్ అముష్యరూపం<br>యా అవముష్య గేష్ణౌ తౌ గేష్ణౌ।<br>యత్ నామ, తత్ నామ।** | ఏ పురుషుడు నేత్రములో అంతరముగా చూచువానిగా దృశ్యమానమై యున్నారో (As a Perceiver) - **ఆయనయే ఋక్కు**<br>ఆయనయే 'సామము' కూడా।<br>ఆయనయే **'ఉక్థ (ప్రాణము) (సామవేదము)**<br>ఆయనయే - **"యజుర్వేదము"**<br>ఆయనయే - **"బ్రహ్మము"**<br>ఈ నేత్రములలో నివాసము కలిగియున్న రూపమే (చూచువాడే) అముష్యరూపము. సూర్యునిలో నివసించుచున్న రూపము కూడా ఆయనయే.<br>పురుషుడు- సూర్యునిలో నివసించుచున్నవాని పేరు, ఈ నేత్రములలో నివసిస్తున్నవారి పేరు ఒక్కటే. ఆతడే **'పురుషుడు'**।<br>ఆ **పురుషుడే సర్వజీవులలో "ఉత్తమపురుషగా"** (The First Person, 'I' గా) వెలయుచు - **పురుషోత్తముడుగా** స్తుతించబడుచున్నాడు. |
| **6.** | **స ఏష యే చ ఏతస్మాత్ అర్వాంచో<br>లోకాః తేషాం చేష్టే మనుష్య కామానాం చ ఇతి।** | ఆ పురుషుడే<br>- జగత్తులో సర్వజీవుల ఇష్టము, వాంఛ, ఆశయముల రూపంగా ప్రదర్శనమగుచున్నారు. (అహమ్ ఆత్మ సర్వభూతాయ స్థితః)<br>- ఆయనయే లోకముల రూపంగాను, లోకములలోని సర్వ దృశ్యములుగాను వెలయుచున్నారు.<br>- ఆయనయే మనుష్యులలో (జీవులలో) కామములను చేష్టితము చేయుచున్నవారు.<br>(He is the Inspirer of all Desires/Expectations of all Beings, just like a Drama Writer for all Roles) |
| | **తద్య ఇమే వీణాయాం గాయన్తి।<br>ఏతం తే గాయన్తి తస్మాత్ తే ధనసనయః** | ఎవ్వరైతే అట్టి సమస్తమునందు వసించుచున్న వాసుదేవ భగవానుని (లేక) వాసుదేవ పురుషుని వీణాగానముతో పాడుచున్నారో (స్తుతిస్తూ పాట పాడుచున్నారో) - వారు ఏది 'మాకు కావాలి' అనుకుంటే అవన్నీ పొందగలరు. |
| **7.** | **అథ య ఏతత్ ఏవం విద్వాన్<br>సామ గాయతి ఉభౌ స గాయతి।** | ఎవ్వరైతే అట్టి దేవదేవుని ఎరుగుచు సామగానము చేయుచున్నారో, వారు (ఇహ-పర రూపములగు) ఉభయము - ఋక్ (వాక్) - సామ అర్థోపాసనలను ఉపాసించువారగుచున్నారు. |
| | **సో అమున ఏవ స ఏష యే చ అముష్మాత్<br>పరాంచో లోకాన్ తాగ్ం చ<br>ఆప్నోతి దేవ కామాగ్ంశ్చ॥** | అట్టి పరమాత్మను ఎవ్వరైతే ఉద్గీథ గానము ద్వారా ఉపాసిస్తున్నారో వారు పరమునగల దివ్యలోకములు ప్రాప్తించుకోగలరు. దివ్యపురుషులగు దేవతలచే (హిరణ్యగర్భునిచే) దేవతా లోక భోగములు ప్రసాదించ బడుచున్నారు. |
| **8.** | **అథ అనేన ఏవ యే చ ఏతస్మాత్<br>అర్వాంచో లోకాః తాగ్ంశ్చ<br>ఆప్నోతి మనుష్య కామాగ్ంశ్చ।<br>తస్మాత్ ఉ హ ఏవం విత్<br>ఉద్గాతా బ్రూయాత్।** | యజ్ఞవిధులందు యజ్ఞకర్తను, తదితరులను ఉద్దేశించి ఉద్గాత (సామగానము చేయు యజ్ఞవిధిలోని నిర్వాహకుడు) ఏ ఏ ఉత్తమ ఆశీర్వాదములు పలుకుచున్నాడో - అట్టి తాము కోరుకొన్న ఉత్తమ లోకములను - ఆ పరమపురుషుని ఉపాసించు మానవులు, సర్వత్ర పరమాత్మ సంకల్పములను దర్శించువారు పొందగలరు.<br>(వాసనాత్ వాసుదేవస్య వాసితం తే జగత్త్రయమ్। సర్వభూత నివాసోఽసి, శ్రీ వాసుదేవ నమోస్తుతే) |
| **9.** | **కం తే కామం ఆగాయనీతి ఏష హి ఏవ<br>కామాగానస్య ఈష్టే య ఏవం విద్వాన్<br>సామ గాయతి। సామ గాయతి॥** | ఉద్గాత సామగానము చేస్తూ యజ్ఞకర్తకు, శ్రోతలకు, సభికులకు ఏఏ 'భవతు' అని గానం చేస్తున్నారో, అట్టి సామగాన ప్రయోజనములు - 'పరమపురుషోపాసన' చేయుచున్నవారికి స్వాభావికంగానే సిద్ధించగలవు. |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ప్రథమాధ్యాయే సప్తమః ఖండః**

## 1-8. ప్రథమ ప్రపాఠకః - అష్టమః ఖండః - సామ యొక్క గతి ఏది?

| | | |
|---|---|---|
| 1. | త్రయో హ ఉద్గీథే<br>కుశలా బభూవుః।<br>శిలకః శాలావత్యః<br>చైకితాయనో దాల్భ్యః<br>ప్రవాహణో జైవలిః - ఇతి॥ | అట్టి ఉద్గీథము (సామ) గానము చేయగల నిష్ణాతులైనవారు (కుశలురు) ముగ్గురు ముఖ్యమైనవారిని తలచుకొని నమస్కరిస్తున్నాము.<br>(1) శాలవత్యుని కుమారుడు - శిలక ముని<br>(2) దాల్భ్య వంశీయుడు - చైకితాయన ముని<br>(3) జీవలుని కుమారుడు - ప్రవాహణముని, జైవలి. |
| | తే హ ఊచుః<br>ఉద్గీథే వై కుశలాః<br>స్మః హంత ఉద్గీథే<br>కథాం వదామ ఇతి॥ | మహనీయులగు అట్టి ముగ్గురు మునీశ్వరులు - ఒక సందర్భంలో కలుసుకొని ఈ విధంగా సంభాషించసాగారు.<br>ముగ్గురు మునీశ్వరులు : ఓ మునివర్యులారా! ఉద్గీథగానము (తత్త్వవర్ణన, తత్త్వ ప్రశంస) యందు కుశలురమైనాము కనుక, మీరు ఇష్టపడితే మనము ఉద్గీథ గానము గురించి సంభాషించుకుందాము. |
| 2. | తథా ఇతి హ సముపవివిశుస్స హ<br>ప్రవాహణో జైవలిః ఉవాచ<br>భగవంతౌ అగ్రే వదతాం బ్రాహ్మణ<br>యోః వదతోః వాచగ్ం శ్రోష్యామి ఇతి। | మునుల సభ ప్రారంభమైనది.<br>**ప్రవాహణో జైవలి మునీంద్రుడు :** (లేచి నిలుచుని) ఓ శాలవత్య కుమారులగు శిలకమునీంద్రా! దాల్భ్య వంశీయులగు చైకితాయన ముని సత్తమా! మీరిద్దరు అగ్రతాంబూలార్హులు. నాచే నమస్కారార్హులు. మీరు ముందుగా బ్రాహ్మణములను గానం చేయండి. మేమంతా శ్రవణము చేస్తాము. |
| 3. | స హ శిలకశ్శాలావత్యః<br>చైకితాయనం దాల్భ్యం ఉవాచ<br>హంత త్వా పృచ్ఛానీతి పుచ్ఛేతి హ ఉవాచ॥ | **శిలక శాలావత్యుడు :** (చైకితాన దాల్భ్యునితో) అయ్యా! చైకితాన దాల్భ్య మహాశయా! నాదొక చిన్న ప్రశ్న! అనుజ్ఞ అయితే అడుగుతాను. ఈ రీతిగా ఈ సత్సంగ సందర్భమును మనిద్దరము ప్రారంభిద్దాము.<br>చైకితాన దాల్భ్యుడు : శిలక శాలవత్య మునీంద్రా! అట్లాగే అడగండి. నాకు తెలియవచ్చినంతవరకు మీ ప్రశ్నలకు సమాధానము మనవి చేస్తాను. |
| 4. | కా సామ్నో గతిః ఇతి?<br>"స్వర" ఇతి హ ఉవాచ।<br>స్వరస్య కా గతిః? ఇతి ।<br>"ప్రాణ" ఇతి హ ఉవాచ ।<br>ప్రాణస్య కా గతిః? ఇతి<br>"అన్నమ్" ఇతి హ ఉవాచ।<br>అన్నస్య కా గతిః? ఇతి।<br>"ఆప ఇతి" హ ఉవాచ। | (గతి = పోక; త్రోవ; ఉపాయము; శరణము; విధము; దశ; ఆధారము; చలనము; నడక; ప్రవేశము; ప్రాప్తి; దిక్కు; ఫలితము)<br>శిలక శాలవత్యుడు : 'సామ' యొక్క గతి (ఆశ్రయము) ఏమైయున్నది?<br>చైకితాన దాల్భ్యుడు : 'స్వరము'.<br>శిలక శాలవత్యుడు : స్వరముయొక్క గతి ఏది?<br>చైకితాన దాల్భ్యుడు : "ప్రాణము"<br>శిలక శాలవత్యుడు : ప్రాణముయొక్క 'గతి' ఏది?<br>చైకితాన దాల్భ్యుడు : "అన్నమ్" (ఇంద్రియములకు ఆహారమగుచున్న శబ్ద స్పర్శ రూప రస గంధ విషయములు)<br>శిలక శాలవత్యుడు : 'అన్నము' యొక్క గతి ఏది?<br>చైకితాన దాల్భ్యుడు : ఆపః (జలము) |
| 5. | అపాం కా గతిః? ఇతి<br>"అసౌ లోక" - ఇతి హ ఉవాచ।<br>అముష్య లోకస్య కా గతిః? ఇతి। | శిలక శలావత్య ముని : అపాం (జలము)నకు గతి ఏది?<br>చైకితాయన దాల్భ్య ముని: ఆ లోకము (స్వర్గలోకము; అముష్యలోకము)<br>శిలక శలావత్య ముని : అముష్యలోకము ఎటు గతిస్తోంది? |

| | | |
|---|---|---|
| | న స్వర్గం లోకం అతినయేత్ – ఇతి॥ హ ఉవాచ।<br>స్వర్గం వయం<br>లోకగ్ం సామ అభిసగ్ంస్థాపయామః<br>స్వర్గసగ్ంస్తావగ్ం హి సామ ఇతి॥ | చైకితాయన దాల్భ్య ముని : స్వర్గమునకు ఆవల ఇంకేమీ లేదు. అందుచేత స్వర్గలోకమునకు ఆవల స్తుతించవలసిన మరొక 'గతి' లేదు. 'సామము'నే స్వర్గముగా వర్ణించుచున్నారు కదా!<br>స్వర్గములోనే సామము సంస్థితము. అందుచేత స్వర్గమునందే 'సామము' కొరకై వెతకి పట్టుకోవాలి. సామము స్వర్గలోకము దాటి వెళ్లవలసినది ఏదీ లేదు. |
| **6.** | తగ్ం హ శిలకః శాలవత్యః<br>చైకితాయనం దాల్భ్యం ఉవాచ –<br>అప్రతిష్ఠితం వై కిల తే దాల్భ్య<br>సామ యస్తు ఏతర్హి బ్రూయాన్<br>మూర్ధా తే విపతిష్యతి – ఇతి।<br>మూర్ధా తే విపతేత్ – ఇతి॥ | శిలక శాలవత్య ముని : ఓ చైకితాయన దాల్భ్యమునివర్యా! మీరు వర్ణించిన సామగానము గురించిన ముగింపులో ఒక అప్రతిష్ఠము (లేక) దోషము ఉన్నదని నా మనవి.<br>మీరు చేసిన సామగానము గురించిన ముగింపు - మీ శిరస్సు నేలకూలదని చెప్పగలరా?<br>- ఓ దాల్భ్యా! మీ బుఱ్ఱ (తల) క్రింద పడగలదు సుమా! (అనగా విజ్ఞుల సభలో మీరు తల వంచవలసి వస్తుంది - అని భావన) |
| **7.** | హంతా। అహం ఏతత్<br>భగవతో వేదాని ఇతి<br>విద్ధీతి, హ ఉవాచ।<br>అముష్య లోకస్య కా గతిః? ఇతి।<br>'అయం లోక' – ఇతి। హ ఉవాచ।<br>అస్య లోకస్య కా గతిః? ఇతి।<br>న ప్రతిష్ఠాం లోకమ్<br>అతినయేత్ ఇతి। హ ఉవాచ<br>ప్రతిష్ఠాం వయం లోకగ్ం<br>సామ అభిసగ్ంస్థాపయామః<br>ప్రతిష్ఠా సగ్ంస్తావగ్ం హి సామ – ఇతి॥ | చైకితాయన దాల్భ్య ముని : హే భగవాన్! శిలకమునీశ్వరా! నాకు ఇంతకు మించి తెలియదు. అందుచేత మీరు 'సామగానము' గురించి నేను చెప్పిన 'స్వర్గలోకము'నకు మించి ఉత్తరోత్తర సత్యము ఏదైనా ఉంటే నాకు బోధించండి. నేను వింటాను.<br>శిలక శాలావత్య ముని : ఓ! తప్పకుండా! అడగండి. చెపుతాను.<br>చైకితాయాన దాల్భ్యముని : అముష్య (స్వర్గ) లోకమునుండి ఆపై గతి ఏది?<br>శిలక శాలావత్యముని : ఈ భూలోకమే।<br>చైకితాయాన దాల్భ్యముని : ఈ (భూ)లోకమునకు తరువాత గతి ఏది? సారాంశము ఏది?<br>శిలక శాలవత్యముని : సారాంశము సామగానమే. అట్టి సామగానమును ఎవ్వరు లోకమునుండి మరొకచోటికి తీసుకుపోలేరు.<br>సామగానమును ఈ లోకముననే సిద్ధించుకోవాలి.<br>సామగాన సారాంశమే 'పృథివి'. |
| **8.** | తగ్ం హ ప్రవాహణో జైవలిః ఉవాచ<br>అంతవత్ వై కిల తే శాలావత్య సామ<br>యస్తు ఏతర్హి బ్రూయాన్ మూర్ధా తే<br>విపతిష్యతి ఇతి। మూర్ధా తే విపతేత్ ఇతి॥ | ప్రవాహణ జైవలి : ఓ శిలక శాలపత్యమునీ! 'సామగానము' మరొక రీతిగా విశదీకరించబడుతోంది. ఆ మీరు చెప్పినదానికి మరొక వేరైన వివరణను విన్నవారు "మీ శిరస్సు నేలవాలుతుంది" - అని చెప్పగలరు.<br>మీ శిరస్సు నేల కూలగలదు. (నీవు వారి అభిప్రాయము ముందు తలవంచవలసి వస్తుంది?) |
| | హంత అహం ఏతత్<br>భగవతో వేదాని ఇతి<br>విద్ధి ఇతి హ ఉవాచ॥ | శిలక శాలవత్యముని : మహనీయా! ప్రవాహణ జైవలి మునీంద్రా। భగవాన్। మీ దృష్టిలో ఉన్న అట్టి - ఆ పై విద్యాక్రమము ఏమిటో మీరే దయచేసి వివరించండి. నేను శ్రవణము చేసి నేర్చుకోవటానికి సంసిద్ధుడనై ఉన్నాను.<br>ప్రవాహణ జైవలి : అట్లే చెప్పుతాను. వినండి. |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ప్రథమాధ్యాయే అష్టమః ఖండః**

## 1-9. ప్రథమ ప్రపాఠకః - నవమః ఖండః - సామ యొక్క గతి ఆత్మయే!

| | | |
|---|---|---|
| **1.** | **అస్య లోకస్య కా గతిః ఇతి?**<br>**ఆకాశ ఇతి హ ఉవాచ**<br>**సర్వాణి హ వా ఇమాని భూతాని**<br>**ఆకాశాత్ ఏవ సముత్పద్యంత।**<br>**ఆకాశం ప్రత్యస్తం యన్తి**<br>**ఆకాశో హి ఏవ ఏభ్యో జ్యాయాన్**<br>**ఆకాశః పరాయణమ్॥** | **శిలక శాలావత్యముని :** ఈ లోకముయొక్క లోకానంతరపు గతి ఏది?<br>**ప్రవాహణ జైవలి :** లోకము యొక్క గతి "ఆకాశము". ఎందుకంటే, ఈ జీవులంతా ఆకాశమునుండే పుట్టుచున్నారు. తిరిగి ఆకాశమునందే లీనము అగుచున్నారు.<br>సమస్తము ఆకాశమునుండే బయల్వెడలుతోంది. కనుక పంచభూతములలో ఆకాశమే తదితర భూ-జల-అగ్ని-వాయువుల కంటే గొప్పది. పెద్దది. శ్రేష్ఠము. ఆకాశమే ఆధారము. అందుచేత ఆకాశతత్త్వమే పరాయణము (శ్రేష్ఠాతిశ్రేష్ఠము). |
| **2.** | **స ఏష పరోవరీయాన్ ఉద్గీథః।**<br>**స ఏషో అనంతః పరోవరీయో**<br>**హ అస్య భవతి।**<br>**పరోవరీయ, సో హ లోకాన్**<br>**జయతి య ఏతత్ ఏవం విద్వాన్**<br>**పరోవరీయాగ్ం సముద్గీథమ్ ఉపాస్తే।** | అట్టి అత్యంత సూక్ష్మము, శ్రేష్ఠము అగు ఆకాశముకంటే కూడా ఆత్మతత్త్వగాన రూపమగు 'ఉద్గీథము' ఎంతో సూక్ష్మము, శ్రేష్ఠము కూడా. అట్టి ఆత్మ గురించిన ఉద్గీథా వాక్యంగా - ఆత్మ అనంతము! "అట్టి పరోవరీయమే (పరమాత్మ స్వరూపమే) ఈ సమస్తము అయి ఉన్నది" - అని ఎరిగినవాడు దివ్య - (స్వర్గ) లోకముతో సహా సమస్త లోకములను జయించి వేయగలడు.<br>అట్టి పరోవరీయమ్ (పరమాత్మయే) విద్వాంసులు సముద్గీథము (గానము) చేస్తూ ఉపాసించవలసిన పరాకాష్ఠగా భావిస్తున్నారు. |
| **3.** | **తగ్ం హ ఏతం అతిధన్వా శౌనక ఉదర**<br>**శాండిల్యాయ ఉక్త్వా ఉవాచ**<br>**యావత్ త ఏనం ప్రజాయాం**<br>**ఉద్గీథం వేదిష్యన్తే పరోవరీయో హి ఏభ్యః,**<br>**తావత్ అస్మిన్ లోకే జీవనం భవిష్యతి॥** | శునక మహాముని కుమారుడు శౌనకుడు - అతిధన్వా నామధేయుడు, ఉదర శాండిల్యునికి ఈ విధంగా బోధిస్తూ - ఇంకా ఇట్లు చెప్పసాగారు.<br>అట్టి పరోవరీయము ఉద్గీథా గానముగా ఉపాసించుచుండగా వారు పరంపరగా ఉత్తమ జీవనము పొందగలరు. ఈ లోకములో జీవితము యొక్క సార్థకత సిద్ధించుకోగలరు. |
| **4.** | **తథా అముష్మిన్ లోకే లోక ఇతి।**<br>**స య ఏతత్ ఏవం**<br>**విద్వాన్ ఉపాస్తే పరోవరీయ ఏవ హ**<br>**అస్య అస్మిన్ లోకే జీవనం భవతి,**<br>**తథా అముష్మిన్ లోకే లోక ఇతి,**<br>**లోకే లోక ఇతి॥** | అంతేకాదు. అట్టి పరోవరీయోపాసనచే ఆముష్మిక (ఉత్తరోత్తర - స్వర్గ - దివ్య) లోకములలో కూడా కీర్తిమంతులు కాగలరు.<br>పరోవరీయ ఉద్గీథము (ఆత్మోపాసన) ఎరిగినవారు ఐహిక-ఆముష్మిక లోకములలో విజయము పొంది, లోక-లోకములలో ప్రకాశవంతులై, లోకాతీత స్థానము సిద్ధించుకోగలరు. |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ప్రథమాధ్యాయే నవమః ఖండః**

## 1-10. ప్రథమ ప్రపాఠకః - దశమః ఖండః - యజ్ఞములకు ప్రస్తావ - ప్రతిహర్త దేవతలు ఎవరు?

| | | |
|---|---|---|
| **1.** | **మటచీ హతేషు కురుషు ఆటిక్యా**<br>**సహ జాయయా ఉషస్తిః హ**<br>**చాక్రాయణ ఇభ్యగ్రామే**<br>**ప్రద్రాణక ఉవాస॥** | 'కురు' అనే దేశంలో ఒకానొక సమయంలో తుఫాను - వడగళ్ళ వానల కారణంగా పంటలన్నీ పాడైపోయినాయి. ఆ దేశంలోగల 'ఇభ్య' అనే మావటివారి నివాస గ్రామంలో చక్రాయణుడు అను మరొక పేరుగల ఉషస్తిముని, ఇంకా యవ్వనము కూడా రాని వారి ధర్మపత్నితో నివసిస్తూ ఉండేవారు.<br>అది పేదలు నివసిస్తున్న ఒక మారుమూల గల పల్లెటూరు. |
| **2.** | **స హ ఏభ్యం కుల్మాషాన్ ఖాదన్తం బిభిక్షే!**<br>**తగ్ం హ ఉవాచ ।**<br>**న ఏతో అన్యే విద్యన్తే యత్ చ,**<br>**యే మ ఇమ ఉపనిహితా ఇతి॥** | ఆ ఉషస్తి ముని ఒకరోజు ఒక మావటివాని ఇంటి దగ్గర నిలబడి భిక్షాం దేహి అని భిక్షము అడిగారు.<br>**మావటివాడు** : ఓ ఉషస్తి మునీశ్వరా! మీకు తెలుసు కదా, ఇవి కరువుకాటకపు రోజులని! ఇంట్లో ఉలవ గుగ్గిళ్ళు (గుర్రాలకు ఆహారము) (లేక పుచ్చిన మినుగులు) మాత్రమే ఉన్నాయి. మరింకేమీ లేవు. ఈ గుగ్గిళ్ళు మాత్రం ఉడకపెట్టి మీకు ఇవ్వగలను. తీసుకొంటారుగా మరి? (కుల్మాషము = గుగ్గిళ్ళు, కుడితినీరు)<br>(మినుగులు - అని కూడా అర్థం చెప్పబడింది) |
| **3.** | **ఏతేషాం మే దేహి ఇతి। హ ఉవాచ**<br>**తాన్ అస్మై ప్రదదౌ హంత**<br>**అనుపానమ్ ఇతి ఉచ్ఛిష్టం వై।**<br>**"మే పీతగ్ం స్యాత్ ఇతి" హ ఉవాచ॥** | **ఉషస్తి ముని (చక్రాయణుడు)** : నాయనా! మీరు కలిగియున్నవే తినటానికి నాకు ఇవ్వండి. నాకు చాలా ఆకలి వేస్తోంది. మీ దగ్గర లేనివాటి గురించి మీరు మాత్రం ఏమిచేస్తారు?<br>**మావటివాడు** : అయ్యా! ఇదిగో పుచ్చి ఉన్న ఈ గుగ్గిళ్ళు మీకు సంతోషంగా ఇస్తున్నాను. అయితే త్రాగటానికి మంచినీరు లేదు. మురికి నీరు మాత్రమే ఉన్నది. అవి ఎంగిలివి కూడా! (జంతువులు ఎంగిలి చేసాయి).<br>**ఉషస్తి ముని** : బిడ్డా! అట్లాగే! మీరు ఇంట్లో ఏ నీరు త్రాగుచున్నారో, ఆ నీరే ఇవ్వండి. నేను సంతోషంగా త్రాగుతాను. ఎంగిలి నీరైనా కూడా - దాహం తీరుస్తాయా? లేదా? అనేది ముఖ్యం. జగత్తులో ఎంగిలి కానిదేముంటుంది? |
| **4.** | **న స్విత్ ఏతే అపి ఉచ్ఛిష్టా ఇతి న వా?**<br>**ఆజీవిష్యం ఇమాన్ అఖాదన్ ఇతి**<br>**హ ఉవాచ।**<br>**కామో మ ఉదకపానం ఇతి।** | (గుగ్గిళ్ళు తిన్న తరువాత)<br>"నాయనా! ఆకలి తీర్చటానికి ఉపయోగపడుచూ ఉన్నప్పుడు - ఏ పదార్థమైనా నీచము' అని, మరొకదానిని ఉచ్చము అని ఎట్లా అంటాము? అందుచేత చక్కగా తిన్నాను. నీవు ఇచ్చిన నీళ్లు కూడా నా దాహం తీర్చింది. నాకు సంతోషము" - అని ఆ మావటివానిని ఉషస్తముని ఆశీర్వదించారు. |
| **5.** | **స హ ఖాదిత్వా అతిశేషాన్ జాయాయా ఆజహార।**<br>**సా అగ్ర ఏవ సుభిక్షా బభూవ తాన్ ప్రతిగృహ్య నిదధౌ।** | తాను తిన్న తరువాత మిగిలిన కొంచము గుగ్గిళ్ళను భార్య యొక్క ఆహారము కొరకై ఇంటికి తీసుకొనిపోయారు. ఆమె భిక్షము ఎత్తుకొని వచ్చి అప్పటికే ఆహారము భుజించియున్నందువల్ల భర్త తెచ్చిన గుగ్గిళ్ళను ఇంటిలో దాచిపెట్టింది. |
| **6.** | **స హ ప్రాతః సంజిహాన ఉవాచ**<br>**యత్ బత అన్నస్య లభేమహి లభేమహి ధనమాత్రామ్**<br>**రాజా అసౌ యక్ష్యతే స మా సర్వైః**<br>**ఋత్విజైః వృణీత ఇతి॥** | ఆ మరునాడు నిదురలేచిన తరువాత ఆ చాక్రాయణ ఉషస్తిముని ఇట్లా పలికారు. "ఓ భార్యామణీ! ఆహా! మరికొన్ని గుగ్గిళ్ళు ఉంటే బాగుండేది. హాయిగా తినే వాళ్ళం. ఇదంతా ధనం లేక పోవటంవలనే కదా! ధనం సంపాదించదలిచాను. ఈ సమీపంలోగల ఒక ప్రదేశంలో రాజుగారు ఒక యజ్ఞం చేస్తున్నారని విన్నాను. వెళ్లి వారి యజ్ఞ కార్యక్రమములోని ఋత్విజులలో ఒకడినై యజ్ఞ కార్యక్రమమును సేవిస్తాను. వారు నన్ను స్వీకరించవచ్చు కదా! అప్పుడు ఋత్విజ సంభావన రాజుగారు ఇవ్వవచ్చు కదా! |

| | | |
|---|---|---|
| **7.** | **తం జాయా ఉవాచ**<br>**హంత। పత ఇమ ఏవ**<br>**కుల్మాషా ఇతి తాన్**<br>**ఖాదిత్వా అముం యజ్ఞం వితతం ఏయాయ॥** | చక్రాయణ నామధేయ ఉషస్తిముని మాటలకు ఆయన భార్య సంతోషించారు. రాత్రి తాను దాచిపెట్టిన ఉలవచిక్కుళ్ళ గుగ్గిళ్ళు (కుల్మాషములు) తెచ్చి ఇచ్చి, యాగము జరిగేచోటికి వెళ్లి ఋత్విక్కుగా పాల్గొనమని ప్రోత్సాహం చేసారు.<br>ఆ కుల్మాషములు తిని ఆ ఉషస్తి ముని యజ్ఞము చేయుచున్న చోటికి వెళ్లారు. యజ్ఞకర్తయగు రాజును దర్శించారు. |
| **8.** | **తత్ర ఉద్గాతౄన్**<br>**ఆస్తావే స్తోష్యమాణ**<br>**అనుపోపవివేశ,**<br>**స హ ప్రస్తోతారం ఉవాచ।** | **యజ్ఞ వేదిక వద్ద:-**<br>ఆ తరువాత స్తోత్రములు చేయుచున్న ఉద్గాతలు (ఋత్విక్కుల) మధ్యగా వెళ్లి కూర్చున్నారు.<br>ఇక యజ్ఞం ఆరంభం కాబోతోంది.<br>ఉషస్తిముని అక్కడ యజ్ఞ ప్రదేశములో గల 'ప్రస్తోత'తో ఇట్లు పలికారు. |
| **9.** | **ప్రస్తోతః యా దేవతా**<br>**ప్రస్తావం అన్వాయత్తా**<br>**తాం చేత్ అవిద్వాన్ ప్రస్తోష్యసి**<br>**మూర్ధా తే విపతిష్యతి ఇతి॥** | ఉషస్తిముని : అయ్యా ప్రస్తోతగారూ! మీరు ప్రస్తావం (Introduction) చేస్తూ ఏ దేవతను ప్రస్తుతిస్తున్నారో, తెలుసు కదా? అట్టి ప్రస్తావ దేవతయొక్క తాత్త్విక ప్రయోజనమైన పరమార్థమును తెలుసుకొనియే చేస్తున్నారు కదా? ఒకవేళ 'ప్రస్తావ దేవత' పరమార్థమును తెలియకుండానే చేస్తున్నారా ఏమి?<br>తెలియకుండా, దేవతా స్తుతులు మాత్రం గానం చేస్తూ ఉంటే - మీరు ఎప్పుడో మీ తల దించుకోక తప్పదు.<br>ప్రస్తావ దేవత తెలియకుండా ఉన్నవారైతే మీ తల ఆ విధంగా తెగి నేలకూలుతుంది. |
| **10.** | **ఏవం ఏవ ఉద్గాతారం ఉవాచ**<br>**ఉద్గాతః యా దేవత ఉద్గీథం అన్వాయత్తా**<br>**తాం చేత్ అవిద్వాన్ ఉద్గాస్యసి,**<br>**మూర్ధా తే విపతిష్యతి ఇతి॥** | ఆ తరువాత ఉగ్దాతారునివైపు చూచి, ఆ ఉద్గాతారునితో ఇట్లా అన్నారు.<br>ఓ ఉద్గాతారా! ఏ దేవత గురించి మీరు"ఉద్గీథ గానము" చేస్తూ ఉన్నారో, అట్టి దేవత ఎవరో తెలియకుండా (అవిద్వాన్) - గానము మాత్రము చేస్తూ ఉంటే (ఉద్గాస్యసి-కిం) - అప్పుడు మీరు శిరస్సు వంచుకోవలసి వస్తుంది. విదిత వేద్యుల సభలో మీ శిరస్సు తెగి క్రింద పడగలదు. |
| **11.** | **ఏవం ఏవ ప్రతిహర్తారమ్ ఉవాచ**<br>**ప్రతిహర్తః యా దేవతా ప్రతిహారమ్**<br>**అన్వాయత్తా, తాం చేత్**<br>**అవిద్వాన్ ప్రతిహరిష్యసి।**<br>**మూర్ధా తే విపతిష్యతి ఇతి॥** | అటు తరువాత ఉషస్తిముని అక్కడి ప్రతిహర్తారుని స్థానంలో ఆసీనులైన ప్రతివర్తారుని చూచి ఇట్లా పలికారు.<br>ఓ ప్రతిహర్తార ఋత్విక్కు మహాశయా! మీరు కనుక ప్రతిహర్తార దేవత ఎవరో, పరమార్థమును తెలియకుండా ప్రతిహార (ద్వారపాలక) గానము చేస్తూ ఉంటే (స్వాగత ప్రవచనాలు పలుకుతూ ఉంటే)<br>- మీరు అవిద్వాంసులై ప్రతీహారము (Punishment) పొందగలరు సుమా! మీరు శిరస్సు దించుకోవలసిన సమయం వస్తుంది, అనగా మీ పాండిత్యపు శిరస్సు తెగిపోగలదు. అందుచేత ప్రతిహర్తార్య దేవతను తెలుసుకొని ఉన్నారని అనుకుంటున్నాను. |
| | **తే హ సమారతాః తూష్ణీం**<br>**ఆసాంచక్రిరే॥** | అట్టి ఉషస్తిముని వాక్యములు విని యజ్ఞకర్త అక్కడ యజ్ఞము నిర్వర్తిస్తున్న వారు, పర్యవేక్షిస్తున్నవారు, ఆ కార్యక్రమంలో ఉపాసకులై పాల్గొనుచున్న వారు - వారంతా కూడా, వారివారి పనులను ఆపి - ఉషస్తిముని ఆసీనులై ఉన్నచోట దృష్టి సారించసాగారు. |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ప్రథమాధ్యాయే దశమః ఖండః**

## 1-11. ప్రథమ ప్రపాఠకః - ఏకాదశః ఖండః - ఆదిత్యుడు ప్రస్తావ దేవత, అన్నమే ప్రతిహర్త

| | | |
|---|---|---|
| **1.** | **అథ హ ఏనం యజమాన ఉవాచ-**<br>**భగవన్ తం వా అహం వివిదిషాణీ ఇతి।**<br>**ఉషస్తిః అస్మి చాక్రాయణ**<br>**ఇతి హ ఉవాచ॥** | **యజ్ఞముయొక్క యజమాని (యజ్ఞకర్త అయిన రాజుగారు):**<br>అయ్యా! భగవాన్! మీరెవ్వరో, ఎందుకు వచ్చారో, ఏమి ఉద్దేశ్యమో ఈ యజ్ఞప్రాంగణ సభకు ముందుగా వివరిస్తూ తెలియజేయమని నా ప్రార్థన.<br>**ఉషస్తిముని :** అయ్యా, నేను చక్రాయణ మహర్షి కుమారుడను. చాక్రాయణుడను. ఉషస్తి మునిగా మునుల లోకంలో పిలువబడువాడను. |
| **2.** | **స హ ఉవాచ -**<br>**భగవన్తం వా అహం ఏభిః సర్వైః ఆర్త్విజ్యైః**<br>**పర్య ఏషిషం భగవతో వా**<br>**అహం అవిత్త్యా అన్యాన్ అవృషి।**<br>**భగవాగ్ంస్త్వ (త్వ) ఏవ మే సర్వైః**<br>**ఋత్విజైః ఇతి ।** | **ఋత్విక్కు (మరియు) యజమాని :** హే భగవాన్! నమో నమః! మీరు ఉద్గీథ గాన దేవత యొక్క తాత్త్వికార్థము ఎరిగి ఉండుటము గురించి ప్రశ్నిస్తున్నారు కదా. సంతోషము. మిమ్ములను ఋత్విజునిగా ఈ యజ్ఞమునకు ఆహ్వానించాలని మేము అనుకొన్నాము. మీ గురించి అన్వేషించి ప్రయత్నించాము కూడా. మీరు మా వార్తాహరులకు దొరకలేదు. అందుచేత వేరే ఋత్విజులను నియమించాము. సరే! ఇప్పుడు ఈ యజ్ఞమును ఋత్విజులై పర్యవేక్షించవలసినదిగా మా విన్నపము. |
| **3.** | **తథా ఇతి।**<br><br>**అథ తర్హి ఏత ఏవ సమతిసృష్టాః**<br>**స్తువతాం యావత్ తేభ్యో ధనం**<br>**దద్యాః తావన్ మమ దద్యా ఇతి**<br>**తథా ఇతి హ యజమాన ఉవాచ।** | **ఉషస్తిముని :** భగవాన్! యజమానీ! ఈ యజ్ఞమును నిర్వహించటానికి నేను సిద్ధమే. అందుకు రెండు నియమములు మీరు అంగీకరించెదరు గాక!<br>(1) నేను ఋత్విజునిగా యజ్ఞము నిర్వహిస్తుండగా ఋత్విజులంతా నేను చెప్పిన రీతిగా, నా ఆధ్వర్యంలో స్తుతిగానములు అర్థము తెలుసుకొంటూ చేయుచుండెదరు గాక!<br>(2) ఈ ఋత్విజులందరికీ ఎంత ధనము ఇస్తున్నారో, అంతమాత్రమే ధనమును నాకు కూడా ఋత్విజ తాంబూలముగా ఇప్పించండి, అంతకుమించి వద్దు.<br>**యజమాని :** మీ రెండు నియమములు నాకు అంగీకారమే. |
| **4.** | **అథ హ ఏనం ప్రస్తోత ఉపససాద।**<br>**ప్రస్తోతః యా దేవతా ప్రస్తావం**<br>**అన్వాయత్తా తాం చేత్ అవిద్వాన్**<br>**ప్రస్తోష్యసి, - మూర్ధా తే విపతిష్యతి ఇతి।**<br>**మా భగవాన్ అవోచత్**<br>**కతమా సా దేవతా? ఇతి॥** | **ప్రస్తోత (దేవతాహ్వానములను, తదితర మంత్రములను ప్రస్తావన చేస్తూ విస్తరించి సవివరించు ఋత్విక్కు ):-**<br>హే ఉషస్తి భగవాన్! ప్రస్తుతించబడుచున్న దేవత ఎవరో తెలుసుకోకుండా, అవిద్వాంసుడై - ప్రస్తావన (Introductory) గానము చేస్తూ ఉంటే శిరస్సు దించవలసిన సందర్భం వస్తుందని (శిరస్సు ఖండింపబడగలదని) మీరు ఇప్పుడు అని ఉన్నారు కదా! హే భగవాన్! ఈ యజ్ఞములో ఉద్గీథ గానము చేయబడు దేవత ఎవరు? మీకు తెలిసి ఉంటుంది. దయచేసి వివరించండి. |
| **5.** | **"ప్రాణ" ఇతి హ ఉవాచ।**<br>**సర్వాణి హ వా ఇమాని భూతాని**<br>**ప్రాణం ఏవ అభిసంవిశంతి। ప్రాణం అభి ఉజ్జిహతే।**<br>**స ఏషా దేవతా ప్రస్తావం అన్వాయత్తా।**<br>**తాం చేత్ అవిద్వాన్ ప్రాస్తోష్యో**<br>**మూర్ధా తే వ్యపతిష్యత్**<br>**తథా ఉక్తస్య మయా ఇతి॥** | ఉతస్తిముని : యజ్ఞమునకు ముఖ్యమైన, ముందుగా ప్రస్తావించవలసిన ప్రస్తోత దేవత - "ప్రాణదేవతయే"!<br>ఈ సృష్టిలో కనిపిస్తున్న చరాచరములన్నీ కూడా చివరికి "ప్రాణశక్తి" యందే లయమగుచున్నాయి.<br>ప్రాణమునందే సృష్టి సమయంలో తిరిగి ఉద్భవిస్తూ ఉన్నాయి.<br>అందుచేత ప్రస్తావ గానమునకు దేవత **"ప్రాణమే"।** - అని పూజ్యులగు వేదవిదుల నిర్ణయము.<br>అట్టి ప్రాణదేవత గురించి మీరు తెలుసుకోకుండా (లేదా - ఋత్విక్కుగా నేను సభకు తెలియజేయకుండా), కేవలము ఉద్గీథ గానము నోటితో మాత్రమే పలుకుతూ ఉంటే - అర్థం తెలియకుండా ప్రస్తావ గానమును చదువుతూ ఉంటే |

| | | |
|---|---|---|
| | | అట్టి ఋత్విజుడు ఎప్పటికైనా ఎక్కడో తలవంచుకొని సిగ్గుపడక తప్పదు. అందుచేత "శిరస్సు తెగిపోగలదు'' అని నాచే జాగ్రత్త చెప్పబడింది. |
| **6.** | **అథ హ ఏనం ఉద్గాత ఉపససాద ఉద్గాతః<br>యా దేవతా ఉద్గీథం అన్వాయత్తా।<br>తాం చేత్ అవిద్వాన్ ఉద్గాస్యసి<br>మూర్ధా తే విపతిష్యతి ఇతి మా భగవాన్<br>అవోచత్ కతమా సా దేవతా ఇతి।** | **ఉద్గాత ఋత్విక్కు :** హే చక్రాయణ ఉషస్తిమునివర్యా! ఉద్గానముతో మనము ప్రశంసిస్తున్న (లేక) స్తోత్రము చేయుచున్న (లేక) ప్రస్తావము చేయుచున్న దేవతయొక్క 'పరార్థము' (తాత్త్వికార్థము) తెలియకుండానే అవిద్వాంసుడై ఉద్గీథస్తుతి పలుకుతూ ఉంటే - అట్టి అవిద్వాంసుడగు ఉద్గాతగా నా శిరస్సు నేలకూలగలదని మీరు ఇందాక హెచ్చరించారు కదా!<br>ఇప్పుడు మిమ్ములను ఒక ప్రశ్న అడుగుచున్నాను.<br>యాగములలో ఉద్గీథగానము చేస్తున్నాము కదా! అట్టి గానము చేయబడుచున్న దేవత ఎవరు? దయచేసి చెప్పండి! నేను మీనుండి ఎరుగుటకు సంసిద్ధుడను. |
| **7.** | **"ఆదిత్య" ఇతి హ ఉవాచ<br>సర్వాణి హ వా ఇమాని భూతాని<br>ఆదిత్యమ్ ఉచ్చైః సన్తం గాయన్తి!<br>స ఏషా దేవతా ఉద్గీథం అన్వాయత్తా।<br>తాం చేత్ అవిద్వాన్ ఉదగాస్యో -<br>మూర్ధా తే వ్యపతిష్యత్<br>తథా ఉక్తస్య మయా ఇతి।** | **ఉషస్తిముని :** అట్టి ఉద్గీథము (లేక) ఉద్గీథ గానము ఉద్దేశ్యించు ప్రస్తావ దేవత "ఆదిత్యుడు (లేక) సూర్య భగవానుడే''।<br>ఆదిత్యుడు ఉదయించగానే ఈ చరాచర ప్రకృతి అంతా, ఈ భూతజాలమంతా కూడా ఉత్తేజితమై నిదుర లేస్తోంది. ఆ సూర్యభగవానుని ఉద్గీథ (మహాత్మ్య) గానము చేస్తూ 'జాగ్రత్'ను స్వీకరిస్తోంది.<br>ఈ విషయము ఎరిగి - వేదగానము చేస్తూ యజ్ఞ / యాగ విధానము ప్రారంభం చేయాలి. "ఈ సూర్యుడే పరమాత్మ'' అని ఎరుగకుండా, ప్రస్తావ దేవతగా భావించకుండా ప్రస్తావన స్తుతులు గానం చేస్తూ ఉంటే, అట్టివాడు తలవంచవలసి ఉంటుంది. (శిరస్సు తెగి నేలపై పడుతుంది) - అని గుర్తు చేయటానికే "ప్రస్తోత ప్రస్తావ దైవమును ఎరిగి ఉండాలి'' - అని నేను చెప్పాను. |
| **8.** | **అథ హ ఏనం ప్రతిహర్తా ఉపససాద ప్రతిహర్తః<br>యా దేవతా ప్రతిహారం అన్వాయత్తా,<br>తాం చేత్ అవిద్వాన్ ప్రతిహరిష్యసి,<br>మూర్ధా తే విపతిష్యతి ఇతి।<br>మా భగవాన్ అవోచత్<br>కతమా సా దేవతా ఇతి।** | ప్రతిహర్త (అడ్డగించు, విరుద్ధ, విరాస్త, తోసిపుచ్చు చమత్కారి) :<br>ఓ చక్రాయణ ఉషస్తి మునీశ్వరా! భగవాన్!<br>"ప్రతిహర్తగా దేవత ఎవరో, దివ్యతత్త్వము ఏమిటో - తెలుసుకోకుండా ప్రతిహర్తగా గానం చేస్తూ ఉంటే, తత్త్వార్థము పట్ల అవిద్వాంసుడై (పరమార్థము తెలియకయే) ప్రతిహారము నిర్వర్తిస్తూ ఉంటే - అప్పుడు తలదించవలసి ఉంటుంది (తల తెగిపడినట్లు అవుతుంది) - అని మీరు అభిప్రాయము చెప్పారు కదా!<br>అట్టి ప్రతిహర్త (ప్రతిహార) దేవత ఎవరై ఉన్నారో - దయతో వివరించండి. నేను మీ వద్ద ఈ విషయం అధ్యయనుడను అవుతాను. |
| **9.** | **"అన్నం" ఇతి హ ఉవాచ।<br>సర్వాణి హ వా ఇమాని భూతాని<br>అన్నం ఏవ ప్రతిహరమాణాని జీవన్తి।<br>స ఏషా దేవతా ప్రతిహారం అన్వాయత్తా<br>తాం చేత్ అవిద్వాన్ ప్రతిహరిష్యో,<br>మూర్ధా తే వ్యపతిష్యత్ తథా ఉక్తస్య మయా ఇతి।<br>తథా ఉక్తస్య మయా ఇతి।** | **ఉషస్తిముని :** అట్టి దేవత "అన్నము''. ఎందుకంటే, ఈ చరాచర జీవరాసులంతా అన్నముయొక్క ప్రతిక్రియచేతనే జీవిస్తూ ఉన్నారు కదా।<br>ప్రతిహార గాన యుక్తము "అన్నము'' అని తెలియక గానము చేస్తే, అర్థము తెలియకుండా గానము చేయటం చేత (అవిద్వాంసుడు అవటంచేత) అట్టి ప్రతిహర్యము వలన ఎప్పుడో తలవంచవలసి వస్తుంది. అందుకే తల తెగగలదు, అని నాచేత చెప్పబడింది. |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ప్రథమాధ్యాయే ఏకాదశః ఖండః**

## 1-12. ప్రథమ ప్రపాఠకః - ద్వాదశః ఖండః - శ్వేత శునకములు సామ గానం చేయుట

| | | |
|---|---|---|
| 1. | అథ అతః శౌవ ఉద్గీథః। | (అర్థము / దేవతయొక్క తత్త్వార్థము తెలియకుండా ఉద్గీథ గానము చేయటం విషయంలో) - కుక్కలు కూడా ఉద్గీథ గానము చేయగలవు కూడా! |
| | తద్ధ బకో దాల్భ్యో గ్లావో వా మైత్రేయః స్వాధ్యాయం ఉద్వవ్రాజ॥ | ఒకప్పుడు దాల్భ్యబకముని మైత్రేయ గ్లావ ఋషి దగ్గిరకు వెళ్లి అక్కడ ఆశ్రమంలో స్వాధ్యాయము చేయనారంభించారు. అక్కడి గ్రామ సమీపంలోగల ఆశ్రమంలో వేదములు అభ్యసించసాగారు. |
| 2. | తస్మై శ్వా శ్వేతః ప్రాదుః బభూవ। | కుక్కల (శ్వా-శ్వేతః) రూపందాల్చి అక్కడికి తెల్లటి కుక్కల రూపంలో వేదగాన దేవతలు వచ్చారు. |
| | తం అన్యే శ్వాన ఉపసమ ఇతి ఊచుః | అక్కడ ఒక తెల్లటి కుక్క వేదాధ్యయనులను సమీపించి ఇట్లా పలకసాగింది. |
| | అన్నం నో భగవాన్। అగాయతి అశనాయామ వా ఇతి॥ | ఓ దివ్యవేదాధ్యయన దేవతలారా! మాకు ఆకలి వేస్తోంది. అన్నము ఇప్పించండి. మీకు వశముగా ఉండి మేము కూడా గానం చేస్తాము. |
| 3. | తాన్ హ ఉవాచ ఇహ ఏవ మా ప్రాతః ఉపసమీయాత -ఇతి। | ఉద్గీథ దేవతా శ్వేత శునకములు ఇట్లు చెప్పెను - "రేపు ఉదయం మా దగ్గరకు రండి". |
| | తత్ హ బకః దాల్భ్యో గ్లావో వా మైత్రేయః ప్రతిపాలయాంచకార। | బకముని (దాల్భ్య బకముని), మైత్రేయ గ్లావ ఋషి ఆ సమీపమున వేచి ఉండసాగారు (నిరీక్షించసాగారు). ఉద్గీథమును గానము చేస్తున్న శ్వేత శునకరూప గానదేవతలను గమనిస్తూ ఉండసాగారు. |
| 4. | తే హ యథ ఏవ ఇహ బహిః పవమానేన స్తోష్యమాణాః సగ్ంరబ్ధాః సర్పన్తి ఇతి ఏవం ఆససృపుః తే హ సముపవిశ్య హిం చక్రుః। | ఆ దేవతా శునకములు ఋత్విక్కులు గానం చేసే విధంగానే - అవయవములు త్రిప్పుతూ, మధురంగా ఉద్గీథగానము చేయసాగాయి. ఆ తరువాత ఆ శునకములు మంత్రములు చెప్పుచూ కూర్చుండిపోయాయి.<br>"ఓ యజ్ఞపురుషుడా! ఓ యాగకర్తా! నమస్కారము।<br>ఓం। మమ్ములను 'అన్నము' తిననీయండి.<br>'ఓం'। పానీయములు త్రాగనీయండి<br>అని సమీపమున కూర్చుని అర్థించసాగాయి. |
| 5. | ఓం ఆదామ ఓం పిబామ ఓం దేవో వరుణః, ప్రజాపతిః, సవితా, అన్నం ఇహ ఆహరత్ అన్నపతే! అన్నం ఇహ ఆహర ఆహర ఓం ఇతి। | ఓం। మమ్ములను ఆహారము తిననీయండి. త్రాగనీయండి. పాడనీయండి।<br>దేవదేవుడగు వరుణ భగవానుడు, ప్రజాపతి, సవిత్రు (సూర్య) దేవుడు మాకు అన్నమును ప్రసాదించెదరు గాక।<br>ఓ అన్నదేవతా! అన్నపూర్ణాదేవీ! మీరు మాకు అన్నము చేకూర్చండి. ఇక్కడ మేమున్నచోటనే ప్రసాదించండి. మాకు అన్నమును సమకూర్చమని అభ్యర్థన। ఇక్కడకు తెమ్ము! తెమ్ము! ఓం - ఇతి। |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ప్రథమాధ్యాయే ద్వాదశః ఖండః**

## 1-13. ప్రథమ ప్రపాఠకః - త్రయోదశః ఖండః - సామగాన స్వరములకు దేవతలు

| | | |
|---|---|---|
| **1.** | **అయం వావ లోకో 'హా' 'ఉ'కారః - వాయుః।**<br>**'హా' 'ఇ'కారః చన్ద్రమా అథకారః।**<br>**ఆత్మా "ఇహ"కారో।**<br>**అగ్నిః ఈకారః।** | ఈ లోకము 'హా' 'ఉ'కారము.<br>వాయువు 'హా' 'ఇ'కారము.<br>చంద్రుడు 'అథ' కారము<br>ఆత్మ (జీవాత్మ) (ఇహ) 'ఇ' కారము<br>అగ్ని 'ఈ' కారము. |
| **2.** | **ఆదిత్య 'ఊ' కారః।**<br>**నిహవ 'ఏ'కారః।**<br>**విశ్వేదేవా ఔహోయికారః।**<br>**ప్రజాపతిః 'హిం'కారః।**<br>**ప్రాణః స్వరో।**<br>**అన్నం యా।**<br>**వాక్ విరాట్।** | ఆదిత్యుడు - 'ఊ' కారము<br>నిహవము (ప్రార్థన) - 'ఏ' కారము<br>విశ్వేదేవతలు - 'ఔ' 'హో' 'ఇ'కారములు<br>ప్రజాపతి - 'హిం' కారము<br>ప్రాణము - స్వరము<br>అన్నము - 'యా' అనే స్తోభయందు భాసించవలెను (ప్రాణమును నిలుపునది)<br>విరాట్ - వాక్కు |
| **3.** | **అనిరుక్తః త్రయోదశః**<br>**స్తోభః సంచరో 'హుం'కారః।** | 'హుం'కారము అనిర్వాచ్యమగు (That which cannot be told by speaking) 13వ అక్షరము - స్తోభ.<br>స్తోభ = 'హుం' కార సంచారము, అనిర్వాచ్యము, వాక్కుకు అందనిది. |
| **4.** | **దుగ్ధే అస్మై 'వాక్' దోహం యో వాచో**<br>**దోహో అన్నవాన్, అన్నాదో భవతి**<br>**య ఏతాం ఏవగ్ం సామ్నాం ఉపనిషదం వేద।**<br>**ఉపనిషదం వేద।। ఇతి।।** | అట్టి సామగానము చేయువారు పాలవలె మధురము అగు అమృతరూపము సంతరించుకోగలరు.<br>అట్టి వారికి అన్నము అధికముగా లభించగలదు.<br>ఆతడు అన్నమును (ఇంద్రియములతో ఇంద్రియ విషయములను) తృప్తిగా భుజించగలడు.<br>పవిత్రమగు సామగానము చేయువారు పూతాత్ములు (నిర్మలాత్ములు).<br>ఈ ఉపనిషత్ ఎరిగినవారు ధన్యులు. |

**ఇతి ఛాందోగ్యోపనిషత్ ప్రథమోధ్యాయే త్రయోదశః ఖండః**

**ఇతి ప్రథమోఽధ్యాయః సమాప్తః**

# ద్వితీయ ప్రపాఠకః

## 2-1. ప్రథమః ఖండః - సమస్త సామోపాసన

| | | |
|---|---|---|
| **1.** | **ఓం। సమస్తస్య ఖలు సామ్న ఉపాసనగ్ం సాధు।** | సామ ఉపాసన గురించి ఎరిగియున్న సాధు పురుషులకు నమస్కారము. పరమాత్మతత్త్వము ఎరుగుచూ, స్తుతిస్తూ గానము చేయటమే "సామగానము". సమస్త ఉపాసనలలో "సామోపాసన" శుభప్రదము. |
| | **యత్ ఖలు సాధు తత్ సామ ఇతి ఆచక్షతే।**<br>**యత్ అసాధు తత్ అసామ ఇతి।** | ఏదైతే సాధువో (దైవీగుణములో, అమానిత్వాది జ్ఞాన లక్షణములు, అద్వేష్టాది భక్తినిర్వచములు) - అదంతా సామమే। మనము చేస్తున్న సామగానమే!<br>ఏది శాస్త్రముల చేత, అనుభవజ్ఞులగు పెద్దల చేత, సహజములగు సాత్త్విక జనుల చేత "అసాధు" (Not Appropriate) అనబడుచున్నదో అదంతా "అసామమే!" |
| **2.** | **తత్ ఉత అపి ఆహుః**<br>**సామ్న ఏనమ్ ఉపాగాత్ ఇతి।**<br>**'సాధున ఏనం ఉపాగాత్', ఇతి ఏవ।** | ఎవ్వరైనా, "సామగానముతో అభ్యర్థిస్తున్నారు. విన్నవిస్తున్నారు" - అని చెప్పితే అట్టివారు "సద్బుద్ధితోనే అది అడుగుచున్నారు" - అని గమనించాలి. గ్రహించాలి. వారు త్యాగబుద్ధితోనే అడుగుచున్నారని అనుకోబడుతోంది. |
| | **తత్ ఆహుః అసామ్న ఏనం ఉపాగాత్ ఇతి।**<br>**అసాధు న ఏనం ఉపాగాత్ ఇతి ఏవ - తత్ ఆహుః॥** | అట్లా కాకుండా, ఎవ్వరైనా "ఆయన అసామగానముతో అది అడుగుచున్నారు" - అని చెప్పితే, దాని అర్థం - "అట్టివారు సంకుచితమగు, స్వార్థపూరితమగు, కామపూరితమగు బుద్ధితో మాత్రమే అడుగుచున్నారు" - అని గ్రహించాలి. |
| **3.** | **అథ ఉత అపి ఆహుః**<br>**సామ నో బత ఇతి**<br>**యత్ - సాధు భవతి॥**<br>**సాధు బత ఇతి ఏవ తత్ ఆహుః**<br>**అసామ నో బత ఇతి**<br>**యత్ అసాధు భవతి,**<br>**అసాధు బత ఇతి ఏవ తత్ ఆహుః॥** | "ఇదిగో, ఇది సామగానము. ఇది సామనము (సకల జనుల శ్రేయస్సును తమ దృష్టిలో కలిగియున్న మనస్సు). ఈ గాన శ్రవణము (సంభాషణ, శ్రవణము), సద్బుద్ధితో గానము - శ్రవణము పుణ్యప్రదము. ఇది 'సాధు'.<br>సామ ఇంద్రియానము (లేక) లోకసంబంధమైన ఆనందము ఆశయముగా కలిగినది 'అసాధు' అగుచున్నది.<br>కామ్యబుద్ధితో, పాపము కలిగించునది అయి ఉన్నదంతా 'అసాధు' - 'అసామ'। ఏది 'సాధు'యో, ఏది 'అసాధు'యో గ్రహించి ఉండాలి. |
| **4.** | **స య ఏతత్ ఏవం**<br>**విద్వాన్ సాధు 'సామ'**<br>**ఇతి ఉపాస్తే, అభ్యాశో,**<br>**హ యత్ ఏనగ్ం సాధవో**<br>**ధర్మా ఆ చ గచ్ఛేయుః**<br>**ఉప చ నమేయుః॥** | ఎవరైతే 'సాధు', 'అసాధు' అగుచున్న గానములేవో గ్రహించి, వివేకి అయి, విద్వాంసుడై 'సామ'ను ఉపాసిస్తాడో, అభ్యాసం చేస్తాడో అట్టి సాధు - ధర్మ-ఆచరణను ఆశ్రయిస్తూ సర్వశుభములను, సంపదలను పొందుచున్నాడు. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ద్వితీయాధ్యాయే ప్రథమః ఖండః

## 2-2. ద్వితీయః ఖండః - పంచవిధ సామోపాసన

| | మూలం | వివరణ |
|---|---|---|
| **1.** | **లోకేషు పంచవిధగ్ం<br>సామా ఉపాసీత।<br>పృథివీ 'హిం'కారః।<br>అగ్నిః 'ప్రస్తావో'<br>అన్తరిక్షం 'ఉద్గీథ'।<br>ఆదిత్యః "ప్రతిహారో"<br>ద్యౌః "నిధనం"।<br>ఇతి ఊర్ధ్వ ఏషు।** | లోకంలో "సామము" - యొక్క ఐదు (5) విధములైన 'ఉపాసన'<br>(1) 'హిం' ఆహ్వానము (Welcome) (2) ప్రస్తావము (Introduction) (3) ఉద్గీథము - మహిమ స్తుతి (Literary description) (4) ప్రతిహారము - వ్యతిరిక్త ఖండనము (5) నిధనము (సమాప్తి - End up / Conclusion)<br>పృథివి పంచవిధ సామోపాసనా!<br>(1) పృథివి - 'హిం' కారము (ఆహ్వానము)<br>(2) అగ్ని - ప్రస్తావము (దేవత గురించి ప్రస్తావించటము)<br>(3) అంతరిక్షము (ఆకాశము) - ఉద్గీథము (ఔన్నత్య వర్ణనము)<br>(4) ఆదిత్యుడు - ప్రతిహారము (వ్యావిరిక్తభావముల ఖండనము)<br>(5) ద్యౌః (ద్యులోకము, దేవతాలోకము, స్వర్గలోకము) - నిధనము (సమాప్తి)<br>ఈ విధంగా తెలుసుకొని ఉపాసిస్తూ ఈ జీవుడు ఊర్ధ్వగతులను ఊర్ధ్వస్థానములను సిద్ధించుకోగలడు. |
| **2.** | **అథ ఆవృత్తేషు<br>ద్యౌః 'హిం' కార।<br>ఆదిత్యః "ప్రస్తావో"<br>అన్తరిక్షం "ఉద్గీథో"<br>అగ్నిః "ప్రతిహారః"<br>పృథివీ "నిధనమ్"** | **ఇప్పుడిక ఆవృత్తమునందు (తిరిగి నిర్వర్తిస్తూ ఉన్నప్పుడు) (లేక) అనుక్రమమునందు**<br>(1) ద్యులోకము స్వర్గలోకము యొక్క స్వరము - **'హిం'కార ఉపాసన**<br>(2) ఆదిత్యము యొక్క స్వరము - **"ప్రస్తావ" ఉపాసన**<br>(3) ఆకాశము (అంతరిక్షము) యొక్క స్వరము - **'ఉద్గీథ' ఉపాసన**<br>(4) అగ్ని యొక్క స్వరము - **'ప్రతిహార' ఉపాసన**<br>(5) భూమి యొక్క స్వరము - **"నిధన" ఉపాసన** |
| **3.** | **కల్పన్తే హ అస్మై లోకా<br>ఊర్ధ్వాశ్చ, ఆవృత్తాశ్చ<br>య ఏతత్ ఏవం విద్వాన్ లోకేషు<br>పంచవిధం సామా ఉపాస్తే॥** | ఈవిధంగా ఊర్ధ్వలోకములను (కిందనుంచిపైకి), ఆవృత్తములను (పైనుండి క్రిందికి) - స్వరములను గురించి తెలుసుకొని సామగానమును '5' (పంచ) విధములుగా ఉపాసిస్తున్నారు. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ద్వితీయాధ్యాయే ద్వితీయః ఖండః

## 2-3. తృతీయః ఖండః - పంచవిధ సామగాన "వృష్టి" ఉపాసన

| | | |
|---|---|---|
| **1.** | **వృష్టౌ పంచవిధగ్ం సామా ఉపాసీత।** | వృష్టులు (కురిపించటము) 5 విధములగు సామములుగా ఉపాసించ బడుగాక। |
| | **పురోవాతో 'హిం' కారో** | (1) తూర్పు వాయువు - 'హిం'కారోపాసనగా |
| | **మేఘో జాయతే స ప్రస్తావో** | (2) మేఘమును - 'ప్రస్థాన' ఉపాసనగా |
| | **వర్షతి స ఉద్గీథో** | (3) వర్షమును - 'ఉద్గీథము' ఉపాసనగా |
| | **విద్యోతతే స్తనయతి। స ప్రతిహారః।** | (4) మెఱుపులను, పిడుగులను - 'ప్రతిహార' ఉపాసనగా ఉపాసించబడు గాక! |
| **2.** | **ఉత్ గృహ్ణాతి తత్ 'నిధనమ్'।** | (5) ఉపసంహారము (లేక) విరమించటమును - నిధనముగాను, గానము చేస్తూ ఉపాసించబడుతోంది. |
| | **వర్షతి హ అస్మై వర్షయతి హ య ఏతత్ ఏవం విద్వాన్ వృష్టౌ పంచవిధగ్ం సామా ఉపాస్తే।** | ఈ విధంగా వృష్టిని (వర్షమును) ప్రకృతియొక్క మహత్తరమైన ప్రసాదముగాను, పరమాత్మయొక్క కరుణా రసముగాను విద్వాంసులచే ఉపాసించబడుచున్నది. ఇది విద్వాంసుల యొక్క 'వృష్టిరూప పంచవిధ సామోపాసన।' |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ద్వితీయాధ్యాయే తృతీయః ఖండః**

## 2-4. చతుర్థః ఖండః - పంచవిధ జల సామోపాసన

| | | |
|---|---|---|
| **1.** | **సర్వాన్ అప్సు పంచ విధగ్ం సామా ఉపాసీత।** | సమస్త జలములను '5' విధములుగా 'సామగానోపాసన' చేయుదురు గాక। |
| | **మేఘో యత్ సంప్లవతే స "హింకారః"।** | (1) మేఘముల సమూహము రూపుదిద్దుకోవటము - **'హిం'కారోపాసన।** |
| | **యత్ వర్షతి స ప్రస్తావో** | (2) వర్షించటము - **ప్రస్తావోపాసన।** |
| | **యాః ప్రాచ్యః స్యన్దంతే స ఉద్గీథో** | (3) జలము ప్రాచీ (తూర్పు) దిశగా ప్రవహించటము - **ఉద్గీథము** |
| | **యాః ప్రతీచ్యః స "ప్రతిహారః"।** | (4) జలము ప్రతీచ్యదిశగా (పడమట - ప్రవహించటము) - **ప్రతిహారము** |
| | **స సముద్రో 'నిధనమ్'।** | (5) సముద్రమే - **నిధనము (సమాప్తి)** |
| **2.** | **స హ అప్సు ప్రైత్యప్సుమాన్ భవతి య ఏతత్ ఏవం విద్వాన్ సర్వాః అప్సు పంచ విధగ్ం సామా ఉపాస్తే॥** | ఈ విధంగా 'పంచసామోపాసన' గురించి ఎరిగియున్నవాడు, జలోపాసన చేయుచున్నవాడై 'జలపంచ సామము' తత్త్వము ఎరిగియున్న విద్వాంసుడగుచున్నాడు. |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ద్వితీయాధ్యాయే చతుర్థః ఖండః**

## 2-5. పంచమః ఖండః - పంచవిధ ఋతు సామోపాసన

| | | |
|---|---|---|
| 1. | **ఋతుషు పంచవిధగ్ం - సామా ఉపాసీత।**<br>**వసన్తో 'హిం'కారః।**<br>**గ్రీష్మః "ప్రస్తావో"**<br>**వర్షా "ఉద్గీథః"।**<br>**శరత్ "ప్రతిహారః"।**<br>**హేమన్తః "నిధనమ్"।** | ఋతువులను పంచ (5) విధములైన సామోపాసన నిర్వర్తించెదరుగాక।<br>(1) వసంత ఋతువు → 'హిం'కారోపాసన<br>(2) గ్రీష్మ ఋతువు → ప్రస్తావనోపాసన<br>(3) వర్ష ఋతువు → ఉద్గీథము<br>(4) శరత్ ఋతువు → ప్రతిహారము<br>(5) హేమన్తము → నిధనము (ఉపసంహారము/సమాప్తి)<br>(గమనిక - ఇక్కడ సంవత్సరమును ఆరు కాకుండా ఐదు ఋతువులుగా చెప్పబడెను.) |
| 2. | **కల్పన్తే హ అస్మా ఋతవ**<br>**ఋతుమాన్ భవతి,**<br>**య ఏతత్ ఏవం విద్వాన్ ఋతుషు,**<br>**పంచవిధగ్ం సామా ఉపాస్తే।** | ఎవ్వరైతే వసంత - గ్రీష్మ - వర్ష - శరత్ - హేమన్త 'పంచ' (5) ఋతువులను సామము యొక్క 'హిం'కార, ప్రస్తావన, ఉద్గీథ ప్రతిహార - నిధనములుగా తెలుసుకొని విద్వాంసులై 'పంచ ఋతు సామగానము'ను ఉపాసిస్తారో - వారు ఋతువులచే రక్షించబడి, ఋతువులలోని ఆయా సంపదలు పొందగలరు. |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ద్వితీయాధ్యాయే పంచమః ఖండః**

## 2-6. షష్ఠః ఖండః - పంచవిధ పశు సామోపాసన

| | | |
|---|---|---|
| 1. | **పశుషు పంచవిధగ్ం**<br>**సామా ఉపాసీత।**<br>**అజా "హిం"కారో**<br>**అవయః "ప్రస్తావో"**<br>**గావ "ఉద్గీథో"**<br>**అశ్వాః "ప్రతిహారః"**<br>**పురుషో "నిధనమ్"।** | పశువుల గురించిన పంచ (5) విధ సామోపాసన ఈ విధంగా ఉంటుంది.<br>(1) అజములు (మేకలు) - 'హిం 'కారోపాసన।<br>(2) అవయములు (గొర్రెలు) - ప్రస్తావోపాసన।<br>(3) గోవులు (ఆవులు) - ఉద్గీథోపాస।<br>(4) అశ్వములు (గుఱ్ఱములు) - ప్రతిహారోపాసన।<br>(5) పురుషుడు (మానవుడు) - నిధనము (సమాప్తి) |
| 2. | **భవన్తి హ అస్మా పశవః**<br>**పశుమాన్ భవతి -**<br>**య ఏతత్ ఏవం విద్వాన్**<br>**పశుషు పంచ విధగ్ం సామా ఉపాస్తే॥** | ఇట్టి పంచవిధ పశు సామోపాసన ఎరిగి, నిర్వర్తించువాడు సమృద్ధియగు పశుసంపద పొందగలడు.<br>అట్టి **"పంచవిధ పశు సామోపాస"** ఎరిగినవాడు లోటు లేనివాడై ఉంటాడు. |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ద్వితీయాధ్యాయే షష్ఠః ఖండః**

## 2-7. సప్తమః ఖండః - ఇంద్రియ సామోపాసన

| | | |
|---|---|---|
| **1.** | **ప్రాణేషు పంచవిధగ్ం<br>పరోవరీయః సామా ఉపాసీత।<br>ప్రాణో "హిం" కారో<br>వాక్ "ప్రస్తావః"।<br>చక్షుః ఉద్గీథః। శ్రోత్రం "ప్రతిహారః"।<br>మనో 'నిధనం' పరోవరీయాగ్ంసి వా ఏతాని॥** | **పంచవిధ పరోవరీయ (శ్రేష్ఠ) సామోపాసన**<br>పరోవరీయోపాసన (లేక) పంచవిధ (శ్రేష్మాతి శ్రేష్ఠ) సామోపాస ఈ విధమైనది.<br>(1) ప్రాణము → 'హిం'కార ఉపాసన।<br>(2) వాక్ (మాట్లాడటం) → ప్రస్తావనోపాసన।<br>(3) చక్షువులు (కన్నులు) → ఉద్గీథోపాసన<br>(4) శ్రోత్రములు (చెవులు) → ప్రతిహారోపాసన<br>(5) మనస్సు → నిధనము (సమాప్తి ముగింపు)<br>ఇవి **"పరోవరీయ పంచవిధ సామోపాసనలు"**. |
| **2.** | **పరోవరీయో హ అస్య భవతి।<br>పరోవరీయసో హ లోకాన్ జయతి।<br>య ఏతత్ ఏవం విద్వాన్ ప్రాణేషు<br>పంచవిధం పరోవరీయః<br>సామా ఉపాస్త<br>ఇతి తు పంచవిధస్య॥** | అట్టి పంచవిధ పరోవరీయ సామోపాసన ఎరిగినవాడు, ధ్యానము చేయువాడు లోకాలు జయించివేయగలడు. (లోకములలో నేను ఉన్నాను. లోకాలు నాలో అదే సమయంలో ఉన్నాయి - అను) సిద్ధిని పొందగలడు.<br>అట్టి "ప్రాణేషు పంచవిధ పరః పరీయ సామోపాసన"చే విద్వాంసుడై దివ్యలోకప్రవేశమునకు అర్హులౌతారు.<br>పంచవిధ ఉపాసన, సర్వదా ఉత్తమ ప్రయోజనము ప్రసాదించగలదు. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ద్వితీయాధ్యాయే సప్తమః ఖండః

## 2-8. అష్టమః ఖండః - 'వాచి (వాక్)' సప్తవిధ సామోపాసన

| | | |
|---|---|---|
| **1.** | **అథ సప్తవిధస్య వాచి<br>సప్తవిధగ్ం సామా ఉపాసీత।<br>యత్ కించ వాచో<br>హుం ఇతి స "హింకారః"।<br>యత్ ప్ర ఇతి స "ప్రస్తావో"<br>యత్ ఏతి స "ఆదిః"।** | "7" విధముల వాచి (వాక్కు) - **"సప్తవిధ సామోపాసన"** గురించి ఉపాసన కొరకై చెప్పుకుంటున్నాము.<br>1. ఏది 'హుం' అని ఏ కొంచము కూడా అయి, అనబడుచున్నదో → అది **'హిం'కారము.** (వాక్కులో 'హుమ్' అను స్వరమే 'హిం'కారము)<br>2. "ప్ర" అను స్వరము → అది **'ప్రస్తావము'**.<br>3. ఏది 'అ' ఆదియో → అదియే **'ఆది'**. (That is at the begining of all else).<br>**"అ" - అను స్వరమే - ఆది। అదియే "ఓం".** |
| **2.** | **యత్ ఉత్ ఇతి – స "ఉద్గీథో"<br>యత్ 'ప్రతి' ఇతి స "ప్రతిహారో"<br>యత్ ఉప ఇతి స ఉపద్రవో<br>యత్ 'ని' ఇతి తత్ "నిధనమ్"।** | 4. ఏ ఉత్ (ఆది నుండి - ఆదికి అనన్యంగా) బయల్వెడలుచున్నదో (జలము నుండి తరంగంలా) → అది **'ఉద్గీథము'**. ఉత్ అను స్వరమే ఉద్గీథము.<br>5. ఏది ప్రతి అయి ఉన్నదో - ఈ కనబడే దానికి వేరై విడిగా ఉన్నదో → అది **'ఆది'**. **"ప్రతి" - అను స్వరమే "ప్రతిహారము"**.<br>6. ఏది ఉప అను స్వరమో → అదియే **'ఉపద్రవము'**.<br>7. "ని" - అనునదే ఆ యొక్క **'నిధనము'** → 'ని' అను స్వరమే 'నిధనము' (ముగింపు/సమాప్తి). |
| **3.** | **దుగ్ధే అస్మై వాక్ దోహం యో<br>వాచో దోహః।<br>అన్నవాన్ అన్నాదో భవతి<br>య ఏవం విద్వాన్<br>వాచి సప్త విధగ్ం సామా ఉపాస్తే॥** | అట్టి "సప్తవిధ వాచి (వాక్)-సప్తవిధ సామము"గా తెలుసుకొని ఉపాసించువాడు పితికిన పాలు పోసియున్న పాత్రను - పొందు రీతిగా (పాల పాత్రను పొందు విధంగా) - "వివేకి అయి వాక్-అమృతమును" పొందుచున్నాడు.<br>అన్నము (బ్రహ్మము)ను కోరుకొని అన్నమే (బ్రహ్మమే) అగుచున్నాడు. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ద్వితీయాధ్యాయే అష్టమః ఖండః

## 2-9. నవమః ఖండః - ఆదిత్య సప్తవిధ సామోపాసన

**1.** **అథ ఖల్వముమ్ (ఖలు అముమ్)**
**ఆదిత్యగ్ం సప్తవిధగ్ం సామా ఉపాసీత।**

ఇక ఆపై, సూర్యుని (ఆదిత్యుని) సప్తవిధ సామగానములుగా (సప్తాశ్వ రథమ్ ఆరూఢునిగా, సప్త వర్ణముల కిరణ స్వరూపునిగా) ఉపాసించటము గురించి చెప్పుకుంటున్నాము.

**సర్వదా "సమః" తేన సామ।**
**మాం ప్రతి మాం ప్రతి ఇతి**
**సర్వేణ సమః తేన సామ।**

"సూర్యుడు సర్వదా సమత్వమునందు అధిరోహితులై, సర్వదా ప్రకాశిస్తూ, నా వైపు సమీప్యుడై ఉన్నారు. సర్వత్రా సమస్తులై సమముగా ప్రకాశించువారు. సర్వులపట్ల సమభావన, స్వయంప్రకాశకము, నిత్య జాగరూకత, సర్వత్రా సమవత్ స్థితి''- మొదలైన ఆత్మతత్త్వ నిర్వచనములు పుణికి పుచ్చుకున్నవారు'' - అను సామగానముతో స్తుతించెదరు గాక. ప్రతి ఒక్కరికి సమీపమున ఉన్నారు కాబట్టి ఆయనయే 'సామగానము' (స-ఆమ).

---

**2.** **తస్మిన్ ఇమాని సర్వాణి**
**భూతాని అన్వాయత్తాని ఇతి విద్యాత్।**
**తస్య యత్ పురోదయాత్, స 'హిం'కారః।**
**తత్ అస్య పశవః అన్వాయత్తాః।**
**తస్మాత్ తే 'హిం' కుర్వంతి,**
**హింకార భాజినో,**
**హి ఏతస్య సామ్నః।**

సమస్త భూతజాలము ఆ సూర్యభగవానునిపై ఆధారపడి మాత్రమే జీవించగలుగుచున్నారని గ్రహించబడు గాక।

**ఆ సూర్యుడు ఉదయించటానికి ముందుగా - 'హిం' కారము**

ఆయన 'హిం' కార మహిమపైననే జీవుల మనుగడ అంతా ఆధారపడి ఉన్నది. అందుచేత జీవులంతా 'జీవించటము'ను ఆధారముగా పొందుతూ, 'హిం' కార శబ్దమును చేస్తూ నిదురలేస్తున్నారు. అట్టి 'హిం'కార స్వరూపులే అయి జీవించటమే **"ఆదిత్య సప్తవిధ సామోపాసన" అనబడే "సామగానము".**

---

**3.** **అథ యత్ ప్రథమా ఉదితే స "ప్రస్తావః"।**
**తత్ అస్య మనుష్యా "అన్వాయత్తాః"।**
**తస్మాత్ తే ప్రస్తుతి కామాః ప్రశగ్ంసా**
**కామాః ప్రస్తావ భాజినో**
**హి ఏతస్య సామ్నః॥**

(1) సూర్యుని (ఆదిత్యుని) ఉదయించటానికి మునుముందటి రూపము **-'హిం' కారము.**

(2) మొట్టమొదటి ఉదయ కిరణములు - **ప్రస్తావము.**

జీవుల జీవనము అట్టి సూర్యోదయముపై ఆధారపడి ఉన్నది. వారి ప్రత్యక్ష - రక్షణ, పరోక్ష దేహ మనోబుద్ధులను నిర్మలము చేయటము, ఇవన్నీ ప్రశంసించటమే **"సామగాన-ప్రస్తావన".**

---

**4.** **అథ యత్ సంగవ**
**వేలాయాగ్ం స ఆదిః।**
**తత్ అస్య వయాగ్ంసి అన్వాయత్తాని।**
**తస్మాత్ తాని అన్తరిక్షే అనారంబణాని**
**ఆదాయ ఆత్మానం పరిపతంతి**
**ఆది భాజీని హి ఏతస్య సామ్నః।**

ఆయన కిరణములు లోకమంతా విస్తరించుచుండు సందర్భమే 'ఆది'. ఆదిత్యుని లోని 'ఆది'।

సూర్యాకారముగా పక్షులు ఆకాశంలో ఎగురుచున్నాయి. పక్షులు సూర్యునిపై ఆధారపడియే ఎగురుచున్నాయి.

అట్టి చిన్న ఆకారముగల (అల్పబలము, మేధస్సుగల) పక్షులు అంతరిక్షములో సూర్యోదయము ఆరంభము అగుచూ ఉండగా, చెట్లుపైనుండి కిలకిలారవములతో ఆకాశములోకి ఎగురుచూ ఉన్న శక్తి యొక్క దృశ్యమే 'ఆదిత్య సామగానము'। ఆ కిలకిలా శబ్దాలే సూర్యస్తోత్రము.

| | | |
|---|---|---|
| **5.** | **అథ యత్ సంప్రతి<br>మధ్యన్ దినే స "ఉద్గీథః"।<br>తత్ అస్య దేవా "అన్వాయత్తాః"।<br>తస్మాత్ తే సత్తమాః<br>ప్రాజాపత్యానాం ఉద్గీథ భాజినో<br>హి ఏతస్య దేవాః (సామ్నః)।** | మధ్యాహ్న సమయంలో సూర్యుడి ప్రకాశమాన ప్రత్యక్ష రూపము - ఉద్గీథముగా ఉపాసన<br>అట్టి మధ్యాహ్న సూర్యుని నుండియే తేజస్సు పొందుతూ, దేవతలు ప్రకాశించుచున్నారు. మధ్యందిన ప్రకాశముపై ఆధారపడి ఉన్నారు. అట్టి మధ్యాహ్న సూర్యతేజస్సును పొందుచున్న దేవతలు, అట్టి తేజోవిభవము గురించి ప్రజాపతి పుత్రులగు దేవతలు ఉద్గీథ గానము చేస్తూ ఉన్నారు. అట్టి ఉద్గీథ గానమే **"మధ్యందిన ఆదిత్య ఉద్గీథ-సామ గానము".** |
| **6.** | **అథ యత్ ఊర్ధ్వం మధ్యన్ దినాత్<br>ప్రాక్ – అపరాహ్ణాత్ స "ప్రతిహారః"।<br>తత్ అస్య గర్భా "అన్వాయత్తాః"<br>తస్మాత్ తే ప్రతిహృతా న అవపద్యంతే<br>'ప్రతిహార' భాజినో హి, ఏతస్య సామ్నః॥** | మధ్యాహ్నకాలము గడుచుచూ ఉండగా, ఏర్పడియున్న సాయం సూర్యప్రకాశము - "ప్రతిహారము" (1 PM to 3 PM)<br>అట్టి మధ్యాహ్నానంతర సూర్యప్రకాశముపై తల్లి గర్భములోని పిండములు ఆధారపడి రక్షణ పొందుచున్నాయి.<br>అట్టి ప్రతిహార - ఆదిత్య సామగానమువలననే గర్భస్థ పిండములు క్రిందకు పడకుండా గర్భములో మధ్యగా వ్రేలాడుచూ, జీవశక్తిని పొందసాగుచున్నాయి. మధ్యాహ్నానంతర సూర్యప్రకాశ - గర్భస్థ శిశు స్థాన రక్షణయే **"ఆదిత్య-ప్రతిహార సామగానము".** |
| **7.** | **అథ యత్ ఊర్ధ్వం అపరాహ్ణాత్<br>ప్రాక్ – అస్తమయాత్<br>స "ఉపద్రవః"<br>తత్ అస్య అరణ్యా "అన్వాయత్తాః"।<br>తస్మాత్ తే పురుషం దృష్ట్వా<br>కక్షగ్ం శ్వభ్రమితి ఉపద్రవన్తి।<br>ఉపద్రవ భాజినో హి,<br>ఏతస్య సామ్నః।** | (అపరాహ్ణము = పగటి చివరి భాగము. ఒక పగటిని మూడు సమాన భాగాలు చేసినప్పుడు - చివరి 3వ భాగము)<br>పగటిలో చివరి భాగము, సూర్య అస్తమయానికి ముందు ప్రకాశించు సూర్యుడు "ఉపద్రవము" ( 3 pm to 5 pm )<br>అట్టి ఉపద్రవ - సూర్యునిపై అరణ్య మృగములు జీవము, రక్షణ పొందినవై ఉంటున్నాయి.<br>అట్టి అపరాహ్ణ - ప్రాక్ (Before) అస్తమయ సూర్యుని రూపము "ఉపద్రవ సూర్యరూపము"గా ఉపాసించబడు గాక। |
| **8.** | **అథ యత్ ప్రథమా<br>అస్తమితే తత్ "నిధనం।"<br>తత్ అస్య పితరో "అన్వాయత్తాః"।<br>తస్మాత్ తాన్ నిదధతి,<br>నిధన భాజినో హి।** | సూర్యుడు అస్తమించగానే ఆ మరుక్షణ సూర్యుని "నిధనము" (ఉపసంహార - ఆటవిడుపు).<br>అట్టి నిధన సూర్యునిపై పితరులు ఆధారపడినవారై ఉంటారు.<br>అట్టి నిధనరూప సూర్యతత్త్వము వలననే పితరులు ఆధారపడి పోషింపబడుచున్నారు. |
| | **ఏతస్య సామ్న ఏవం ఖల్వముమ్<br>ఆదిత్యగ్ం సప్తవిధగ్ం సామా ఉపాస్తే॥** | ఈ విధంగా సప్త (7) విధ సామగానంగా ఆదిత్యుని సామగానం చేస్తూ ఆరాధించెదరు గాక।<br>(1) పురా ఉదయ ఆదిత్య హింకార సామగానము (2) ప్రథమ ఉదిత ఆదిత్య సామగానము (3) ఉషోదయానంతర - ఆదిత్య సామగానము (4) మధ్యందిన ఉద్గీథ సామగానము (5) అపరాహ్ణ ఊర్ధ్వ - ప్రాక్ అస్తమయ ఆదిత్య సామగానము. (6) అస్తమయ ఆదిత్య సామగానము (ఉద్గీథోపాసన) (7) అస్తమయానంతర ఆదిత్య సామగానము - ఉపాసించబడు గాక। |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ద్వితీయాధ్యాయే నవమః ఖండః**

## 2-10. దశమః ఖండః - "అతిమృత్యు సామోపాసన"

**1.** **అథ ఖలు - ఆత్మ సంమితమ్ "అతిమృత్యు", సప్తవిధగ్ం సామా ఉపాసీత।**

ఇక ఇప్పుడు - మృత్యువుకు ఆవలగల (మార్పు చేర్పులకు ఆవలగల) సర్వత్రా సమరూపమైయున్న ఆత్మయొక్క 'అతిమృత్యురూప' (Beyond Change Factors) సప్తవిధ 'సామోపాసన' గురించి చెప్పుకుంటున్నాము.

**హింకార ఇతి।**

"హిం-కార" - ఇతి । 3 అక్షరముల శబ్దము

**త్రి అక్షరం (త్ర్యక్షరం) ప్రస్తావ ఇతి।**

"ప్రస్తావ" - ఇతి। 3 అక్షరముల శబ్దము

**త్రి అక్షరం (త్ర్యక్షరం) తత్ సమమ్।**

ఈ రెండు సమస్వరూపమైనవి.

---

**2.** **"ఆదిః" ఇతి ద్వి అక్షరం (ద్వ్యక్షరం)। "ప్రతిహార" ఇతి చతుః అక్షరం। తత ఇహ ఏకం తత్ సమమ్।**

"ఆది" - ఇది '2' అక్షరముల శబ్దము.

"ప్రతిహార" - ఇది '4' అక్షరముల శబ్దము

'ప్రతిహారము' నుండి ఒక అక్షరమును తీసుకొనివచ్చి 'ఆది'కి చేర్చాలి. అప్పుడు ఆ రెండు సమము అవగలవు.

(ఆది = మొట్టమొదటే ఉన్న 'నేను'. ప్రతిహారము = కల్పన, ఊహ, భావన, మాయ).

---

**3.** **ఉద్గీథ ఇతి త్రి అక్షరం। (త్ర్యక్షరం)। "ఉపద్రవ" ఇతి చతుః అక్షరం।**

'ఉద్గీథ' - ఇది '3' అక్షరములు.

'ఉపద్రవ' - ఇది '4' అక్షరములు.

**త్రిభిః త్రిభిః సమం భవతి। అక్షరం అతి శిష్యతే। త్రి అక్షరం తత్ సమమ్।।**

పై అక్షరములు '3+3' = 6 ఏకము చేస్తే అప్పటికిక ఏడిటిలో (Out of 7) ఒక అక్షరము శేషిస్తోంది. ఆ విధంగా త్రి అక్షరం - త్రి అక్షరం సమము అయి "సర్వత్రా సమము" మాత్రమే ఏర్పడియున్నదగుచున్నది. మిగిలిన ఒక అక్షరము కూడా మూడు అక్షరములతో సమముగానే చెప్పబడెను.

---

**4.** **"నిధనం" ఇతి త్రి అక్షరం (త్ర్యక్షరం)। తత్ సమం ఏవ భవతి। తాని హ వా ఏతాని ద్వావిగ్ంశతిః(22) అక్షరాణి।**

**'నిధనం'** (సమాప్తి, ముగింపు) - అనునది 'త్రి' అక్షరం (3 అక్షరములతో ఉన్నది)

అంతా అక్షరమే కనుక మిగతా త్రి-అక్షరములతో సమమే (Equal) అయి ఉన్నది.

**ఈ విధంగా సప్తవిధి సామగానోపాసనకు "22' అక్షరములు కలిగి ఉన్నది.**

I. "హిం" "కార" = 3; II. "ప్రస్తావ" = 3; III. ఆది = 2;
IV. ప్రతిహార = 4; V. ఉద్గీథ = 3; VI. ఉపద్రవ = 4; VII. నిధనం= 3

$$3+3+2+4+3+4+3 = 22$$

---

**5.** **ఏకవిగ్ంశతి (21) ఆదిత్యం ఆప్నోతి।**

సమస్వరూపములైన 21 ఆదిత్య (మొట్టమొదటి స్వరూపమగు ఆత్మయొక్క) తత్త్వము తెలుసుకొంటారో, వారు 'ఆదిత్యము' (The Beginning of Everything) సిద్ధించుకుంటారు.

**ఏకవిగ్ంశః వా ఇతిః (21వ వాడు) అసావాదిత్యో**

ఈ 21 అక్షరములుగా కనిపిస్తున్నది సర్వత్ర వేంచేసి, సమస్తము తానే అయి ఉన్న ఆదిత్యుడే!

**ద్వావిగ్ంశేన (22) పరమాదిత్యాత్ జయతి। తత్ నాకం। తత్ విశోకమ్।**

22వది అక్షరమగు పరమాదిత్యము (ఆదిత్యునికి కూడా పరమైనది. ఆవలది). అట్టి పరమాదిత్యము, దివ్యలోకము శోకరహితమైనది. అట్టి పరమాదిత్యము (కేవలాత్మ, పరస్వరూపము, పరమాత్మ) తెలుసుకొంటే ద్రష్టయొక్క (జీవునియొక్క) ద్రష్టత్వముచే దృశ్యము నుండి పొందుచున్న దుఃఖములన్నీ శమిస్తాయి. (All worries of Indria-jagath vanish / subside).

| | | |
|---|---|---|
| **6.** | **ఆప్నోతి హ ఆదిత్యస్య జయం పరో హ।**<br>**అస్య ఆదిత్య జయాత్ జయో భవతి।**<br>**య ఏతత్ ఏవం విద్వాన్ ఆత్మ,**<br>**సంమితం అతిమృత్యు సప్త విధగ్ం**<br>**సామా ఉపాస్తే। సామా ఉపాస్తే।** | ఈ లోకమున ప్రకాశమానుడైయున్న ఆదిత్యునికి (సూర్యునికి) 21 అక్షరములు. 22వ అక్షరం సూర్యునికి ఆవలి లోకము. అది ఆదిత్యమును కూడా దాటినట్టి (కేవలమగు ఆత్మ) స్థానము. అట్టి ఆదిత్యలోకము దాటి అమృతమగు ఆత్మలోకము (ఆత్మస్థానము) ఎరిగిన విద్వాంసుడు సమస్తమునందు ఆత్మను, ఆత్మయందే సమస్తమును దర్శించుచూ, సప్తవిధ సామములను ఉపాసిస్తూ - క్రమంగా మృత్యుపరిధులను దాటివేస్తాడు. అట్టి ఏకవింశతి అక్షర సామోపాసనచే అమృతస్వరూపమును సిద్ధించుకొంటాడు. |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ద్వితీయాధ్యాయే దశమః ఖండః**

---

## 2-11. ఏకాదశః ఖండః - గాయత్ర సామోపాసనా

| | | |
|---|---|---|
| **1.** | **మనో "హింకారో" వాక్ "ప్రస్తావః।**<br>**చక్షుః "ఉద్గీథః"।**<br>**శ్రోత్రం "ప్రతిహారః"।**<br>**ప్రాణో "నిధనం"।**<br>**ఏతత్ గాయత్రం**<br>**ప్రాణేషు ప్రోతమ్॥** | 'మనస్సు' - **'హిం' కారము**<br>వాక్ - **'ప్రస్తావ'**<br>చక్షువులు - **"ఉద్గీథ"**<br>శోత్రములు (చెవులు) - **"ప్రతిహార"**<br>ప్రాణము - **'నిధనం'**<br>అట్టి ప్రాణశక్తితో ఆయా (5) రూపములుగా ప్రోతమై (నిండినదై) ఉన్నదే - **ఏతత్ గాయత్రం।** (అదియే గాయత్రి)। |
| **2.** | **స య ఏవం ఏతత్**<br>**గాయత్రం ప్రాణేషు ప్రోతం**<br>**వేద ప్రాణీ భవతి।**<br>**సర్వం ఆయుః ఏతి।**<br>**జ్యోక్ జీవతి।**<br>**మహాన్ ప్రజయా పశుభిః భవతి।**<br>**మహాన్ కీర్త్యా, మహామనాః స్యాత్,**<br>**తత్ వ్రతమ్।** | ప్రాణము 'గాయత్రి'చే ప్రోతమై ఉన్నట్లే గాయత్రి ప్రాణముచే ప్రోతమైయున్నది.<br>వేదము (తెలియబడేది / తపస్సు) ప్రాణిగా అగుచున్నది.<br>అట్టి "ప్రాణస్వరూప గాయత్రి సామగానము". తెలుసుకొని గాయత్రీ - ప్రాణోపాసన చేయువారు జ్యోతిస్వరూపులై జీవించగలరు. వారి జీవితమే జ్యోతి (స్వయంప్రకాశ) రూపమవగలదు। ఆత్మజ్యోతియగు (కేవల శివ స్వరూపము సంతరించుకోగలరు).<br>అట్టివారు గొప్ప జన, పశు, సంపద పొందగలరు.<br>గొప్ప కీర్తిమంతులు అగుచున్నారు. అట్టి 'మహామనోసిద్ధి'యే **"గాయత్రీ - ప్రాణోపాసనా వ్రతము".** |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ద్వితీయాధ్యాయే ఏకాదశః ఖండః**

## 2-12. ద్వాదశః ఖండః - రథంతరమగ్ని సామోపాసనా

| | | |
|---|---|---|
| **1.** | **అభిమంథతి స 'హిం'కారో।** | అరణి కొయ్యలతో మథనము (రెండు కొలతో ఒరిపిడి చేయటము) - 'హిం' కారము. |
| | **ధూమో జాయతే స ప్రస్తావః।** | ధూమము పుట్టటము - "ప్రస్తావము". |
| | **జ్వలతి స "ఉద్గీథః"** | అగ్నిజ్వాల జననము - 'ఉద్గీథము". |
| | **అంగారా భవంతి స "ప్రతిహార"** | అగ్నికణములు - విస్ఫులింగములు - "ప్రతిహారము". |
| | **ఉపశామ్యతి తత్ "నిధనగ్ం"** | ఆ విధంగా జ్వలిస్తున్న అగ్ని ఉపశాంతి పొందటము, (అనగా) ఉపశమించటము - 'నిధనము'. |
| | **సగ్ంశామ్యతి తత్ నిధనం** | |
| | **ఏతత్ "రథంతరం అగ్నౌ" ప్రోతమ్।** | అట్టి 'సంశామ్య' (Subsiding) రూపమగు అగ్ని - రథంతరాగ్నిగా జగత్తంతా ప్రోతమై(Filled up) ఉన్నది. |
| **2.** | **స య ఏవమ్ ఏతత్ రథంతరం అగ్నౌ ప్రోతం వేద, బ్రహ్మవర్చసి అన్నాదో భవతి।** | అట్టి రథంతరంగా ప్రోతమైయున్న (జగత్తంతా ఓతప్రోతమైయున్న) అగ్నితత్త్వమును తెలుసుకొన్నవాడు బ్రహ్మవర్చస్సు పొందగలడు. సమస్తమును పొందిన 'అన్నాదుడు' - కాగలడు. |
| | **సర్వం ఆయుః ఏతి।** | - వారి ఆయుష్షు పవిత్రము కాగలదు (ఉత్తమమైన ఆయుష్షు పొంద గలరు). |
| | **జ్యోక్ జీవతి।** | - జ్యోతిస్వరూపులై జీవించగలరు. |
| | **మహాన్ ప్రజయా పశుభిః భవతి।** | - ఉత్తమ సంతానము, పశుసంపద పొందగలరు. |
| | **మహాన్ కీర్త్యా** | - గొప్ప కీర్తిమంతులుగా కాగలరు. |
| | **న ప్రత్యఙ్ అగ్నిం ఆచామేత్ న నిష్ఠీవేత్ తత్ వ్రతమ్।** | అందుచేత సర్వత్రా మౌనంగా ఉన్న అగ్ని (లేక) ప్రాణశక్తిని ఉపాసించటమును 'వ్రతము' (Regular Practice)గా కలిగి ఉండెదరు గాక। |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ద్వితీయాధ్యాయే ద్వాదశః ఖండః

## 2-13. త్రయోదశః ఖండః - వామదేవం మిథున సామోపాసన

| | | |
|---|---|---|
| **1.** | **ఉపమన్త్రయతే స "హిం"కారః।** | ఉపమంత్రణము = **పిలుపు, బుజ్జగింపు మంత్రోచ్చారణ** |
| | **జ్ఞపయతే స ప్రస్తావః।** | ఉపమంత్రయతము - మంత్రోచ్చారణ - **'హిం'కారము** |
| | **స్త్రియా సహః ఏతే స ఉద్గీథః।** | జ్ఞాపకము - **ప్రస్తావము** |
| | **ప్రతి స్త్రీం సహః ఏతే స "ప్రతిహారః"।** | స్త్రీ సంగమము (ప్రకృతితో కలిసి ఉండటము) - **ఉద్గీథము** |
| | **కాలం గచ్ఛతి తన్నిధం** | ప్రతి స్త్రీ సహము(మిథునము । కలయిక) - **ప్రతిహారము।** |
| | **పారం గచ్ఛతి తత్ "నిధనం"।** | కాలము గడచిపోవటము, చివరికి చేరటము - **నిధనము (సమాప్తి)** |
| | **ఏతత్ వామదేవ్యం మిథునే ప్రోతమ్।** | అట్టి వామదేవ మిథునము (కేవలమగు ఆత్మతో కల్పన చేరి సమాగమము)తో ఇదంతా ఏర్పడినది అగుచున్నది. |
| **2** | **స య ఏవం ఏతత్ వామదేవ్యం మిథునే ప్రోతం వేద మిథునీ భవతి।** | అట్టి 'ఆ వామదేవ మిథునము'చే ప్రోతము (Made up of) - తెలుసుకొన్నవాడు 'మిథునీ' అగుచున్నాడు. |
| | **మిథునాన్ మిథునాత్ ప్రజాయతే। సర్వం ఆయుః ఏతి। జ్యోక్ జీవతి। మహాన్ ప్రజయా, పశుభిః భవతి। మహాన్ కీర్త్యా న కాంచన పరిహారేత్ తత్ వ్రతమ్।।** | మిథునముచే మిథునము వృద్ధి చెందుచున్నది. మిథునము (కలయిక) ప్రవృద్ధమవగలదు. అట్టి ఏకత్వ దర్శన ధ్యానముచే ఆయుష్షు పవిత్రమవగలదు. జగజ్యోతి స్వరూపము ఆవిష్కరణము కాగలదు. ఉత్తమ సంతానము, పశుసంపద ప్రాప్తించగలదు. ఉత్తమ కీర్తి లభించగలదు. అట్టి వామదేవ మిథునము (అనుభవి - అనుభవముల ఏకత్వము) వ్రతముగా ఆచరించబడు గాక। |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ద్వితీయాధ్యాయే త్రయోదశః ఖండః

## 2-14. చతుర్దశః ఖండః - 'బృహదాదిత్య' సామోపాసన

| | | |
|---|---|---|
| 1. | ఉద్యన్ "హింకార"।<br>ఉదితః "ప్రస్తావః"।<br>మధ్యందిన "ఉద్గీథః"।<br>అపరాహ్ణః "ప్రతిహారః"।<br>అస్తం యత్ "నిధనం"।<br>ఏతత్ "బృహత్ ఆదిత్యే" ప్రోతమ్। | <u>**సూర్యుడు**</u><br>ఉదయించు సూర్యుడు - **'హిం'కారము.**<br>ఉదయిస్తున్నప్పుడు - **'ప్రస్తావము'**<br>మధ్యాహ్న సూర్యుడు - **ఉద్గీథము**<br>అపరాహ్ణ (మధ్యాహ్నానంతర-సాయంత్ర) సూర్యుడు - **ప్రతిహారము**<br>సూర్యాస్తమయం - **'నిధనము'**<br>ఇది **'బృహత్ ఆదిత్యము'** అనబడుతోంది. |
| 2. | స య ఏవం ఏతత్ బృహత్<br>ఆదిత్యే ప్రోతం వేద,<br>తేజస్వీ అన్నాదో భవతి।<br>సర్వం ఆయుః ఏతి। జ్యోక్ జీవతి।<br>మహాన్ ప్రజయా పశుభిః భవతి।<br>మహాన్ కీర్త్యా। తపన్తం న నిందేత్। తత్ వ్రతమ్। | అట్టి ఆ యొక్క 'బృహత్ ఆదిత్యము' ఏ విధంగా సర్వత్రా ప్రోతమైయున్నదో ఎరిగి ఉపాసిస్తున్నవాడు తేజోవంతుడు, సమస్తము అనుభవముగా పొందువాడు అగుచున్నాడు. ఆయుష్మంతుడు కాగలడు. జగత్‌జ్యోతి స్వరూపుడు కాగలడు. ఉత్తమ జనసంపద, పశుసంపద పొందగలడు।<br>గొప్ప కీర్తిమంతుడగుచున్నాడు.<br>అట్టి బృహత్ ఆదిత్యుని తీవ్రతను నిందించరాదు.<br>అట్టి ఆరాధన 'వ్రతము'గా ఆచరించబడు గాక! |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ద్వితీయాధ్యాయే చతుర్దశః ఖండః**

## 2-15. పంచదశః ఖండః - వైరూప పర్జన్య సామోపాసన

| | | |
|---|---|---|
| 1. | అభ్రాణి సంప్లవన్తే స "హింకారో"<br>మేఘో జాయతే స "ప్రస్తావో"<br>వర్షతి స "ఉద్గీథో"<br>విద్యోతతే స్తనయతి, స "ప్రతిహార"<br>ఉత్ గృహ్ణాతి తత్ "నిధనమ్"<br>ఏతత్ వైరూపం పర్జన్యే ప్రోతమ్। | మబ్బుల సంప్లవన్తము (సమూహము ఏర్పడటం) - **'హిం'కారము**<br>దట్టమైన మేఘములు - **ప్రస్తావము**<br>వర్షించటము - **ఉద్గీథము**<br>మేఘపు మెఱుపులు - **'ప్రతిహారము'**<br>వర్షానంతరము (మేఘములు । ఆకాశము) - **"నిధనము"**<br>అట్టి మేఘముల తత్త్వము **"పర్జన్యము"**తో ప్రోతమైయున్నది. |
| 2. | స య ఏవం ఏతత్ వైరూపం<br>పర్జన్యే ప్రోతం వేద విరూపాగ్ంశ్చ<br>సురూపాగ్ంశ్చ పశూన్ అవరుంధే,<br>సర్వం ఆయుః ఏతి। జ్యోక్ జీవతి।<br>మహాన్ ప్రజయా పశుభిః భవతి।<br>మహాన్ కీర్త్యా, వర్షంతం।<br>న నిందేత్ తత్ వ్రతమ్॥ | అట్టి పర్జన్యమును సామోపాసన చేయువారు - సామగానము చేయువారు, (అనగా) పర్జన్యముతో ఆత్మోపాసన చేయువారు<br>- పశు సంపద పొందగలరు.<br>- ఆయుష్మంతులు కాగలరు.<br>- జగజ్జ్యోతి స్వరూపులగుచున్నారు.<br>- ఉత్తమ ప్రజలను, పశుసంపద పొందగలరు.<br>- గొప్ప కీర్తిమంతులు కాగలరు.<br>**'వర్షము'ను నిందించరాదు. ఇది వ్రతము.** |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ద్వితీయాధ్యాయే పంచదశః ఖండః

## 2-16. షోడశః ఖండః - వైరాజ ఋతు సామోపాసన

| | | |
|---|---|---|
| 1. | వసన్తో "హింకారః"। | వసంత ఋతువు - **'హిం'కారము** |
| | గ్రీష్మః "ప్రస్తావః"। | గ్రీష్మ ఋతువు - **'ప్రస్తావము'** |
| | వర్షా "ఉద్గీథః"। | వర్ష ఋతువు - **'ఉద్గీథము'** |
| | శరత్ "ప్రతిహారః"। | శరత్ ఋతువు - **'ప్రతిహారము'** |
| | హేమంతః "నిధనం"। | హేమంతము - **'నిధనము'** |
| | ఏతత్ వైరాజమ్ ఋతుషు ప్రోతమ్। | ఇది "వైరాజ ఋతు సామగానోపాసన". కాలము ఆత్మయందు ఓతప్రోతమైయున్నతీరును ఉపాసించటము- "వైరాజ ఋతుపాసన". |
| 2. | స య ఏవం ఏతత్ వైరాజమ్ ఋతుషు ప్రోతం వేద విరాజతి ప్రజయా పశుభిః। బ్రహ్మవర్చసేన, సర్వం ఆయుః ఏతి। జ్యోక్ జీవతి। మహాన్ ప్రజయా పశుభిః భవతి। మహాన్ కీర్త్యా। ఋతూన్ న నిందేత్। తత్ వ్రతమ్॥ | అట్టి ఆ **"వైరాజ ఋతు ప్రోతము"** ఎరిగినవాడు ప్రజ - పశు సంపదతో విరాజిల్లగలడు. బ్రహ్మవర్చస్సుతో ఉత్తమ ఆయుష్షు కలిగి యుండగలడు. స్వయంజ్యోతి స్వరూపుడు కాగలడు. ఉత్తమ ప్రజా సంపద, పశు సంపద కలిగి యుండగలడు. ఋతువులను (చలి - ఎండ - వేడి కదా...అని తలచుచూ) నింద చేయరాదు. ఇది వ్రతము। |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ద్వితీయాధ్యాయే షోడశః ఖండః

## 2-17. సప్తదశః ఖండః - శక్వరీ లోక సామోపాసన

| | | |
|---|---|---|
| 1. | పృథివీ "హింకారో" అంతరిక్షం "ప్రస్తావో" ద్యౌః ఉద్గీథో దిశః "ప్రతిహారః" సముద్రో "నిధనం" ఏతాః శక్వర్యో లోకేషు ప్రోతాః॥ | పృథివి (భూమి) - **'హిం'కారము** అంతరిక్షము - **'ప్రస్తావము'** ద్యులోకము (దివ్యలోకము) - **'ఉద్గీథము'** దిక్కులు - **'దిశలు'** సముద్రము - **'నిధనము'** ఇది లోకమునందు **"శక్వరీ సామగానము"**. |
| 2. | స య ఏవం ఏతాః శక్వర్యో లోకేషు ప్రోతా వేద లోకీ భవతి। సర్వం ఆయుః ఏతి। జ్యోగ్జీవతి మహాన్ ప్రజయా పశుభిః భవతి। మహాన్ కీర్త్యా। లోకాన్ న నిందేత్ తత్ వ్రతమ్। | ఎవ్వరైతే ఇట్టి లోక సంబంధమైన శక్వరీ సామగానోపాసన చేయుచున్నారో, అట్టివాడు లోకతత్త్వమును ఎరిగినవాడై 'వేద లోకీ' - అగుచున్నాడు.<br>❖ అట్టివాని ఆయుష్షు పవిత్రమగుచున్నది.<br>❖ స్వయంజ్యోతి జీవన స్వరూపుడై ప్రకాశిస్తున్నాడు.<br>❖ మహనీయులగు జనసంగమము, పశుసంపద పొందుచున్నాడు.<br>❖ గొప్ప కీర్తిమంతుడు కాగలడు.<br>అంతేగాని లోకనింద చేయరాదు.<br>ఇది వ్రతము. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ద్వితీయాధ్యాయే సప్తదశః ఖండః

## 2-18. అష్టాదశః ఖండః - రేవతీ సామగానోపాసన

| | | |
|---|---|---|
| 1. | అజా "హింకారో" | <u>రేవతీ గానము</u>: |
| | అవయః "ప్రస్తావో" | అజములు (మేకలు) - **'హిం'కారము** |
| | గావ "ఉద్గీథో" | గొఱ్ఱెలు - **ప్రస్తావము** |
| | అశ్వాః "ప్రతిహారః" | గోవులు (ఆవులు) - **ఉద్గీథము** |
| | పురుషో "నిధనం" | గుఱ్ఱములు - **'ప్రతిహారము'** |
| | ఏతా రేవత్యః పశుషు ప్రోతాః। | పురుషుడు (మానవుడు) - **'నిధనము'** |
| | | ఈ విధమైన ఉపాసన ఆత్మోపాసనకు దారితీస్తూ ఉన్నది. |

**(గమనిక 2-6 ఖండములో కూడా చెప్పబడిన పశు ఉపాసన)**

| | | |
|---|---|---|
| 2. | స య ఏవం ఏతా | అట్టి రేవతీ సామగానముచే 'పశువు' (మేకలు - గొఱ్ఱెలు - గోవులు - గుఱ్ఱములు, పురుషుడు) లను ఉపాసించు అభ్యాసి, |
| | రేవత్యః పశుషు ప్రోతా | - పశు సంపదా సమృద్ధి పొందగలడు. |
| | వేద - పశుమాన్ భవతి। | - ఆయుష్షు పావనము కాగలదు. |
| | సర్వం ఆయుః ఏతి। | - జ్యోతిస్వరూప జీవనము (స్వయంజ్యోతి, అఖండజ్యోతి రూపము) స్వానుభవముగా పొందగలడు. |
| | జ్యోక్ జీవతి। మహాన్ ప్రజయా | - ప్రజ - పశు సంపదలు పొందగలడు. |
| | పశుభిః భవతి। | - గొప్ప కీర్తి పొందగలడు. |
| | మహాన్ కీర్త్యా। | - పశువులను నిందించరాదు. |
| | పశూన్ న నిందేత్ తత్ వ్రతమ్।। | ఇదంతా వ్రతమై ఉండును గాక। |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ద్వితీయాధ్యాయే అష్టాదశః ఖండః

## 2-19. ఏకోనవింశః ఖండః - యజ్ఞ యజ్ఞీయ అంగ సామగానోపాసన

| | | |
|---|---|---|
| 1. | లోమ "హింకారః"। | లోమము (రోమము) - **'హిం'కారము** |
| | త్వక్ ప్రస్తావో। | త్వక్ (చర్మము) - **ప్రస్తావము** |
| | మాగ్ంసమ్ ఉద్గీథః। | మాంసము - **ఉద్గీథము** |
| | అస్థి "ప్రతిహారో"। | బొమికలు (అస్థి) - **ప్రతిహారము** |
| | మజ్జా "నిధనం"। | మజ్జ (ఎముకలలోని పొడి పదార్థము) - **నిధనము** |
| | ఏతత్ యజ్ఞా యజ్ఞీయమ్ | శరీరావయవ సంబంధితమైన ఈ **"యజ్ఞా-యజ్ఞీయ సామోపాసన"** |
| | అంగేషు ప్రోతమ్। | ఎరిగియున్నవారు - ఉత్తమ అంగములు కలిగి ఉండగలరు. |
| 2. | స య ఏవం ఏతత్ యజ్ఞా యజ్ఞీయం అంగేషు ప్రోతం వేదాంగీ భవతి। | అట్టి యజ్ఞ యజ్ఞీయ అంగదృష్టి కలిగియున్నవాడు (అంగ యజ్ఞోపాసకుడు) వేదములు (తెలియబడే సమస్తము) తన అవయవములుగా భావన సిద్ధించుకొని "వేదాంగి" - కాగలడు. |
| | న అంగేన విహూర్ఛతి। | - ఆతడు అంగములచే బాధించబడడు. |
| | సర్వం ఆయుః ఏతి। జ్యోక్ జీవతి। | - ఉత్తమ ఆయుష్షు పొందగలడు. |
| | మహాన్ ప్రజయా పశుభిః భవతి। | - జ్యోతివలె స్వయం ప్రకాశకుడై వెలుగొందగలడు. |
| | మహాన్ కీర్త్యా। | - ఉత్తమ కీర్తిమంతుడు కాగలడు. |
| | సంవత్సరం మజ్ఞో (మనోజ్ఞో) న అశ్నీయాత్। తత్ వ్రతమ్।। మన్జ్ఞో న అశ్నీయాత్ ఇతి వా।। | - సంవత్సరమంతా (ఎల్లకాలము) స్వీకరించకూడనివి ఎరిగి స్వీకరించక ఉండాలి. శాస్త్ర - గురు - ఆర్య వాక్యానుసారం శుభప్రదమైనవి, జ్ఞానప్రదమైనవి మాత్రమే స్వీకరించాలి. ఇది 'వ్రతము'గా అనువర్తించబడు గాక। |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ద్వితీయాధ్యాయే ఏకోనవింశః ఖండః

## 2-20. వింశః ఖండః – దేవతా రాజన సామగానోపాసన

| | | |
|---|---|---|
| 1. | అగ్నిః "హింకారో"<br>వాయుః "ప్రస్తావ"।<br>ఆదిత్య ఉద్గీథో।<br>నక్షత్రాణి "ప్రతిహారః"<br>చంద్రమా "నిధనం"<br>ఏతత్ రాజనం దేవతాసు ప్రోతమ్। | అగ్ని - **'హిం' కారము।**<br>వాయువు - **"ప్రస్తావము"।**<br>ఆదిత్యుడు - **"ఉద్గీథము"।**<br>నక్షత్రములు - **"ప్రతిహారము"।**<br>చంద్రుడు - **"నిధనము"**<br>ఇది **"దేవతా రాజన సామ గానము"**గా చెప్పబడుతోంది. |
| 2. | స య ఏవం ఏతత్<br>రాజనం దేవతాసు ప్రోతం వేద,<br>ఏతా సామా ఏవ దైవతానాగ్ం<br>సలోకతాగ్ం సార్ష్టితాగ్ం<br>సాయుజ్యం గచ్ఛతి।<br>సర్వం ఆయుః ఏతి। జ్యోగ్జీవతి।<br>మహాన్ ప్రజయా పశుభిః భవతి।<br>మహాన్ కీర్త్యా బ్రాహ్మణాన్ న నిందేత్।<br>తత్ వ్రతమ్॥ | అట్టి **"రాజనం దేవతాసు సామగానోపాసనం"** ఎరిగినవాడు దేవతా తత్త్వమును ఎరిగినవాడై లోకపరిధులను దాటి వేయగలడు. 'సాయుజ్యము' సిద్ధించుకోగలడు.<br>- ఆయుష్షు సద్వినియోగపడగలదు.<br>- స్వయంజ్యోతి స్వరూపుడు కాగలడు.<br>- మహాన్ ప్రజ - పశు సంపద పొందగలడు.<br>- మహాన్ కీర్తిమంతుడగుచున్నాడు.<br>బ్రహ్మతత్త్వజ్ఞులగు (బ్రాహ్మణముల అంతర్గానము ఎరిగిన) బ్రాహ్మణులను నిందించరాదు. ఇది వ్రతము। |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ద్వితీయాధ్యాయే వింశః ఖండః

## 20-21. ఏకవింశః ఖండః – సర్వస్మిన్ సామగానోపాసన

| | | |
|---|---|---|
| 1. | త్రయీ విద్యా "హింకారః"।<br>త్రయ ఇమే లోకాః "ప్రస్తావో"<br>అగ్నిః వాయుః ఆదిత్యః స "ఉద్గీథో"<br>నక్షత్రాణి వయాగ్ంసి మరీచయః, స "ప్రతిహారః"।<br>సర్పా గన్ధర్వాః పితరః తత్ "నిధనం"।<br>ఏతత్ సామ సర్వస్మిన్ ప్రోతమ్॥ | త్రయీ విద్యా(ఋుక్-యజుః-సామ వేదములు) - **'హిం' కారము**<br>భూర్-భువర్-సువర్ త్రైలోకములు - **"ప్రస్తావము"**<br>అగ్ని-వాయు-ఆదిత్య త్రయీ దేవతలు - **"ఉద్గీథము"**<br>నక్షత్రములు, పక్షులు, సూర్యకిరణములు - **"ప్రతిహారము"**<br>సర్పములు, గంధర్వులు, పితృదేవతలు - **"నిధనము"**<br>ఇదంతా ''సామ సర్వస్మిన్'' లేక ''సర్వస్మిన్ సామోపాసన'' - అనబడుతోంది. |
| 2. | స య ఏవం ఏతత్ సామ సర్వస్మిన్<br>ప్రోతం వేద సర్వగ్ం హ భవతి। | అట్టి సర్వస్మిన్ సామగానోపాసన ఎరిగినవాడు వేదవిద్వాంసుడు, వేదహృదయము ఎరిగినవాడు.<br>సర్వులకు సంబంధించిన సామగానము హృదయమునందు దర్శించగలడు. |
| 3. | తత్ ఏష శ్లోకః, యాని<br>పంచధా త్రీణి త్రీణి తేభ్యో।<br>న జ్యాయః పరం అన్యత్ అస్తి। | దీనికి సంబంధించిన మనన రూపమంత్రము "5'' విధములుగా '3' విభాగములుగా (5×3=15) ఏర్పడి ఉపాసించబడుచున్నాయి.<br>అట్టి '15' అక్షరముల సామగానము (సర్వస్మిన్ వేద సామగానము) మించిన ఉపాసన మరొకటి లేదు. |
| 4. | యః తత్ వేద స వేద సర్వగ్ం।<br>సర్వా దిశో బలిం అస్మై హరంతి।<br>"సర్వం అస్మి" – ఇతి ఉపాసీత।<br>తత్ వ్రతం తత్ వ్రతమ్॥ | ఈ స్వర్వస్మిన్ సామవేదగానము తెలిసినవారు సర్వము ఎరిగిన వారగుచున్నారు. వారికి సర్వదిక్కులు తమ బలమును ప్రసాదిస్తూ ఉండగా, వారు ఆత్మబలము పునికిపుచ్చుకోగలరు.<br>"ఈ సమస్తము నేనై ఉన్న నేను''ను ఉపాసించెదరు గాక।<br>ఇది వ్రతమగు గాక। ఇదియే వ్రతమగు గాక। |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ద్వితీయాధ్యాయే ఏకవింశః ఖండః

## 2-22. ద్వావింశః ఖండః - వినర్ది సామోపాసన

| | | |
|---|---|---|
| **1.** | **వినర్ది సామ్నో వృణే పశవ్యమ్ ఇతి।<br>అగ్నేః ఉద్గీథో। అనిరుక్తః ప్రజాపతేః।<br>నిరుక్తః సోమస్య మృదు శ్లక్ష్ణం వాయోః।<br>శ్లక్ష్ణం బలవత్ ఇంద్రస్య।<br>క్రౌన్చం బృహస్పతేః అపధ్వాంతం వరుణస్య।<br>తాన్ సర్వాన్ ఏవ ఉపసేవేత<br>వారుణం తు ఏవ వర్జయేత్॥** | పైన చెప్పుకుంటూ ఉన్నట్టి "సామగానము"చే సర్వత్రా విస్తారమగు ఆత్మ అనుభవమవగలదు. వినర్ది (ఎద్దుతో పోలిన) గానము పశువులకు హితకరము.<br>అగ్ని - ఉద్గీథముగా<br>ప్రజాపతి - అనిరుక్తముగా<br>చంద్రుడు - నిరుక్తముగా<br>వాయువు - మృదువుగా, ప్రియముగా, పిల్లవాయు తరంగాలుగా<br>ఇంద్రుడు - ప్రియము, బలములతో కూడి<br>బృహస్పతి - క్రౌంచముగా (కొండగా)<br>వరుణుడు - అపధ్వాంతముగా (తిరస్కరించవలసినవి తిరస్కరించుటకు శక్తిగా) సామగానములన్నిటినీ ఉపసేవించాలి. సాధన చేయాలి.<br>వారుణము అనబడు అపధ్వాంతము (దూషణలను) విసర్జించాలి. |
| **2.** | **అమృతత్వం దేవేభ్య<br>ఆగాయని ఇతి ఆగాయేత్।<br>స్వధాం పితృభ్య।<br>ఆశాం మనుష్యేభ్యః।<br>తృణ ఉదకం పశుభ్యః।** | ఈ "అగ్ని, ప్రజాపతి, చంద్ర, ఇంద్ర, బృహస్పతి, కరుణ'' - సామగానోపాసనచే ఓ ఆయా దేవతలారా! మాకు అమృతత్వము ప్రసాదించండి!'' - అని సామగానము చేయుదురు గాక!<br>ఓ దేవతలారా! నన్ను అమృతత్వమునకు జేర్చండి. మా పితృదేవతలకు తృప్తిగా స్వధామ - భోజనము అందించండి. మా పశువులకు గడ్డి, నీరు లభించును గాక। |
| | **స్వర్గం లోకం యజమానాయ।** | యజమానికి స్వర్గలోకం లభించును గాక। |
| | **అన్నమ్ ఆత్మన ఆగాయానీ ఇతి।** | నాకు అన్నము (బ్రహ్మము। బ్రాహ్మీస్థితి) ప్రసాదించండి. |
| | **ఏతాని మనసా ధ్యాయన్<br>అప్రమత్తః స్తువీత॥** | ఈ విధంగా మనస్సును నియామకం చేసి అప్రమత్తతతో సామస్తుతి సమర్పిస్తూ ధ్యానించెదరు గాక। |
| **3.** | **సర్వే స్వరా ఇంద్రస్య ఆత్మనః।** | సమస్త స్వరములు ఇంద్రభగవానుని రూపములే। |
| | **సర్వ ఊష్మాణః ప్రజాపతేః ఆత్మానః।** | ఊష్మములు (ఉష్ణములు, ఉత్తేజములు) అన్నీ కూడా ప్రజాపతి రూపములే। |
| | **సర్వే స్పర్శా మృత్యోః ఆత్మానస్తం** | స్పర్శలన్నీ కూడా 'మృత్యువు' యొక్క రూపములే। |
| | **యది స్వరేషు ఉపాలభేత్<br>ఇన్ద్రగ్ం శరణం ప్రపన్నో** | స్వరములో ఏవైనా దోషములు ఉంటే - "స్వామీ! ఇంద్రదేవా! మిమ్ములను శరణువేడి ఈ స్వరము పలుకుచున్నాను'' - అని నమస్కరించుదురు గాక। |
| | **అభూవం స త్వా ప్రతివక్ష్యతి** | "ఇంద్రదేవా! మీరు సమాధానము ప్రసాదించెదరు గాక। దోషములు తొలగించి నన్ను ఉద్ధరించండి'' అని ప్రార్థన చేసి స్వరం పలికెదరు గాక। |
| | **ఇతి ఏనం బ్రూయాత్।** | దోషములు చూపువారితో "అయ్యా! క్షమించండి! ఇంద్రదేవుడు సరిచేయుటకై ప్రార్థిస్తున్నాను''-అని వినమ్రులై పలికెదరు గాక। ఇంద్రుని ఆ రీతిగా వేడెదరు గాక। |

**4.** **అథ యది ఏనం ఊష్మసు ఉపాలభేత**
**ప్రజాపతిగ్ం శరణం,**
**ప్రపన్నో అభూవం,**
**స త్వా ప్రతిపేక్ష్యతి –**
**ఇతి ఏనం బ్రూయాత్।**

(ఊష్మములు = గాలిని ఊదుచూ పలుకు వర్ణములు. "శ-ష-స-హ" అను వర్ణములు. జిహ్వామూలీయము 'క' కార 'ఖ' కారములకు ముందు వచ్చే విసర్గలు. అనుస్వారము)

గాలిని ఊదుతూ పలికే శ-ష-స-హ వర్ణములు, 'క'కార-'గ'కార విసర్గలు, అనుస్వారములు - మొదలైన ఊష్మములలో దోషము ఎవరైనా చూపుతూ ఉంటే, "నేను ప్రజాపతిని ఈ విషయంలో శరణు వేడుచున్నాను. క్షమించబడుదును గాక।" - అని నమస్కరిస్తూ ప్రజాపతిని వేడెదరు గాక।

**అథ యది ఏనగ్ం**
**స్పర్శేషు ఉపాలభేత**
**మృత్యుగ్ం శరణం**
**ప్రపన్నో అభూవం**
**స త్వా ప్రతిధక్ష్యతి**
**ఇతి ఏనం బ్రూయాత్॥**

"స్పర్శ"లో ఏవైనా దోషములున్నాయేమోనని అనుకుంటే "నేను మృత్యు దేవతను శరణువేడుచున్నాను. నమస్కరించి సరిచేయమని ప్రార్థన" అని నమస్కరిస్తూ ప్రతిధ్యక్షిస్తూ (అభ్యర్థన చేస్తూ)

దోష నివృత్తికై - ప్రార్థన పలకాలి.

''మృత్యుదేవత దోషములను దహించును గాక'' - అని భావపూర్వకంగా శరణాగతుడవాలి.

---

**5.** **సర్వే స్వరా ఘోషవన్తో**
**బలవన్తో వక్తవ్యా।**
**ఇంద్రే బలం దదాని ఇతి।**

సప్త స్వరములను ("స-రి-గ-మ-ప-ద-ని") ఎలుగెత్తి బలమైన నాదముతో, సుశబ్దంగా భావన చేసి గట్టిగా, సుస్పష్టంగా పలకాలి.

"ఇంద్ర భగవానుడు మాకు శబ్ద - నాద బలము ప్రసాదించు గాక" - అని భావించి ఉచ్చరించాలి.

**సర్వ ఊష్మాణో అగ్రస్తా అనిరస్తా,**
**వివృతా వక్తవ్యాః।**

సర్వ ఊష్మాణములను (గాలిని ఊదుతూ పలికే 'శ స ష హ' వర్ణములను, అనుస్వరములను) - అగ్రములుగా (ప్రాముఖ్య భావనా సహితంగా), అనిరస్తములుగా (అనిరుక్తముగా - సుస్పష్టంగా, నిర్దుష్టంగా) వివృత్తంగా (విడివిడిగా), భావనాపూర్వకంగా పలకాలి.

**"ప్రజాపతేః ఆత్మానం పరిదదాని"**
**ఇతి సర్వే స్పర్శా లేశేనాన్**
**అభినిహితా వక్తవ్యా।**

"జగద్రచయిత అగు ప్రజాపతికి నా ఈ సర్వము సమర్పిస్తున్నాను. ఆత్మార్పణము చేయుచున్నాను'' - అని భావన చేస్తూ సర్వ శబ్దస్పర్శలను (ఒక శబ్దభావనతో మరొక శబ్దభావన కలిసిపోకుండా) పలకాలి.

**మృత్యోః ఆత్మానం పరిహరాణి। ఇతి॥**

"మృత్యువు నుండి నేను రక్షింపబడెదను గాక'' - అని అమృతస్థాన, మహాశయముతో పలకాలి. అమృతస్థానమును ఉపాసించెదరు గాక।

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ద్వితీయాధ్యాయే ద్వావింశః ఖండః

## 2-23. త్రయోవింశః ఖండః - త్రయీ విద్యా - భూః భువః సువః - "ఓం"

| | | |
|---|---|---|
| **1.** | **త్రయో ధర్మ స్కంధాః।** | మూడు ధర్మ స్కందములు (విభాగములు, సమూహములు) |
| | **యజ్ఞో, అధ్యయనం, దానం ఇతి ప్రథమః।** | (1) యజ్ఞము, (2) అధ్యయనము, (3) దానము - వీటికి ముందుగా సంసిద్ధులం కావాలి. ఇది మొదటిది. |
| | **తప ఏవ। ద్వితీయః।** | "తపస్సు" రెండవది. |
| | **బ్రహ్మచారీ  ఆచార్య కులవాసీ తృతీయో।** | బ్రహ్మచర్యము ఆర్యకుల వాసము (గురుకుల వాసము) మూడవది. |
| | **అత్యన్తం ఆచార్యకులే అవసాదయః।**<br>**సర్వ ఏతే పుణ్యలోకా భవన్తి।** | అన్నిటికీ శ్రేష్ఠము ఆచార్యకుల అవసాదయము (సేవనము). అట్టి గురుసేవచే పుణ్యలోకములు లభించగలవు. |
| | **బ్రహ్మసగ్ంస్థో, అమృతత్వం ఏతి।** | అట్టి తపో బ్రహ్మచర్య గురుకుల వాసములచే బ్రహ్మమునందు బుద్ధి నిశ్చలమైనదై (సంస్థితమై) అమృతత్వము లభించగలదు. |
| **2.** | **ప్రజాపతిః లోకాన్ అభ్యతపత్**<br>**తేభ్యో అభితప్తేభ్యః త్రయీ విద్యా**<br>**సంప్రాస్రవత్ తాం అభ్యతపత్।** | ప్రజాపతి లోకములను తపస్సు - సంకల్పము నుండి సృష్టిస్తూ త్రయీ విద్యలను (తపస్సు, బ్రహ్మచర్యము, గురుకుల సేవలను) అభితప్యేభ్యముగా (ఆచరణ మార్గములుగా) కల్పించారు. |
| | **తస్యా అభితప్తాయా ఏతాని అక్షరాణి**<br>**సంప్రాస్రవన్త  "భూర్భువః స్వః" ఇతి।।** | త్రయీ విద్యనుండి త్రయీ (ఋక్ - యజుర్ - సామ)వేదములను, (అ+ఉ+మ) త్రయీ అక్షరములను, భూర్ (Matter) - భువర్ (Thought and Feelings) - స్వర్ (దివ్య) వ్యాహృతులు అను త్రైలోకములను కల్పించారు. |
| **3.** | **తాని అభ్యతపత్** | వాటి "అభితపము" నుండి 'ఓం' కారము జనిస్తోంది. |
| | **తేభ్యో అభితప్తేభ్య**<br>**'ఓం'కారః సంప్రాస్రవత్।।** | అట్టి 'ఓం'కారము నుండి సమస్త జగత్తు బయల్వెడల సాగుతోంది. |
| | **తత్ యథా శంకునా సర్వాణి**<br>**పర్ణాని సన్తృణ్ణాని।** | సర్వపర్ణములు (ఆకులవలె) మనో బుద్ధి చిత్త అహంకారములన్నీ జీవకణములుగా బయల్వెడలుచున్నాయి. |
| | **ఏవం 'ఓం'కారేణ సర్వా వాక్ సన్తృణ్ణా।** | 'ఓం'కారము నుండే సమస్త 'వాక్' బయల్వెడలుచున్నది. |
| | **'ఓం'కార ఏవ ఇదగ్ం సర్వమ్।** | కనుక ఈ సమస్తము 'ఓం' కారమే। |
| | **'ఓం'కార ఏవ ఇదగ్ం సర్వమ్।।** | ఓంకారమే ఈ సమస్తము। |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ద్వితీయాధ్యాయే త్రయోవింశతి ఖండః

## 2-24. చతుర్వింశః ఖండః - సవనము (యజ్ఞము)

అగ్ని = అష్టదిక్పాలకులలో ఒకరు. పూర్వ దక్షిణ దిక్ దేవత (ఆగ్నేయము) - భార్య = స్వాహాదేవి, పట్టణము = తేజోవతి, వాహనము = మేషము, ఆయుధము = శక్తి. అష్ట వస్తువులకు రాజు కూడా!

| | | బ్రహ్మతత్త్వజ్ఞుల ప్రవచనము: |
|---|---|---|
| **1.** | **బ్రహ్మవాదినో వదన్తి<br>యత్ వసూనాం ప్రాతః సవనగ్ం।<br>రుద్రాణాం మాధ్యన్ దినగ్ం సవనం।<br>ఆదిత్యానాం చ విశ్వేషాం చ<br>దేవానాం తృతీయ సవనమ్।** | ప్రాతః (ఉదయ) సవనము ఉపాసన → (అష్ట) వసువుల నిమిత్తము<br>మధ్యాహ్న సవనము - (ఏకాదశ) రుద్రుల నిమిత్తము<br>సాయం సవనము - (ద్వాదశ) ఆదిత్యుల నిమిత్తము, విశ్వేదేవుల నిమిత్తము నిర్వర్తించాలి. |
| **2.** | **క్వ తర్హి యజమానస్య లోక ఇతి<br>స యః తమ్ న విద్యాత్<br>కథం కుర్యాత్? అథ విద్వాన్ కుర్యాత్।** | యజమాని (యజ్ఞకర్త) ఉన్న లోకము ఏది? ఆయనచే అన్ని లోకములు స్వాధీనపరచుకోబడుచున్నాయి.<br>ఈ విధంగా ప్రాతః మధ్యాహ్న సాయం వసు - ఆదిత్య - రుద్ర - యజమాన లోక యజ్ఞవిధులు తెలియకుండా కర్త యజ్ఞము ఎట్లా చేయగలరు? చేయలేరు. అందుచేత యజ్ఞతత్త్వము లక్ష్యము యజ్ఞకర్త, యజ్ఞాభిమానులు, యజ్ఞము చేయించే వారు, యజ్ఞములో పాల్గొనువారు కూడా త్రైసవనములను తెలుసుకొనెదరు గాక। వసు - ఆదిత్య - రుద్ర - విశ్వేదేవ తత్త్వములను ఎరిగి ఉండెదరు గాక। |
| **3.** | **పురాప్రాతః అనువాకస్య ఉపాకరణాత్<br>జఘనేన గార్హపత్యస్య ఉదఙ్ముఖ<br>ఉపవిశ్య స వాసవగ్ం సామ అభిగాయతి।** | ఉదయ అనువాకము (సవనము / ఉపాకరణము) ప్రారంభిస్తున్నప్పుడు యజ్ఞకర్త - 'గార్హపత్యాగ్ని'కి ఉత్తరదిక్కుగా ఆసీనుడై "సవాస-సం సామగానము" గానము చేస్తూ యజ్ఞ యాగ హోమ కార్యక్రమము ప్రారంభిస్తున్నాడు. |
| **4.** | **లో౩క ద్వారమ్ అపావా౩ర్ణూ ౩౩ పశ్యేమ<br>త్వా వయగ్ం రా ౩౩౩౩౩<br>హు౩మ్ ఆ ౩౩ జ్యా ౩ యో౩<br>ఆ ౩ ౨౨౨౨- ఇతి** | "ఓ అగ్నిదేవా। నా విజ్ఞాపన వినండి. మా కొరకై ఊర్ధ్వలోకముల ద్వారములను తెరువండి। ఊర్ధ్వలోకములలో మాకు జ్ఞానదర్శనము ప్రసాదించండి।<br>ఆ తరువాత ఆహుతులను (1) (5) సార్లు అగ్నికి సమర్పిస్తూ ఉన్నాను"<br>- అని యజమాని స్వరబద్ధంగా గానము చేయుచున్నాడు. |
| **5.** | **అథ జుహోతి నమో అగ్నయే। పృథివీ క్షితే।<br>లోక క్షితే లోకం మే యజమానాయ<br>వింద ఏష వై యజమానస్య లోక ఏతాఽస్మి।** | "విశ్వమంతా వ్యాపించియున్న ఓ అగ్నిదేవా! నమోనమః । ఈ అగ్ని కార్యమునకు యజమానినగు నాకు దర్శనమివ్వండి.<br>భూమిని, లోకములను దాటివేసి నన్ను ఉద్ధరించడానికి ఈ నేనున్న స్థానము చేరి మమ్ములను ఉద్ధరించండి।" అని ప్రార్థించెదరు గాక। |
| **6.** | **అత్ర యజమానః పరస్తాత్ ఆయుషః స్వాహా।<br>అపజహి పరిఘం ఇతి।<br>ఉక్త్వా ఉత్తిష్ఠతి।<br>తస్మై వసవః ప్రాతః సవనగ్ం సంప్రయచ్ఛన్తి।** | "యాగకర్త యొక్క పరతత్త్వాయుష్షు కొరకై ఈ ఆహుతి (నేయి) సమర్పిస్తున్నాను। స్వాహా!"<br>"ఆయుర్దాయము పూర్తి అయిన తరువాత ఉత్తరగతుల కొరకు "స్వాహా" అని హోమము చేయుటకై సంసిద్ధుడను! పరిఘము (గడియ)ను తీసివేయుము" అని పలుకుచున్నారు.<br>అప్పుడు "అగ్నిదేవా! ఈ స్థానముకు రండి!" అని చెప్పుచూ యజమాని నిదుర లేస్తున్నారు.<br>ఆ ప్రాతః సవనము స్వీకరించి వసువులు యజమానికి వరప్రసాదులు అగుచున్నారు. |

| | | |
|---|---|---|
| **7.** | **పురా మాధ్యన్ దినస్య సవనస్య ఉపకరణాత్,<br>జఘనేన అగ్నీధ్రస్య ఉదన్ముఖ ఉపవిశ్య<br>స రౌద్రగ్ం సామ అభిగాయతి।** | మధ్యాహ్న సవనము (యజ్ఞము) ప్రారంభించటానికి ముందుగా యజమాని దక్షిణాగ్నికి వెనుకవైపు ఆసీనుడై, ఉత్తరదిక్కుగా చూస్తూ, ఏకాదశ రుద్రుల గురించి స్వాగత - ఆహ్వానాలు పలుకుచున్నారు. సామగాన పూర్వకంగా పలికెదరు గాక। |
| **8.** | **లో౩ క ద్వారం అపావా ౩ ర్ణూ ౩౩ పశ్యేమ?<br>త్వా వయం వైరా ౩-౩-౩-౩-౩ హు ౩ మ్<br>ఆ ౩-౩ జ్యా ౩ యో ౩ ఆ ౩ ౨౨౨౨- ఇతి॥** | "ఓ అగ్నిదేవా! ఊర్ధ్వలోకముల ద్వారములు మా కొరకై తెరిపించండి। '3' '3' '3' సార్లు మంత్రములు, హవిస్సు సమర్పిస్తున్నాము. స్వామీ! మేము విరాట్ పదము కొరకై సమర్పిస్తున్నాము. మిమ్ములను ఆకాశంలో సందర్శించెదము గాక।".<br>హుం। హుం। హుం।<br>జ్యా। జ్యా। జ్యా। యో। యో। యో।<br>ఆ ఆ ఆ ఆ<br>అంటూ మంత్రములు గానము చేస్తూ హవిస్సులను ఆహుతి (సమర్పణ) చేయాలి. |
| **9.** | **అథ జుహోతి నమో వాయవే<br>అంతరిక్షక్షితే లోకక్షితే।<br>లోకం మే యజమానాయ<br>వింద ఏష వై యజమానస్య లోక ఏతాస్మి।** | అంతరిక్షమున సంచరిస్తూ లోకరక్షణ చేస్తూ ఉన్న ఓ వాయుదేవా!<br>ఈ యజ్ఞమునకు యజమానినైయున్న నేను ఈ స్థానమునకు (ఇచ్చటకు) విచ్చేయుటకై ఆహ్వానము పలుకుచున్నాను సుస్వాగతం। |
| **10.** | **అత్ర యజమానః పరస్తాత్ ఆయుషః స్వాహా** | "యజమాని పరతత్త్వ ఆయుష్షు అనుగ్రహించటానికై - హవిస్సును ఆహుతిగా సమర్పిస్తున్నాము. స్వాహా!" |
| | **అపజహి పరిఘం<br>ఇతి ఉక్త్వా ఉత్తిష్ఠతి।** | ఈ బెత్తపు దెబ్బతో యజమానిని (యజ్ఞకర్తను) 'ఉత్తిష్ఠ' అని విప్రులు లేపుచున్నారు.<br>(బెత్తపు దెబ్బ = ఉత్తేజితుని, సంసిద్ధుని చేయటము) |
| | **తస్మై రుద్రా మాధ్యన్<br>దినగ్ం సవనగ్ం సంప్రయచ్ఛంతి॥** | ఈ విధంగా మధ్యాహ్న సవనము స్వీకరించు రుద్రులు మధ్యాహ్న వరప్రసాదులై ఆశీర్వాదములు అందజేయుచున్నారు. |
| **11.** | **పురా తృతీయ సవనస్య<br>ఉపకరణాత్ జఘనేన ఆహవనీయస్య<br>ఉదన్ముఖ ఉపవిశ్య స ఆదిత్యగ్ం<br>స వైశ్వదేవగ్ం సామ అభిగాయతి।** | మూడవ సవనము (సాయంత్ర సవనము)నకు ముందుగా ఆహవనీయాగ్నికి ప్రక్కగా - ఉత్తరంగా ఉపవిశ్యము (Placed) అయినవాడై, ఆదిత్యుని గురించి (ఆదిస్వరూపము గురించి), విశ్వదేవతల గురించి - యజ్ఞకర్త సామగాన స్తోత్రము గానము చేయుచుండెదరు గాక. |
| **12.** | **లో౩ క ద్వారం అపావా౩ ర్ణూ ౩-౩ పశ్యేమ,<br>త్వా వయగ్ం స్వారా ౩-౩-౩-౩-౩ హు ౩ మ్<br>ఆ ౩-౩ జ్యా ౩ యో ౩ ఆ ౩౨౨౨౨ - ఇతి।** | "ఓ ఆదిత్యా! ఈ లోకములో మేము చిక్కుకొని ఉన్నాము. ఈ లోకముయొక్క ముఖద్వారము తెరవండి। మేము 'స్వారాజ్యము' కొరకై మిమ్ములను దర్శించగలము.<br>"ఓ అగ్నిదేవా! స్వర్గతలముయొక్క ద్వారమును మాపై కరుణకలవారై, మా కొరకు దారిచూపండి. దివ్యలోకములు పొందుట కొరకై మేము మిమ్ములను శరణువేడుచున్నాము. మీ దర్శనభాగ్యము ప్రసాదించండి".<br>ఇది ఆదిత్యుల గురించిన సామగానము। |

| | | |
|---|---|---|
| **13.** | **ఆదిత్యమ్ అథ వైశ్వ దేవం లో౩క ద్వారం అపావా ౩ర్ణూ ౩౩ పశ్యేమ।** | "ఓ అగ్నిదేవా! స్వర్గభూములు మేము చేరటానికి ముఖద్వారము మీరు తెరిపించండి. మమ్ములను దేవతాలోకము చేరుటకై సహకరించవలసినదిగా అభ్యర్థిస్తున్నాము'' - అని యజమాని అగ్నిదేవునికి సాయంకాల సవనమును నుతులతో ప్రారంభం చేస్తున్నారు. |
| | **త్వా వయగ్ం సా(మ్రా౩-౩-౩-౩-౩ హు ౩ మ్ ఆ ౩-౩ జ్యా ౩ యో ఆ ౩౨౨౨౨ - ఇతి।** | "ఓ అగ్నిదేవా! మేము సమర్పిస్తున్న హోమద్రవ్యములను ఆహుతులుగా స్వీకరించి మమ్ము స్వర్గధామము జేర్చండి'' - అని యజమాని అగ్నిదేవుని వేడుకొంటున్నారు. |
| | | ఓ విశ్వదేవతలారా! లోకము యొక్క ద్వారం తెరవండి. ఆత్మ సామ్రాజ్యము కొరకై మీ దర్శనం ఇవ్వండి। |
| **14.** | **అథ జుహోతి నమ ఆదిత్యేభ్యశ్చ। విశ్వేభ్యశ్చ। దేవేభ్యో దివిక్షిద్భ్యో లోకక్షిద్భ్యః। లోకం మే యజమానాయ విందత।** | ఇప్పుడు ఆదిత్యునికి ఆహుతులు యజమానిచే సమర్పించబడుచున్నాయి. |
| | | విశ్వదేవునికి (The Worker of the Universe) - దేవతా లోకములోని దేవతలకు, లోకపాలకులకు హవిస్సులు సమర్పిస్తున్నాను. |
| | | యజమానినగు నేను ఈ ఆహుతులు సమర్పిస్తున్నాను. స్వీకరించి యజమానినగు నాకు సంతోషము కలుగజేసెదరు గాక। |
| **15.** | **ఏష వై యజమానస్య లోక ఏతా అస్మి అత్ర యజమానః పరస్తాత్ ఆయుషః స్వాహా।** | హే ఆదిత్య భగవాన్। యజమానినగు నేను ఈ ఆహుతులు హవ్యవాహనుని ద్వారా సమర్పిస్తున్నాను. నాకు పరతత్త్వజ్ఞానముతో నిర్మితమగు ఆయుష్షును ప్రసాదించెదరు గాక। స్వాహా। |
| | **అపహత పరిఘం ఇతి ఉక్త్వా "ఉత్తిష్ఠ" ఇతి।** | బెత్తపు దెబ్బచే యజమాని ఉత్థిష్ఠితుడు (Awakened) అగుచున్నాడు. |
| **16.** | **తస్మా ఆదిత్యాశ్చ విశ్వే చ దేవాః తృతీయ సవనగ్ం, సంప్రయచ్ఛన్తి ఏష వై యజ్ఞస్య మాత్రాం వేద, య ఏవం వేద। య ఏవం వేద॥** | అప్పుడు యజమాని ఈ విధంగా ఉత్థిష్ఠితుడు (నిదురలేచినవాడు) అగుచూ ఇట్లు అంటున్నాడు.<br>- ఇదియే ఆదిత్య ముఖద్వారము.<br>- ఇదే విశ్వేశ్వరుని సమక్షము<br>- ఇదే దేవతలను జ్ఞాపకము చేసుకొను తృతీయ సవనము।<br>ఈ విధంగా అట్టి యజ్ఞపురుషుని స్థానము పొందగలము.<br>ఆయనను తెలుసుకొని పునీతులము అగుచున్నాము. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - ద్వితీయాధ్యాయే చతుర్వింశః ఖండః

**ఇతి - ఛాందోగ్యోపనిషది - ద్వితీయో అధ్యాయః సమాప్తః॥**

# తృతీయ ప్రపాఠకః

## (మధు విద్యా ఉపాసన : 3-1 నుండి 3-11 వరకు)

## 3-1. ప్రథమః ఖండః - సూర్యుని తూర్పు కిరణముల ఉపాసన

(మధు = తేనె; తిరశ్చీనవగ్ం = తేనెపట్టు ఉన్న బొంగు; మరీచి = కిరణములు; మధునాడ్యః = తేనె తాగినవాడు)

| | | |
|---|---|---|
| 1. | **ఓం।** | 'ఓం'! |
| | **అసౌ వా ఆదిత్యో దేవ మధు।** | ఆకాశంలో ప్రకాశించు ఆదిత్యుడే (ఆది = The beginning Point of everything) దేవతలకు మధు (తేనె) |
| | **తస్య ద్యౌః ఏవ తిరశ్చీనవగ్ంశో** | ద్యులోకమే (అమృత లోకము) తేనె పట్టు ఉన్న బొంగు వంటిది. |
| | **అన్తరిక్షం అపూపో మరీచయః పుత్రాః।** | అట్టి ద్యులోకమునకు స్థానము అరూపమగు అంతరిక్షము. అట్టి అంతరిక్షము - తేనెపట్టు. ఆదిత్యుని (లేక) సూర్యుని కిరణములు ఆదిత్యుని పుత్రులు- **"తేనెటీగలు"**. |
| 2. | **తస్య యే ప్రాంచో రశ్మయస్తా ఏవ అస్య ప్రాచ్యో మధునాడ్యః।** | అట్టి (తూర్పు నుండి) ఆదిత్యుని (సూర్యుని) నుండి ప్రసరిస్తున్న కిరణములే మధునాడ్యములు - తూర్పు మధు నాడ్యములు. |
| | **ఋచ ఏవ మధుకృత।** | ఋగ్వేదములో ఋక్కులు - మధుకృతములు (తేనెటీగలు) |
| | **ఋగ్వేద ఏవ పుష్పమ్।।** | ఋగ్వేదము - "పుష్పము" |
| | **తా అమృతా ఆపః।** | అందలి జలమే (తేనెయే) - "అమృతము" |
| | **తా వా ఏతా ఋచః।** | అట్టి తత్త్వజ్ఞుల పరమాత్మ గురించిన ప్రవచన గానములే ఋగ్వేదము. |
| 3. | **ఏతమ్ ఋగ్వేదం అభ్యతపన్,** | పరమాత్మ స్వరూప స్వభావములను అభివర్ణించు తత్త్వము సదా ఉపాసించబడు గాక। భావించబడు గాక। |
| | **తస్య అభితప్తస్య యశః తేజ ఇన్ద్రియం వీర్యం అన్నాద్యగ్ం రసో అజాయత।** | ఈ విధంగా - "సూర్యుడే దేవతలకు మధువుగాను, మధువు (అమృత తత్త్వముతో) స్వర్గము జేర్చునని, ఆకాశమే మధువుకు ఆధారమని, సూర్యకిరణములే మధుపుత్రులని, ఋక్కులు మధుపములని (పంచామృత విశేషములని), ఋగ్వేదమే యజ్ఞపుష్పమని, అందలి ఆత్మతత్త్వ స్తుతులే అమృతమని, ఆత్మతత్త్వము గానము చేయు ఋషులే తేనెటీగలనీ-ఎరిగి భజించువాడు - యశస్సు, తేజస్సుతో కూడిన ఇంద్రియములు, వీర్యము, అన్నాద (బ్రాహ్మీ) రసము పొందగలడు. |
| 4. | **తత్ వ్యక్షరత్ తత్ ఆదిత్యమ్ అభితో అశ్రయత్।** | అట్టివాడు స్వాభావికంగా ఇక్కడే, ఇప్పుడే ఆదిత్య లోకము ఆశ్రయించిన వాడై, సిద్ధించుకోగలడు. దాటివేయగలడు కూడా। |
| | **తద్వా ఏతత్ యత్ ఏతత్ ఆదిత్యస్య రోహితగ్ం రూపమ్।।** | ఆదిత్యుని ఎఱ్ఱని రూపము ఉపాసిస్తూ ఆదిత్య భగవానుని ఆత్మస్వరూపునిగా గ్రహించినవాడై, క్రమంగా తానే అఖండాత్మానంద స్వరూపుడై విరాజిల్లగలడు. |

**ఇతి ఛాందోగ్యోపనిషత్ - తృతీయాధ్యాయే ప్రథమః ఖండః**

## 3-2. ద్వితీయః ఖండః - సూర్యుని దక్షిణ కిరణముల ఉపాసన

| | | |
|---|---|---|
| 1. | అథ యే అస్య దక్షిణా రశ్మయస్తా<br>ఏవ అస్య దక్షిణా మధునాడ్యో।<br>యజూగ్ంషి ఇవ మధుకృతో।<br>యజుర్వేద ఏవ పుష్పం।<br>తా అమృతా ఆపః॥ | సూర్యునికి దక్షిణముగా ఏ కిరణములు ఉన్నాయో, అవియే దక్షిణమువైపుగల **"మధునాడులు"**.<br>యజుర్వేదములోని మంత్రములు - తేనెటీగలు (మధుకృతములు, తుమ్మెదలు)<br>యజుర్వేదమే పుష్పము (తేనెటీగలు తేనె తెచ్చు స్థానములు)<br>తేనెయే అమృతము<br>(మార్పు చేర్పులు లేనట్టి - మధురమగు కేవల స్వస్వరూపము) |
| 2. | తాని వా ఏతాని యజూగ్ంషి<br>ఏతం యజుర్వేదం అభ్యతపన్।<br>తస్య అభితప్తస్య యశః<br>తేజ ఇన్ద్రియం వీర్యం<br>అన్నాద్యగ్ం రసో అజాయత॥ | యజుర్వేద మంత్రములు (యజస్సులు) యజుర్వేదమును - (తేనె పట్టును తేనె తీగలవలె) ఆలింగనము చేసుకొని ఉన్నాయి.<br>అట్టి యజస్సుల (మంత్రముల) యజుర్వేద ఆలింగనము వలన (ఆశ్రయము వలన) రసము రూపంగా (తేనె రూపంగా) యశస్సు, తేజస్సు, ఇంద్రియ బలము, వీర్యము, భోజనము (అన్నము) - ఇవన్నీ లభిస్తున్నాయి. |
| 3. | తత్ వ్యక్షరత్ తత్ ఆదిత్యం<br>అభితో అశ్రయత్ తద్వా ఏతత్<br>యత్ ఏతత్ ఆదిత్యస్య శుక్లగ్ం రూపమ్॥ | అట్టి యజస్సుల (మంత్రముల) తేనెతీగలు ఆశ్రయించియున్న 'తేనెపట్టు' వంటి యజుర్వేదమునుండి (ఆత్మానంద మాధుర్యము అనే) తేనె పొంగిపొరలి (జ్ఞాన) సూర్యుని చుట్టూతా ఆశ్రయించాయి.<br>అట్టి తేనె (యజస్సుల అంతరార్థము) ఆక్రమణయే ఆదిత్యుని "తెల్లటి రూపము" అయి ఉన్నది. |

**ఇతి ఛాందోగ్యోపనిషత్ - తృతీయాధ్యాయే ద్వితీయః ఖండః**

## 3-3. తృతీయః ఖండః - సూర్యుని పడమర కిరణముల ఉపాసన

| | | |
|---|---|---|
| 1. | అథ యే అస్య ప్రత్యంచో<br>రశ్మయస్తా ఏవ అస్య ప్రతీచ్యో<br>మధునాడ్యః సామాని ఏవ మధుకృతః।<br>సామవేద ఏవ పుష్పం తా అమృతా ఆపః॥ | సూర్యునియొక్క పడమరదిక్కు కిరణములే మధునాడ్యములు (తేనె తుట్టెలోని నాడ్యములు)<br>సామ గానములే (సామములే) - తేనెటీగలు (మధుకృతములు)<br>సామ వేదమే - (తేనెటీగలు తేనె తెస్తున్న) పుష్పములు<br>తేనెతుట్టెలోని తేనె రసము వలె సామవేదములోని రసమే / జలమే - "అమృతము" (జన్మ-కర్మలకు ఆవలిదగు, మార్పుచేర్పులు లేని ఆత్మరూపము). |
| 2. | తాని వా ఏతాని సామాని<br>ఏతగ్ం సామవేదం అభ్యతపన్<br>తస్య అభితప్తస్య యశః<br>తేజ ఇన్ద్రియం వీర్యం<br>అన్నాద్యగ్ం రసోఽజాయత॥ | సామములు (సామవేద గానములు) తేనెపట్టును తుమ్మెదల వలె - సామవేదమును ఆశ్రయించి, చోటు చేసుకొని ఉన్నాయి.<br>అట్టి సామముల (సామగానముల, సామమంత్రముల) సామవేద-ఆలింగనము నుండి యశస్సు, తేజస్సు, ఇంద్రియముల జ్ఞానసాధనముల ఆశ్రయము అనే బలము, (ఆత్మజ్ఞానము అనే) వీర్యము అనబడు రసము (తేనె) లభిస్తోంది. ("రసము" = తత్త్వజ్ఞానము, తత్త్వానుభవము) |
| 3. | తత్ వ్యక్షరత్, తత్ ఆదిత్యం అభితో అశ్రయత్।<br>తత్ వా ఏతత్ యత్ ఏతత్ ఆదిత్యస్య కృష్ణగ్ం రూపమ్। | అట్టి రసము (ఆత్మజ్ఞానము అనే తేనె) ఆదిత్యుని ఆశ్రయించుటచేత ఏర్పడిన నలుపుయే ఆదిత్యుని కృష్ణవర్ణము. |

**ఇతి ఛాందోగ్యోపనిషత్ - తృతీయాధ్యాయే తృతీయః ఖండః**

## 3-4. చతుర్థః ఖండః - సూర్యుని ఉత్తర కిరణముల ఉపాసన

| | | |
|---|---|---|
| **1.** | **అథ యే అస్య ఉదంచో రశ్మయస్తా ఏవ**<br>**అస్య ఉదీచ్యో మధునాడ్యో**<br>**అథర్వ అంగిరస ఏవ మధుకృత।**<br>**ఇతిహాస పురాణం పుష్పం।**<br>**తా అమృతా ఆపః।** | ఇక సూర్యుని ఉదీచ్యదిశ (ఉత్తరదిక్కు) కిరణములు.<br>- అట్టి ఉత్తరదిక్కు మధునాడ్యములు (నాడులు).<br>- అథర్వ వేద మంత్రములే ఆ "తేనెటీగలు".<br>- ఇతిహాస పురాణములు ఆత్మ మాధుర్యము కొరకు వెతకు తేనెటీగలు వ్రాలు "పుష్పములు".<br>- అందు లభించే జలమే (తేనెయే) అమృతము. |
| **2.** | **తే వా ఏతే అథర్వ అంగిరస**<br>**ఏతత్ ఇతిహాస పురాణం అభ్యతపన్।**<br>**తస్య అభితప్తస్య యశః తేజ**<br>**ఇంద్రియం వీర్యం అన్నాద్యగ్ం**<br>**రసో అజాయత।।** | అట్టి అథర్వ మంత్రములయొక్క అథర్వవేదమనే తేనెతుట్టెను ఆలింగనము చేసుకొనియుండటముచే ఇతిహాస పురాణములు లభిస్తున్నాయి.<br>- అట్టి ఇతిహాస పురాణములలోని (ఆత్మతత్త్వము అనే) మధురసము గ్రోలుటచే యశస్సు, తేజస్సు, వీర్యము, అన్నాదము (భుజించు మధుర పదార్థములు) లభిస్తున్నాయి.<br>(అంగీరసము = సమస్తము స్వస్వరూపాత్మగా దర్శించుచున్నప్పుడు లభించే మాధుర్యము) |
| **3.** | **తత్ వ్యక్షరత్ తత్ ఆదిత్యం**<br>**అభితో ఆశ్రయత్।**<br>**తత్ వా ఏతత్ యత్ ఏతత్**<br>**ఆదిత్యస్య పరం కృష్ణగ్ం రూపమ్।** | అట్టి మధుర రసము (ఇతిహాస, పురాణములలోని ఆత్మతత్త్వరసము) పొంగి పొరలి సూర్యునిచుట్టూ ఏర్పడటము జరుగుతోంది. అట్టి అథర్వమంత్రముల రసరూపమగు ఇతిహాస పురాణ సారమే ఆదిత్యునిలో కనిపిస్తున్న నలుపురంగు ఆచ్ఛాదనము. |

**ఇతి ఛాందోగ్యోపనిషత్ - తృతీయాధ్యాయే చతుర్థః ఖండః**

## 3-5. పంచమః ఖండః - సూర్యుని ఊర్ధ్వ కిరణముల ఉపాసన

| | | |
|---|---|---|
| **1.** | **అథ యే అస్య ఊర్ధ్వా రశ్మయస్తా ఏవ।<br>అస్య ఊర్ధ్వా మధునాడ్యో<br>గుహ్యా ఏవ ఆదేశా మధుకృతో।<br>బ్రహ్మైవ పుష్పం తా అమృతా ఆపః॥** | సూర్యునియొక్క ఊర్ధ్వ దిక్కువైపు కిరణములే మధునాడ్యము (తేనెతుట్టె)<br>ఆత్మ గురించి గురుముఖతః లభిస్తున్న తత్త్వరహస్యమగు ఆదేశములు తుమ్మెదలు.<br>బ్రహ్మమే - "పుష్పము"<br>జలము (రసము, తేనె) - "అమృతము". |
| **2.** | **తే వా ఏతే గుహ్యా ఆదేశా<br>ఏతత్ బ్రహ్మ అభ్యతపన్।<br>తస్య అభితప్తస్య యశః<br>తేజ ఇంద్రియం వీర్యం<br>అన్నాద్యగ్ం రసో అజాయత।** | బ్రహ్మతత్త్వజ్ఞులగు మహనీయుల శ్రేయోవాక్యపూర్వక తత్త్వరహస్య బోధలు బ్రహ్మమును ఆలింగనము చేయుస్తున్నాయి.<br>అట్టి రహస్య బోధలు ఏ ప్రణవ స్వరూపమగు ఆత్మను ఆలింగనము చేస్తున్నాయో, అట్టి బోధలు శ్రవణ మననములు చేసి, ధ్యాసను ఏకాగ్ర పరచువాడు యశస్సు, తేజస్సు, ఇంద్రియముపై అజమాయిషీ, వీర్యము, ఉత్తమానుభవముల రూపమగు అన్నాద రసములు పొందగలడు. |
| **3.** | **తత్ వ్యక్షరత్ తత్ ఆదిత్యం అభితో ఆశ్రయత్।<br>తత్ వా ఏతత్ యత్ ఏతత్<br>ఆదిత్యస్య మధ్యే క్షోభత ఇవ।** | అట్టి మధువు (తత్త్వరహస్య బోధల సారము) ఆదిత్యుని ఆశ్రయించి చుట్టూ స్థానము పొందుచున్నాయి.<br>ఆ మధు తత్త్వము పొంగిపొరలి సూర్యుని మధ్యగా క్షోభవలె ఆక్రమించుచున్నది. |
| **4.** | **తే వా ఏత రసానాగ్ం రసాః।<br>వేదా హి రసాః తేషాం ఏతే రసాః॥<br>తాని వా ఏతాని అమృతానాం అమృతాని<br>వేదా హి - అమృతాః<br>తేషాం ఏతాని అమృతాని॥** | అట్టి మధువుయొక్క రసామృతము చేతనే వేదములు నిండి ఉన్నాయి. వేదముల సారము అట్టి మధుర రసామృతమే। ఆత్మమాధుర్య మార్గదర్శకత్వమే। ఆత్మయొక్క కేవల స్వరూప ఆనందరసమే అటు సూర్యుని, ఇటు వేదములను తమ కాంతి - ఎరుక తేజోవిభవముతో నింపి ఉంచుచున్నది. |

**ఇతి ఛాందోగ్యోపనిషత్ - తృతీయాధ్యాయే పంచమః ఖండః**

## 3-6. షష్ఠః ఖండః - అరుణాదిత్యోపాసన (లేక) సూర్యోదయాది కాంతుల ఉపాసన

### సూర్యోదయ వసువుల ఉపాసన

**1.** **తత్ యత్ ప్రథమం అమృతం**

అరుణ (ఎఱ్ఱటి) రూపములో ఉన్నట్టిది ప్రథమ అమృతము.

**తత్ వసవ ఉపజీవన్తి అగ్నినా ముఖేన।**

అగ్ని ముఖంగా, అగ్నిదేవుని రూపంగా ప్రాతఃసవనమునకు అధిపతులగు - (అష్ట) వసువులు ఆ అమృతమును అనుభవముగా పొందుచున్నారు.

**న వై దేవా అశ్నన్తి। న పిబన్తి।**

అయితే, దేవతలు అట్టి అమృతమును భుజించటము లేదు, త్రాగటము లేదు.

**ఏతత్ ఏవ అమృతం దృష్ట్వా తృప్యంతి।**

అమృతము (మార్పుచేర్పులు లేని స్వస్వరూప మాధుర్యము)ను చూస్తూ ఆనందిస్తున్నారు. తృప్తి పొందుచున్నారు.

---

**2.** **త ఏతత్ ఏవ రూపం అభిసంవిశంతి।**

అట్టి అమృత రూపములో లీనమగుచున్నారు.

**ఏతస్మాత్ రూపాత్ ఉద్యన్తి।**

వారు ఆత్మరూపము (లేక) అమృతరూపము పట్ల ఉద్యుక్తులు అగుచున్నారు. ఉద్యమిస్తున్నారు.

---

**3.** **స య ఏతత్ ఏవం అమృతం వేద,**
**వసూనాం ఏవ ఏకో భూత్వా అగ్నిన ఏవ**
**ముఖేన ఏతత్ ఏవ అమృతం దృష్ట్వా తృప్యతి।**
**స ఏతత్ ఏవ రూపం అభిసంవిశతి**
**ఏతస్మాత్ రూపాత్ ఉదేతి॥**

"అట్టి మార్పు చేర్పులకు ఆవలిదైనట్టి అమృతరూపము ఎవరు తెలుసుకుంటారో, వారు వసువుల రూపము పొందుచూ, అగ్నిదేవుని ఉన్ముఖంగా అమృతత్వము సిద్ధించుకొనెదరు",

అట్టి అరుణకాంతుల సూర్యుని ఆత్మభావనకై ఉపాసించువారు మార్పుచేర్పులచే స్పర్శించబడని అమృతదృష్టిచే అసంతృప్తులను జయించగలరు. 'ఆత్మతృప్తి'ని పొందగలరు. 'ఆత్మమేవాహమ్' భావనను ఆశ్రయించినవారై ఆత్మయందు నిత్యోదితులై ఉండగలరు.

---

**4.** **స యావత్ ఆదిత్యః పురస్తాత్**
**ఉదేతా పశ్చాత్ అస్తమేతా**
**వసూనాం ఏవ తావత్**
**ఆధిపత్యగ్ం స్వారాజ్యం పర్యేతా।**

అట్టి అరుణోదయ కాంతులను (ధ్యేయత్ సదా సవితృమండల మధ్యవర్తిమ్...., సప్త అశ్వ రథం ఆరూఢం, ప్రచండం, కశ్యపాత్మజం, భాస్కరాయ విద్మహే, మహద్ద్యుతి కరాయ ధీమహి। తన్నో ఆదిత్య ప్రచోదయాత్ మొదలైన మంత్రములతో) - ఆత్మోపాసన చేయువారు -

సూర్యుడు తూర్పున ఉదయిస్తూ పడమర అస్తమిస్తున్నంతకాలము వసువుల ఆధిపత్యము పొందినవారై స్వయం ప్రకాశత్వమగు స్వారాజ్యము సిద్ధించుకోగలరు.

**ఇతి ఛాందోగ్యోపనిషత్ - తృతీయాధ్యాయే షష్ఠః ఖండః**

## 3-7. సప్తమః ఖండః - మధ్యాహ్న సూర్య - రుద్రుల ఉపాసన

| | | |
|---|---|---|
| **1.** | **అథ యత్ ద్వితీయం అమృతం<br>తత్ 'రుద్రా' ఉపజీవన్తి, ఇన్ద్రేణ ముఖేన।** | ఇప్పుడు ఇక ద్వితీయమగు సూర్యుని శుక్ల (తెల్లని) రూప - అమృతమును (ఏకాదశ) రుద్రులు ఇంద్రుని ముఖంగా, ఇంద్రుని రూపంగా పొందుచున్నారు. |
| | **న వై దేవా అశ్నన్తి న పిబన్తి।** | దేవతలు ఈ అమృతము కూడా తినటం లేదు, త్రాగటం లేదు. |
| | **ఏతత్ ఏవ అమృతం దృష్ట్వా తృప్యన్తి।** | అయితే దేవతలు - ఆ అమృతమును (The Self beyond any change) సర్వత్రా దర్శించుచు తృప్తిచెందుచున్నారు. |
| **2.** | **త ఏతత్ ఏవ రూపం అభిసంవిశంతి।<br>ఏతస్మాత్ రూపాత్ ఉద్యంతి।** | వారు ఆ సూర్యుని తెల్లటి రూపమునందు ప్రవేశించి, ఆ రూపమును ఉద్యమింపజేస్తున్నారు. |
| **3.** | **స య ఏతత్ ఏవం అమృతం<br>వేద రుద్రాణాం ఏవ-ఏకో భూత్వా,<br>ఇంద్రేణ ఏవ ముఖేన ఏతత్<br>ఏవ అమృతం దృష్ట్వా తృప్యతి।<br>స ఏతత్ ఏవ రూపం అభిసంవిశతి।<br>ఏతస్మాత్ రూపాత్ ఉదేతి।** | ఎవ్వరైతే అట్టి ఆదిత్యునియొక్క తెల్లటి "అమృత" రూపము తెలుసుకొంటూ ఉంటున్నారో అట్టి ఉపాసనపరుడు ఏకాదశ రుద్రులలో ఒకడుగా అగుచు, ఇంద్రుని సహాయముతో అట్టి అమృతమును సర్వదా దర్శించుచు 'ఆత్మతృప్తుడు' అగుచున్నాడు.<br>- అట్టి అమృత రూపములో విలీనుడు అగుచున్నాడు.<br>- తత్ రూపమునందు ఉదితుడై (ఉదయించి) స్వయం అమృతరూపుడగుచున్నాడు. స్వయంప్రకాశమగు నిత్య ప్రకాశాత్మానందరూపుడై విరాజిల్లుచున్నాడు. |
| **4.** | **స యావత్ ఆదిత్యః<br>పురస్తాత్ ఉదేతా।<br>పశ్చాత్ అస్తమేతా।<br>ద్విస్తావత్ దక్షిణత ఉదేత।<br>ఉత్తరతో అస్తమేతా।<br>రుద్రాణాం ఏవ,<br>తావత్ ఆధిపత్యగ్ం<br>స్వారాజ్యం పర్యేతా।** | ఎవ్వడైతే - అట్టి అనన్యమగు అమృతమును (లేక) అట్టి స్వస్వరూపామృత తత్త్వమును ఎరుగుచున్నాడో అట్టివాడు సూర్యోదయాస్తములు ఉత్తర - దక్షిణములలో జరుగుచున్నంత కాలము (ఆచంద్రార్కము) 'కాలము' ప్రవర్తించునంతకాలము, "రుద్రస్థానము" పొంది ఉండగలడు.<br>ఇంకా, దక్షిణ దిక్కుతో ఉదయించి ఉత్తరదిక్కుతో అస్తమించు కాలము (అనగా, రెట్టింపు కాలము) - రుద్రుల ఆధిపత్యమగు స్వారాజ్యము (ఈ సమస్తము స్వయంకృతమగు స్వయం - ఆత్మస్వరూపమే - అను స్వస్వరూపాస్వాదన) సిద్ధించుకొనుచూ రుద్రానందము పొందగలడు. |

**ఇతి ఛాందోగ్యోపనిషత్ - తృతీయాధ్యాయే సప్తమః ఖండః**

## 3-8. అష్టమః ఖండః - సాయంకాల - ఆదిత్యుల ఉపాసన

| | | |
|---|---|---|
| 1. | **అథ యత్ తృతీయం అమృతం -<br>తత్ ఆదిత్యా ఉపజీవన్తి, వరుణేన ముఖేన।<br>న వై దేవా అశ్నన్తి। న పిబన్తి।<br>ఏతత్ ఏవ అమృతం దృష్ట్వా తృప్యన్తి।** | సూర్యభగవానుని మూడవ రూప విభాగము మూడవ అమృతము. అట్టి మూడవ అమృతమును వరుణ ముఖముగా వరుణుని రూపముగా ఆదిత్యులు ఆస్వాదనచేస్తూ ఉన్నారు. (ఇది సాయంకాల సూర్యుని ఉపాసన)<br>దేవతలు అట్టి సాయం - అమృతతత్త్వమును దేవతలు భుజించటము లేదు. త్రాగటము లేదు. అయితే అట్టి సాయంకాల సూర్య అమృత తత్త్వమును చూస్తూ ఆనందిస్తున్నారు. తృప్తులగుచున్నారు. |
| 2. | **త ఏతత్ ఏవ రూపం అభిసంవిశన్తి<br>ఏతస్మాత్ రూపాత్ ఉద్యన్తి।** | ఆదిత్యులు అట్టి అమృతరూపమునందు లీనమై తత్ రూపమును పొందినవారై ఉంటున్నారు. |
| 3. | **స య ఏతత్ ఏవం అమృతం వేద,<br>ఆదిత్యానాం ఏవ ఏకోభూత్వా,<br>వరుణేన ఏవ ముఖేన ఏతత్ ఏవ<br>అమృతం దృష్ట్వా తృప్యతి।<br>స ఏతత్ ఏవ రూపమ్ అభి సంవిశతి,<br>ఏతస్మాత్ రూపాత్ ఉదేతి॥** | అట్టి సూర్యుని సాయం సూర్య అమృత తత్త్వము ఎరిగినవాడు ద్వాదశాదిత్యులలో ఒకడై, వరుణముఖంగా 'అమృతము' (మార్పు-చేర్పులకు ఆవలగల కేవలమగు స్వస్వరూపమును) దర్శించుచూ తృప్తుడగుచున్నాడు.<br>అట్టి అమృత రూపముతో విలీనము పొంది, అమృతరూపుడై ఉదయిస్తున్నాడు. |
| 4. | **స యావత్ ఆదిత్యో దక్షిణత ఉదేత।<br>ఉత్తరతో అస్తమేతా 'ద్వి'స్తావత్।<br>పశ్చాత్ ఉదేతా।<br>పురస్తాత్ అస్తమేతా।<br>ఆదిత్యానాం ఏవ,<br>తావత్ ఆధిపత్యగ్ం<br>స్వారాజ్యం పర్యేతా॥** | అట్టివాడు సూర్యోదయాస్తమయము జరుగుచున్నంతకాలమునకు రెండంతలు కాలము (అనగా)<br>ఎంతకాలము సూర్యుడు దక్షిణ దిక్కులో ఉదయించి ఉత్తర దిక్కునందు అస్తమిస్తాడో...(మరియు)<br>ఎంతకాలము సూర్యుడు పశ్చిమ దిక్కుగా ఉదయించి, తూర్పు దిక్కుగా అస్తమిస్తాడో...<br>అంత కాలము ద్వాదశాదిత్యుల స్వారాజ్యము, సంపదలు పొందగలరు. |

**ఇతి ఛాందోగ్యోపనిషత్ - తృతీయాధ్యాయే అష్టమః ఖండః**

## 3-9. నవమః ఖండః - సూర్యాస్తమయ - మరుత్తుల ఉపాసన

| | | |
|---|---|---|
| **1.** | **అథ యః చతుర్థం అమృతం**<br>**తత్ మరుత ఉపజీవన్తి - సోమేన ముఖేన।** | **సూర్యదేవుని నల్లని రూపము నాలుగవ అమృతము.**<br>"చంద్రముఖం"గా మరుత్తులు ఆ చతుర్థ నల్లని రూపమును అనుభవముగా పొందుచున్నారు. |
| | **న వై దేవా అశ్నన్తి। న పిబంతి।**<br>**ఏతత్ ఏవ అమృతం దృష్ట్వా తృప్యన్తి।** | దేవతలు అట్టి నల్లటి అమృత రూపమును భుజించటము లేదు. త్రాగటము లేదు. అయితే, అట్టి అమృత చతుర్థ రూపమును చూస్తూ తృప్తిని పొందుచూ ఉన్నారు. |
| **2.** | **త ఏతత్ ఏవ రూపం అభిసంవిశన్తి,**<br>**ఏతస్మాత్ రూపాత్ ఉద్యన్తి।** | ఎవ్వరైతే ఈ వివరములను తెలుసుకొంటున్నారో, ఉపాసిస్తున్నారో, అట్టివాడు మరుత్తులలో ఒకడుగా అగుచున్నాడు. సోమముఖంగా ఆ నాలుగవ అమృతరూపమును పొందుచున్నాడు. అట్టి రూపముతో ఉద్యన్తుడు అగుచున్నాడు. |
| **3.** | **స య ఏతత్ ఏవం అమృతం వేద,**<br>**మరుతాం ఏవ ఏకో భూత్వా**<br>**సోమేన ఏవ ముఖేన।**<br>**ఏతత్ ఏవ అమృతం దృష్ట్వా తృప్యతి।**<br>**స ఏతత్ ఏవ రూపం అభిసంవిశతి,**<br>**ఏతస్మాత్ రూపాత్ ఉదేతి।** | - ఆ విధంగా మరత్తులలో ఒకడై, అట్టి అమృతరూపమును పొంది,<br>- తత్ రూపమునందు ప్రభవించుచు,<br>- తత్ అమృతరూపమును దర్శించుచు తృప్తుడగుచున్నాడు.<br>అట్టి సూర్యాస్తమయం (సూర్యుని) నాలుగవ రూపమును ఉపాసించి ఆత్మోపాసన చేయువారు, అట్టి సూర్యాస్తమయ సూర్యతత్త్వమును సంతరించుకొని ఆదిత్యునియందు ఉదయించువారు అవగలరు. |
| **4.** | **స యావత్ ఆదిత్యః।**<br>**పశ్చాత్ ఉదేతా।**<br>**పురస్తాత్ అస్తం।**<br>**ఏతా 'ద్వి'స్తావత్**<br>**ఉత్తరత ఉదేతా।**<br>**దక్షిణతో అస్తమేతా।**<br>**మరుతాం ఏవ,**<br>**తావత్ ఆధిపత్యగ్ం**<br>**స్వారాజ్యం పర్యేతా॥** | సూర్యుడు ఎంతవరకు పశ్చిమదిక్కుగా ఉదయించి తూర్పుదిక్కుగా అస్తమిస్తున్నాడో, అంతకు రెండింతలు -<br>ఉత్తర దిక్కుగా ఉదయించి దక్షిణ దిక్కుగా అస్తమించు కాలము అంతకాలము - సూర్యుని నాలుగవ అమృత రూపము ఎరిగి ఉపాసించువాడు మరుత్తులలో ఒకడై ఆధిపత్యము, స్వారాజ్యము పొందియుండగలడు. |

**ఇతి ఛాందోగ్యోపనిషత్ - తృతీయాధ్యాయే నవమః ఖండః**

## 3-10. దశమః ఖండః - సాధ్యుల - ఆదిత్య అంతరాంతర - బ్రహ్మోపాసన

| | | |
|---|---|---|
| **1.** | **అథ యత్ పంచమం<br>అమృతం తత్ సాధ్యా ఉపజీవన్తి,<br>బ్రహ్మణా ముఖేన॥<br>న వై దేవా అశ్నన్తి। న పిబన్తి।<br>ఏతత్ ఏవ అమృతం దృష్ట్వా తృప్యన్తి।** | సూర్యభగవానుని అంతర (లోపలి) రూపము 'పంచమ' అమృత రూపము.<br>అట్టి పంచమ అమృతరూపమును బ్రహ్మదేవుని (ప్రజాపతి) ముఖంగా సాధ్యులు ఆశ్రయించి జీవిస్తున్నారు.<br>దేవతలు అట్టి అంతర్గత పంచమ అమృత రూపమును తినటము లేదు. త్రాగటము లేదు. అయితే అట్టి సూర్య అంతరామృతమునే దర్శిస్తూ తృప్తులు అగుచున్నారు. |
| **2.** | **త ఏతత్ ఏవ రూపం<br>అభిసంవిశన్తి ఏతస్మాత్<br>రూపాత్ ఉద్యన్తి।** | అట్టి ఐదవ అంతరామృత రూపమును చూస్తూ సర్వదా ఆ అమృత రూపమునందే సాధ్యులు - నిత్యోదితులై ఉంటున్నారు. |
| **3.** | **స య ఏతత్ ఏవం<br>అమృతం వేద సాధ్యానాం ఏవ<br>ఏకో భూత్వా బ్రహ్మణైవ ముఖేన<br>ఎతత్ ఏవ అమృతం దృష్ట్వా తృప్యతి।<br>స ఏతత్ ఏవ రూపం అభిసంవిశతి।<br>ఏతస్మాత్ రూపాత్ ఉదేతి॥** | అట్టి అంతర - అమృతరూపమును ఎరిగినవారు సాధ్యులలో ఒకరై, బ్రహ్మదేవుని (ప్రజాపతి) ముఖంగా అమృతదర్శనం చేస్తూ ఆత్మతృప్తులవగలరు.<br>అట్టి రూపములో ప్రవేశము పొంది అమృతస్వరూపులుగా ఉదయించగలరు. |
| **4.** | **స యావత్ ఆదిత్య ఉత్తరత ఉదేతా।<br>దక్షిణతో అస్తమేతా ద్విస్తావత్<br>ఊర్ధ్వ ఉదేతా। అర్వాక్ అస్తమేతా।<br>సాధ్యానాం ఏవ తావత్ ఆధిపత్యగ్ం<br>స్వారాజ్యం పర్యేతా॥** | అట్టి అంతరాంతర అమృత తత్త్వము ఎరిగినవారు<br>- సూర్యుడు ఉత్తరమున ఉదయించి దక్షిణమున అస్తమించుచున్నంత కాలమునకు రెండంతలు,<br>- ఊర్ధ్వమున ఉదయించి, అధోభాగమున అస్తమించుచున్నంత కాలము, సాధ్యులలో ఒకరై ఆధిపత్యము, స్వారాజ్యము సిద్ధించుకొన్నవారై ఉండగలరు. |

**ఇతి ఛాందోగ్యోపనిషత్ - తృతీయాధ్యాయే దశమః ఖండః**

## 3-11. ఏకాదశః ఖండః - మధు విద్యా ఉపాసనకు పరాకాష్ఠ

| | | |
|---|---|---|
| **1.** | **అథ తత ఊర్ధ్వ ఉదేత్య, న ఏవ ఉదేతా।<br>న అస్తం ఇతి।<br>ఏకల ఏవ మధ్యే స్థాతా॥<br>తత్ ఏష శ్లోకః॥** | ఆ తరువాత అట్టి ఉపాసకుడు - సూర్యుడు ఊర్ధ్వంగా తాను వెళ్లి - అక్కడ ఉదయాస్తములు లేనివాడై (ఉదయించనివాడై, అస్తమించనివాడై) అక్కడే మధ్యగా నివాసము కలిగి ఉంటున్నాడు.<br>అట్టి ఉదయాస్తమయాతీతమగు సూర్యస్థానము వర్ణిస్తూ శాస్త్రీయమగు ఈ శ్లోకము చెప్పబడుచున్నది. |
| **2.** | **న వై తత్ర న నిమ్లోచ<br>న ఉదియాయ కదాచన।<br>దేవాః తేన అహగ్ం<br>సత్యేన మా విరాధిషి బ్రహ్మణా ఇతి॥** | ఆత్మసూర్యుడు ఏ కార్యములు చేయనివాడై, ఉదయ - అస్తమయములు ఏమాత్రము ధర్మములుగా లేనివాడై (Sans the Functions of Dawn and Dusk)<br>- 'బ్రహ్మము' అను స్థానమును వీడనివారై ఉంటున్నారు.<br>ఓ దేవతలారా! నేను అట్టి సత్యమగు బ్రహ్మస్వరూపమునందే నిత్యనివాసిని। |
| **3.** | **న హ వా అస్మా ఉదేతి।<br>న నిమ్లోచతి। సకృద్దివా హి<br>ఏవ అస్మై భవతి – య ఏతాం<br>ఏవం బ్రహ్మోపనిషదం వేద॥** | ఓ శ్రోతలారా। దేవతలారా। నేను ఈ సర్వాత్మకమగు స్వస్థానము నుండి రాను - పోను - వృద్ధి పొందను. గ్లాని-హాని పొందను.<br>బ్రహ్మమును సమీపించి, బ్రహ్మమునకు సమీపముగా ఆసీనుడై<br>- బ్రహ్మమే తానై ప్రకాశించుచున్నాను. బ్రహ్మోపనిషదుడనై విరాజిల్లుచున్నాను. |
| **4.** | **తత్ హ ఏతత్<br>బ్రహ్మ ప్రజాపతయ ఉవాచ।<br>ప్రజాపతిః మనవే। మనుః ప్రజాభ్యః।<br>తత్ హ ఏతత్ ఉద్దాలకాయ, అరుణయే,<br>జ్యేష్ఠాయ పుత్రాయ<br>పితా బ్రహ్మ ప్రోవాచ॥** | ఈ 'మధు విజ్ఞానము'ను ఒకప్పుడు సృష్టికి ఆదిస్వరూపుడగు బ్రహ్మభగవానుడు, ప్రజలకు పతి అగు ప్రజాపతికి చెప్పి ఉన్నారు.<br>- ప్రజాపతి మనువుకు బోధించి ఉన్నారు.<br>- మనువు ఇక్ష్వాకుడు మొదలైన అనేకమంది జనులకు బోధించారు.<br>ఈ బ్రహ్మ జ్ఞానమును అరుణి తన పెద్ద కుమారుడగు ఉద్దాలకునికి ఉపదేశించారు. |
| **5.** | **ఇదం వావ తత్<br>జ్యేష్ఠాయ పుత్రాయ పితా<br>బ్రహ్మ ప్రబ్రూయాత్।<br>ప్రణాయ్యాయ వా అన్తేవాసినే॥** | అట్టి ఈ బ్రహ్మజ్ఞానమును బ్రహ్మజ్ఞుడైనవాడు తన జ్యేష్ఠ పుత్రునికి, మరియు అర్హులు, ప్రియులు అగు శిష్యులకు పరంపరగా ఉపదేశించెను. |
| **6.** | **న అన్య అస్మై కస్మై చ న<br>యది అపి అస్మా ఇమాం అద్భిః<br>పరిగృహీతాం, ధనస్య పూర్ణాం దద్యాత్।<br>ఏతత్ ఏవ తతో భూయ ఇతి।<br>ఏతత్ ఏవ తతో భూయ ఇతి॥** | అర్హతగల సంతానమునకు, శిష్యులకు కాకుండా, తపోధ్యానాదుల అభ్యాసములేని అనర్హులకు ఉపదేశించరాదు.<br>ఈ బ్రహ్మవిద్య సముద్రమంత సంపదకన్నా కూడా ఉత్తమోత్తమమైనది. అందుచే ధనము, అధికారము మొదలైనవి బ్రహ్మవిద్యకు అర్హత కాదు.<br>ఈ బ్రహ్మవిద్య సమస్త లోకసంబంధమైన, ధనార్జనా సంబంధమైన అన్ని విద్యలకంటే కూడా మహత్తరమైనది, మహనీయమైనది. |

**ఇతి ఛాందోగ్యోపనిషత్ - తృతీయాధ్యాయే ఏకాదశః ఖండః**

# 3-12. ద్వాదశః ఖండః - గాయత్రీ ఉపాసన

| | | |
|---|---|---|
| **1.** | **గాయత్రీ వా ఇదగ్ం సర్వం**<br>**భూతం యత్ ఇదం కిం చ।**<br>**వాక్ వై గాయత్రీ।**<br>**వాక్ వా ఇదగ్ం సర్వం భూతం।**<br>**గాయతి చ త్రాయతే చ॥** | సర్వలోకములలోని సమస్త భూతజాలము (కొంచము నుండి భూరివరకు), సమస్తము గాయత్రీ గాన స్వరూపమే।<br>వాక్కు గాయత్రీ స్వరూపము। ఈ సర్వము గాయత్రీ గానముగా ఉపాసించుటచే అట్టి గాయత్రీ మననము రక్షణ ప్రసాదించగలదు.<br>(గాతయత్ త్రాయతే యస్మాత్ "గాయత్రీ" ఇతి అభిధీయతే- గానముచే రక్షించునది కాబట్టి 'గాయత్రీ'।) |
| **2.** | **యా వై సా గాయత్రీ**<br>**ఇయం వావ సా యేయం పృథివీ।**<br>**అస్యాగ్ం హి ఇదగ్ం సర్వం**<br>**భూతం ప్రతిష్ఠితం**<br>**ఏతాం ఏవ న అతిశీయతే॥** | ఏది గాయత్రియో, అదియే ఈ సమస్త పృథివి, ఈ సమస్త జీవుల స్వరూపము కూడా। "గాయత్రి" తత్త్వమునందే ఈ జీవులంతా ప్రతిష్ఠితులై ఉన్నారు. గాయత్రియందే నివాసము కలిగియున్నారు. ఏదీ కూడా గాయత్రీతత్త్వమును అధిగమించి లేనేలేదు. సమస్త బ్రహ్మాండములు "గాయత్రి" యందు (దర్పణంలో దృశ్యమువలె) అంతర్గతమై ఉన్నాయి. |
| **3.** | **యా వై సా పృథివీ ఇయం వావ సా యత్ ।**<br><br>**ఇదం అస్మిన్ పురుషే శరీరం**<br>**అస్మిన్ హి ఇమే ప్రాణాః ప్రతిష్ఠితా**<br>**ఏతత్ ఏవ న అతిశీయన్తే।** | ఏది పృథివియో అది గాయత్రియే।<br>ఈ పురుషుని భౌతిక శరీరము, ఇందలి పంచప్రాణములు, ఇంద్రియములు, 'శబ్ద స్పర్శ రూప రస గంధ' - ఇంద్రియార్థములు, ఆ ఇంద్రియార్థములకు విషయములతో కూడిన దృశ్యజగత్తు - ఇదంతా గాయత్రీయందే సంప్రతిష్ఠితమైయున్నది. గాయత్రిని దాటి ఏదీ లేదు. |
| **4.** | **యత్ వై తత్పురుషే**<br>**శరీరం ఇదం వావ, తత్**<br>**యత్ ఇదం అస్మిన్**<br>**న అంతః పురుషే హృదయం।**<br>**అస్మిన్ హి ఇమే ప్రాణాః ప్రతిష్ఠితా,**<br>**ఏతత్ ఏవ న అతిశీయన్తే।** | గాయత్రియే తత్పురుష శరీరము. ఆద్యంతరహిత పురుషుడే గాయత్రి।<br>ఈ పురుషుడు, ఆలోచనలకు జననస్థానమగు ఆతని హృదయము, పురుషకారమునందు ప్రవర్తమానమైయున్న ఇందలి ప్రాణతత్త్వము-<br>గాయత్రియందే సుప్రతిష్ఠితమై ఉన్నాయి. గాయత్రిని అధిగమించినదై ఏదీ లేదు। |
| **5.** | **స ఏషా చతుష్పదా**<br>**షడ్విధా గాయత్రీ।**<br>**తత్ ఏతత్ ఋచా అభ్యనూక్తమ్।** | గాయత్రీ షట్ విధా : ఆరేసి (6) అక్షరములుగల నాలుగు (4) పాదములతో కూడిన ఛందస్సు.<br>అట్టి గాయత్రి : వాక్కు, ప్రాణులు, పృథివి, దేహము, హృదయము, ప్రాణములు అనే ఆరు (6) రూపములుగా ఉన్నది.<br>అట్టి గాయత్రీదేవి జాగ్రత్ - స్వప్న - సుషుప్తి - తురీయములనే 'చతుష్పాదము' అయి (నాలుగు పాదములు) మరియు (మనో బుద్ధి చిత్త అహంకార-జీవ-ఈశ్వరులనే) ఆరు పాదములు ప్రదర్శనముగా కలిగియున్నది.<br>ఆ గాయత్రీ ఋక్కులచే స్తుతించబడుచున్నది. |

| | | |
|---|---|---|
| **6.** | **తావాన్ అస్య మహిమా**<br>**తతో జ్యాయాగ్ంశ్చ పూరుషః।**<br>**పాదో అస్య సర్వా**<br>**భూతాని త్రిపాదస్య**<br>**అమృతం దివి ఇతి॥** | వాక్కు, ప్రాణులు, పృథివి, దేహము, హృదయము, ప్రాణములు - అనే ఆరు రూపములు గాయత్రీ మహిమా విశేషములు. వాటన్నిటికంటే అధిక మహిమగలవాడు "పురుషుడు".<br>అట్టి పురుషునిలో<br>I. నాలుగవ వంతు - సమస్త భౌతిక రూప - భూతజాలము. మార్పు - చేర్పుల విభాగమైయున్నది.<br>II. మిగతా మూడు పాదములు - అమృతస్వరూపమై దివ్యలోకములను నిండి ఉన్నది. |
| **7.** | **యత్ వై తత్ బ్రహ్మ ఇతి ఇదం వావ।**<br>**తత్ యో అయం బహిర్ధా పురుషాత్ ఆకాశో।**<br>**యో వై స బహిర్ధా పురుషాత్ ఆకాశః।** | గాయత్రీ దేవీ రూపమగు అట్టి పరబ్రహ్మమే ఇక్కడి ఈ శరీరము చుట్టూ ఆకాశరూపముగా (బహిరాకాశంగా) వ్యాపించి ఉన్నది. |
| **8.** | **అయం వావ స యో**<br>**అయం అంతఃపురుష ఆకాశో**<br>**యో వై సో అంతఃపురుష ఆకాశః।** | ఆ పరబ్రహ్మమే అంతఃపురుష ఆకాశ పురుషుడై, దేహములోపల అంతఃపురుషాకాశము రూపముగా సర్వత్రా నిండియున్నది. |
| **9.** | **అయం వావ స యో అయం**<br>**అంతర్హృదయ ఆకాశః।**<br>**తత్ ఏతత్ పూర్ణం అప్రవర్తి**<br>**పూర్ణాం అప్రవర్తినీగ్ం।**<br>**శ్రియం లభతే, య ఏవం వేద॥** | అట్టి పరబ్రహ్మమే "అంతర-హృదయాకాశము"లో కూడా హృదయమంతటా నిండి ఉన్నది.<br>హృదయములో ఏ పరబ్రహ్మము బ్రహ్మాకాశమై విస్తరించి ఉన్నదో, అది స్వతఃగానే పూర్ణము. అది ప్రవర్తితము కాదు. అప్రవర్తితము. ఎటువంటి ప్రవర్తనలేనిదై నిశ్చలమై, సుస్థిరమై, యథాతథమై, నిర్వికారమైయున్నది.<br>అట్టి ఆత్మ గురించిన తత్త్వము ఎరిగినవాడు సర్వశ్రేయస్సులు పొందగలడు. |

**ఇతి ఛాందోగ్యోపనిషత్ - తృతీయాధ్యాయే ద్వాదశః ఖండః**

## 3-13. త్రయోదశః ఖండః - హృదయాంతర్గత సుషిర ఉపాసన

**1.** **తస్య హ వా ఏతస్య**
**హృదయస్య పంచ దేవ సుషయః।**
**స యో, అస్య ప్రాక్ సుషిః**
**స ప్రాణస్తః చక్షుః।**
**స ఆదిత్యః తదేతత్ "తేజో"।**
**"అన్నాద్యం" ఇతి ఉపాసీత।**
**తేజస్వి అన్నాదో భవతి,**
**య ఏవం వేద।।**

(సుషి = రంధ్రము, దారి)

అట్టి గాయత్రీస్వరూపమై ప్రకాశించుచున్న హృదయస్థానము సిద్ధింపజేయుటకు పంచ విధములైనట్టి దేవ సుషులు (దేవలోకమునకు ద్వారములు / మార్గములు / త్రోవలు / దారులు) ఉన్నాయి.

**(1) తూర్పు సుషి (మార్గము)** - ప్రాణదేవత : ద్వారపాలకుడు 'ప్రాణము'. ప్రాణదేవుడే దేహములో నేత్రములు (చూపు)గానున్నారు. ఆకాశంలో ఆదిత్యుడై (సూర్యభగవానుడై) ఉన్నారు. ఆయనను పంచప్రాణములలోని **"ప్రాణము"ను హృదయము యొక్క తూర్పు సుషిగా పూజించాలి.**

ఇంకా, అట్టి ప్రాణదేవతను తేజోరూపముగాను, అన్నాదుడుగాను (ఆహారప్రదాతగాను) ఉపాసించెదరు గాక।

అట్టి ప్రాణేశ్వరుని (మోక్ష) ద్వారపాలకునిగాను, తేజోరూపునిగాను, అన్నాదునిగాను ఎరుగువాడు - తేజోవంతుడు, అన్నాదుడు అగుచున్నాడు.

---

**2.** **అథ యో అస్య దక్షిణః సుషిః స"వ్యానః"।**
**తత్ శ్రోత్రగ్ం। స చన్ద్రమాః।**
**తత్ ఏతత్ శ్రీః చ। యశః చేతి ఉపాసీత।**
**శ్రీమాన్ యశస్వీ భవతి, య ఏవం వేద।**

**(2) దక్షిణ సుషి - "వ్యానము"** : ఈయనయే చెవి, వినికిడిగా, ఆకాశంలో చంద్రుడుగా, దర్శించాలి. ఈయనయే ఐశ్వర్యప్రదాతగా ఉపాసించాలి.

ఎవ్వరైతే (పంచ ప్రాణములలోని) వ్యానదేవతను శ్రవణశక్తి గాను, ఔషధి రూపంగాను, ఆహారము అనుగ్రహిస్తున్నవారు గాను, యశోప్రదాత గాను (రక్షకుడుగాను) తెలుసుకొని ఉంటారో, అట్టివారు శ్రీమాన్ (సంపదకలవారు)గాను, కీర్తిమంతులుగాను (యశస్విగాను) అగుచున్నారు.

---

**3.** **అథ యో అస్య ప్రత్యక్ సుషిః**
**సో "అపానః" సా వాక్। సో "అగ్నిః"।**
**తత్ ఏతత్ బ్రహ్మవర్చసం,**
**"అన్నాద్యం" ఇతి ఉపాసీత।**
**బ్రహ్మవర్యస్య అన్నాదో భవతి, య ఏవం వేద।**

**(3) ప్రత్యక్ - (పశ్చిమ) సుషి (ద్వారము) -"అపానము":**

అట్టి అపాన దేవతయే - (అపానద్వారమే) 'వాక్' స్వరూపము. (మరియు) అగ్ని స్వరూపము. అట్టి అపానదేవతను "బ్రహ్మవర్చస్సు" గాను, అన్నాదుడు (అన్నప్రదాత)గాను ఉపాసించెదరు గాక।

అపానమును వాక్ రూపముగాను, (Talking Ability) అగ్నిరూపము గాను, బ్రహ్మవర్చో ప్రదాతగాను, అన్నాదుడుగాను ఎరిగి ఉపాసించు వాడు బ్రహ్మవర్చస్సు, ఆహార సమృద్ధి పొందగలడు.

---

**4.** **అథ యో అస్య ఉదజ్ సుషిః స "సమానః"।**
**తత్ మనః। స పర్జన్యః।**
**తత్ ఏతత్ కీర్తిశ్చ వ్యుష్టిశ్చ।**
**ఏతి ఉపాసీత।**
**కీర్తిమాన్, వ్యుష్టిమాన్ భవతి**
**య ఏవం వేద।**

**(4) హృదయమునకు ఉత్తరంగా గల రంధ్రము - "సమానము":**

- అది "మనస్సు".
- అదియే పర్జన్యుడు

అట్టి సమానప్రాణబ్రహ్మమును మనస్సుగాను, పర్జన్యుడుగాను, పరబ్రహ్మముయొక్క 'కీర్తి'గాను, వర్షించు అనుగ్రహముగాను ఉపాసించబడుగాక।

ఈ విధంగా హృదయ ఉత్తర సుషియమును సమానప్రాణ-మనో-పర్జన్య-పరబ్రహ్మరూపముగా ఉపాసించువాడు కీర్తిమంతుడు వృష్టి (లావణ్య)వంతుడు కాగలడు.

**5.** **అథ యో అస్య ఊర్ధ్వః**
**సుషిః స "ఉదానః"।**
**స వాయుః। స ఆకాశః।**
**తత్ ఏతత్ ఓజః చ మహః చ**
**ఇతి ఉపాసీత। ఓజస్వీ,**
**మహస్వాన్ భవతి,**
**య ఏవం వేద॥**

**హృదయముయొక్క ఊర్ధ్వ సుషిరము (ఛిద్రము) - ఉదాన ప్రాణోపాసన।**

- అట్టి ఊర్ధ్వరంధ్ర ఉదానప్రాణమే వాయువు. అదియే ఆకాశము. అదియే ఓజస్సుగాను , మహత్ స్వరూపముగాను ఉపాసించబడుగాక।

(ఓజస్సు = తేజము; బలము; సారము; పరాక్రమము;, వెలుగు;, శ్రేష్ఠత, Inclination / Inspiration)

<u>ఈ విధంగా</u> : హృదయ ఊర్ధ్వ సుషిరమును (ఛిద్రమును) - ఉదాన ప్రాణముగా, ఉదానప్రాణమును వాయు స్వరూపంగా, ఆకాశ స్వరూపంగా, ఓజస్సుగా, మహత్‌గా ఉపాసించబడు గాక।

అట్టి ఉపాసనను ఎరిగినవాడు ఓజస్విగాను, మహాన్‌గాను అగుచున్నాడు.

---

**6.** **తే వా ఏతే "పంచ బ్రహ్మ పురుషాః"**
**స్వర్గస్య లోకస్య ద్వారపాలాః।**
**స య ఏతాన్ ఏవం పంచ బ్రహ్మపురుషాః**
**స్వర్గస్య లోకస్య ద్వారపాన్ వేదాస్య కులే**
**వీరో జాయతే, ప్రతిపద్యతే స్వర్గం లోకం,**
**య ఏతాన్ ఏవం పంచ బ్రహ్మ పురుషాన్" –**
**స్వర్గస్య లోకస్య ద్వారపాన్ వేద॥**

**హృదయము యొక్క సుషి (రంధ్రములు)**

**(1)** ప్రాక్ సుషిః (రంధ్రము) - <u>"ప్రాణము"</u> (చూపు, ఆదిత్యుడు, అన్నాదము)

**(2)** దక్షిణ సుషి - <u>"వ్యానము"</u> (శ్రోతము (వినికిడి); చంద్రమసము; సంపద; కీర్తి)

**(3)** ప్రత్యక్ (పడమర) సుషిః (రంధ్రము) - <u>"అపానము"</u> - వాక్కు, అగ్ని, వర్చస్సు, అన్నాదము.

**(4)** ఉదన్ (ఉత్తరము) వైపు సుషిః <u>"సమానము"</u> - మనస్సు; పర్జన్యుడు; కీర్తి; అనుగ్రహము.

**(5)** ఊర్ధ్వసుషిః (ద్వారము) <u>'ఉదానము'</u> - వాయువు, ఆకాశము, బలము.

పై ఐదుగురు బ్రహ్మపురుషులు బ్రహ్మమునకు ద్వారపాలకులు.

ఈ ఐదుగురు బ్రహ్మపురుషులు స్వర్గలోక (ఆత్మతత్త్వ) <u>**"పంచద్వారపాలకులు".**</u> ఎవ్వరైతే ఈ పంచ దివ్య ద్వారపాలకులను భక్తితో ప్రార్థనలు సమర్పిస్తూ ఉపాసన చేయుచున్నాడో...

పంచద్వారపాలకులను బుద్ధితో ఎరుగుచూ, ఆరాధిస్తూ ఉంటాడో, అట్టివాడు స్వాభావికంగా స్వర్గలోక ఆనంద నివాసమునకు అర్హుడై, స్వర్గలోక ప్రవేశము పొందుచున్నాడు.

---

**7.** **అథ యత్ అతః పరో దివో జ్యోతిః దీప్యతే।**
**విశ్వతః పృష్ఠేషు సర్వతః పృష్ఠేషు**
**అనుత్తమేషు, ఉత్తమేషు లోకేషు**
**ఇదం వావ తద్యత్ ఇదం**
**అస్మిన్ అంతః పురుషే జ్యోతిః॥**

ఏ పరబ్రహ్మజ్యోతి - ఆవలి లోకమగు దివ్యలోకమునందు (స్వర్గలోకమునందు) - అన్నింటికీ పైనగా, విశ్వమునకు ఆవలగా, అనుత్తమ లోకములలో కూడా <u>అంతటా ప్రకాశించుచున్నదో,</u>

అట్టి ఉత్తమ - అనుత్తమ లోకములలో సర్వత్రా ప్రకాశమానమైయున్న జ్యోతియే (Enlightenment)....ఇక్కడ సమస్త భౌతిక శరీరములలో కూడా (పురుషుని అంతరమున కూడా) జ్యోతి స్వరూపమై వెలుగొందుచున్నది.

ఈ ఎదురుగా కనిపిస్తున్న సమస్తము "ఆత్మజ్యోతి" యొక్క తేజోరూపమే।

| | | |
|---|---|---|
| 8. | తస్య ఏషా దృష్టిః<br>యత్ర, ఏతత్ అస్మిన్ శరీరే<br>సగ్ంస్పర్శేన ఉష్ణిమానం విజానాతి। | అట్టి పరంజ్యోతి స్వరూపమే కంటికి సాకారముగా కనబడుచున్న సమస్తముగా వెలుగొందుచున్నది.<br>అట్టి (ఆత్మానంద) జ్యోతి స్వరూపమే ఒకరి శరీరము స్పృశించినప్పుడు 'వెచ్చతనము'గా స్పర్శానుభవము అగుచూ, తెలియబడుతోంది. |
| | తస్య ఏషా శ్రుతిః యత్ర ఏతత్<br>కర్ణావపి గృహ్య నినదం ఇవ,<br>నదథుః ఇవ, అగ్నేః ఇవ,<br>జ్వలత ఉపశృణోతి।<br>తదేతత్ దృష్టం చ,<br>శ్రుతం చ, ఇతి ఉపాసీత।<br>చక్షుష్యః శ్రుతో భవతి,<br>య ఏవం వేద।<br>య ఏవం వేద॥ | అట్టి పరంజ్యోతియే చెవులు (వ్రేళ్ళతో) మూసుకున్నప్పుడు 'ఒం.....' నినదముగా వినపడుతోంది. చెవులలో అగ్నిజ్వాల శబ్దమువలె 'ఒం'కు ఆదిగా (శబ్దరూపంగా) వినబడుతోంది.<br>ఈ విధంగా యోగాభ్యాసి కంటికి కనబడు వెలుగును (వెలుగులో దృశ్యమును),<br>- చెవులకు వినబడే నినదము (Sound)ను,<br>- అగ్నిజ్వాల శబ్దమువలె వినబడు ఛటఛట శబ్దములును<br>ధ్యానపూర్వకంగా ఎరుగుచూ ఉపాసించువాడు ఆత్మతత్త్వము యొక్క దర్శనము, స్పర్శ సిద్ధించుకోగలడు. సర్వత్రా స్వస్వరూపాత్మను, స్వస్వరూపమునందే సమస్తమును గమనించగలడు. |

**ఇతి ఛాందోగ్యోపనిషత్ - తృతీయాధ్యాయే త్రయోదశః ఖండః**

## 3-14. చతుర్దశః ఖండః - శాండిల్య విద్యా

| | | |
|---|---|---|
| 1 | సర్వం ఖల్విదం బ్రహ్మ। | నామ-రూప-గుణాత్మకంగా ఎదురుగా కనిపిస్తున్న ఈ సమస్తముగా ఉన్నది బ్రహ్మమే। |
| | తత్ జలాన్ – ఇతి "శాంత" ఉపాసీత॥ | అట్టి బ్రహ్మమునందే సమస్త దృశ్యము యొక్క ఏర్పడటము, కొనసాగటము, లయము అవటము జరుగుతోంది. అట్టి పరమశాంతమగు బ్రహ్మమును ఉపాసించెదము గాక! |
| | అథ ఖలు క్రతుమయః పురుషో యథా<br>క్రతుః అస్మిన్ లోకే పురుషో భవతి।<br>తథేతః ప్రేత్య భవతి।<br>స క్రతుం కుర్వీత। | అట్టి పరమాత్మ క్రతు (యజ్ఞ)మయ పురుషుడు. అట్టి క్రతు (యజ్ఞ)మయ పరుషునిగా పరమాత్మను తెలుసుకొనెదము గాక। **పురుషుడే ఈ జీవుడు.**<br>- ఈ జీవుడు సంకల్పములను (నిశ్చయములను) కలిగి ఉంటున్నాడు.<br>- ఈ జీవుడు ఏఏ సంకల్పములను (నిర్ణయములను, నిశ్చయములను) కలిగి ఉంటాడో, తదనంతరం అదియే అగుచున్నాడు. అందుచేత, జగత్ యజ్ఞ పురుషుని పురుషకారముగా ఈ జగత్తును భావించువాడు యజ్ఞపురుషుడే అగుచున్నాడు. |
| 2. | మనోమయః ప్రాణ శరీరో, 'భా' రూపః।<br>సత్య సంకల్ప। ఆకాశాత్మా।<br>సర్వ కర్మా। సర్వకామః।<br>సర్వగంధః, సర్వ రసః।<br>సర్వం ఇదం అభ్యాత్తః।<br>అవాకీ అనాదరః॥ | అట్టి బ్రహ్మము...,<br>❖ మనోమయుడు. ఆయన మనస్సే ఇదంతా! ❖ ప్రాణరూపుడు. తేజోరూపుడు. ❖ సత్య సంకల్పుడు. ❖ ఆకాశమంతా ఆత్మగా కలవాడు. ❖ సర్వ కర్మలు ఆత్మయే. ❖ సర్వ కామములు ఆత్మయే. ❖ సర్వగంధములు, రసములు ఆత్మ విన్యాసమే.<br>ఈ సమస్తమును అన్నివైపులా వ్యాపించి ఉన్నది - ఆత్మయే.<br>**ఆత్మ -**<br>- అవాక్మానసగోచరము.<br>- ఎట్టి అదరము (తొట్రుపాటు) లేనట్టిది. |

**3.** **ఏష మ ఆత్మా అంతర్ హృదయే**
**అణీయాన్ వ్రీహేర్వా,**
**యవాద్వా, సర్షపాద్వా,**
**శ్యామాకాద్వా, శ్యామాక తండులాద్వా।**
**ఏష మ ఆత్మా అంతర్ హృదయే జ్యాయాన్ పృథివ్యా**
**జ్యాయాన్ 'అంతరిక్షా'। జ్యాయాన్ 'దివో'।**
**జ్యాయాన్ 'ఏభ్యో-లోకేభ్యః'।**

నా ఈ ఆత్మ నాయొక్క అంతరహృదయమునందు
వ్రీహేర్వా - వడ్ల గింజ చివ్వరి మొన కంటె,
యవ - కారు మినుములు, అలసందల కంటె,
సర్ష పాద్వా - ఆవ గింజల కంటె,
శ్యామాకాద్వా - మిరియపు గింజలకంటె,
శ్యామాక - తృణధాన్య విశేషములకంటె,
తండూలాక్వా - బియ్యపు గింజ కంటె,
వీటన్నిటి సూక్ష్మరూపము కంటే సూక్ష్మాతి సూక్ష్మము।
(The Smallest of the Smallest, The subtlest!)

**అంతేకాదు!**- అంతర హృదయములో వెలుగుచున్న నా ఆత్మ
పృథివికంటే, అంతరిక్షముకంటే, దేవలోకముకంటే,
సమస్త లోకములకంటే కూడా (14 లోకములలో సమస్త వస్తు జాలము కంటే కూడా) అత్యంత శ్రేష్ఠము. మిక్కిలి వృద్ధము.
(The Biggest of the Biggest)

---

**4.** సర్వకర్మా। సర్వకామః।
సర్వగంధః। సర్వరసః।
సర్వం ఇదం అభ్యాత్తో।
అవాకీ అనాదర, ఏష మ
ఆత్మా అంతర్ హృదయ "ఏతత్ బ్రహ్మ"।
ఏతం ఇతః ప్రేత్య అభిసంభవితాఽస్మి - ఇతి
యస్య స్యాదద్ధా న విచికిత్సా అస్తి - ఇతి।
హ స్మాహ శాండిల్యః శాండిల్యః।

సర్వకర్మలు, సర్వ కామములు ఆత్మవే।
సర్వగంధానుభవములు, సర్వ రసానుభవములు కలిగియున్నట్టిది - ఆత్మ।
సర్వ దిక్కులందు, సర్వ వైపులా, సర్వత్రా వ్యాపించి ఉన్నది.
నా యొక్క సర్వదా నేనైయున్న, ఆత్మయొక్క సహజరూపము-
- వాక్యములచే వర్ణించరానిది.
- అదరము (Disturbance) లేనిది. ఈ దృశ్య జగత్తుగా కనిపిస్తున్నా కూడా నిర్వికారమైనది.

అట్టి హృదయమునందలి ఆత్మయే బ్రహ్మము.

**అట్టి ఆత్మ తత్త్వమునందు ఎవరు శ్రద్ధ కలిగి ఉంటారో, వారికి సంసారమునకు సంబంధించిన ఎట్టి సందేహములు మిగిలి ఉండవు.**

ఇది శాండిల్య జగద్గురువుచే ప్రవచించబడిన ఆత్మతత్త్వ విన్యాసము. శ్రీ శాండిల్య మునీశ్వరులుచే ప్రబోధించబడిన ఆత్మజ్ఞాన విశేషము.

శాండిల్య జగద్గురవే నమః।

**ఇతి ఛాందోగ్యోపనిషత్ - తృతీయాధ్యాయే చతుర్దశః ఖండః**

# 3-15. పంచదశః ఖండః - విరాట్ కోశోపాసన

| | మంత్రము | అర్థము |
|---|---|---|
| **1.** | **అంతరిక్ష ఉదరః, కోశో భూమి, బుధ్నో న జీర్యతి।** | ఆత్మకు జీర్యము (నాశనము) అనునదే లేదు. ఈ విశ్వము అట్టి విశ్వేశ్వర రూపమే। అంతరిక్షము ఉదరము (పొట్ట) గాను, భూమి కోశము (ఖజానా) గాను గల ఈ విశ్వము కూడా వినాశనము లేనట్టిదే। |
| | **దిశో హి అస్య స్రక్తయో।** | అట్టి ఈ విశ్వమునకు అష్టదిక్కులు మూలముగా (లేక) కోణములుగా కలిగియున్నట్టిది. |
| | **ద్యౌః అస్య ఉత్తరం బిలగ్ం స ఏష కోశో** | ద్యులోకము (స్వర్గలోకము) పైన ఉండే ఛిద్రము, అనగా బిలము అద్దాని కోశము. |
| | **వసుధానః తస్మిన్ విశ్వం ఇదగ్ం శ్రితమ్॥** | అట్టి విశ్వమునకు రత్నగర్భ అయి భూమి అమర్చబడినదై ఉన్నది. |
| **2.** | **తస్య ప్రాచీ దిక్ 'జుహూః' నామ। "సహమానా" నామ "దక్షిణా"। 'రాజ్ఞీ' నామ ప్రతీచీ। "సుభూతా" నామ ఉదీచీ।** | అట్టి విశ్వమునకు తూర్పు దిక్కు పేరు - **'జుహూ"।** దక్షిణ దిక్కు పేరు - **'సహనామ'** పడమర దిక్కు పేరు - **"రాజ్ఞీ"** ఉత్తర దిక్కు పేరు - **"సుభూతా"** |
| | **తాసాం వాయుః వత్సః ।** | అట్టి నాలుగు దిక్కులకు ప్రియమైన బిడ్డ - 'వాయువు'. |
| | **స య ఏతం ఏవం వాయుం దిశాం వత్సం వేద, న పుత్ర రోదగ్ం రోదితి॥** | అట్టి '4' దిక్కుల యొక్క ముద్దుబిడ్డ అగు దిశ సమన్వితమగు 'వాయువు'ను ఎఱిగినవాడు - కుమారునివలన దుఃఖము ఏమాత్రము పొందడు. (పుత్రునివలన ఆనందమునే పొందగలడు). |
| | **సోఽహమ్ ఏతం ఏవం వాయుం దిశాం వత్సం వేద, మా పుత్ర రోదగ్ం రుదమ్।** | నేను ఈ విధంగా వాయు వీచికలను దిక్కుల ప్రియ పుత్రునిగా ఎరుగుచున్నాను. అందుచేత పుత్రుని గురించిన దిగులు ఇక నాకు ఉండజాలదు. క్షేమముకొరకై బాధ పడనక్కర్లేదు. నా పుత్రుని ఆయుష్షు కొరకై వత్స (Young boy) వంటి వాయు దేవుని ఉపాసించుచున్నాను. |
| **3.** | **"అరిష్టం కోశం" ప్రపద్యే అమునా, అమునా, అమునా॥** | అరిష్టము (మేలు, శుభము) కొరకై - అవినాశియగు 'కోశము'ను "విశ్వకోశము నాశనము లేనిది - లేనిది - లేనిది" - అని ఉపాసించు చున్నాము. |
| | **'ప్రాణం' ప్రపద్యే అమునా, అమునా, అమునా।** | ప్రాణదేవతను కోరికలు నెరవేరుటకై శరణువేడుచున్నాను. |
| | **'భూః' ప్రపద్యే అమునా, అమునా, అమునా।** | అభీప్సితములు నెరవేరటానికై భూలోకమును ఆశ్రయిస్తున్నాను. |
| | **'భువః' ప్రపద్యే అమునా, అమునా, అమునా॥** | అవసర సిద్ధికై భువర్లోకమును శరణు కోరుకొనుచున్నాను. |
| | **"స్వః" ప్రపద్యే అమునా, అమునా, అమునా।** | వాంఛల సిద్ధికై (స్వర్) సువర్లోకమునకు శరణాగతుడను అగుచున్నాను. |

| | | |
|---|---|---|
| **4.** | **స యత్ అవోచం ప్రాణం ప్రపద్య, ఇతి ప్రాణో వా। ఇదగ్ం సర్వం భూతం, యత్ ఇదం కించ తమ్ ఏవ తత్ ప్రాపత్సి।** | **<u>ప్రాణోపాసన అనగా</u>**<br>"ఈ సృష్టిలో (లేక) దృశ్యములో కనిపించే ప్రాణులంతా, అస్మత్ (నాయొక్క) - ప్రాణశక్తి యొక్క ప్రదర్శనమే" అని గమనిస్తూ ఉన్నవాడనై ఉండటము.<br>సర్వ స్వరూపుడగు, స్వయం సమస్త ప్రదర్శనా స్వరూపుడగు - "ప్రాణేశ్వర భగవానుని" ప్రార్థనలను సమర్పిస్తూ ఉపాసించటము. "విశ్వప్రాణ స్వరూపమే నేనై ఉన్నాను" అను ప్రాణేశ్వర స్వరూప ధారణము. |
| **5.** | **అథ యత్ అవోచం భూః ప్రపద్య ఇతి పృథివీం ప్రపద్యే।** | **<u>భూ ఉపాసన అనగా -</u>**<br>"భూః" కు ప్రపత్తి సమర్పిస్తున్నాను - అనగా భూమికి శరణాగతుడను అగుచున్నాను - అను భావన. భౌతికమైనదంతా ఆత్మగా దర్శించటము. |
| | **అంతరిక్షం ప్రపద్యే దివం ప్రపద్య, ఇతి ఏవ తత్ అవోచమ్।** | **<u>అంతరిక్షోపాసన అనగా -</u>**<br>అంతరిక్షమును శరణువేడుచున్నాను. ద్యులోకమును ప్రపద్యించుచున్నాను. అనగా ఆ తత్ పరమాత్మనే నేను ఉపాసించటము - ఉపాసకుడనై ఉపాస్యము అగుచుండటము. |
| **6.** | **అథ యత్ అవోచం భువః ప్రపద్య ఇతి అగ్నిం ప్రపద్యే వాయుం ప్రపద్య। ఆదిత్యం ప్రపద్య। ఇతి ఏవ తత్ అవోచమ్॥** | "భువః ప్రపద్య" అనగా భువలోక ఉపాసనచే -<br>- అగ్నిని ఉపాసిస్తున్నాను<br>- వాయువును ఉపాసిస్తున్నాను<br>- ఆదిత్య భగవానుని ఉపాసిస్తున్నాను<br>అనియే నేను చెప్పుచున్నట్లు! |
| **7.** | **అథ యత్ అవోచగ్ం "స్వః" ప్రపద్య – ఇతి ఋగ్వేదం ప్రపద్యే। యజుర్వేదం ప్రపద్యే। సామవేదం ప్రపద్య ఇతి ఏవ తత్ అవోచం। తత్ అవోచం॥** | **<u>"సువర్లోకమును ఉపాసిస్తున్నాను"</u>** - అని చెప్పుచున్నప్పుడు "ఋగ్వేదమును, యజుర్వేదమును, సామవేదమును ఆరాధిస్తున్నాను" అని చెప్పుచున్నాను. "త్రైవేద అంతర్లీనసారమే నేను" అను ఆరాధన. |

**ఇతి ఛాందోగ్యోపనిషత్ - తృతీయాధ్యాయే పంచదశః ఖండః**

# 3-16. షోడశః ఖండః - ఆత్మయజ్ఞోపాసన-1

**1.** **పురుషో వావ యజ్ఞః।**
**తస్య యాని చతుర్విగ్ంశతి (24) వర్షాణి**
**తత్ "ప్రాతః సవనమ్"।**
**చతుర్విగ్ంశతి (24) అక్షరా**
**గాయత్రీ గాయత్రం ప్రాతః సవనం।**
**తదస్య వసవో అన్వాయత్తాః।**
**ప్రాణా వావ వసవ,**
**ఏతే హి ఇదగ్ం సర్వం వాసయంతి।**

పురుషుడే (వ్యక్తియే) నిశ్చయముగా యజ్ఞము. (నా యొక్క పురుషకారము జగత్ -యజ్ఞవిభాగమే)।

<u>ప్రాతః సవనం</u>

<u>ప్రాతః స్తుతులు</u>

- అట్టి పురుషుడు గడిపిన 24 సంవత్సరముల జీవితము ప్రాతఃకాల యజ్ఞ సవనము.

- అట్టి ప్రాతఃకాల సవనము '24' అక్షరములు కలిగియున్నది.

- (ఈ విధంగా) గాయత్రీమంత్రము 24 అక్షరములు.

- ఉదయ యజ్ఞము "ప్రాతఃకాల గాయత్రీసవనము" - <u>వసువులకు</u> సంబంధించినది.

ప్రాణములు సర్వత్రా విస్తరించి అంతటా నిండి ఉండటంచేత, వసించినవి అవటంచేత - **ప్రాణములే "వసువులు".**

---

**2.** **తం చేత్ ఏతస్మిన్ వయసి**
**కించిత్ ఉపతపేత్,**
**స బ్రూయాత్ ప్రాణా! వసవ।**
**ఇదం మే ప్రాతఃసవనం,**
**మాధ్యం దినగ్ం సవనం అనుసంతనుతేతి।**
**మా అహం ప్రాణానాం వసూనాం**
**మధ్యే యజ్ఞో విలోప్సీయ ఇతి।**
**ఉద్ధైవ తత ఏతి అగదో హ భవతి॥**

ఈ 24 సంవత్సరముల వరకు ఏదైనా వ్యాధివలన కించిత్ బాధ కలుగుతూ ఉంటే - ఇట్లా ప్రార్థన చేయాలి.

**"ఓ ప్రాణ రూపులగు వసువులారా! నేను మీకు భక్తితో సమర్పిస్తున్న ఈ "ప్రాతఃకాల యజ్ఞ సవనము"ను "మాధ్యందిన సవనము"తో ఏకము చేయండి. కలపండి!**

**ప్రాతఃకాల యజ్ఞసవన నిష్ఠుడనైయున్న నేను ప్రాణరూపులగు వసువుల మధ్యలో ఉండి, నాశనము లేనివాడనగుదును గాక। నశించకుండెదను గాక।"**

ఇట్టి ప్రాతః చతుర్వింశతి అక్షరగాయత్రీ - సవనము చేయువాడు సర్వ దైహిక - మానసిక రోగములనుండి విముక్తుడవగలడు.

---

**3.** **అథ యాని చతుఃచత్వారిగ్ంశత్ (44)**
**వర్షాణి తత్ "మాధ్యన్దినగ్ం సవనం।"**
**చతుఃచత్వారిగ్ంశత్ అక్షరా।**
**త్రిష్టుప్। త్రైష్టుభం మాధ్యన్దినగ్ం సవనం।**
**తదస్య రుద్రా అన్వాయత్తాః।**
**ప్రాణా వావ రుద్రా**
**ఏతే హి ఇదగ్ం సర్వగ్ం రోదయన్తి॥**

<u>మధ్యన్దినగ్ం సవనం</u>

<u>మధ్యాహ్న స్తుతులు</u>

ప్రాతః దిన సవనం తరువాత 44 సంవత్సరముల వరకు **"మధ్యందిన సవనము"** - చెప్పబడుతోంది.

- అక్షరములు = '44'

- ఛందస్సు = 'త్రిష్టుప్'

- "త్రిష్టుప్"చే మధ్యాహ్న సవనము గానము చేయబడుతోంది.

అట్టి మధ్యందిన సవనము (ఏకాదశ) రుద్రులకు సంబంధించినది.

- రుద్రులు ఈ విశ్వమునకు రోదనము (ఆక్రందనము, అణచటము) కలిగించువారు. కనుక రుద్రులు.

- ప్రాణములు రోదనములు కలిగించేవి కాబట్టి ప్రాణములే రుద్రులు.

**4.** **తం చేత్ ఏతస్మిన్ వయసి**
**కించిత్ ఉపతపేత్ స బ్రూయాత్।**
**"ప్రాణా! రుద్రా! ఇదం మే మాధ్యన్ దినగ్ం**
**సవనం తృతీయ సవనం అనుసన్తనుతేతి।**
**మా అహం ప్రాణానాగ్ం రుద్రాణాం మధ్యే**
**యజ్ఞో విలోప్సీయేత్ ఇతి**
**ఉద్ధైవ తత ఏతి అగదో హ భవతి॥**

ఈ మధ్యందిన సవనకాలమగు 44 సంవత్సరములు వ్యాధులు కలుగుచున్నప్పుడు ఈ విధంగా ప్రార్థించెదరు గాక।

ప్రాణదేవతలారా! రుద్రులారా! ఈ మా మధ్యాహ్న సమయ సవనము (లేక) యజ్ఞమును మూడవ (తృతీయ) యజ్ఞముగా (వరకు) మలచమని రుద్ర దేవతా స్వరూపులగు మిమ్ములను శరణు వేడుచున్నాను. యజ్ఞపురుషుడనైయున్న నేను ప్రాణదేవతలైనటువంటి రుద్రుల మధ్యగా మిగిలిపోయి రుద్రస్వరూపుడనగుదును గాక। ముందుముందుకు ఉద్ధరించబడెదము గాక।

అట్టివాడు బాధలనుండి విడివడి ఆరోగ్యవంతుడు కాగలడు.

---

**5.** **అథ యాని అష్టాచత్వారిగ్ంశత్ (48)**
**వర్షాణి తత్ తృతీయ సవనం।**
**అష్టాచత్వారిగ్ంశదక్షరా "జగతీ"।**
**జాగతం తృతీయ సవనం**
**తత్ అస్య ఆదిత్యా అన్వాయత్తాః।**
**ప్రాణా వావ ఆదిత్యా ఏతే హి**
**ఇదగ్ం సర్వం ఆదదతే।**

**తృతీయ సవనము**

ఆ తరువాత "48" సంవత్సరముల మూడవ సవనము (యజ్ఞము)

ఛందస్సు - 'జగతీ'।

అక్షరములు - '48'

ఈ జగతీ మూడవ సవనము ఆదిత్యులకు సంబంధించినది.

సర్వము సర్వత్రా ప్రాణములు గ్రహిస్తూ ఉన్నాయి. అందుచేత ప్రాణదేవతలే "ఆదిత్యులు" అయి ఉన్నారు.

---

**6.** **తం చేత్ ఏతస్మిన్ వయసి**
**కించిత్ ఉపతపేత్, స బ్రూయాత్।**
**"ప్రాణా ఆదిత్యా। ఇదం మే తృతీయ సవనం"।**
**ఆయుః అనుసన్తనుతేతి।**
**మా అహం ప్రాణానామ్ ఆదిత్యానాం**
**మధ్యే యజ్ఞో విలోప్సీయేత్ ఇతి।**
**ఉద్ధైవ తత ఏతి అగదో హ భవతి।**

**తృతీయ సవనము**

అట్టి (పైన చెప్పిన) 48 సంవత్సర జీవిత విభాగములో ఏవైనా కష్టములు, బాధలు సందర్భమగుచున్నప్పుడు ఈ విధంగా ప్రార్థించెదరు గాక।

ఓ ప్రాణదేవా! ఆదిత్య స్వరూపా। ఇదే మా తృతీయ (సాయంకాల) సవనం। దయతో స్వీకరించండి. ఈ తృతీయ సవనం ఆయుష్షు ఉన్నంతవరకు నిర్వర్తించుటకై అనుగ్రహించండి.

యజ్ఞభావనతో ''జగతీ మూడవ సవనము'' సమర్పిస్తున్న యజ్ఞకార్యము ప్రాణరూపులగు ఆదిత్యుల మధ్యలో ముగియకుండా కొనసాగింపజేయండి. ఆదిత్య స్వరూపము ప్రసాదించి నన్ను మాయనుండి సముద్ధరించండి.

ఇట్టి ఉపాసన చేయువాడు అన్ని బాధలనుండి విముక్తుడై ఆరోగ్యవంతుడుగా ఉండగలడు.

---

**7.** **ఏతద్ధ స్మ వై తత్ విద్వాన్ ఆహ**
**మహిదాస ఐతరేయః**
**స కిం మ ఏతత్ ఉపతపసి।**
**యో అహం అనేన న ప్రేష్యామి ఇతి**
**స హ షోడశం వర్ష శతం (116)**
**అజీవత్ప్ర హ షోడశం**
**వర్ష శతం (116) జీవతి,**
**య ఏవం వేద। య ఏవం వేద।**

శ్రీ ఐతరేయ మహిదాస మునీంద్రులవారు ఈ యజ్ఞవిధిని పూర్తిగా ఎరిగినవారై, విద్వాంసులై - ఈ విధంగా ప్రవచనము చేస్తున్నారు.

"నేను 116 సంవత్సరములు ఎట్లా జీవించాను? ఈ (1) ప్రాతఃకాల గాయత్రీ మంత్ర 24 సంవత్సరముల 24 అక్షరముల సవనమును,

(2) మధ్యాహ్న త్రిష్టుప్ రుద్ర మంత్ర 44 సంవత్సరముల 44 అక్షరముల సవనమును,

(3) సాయంకాల జగతీ ఛందో 48 సంవత్సరముల 48 అక్షరముల సవనమును

- ఈ మూడిటిని ఉపాసించుట చేతనే। ఎవ్వరు ఇది ఎరుగుచున్నారో వారు 116 సంవత్సరముల దీర్ఘాయుష్మంతులు (24+44+48=116) కాగలరు.

**ఇతి ఛాందోగ్యోపనిషత్ - తృతీయాధ్యాయే షోడశః ఖండః**

# 3-17. సప్తదశః ఖండః - ఆత్మయజ్ఞోపాసన-2

| | | |
|---|---|---|
| **1.** | **స యత్ అశిశిషతి, యత్ పిపాసతి, యత్ న రమతే, తా అస్య"దీక్షాః"।** | యజ్ఞదీక్షలు : ఆకలి అనుభవించటము, దాహము కలిగి ఉండటము, రమించకపోవటము ఇవన్నీ యజ్ఞదీక్షలు. |
| **2.** | **అథ యత్ అశ్నాతి యత్ పిబతి, యత్ రమతే, తత్ ఉపసదైః ఏతి।** | భుజించటము, త్రాగటము, రమించటము - ఇవన్నీ కూడా ఉపసదములు (గురు ఆజ్ఞ ప్రకారం నియమముగా చేయవలసినవి) |
| **3.** | **అథ యద్ధసతి, యజ్జక్షతి యత్ మైథునం చరతి స్తుత శస్త్రైః ఏవ తత్ ఏతి॥** | నవ్వటము, తినటము, సంభోగము - ఇవన్నీ స్తోత్రములు, శస్త్రములు. |
| **4.** | **అథ యత్ తపో దానం ఆర్జవమ్ అహిగ్ంసా సత్యవచనం। ఇతి తా అస్య దక్షిణాః॥** | తపస్సులు, దానములు, ఆర్జవములు అహింసా - ఇవన్నీ సత్యవచనములు. **"ఇవన్నీ యజ్ఞ దక్షిణములు"**. |
| **5.** | **తస్మాత్ ఆహుః సోష్యతి అసోష్టేతి పునః ఉత్పాదనం ఏవ అస్య। తత్ మరణం ఏవ "అవభృథః"** | ఇక్కడ ఫలించునవి, ఫలించనివి అవన్నీ యజ్ఞముయొక్క సత్ఫలితములు, అవియే పునఃఉత్పాదనములు<br>తల్లి ప్రసవించటమే పునర్జన్మ।<br>మరణమే అవభృథ స్నానము. |
| **6.** | **తద్ధ ఏతత్ ఘోర ఆఙ్గీరసః కృష్ణాయ దేవకీ పుత్రాయ ఉక్త్వా ఉవాచ। అపిపాస ఏవ స బభూవ। సో అంతవేళాయాం ఏతత్ త్రయం ప్రతిపద్యేత॥ అక్షితమసి। అచ్యుతమసి। ప్రాణసగ్ంశితం అసీతి। తత్ర ఏతే ద్వే ఋచౌ భవతిః॥** | ఘోర అంగీరస ముని ఒక సందర్భములో దేవకీ పుత్రుడగు శ్రీకృష్ణునికి ఈవిధంగా వివరించి చెప్పుచూ పైవిధంగా పలికారు.<br>అప్పుడు శ్రీకృష్ణుడు ఏ ఇతర విద్యల పట్ల తృష్ణ లేనివారయ్యారు.<br>**ఉత్తమ సాధకుడు మరణ సమయంలో ఈ మూడు మంత్రములను జపించునుగాక।**<br>**- నీవు క్షీణించనివాడవు।**<br>**- చ్యుతి లేనివాడవు।**<br>**- సూక్ష్మ ప్రాణస్వరూపుడవు।**<br>ఈ విషయమై రెండు ఋక్కులు ఉన్నాయి. |
| **7.** | **ఆదిత్ ప్రత్నస్య రేతసః। (జ్యోతిః పశ్యంతి వాసరమ్। పరోయత్ ఇధ్యతే దివి)। ఉద్వయం తమసః పరి జ్యోతిః పశ్యన్త ఉత్తరగ్ం స్వః। పశ్యంత ఉత్తరం దేవం దేవత్రా సూర్యమగన్మ। జ్యోతిః ఉత్తమం ఇతి॥ జ్యోతిః ఉత్తమం ఇతి॥** | బ్రహ్మజ్ఞులగు మహనీయులు ఎల్లవేళలా ఈ దృశ్యజగత్తును (సనాతనము, జగత్కారణము అగు) పరబ్రహ్మముయొక్క రేతస్సుగా (తేజోరూపముగా) దర్శిస్తూ ఉంటారు. జ్యోతికే జ్యోతిని, సమస్తమునకు పరమై - దివ్యమైయున్న తత్త్వమును సర్వే సర్వత్రా గాంచుచున్నారు.<br>ఆత్మజ్ఞానమును అధ్యయనము చేస్తూ ఉన్న మేము కూడా<br>- నిత్యోదితము, చీకటికి ఆవల<br>- సమస్తమునకు పరము<br>అయిన పరంజ్యోతినే దర్శిస్తున్నాము.<br>"మేము ఆత్మజ్యోతి స్వరూపులము" - అను భావన, అనుభూతులను ఆశ్రయిస్తూ ఉన్నాము.<br>సర్వదేతలకు ఆవలగా సమస్త దేవాతీతముగా, సూర్యునికి కూడా ఆవలగా ప్రకాశించు తత్త్వమును చూస్తూ ఉన్నాము. ఉత్తమ స్వయం జ్యోతి స్వరూపంగా స్వస్వరూప - సర్వస్వరూప 'ఆత్మ'ను ఆరాధిస్తున్నాము.<br>అది ఉత్తమపురుష (First Person) జ్యోతి స్వరూపమే। అదియే నేను - నీవు కూడా। |

**ఇతి ఛాందోగ్యోపనిషత్ - తృతీయాధ్యాయే సప్తదశః ఖండః**

## 3-18. అష్టాదశ ఖండః - చతుష్పాద బ్రహ్మోపాసనా

**1.** **"మనోబ్రహ్మ" - ఇతి ఉపాసీత ఇతి అధ్యాత్మం।**
**అథ అధిదైవతం।**
**ఆకాశో బ్రహ్మేతి।**
**ఉభయం ఆదిష్టం భవతి,-**
**అధ్యాత్మం చ అధిదైవతం చ॥**

ఈ మనస్సు బ్రహ్మమే। కనుక, "మనస్సు యొక్క సహజ-వాస్తవ స్వరూపము ఆత్మయే" అని ఉపాసించుచున్నాము.

అట్టి బ్రహ్మమును సర్వ జీవులలో వేంచేసినదై ఉండటంచేత ''అధ్యాత్మము'' అని, సర్వ దైవతా స్వరూపము కాబట్టి "అధి-దైవతము'' అని ఆరాధిస్తున్నాము. 'ఆకాశము' బ్రహ్మమే। అధ్యాత్మము (దేహము), దేవతలు (అధిదైవతము) కూడా ఆది స్వరూపమగు బ్రహ్మమే। కనుక సమస్త జీవులలో 'అహమ్-నేను' రూపమున మాకు ప్రదర్శనము అగుచున్నట్టిదే - "అధి దైవతము". అధిదైవమే పరబ్రహ్మము.

---

**2.** **తత్ ఏతత్ చతుష్పాద్ బ్రహ్మ।**
**వాక్ పాదః, ప్రాణః పాదః,**
**చక్షుః పాదః శ్రోత్రం పాద - ఇతి అధ్యాత్మమ్॥**
**అథ అధిదైవతం। అగ్నిః పాదో।**
**వాయుః పాద ఆదిత్యః పాదో।**
**దిశః పాద - ఇతి ఉభయం ఏవ**
**ఆదిష్టం భవతి। అధ్యాత్మం చ ఏవ।**
**అధిదైవతం చ॥**

అట్టి పరబ్రహ్మమునకు పాదములు-4.

**అధ్యాత్మము (దేహమునకు సంబంధించి)**

1. వాక్ ఇంద్రియ పాదము
2. ప్రాణ పాదము
3. నేత్రములు (కళ్ళు) - పాదము
4. చెవులు (వినికిడి) - పాదము.

ఇది "అధ్యాత్మము''।

**అధి దైవతము**

దేవతలకు సంబంధించిన పాదములు.

1. అగ్ని 2. వాయువు 3. ఆదిత్యుడు 4. దిక్కులు

ఇదియే (శరీరము - దేవతల) అధిదైవతోపాసన.

**ఇవి అధ్యాత్మ - అధిదైవతోపాసనములు.**

---

**3.** **వాక్ ఏవ బ్రహ్మణః చతుర్థః పాదః।**
**సో అగ్నినా, జ్యోతిషా భాతి చ,**
**తపతి చ। భాతి చ తపతి చ కీర్త్యా**
**యశసా బ్రహ్మవర్చసేన య ఏవం వేద।**

**వాక్కు బ్రహ్మమే।** బ్రహ్మముయొక్క నాలుగు పాదములలో ఒకటి ఈ వాక్కు.

బ్రహ్మమే అగ్నిగా, వెలుగుగా (జ్యోతిస్వరూపమై) వెలుగొందుచున్నది.

సమస్తమును తపింపజేయుచున్నది. ఈవిధంగా బ్రహ్మమే సర్వముగా భాసిస్తూ, సమస్తమును తపింపజేయుచున్నదని ఎవరు ఎరుగుచున్నారో, అట్టివారు కీర్తి, యశస్సు, బ్రహ్మ తేజస్సు కలిగి ప్రకాశించగలరు.

---

**4.** **ప్రాణ ఏవ బ్రహ్మణః చతుర్థః పాదః।**
**స వాయునా జ్యోతిషా భాతి చ।**
**తపతి చ। భాతి చ।**
**తపతి చ కీర్త్యా యశసా**
**బ్రహ్మవర్చసేన య ఏవం వేద।**

ప్రాణమే బ్రహ్మము. ప్రాణము బ్రహ్మముయొక్క నాలుగు పాదములలో ఒకటి.

అట్టి ప్రాణము వాయు స్పర్శచే జ్యోతి స్వరూపమై ప్రకాశించుచూ ప్రదర్శనమగుచున్నది. సమస్తమును ప్రాణము తపింపజేయుచున్నది. అన్నిటినీ వెలిగించుచున్నది. ప్రాణమును ఆత్మయే తపించుచు, ప్రాణమునకు 'ప్రాణి' అయి ఉన్నది.

ఎవ్వరు ప్రాణమును పరబ్రహ్మ స్వరూపంగా ఎరిగి ఉపాసిస్తారో, అట్టి వారు గొప్ప తపోవంతులు, కీర్తివంతులు, యశోసంపన్నులు, బ్రహ్మవర్చస సంపన్నులు అగుచున్నారు.

| | | |
|---|---|---|
| **5.** | “చక్షుః” ఏవ “బ్రహ్మణః” చతుర్థః పాదః।<br>**స ఆదిత్యేన జ్యోతిషా భాతి చ।**<br>**తపతి చ। భాతి చ తపతి చ**<br>**కీర్త్యా యశసా బ్రహ్మవర్చసేన య ఏవం వేద॥** | **ఈ చక్షువులు (చూపు) బ్రహ్మమే అయి ఉన్నది.** బ్రహ్మము యొక్క నాలుగు పాదములలో ఒకటి - ‘చక్షువులు’.<br><br>నేత్రములోని తేజస్సే ఆకాశంలో సూర్య ప్రకాశముగా వెలుగొందుచున్నది. సూర్య ప్రకాశ చైతన్యమే కళ్ళలో తేజస్సుగా ప్రకాశముగా, చైతన్యమై వెలుగొందుచున్నది.<br><br>ఈ విధంగా **“కళ్ళలోని వెలుగు”, “సూర్యునిలోని వెలుగు”** - ఏకము, అఖండము అగు బ్రహ్మప్రకాశమే - అని గ్రహించి తపస్సు నిర్వర్తించు వారు తపోఫలము, కీర్తి, యశస్సు, బ్రహ్మవర్చస్సు పొందుచున్నారు. |
| **6.** | **శ్రోత్రం ఏవ బ్రహ్మణః చతుర్థః పాదః**<br>**స దిగ్భిః జ్యోతిషా భాతి చ।**<br>**తపతి చ। భాతి చ తపతి చ**<br>**కీర్త్యా యశసా బ్రహ్మవర్చసేన**<br>**య ఏవం వేద। య ఏవం వేద॥** | చెవి-వినికిడి బ్రహ్మమే అయి ఉన్నాయి.<br><br>ఇది బ్రహ్మమునకు నాలుగవ పాదము. ఇది దిక్ దేవతా రూపమై నాలుగు దిక్కులలో జ్యోతి స్వరూపంగా ప్రకాశిస్తోంది. నాలుగు దిక్కులను తపింపజేస్తోంది. తాను వెలుగుతూ, దిక్కులన్నీ వెలిగిస్తోంది.<br><br>ఈవిధంగా బ్రహ్మమే ‘వినికిడి’ రూపంగా దిక్కులన్నీ వెలిగిస్తూ తపింపజేస్తూ ఉన్నదని ఎరిగి ఉపాసించువాడు - **బ్రహ్మవర్చస్సు, కీర్తి పొందుచున్నాడు.** |

**ఇతి ఛాందోగ్యోపనిషత్ - తృతీయాధ్యాయే అష్టాదశః ఖండః**

## 3-19. ఏకోనవింశః ఖండః - ఆదిత్యబ్రహ్మోపాసనా

| | | |
|---|---|---|
| **1.** | **"ఆదిత్యో బ్రహ్మ" ఇతి ఆదేశః।<br>తస్య ఉపవ్యాఖ్యానమ్।<br>'అసత్' ఏవ ఇదమ్ అగ్ర ఆసీత్॥<br>తత్ సదాసీత్, తత్ సమభవత్।<br>తత్ ఆండం నిరవర్తత।<br>తత్ సంవత్సరస్య మాత్రామ్ అశయత।<br>తత్ నిరభిద్యత। తే ఆండకపాలే రజతం చ,<br>సువర్ణం చ అభవతామ్।** | ఆదిత్యుడు (సూర్యుడు) బ్రహ్మమే। ఇది ఆదేశము (This is the order)<br><br>తదితర విశేషములన్నీ ఉపవ్యాఖ్యానము (Talking about other relevant details) మాత్రమే।<br><br>మొట్టమొదట - "కేవలము, 'అన్యము' అనునది కించిత్ కూడా లేనట్టిది" - అగు 'ఆత్మ' మాత్రమే ఉన్నది. అట్టి మొట్టమొదటి స్థితియందు ఈ 'జగత్తు' అనునది లేదు. అనగా అసత్తు (Non present)! అది ఎప్పటికీ యథాతథము.<br><br>మొట్టమొదట 'సత్' (existence) అయి, అద్దాని నుండి (లేక) అట్టి 'ఆసత్'యే ఈ 'భూమి' మొదలైనవన్నీగా ప్రదర్శనమగుచున్నది. అవ్యక్తంలోంచి వ్యక్తము అగుచు, అండాకారము (గ్రుడ్డు ఆకారము) బయల్వెడలుతోంది.<br><br>ఆ విధముగా అండాకారము (బ్రహ్మాండము)గా పరిణమించి, అది ఒక సంవత్సర కాలము అట్లే ఉన్నది.<br><br>ఆ అండము పగిలి - రెండు ముక్కలుగా (విభాగములుగా) అయి - అవి ఒకటి వెండిరంగుతో మరొకటి సువర్ణము (బంగారము) రంగుతోను రూపుదిద్దుకున్నాయి. |
| **2.** | **తత్ యత్ రజతగ్ం సేయం పృథివీ<br>యత్ సువర్ణగ్ం, సా ద్యౌర్యత్<br>జరాయు తే, పర్వతా।<br>యత్ ఉల్బగ్ం, స మేఘో నీహారో<br>యా ధమన యస్తా నద్యో<br>యత్ వాస్తేయమ్ - ఉదకగ్ం స సముద్రః॥** | I. వెండి రంగుగా కనిపిస్తున్న ప్రథమార్థ భాగము (1st Half) - ఈ సమస్త భూతలము (All that is solid) - భూలోకము.<br><br>II. బంగారపు రంగుతో కనిపిస్తున్న ద్వితీయార్థ భాగము (2nd Half) ద్యులోకము (లేక) స్వర్గలోకము.<br><br>బాహ్యమున ఉన్న విభాగం చర్మ భాగము - పర్వతములు.<br><br>ఆ అండములోని ఉల్బగము (పొంగుతూ కనిపించు విభాగము) - మేఘములు<br><br>ఆ అండములోని 'నరములు'గా ఉన్న విభాగములు - నదులు<br><br>ఆ అండమునకు అడుగున ఉన్నవి - సముద్రములు |
| **3.** | **అథ యత్ తత్ అజాయత,<br>సో అసావాదిత్యః<br><br>తం జాయమానం<br>ఘోషా ఉలూలవో అనూద తిష్ఠన్<br>సర్వాణి చ భూతాని, సర్వే చ కామాః॥<br><br>తస్మాత్ తస్య ఉదయం ప్రతి ప్రత్యాయనం<br>ప్రతి ఘోషా ఉలూ లవో అను-ఉత్తిష్ఠన్తి<br>సర్వాణి చ భూతాని, సర్వే చ కామాః॥** | ఆ తరువాత ఏది జనించిందో, అది ఆదిత్యుడు (మొట్టమొదట సృష్టిరూపంగా బయల్వెడలుచున్నట్టి తత్త్వము).<br><br>ఆ ఆదిత్యునినుండి 'ఘోష' (పెద్ద శబ్దము - Big Bang) బయల్వెడలి, అది అన్నివైపులా విస్తరిస్తూ ఈ సమస్త భూతజాలము, ఆ భూతజాలముల అవసరములు, ఆశయముల రూపంగా విస్తరించసాగింది.<br><br>ఈ విధంగా ఆ ఆదిత్యుని ఉదయము, అస్తమయము వాటిననుసరించి జీవులు, ఆ జీవులనుండి ప్రతిఘోష (Resound) సర్వభూతజాలము, వారివారి కోరికలు, ఆశయములు బయల్వెడలటం జరుగుతోంది.<br><br>(అహమాత్మా సర్వభూతాశయ స్థితః - భగవద్గీత)। |

**4. స య ఏతం ఏవం విద్వాన్**
**"ఆదిత్యం బ్రహ్మేతి" ఉపాస్తే॥**
**అభ్యాసో హ యత్ ఏనగ్ం**
**సాధవో ఘోషా ఆ చ గచ్ఛేయుః**
**ఉప చ – నిమ్రేడేరన్। నిమ్రేడేరన్।**

ఈ విధంగా -

- కేవలమగు, నిర్విషయమగు సత్‌రూపాత్మ।

- అద్దాని నుండి అండము।

- అండము 'రెండుగా' అవటము।

- అవి భు-స్వర్గ లోకములవటము।

- ఆ ఆదిత్యుని నుండి ఘోష

- ఆ ఘోష నుండి జీవులు (Individual Beings) వారి ఆశయములు, ఆర్తి, ఆవేదనలు।.......

బయల్వెడలటము ఎరిగినవారై, అట్టి "ఆదిత్యుడే బ్రహ్మము'' అని ఉపాసిస్తారో, అభ్యాసపరులై ఉంటారో -

అట్టి ఉపాసకుని నుండి (ఓంకార) ఘోష అనుభూతమై, వేదనాదములు జనిస్తూ సర్వత్రా ఆనందము కలిగించగలవు. ఆతడు ఆనందవంతుడు, సుఖవంతుడు కాగలడు.

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - తృతీయాధ్యాయే ఏకోనవింశతిః ఖండః

**ఇతి - ఛాందోగ్యోపనిషది - తృతీయో అధ్యాయః సమాప్తః॥**

# చతుర్థ ప్రపాఠకః

## 4-1. ప్రథమ ఖండము - జ్ఞానశ్రుతి రైక్వ ఉపాఖ్యానము - సంవర్గ విద్యా

**1.** ఓమ్।
జానశ్రుతిః హ పౌత్రాయణః
శ్రద్ధాదేయో బహుదాయీ బహుపాక్య ఆస।
స హ సర్వత ఆవసథాన్
మాపయాంచక్రే సర్వత ఏవ
మే - అత్స్యంతి - ఇతి॥

జానశ్రుత వంశీయుడు - జనశ్రుతుని ప్రపౌత్రుడు (మునిమనుమడు) - శ్రీ జానశ్రుత పౌత్రుడు.

ఆ జానశ్రుత పౌత్రుడు ఎంతో శ్రద్ధగా దానములు చేస్తూ ఉండేవారు. గొప్ప 'అన్నదాత'గా లోకప్రసిద్ధుడైనారు.

"జనులు అన్నదానము స్వీకరించి సుఖముగా ఉండెదరు గాక।" - అని భావించి ఆయన అనేకచోట్ల అన్నదాన సత్రములను, ధర్మశాలలను కట్టించారు కూడా।

---

**2.** అథ హ హగ్ంసా నిశాయాం అతిపేతుః
తద్ ధ ఏవగ్ం హగ్ంసో హగ్ంసం అభ్యువాద
హో! హో! అయి।
భల్లాక్ష! భల్లాక్ష!
జానశ్రుతేః పౌత్రాయణస్య
సమం దివా జ్యోతిః ఆతతం।
తత్ మా ప్రసాఙ్క్షీః।
తత్ త్వా మా ప్రధాక్షీః ఇతి॥

ఒకానొకరోజు సాయం సమయంలో ఆ జానశ్రుతి పౌత్రాయణుడు మేడపై గల విశాల ప్రదేశంలో చల్లటి గాలులు సేవిస్తూ ప్రశాంతంగా విశ్రాంతి తీసుకుంటూ ఉన్నారు. ఆతనికి ఎదురుగా రెండు హంసలు ఆకాశంలో ఎగిరిపోతూ ఈ విధంగా సంభాషించుకోవటం వినసాగారు.

<u>మొదటి హంస :</u> అహో! అహో! ఆశ్చర్యం! ఓ మిత్రమా! భల్లాక్షా! భల్లాక్షా! అదిగో! ఆ జానశ్రుతి పౌత్రాయణుడిని చూస్తున్నావా? ఈయన చేస్తున్న అన్నదానమునకు లోకశుభముకొరకై కట్టించిన ధర్మశాలలకు, అన్నసత్రములకు - ఈయన ఎంతో తేజోవంతుడైనాడు. ఆయన కీర్తి, తేజస్సు ద్యులోకము (స్వర్గలోకము) వరకు వ్యాపించి ప్రకాశిస్తోంది. ఓ పరిమితమగు కాళ్లు గల మిత్రమా! చూస్తున్నావు కదా!

అదిగో! దేవలోకము వైపుగా ప్రసరిస్తూ ఉన్న ఆయన అన్నదాన తేజస్సును పొరపాటుగా స్పృశించవద్దు సుమా! ఎందుకంటే ఆతని అన్నదాన తేజస్సును నీవు స్పృశించావో, అది నిన్ను తగలబెట్టగలదు.

---

**3.** తము హ పరః ప్రతి ఉవాచ-
కం వర ఏనమ్ ఏతత్
సంతగ్ం సయుగ్వానమ్ ఇవ
రైక్వామ్ ఆత్థేతి?
యో ను కథగ్ం సయుగ్వా, రైక్వ? ఇతి॥

<u>రెండవ హంస :</u> ఏమిటి? అజ్ఞానిలా ఉన్నావే! ఈ జానశ్రుతి పౌత్రాయణుని గురించి నాకు ఇంత గొప్పగా చెప్పుచున్నావేమిటి? ఈ రాజు అల్పుడు మాత్రమే అయి ఉండగా, ఈతనిని బండి రైక్వునితో సమానంగా పొగుడుచున్నావా? సరికాదు. ఆ రైక్వుని **<u>(రైక్వుడు అను పేరు గలవాని)</u>** ముందు ఈ జానశ్రుతి పౌత్రుడు ఎంతటివాడు? గమనించలేదా?

<u>మొదటి హంస :</u> బండితో కూడిన రైక్వుడా? ఆయన ఎవరు? కాస్త విడమర్చి, వివరించి చెప్పండి.

---

**4.** యథా కృతాయ విజితాయ
అధరేయాః సంయతి ఏవం ఏనగ్ం
సర్వం తత్ అభిసమేతి।
యత్కించ ప్రజాః సాధు కుర్వంతి,
యః తత్ వేద, యత్ స వేద
స మయా ఏతత్ ఉక్త ఇతి॥

**<u>రెండవ హంస :</u>** ఒక జూదరి జూదములో 4 పందెములు గెలిచాడనుకోండి. అప్పుడు ఆతనికి 3, 2, 1 పందెములు గెలిచినవారు వశమై ఉంటారు కదా।

అట్లాగే ఆ రైక్వుడు తదితర అన్నదానాది సత్కర్మల ఫలములన్నీ ఏది తెలుసుకొంటే వశమై ఉంటాయో - అవన్నీ తెలుసుకొని ఉన్నట్టివాడు. జనులు చేస్తున్న సత్కర్మలన్నీ (4 పందెములు గెలిచిన జూదక్రీడాకారుని వలె), సమస్త కర్మలు చేసిన ఫలము జ్ఞాని అయి ఆ రైక్వుడు సంపాదించుకున్నారు. అందుచేత "అట్టి బండి రైక్వుని సత్కర్మ ఫలముల ముందు అన్నదానం చేస్తున్న ఈ జానశ్రుత పౌత్రాయణుని కర్మ ఫలమెంత?" - అని ప్రశ్నించాను.

---

**5.** తదు హ జానశ్రుతిః
పౌత్రాయణ ఉపశుశ్రావ।

ఆకాశంలో ఎగురుచూ వెళ్లుచున్న ఆ రెండు హంసల సంభాషణను జానశ్రుత పౌత్రాయణుడు శ్రద్ధగా విన్నారు.

**స హ సంజిహాన ఏవ**
**క్షత్తారమ్ ఉవాచ**
**అంగారే హ సయుగ్వానం ఇవ**
**రైక్వమ్ ఆత్థేతి యో?**
**కథగ్ం సయుగ్వా రైక్వ? ఇతి।**

జానశ్రుతపౌత్రాయణుడు - ఆ మరునాడు నిద్రలేస్తూనే (తన సేవకునితో) (వైతాళిక మాటలు వింటూ)

ఓ ప్రతీహారీ! వైతాళికా! నన్ను సయుగ్వ రైక్వునివలె పొగుడు చున్నావేమిటయ్యా? నేను సయుగ్వా రైక్వుని (బండితో కూడిన రైక్వుని) ముందు అల్పుడనని నీకు ఇంకా తెలియదా? ఆయనను పిలుచుకురండి.

**ప్రతిహారి (సేవకుడు)** : మహాన్! ఆ 'సయుగ్వ రైక్వుడు' అనగా ఎవరు? ఎక్కడుంటాడో మరి?

---

**6.** **యథా కృతాయ విజితాయ ఆధరే యాః**
**సంయంతి ఏవం ఏనగ్ం**
**సర్వం తత్ అభిసమేతి**
**యత్కించ ప్రజాః సాధు కుర్వంతి**
**యః తత్ వేద - యత్స వేద,**
**స మయా ఏతత్ ఉక్త - ఇతి॥**

**జానశ్రుత పౌత్రాయణుడు** : ఓ ప్రతీహారీ! వైతాళికా ఆ సాయుగ్వానమివ (నాలుగు చక్రాల బండిని అధిరోహించిన) రైక్వుడే పొగడ తగినవాడుగాని, నేను కాదు.

ఒక జూదగాడు కృతాయమ అనే క్రీడలో నాలుగు ఆటలను గెలిచినప్పుడు - ఆతనికి మిగతా 3-2-1 ఆటలు గెలిచినవారిపై ఆధిపత్యం ఉంటుంది కదా! అట్లాగే, ఆ రైక్వుడు ఏది తెలుసుకున్నాడో, మిగతా ఉత్తమ కర్మపరులంతా వశులై ఉంటారు. తెలుసుకోవలసినది తెలుసుకొని ఉండటంచేత కర్మిష్ఠులగు మేము ఆ రైక్వుని ముందు స్వల్పులము. మీరు వెళ్లి ఆయన ఎక్కడున్నా చూచి పిలుచుకురండి.

---

**7.** **స హ క్షత్తా అన్విష్య**
**న అవిదం ఇతి ప్రత్యేయాయ**
**<u>తగ్ం హ ఉవాచ-</u>**
**యత్ర, అరే! బ్రాహ్మణస్య**
**అన్వేషణా తత్ ఏనమ్ అర్ఛ ఇతి॥**

సేవకుడు రైక్వుని కోసం వెతికి, ఆయన కనబడక తిరిగివచ్చి జానశ్రుత పౌత్రాయణునితో ఇట్లు పలికారు.

సేవకుడు : అయ్యా! మునివర్యా! మీరు చెప్పిన ఆ రైక్వుని కోసం చాలా గ్రామాలలో వెతికాము. వారు కనబడలేదు. ఏమి చేయమంటారు?

**జానశ్రుత పౌత్రాయణుడు** : ఓ సేవకా! వైతాళికా! ఎవ్వరు ఎక్కడ నివాసం కలిగి ఉంటారో - అక్కడ వెతకాలి. ఎక్కడెక్కడో ఆయనకు నివాసము కానిచోట్ల వెతికి ఏమి ప్రయోజనం? ఎక్కడ బ్రహ్మతత్త్వజ్ఞులు నివసిస్తూ ఉంటారో అక్కడ వెతికి, ఆయనను గుర్తించి పట్టుకు రండి!

---

**8.** **సో అధస్తాః శకటస్య పామానం**
**కషమాణం ఉప ఉపవివేశ।**
**తగ్ం హ అభ్యువాద త్వం ను**
**భగవః సయుగ్వా, రైక్వ?**
**ఇతి అహగ్ం హి అరా ఇతి।**
**హ ప్రతిజజ్ఞే స హ క్షత్తా**
**అవిదం ఇతి ప్రత్యేయాయ॥**

అప్పుడు ఆ సేవకులు మరల వెళ్లి తత్త్వజ్ఞులు నివసించే పవిత్ర ప్రదేశములలో రైక్వుని కొరకు వెతకనారంభించారు.

అప్పుడు ఒక బండి క్రింద (అధస్తాః శకటస్య) - దురద పొక్కులు గోక్కుంటూ ఒకాయన కనిపించారు. ఆ సేవకులకు "ఈయన రైక్వుడేమో?" - అనే అనువనం వచ్చింది.

ఆయన కూర్చునియున్న బండి క్రింద స్థానమును సమీపించారు.

**జానశ్రుత పౌత్రాయుని సేవకులు** : హే పూజనీయా! మహానీయా! "బండితో కూడిన రైక్వుడు" అనగా తమరే కదా?

**బండి క్రింద కూర్చున్న ఆయన** : అవును. మీరు అడిగే ఆ రైక్వుడను నేనే! అనుమానమెందుకు వచ్చింది?

అప్పుడు ఆ సేవకులు "అమ్మయ్య। మన యజమాని వెతకమని చెప్పిన రైక్వుడు కనిపించారు।"... అని సంతోషము పొందినవారై,జానశ్రుత పౌత్రేయుని సమీపించి, "రాజా! మునీశ్వరా! మేము దేవరవారు (మీరు) వర్ణించి చెప్పిన రైక్వుని కనుగొన్నాము. దగ్గరలోనే బండి క్రింద ఏకాంతంగా కూర్చుని ఉన్నారు" - అని తెలియజేసారు. అప్పుడు జానశ్రుత పౌత్రుడు గబగబలేచి సయుగ్వా (బండి క్రింద గల) రైక్వుని దర్శనము కొరకై జ్ఞానార్థి అయి బయల్వెడలారు.

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - చతుర్థాధ్యాయే ప్రథమః ఖండః**

## 4-2. ద్వితీయ ఖండము - జ్ఞానమునకు అర్హత నిరహంకారము, ప్రపత్తి

| | | |
|---|---|---|
| **1.** | **తదు హ జానశ్రుతిః పౌత్రాయణః<br>షట్ శతాని గవాం నిష్కం - అశ్వతరీ - రథమ్<br>తత్ ఆదాయ, ప్రతిచక్రమే తగ్ం హ అభ్యువాద॥** | జానశ్రుతి పౌత్రాయణుడు సేవకులు చెప్పిన గుర్తులను అనుసరించి వెళ్లారు. 600 గోవులను, గుఱ్ఱములను, రథములను తీసుకొని మహానుభావుడగు ఆ రైక్వుడు ఉన్నచోటును జ్ఞానార్థి అయి సమీపించారు. శ్రీ రైక్వునికి అభివాదములు సమర్పించారు. |
| **2.** | **రైక్వేమాని షట్‌శతాని,<br>గవాం అయం నిష్కో<br>అయమ్ అశ్వతరీ రథో ను<br>మ ఏతాం భగవో దేవతాగ్ం శాధి<br>యాం దేవతామ్ ఉపాస్స ఇతి॥** | **జానశ్రుత పౌత్రేయుడు** : బండి క్రింద విశ్రాంతి తీసుకుంటున్న మహామహనీయా! రైక్వమహాశయా! మీ కొరకై 600 ఆవులను, గుఱ్ఱములను, రథములను సమర్పించటానికై తీసుకొచ్చాను. దయతో స్వీకరించండి. అనుగ్రహించండి. మీరు ఏ దేవతా ఉపాసనచే దివ్యజ్ఞానము పొందారో, అట్టి దివ్యతత్త్వవిశేషమును శ్రవణం చేయాలని వచ్చాను. దయతో వివరించమని తమకు నా ప్రార్థన. |
| **3.** | **తము హ పరః ప్రతి ఉవాచ అహ<br>హారే త్వా శూద్ర; తవ ఏవ సహ గోభిః అస్తు॥ ఇతి॥<br>తదు హ పునః ఏవ జానశ్రుతిః<br>పౌత్రాయణః సహస్రం గవాం,<br>నిష్కం అశ్వతరీ రథం<br>దుహితరం తదాదాయ ప్రతిచక్రమే॥** | రైక్వుడు : ఓయీ! శూద్రా! నీవు తెచ్చిన గోవులు, గుఱ్ఱములు, రథములు నాకెందుకు? నేనేం చేసుకుంటాను? నీవే దాచుకో!<br><br>**జానశ్రుత పౌత్రేయుడు** : స్వామీ! అట్లాగా! అయితే 1000 గోవులను, చక్కటి గుఱ్ఱములతో కూర్చిన రథమును సమర్పించుకుంటాము. నాకు జ్ఞానము బోధించండి.<br><br>రైక్వుడు : అవన్నీ నాకెందుకు చెప్పు? |
| **4.** | **తగ్ం హ అభ్యువాద, రైక్వా!<br>ఇదగ్ం సహస్రం గవాం అయం<br>నిష్కో అయం అశ్వతరీ రథ<br>ఇయం జాయా అయం<br>గ్రామో యస్మిన్ నాస్సే అను ఏవ<br>మా భగవన్। శాధి। ఇతి॥** | **జానశ్రుత పౌత్రేయుడు** : (మరల మరల అభివాదములు పలుకుచూ) ఓ రైక్వేయ మహాత్మా! నమో నమః। మీకు 1000 గోవులు, శ్రేష్ఠమైన గుఱ్ఱములు, రథములు తెచ్చి సమర్పిస్తున్నాను. స్వీకరించండి.<br><br>నా భార్యపుత్రులతో సహా మీకు సేవకులమౌతాము.<br><br>ఇదిగో! కంచరగాడిదల రథము. నా కుమార్తెయగు ఈమెను మీకు జీవితభాగస్వామిగా సమర్పిస్తాను. మీరున్న ఈ గ్రామమును మీకు కానుకగా సమర్పిస్తున్నాను.<br><br>హే భగవాన్! ఇంకా ఏమి కావాలో కోరుకోండి - స్వామి! నాకు మీరు ఆత్మజ్ఞానము సిద్ధించుకొన్న తీరు దయతో వినిపించండి. |
| **5.** | **తస్యా హ ముఖమ్ ఉపోద్ గృహ్ణన్ ఉవాచ :<br>ఆజహార ఇమాః శూద్ర అనేనైవ<br>ముఖేన ఆలాపయిష్యథా ఇతి॥<br>తే హి ఏతే రైక్వపర్ణా - నామ<br>మహావృషేషు యత్ర - అస్మా<br>ఉవాస, స తస్మై హ ఉవాచ॥** | రైక్వుడు : జానశ్రుత పౌత్రేయుని కుమార్తె ముఖం వైపుగా చూచారు. ఏదో అవ్యాజమైన బ్రహ్మజ్ఞాన తేజస్సును గమనించారు. "విద్యా ముఖము" అని గ్రహించారు. బ్రహ్మవిద్యను సంభాషించటానికి అంగీకారము పలికారు. "ఓ శూద్రుడా! మీరు కోరినట్లు మీ కుమార్తె ముఖంలోని బ్రహ్మతేజస్సును గౌరవిస్తూ తత్త్వ సంబంధమై సంభాషించటానికి సంసిద్ధుడను" - అని పలికారు.<br><br>అప్పటి నుండి ఆ మహావృషల దేశములోని ఆ రైక్వుడు బండిక్రింద ఉండి ఉన్న గ్రామము "రైక్వపర్ణ" అనే పేరుతో ప్రసిద్ధమయింది.<br><br>ఆ చోటనే ఉండి ఇక రైక్వుడు జానశ్రుత పౌత్రేయుని విన్నపమును అనుసరించి ప్రసంగించటానికి సిద్ధమైనారు. |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - చతుర్థాధ్యాయే ద్వితీయః ఖండః**

# 4-3. తృతీయ ఖండము - సంవర్గము (విలీనము, ఆశ్రయము)

బండి క్రిందనే ఉండే మహనీయుడగు రైక్వుడు ఈ విధంగా ప్రసంగించసాగారు.

ఓ జానశ్రుత పౌత్రేయ మహాశయా! వినండి.

| | మూలము | అర్థము |
|---|---|---|
| **1.** | **వాయుః వావ సంవర్గః।** | అధిదైవతమునకు 'వాయువు'యే సంవర్గము, చివరికి ఆశ్రయము వాయువే! |
| | **యదా వా అగ్నిః ఉద్వాయతి 'వాయుమ్' ఏవ అవాప్యేతి॥** | అగ్ని చల్లబడినప్పుడు ఆశ్రయిస్తున్నది ఏది? వాయువునే! |
| | **యదా సూర్యో అస్తమేతి, 'వాయుమ్' ఏవ అవాప్యేతి।** | సూర్యుడు అస్తమించినప్పుడు వాయువునందే ప్రవేశము పొందుచున్నారు. |
| | **యదా చంద్రో అస్తమేతి, 'వాయుమ్' ఏవ అవాప్యేతి॥** | అట్లాగే చంద్రుడు కూడా అస్తమించినప్పుడు వాయువునందే లీనము, మమేకము అగుచున్నారు. |
| **2.** | **యదా ఆప ఉచ్ఛుష్యంతి, 'వాయుమ్' ఏవ ఆపియంతి।** | జలము ఇంకిపోయినప్పుడు ప్రవేశము పొందుచున్నది ఎందులో? వాయురూపమే పొందుచున్నది. |
| | **వాయుర్హ్యే ఏవ ఏతాన్ సర్వాన్ సంవృంక్త ఇతి "అధిదైవతమ్"॥** | వాయువే సమస్తమును చివరికి మ్రింగివేయుచున్నది. అందుచేత వాయువే "అధిదైవతము"। |

## అధ్యాత్మము

| | మూలము | అర్థము |
|---|---|---|
| **3.** | **అథ అధ్యాత్మం।** | ఇక అధ్యాత్మము. శరీరములోని అంతర్గతంగా ఉండిన శక్తులకు సంబంధించినది. |
| | **ప్రాణో వావ సంవర్గః** | (ప్రాణమే - సంవర్గము (తనలో) తదితరమును విలీనము చేసుకొనునది) |
| | **స యదా స్వపితి ప్రాణమేవ వాక్ అపి ఏతి** | ఈ వ్యక్తి (జీవుడు) నిదురకు ఉపక్రమించగానే వాక్ ఇంద్రియము ప్రాణమునందే విలీనం అవుతోంది. |
| | **ప్రాణం చక్షుః ప్రాణగ్ం శ్రోత్రం ప్రాణం మనః ప్రాణో హి ఏవ।** | అట్లాగే చక్షువులు (చూపు), శ్రోత్రము (వినికిడి), మనస్సు కూడా ప్రాణమునందే విలీనమౌతున్నాయి. |
| | **ఏతాన్ సర్వాన్ సంవృంక్త ఇతి॥** | "ప్రాణమే వాటన్నిటినీ తనయందు కలుపుకొని (విలీనము చేసుకొని) ఉంటోంది. |
| **4.** | **తౌ వా ఏతౌ ద్వౌ సంవర్గౌ వాయుః ఏవ దేవేషు ప్రాణః ప్రాణేషు॥** | దేవతలయందు వాయువు, ప్రాణులయందు ప్రాణము రెండు కూడా - సంవర్గము (విలీనము/చేరిక) పొందటం జరుగుతోంది. |
| **5.** | **అథ హ శౌనకం చ కాపేయం అభిప్రతారిణం చ కాక్షసేనిం పరివిష్యమాణౌ బ్రహ్మచారీ బిభిక్షే తస్మా ఉ హ న దదతుః॥** | పూర్వకాలంలో ఒకప్పుడు ఇద్దరు స్నేహితులు ఉండేవారు.<br>(1) కాపేయ (కపి) గోత్రీకుడైన శౌనకుడు (2) కక్షసేనుని కుమారుడు - అభిప్రతారిణి. ఒకరోజు వారిద్దరు కలిసి భోజనము చేయటానికి కూర్చుని భుజించటం ప్రారంభించారు.<br>ఆ సమయంలో ఒక బ్రహ్మచారి వచ్చి "భిక్షాం దేహి!" అని అర్థించారు. వారు అది విని కూడా ఆ భిక్షకునికి భిక్ష పెట్టలేదు. |

| | | |
|---|---|---|
| **6.** | **స హ ఉవాచ మహాత్మనః చతురో దేవ ఏకః<br>కః స జగార భువనస్య గోపాః తం కాపేయ<br>న అభిపశ్యంతి మర్త్యా అభి(ప్రతారిన్ బహుధా<br>వసంతం యస్మై వా ఏతత్ అన్నం,<br>తస్మా ఏతత్ న దత్తమ్। ఇతి।** | భిక్షకుడు అగు ఆ బ్రహ్మచారి :<br>ఓ కాపేయ శౌనకమునీ! ఓ కాక్షసేన అభిప్రతారిణీ! మీరు భలేవారే! (వాక్కు, చక్షువులు, శ్రోతము, మనస్సు అనబడే) నలుగురు దేవతలను తనయందు కలుపుకొని ఉంటున్న (లేక) అపాన - వ్యాన - ఉదాన - సమాన - ప్రాణములను తనయందు ఏకము చేసుకొనియున్న) ముఖ్య ప్రాణస్వరూపుడగు మహాత్ముడగు ప్రజాపతిని, భువన రక్షకుని, మీ మానవులు గుర్తించటం లేదేమిటి? సమస్త ఆహారము ఎవ్వరి కొరకు భుజించబడుచున్నాయో అట్టి ప్రాణేశ్వరుడే "అన్నము పెట్టండి!" - అని అడుగుతుంటే, అట్టి ప్రజాపతి ప్రాణస్వరూపునకే అన్నముపెట్టరెందుకు? |
| **7.** | **తదు హ శౌనకః కాపేయః<br>ప్రతిమన్వానః ప్రత్యేయాయ।** | ఆ మాటలు విన్న (కాపేయముని కుమారుడగు) శౌనకముని, అన్నం తింటున్నవాడల్లా ఆ మాటలు అంతరార్థము మననము చేస్తూ లేచి, ఆ బ్రహ్మచారి వద్దకు వచ్చారు. |
| | **ఆత్మా దేవానాం జనితా ప్రజానాగ్ం<br>హిరణ్యదగ్ంష్ట్రో బభసో అనసూరిః మహాన్తమ్।<br>అస్య మహిమానమ్<br>ఆహుః అనద్యమానో యదన్<br>అన్నం అత్తి ఇతి వై వయం।** | శౌనకుడు : ఓ గృహయజమానీ! ప్రజాపతి సర్వదేవతలకు ఆత్మస్వరూపుడు. సర్వజీవులను సృష్టించువారు. ఆయన బంగారు దంతములు కలవాడు. ఈ ప్రాణేశ్వరుని మహిమ "మహాన్తము, మహత్తరము, బహుగొప్పది" - అని వేదములచే కీర్తించబడుతోంది.<br>ఈయనయే అన్నము, అన్నము కానిది కూడా భక్షించగలిగినట్టివారు. |
| | **బ్రహ్మచారిన్।<br>ఆ ఇదమ్ ఉపాస్మహే<br>దత్తాస్మై భిక్షామ్ ఇతి॥** | ఓ బ్రహ్మచారి గారూ! మేము అన్నమునే ఉపాసించుచున్నాము. అందుచేత, వీరికొరకే భుజిస్తూ అన్నము వీరికి - ఎందుకు సమర్పించము. తప్పక సమర్పిస్తాము! అనగా అట్టి మీకు అన్నము సమర్పించ సంసిద్ధము. |
| **8.** | **తస్మా ఉ హ దదుస్తే వా।<br>ఏతే పంచాన్యే పంచాన్యే<br>దశ సంతస్తత్ కృతమ్॥<br>తస్మాత్ సర్వాసు దిక్ష్వన్<br>అన్నమ్ ఏవ దశ కృతగ్ం<br>స ఏషా విరాట్ అన్నాదీ<br>తయా ఇదగ్ం సర్వం దృష్టగ్ం।<br>సర్వమసి ఇదం దృష్టం భవతి।<br>అన్నాదో భవతి –<br>య ఏవం వేద।<br>య ఏవం వేద॥** | అప్పుడు లేచి ఆ బ్రహ్మచారికి భిక్ష సమర్పించారు.<br>'ఐదు, ఐదు కలిసి పది'కి వారు అన్నమును ఆ బ్రహ్మచారికి సమర్పించారు.<br>కాబట్టి (తూర్పు-పడమర-ఉత్తరము-దక్షిణము-ఈశాన్యము-ఆగ్నేయము-నైరుతి-వాయువ్యము-పైన-క్రింద అన్నీ కలిపి) కృతమగు దశదిక్కులు బ్రహ్మమునకు సమర్పించబడుచున్న అన్నమే।<br>సమస్తము భక్షించువాడు ఆ విరాట్ పురుషుడే। ఆయనయే సమస్తము దర్శిస్తున్న ద్రష్ట.<br>"ఆ అన్నాదుడగు పరబ్రహ్మమే సమస్తమును చూస్తూ, అనుభవముగా కల్పించుకొని పొందుతోంది" - అని ఎరుగుచున్నవాడు - సర్వమును సరి అయిన దృష్టితో దర్శిస్తున్నవాడు, ఆస్వాదిస్తున్నవాడు అగుచున్నాడు. |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - చతుర్థాధ్యాయే తృతీయః ఖండః**

## 4-4. చతుర్థ ఖండము - సత్యకామ జాబాలుని చరిత

**1.** **సత్యకామో హ జాబాలో। జబాలాం మాతరమ్। ఆమంత్రయాంచక్రే బ్రహ్మచర్యం భవతి। వివత్స్యామి - కిం గోత్రో ను అహమ్ అస్మి ఇతి॥**

సత్యకాముడు అనే పిల్లవాడు. ఆతని తల్లి జబాల. ఆ సత్యకాముడు గురుకులాశ్రమము చేరి విద్యాభ్యాసము చేయవలసిన సమయము, బ్రహ్మచర్య వ్రతము ప్రారంభించవలసిన వయసు వచ్చింది.

**జబాల** : బిడ్డా! సత్యకామా! నీవు విద్యార్థివై, బ్రహ్మచర్యవ్రతం ప్రారంభించి గురుకులమునకు వెళ్లవలసిన సమయం వచ్చిందయ్యా!

**సత్యకామ** : అమ్మా! నేను సంతోషంగా గురుకులం జేరి గురువును విద్యకై ఆశ్రయిస్తాను. అయితే "ఇదమ్ గోత్రోద్భవస్య అహం భో అభివాదయే।'' - అని గురువుకు నమస్కరించాలి కదా! నేను ఏ గోత్రజుడను?

---

**2.** **సా హ ఏనమ్ ఉవాచ : న అహమ్ ఏతత్ వేద - తాత! యత్ గోత్రః త్వమ్ అసి। బహు అహం చరంతీ పరిచారిణీ యౌవనే త్వామలభే, సా అహమ్ ఏతత్ న వేద యత్ గోత్రః త్వమ్ అసి। 'జబాలా' తు నామ అహమ్ అస్మి। సత్యకామో నామ త్వమ్ అసి। స సత్యకామ ఏవ జాబాలో బ్రువీథా ఇతి॥**

**జాబాలి** : బిడ్డా! నేను యౌవ్వనంలో ఉండగా పరిచారికనై, దాసిగా అనేక గృహములలో సేవిస్తూ ఉండగా, నీవు నాకు పుట్టావు. అందుచేత నీవు ఏ గోత్రమునకు చెందినవాడవో నాకు తెలియదు. అందుచేత ఇది అని చెప్పలేను.

నా పేరు 'జబాలి', నీ పేరేమో - 'సత్యకాముడు' నీవు నా కుమారుడుగా - సత్యకామ జాబాలి అని ఇంతవరకే నేను రూఢిగా చెప్పగలను.

నీ తండ్రి ఎవ్వరో నాకు తెలియదు. నేను చెప్పలేను. అందుచేత ఈ విశేషములతో నీవు గురుకులమును, గురువును ఆశ్రయించి విద్యను అభ్యసించు.

---

**3.** **స హ హారిద్రుమతం గౌతమమ్ ఏతి ఉవాచ : బ్రహ్మచర్యం భగవతి వత్స్యామి ఉపేయం భగవంతమ్। ఇతి॥**

అప్పుడు ఆ సత్యకాముడు బ్రహ్మచర్య - విద్యాభ్యాస దీక్ష కొరకై హరిద్రమతముని కుమారుడగు గౌతముని ఆశ్రమం ప్రవేశించాడు.

**సత్యకాముడు** : గురుదేవా! గౌతమ మునీంద్రా! భగవాన్! నేను విద్యార్థినై విద్యకొరకు మిమ్ములను ఆశ్రయిస్తున్నాను. శిష్యత్వము అనుగ్రహించండి.

---

**4.** **తగ్ం హ ఉవాచ : "కిం గోత్రో ను సోమ్య! అసి" - ఇతి? స హ ఉవాచ : "న అహమ్ ఏతత్ వేద భో!" యత్ గోత్రో అహమ్ అస్మి - అపృచ్ఛం మాతరగ్ం, సా ప్రత్యబ్రవీత్ "బహు అహం చరంతీ పరాచారిణీ యౌవనే। త్వామలభే స అహమ్ ఏతత్ న వేద। 'యత్ గోత్రః త్వమ్ అసి।**

**గౌతమ మునీంద్రుడు** : మంచిది. స్వాగతం. ఓ సౌమ్యా! ప్రియదర్శనా! నీ గోత్రము - నామములతో కూడిన ''ప్రవర'' చెప్పి, గురుకులాశ్రమములో ప్రవేశించు.

**సత్యకాముడు** : హే మహనీయా! గురు భగవాన్। నా గోత్రము ఏమిటో నాకు తెలియదు. నేను నా గోత్రమేమిటని నా మాతృదేవతను జబాలను ఇక్కడికి వచ్చేముందు అడిగాను.

మా అమ్మ ఏమన్నదంటే...

"బిడ్డా! నేను యౌవనవతినై ఉన్నప్పుడు అనేక చోట్ల పరిచారిణినై ఉండటం జరిగింది. అందుచేత నీ తండ్రి ఎవ్వరో గోత్రమేమిటో తెలియదు కాబట్టి ఇది అని చెప్పలేను''.

| | |
|---|---|
| **జబాలా తు నామా అహమస్మి।**<br>**సత్యకామో నామ త్వమ్ అసి ఇతి।"**<br>**సో అహగ్ం సత్యకామో**<br>**జాబాలో అస్మి భో। ఇతి॥** | మా అమ్మ పేరు - జబాల<br>నా పేరు - సత్యకాముడు<br>అందుచేత నేను సత్యకామ జాబాలిని మీకు నమస్కరిస్తూ అభివాదము పలుకుచున్నాను.<br>(చతుస్సాగర పర్యంతం గో - బ్రాహ్మణేభ్యః శుభం భవతు। "పరమాత్మ" ఋషేయ గోత్రోద్భవస్య - గురునిర్ణయ వేదశాఖ అధ్యాయి సత్యకామ జాబాల - అహం భో అభివాదయే.) |

**5.** <u>**తగ్ం హ ఉవాచ :**</u>
**న ఏతత్ అబ్రాహ్మణో వివక్తుం అర్హతి।**
**సమిధగ్ం సోమ్యా। ఆహర ఉప త్వా**
**నేష్యే న సత్యాదగా ఇతి।**
**తమ్ ఉపనీయ**
**కృశానాం-అబలానాం చతుశ్శతా (400) గాః**
**నిరాకృత్య ఉవాచేమాః సోమ్యా!**
**అనుసంవ్రజేతి।**
<u>**తా అభిప్రస్థాపయన్ ఉవాచ :**</u>
**న అసహస్రేణ ఆవర్తేయేతి।**
**సహ వర్షగణం ప్రోవాస**
**తా యదా సహస్రగ్ం సంపేదుః।**

గౌతమ మహర్షి : బిడ్డా। సత్యకామా! ఈ విధంగా సత్యమును <u>బ్రహ్మవిద్యార్హత కలవాడు (బ్రాహ్మణుడు అయినవాడు)</u> మాత్రమే పలుకగలడు. ఇతరులు చెప్పలేరు. సత్యమును చెప్పావు కాబట్టి నీవు బ్రాహ్మణుడివేవయ్యా! (కర్మణా జాయతే ద్విజాః)। గుణముచేత (సత్యము పలుకుటచేత) నిన్ను బ్రాహ్మణుడుగా గుర్తిస్తున్నాను.

ఓ సౌమ్య! నీవు దగ్గరలోని అడవిలోకి వెళ్లి యజ్ఞమునకు కావలసిన సమిధలు పట్టుకురా! సమిత్పాణివై రమ్ము! నీవు సత్యము నుండి చ్యుతుడవు కాలేదు. 'సత్యకాముడు' అనే పేరుకు అర్హుడవు.

ఆ పేరుతోనే ఉపనయనం జరిపిస్తాను అని చెప్పి అప్పుడు **ఉపనయనము జరిపించారు.**

అప్పుడు గురుదేవుడగు గౌతమమహర్షి తన గోసంపదలోని బక్కచిక్కిన, బలములేని '400' గోవులను వేరు చేసి సత్యకామునికి ఇచ్చి మేపుకురమ్మని చెప్పారు.

సత్యకాముడు ఆ బక్కచిక్కిన 400 గోవులను మేపటానికి తోలుకుపోతూ ఇట్లా గురువుగారితో తన విద్యకు సంబంధించిన పట్టుదలకు సంజ్ఞగా (గుర్తుగా) ఇట్లా వినమ్రుడై పలికారు.

గౌతముడు : ఈ 400 గోవులు 1000 గోవులు కాగానే మీ వద్దకు తిరిగివస్తాను. 1000 గోవులు కాకుండా మీ దర్శనం చూసుకోనని నా మనవి.

సత్యకాముడు ఆ విధంగా 400 గోవులను మేపసాగాడు. సంవత్సర కాలానికి ఆ '400' గోవులు '1000' గోవులు అయినాయి.

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - చతుర్థాధ్యాయే చతుర్థః ఖండః**

## 4-5. పంచమ ఖండము - ప్రకాశవాన్-చతుష్కలా బ్రహ్మము యొక్క మొదటి పాదము

**1.** **అథ హి ఏనం ఋషభో అభ్యువాద సత్యకామ! ఇతి భగవ! ఇతి! హ ప్రతిశుశ్రావ ప్రాప్తాః, సోమ్య! సహస్రగ్ం స్మః ప్రాపయ న ఆచార్య కులమ్।**

ఒకరోజు ఆ గోసంపదలోని వృషభము (ఎద్దు) సత్యకాముని వద్దకు వచ్చి ఎదురుగా నిలుచున్నది.

వృషభము : ఓ సత్యకామా!

సత్యకాముడు : భగవాన్। వృషభరాజమా? చెప్పండి. ఏమి కావాలి? ఏమి ఆజ్ఞ?

వృషభము : మేము వేయి సంఖ్యగా గో సంపద అయ్యాము. మీరు చేపట్టిన కార్యము పూర్తి అయింది కదా! ఓ సౌమ్యా! ఇక మమ్ములను ఆచార్యులవారు విద్య బోధిస్తున్న గురుకులమునకు చేర్చండి.

అప్పుడు సత్యకాముడు లేచి నిలబడి, ఆ వృషభమునకు ప్రదక్షిణ నమస్కారములు సమర్పించి "వృషభదేవా! మీ ఆజ్ఞను నిర్వహిస్తాము!" అని పలికారు.

---

**2.** **బ్రహ్మణః చ తే పాదం బ్రవాణి - ఇతి॥**

వృషభము : మా కోరిక నెరవేరుస్తున్నారు కదా. సరే! అందుకుగాను - మీకు బ్రహ్మముయొక్క చతుష్పాదముల గురించి చెప్తుతాను.

**బ్రవీతు మే భగవాన్। - ఇతి॥**

సత్యకాముడు : భగవాన్! వృషభదేవా! దయచేసి చెప్పండి. విద్యార్థినై వింటాను.

**తస్మై హ ఉవాచ**
**- పాచీ దిక్ - కలా,**
**- ప్రతీచీ దిక్ - కలా**
**- దక్షిణా దిక్ - కలా**
**- ఉదీచీ దిక్ - కలా**
**ఏష వై సౌమ్య - చతుష్కలః**
**పాదో బ్రహ్మణః ప్రకాశవాన్ నామ।**

వృషభము : ఆ నాలుగు పాదములు 4 అంశలు (కళలు).

(1) తూర్పు (2) పడమర (3) దక్షిణము (4) ఉత్తరము

ఈ నాలుగు దిక్కులు బ్రహ్మమునకు 'ప్రకాశరూపము' అని పిలువబడును. నాలుగు దిక్కులను బ్రహ్మము ప్రకాశింపజేయుచున్నది. కాబట్టి పరమాత్మ (లేక) పరబ్రహ్మము 'ప్రకాశవాన్' అనబడుచున్నారు. ఈ నాలుగు దిక్కులుగా ప్రకాశిస్తున్నది పరబ్రహ్మమే। ఈ నాలుగు కళలుగా బ్రహ్మముయొక్క మొదటి పాదమును ఉపాసించు.

---

**3.** **స య ఏతం ఏవం విద్వాగ్ం చతుష్కలం పాదం బ్రహ్మణః। 'ప్రకాశవాన్' ఇతి ఉపాస్తే, ప్రకాశవాన్ అస్మింల్లోకే భవతి। ప్రకాశవతో హ లోకాన్ జయతి। య ఏతమ్ ఏవం విద్వాగ్ం చతుష్కలం పాదం బ్రహ్మణః 'ప్రకాశవాన్' ఇతి ఉపాస్తే।**

ఎవ్వరైతే బ్రహ్మమును '4' దిక్కులలో ప్రకాశమానుడైయున్న 'ప్రకాశవాన్' అని తెలుసుకొని, నాలుగు దిక్కులను పరబ్రహ్మ స్వరూపంగా ఉపాసిస్తారో ఆతడు సమస్త లోకములలో ప్రకాశవంతుడై ఉండగలడు.

తనయొక్క ప్రకాశముచే ఆతడు లోకములను జయించగలడు. "లోకములన్నీ నాలోనే, నా యొక్క ఆత్మ ప్రకాశములోనే ఉన్నాయి" - అని గమనించగలడు.

ప్రకాశపూర్ణుడై సమస్త లోకములను దాటివేయగలడు కూడా!

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - చతుర్థాధ్యాయే పంచమః ఖండః**

## 4-6. షష్ఠః ఖండము - అనంతవాన్ - చతుష్కలా బ్రహ్మము యొక్క రెండవ పాదము

| | | |
|---|---|---|
| **1.** | **అగ్నిష్టే పాదం వక్తేతి।** | సత్యకాముడు : వృషభదేవా! దయచేసి బ్రహ్మముయొక్క రెండవ పాదము గురించి బోధించండి.<br>వృషభము : అదా! అది నేను కాదు. అగ్నిదేవుల వారు మాత్రమే బోధించగలరు. నేను కాదు.<br>ఇట్లా పలికి పూజనీయుడగు వృషభము చెప్పటమును విరమించింది. |
| | **స హ శ్వో భూతే గా అభిప్రస్థాప్రయాంచకార।** | ఆ మరునాడు సత్యకాముడు గోవులను మేపటానికి అడవికి తీసుకొనిపోయి ఇక మేపనారంభించాడు. |
| | **తా యత్ర అభిసాయం బభూవుః** | అక్కడ కొన్ని ఎండు కట్టెలు తెచ్చి అగ్నిని వెలిగించారు. |
| | **తత్ర అగ్నిం ఉపసమాధాయ గా ఉపరుధ్య సమిధమ్ ఆధాయ పశ్చాత్ అగ్నేః ప్రాజుపోపవివేశ॥** | తూర్పు దిక్కుగా కూర్చుని అగ్నిదేవుని ప్రతిష్ఠించి ఆహ్వానము - సుస్వాగతము మొదలైనవి స్తుతులు పలుకుచూ ఆరాధించసాగారు. అప్పుడు అగ్నిదేవుడు పలుకసాగారు. |
| **2.** | **తమ్ అగ్నిః అభ్యువాద, సత్యకామ! - ఇతి- భగవ! ఇతి హ ప్రతిశుశ్రావ॥** | అగ్ని భగవానుడు : ఓ సత్యకామా?<br>సత్యకాముడు : హే భగవాన్! అగ్నిదేవా! నమోనమః।<br>అగ్నిదేవుడు : నన్ను ఎందుకొరకై ఉపాసిస్తూ ఆహ్వానించావయ్యా? |
| **3.** | **"బ్రహ్మణః సోమ్య! తే పాదం బ్రవాణి" ఇతి।**<br>**"బ్రవీతు మే భగవాన్" ఇతి।**<br>**<u>తస్మై హ ఉవాచ :</u>** | సత్యకాముడు : అగ్నిదేవా! బ్రహ్మముయొక్క రెండవ పాదము గురించి మీరు బోధిస్తారు కదా - అని మిమ్ములను భక్తితో ఆహ్వానించాను. భగవాన్! దయతో బోధించండి. |
| | **పృథివీ కలా। అంతరిక్షం కలా। ద్యౌః కలా। సముద్రః కలా। ఏష వై సోమ్య। చతుష్కలః పాదో బ్రహ్మణో అనంతవాన్ నామ॥** | అగ్నిదేవుడు : సరే! విను. చెప్పుతాను.<br>బ్రహ్మముయొక్క రెండవ పాదమునకు చెందిన నాలుగు కళా ప్రదర్శనములు ఇట్లు ఏర్పడి ఉన్నాయి.<br>(1) పృథివీ కళ (2) అంతరిక్ష కళ (3) ద్యులోక (స్వర్గలోక) కళ (4) సముద్ర కళ<br>ఈ నాలుగు బ్రహ్మముయొక్క 4 కళలై అంశలై బ్రహ్మమువలెనే అనంతములై ఉన్నాయి. ఈ **4** కళలను బ్రహ్మముయొక్క రెండవ **పాదపు - 4** అంశలుగా ఉపాసించు. |
| **4.** | **స య ఏతమ్ ఏవం విద్వాగ్ం చతుష్కలం పాదం బ్రహ్మణో 'అనంతవాన్' ఇతి - ఉపాస్తే, అనంతవాన్ అస్మిన్ లోకే భవతి। అనంతవతో హ లోకాన్ జయతి, య ఏతమ్ ఏవమ్ విద్వాగ్ం చతుష్కలం పాదం బ్రహ్మణో అనంతవాన్ ఇతి ఉపాస్తే॥** | ఎవ్వరైతే బ్రహ్మముయొక్క రెండవ పాదమునకు చెందిన కళలు (Art of the Artist)గా పృథివిని, ఆకాశము (అంతరిక్షము)ను, (అశరీర దివ్యపురుషుల) దేవతా లోకము, సముద్రములను అనంతరూపంగా ఎరిగి ఉపాసిస్తాడో, **<u>అట్టివాడు దృశ్యముచే పరిమితము కానివాడై - అనంతుడు, అపరిమితుడు అగుచున్నాడు.</u>**<br>- అనంతుడై లోకములను జయించుచున్నాడు.<br>- లోకములను తనయందు దర్శిస్తున్నాడు.<br>ఈ బ్రహ్మముయొక్క చతుష్పాదముల అనంతత్వము ఆరాధించువాడు అనంతుడై వెలుగొందగలడు. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - చతుర్థాధ్యాయే షష్ఠః ఖండః

## 4-7. సప్తమ ఖండము - జ్యోతిష్మాన్ - చతుష్కలా బ్రహ్మముయొక్క మూడవ పాదము

| | | |
|---|---|---|
| **1.** | **హగ్ంసః తే పాదం వక్త ఇతి।**<br>**స హ శ్వో భూతే గా అభిప్రస్థాపయాంచకార**<br>**తా యత్ర అభిసాయం బభూవుః**<br>**తత్ర అగ్నిమ్ ఉపసమాధాయ**<br>**'గా' ఉపరుధ్య సమిధమ్ ఆధాయ**<br>**పశ్చాత్ అగ్నేః ప్రాజ ఉప ఉపవివేశ॥** | సత్యకాముడు : స్వామీ! బ్రహ్మముయొక్క 3వ పాదము గురించి చెప్పరూ!<br>అగ్నిదేవుడు : బిడ్డా! నీవు అడిగిన '3'వ పాదము గురించి 'హంస'ను అడుగు చెప్పగలదు. ఆ హంస నీకు 3వ పాదము యొక్క అంశలను విశదీకరించగలదు.<br>ఇట్లా ఆ మరునాడు ఉదయం మరల ఆవులను తోలుకొని అడవికెళ్ళారు.<br>ఆవులను మేతకు త్రోలారు. అక్కడ కొన్ని సమిధలు పేర్చి అగ్నిని ప్రజ్వలింపజేసారు.<br>తూర్పుముఖంగా అగ్నికి ఎదురుగా ఆశీనులైనారు. 'హంస'ను ధ్యానం చేసారు. హంస ప్రత్యక్షమైనది. |
| **2.** | **తగ్ం హగ్ంస ఉపనిపత్యాభ్యువాద,**<br>**సత్యకామ! ఇతి॥**<br>**భగవ! ఇతి హ ప్రతిశుశ్రావ।** | హంస : ఓ సత్యకామా!<br>సత్యకాముడు : భగవాన్! హంసదేవా! నమో నమః।<br>హంస : ఏమిటయ్యా? నన్నెందుకు అగ్న్యోపాసన పూర్వకంగా ఆహ్వానించావు? |
| **3.** | **బ్రహ్మణః సోమ్య తే పాదం**<br>**బ్రవాణి। ఇతి॥**<br>**బ్రవీతు మే భగవాన్! ఇతి।**<br>**<u>తస్మై హ ఉవాచః</u>**<br>**అగ్నిః కలా। సూర్యః కలా।**<br>**చంద్రః కలా। విద్యుత్ కలా।**<br>**ఏష వై, సోమ్య। చతుష్కలః।**<br>**పాదో బ్రహ్మణో జ్యోతిష్మాన్ నామ॥** | సత్యకాముడు : ఓ సౌమ్యా! బ్రహ్మముయొక్క '3'వ పాదము గురించి చెప్ప ప్రార్థన. భగవాన్! దయతో వివరించండి.<br>హంస : చెప్పుచున్నాను. వినండి.<br>బ్రహ్మముయొక్క '4' కళలు / అంశలు - 3వ పాదముయొక్క అంశలు.<br>(1) అగ్ని (2) సూర్యుడు (3) చంద్రుడు<br>(2) విద్యుత్తు (తేజస్సు)<br>ఓ సౌమ్యా! బ్రహ్మముయొక్క అంశలుగా వీటిని ఎరిగినవాడు జ్యోతిష్మాన్ లోకములను జయించగలడు. |
| **4.** | **స య ఏతం ఏవం విద్వాన్ చతుష్కలం।**<br>**"పాదం బ్రహ్మణో జ్యోతిష్మాన్" ఇతి ఉపాస్తే**<br>**జ్యోతిష్మాన్ అస్మిన్ లోకే భవతి।**<br>**జ్యోతిష్మతో హ లోకాన్**<br>**జయతి య ఏతమ్ ఏవం**<br>**విద్వాన్ చతుష్కలం పాదం**<br>**బ్రహ్మణో "జ్యోతిష్మాన్" ఇతి ఉపాస్తే॥** | బ్రహ్మముయొక్క పాదములుగా, కళలుగా అగ్ని - సూర్య - చంద్ర - విద్యుత్తులను భావించి ఉపాసించువాడు జ్యోతిష్మంతుడు।<br>జ్యోతిష్మంత లోకాలను జయించగలడు. అనగా జ్యోతిష్మంత లోకములను తనయందు దర్శించగలడు. జ్యోతిస్వరూపుడై ప్రకాశించగలడు. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - చతుర్థాధ్యాయే సప్తమః ఖండః

## 4-8. అష్టమ ఖండము - అయతనవాన్ - చతుష్కలా బ్రహ్మము యొక్క నాలుగవ పాదము

**1.** మద్గుష్టే పాదం వక్త ఇతి
స హ శ్వోభూతే
గా అభిప్రస్థాపయాంచకార
తా యత్రాభిసాయం బభూవుః
తత్ర అగ్నిం ఉపసమాధాయ
గా ఉపరుధ్య, సమిధమ్ ఆధాయ।
పశ్చాత్ అగ్నేః ప్రాఙ ఉప ఉపవివేశ॥

సత్యకాముడు : తరువాతి, (4వ) పాదము గురించి కూడా చెప్పండి.

హంస : మిత్రమా! అది నీకు మద్గుష్టము (నీటి కాకి) చెప్పగలదులే। అని హంస మౌనము వహించింది.

ఆ మరునాడు సత్యకాముడు దినచర్యగా ఆవులను తోలుకువెళ్ళారు. అవి మేత మేయనారంభించాయి. ఆతడు సమిధలు ప్రోగుచేసి, అగ్నిని వెలిగించి, తూర్పుగాను - అగ్నికి ఆవలగా కూర్చుని నీటి కాకి గురించి ప్రార్థనలు సమర్పించారు.

---

**2.** తం మద్గుః ఉపనిపత్య
అభ్యువాద "సత్యకామ!" ఇతి
"భగవ!"....ఇతి హ ప్రతిశుశ్రావ॥

**మద్గుష్టము (నీటికాకి)** : ఓ సత్యకామా!

సత్యకాముడు : ఓ జలజంతు దేవతా। జ్ఞానియగు నీటికాకి। భగవాన్! నమస్కారము। అని స్తుతించారు.

---

**3.** బ్రహ్మణః సోమ్య! తే పాదం బ్రవాణి ఇతి।
బ్రవీతు మే భగవన్। ఇతి॥
<u>తస్మై హ ఉవాచ</u>
ప్రాణః కలా। చక్షుః కలా।
శ్రోత్రం కలా। మనః కలా।
ఏష వై, సోమ్య। చతుష్కలః
పాదో బ్రహ్మణ ఆయతనవాన్ - నామ॥

సత్యకాముడు : హే బ్రహ్మన్। భగవాన్। బ్రహ్మము గురించిన (4వ) పాదము గురించి నాకు చెప్పమని విన్నపము.

మద్గుష్టము : చతుష్కళలు

(1) ప్రాణకళ (2) చక్షువులు (చూపు) (3) శ్రోత (వినికిడి) కళ (4) మనస్సు - కళ

హే సౌమ్య! ఈ చతుష్కళ సమన్విత బ్రహ్మముయొక్క పాదమును తెలుసుకొన్నవాడు ఆయతనవంతుడు (ఉత్తమస్థానము కలవాడు) అగుచున్నాడయ్యా।

---

**4.** స య ఏతం ఏవం విద్వాన్
చతుష్కలం పాదం బ్రహ్మణ
ఆయతనవాన్ - ఇతి ఉపాస్తే।
ఆయతనవాన్ అస్మిన్ లోకే భవతి।
ఆయతనవతో హ లోకాన్ జయతి।
య ఏతం ఏవమ్ విద్వాన్
చతుష్కలం పాదం
బ్రహ్మణ ఆయతనవాన్ ఇతి ఉపాస్తే।

4 పాదములగు (1) ప్రాణము, (2) చక్షువులు (కళ్ళు - చూపు) (3) శ్రోతము (వినికిడి) (4) మనస్సు (ఆలోచన స్థానము)లను బ్రహ్మముయొక్క కళలుగా ఉపాసించువాడు ఆయతనుడు (ఉత్తమ గృహము కలవాడు) అవగలడు. సమస్త లోకములు ఆతనికి సొంత ఇంటితో సమానము అవుతాయి. లోకములను జయించగలడు. లోకములను తనయందు దర్శించగలడు.

ఉపాసనచే బ్రహ్మమును ఉపాసించువాడు, సర్వ సమృద్ధుడు కాగలడు.

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - చతుర్థాధ్యాయే అష్టమః ఖండః

# 4-9. నవమ ఖండము - గురుముఖతా బ్రహ్మవిద్య అభ్యాసము

| | | |
|---|---|---|
| **1.** | **ప్రాప హ ఆచార్యకులం।<br>తమ్ ఆచార్యో అభ్యువాద<br>"సత్యకామ!" ఇతి "భగవ!"<br>ఇతి హ ప్రతిశుశ్రావ॥** | అప్పుడు సత్యకాముడు గురుకులం చేరాడు.<br>**ఆచార్యులవారు** : ఓ సత్యకామా।<br>**సత్యకాముడు** : భగవాన్! గురుదేవా! సాష్టాంగ దండ ప్రణామములు స్వీకరించండి।<br>**ఆచార్యులు** : సౌమ్య! సత్యకామా! నీ ముఖము చూస్తూ ఉంటే బ్రహ్మమును ఎరిగినట్లుగా కనిపిస్తున్నావు. నీకు ఎవ్వరు బోధించారు? |
| **2.** | **"బ్రహ్మవిత్ ఇవ వై సోమ్య।<br>భాసి? కో ను త్వా అనుశశాసేతి?"<br>"అన్యే మనుష్యేభ్య ఇతి<br>హ ప్రతిజజ్ఞే భగవాన్<br>త్వయేవ మే కామే బ్రూయాత్।** | **సత్యకాముడు** : మనుష్యులకు వేరైనవారే నాకు (సవిషయ-సాకార) బ్రహ్మముయొక్క కళల గురించి, పాదముల గురించి చెప్పారు. అయితే మాత్రం ఏమున్నది? స్వామీ! మీరు నాకు నేను కోరుకొను చున్న (నిర్విషయ-నిరాకార) బ్రహ్మము గురించి బోధించి భగవాగుడు (ధన్యుడు)గా తీర్చిదిద్దండి. |
| **3.** | **శ్రుతగ్ం హి ఏవ మే భగవద్దృశేభ్య<br>ఆచార్యాద్ధైవ విద్యావిదితా<br>సాధిష్ఠం ప్రాపతి - ఇతి॥<br>తస్మై హి ఏతత్ ఏవో వాచా<br>అత్ర హ న కించన వీయాయేతి।<br>వీయాయేతి॥** | తమవంటి మహనీయులగు ఆచార్యులు బోధించునది అత్యుత్తమమైన బ్రహ్మవిద్య.<br>ఆచార్యులగు మీరు బోధించుట చేతనే మేము సాధుత్వము పొందగలమని మీవంటి మహనీయులు చెప్పటం వింటున్నాము. శ్రీ గురుభ్యోన్నమో నమో నమో నమః ॥<br>అప్పుడు ఆచార్యులగు గౌతమమహర్షి సత్యకామునికి 'బ్రహ్మవిద్య'ను బోధించారు. అప్పుడు 'లోటు' అనునదంతా తొలగిపోయి, ఆ సత్యకాముడు ఏలోటు లేనివాడైనాడు. |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - చతుర్థాధ్యాయే నవమః ఖండః**

# 4-10. దశమ ఖండము - ఉపకోసల విద్య

**1.** **ఉపకోసలో హ వై కమలాయనః**
**సత్యకామే జాబాలే బ్రహ్మచర్యం ఉవాస।**
**తస్య హ ద్వాదశ వర్షాణి అగ్నీన్ పరిచచార।**
**స హ స్మ అన్యాన్ అన్తేవాసినః**
**సమావర్తయగ్ం తగ్ం హ**
**స్మ ఏవ న సమావర్తయతి॥**

కమలాయని మునీంద్రుని కుమారుడు "ఉపకోసల కమలాయనుడు" అనేవారు, ఆయన సత్యకామ జాబాలి ఆశ్రమంలో ఉండి బ్రహ్మచర్య వ్రతమును (బ్రహ్మము గురించిన ఉపాసనా వ్రతమును) నిర్వర్తించసాగారు. 12 సంవత్సరముల కాలము ఆయన తోటి విద్యార్థులతో కూడి శాస్త్ర ప్రవచనానుసారంగా అగ్నికార్యము దైనందిక హోమము) మొదలైన వాటిని నిర్వర్తించారు.

ఆ విధంగా 12 సంవత్సరముల కాలము గడచిన తరువాత సత్యకామ జాబాలి ఒకరోజు శిష్యులందరికీ 'వీడ్కోలు ఆశీర్వాద సభ' ఏర్పాటు చేసారు. కానీ ఉపకోసలునుని మాత్రం ఆ సభకు పిలువలేదు.

---

**2.** **<u>తం జాయ ఉవాచ :</u>**
**తప్తో బ్రహ్మచారీ కుశలమ్**
**అగ్నీన్ పరిచచారీన్।**
**మా త్వా అగ్నయః పరిప్రవోచన్**
**ప్రబ్రూహి అస్మా ఇతి।**
**తస్మై హ అప్రోచ్యైవ ప్రవాసాంచక్రే।**

అప్పుడు సత్యకాముని భార్య (గురుమాత) సత్యకామునితో ఇట్లా పలికారు.

"పతిదేవా! తమరు శిష్యులందరికీ వీడ్కోలు ఆశీర్వాదము ప్రసాదించారు. కానీ మీ శిష్యులలో ఉపకోసలుని మాత్రం వీడ్కోలు సభకు పిలువలేదు. ఉపకోసలుడు అందరికంటే కూడా గురుకుల (ఆశ్రమ) సేవ అధికంగా చేసి ఉన్నవాడు. ఇది మీరు గమనించియే ఉంటారు.

బ్రహ్మచర్య వ్రతమును దీక్షగా నిర్వర్తించి ఉన్నాడు కూడా. నిత్యాగ్నిదేవత ఈ విషయంలో మిమ్ములను ఆక్షేపించవచ్చునేమో గదా?".

సత్యకాముడు అది విని కూడా ఉపకుశలనకు వీడ్కోలు ఉపదేశము ఇవ్వకుండానే, ఎటో ప్రహసమునకు (సంచారమునకు) వెళ్లారు.

---

**3.** **స హ వ్యాధినా అనశితుం దధ్రే**
**తమ్ ఆచార్య జాయా ఉవాచ :**
**బ్రహ్మచారిన్ అశాన**
**'కిం ను న - అశ్నాసి?' ఇతి।**
**స హ ఉవాచ :**
**బహవ ఇమే అస్మిన్ పురుషే**
**కామాన్ అనాత్యయా**
**వ్యాధిభిః ప్రతిపూర్ణోఽస్మి।**
**న అశిష్యామి ఇతి॥**

అది తెలుసుకొన్న ఉపకుశలుడు మనోవేదన చెంది ఉపాసములతో కృశించిపోసాగాడు. అప్పుడు ఆచార్యపత్ని (సత్యకాముని జీవిత భాగస్వామి) - అది గమనించారు. ఉపకుశలునితో ఇట్లు పలికారు.

**గురుమాత** (ఆచార్యుల వారి ధర్మపత్ని)

ఓ బ్రహ్మచారీ। చిరంజీవి। ఉపకుశలా। ఏమిటి, నీవు ఆహారం తీసుకోవటం మానావా? ఎందుకు?

**ఉపకుశలుడు** : గురుమాతా! అనుకున్నది జరగకపోవటంచేత నేను మనోవ్యాధిచే ప్రతిపూర్ణుడను అయ్యాను. భోజనముపై మనస్సు పోవటం లేదు.

{ఆ నిరుత్సాహం చూచి గురుమాత "అయ్యో! బిడ్డ ఏమౌతాడో!" అని అనుకోసాగారు.}

4. **అథ హ అగ్నయః సమూదిరే,**
**తప్తో బ్రహ్మచారీ కుశలం**
**నః పర్యచారీత్।**
**హ అంతా, అస్మై ప్రబ్రవామి – ఇతి।**
**తస్మై హ ఊచుః**
**ప్రాణో బ్రహ్మ। "కం" బ్రహ్మ।**
**"ఖం" బ్రహ్మ। ఇతి।।**

అప్పుడు ఉపకుశలుని నిరాహారము (ఆహారము తీసుకోకపోవటము) గమనించిన యజ్ఞాగ్నీ దేవతలు ఒకచోట కలుసుకొన్నవై ఇట్లా సంభాషించుకోసాగారు.

**యజ్ఞాగ్ని దేవతలు :** ఓ మిత్ర అగ్నిశిఖా దేవతలారా! ఈ పిల్లవాడు ఉపకుశలుడు ఆహారం తీసుకోక ఎంతో బాధపడుచున్నాడు. ఈతడు సుదీర్ఘకాలంగా సేవానిరతుడై అహూతులను అందించటంలో శ్రమలు తీసుకొని ఉన్నాడు. ఈతనిని ఊరడించి, శాంతపరచటం మనయొక్క ప్రత్యుపకార ధర్మము।

**యాజ్ఞాగ్ని దేవతలు :** చిరంజీవా! ఉపకోసలా! నీకు ఉపదేశము ప్రసాదించదలిచాము. విను! ప్రాణమే బ్రహ్మము. 'కం' బ్రహ్మము. 'ఖం' - బ్రహ్మము అని ఎరుగుదువా?

---

5. **<u>స హ ఉవాచ :</u>**
**విజానామి అహం యత్ ప్రాణో బ్రహ్మ।**
**కం చ తు ఖం చ**
**న విజానామి ఇతి।।**
**<u>తే హ ఊచు :</u>**
**యత్ వావ 'కం' తత్ ఏవ 'ఖం'।**
**యత్ ఏవ 'ఖం' తత ఏవ 'కం' ఇతి।**
**ప్రాణం చ హ అస్మై తత్**
**ఆకాశం చ ఊచుః।**

**ఉపకోసలుడు :** ఓ యజ్ఞాగ్ని శిఖ దేవతలారా! నమోనమః। "ప్రాణము బ్రహ్మమే" - అనే విషయం నేను ఎరిగి ఉన్నాను.

కానీ మీరు 'కం బ్రహ్మమే' 'ఖం బ్రహ్మమే' అంటున్నారే! ఆ విషయం నేను ఎరిగి ఉండలేదు. దయచేసి విశదపరచండి.

**అగ్నిదేవతలు :**

ఏది 'కం'యో, అదియే 'ఖం'।

ఏది 'ఖం'యో, అదియే 'కం' కూడా।

**(కం = సుఖము; ఖం = ఆకాశము)**

అప్పుడు యజ్ఞాగ్ని దేవతలు ఆ ఉపకోసలునికి సుఖమయరూపమగు "ప్రాణము" గురించి, "ఆకాశము" (చిదాకాశము) గురించి కూడా ఉపదేశించారు.

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - చతుర్థాధ్యాయే దశమః ఖండః**

# 4-11. ఏకాదశ ఖండము - గార్హపత్యాగ్ని అనుశాసనము (1)

**1.** **అథ హి ఏనం గార్హపత్యో అనుశశాస**
**"పృథివిః - అగ్నిః - అన్నమ్ - ఆదిత్య" - ఇతి॥**
**య ఏష ఆదిత్యే పురుషో**
**దృశ్యతే, - సోఽహమస్మి।**
**స ఏవ అహం అస్మి - ఇతి॥**

గార్హపత్యాగ్ని పురుషుడు

"నేను సర్వదా ఆత్మ స్వరూపుడను।

- ఈ సమస్తము ఆత్మస్వరూపమే। కాబట్టి భూమి, అగ్ని, అన్నము ఆదిత్యుల రూపముగా ఉన్నది నేనే। ఇది అనుశాసనము.

ఆదిత్యునియందు ఏ పురుషుడు (Worker of the Whole) కనిపిస్తూ ఉన్నారో,

- ఆ ఆదిత్య పురుషుడను నేనే।

- ఆ ఆదిత్యపురుషుడనే నేను।

అంతేగాని, జీవమాత్రుడను కాను. అగ్ని - కట్టెల రూపమాత్రుడను కాను.

---

**2.** **స య ఏతం ఏవం విద్వాన్**
**ఉపాస్తే అపహతే**
**పాప కృత్యాం లోకీ భవతి।**
**సర్వమ్ ఆయురేతి। జ్యోగ్జీవతి।**
**న అస్య అవరపురుషాః క్షీయంతే॥**

ఎవ్వడైతే ఆత్మగురించి ఈ విధంగా - "ఈ సమస్తము ఆత్మయే। నేను ఆత్మ స్వరూపుడనే। ఈ సమస్తము నేనే" - అని ఆత్మజ్ఞానవిద్వాంసుడై నిశ్చలుడౌతాడో

- ఆతని పాపదృష్టులన్నీ తొలగిపోతాయి.

- ఉత్తమ లోకములు సిద్ధించుకోగలడు.

- ఆయుష్షు పవిత్రమౌతుంది.

- ఉజ్వలుడై జీవించగలడు.

- ఆతనిని ఆశ్రయించినవారు, సంబంధీకులు క్షీణత పొందరు.

**ఉప వయం తం భుంజామో**
**అస్మిగ్ంశ్చ లోకే అముష్మిగ్ంశ్చ**
**య ఏతం ఏవం విద్వాన్ ఉపాస్తే॥**

అట్టి ఆముష్మిక లోకతత్త్వము ఎరిగినవారు మా చే ఇహ - పరములందు కూడా మార్గదర్శకులుగా, తత్త్వజ్ఞులుగా గౌరవించబడుచున్నారు. (ఈవిధంగా పలికి గార్హపత్యాగ్ని పురుషుడు మౌనం వహించారు)

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - చతుర్థాధ్యాయే ఏకాదశః ఖండః**

## 4-12. ద్వాదశ ఖండము - గార్హపత్యాగ్ని అనుశాసనము (2)

| | | |
|---|---|---|
| 1. | అథ హి ఏనమ్<br>అన్వాహార్య పచనో అనుశశాసా<br>"ఆపో దిశో నక్షత్రాణి చంద్రమా" - ఇతి<br>య ఏష చంద్రమసి పురుషో దృశ్యతే -<br>సో౽హమస్మి। స ఏవ అహమస్మి ఇతి॥ | గార్హపత్యాగ్ని అనుశాసనం -<br>అప్పుడు అన్వాహార్య పచనాగ్ని గురించి గార్హపత్యాగ్ని దేవత ఇంకా ఈ విధంగా బోధించసాగారు.<br>గార్హపత్యాగ్ని పురుషుడు (దేవత) : ఓ ఉపకోసలా। ఇది కూడా విను.<br>**(1) జలము (2) దిక్కులు (3) నక్షత్రములు (4) చంద్రమా...**అయి ఉన్నది చంద్రమ పురుషకారమే। అట్టి చంద్రమసముగా కనబడుచూ ఉన్నదంతా నేనే అయి ఉన్నాను.<br>అది నేను। నేనే అదంతా। |
| 2. | స య ఏతం ఏవం విద్వాన్<br>ఉపాస్తే - అపహతే<br>పాపకృత్యాం, లోకీ భవతి।<br>సర్వమాయురేతి। జ్యోగ్జీవతి।<br>న అస్య అవరపురుషాః క్షీయంత।<br>ఉప వయం తం భుంజామో<br>అస్మిగ్ంశ్చ లోకే అముష్మిగ్ంశ్చ<br>య ఏతం ఏవం<br>విద్వాన్ ఉపాస్తే॥ | ఇది ఎరిగి ఉపాసిస్తున్న విద్వాంసుడు 'అది నేనే' అనే భావనను నిశ్చలపరచుకొన్నవాడు,<br>- సర్వపాప దృష్టులనుండి విడివడగలడు.<br>- సర్వ లోకములు తన స్వరూపమే అయి ఆనందించగలడు.<br>- ఉత్తమ ఆయుష్షు పొందగలడు.<br>- స్వయం ప్రకాశమగు జ్యోతి స్వరూపుడై విరాజిల్లగలడు.<br>- అట్టివాని వంశము క్షీణించదు.<br>- వారు ఆముష్మిక లోకవాసులుగా మాచే దర్శించబడుచున్నారు. గౌరవించబడుచున్నారు. లోకంలో అట్టివారు మాకు ఆరాధ్య పురుషులగుచున్నారు. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - చతుర్థాధ్యాయే ద్వాదశః ఖండః

## 4-13. త్రయోదశ ఖండము - ఆహవనీయాగ్ని అనుశాసనం (1)

| | | |
|---|---|---|
| 1. | అథ హి ఏనం ఆహవనీయో అనుశశాస<br>"ప్రాణ। ఆకాశో। ద్యౌః। విద్యుత్" - ఇతి।<br>య ఏష విద్యుతి పురుషో దృశ్యతే...<br>సో౽హమస్మి। స ఏవ అహమస్మి - ఇతి॥ | ఆహవనీయాగ్ని పురుషుడు (దేవత) :<br>ఏ విద్యుత్ పురుషుడు ప్రాణ, ఆకాశ, ద్యులోక, విద్యుత్తు (తేజోమయము)గా అగుపిస్తున్నారో అట్టి విద్యుత్ (తేజో) పురుషుడను నేనే। నేనే అవన్నీగా ఏర్పడి ఉన్నాను. |
| 2 | స య ఏతం ఏవం విద్వాన్ ఉపాస్తే,<br>అపహతే పాపకృత్యాం లోకీ భవతి।<br>సర్వమ్ ఆయుః ఏతి। జ్యోగ్జీవతి।<br>న అస్య అవరపురుషాః క్షీయంత।<br>ఉప వయం తం భుంజామో<br>అస్మిగ్ంశ్చ లోకే అముష్మిగ్ంశ్చ<br>య ఏతమ్ ఏవం విద్వాన్ ఉపాస్తే॥ | ఈ విధంగా ఎవ్వరైతే తన ఆత్మస్వరూపము గురించి తాను తెలుసుకొని విద్వాంసుడై ఉపాసిస్తాడో....<br>- అట్టివాడు పాపకృత్యములనుండి విడివడి, సర్వలోకహితుడు అవుతాడు.<br>- ఆయుష్మంతుడు కాగలడు.<br>- జ్యోతి స్వరూపుడై జీవితమును ప్రకాశింపజేసుకోగలడు.<br>- ఆతని వంశము పావనము అవుతుంది.<br>- ఆతని ఆముష్మక జ్ఞానమును మేము భజించుచున్నాము. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - చతుర్థాధ్యాయే త్రయోదశః ఖండః

## 4-14. చతుర్దశ ఖండము - ఆహవనీయాగ్ని అనుశాసనం (2)

**1.** **తే హ ఊచుః।**
**ఉపకోసల ఏషా, సోమ్య!**
**తే అస్మత్ విద్యా - ఆత్మ విద్యా చ।**
**ఆచార్యస్తు తే గతిం వక్తా ఇతి**
**అజగామ హ అస్య ఆచార్యః।**
**తమ్ ఆచార్యో అభ్యువాదా**
**ఉపకోసలా! ఇతి॥**

ఆ అగ్ని పురుషులు ఇంకా ఇట్లా ప్రవచించసాగారు.

త్రయాగ్ని పురుషులు : ఓ ప్రియ ఉపకోసలా! సౌమ్యా! మేము మీకు ఆత్మ విద్య గురించి చెప్పాము. ఇంకా కూడా మీ గురుదేవులు సత్యకాములవారు మరింతగా బోధించగలరు.

అప్పుడు ఆచార్యులవారు (సత్యకాములవారు) సంచారమునుండి తిరిగివచ్చారు.

ఆచార్యులు : ఓ ఉపకోసలా!

---

**2.** **'భగవ।' - ఇతి హ।**
**ప్రతిశుశ్రావ బ్రహ్మవిద ఇవ,**
**సోమ్య, తే ముఖం భాతి కా ను?**
**త్వా అనుశశాసేతి కో, ను!**
**మా అనుశిష్యాత్ భో,**
**ఇతీ హ అప ఏవ నిహ్నుతే।**
**ఇమే నూనం ఈదృశా అన్యాదృశా**
**ఇతీ హ అగ్నీన్ అభ్యూదే।**
**కిం ను, సోమ్య!**
**కిల తే అవోచన్? ఇతి॥**

ఉపకోసలుడు : భగవాన్! గురుదేవా! నమోనమః

ఆచార్యులు : సౌమ్యా! ప్రియదర్శనుడా! నీ ముఖము బ్రహ్మవేత్త ముఖంలాగా ప్రకాశిస్తోందే! నీకు ఎవ్వరైనా బ్రహ్మవిద్యను ఉపదేశించారా?

ఉపకోసలుడు : స్వామీ గురుదేవా! మీ శిష్యుడనగుటచే మీరే కదా, నాకు బ్రహ్మ జ్ఞానమును ప్రసాదించాలి!

ఆయా విధములుగా (గార్హపత్యాగ్ని-ఆహవనీయాగ్ని స్వరూపుడగు) అగ్నిదేవుడు దృశ్యంలో సందర్భములగు కొన్ని విశేషములపట్ల సోఽహమ్ భావమును బోధించారు.

---

**3.** **'ఇదమ్' ఇతి హ ప్రతిజజ్ఞే లోకాన్ వావ**
**కిల సోమ్య! తే అవోచన్**
**అహం తు తే తత్ వక్ష్యామి!**
**యథా పుష్కరపలాశా ఆపో**
**న శ్లిష్యంత ఏవం,**
**ఏవం విది పాపం కర్మ న శ్లిష్యత - ఇతి।**
**బ్రవీతు మే భగవాన్! ఇతి**
**తస్మై హ ఉవాచ॥**

ఆచార్యులు : ఓహో! అగ్నిపురుషుడు లోక విశేషములను సోఽహమ్ దృష్టితో దర్శించుచూ ఉపాసించు విశేషములన్నీ చెప్పారా? మంచిది.

ఇప్పుడు నీకు బ్రహ్మము గురించిన విశేషమునే బోధిస్తాను. నీ మనస్సులోని బ్రహ్మజిజ్ఞాసాభిలాషను తీరుస్తాను.

పద్మముపై ఉన్న జలబిందువులు పద్మమును తాకని విధంగా, బ్రహ్మతత్త్వజ్ఞానముచే నిన్ను పాపదోషములు స్పృశించజాలవు.

ఉపకోశలుడు : ఆచార్యదేవా! నాకు ఇంకను బ్రహ్మజ్ఞానము పూర్తిగా బోధించండి.

అప్పుడు గురుదేవులు ఇట్లా పలుకసాగారు.

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - చతుర్థాధ్యాయే చతుర్దశః ఖండః**

## 4-15. పంచదశ ఖండము - అక్షిణి పురుష ఉపాసన

| | | |
|---|---|---|
| | <u>తస్మై హ ఉవాచ :</u> | సత్యకామ జాబాలి : |
| 1. | య ఏషో "అక్షిణి పురుషో"<br>దృశ్యత - ఏష "ఆత్మ" ఇతి।<br><u>హ ఉవాచ :</u><br>ఏతత్ అమృతమ్। అభయమ్।<br>ఏతత్ బ్రహ్మ ఇతి॥<br>తత్ యత్ అపి అస్మిన్ సర్పిర్వ<br>ఉదకం వా సించతి వర్త్మనీ ఏవ గచ్ఛతి॥ | ఓ ప్రియశిష్యా! ఉపకోశలా! విను.<br><br>ఈ కంటిలో చూపును ఉపయోగించుచూ ఏ 'చూచువాడు' (అక్షిణిపురుషుడు) వేంచేసి ఉన్నాడో - ఆతడు ఆత్మయే అయి ఉన్నాడు.<br><br>ఆ చూపు తనదైన అక్షిణి పురుషుడు 'కన్ను' అనే ఉపకరణము కంటే ముందే ఉన్నాడు. చూచేవాడే కంటితో పుట్టడు, కంటితో చావడు. ఆ చూచేవాడే అమృత పురుషుడు. అభయ స్థానమునకు చెందినవాడు. బ్రహ్మమే అయిఉన్నాడు.<br><br>అట్టి చూచువాడుగాని, చూపుగాని చూడబడే దానిచే ప్రవేశించబడటం లేదు. వెన్నగాని, నీటిబిందువుగాని కళ్లపై జల్లితే, అవి బయటకు వెళ్తాయేగాని, లోనికి ప్రవేశించవు గదా! చూపులో చూడబడేది ప్రవేశించక తిరిగి బయటకే వెళ్లుచున్నది. |
| 2. | ఏతగ్ం సంయద్వామ - ఇతి<br>ఆచక్షత, ఏతగ్ం హి<br>సర్వాణి వామాని అభిసంయంతి।<br>సర్వాణి ఏనం వామాని<br>అభిసంయంతి - య ఏవం వేద॥ | అట్టి అక్షిణి పురుషుడే (One who is seeing) ఆత్మపురుషుడు. ఆయనను "సంయద్వామ" (యత్ వామ సంయత్ - విడిగా ఉన్నవాడు) - అని కూడా అంటారు. ఎందుకంటే, అన్ని నామములు (అభినందనములు) ఆయనకే చేరుచున్నాయి. ఎవ్వడైతే "సర్వస్తుతులు, దృశ్యసేవనములు చెందుచున్నది ఆ ద్రష్ట పురుషునికే" - అని గ్రహిస్తాడో, ఆతడు సర్వ నామములు (అభినందనలు) పొందినవాడగుచున్నాడు. అందుచేత నీవు చూచేవన్నీ చూచువానికే సమర్పించు. |
| 3. | ఏష ఉ ఏవ వామనీః।<br>ఏష హి సర్వాణి వామాని నయతి।<br>సర్వాణి వామాని నయతి య ఏవం వేద॥ | అట్టి ఆత్మస్వరూపుడగు అక్షిణిపురుషుడే (కేవల ద్రష్టయే) -<br><br>వామనీ → సర్వము తనకు చెందినవాడు, దృశ్యమంతా తన సంపదగా కలవాడు.<br><br>ఈ విధంగా కంటిలో ప్రవర్తమానుడై ఉన్న ద్రష్ట (లేక) అక్షిణి పురుషుని ఆత్మగా ఎరిగినవాడు - తాను చూస్తున్నదంతా తన సంపదగా ఎరిగి, ఆత్మానందుడగుచున్నాడు. |
| 4. | ఏష ఉ ఏవ భామనీః<br>ఏష హి సర్వేషు లోకేషు భాతి।<br>సర్వేషు లోకేషు భాతి -<br>య ఏవం వేద॥ | ఆ కంటిలో నివాసము కలిగి సమస్తమును చూస్తూ ఉన్న దృక్ - పురుషుడే -<br><br>భామనీ → సమస్తమును తన చూపు తేజస్సుతో వెలిగించుచున్నాడు.<br><br>భాతి = ఈ సమస్త లోకములుగా భాసించుచున్నది ఆ అక్షిణి పురుషుడే। ఇదంతా ఆయన పురుషకారమే।<br><br>ఇది తెలుసుకొన్నవాడు "నేనే ఈ కనబడే సమస్తమును దృశ్యముగా వెలిగిస్తూ వెలుగుచున్నదంతా నేనే అయి ఉన్నాను" అని ఎరుగగలడు. |

5. **అథ యత్ ఉ చ ఏవ
అస్మిన్ శవ్యం కుర్వంతి,
యది చ న అర్చిషం ఏవ
అభిసంభవంతి,
అర్చిషో అహరహ్న
ఆపూర్యమాణపక్షమ్
ఆపూర్యమాణపక్షాతి ఆన్షట్ ఉదజ్
ఏతి → మాసాగ్ం।
తాన్ మాసేభ్యః సంవత్సరగ్ం।
సంవత్సరాత్ → ఆదిత్యమ్।
ఆదిత్యాత్ → చద్రమసమ్।
చంద్రమసో → విద్యుతమ్।**

ఈ విధంగా - (1) నేత్రములో నివసించుచూ అక్షిణి పురుషుడై (2) చూడబడుచున్నదంతా తానే అయి, సమస్త దృశ్యముగా వెలుగొందుచున్నాడు అని ఆత్మను (స్వస్వరూప-దృక్ద్రష్ట స్వరూపముగా) - ఉపాసించువాడు -

→ ఆతడు సంతానము మొదలైన ఇతరులచే గుర్తింపకున్నా (లేక) స్తుతించబడకున్నా, దేవ పితృకార్యములు పొందినా, పొందకపోయినా కూడా → ఆతడు - అర్చిస్సులను (అర్చన కిరణములను) చేరుచున్నాడు.

→ పగటి తేజోపుంజములలోను, కాంతిలోను ప్రయాణములు పొందుచున్నాడు.

→ ఆపూర్యమాణ పక్షము (శుక్లపక్షము)లో ప్రవేశిస్తున్నాడు.

→ శుక్లపక్ష దేవత నుండి ఉత్తరాయణ దేవతను ఆశ్రయిస్తున్నాడు. ఉత్తరాయణములో ప్రవేశిస్తున్నాడు.

→ అందులోంచి సంవత్సర దేవతను పొందుచున్నాడు.

→ అక్కడనుండి ఆదిత్యలోకము (సూర్యుని) చేరుచున్నాడు.

→ అక్కడి నుండి చంద్రమసము.

→ చంద్రమసము నుండి తేజమయమగు 'విద్యుత్' రూపమును పొందుచున్నాడు.

**తత్పురుషో అమానవః
స ఏనా(త్) బ్రహ్మ గమయతి।**

అట్టి తేజోమయ విద్యుత్ స్థానమునుండి తత్పురుష సంబంధమైన, మానవాతీతమైన బ్రహ్మలోకము జేరి ''బ్రహ్మము''ను పొందుచున్నాడు.

**ఏష "దేవ పథో" "బ్రహ్మపథ"
ఏతేన ప్రతిపద్యమానా।
ఇమం మానవం ఆవర్తం
న ఆవర్తంతే। న ఆవర్తంతే।।**

ఇదియే "దేవపథము''. ఇదియే "బ్రహ్మపథము''. అదియే "బ్రహ్మమే తానవటము''. అట్టివాడు బ్రహ్మమే తానై, ఇక "నేను జీవుడను'' అనబడు స్వయం కల్పిత పరిమితమగు మానవలోకమునకు తిరిగిరాడు. బ్రహ్మమే తానై సర్వత్రా విరాజిల్లగలడు.

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - చతుర్థాధ్యాయే పంచదశః ఖండః**

# 4-16. షోడశ ఖండము - యజ్ఞోపాసన

| | | |
|---|---|---|
| 1. | ఏష హ వై యజ్ఞో<br>యో అయం పవత<br>ఏష హ యన్నిదగ్ం సర్వం పునాతి॥ | ఈ జగత్తులో వాయువు (పవనము) వీచుచు సమస్తము నిర్వర్తిస్తోంది. జీవులకు జీవనము ప్రసాదిస్తూ ఉన్నది. కదిలే వాయువు వెనుక "కదిల్చే చైతన్యము" ప్రవర్తమానమై ఉన్నది.<br>అట్టి (పవతము) వీచువాయువే, అగ్నిజ్వలనంగా ఇక్కడి యజ్ఞ కార్యక్రమమునకు నాంది. అట్టి వాయువుయొక్క వీచికలు సమస్తమును పవిత్రము చేస్తున్నాయి. |
| | యత్ ఏష యన్నిదగ్ం సర్వం పునాతి - | వాయువు వీచుచుండగా అది యజ్ఞరూపంగా సమస్తమును పవిత్రము - ఉత్తేజము చేయుచున్నది.<br>యజ్ఞమునకు ప్రారంభమును ప్రసాదిస్తోంది. |
| | తస్మాత్ ఏష ఏవ యజ్ఞః<br>తస్య మనః చ వాక్ చ వర్తనీ॥ | కావున, వాయు సంచలనమే మహత్తరమగు సృష్టి యజ్ఞము. (నమస్తే వాయు! త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి।)<br>యజ్ఞమునకు (1) మనస్సు (2) వాక్కు మార్గములు. ఆ రెండు ప్రధానములు. |
| 2. | తయోః అన్యతరాం మనసా<br>సగ్ంస్కరోతి, బ్రహ్మా వాచా<br>హోతా, అధ్వర్యుః ఉద్గాతా అన్యతరామ్॥<br>స యత్ర ఉపాకృతే ప్రాతః అనువాకే।<br>పురా పరిధానీయాయా<br>బ్రహ్మా వ్యవవదతి॥ | యజ్ఞములోని మనస్సు - వాక్కు మార్గములలో,<br>**మనస్సును** → "బ్రహ్మ" అగు ఋత్విక్కు మనస్సుతో సంస్కరిస్తున్నారు.<br>**వాక్కును** → హోత - అధ్వర్యుడు - ఉద్గాత, వీరు తమ వాక్కుతో 'వాక్కు'ను సంస్కరిస్తున్నారు. ఈ రెండవ మార్గము - వారిచే సంస్కరించబడుతోంది.<br>ముందుగా ప్రాతరనువాకము. ఆ తరువాత యజ్ఞము మొదలౌతోంది. "పరిధానీయము" అనే ఋక్కు యజ్ఞగుండమును, కుండలను పవిత్రము చేయటమునకు ముందుగా ఋత్విక్కు ఋక్కులను గానం చేస్తారు. ఋక్కుల గానము ముగించి, ఋత్విక్కు మౌనము వీడగానే "మనో సంస్కరణము" అనే మొదటి మార్గము పూర్తి అయినట్లు. |
| 3. | అన్యతరామ్ ఏవ వర్తనీగ్ం,<br>సగ్ంస్కరోతి। హీయతే అన్యతరా।<br>స యథ ఏకపాద్ వ్రజన్<br>రథో, వైకేన చక్రేణ<br>వర్తమానో రిష్యతి।<br>ఏవమ్ అస్య యజ్ఞో రిష్యతి।<br>యజ్ఞగ్ం రిష్యంతం<br>యజమానో అనురిష్యతి।<br>స ఇష్ట్వా పాపీయాన్ భవతి॥ | మనస్సు సంస్కరించబడిన తరువాతనే వాక్కు కూడా సంస్కరించబడాలి. అట్లా కాకుండా (మనో సంస్కార ఋక్‌గానం) లేకుండా వాక్ సంస్కారం మాత్రమే ఆశ్రయించటం ఎటువంటిదంటే<br>→ యజ్ఞ కర్మ పవిత్రత చెందదు.<br>→ ఒంటి కాలితో మనుష్యుడు నడవటము వంటిది.<br>→ ఒక చక్రముతోనే రథమును ముందుకు త్రోయటము వంటిది.<br>యజ్ఞము కూడా ఆ విధంగా ఉత్తమంగా ప్రయోజనకారి కాదు.<br>మనో సంస్కారము + వాక్ సంస్కారము → ఉభయము అనుసరించకపోతే యజ్ఞము కుంటుపడినట్లు అవుతుంది. యజమాని పాపి కూడా అగుచున్నాడు. |

| | | |
|---|---|---|
| **4.** | **అథ యత్ర ఉపాకృతే ప్రాతః<br>అనువాకే న పురా పరిధానీయాయా<br>బ్రహ్మా వ్యవవదతి<br>ఉభే ఏవ వర్తనీ సగ్ంస్కుర్వంతి।<br>న హీయతే అన్యతరా॥** | "ప్రాతరనువాకము" (Pre Praying chants) తరువాత పరధీయ ఋక్కులకు ముందుగా ఋత్విక్కు మౌనము వీడకుండా ఉంటే - అప్పుడు అటు<br><br>(1) ప్రాతరనువాకము (2) పరాధీయు ఋక్కులు - ఉభయము సంస్కరించబడినవి అవుతాయి.<br><br>రెండూ కూడా ఇక లోపభూయిష్టము కావు. |
| **5.** | **స యథా ఉభయ పాద్,<br>వ్రజన్ రథో వోభాభ్యాం<br>చక్రాభ్యాం వర్తమానః ప్రతితిష్ఠతి।<br>ఏవం అస్య యజ్ఞః ప్రతితిష్ఠతి।<br>యజ్ఞం ప్రతితిష్ఠంతం<br>యజమానో అనుప్రతితిష్ఠతి।<br>స ఇష్ట్వా, శ్రేయాన్ భవతి॥** | ఏ విధంగా అయితే...<br><br>- మానవుడు రెండుకాళ్ళతో అయితే చక్కగా నడుస్తున్నాడో,<br><br>- రెండు చక్రములతోనే రథము చక్కగా ముందుకు నడవగలదో,<br><br>అదే విధంగా ప్రాతరనువాకము, పరాధీయ ఋక్కులు ఇవన్నీ మనో సంస్కార మంత్రముల - "వాచా సంస్కార మంత్రములతో" కూడుకొని యజ్ఞము ప్రతితిష్ఠము అగుచున్నది.<br><br>యజ్ఞకర్త, ఋత్విక్కు, ఆధ్వర్యుడు, హోత, ఉద్గాత మొదలైన యజ్ఞదీక్షా భాగస్తులంతా అనుప్రతిష్ఠితులు కాగలరు.<br><br>యజ్ఞము తృప్తిగా జరుగుచూ ఉండగా, యజమానికి, యజ్ఞవీక్షకులకు క్షేమము కాగలదు.<br><br>యజ్ఞము (ఇష్టము)చే యజమాని శ్రేయము పొందగలడు. యజ్ఞభాగస్తులు, యజ్ఞవీక్షకులు - సర్వశ్రేయస్సులు పొందగలరు. |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - చతుర్థాధ్యాయే షోడశః ఖండః**

# 4-17. సప్తదశః ఖండః - వ్యాహృత్యుపాసన

1. **ప్రజాపతిః లోకాన్ అభ్యతపత్।**
**తేషాం తప్య మానానాగ్ం**
**రసాత్ ప్రావృహత్।**
**అగ్నిం పృథివ్యా వాయుమ్**
**అంతరిక్షాత్ ఆదిత్యం దివః॥**

"ప్రజాపతి - 'సృష్టి'ని లీల - క్రీడ - వినోదముగా కల్పన చేసెదను గాక'' - అనే ఇచ్ఛ పొందారు. తపన రూపంగా తపస్సుచే ధ్యానరూపంగా సృష్టి రసమును పండించసాగారు.

తపనయే - తపస్సు। ధ్యాసయే - ధ్యానము।

కొన్ని మహత్తర వస్తువులను సృష్టి కల్పనా లీలకొరకై వెలికితీయసాగారు. భూమి.

భూమి నుండి - అగ్నిని,

ఆకాశము నుండి - వాయువును

ద్యు(దేవతా) లోకమునుండి - ఆదిత్యుని (సూర్యుని)

రసరూపంగా - బహిర్గతపరచారు.

(గమనిక - సృష్టి క్రమము అనేక వేదోపనిషత్తులలో అనేక విధములుగా చెప్పబడినా, సృష్టికి మూలము మాత్రము ఆత్మ (బ్రహ్మము) అనియే నిర్ధారణ చేయబడినది.)

---

2. **స ఏతాః తిస్రో దేవతా అభ్యతపః।**
**తాసాం తప్యమానానాగ్ం**
**రసాన్ ప్రావృహత్।**
**అగ్నేః ఋచో।**
**వాయోః యజూగ్ంషి।**
**సామాని ఆదిత్యాత్॥**

ఈ విధంగా కొనసాగిస్తూ ముగ్గురు దేవతలను (త్రిమూర్తులను) గురించి ధ్యానతపస్సులచే ఆ దేవతల రసతత్త్వము స్వీకరించారు.

అగ్ని నుండి → ఋక్కులను (ఋగ్వేదమునందలి ఆత్మదేవుని గురించి స్తుతులను),

వాయువు నుండి → యజుర్వేద మంత్రములను (యజస్సులను)

ఆదిత్యుని నుండి → సామ వేదగానములను

రసముగా (సృష్టికొనసాగించటానికి) స్వీకరించారు. ఈ విధంగా 3 వేదములు రూపుదిద్దుకున్నాయి.

---

3. **స ఏతాం త్రయీం విద్యామ్**
**అభ్యతపః, తస్యాః తప్యమానాయా**
**రసాత్ ప్రావృహత్ 'భూః' ఇతి ఋగ్భ్యో।**
**'భువః' ఇతి యజుర్భ్యః।**
**"స్వః' ఇతి సామభ్యః॥**

ఆ "ఋక్ - యజుర్ - సామ'' త్రయీ (3) వేదములనుండి మరల తపస్సుచే 'రసము'ను వేదసారమును స్వీకరించారు.

ఋగ్వేద ఋక్కుల నుండి - భూమి (Zone of Matter)

యజుర్వేద మంత్రముల నుండి - భువర్లోకమును (Zone of Thought)

సామవేద సామముల నుండి - 'స్వః' వ్యాహృతులను

(సృష్టికొరకై) తీసుకొన్నారు (స్వీకరించారు).

---

4. **తత్ యద్య ఋక్తో రిష్యేత్**
**"భూస్స్వాహా' ఇతి గార్హపత్యే జుహుయాత్।**
**ఋచామ్ ఏవ తత్ రసేనర్చాం, వీర్యేణర్చాం,**
**యజ్ఞస్య విరిష్టగ్ం సందధాతి॥**

యజ్ఞములో ఋగ్వేద ఋక్కులవలన ఏవైనా దోషములు అనిపిస్తూ ఉంటే "భూస్స్వాహా'' అని చెప్పుచూ 'గార్హపత్యాగ్ని'లో హవిస్సులను వ్రేల్చాలి. (హోమము చేయాలి).

ఈ విధంగా ఋక్కుల సారముచే ఋక్కుల వీర్యత్వము (శక్తి)చే హోమద్రవ్యములను హోమాగ్నిలో వ్రేల్చుచుండగా ఋక్కులకు చెందిన లోటులు తొలగిపోతాయి.

---

5. **అథ యది యజుషో రిష్యేత్ "భువస్స్వాహా" ఇతి,**
**దక్షిణాగ్నౌ జుహుయాత్ యజుషామ్ ఏవ**
**తత్ రసేన యజుషాం వీర్యేణ**
**యజుషాం యజ్ఞస్య**
**విరిష్టగ్ం సందధాతి॥**

అటుపై యజుర్వేద యజస్సుల (లేక) మంత్రముల కారణంగా ఏవైనా 'లోటు' కలుగుచుండటము గురించి - 'దక్షిణాగ్ని' యందు "భువస్స్వాహా'' అని పలుకుచు హవిస్సులను దక్షిణాగ్నికి సమర్పించాలి. (దక్షిణాగ్నియందు హోమద్రవ్యములను వ్రేల్చాలి).

అట్టి యజస్సుల వీర్యత్వము (బలము)చే యజస్సుల దోషములు ఏమైనా ఉంటే ఆ అరిష్టములు తొలగగలవు.

| | | |
|---|---|---|
| 6. | అథ యది సామతో రిష్యేత్ 'స్వః స్వాహా' ఇతి<br>ఆహవనీయే జుహుయాత్,<br>సామ్నామ్ ఏవ తత్ రసేన,<br>సామ్నామ్ వీర్యేణ సామ్నామ్ యజ్ఞస్య<br>విరిష్టగ్ం సందధాతి॥ | **అప్పుడు ఇక -**<br>సామవేద సామగాన - మంత్రములలో ఏదైనా 'లోటు' (యజ్ఞదోషములు) కలిగితే "స్వస్వాహా" అనే మంత్రముతో అహవనీయగ్నికి ఆహుతులు సమర్పించెదరు గాక।<br>అట్టి సామవేద సామముల రసము చేతను, సామ్నమంత్ర ఉచ్చారణ బలము చేతను యజ్ఞము యొక్క సర్వదోషములు తొలగుతాయి. |
| 7. | తత్ యథా లవణేన<br>సువర్ణగ్ం సందధ్యాత్,<br>సువర్ణేన రజతగ్ం, రజతేన త్రపు,<br>త్రపుణా సీసగ్ం సీసేన లోహం<br>లోహేన దారు దారు చర్మణా! | ఈ విషయం (దోషనివారణ) ఎటువంటిదంటే<br>- బంగారమును టంకము మొదలైన క్షారద్రవ్యములతో అతిగించగలము.<br>- వెండిని అతికించటానికి బంగారమును ఉపయోగించాలి.<br>- తగరమును వెండితో అతిగించగలం.<br>- సీసమును - తగరంచే అతిగించగలం.<br>- ఇతర లోహములను (ఇనుమును) - సీసముతో అతిగించగలం.<br>- కొయ్యను - ఇనుముతో అతిగించగలం. |
| 8. | ఏవం ఏషాం లోకానాం ఆసాం,<br>దేవతా నామస్య అస్త్రయ్యా,<br>విద్యయా వీర్యేణ యజ్ఞస్య<br>విరిష్టగ్ం సందధాతి,<br>భేషజకృతో హ వా ఏష యజ్ఞో,<br>యత్ర ఏవం విత్ బ్రహ్మా భవతి॥ | అదే విధంగా - లోకములయొక్క దుష్టత్వము దేవతా నామముల అస్త్రములు తొలగించుతీరుగా<br>- వేద రూపమగు రసరూపశక్తితో (శబ్దవీర్యత్వముతో) దోషములు తొలగించవచ్చును. యజ్ఞము యొక్క లోటులను పూరించవచ్చును.<br>ఈ విధంగా ఋక్ - యజుర్ - సామ మంత్రములచే యజ్ఞముల లోటును పూరించగల భిషజుల (Doctor) వంటి 'బ్రహ్మ' ఏ యజ్ఞకార్యమును పర్యవేక్షిస్తూ ఉంటారో - అట్టి యజ్ఞము దోషరహితము కాగలదు. **వ్యాహృతి హోమరూప ప్రాయశ్చిత్తము ఎరిగిన ఋత్విక్కు గల యజ్ఞము దిగ్విజయమవగలదు.** |
| 9. | ఏష హ వా ఉదక్ ప్రవణో యజ్ఞో<br>యత్ర ఏవం విత్ బ్రహ్మా భవతి।<br>ఏవం విదగ్ం హ వా ఏషా<br>బ్రహ్మాణమ్ అనుగాథా<br>యతో యత ఆవర్తతే,<br>తత్ తత్ గచ్ఛతి। | ఒక మంచి గుఱ్ఱము సరి అయిన సమయంలో రౌతును రక్షిస్తుంది కదా! అట్లాగే బ్రాహ్మణములు, అంతరార్థములు ఎరిగిన ఋత్విక్కు మాత్రమే యజ్ఞమును, యజమానిని, తదితరులందరినీ యజ్ఞం జరుగు పర్యంతము కాపాడుతూ ఉండగలడు.<br>ఆతడు యజ్ఞములో ఎక్కడెక్కడ ఎంతెంతవరకు సరిచేయుట అవసరమైయున్నదో - అక్కడక్కడకు వెళ్లి పొరపాటులను, లోటులను సరిచేయగలడు. అందరికి శాస్త్రీయతను బోధించి, యజ్ఞమును నడిపించగలడు. |
| 10. | మానవో బ్రహ్మా ఏవ ఏక ఋత్విక్ కురూన్<br>అశ్వా అభిరక్షతి ఏవం విద్ధ వై<br>బ్రహ్మా యజ్ఞం యజమానగ్ం<br>సర్వాగ్ంశ్చః ఋత్విజో అభిరక్షతి॥<br><br>తస్మాత్ ఏవం విదం ఏవ బ్రహ్మాణం కుర్వీత<br>నానేవం విదం। నానేవం విదం॥ | మానవీయుడగు బ్రహ్మ ఒక్కడే ఋత్విక్కు. అందరికీ యజ్ఞవిధులలో రక్షకుడు. అశ్వమును రక్షించుచున్నారు.<br>- బ్రహ్మయజ్ఞమును / (బ్రహ్మతత్త్వము) తెలియజేయుచున్నారు.<br>- యజమానిని అపరాధములను నివృత్తింపజేయుచున్నాడు.<br>- సర్వజనులను శ్రద్ధావంతులుగా చేయుచున్నాడు.<br>ద్విజుడై అన్నివైపులా రక్షించగలడు.<br>కాబట్టి యజ్ఞముయొక్క విధివిధానమంతా అంతర్హృదయముతో సహా చక్కగా తెలిసియున్నవానిని మాత్రమే యజమాని బ్రహ్మగా నియమించుకోవాలి. యజ్ఞవిధిని తెలియనివానిని బ్రహ్మగా నియమించుకోకూడదు. ఇది యజ్ఞవిధి సూచనము. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - చతుర్థాధ్యాయే సప్తదశః ఖండః

**ఇతి - ఛాందోగ్యోపనిషది - చతుర్థ అధ్యాయః సమాప్తః॥**

# ఛాందోగ్యోపనిషత్
# 5వ అధ్యాయము
## 5-1. ప్రథమ ఖండము - ప్రాణదేవతా ఉపాసన

| | | |
|---|---|---|
| **1.** | ఓం।<br>యో హ వై జ్యేష్ఠం చ శ్రేష్ఠం చ వేద,<br>జ్యేష్ఠశ్చ హ వై శ్రేష్ఠశ్చ భవతి।<br>ప్రాణో వావ జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ॥ | ఎవ్వరైతే సర్వజ్యేష్ఠమైనది, సమస్తమునకు శ్రేష్ఠమైనది తెలుసుకుంటాడో - అట్టివాడు అంతటా జ్యేష్ఠుడై, శ్రేష్ఠుడై ఉండగలడు.<br>ప్రాణమే సర్వదా జ్యేష్ఠము, శ్రేష్ఠము కూడా। |
| **2.** | యో హ వై వసిష్ఠం వేద, వసిష్ఠో<br>హ స్వానాం భవతి।<br>వాగ్వావ వసిష్ఠః। | ఎవ్వరైతే వసిష్ఠుని (మిక్కిలి శ్రేష్ఠుని) తెలుసుకొనుచున్నాడో, ఆతడు వసిష్ఠుడే (అందరిలో శ్రేష్ఠుడు) అగుచున్నాడు.<br>వాక్కుయే వసిష్ఠము। |
| **3.** | యో హ వై ప్రతిష్ఠాం వేద<br>ప్రతి హ తిష్ఠతి అస్మిగ్ంశ్చ,<br>లోకే అముష్మిగ్ంశ్చ॥<br><br>చక్షుర్వావ ప్రతిష్ఠా। | ఎవ్వరైతే ప్రతిష్ఠమైనది (స్థిరత్వమును ఇచ్చునది) తెలుసుకొంటాడో, అట్టివాడు చంచలములను జయించి సుప్రతిష్ఠితుడు అగుచున్నాడు. అట్టివాడు ఐహిక - ఆముష్మికములందు ప్రతిష్ఠితుడు (Wel-Placed) అగుచున్నాడు.<br>(యథాతథంగా ఉంటూనే అనేక వేరువేరు విషయములు చూడగలదు కాబట్టి -) ఈ నేత్రములే ప్రతిష్ఠితము. |
| **4.** | యో హ వై సంపదం వేద<br>సగ్ం హ అస్మై కామాః<br>పద్యంతే దైవాశ్చ, మానుషాశ్చ॥<br>శ్రోత్రం వావ సంపత్॥ | ఎవరైతే వాస్తవమైన 'సంపద' ఏదో - అది తెలుసుకుంటాడో - అట్టి వానిని దేవతలు కోరికలు తీర్చుకొన్న వారుగా చేయగలరు. అన్ని కోర్కెలు తీర్చగలరు.<br>వేదముల శ్రవణము, గురువులు చెప్పు సద్బోధ వినగలగటమే సంపద. అందుచేత జీవునకు చెవులే - నిజమైన సంపద। |
| **5.** | యో హ వా ఆయతనం వేద<br>ఆయతనగ్ం హ స్వానాం భవతి॥<br><br>'మనో' హ వా ఆయతనమ్॥ | ఎవ్వడైతే - అన్నీ కూడా దేనిని ఆశ్రయించినవై ఉంటున్నాయో - అట్టి 'ఆయతనము'ను తెలుసుకుంటాడో, అట్టివాడు - తదితరులకు ఆయతనుడు (ఆశ్రయింపతగినవాడు) అయి ప్రకాశిస్తున్నాడు.<br>(ఇంద్రియములకు భోక్త మనస్సు. ఇంద్రియములు దృశ్యమునుండి తెచ్చే సమాచారమంతా మనస్సుకే చేర్చబడుతోంది. కనుక మనోవృత్తుల రూపమగు) మనస్సే ఆయతనము (సర్వాశ్రయము) |
| **6.** | అథ హ ప్రాణా అహగ్ం<br>శ్రేయసి 'వ్యూదిరే అహగ్ం'<br>శ్రేయానస్మి అహగ్ం।<br>శ్రేయాన్ అస్మి ఇతి॥ | ఒకప్పుడు ప్రాణశక్తి సమన్వితములగు ఇంద్రియములన్నీ ఒకచోట సమావేశమైనాయి. ఒక్కొక్క ఇంద్రియము "నేనే జీవునికి ముఖ్య శ్రేయము" కలుగజేస్తున్నాను. "శ్రేయోదాయకుడిని నేనే" - అని ఎవరికివారే (కళ్ళు, చెవులు, నోరు మొదలైనవి) వివాదము పొందసాగాయి. |
| **7.** | తే హ ప్రాణాః ప్రజాపతిం<br>పితరమ్ ఏతి ఊచుః<br>"భగవాన్। కో నః శ్రేష్ఠ? ఇతి।<br><u>తాన్ హ ఉవాచ :</u><br>"యస్మిన్ వ ఉత్క్రాన్తే<br>శరీరం 'పాపిష్ఠతరమ్' ఇవ<br>దృశ్యేత, స వః శ్రేష్ఠ।"<br>ఇతి॥ | అప్పుడు ప్రాణశక్తి రూపములగు ఇంద్రియ దేవతలందరు పితృదేవులగు సృష్టికర్త వద్దకు వెళ్లారు. ఈవిధంగా అడిగారు.<br>"హే భగవాన్। పితృదేవా! శరీరములో గొప్ప ధర్మములు (Functions) నిర్వర్తిస్తూ ఉన్న మాలో గొప్పవారు ఎవ్వరో శ్రేష్ఠులెవరో జ్యేష్ఠులెవరో కొంచం వివరించి చెప్పండి.<br>ప్రజాపతి! ఓం! అదాః వినండి, చెపుతాను. మీలో ఎవ్వరు దేహమును వదలి లేచిపోతే శరీరము అత్యంత అశుచి అయి, పాపభూయిష్ఠము, (ఆవల పారవేయవలసినది) అవుతుందో - వారే శ్రేష్ఠులు. సరేనా? |

**8.** సా హ 'వాక్' ఉచ్చక్రామ,
సా సంవత్సరం
ప్రోష్య పర్యేత్య ఉవాచ
"కథమ్ అశకతర్తే
మజ్జీవితుమ్?" – ఇతి।

యథా కలా అవదన్తః।
ప్రాణంతః ప్రాణేన
పశ్యంతః చక్షుషా
శృణ్వంతః శ్రోత్రేణ
ధ్యాయంతో మనసైవమ్।

ఇతి ప్రవివేశ హ వాక్।

## వాగింద్రియ దేవత

ఇంద్రియములు తిరిగివచ్చి దేహములో ప్రవేశించాయి. అప్పుడు "వాక్కు (Talking) శరీరమును విడచి పైకి వెళ్లింది. మరల సంవత్సరము తరువాత తిరిగి వచ్చింది.

వాక్ దేవత : ఓ తదితర ఇంద్రియములారా "నేను లేనప్పుడు కూడా మీరు ఈ శరీరములో ఎట్లా జీవిస్తున్నారు? ఈ శరీరము ఇంకా జీవిస్తూ ఉన్నదేమిటి? నాకు ఆశ్చర్యమేస్తోంది.

తక్కిన ఇంద్రియములు : ఓ వాక్ ఇంద్రియ దేవతా! ఒక మూగవాడు ప్రాణము కలిగి, ప్రాణముల శక్తిచే కళ్ళతో చూస్తూ, చెవులతో వినుచూ, మనసుతో ధ్యాసలు కలిగి ఉండనే ఉంటాడు కదా! అట్లాగే, ఈ జీవుడు వాక్కు తొలగినప్పటికీ శరీరముతో జీవించియే ఉన్నాడు.

అప్పుడు వాక్కు తిరిగి శరీరములో ప్రవేశించి - (నేను లేకున్నా ఈ జీవుడు జీవించియే ఉన్నాడు, కాబట్టి అత్యంత శ్రేష్ఠుడను కాదు - అని తలచింది)

---

**9.** చక్షుః హ ఉచ్చక్రామ
తత్ సంవత్సరం
ప్రోష్య పర్యేత్య ఉవాచ :

"కథమ్ అశకతర్తే
మజ్జవితుమ్?" – ఇతి।

చక్షురింద్రియము : అప్పుడు చక్షు (చూపుదేవత) - ("నేను లేకపోతే ఈ దేహము అశుచి, నిస్తేజము అవుతుంది కదా" అని తలచి) - ఆ జీవుని దేహమును వదలి పైకివెళ్లి పోయింది. ఒక సంవత్సరము తరువాత తిరిగి శరీరమును సమీపించింది. అప్పటికీ ఆ శరీరి జీవిస్తూనే ఉన్నాడు.

చక్షురింద్రియ దేవత : ఓ తదితర ఇంద్రియములారా! నేను సంవత్సరకాలం లేకపోయినా ఈ దేహము శిథిలం కాలేదే? మీరంతా ఎటూ పోలేదే? ఈ సంవత్సరకాలం ఈ జీవుడు ఏదీ చూడలేకపోయాడు కదా।

"యథా అంధా అపశ్యంతః।"
ప్రాణంతః ప్రాణేన వదంతో
వాచా, శృణ్యంతః శ్రోత్రేణ
ధ్యాయంతో మనస ఏవం ఇతి

తదితర ఇంద్రియములు : ఓ చక్షుదేవతా! ఏదైనా కారణం చేత ఒకనికి చూపుపోయిందనుకోండి. ఆతని ప్రాణము, ప్రాణిగా ఆతడు వాక్కు, చెవులతో శ్రవణము, మనసుతో ధ్యానము కొనసాగుతూనే ఉంటుంది కదా! అదేవిధంగా మీరు శరీరంను వీడి పైకి వెళ్లినప్పుడు ప్రాణము, ప్రాణశక్తులైన వినికిడి, వాక్కు, శ్రవణము - ఇవన్నీ కొనసాగుచూనే ఉన్నాయి.

ప్రవివేశ హ చక్షుః॥

అప్పుడు చక్షు శక్తి (చూపు) నేను లేనంతమాత్రంచేత తదితర శరీరం నిష్ప్రయోజనం కాదన్నమాట అనుకొన్నది. శరీరములో పునః ప్రవేశించింది.

---

**10.** శ్రోత్రగ్ం హ ఉచ్చక్రామ।
తత్ సంవత్సరం ప్రోష్య పర్యేత్య – ఉవాచ :-
"కథం అశకతర్తే మజ్జీవితుమ్?" – ఇతి।
యథా బధిరా అశృణ్వంతః।
ప్రాణన్తః ప్రాణేన వదంతో వాచా
పశ్యంతః చక్షుషా
ధ్యాయంతో మనసైవమ్ ఇతి ప్రవివేశ హ శ్రోతమ్।

శ్రవణ (వినికిడి, చెవి) దేవత అప్పుడు శరీరమునుండి బయల్వెడలి సంవత్సరకాలం తరువాత మరల శరీరమును సమీపించింది.

నేను సంవత్సరకాలం ఈ శరీరం వదలివేసి ఉన్నా కూడా ఇది ఎట్లా మనగలుగుతోంది? "ప్రాణము, చూపు, స్పర్శ మొదలైనవన్నీ ఎట్లా ఉండి ఉన్నాయి?

తదితర ఇంద్రియముల సమాధానం: "ఒకడు చెవిటివాడు అయినప్పటికీ ప్రాణము, మనస్సు, ఆలోచన మొదలైనవి ఉంటాయి కదా! ఇదీ అంతే।" అప్పుడు వినికిడి తిరిగి శరీరంలో ప్రవేశించింది.

---

**11.** మనో హ ఉచ్చక్రామ।
తత్ సంవత్సరం ప్రోష్య
పర్యేత్య ఉవాచ :
"కథమ్ అశకతర్తే మజ్జీవితుమ్" – ఇతి

అప్పుడు మనస్సు దేహమును విడచి ఎటో వెళ్లిపోయింది. ఒక సంవత్సరకాలం తరువాత తిరిగివచ్చింది.

మనస్సు : ఇదేమిటి? నేను సంవత్సర కాలము ఈ దేహమును త్యజించినప్పటికీ ఇది ఇంకా కూడా జీవించి ఎట్లా ఉండగలిగింది? మీరంతా ఎట్లా ఈ దేహంలో ఉండగలిగారు?

| | | |
|---|---|---|
| | **"యథా బాలా అమనసః"।<br>ప్రాణంతః ప్రాణేన<br>వదంతో – వాచా,<br>పశ్యంతః – చక్షుషా,<br>శృణ్వంతః – శ్రోత్రేణైవమ్ ఇతి<br>ప్రవివేశ హ మనః॥** | **సమాధానము :** మనస్సు ఏమాత్రము వికసించని, అప్పుడే పుట్టిన బిడ్డ ప్రాణశక్తితో వినటము, ఏడవటము, నొప్పి అనుభవించటము, ఆకలి, చూడటము - చేయటం లేదా? అట్లాగే మనస్సు సంవత్సర కాలం లేనప్పటికీ ఈ దేహము ప్రాణశక్తితో (ప్రాణములు కలిగి ఉండి) మాట్లాడుతోంది, చూస్తోంది, వింటోంది, వినిపిస్తోంది.<br>అప్పుడు మనస్సు, మరల శరీరములో ప్రవేశించింది. తాను లేనంతమాత్రంచేత శరీరము నశించదు కాబట్టి తాను సర్వ శ్రేష్ఠము కాదని గమనించింది. |
| **12.** | **అథ హ ప్రాణ ఉత్ చక్రమిషన్ సః।<br>యథా సు–హయః<br>పడ్వీశ శంకూన్ సంఖిదేత్<br>ఏవమ్ ఇతరాన్<br>ప్రాణాన్ సమఖిదత్।<br>తగ్ం హ అభిసమేత్య ఊచు :–<br>"భగవన్! నేధి! త్వం నః శ్రేష్ఠోఽసి।<br>మా ఉత్క్రమీః ఇతి।** | అప్పుడు ముఖ్యప్రాణము శరీరమునుండి నిష్క్రమించటానికి సంసిద్ధమవసాగింది.<br>ఒక ఉత్తమమైన గుర్రము తనను కాళ్ళు కట్టి ఉంచిన గింజను పెరికి ఛంగ్న బయలుదేరుచున్నది చూచారా!<br>అట్లా ప్రాణము బయటకు వెళ్లటానికి ఉద్యమిస్తూ ఉండగా శరీరములోని చూపు, వినికిడి, మాట, ఆలోచన - భావన - స్పర్శ - మొదలైనవి కూడా దేహము నుండి పెరికివేయబడసాగాయి.<br>అప్పుడా ఇంద్రియశక్తులన్నీ (పంచేంద్రియములు) మనస్సుతో సహా ప్రాణదేవతను సమీపించి ఇట్లా పలికాయి.<br>"భగవాన్! ప్రాణదేవా! మీరు ఈ శరీరంలో శ్రేష్ఠులు, జ్యేష్ఠులు అయి ఉన్నారు. ఇది ఇప్పుడు మేము గమనిస్తున్నాము. దయచేసి శరీరమునుండి బయటకు వెళ్ళకండి. మీరు ఉంటేనే మేము దేహములో మనగలమని తెలుసుకున్నాము". |
| **13.** | **<u>అథ హ ఏనం వాక్ ఉవాచ:–</u><br>"యత్ అహం వసిష్ఠో అస్మి<br>త్వం తత్ వసిష్ఠో అసి" ఇతి।<br><u>అథ హ ఏనం చక్షుః ఉవాచ :–</u><br>"యత్ అహం ప్రతిష్ఠాఽస్మి।<br>త్వం తత్ ప్రతిష్ఠా అసి"। ఇతి॥** | **ఇంద్రియములు ప్రాణదేవతను ఇట్లా స్తుతించాయి.**<br>**వాక్కు :** నేను ఈ దేహములో వసిష్ఠుడను (అందరికంటే పెద్దవాడను) అయి ఉన్నమాట నిజమే. అయితే మీరు దేహంలో ప్రతిష్ఠితులై ఉండబట్టే నేను వసిష్ఠుడను.<br>**చక్షువులు :** నేను దేహంలో ప్రతిష్ఠుడనై ఉన్న మాట నిజమేకాని, అదంతా మీయొక్క "ప్రతిష్ఠ" యొక్క ప్రభావమే! |
| **14.** | **<u>అథ హ ఏనగ్ం శ్రోత్రమ్ ఉవాచ:</u><br>"యత్ అహగ్ం 'సంపద్' అస్మి,<br>త్వం తత్ సంపద్ అసి ఇతి।<br><u>అథ హ ఏనం 'మన' ఉవాచ :–</u><br>యత్ అహమ్ 'ఆయతనమ్'<br>అస్మి త్వం తత్ ఆయతనమ్ అసి ఇతి॥** | **శ్రోతము (వినికిడి - చెవులు) :** నేను ఈ దేహముయొక్క 'సంపద' అయి ఉండటమనేది - అదంతా కూడా - ప్రాణదేవా! మీరు సంపద కలిగి ఉండటం చేతనే।<br>మనస్సు : ఓ ప్రాణదేవా! సమస్తమునకు మీరే ఆధారము అయి ఉండగా, ఆ ఆధారమే (ఆశ్రయమే) నాచే ప్రదర్శించబడుతోంది. |
| **15.** | న వై వాచో, న చక్షూగ్ంషి<br>న శ్రోత్రాణి, న మనాగ్ంసి ఇతి అచక్షతే॥<br>"ప్రాణా" ఇత్యేవ ఆచక్షతే।<br>ప్రాణో హి ఏవ ఏతాని<br>సర్వాణి భవతి। | ఈ విధంగా వాక్కుగాని, కళ్ళుగాని, చెవులుగాని, ఆలోచన (మనస్సు)గాని స్వయముగా చైతన్యవంతము కావు. స్వయంగా శక్తి కలిగియున్నవి కావు. అందుచేత జీవుడు అనగా "వాక్కు, కళ్ళు, చెవులు, ఆలోచన" - అని అనరు.<br>**"ప్రాణమే - జీవుడు"** అనబడుచున్నాడు.<br>ప్రాణశక్తియే శరీరంలో వాక్కుగాను, చూపుగాను, వినికిడిగాను ఆలోచన (మనస్సు)గాను ప్రదర్శనం అగుచున్నది. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - పంచమాధ్యాయే ప్రథమః ఖండః

# 5-2. ద్వితీయ ఖండము - ప్రాణ విద్య

1. స హ ఉవాచ :-
కిం మే అన్నం భవిష్యతి - ఇతి॥
యత్ కించిత్ ఇదమా
శ్వభ్య ఆ శకునిభ్య
ఇతి హ ఊచుః।

ప్రాణదేవత : ఓ ఇంద్రియములారా! నాకు ఏది అన్నము (ఆహారము) కాగలదు? మరి నన్ను శరీరంలో ఉండిపోమంటున్నారు కదా! నాకు ఆహారము ఏది?

ఇంద్రియములు : ప్రాణేశ్వరా! ఒక కుక్క నుండి పక్షివరకు ఏదేది అన్నము (ఆహారము) అగుచున్నదో అదంతా మీరు స్వీకరిస్తున్న ఆహారమే కదా!

---

తద్వా ఏతత్ అనస్య అన్నమ్।
అనో హ వై నామ ప్రత్యక్షం।
న హ వా ఏవంవిది

ఈ విధంగా ప్రాణదేవతకు సర్వేంద్రియ విషయములు ఆహారమే। - ఇంద్రియములకు ప్రత్యక్షమైనదంతా ఆహారమే। ఈ దృశ్య జగత్తులో ప్రాణములకు ఆహారము కానిదంటూ ఏదీ లేదు. అనన్నము ఏదీ లేదు.

కించన అనన్నం భవతి - ఇతి॥

"ప్రాణములకు సమస్తము అన్నమే" అని తెలుసుకొన్నవానికి ఇంద్రియములకు విషయమగుచున్న ఈ జగద్దృశ్యమంతా 'అన్నము'గా అగుచున్నది.

---

2. స హ ఉవాచ :-
కిం మే వాసో భవిష్యతి? ఇతి
'ఆపః' - ఇతి హ ఊచుః

ప్రాణదేవత : సరే! మరి నాకు ధరించటానికి వస్త్రము ఏది?

ఇంద్రియములు : ప్రాణదేవా! జలమే మీరు ధరించు వస్త్రము.

---

తస్మాత్ వా ఏతత్ అశిష్యంతః
పురస్తాత్ చ ఉపరిష్టాత్ చ
అద్భిః, పరిదధతి
లంభుకో హ వాసో
భవతి అనగ్నో హ భవతి॥

ఈ కారణం చేతనే భోజనానికి కూర్చున్నవారు

- భోజనానికి ముందుగా - భుజించిన తరువాత - కూడా అన్నమును జలముతో ఆచ్ఛాదిస్తున్నారు.

"అట్టి ఆచమనమే ప్రాణమునకు వస్త్రము" అని ఎవ్వరు తెలుసుకొంటారో, వారికి వస్త్రములు అక్షయముగా లభించగలదు. వారు ఎప్పటికీ నగ్నముగా ఉండవలసిన పని ఉండదు.

---

3. తద్ధైతత్ (తత్ హి ఏతత్) సత్యకామో జాబాలో
గో శ్రుతయే వైయాఘ్రపద్యాయ
ఉక్త్వ ఉవాచ॥

మనము చెప్పుకొన్న ఈ "ప్రాణవిద్య"ను జగద్గురువగు శ్రీ సత్యకామ జాబాలుడు - తనను ప్రాణతత్త్వము గురించి శ్రవణము చేయటానికి వచ్చి ఆశ్రయించిన వ్యాఘ్రపదుని కుమారుడగు గోశ్రుతి... అనే వారికొరకు కూడా ఉపదేశించారు.

యద్యపి ఏతత్ శుష్కాయ స్థాణవే బ్రూయాత్
జాయేరన్ ఏవ అస్మిన్ శాఖాః ప్రరోహేయుః
పలాశాని - ఇతి॥

సత్యకామ జాబాల : ఓ ప్రియ వ్యాఘ్రపద ప్రియకుమారుడవగు గోశ్రుతా! ఈ 'ప్రాణవిద్య'ను మీరు ఎండిపోయిన మ్రానుకు చెప్పటం జరిగినా సరే - ఆ ఎండిపోయిన చెట్టు మరల చిగురించగలదు। ఇతి ఫలశ్రుతి।

---

4. అథ యది మహత్ జిగమిషేత్
అమావాస్యాయాం
దీక్షిత్వా పౌర్ణమాస్యాగ్ం
రాత్రౌ సర్వ - ఔషధస్య
మంథం దధి మధునోః
ఉపమథ్య

పైన చెప్పబడ్డ ప్రాణవిద్యామంత్రములన్నీ కూడా మహత్వసిద్ధులు ప్రసాదించగలిగినట్టివిగా మంత్రశాస్త్రవేత్తలచే ఉచ్చరించ బడుచున్నాయి. "మంథనము" అనే యజ్ఞములో విధి విధానములుగా చెప్పబడుచున్నాయి.

ప్రాణవిజ్ఞానము తెలిసినవారు - మహత్వసిద్ధి కొరకు ఈ యజ్ఞ విధానము ఆచరించుచున్నారు. ఆ విధానము చెప్పుకుందాము.

మహత్ సిద్ధికొరకై

- అమావాస్య రోజున 'యజ్ఞదీక్ష'ను స్వీకరించాలి.

| | మూలం | వివరణ |
|---|---|---|
| | "జ్యేష్ఠాయ - శ్రేష్ఠాయ స్వాహా" - ఇతి అగ్నావాజ్యస్య హుత్వా మంథే సంపాతమ్ అవనయేత్॥ | - 15 రోజులు దీక్షగా గడిపి పౌర్ణమినాటి రాత్రి యందు<br>❧ పెరుగు - తేనెలో నవధాన్యములు పిండిని - వీటన్నిటినీ పిష్టము (ముద్ద)గా చేయాలి (మంథపిష్టము).<br>❧ అట్టి పిష్టమును జ్యేష్ఠుడు, శ్రేష్ఠుడు అగు ప్రాణదేవతకు నివేదనగా సమర్పించాలి.<br>హవిస్సును యజ్ఞాగ్నికి **"జ్యేష్ఠాయ - శ్రేష్ఠాయ స్వాహా"** అని మంత్రములను పలుకుచూ అగ్నికి ఆజ్యము (నేయి) సమర్పించాలి. ఆ తరువాత మాలిన్యము తీసి వేరేచోట ఉంచాలి. |
| **5.** | "వసిష్ఠాయ స్వాహా।" - ఇతి అగ్నావాజ్యస్య హుత్వా మంథే సంపాతమ్ అవనయేత్ "ప్రతిష్ఠాయై స్వాహా" ఇతి | **"వసిష్ఠాయ స్వాహా"** ( వసిష్ఠము - అంతటికి పెద్దదైనట్టి దానికొరకు హోమద్రవ్యము సమర్పిస్తున్నాను) అని మరల మంత్రములతో అగ్నితో నేతిని వ్రేల్చుచూ, మంథపిష్టముపై నేతిని సంప్రోక్షించాలి. "ప్రతిష్ఠా ప్రాణదేవతకు సమర్పిస్తున్నాము" అంటూ అగ్నికి సమర్పించి పిష్టముపై కూడా నేతిబొట్లు వేయాలి. |
| | అగ్నా వాజ్యస్య హుత్వా మంథే సంపాతమ్ అవనయేత్ సంపదే స్వాహా ఇతి। | అట్లాగే **"సంపదాయ స్వాహా"** మంత్రము ఉచ్చరిస్తూ, అగ్నికి నేయి హోమం చేస్తూ మంథపిష్టముపై నేయిబొట్లు వదలాలి.<br>సంపత్ గుణ సమన్వితమగు ప్రాణదేవతకు ఆహుతులు సమర్పిస్తూనే, సంపదే స్వాహా అంటూ మంథ పిష్టముపై కూడా నేయి బొట్లు విడువాలి. |
| | "ఆదాయతనాయ స్వాహా" ఇతి। అగ్నా వాజ్యస్య హుత్వా మంథే సంపాతమ్ అవనయేత్॥ | "ఆదాయము (సమస్తమునకు ఆశ్రయము, ఆధారము) అగు ప్రాణ దేవతకు సమర్పిస్తున్నాను" - అని పలుకుచూ ("ఆదాయనాయ స్వాహా" అని మంత్రము చదువుచూ) స్రువముతో నేయిని తీసుకొని హోమాగ్నికి సమర్పించాలి. స్రువమునకు అతుక్కుకొని ఉన్న నేతి బొట్లను మంథపిష్టముపై వేయాలి. శ్రువమున శేషించిన నేతి చుక్కలు సంపాతము చేయాలి (చల్లాలి). |
| **6.** | అథ ప్రతిసృప్య అంజలౌ మంథమ్ ఆధాయ జపతి। | ఆ తరువాత అగ్నిగుండమునకు కొంచము దూరముగా జరిగి, మంథన మలిన భస్మమును దోసిలియందు ఉంచుకొని ఇట్లా ప్రార్థించాలి. |
| | "అమో" నామ అసి। అమా హి తే సర్వం ఇదమ్॥ స హి జ్యేష్ఠః శ్రేష్ఠః ॥ రాజా అధిపతిః సః మా జ్యైష్ఠ్యగ్ం శ్రైష్ఠ్యగ్ం। | ఓ ప్రాణదేవా! మీరు 'అమో' అనే పేరు గలవారు. (ప్రాణము ఆహారము వెంటనంటి దేహమునందు సంచరిస్తూ ఉండటంచేత) మంథద్రవ్యము అగ్నికి ఆహారము కాబట్టి 'ఆమో' అని అగ్ని పిలువబడుతోంది.<br>"సర్వమిదదగ్ం స హి జ్యేష్ఠః శ్రేష్ఠో రాజ్యాధిపతిః" - అను మంత్రముతో "ఓ ప్రాణదేవా? మీరు జ్యేష్ఠులు, శ్రేష్ఠులు, ఈ దేహరాజ్యమునకు అధిపతులు కూడా! - అని భావిస్తూ పూజించాలి. |
| | రాజ్యమ్ ఆధిపత్యం గమయతి। అహమేవ ఇదగ్ం సర్వమ్ అసాని। - ఇతి॥ | ఓ ప్రాణదేవా! ప్రకాశమానులగు మీరు నాకు జ్యేష్ఠత్వము, శ్రేష్ఠత్వము ఈ శరీరముపై ఆధిపత్యము ప్రసాదించండి। సర్వము అగు ఆత్మయే నేనై ఉండెదను గాక. |

| | |
|---|---|
| **7. అథ ఖలు ఏతయః ఋచా<br>పచ్ఛ ఆచామతి<br>తత్ సవితుః వృణీమహ<br>ఇతి ఆచామతి॥<br><br>వయం దేవస్య భోజనం<br>ఇతి ఆచామతి।** | ఆ తరువాత ఋక్కు మంత్రము పఠిస్తూ ఒక్కొక్క అడుగులోను ఆచమనం చేయాలి.<br>ఋక్కులు : "తత్సవితుః వృణీమహే"। వయం దేవస్య భోజనం॥<br>"శ్రేష్ఠం సర్వధా తమమ్॥ తురం భగస్య ధీమహి।"<br>ఈ విధంగా ప్రతి ఋక్కుకు ఆచమనం చేస్తూ ఉండాలి.<br>ఆ సవితృ దేవత యొక్క మహిమను స్తుతిస్తున్నాను'' - ఆచామతి (ఆచమనం)<br>"సవితృ దేవతారూపము పొందుటకై మేము ఈ దివ్యమగు దైవీ ప్రసాదము పొందెదము గాక'' - అని ఆచమనం చేయాలి. (ఉద్ధరిణితో నీళ్ళు తీసుకోవాలి) |
| **శ్రేష్ఠగ్ం సర్వధాతమమ్<br>ఇతి ఆచామతి।<br>"తురం భగస్య ధీమహి"<br>ఇతి సర్వం పిబతి।<br>నిర్ణిజ్య కగ్ంసం చమసం వా<br>పశ్చాత్ అగ్నేః సంవిశతి<br>చర్మణి వా స్థండిలే వా<br>వాచంయమో అప్రసాహః** | (దేవస్య - ప్రకాశరూపుడైన సవితుః)<br>యజ్ఞ ప్రసాదము అన్ని అన్నములకంటే మిక్కిలి శ్రేష్ఠము. సర్వ జగత్తులను ఉత్పన్నము చేయునది, నిలబెట్టునది - యజ్ఞప్రసాదమే.<br>వేగముగా, తేజోరూపముయొక్క (సవితృదేవతయొక్క) మహిమ ఎరిగిన బుద్ధి పొందెదము గాక! అన్నీ త్రాగుచున్నది! ఆ ప్రాణ దేవతయే సమస్త ప్రదర్శనము - అను బుద్ధి పొందెదము గాక। ప్రాణమే ఈ సమస్తము.<br>అని పలుకుచూ కాంస్య పాత్రను శుభ్రం చేసి, పాత్రకు అతుకుకుని ఉన్న మంథన యజ్ఞద్రవ్యములను నీటితో కడిగి - నీటిని త్రాగాలి. లేదా వేరే కంచుపాత్రతో నీరు త్రాగాలి. |
| **స యది స్త్రియం<br>పశ్యేత్ సమృద్ధం<br>కర్మ – ఇతి విద్యాత్॥** | ఆ తరువాత అగ్ని కుండమునకు ప్రక్కగా - జింకచర్మము పరచుకొని (లేదా) నేలను శుభ్రం చేసుకొని మౌనం పాటిస్తూ, అలజడి లేని ప్రశాంత చిత్తముతో యజమాని పరుండును గాక!<br>నిదురించినప్పుడు స్వప్నములో "స్త్రీయొక్క దర్శనం'' అయితే - అప్పుడు యజ్ఞకర్మ చక్కగా సమృద్ధముగా ఫలితం ఇచ్చినట్లుగా భావించాలి. |
| **8. తత్ ఏష శ్లోకో।<br>యదా కర్మసు కామ్యేషు స్త్రియగ్ం<br>స్వప్నేషు పశ్యతి సమృద్ధం,<br>తత్ర జానీయాత్<br>తస్మిన్ స్వప్న నిదర్శనే।<br>తస్మిన్ స్వప్న నిదర్శనే॥** | ఈ విషయమై ఈ విధంగా శ్లోకము చెప్పబడుతోంది.<br>**"ఎప్పుడైతే కామ్య కర్మలయందు (ఏదైనా ఇహలోక (లేక) స్వర్గాదిలోక సంబంధమైన ఉద్దేశ్యముతో) యజ్ఞము మొదలైన కర్మలు నిర్వర్తిస్తూ ఉండగా, అప్పుడు 'స్త్రీ దేవత' యొక్క దర్శనము స్వప్నములో అయితే - అది "యజ్ఞకర్మ సమృద్ధమైనది" అని అనుకోవటానికి నిదర్శనము" అని చెప్పబడుతోంది.** |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - పంచమాధ్యాయే ద్వితీయః ఖండః

## 5-3. తృతీయ ఖండము - పంచాగ్ని విద్య

| | | |
|---|---|---|
| **1.** | **శ్వేతకేతుః - ఆరుణేయః పంచాలానాగ్ం సమితిమేయాయ।** | అరుణి ఋషి కుమారుడు ఆరుణి. ఆరుణి 'గౌతమ' నామధేయుడు. అట్టి గౌతమారుణి కుమారుడు శ్వేతకేతువు. ఆ శ్వేతకేతువు ఒకానొక సందర్భములో పాంచాలరాజ్య రాజభవనానికి విచ్చేశారు. ఆ కాలంలో జైవలుని కుమారుడు ప్రహవణుడు అనే రాజు రాజ్యము ఏలుతూ ఉండేవారు. రాజు ప్రవాహణుడు శ్వేతకేతు మునికి రాజప్రసాదానికి స్వాగతం పలికారు. |
| | **తగ్ం హ ప్రవాహణో జైవలిః ఉవాచ। "కుమారాను త్వా అశిషత్ పితే ఇతి। "అను హి భగవ" ఇతి॥** | ప్రవాహణుడు : కుమారా! శ్వేతకేతూ! రండి! సుస్వాగతం। ఆశీనులుకండి. ఇప్పుడు చెప్పండి. మీ నాన్నగారు పూజ్యులు ఆరుణిగౌతములు నీకు విద్యలన్నీ నేర్పించినారు కదా! మీ విద్య పూర్తి అయినదా?<br>శ్వేతకేతు : అవును. మా నాన్నగారు ఆరుణి మునివర్యులు నాకు అన్నీ నేర్పియున్నారు. నాయొక్క విద్య పూర్తి అయినదని ఆశీర్వదించారు. |
| **2.** | **వేత్థ యదితో అధి ప్రజాః ప్రయంతి?" - ఇతి। "న భాగవ!" - ఇతి** | ప్రవాహణుడు : సరే! సంతోషము. అయితే ఒక విశేషము అడుగుతాను. ఈ జగత్తులో సృష్టించబడుచూ ఉన్న జీవులంతా (మరణానంతరము) పైకి పోవుచున్నారు కదా! ఎటు / ఎక్కడికి వెళ్లుచున్నారో - మీకు తెలుసు కదా!<br>శ్వేతకేతువు : ఈ విషయం నాకు తెలియదు. |
| **3.** | **"వేత్థ యథా పునః ఆవర్తంత ఇతి? "న భగవ!" - ఇతి।** | ప్రవాహణుడు : సరే! రెండవ ప్రశ్న. ఈ జీవులు తిరిగి ఏవిధంగా పునరావర్తులు అవుతారు? ఎట్లా తిరిగివస్తారు? (How are they getting back to material Forms?)<br>శ్వేతకేతువు : ఈ విషయం కూడా నాకు తెలియదే! |
| | **"వేత్థ పథోః దేవయానస్య పితృయాణస్య చ వ్యావర్తనా ఇతి। న భగవ। - ఇతి** | ప్రవాహణుడు : ఈ సృష్టిలో 'జీవులు' అనే ప్రయాణీకులకు సంబంధించిన (1) దేవయానము (2) పితృయానము అనే రెండు మార్గములు సంకల్పితమై వర్తిస్తున్నాయి. ఆ రెండు మార్గముల గురించి మీకు తెలుసు కదా! అవి రెండూ విడిపోయే స్థానము మీకు తెలుసా?<br>శ్వేతకేతువు : తెలియదే! దేవయాన - పితృయానములనే మార్గముల గురించి కూడా నాకు తెలియనే తెలియదు. అవి ఏ చోట రెండు మార్గములుగా విడిపోతున్నాయో కూడా అస్సలు తెలియదు. |
| **3.** | **"వేత్థ యథా అసౌ లోకో న సంపూర్యత ౩?" ఇతి। - న భగవ।" ఇతి॥ "వేత్థ యథా పంచమ్యాం ఆహుతావా ఆపః పురుషవచసో భవంతి?" - ఇతి? "న ఏవ భగవ!" - ఇతి।** | ప్రవాహణరాజు : ఈ జగత్తులో అసంఖ్యాక జీవులు దేహములు త్యజించి ఊర్ధ్వలోకములు చేరుచున్నారు కదా! మరి ఊర్ధ్వలోకములు (పితృలోకములు) మరణించినవారితో నిండిపోవటం లేదేమి?<br>శ్వేతకేతువు : ఇది కూడా నాకు తెలియనే లేదు.<br>ప్రవాహణుడు : "పంచమ హవిస్సునందు జలము" పురుషుడు అనే పేరును పొందుచున్నాడు" - అనే వాక్యము యొక్క సవివరణ మీరు ఎరిగియే ఉన్నారు కదా?<br>శ్వేతకేతువు : ఈ విషయం కూడా నాకు కొంచెము కూడా తెలియదే! |
| **4.** | **"అథాను కిమ్ అనుశిష్టో అవోచథా యో హీమాని న విద్యాత్ కథగ్ం సో 'అనుశిష్టో' బ్రువీతి ఇతి?** | ప్రవాహణరాజు : అనగా మీరు విద్యను పూర్తిగా నేర్చుకోలేదా? మరి మీరు "నేను విద్యను నేర్చుకోవటం పూర్తి చేసినవాడనైనాను. అనుశిష్టుడను" అని అంటున్నారేమిటి? |

| | | |
|---|---|---|
| | స హాయస్తః పితుః<br>అర్ధం ఏయాయ?<br>తగ్ం హ ఉవాచ –<br>"అననుశిష్య వావ<br>కిల మా, భగవాన్।<br>అబ్రవీత్ అను త్వా<br>అశిషమ్?" – ఇతి। | అప్పుడు శ్వేతకేతు : "ప్రవణ మహారాజా! మరల మీ దర్శనం చేసుకుంటాను'' - అని చెప్పి అక్కడి నుండి బయలుదేరారు.<br>శ్వేతకేతువు : పితృదేవా? ఆరుణిమహర్షీ! రాజర్షియగు ప్రవాహణ మహారాజుగారు వేసిన ప్రశ్నలకు నాకు సమాధానం తెలియలేదు. "విద్య పూర్తి అయినదని ఎట్లా అన్నారు?'' - అని ఆయన నన్ను ప్రశ్నించారు కూడా!<br>భగవాన్! నేను విద్యను పూర్తి చేసానని మీరు అన్నారు కదా!? ఆ మాట ఎట్లా అన్నారు? |
| **5.** | పంచ మా రాజన్యబంధుః<br>ప్రశ్నాన్ అప్రాక్షీః తేషాం<br>నైకంచన అశకం వివిక్తుమ్ – ఇతి। | ఆ రాజన్య బంధువు (దుష్టుడు) అడిగిన 5 ప్రశ్నలలో ఒక్కదానికి కూడా సమాధానం చెప్పలేకపోయానే? ఏమిటి నాకు ఈ దుస్థితి? ఈ విధంగా అడుగుతూ రాజు అడిగిన '5' ప్రశ్నలు తండ్రికి శ్వేతకేతువు - వినిపించాడు. |
| | <u>స హ ఉవాచ :–</u><br>యథా మా త్వం తత్ ఏతాన్ అవదో।<br>యథా అహమ్ ఏషాం నైకంచన వేద।<br>యది అహమ్ ఇమాన్ అవేదిష్యం,<br>కథం తే న అవక్ష్యం? ఇతి। | ఆరుణీ మునీంద్రులు : బిడ్డా! శ్వేతకేతూ! నీవు అడిగిన ఐదు ప్రశ్నలకు సమాధానము ఏమిటో నాకు ఏమాత్రం తెలియదు. అందుచేత నాకు తెలియని ప్రశ్నలు, ప్రశ్నల సమాధానం నేను బోధించలేను కదా!<br>నేను కనుక ఆ ప్రశ్నలు వాటి సమాధానము ఎరిగిఉండి ఉంటే, నేను నీకు ఎందుకు బోధించను? బోధించి ఉండేవాడినే! |
| **6.** | స హ గౌతమో రాజ్ఞో అర్ధమ్ ఏయాయ,<br>తస్మై హ ప్రాప్తాయ అర్హాంచకార।<br>స హ ప్రాతః సభాగ ఉదేయాయ। | గోతమ గోత్రీయుడగు ఆరుణి అప్పటికప్పుడే బయలుదేరి ఆ మరునాడు ఉదయమే జావలుని కుమారుడగు పాంచాల దేశరాజు ప్రవాహణుడు ఉన్నచోటుకు వెళ్లారు. పంచ ప్రశ్నలకు సమాధానం వివరించవలసినదిగా అర్థించారు. |
| | <u>తగ్ం హ ఉవాచ :–</u><br>"మానుషస్య, భగవాన్ గౌతమ!<br>విత్తస్య వరం వృణీథా।" ఇతి | ప్రవాహణ రాజర్షి : పూజనీయుడగు గౌతమా! ఆ సమాధానాలెందుకు? మనుష్య సంబంధమైన సంపదను అడగండి. మీకు సమర్పించుకోగలను. |
| | <u>స హ ఉవాచ :</u><br>తవ ఏవ, రాజన్। మానుషం విత్తం యామేవ।<br>కుమారస్య అంతే వాచమ్<br>అభాషథాః తామ్ ఏవ<br>మే బ్రూహి – ఇతి<br>స హ కృచ్ఛ్రీ, బభూవ। | **ఆరుణీ మునీంద్రుడు** : మీరు ఇస్తానన్న మనుష్య సంపదతో నాకు పనిలేదు. మీ వద్దనే ఉంచుకోండి. మా కుమారుడు (మరియు) శిష్యుడు అగు శ్వేతకేతువును మీరు అడిగియున్న '5' ప్రశ్నలకు సవివరణ ప్రసాదించండి.<br>**ప్రవాహణ రాజర్షి** (తనలో)<br>అయ్యో! ఏమిటి ఇవి అడుగుచున్నారు? - అని ఇబ్బందిగా భావించారు. |
| **7.** | "తగ్ం హ చిరం వసేతి।"<br>అజ్ఞాపయాంచకార।<br><u>తగ్ం హ ఉవాచ :–</u><br>యథా మా త్వం, గౌతమా।<br>అవదో యథా ఇయం<br>న ప్రాక్త్వతః పురా<br>విద్యా బ్రాహ్మణాన్ గచ్ఛతి<br>తస్మాత్ ఉ సర్వేషు లోకేషు<br>క్షత్రస్యైవ ప్రశాసనమ్ అభూత్ – ఇతి।।<br>తస్మై హోవాచ।। | ప్రవాహణ రాజర్షి : గౌతమా! ఆరుణిమునీంద్రా! మీరు కొంతకాలం ఇక్కడ ఉండండి!...ఈ విధంగా (గురువువలె) ఆదేశించారు. <u>కొంతకాలమైన తరువాత</u><br>ప్రవాహణ రాజర్షి : ఓ ఆరుణి మహాశయా! గౌతమా! మీరు నన్ను ఆ '5' ప్రశ్నలకు సమాధానం అడుగుచున్నారు. అవి బ్రాహ్మణులకు మేము ఎప్పుడూ చెప్పలేదు.<br>ఇతః పూర్వము బ్రాహ్మణులకు చెప్పబడని అవశేషములు క్షత్రియజాతికి ఉపదేశ్యము (బోధించతగినవి) మాత్రమే। మీవంటి మహనీయులగు బ్రహ్మతత్త్వాశయము గలవారికి కాదు.<br>అయినా కూడా మీరు అడుగుచున్నారు.<br>సరే! వివరిస్తాను. వినండి. మీరు మాకు పూజనీయులు కదా, మరి! |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - పంచమాధ్యాయే తృతీయః ఖండః

# 5-4. చతుర్థ ఖండము - ప్రథమ విశ్వయజ్ఞ హోమము

**1.** **అసౌ వావ లోకో,**
**గౌతమా! "అగ్నిః"।**
**తస్య ఆదిత్య ఏవ సమిత్**
**రశ్మయో ధూమో।**
**అహః అర్చిః।**
**చంద్రమా అంగారా।**
**నక్షత్రాణి విస్ఫులింగాః॥**

గౌతమా! వినండి.

**ప్రథమ దేవతా హోమమునకు**

(భూలోకంలో అగ్నిహోత్రమునకే ఆహవనీయాగ్ని ఆశ్రయమయే తీరుగా)

ద్యులోకము (స్వర్గ లోకము) - **అగ్ని**

ద్యులోకమనే అగ్నికి ఆదిత్యుడు - **సమిధలు** (కట్టెలు)

ఆదిత్య (సూర్యకిరణములు) - **'పొగ'**

చంద్రుడు పగలు - **బొగ్గులు** (జ్వాల చల్లారిన తరువాత మిగిలేవి)

నక్షత్రములు - **కిరణములు. విస్ఫులింగములు**

---

**2.** **తస్మిన్ ఏతస్మిన్ అగ్నౌ**
**దేవాః "శ్రద్ధాం" జుహ్వతి।**
**తస్యా ఆహుతేః**
**'సోమో రాజా' - సంభవతి।**

ఈ విధంగా ఇంద్రియాభిమాన దేవతలు 'శ్రద్ధ' అనే ఆహుతిని ప్రాణాగ్నికి సమర్పిస్తున్నారు.

అట్టి ఆహుతిని ఇంద్రియ - అభిమాన దేవతలు {నేత్ర (చూపు) దేవత, చెవులు (శ్రవణ) దేవత, స్పర్శ (చర్మ) దేవత, రుచి (నాలుక) దేవత, గంధ (ముక్కు) దేవత} -

"శ్రద్ధ'' అనే ఆహుతిని సమర్పిస్తూ - పవిత్రులగుచున్నారు. ఆ హవిస్సులవలన ''సోమరాజు'' (జీవుడు - Experiencer) జనించుచున్నాడు (సంభవించుచున్నాడు).

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - పంచమాధ్యాయే చతుర్థః ఖండః**

---

# 5-5. పంచమ ఖండః - ద్వితీయ విశ్వయజ్ఞ హోమము

**1.** **పర్జన్యో వావ గౌతమ! అగ్నిః।**
**తస్య వాయుః ఏవ సమిత్।**
**అభ్రం ధూమో। విద్యుత్ అర్చిః।**
**అశనిః అంగారా।**
**హ్రాదనయో విస్ఫులింగాః॥**

**ద్వితీయ దేవతా హోమము**

పర్జన్యుడు (వర్ష దేవతయే) - **"అగ్ని"**

దానికి వాయువే - **"సమిధ"**

మేఘములే - **"పొగ"**

విద్యుత్ (మెరుపు) - **"జ్వాల"**

పిడుగులే - **బొగ్గు** (జ్వాల తరువాత శేషించేది)

---

**2.** **తస్మిన్ ఏతస్మిన్ అగ్నౌ దేవాః**
**సోమగ్ం రాజానం జుహ్వతి।**
**తస్యా ఆహుతేః వర్షగ్ం సంభవతి॥**

అట్టి అగ్నియందు దేవతలు ఆహుతిని సమర్పిస్తున్నారు.

అట్టి ఆహుతిని చంద్రుని (సోమరాజుకు) సమర్పించటం చేత "వర్షము'' సంభవిస్తోంది.

(శ్రద్ధయే చంద్రుని రూపము పొందుచూ - అగ్నిచే వర్షాకారము పొందుతోంది)

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - పంచమాధ్యాయే పంచమః ఖండః**

## 5-6. షష్ఠ ఖండము - తృతీయ విశ్వయజ్ఞ హోమము

| | | |
|---|---|---|
| **1.** | **పృథివీ వావ, గౌతమా! అగ్నిః।**<br>**తస్యాః సంవత్సర ఏవ సమిత్।**<br>**ఆకాశో ధూమో।**<br>**రాత్రిః - అర్చిః।**<br>**దిశో - అంగారా।**<br>**అవాంతరదిశో - విస్ఫులింగాః॥** | **తృతీయ దేవతా హోమము**<br>ఈ పృథివి (భూమి)యే - **"అగ్ని"**<br>దీనికి సంవత్సరము (Time Factor) - **సమిధ**<br>ఆకాశమే - **ధూమము (పొగ)**<br>రాత్రి - **జ్వాల**<br>(తూర్పు-పడమర-ఉత్తర-దక్షిణ) దిక్కులు - **ఉష్ణము** (మండే బొగ్గులు-జ్వాల తరువాత మిగిలేవి)<br>అవాంతర దిశలు - **విస్ఫులింగము** (ఈశాన్య-ఆగ్నేయ-నైరుతి - వాయవ్యములు) |
| **2.** | **తస్మిన్ ఏతస్మిన్ అగ్నౌ**<br>**దేవా 'వర్షం' - జుహ్వతి।**<br>**తస్యా ఆహుతేః అన్నగ్ం సంభవతి** | అట్టి ఆ యొక్క అగ్నియందు దేవతలు "వర్షము"ను హోమము చేయుచున్నారు.<br>అట్టి అగ్నియందు దేవతలు వర్షమును వాహనము చేస్తూ ఉండగా, అట్టి ఆహుతుల వలన "అన్నము" (ఆహారము) పుడుతోంది. |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - పంచమాధ్యాయే షష్ఠమః ఖండః**

## 5-7. సప్తమ ఖండము - చతుర్థి విశ్వయజ్ఞ హోమము

| | | |
|---|---|---|
| **1.** | **పురుషో వావ గౌతమా। అగ్నిః।**<br>**తస్య 'వాక్' ఏవ సమిత్।**<br>**ప్రాణో - ధూమో।**<br>**జిహ్వా - అర్చిః।**<br>**చక్షుః - అంగారాః।**<br>**శ్రోత్రం - విస్ఫులింగాః।** | **4వ దేవతా హోమము**<br>అన్నము నుండి జనించిన పురుషుడే - **"అగ్ని"**<br>వాక్కు - **'సమిధ'**<br>ప్రాణము - **పొగ**<br>జిహ్వ - **జ్వాల**<br>చక్షువులు (చూపు) - **మండే బొగ్గు కణములు**<br>చెవులు (వినికిడి) - **విస్ఫులింగములు** |
| **2.** | **తస్మిన్ - ఏతస్మిన్ అగ్నౌ**<br>**దేవా 'అన్నం' జుహ్వతి।**<br>**తస్యా ఆహుతే 'రేతః' సంభవతి** | అట్టి అగ్నియందు అన్నమును దేవతలు ఆహుతులుగా సమర్పిస్తున్నారు. అప్పుడు ఆ ఆహుతులనుండి "రేతస్సు" జనిస్తోంది. |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - పంచమాధ్యాయే సప్తమః ఖండః**

## 5-8. అష్టమ ఖండము - పంచమ విశ్వయజ్ఞ హోమము

| | | |
|---|---|---|
| 1. | యోషా వావ, గౌతమా! అగ్నిః।<br>తస్యా 'ఉపస్థ' ఏవ సమిత్।<br>యత్ ఉపమంత్రయతే స ధూమో।<br>యోనిః అర్చిః<br>యత్ అంతః కరోతి - తే అంగారా।<br>అభినందా - విస్ఫులింగాః। | **5వ దేవతా హోమము**<br>స్త్రీ - **అగ్ని**<br>ఉపస్థ (జననేంద్రియము) - **సమిధలు**<br>స్త్రీ పురుషుని ఆకర్షించు ఉప మంత్రమే - **ధూమము**<br>జననేంద్రియమే - **జ్వాల**<br>సంభోగమే - **బొగ్గు కణములు**<br>రతిసుఖమే - **అగ్నికిరణములు** |
| 2. | తస్మిన్ ఏతస్మిన్ అగ్నౌ దేవా<br>"రేతో" జుహ్వతి।<br>తస్యా ఆహుతేః 'గర్భః' సంభవతి।। | అట్టి ఆ యొక్క అగ్ని కార్యమునందు అగ్నికి దేవతలు 'రేతస్సు'కు ఆహుతిగా సమర్పిస్తున్నారు. అట్టి ఆహుతుల నుండి "గర్భము" సంభవిస్తోంది. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - పంచమాధ్యాయే అష్టమః ఖండః

## 5-9. నవమ ఖండము - పంచమ హవిస్సునందు జల 'పురుషుడు'

| | | |
|---|---|---|
| 1. | ఇతి తు పంచమ్యామ్ ఆహుతాః<br>ఆపః పురుష వచసో భవంతి - ఇతి | ఈ విధంగా 5వ ఆహుతి దేవతలచే సమర్పించబడుచుండగా జలము 'పురుషుడు (జీవుడు)' శబ్దమునకు వాచ్యముగా (Main Meaning) అగుచున్నాయి. |
| | స ఉల్బావృతో గర్భో దశ<br>వా నవ వా మాసానంతః<br>శయిత్వా యావత్ వా అథ జాయతే।। | "జరాయువు" అనే గర్భసంచిలో '10' నెలలో, '9' నెలలో గడుపుచూ అక్కడ నిదురిస్తూ, చివరికి ఆ తరువాత జీవుడు జన్మించటం జరుగుతోంది. |
| 2. | స జాతో యావత్ ఆయుషం జీవతి। | ఆ విధంగా 'జీవుడు'గా జనియించిన శిశువు (జీవుడు) ఆయుష్షు ఉన్నంతవరకు పాంచభౌతిక జగత్తులో జీవిస్తున్నాడు. |
| | తం ప్రేతం దిష్టం ఇతో<br>అగ్నయ ఏవ హరంతి, యత ఏవేతో<br>యతః సంభూతో భవతి।। | మరణించిన తరువాత ఆ జీవుడు 'ప్రేతము' అనబడుచున్నాడు. అట్టి ప్రేతము (ఆ మరణించిన వానిని) కర్మఫలానుసారంగా ఏ అగ్ని నుండి ఈ లోకమునకు వచ్చియున్నాడో - ఆ అగ్నియే హరించి మరొక లోకములోనికి తీసుకొనిపోవటము, అక్కడ తిరిగి ప్రతిష్ఠించటము జరుగుతోంది. అనగా ఈ జీవుడు దేహానంతరము మరొక దేహమునందు తనను తాను అనుభవముగా పొందుచున్నాడు. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - పంచమాధ్యాయే నవమః ఖండః

# 5-10 దశమ ఖండము - దేవయాన పితృయాన మార్గములు

**దేవయాన పంథా**

**1.** **తత్ య ఇత్థం విదుః**
**యే చ ఏమే అరణ్యే 'శ్రద్ధా' తప,**
**ఇతి ఉపాసతే, తే 'అర్చిషమ్'**
**అభిసంభవంతి।**
**అర్చిషో అహరహ్నా**
**ఆపూర్యమాణ పక్షమ్।**
**ఆపూర్యమాణపక్షాద్యాన్**
**షడుదన్ ఏతి మాసాగ్ంస్తాన్॥**

ఎవ్వరైతే ఈ విధంగా (1) శ్రద్ధ (2) వర్షము (3) అన్నము (4) రేతస్సు (5) గర్భము అనబడే '5' దేవతా హోమములవలన ఈ శరీరయానము, జీవాత్మ (పురుషుడు) వ్యవహారము సంభవిస్తోందని గ్రహిస్తాడో, అరణ్యము (Beyond worldly events and happenings)లో ఉండి, శ్రద్ధతో ఈ ఐదిటికీ ఆవల గల పరమాత్మ స్వరూపము ఉపాసిస్తారో, అర్చిస్తారో - వారు కాంతివంతమగు లోకములు పొందుచున్నారు. వారు అర్చిష్మంతుడు అనబడే అగ్నిజ్వాల అభిమాని దేవతను పొందుచున్నారు. జ్వాలనుండి పగలును, పగలు నుండి శుక్లపక్షమును, ఉత్తరాయణ 6 నెలల (షణ్మాసామ్) చివర ఉత్తరగతిని పొందుచున్నారు.

---

**2.** **మాసేభ్యః సంవత్సరగ్ం**
**సంవత్సరాత్ - ఆదిత్యమ్।**
**ఆదిత్యాత్ - చంద్రమసమ్।**
**చంద్రమాసో - విద్యుతమ్।**
**తత్పురుషో - అమానవః।**
**స ఏనాత్ 'బ్రహ్మ' గమయతి ఏష**
**దేవయానః పంథా ఇతి॥**

ఉత్తరాయణ షణ్మాసము నుండి - సంవత్సరమును,

సంవత్సరము నుండి - ఆదిత్యుని

ఆదిత్యుని నుండి - చంద్రమసమును (చంద్రుని)

చంద్రమసము నుండి - విద్యుత్తును (తేజస్సును)

- అక్కడి నుండి మానవపరిధికి ఆవలగల 'తత్పురుషము' అనబడే బ్రహ్మము వైపుగా ప్రయాణిస్తూ ఉంటారు.

ఈ పంథా (మార్గము, విధి విధానము)ను **"దేవయాన పంథా"** అని పిలుస్తున్నారు.

---

**పితృయాన మార్గము**

**3.** **అథ య ఇమే గ్రామ ఇష్టాపూర్తే,**
**దత్తమ్ ఇతి ఉపాసతే,**
**తే 'ధూమం' అభిసంభవంతి**
**ధూమాత్- రాత్రిగ్ం**
**రాత్రేః - అపర పక్షమ్॥**
**అపరపక్షాద్యాన్ - 'షట్'**
**దక్షిణ ఏతి మాసాగ్ం।**
**తాన్ న ఏతే 'సంవత్సరం'**
**అభిప్రాప్నువంతి।**

ఎవ్వరైతే తామున్నచోట

- ఇష్టా పూర్తములను (యజ్ఞ యాగములు, లోకసేవా కార్యక్రమములను) నిర్వర్తిస్తూ ఉంటారో, దాన-ధర్మములు మొదలైనవి నిర్వర్తిస్తూ, అట్టి ఆశయములు మాత్రమే కలిగి ఉంటారో, అట్టివారు ధూమ (పొగ) లోకములు చేరుచున్నారు.

ధూమము నుండి - 'రాత్రి'కి

రాత్రి నుండి - కృష్ణపక్షమునకు,

కృష్ణపక్షము నుండి - దక్షిణాయణ షట్ మాసములను,

అక్కడి నుండి - సంవత్సరమును పొందుచున్నారు.

---

**4.** **మాసేభ్యః - పితృలోకం**
**పితృలోకాత్ - ఆకాశమ్**
**ఆకాశాత్ - చంద్రమసమ్**
**ఏష సోమో రాజా తత్**
**దేవానాం - 'అన్నం'**
**తం దేవా భక్షయంతి॥**

మాసముల నుండి - పితృలోకములకు,

పితృలోకముల నుండి - ఆకాశమునకు,

ఆకాశము నుండి - చంద్రమసమునకు,

(ఆయా అభిమాన దేవతలకు) చేరుచున్నారు.

ఈతడే సోమరాజు. ఈతడు దేవతలకు ఆహారము అగుచున్నాడు. దేవతలు ఆతనిని అన్నముగా (ఆహారముగా) భుజించుచున్నారు.

**5.** **తస్మిన్ యావత్ సంపాతమ్ ఉషిత్వా, అథ ఏతమ్ ఏవ అధ్వానం పునః నివర్తంతే।**

అక్కడ పురాకృత కర్మల ఫలములను పొందుచు తిరిగి పునరావృత్తిగా క్రింద జన్మలను పునః పొందుచున్నారు.

**యథా ఏతమ్ – "ఆకాశమ్"।**
**ఆకాశాత్ – "వాయుం"।**
**వాయుః భూత్వా "ధూమో" భవతి।**
**ధూమో భూత్వా – "అభ్రం" భవతి।**

**పునరావృత్తి యానము**

ఇది శరీరము విడిచినప్పుడు ఏ మార్గంలో ప్రయాణం చేసి ఉన్నారో, ఇప్పుడు ఆ మార్గంగానే తిరిగి దేహముల ధారణ వైపుగా తిరిగివస్తున్నాడు.

(ఇదివరకు వెళ్లినది మాసములు - పితృలోకము - ఆకాశము - చంద్రమసము)

ఇప్పుడు తిరిగి రాక...

చంద్రమసము నుండి - ఆకాశము

ఆకాశము నుండి - వాయువులో ప్రవేశము

వాయువు నుండి - 'ధూమము' (పొగ)

ధూమము నుండి - మేఘము అగుచున్నాడు.

**6.** **అభ్రం భూత్వా – మేఘో భవతి।**
**మేఘో భూత్వా – ప్రవర్షతి॥**
**త ఇహ వ్రీహియవా ఓషధి – వనస్పతయః**
**తిలమాషా ఇతి జాయంతే।**
**అతో వై ఖలు దుర్నిష్ప్రపతరమ్।**
**యో యో హి 'అన్నం' అత్తి।**
**యో "రేతః" సించతి।**
**తత్ భూయ ఏవ భవతి॥**

దట్టమైన మేఘమై - వర్షించు మేఘము అగుచున్నాడు.

మేఘము నుండి - చినుకుల ద్వారా వర్షించువాడగుచున్నాడు.

అట్లా వర్షించి భూమిపై -

వ్రీహి (ధాన్యముగా, వడ్లుగా)

యవ - (ధాన్య విశేషములుగా, గోధుమలు మొ॥వి)

ఓషధులు - (అరటి వంటి మొక్కలు మొదలైనవిగా)

వనస్పతులు - (చెట్లుగా)

తిల - (నువ్వులుగా)

మాషా - (మినుములుగా)

ఆయా రూపములు పొందుచున్నాడు.

ఈ విధంగా ఈ జీవుడు తిరిగి దేహరూపముగా అవటమనేదంతా అనేక కష్టము - బాధ - దుర్ఘటనములతో కూడినదే! ఆయా రూపములలో బయటకు వచ్చుటకు అనేక కష్టములు పొందుచున్నారు.

ఆయా పదార్థముల రూపము పొంది, ఆ తరువాత

- జీవుల ఆహారము రూపముగా అయి,

- ఆహారము రేతస్సుగా అయి, విడుబడి ఆయా రూపములు కలదిగా అగుచున్నది.

**7.** **తద్య ఇహ రమణీయ చరణా అభ్యాశో, హ యత్తే రమణీయాం యోనిమ్ ఆపద్యేరన్। బ్రాహ్మణ యోనిం వా, క్షత్రియ యోనిం వా, వైశ్య యోనిం వా అథ య ఇహ కపూయ చరణా అభ్యాశో హ యత్తే కపూయాం యోనిం ఆపద్యేరన్ 'శ్వ' యోనిం వా, 'సూకర' యోనిం వా, చణ్డాల యోనిం' వా।**

అట్టి జీవులలో ఇతఃపూర్వము రమణీయమైన, పుణ్యప్రదమగు ఆచరణ, అభ్యాసము కలవారు రమణీయమైన యోనులు (జన్మలు) పొందటం జరుగుతోంది.

బ్రహ్మతత్త్వముపై ధ్యాసగల - బ్రాహ్మణ కార్య సమర్థత గల - క్షత్రియ వ్యవహార వ్యాపార దక్షత గల - వైశ్య యోనులందు జన్మిస్తున్నారు.

అట్లా కాకుండా, దుష్టమైన ఆచరణ అభ్యాసములు కలవారు, చెడు నడవడి గలవారు కపూయ (అల్ప) యోనులలో, కుక్క - పంది - చణ్డాల యోనులలో జన్మ పొందుచున్నారు.

| | | |
|---|---|---|
| 8. | **అథ ఏతయోః పథోః న కతరేణ చ న తాని ఇమాని క్షుద్రాణి అసకృత ఆవర్తీని భూతాని భవంతి।<br>జాయస్వ మ్రియస్వ ఏతి ఏతత్ తృతీయం స్థానం।<br>తేన అసౌ లోకో న సంపూర్యతే।<br><br>తస్మాత్ జుగుప్సేత। తత్ ఏష శ్లోకః॥** | కొందరు పై మార్గములు కాకుండా, అల్పమగు దోమవంటి క్రిమికీటక క్షుద్ర ప్రాణులై మరల మరల జన్మిస్తూ ఉంటారు.<br><br>జన్మిస్తూ మరణిస్తూ ఉండటంచేత వారు ఈ లోకములోనే సంచారములు, రాకపోకలు కలిగి ఉంటూ ఉన్నారు. <u>అందుచేతనే (స్వర్గము, పితృలోకము మొదలైన) ఊర్ధ్వలోకములు నిండటము జరగటము లేదు.</u><br><br>పైన చెప్పుకొన్నరీతిగా - ఉత్తరోత్తర స్థితిగతులలో గల భీకర దుఃఖస్థితులు గమనించి ముందుగానే నిషిద్ధకర్మలు, క్రూరప్రవర్తనలు పట్ల అత్యంత జాగరూకులై ఉండాలి. ఈ విషయము వివరిస్తూ పాఠ్యాంశములున్నాయి. |
| 9. | **స్తేనో హిరణ్యస్య, సురాం పిబగ్ంశ్చ, గురోః తల్పమ్ ఆవసన్, బ్రహ్మహా చ ఏతే పతంతి చత్వారః పంచమశ్చ ఆచరగ్ం స్తైరితి॥** | ఉత్తరోత్తర సుదీర్ఘదుఃఖస్థితులను దృష్టిలో పెట్టుకొని పంచ (5) నిషిద్ధ మహాపాతకములు ఈ విధంగా చెప్పబడుచున్నాయి.<br><br>(1) బంగారము అపహరించువాడు.<br><br>(2) సురాపానము చేయువాడు<br><br>(3) గురుపత్నీ సంగమము<br><br>(4) బ్రహ్మహత్య చేయువాడు<br><br>ఇవి పతనమునకు కారణము.<br><br>(5) పై దోష ప్రవర్తన కలవారితో కూడి సంచరించటము పంచమ మహాపాతకముగా చెప్పబడుతోంది. |
| 10. | **అథ హ య ఏతాన్ ఏవం పంచాగ్నీన్ వేద, న సహ ఏతైః అపి ఆచరన్ పాప్మనా లిప్యతే।<br>శుద్ధః పూతః పుణ్య లోకో భవతి య ఏవం వేద।<br>య ఏవం వేద॥** | అయితే, ఎవ్వరైతే - ఈ పంచమ పాఠకములో చెప్పుకొన్న పంచాగ్నులను ఎఱిగినవాడై, వాటియొక్క అంతర్లీన తత్త్వమును ఉపాసిస్తూ ఉంటారో పైన చెప్పిన పంచ మహాపాతకముల దోషములనుండి, తదితర పాపదోషములను పొందడు.<br><br>**పరిశుద్ధుడు, నిర్మలుడు, పునీతుడు** కాగలడు.<br><br>- పుణ్యలోకములలో ప్రవేశము పొందగలడు.<br><br>అందుచేత అట్టి పంచాగ్ని తత్త్వములను ఎఱిగి, ఆత్మోపాసనను ఆశ్రయించెదరు గాక। |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - పంచమాధ్యాయే దశమః ఖండః**

# 5-11. ఏకాదశ ఖండము - వైశ్వానరాత్మోపాసన

| | | |
|---|---|---|
| **1.** | **ప్రాచీనశాల ఔపమన్యవః<br>సత్యయజ్ఞః పౌలుషిః,<br>ఇంద్రద్యుమ్నో భాల్లవేయో జనః శార్కరాక్ష్యో,<br>బుడిల అశ్వతరాశ్విః** | ఒకానొక సందర్భంలో కొందరు మహనీయులు సత్సంగపూర్వకంగా ఒకచోట సమావేశమవటం జరిగింది.<br>(1) ఉపమన్యుని కుమారుడు - **ప్రాచీనశాలుడు.**<br>(2) పులిషియొక్క కుమారుడు - **సత్యయజ్ఞుడు.**<br>(3) భల్లవి పుత్రుడు - **ఇంద్రద్యుమ్నుడు.**<br>(4) శర్కరాక్షుని పుత్రుడు - **జనుడు.**<br>(5) అశ్వతరాశ్వుని పుత్రుడు - **బుడిలుడు.** |
| | **తే హైతే మహాశాలా,<br>మహా శ్రోత్రియాః సమేత్య<br>"మీమాగ్ంసాం" - చక్రుః।<br>కో నః ఆత్మా? కిం బ్రహ్మేఽ తి।** | వీరు గొప్ప శాస్త్రకోవిదులు. గొప్ప శిష్యగణము గల గృహస్థులు. శ్రుతుల గురించి అధ్యయనము చేసియున్న శ్రోత్రియులు వీరంతా సమావేశమై **"మన ఆత్మ అనగా ఎవరు? పరాబ్రహ్మము అనగా ఏది?"** - అని సమాలోచన చేయసాగారు. |
| **2.** | **తే హ సంపాదయాం చక్రుః<br>ఉద్దాలకో వై భగవంతో<br>అయమ్ ఆరుణిః<br>సంప్రతి ఇమం ఆత్మానం<br>వైశ్యానరం అధ్య ఇతి।<br>తం హన్త అభ్యాగచ్ఛాం ఏతి।<br>తగ్ం హాభ్యాజగ్ముః।** | కొంతసేపు సమాలోచన చేసిన తరువాత, **"ఇట్లా కాదు, మనము వేదతత్త్వము తెలిసిన సద్గురువును ఆశ్రయిద్దాము"** అని అనుకొన్నారు. ఆరుణి ఋషి కుమారుడైన ఉద్దాలకమహర్షి (ఆరుణి) దర్శనం చేసుకొని, వారి వద్ద "వైశ్వానరోపాసనా విద్య" గురించి తెలుసుకోవాలని నిశ్చయించుకున్నారు.<br>వెంటనే ఆరుణీ నామధేయ ఉద్దాలక మహర్షి ఆశ్రమానికి వచ్చి తత్త్వవేత్త అగు ఆ మహర్షిని సందర్శించారు.<br>**హే మహాత్మా! మాకు వైశ్వానర విద్యను బోధించ ప్రార్థన!** |
| **3.** | **స హ సంపాదయాంచకార<br>ప్రక్ష్యన్తి - మామ్ ఇమే<br>మహాశాలా మహాశ్రోత్రియాః<br>తేభ్యో న సర్వమివ ప్రతిపత్స్యే హంత।<br>అహమ్ అన్యమ్ అభ్యనుశాసాని। ఇతి।।** | ఉద్దాలక మహర్షి : ఈ విధంగా తలచారు. "ఈ వచ్చినవారు పెద్ద శిష్యబృందము గల గృహస్థులు. వీరు అనేక వివరణల గురించి నన్ను ప్రశ్నించగలరు. వీరికి వైశ్వానర విద్య గురించి సంపూర్తిగా బోధించలేను. అందుచేత వీరికి మరొక మహనీయుడగు గురువును ఆశ్రయించటానికై దారి చూపిస్తాను" ఇట్లా అనుకొని ఈ విధంగా పలుక సాగారు. |
| **4.** | **<u>తాన్ హ ఉవాచ :-</u><br>అశ్వపతిర్వై భగవన్తో<br>అయం కైకేయః సంప్రతి<br>ఇమమ్ ఆత్మానం 'వైశానరమధ్య' ఇతి।<br>తం హన్త అభ్యాగచ్ఛామ్<br>ఏతి తం హాభ్యాజగ్ముః ।।** | ఉద్దాలక మహర్షి : ఓ మహాశాలా - మహాశ్రోత్రియులారా! పూజనీయులారా! నాకన్నా కూడా వైశ్వానరోపాసన గురించి ఎరిగియున్నవారు, మహనీయుడు అగు ఒకరున్నారు. వారు - ఆయన కేకయరాజ కుమారుడగు అశ్వపతి. మహారాజు వారు వైశ్వానరుని ఎరిగియున్నవారు. మనము ఇప్పుడు ఆయన దగ్గరకు వెళ్ళి వైశ్వానరవిద్య గురించి శ్రవణము, అధ్యయనము చేద్దాము పదండి. |
| **5.** | **తేభ్యో హ ప్రాప్తేభ్యః పృథక్<br>అర్హాణి కారయాంచకార<br>స హ ప్రాతః సంజిహాన ఉవాచ** | ఆ మరునాడు వారంతా అశ్వపతి మహారాజు వద్దకు వెళ్ళి, వారిని సందర్శించారు. అప్పుడు అశ్వపతి మహారాజు ఆ వచ్చినవారందరికి సుస్వాగతము పలికారు. ఒక్కొక్కరికి సత్కారములు సపర్యలు అందజేసారు. ఆ మరునాడు ఉదయము వారందరినీ సమీపించి రాజు ఇట్లా పలికారు. |

**"న మే స్తేనో జనపదే।**
**న కదర్యో న మద్యపో।**
**నానాహితాగ్నిః న అవిద్వాన్।**
**న స్వైరీ, స్వైరిణీ కుతః?**
**యక్ష్యమాణో వై భగవన్తో అహమస్మి।**

**అశ్వపతి మహారాజు :** ఓ పూజనీయులారా! ఈ మా రాజ్యములో దొంగలుగాని, లోభులుగాని లేరు. మద్యపానం చేయువారు లేరు. అహితాగ్నినిష్ఠులు కానివారు లేరు. అవిద్వాంసులు లేరు.

వ్యభిచారులు గాని, కుంటలు గాని లేరు. మీరు నిశ్చింతగా మా రాజ్యంలో కొంతకాలము ఉండి ఆనందించండి.

భగవాన్! నేను ఇప్పుడు ఒక యజ్ఞమును ప్రారంభించబోతూ, దీక్ష తీసుకోబోతున్నాను.

---

**యావత్ ఏకైకస్మా ఋత్విజే**
**ధనం దాస్యామి,**
**తావత్ భగవద్భ్యో దాస్యామి**
**వసంతు భగవంత। ఇతి॥**

ఈ జరగబోయే యజ్ఞమునకు ఋత్విజులు వచ్చియున్నారు. ఒక్కొక్క ఋత్విజునికి ఎంతెంత సమర్పించుకోబోవుచున్నానో - అంతంత ధనము మీలో ప్రతి ఒక్కరికి కూడా సమర్పించుకుంటాను. మీ మహనీయత్వమును గౌరవించుకుంటాను.

నాచే మీరు పూజింపబడుచూ ఇక్కడ ఉండండి. ఇది నా అభ్యర్థన, ప్రార్థన.

---

**6.** **తే హ ఊచు :-**
**"యేన హ ఏవ అర్థేన**
**పురుషశ్చః ఏత్తగ్ం హైవ**
**వదేత్ ఆత్మానమ్**
**ఏవేమం వైశ్వానరగ్ం**
**సంప్రత్యధ్యేషి తమేవ**
**నో బ్రూహి - ఇతి।**

**ఉద్దాలక ఋషి, ప్రాచీనశాలుడు, సత్యయజ్ఞుడు, ఇంద్రద్యుమ్నుడు, జనుడు, బుడిలుడు :**

మహారాజా! అశ్వపతీ! మీ స్వాగత వచనములకు, అభ్యాగతి మర్యాదలకు, ధనసమర్పణ సంసిద్ధతకు మేము ఎంతో సంతోషిస్తున్నాము. మీకు సర్వదా శుభమగు గాక! మీ యజ్ఞ కార్యక్రమము దిగ్విజయమగు గాక! అయితే ఇక్కడ ఒక విషయం మీకు విన్నవించుకొంటున్నాము. మేము సంపదల కొరకై మీవద్దకు రాలేదు. ఎవరు ఏ ప్రయోజనము కొరకై వస్తారో, అదియే మీవంటి మహనీయులు సిద్ధింపజేయటము ఆచరిస్తూ ఉంటారు కదా!

మీరు 'వైశ్వానరవిద్య'ను సవివరంగా, సశాస్త్రీయంగా ఎరిగి ఉన్నవారనునది లోకప్రసిద్ధము. అందుకొరకై విద్యార్థులమై వచ్చాము. దయతో వైశ్వానరవిద్యను మాకు బోధించవలసినదిగా అర్థిస్తున్నాము. అనుగ్రహించండి.

---

**7.** **<u>తాన్ హ ఉవాచ :-</u>**
**ప్రాతర్వః ప్రతివక్తాఽస్మి,**
**ఇతి తే హ సమిత్**
**పాణయః పూర్వాహ్ణే**
**ప్రతిచక్రమిరే తాన్ వా**
**అనుపనీయైవ...**
**ఏతత్ ఉవాచ॥**

అశ్వపతి మహారాజు : మహనీయులారా! అట్లాగే! అయితే, అట్టి విద్య మనం అభ్యసించటానికై మీరు ప్రాతఃకాల ఉదయ సమయములలో సంసిద్ధులై ఉండండి. అప్పుడు మాత్రమే నాకు తీరిక.

ఆ మరునాడు ఉదయమే ఉద్దాలకఋషి మొదలైనవారు సమిత్ ప్రాణులై (సమిధల కట్టెలను గురుసమర్పణగా చేతబూనినవారై) సిద్ధమై ఉన్నారు.

వారికి "ఉపనయన దీక్ష" - నియమించకుండానే అశ్వపతిరాజు ఈ విధంగా బోధించటము ఆరంభించారు.

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - పంచమాధ్యాయే ఏకాదశః ఖండః**

# 5-12. ద్వాదశ ఖండము - ద్యులోక వైశ్వానరోపాసన

| | | |
|---|---|---|
| 1. | **ఔపమన్యవ కం త్వమ్**<br>**ఆత్మానమ్ ఉపాస్స? ఇతి।**<br>**(ఔపమన్యుడు) దివమేవ భగవో, రాజన్!** | అశ్వపతి మహారాజు : మహనీయుడగు ఉపమన్య మునీంద్రుల ప్రియ కుమారుడగు ఔపమన్యా! ప్రాచీనశాలా! మీరు 'ఆత్మ'ను ఏవిధంగా ఉపాసిస్తూ ఉన్నారో ముందుగా అది వివరించి మాకందరికీ చెప్పండి.<br><br>ఔపమన్యుడు / ప్రాచీనశాలుడు : రాజా! ద్యులోకమును (దేవతా లోకమును) వైశ్వానరాత్మగా ఉపాసిస్తున్నాను. |
| | **<u>ఇతి హ ఉవాచ :</u>**<br>**"ఏష వై సుతేజా - "ఆత్మా**<br>**వైశ్వానరో - యం।"**<br>**త్వమ్ ఆత్మానం, ఉపాస్సే**<br>**తస్మాత్ తవ 'సుతం',**<br>**'ప్రసుతం', 'ఆసుతం' కులే దృశ్యతే।** | అశ్వపతిరాజు : అయితే, మీరు ఉపాసిస్తూ ఉన్నది ఆత్మయొక్క ఒక 'సంతేజము' అయినట్టి వైశ్వానరాత్మను మాత్రమే! అది పూర్ణాత్మ యొక్క ఉపాసన కాదు.<br><br>మీరు 'సుతేజా' అనబడే ఆత్మయొక్క కళను మాత్రమే ఉపాసిస్తున్నారు. సుతేజ వైశ్వానరాత్మ కేవలమగు ఆత్మకు ఒక అవయవము వంటిది. మీరు ఉపాసిస్తూ వస్తున్నది -<br><br>(1) సుతము = {వైదిక కర్మ (అగ్నిష్టోమము) నందు సోమలతను దంచి వేరుచేయబడిన "సోమరసము"}<br><br>(2) ప్రసుతము = {క్రతువులలో (వాజపేయము వాటియందు) సంపాదించబడే సోమరసము}<br><br>(3) అసుతము = {యాగములందు (సత్రయాగము మొదలైన వాటియందు) నిరంతరము ఉపయోగించు సోమరసముగా సుస్పష్టము అవుతోంది} |
| 2. | **అత్స్యన్నం పశ్యసి।**<br>**ప్రియం అత్త్యన్నం పశ్యతి।**<br>**ప్రియం భవతి అస్య బ్రహ్మావర్చసం కులే**<br>**య ఏతమ్ ఏవం**<br>**ఆత్మానం వైశ్వానరం**<br>**ఉపాస్తే మూర్ధాతి,**<br>**ఏష ఆత్మన - ఇతి।** | మీరు ఆహారము చక్కగా పొంది భుజించగలరు. ప్రియమగు పదార్థములు పొందగలరు.<br><br>ఎవ్వరైతే పరబ్రహ్మమును (లేక) వైశ్వానరాత్మను దివ్యలోకముగా పూజిస్తారో - అట్టి వారి కులంలో సత్కర్మానుష్ఠానపరులే పుడతారు. అట్టివారి కులంలో బ్రహ్మావర్చస్సు అగుపడుతూ ఉంటుంది.<br><br>అయితే అట్టివారిది పూర్ణాత్మకు చెందిన శిరస్సుయొక్క ఉపాసన మాత్రమే। సంపూర్ణమైన ఉపాసన కాదు. |
| | **<u>హ ఉవాచ :</u>**<br>**మూర్ధా తే వ్యపతిష్యత్ యత్**<br>**మాం న ఆగమిష్య। ఇతి॥** | ఓ ఔపవన్యా! ఒకవేళ మీరు ఇప్పుడు నా దగ్గిరకు వచ్చి, నేను చెప్పబోవు వైశ్వానరాత్మ యొక్క వివరణ వినకపోతే - ఎప్పుడో మీ తల క్రింద పడిపోయి ఉండేదే। అనగా, మీరు అసంపూర్ణ ఉపాసనచే తలవంచవలసి వచ్చేది। |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - పంచమాధ్యాయే ద్వాదశః ఖండః

# 5-13. త్రయోదశ ఖండము - ఆదిత్య వైశ్వారోపాసన

| | | |
|---|---|---|
| **1.** | **అథ హ ఉవాచ :**<br>**సత్యయజ్ఞం పౌలిషిం,**<br>**ప్రాచీనయోగ్య కం త్వమ్**<br>**ఆత్మానమ్ ఉపాస్స? ఇతి।**<br>**ఆదిత్యమేవ భగవో, రాజన్। ఇతి॥** | అశ్వపతి మహారాజు : ఓ ప్రాచీన యోగ్యుడా! మానవీయుడగు పులిష మునీశ్వరుని కుమారా? సత్యయజ్ఞా! మీరు చెప్పండి. మీరు దేనిని ఆత్మగా ఉపాసిస్తున్నారు?<br>సత్యయజ్ఞుడు: భగవాన్! రాజన్! గురుదేవా! నేను సూర్య భగవానుని వైశ్వానరాత్మ దేవునిగా (లేక) పరమాత్మగా ఉపాసిస్తున్నాను. |
| | **<u>హ ఉవాచ :</u>**<br>**ఏష వై విశ్వరూప ఆత్మా**<br>**వైశ్వానరో యం త్వమ్ ఆత్మానమ్ ఉపాస్సే,**<br>**తస్మాత్ తవ బహు**<br>**విశ్వరూపం కులే దృశ్యతే॥** | అశ్వపతి మహారాజు : నీవు ఏ సూర్యుని ఉపాసిస్తున్నావో ఆయన వైశ్వానరాత్మ యొక్క ఒక (అంశ) రూపమే ఉపాసిస్తున్నారు. అట్టి **ఆత్మ స్వరూపోపాసన** చేస్తూ ఉన్నారు కాబట్టి ; **ఆదిత్యుడే విశ్వరూపుడు** కనుక - ఆయనను ఉపాసించటం వలన మీ కులములో (వంశములో) అనేక ఇహ-పర సుఖములు ఇచ్చే సాధనములు కనబడుచున్నాయి. సాధన సంపత్తి సమగ్రంగా లభించగలదు. |
| **2.** | **ప్రవృత్తో, అశ్వతరీరథో దాసీ నిష్కో**<br>**అత్స్యన్నం పశ్యసి।** | అశ్వతర (గుర్రము/కంచరగాడిద) రథములు, దాసదాసీజనులు, శుభ్రమైన ఆహారము కలిగియుండగలరు. ప్రియమగు అన్నము సర్వదా లభించగలదు. |
| | **ప్రియమత్త్యన్నం పశ్యతి।**<br>**ప్రియం అత్త్యన్నం పశ్యతి।**<br>**ప్రియం భవతి।**<br>**అస్య బ్రహ్మవర్చసం కులే య**<br>**ఏతమేవమ్ ఆత్మానం 'వైశ్వానరమ్' ఉపాస్తే**<br>**చక్షుష్టు ఏతత్ ఆత్మన ఇతి।**<br>**<u>హ ఉవాచ :</u>**<br>**అంధో అభవిష్యో యత్**<br>**మాం న ఆగమిష్య। ఇతి॥** | ప్రియమైన విషయములు చూస్తూ ఉండగలరు. బ్రహ్మవర్చస్సు కలిగి యుంటారు. కనుక ఈ విధంగా ఆత్మను ఆదిత్యరూపంగా ఉపాసించటము శుభప్రదమే!<br>అయితే మీరు ఉపాసించునది వైశ్వానరాత్మ యొక్క 'కన్ను' మాత్రమే। అందుచేత అది సంపూర్ణమైన వాశ్వానరోపాసన కాదు.<br>ఏది ఏమైతేనేమి. మీరు మాత్రం నా దగ్గిరకు ఇప్పుడు వచ్చి వైశ్వానరాత్మ యోగము ఉపాసనల గురించి శ్రవణం చేయబోతున్నారు. కాబట్టి మంచిదే. అట్లా వచ్చి ఉండకుంటే మీరు పూర్ణాత్మ జ్ఞాన విషయంలో గ్రుడ్డివారు అయిపోయేవారే! |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - పంచమాధ్యాయే త్రయోదశః ఖండః**

# 5-14. చతుర్దశ ఖండము - వాయు వైశ్వానరోపాసన

| | | |
|---|---|---|
| **1.** | **అథ హ ఉవాచ ఇంద్రద్యుమ్నం భాల్లవేయం వైయాఘ్రపద్యకం త్వమ్ ఆత్మానమ్ ఉపాస్స? ఇతి।** | అశ్వపతి మహారాజు : ఓ భల్లవి మునీశ్వరుని పుత్రులగు ఇంద్రద్యుమ్న మహాశయా! వైయాఘ్రపద్యా! మీరు కూడా చెప్పండి. మీరు ఆత్మ అనగా ఏదని ఉపాసిస్తున్నారు? |
| | **వాయుమేవ భగవో, రాజన్! - ఇతి।**<br>**<u>హ ఉవాచ :</u>**<br>**ఏష వై పృథక్ వర్మా ఆత్మా వైశ్వానరో యం త్వమ్ ఆత్మానమ్ ఉపాస్సే తస్మాత్ త్వాం పృథక్ బలయ ఆయంతి। పృథక్ రథ శ్రేణయో అనుయంతి।** | ఇంద్రద్యుమ్నుడు : గురువర్యా! మహారాజా! నేను వాయుదేవుని పరమాత్మగా ఉపాసిస్తున్నాను. (నమస్తే వాయో! త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి।)<br><br>అశ్వపతి మహారాజు : అనగా, ఓ ఇంద్రద్యుమ్నమునీ! మీరు "పృథక్ వర్మ" అను వైశ్వానరాత్మ అంశను ఉపాసిస్తున్నారన్నమాట.<br><br>వాయువు నానాగతి కలది కదా! అందుచేత మీరు అనేక దిక్కులనుండి బలమును పొందగలరు.<br><br>అనేక రథములు మీ వెనుకగా (మీరు ఎక్కడికి వెళ్లితే అక్కడికి) నడచివస్తూ ఉండగలరు. |
| **2.** | **అత్స్యన్నం పశ్యసి। ప్రియమత్త్యన్నం పశ్యతి। ప్రియం భవతి। అస్య బ్రహ్మవర్చసం కులే, య ఏతమేవమ్ ఆత్మానం వైశ్వానరం ఉపాస్తే, ప్రాణస్త్వేష ఆత్మన ఇతి॥** | మీరు పవిత్రము, ప్రియము అగు ఆహారము ఎల్లప్పుడు పొందుచూ ఉండగలరు. అన్నభోక్త అయి ఉంటారు.<br><br>అందరికీ ప్రీతిపాత్రులు అవుతారు. బ్రహ్మవర్చస్సు కలిగి ఉంటారు. ఆ విధంగా వాయువును వైశ్వానరాత్మగా ఉపాసించటం చేత మీ వంశము పవిత్రమై ఉండగలదు.<br><br>అయితే మీరు వైశ్వానరాత్మ యొక్క "ప్రాణాంశ"ను మాత్రమే ఉపాసించినవారగుచున్నారు. అనగా మీయొక్క వైశ్వానరోపాసన సమగ్రము కానేకాదు. |
| | **<u>హ ఉవాచ :</u>**<br>**ప్రాణస్త ఉదక్రమిష్యయత్ మాం న ఆగమిష్య। ఇతి॥** | ఒకవేళ మీరు నా వద్దకు వైశ్వానరోపాసన యొక్క వాస్తవ తత్త్వము శ్రవణము చేయటానికి వచ్చి ఉండకపోతే - మీరు ప్రాణము పోగొట్టుకొని ఉండేవారు సుమా! |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - పంచమాధ్యాయే చతుర్దశః ఖండః**

# 5-15. పంచదశ ఖండము - ఆకాశ వైశ్వానరోపాసన

| | మూలం | అర్థం |
|---|---|---|
| 1. | **అథ హ ఉవాచ జనగ్ం। శార్కరాక్ష్య "కం" త్వమ్ ఆత్మానమ్ ఉపాస్స? ఇతి॥** | అశ్వపతి మహారాజు : ఓ శర్కరాక్ష్య మునీశ్వరుని ప్రియకుమారా! జన మహాశయా! మీరు చెప్పండి. మీరు ఇంతవరకు వైశ్వానరాత్మగా ఎవరిని (లేక) దేనిని ఉపాసిస్తున్నారు? అది ఈ మన 'సభ'కు వివరించి చెప్పండి। |
| | **ఆకాశమేవ భగవో, రాజన్! ఇతి!** | జనుడు : మహాత్మా! అశ్వపతి మహారాజా! గురువర్యా! నేను ఆకాశమును భగవానునిగాను, "వైశ్వానరాత్మ" గాను ఉపాసిస్తూ ఉన్నాను. |
| | <u>**హ ఉవాచ :**</u><br>**ఏష వై బహుల ఆత్మా వైశ్వానరో యం త్వమ్ ఆత్మానం ఉపాస్సే। తస్మాత్ త్వం బహులో అసి ప్రజాయా చ। ధనేన చ।** | అశ్వపతి మహారాజు : ఓ జన మహాశయా! మీరు ఆత్మను ఆకాశరూపంగా ఉపాసించటము - <u>**'బహుళోపాసన'**</u> అని చెప్పబడుతూ ఉంటోంది.<br>అందుచేత మీరు బహుళమగు అష్టసంపదలతోను, ఉత్తమ జన సంపదతోను, ధనముతోను సర్వదా సమృద్ధులై ఉంటారు. |
| 2. | **అత్స్యన్నం పశ్యసి। ప్రియమత్త్యన్నం పశ్యతి। ప్రియం భవతి। అస్య బ్రహ్మవర్చసం కులే య ఏతమేవమ్ ఆత్మానం వైశ్వానరం ఉపాస్తే, సందేహస్త్వ ఏష ఆత్మన ఇతి।**<br><u>**హ ఉవాచ**</u><br>**సందేహః తే వ్యదీర్యతి యత్ మాం న ఆగమిష్య। ఇతి॥** | సమృద్ధిగాను, ప్రియముగాను ఎల్లప్పుడు మీరు ఆహారము పొందుతూ ఉంటారు. అందరికి ప్రియము అవుతారు. మీ వంశము బ్రహ్మవర్చస్సుతోను, జ్ఞానులతోను విరాజిల్లగలదు.<br>అయితే మీరు ఉపాసిస్తున్న వైశ్వానరోపాసన - ఆత్మయొక్క మధ్యభాగము మాత్రమే ఉపాసించువారగుచున్నారు సుమా.<br>మీరు ఇక్కడికి (నావద్దకు) వచ్చి ఉండకపోతే మీ శరీరమధ్యాభాగము నశించిపోయి ఉండేదే! |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - పంచమాధ్యాయే పంచదశః ఖండః**

# 5-16. షోడశ ఖండము - జల వైశ్వానరోపాసన

**1.** <u>అథ హ ఉవాచ</u>
బుడిలం అశ్వతరాశ్విం
<u>వైయాఘ్రపద్య!</u>
కం త్వమ్ ఆత్మానమ్ ఉపాస్స? ఇతి॥
'అప' ఏవ భగవో, రాజన్। ఇతి।

అశ్వపతి మహారాజు : ఓ అశ్వతరాశ్వ మునీశ్వర కుమారా! బుడిల మహాశయా! వైయాఘ్రపద్య। మీరు ఆత్మను ఏ ఆలంబనంతో ఉపాసిస్తున్నారు? ఏ రూపము ఆశ్రయించి ఆత్మయొక్క "సమగ్రము"ను సమీపించ యత్నిస్తున్నారు?

బుడిల ముని : నేను జలదేవతను భగవానుని స్వరూపంగా భావించి వైశ్వానరోపాసన చేస్తున్నాను.

---

<u>హ ఉవాచ :</u>
ఏష వై రయిః ఆత్మా వైశ్వానరో యం త్వమ్
ఆత్మానం ఉపాస్సే తస్మాత్ త్వగ్ం
రయిమాన్, పుష్టిమాన్ అసి।

అశ్వపతి మహారాజు : మీరు ఆపః (జలమును) ఆత్మోపాసన కొరకై ఉపాసించటము "రయి-వైశ్వానరాత్మోపాసన" అని అంటూ ఉంటారు.

(జలమునుండి పంటలు, వాటి నుండి ధనధాన్య సంపద లభిస్తాయి. కనుక) మీరు శరీర పుష్టిని పొందుచున్నారు.

---

**2.** అత్స్యన్నం పశ్యసి।
ప్రియమత్త్యన్నం పశ్యతి।
ప్రియం భవతి, అస్య బ్రహ్మవర్చసం కులే।
య ఏతమ్ ఏవ ఆత్మానం వైశ్వానరం ఉపాస్తే
బస్తిస్త్వ ఏష ఆత్మన ఇతి।

అన్నమును సమృద్ధిగా పొందగలరు. అంతా ప్రియంగా ఉండగలదు. బ్రహ్మవర్చస్సు పొందగలరు. మీ కులము (వంశము) లోని వారు ఆహారము, బ్రహ్మవర్చస్సు చక్కగా పొందగలరు.

అయితే అట్టి జలమును ఉపాసించటమనేది వైశ్వానరాత్మయొక్క మూత్రాశయ - అంశము ఉపాసించటము వంటిది.

---

<u>హ ఉవాచ</u>
బస్తిస్తే వ్యభేత్స్యత్ యత్ మాం న ఆగమిష్య। ఇతి॥

మీరు నా వద్దకు వచ్చి ఉండకపోతే మూత్రాశయము పగిలి ఉండేదే!

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - పంచమాధ్యాయే షోడశః ఖండః

# 5-17. సప్తదశ ఖండము - భూమి వైశ్వానరోపాసన

**1.** అథ హ ఉవాచ ఉద్దాలకం ఆరుణిం :
గౌతమ। కం త్వమ్ ఆత్మానం
ఉపాస్స? - ఇతి
"పృథివీమ్" ఏవ, భగవో రాజన్।" - ఇతి।

అశ్వపతి మహారాజు : అరుణిమహర్షి పౌత్రులు, పూజ్యులగు ఆరుణి మునీంద్రులవారి కుమారుడు అగు ఓ ఉద్దాలక మహర్షీ! గౌతమా? మీరు ఆత్మను ఏ ఉపాయంగా - రూపంగా ఉపాసిస్తున్నారు?

ఉద్దాలకుడు : ఈ భూమియే ఆత్మస్వరూపము - అని వైశ్వానరోపాసన చేస్తూ ఉన్నాను, భగవాన్! రాజన్!

---

<u>హ ఉవాచ :</u>
ఏష వై ప్రతిష్ఠా ఆత్మా వైశ్వానరో యమ్ త్వమ్
ఆత్మానం ఉపాస్సే, తస్మాత్ త్వం
ప్రతిష్ఠితోఽసి ప్రజయా చ, పశుభిః చ॥

అశ్వపతి మహారాజు : మీరు వైశ్వానరోపాసనగా భూమిని ఆత్మస్వరూపంగా భావించి ఉపాసించటము మంచిదే. అది 'ప్రతిష్ఠా' అనబడుచున్న వైశ్వానరాత్మోపాసన.

ఈ ఉపాసనచేత మీరు ప్రజా - పశు సంపదచే "ప్రతిష్ఠ" కలిగి ఉంటారు.

---

**2.** అత్స్యన్నం పశ్యసి ప్రియమత్త్యన్నం పశ్యతి।
ప్రియం భవతి। అస్య బ్రహ్మవర్చసం కులే య
ఏతమేవమ్ ఆత్మానం వైశ్వానరం ఉపాస్తే,
పాదౌ త్వేతావా ఆత్మన ఇతి।
<u>హ ఉవాచ :</u>
పాదౌ తే వ్యమ్లాస్యేతాం
యత్ మాం న ఆగమిష్య - ఇతి॥

ఉత్తమమైన 'అన్నము' (ఇంద్రియములకు ఆహారము) పొందుచూ ప్రీతిని పొందుచూ ఉంటారు. మా వంశంలో బ్రహ్మవర్చస్సు వెంచేసినదై ఉండగలదు.

ఇటువంటి ఉపాసన వైశ్వానరాత్మ యొక్క పాదములను (పాద అంశను మాత్రమే) మీరు ఉపాసిస్తూ ఉన్నట్లు!

నా వద్దకు వచ్చి ఉండకపోతే మీ పాదములు శుష్కించి ఉండేవే!

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - పంచమాధ్యాయే సప్తదశః ఖండః

# 5-18. అష్టాదశ ఖండము - పూర్ణ వైశ్వానరాత్మోపాసన

**1.** **తాన్ హ ఉవాచ :**
**ఏతే వై ఖలు యూయం పృథక్ ఇవ**
**ఏవం ఆత్మానం వైశ్వానరం విద్వాగ్ం**
**సో అన్నమత్థ యస్తు।**
**ఏతమ్ ఏవం ప్రాదేశ మాత్రమ్**
**అభివిమానమ్ ఆత్మానం**
**వైశ్వానరం ఉపాస్తే,**

**వైశ్వానరాత్మోపాసన - ముఖ్య విధానము**

అశ్వపతి మహారాజు : [ఆ ఉద్దాలకుడు మొదలైన వైశ్వానరోపాసన (లేక) ఆత్మోపాసన అధ్యయనం చేయవచ్చిన వారందరితో] :

ఓ ఉద్దాలకుడు మొదలైన మహనీయులారా! మీరంతా కూడా వైశ్వానరాత్మను వేరువేరుగా తెలుసుకొంటూ ఉపాసన చేస్తున్నారు. అన్నమును (ఆహారమును / ఇంద్రియ విషయములను) ఆస్వాదిస్తూ ఉన్నారు. అంతటితో 'పరమాత్మను ఉపాసిస్తున్నాను' - అని తృప్తిపడుచున్నారు. పరమాత్మను ఒక్కచోట మాత్రమే (ప్రాదేశమాత్రుడై) ఉన్నాడనే అభినివేశము (Emotion)తో మాత్రమే ఆరాధన చేస్తున్నారు.

పరమాత్మ ఒక్క రూపంగానో, ఒకచోటనే, పంచ భూతములలో ఒకటి మాత్రమేగానో పరిమితుడు కాదు కదా! కాబట్టి మీది పరిమితమైన ఉపాసనయేగాని **పూర్ణాహుతి కాదు.**

---

**స సర్వేషు లోకేషు,**
**సర్వేషు భూతేషు,**
**సర్వేషు ఆత్మ సు అన్నమత్తి॥**

ఆ వైశ్వానరాత్మ భగవానుడు సర్వ లోకములలోను, సర్వ భూతములందు (పంచ భూతములందు) సర్వజీవులందు వేంచేసి, సర్వత్ర ప్రకాశమానులై ఉన్నారు. ఇట్టి ఉపాసన చేయువారు సమస్తము అన్నముగా, స్వానుభూతిగా, స్వస్వరూపముగా ఆస్వాదించగలరు.

---

**2.** **తస్య హ వా ఏతస్య ఆత్మనో**
**వైశ్వానరస్య మూర్ధ ఏవ సుతేజాః చక్షుః**
**విశ్వరూపః ప్రాణః పృథక్ వర్త్మా ఆత్మా**
**సందేహో బహులో బస్తిః ఏవ రయిః**
**పృథివి ఏవ పాదౌ। ఉర ఏవ**
**వేదిః। లోమాని బర్హిః।**
**హృదయం 'గార్హపత్యో'।**
**మనో 'అన్వాహారి'। అపచన**
**ఆస్యమ్ 'ఆహవనీయః'।**

అట్టి మన స్వస్వరూపుడే అగు వైశ్వానరాత్మ ఎట్టివాడంటే **(పరమాత్మ ఎంతటి వాడంటే),**

ఆయన మూర్ధమే (శిరస్సే) : తేజోమయమై కనిపిస్తున్న సమస్త సుతేజస్సు. ఆ తేజస్సే ద్యులోకము (స్వర్గలోకము)

ఆయన చక్షువులే! చూపుయే - ఈ సమస్త విశ్వము యొక్క రూపము - ఆదిత్యుడు (All that beeing seen)

ఆయన ప్రాణశక్తియే - ఈ వేరువేరుగా కనిపించే పృథక్ (multiple) వర్తనమంతా - వాయువు (The Vapour and its Air waves)

ఆయన శరీరమధ్యభాగమే - ఈ విస్తారము, సువిశాలము అగు "ఆకాశము" (Total Space)

ఆయన మూత్రాశయమే - ఈ సమస్త జలము (All Liquid)

ఆయన యొక్క పాదములే - ఈ సమస్తమైన పృథివి (All that is Solid)

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - పంచమాధ్యాయే అష్టాదశః ఖండః

# 5-19. ఏకోనవింశ ఖండము - ప్రాణాయ స్వాహా

| | | |
|---|---|---|
| **1.** | **తద్యత్ భక్తం ప్రథమమ్**<br>**ఆగచ్ఛేత్ తత్ హోమీయం**<br>**స యాం ప్రథమామ్**<br>**ఆహుతిం జుహుయాత్తాం**<br>**జుహుయాత్ "ప్రాణాయ స్వాహా" - ఇతి**<br>**ప్రాణః తృప్యతి।** | **ప్రాణ - ఆహుతులు**<br>**(1)** ప్రథమ ఆహుతి - "ప్రాణాయస్వాహా"<br>(మొదటి హోమము) (భోజన కాలములో) ఏది మొదటగా లభిస్తుందో - అది ప్రథమ హోమ సమర్పణగా<br>"ప్రాణాయ స్వాహా" అని హోమద్రవ్యముగా భావనచేసి వైశ్వానరాగ్నికి (లేక) వైశ్వానరాత్మకు సమర్పించాలి.<br>అప్పుడు "ప్రాణము" తృప్తి పొందగలదు. |
| **2.** | **ప్రాణే తృప్యతి - చక్షుః తృప్యతి॥**<br>**చక్షుషి తృప్యతి**<br>**ఆదిత్యః తృప్యతి।**<br>**ఆదిత్యే తృప్యతి।**<br>**ద్యౌః తృప్యతి।**<br>**దివి తృప్యంత్యాం।** | ఎప్పుడైతే "పంచప్రాణములలో మొదటిదైనట్టి వైశ్వానర తేజో ప్రథమరూపమగు ప్రాణము తృప్తి చెందుతుందో<br>- నేత్రేంద్రియములు తృప్తి చెందుతాయి.<br>- నేత్రేంద్రియ తృప్తిచే 'ఆదిత్యుడు' తృప్తి చెందుతారు.<br>- ఆదిత్యతృప్తిచే దేవతా లోకము (ద్యులోకము) తృప్తి చెందగలదు.<br>- ద్యులోక తృప్తిచే దివి (ఊర్ధ్వమంతా) తృప్తి పొందగలదు. |
| | **యత్ కిం చ ద్యౌః చ**<br>**ఆదిత్యః చ అధితిష్ఠతః తత్ తృప్యతి।** | ఏది ద్యులోకము (దివ్య తత్త్వముల)చే, ఆదిత్యునిచే అధితిష్ఠితము (occupied) అయి ఉన్నదో - అట్టి సమస్తము తృప్తి చెందగలదు. |
| | **తస్య అనుతృప్తిం తృప్యతి।**<br>**ప్రజయా పశుభిః అన్నాద్యేన**<br>**తేజసా బ్రహ్మవర్చసేన ఇతి॥** | అప్పుడు సర్వ అసంతృప్తులు తొలగిపోయినవై తృప్తిచేత తృప్తిపొందగలము. ఇట్టి "ప్రాణాయస్వాహా" అంటూ మొదట లభించిన అన్నమును ప్రాణాహుతిగా సమర్పించుటలో అంతరార్థము ఎరిగి, ఆచరించువాడు - ప్రజలు, పశుసంపద, అన్నము సమృద్ధిగా, శ్రేయోదాయకంగా పొందుచూ, బ్రహ్మవర్చస్సుతో "అహంబ్రహ్మాస్మి" అని ప్రకాశించగలడు. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - పంచమాధ్యాయే ఏకోనవింశః ఖండః

## 5-20. వింశ ఖండము - వ్యానాయ స్వాహా

| | | |
|---|---|---|
| 1. | అథ యాం ద్వితీయాం<br>జుహుయాత్తాం జుహుయాత్<br>'వ్యానాయస్వాహా' ఇతి<br>వ్యానః తృప్యతి। | **ద్వితీయ ఆహుతి - "వ్యానాయస్వాహా"**<br>(రెండవ హోమము)<br>ఇప్పుడు రెండవ ఆహుతిని **"వ్యానాయ స్వాహా"** అని చెప్పుచూ హోమము చేయాలి. ఈ ద్వితీయ హోమమును సర్వాత్మేశ్వరుడగు వైశ్వానరాత్మ దేవునికి సమర్పించాలి. |
| 2. | వ్యానే తృప్యతి – శ్రోత్రం తృప్యతి।<br>శ్రోత్రే తృప్యతి చంద్రమాః తృప్యతి।<br>చన్ద్రమసి తృప్యతి దిశః తృప్యంతి।<br>దిక్షు తృప్యంతీషు యత్ కిం చ దిశశ్చ,<br>చన్ద్రమాశ్చ అధితిష్ఠన్తి, తత్ తృప్యతి।<br>తస్యాను తృప్తిం తృప్యతి,<br>ప్రజయా పశుభిః అన్నాద్యేన<br>తేజసా బ్రహ్మవర్చసేన ఇతి॥ | అట్టి ''వ్యానాయ స్వాహా'' - అంటూ ఆహుతిని హోమము చేయుచుండగా వ్యాన వాయువు తృప్తి చెందగలదు.<br>వ్యాన వాయు తృప్తిచే - శ్రోత్రేంద్రియము (వినికిడి) తృప్తి చెందగలదు.<br>తృప్తి పొందిన శ్రోత్రేంద్రియము (చెవి)చే చంద్రుడు తృప్తి చెందగలడు.<br>చంద్రమసి తృప్తిచే - దిక్కులన్నీ తృప్తి చెందగలవు.<br>దిక్కుల తృప్తిచే ఈ దిక్కులుకు, చంద్రునికి ఆధారమైయున్న సమస్తము తృప్తి చెందగలదు.<br>అప్పుడు అసంతృప్తి తొలగి అనుతృప్తి (ఆత్మతృప్తి) తృప్తి పొందగలదు.<br>అట్టి 'అపానాయస్వాహా' రూపమగు రెండవ ఆహుతి హోమ విధానము (తత్త్వము) ఎరిగినవాడు - ప్రజా (మిత్రులు, కుటుంబసభ్యులు), సంపద, పశు సంపద, అన్నము, బ్రహ్మవర్చస్సులతో ప్రకాశించగలడు. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - పంచమాధ్యాయే వింశః ఖండః

## 5-21. ఏకవింశ ఖండము - అపానాయ స్వాహా

| | | |
|---|---|---|
| 1. | అథ యాం తృతీయాం<br>"జుహుయాత్తాం జుహుయాత్<br>అపానాయస్వాహా" – ఇతి<br>అపానః తృప్యతి। | **తృతీయ ఆహుతి - "అపానాయస్వాహా"**<br>**(తృతీయ హోమము)**<br>ఆ తరువాత "అపానాయ స్వాహా'' అంటూ అపాన ప్రాణమునకు మూడవ ఆహుతి హోమము చేయాలి. అప్పుడు అపాన వాయువు తృప్తిపొందగలదు. |
| 2. | అపానే తృప్యతి వాక్ తృప్యతి।<br>వాచి తృప్యన్త్యామ్ అగ్నిః తృప్యతి।<br>అగ్నౌ తృప్యతి, పృథివీ తృప్యతి। | అపానవాయు తృప్తిచే 'వాక్కు' తృప్తి చెందగలదు.<br>వాక్ తృప్తిచే - అగ్ని తృప్తి పొందుతుంది.<br>అగ్ని తృప్తిచే - పృథివి తృప్తి చెందుతుంది. |
| | పృథివ్యాం తృప్యన్త్యాం యత్కిం చ<br>పృథివీ చ, అగ్నిశ్చ అధితిష్ఠతః తత్ తృప్యతి। | పృథివీ తృప్తిచే - అట్టి పృథివికి, అగ్నికి అధిష్ఠానము అయినట్టిది (ఆత్మ) తృప్తి చెందగలదు. |
| | తస్య అనుతృప్తిం తృప్యతి।<br>ప్రజయా, పశుభిః అన్నాత్<br>ఏన తేజసా బ్రహ్మవర్చసేన ఇతి। | అట్టి అనుతృప్తి (ఆత్మ తృప్తి)చే తృప్తి సిద్ధించుకొన్నవాడు ప్రజ-పశు -అన్న-బ్రహ్మ తేజస్సులను పొందగలడు. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - పంచమాధ్యాయే ఏకవింశః ఖండః

# 5-22. ద్వావింశ ఖండము - సమానాయ స్వాహా

| | | |
|---|---|---|
| **1.** | **అథ యాం చతుర్థీం<br>జుహుయత్తాం జుహుయాత్<br>"సమానాయ స్వాహా" ఇతి<br>సమానః తృప్యతి।** | **(4) చతుర్థ ఆహుతి "సమానాయ స్వాహా" (4వ హోమము)**<br>ఇప్పుడిక 4వ ఆహారమును (ఆహుతిని) "సమానాయ స్వాహా" అని చెప్పుచూ సమాన వాయువు కొరకై హోమము చేయాలి.<br>అప్పుడు సమాన వాయువు తృప్తి చెందగలదు. |
| **2.** | **సమానే తృప్యతి - మనః తృప్యతి।<br>మనసి తృప్యతి - పర్జన్యః తృప్యతి ।<br>పర్జన్యే తృప్యతి - విద్యుత్ తృప్యతి।** | సమాన ప్రాణము తృప్తి చెందటంచేత - మనస్సు తృప్తి చెందుతుంది.<br>మనోతృప్తి చేత పర్జన్యుడు (వర్షదేవత) తృప్తి చెందగలరు.<br>పర్జన్యతృప్తి చేత విద్యుత్ (తేజస్సు / కాంతి) తృప్తి చెందగలదు. |
| | **విద్యుతి తృప్యన్త్యాం - యత్కిం చ విద్యుచ్చ<br>పర్జన్యశ్చ అధితిష్ఠతః తత్ తృప్యతి।<br>తస్య అనుతృప్తిం తృప్యతి।** | విద్యుత్ తృప్తి చేత - అట్టి పర్జన్యునికి (వర్షమునకు), విద్యుత్తుకు (కాంతికి) అధిష్ఠానము (Root) అయి ఉన్న (అధిష్ఠానమగు) ఆత్మ - తృప్తి చెందగలదు. "అనుతృప్తి" - తృప్తి పొందగలదు. |
| | **ప్రజయా పశుభిః అన్నాద్యేన<br>తేజసా బ్రహ్మవర్చసేన ఇతి॥** | అనుతృప్తిచే (అధిష్ఠానము యొక్క తృప్తిచే) - అట్టి హోమము చేయువానికి సత్సంతానము, పశుసంపద, అన్నము, బ్రహ్మతేజస్సు స్వాభావికంగానే లభిస్తాయి. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - పంచమాధ్యాయే ద్వావింశః ఖండః

# 5-23. త్రయోవింశ ఖండము - ఉదానాయ స్వాహా

| | | |
|---|---|---|
| **1.** | **అథ యాం పంచమీం<br>జుహుయాత్తాం జుహుయాత్<br>"ఉదానాయ స్వాహా" ఇతి<br>ఉదానః తృప్యతి।** | **(5) పంచమ ఆహుతి "ఉదానాయ స్వాహా" (5వ హోమము)**<br>ఇప్పుడిక "ఉదానాయ స్వాహా" అను మంత్రము పలుకుచు వైశ్వానరాత్మకు "ఐదవ ఆహుతి" సమర్పించాలి. అప్పుడు ఉదాన ప్రాణము తృప్తిచెందగలదు. |
| **2.** | **ఉదానే తృప్యతి త్వక్ తృప్యతి,<br>త్వచి తృప్యన్త్యాం వాయుః తృప్యతి।<br>వాయౌ తృప్యత్య ఆకాశః తృప్యతి।** | ఉదానప్రాణ తృప్తిచే - చర్మము తృప్తి చెందగలదు.<br>చర్మము యొక్క తృప్తిచే - వాయువు తృప్తి పొందుతోంది.<br>వాయు తృప్తిచే ఆకాశము తృప్తి పొందగలదు. |
| | **ఆకాశే తృప్యతి యత్కిం చ వాయుశ్చ,<br>ఆకాశశ్చ, అధితిష్ఠతః తత్ తృప్యతి।** | ఆకాశ తృప్తిచే ఆకాశమునకు, వాయువుకు కూడా అధిష్ఠానము అయినట్టిది (ఆత్మ) తృప్తి చెందగలదు. |
| | **తస్య అనుతృప్తిం తృప్యతి।<br>ప్రజయా పశుభిః అన్నాద్యేన<br>తేజసా బ్రహ్మవర్చసేన ఇతి॥** | అప్పుడు అనుతృప్తిరూపంగా సమస్తము తృప్తి చెందగలదు.<br>అట్టి హోమము చేయువాడు ప్రజలను, పశువులను, అన్నమును సమృద్ధిగా పొందగలడు.<br>అట్టి పవిత్రమగు అన్నముచే - బ్రహ్మతేజస్సుతో ప్రకాశిస్తూ సంతృప్తుడై ఉండగలడు. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - పంచమాధ్యాయే త్రయోవింశః ఖండః

## 5-24. చతుర్వింశ ఖండము - వైశ్వానర పంచ ఆహుతి సమర్పణ ఫలము

| | | |
|---|---|---|
| 1. | స య ఇదమ్ అవిద్వాన్<br>అగ్నిహోత్రం జుహోతి<br>యథా అంగారాన్ అపోహ్య<br>భస్మని జుహుయాత్<br>తాదృక్ తత్ స్యాత్। | అశ్వపతి మహారాజు : ఓ ఉద్దాలకాది మహనీయులారా! మనం వైశ్వానరాత్మ "పంచప్రాణాహుతులు" గురించి చెప్పుకున్నాం కదా! ఇట్టి వైశ్వానరాత్మ విజ్ఞానమును అభ్యసించకుండా అగ్నిహోత్రము చేస్తే యజ్ఞము, యాగము, హోమము మొదలైనవి నిప్పులే లేని బూడిదలో హోమము చేయు విధంగా వ్యర్థమే అవుతుంది. |
| 2. | అథ య ఏతత్ ఏవం విద్వాన్<br>అగ్నిహోత్రం జుహోతి,<br>తస్య సర్వేషు లోకేషు,<br>సర్వేషు భూతేషు, సర్వేషు ఆత్మసు హుతం భవతి। | వైశ్వానరాత్మ పంచ ప్రాణాహుతులు ఎరిగి అగ్నిహోత్రము ప్రారంభించి హోమము చేయుటంచేత సర్వాలోకములకు, సర్వజీవులకు, సర్వుల ఆత్మకు ఆహుతులు సమర్పించి హోమము చేసిన ప్రయోజనము, హుతము చేసిన ఫలము లభించగలదు. |
| 3. | తత్ యథా ఈషీకాతూలమ్ అగ్నౌ<br>ప్రోతం ప్రదూయేత్<br>ఏవగ్ం హాస్య సర్వే పాప్మానః ప్రదూయన్తే<br>య ఏతత్ ఏవం విద్వాన్<br>అగ్నిహోత్రం జుహోతి। | ఎవ్వరు "వైశ్వానర పంచ ఆహుతి సమర్పణ హోమ విధానము" పై విధంగా అంతరార్థపూర్వకంగా ఎరిగి, మననం చేస్తూ పంచాహుతులను సమర్పించి, అటుపై యజ్ఞము, క్రతువు, హోమము ప్రారంభిస్తారో వారియొక్క పాపములన్నీ అగ్నిలో వ్రేల్చబడుచున్న ముంజగడ్డి చివరలవలె సలసల కాలి బూడిద అయిపోగలవు. **తినే ఆహారమును హోమము చేయు భావనతో భావించువాడు సర్వలోకములందు హుతం చేసిన ప్రయోజనము పొందగలడు.** |
| 4. | తస్మాదు హ ఏవం విత్ యద్యపి<br>చణ్డాలాయ ఉచ్ఛిష్టం<br>ప్రయచ్ఛేత్ ఆత్మని హ<br>ఏవ అస్య, తత్<br>వైశ్వానరే హుతం స్యాత్।<br>ఇతి। తత్ ఏష శ్లోకః। | పంచహోమములు ఎరిగి అగ్నికార్యము, తదితర కార్యక్రమములు నిర్వర్తించువారు ఇతరులను హింసించు స్వభావము గల చండాలునికి తెలిసి కూడా దానము చేసిన పాపము కూడా తొలగగలవు. ముందుగా 'వైశ్వానరాహుతి' తెలిసి (మనస్సుతో) నిర్వర్తిస్తూ భుజించువారు, యజ్ఞహోమములు చేయువారివలెనే అన్ని దోషములన్నీ తొలగించుకోగలరు. ఈ విధంగా శ్లోకించబడుతోంది. |
| 5. | యథా ఇహ క్షుధితా<br>బాలా మాతరం పర్యుపాసతే,<br>ఏవగ్ం సర్వాణి భూతాని<br>'అగ్నిహోత్రమ్' ఉపాసత ఇతి।<br>'అగ్నిహోత్రమ్' ఉపాసత। ఇతి॥ | ఆకలిగొన్న పసిబిడ్డలు తల్లిని 'రావాలి' అని కోరుకొంటూ తల్లి చుట్టూ చేరి బ్రతిమలాడుతూ ఉపాసిస్తారు చూచారా? ఆ విధంగా యజ్ఞ, యాగ, క్రతు, హోమ సందర్భములలో యజ్ఞకర్త మొదలైన వారంతా అగ్నిహోత్రమును ఉపాసించాలి. ఉపాసించెదరు గాక! |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - పంచమాధ్యాయే చతుర్వింశః ఖండః

**ఇతి - ఛాందోగ్యోపనిషది పంచమ అధ్యాయః సమాప్తః॥**

# ఛాందోగ్యోపనిషత్
# 6వ అధ్యాయము
## 6-1. ప్రథమ ఖండః - సమస్త శాస్త్రముల అంతిమ ఆదేశం

**1.** **ఓం**
**శ్వేతకేతుః హ ఆరుణేయ ఆస।**
**<u>తం హ పితా ఉవాచ :-</u>**
**శ్వేతకేతో వస బ్రహ్మచర్యమ్।**
**న వై, సోమ్యా! అస్మత్**
**కులీనో అననూచ్య**
**బ్రహ్మబంధుః ఇవ భవతి ఇతి॥**

ఓం! అరుణి మహర్షి మనుమడు మరియు ఆరుణిమహర్షి (ఉద్దాలకుని) కుమారుడు - శ్వేతకేతువు.

ఒకరోజు ఉద్దాలకారుణి మహర్షి పంచవర్షములు గల పుత్రునితో ఈ విధంగా సంభాషించారు.

**ఉద్దాలకారుణి మహర్షి:** బిడ్డా! శ్వేతకేతూ! నీవు మన వంశానుచారములు ఆశ్రయించాలి.

**శ్వేతకేతువు :** పితృదేవా! ఆజ్ఞాపించండి। ఏమి చేయవలసియున్నది?

**ఉద్దాలకుడు :** బిడ్డా! సోమ్యా! శ్వేతకేతూ। నీవు సద్గురువును ఆశ్రయించాలి. బ్రహ్మచర్య దీక్షను గ్రహించి వేదవేదాంగములు అధ్యయనము చేయాలి. వేదములను, అందలి శిరోభాగమువంటి ఉపనిషత్తులను అధ్యయనము చేయాలి. మన వంశములో వేదములను, అందలి శిరోభాగమువంటి ఉపనిషత్తులను అధ్యయనము చేసినవారే అందరూ కూడా! అంతేకాని, నామమాత్ర బ్రాహ్మణులు మన వంశంలోఎవరూ లేరు.

---

**2.** **స హ ద్వాదశ (12) వర్ష ఉపేత్య**
**చతుర్వింశతి (24) వర్షః**
**సర్వాన్ వేదాన్ అధీత్య**
**మహామనా అనూచానమానీ స్తబ్ధ ఏయాయ।**

శ్వేతకేతువు 12 సంవత్సరముల నుండి 24 సంవత్సరముల వయసువరకు (12 సంవత్సరముల కాలము) 4 వేదములు అధ్యయనం చేశారు.

విద్యార్థి దశ పూర్తయినది, ఇంటికి తిరిగి వచ్చారు. తాను విద్య నేర్చుకొని మహా బుద్ధి గలవాడనని తలచుచూ విద్యాగర్వముతో, అభిమానముతో ఉండసాగారు.

---

**<u>తం హ పితా ఉవాచ :-</u>**
**శ్వేతకేతో! యన్ను సోమ్య! ఇదం మహమనా**
**అనూచానమానీ స్తబ్ధో? అస్యుత।**
**తమ్ ఆదేశమ్ అప్రాక్ష్యః।**

**ఉద్దాలకుడు :** కుమారా! సౌమ్య! శ్వేతకేతూ! నీవు అన్నీ తెలుసుకున్నానని, విద్యావంతుడనని, గొప్పవాడివైనావని తలచుచూ, స్తబ్ధుడవై కనిపిస్తున్నావే? మంచిది. అయితే సరే.! మంచిదే! అయితే ఒక ముఖ్య విషయం.

---

**3.** **యేన అశ్రుతం శ్రుతం భవతి, అమతం మతం**
**అవిజ్ఞాతం విజ్ఞాతం ఇతి**
**కథం ను భగవః**
**స ఆదేశో భవతి – ఇతి?**

ఏది లోకంలో వినబడదో అట్టిది విని ఉన్నావా? ఏది అమతమో (లోకాభిప్రాయములచే సిద్ధించదో) అట్టిది (బ్రహ్మజ్ఞానము) సిద్ధించుకున్నావు కదా! ఏది లోక జీవనములో తెలియబడజాలదో అట్టి దాని గురించి తెలుసుకున్నావు కదా? శాస్త్రముల ఆదేశమేమిటో గ్రహించావా?

**శ్వేతకేతువు :** తండ్రీ! అట్టి ఆదేశము ఏమిటి? ఎటువంటిది? విశదీకరించండి. జ్ఞానము ఏమిటో ఉపదేశించండి.

---

**4.** **యథా, సోమ్య!**
**ఏకేన మృత్పిండేన సర్వం**
**మృణ్మయం విజ్ఞాతం స్యాత్,**
**"వాచారమ్భణం వికారో నామధేయం,**
**మృత్తిక ఇతి ఏవ సత్యమ్"।**

**ఉద్దాలకారుణి :** తత్త్వశాస్త్రము యొక్క, సమస్త శాస్త్రముల అంతిమ ఆదేశము (The Final Message) ఏమిటో కొన్ని విశేషాలు చెబుతాను విను. ఓ సోమ్య! నీవు, నేను తెలుసుకోవలసిన సత్యము - స్వస్వరూపమునకు అనన్యము అయి ఉండినట్టి బ్రహ్మమే కదా! అంతకుమించి తెలుసుకోవలసినది మరేముంటుంది?

**శ్వేతకేతువు :** ఏది సత్యము? ఏది కల్పన? ఏది బ్రహ్మము? ఏది అనన్యము? దయతో నాకు చెప్పండి.

**ఉద్దాలక మహర్షి :** బ్రహ్మము గురించి శాస్త్రముల ఆదేశమేమిటో కొన్ని దృష్టాంతములతో కూర్చి చెప్పుతాను. విను.

| | | |
|---|---|---|
| | | ఈ దృశ్య జగత్తు అనేకమంది జీవరాసులతో, అనేక భేదములతో లోకన్యాయంగా అనభవమౌతోంది కదా! అయితే -<br>**మృత్తికా - కుంభ న్యాయము :** అనేక ఆకారములు గల కుండలు ఒకానొకచోట ఉన్నాయి. ఆ కుండల వేరు వేరు ఆకారములు, కుండ మూత, మట్టి బాన....మొదలైనవన్నీ సత్యమా? కాదు. కుండలన్నీ మట్టితో తయారైనాయి కనుక 'వేరు వేరు కుండలు' అనునది సత్యమా? కాదు. మట్టి మాత్రమే నిత్యము సత్యము. "కుండ-బాన-మూత" - మొదలైనవి మాటవరసవరకే. మట్టియొక్క అనేక ఆకారములు కల్పించబడినవి మాత్రమే। అట్లాగే అనేక జీవులుగా కనిపిస్తున్నప్పటికీ సమస్తమునకు "అధిష్ఠానమగు బ్రహ్మము" మాత్రమే సత్యము. |
| **5.** | **యథా సోమ్య! ఏకేన లోహ మణినా సర్వం<br>లోహమయం విజ్ఞాతం స్యాత్,<br>వాచారమ్భణమ్ వికారో నామధేయమ్,<br>– లోహం ఇతి ఏవ సత్యమ్।** | బంగారు ఆభరణ న్యాయము: బంగారముతో చేయబడిన అనేక ఆభరణములు ఆయా పేర్లతో చెప్పబడుచున్నాయి. (ఉదాహరణకు గాజులు, అరవంకె, ఉంగరము, పాపిడిబిళ్ల మొదలైన ఆయా పేర్లు) బంగారము ఒక్కటేగాని ఆయా అనేకములు అవటం లేదు కదా! ఆ పేర్లన్నీ పేర్లుగా కల్పన మాటవసరకేగాని మొదలే (బంగారము దృష్ట్యా) వేరుకానివే. బంగారము - గాజు వేరు చేసి ఇద్దరికి ఇవ్వగలమా? లేదు. అందుచేత। "గాజు" అనే మాట వాచారంభము. (మాటకేగాని వస్తుతః గాజు బంగారమునకు వేరుగా లేదు. ఆకార వికారమునకు చెప్పే పేరు) అందుచే 'వికారము' నకు పెట్టిన పేరు.<br>**ఇనుము లోహమే సత్యము. ఆభరణము, సూది, సుత్తి, పలుగు, గొలుసు - మొదలైనవి సత్యము కాదు. వాచారంభము. వికారో నామధేయము.** |
| **6.** | **యథా, సోమ్య। ఏకేన<br>నఖ నికృంతనేన సర్వం<br>కార్ష్ణాయసం విజ్ఞాతం స్యాత్,<br>వాచారమ్భణం వికారో నామధేయం<br>– కృష్ణాయసమ్ ఇతి ఏవ సత్యం!<br>ఏవం సోమ్య! స ఆదేశో భవతి। ఇతి।।** | కొయ్యతో గొప్పదేవతా విగ్రహం ఒక కళాకారుడు తయారు చేశారు. అందరు ఆ దేవతా విగ్రహమును పూజిస్తున్నారు. అట్టి ఆ విగ్రహమునకు నఖ-శిఖ పర్యంతము, పాదములగోళ్లు, పాదములు, పిక్క, మోకాలు, నడుము, భుజములు, పొట్ట, హృదయము, ముఖము, కళ్లు, చెవులు, నుదురు, శిరస్సు, కిరీటము - ఇవన్నీ కొయ్య యందు చెక్కబడ్డాయి. అయితే అక్కడ ఉన్నది ఏకమగు కొయ్య మాత్రమే! మిగతాదంతా వాక్కుచే ఆరంభమై మొత్తమంతా ఆయా వికారములకు పెట్టబడిన కల్పితమగు పేర్లు - మాత్రమే! |
| **7.** | **న వై నూనం భగవన్తః<br>స ఏతత్ అవేదిషుః<br>యద్ధ్యేతత్ (యత్ హి ఏతత్) అవేదిష్యన్<br>కథం మే నా వక్ష్యన్? ఇతి।<br>భగవాన్। త్వ ఏవ మే<br>తత్ బ్రవీతు – ఇతి।<br>తథా సోమ్య! ఇతి హ ఉవాచ।।** | **శ్వేతకేతు :** "స్వామీ!"బొమ్మలన్నీ మట్టివే। ఆభరణములన్నీ బంగారమే। కొయ్య విగ్రహములోని అవయవములన్నీ కొయ్య మాత్రమే. తదితరంగా భేదంగా పిలువబడేదంతా వాక్కుచే కల్పనగా ఆరంభించబడిన కల్పన. వికారములకు ఈయబడిన పేర్లు మాత్రమే। అక్కడ మట్టి, బంగారము, కొయ్య మాత్రమే సత్యము" - అను ఒకానొక పాఠ్యాంశము. శాస్త్రముల ఆదేశము (The order of Learning Text Book) అనేది ఒకానొక కొత్త కోణముగా వింటున్నాను. నాకు ఈ విషయం భగవంతునితో సమానులు, పూజ్యులు అగు గురువులు బోధించి ఉండలేదు. వారి దృష్టిలో మీరు చెప్పే వివరణ తెలియదేమో! వారు చెప్పందే నాకు తెలియదు కదా! (లేక) ఇతః పూర్వము నేను అర్హుడనై ఉండలేదో! అందుచేత మీరు నాకు వివరించమని ప్రార్థన.<br>**ఉద్దాలకుడు :** సోమ్యా! ప్రియకుమారా! చెపుతాను. విను. |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - షష్ఠాధ్యాయే ప్రథమః ఖండః**

## 6-2. ద్వితీయ ఖండః - జగత్ కూడా సత్ రూపమే!

| | | |
|---|---|---|
| **1.** | **"సత్" ఏవ సోమ్య।**<br>**ఇదమ్ అగ్ర ఆసీత్।**<br>**ఏకం ఏవ - అద్వితీయం!**<br>**తత్ హి ఏక ఆహుః అసత్ ఏవ**<br>**ఇదమ్ అగ్ర ఆసీత్।**<br>**ఏకమేవ - అద్వితీయం**<br>**తస్మాత్ అసతః సత్ జాయతా!** | ఉద్దాలకుడు : ఈ దృశ్య మానమగుచున్న జగత్తుకు మునుముందుగా "నేను ఉన్నాను" అను రూపముగల "సత్" మాత్రమే ఉన్నది. నేను ఉన్నాను అనునది ఎవ్వరూ మనకు చెప్పకుండానే మనము స్వానుభవంగా కలిగి ఉంటున్నాము కదా! అప్పుడు అట్టి 'సత్' ఏకము అయి ఉన్నది. అనేకముగా కాదు. అద్దానికి (నేను ఉన్నాను - అనుదానికి) ద్వితీయ సైతం ఏదీ లేదు. ఇదియును అర్థం చేసుకో.<br><br>అట్టి ఏకము, అద్వితీయము అయి ఉన్న 'సత్' యే 'అసత్'గా కూడా ప్రదర్శనమౌతోంది. |
| **2.** | **కుతస్తు ఖలు, సోమ్య।**<br>ఏవం స్యాత్ ఇతి?<br><u>హోవాచ :</u><br>కథమ్ అసతః సత్ జాయతే - ఇతి?<br>సత్త్వ ఏవ, సౌమ్య!<br>ఇదమ్ అగ్ర ఆసీత్<br>ఏకమేవ - అద్వితీయమ్। | శ్వేతకేతు : అయితే ఉన్నదానినుండి (సత్ నుండి) లేనిది (అసత్) బయల్వెడలుతోందా? సత్ నుండి అసత్ ఎట్లా జనిస్తోంది?<br><br>ఉద్దాలకుడు : ఉన్నదాని నుండి 'లేనిది' వెడలటమేమిటి? లేనిది ఉన్నదాని నుండి జనించటమేమిటి?<br><br>సౌమ్యా। మొట్టమొదట 'సత్' యే ఉన్నది. ఇప్పటికీ 'సత్'యే ఉన్నది. ఉన్నది ఎప్పటికీ ఉన్నది. లేనిది ఎప్పుడూ లేదు. సత్‌యే (ఉనికియే) సర్వదా ఏకమై, అద్వితీయమై ఉన్నది. |
| **3.** | **తత్ ఐక్షత బహు స్యాం ప్రజాయేయేతి।**<br>**తత్ తేజో అసృజత।**<br>**తత్ తేజ ఐక్షత**<br>**బహు స్యాం ప్రజాయేయేతి।**<br>**తత్ అపో అసృజత।**<br>**తస్మాత్ యత్ర క్వ చ**<br>**శోచతి, స్వేదతే వా పురుషః।**<br>**తేజస ఏవ తత్ అధి ఆపో జాయన్తే।** | ఆ మొట్టమొదటే ఉన్న సత్ (తత్) - "నేను అనేకములుగా అగుదునుగాక। బహురూపములు ధరించెదనుగాక।" - అని భావించుచున్నది. ఆ సత్ (తత్) ముందుగా తేజస్సు (Enlighten-ment) ను సృజించుకుంటున్నది.<br><br>అట్టి తన నుండి బయల్వెడలిన తేజస్సును "అనేకముగా అగునుగాక।" - అని అనుకుని అట్టి భావననుండి 'జలము'ను సృజిస్తోంది. అందుచేతనే ఈ పురుషుడు దేనిగురించైనా వేదన (ఆదుర్దా) చెందగానే ముందుగా స్వేదము (చెమట) పుట్టుకొస్తున్నది.<br><br>ఆ సమయములో తేజస్సు నుండి జలము ఉత్పన్నమౌతోంది. అందుకే ముఖము తేజోమయమై కనిపిస్తోంది. |
| **4.** | **తా ఆప ఐక్షంత బహ్వ్యః**<br>**స్యామ ప్రజాయేమహీతి।**<br>**తా అన్నమ్ అసృజన్త।**<br>**తస్మాత్ యత్ర క్వ చ**<br>**వర్షతి తత్ ఏవ**<br>**భూయిష్ఠమ్ 'అన్నం' భవతి।** | ఆ జలము "మేము అనేకముగా అయ్యెదము" - అని ఈక్షణము (Perceiving, Feelings) చేస్తున్నది.<br><br>అనేక రూపములుగా అవసాగుతోంది.<br><br>ఆ జలము తన నుండి అన్నమును పుట్టింపజేసుకొంటోంది. (అన్నము = ఆహారము; పంచేంద్రియానుభవములు)<br><br>అందుచేతనే - ఎచ్చటైనా ఎప్పుడు 'వర్షము' కురిస్తే, అక్కడ జీవులకు అన్నము సమృద్ధిగా అగుచున్నది. 'పరిపోషణ ధర్మము' బయల్వెడతలుతోంది. |
| | **యద్భ్య ఏవ తదధి**<br>**'అన్నాద్యం' జాయతే।** | జలము అన్నాద్యము (ఆహారము ఉత్పత్తి చేసి ప్రసాదించునదిగా) ఈ సృష్టిలో - అగుచున్నది సృష్టికి ఆహారప్రదాతగా ప్రదర్శనమౌతోంది. |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - షష్ఠాధ్యాయే ద్వితీయః ఖండః**

# 6-3. తృతీయ ఖండః - సత్‌యే జీవరూపములు

| | | |
|---|---|---|
| **1.** | **తేషాం ఖలు ఏషాం భూతానం**<br>**త్రీణి ఏవ బీజాని భవన్తి**<br>**అణ్డజం। జీవజమ్। ఉద్భిజ్జమ్ - ఇతి।** | సమస్త జీవులు జనిస్తున్న బీజము (Types of source of generation) - మూడు విధములు.<br>**(1)** అండజములు : (గ్రుడ్డు నుండి ఉత్పన్నములు, జనితములు, ఉదా॥ పక్షులు, పాములు మొదలైనవి).<br>**(2)** జీవజములు : దేహంలోంచి, పుట్టేవి. ఉదా॥ జరాయుజములగు మానవులు, పశువులు మొదలైనవి.<br>**(3)** ఉద్భిజములు : నేలను (పైభాగంలోంచి) చీల్చుకొని పుట్టుచున్నవి. (ఉద్భిద్-స్థావరములు)<br>[ స్వేదజములు (చెమట నుండి పుట్టేవి), వేడి నుండి పుట్టే ఉష్మకజములు జీవజములని ఇక్కడ మహర్షి ఉద్దేశ్యము] |
| **2.** | **సేయం దేవత ఐక్షత, హన్త।**<br>**అహమ్ ఇమాః తిస్రో**<br>**దేవతా "అనేన జీవేన**<br>**ఆత్మనా అనుప్రవిశ్య,**<br>**నామరూపే - వ్యాకరవాణి" - ఇతి।** | "కేవల సత్" స్వరూపుడగు ఆ ఆత్మ భగవానుడు - "ఇక నేను అగ్ని - జల - అన్నములనబడే ముగ్గురు దేవతలుగా ప్రవేశించి నామ రూపములను వ్యక్తపరిచెదను గాక।"- అని తలచుచున్నారు. |
| **3.** | **తాసాం త్రివృతం।**<br>**త్రివృతం ఏకైకాం**<br>**కరవాణి - ఇతి।**<br>**స ఇయం దేవతా ఇమాః తిస్రో దేవతా**<br>**అనేన ఏవ జీవేన ఆత్మన**<br>**అనుప్రవిశ్య నామరూపే వ్యాకరోత్।** | ఈ మూడిటిలో ఒక్కొక్క దానిని తిరిగి మిగతా రెండు కలుస్తూ ఆయా సమ్మిళతములు (permutations and combinations) ఏర్పడుచూ ఆత్మదేవునిచే ధారణ పూర్వకంగా స్వయం స్వరూపమై కల్పించబడుతోంది. అట్టి "త్రివృత్ × త్రివృత్ కరణము"చే అసంఖ్యాక నామరూపములు ఆత్మచే పరికల్పించబడి (ఒక రచయితే తన నవలయందు అనేక పాత్రల స్వభావములను, పరస్పరములను కల్పిస్తున్నట్లుగా) వ్యవహారితమై (Transactionally) విస్తరింపజేయబడుతోంది. |
| **4.** | **తాసాం త్రివృతం। త్రివృతం**<br>**ఏకైకామ్ అకరోతి।**<br>**యథా తు ఖలు, సోమ్య।**<br>**ఇమాః తిస్రో దేవతాః త్రివృత్।**<br>**త్రివృత్ త్రివృత్ ఏకైకా భవతి।**<br>**తత్ మే (తన్మే) విజానీ హి। ఇతి॥** | ఈ విధంగా మొట్టమొదటగా ఉన్న 'సత్' దేవత ఏకమే అయి ఉండి 3×3×3గా అనేకముగా అనుకోబడుతోంది. ఓ సౌమ్య! అదంతా - యథాభావం తథా భవతి" - గా భావించబడుతోంది. అట్టి త్రివృత్ భావనచే కల్పనగా అనుభవమగుచున్న ఇంద్రియజగత్ దృశ్యమంతా - మరోకప్పుడు కలలోని దృశ్యము కల తనదైనవాడిలో లయం పొందుచున్నట్లు) - తిరిగి తనయందే తిరోధానము (withdrawal) పొంది అనేకమంతా ఏకమునందు (నాయందే) లయమై 'తత్' రూపముగా అగుచున్నది. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - షష్ఠాధ్యాయే తృతీయః ఖండః

# 6-4. చతుర్థః ఖండః - త్రివృత్‌కరణం - వాచారంభణం వికారో నామధేయం

**1.** **యత్ అగ్నే, "రోహితం"**
**రూపం "తేజసః" తత్ రూపమ్।**
**యత్ "శుక్లం", తత్ "అపాం"।**
**యత్ "కృష్ణమ్" తత్ "అన్నస్య"।**
**అపాగాత్ అగ్నేః అగ్నిత్వం వాచారంభణం**
**వికారో నామధేయం।**
**త్రీణి రూపాణి ఇత్యేవ సత్యం।**

( △ మూడు రేఖలు కలిస్తే త్రిభుజం (Triangle). ఈ '3' రేఖలు తీసి ప్రక్కన పెడితే త్రిభుజము ఎక్కడున్నది)

**అగ్నిరూపం :**

అగ్నిలో ఎరుపు, తెలుపు, నలుపు కలిసి ఉన్నాయి.

ఎరుపు - తేజోరూపము.

తెలుపు - జలరూపము

నలుపు - అన్నము రూపము (పృథివి)

ఈ రక్తవర్ణము (తేజస్సు), శ్వేతవర్ణము (జలము), నల్లటి రూపము (అన్నము) - ఈ మూడు తొలగించి చూస్తేనో, అగ్నిలో ఈ మూడు (తేజోతత్త్వము, జలతత్త్వము, పృథివీతత్త్వము) ప్రక్కన పెడితే - "అగ్ని, అగ్నిత్వం'' అనునవి ['బంగారపుగాజు'లో గాజు (Bangle) వలె] వాచారంభము - మాటవరుసగా చెప్పుకునేది. వికారో నామధేయము - ఒక వికారమునకు (త్రిభుజములాగా) చెప్పునది. మూడు (తేజస్సు, జలం, అన్నం) రకములుగా ఉన్నవే సత్యము.

---

**2.** **యత్ ఆదిత్యస్య రోహితం**
**రూపం 'తేజసః" తత్ రూపం।**
**యత్ శుక్లం, తత్ "అపాం"।**
**యత్ కృష్ణం తత్ "అన్నస్య"**
**అపాగాత్ ఆదిత్యాది ఆదిత్యత్వం**
**వాచారమ్భణం వికారో నామధేయం।**
**త్రీణి రూపాణి। ఇత్యేవ సత్యం।।**

**సూర్యబింబము**

**ఆదిత్యునిలో (సూర్య బింబములో) :**

రోహితరూపం (ఎరుపు) - తేజస్సు.

తెల్లటి రూపము - జలము.

నల్లగా ఉన్నది - అన్నము (పృథివి).

ఈ మూడు విడదీసి ఆవలపెట్టి ఇప్పుడు సూర్యబింబమును చూస్తేనో?

ఆదిత్యుడు (సూర్యబింబము అనునది - వాచారంభణం (మాటవరసకు చెప్పుకొనేది మాత్రమే)।

నామధేయం (ఆదిత్యుడు అనునది) వికారమునకు చెప్పుకొనేది (మట్టిబొమ్మలో మట్టికి బొమ్మవలె). త్రిరూపములే సత్యము.

అంతేగాని 'ఆదిత్యుడు' - అనునది ఆ మూడిటి (తేజస్సు, జలం, అన్నం) కలయికకు వేరుగా లేదు.

---

**3.** **యత్ చంద్రమసో "రోహితం"**
**రూపం, 'తేజసః' - తత్ రూపం।**
**యత్ "శుక్లం" తత్ "అపాం"।**
**యత్ "కృష్ణం" తత్ "అన్నస్య"।**
**అపాగాత్ చంద్రాః।**
**చంద్రత్వం - వాచారమ్భణం**
**వికారో నామధేయం।**
**త్రీణి రూపాణి। ఇత్యేవ సత్యం।।**

**చంద్రమసము (చంద్రబింబము)**

"చంద్రబింబము'' అనే దానిలో

ఎర్రని రూపము - తేజస్సు

తెల్లటి విభాగము - జలము

నలుపు విభాగము - అన్నము (అనుభవమయ్యేదంతా)

వీటిని వదలి (ప్రక్కకు పెట్టి) చూచినప్పుడు? - 'చంద్రత్వము' అనబడేది -

వాచారంభణం - మాటకోసం అనుకునేది మాత్రమే।

పేరు - వికారము (ఆకారరహితం)।

పైమూడే సత్యముగాని 'చంద్రుడు' అనేది 'మాటలగారడీ'యే।

| | | |
|---|---|---|
| **4.** | **యత్ విద్యుతో 'రోహితగ్ం'**<br>**రూపం – తేజసః తత్ రూపమ్**<br>**యత్ శుక్లం, తత్ "అపాం'।**<br>**యత్ కృష్ణం, తత్ 'అన్నస్య'।**<br>**అపాగాత్ విద్యుతో,**<br>**విద్యుత్త్వం – వాచారమ్భణం।**<br>**వికారో నామధేయం।**<br>**త్రీణి రూపాణి – ఇత్యేవ సత్యం।** | **విద్యుత్తు - తేజస్సు**<br>విద్యుత్ (తేజస్సు) యొక్క రూపం<br>విద్యుత్ యొక్క రక్తవర్ణమే - తేజస్సు<br>తెల్లటి రూపమే - జలము<br>నల్లటి రూపమే - అన్నము<br>ఈ మూడు విడదీసి చూస్తేనో? విద్యుత్తులో 'విద్యుత్తత్త్వము" అనేది వాచారంభము (వాక్కు యొక్క కల్పనయే).<br>అద్దాని నామధేయము ('విద్యుత్' అనే శబ్దము) ఒక వికారము వంటిది. ఆ తేజస్సు, జలము, అన్నము కలిస్తేనే విద్యుత్తు. కనుక మూడు రూపములు సత్యము. విద్యుత్తు సత్యము కాదు. |
| **5.** | **ఏతత్ హ స్మ వై తత్**<br>**విద్వాంస ఆహుః–**<br>**పూర్వే మహాశాలా**<br>**మహాశ్రోత్రియా న నో౽ద్య**<br>**కశ్చన అశ్రుతం**<br>**అమతమ్, అవిజ్ఞాతమ్**<br>**ఉదాహరిష్యతి – ఇతి।**<br>**హ్యేభ్యో విదాంచక్రుః॥** | ఓ శ్వేతకేతూ! పూర్వకాలంలో అనేకమంది పూర్వీకలగు మహాగృహస్థులు, మహాశ్రోత్రియులు మనము చెప్పుకొన్న "త్రివృత్కరణము"ను తెలుసుకొనియున్నవారు ఉన్నారు. మన వంశంలో నా పితృదేవులు (అరుణి మునీంద్రులు మొదలైనవారు) శ్రోత్రియులు ఉన్నారు. మీ గురువులు కూడా ఎరిగియే ఉన్నారు. అందుచేత మనము చెప్పుకొన్నది అమితము, అశ్రుతము, అవిజ్ఞాతము కాదు. ఎందుకంటే, ఎందరో మహనీయులు 'అగ్ని' ఇత్యాది దృష్టాంతములు ద్వారా సమస్తము తెలుసుకొనియే ఉన్నారు. వారు వచించి ఉన్నారు కూడా। |
| **6.** | **యదు రోహితమ్ ఇవ అభూత్**<br>**ఇతి 'తేజసః' తత్ రూపమ్ – ఇతి।**<br>**తత్ విదాంచక్రుః।**<br>**యదు 'శుక్లమ్' ఇవ**<br>**అభూత్ ఇతి 'అపాం' రూపమితి।**<br>**తద్విదామ్ చక్రుః యదు**<br>**'కృష్ణమ్' ఇవ అభూత్**<br>**ఇతి అన్నస్య రూపమ్ ఇతి**<br>**తద్విదాం చక్రుః।** | వారంతా కూడా ఈ ఈ విశేషము తెలుసుకొనియే శాస్త్రీయంగా ఎలుగెత్తి చాటుచున్నారు.<br>- రోహితము (ఎర్రగా) కనిపించేది తేజోరూపమని.<br>- ఏది తెల్లవలె కనిపిస్తోంది అది జలము యొక్క రూపమని.<br>- ఏది శుక్ల (నలుపు) వర్ణంగా కనిపిస్తోందో - అదంతా అన్నము (అనుభవముగా పొందబడు) రూపమని వారు గమనిస్తూ ప్రవచించి ఉన్నారు. వారు సర్వజ్ఞులై ప్రకాశిస్తున్నారు. |
| **7.** | **యత్ విజ్ఞాతమ్ ఇవ అభూత్**<br>**ఇతి ఏతా సామేవ దేవతానాం**<br>**'సమాస' ఇతి, తత్ విదాం చక్రుః।**<br>**యథా ను ఖలు, సోమ్యే।**<br>**మాః త్రిసో దేవతాః**<br>**పురుషం ప్రాప్య త్రివృత్।**<br>**త్రివృత్ ఏకైకా భవతి**<br>**తత్ మే విజానీహి। ఇతి॥** | ఈ విధంగా విజ్ఞాతంగా (తెలియబడుచున్న రూపంగా) కనిపిస్తున్నదంతా భూ-జల-అగ్ని-వాయు-ఆకాశ దేవతా సంయోగము చేతనేనని వారు దర్శించుచున్నారు.<br>**ఓ సోమ్యా! ఏ తేజ - జల - అన్న త్రిదేవతలు పురుషునియందు త్రివృత్ రూపములు కలిగియుండి ఏకము అగుచున్నారో - అది చెప్పుతాను. శ్రద్ధగా శ్రవణం చేసెదవు గాక।** |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - షష్ఠాధ్యాయే చతుర్థః ఖండః

# 6-5. పంచమః ఖండః - త్రివృత్ కరణం

| | |
|---|---|
| **1. అన్నమ్ అశితం త్రేధా విధీయతే।** | <u>అన్న - జల - అగ్నుల త్రివిధ పరిణామములు</u><br>ఈ జీవుడు అన్నము భుజించిన తరువాత (జఠరాగ్నిచే పచనము అయిన తరువాత) - మూడు విభాగాలుగా ఆ అన్నము విభాగము/ విభజనము పొందుతోంది. |
| **తస్య యః స్థవిష్ఠో ధాతుః, తత్ పురీషం భవతి।**<br>**యో మధ్యమః - తత్ మాగ్ంసం।** | (1) అన్నమునకు చెందిన స్థూల భాగము / ధాతు విభాగము - అది మలము రూపంగా బయటకు వెళ్లుచున్నది.<br>(2) అన్నముయొక్క మధ్యాంశము - రసముగా మారి, ఆ తరువాత మాంస రూపముగా పొందుచున్నది. |
| **యో అణిష్ఠః తత్ మనః ।** | (3) అణుతమమగు సూక్ష్మ అంశము - ఊర్ధ్వముగా (పైపైపుగా) వెళ్లి సూక్ష్మ (హిత) నాడులలో ప్రవేశించి (మనస్సులో ప్రవేశించి, ఆలోచనను వృద్ధిపరుస్తోంది. మనస్సునుండి పంచేంద్రియములు కార్యములను ప్రవర్తిస్తున్నాయి. |
| **2. ఆపః పీతాః త్రేధా విధీయన్తే।**<br>**తాసాం -**<br>**యః స్థవిష్ఠో ధాతుః**<br>**- తత్ మూత్రం భవతి।**<br>**యో మధ్యమః - తత్ లోహితం।**<br>**యో అణిష్ఠః - స ప్రాణః॥** | త్రాగిన నీరు '3' విధములుగా రూపము దాల్చుచున్నది.<br>(1) జలము యొక్క స్థూలభాగము ధాతు విభాగం - మూత్రముగా అగుచున్నది.<br>(2) మధ్య భాగము - రక్తముగా అగుచున్నది.<br>(3) సూక్ష్మ విభాగము - ప్రాణములో ప్రవేశించుచు, శరీరములో ప్రాణముయొక్క ఉత్తేజతకు తోడు అవుతోంది. |
| **3. తేజో అశితం త్రేధా విధీయతే।**<br>**తస్య - యః స్థవిష్ఠో**<br>**"ధాతుః" - తత్ 'అస్థి' - భవతి।**<br>**యో మధ్యమః - స 'మజ్జా'।**<br>**యో అణిష్ఠః - సా 'వాక్'॥** | తేజస్సు (నేయి మొదలైన) మూడు విధములుగా ప్రవర్తనమానమౌతోంది.<br>తేజస్సుయొక్క స్థూల - ధాతు విభాగము - ఎముకల రూపము పొందుచూ, శరీరంలో గట్టి తనమును పరిపోషిస్తోంది.<br>తేజస్సు (వేడిమి) యొక్క మధ్య విభాగము - మజ్జ (ఎముకలలోని నూనె వంటి విభాగముగా అవుతోంది)<br>తేజస్సుయొక్క సూక్ష్మవిభాగము - వాక్కుగా రూపుదిద్దుకుంటోంది. |
| **4. అన్నమయం హి, సోమ్య!**<br>**మనః ఆపోమయః ప్రాణః ।**<br>**తేజోమయీ 'వాక్' ఇతి।**<br>**<u>శ్వేతకేతు</u> : భూయ ఏవ**<br>**మామ్, భగవాన్! విజ్ఞాపయతి। ఇతి।**<br>**<u>ఆరుణి</u> : తథా। సోమ్య।**<br>**ఇతి హ ఉవాచ॥** | ఈ మనస్సు - అన్నమయము,<br>ప్రాణము - జలమయము<br>వాక్కు - తేజోమయము<br>(ఈ మూడు విడదీస్తే - 'శరీరము' అనే శబ్దము వాచారంభణమ్। వికారో నామధేయమ్।)<br>**శ్వేతకేతువు** : గురుదేవా! ఆరుణి మహర్షీ! దయతో మరికొంతగా వివరించి చెప్పండి.<br>**ఆరుణిమహర్షి** : నాయనా! శ్వేతకేతూ! సరే! అట్లాగే వివరించి చెప్పుతాను, విను. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - షష్ఠాధ్యాయే పంచమః ఖండః

# 6-6. షష్ఠః ఖండః - అన్నమే మనస్సు, నీరే ప్రాణము, అగ్నియే వాక్

| | | |
|---|---|---|
| **1.** | **దధ్నః సోమ్య! మథ్యమానస్య<br>యో అణిమా, స ఊర్ధ్వః<br>సముదీషతి, తత్ సర్పిః భవతి।** | పెరుగును చిలికినప్పుడు ఆ పెరుగుయొక్క సూక్ష్మభాగము పైకి చేరి మీగడగాను, అదే వెన్న, ఆ తరువాత నేయిగాను అగుచున్నది. |
| **2.** | **ఏవమ్ ఏవ ఖలు, సౌమ్య।<br>అన్నస్య ఆశ్యమానస్య<br>యో - అణిమా, స ఊర్ధ్వః<br>సముదీషతి - తత్ 'మనో' భవతి।** | ఓ సోమ్య! అదే విధంగా తిన్న అన్నముయొక్క అత్యంత సూక్ష్మవిభాగము పైకి తేలియాడుచు అదియే 'మనస్సు'గా రూపుదిద్దుకొనుచున్నది. (అనగా ఇంద్రియములకు విషయములతో ఆలోచనలే 'మనస్సు' అగుచున్నది.) |
| **3.** | **అపాగ్ం సోమ్య। పీయమానానాం<br>యో అణిమా, స ఊర్ధ్వః<br>సముదీషతి స 'ప్రాణో' భవతి॥** | త్రాగబడిన నీరు యొక్క సూక్ష్మభాగము పైకివచ్చి అదియే 'ప్రాణము' రూపమును ప్రత్యుత్సాహపరచుచున్నది. |
| **4.** | **తేజసః, సోమ్య! అశ్యమానస్య<br>యో అణిమా స ఊర్ధ్వః<br>సముదీషతి సా 'వాక్' భవతి॥** | స్వీకరించబడిన తేజస్సు యొక్క (అగ్నియొక్క) సూక్ష్మ విభాగము పైకి వచ్చి అదియే 'వాక్' అవుతోంది. |
| **5.** | **అన్నమయం హి, సోమ్య!<br>'మన' ఆపోమయః 'ప్రాణః'।<br>తేజోమయీ 'వాక్' - ఇతి।** | ఓ సోమ్యా! శ్వేతకేతూ!<br>మనస్సు అన్నమయము (అన్నమయం మనః)<br>✠ ఇంద్రియ విషయానుభవములే మనోరూపముగా అవుతోంది.<br>✠ ప్రాణములు జలమయము.<br>✠ వాక్కు తేజోమయము. |
| | **<u>శ్వేతకేతువు :</u><br>భూయ ఏవ, భగవాన్।<br>విజ్ఞాపయత్వ ఇతి।<br><u>శ్రీ ఆరుణి :</u><br>తథా సోమ్య।<br>ఇతి హోవాచ।** | శ్వేతకేతు : పితృదేవా! సద్గురుదేవా! మీరు చెప్పు పెరుగుయొక్క సూక్ష్మవిభాగం 'నేయి' అగుచున్న విధంగా -<br>**తినే అన్నముయొక్క అత్యంత సూక్ష్మవిభాగం "మనస్సు"గాను, త్రాగే జలముయొక్క అత్యంత సూక్ష్మవిభాగం - ప్రాణరూపంగాను, తేజస్సు (అగ్ని) యొక్క అత్యంత సూక్ష్మవిభాగం - 'వాక్కు'గాను అగుచున్నాయనే విషయం నేను ఏమాత్రము ఎరిగి ఉండలేదు. ఇది నాకు విజ్ఞాపనం (To practically learn) ప్రసాదించండి.** |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - షష్ఠాధ్యాయే షష్ఠః ఖండః

## 6-7. సప్తమః ఖండః - అన్న-జల-తేజస్సు యొక్క సూక్ష్మాంశములు

**1.** **తథా సౌమ్య! ఇతి హోవాచ**
**షోడశ కలః సోమ్య!**
**పురుషః పంచదశాహాని,**
**మాశీః కామమ్। అపః పిబ।**
**ఆపోమయః ప్రాణో న పిబతో**
**విచ్ఛేత్ స యత। ఇతి॥**

**ఉద్దాలకుడు** : సోమ్యా! శ్వేతకేతూ! నీకు అనుభవమవటానికై ఈ ఈ విషయాలు (For practically experiencing) చెపుతాను. విను.

బిడ్డా! ఈ పురుషుడు భుజించిన అన్నముయొక్క సూక్ష్మతమమైన (సూక్ష్మాతి - సూక్ష్మమైన) అంశము - మనస్సులో శక్తి సంచారము కలిగిస్తోంది. అన్నము ద్వారా బలము సంతరించుకొన్న మనస్సు - 16 భాగములుగా విభాజ్యము (Divided) అగుచున్నది. అనగా 16 కళలు ప్రదర్శనమై పురుషుడు షోడశకళారూపుడై ప్రదర్శనం అగుచున్నాడు. అట్టి షోడశ కళలు ఉన్నప్పుడే ఈ పురుషుడు - ద్రష్ట, శ్రోత, మన (మననము), బోద్ధ (బోధింపబడువాడు), కర్త, విజ్ఞాత అగుచూ ఆయా సమస్త కళలు నిర్వర్తించగలడు.

షోడశ కళాపూర్ణుడవగు నీవు ఇప్పుడు 15 రోజులు ఏమీ తినకుండా ఉపవాసం ఉండు. కానీ జలము మాత్రము కావలసినంత త్రాగుచూ ఉండు. ప్రాణము జలమయము కాబట్టి, జలము త్రాగకపోతే ప్రాణము పోతుంది సుమా!

---

**2.** **స హ పంచదశాహాని న అశా**
**అథ హ ఏనమ్ ఉపససాద।**
**కిం బ్రవీమి, భో ఇతి ఋచః సోమ్య।**
**యజూంషి సామాని ఇతి।**
<u>స హ ఉవాచ</u> : న వై మా
**ప్రతిభాన్తి, భో - ఇతి॥**

**ఆ చెప్పిన విధంగా నీరు మాత్రమే త్రాగుచు 15 రోజులు నిరాహారంగా ఉపవాసము ఉండి, శ్వేతకేతువు 15 రోజుల తరువాత తండ్రిని ఉద్దాలక మహర్షి దర్శనం చేసుకున్నారు.**

**శ్వేతకేతువు** : తండ్రీ! మీరు చెప్పిన విధముగా నీరు మాత్రమే త్రాగుచూ 15 రోజులు ఉపవాసం ఉన్నాను. ఇప్పుడు నన్ను ఏమి చేయమంటారు?

**ఉద్దాలకుడు** : సోమ్యా! నీవు 12 సంవత్సరాల కాలం గురుకులంలో వేద పఠనము నేర్చుకొని ఉన్నావు కదా! ఏదీ? ఋక్-యజుః సామవేదములలోని కొన్ని మంత్రములు సశాస్త్రీయంగా స్వరయుక్తంగా చెప్పు.

**శ్వేతకేతువు** : నాన్న గారూ! అవేమీ ఇప్పుడు నాకు జ్ఞాపకానికి రావటం లేదు. క్షమించాలి.

---

**3.** **<u>తం హోవాచ</u> : యథా, సోమ్య।**
**మహతో అభ్యాహితస్య,**
**ఏకో అంగారః ఖద్యోత**
**మాత్రః పరిశిష్టః స్యాత్ తేన తతోఽపి**
**న బహు దహేత్ ఏవం**
**సోమ్య! తే షోడశానాం**
**కలానామ్ ఏకా కల**
**అతిశిష్టా స్యాత్ తయైతర్హి వేద**
**అన్న అనుభవసి**
**అశాన అథ మే విజ్ఞాస్య, ఇతి॥**

**ఉద్దాలకుడు** : ఎందుకు జ్ఞాపకం రావటంలేదు? ఎందుకో చెపుతాను విను. ఒకచోట అగ్ని జ్వాజ్వల్యంగా మండుతూ ఉన్నది. ఆ జ్వాజ్వలంగా వెలుగుచున్న అగ్ని క్రమంగా ఆరిపోయి, చివరకు కొద్ది నిప్పురవ్వలు మాత్రమే మిగిలి ఉన్నాయి. ఆ చిన్న నిప్పురవ్వలు ఒక కట్టెను కాల్చలేవు కదా!

అట్లాగే ఓ సోమ్యా! నీయొక్క (పైన పురుషుని గురించి చెప్పుకొన్న) షోడశ (16) జీవకళలలో ఒక్క జీవకళమాత్రమే మిగిలి ఉండటంచేత నీకు ఇప్పుడు గురుకులంలో నేర్చుకొన్న వేదపాఠములు గుర్తుకు రావటంలేదు.

అందుచేత ఇప్పుడు నీవు అన్నము భుజించు. అన్నీ గుర్తుకు వస్తాయి.

| | | |
|---|---|---|
| **4.** | **స హ అశ అథ హి ఏనమ్ ఉపససాద।**<br>**తగ్ం హ యత్ కించ పప్రచ్ఛ**<br>**సర్వగ్ం హ ప్రతిపేదే।** | శ్వేతకేతువు తృప్తిగా ఆహారము స్వీకరించి మరల ఉద్దాలకమహర్షి వద్దకు వచ్చారు. అప్పుడు ఇక వేదములలో తండ్రిగారు ప్రశ్నిస్తున్నవన్నీ జ్ఞాపకమువచ్చి, ఆతడు తండ్రి కోరిన విధంగా చెప్పగలిగారు. |
| **5.** | **తగ్ం హోవాచ**<br>**యథా సోమ్య।**<br>**మహతో అభ్యాహితస్య ఏకమ్**<br>**అంగారం ఖద్యోత మాత్రమ్ పరిశిష్టం**<br>**తం తృణైః ఉపసమాధాయ**<br>**ప్రజ్వలయేత్ తేన తతోఽపి బహు దహేత్।।** | ఉద్దాలకమహర్షి : శ్వేతకేతూ సౌమ్య! ఇప్పుడేమి జరిగింది?<br>ప్రజ్వలిస్తూ ఉన్న అగ్ని చల్లారిన తరువాత శేషించిన చిన్న నిప్పుకణములపై ఎండుగడ్డిపరకలను వేసినప్పుడు మరల మంటలుగా మారగా, అప్పుడు ఆ అగ్ని అనేక తృణములను కాల్చగలుగుతుంది కదా! |
| **6.** | **ఏవం సోమ్య! తే షోడశానాం**<br>**కలానామ్ ఏకా కలా అతిశిష్టాభూత్।**<br>**సా అన్నేన ఉపసమాహితా**<br>**ప్రాజ్వాలితః య ఏతర్హి వేదాననుభవసి**<br>**అన్నమయం హి సోమ్య! మన।**<br>**ఆపోమయః – ప్రాణః । తేజోమయీ వాక్।**<br>**ఇతి తత్ హ అస్య**<br>**విజజ్ఞావితి। విజజ్ఞావితి।।** | అట్లాగే, సోమ్య! నీవు ఉపవాసము చేసియున్నప్పుడు చివరికి మిగిలియున్న ఒక్క కళను నీవు అన్నము తినటంచేత ఉపసమాహితము అయి తక్కిన 15 కళలను కూడా వెలిగించగలిగింది. అప్పుడు నీవు మనస్సు ప్రత్యుత్సాహము పొందగా వేద మంగళ శ్లోకములు గుర్తుకు వచ్చి గానం చేయగలుగుచున్నావు.<br>అన్నము తినగానే మనస్సు ఉత్తేజము పొందసాగుతోంది. కనుక<br>❀ మనస్సు - అన్నమయము (తస్మాత్ అన్నమయం మనః)<br>❀ ప్రాణము - ఆపో (జల) మయము<br>❀ తేజస్సు - వాక్మయము<br>అని అర్థము చేసుకొనెదవు గాక। |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - షష్ఠాధ్యాయే సప్తమః ఖండః

# 6-8. అష్టమః ఖండః - సత్‌యే జీవులకు మూలము

| | | |
|---|---|---|
| 1. | <u>ఉద్దాలకో హ ఆరుణిః</u><br><u>శ్వేతకేతుం పుత్రం ఉవాచ</u><br>"స్వప్నాన్తం మే సోమ్య! విజానీహి ఇతి।<br>యత్ర ఏతత్ పురుషః<br>స్వపితి నామ సతా, సోమ్య!<br>తదా సంపన్నో భవతి।<br>స్వమపీతో భవతి।<br>తస్మాత్ ఏనగ్ం స్వపితి, ఇతి ఆచక్షతే<br>స్వగ్ం హి అపీతో భవతి॥ | శ్వేతకేతువు : తండ్రీ! 'స్వప్నము' రూపము ఎట్టిది?<br><br>ఉద్దాలకుడు : కుమారా! శ్వేతకేతా!<br><br>ఇప్పుడు ఇక నీకు స్వప్నము యొక్క స్వరూపము ఏమిటో వివరిస్తాను. స్వప్న పురుషకారము గురించి విను.<br><br>జాగ్రత్‌లో దృశ్యము పొందుచున్నట్టి ఈ పురుషుడు (జీవుడు), అట్టి దృశ్యము యొక్క భౌతికమైన ఇంద్రియములద్వారా - ఆస్వాదనము విరమించి, స్వప్నస్థితిని స్వీకరిస్తున్నాడు.<br><br>స్వప్నస్థితిలో (ఇంద్రియములను ఉపయోగిస్తున్నప్పుడు కనిపిస్తూ ఉన్న) భౌతిక జాగ్రత్ జగత్ దృశ్యమునుండి విడివడి ఉంటున్నాడు కాబట్టి - తనయందు తానే ఉనికి పొందుచున్నాడు. అందుచేత "స్వమపి" గా అగుచున్నాడు. అందుచేత 'స్వపితి' - స్వం అపీతః - తన స్వరూపము తానే త్రాగువాడు - అగుచున్నాడు. తనయందు తాను ఏకము అగుచున్నాడు. |
| 2. | స యథా శకునిః సూత్రేణ<br>ప్రబద్ధో దిశమ్ దిశమ్ పతిత్వా<br>అన్యత్ర ఆయతనం అలబ్ధ్వా<br>బన్ధనమేవా ఉపశ్రయత।<br>ఏవమేవ ఖలు సోమ్య।<br>తన్మనో దిశం దిశం పతిత్వా,<br>అన్యత్ర ఆయతనమ్ అలబ్ధ్వా<br>ప్రాణమేవ ఉపశ్రయతే।<br>ప్రాణబన్ధనం హి సోమ్య।<br>'మన' - ఇతి। | ఒక పంజరమునకు ఒక పక్షి యొక్క కాలును బారైన దారము (Long Thread) తో కట్టిన తరువాత, పంజరముయొక్క తలుపులు తీసిబెట్టినప్పటికీ ఆ పక్షి అటు దిక్కు, ఇటు దిక్కు ఎగిరి ఎగిరి, ఎటు వెళ్లలేక తిరిగి పంజరములోనే ప్రవేశిస్తుంది కదా! పంజరమును వదలి ఎటూ దూరంగా వెళ్లలేదు కదా!<br><br>ఓ సోమ్యా! అదే విధంగా మనస్సు కూడా 'ప్రాణము' అనే దారముతో బంధించబడి ఉన్నది. అందుచేత ఈ మనస్సు అటు - ఇటు తిరిగినా కూడా, బయట ఎక్కడా స్థిరమైన, నిశ్చలమైన ఆశ్రయము దొరకక, తిరిగి ప్రాణమునే ఆశ్రయించునదై ఉంటోంది.<br><br>అందుచేత - మనస్సు 'ప్రాణము' అనే బంధము కలిగియే ఉంటుంది. |
| 3. | అశనా పిపాసే మే, సౌమ్య!<br>విజానీ హి। ఇతి।<br>యత్ర ఏతత్ పురుషో<br>అశిశిషతి నామ 'ఆప' ఏవ।<br>తత్ అశితం నయన్తే<br>తత్ యథా గోనాయో<br>అశ్వనాయః, పురుషనాయ<br>ఇత్యేవం తదప ఆచక్షతే అశనాయ ఇతి।<br>తత్ర ఏతత్ శుంగమ్<br>ఉత్పతితగ్ం, సోమ్య! విజానీ హి<br>న ఇదం అమూలమ్ భవిష్యతి - ఇతి॥ | శ్వేతకేతువు : పితృదేవా! ఆకలి - దప్పికలు ఏతీరైనవి?<br><br>ఉద్దాలకుడు : ఆకలి దప్పికల గురించి చెప్పుచున్నాను. విను. ఈ జీవుడు ఆకలి పొందినప్పుడు అట్టివాడు తినుచున్నాడు. జలము చేతనే ఆహారము శరీరములోని అన్ని భాగములలోకి తీసుకొనిపోబడుతోంది. అందుచేత జలమును "అశితి" అని అంటారు. గోవులను తోలుకొని పోవు వానిని 'గోనాయ' అని, అశ్వములను తీసుకొనిపోవు వానిని అశ్వనాయ, సేనాపతిని 'పురుషనాయ' అంటారు కదా!<br><br>అట్లాగే ఆహారరసమును తీసుకొని శరీరములోనికి తీసుకుపోతుంది, కనుక 'అశనాయ' అని అంటారు.<br><br>ఓ శ్వేతకేతూ! మొక్కకు మూలము (వేరు) లేకుండా అంకురము (మొలక) రాదు కదా! |

| | | |
|---|---|---|
| | | అట్లాగే, 'జలము' చేతనే ఈ శరీరము యొక్క శుంగము (అంకురము) ఉత్పన్నమౌతోంది. అంకురము కార్యరూపముగా శరీరము రూపుదిద్దుకుంటోంది. కనుక మూలము (జలము) లేకుండా ఈ శరీరము ఉండజాలదు. |
| **4.** | **తస్య క్వ మూలం స్యాత్ అన్యత్రాత్**<br>**అన్నాత్ ఏవం ఏవ ఖలు సోమ్య!**<br>**అన్నేవ శుంగేన "ఆపో మూలమ్"**<br>**అన్విచ్ఛాత్ అద్భిః సోమ్య!**<br>**శుంగేన "తేజో మూలమ్" అన్విచ్ఛ।**<br>**తేజసా సోమ్య। శుంగేన**<br>**'సన్మూలమ్' అన్విచ్ఛ।**<br>**సన్మూలాః, సోమ్య! ఇమాః**<br>**సర్వాః ప్రజాః 'సత్'**<br>**ఆయతనాః సత్యప్రతిష్ఠాః ॥** | జలము కంటే వేరైన మూలము, కారణరూపము ఈ శరీరమునకు మరొకటేమున్నది? లేదు.<br><br>అన్నరూపమగు శుంగము (అంకురము) ద్వారా జలరూపమగు మూలము అన్వేషణం చేయి.<br><br>జలరూపమగు శుంగము (అంకురము) ద్వారా తేజముయొక్క మూలము అన్వేషించు.<br><br>తేజముయొక్క అంకురము (ఉత్పత్తి) ద్వారా 'సత్తు' మూలమును గుర్తించు.<br><br>ఈ జీవులంతా "సత్"యే మూలముగా కలిగియున్నారు.<br><br>సమస్త జనులకు 'సత్తు' ఆశ్రయము, ఆధారము కూడా। |
| **5.** | **అథ యత్ర ఏతత్ పురుషః**<br>**పిపాసతి నామ తేజ ఏవ**<br>**తత్ పీతం నయతే, తత్ యథా,**<br>**గోనాయో అశ్వనాయః, పురుషనాయ**<br>**ఇత్యేవం తత్ 'తేజ' ఆచష్ట ఉదన్యేతి।**<br>**తత్ర ఏతత్ ఏవ 'శుంగమ్'**<br>**ఉత్పతితం, సోమ్య।**<br>**విజానీహి న ఇదం**<br>**అమూలమ్ భవిష్యతి॥ ఇతి॥** | <u>ఇక ఇప్పుడు -</u><br><br>ఈ పురుషుడు దప్పిక (దాహము) పొంది నీరు త్రాగగానే ఆ జలమును తేజస్సు తీసుకొని పోవుచున్నది. అప్పుడు పిపాసతి - అనబడుచున్నాడు.<br><br>(గోవులు తోలుకెళ్లువాడు 'గోనాయ', అశ్వములను తోలుకెళ్లువాడు 'అశ్వనాయ', జనులను గొనిపోవువాడు 'పురుషనాయ' అనబడునట్లుగా) తేజస్సు జలమును తీసుకొనిపోవు ధర్మముచే 'ఉదన్య' - అనే పేరు కూడా పొందుచున్నది.<br><br>జలరూపమగు 'మూలము' చేతనే ఈ 'శరీరము' రూపమగు అంకురము ఏర్పడుతోంది. మూలము లేకుండా ఏదీ జనించదదు కదా! ఈ శరీరమునకు మూలము జలమే. |
| **6.** | **తస్య క్వ మూలం స్యాత్**<br>**అన్యత్ర అద్భ్యో అద్భిః, సోమ్య।**<br>**శుంగేన 'తేజో మూలమ్' అన్విచ్ఛ।**<br>**తేజసా సోమ్య। శుంగేన 'సన్మూలమ్' అన్విచ్ఛ।**<br>**సన్మలాః సోమ్య! ఇమాః సర్వాః**<br>**ప్రజాః 'సత్' ఆయతనాః, 'సత్' – ప్రతిష్ఠా।**<br>**యథా ను ఖలు,**<br>**సోమ్య। ఇమాః తిస్రోః దేవతాః**<br>**పురుషం ప్రాప్య, త్రివృత్।**<br>**త్రివృత్ ఏకైకా భవతి।**<br>**తదుక్తం పురుసాత్ ఏవ భవతి।** | జలముయొక్క పరిణామమే అయి ఉన్న ఈ శరీరమునకు వేరే మూలమేమున్నది?<br><br>జలముయొక్క మూలము 'తేజస్సు'ను గుర్తించు.<br><br>తేజో అంకురమునకు మూలము 'సత్' అని గుర్తించు.<br><br>ఈ జవులంతా 'సత్'యే మూలముగా ఆధారముగా కలిగి ఉన్నారు. 'సత్'యందే సమస్తము ప్రతిష్ఠము (Established) అయి ఉన్నది.<br><br>పుత్రా! ఏవిధంగా అయితే (తేజో-జల-అన్నములు)గా త్రివృత్ - త్రివృత్ "3×3" = 9 దేవతా పురుషరూపములు అగుచూ, ఏకమగు పరమాత్మగానే (ఆదిపురుషుడుగానే) ఉన్నారో అదివరకు చెప్పియున్నాను. |

| | | |
|---|---|---|
| | **అస్య, సోమ్య! పురుషస్య ప్రయతో** | ఈ జీవుడు ప్రకృతి సిద్ధదేహము త్యజిస్తున్నప్పుడు |
| | **వాక్–మనసీ సంపద్యతే।** | వాక్కు మనస్సునందు లయిస్తోంది. |
| | **మనః ప్రాణే** | మనస్సు ప్రాణమునందు లయిస్తోంది. |
| | **ప్రాణః తేజసి** | ప్రాణము తేజస్సునందు ఏకము అవుతోంది. |
| | **తేజః పరస్యాం – దేవతాయామ్।** | తేజస్సు పరమగు ఆత్మయందు లయము పొందుతోంది. |
| | | అట్టి పరమాత్మ తత్త్వము సూక్ష్మాతిసూక్ష్మము. |
| **7.** | **స య ఏషో అణిమ ఏతత్**<br>**ఆత్మ్యమ్ ఇదం।**<br>**సర్వం। తత్ సత్యం।**<br>**స ఆత్మా తత్త్వమసి, శ్వేతకేతో। ఇతి।** | ఈ విధంగా ఈ కనబడే సర్వము ఆత్మయే। అట్టి ఆత్మయే సత్యము. ఓ శ్వేతకేతూ। ఆ 'ఆత్మ' అనబడేది 'నీవే' అయి ఉన్నావు. |
| | <u>**శ్వేతకేతువు :**</u><br>**భూయ ఏవ మా, భగవాన్।**<br>**విజ్ఞాపయతి – ఇతి।**<br><u>**ఉద్దాలకుడు :**</u><br>**తథా, సోమ్య! ఇతి – హోవాచ।** | **శ్వేతకేతువు :** హే భగవాన్! మీరు నాకు చెప్పుచున్న 'తత్త్వమసి' అనే విషయము (లేక) మహావాక్యము నాయొక్క సునిశ్చిత, అనునిత్య, అప్రతిహత, నిస్సందేహ స్వానుభవము కొరకై మరింతగా బోధించమని అర్థిస్తున్నాను.<br>**ఉద్దాలక మహర్షి :** బిడ్డా! సరే! చెపుతాను విను. |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - షష్ఠాధ్యాయే అష్టమః ఖండః**

# 6-9. నవమః ఖండః - తత్త్వమసి!

**ఆరుణి :**

1. **యథా, సోమ్య!**
**మధు మధుకృతో నిస్తిష్ఠన్తి,**
**నానాత్యయానాం వృక్షాణాం**
**రసాన్ సమవహారమ్**
**ఏకతాం రసం గమయన్తి।**

ఉద్దాలకుడు : కుమారా! సమస్తము పరమాత్మయొక్క స్వయం ప్రదర్శనా చమత్కారమే - అని మనం సుస్పష్టం చేసుకోవటానికి దృష్టాంతాలు కొన్ని చెపుతాను విను.

కొన్ని తేనెటీగలు - అనేక వృక్షాల పూలమొక్కలను సమీపించి పూవులపై వ్రాలి, రసమును గ్రహించి, తేనెపట్టులో తేనెను తయారుచేసి ఉంచుతున్నాయి. ఏ తేనె బొట్టు ఏ వృక్షం నుండి లభించిందో తెలుసుకోగలమా? లేదు కదా! తేనె అంతా ఒకటే అయి ఉన్నది కదా!

---

2. **తే తథా తత్ర స వివేకం**
**లభన్తే 'అముష్య అహం'**
**వృక్షస్య రసోఽస్మి అముష్యాహం**
**'వృక్షస్య రసో అస్మి।'**
**ఇతి ఏవ ఖలు।**

ఆ తేనె బొట్టుకు - "నేను ఈ వృక్షం నుండి వచ్చాను. ఆ వృక్షం నుండి వచ్చాను" - అనేది ఏమాత్రము తెలియటము లేదు కదా।

---

**ఆరుణి:**
**సోమ్య! ఇమాః సర్వాః ప్రజాః**
**సతి సంపద్య న విదుః "సతి-**
**సమ్పద్యామ్ అహమ్" ఇతి॥**

అదే విధంగా ఈ జీవులంతా కూడా 'సత్తు' నుండి బయలుదేరి 'సత్' నే పొందుచూ కూడా, 'సత్' గురించి "మేము సత్తును సర్వదా పొందియే ఉంటూ, సత్ స్వరూపమే అయి ఉన్నాను" - అనునది దృష్టిలో లేకయే ఉంటున్నారు.

---

3. **త ఇహ వ్యాఘ్రో వా,**
**సింహో వా, వృకో వా, వరాహో వా,**
**కీటో వా, పతంగో వా,**
**దంశో వా, మశకో వా**
**యద్యత్ భవన్తి, తదా భవన్తి॥**

'సత్'యే సమస్తము అయి ఉండి కూడా, అట్టి కేవలమగు సత్స్వరూపదేవత ఎప్పుడు ఎట్లా అవాలని భావిస్తుందో - అట్లాగే పులిగానో, సింహముగానో, తోడేలుగానో, పందిగానో, కీటకముగానో శీతాకోక చిలుకగానో, అడవి ఈగగానో, దోమగానో అగుచున్నది. తన కల్పనయందు తానే ప్రవేశించి తాను కల్పించుకొన్న రూపములను తానే నిరాటంకముగా ధారణ చేస్తున్నది. అయితే తన సత్ స్వరూపము వీడకయే ఉన్నది.

---

4. **స య ఏషో 'అణిమ'**
**ఏతత్ 'ఆత్మ్యమ్' ఇదం సర్వం।**
**తత్ సత్యగ్ం। స ఆత్మా।**
**తత్త్వమసి, శ్వేతకేతో। ఇతి।**
**శ్వేతకేతువు :**
**భూయ ఏవ మా భగవాన్।**
**విజ్ఞాపయతు। ఇతి।**
**ఆరుణి :**
**తథా సోమ్యా!**
**ఇతి హో వాచ॥**

ఒక అణువు దగ్గరి నుండి ఏదేది ఉన్నదిగా కనిపిస్తూ అనిపిస్తూ ఉన్నదో - అట్టి సమస్తము ఆత్మయే "ఇన్ని రూపములుగా అగుచూ ఉన్నది. సర్వదా సమస్తము తానే అగుచున్న ఆత్మమాత్రమే సత్యము. తదితరమైనదంతా కల్పన.

ఓ శ్వేతకేతూ! ఇంకొక ముఖ్యమైన, అసలైన సత్యము విను. పరమసత్యమగు, ఈ సమస్తము తానే అయి ఉంటున్న దానినే 'ఆత్మ' అంటున్నారు. ఆత్మయే సత్యము. అంతేకాదు అట్టి 'ఆత్మ' నీవే అయి ఉన్నావు. ఇదియే వేదవాక్కు। తత్త్వజ్ఞానము. ఉపనిషత్ వాణి।

**శ్వేతకేతువు** : అట్టి నేనే అయి ఉన్న పరమసత్యమగు పరమాత్మ గురించి ఇంకా వినాలని ఉన్నది. స్వామి! పితృదేవా! ఇంకా వివరించి చెప్పండి!

**ఉద్దాలకుడు** : సరే! మరికొంతగా సత్యము, ఆత్మ అయి ఉన్న దాని గురించి చెప్పుకుందాము. విను.

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - షష్ఠాధ్యాయే నవమః ఖండః

# 6-10. దశమః ఖండః - ఆత్మతత్త్వము - నది దృష్టాంతము

<u>ఆరుణి :</u>

1. **ఇమాః సోమ్య! నద్యః పురస్తాత్
ప్రాచ్యః స్యందన్తే।
పశ్చాత్ ప్రతీచ్యస్తాః సముద్రాత్
సముద్రం ఏవ అపియన్తి
స సముద్ర ఏవ భవతి,
తా యథా తత్ర న విదుః,
"ఇయమ్ అహమస్మి।
ఇయమ్ అహమస్మి" ఇతి।**

ఉద్దాలకుడు : సోమ్యా! శ్వేతకేతు! మరొక దృష్టాంతం సహాయంతో సత్యమగు ఆత్మగురించిన మరికొంత విశేషము చెప్పుకుందాము. నదులు చూడు। కొన్ని తూర్పుగా ప్రవహించి, అలా అలా సముద్రంలో జేరుచున్నాయి. మరికొన్ని పడమరదిక్కుగా ప్రవహించి సముద్రంలో జేరుచున్నాయి.

సముద్రంలో నదుల జలము ప్రవేశించిన తరువాత "నేను ఈ నదీ జలమును। ఆ పేరుగల నదీజలము అనేది ఏమైనా తెలుస్తోందా? లేనే లేదు కదా! సముద్ర జలంలో ఏ జలం ఏ నది నుండి వచ్చిందనే గుర్తింపు ఏమున్నది?

---

2. **ఏవం ఏవ ఖలు సోమ్య!
ఇమాః సర్వాః ప్రజాః,
సత-ఆగమ్య (ఆగత్య) న విదుః
సత ఆగచ్ఛామ్ అహమ్ ఇతి।
త ఇహ వ్యాఘ్రో వా
సింహో వా, వృకో వా, కీటో వా,
పతంగో వా, దగ్ంశో వా,
మరకో వా - యద్యత్ భవన్తి,
తదా భవన్తి।**

అట్లాగే ఈ జీవులంతా 'సత్' నుండీ బయలుదేరి ప్రదర్శనమగుచూ కూడా - 'నేను సర్వత్రా సమస్వరూపమై, సమస్తము అయి ఉన్న 'సత్త' నుండే వచ్చాను'' - అనునది లోకదృష్టిగా తెలియనట్లే అయి ఉంటోంది.

సత్ నుండే బయలుదేరి సత్ స్వరూపుడే సర్వదా అయి ఉండి కూడా - ఈ జీవుడు ఇక్కడ దృశ్యములో పులిగానో, సింహముగానో, తోడేలుగానో, కీటకము (చీమ) గానో, పతంగము (ఎగిరే తేనెటీగ) గానో, అడవి ఈగగానో ఏది అవాలనుకొంటే అదిగా అగుచూ 'సత్' యందు భావనగా సంచారములు పొందుచున్నారు.

---

3. **స య ఏషో అణిమా
ఏతత్ "ఆత్మ్యమ్
ఇదమ్ సర్వమ్"।
తత్ సత్యమ్। స ఆత్మా।
తత్ త్వమ్ అసి, శ్వేతకేతో। ఇతి।।**
**<u>శ్వేతకేతువు :</u> "భూయ ఏవ మా
భగవాన్। విజ్ఞాపయతు ఇతి।
<u>ఆరుణి :</u> తథా 'సోమ్య!'
ఇతి హో వాచ।।**

అట్టి అతి సూక్ష్మాతిసూక్ష్మమగు ఆత్మయే ఈ సర్వముగా అయి ఉంటోంది. అదియే సత్యము। ఏది సత్యామో అదియే సత్। ఏది సత్‌యో అదియే ఆత్మ। ఏది ఆత్మయో అదియే నీవు। నిత్యము అయి ఉన్నావు.

శ్వేతకేతువు : ఈ సమస్తము ఆత్మయే అయి, అట్టి ఆత్మయే నేనై ఉన్న సత్యము (సత్) గురించి ఇంకా వినాలని ఉంది. ఓ గురుదేవా! పితృదేవా! మరికొంత వివరిస్తూ, వర్ణించి చెప్పండి.

ఉద్దాలకుడు : ఇంకా కూడా చెప్పుకుందాము విను.

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - షష్ఠాధ్యాయే దశమః ఖండః

# 6-11. ఏకాదశః ఖండః - ఆత్మతత్త్వము - వృక్ష దృష్టాంతము

**ఆరుణి :**

1. **అస్య, సోమ్య! మహతో వృక్షస్య**
**యో 'మూలే" అభ్యాహన్యాత్ జీవన్।**
**స్రవేద్యో "మధ్యే" అభ్యాహన్యాత్ జీవన్।**
**స్రవేద్యో "అగ్రే" అభ్యాహన్నాత్ జీవన్।**
**స్రవేత్స ఏష జీవేన "ఆత్మన" అను ప్రభూతః**
**పేపీయమానో, మోదమానః తిష్ఠతి॥**

ఉద్దాలకుడు : ఒక మహావృక్షము యొక్క ఒక కొమ్మను ఖండిస్తే, అది రసము స్రవిస్తూ, మిగిలిన కొమ్మలు, వృక్షము జీవిస్తూనే ఉంటుంది. మధ్యభాగముగాని, అగ్రభాగముగాని ఖండించినా కూడా, మిగిలిన భాగము జీవిస్తూ, రసము స్రవిస్తూ ఉంటుంది. వృక్షము జీవిస్తూనే, జీవాత్మత్వము కొనసాగుతూ జలపానము చేస్తూ ప్రమోదము, ఆనందము కొనసాగిస్తూ, వృద్ధిని కలిగియే ఉంటోంది.

---

2. **అస్య యత్ ఏకాగ్ం శాఖాం జోవో జహాతి।**
**అథ సా శుష్యతి।**
**ద్వితీయాం జహాత్।**
**అథ సా శుష్యతి।**
**తృతీయం జహాతి। అథ సా శుష్యతి।**
**సర్వం జహాతి। సర్వః శుష్యతి।**
**ఏవం ఏవ ఖలు సోమ్య।**
**విద్ధి। ఇతి హోవాచ॥**

వృక్షజీవుడు వృక్షముయొక్క శాఖను వీడినప్పుడు - ఆ శాఖ శుష్కించి పోవుచున్నది. జీవత్వముచే వృక్షజీవుడు రెండవ శాఖను కొనసాగింప జేయుచున్నాడు. అది విడిస్తే, మూడవశాఖను కూడా విడిస్తే ఆ మూడవ శాఖ శుష్కిస్తూ ఉన్నాయి. మొత్తము వృక్షమును వృక్షజీవుడు త్యజించినప్పుడు వృక్షమంతా శుష్కిస్తోంది. అట్టి జీవరసమే ఆత్మతత్త్వము అను గమనించు.

---

3. **జీవాపేతం వావ కిల**
**ఇదం మ్రియతే, న జీవో మ్రియత। ఇతి।**
**స య ఏషో అణిమై**
**తదాత్మ్యమ్ ఇదగ్ం సర్వం।**
**తత్ సత్యగ్ం। స ఆత్మా।**
**తత్ త్వమ్ అసి**
**శ్వేతకేతో! ఇతి।**

**<u>శ్వేతకేతువు :</u>**
**భూయ ఏవ మా భగవాన్।**
**విజ్ఞాపయతు ఇతి।**
**<u>ఆరుణి :</u> తథా। సోమ్య।**
**ఇతి హో వాచ।**

అదేవిధంగా జీవుడు ఈ దేహమును త్యజించినప్పుడు దేహము నశిస్తోంది. కానీ 'జీవుడు', ఆతని 'జీవనము' ఈ రెండూ నశించటము లేదు. అట్టి జీవుని ఆత్మ చైతన్యము అత్యంత సూక్ష్మము. అట్టి సూక్ష్మమగు ఆత్మయే ఈ కనబడేదంతా।

అట్టి ఆత్మయే సత్యము। సత్యము నాశనము లేనిది, నిత్యమైనదే ఆత్మ। అట్టి ఆత్మయే నీవై ఉన్నావు.

శ్వేతకేతువు : మహనీయా! సంతోషము, ఇంకా కూడా వివరించి, నాకు తెలియజేయ ప్రార్థన.

ఉద్దాలకుడు : సరేఁ! సోమ్య! ఇంకొంత వివరిస్తాను. విను.

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - షష్ఠాధ్యాయే ఏకాదశః ఖండః

# 6-12. ద్వాదశః ఖండః - ఆత్మతత్త్వము - మఱ్ఱిగింజ దృష్టాంతము

**ఆరుణి :**

**1.** **న్యగ్రోధ ఫలమ్ అత ఆహరేతి।**
**ఇదమ్ భగవ।**
**ఇతి భిన్ధీతి।**
**భిన్నమ్ భగవ - ఇతి।**
**కిమ్ అత్ర పశ్యసి? ఇతి।**
**అణ్వ్య ఇవ ఇమే ధానా,**
**భగవ! ఇత్యాసాం అంగైకాం భిన్ధీతి।**
**భిన్నా భగవ ఇతి।**
**కిమ్ అత్ర పశ్యసి? ఇతి।**
**"న కించన భగవ!" ...ఇతి।**

ఉద్దాలక మహర్షి : నాయనా! శ్వేతకేతూ అదిగో। ఆ మఱ్ఱి చెట్టు ఉన్నది కదా! ఒక మఱ్ఱి పండును ఇట్లా తీసుకురా.

ఉద్దాలక మహర్షి : ఏదీ! ఈ మఱ్ఱిపండును చీల్చు.

శ్వేతకేతువు : భగవాన్। ఇదిగో। చీల్చాను.

ఉద్దాలక మహర్షి : ఇప్పుడు ఇందులో ఏమి కనిపిస్తోంది?

శ్వేతకేతువు : ఇందులో అణువువంటి చిన్న చిన్న గింజలు కనిపిస్తున్నాయి, భగవాన్।

**ఉద్దాలకమహర్షి** : ఆ గింజను కూడా పగలగొట్టు.

**శ్వేతకేతువు** : ఈ చిన్న గింజను కూడా పగలగొట్టాను.

ఉద్దాలకుడు : ఆ చిన్నగింజను పగలగొట్టి చూస్తే ఇంకా నీకేమి కనిపించింది?

**శ్వేతకేతువు** : భగవాన్! నాకు ఇంక ఏమీ కనిపించటము లేదు.

---

**2.** **తం హోవాచ (ఆరుణి ఉవాచ) :**
**యం వై సోమ్య। ఏతమ్ అణిమానం**
**న నిభాలయస ఏతస్య వై, కిల సోమ్య।**
**ఏషో అణిమ్న ఏవం**
**మహాన్ న్యగ్రోధః తిష్ఠతి॥**
**శ్రద్ధత్స్వ సోమ్య! ఇతి।**

**ఉద్దాలక మహర్షి** : చిన్న గింజను చీల్చితే నీకు ఏదీ కనిపించటము లేదు. అత్యంత సూక్ష్మ భాగమేదో నీకు కనిపించటము లేదు. అట్టి కంటికి ఏ మాత్రము కనిపించిన సూక్ష్మాతి సూక్ష్మభాగమునుండి అనేక శాఖలు, ఫలములు, ఆకులుగల సువిశాలమైన మఱ్ఱి మహావృక్షము పుట్టుకువస్తోంది. మహావృక్షముయొక్క ఆకారములు తదితర వస్తు ధర్మములు అట్టి మఱ్ఱి సూక్ష్మ గింజలోని ఖాళీ స్థానములోనుండి, కాలక్రమంగా అంతటా ప్రదర్శనమౌచున్నాయి.

---

**3.** **స య ఏషో 'అణిమ' ఏతత్**
**ఆత్మ్యమ్ ఇదమ్ సర్వం**
**తత్ సత్యం। స ఆత్మా।**
**తత్ త్వమ్ అసి, శ్వేతకేతో। ఇతి।**
**శ్వేతకేతువు : భూయ ఏవ, మా భగవాన్।**
**విజ్ఞాపయతి ఇతి।**
**ఆరుణి : తథా సోమ్య ఇతి!**
**హో వాచ॥**

అట్టి సూక్ష్మాతిసూక్ష్మమగు ఆత్మాకాశ సూక్ష్మ విభాగంలో ఈ సమస్త సువిశాల బ్రహ్మాండమంతా తిష్ఠితమైయుండి, కాలక్రమేణా ప్రదర్శనము అవుతోంది.

ఎట్టి సూక్ష్మాతిసూక్ష్మ విభాగ చమత్కారము నుండి ఈ బ్రహ్మాండాలన్నీ బయల్వెడలుచున్నాయో అదియే **- సత్యము (యత్ - సత్)! అదియే ఆత్మ।**

**ఓ శ్వేతకేతూ! అట్టి ఆత్మయే నీ సత్యస్వరూపము। నీవే అయి ఉన్నావు। ఇది ఆత్మజ్ఞుల, వేదముల నిర్వచన సారము.**

శ్వేతకేతువు : భగవాన్! ఇంకా కూడా మీ వద్ద మహానంద స్వాభావికమగు ఆత్మగురించి తెలుసుకోగోరుచున్నాను.

ఉద్దాలక మహర్షి : సరే! మరికొంతగా చెప్పుకుందాము.

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - షష్ఠాధ్యాయే ద్వాదశః ఖండః

# 6-13. త్రయోదశః ఖండః - ఆత్మతత్త్వము - లవణం దృష్టాంతం

| | |
|---|---|
| **ఆరుణి :**<br>**1.** **లవణమ్ ఏతత్ ఉదకే**<br>**అవధాయ అథ మా ప్రాతః**<br>**ఉపసీదథా ఇతి॥**<br>**స హ తథా చకార**<br>**తం హోవాచ : (ఆరుణీ ఉవాచ)**<br>**యద్దోషా లవణమ్ ఉదకే**<br>**అవాధా (అబాధా) అంగ తత్ ఆహః ఏతి।**<br>**తత్ ధావమృశ్య న వివేద** | ఉద్దాలక మహర్షి : ఓ ప్రియ శ్వేతకేతూ! కొంచము ఉప్పు తీసుకురా. ఆ ఉప్పురాళ్ళను నీటిలో వేయి. తెల్లవారిన తరువాత నా దగ్గరకు రా. మాట్లాడుకుందాము.<br>(అప్పుడు శ్వేతకేతువు ఉప్పును ముంచి నీళ్ళలో వేసారు. ఆ మరునాడు తెల్లవారిన తరువాత ఉదయం తిరిగి పితృదేవుల సమక్షానికి వచ్చారు.)<br>శ్రీ ఉద్దాలకుడు : శ్వేతకేతూ! రాత్రివేళ నీళ్లల్లో ఉప్పు వేశావు కదా! అదే ఉప్పు ఆ నీళ్లలోనుండి తీసుకునిరా!<br>నీళ్లలో వెతికినా కూడా ఉప్పు గడ్డలు కనిపించనేలేదు.<br>శ్వేతకేతు : ఆ ఉప్పుగడ్డలు నీళ్లలో విలీనమై పోయినాయి. |
| **2.** **యథా విలీనం ఏవ అంగ**<br>**అస్య అన్తాత్ ఆచామ్ ఏతి।**<br>**కథమ్ ఇతి?**<br>**శ్వేతకేతువు : లవణమ్ ఇతి।**<br>**ఆరుణి : మధ్యాత్ ఆచామేతి!**<br>**కథమితి?**<br>**శ్వేతకేతువు : లవణం ఇతి।**<br>**ఆరుణి : అంతాత్ ఆచామేతి।**<br>**కథమితి?**<br>**శ్వేతకేతువు : లవణమ్ ఇతి।**<br>**ఆరుణి : అభిప్రాస్యై, తత్ అథమ్**<br>**ఉపసీదథా ఇతి।**<br>**తద్ధ తథా చకార। తత్ శశ్వత్ సంవర్తతే।**<br>**తం హోవాచ (ఆరుణీ ఉవాచ) : అత్ర వావ కిల**<br>**'సత్' సోమ్య! న నిభాలయసే**<br>**అత్రైవ కిల। ఇతి॥** | ఉద్దాలక మహర్షి : సరే! ఉప్పు ఏమైనాగానీ, నీళ్ల పైపై రుచి ఎట్లా ఉన్నదో? అది గమనించు.<br>శ్వేతకేతు : నీరు ఉప్పగా ఉన్నది.<br>ఉద్దాలకుడు : అడుగున (క్రిందగా) రుచి చూచి చెప్పు.<br>శ్వేతకేతు : ఉప్పగానే ఉన్నది.<br>ఉద్దాలకుడు : ఆ నీరు ఆవల పారబోసి నా దగ్గరకురా!<br>శ్వేతకేతువు ఆ ఉప్పగా ఉన్న నీరు ఆవల పారబోసి తండ్రి దగ్గరకు వచ్చాడు.<br>ఉద్దాలకుడు : నీవు నీటిలో వేసిన ఉప్పు నీటిలో ఎక్కడ ఉండి ఉన్నది?<br>శ్వేతకేతు : నీటిలో కలిసిపోయి అంతటా ఉండి ఉన్నది.<br>ఉద్దాలకుడు : నీటిలో ఉప్పు కలిసిపోయి, ఉప్పు చేతికి దొరకక, రుచిగా మాత్రమే తెలియవచ్చింది చూచావా? అట్లాగే సత్‌రూపమగు బ్రహ్మము సర్వత్రా నిండి ఉన్నప్పటికీ కళ్లకు కనపించటం లేదు. స్థూలమైన "ప్రత్యక్షము" మొదలైన ప్రమాణములకు తెలియరావటం లేదు. |
| **3.** **స య ఏషో అణిమ ఏతత్ 'ఆత్మ్యమ్'**<br>**ఇదగ్ం సర్వం। తత్ సత్యం।**<br>**స ఆత్మా। తత్ త్వమ్ అసి, శ్వేతకేతో । ఇతి।**<br>**శ్వేతకేతువు : భూయ ఏవ మా భగవాన్**<br>**విజ్ఞాపయతు ఇతి।**<br>**ఆరుణి : తథా సోమ్య!**<br>**ఇతి హోవాచ॥** | అట్టి సూక్ష్మమగు 'సత్' చేతనే (నీళ్లల్లో కరిగిన ఉప్పువలె) ఈ సమస్తము తదాత్మ్యము కాబడి ఉన్నది. అటి సత్ యే సత్యము. ఆ సత్యమే ఆత్మ। ఓ శ్వేతకేతూ! అట్టి ఆత్మయే నీవై ఉన్నావు.<br>శ్వేతకేతు : భగవాన్! అట్టి నా ఆత్మస్వరూపం గురించి ఇంకా కొంత చెప్పండి.<br>శ్రీ ఉద్దాలక మహర్షి : సరే! ఇంకా చెపుతాను. విను. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - షష్ఠాధ్యాయే త్రయోదశః ఖండః

# 6-14. చతుర్దశః ఖండః - ఆత్మతత్త్వము - దొంగలచే బంధింపబడినవాని దృష్టాంతము

| | |
|---|---|
| <u>ఆరుణి :</u><br>1. యథా, సోమ్య! పురుషం గాంధారేభ్యో<br>అభినద్ధ అక్షమానీయ తం తతో<br>అతిజనే విసృజేత్ స యథా తత్ర ప్రాఙ్వోదఙ్ వాధరాఙ్ వా<br>ప్రత్యఙ్ వా ప్రధ్మాయీ త<br>అభినద్ధాక్ష ఆనీతో। అభినద్ధాక్షో విసృష్టః॥ | శ్రీ ఉద్దాలక మహర్షి : ఒకసారి కొందరు దొంగలు గాంధర దేశము నుండి ఒక వ్యక్తి కళ్లకు గంతలు కట్టి తీసుకొనివచ్చి ఎక్కడో ఒక మహారణ్యంలో విడచి పెట్టి వెళ్లిపోయారు.<br><br>అప్పుడు ఆ కీకారణ్యంలో కళ్లు కట్టివేయబడి "అయ్యా! ఎవ్వరైనా దగ్గరలో ఉన్నారా? నా కనులకు గంతలు కట్టి ఇక్కడ ఎక్కడో పడవేశారు. కనులు కనిపించటం లేదు'' - అని ఏడవటం ప్రారంభించాడు. |
| 2. తస్య యథా అభినహనం<br>ప్రముచ్య ప్రబ్రూయాత్ ఏతాం<br>దిశం గన్ధారా, ఏతాం దిశం వ్రజేతి।<br>స గ్రామాత్ గ్రామం పృచ్ఛన్ పండితో<br>మేధావీ గన్ధారానేవ ఉపసంపద్యేత్। | ఎవ్వరో బాటసారులు ఆతని కేకలు విన్నారు. కట్లు విప్పి కనులకు గంతలు తొలగించారు. "ఎటు వెళ్లాలి?'' అని అడిగి **"ఇదిగో! ఈ దిశగా ఈ బాటగా వెళ్ళండి. మీరు మీ గాంధార దేశం తిరిగి చేరగలరు"** - అని త్రోవ చూపించారు.<br><br>ఆతడు పండితుడు, మేధావి, అవటంచేట త్రోవలో ఆయా బాటసారులను, ఆయా గ్రామ యజమానులను అడుగుచూ, త్రోవ తెలుసుకుంటూ చివరికి గాంధార దేశం చేరాడు. తిరిగి తన ఇంటికి సుఖంగా చేరాడు. |
| ఏవం ఇవ ఇహ ఆచార్యవాన్ పురుషో వేద<br>తస్య తావత్ ఏవ చిరం,<br>యావత్ న విమోక్ష్యే<br>అథ సంపత్స్య। ఇతి। | అదేవిధంగా సంసారారణ్యంలో కామ - క్రోధ - లోభ - మోహ ఇత్యాది దొంగలు సంసారాంధకారములో పడవేయగా, ఈ జీవుడు తన సంసార బాధలను గమనించి అరచి, శాస్త్రములచే గంతలు తొలగించబడుచున్నాడు. ఆచార్యులవారిని దర్శించి, ప్రయత్నశీలుడై సత్యమును ఎరిగి ముక్తిని సిద్ధించుకొంటున్నాడు. |
| 3. స య ఏషో 'అణిమా' ఏతత్<br>'ఆత్మ్యమ్' ఇదం సర్వమ్।<br>తత్ సత్యమ్। స ఆత్మా।<br>తత్ త్వమసి - శ్వేతకేతో! ఇతి॥<br><u>శ్వేతకేతువు :-</u><br>భూయ ఏవ మా భగవాన్ విజ్ఞాపయతు ఇతి।<br><u>ఉద్దాలకారుణి:</u><br>తథా సోమ్య!<br>ఇతి - హోవాచ॥ | అట్టి సాంసార జీవుడు చేరు స్వస్థానమ్ అతి సూక్ష్మాతిసూక్ష్మమగు ఆత్మ। అట్టి ఆత్మయే ఈ సమస్తము అయి ఉన్నది. అట్టి ఆత్మయే సత్యము. సత్యమగు ఆత్మయే నీవై ఉన్నావు. ఇదియే వేద హృదయం। ఉపనిషత్ వాణి।<br><br>శ్వేతకేతువు : తండ్రీ! భగవాన్! ఇంకా కూడా ఆత్మ గురించి మరికొంత నాకు తెలియజేయండి.<br><br>శ్రీఉద్దాలక మహర్షి : బిడ్డా! ఇంకా కూడా చెపుతాను. విను.<br><br>(అరుణి పుత్రుడు ఆరుణి ఉద్దాలకుడు అని పేరు. ఆయన కుమారుడు శ్వేతకేతువు). |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - షష్ఠాధ్యాయే చతుర్దశః ఖండః

## 6-15. పంచదశః ఖండః - ఆత్మతత్త్వము - మరణశయ్యపై ఉన్నవాని దృష్టాంతము

**ఆరుణి :**

**1.** **పురుషం సోమ్య! అత ఉపతాపినం జ్ఞాతయః పర్యుపాసతే - "జానాసి మాం? జానాసి మాం?" ఇతి। తస్య యావత్ న వాక్ - మనసి సంపద్యతే, మనః ప్రాణే, ప్రాణః తేజసి తేజః పరస్యాం దేవతాయం తావత్ జానాతి॥**

ఉద్దాలక మహర్షి : ఒకానొకడు వ్యాధిపీడితుడై మరణశయ్యపై ఉన్నప్పుడు - ఆతని బంధువులు "ఇదిగో! నన్ను గుర్తుపట్టావా? నేనెవరు? నేనెవరు? ఈతడెవరు?" అని అడుగుచూ ఉంటారు. "నా గుర్తు నీకు ఉన్నదా?" అని పలుకరిస్తూ ఉంటారు.

ఆతని వాక్కు మనస్సునందు, మనస్సు ప్రాణమునందు, ప్రాణము తేజస్సునందు, తేజస్సు ఆవలదగు పరదేవతా స్వరూపమునందు ఏకమవనంతవరకు గుర్తు పడతాడు.

(ఇక ఆతడు ఆ తరువాత ఎవ్వరినీ గుర్తుపట్టడు)

- బంధువు, అయినవాడు మొదలైన గుర్తులు ఆతనికి ఇక ఉండవు.

---

**2.** **అథ యదా అస్య వాక్ - మనసి సంపద్యతే, మనః - ప్రాణే, ప్రాణః తేజసి, తేజః పరస్యాం దేవతాయామ్ - అథ న జానాతి॥**

ఆ తీరుగా వాక్కు మనస్సునందు, మనస్సు ప్రాణమునందు, ప్రాణము తేజస్సునందు, తేజస్సు ఆత్మయందు లయము పొందుచున్నదో అట్టి ఆత్మ జగదృష్టిచే కప్పబడినవి తొలగుచుండగా ఆతడిక బంధువులను గుర్తుపట్టడు.

---

**3.** **స య ఏషో "అణిమా" ఏతత్ ఆత్మ్యమ్ - ఇదమ్ సర్వం। తత్ సత్యం। స ఆత్మా। తత్త్వమసి - శ్వేతకేతో! ఇతి।**

**శ్వేతకేతువు :**

**భూయ ఏవ మా భగవాన్ విజ్ఞాపయతు ఇతి।**

**ఆరుణి :**

**తథా సౌమ్య! ఇతి హో వాచ।**

అట్టి సూక్ష్మమగు ఆత్మయే ఈ సమస్తము. అదియే సత్యము. సత్యమైనదే ఆత్మ. ఓ శ్వేతకేతూ! అట్టి ఆత్మ నీవే అయి ఉన్నావు. తత్ త్వమ్ అసి।

శ్వేతకేతువు : భగవాన్! ఇంకా కూడా 'ఆత్మ' గురించి (అనగా సహజ స్వరూపము గురించి) ఇంకా ఇంకా కూడా బోధించ ప్రార్థన.

ఉద్దాలక మహర్షి : సరే! ఇంకా విను.

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - షష్ఠాధ్యాయే పంచదశః ఖండః**

# 6-16. షోడశః ఖండః - ఆత్మ విజ్ఞానిని దృశ్యము బంధించలేదు

**ఆరుణి (ఉద్దాలకుడు):-**

**1.** **పురుషం సోమ్య! ఏత**
**హస్త గృహీత మానయన్తి**
**అపహార్షీత్ స్తేయమ్ అకార్షీత్**
**పరశుమ్ అస్మై తపతి ఏతి।**
**స యది తస్య కర్తా భవతి,**
**తత ఏవ అనృతమ్ ఆత్మానం**
**కురుతే, సో అనృత-అభిసంధో**
**అనృతేన ఆత్మానమ్ అంతర్ధాయ**
**పరశుం తప్తం ప్రతిగృహ్ణాతి,**
**స దహ్యతే, అథ హన్యతే॥**

ఉద్దాలకుడు : ఒకనిపై దొంగతనము ఆపాదించబడినది. కానీ ఆతడు "నేను దొంగతనము చేయలేదు" - అని చెప్ప ప్రారంభించాడు. అప్పుడు ఇనుప కడ్డీ కాల్చి "తాకి-ప్రమాణము చేయి" అని ఊరి పెద్దలచే సత్య-అసత్య నిరూపణకై నిర్దేశించబడింది. ప్రమాణముయొక్క ప్రయోజనంగా →

- దొంగతనము చేసి ఉంటే కాల్చిన ఇనుప కడ్డీ చేతిని కాల్చగలదు.

- దొంగతనము చేయకపోతే చేతిని ఇనుపకడ్డీ కాల్చదు. ఆతడు వెంటనే విడుదల చేయబడతాడు.

---

**2.** **అథ యది తస్య అకర్తా భవతి,**
**తత ఏవ 'సత్యమ్' ఆత్మానం**
**కురుతే, స సత్యాభిసన్ధః**
**సత్యేన ఆత్మానమ్ అన్తర్ధాయ**
**పరశుం తప్తం ప్రతిగృహ్ణాతి**
**స న దహ్యతే - అథ ముచ్యతే।**

అట్లాగే సత్యమగు ఆత్మను ఎరిగి "ఆత్మయే సత్యము ఆత్మయే నేను" - అను 'సత్యము'ను ధారణ చేయువానిని (కాలిన పలుగు సత్యము చెప్పువాని చేయి కాల్చని తీరుగా) దృశ్యము బంధించలేదు.

---

**3.** **స యథా తత్ర నాదాహి**
**ఏత ఏతత్ ఆత్మ్యమ్ ఇదగ్ం**
**సర్వం। తత్ సత్యగ్ం।**
**స ఆత్మా। తత్ త్వమసి, శ్వేతకేతో! ఇతి**
**శ్వేతకేతువు :**
**తత్ హ అస్య విజజ్ఞావితి, విజజ్ఞావితి।**

ఈ సమస్తము ఆత్మయే। ఆత్మయే సత్యము. సత్యమగు ఆత్మను ధారణచేయువాడు అట్టి సత్యము దర్శిస్తాడు. అట్టి ఆత్మయే సత్యము. అదియే నీవు।

**శ్వేతకేతువు** : మీరు చెప్పిన దృష్టాంతములను మననము చేస్తూ ఉండగా ఆత్మను ఎరుగుచున్నాను. చక్కగా ఆత్మను తెలుసుకుంటున్నాను.

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - షష్ఠాధ్యాయే షోడశః ఖండః

**ఇతి - ఛాందోగ్యోపనిషది - షష్ఠ అధ్యాయః సమాప్తః॥**

# ఛాందోగ్యోపనిషత్
# 7వ అధ్యాయము
## 7-1. ప్రథమ ఖండము - నారదునకు సనత్కుమారుని ఉపదేశము

**1.** **ఓం**
**అధీహి భగవ। ఇతి**
**హ ఉపససాద సనత్కుమారం నారదః।**
**<u>తం హ - ఉవాచ :</u>**
**(సనత్కుమారౌవాచ:)**
**యత్ వేత్థ తేనమ్ ఉపసీద।**
**తతస్త ఊర్ధ్వం వక్ష్యామి ఇతి।**

దేవర్షి త్రిలోక సంచారి అగు శ్రీనారదమహర్షి ఒక సందర్భములో సద్గురువు, బ్రహ్మ మానసపుత్రుడు - శ్రీ సనత్కుమారులవారిని సమీపించి తత్త్వము ఉపదేశించమని విన్నవించుకొన్నారు.

సనత్కుమారుడు : మంచిది అయితే ముందుగా మీరు తత్త్వము ఏవిధంగా తెలుసుకొన్నవారై ఉన్నారో అది వివరించండి. ఆ తరువాత నేను తప్పక చెపుతాను.

---

**2.** **<u>స హ ఉవాచ (నారదౌవాచ) :</u>**
**ఋగ్వేదం, భగవో। అధ్యేమి।**
**యజుర్వేదం; సామవేదం ;**
**అథర్వణం చతర్థం;**
**ఇతిహాస పురాణం పంచమం;**
**వేదానాం వేదం, పిత్ర్యం,**
**రాశిం, దైవం, నిధిం;**
**వాకోవాక్యమ్ ఏకాయనం**
**దేవవిద్యాం, బ్రహ్మవిద్యాం;**
**భూతవిద్యాం, క్షత్రవిద్యాం;**
**నక్షత్ర విద్యాం, సర్ప దేవ జన**
**విద్యాం ఏతత్, భగవో। అధ్యేమి।**

నారద మహర్షి : గురుదేవా। సనత్కుమారా! భగవాన్! ఋక్ - యజుః - సామ - అథర్వణ చతుర్వేదములు, పంచమవేదముగా చెప్పబడే భారతాది పురాణ - ఇతిహాసములు, వేదములకు వేదము అగు వ్యాకరణము, పిత్ర్యము అనబడే శ్రాద్ధ కర్మ విధాన శాస్త్రము, (శ్రాద్ధకల్పము), రాశి (గణితవిద్య), దైవము (ధూమకేతు ఉత్పాతములను చెప్పే ఉత్పాత శాస్త్రము), నిధి (మహాకాలాది కాలశాస్త్రము), వాకోవాకము (తర్కశాస్త్రము - logic), ఏకాయనము (నీతిశాస్త్రము), దేవవిద్య, నిరుక్తము (పదముల అవయవార్థ వివరణ విద్య), శిక్ష, కల్పము మొదలైన విద్యలు, ఛందస్సు, చితులు మొదలైనవి అంశములుగాగల బ్రహ్మవిద్య, పంచభూతములను వశం చేసుకొనే భూతవిద్య, (ధనుర్వేదము మొదలైన) క్షత్రవిద్య, నక్షత్ర శాస్త్రము, (జ్యోతిషశాస్త్రము), సర్పవిద్య (సర్పశాస్త్రము), దేవజనవిద్య (నృత్యగీతాది లలిత కళలు) ఇవన్నీ నాకు వచ్చు.

---

**3.** **సోఽహం భగవో మన్త్రవిదే**
**వాఽస్మి। న ఆత్మ విత్।**
**శ్రుతం హి "ఏవ మే భగవన్**
**దృశేభ్యః "తరతి శోకం ఆత్మవిత్" - ఇతి।**
**సోఽహం భగవః శోచామి।**
**తం మా భగవాన్। శోకస్య**
**పారం తారయతు - ఇతి।**
**తం హోవాచ : యత్ వై**
**కిం చ ఏతత్ అధ్యగీష్ఠా నామ ఏవ ఏతత్॥**

ఇవన్నీ తెలుసుకొని నేను మంత్ర వేదుడను అయ్యానేగాని ఆత్మవిత్ (ఆత్మతత్త్వవేత్త) కానేలేదు. ఆత్మవిత్ మాత్రమే సర్వ శోకముల నుండి విడివడగలడని నేను సత్యద్రష్టల వద్ద విని ఉన్నాను. నేను శోకము (worry) తొలగించుకోలేక, శోకము వదలక ఉన్నాను.

భగవాన్। నన్ను శోకము అనే సముద్రము దాటించండి. సంసార సాగరం నుండి కాపాడండి.

శ్రీ సనత్కుమారుడు : ఓ నారదా! ఇప్పటిదాకా మీరు చెప్పినదంతా నామము మాత్రమే.

---

**4.** **నామ వా ఋగ్వేదో యజుర్వేదః**
**సామవేద అథర్వణః**
**చతుర్థ; ఇతిహాస పురాణః పంచమో**
**వేదనాం వేదః**
**పిత్ర్యోః, రాశిః**

నామోపాసన

అనగా - ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అథర్వణ వేదములు, పంచమ వేదములనబడే భారతము మొదలైన ఇతిహాస పురాణములు, వేదవేదమనబడే వ్యాకరణము, శ్రాద్ధకల్పము అనబడే పితృదేవోపాసనా శాస్త్రము, గణితము, నిధిజ్ఞానము, తర్కశాస్త్రము, మీమాంస,

| | |
|---|---|
| **దైవో నిధిః వాకో వ్యాకమ్,**<br>**ఏకాయనం దేవవిద్యా**<br>**బ్రహ్మవిద్యా భూతవిద్యా**<br>**క్షత్రవిద్యా, నక్షత్రవిద్యా**<br>**సర్ప దేవ జన విద్యా**<br>**నామ ఏవ ఏతత్ నామా ఉపాస్స్వ ఇతి॥** | నీతిశాస్త్రము, నిరుక్తము (శబ్దశాస్త్రము), వేదమంత్రోచ్చారణ అగు వేద విద్య, భూతవిద్య, [ధనుర్వేదము (Medical), జ్యోతిషము, గారడి మొదలైన] క్షేత్రవిద్య, జ్యోతిష్యము (నక్షత్ర విద్య), గారుడము, సంగీతము, నృత్యము మొదలైన కళలు, శిల్పవిద్య ఇవన్నీ నామములే!<br><br>నామమాత్ర విద్యలే! భౌతిక విద్యలే! ఈ నామవిద్యను బ్రహ్మముగా ఉపాసించాలి. బ్రహ్మముగా ఉపాసిస్తేనే ప్రయోజనం. |
| **5.** **స యో నామ బ్రహ్మ ఇతి ఉపాస్తే**<br>**యావత్ నామ్నో గతం తత్ర**<br>**అస్య యథా కామచారో భవతి**<br>**యో "నామ బ్రహ్మ" ఇతి ఉపాస్తే॥**<br>**<u>నారదుడు :</u>**<br>**అస్తి, భగవో! నామ్నో భూయ? – ఇతి।**<br>**<u>సనత్కుమారుడు :</u>**<br>**నామ్నో వావ భూయో అస్తి ఇతి।**<br>**<u>నారదుడు :</u>**<br>**తత్ మే, భగవాన్।**<br>**బ్రవీతు – ఇతి** | అట్టి 'నామము'ను బ్రహ్మముగా ఉపాసించువాడు, నామ విషయకమగు జ్ఞానమును పొంది - అట్టి ఆత్మ (బ్రహ్మ) జ్ఞానమునందు ఉదయిస్తున్నాడు. పొందుచున్నాడు.<br><br>**నామము యొక్క వ్యాప్తి ఎంతవరకో గ్రహించి, అంతవరకు వ్యాప్తి కలవాడై సంపూర్ణమైన బ్రాహ్మీ ఫలము పొందుచున్నాడు.**<br><br>నారద మహర్షి : 'నామము' కంటే గొప్పదైనది మరేదైనా ఉంటుందా?<br><br>సనత్కుమారుడు : అవును. నామ విద్య కంటే మహత్తరమైన విద్య ఉన్నది.<br><br>నారద మహర్షి : అయితే భగవాన్! అట్టి భూరి (ఇంకా గొప్పదైన) విద్య నాకు దయచేసి బోధించండి. |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే ప్రథమః ఖండః**

# 7-2. ద్వితీయ ఖండము - "వాక్ ఉపాసన"

**1.** **వాక్ వావ నామ్నో భూయసీ।**
**వాగ్వా ఋగ్వేదం విజ్ఞాపయతి।**
**యజుర్వేదం, సామవేదం,**
**అథర్వణం చతుర్థమ్,**
**ఇతిహాస పురాణం పంచమమ్,**
**వేదానాం వేదం, పిత్ర్యం,**
**రాశిం దైవం నిధిం వాకోవాక్యం**
**ఏకాయనం దేవవిద్యాం బ్రహ్మవిద్యాం**
**భూతవిద్యాం, క్షత్రవిద్యాం,**
**నక్షత్ర విద్యాం, సర్ప - దేవ -**
**జన విద్యాం దివం చ,**

వాక్కు నామముకంటే గొప్పది, వాక్కు చేతనే ఈ క్రింది విద్యలన్నీ నిర్మితమైనవి. అట్టి వాక్కును బ్రహ్మముగా ఉపాసించాలి.

వాక్ నిర్మితములు : చతుర్వేదములు, ఇతిహాస పురాణ పంచమము, వ్యాకరణము, శ్రాద్ధ - కల్ప - గణిత శాస్త్రములు, దైవజ్ఞానము, నిధిశాస్త్రము, తర్కము, నీతిశాస్త్రము, నిరుక్తము, కల్పము, శిక్ష, భూతతంత్ర విద్య, ధనుర్వేదము, జ్యోతిషశాస్త్రము, గారుడివిద్య, ద్యులోకవిద్య, భూతవిద్యా, అస్త్రవిద్య, నక్షత్రవిద్య, సర్ప-దేవ-జన విద్య - ఇవన్నీ వాక్ విద్యలే.

---

**పృథివీం చ, వాయుం చ, ఆకాశం చ ఆపశ్చ**
**తేజశ్చ దేవాంశ్చ మనుష్యాంశ్చ**
**పశూంశ్చ వయాంసి చ**
**తృణ - వనస్పతీన్ శ్వాపదా**
**అన్యా కీట - పతంగ - పిపీలికం,**
**ధర్మం చ, అధర్మం చ, సత్యం చ,**
**అనృతం చ, సాధు చ, అసాధు చ**
**హృదయజ్ఞం చ, అహృదయజ్ఞం చ**
**యద్వై వాక్జ్ఞా భవిష్యత్।**

<u>**సమస్తము వాక్కు చేతనే తెలియబడుతోంది.**</u>

పంచభూతములైనటువంటి పృథివి, వాయు, ఆకాశ, ఆప (జల) తేజస్సులు; దేవతలు, మనుష్యులు, పశువులు, పక్షులు;

తృణములు (గడ్డిపరకలు), వనస్పతులు (వృక్షములు), శ్వాపదములు (పులి మొదలైన హింసక క్రూర జంతువులు), తదితర జంతువులు, కీటకములు, పతంగములు (తుమ్మెదలు), పిపీలికములు (పురుగులు, చీమలు)

ధర్మ - అధర్మములు, సత్య - అసత్యములు, సాధు - అసాధులు మనోజ్ఞ - అమనోజ్ఞము (మనస్సుకు తెలిసేవి, తెలియనివి ఇవన్నీ) వాక్కు లేకపోతే తెలిసేవే కావు.

---

**న ధర్మో న అధర్మో వ్యజ్ఞాపయిష్యత్।**
**న సత్యం, న అనృతం న సాధు న అసాధు**
**న హృదయజ్ఞో - న అహృదయజ్ఞో**
**వాక్ ఏవ ఏతత్ సర్వం విజ్ఞాపయతి**
**వాచమ్ ఉపాస్స్వ ఇతి॥**

వాక్కు కనుక లేకపోతే ఏది ధర్మమో, ఏది కాదో, తెలియజేయు వీలు కాదు.

సత్యమేమో, అసత్యమేమో, ఏది సాధు, ఏది అసాధు - గుర్తు తెలిసేది కాదు. మనోజ్ఞ - అమనోజ్ఞములైనవన్నీ వాక్కు చేతనే గుర్తింపబడుచున్నాయి. అందుచేత వాక్కునే బ్రహ్మముగా ఉపాసించు.

---

**2.** **స యో వాచం బ్రహ్మేతి ఉపాస్తే**
**యావత్ వాచో గతం తత్ర అస్య**
**యథా కామచారో భవతి**
**యో వాచం బ్రహ్మేతి ఉపాస్తే।**
**అస్తి భగవో వాచో, భూయ? ఇతి।**
**వాచో వావ భూయో 'అస్తి' ఇతి।**
**తత్ మే, భగవాన్! బ్రవీతు। ఇతి॥**

ఎవ్వరైతే 'వాణి' లేక వాక్కును బ్రహ్మముగా ఉపాసిస్తారో, వారు వాక్కు విస్తరించి ఉన్నంతవరకు స్వేచ్ఛాగతి (కామగతి - ఇష్టముగా విస్తరించటము)ను సిద్ధించుకోగలరు. వాక్కు వ్యాప్తి అగు స్థానము వరకు యథేచ్ఛగా విహరించగలరు.

నారదమహర్షి : గురుదేవా! భగవాన్! వాక్కు కంటే గొప్పదైనది మరేదైనా ఉన్నదా?

సనత్కుమారుడు : ఓ! వాక్కు కంటే ఉన్నతమైనది ఉన్నది.

నారదమహర్షి : భగవాన్! వాక్కుకన్నా భూరి (గొప్పది, విస్తారమైనది) ఏదో దానిగురించి చెప్పండి.

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే ద్వితీయః ఖండః**

## 7-3. తృతీయ ఖండము - "మనో ఉపాసన"

| | |
|---|---|
| <u>సనత్కుమారుడు</u><br>**1.** **'మనో' వావ వాచో భూయో।**<br>**యథా వై ద్వే వా ఆమలకే,**<br>**ద్వే వా కోలే, ద్వౌ వా అక్షౌ,**<br>**ముష్టిః అనుభవతి....**<br>**ఏవం వాచం చ నామ చ**<br>**'మనో' → అనుభవతి।** | శ్రీ సనత్కుమారుడు : ఓ నారదా! వాక్కు కంటే కూడా అధికమైనది మనస్సు.<br>దృష్టాంతపూర్వకంగా చెపుతాను. విను. ఒకడు రెండు ఉసిరిక పండ్లను, (లేక) రెండు వాక్కాయలను, రేగుకాయలను (లేక) రెండు రుద్రాక్షలను గుప్పిటతో (పిడికిలియందు) పెట్టుకొన్నప్పుడు మనస్సునందు - ఆ నామములు, ఆ వాక్కు ఇముడుకొన్నట్లుగా - అనుభవము అవుతోంది. |
| **స యదా మనసా మనస్యతి**<br>**మంత్రాన్ అధీయీయేతి,**<br>**యథాధీతే కర్మాణి కుర్వీయేతి।**<br>**అథ కురుతే పుత్రాగ్ంశ్చ**<br>**పశూంశ్చ ఇచ్ఛేయేతి।**<br>**యథా ఇచ్ఛత ఇమం చ లోకం**<br>**అముంచేత్ ఇచ్ఛేయేత్ యథేచ్ఛతే।**<br>**మనో హి ఆత్మా।**<br>**మనో హి లోకో।**<br>**"మనో హి బ్రహ్మ।"**<br><u>**మన ఉపాస్స్వ**</u> **- ఇతి॥** | మనస్సుతో ఎప్పుడైతే అనుకుంటాడో<br>- అప్పుడు ఆతడు మంత్రమును మననము చేస్తాడు. ఉచ్చరిస్తాడు.<br>- అప్పుడే ఆతడు ఆయా కర్మలు నిర్వర్తిస్తాడు.<br>- పశువులు, సంతానము మొదలైనవి మనస్సుతో కోరుకొన్నప్పుడే అవన్నీ పొందుతాడు.<br>- మనస్సుతో కోరనివేవీ పొందనేపొందడు.<br>- మనస్సుతో ఇహ పరలోకములలో ఎక్కడ యథేచ్ఛగా సంచరించాలని అనుకుంటాడో అక్కడే ఇష్టంగా సంచారములు చేస్తాడు.<br>అంతేకాదు. మనస్సు ఆత్మ స్వరూపమే! మనస్సు 'బ్రహ్మమే' కూడా!<br>అందుచేత మనస్సును బ్రహ్మముగా ఉపాసించెదరు గాక। |
| **2.** **స యో మనో బ్రహ్మేతి**<br>**ఉపాస్తే, యావత్ మనసో**<br>**గతం తత్ర అస్య**<br>**యథా కామచారో భవతి।**<br>**యో "మనో బ్రహ్మ" - ఇతి ఉపాస్తే॥** | ఎవ్వరు మనస్సును పరబ్రహ్మస్వరూపంగా ఉపాసిస్తారో, - అట్టివారు మనస్సు విస్తరించి ఉన్నంతవరకు ఇచ్ఛాపూర్వకంగా ప్రియస్వరూపులై ఉండగలరు. |
| <u>నారదుడు :</u><br>**అస్తి, భగవో। మనసో**<br>**భూయ? ఇతి।**<br><u>సనత్కుమారుడు :</u><br>**మనసో వావ భూయో అస్తి ఇతి।**<br><u>నారదుడు :</u><br>**తత్ మే భగవాన్**<br>**బ్రవీతు - ఇతి॥** | శ్రీ నారదులవారు : స్వామీ! మనస్సుకన్నా భూయ (అధికమైనది, ఉన్నతమైనది) ఏదైనా ఉన్నదా?<br>శ్రీ సనత్కుమారుడు : మనస్సు కన్నా అధికమైనది ఉన్నది.<br>శ్రీ నారద మహర్షి : భగవాన్! అట్టి మనస్సు కంటే కూడా విస్తారము, పెద్దది ఏదై ఉన్నదో అది వివరించ ప్రార్థన! |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే తృతీయః ఖండః**

# 7-4. చతుర్థ ఖండము - "సంకల్పోపాసన"

సనత్కుమారుడు

1. సంకల్పో వావ మనసో భూయాన్।
యదా వై సంకల్పయతే, అథ 'మనసి'।
అతి అథ వాచమ్ ఈరయతి।
తాము నామ్నీరయతి।
నామ్ని మన్త్రా ఏకమ్
భవన్తి - మంత్రేషు కర్మాణి॥

శ్రీ సనత్కుమారుడు : మననరూపమగు మనస్సు కంటే "సంకల్పము" - విస్తారమైనట్టిది. ఎప్పుడైతే ఈ జీవుడు సంకల్పించటానికి ఉపక్రమిస్తాడో - అప్పుడు మనస్సుతో ఆ సంకల్పించిన దానిని కోరుకుంటాడు.

- ఆ మనస్సు వాక్కును ప్రేరేపిస్తోంది.

- వాక్కు నామరూపములను ప్రేరేపిస్తోంది. అనగా, వాక్కులో నామము చేరియుంటోంది.

నామము మంత్రములో ఏకమగుచున్నది. మంత్రము (మననము) కర్మలలో చేరుచున్నది.

---

2. తాని హ వా ఏతాని సంకల్ప
ఏకాయనాని, సంకల్పాత్మకాని,
సంకల్పే ప్రతిష్ఠితాని
సమక్లృపతాం ద్యావా - పృథివీ
సమకల్ప ఏతాం। వాయుశ్చ
ఆకాశం చ, సమకల్పంత ఆపశ్చ।
తేజశ్చ। తేషాం సంక్లృప్త్యై వర్షం సంకల్పతే।
వర్షస్య సంక్లృప్త్యా, అన్నగ్‌ం సంకల్పతే।
అన్నస్య సంక్లృప్త్యై ప్రాణాః సంకల్పన్తే।
ప్రాణానాం సంక్లృప్త్యై మంత్రాః సంకల్పన్తే।
మంత్రాణాం సంక్లృప్త్యై కర్మాణి సంకల్పన్తే।
కర్మాణాం సంక్లృప్త్యై లోకః సంకల్పతే
లోకస్య సంక్లృప్త్యై సర్వం సంకల్పతే।
స ఏష సంకల్పః। సంకల్పం ఉపాస్య ఇతి॥

మనస్సు, వాక్కు, నామము మొదలైనవన్నీ సంకల్పమునందు, సంకల్పము సంకల్పించుకొని అందు ప్రతిష్ఠితమై ఉంటున్నాయి.

అన్నిటికీ మూలము సంకల్పమే! సమస్తము సంకల్పమునే ఆధారముగా కలిగి ఉన్నాయి. దివ్యలోకము, భూలోకము కూడా సంకల్పమాత్రములే. వాయువు, ఆకాశము కూడా సంకల్పించబడి, ఉనికి పొందినవే. తేజస్సు కూడా సంకల్పము చేతనే ఏర్పడుతోంది.

సూర్యతేజస్సుచే (నీరు ఆవిరి అయి, మేఘములుగా అయి) వర్షముగాను, వర్షమువలన అన్నము, అన్నమువలన కర్మలు, కర్మలవలన (14) లోకములు, ఇవన్నీ కూడా సంకల్పములచేతనే సిద్ధిస్తున్నాయి. లోకములవలన మరల సంకల్పములు కలుగుచున్నాయి.

లోకములు మొదలైనవి, పైన చెప్పుకొన్న సమస్తము సంకల్పముచేతనే కలుగుచున్నాయి. అంతెందుకు? ఈ 'సృష్టి' అంతా సంకల్పము చేతనే సృష్టించబడుతోంది. అందుచేత ఓ నారదా! నీవు 'సంకల్పము'ను బ్రహ్మముగా ఉపాసించు.

---

3. స యః "సంకల్పం బ్రహ్మ"
ఇతి ఉపాస్తే, సంక్లృప్తాన్ వై
స లోకాన్ ధ్రువాన్ ధ్రువః ప్రతిష్ఠితాన్।
ప్రతిష్ఠితో అవ్యథమానాన్।
అవ్యథమానో అభిసిధ్యతి।
యావత్ సంకల్పస్య గతం
తత్ర అస్య యథా కామచారో
భవతి, యః "సంకల్పం బ్రహ్మ" ఇతి ఉపాస్తే॥

నారదుడు :
అస్తి భగవః సంకల్పాత్ భూయ? ఇతి।

సనత్కుమారుడు :
సంకల్పాత్ వావ భూయో అస్తి - ఇతి

నారదుడు :
తత్ మే భగవాన్। బ్రవీతు। ఇతి॥

ఎవ్వరైతే "సంకల్పము బ్రహ్మమే" - అని భావించి సంకల్పమును ఉపాసిస్తారో - ఆతను తాను సంకల్పించిన లోకముతో - ధ్రువముగా ధ్రువమైన నివాసము పొందగలడు. ప్రతిష్ఠితుడు కాగలడు.

'సంకల్పము'ను బ్రహ్మముగా దర్శించువాడు - ఎట్టి వ్యథలు లేనివాడై, వ్యథలేని స్థితి స్థానములను ఉత్తమముగా సిద్ధించుకోగలడు. దుఃఖరహితుడు కాగలడు.

'సంకల్పము' ఎంతవరకు విస్తరించి ఉండగలదో - అంతవరకు తన ఇచ్ఛానుసారంగా స్వేచ్ఛగా సంచరించువాడై ఉండగలడు.

నారదమహర్షి : గురుదేవా! సనత్కుమారా? సంకల్పము కంటే కూడా ఇంకా శ్రేష్ఠమైనది, అధికమైనది ఉన్నదా?

సనత్కుమారుడు : అవును. 'సంకల్పము' కంటే కూడా పెద్దదైనది, శ్రేష్ఠమైనది - ఉన్నది.

నారదమహర్షి : అట్టి సంకల్పమునకు మించినది, శ్రేష్ఠమైనది ఏమై ఉన్నదో - అది నాకు బోధించండి.

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే చతుర్థః ఖండః

# 7-5. పంచమ ఖండము - "చిత్తోపాసన"

| మూలము | వ్యాఖ్యానము |
|---|---|
| <u>సనత్కుమారుడు</u><br>**1.** **చిత్తం వావ సంకల్పాత్ భూయో।**<br>**యదా వై చేతయతే। అథ సంకల్పయతే।**<br>**అథ 'మనస్యతి' అథ వాచమ్ ఈరయతి।**<br>**తాము నామ్నీరయతి।**<br>**నామ్ని మంత్రా ఏకం భవన్తి।**<br>**మంత్రేషు కర్మాణి॥** | సనత్కుమారుడు : చిత్తము సంకల్పము కంటే - శ్రేష్ఠము, అధికము.<br>ఈ జీవుడు తాను 'చిత్తము'ను ఉపయోగిస్తూ (చేతనము చేస్తూ) ఉన్నప్పుడే సంకల్పించగలడు. చిత్తము - ఇష్టము, వాంఛరూపము, చిత్తము ఉన్నప్పుడే - సంకల్పము, మనస్సు, వాక్కు - ప్రేరణము పొందుతాయి.<br>చిత్తము (ఆసక్తి) యొక్క ప్రవర్తన చేతనే...వాక్కు నామమునందు ప్రేరణ ప్రదర్శించగలదు. నామము - మంత్రము అప్పుడు ఏకము కాగలుగుతాయి. మంత్రము వలన కర్మలు ప్రవర్తమానమగు చున్నాయి. |
| **2.** **తాని హ వా ఏతాని చిత్త ఏకాయనాని।**<br>**చిత్తాత్మని। చిత్తే ప్రతిష్ఠితాని।** | నామము, వాక్కు, మనస్సు, సంకల్పము - ఇవన్నీ చిత్తమునందే ఏకత్వము పొందుచున్నాయి. చిత్తమే వాటన్నిటికీ 'ఆత్మ'. అవన్నీ చిత్తమునందే ప్రతిష్ఠితమై ఉంటున్నాయి. |
| **తస్మాత్ యద్యపి బహువిద చిత్తో భవతి,**<br>**"న అయం అస్తి - ఇతి ఏవ ఏనం**<br>**ఆహుః యత్ అయం వేద",**<br>**యద్వా అయం విద్వాన్నేత్థమ**<br>**చిత్తః స్యాత్ ఇతి అథ**<br>**యది అల్పవిచ్చిత్తవాన్ భవతి।**<br>**తస్మా ఏవోత శుశ్రూషన్తే।** | అందుచేతనే - ఒకానొకడు ఎన్నో విషయములు తెలిసికొని ఉన్నవాడు అయినప్పటికీ - అతని చిత్తము ఒక విషయముపై ఏకాగ్రత (concentration) కలిగి ఉండకపోతే, **"ఈతనికి ఈ విషయము ఏమాత్రము తెలియదు. ఈతడే గనుక ఈ విషయం తెలిసి ఉంటే, దీనిపట్ల అజ్ఞుడై ఉంటాడా?"** - అని జనులు అనుకుంటూ ఉంటారు.<br>ఆ చిత్తము కొంతమాత్రమే ఏకాగ్రమైతే (If his interest is only partially involved) ఆతడు **కొంతమాత్రమే** తెలుసుకోగలడు. ఒక విషయముపై ఎవరికి చిత్తము ఏకాగ్రమై ఉంటుందో, వారితోనే జనులు ఆ విషయం సంభాషిస్తారు. |
| **చిత్తం హి ఏవ ఏషామ్ ఏకాయనం।**<br>**చిత్తం ఆత్మా।**<br>**చిత్తం ప్రతిష్ఠా।**<br>**చిత్తం ఉపాస్స్వ ఇతి।** | చిత్తమే చివరికి అన్నిటినీ ఏకీయము (united) చేయు ఆశ్రయము.<br>చిత్తము ఆత్మయే॥<br>చిత్తమే సమస్తమునకు ప్రతిష్ఠితమైయున్న స్థానము।<br>అందుచేత **"చిత్తము పరబ్రహ్మమే।"** అని ఉపాసించెదవు గాక. |
| **3.** **"స యత్ చిత్తం బ్రహ్మేతి" ఉపాస్తే చిత్తాన్వై।**<br>**స లోకాన్ ధృవాన్। ధ్రువః ప్రతిష్ఠితాన్**<br>**ప్రతిష్ఠితో - అవ్యథమానా।**<br>**అవ్యథమానో - అభిసిధ్యతి।** | ఎవ్వరైతే - **"చిత్తము బ్రహ్మమే అయి ఉన్నది"** - అని చిత్తమును ఉపాసిస్తారో, అట్టివారు దృఢచిత్తులు అగుచున్నారు.<br>ఆతడు లోకములలో ఎక్కడ ఉంటే అక్కడ ధృవముగా ప్రతిష్ఠితుడు కాగలడు. ఆతని చిత్తము చాంచల్యము త్యజించినదై ఉండగలదు. ఆతడు ఏ వ్యథలు లేనివాడై (Sans all worries) ఎక్కడైనా ప్రతిష్ఠ కలిగి, వ్యథరాహిత్యము సిద్ధించుకొని ఉండగలడు. |
| **యావత్ చిత్తస్య గతం, తత్రాస్య**<br>**యథా కామచారో భవతి।**<br>**'యత్ చిత్తం బ్రహ్మ' ఇతి ఉపాస్తే।**<br><u>నారదుడు :</u> **అస్తి, భగవన్।**<br>**చిత్తాత్ భూయ ఇతి?**<br><u>సనత్కుమారుడు :</u> **చిత్తాత్ వావ భూయో అస్తి - ఇతి।**<br><u>నారదుడు :</u> **భగవాన్! బ్రవీతు - ఇతి।** | చిత్తము ఎంతవరకు విస్తరించి ఉండగలదో - అంతవరకు ఆతడు తన ఇచ్ఛానుసారంగా ఉండగలడు. చిత్తము బ్రహ్మముగా ఉపాసించువాడు బ్రహ్మమే కాగలడు.<br>శ్రీనారదమహర్షి : గురు రాజన్ ! చిత్తముకంటే శ్రేష్ఠము, 'బహు' అయినది మరొకటేదైనా ఉన్నదా?<br>సనత్కుమారుడు : చిత్తముకంటే కూడా మహత్తరమైనది ఉన్నది.<br>శ్రీ నారదుడు : భగవాన్। చిత్తముకంటే కూడా బృహత్తరము ఏదో దాని గురించి చెప్పండి. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే పంచమః ఖండః

## 7-6. షష్ఠ ఖండము - "ధ్యాన ఉపాసన"

| | | |
|---|---|---|
| **1.** | **ధ్యానం వావ చిత్తాత్ భూయో।<br>ధ్యాయతి ఇవ పృథివీ। ధ్యాయతీవ<br>అంతరిక్షం। ధ్యాయతీవ ద్యౌః। ధ్యాయన్తీవ ఆపో<br>ధ్యాయన్తీవ పర్వతా।<br>ధ్యాయన్తీవ దేవమనుష్యాః।** | సనత్కుమారుడు : చిత్తము కంటే కూడా ధ్యానము - బహుళము, శ్రేష్ఠము.<br><br>పృథివి (భూమి), అన్తరిక్షము (ఆకాశము), ద్యౌః (దేవతాలోకము), జలము, పర్వతములు, దేవతప్తమనుష్యులు - అందరూ ధ్యాస (లేక) ధ్యానమునందే నిమగ్నమై కనిపిస్తున్నారు. (ధ్యాసయే ధ్యానము) |
| | **తస్మాత్ య ఇహ<br>మనుష్యాణాం మహతాం ప్రాప్నువన్తి।<br>ధ్యానాపాదాంశా ఇవ ఏవ తే భవంత్యథ।<br>యే అల్పాః కలహినః, పిశునా ఉపవాదినస్తే।<br>అథ యే ప్రభవో ధ్యానాపాదాగ్ంశా<br>ఇవైవ తే భవంతి। ధ్యానం ఉపాస్స్వ ఇతి।** | అందుచేత మానవులంతా ఎవ్వరైతే మహదత్వము పొందుచున్నారో అదంతా ధ్యాసరూపమగు **'ధ్యానము'** చేతనే ప్రాప్తించుకొంటున్నారు.<br><br>ధ్యానముయొక్క అభ్యాసము లేనివారు క్రింద దశలోనే అల్పులుగా, కలహప్రియులుగా (పోట్లాడటం అలవాటు గల వారుగా), పిశునులుగా (కొండెములు చెప్పువారుగా) నీచ-దుష్ట-ద్రోహ స్వభావులుగా, నిందలు ఆరోపించువారుగా ఉండిపోవుచున్నారు. |
| **2.** | **స యో "ధ్యానం బ్రహ్మేతి" ఉపాస్తే<br>యావత్ ధ్యానస్య గతం, తత్రాస్య<br>యథా కామచారో భవతి,<br>యో "ధ్యానం బ్రహ్మ" ఇతి ఉపాస్తే।<br><u>నారదుడు :</u><br>అస్తి భగవో! ధ్యానాత్ "భూయ" ఇతి?<br><u>సనత్కుమారుడు :</u><br>"ధ్యానాత్ వావ భూయో అస్తి" - ఇతి।<br><u>నారదుడు :</u><br>తత్ మే భగవాన్। బ్రవీతు।"...ఇతి।** | సమర్థులైన వారంతా తమయొక్క ధ్యాసరూపమగు ధ్యానముచేతనే ధ్యానలాభంగా సమర్థత పొందుచున్నారు.<br><br>ఎవ్వరైతే "ధ్యానము బ్రహ్మమే" - అని ఉపాసిస్తారో, అట్టివారు వారి ధ్యానము (ధ్యాస) ఎక్కడివరకు విస్తరిస్తోందో, అంతవరకు తమ ఇచ్ఛానుకూలంగా (As they like it) ఉండగలరు. "ధ్యానము బ్రహ్మమే" అని ఉపాసించబడు గాక।<br><br>నారద మహర్షి : ధ్యానము కంటే మించినది ఇంకేమైనా ఉన్నదా?<br><br>సనత్కుమారుడు : ఆ! ధ్యానముకంటే 'భూరి' (శ్రేష్ఠము) అయినది ఉన్నది.<br><br>నారద మహర్షి : అది ఏది? గురు సత్తమా? దయచేసి చెప్పండి। |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే షష్ఠః ఖండః

# 7-7. సప్తమ ఖండము - "విజ్ఞాన ఉపాసన"

<u>సనత్కుమారుడు</u>

**1.** **విజ్ఞానం వావ ధ్యానాత్ భూయో।**
**విజ్ఞానేన వా ఋగ్వేదం విజానాతి।**
**యజుర్వేదం, సామవేదగ్ం, అథర్వణం చతుర్థమ్,**
**ఇతిహాస పురాణం పంచమమ్;**
**వేదానాం వేదం, పిత్ర్యం, రాశిం, దైవం,**
**నిధిం, వాకోవాక్యమ్, ఏకాయనం,**
**దేవ విద్యాం, బ్రహ్మవిద్యాం,**
**భూతవిద్యాం, క్షత్రవిద్యాం,**
**నక్షత్రవిద్యాగ్ం, సర్ప దేవ జన విద్యాం,**
**దివం చ పృథివీం చ - వాయుం చ**
**ఆకాశం చ - ఆపశ్చ - తేజశ్చ**
**దేవాంశ్చ, మనుష్యాగ్ంశ్చ,**
**పశూగ్ంశ్చ, వయాంసి చ**
**తృణ వనస్పతీన్ చ శ్వాపద**
**అన్యాకీట పతంగి పిపీలికం**

సనత్కుమారుడు : ధ్యానము కంటే విజ్ఞానము - భూరి (గొప్పది / పెద్దది, శ్రేష్ఠము)

'విజ్ఞానము' చేతనే ఈ మానవుడు ఋగ్వేద - యజుర్వేద - సామవేద - అథర్వణ వేద (చతుర్వేదములు) పంచమ వేదమగు భారతము మొదలైన ఇతిహాస - పురాణములు, వేదనాం వేదము అయినట్టి వ్యాకరణము, పిత్ర్యము (శ్రాద్ధ, తంత్రము), కల్పము, గణితశాస్త్రము, దైవతత్త్వములు, నిధి శాస్త్రము, ఏకోవాక్యము (తర్కము), ఏకాయతనము (నీతిశాస్త్రము), దేవతల గురించిన విద్య, బ్రహ్మవిద్య, భూతప్రేత పిశాచ సంబంధమైన విద్య, క్షత్రియ (యుద్ధ) విద్య, నక్షత్రవిద్య (జ్యోతిష్యశాస్త్రము), సర్వదేవతాజనవిద్య, దేవతల దివ్యలోకముల గురించి, పృథివి గురించి, వాయువు గురించి, ఆకాశము గురించి, జలము గురించి, తేజస్సు గురించి, దేవ - మనుష్య - పశు - పక్షి - తృణ - వనస్పతి - ఓషధి - కీటకము గురించి పతంగముల (పిట్టల) గురించి, పురుగుల గురించి,

---

**ధర్మం చ - అధర్మం చ,**
**సత్యం చ - అనృతం చ,**
**సాధు చ - అసాధు చ,**
**హృదయజ్ఞం చ - అహృదయజ్ఞం చ**
**అన్నం చ - రసం చ,**
**ఇమం చ లోకం - అముం చ**
**విజ్ఞానేన ఏవ విజానాతి। విజ్ఞానమ్ ఉపాస్స్వ ఇతి॥**

ధర్మ - అధర్మ, సత్య - అసత్య, సాధు - అసాధు, హృదయానికి ఆనందము కలిగించే - కలిగించని వాటి గురించి.

అన్నము (ఆహారము) గురించి, అన్నరసము గురించి, ఇహ -పర (తరువాతి, ఊర్ధ్వ) లోకముల గురించి వీటన్నిటి గురించి తెలుసుకొంటున్నాడు. "తెలుసుకోవటము" అనేది "విజ్ఞానము" చేతనే సిద్ధిస్తోంది. కనుక 'విజ్ఞానము బ్రహ్మమే' - అని ఉపాసించెదవు గాక।

---

**2.** **స యో 'విజ్ఞానం బ్రహ్మేతి'**
**ఉపాస్తే విజ్ఞానవతో వై**
**స లోకాన్ జ్ఞానవతో అభిసిధ్యతి।**
**యావత్ విజ్ఞానస్య గతం,**
**తత్ర అస్య యథా కామచారో భవతి యో**
**"విజ్ఞానం బ్రహ్మ" ఇతి ఉపాస్తే॥**
**<u>నారదుడు :</u>**
**"భగవో। విజ్ఞానాత్ భూయ? ఇతి।**
**<u>సనత్కుమారుడు :</u>**
**"విజ్ఞానాత్ వావ భూయో అస్తి। ఇతి"**
**<u>నారదుడు :</u>**
**"తత్ మే, భగవాన్! బ్రవీతు - ఇతి"।**

"విజ్ఞానము బ్రహ్మమే" - అను విధంగా ఎవరు ఉపాసిస్తారో - అట్టి వారు విజ్ఞానమయ లోకములలో జ్ఞానవంతులతో సంగము పొందగలరు.

విజ్ఞానము ఎంతవరకు విస్తరించి ఉన్నదో - అంతవరకు విజ్ఞానమును బ్రహ్మముగా ఉపాసించువారు - తమ ఇచ్ఛానుకూలంగా ఉండగలరు. తదితరములకు బద్ధులు కారు.

నారదమహర్షి : విజ్ఞానము కంటే కూడా ఉన్నతమైనది ఏదైనా ఉన్నదా?

సనత్కుమారుడు : విజ్ఞానము కంటే కూడా ఉత్కృష్టమైనది (మహత్తరమైనది) ఉన్నది.

నారదుడు : అది ఏది? భగవాన్! దయచేసి వివరించండి!

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే సప్తమః ఖండః**

# 7-8. అష్టమ ఖండము - "బల ఉపాసన"

<u>సనత్కుమారుడు</u>

**1.** **బలం వావ విజ్ఞానాత్ భూయో అపి**
**హ శతం విజ్ఞానవతాం ఏకో**
**బలవాన్ ఆకంపయతే**
**స యదా బలీ భవతి,**
**అథ ఉత్థాతా భవతి ఉత్తిష్ఠన్**
**పరిచరితా భవతి।**
**పరిచరన్ ఉపసత్తా భవతి।**
**ఉపసీదన్ ద్రష్టా భవతీ**
**శ్రోతా భవతి। మన్తా భవతి।**
**బోద్ధా భవతి। కర్తా భవతి।**
**విజ్ఞాతా భవతి।**

సనత్కుమారుడు : విజ్ఞానము కంటే కూడా (ధైర్య) బలము గొప్పది. (బుద్ధి - logic - ఉన్నతమైనది).

వందమంది విజ్ఞానవంతులను (పండితులను) కూడా ఒక్క ఆత్మబలం భావన చేయువాడు - వణికించగలడు. ఓపిక ఉంటేనే ఏదైనా చేయగలడు.

ఈ జీవుడు (మానవుడు) బలవంతుడైతే ధైర్యము కలవాడు కాగలడు. లేచి నిలుచోగలడు. ఉత్తిష్ఠుడై సద్గురువులను సమీపించగలడు. బలములేని బలహీనుడు ఎక్కడికి వెళ్లగలడు? కూర్చున్నవాడు లేవనే లేవలేడు కదా?

బలవంతుడైనప్పుడే ఈ మానవుడు ఉపసత్తు - శ్రోతము కాగలడు.

- బోద్ధా (బోధించుటకు) అర్హుడు కాగలడు.
- బలముంటేనే ఒక పనికి కర్త కాగలడు.
- బలమున్నప్పుడే ఏదైనా తెలుసుకొన్నవాడు కాగలడు.

---

**బలేన వై పృథివీ తిష్ఠతి।**
**బలేన అంతరిక్షం।**
**బలేన ద్యౌః। బలేన పర్వతా।**
**బలేన దేవ మనుష్యా।**
**బలేన పశవశ్చ వయాంసి చ**
**తృణ వనస్పతయః**
**శ్వాపదా అన్యా కీట - పతంగ పిపీలికం।**
**బలేన లోకః తిష్ఠతి।**
**బలమ్ ఉపాస్స్వ - ఇతి।**

- బలముచేతనే భూమి పడిపోకుండా నిలిచి ఉండగలుగుతోంది.
- బలము చేతనే అంతరిక్షము నిలిచి ఉన్నది.
- బలము చేతనే పర్వతము తనపై చెట్లు, మృగములు సంచరించ గలిగి ఉంటున్నాయి.
- బలము ఉండటంచేతనే దేవతలు, మనుష్యులు మనగలుగుతున్నారు.

పశువులు, పక్షులు, తృణములు, వనస్పతులు, (పులి మొదలైన) క్రూరమృగములు, కీటకములు, పక్షులు, పురుగులు జీవించటం కొనసాగించగలుగుచున్నాయి.

బలముయొక్క ఆధారము చేతనే లోకములు కొనసాగుచూ, తిష్ఠితమై ఉన్నాయి.
అందుచే 'బలము'ను పరబ్రహ్మముగా ఉపాసించు.

---

**2.** **స యో 'బలం బ్రహ్మేతి'**
**ఉపాస్తే యావత్ బలస్య గతం,**
**తత్రాస్య యథా కామచారో భవతి,**
**యో 'బలం బ్రహ్మ' - ఇతి ఉపాస్తే।**
<u>**నారదుడు :**</u>
**"అస్తి, భగవో। బలాత్ భూయ? - ఇతి"।**
<u>**సనత్కుమారుడు:**</u>
**"బలాత్ వావ భూయో అస్తి - ఇతి"।**
<u>**నారదుడు :**</u>
**"తత్ మే భగవాన్, బ్రవీతు" - ఇతి।।**

ఎవ్వరైతే "బలము బ్రహ్మమే అయి ఉన్నది" అను భావనను ఆశ్రయించి ఉపాసిస్తూ ఉంటారో, అట్టివారు - ఎక్కడివరకు బలము విస్తరించి ఉన్నదో - అక్కడి వరకు వారు ఇచ్ఛాపూర్వకంగా (The way they like) ఇష్టమైన విధంగా ఉండగలుగుతారు। బలమును ఉపాసించువారు బలవంతులవగలరు.

నారదమహర్షి : హే భగవాన్! "బలము" కంటే కూడా గొప్పది (భూయ) ఇంకా ఏదైనా ఉన్నదా?

సనత్కుమారుడు: ఎందుకు లేదు? బలము కంటే అధికమైనది ఉన్నది.

నారదమహర్షి : బలముకంటే అధికమైనది ఏమున్నదో అద్దానిగురించి వివరించండి.

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే అష్టమః ఖండః**

# 7-9. నవమ ఖండము - "అన్న ఉపాసన"

<u>సనత్కుమారుడు</u>

**1.** **అన్నం వావ బలాత్ భూయః।**
**తస్మాత్ యద్యపి దశరాత్రీః - న**
**అశ్నీయాత్ యద్యు హ జీవేత్।**
**అథవా అద్రష్టా, అశ్రోతా, అమన్తా,**
**అబోద్ధా, అకర్తా, అవిజ్ఞాతీ భవతి।**
**అథ అన్నస్యాయై ద్రష్టా**
**భవతి। శ్రోతా భవతి।**
**మన్తా భవతి। బోద్ధా భవతి। కర్తా భవతి।**
**విజ్ఞాతా భవతి।**
**అన్నమ్ ఉపాస్స్వ ఇతి।**

సనత్కుమారుడు : 'బలము' కంటే గొప్పది (భూరిః) **"అన్నము"**.

అందుచేతనే ఒకానొకడు 10 రోజులు అన్నము తినకపోతే - ఏమౌతోంది? తనకున్న బలము పోగొట్టుకొని, బలహీనుడై, జీవించటమే కష్టముగా అగుచున్నాడు.

10 రోజులు ఆహారము తీసుకోకపోవటం చేత మరణించనైనా మరణిస్తాడు. లేదా ఒకవేళ ఇంకా జీవిస్తూ ఉన్నా కూడా కళ్ళతో చూడలేడు. బుద్ధితో ఏమీ విశ్లేషించి తెలుసుకోలేడు. ఏ పనీ చేయలేడు. ఏమీ తెలుసుకోలేడు. ఆహారము తీసుకోనప్పుడు స్థితి ఇట్టిది.

ఆహారము తీసుకొన్న తరువాతనో?

ద్రష్ట కాగలడు. శ్రోత కాగలడు. మనస్సుతో మననము చేయగలడు. బుద్ధితో తెలుసుకోగలడు. తెలుసుకొన్నది ఆకలింపు చేసుకుంటూ 'విజ్ఞాత' కాగలడు.

అందుచేత 'అన్నము'ను పరబ్రహ్మముగా ఉపాసించెదవు గాక।

---

**2.** **స యో "అన్నం బ్రహ్మేతి"**
<u>**ఉపాస్తే। అన్నవతో వై।**</u>
**స లోకాన్ పానవతో అభిసిద్ధ్యతి**
**యావత్ అన్నస్య గతం**
**తత్ర అస్య యథా కామచారో**
**భవతి। యో 'అన్నం బ్రహ్మ'**
**ఇతి - ఉపాస్తే।**
<u>**నారదుడు:**</u>
**"అస్తి, భగవో। అన్నాత్ భూయ?" - ఇతి**
<u>**సనత్కుమారుడు :**</u>
**"అన్నాత్ వావ భూయో అస్తి" - ఇతి**
<u>**నారదుడు:**</u>
**"తన్మే భగవాన్ బ్రవీతు।" - ఇతి॥**

''అన్నము బ్రహ్మమే'' అను భావముతో ఉపాసించువాడు అన్నవంతుడు కాగలడు. తృప్తిగా ఆహారము పొందగలడు.

అన్నము పొందువాడు అన్ని విధాలా భాగ్యవంతుడే। ఎందుకంటే దేహ, ఇంద్రియ, మనో, బుద్ధి, చిత్తములు మొదలైన వాటన్నిటికీ అన్నమే ఆధారము.

"అన్నము బ్రహ్మమే'' అని ఉపాసించువానికి - ఇచ్ఛానుసారంగా దేహ - మనో - బుద్ధి - చిత్తములు రూపుదిద్దుకోగలవు.

నారద మహర్షి : మహాత్మా! 'అన్నము' కంటే అధికమైనది ఇంకా మరొకటి ఏదైనా ఉన్నదా?

సనత్కుమారుల వారు : నారదమహర్షీ! అన్నము కంటే ఇంకా గొప్పదైనది ఉన్నది.

నారద మహర్షి : అది ఏదో సెలవియ్యండి, భగవాన్।

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే నవమః ఖండః**

# 7-10. దశమ ఖండము - "ఆపో ఉపాసన"

**సనత్కుమారుడు**

**1. 'ఆపో' వావ అన్నాత్ భూయస్యః**
**తస్మాత్ యదా సువృష్టిః న భవతి,**
**వ్యాధీయన్తే ప్రాణా**
**అన్నం కనీయో భవిష్యతి ఇతి।**
**అథ యదా సువృష్టిః భవతి - ఆనందినః,**
**ప్రాణా భవన్తి, అన్నం బహుభవిష్యతి। ఇతి।**
**'ఆప' - ఏవ ఇమా మూర్తా**
**యేయం పృథివీ। యత్ అంతరిక్షం।**
**యత్ ద్యౌః। యత్ పర్వతా।**
**యత్ దేవ - మనుష్యా।**
**యత్ పశవశ్చ వయాంసి చ।**
**తృణ వనస్పతయః శ్వాపదా।**
**అన్యాకీట - పతంగ - పిపీలకమ్**
**"ఆపః' ఏవ ఇమా మూర్తా।**
**ఆప ఉపాస్స్వ ఇతి॥**

సనత్కుమారుడు : జలము అన్నము కంటే కూడా అధికమైనది.

అందుచేతనే సువృష్టి (బాగుగా, సమయానుకూలంగా వర్షము) వర్షించనప్పుడు అన్నము సరిగా లభించదు. శరీరములకు వ్యాధులు కలుగుచూ ఉంటాయి కూడా.

సకాల - సమృద్ధి వర్షము కురిసినప్పుడు (వర్షపాతము సరిగా ఉన్నప్పుడు) - "అన్నము బహుగా లభిస్తుంది" - అన్ని జీవులు ఆనందిస్తున్నారు.

మూర్తీభవించిన (రూపము గల) సర్వ పదార్థములలోను జలము ఉనికి కలిగియున్నది.

సమస్త పదార్థములకు ఆధారము జలమే।

పృథివి (భూమి), అంతరిక్షము (ఆకాశము), ద్యులోకము (దేవతాలోకము, స్వర్గలోకము), పర్వతములు, దేవ-మనుష్యులు, పశువులు, పక్షులు, క్రిమి-కీటకములు, తృణములు (గడ్డిపరకలు), వనస్పతులు (వృక్షములు), మృగములు, కీటక-పతంగ -పిపీలికములు (చీమలు) - సమస్తము (అన్నీ కూడా) జలము చేతనే మూర్తీభవించినవై ఉన్నాయి.

అందుచేత జలమును పరబ్రహ్మస్వరూపంగా ఉపాసించెదవు గాక।

---

**2. స యో "అపో బ్రహ్మ" ఇతి ఉపాస్త**
**ఆప్నోతి సర్వాన్ కామాం,**
**తృప్తిమాన్ భవతి।**
**యావత్ అపాం గతం, తత్రాస్య**
**యథా కామచారో భవతి।**
**యో 'అపో బ్రహ్మ ఇతి' ఉపాస్తే**
**<u>నారదుడు :</u>**
**"అస్తి భగవో। అద్భ్యో భూయ? ఇతి**
**<u>సనత్కుమారుడు :</u>**
**'అద్భ్యో వావ భూయో అస్తి' - ఇతి।**
**<u>నారదుడు :</u>**
**"తత్ మే భగవాన్। బ్రవీతు।" ఇతి॥**

ఎవ్వరైతే "జలము పరబ్రహ్మస్వరూపము" - అని ఉపాసిస్తారో, వారు కోరుకొనేవన్నీ లభించి తృప్తివంతులు కాగలరు.

అట్టివారు - జలము విస్తరించి ఉన్నంతవరకు, వారి ఇచ్ఛానుసారం సంచారములు చేయగలరు.

అందుచేత "జలము బ్రహ్మమే" అని ఉపాసించుము.

నారద మహర్షి : జలము కంటే కూడా అధికమైనది ఉన్నదా?

సనత్కుమారుడు : జలము కంటే కూడా ఉపాసనకొరకై అధికమైనది ఉన్నది.

నారద మహర్షి : అట్టి అధికమైనది మా ఉపాసన కొరకై శలవియ్యండి.

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే దశమః ఖండః

# 7-11. ఏకాదశ ఖండము – "తేజో ఉపాసన"

<u>సనత్కుమారుడు</u>

1. తేజో వావ అద్భ్యో భూయః తద్వా,
ఏతత్ వాయుమ్ ఆగృహ్య,
ఆకాశమ్ అభితపతి।
తత్ – ఆహుః – నిశోచతి నితపతి।
వర్షిష్యతి వా ఇతి।
తేజ ఏవ, తత్ పూర్వం
దర్శయిత్వాథ ఆపః సృజతే।

సనత్కుమారుడు : తేజస్సు జలముకంటే కూడా గొప్పది. అట్టి తేజస్సు ఎప్పుడైనా వాయువును నిశ్చలం చేసి, ఆకాశమును అన్నివైపులా తపింపజేస్తూ (వేడి కలిగిస్తూ) ఉంటే, అప్పుడు "బాగా వేడిగా ఉండి ఆకాశము ఉక్కబోస్తోంది. అందుచేత వర్షము రావచ్చును" - అంటారు. ఈ విధంగా వర్షమునకు తేజస్సే ప్రథమ కారణము.

ఈ విధంగా తేజస్సే అన్నిటికంటే ముందుగా ప్రదర్శనమై జలమును సృష్టించుచున్నది. తేజస్సువల్లనే నీటి ఆవిరిరూపంగా మేఘములు ఉత్పన్నమై వర్షమునకు కారణము అగుచున్నది.

---

తత్ ఏతత్ ఊర్ధ్వా అభిశ్చ,
తిరశ్చీభిశ్చ విద్యుద్భిః
ఆహ్రాదాః చరన్తి।
తస్మాత్ ఆహుః విద్యోతతే
స్తనయతి, వర్షిష్యతి వా
ఇతి 'తేజ' ఏవ।
తత్పూర్వం దర్శయిత్వా।
అథ ఆపః సృజతే
తేజ ఉపాస్స్వ ఇతి।

తేజస్సు ఎప్పుడైతే పైకి - క్రిందకు విస్తారమగుచు పైకి, వెనుకకు ఊర్ధ్వగామి, తిర్యక్‌గామి అగుచు ఉన్నదో, ఆ సందర్భములో మేఘములలో విద్యుత్తుతో కూడిన గర్జనలు వినిపిస్తూ ఉన్నాయి. ఎప్పుడైతే విద్యుత్ (మేఘములో మెఱుపు) మేఘగర్జనలతో ప్రదర్శనమౌతుందో అప్పుడు "ఆకాశంలో మెఱుపులు సంభవిస్తూ ఉన్నాయి. మేఘగర్జనలు వినిపిస్తున్నాయి. కనుక వర్షింపబడవచ్చు" -అని అనుకుంటూ ఉంటారు.

అందుచేత తేజస్సే మొదటిగా ఉండి వర్షమును వర్షింపజేస్తోంది. కనుక జలమును సృష్టిస్తున్నది 'తేజస్సే'। అట్టి తేజస్సు ఆత్మగా ఉపాసించ బడుగాక।

---

2. స యః 'తేజో బ్రహ్మేతి"
ఉపాస్తే తేజస్వీ వై,
స తేజస్వతో లోకాన్ భాస్వతో
అపహత తమస్కాన్ అభిసిద్ధ్యతి।
యావత్ తేజసోగతం
తత్ర అస్య యథా కామచారో భవతి,
యః 'తేజో బ్రహ్మ' ఇతి ఉపాస్తే।
<u>నారదుడు :</u>
"అస్తి, భగవ! తేజసో భూయ?" ఇతి
<u>సనత్కుమారుడు :</u>
"తేజసో వావ భూయో అస్తి – " ఇతి॥
<u>నారదుడు :</u>
"తత్ మే భగవాన్, బ్రవీతు" – ఇతి॥

ఎవ్వరైతే "తేజస్సు బ్రహ్మమే" అని దర్శిస్తూ బ్రహ్మోపాసన చేస్తారో - తేజోవంతుడౌతాడు. తన తేజస్సుతో లోకములకు వెలుగు ప్రసాదిస్తూ ఉంటాడు. చీకటిలేని లోకములలో ప్రవేశించి, తేజోమయం చేస్తూ ఉంటాడు. తేజోమయ లోకములలో తన ఇచ్ఛానుసారం విహరించగలిగినవాడై ఉంటాడు. తేజస్సు బ్రహ్మముగా దర్శిస్తూ బ్రహ్మముగా ఉపాసించుదురుగాక।

నారద మహర్షి : స్వామీ! తేజస్సు కన్నా అధికమై ఉపాసించవలసినది ఏదైనా ఉన్నదా?

సనత్కుమారుడు : అవును. తేజస్సుకన్నా 'భూరి' అయిన ఉపాసనా వస్తువు ఉన్నది.

నారద మహర్షి : భగవాన్! అదేమిటో కూడా దయచేసి నాకు ఉపదేశించండి.

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే ఏకాదశః ఖండః

# 7-12. ద్వాదశ ఖండము - "ఆకాశ ఉపాసన"

<u>సనత్కుమారుడు</u>

**1.** **ఆకాశో వావ తేజసో భూయాన్।**
**ఆకాశే <u>వై</u> సూర్యాచన్ద్రమసా ఉభౌ।**
**విద్యుత్ నక్షత్రాణి అగ్నిః।**
**ఆకాశేన ఆహ్వయతి।**
**ఆకాశేన శృణోతి।**
**ఆకాశేన ప్రతిశృణోతి।**
**ఆకాశే రమత - ఆకాశే న రమత।**
**ఆకాశే జాయత।**
**ఆకాశమ్ అభిజాయత**
**<u>ఆకాశమ్ ఉపాస్స్వేతి॥</u>**

సనత్కుమారుడు : తేజస్సు కంటే ఆకాశము అధికతరమైనది. ప్రాధాన్యమైనది.

ఆకాశములో సూర్యుడు, చంద్రుడు, విద్యుత్ (తేజస్సు), తారలు (నక్షత్రములు), అగ్ని - ఇవన్నీ స్థానము కలిగి ఆహ్వానితమై ఉన్నాయి.

ఆకాశమువలననే శబ్దమును వినగలుగుచున్నాము. మనము చేసిన శబ్దము కూడా (Resound) మనము ఆకాశము వలననే వినగలుగుచున్నాము.

మనమంతా రమిస్తున్నది, రమించనిది కూడా- ఆకాశమునందే।

ఆకాశము నుండే పుట్టుచున్నాము.

ఆకాశములోనికే తిరిగి వెళ్లుచున్నాము.

**అందుచేత "ఆకాశము బ్రహ్మమే" అని ఉపాసించబడు గాక।**

---

**2.** **స య 'ఆకాశమ్ బ్రహ్మ"**
**ఇతి ఉపాస్తే, ఆకాశవతో <u>వై</u>**
**స లోకాన్ ప్రకాశవతో,**
**అసం బాధాన్ ఉరుగాయవతో అభిసిద్ధ్యతి।**
**యావత్ ఆకాశస్య గతం**
**తత్రాస్య యథా కామచారో**
**భవతి, య "ఆకాశం బ్రహ్మ" ఇతి ఉపాస్తే।**
**<u>నారదుడు :</u>**
**"అస్తి భగవ, ఆకాశాత్ భూయ?" - ఇతి**
**<u>సనత్కుమారుడు :</u>**
**"ఆకాశాత్ వావ భూయో అస్తి" - ఇతి।**
**<u>నారదుడు :</u>**
**తత్ మే, భగవాన్। బ్రవీతు।"...ఇతి॥**

ఎవరైతే ఆకాశమును "ఇది బ్రహ్మము'' అని ఉపాసిస్తాడో, అట్టివాడు ప్రకాశవంతమైనట్టి, సంబంధ బంధములు ఉండనట్టి, బహువిస్తారములైనట్టి లోకములను బాగుగా సిద్ధించుకోగలడు.

"ఆకాశము బ్రహ్మము'' - అని ఉపాసించువాడు - ఆకాశము ఎంతవరకు విస్తరించి ఉంటే అంతవరకు ఇచ్ఛాపూర్వకంగా ఉనికి, సంచారములు పొంది ఉండగలడు.

నారద మహర్షి : మహాత్మా! ఆకాశము కంటే కూడా అధికమైనది ఉపాసనకై ఇంకా కూడా ఏదైనా ఉన్నదా?

సనత్కుమారుడు : ఆకాశము కంటే కూడా భూరి (అధికము, విస్తారము) అయినది ఉన్నది.

నారద మహర్షి : భగవాన్। అది ఏమై ఉన్నదో దయతో వివరించండి.

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే ద్వాదశః ఖండః**

## 7-13. త్రయోదశ ఖండము - "స్మర ఉపాసన"

| | |
|---|---|
| **సనత్కుమారుడు**<br>**1. 'స్మరో' వావ ఆకాశాత్ భూయః।**<br>**తస్మాత్ యత్ అపి బహవ**<br>**ఆసీః, అన్న స్మరన్తో,**<br>**నైవ తే కంచన శృణుయుః।**<br>**న మన్వీః। న విజానీరన్।** | సనత్కుమారుడు : ఆకాశము కంటే కూడా స్మరణము (Remembrance) గొప్పది. 'బహు' అయినట్టిది.<br>ఒకచోట చాలామంది ఆశీనులై ఉన్నారనుకో. వారంతా ఒకరి గురించి మరొకరు ఏమాత్రము స్మరించనప్పుడు - ఒకరు చెప్పేది మరొకరు వినరు. ఒకరి గురించి మరొకరు ఆలోచించరు. ఒకరి గురించి మరొకరు తెలియబడరు కూడా. |
| **యదా వావ తే స్మరేయుః,**<br>**అథ శృణుయుః,**<br>**అథ మన్వీరన్,**<br>**అథ విజానీరన్,**<br>**స్మరేణ వై పుత్రాన్ విజానాతి।**<br>**స్మరేణ పశూన్**<br>**స్మరమ్ ఉపాస్స్వ। ఇతి।** | వారంతా పరస్పరము స్మరించటము ప్రారంభించినప్పుడు మాత్రమే - ఒకరు చెపుతున్నది మరొకరు వినగలరు.<br>- ఒకరి గురించి మరొకరు మనస్సు పెట్టగలరు.<br>- ఒకరి గురించి మరొకరు తెలుసుకోగలరు. స్మరణచేతనే "ఈతడు నా కుమారుడు, ఇది పశువు'' - మొదలైన సమస్తము గుర్తించబడుచున్నాయి. అనుభూతపరచుకోబడుచున్నాయి.<br>**కాబట్టి నీవు "స్మరణశక్తి"ని బ్రహ్మముగా ఉపాసించెదవు గాక।** |
| **2. స యః 'స్మరమ్ బ్రహ్మ'**<br>**ఇతి ఉపాస్తే, యావత్ స్మరస్య గతం,**<br>**తత్ర అస్య యథా కామచారో భవతి,**<br>**యః "స్మరమ్ బ్రహ్మ" ఇతి ఉపాస్తే।**<br>**<u>నారదుడు :</u>**<br>**"అస్తి, భగవః స్మరాత్ భూయ?" ఇతి**<br>**<u>సనత్కుమారుడు :</u>**<br>**'స్మరాత్ వావ భూయో అస్తి।' - ఇతి।।**<br>**<u>నారదుడు :</u>**<br>**"తన్మే భగవాన్। బ్రవీతు।" ఇతి।।** | ఎవరైతే స్మరణశక్తిని బ్రహ్మముగా ఉపాసిస్తూ ఉంటాడో, అట్టివాడు స్మరణము ఉన్నంతవరకు స్వేచ్ఛగా ఇచ్ఛాపూర్వకమై (బంధరహితుడై) స్థితి పొంది ఉండగలడు.<br>నారదమహర్షి : మహానుభావన్। భగవాన్। 'స్మరణము' కంటే మించినది, అధికమైనది (ఉపాసనకై) ఏదైనా ఉన్నదా?<br>సనత్కుమారుడు : ఉన్నది. 'స్మరణము' కంటే అధికమైనది కలదు.<br>నారదమహర్షి : ఏమిటది? దయచేసి వివరించి చెప్పండి. |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే త్రయోదశః ఖండః**

# 7-14. చతుర్దశ ఖండము - "ఆశా ఉపాసన"

<u>సనత్కుమారుడు</u>

**1. 'ఆశా' వావ స్మరాత్ భూయస్య।**
**ఆశేద్ధో వై స్మరో మంత్రాన్ అధీతే।**
**కర్మాణి కురుతే।**
**పుత్రాగ్ంశ్చ పశూగ్ంశ్చ ఇచ్ఛత।**
**ఇమం చ లోకం అముం చ ఇచ్ఛత**
**ఆశామ్ ఉపాస్స్వ। ఇతి॥**

సనత్కుమారుడు : 'ఆశ' (కామము) అనునది స్మరణము (జ్ఞాపకము) కన్నా కూడా అధికమైనది.

జీవునిలోని స్మరణశక్తి 'ఆశ'చే ప్రేరేపించబడినప్పుడు మాత్రమే ఆతడు 'మంత్రము'ను ఉపాసించగలడు.

- 'ఆశ' చేతనే జీవుడు కర్మలు చేస్తున్నాడు.

- ఆశ చేతనే సంతానము, పశుసంపద మొదలైనవాటికొరకు ప్రయత్నశీలురై ఈ జీవుడు ఉంటున్నాడు. ఇహ-పర లోకములు ప్రయోజనములను 'ఆశ' చేతనే ప్రయత్నించటము, పొందటము జరుగుతోంది.

అందుచేత 'ఆశయే బ్రహ్మము" - అని ఉపాసించబడు గాక।

---

**2. స య "ఆశాం బ్రహ్మ"**
**ఇతి - ఉపాస్తే, ఆశయాస్య సర్వే**
**కామాః సమృధ్యన్త।**
**అమోఘా హా అస్య ఆశిషో భవన్తి।**

ఎవ్వరైతే 'ఆశ పరబ్రహ్మ స్వరూపమే' అని ఉపాసిస్తాడో, ఆతడు కోరుకొనే సమస్త కోరికలను (వాంఛితార్థములను) పూర్తిగా, సమృద్ధిగా పొందగలడు.

అమోఘముగా అవన్నీ సిద్ధించగలవు.

---

**యావత్ ఆశాయా గతం,**
**తత్రాస్య యథా కామచారో భవతి।**
**య 'ఆశాం బ్రహ్మ' ఇతి ఉపాస్తే।**

'ఆశ' అనునది ఎంతవరకు విస్తరించి ఉంటుందో - అంతవరకు ఆతనికి ఇష్టముగా అనిపించినదంతా పొందగలడు.

'ఆశయే బ్రహ్మము' అని ఉపాసించబడు గాక।

---

<u>**నారదుడు :**</u>
**"అస్తి భగవ। ఆశాయా భూయా?" - ఇతి!**
<u>**సనత్కుమారుడు :**</u>
**"ఆశాయా వావ భూయో అస్తి" - ఇతి॥**
<u>**నారదుడు :**</u>
**"తన్మే భగవాన్। బ్రవీతు।" - ఇతి॥**

శ్రీ నారద మహర్షి : గురువరేణ్యా। 'ఆశ' కంటే అధికమైనది ఉపాసనకొరకై ఇంకేమైనా ఉన్నదా?

శ్రీ సనత్కుమారుడు : ఎందుకులేదు! 'ఆశ' కంటే అధికమైన ఉపాసన వస్తువు ఉన్నది.

శ్రీ నారద మహర్షి : అది ఏది? భగవాన్। దయచేసి చెప్పండి.

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే చతుర్దశః ఖండః**

# 7-15. పంచదశ ఖండము - "ప్రాణోపాసన"

<u>సనత్కుమారుడు</u>

**1. ప్రాణో వావ ఆశయా భూయాన్।**
**యథా వా అరా నాభౌ సమర్పితా ఏవమ్,**
**'అస్మిన్ ప్రాణే సర్వం సమర్పితం।'**
**ప్రాణః ప్రాణేన యాతి।**
**ప్రాణః ప్రాణం దదాతి।**
**ప్రాణాయ దదాతి।**

శ్రీ సనత్కుమారులవారు : 'ప్రాణము' ఆశ కంటే భూయిష్టమైనది. అధికమైనది. ఉన్నతమైనది. గొప్పది.

ఒక రథచక్రము యొక్క నాభి (Central hub) వద్ద ఆకులు (spokes of wheel) బిగించి ఉంచిన తీరుగా - ప్రాణమునందు దృశ్య - దేహ - మనో - బుద్ధి - చిత్తములు అన్నీ కూడా బిగించబడినవై (సమర్పితమై) ఉన్నాయి. ప్రాణము ప్రాణశక్తి చేతనే చేతనమౌతోంది. ప్రాణమే ప్రాణమునకు ప్రాణము ప్రసాదిస్తోంది.

---

**ప్రాణో హ పితా। ప్రాణో మాతా।**
**ప్రాణో భ్రాతా। ప్రాణః స్వసా।**
**ప్రాణ ఆచార్యః। ప్రాణో బ్రాహ్మణః।**

**ప్రాణము - అనగా, ప్రియత్వము యొక్క శక్తిరూపమే।**

ప్రాణము తండ్రి! ప్రాణమే 'అమ్మ'। ప్రాణమే సోదరుడు। ప్రాణమే సోదరి (తోడబుట్టినది) । ఆచార్యులవారు ప్రాణస్వరూపులు। బ్రహ్మతత్త్వజ్ఞులగు బ్రాహ్మణులు - ప్రాణస్వరూపులే। ప్రాణమే ఆయా ప్రియరూపాలన్నీ కూడా!

---

**2. స యది పితరం వా, మాతరం వా**
**భ్రాతరం వా, స్వసారం వా,**
**ఆచార్యం వా, బ్రాహ్మణం వా,**
**కించిత్ భృశమ్ ఇవ**
**ప్రత్యాహ 'ధిక్' త్వ అస్తి।**
**ఇతి ఏవ ఏనం ఆహుః-**

అందుచేతనే నీకు ప్రాణస్వరూపులే అయి ఉన్న తండ్రినిగాని, తల్లినిగాని, సోదరునిగాని, సహోదరినిగాని, ఆచార్యులవారినిగాని, బ్రహ్మజ్ఞులగు బ్రాహ్మణునిగాని కించిత్ అనుచితంగా మాట్లాడితే అప్పుడు ఆ ప్రక్కవారు ''భృశమివ - తగనివిధంగా మాట్లాడుచున్నావేమయ్యా! ధిక్। నీకు ధిక్కారము అగుగాక।'' అంటూ ఉంటారు కదా.

---

**"పితృ హా వై త్వమ్ అసి।**
**మాతృ హా వై త్వమ్ అసి।**
**భ్రాతృ హా వై త్వమ్ అసి।**
**స్వసృ హా వై త్వమ్ అసి।**
**ఆచార్య హా వై త్వమ్ అసి।**
**బ్రాహ్మణ హా వై త్వమ్ అసి। - ఇతి।।**

ఇంకా కూడా ఆ దగ్గిరవారు (స్వతంత్రముగా ఉండువారు - తదితర బంధువులు) ఇట్లా ఉంటారు।

- మీ నాన్నగారిని దూషణగా మాట్లాడకు. వారిని చంపినంత పాపం నీకు వస్తుంది.
- అమ్మను ఏమీ అనకు! అమ్మను చంపినంత పాపం.
- సోదరునితో దుర్భాషలాడవద్దు! చంపినంత పాపం.
- సహోదరుని దూషించకు! చంపినంత దోషం సుమా!
- ఆచార్యులవారిని దూషించకు. వారిని చంపినంత దుష్ఫలితం!
- బ్రహ్మజ్ఞానులను చెడుమాటలనకు. బ్రహ్మహత్య అంత పాపం!

అని అతనితో మాట్లాడటం మానివేస్తారు.

---

**3. అథ యద్యపి ఏనాన్**
**ఉత్క్రాన్త ప్రాణాన్,**
**శూలేన సమాసం వ్యతిషంద హి**
**ఏన న ఏవ ఏనం బ్రూయుః**
**పితృహాసీతి। న మాతృహాసీతి।**

అదే మరొక సందర్భంలో తండ్రి గాని, తల్లిగాని, తదితరులుగాని మరణించినప్పుడు వారిని శ్మశానంలో (పితృవనంలో)దహనము చేసినప్పుడో-

"నీవు పితృ హంతకుడవు. మాతృహంతకుడవు. భ్రాతృ హంతకుడవు. సహోదరీ హంతకుడవు. ఆచార్య హంతకుడవు. బ్రాహ్మణ హంతకుడవు అని ఎవరైనా అంటారా? అనరు.

**న భ్రాతృహాసీతి। న స్వసృహాసీతి।**
**న ఆచార్యహాసీతి।**
**న బ్రాహ్మణహాసీతి।**

ఎందుచేత? ఆ దేహములో ఎప్పుడో ప్రాణము తొలగిపోయింది కనుక! శూలముతో ముక్కలు చేసినా, కాకులకు, గ్రద్దలకు ఆహారంగా వేసినా కూడా ''వీరిని చంపి బాధించావు. ప్రాణహాని చేసావు'' అని ఆపాదించరు.

---

**4.** **'ప్రాణో' హి ఏవ ఏతాని**
**సర్వాణి భవతి।**
**స వా ఏష ఏవం పశ్యన్ ఏవం,**
**మన్వాన ఏవం, విజానన్,**
**న అతివాదీ" భవతి।**
**తం చేత్ బ్రూయుః**
**అతివాద్యసీది।**
**"అతివాది అస్మి" ఇతి బ్రూయాత్ –**
**న అపహ్నువీత।।**

మనం పైన చెప్పుకున్నవారంతా ప్రాణస్వరూపులే అయి ఉన్నారు.

"ఈ జీవులంతా నా ప్రాణస్వరూపులే. అందుచేత అంతా నాకు ప్రియమైన వారే। వారిని నేను బాధించలేను" అని అన్నప్పుడు ఎవ్వరైనా

"నీవు అతివాదివిగా అగుచున్నావు. అతివాదివి కావద్దయ్యా!" - అంటే అనవచ్చుగాక।

అప్పుడు మనము వారితో ఏమని అనాలంటే, **"అవును. నేను ఈ ప్రాణము బ్రహ్మముగా, ప్రియముగా భావించటములో అతివాదినే!"** అనియే అనాలి. అంతేగాని వారన్నారని "ప్రాణస్వరూపభావన" నుండి తప్పుకోకూడదు.

సమస్తము తన ప్రాణస్వరూపంగా దర్శించేవాడు. ఆత్మభావన చేయువాడు ఆ విధంగానే భావిస్తాడు మరి!

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే పంచదశః ఖండః**

## 7-16. షోడశ ఖండము – సత్యము కొఱకు తీవ్ర విజిజ్ఞాస కలిగియుండాలి

**ఏష తు వా అతివదతి యః సత్యేన।**
**అతివదతి సోఽహం, భగవః। సత్యేన**
**అతివదాని ఇతి।**
**సత్యం తు ఏవ విజిజ్ఞాసితవ్యం। – ఇతి।**
**"సత్యం" – భగవో**
**విజిజ్ఞాస – ఇతి।।**

శ్రీ సనత్కుమారుడు : ఓ నారద మహర్షీ! సత్యజ్ఞానసంబంధమైన కేవలాత్మ గురించి చెప్పువాడు (లోకసంబంధమైన సంభాషణల దృష్ట్యా చూచినప్పుడు) - అతివదతి (అతివాది)యే అయి ఉంటున్నాడు.

శ్రీ నారద మహర్షి : స్వామీ! గురుదేవా! పరమార్థ సత్యవిజ్ఞానమును ఆశ్రయిస్తూ నేను అతివాదనుడను, అతివాదిని అయి అతివాదనము చేయు సంసిద్ధుడనై ఉన్నాను.

శ్రీ సనత్కుమారుడు : మనము పరమ సత్యముల పట్ల తీవ్ర జిజ్ఞాసువులము అయితేనే సత్యము అనుభవమై సిద్ధించగలదు. సత్యము పట్ల మాత్రమే విజిజ్ఞాసితులమై ఉండాలి.

శ్రీ నారద మహర్షి : హే సద్గురూ! భగవాన్, మీరు సూచన చేస్తున్నట్లు నేను పరాకాష్ఠ సత్యము కొరకే తెలుసుకోవటానికి సంసిద్ధుడనై (విజిజ్ఞాసుడనై) ఉంటాను.

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే షోడశః ఖండః**

## 7-17. సప్తదశ ఖండము - సత్యము గురించిన విజ్ఞానమే తెలుసుకోవాలి

యదా వై విజానాతి,
అథ సత్యం వదతి।
న అవిజానన్ సత్యం వదతి।
విజానన్ ఏవ సత్యం వదతి।
విజ్ఞానం త్వ ఏవ విజిజ్ఞాసితవ్యమ్
ఇతి విజ్ఞానం, భగవో - విజిజ్ఞాస ఇతి॥

శ్రీ సనత్కుమారుడు : ఈ జీవుడు సత్యము తెలియనంతవరకు అసత్యమునే ఆశ్రయిస్తూ అట్టి అసత్యము గురించియే తర్జన భర్జనలు, వాదోపవాదములు, వ్యవహారములు సంభాషిస్తూ ఉంటాడు. 'సత్యము' ఏమిటో తెలిసిందా - ఇక 'సత్యము' మాత్రమే సంభాషిస్తాడు. అందుచేత సత్యమును గురించిన విజ్ఞానము కొరకే విజ్ఞాని తవ్యుడవై ఉండాలి. వాంఛించాలి.

శ్రీ నారదమహర్షి : గురువర్యా! మీరు గుర్తు చేస్తున్న విధంగా సత్యము గురించే విజ్ఞానవిశేషుడను కాగలను. సత్యము కొరకే నిమగ్నుడను అయి ఉంటాను.

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే సప్తదశః ఖండః

## 7-18. అష్టాదశ ఖండము - మతితో సత్యమును మననము చేస్తూ ఉండాలి

1. యదా వై మనుతే అథ
విజానాతి నామత్వా విజానాతి।
మత్వైవ విజానాతి।
మతిస్త్వేవ విజిజ్ఞాసి తవ్యేతి।
మతిం, భగవో। విజిజ్ఞాస। ఇతి॥

శ్రీ సనత్కుమారుడు : అయితే సత్యము స్వానుభవమై నిర్దుష్టంగా తెలిసేది ఎట్లా? అందుకు "సత్యము యొక్క మననము" - మార్గము. మానవుడు సత్యమును మననము చేతనే తెలుసుకోగలడు. మననము లేకపోతే తెలుసుకోవటము అనుభవమునకు రాదు. మననముచే సత్యమును తప్పక తెలుసుకోగలడు. మననము ద్వారా మతి (బుద్ధి) తో 'సత్యము'ను ధృవీకరించుకోవాలి.

శ్రీ నారద మహర్షి : భగవాన్! ఆత్మపట్ల, పరమసత్యముపట్ల మననము చేయుటకై విజిజ్ఞాసుడనై (సమోత్సాహినై, తెలివిని వినియోగిస్తూ) ఉంటాను.

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే అష్టాదశః ఖండః

## 7-19. ఏకోనవింశ ఖండము - శ్రద్ధ చేతనే మననము సాధ్యము

1. యదా వై శ్రద్ధధాతి
అథ మనుతే।
న అశ్రద్ధధన్ మనుతే।
శ్రద్ధధత్ ఏవ మనుతే।
శ్రద్ధా త్వేవ విజిజ్ఞాసి తవ్యేతి।
శ్రద్ధాం భగవో విజిజ్ఞాస - ఇతి॥

శ్రీ సనత్కుమారుడు : అయితే సత్యము గురించిన మననము ఎప్పుడు సాధ్యపడుతుంది? శ్రద్ధచేతనే మననము సాధ్యం. అశ్రద్ధ కలవాడికి ఆత్మ గురించిన మననము ఘనీభూతమవదు.

(శ్రద్ధావంతుడు) శ్రద్ధ కలిగి ఉంటేనే మననము వలననే విజిజ్ఞాసము (సత్యము తెలియరావటము) జరుగగలదయ్యా!

శ్రీ నారదమహర్షి : గురుదేవా! శ్రద్ధను కలిగి సత్యమును తెలియటానికై ప్రయత్నవంతుడను - మీరు చెప్పే విధంగా - అగుచున్నాను.

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే ఏకోనవింశః ఖండః

## 7-20. వింశ ఖండము - నిష్ఠ చేతనే శ్రద్ధ బలపడుతుంది

**1. యదా వై నిస్తిష్ఠతి అథ శ్రద్ధధాతి।**
**న అనిస్తిష్ఠన్ శ్రద్ధధాతి।**
**నిస్తిష్ఠన్ ఏవ శ్రద్ధ ధాతి।**
**నిష్ఠా త్వేవ విజిజ్ఞాసితవ్యేతి।**

**నిష్ఠాం, భగవో। విజిజ్ఞాస। ఇతి॥**

శ్రీ సనత్కుమారుడు : శ్రద్ధ ఎట్లా ఏర్పడుతుంది? నిశ్చయముతో కూడిన నియమరూపమగు 'నిష్ఠ' చేతనే శ్రద్ధ బలపడుతుంది. నిష్ఠ (ప్రాతఃమధ్యాహ్న సాయం ఇత్యాది సమయములలో సాధనకు సంబంధించిన నియమ పాలన) లేనివాడు అశ్రద్ధవంతుడే అవుతాడు.

(కాలనియమము మొదలైనవి) చేతనే శ్రద్ధ బలపడగలదు. అందుచేత నిష్ఠతో ఆత్మతత్త్వము పట్ల విజిజ్ఞాసితుడవు (తెలుసుకొన్నవాడు అగుము. నిష్ఠను తెలుసుకొని ఉండుము)

శ్రీ నారదమహర్షి : హే భగవాన్! నిష్ఠతో నియమములను ఆశ్రయించి ఆత్మ గురించి విజిజ్ఞాసుడను అవుతాను.

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే వింశః ఖండః

## 7-21. ఏకవింశ ఖండము - కర్మానుష్ఠానము చేతనే నిష్ఠ బలపడుతుంది

**1. యదా వై కరోతి అథ నిస్తిష్ఠతి।**
**న అకృత్వా నిస్తిష్ఠతి।**
**కృత్వైవ నిస్తిష్ఠతి।**
**కృతిస్త్వ ఏవ విజిజ్ఞాసితవ్యేతి।**
**కృతిం భగవో విజిజ్ఞాస - ఇతి॥**

శ్రీ సనత్కుమారుడు : అయితే, నారదమహర్షీ! "నేను నిష్ఠ-నియమముగానే ఉంటాను" అంటే సరిపోదు. కర్మానుష్ఠానము చేతనే నిష్ఠ బలపడుతుంది. కర్మను అనుష్ఠిస్తూ ఉన్నప్పుడే ఒకడు నిష్ఠాపరుడు - అని అనిపించుకోగలడు. "అంతేగాని మాకు చాలా నియమాలు ఉన్నాయి" - అనునది 'నిష్ఠ' అని అనిపించుకోదు. విజ్ఞానము కొరకై "ప్రాణాయామము, మంత్రోపాసన, లోకకళ్యాణార్థం కర్మలు" - మొదలైనవి నిర్వర్తిస్తున్నవాడవై ఉండండి. తద్వారా ఆత్మ గురించిన ఎరుక నిశ్చలం చేసుకోండి.

శ్రీ నారదమహర్షి : భగవాన్! కర్మానుష్ఠానముతో నిష్ఠను వృద్ధి చేసుకొంటూ ఆత్మజ్ఞానమును సుస్థీకరించుకుంటూ ఉంటాను.

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే ఏకవింశః ఖండః

## 7-22. ద్వావింశ ఖండము - హఠంతో కాకుండా సుఖముగా కర్మలను ఆచరించాలి

**1. యదా వై సుఖం లభతే,**
**అథ కరోతి న అసుఖం లబ్ధ్వా కరోతి।**
**సుఖమేవ లబ్ధ్వా కరోతి।**
**సుఖం తు ఏవ విజిజ్ఞాసితవ్యమ్ ఇతి।**
**సుఖం, భగవో।**
**విజిజ్ఞాస - ఇతి॥**

శ్రీ సనత్కుమారుడు : కర్మానుష్ఠానము దేహానుకూలమును దృష్టిలో పెట్టుకొని సుఖముగా చేయాలి. ఇంద్రియములను బాధించి హఠంగా కర్మలు చేసి ఇంద్రియ బలహీనతలను తెచ్చిపెట్టుకోరాదు. ఎందుకంటే సుఖంగా ఉన్నప్పుడే ఈ మానవుడు అనుష్ఠానం నిర్వర్తించి, నిష్ఠాపరుడై శ్రద్ధను పరిపోషించుకుంటూ, సత్యము కొరకై విజిజ్ఞాసుడు కాగలడు. అనుష్ఠానము తనను, ఇతరులను శారీరకంగా, మానసికంగా బాధించేది కాకూడదు. ఆత్మసుఖమే ఆశయం కావాలి.

శ్రీ నారదమహర్షి : భగవాన్। ప్రాణమును సుఖంగా ఉంచుతూనే కర్మానుష్ఠానము నిష్ఠతో శ్రద్ధగా నిర్వర్తిస్తూ ఆత్మజ్ఞాన తత్పరుడను అవుతాను. సుఖమును కోల్పోయి విజిజ్ఞాసుడను అవను.

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే ద్వావింశః ఖండః

## 7-23. త్రయోవింశ ఖండము - భూమా సుఖమే లక్ష్యము

1. యో వై భూమా తత్సుఖం।
న అల్పే సుఖమస్తి।
భూమా ఏవ సుఖం।
భూమా తు ఏవ విజిజ్ఞాసితవ్య ఇతి।
భూమానం భగవో।
విజిజ్ఞాస ఇతి॥

శ్రీ సనత్కుమారుడు : ఆత్మానందము సుఖప్రదమైనదేగాని, శరీరమును శోషించటము, జీవితమును కష్టతరం చేసుకోవటము కాదు. అయితే ఆత్మసుఖములు (ఇంద్రియ సుఖములు) జీవితాశయం కానేకాదు. అది అనేక దుఃఖములకు, బంధములకు దారి తీసేవే. ఆత్మసుఖమే (ఆత్మజ్ఞానమే) భూమా సుఖము. భూమా సుఖమే ఆత్మజ్ఞానము. ఆత్మను ఎరుగుట ఆనందమైన విషయమని ఎరిగి ఉండాలి. భూమా సుఖమే జీవితాశయము.

శ్రీ నారద మహర్షి : భగవాన్! శ్రీ సనత్కుమార గురుదేవా! అట్టి భూమానందమే కర్మలయొక్క మహదాశయముగా ఎరిగి విజిజ్ఞాసుడనై ఉంటాను.

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే త్రయోవింశః ఖండః

## 7-24. చతుర్వింశ ఖండము - భూమా స్వరూపము

1. యత్ర న అన్యత్ పశ్యతి,
న అన్యత్ శృణోతి,
న అన్యత్ విజానాతి, స 'భూమా'।

అథ యత్ర అన్యత్ పశ్యతి,
అన్యత్ శృణోతి, అన్యత్
విజానాతి - తత్ 'అల్పమ్'।

శ్రీ నారద మహర్షి : 'భూమ' (The Beyond, the Highest) మరియు "అల్పము" అని దేనిదేనిని శాస్త్రంలో అంటూ ఉన్నారు?

శ్రీ సనత్కుమారుడు : ఏ స్థితి (లేక) స్థానమునందు 'అన్యము' అనేదే కనిపించదో, 'అన్యము' అనేది వినిపించదో, అన్యము ఏదీ తెలియరాదో - అట్టి అనన్యమును, సమము - సమస్తము అగు దానిని - "భూమా" అని అంటారు.

ఏ స్థితి (లేక) స్థానము నుండి అన్యము అనుభవమగుచున్నదో (జీవుడు వేరు - పరమాత్మ వేరు, జీవుడు బద్ధుడు - మొదలైనవి) అధికాధికంగా తెలియబడుచున్నదో - అద్దానిని "అల్పము" అని పిలుస్తూ ఉంటారు.

---

యో వై భూమా, తత్ అమృతమ్।
అథ యత్ అల్పమ్ తత్ మర్త్యమ్।
స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి?
స్వే మహిమ్ని।
యది వా న మహిమ్ని - ఇతి।

ఏది భూమమో - అది 'అమృతము'. ఏది అల్పమో - అది 'మర్త్యము'.

శ్రీ నారదమహర్షి : గురుదేవా! అట్టి "భూమ" అనునది దేనియందు ప్రతిష్ఠితమై (Placed in) ఉన్నది?

శ్రీ సనత్కుమారుడు : అట్టి "భూమ" తన మహిమ యందు తానే ప్రతిష్ఠితమైయున్నది. ఇంకా చెప్పాలంటే, తన మహిమయందు తాను ప్రతిష్ఠితమై లేదు కూడా! ఎందుకంటే, అది సర్వదా నిరాలంబము. సమస్తము.

---

2. గో అశ్వమ్ ఇహ మహిమేతి అచక్షతే।
హస్తి హిరణ్యం దాస భార్యం
క్షేత్రాణి ఆయతనాని - ఇతి।
"న అహమ్ ఏవం బ్రవీమి - ఇతి।"
హోవాచ :
అన్యోహి అన్యస్మిన్
ప్రతిష్ఠిత" - ఇతి॥

కొందరు ఈ విధంగా అంటూ ఉన్నారు.

అట్టి అమృతమగు "భూమ" గోవునందు, గుఱ్ఱముయందు, ఏనుగు యందు, బంగారమునందు, దాస జనమునందు, భార్యయందు-సర్వక్షేత్రములందు మహిమా - సమన్వితమై ఉన్నది.

కానీ, నేను అట్లా అనుకోవటము లేదు. సమస్తము ఆత్మయే అయి, ఆత్మయొక్క మహిమ స్వరూపులే అయి ఉన్నారు. ఆత్మయే అన్యమునందు అన్యముగా ప్రతిష్ఠితమైయున్నది.

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే చతుర్వింశః ఖండః

# 7-25. పంచవింశ ఖండము - భూమా సమస్తము నేనే

| మం. శ్లో॥ (స-ఆదేశ ఏవ) | |
|---|---|
| 1. "స" ఏవ అధస్తాత్ స ఉపరిష్టాత్।<br>స పశ్చాత్ స పురస్తాత్ । స దక్షిణతః।<br>స ఉత్తరతః। స ఏవ ఇదగ్ం సర్వం।<br>ఇతి అథాతో 'అహంకార' ఆదేశ ఏవ।<br>అహమ్ ఏవ అధస్తాత్<br>అహమ్ ఏవ ఉపరిష్టాత్।<br>అహమ్ పశ్చాత్<br>అహమ్ పురస్తాత్।<br>అహమ్ దక్షిణతో।<br>అహమ్ ఉత్తరతో।<br>**అహమేవ ఇదగ్ం సర్వమ్ ఇతి॥** | సనత్కుమారుడు : (నవలా రచయిత నవలంతా నిండి ఉన్నట్లు, స్వప్న ద్రష్టయే స్వప్నమంతా ఊహారూపంగా ఉన్నట్లుగా) - సర్వజీవుల స్వస్వరూపమే అయి ఉన్న ఆత్మయే (భూమయే)<br>క్రింద, పైన, వెనుకవైపున, ముందువైపున అన్ని ప్రక్కలయందు (All Sides) అంతటా అప్రతిహతంగా నిండి ఉన్నది. దక్షిణ, ఉత్తర దిక్కులలో (నిండుకుండలోని నీరులాగా) నిండి ఉన్నది. ఈ కనబడేదంతా ఆత్మయొక్క ప్రత్యక్ష స్వరూపమే।<br>"భూమ"యే సమస్తమునందు ఆక్రమించి, సమస్తముగా వేంచేసి ఉన్నదని చెప్పుకున్నాము కదా! ఇప్పుడు 'భూమ'యే సర్వజీవులలో 'నేను'గా (అహమ్)గా కూడా ఏర్పడి ఉన్నట్లే కాబట్టి 'ఆత్మ' శబ్దమునకు 'భూమాఽహమ్'ను ఆదేశము చెప్పుకుందాము.<br>ఆత్మయే నేను కాబట్టి ఆత్మనగు నేనే సమస్త దృశ్యమునకు క్రింద, పైన, ఆవల, ఈవల, ముందు - వెనుక, దక్షిణంగాను, ఉత్తరంగాను, తూర్పు-పడమరగాను ఏర్పడి ఉన్నవాడనై, ఈ సమస్తము నేనే అయి ఉన్నాను. |
| 2. అథాత "ఆత్మా" ఆదేశ ఏవ।<br>ఆత్మైవ అధస్తాత్। ఆత్మా ఉపరిష్టాత్।<br>ఆత్మా పశ్చాత్। ఆత్మా పురస్తాత్।<br>ఆత్మా దక్షిణత। ఆత్మా ఉత్తరతా।<br>**ఆత్మైవా ఇదగ్ం సర్వమ్ ఇతి।** | "భూమా అహమ్" గురించి చెప్పుతీరుగానే "ఆత్మ" అనే దానికి కూడా ఆదేశము - ఎట్లా అంటే -<br>ఆత్మయే సమస్తమునకు క్రింద, పైన, ఆవల, ఈవల, ముందు, వెనుక, తూర్పు - పడమర - దక్షిణ - ఉత్తరంగాను ఆక్రమించి ఉండి, సమస్తము ఆత్మయే అయి ఉన్నది. |
| స వా ఏష ఏవం పశ్యన్ ఏవం మన్వాన,<br>ఏవం విజానన్....<br>ఆత్మ రతిః। ఆత్మ క్రీడ।<br>ఆత్మ మిథున। ఆత్మానందః స స్వరాట్ భవతి।<br>తస్య సర్వేషు లోకేషు<br>కామచారో భవతి। | ఈ విధంగా ఎప్పుడైతే స్వస్వరూపమగు ఆత్మను చూస్తూ, మననం చేస్తూ ఎరుక కలిగి ఉంటామో...ఇకప్పుడు<br>• ఆత్మయందే సర్వదా రమిస్తూ ఉన్నవారమై ఉంటాము.<br>• ఆత్మ అనే 'ఆట' స్థలంలో ఎల్లప్పుడు క్రీడించువారమై ఉంటాము.<br>• ఆత్మతో మాత్రమే పరస్పరము కలసి "నేను - ఆత్మ" సయోగపరులమై (మిథునమై) ఉంటాము.<br>• ఆత్మానంద స్వారాజ్య సామ్రాజ్యమునందు రాజాధిరాజుగా అభిషిక్తులమై ఉంటాము.<br>• ఆత్మయందే సర్వలోకములందు ఇష్టానుసారముగా చరిస్తూ ఉంటాము. |
| అథ యే అన్యథాతో విదుర<br>అన్య రాజానః తే<br>'క్షయ' అలోకా భవన్తి।<br>తేషాం సర్వేషు లోకేషు<br>అకామచారో భవతి॥ | అట్టి ఆత్మ గురించిన దర్శన, మనన , ఎరుకలను సిద్ధింప జేసుకొన్నవాడు -<br>- సమస్త లోకములలో ఇచ్ఛాపూర్వకంగా నిత్య స్వాతంత్రుడై సంచరించగలడు.<br>"ఎవ్వడైతే ఆత్మ (లేక) పరమాత్మ (లేక) భూమ - అనునది నాకు వేరుగా ఎక్కడో ఉన్నది. ఎన్నటికో అది సిద్ధించాలి" - అని అనుకుంటాడో - అట్టివాడు మరొక 'రాజు'కు లోబడి జీవిస్తున్నవానివలె ఉంటాడేగాని స్వాతంత్ర్యమగు మోక్షస్వరూపుడు కాలేడు.<br>• క్షయించు స్వభావముగల లోకములలోనే తిరుగాడుతూ ఉంటాడు.<br>• ఇచ్ఛానుసారంగా కాకుండా, అస్వతంత్రుడై ఉంటాడు. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే పంచవింశః ఖండః

## 7-26. షడ్వింశ ఖండము - భూమా విద్య ఉపాసన, అభ్యాస ఫలశృతి

1. తస్య హ వా ఏతస్య ఏవం
పశ్యత
ఏవం మన్వానస్య ఏవం విజానత
**ఆత్మతః ప్రాణ। ఆత్మతః ఆశా।**
**ఆత్మతః 'స్మర' ఆత్మతః ఆకాశ।**
**ఆత్మతః తేజ। ఆత్మతః ఆప।**
**ఆత్మత ఆవిర్భావ - తిరోభావావ।**
**ఆత్మతో అన్నమ్।**
**ఆత్మతో బలమ్।**
**ఆత్మతో విజ్ఞానమ్।**
**ఆత్మతో ధ్యానమ్।**
**ఆత్మతః చిత్తం।**
**ఆత్మతః సంకల్ప।**
**ఆత్మతో మన।**
**ఆత్మతో వాక్।**
**ఆత్మతో నామా।**
**ఆత్మతో మంత్రా**
**ఆత్మతః కర్మాణి।**
**ఆత్మతః కార్యాత్।**
**ఆత్మత ఏవ ఇదగ్ం**
**సర్వమ్ - ఇతి॥**

ఓ నారదా! ఎవ్వరైతే తమయొక్క వాస్తవ, అనునిత్య ఆత్మ (లేక) భూమా స్వరూపము గురించి చూడటము, మననము చేయటము, ఎరిగి ఉండటము సిద్ధించుకుంటారో - అట్టి ఆత్మతత్త్వజ్ఞాని (లేక) తత్త్వదర్శికి....ఈవిధంగా స్వాభావికానుభవం అవుతోంది.

- ఆత్మ వలననే 'ప్రాణము' - ప్రాణము ఆత్మయే।
- ఆత్మ వలననే 'ఆశ' - ఆశ ఆత్మస్వరూపమే।
- ఆత్మ వలననే స్మరణము - స్మరణము ఆత్మ స్వరూపమే।
- ఆత్మ వలననే తేజస్సు - తేజస్సు ఆత్మస్వరూపమే।
- ఆత్మ వలననే జలము - జలము 'ఆత్మస్వరూపమే'।
- ఆత్మ వలననే ఆవిర్భావ - తిరోభావములు (రాక-పోకలు, జన్మ-మృత్యువులు). అట్టి ఆవిర్భావ తిరోభావములు ఆత్మస్వరూపమే।
- ఆత్మ వలననే అన్నము। అన్నము ఆత్మస్వరూపమే।
- ఆత్మ వలననే బలము। బలము ఆత్మస్వరూపమే।
- ఆత్మ చేతనే విజ్ఞానము (తెలివి)। విజ్ఞానము (తెలివి) ఆత్మ స్వరూపమే.
- ఆత్మ చేతనే ధ్యానము। ధ్యానము (ధ్యాస) ఆత్మస్వరూపమే।
- ఆత్మ చేతనే చిత్తము- చిత్తము ఆత్మ స్వరూపమే।
- ఆత్మ చేతనే మననము - మననము ఆత్మ స్వరూపమే!
- ఆత్మ చేతనే వాక్కు। వాక్కు ఆత్మస్వరూపమే।
- ఆత్మ చేతనే నామాత్మకమైనదంతా। నామరూపాత్మక మైనదంతా ఆత్మయే।
- ఆత్మ చేతనే మంత్రము। 'మనావాత్ త్రాయతే' అనబడు మంత్రము ఆత్మస్వరూపమే।
- ఆత్మ చేతనే కార్యము। సమస్త కార్యములు ఆత్మస్వరూపమే।

**ఆత్మచేతనే ఈ కనబడుచున్న సమస్తము**
**సంకల్ప మాత్రంగా పరిఢవింపజేయబడుతోంది.**

**ఆత్మయే సత్యము.**
**ఆత్మ అనన్యము.**
**ఆత్మకు వేరై ఎక్కడా ఏదీ లేదు.**

| | |
|---|---|
| **2.** **తత్ ఏష శ్లోకః।**<br>**న పశ్యో మృత్యుం। పశ్యతి**<br>**న రోగం। నోత దుఃఖతామ్।**<br>**సర్వం హ పశ్యః పశ్యతి సర్వం**<br>**ఆప్నోతి సర్వశ ఇతి।** | ఆత్మ గురించిన శ్లోకము (గానము) ఈ రీతిగా తత్త్వదర్శులచే చెప్పబడుతోంది.<br>ఆత్మగురించి - భూమ, సమస్తము, స్వస్వరూపము దర్శిస్తూ, మననము చేస్తూ సవిజ్ఞాతుడైనవాడు.<br>• ఆతడు మృత్యువును చూడడు. ఆవల ఈవల ఏర్పడి ఉన్న ఆత్మామృతమునే చూస్తాడు.<br>• రోగమును చూడడు. దేహమునకు సాక్షి అగు దేహినే గమనిస్తాడు.<br>• దుఃఖమును చూడడు. సర్వత్రా ఆత్మానందమునే ఆస్వాదిస్తాడు.<br>• చూడబడేది చూడడు. ద్రష్టకు కూడా సాక్షి అగు 'ఆత్మ' లేక భూమ చూస్తాడు.<br>• సర్వము తానే అయి, సమస్తమును సర్వదా పొందినవాడై ఉంటాడు. |
| **స ఏకధా (1) భవతి। త్రిధా (3) భవతి।**<br>**పంచధా (5) సప్తదా (7) నవధా (9) చ ఏవ।**<br>**పునశ్చ ఏకాదశః (11) స్మృతః।**<br>**శతం చ (100) దశ చ (10) ఏకశ్చ**<br>**సహస్రాణి (1000) చ వింశతిః (20)** | • అట్టి ఆత్మ - మొట్టమొదటగా ఏకమే అయి ఉన్నది.<br>• ఆ ఏకమే త్రివిధములుగా (అనుభవి-అనుభవము -అనుభవింపబడునది Experiencer, Experiencing, Experiencedగా) అగుచున్నది.<br>• ఆ తరువాత '5'గా, '7'గా, '9'గా అగుచున్నది.<br>• మరల "11' స్మృతమగుచున్నది.<br>ఆ పరమాత్మయే '100'గా '10'గా, ఏకముగా, కూడా అగుచు లీలాగా కడు వేలాది రూపములుగా అయి వినోదిస్తున్నారు. |
| **ఆహార శుద్ధౌ – సత్త్వశుద్ధిః।**<br>**సత్త్వశుద్ధౌ – ధ్రువా స్మృతిః।**<br>**స్మృతి లమ్భే...సర్వగ్రంథీనాం విప్రమోక్షః।** | ఇదంతా కూడా స్వస్వరూపాత్మయొక్క ఆనంద లీలావినోదమే. |
| **తస్మై మృదిత కషాయాయ**<br>**తమసః పారం దర్శయతి।**<br>**భగవాన్ సనత్కుమారః!**<br>**తం 'స్కంద' ఇతి ఆచక్షతే।।**<br>**తం "స్కంద" ఇతి ఆచక్షతే।।** | అట్టి స్వస్వరూపాత్మకంగా సమస్తము కూడా సర్వదా అయి వినోదిస్తున్న భౌమానుభవం అప్రతిహతము, అనునిత్యము అవటానికై<br>"ఇంద్రియానుభవముల శుద్ధి" అనబడే ఆహారశుద్ధిచే - సత్త్వము (బుద్ధి) శుద్ధి పొందగలడు.<br>బుద్ధియొక్క శుద్ధిచే - స్మృతి (ఆత్మగురించిన అనంతత్వ, అప్రమేయత్వ- ఇత్యాదుల జ్ఞాపకము) ధ్రువమౌతుంది.<br>స్మృతి లభిస్తూ ఉండగా - బ్రహ్మ - విష్ణు - రుద్ర గ్రంథులు విడివడతాయి. 'సృష్టి నిజమే' అనే నమ్మకము పటాపంచలౌతుంది.<br>దృశ్య సంబంధమైన భేదులన్నీ తొలగిపోగా తమస్సుకు (Ignorance) ఆవలగల ఆత్మయొక్క తత్త్వము సందర్శనమౌతుంది.<br>హే భగవాన్। సనత్కుమార సద్గురు వరేణ్యా। మీరు జీవాత్మ - పరమాత్మల తత్త్వము స్కందము (ఖండనము) చేసి ఏకస్వరూపమగు భూమా విద్యను ప్రసాదించారు.<br>అందుచేత మీరు 'స్కందులు'గా స్తుతిస్తూ, నమస్కరిస్తున్నాము. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - సప్తమాధ్యాయే షడ్వింశః ఖండః

**ఇతి - ఛాందోగ్యోపనిషది - సప్తమ అధ్యాయః సమాప్తః।।**

# ఛాందోగ్యోపనిషత్
# 8వ అధ్యాయము
## 8-1. ప్రథమః ఖండః - దహర విద్య

**1.** **హరిః ఓం। అథ।**
**యత్ ఇదమ్ అస్మిన్ బ్రహ్మపురే**
**దహరం పుణ్డరీకం వేశ్మ।**
**దహరో అస్మిన్ అంతరాకాశః।**
**తస్మిన్ యత్ అంతః**
**తత్ అన్వేష్టవ్యం।**
**తత్ వావ విజిజ్ఞాసితవ్యమ్।। ఇతి।।**

**అంతా ఓంకారానంద స్వరూపమే!**

శిష్యుడు : గురువర్యా! నమో నమః శరీరధారులమై, దృశ్యములో సంచారము చేస్తున్న మేము - బ్రహ్మమును ఎట్లా వెతకాలి? ఎట్లా అన్వేషించి తెలుసుకోవాలి?

గురుదేవుడు : ఓ ఆత్మానంద స్వరూపులారా। వినండి. బ్రహ్మము, బ్రహ్మపురి గురించి - ఈ శరీరమే బ్రహ్మము ఉనికి కలిగియున్న 'బ్రహ్మపురము'.

- అట్టి ఈ బ్రహ్మపురములో సమస్తమునకు ఉత్పత్తి స్థానమగు దహర (హృదయ) ఆకాశము.
- అట్టి దహరాకాశములో అంతర్ - హృదయమగు అంతరాకాశము అనే పుష్పము.
- అట్టి మనయొక్క అంతరాకాశములో అంతరముగా ఉన్నదే ఏమై ఉన్నదో...
- అద్దాని కోసము అన్వేషణ చేయాలి.
- అదియే తెలుసుకోవలసియున్నట్టిది.

---

**2.** **తం చేత్ బ్రూయుః యత్ ఇదమ్?**
**అస్మిన్ బ్రహ్మపురే**
**దహరం పుండరీకం వేశ్మ।**
**దహరో అస్మిన్ అంతరాకాశః।**
**కిం తత్ అత్ర విద్యతే యత్ అన్వేష్టవ్యం**
**యత్ వావ విజిజ్ఞాసితవ్యం?**
**ఇతి।। - స బ్రూయాత్।।**

శిష్యుడు : అట్టి హృదయాకాశాంతర్గత పద్మములోగల అంతరాకాశములో ఏమి ఉన్నదో? ఎట్లా తెలుస్తుంది?

గురుదేవుడు : అట్టి బ్రహ్మపురములోని దహరాకాశములోని పుండరీకము (పద్మము)ను శోధన చేయాలి సుమా! అందులో అంతరాకాశము ఉన్నదయ్యా!

శిష్యుడు : అట్టి బ్రహ్మపుర - హృదయాకాశపు అంతరాకాశంలో ఏది వెతుకవలసినదో, ఏది తెలుసుకోవలసినదో - మాకు ఎట్లా అవగాహన కావాలి? జిజ్ఞాస కలిగి ఉండవలసినది దేని గురించి?

---

**3.** **యావాన్ వా అయమ్ ఆకాశః।**
**తావాన్ - ఏషో అంతర్ హృదయ ఆకాశ।**
**ఉభే అస్మిన్ ద్యావా - పృథివీ అంతరేవ సమాహితే।**
**ఉభావః అగ్నిశ్చ**
**వాయుశ్చ - సూర్యాః - చంద్రమసా।**

గురుదేవుడు : బిడ్డా। ఈ ఎదురుగా కనిపిస్తున్న (పంచ భూతముల లోని) భౌతికాకాశము ఎంతగా అనంతమైయున్నదో అంతగానూ హృదయపద్మములోని ఆకాశము విస్తారము, అనంతము అయి ఉన్నది.

ఇక్కడి ఆకాశము, భూమి కూడా కళ్లకు బాహ్యముగా కనిపిస్తూ ఉన్నప్పటికీ - ఈ రెండూ కూడా అంతరాకాశమునందే సమాహితము (Situated) అయి ఉన్నాయి.

అట్టి దహర (హృదయ) ఆకాశములోనే అగ్ని - వాయువు, సూర్య-చంద్రులు ఏర్పడినవై ఉన్నారు.

---

**ఉభౌ విద్యుత్ - నక్షత్రాణి।**
**యత్ చ అస్య ఇహ అస్తి, యత్ చ నాస్తి...**
**సర్వం తత్ అస్మిన్**
**సమాహితం - ఇతి।।**

ఇక్కడి విద్యుత్ (తేజోశక్తి), నక్షత్రములు ఉభయము కూడా హృదయాకాశములోనే ఉన్నాయి.

ఇక్కడ ఉన్నవన్నీ కూడా హృదయ పద్మములోని అంతరాకాశములోనే స్థానము కలిగియున్నవి.

అంతేకాదు. ఇక్కడ లేనివి కూడా। సర్వము అట్టి అంతరాకాశములో సమాహితమై (Having their place) ఉన్నాయి.

**4.** తం చేత్ బ్రూయుః
అస్మింశ్చేత్ ఇదం
బ్రహ్మపురే సర్వం సమాహితం।
సర్వాణి చ భూతాని। సర్వే చ కామా।
యత్ ఏతత్ జరా వా ఆప్నోతి
ప్రధ్వంసతే వా, కిం
తతో అతిశిష్యత? ఇతి॥

శిష్యుని ప్రశ్న : స్వామీ! ఈ ఇంద్రియములకు కనబడుచున్న సమస్తము ఈ భూత (జీవ) జాలము, సర్వజీవుల కామనములు (కోరికలు, ఆశలు, లక్ష్యములు) బ్రహ్మపురములోనే (హృదయము లోపలే) సమాహితమై ఉన్నాయని మాకు ఒక క్రొత్త విషయం బోధిస్తున్నారు.

అట్టి భూతజాలములు, వారి వారి కామనములు (Desires and Expectations) ఇవన్నీ కాలక్రమేణా వృద్ధాప్యము, మరణము పొందటం చూస్తున్నాము కదా! మరణము సంభవించిన తరువాత భూతజాల మంతా ఏమౌతోంది? ఇవన్నీ నశిస్తే ఆపై ఏమి శేషించి ఉంటోంది?

**5.** స బ్రూయాత్।
న అస్య జరయ ఏతత్ జీర్యతి।
న వధేన అస్య హన్యత।
ఏతత్ సత్యం బ్రహ్మపురమ్
అస్మిన్ కామాః సమాహితా।
ఏష ఆత్మా అపహత పాప్మా,
విజరో విమృత్యుః విశోకో,
విజిఘత్సో అపిపాసః
సత్యకామః సత్యసంకల్పో

ఆచార్యులవారు : ఈ భౌతికశరీరము వార్ధక్యముచే బలహీనమవ వచ్చుగాక। కాల క్రమంగా నశించవచ్చు గాక। మనము చెప్పుకొన్న హృదయాకాశాంతర్గత పద్మములోని అంతరాకాశ స్వరూపమగు ఆత్మ వార్ధక్యము పొందదు. వధింపబడదు. మరణించదు. కామ సమాహితమగు బ్రహ్మపురము సత్యము. సర్వకామములు అట్టి బ్రహ్మస్వప్రకాశమునందు ఏర్పడినవై ఉంటాయి.

అట్టి బ్రహ్మమును పాపదోషములు స్పృశించవు. అది కాంతివలె నిత్యనిర్మలము. దానిని జర, మృత్యువు, శోకము, దాహము మొదలైనవి తాకలేవు. అది సత్యకామము. ఆత్మ ఏది కోరుకొంటుందో - అది సత్యమగుచున్నది.

సత్యసంకల్పము - ఆత్మ ఏది సంకల్పిస్తే అది సత్యము (ఏర్పడినదై) ఉండగలదు.

యథా హి ఏవ ఇహ ప్రజా।
అన్వావిశంతి, యథా అనుశాసనం
యం యమన్తమ్ అభికామా భవన్తి।
యం జనపదం, యం క్షేత్రభాగం,
తం తం ఏవ ఉపజీవంతి।

రాజుగారి ఆజ్ఞను అనుసరించే ఏవిధంగా ప్రజలు అనువర్తిస్తూ ఉంటారో, రాజు గారు కోరుకొనే విధంగా ఆయా స్థానములలో ఉంటారో, రాజాజ్ఞననుసరించే జనపదములు, క్షేత్రభాగములు ఏర్పడి ఉంటాయో, అట్లాగే హృదయాంతర్గతంగా చైతన్యమై వెలుగొందుచున్న ఆత్మయొక్క సంకల్పానుసారంగా, ఆజ్ఞానుసారంగా సంకల్పములు, భావములు, కామనలు, దేహముల వ్యవహారములు సంప్రవర్తితమై ఉంటున్నాయి. ఆత్మయే సమస్తమును ఉపజీవింపజేస్తోంది.

**6.** తత్ యథా ఇహ కర్మజితో
లోకః క్షీయత, ఏవం ఏవ
అముత్ర పుణ్యజితో, లోకః క్షీయతే।

శిష్యుడు : ఏఏ కర్మలఫలముగా మాకు ఆత్మజయము, మోక్షము, ఈ లోకముల నుండి బంధవిముక్తి లభించగలదు?

గురుదేవులవారు : కర్మలచేతనే ఇహ లోకము పొందబడుతోంది. కర్మల ఫలములు క్షీణిస్తూ ఉండగా ఇహలోకము ఆ కర్తపట్ల క్షీణము పొందగలదు. అట్లాగే పుణ్యఫలముచేత లభించే పుణ్య (స్వర్గాది) సుఖలోములు - కర్మఫలములు ఖర్చు అగుచుండగా - అవి క్షీణిస్తూ ఉంటాయి.

తత్ య ఇహ ఆత్మానం అననువిద్య వ్రజంతి
ఏతాంశ్చ సత్యాన్ కామాన్,
తేషాం సర్వేషు లోకేషు
అకామచారో భవతి।

ఎవ్వరైతే ఇక్కడనే తత్ ఆత్మవిద్య గురించిన మననముచే ఆత్మ స్వరూపము గురించి సునిశ్చితులు కారో - అట్టివారు సత్యకాములు కాలేరు. అట్టివారు ఆయా లోకములలో యథేచ్ఛానుసారంగా పొందరు. వారు కర్మవశులై పుణ్యపాప లోకములలో తిరుగాడుతూనే ఉండవలసివస్తోంది.

అథ య ఇహ ఆత్మానం అనువిద్య వ్రజంతి,
ఏతాంశ్చ సత్యాన్ కామాన్
తేషాం సర్వేషు లోకేషు
కామచారో భవతి।

ఎవ్వరైతే ఆత్మతత్త్వమును ఆత్మయొక్క ఔన్నత్యమును మనన విద్యచే తెలుసుకుంటారో -

వారు సత్యకాములౌతారు. వారు ఇచ్ఛానుసారంగా కోరుకొన్నది పొందగలరు. వారు సర్వలోకములలో తమ ఇష్ట సంకల్పములను అనుసరించి పొందగలుగు సామర్థ్యము పొందుచూ కామచారులు - (Wanderers as they wish) అగుచున్నారు. స్వాతంత్రులౌతారు.

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - అష్టమాధ్యాయే ప్రథమః ఖండః

# 8-2. ద్వితీయః ఖండః - ఇచ్ఛానుసారం లోక ప్రాప్తి

| | | |
|---|---|---|
| 1. | స యది పితృలోక కామో భవతి,<br>సంకల్పాత్ ఏవ అస్య పితరః సముత్తిష్ఠన్తి।<br>తేన పితృలోకేన సంపన్నో మహీయతే। | <u>ఆత్మజ్ఞానము, ఆత్మదృష్టి, ఆత్మయేవాహమ్ భావన సిద్ధించుకున్నవాడు :</u><br>→ ఆతడు పితృలోకము కోరుకొంటే, సంకల్పమాత్రంగానే పితృగణములో ప్రవేశించి పితరుల మధ్య సముత్తిష్ఠత (Blossom-ing) పొందగలడు. పితృలోకములో సుసంపన్నుడై గౌరవించబడ గలడు. పూజనీయుడు కాగలడు. (ఉత్పత్తికి కారణమగుచున్నవారు పితరులు) |
| 2. | అథ యది మాతృలోక కామో భవతి,<br>సంకల్పాత్ ఏవ అస్య మాతరః సముత్తిష్ఠన్తి।<br>తేన మాతృలోకేన సంపన్నో మహీయతే॥ | → ఆతడు (ఆత్మవంతుడు) మాతృలోకము కోరుకొంటే సంకల్పము చేతనే (కర్మలయొక్క ఆవస్యకత లేకుండానే) మాతృగణము మధ్య ఉపస్థితుడు కాగలడు.<br>మాతృలోకప్రాప్తి సంపన్నుడై పూజింపబడగలడు.<br>ఆతని ప్రవేశముచే మాతృలోకము సుసంపన్నమై ప్రకాశించగలదు. |
| 3. | అథ యది భ్రాతృలోక కామో భవతి,<br>సంకల్పాత్ ఏవ అస్య భ్రాతరః సముత్తిష్ఠన్తి।<br>తేన భ్రాతృలోకేన సంపన్నో మహీయతే! | → భ్రాతృలోకం కోరుకుంటే భ్రాతృలోకంలో సంకల్పము చేతనే ప్రవేశించి ఆశీనుడు కాగలడు.<br>ఆతడు ప్రవేశము పొంది భ్రాతృలోకంలో సుసంపన్నుడై కీర్తించబడగలడు. |
| 4. | అథ యది స్వసృలోక కామో భవతి<br>సంకల్పాత్ ఏవ అస్య స్వసారః సముత్తిష్ఠన్తి।<br>తేన స్వసృలోకేన సంపన్నో మహీయతే! | → ఆతడు స్వసృ (అక్క-చెల్లెళ్ళ) లోకము కోరుకొనువాడైతే, ఆతడు సంకల్పించినంతమాత్రంచేత సహోదరీమణులు ఆతడు ఉన్నచోట ఉపస్థితులు కాగలరు. సోదరీలోకము (భగినీలోకము)చే సుసంపన్నుడై ఆతడు 'మహిమాన్వితుడు' అగుచున్నాడు. |
| 5. | అథ యది సఖిలోక కామో భవతి<br>సంకల్పాత్ ఏవ, అస్య సఖాయః సముత్తిష్ఠన్తి,<br>తేన సఖిలోకేన సంపన్నో మహీయతే॥ | → సఖీ లోకము కావాలని కోరుకుంటే సంకల్పంచేతనే సఖీలోక వాసులు ఆతని వద్దకు రాగలరు. ఆతనిని సమీపించి ఆశీనులు కాగలరు. ఆతడు సఖీ లోకముచే మహిమ పొందగలడు. |
| 6. | అథ యది గన్ధమాల్య లోక కామో భవతి,<br>సంకల్పాత్ ఏవ అస్య (గన్ధమాల్యే) సముత్తిష్ఠతః,<br>తేన గన్ధమాల్య లోకేన సంపన్నో మహీయతే॥ | → ఆతడు గంధమాల్య లోకము ఇచ్ఛగిస్తే, సంకల్పించినంత మాత్రంచేత గంధర్వలోకమువారు ఆయన వద్దకు వచ్చి కూర్చుంటారు. గంధర్వ లోకవాసులతో సుసంపన్నుడై మహిమాన్వితుడవగలడు. |
| 7. | అథ యది అన్నపాన లోక కామో భవతి,<br>సంకల్పాత్ ఏవ అస్య అన్నపానే సముత్తిష్ఠతః।<br>తేన అన్నపాన లోకేన సంపన్నో మహీయతే॥ | → ఆతడు అన్నపాన లోకవిశేషాలు కావాలనుకుంటే సంకల్పం చేతనే అన్నపానములు ఆయన వద్దకు చేరగలవు. అన్నపానములచే సంపన్నుడై శ్రీపూజ్యుడు కాగలడు. |
| 8. | అథ యది గీతవాదిత్ర లోక కామో భవతి,<br>సంకల్పాత్ ఏవ అస్య గీతవాదిత్రే సముత్తిష్ఠతః।,<br>తేన గీతవాదిత్ర లోకేన సంపన్నో మహీయతే॥ | → ఆతడు గీతవాద్యములు (Music / Music Instruments) కోరుకుంటే సంకల్పముచే గీతావాద్యములు ఆతని సమక్షమును చేరగలవు. గీతవాద్యములచే సుసంపన్నుడై పూజనీయుడు కాగలడు. |
| 9. | అథ యది స్త్రీ లోక కామో భవతి,<br>సంకల్పాత్ ఏవ అస్య స్త్రియః సముత్తిష్ఠన్తి।<br>తేన స్త్రీలోకేన సంపన్నో మహీయతే॥ | → స్త్రీలోకము కోరుకుంటే సంకల్పమాత్రంచేత స్త్రీలు ఆతని వద్ద ఆశీనులు కాగలరు. అటు స్త్రీ లోకవాసులచే సుసంపన్నుడై గౌరవనీయుడు అగుచున్నాడు. |
| 10. | యం యం అన్తమ్ అభికామో భవతి,<br>యం కామం కామయతే, సో అస్య<br>సంకల్పాత్ ఏవ సముత్తిష్ఠతి।<br>తేన సంపన్నో మహీయతే॥ | ఈ సమస్తము స్వస్వరూపాత్మగా దర్శించుచూ, ఉపాసించుచు, విజ్ఞేయుడైనవాడు.<br>- దేనిదేనికి ఆవల ఆతడు ఇచ్ఛగిస్తాడో,<br>- ఏదేది కోరుకొంటాడో అవన్నీ ఆతడు సంకల్పించినంత మాత్రంచేత పొందగలడు. ఆతనిని అవి సమీపించగలవు. వాటితో సుసంపన్నుడై మహిమాన్వితుడై ఉండగలడు. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - అష్టమాధ్యాయే ద్వితీయః ఖండః

# 8-3. తృతీయః ఖండః - సత్యమును ఆవరించియున్న అసత్యమును వివేకముతో దర్శించుట

**1.** **త ఇమ సత్యాః కామా**
**అనృతాపిదానాః, తేషాం**
**సత్యానాం సతాం**
**అనృతమ్ అపిధానం।**
**యో యో హి అస్య ఏతః**
**ప్రైతి, - న తమ్ ఇహ**
**దర్శనాయ లభతే।**
**(కిం తు తత్ ప్రియమ్ సంబంధమ్ న తు సత్యమ్)।**

గురువరేణ్యుడు : ఆత్మస్వరూపులగు ప్రియ అధ్యయనులారా! సత్యకామములు ఇక్కడ అనృతము (అసత్యము)చే కప్పబడి ఉంటున్నాయి. సత్యము సర్వదా సత్యమే అయి ఉండి కూడా, అనృతము (అసత్యము) అసత్యమే అయి ఉండి కూడా - సత్యమును అసత్యము కప్పి ఉంచుతోంది. ఎంతటి చమత్కారం! లోక సంబంధమైన భావ - అనుభూతి ఆవేశములు మొదలైనవి చేస్తున్నదేమిటి? 'లేనిది' వచ్చి ఉన్నదానిని కప్పి ఉంచటం!

**ఇందుకు ఒక దృష్టాంతం చెప్పుకుందాము**

ఈ జీవునికి తల్లి, తండ్రి, సోదరులు, భార్య, పిల్లలు, స్నేహితులు - ఇటువంటి ఆయా తదితరులతో అనేక ప్రియసంబంధములు ఏర్పడినవై ఉంటున్నాయి. అయితే ఆతనికి అత్యంత ప్రియమైన బంధువు మరణించిన తరువాత - ఆతడు మరల కనిపిస్తున్నాడా? లేదు. అనగా ఈ కనబడేవి అశాశ్వత - కల్పిత సంబంధములే కదా!

---

**2.** **అథ యే చ అస్య ఇహ**
**జీవా యే చ ప్రేతా, యత్ చ**
**అన్యత్ ఇచ్ఛన్ న లభతే సర్వం।**
**తత్ అత్ర గత్వా విందతే।**

ఈ జీవుడు జాగ్రత్‌లో జీవించిననాటి నుండి మరణించేవరకు అనేక ఇచ్ఛలు (Expectations) కలిగి ఉండి, అవన్నీ నెరవేరక - "అయ్యో! పిల్లలు నా మాట వినరు కదా! ఈ బంధువులు నేను అనుకున్నట్లు ఉండరు" - అని తలుస్తూ ఏదీ ఇచ్ఛానుసారంగా ఉండక దుఃఖితుడు అగుచున్నాడు. ఆతడే గాఢనిద్రలోకి జారుకున్నప్పుడో? ఆ అసంతృప్తులు ఉండక నిద్రపోయి "రాత్రి హాయిగా నిద్రపోయాను కదా" అని అనుభవము పొందుచున్నాడు. నిద్రపోయినప్పుడు అన్నీ మరచి నిద్రలో ఆనందంగా ఎట్లా ఉండటం జరుగుతోంది?

**అత్ర హి అస్య ఏతే సత్యాః**
**కామాః అనృతాపిధానాః।**

ఎందుకంటే ఆతని సత్యకామము (ఆత్మపట్ల అనుభవము) జాగ్రత్‌లో అసంఖ్యాకమైన విషయములచే కప్పబడి ఉంటోంది కాబట్టే।

---

**తత్ యథ అపి హిరణ్యనిధిం**
**నిహితమ్ అక్షేత్రజ్ఞా**
**ఉపరి ఉపరి సన్చరన్తో న విందేయుః।**

అది ఏవిధంగానంటే - ఇక్కడ ఒక దృష్టాంతం చెప్పుకుందాము.

**ఒకడు తీర్థయాత్రలకు వెళ్లుచూ బంగారు మూటను దొడ్లో నేలలో పాతిపెట్టాడు. కొన్నాళ్ళ తరువాత తిరిగివచ్చి, ఎక్కడ పాతిపెట్టాడో తెలియక, పాతిపెట్టినచోటే నేలపై తిరుగాడుతూనే తన బంగారు నిధి - నిక్షిప్తమును ఏమరచి, పేదతనము యొక్క దుఃఖము అనుభవించటము వంటిది అది.**

---

**ఏవం ఏవ ఇమాః సర్వాః**
**ప్రజా అహరహః**
**గచ్ఛన్తి య ఏతం**
**బ్రహ్మలోకం న విన్దన్తి**
**అనృతేన హి ప్రత్యూఢాః।**

ఈ జీవుడు నిద్రలోకి వెళ్లినప్పుడు స్వస్వరూప బ్రహ్మము వేంచేసియున్న బ్రహ్మలోకమునకు వెళ్లి, నిర్విషయ బ్రహ్మానందమును రుచి చూచి వస్తూ ఉన్నాడు, కాబట్టే - "నిద్రలో హాయిగా ఉన్నాను" - అని అనుకొంటున్నాడు. నిద్ర లేచి ఆ (నిద్రలోని) హాయిని ఏమరచి, ఆ బ్రహ్మానుభావముపై అనృతమగు లోక (బంధు ఇత్యాది) సంబంధములను (అసత్యములైన వాటిని) కప్పి ఉంచటం చేత -

"నాకు ఆనందం లేదేమి? అని వేదన పడుచున్నాడు. ఆ దుఃఖములు దృశ్యము నుండి ప్రాప్తిస్తున్నాయేమో?" అని అనుకుంటున్నాడు. తన దగ్గర గల బ్రహ్మానందమును వదలి, బంధువులనుండి, తదితరుల నుండి ఆనందంకోసం దేవులాడుచున్నాడు.

---

**3.** **స వా ఏష ఆత్మా హృది।**
**తస్య ఏతత్ ఏవ నిరుక్తం**
**హృద్యమ్ ఇతి।**
**తస్మాత్ హృదయం అహరహర్వా**
**ఏవం విత్ స్వర్గం లోకం ఏతి।**

ఏ పరమాత్మ కోసమై ఈ జీవుడు తచ్చాడుచున్నాడో, అది సర్వదా ఆతని హృదయమునందే వేంచేసియుండి, వేయికాంతులతో వెలుగొందుతోంది.

**హృదయము - శబ్దార్థము (నిరుక్తము) ఎట్లా అంటే - "హృత్-అయమ్"**

**అయమ్ ఋత్ -హ** "పరమసత్యమగు ఆత్మ ఇక్కడే ఉన్నది" పరమాత్మ హృదయమునందే విద్యమానమై ఉన్నది. నీలోనే ఆత్మ ఉన్నది. మరెక్కడో కాదు. ఈ విధంగా **"ఆత్మగల స్థానమే హృదయము" అని ఎరిగినవాడు - స్వర్గలోకము (బ్రహ్మము) ఇప్పుడే ఇక్కడే అనునిత్యంగా పొందగలడు.**

---

**4.** **అథ య ఏష సంప్రసాదో**
**అస్మాత్ శరీరాత్ సముత్థాయ**
**పరంజ్యోతిః ఉపసంపద్య।**
**స్వేన రూపేణ అభినిష్పద్యత ఏష ఆత్మ ఇతి।**
**<u>హ ఉవాచ :</u> ఏతత్ అమృతమ్**
**అభయమ్। ఏతత్ బ్రహ్మేతి॥**
**తస్య హ వా ఏతస్య బ్రహ్మణో**
**నామ సత్యమితి॥**

ఎవ్వడైతే సత్ (బ్రాహ్మీదృష్టి)చే జాగ్రత్ -స్వప్నములోని అసత్‌భావనల సంయోగముచే ఏర్పడే కాలుష్యమును పరిశుభ్రపరచుకొని ప్రసాదుడు (నిర్మలుడు, ప్రసన్నుడు) అవుతాడో - అట్టి సంప్రసాదుడు - ఈ శరీర సంబంధ భావములను దాటివేసి, పరంజ్యోతి స్వరూపమును సంతరించుకున్నవాడై, తనయొక్క సహజ రూపమునందు సుసంపన్నుడు అగుచున్నాడు. ఈ జీవుని సహజరూపం 'ఆత్మ' కాబట్టి 'జీవాత్మ' - అనబడుచున్నాడు.

(గురుదేవులు ఇంకా ఇట్లా అంటున్నారు)

అట్టి ఈ జీవుని నిత్యసత్య సహజరూపము ఇప్పటికిప్పుడు స్వానుభవమవటమే - అమృతము। అభయమ్। అదియే బ్రహ్మము! అట్టి బ్రహ్మమే నామాత్మకంగా సత్యము - అయి ఉన్నది.

---

**5.** **తాని హ వా ఏతాని త్రీణి**
**అక్షరాణి <u>"సతీయమ్"</u> ఇతి।**
**తత్ యత్ సత్ తత్ అమృతమ్।**
**అథ యత్తి। తన్మర్త్యమ్।**
**అథ యద్యం తేన ఉభే యచ్ఛతి।**
**యత్ అనేన ఉభే యచ్ఛతి।**
**తస్మాత్ యమ్ అహరహర్వా**
**ఏవం విత్ స్వర్గం లోకం ఏతి।**

**"సత్యము"** అను శబ్దము - 'స' కారముతో, 'త' కారముతో, 'యమ్' కారముతో కూడి త్రీణి (3) అక్షరములతో "సతీయమ్" అగుచున్నది.

అందులో

<u>"స"</u> = సత్ - తత్ = **<u>"అమృతము"</u>**

<u>"తీ"</u> = ఇతి - ఇదం = **<u>"మర్త్యము"</u>**

<u>"యమ్"</u> = ఏదైతే - ఏదైతే 'స' 'త'లను ఏకము చేయుచున్నదో...

ఏది "పర-ఇహము"లను ఏకము చేయునో అదే 'యమ్'.

అందుచేత రాత్రింబవళ్లు సత్యమును అనగా పర-ఇహములను అభేదదృష్టితో ఏకము చేసి దర్శించువాడు - స్వాభావికంగానే ఇప్పుడే, ఇక్కడే స్వర్గలోకము (బ్రాహ్మీస్థానము) సిద్ధించుకుంటున్నాడు.

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - అష్టమాధ్యాయే తృతీయః ఖండః**

## 8-4. చతుర్థః ఖండః - జీవితమును ఆత్మానుభవమునకు సేతువుగా దర్శించుట

| | మంత్రము | వివరణ |
|---|---|---|
| 1. | **అథ య ఆత్మా, స సేతుః విధృతిః।**<br>**ఏషాం లోకానామ్ అసంభేదాయ**<br>**నైతం సేతుం అహోరాత్రే।** | ఈ జీవాత్మ సందర్భము - పరమాత్మ సిద్ధికై సేతువువలె (Like a Bridge) ధారణము చేయబడినట్టిది.<br>అట్టి బ్రహ్మలోకము (బ్రహ్మస్థానము)తో అహోరాత్రములు ఆత్మోపాసన - ఇహమును పరముతో ఏకము చేయటమే సాధన. |
| | **తరతో న జరా। న మృత్యుః।**<br>**న శోకో, న సుకృతం న దుష్కృతం।**<br>**సర్వే పాప్మానో అతో నివర్తన్తే,**<br>**అపహత పాప్మా హి।**<br>**ఏష 'బ్రహ్మలోకః'।** | అట్టి అనుక్షణికమగు "సత్యము" (అమృత-మర్త్య- Changeless and Changing zones of Self) యొక్క ఆత్మసిద్ధి పొందినవారికి<br>- **వార్ధక్యము ఉండదు**. దానిని వారు బాహ్య వస్తువుయొక్కమార్పు చేర్పులుగా చూస్తారు.<br>- అప్పుడు **మృత్యువు లేనిదే అవుతుంది**. ఈ శరీరములు వారికి దుస్తులు మార్చటముతో సమానము.<br>- శోకము ఉండదు. లోకభావనలు దాటివేసి, సర్వత్రా తనకు వేరుకాని ఆత్మనే చూస్తున్నవానికి ఇక దేనికొరకు శోకించాలి.<br>- సుకృత - దుష్కృతాలు ఉండవు. జాగ్రత్తు - స్వప్నం అసత్ మాత్రమైనప్పుడు అవెక్కడుంటాయి? సర్వపాపదృష్టులు (దోష - అల్పదృష్టులు) తొలగిపోగా సర్వత్రా బ్రహ్మమే దర్శిస్తూ ఉంటాడు. **అదియే "బ్రహ్మలోకము" అనబడుతోంది.** |
| 2. | **తస్మాత్ వా ఏతం సేతుం తీర్త్వా, అంధః,**<br>**సన్ అనంధో భవతి।**<br>**విద్ధః సన్నవిద్ధో భవతి।**<br>**ఉపతాపీ సన్ అనుపతాపీ భవతి॥** | **"ఇహ-పర", "జీవాత్మ-పరమాత్మ"** ద్వంద్వముల ఏకత్వరూపసేతువు, అగు "సత్యము"ను సిద్ధించుకున్నవాడు.<br>ఇతఃపూర్వపు అజ్ఞానాంధకారమంతా తొలగిపోయి, కళ్లు తెరచి, సమస్తమును 'ఆత' (లేక) సత్యము అనే వెలుగులో చూస్తూ ఉన్న వాడగుచున్నాడు.<br>విద్దుడు - ఎడబాటు పొందుతూ కూడా ఎడబాటు (Missing) లేనివాడై ఉంటున్నాడు.<br>బాధలు, తాపములు పొందుతూ కూడా ఏ తాపములు, బాధలు లేనివాడై ఉంటున్నాడు. సంకటములు ఉండి కూడా అవేవీ లేనివాడై ఉంటున్నాడు. |
| | **తస్మాత్ వా ఏతం సేతుం తీర్త్వా అపి నక్తమ్ -**<br>**అహరేవ - అభినిష్పద్యతే।**<br>**సకృత్ విభాతో హి ఏవ ఏష బ్రహ్మలోకః॥** | జీవాత్మ - పరమాత్మల భేదము జయించి సత్యమును ఆశ్రయించువాడు రాత్రిని కూడా పగలుతో సమానంగా ఆస్వాదించగలడు.<br>ఆతడు బ్రహ్మముగా ప్రకాశిస్తూ బ్రహ్మలోకము సిద్ధించుకొంటున్నాడు. |
| 3. | **తత్ య ఏవ ఏతం బ్రహ్మలోకం,**<br>**బ్రహ్మచర్యేణ అనువిన్దన్తి**<br>**తేషామ్ ఏవ ఏష బ్రహ్మలోకః।**<br>**తేషాం సర్వేషు లోకేషు**<br>**కామచారో భవతి॥** | ఎవ్వరు అట్టి "బ్రహ్మమునందే ఆచారము-సంచారము" సంసిద్ధింపజేసుకుంటారో - వారు బ్రహ్మలోకవాసులై బ్రహ్మానందమును ఆస్వాదించగలరు.<br>బ్రహ్మముగా సమస్తమును దర్శిస్తూ అమృత-జీవాత్మలను వారధిచే ఏకము చేయుచుండటమే "బ్రహ్మలోకము".<br>అట్టివారు 14 లోకములలో తమ ఇష్టానుసారం, స్వాతంత్రులై విహారము సిద్ధించుకొనుచున్నారు. |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - అష్టమాధ్యాయే చతుర్థః ఖండః**

## 8-5. పంచమః ఖండః - యజ్ఞవిధిలో బ్రహ్మచర్య ఆశయము దర్శించుట

| | శ్లోకము | అర్థము |
|---|---|---|
| 1. | **అథ యత్ 'యజ్ఞం' ఇతి ఆచక్షతే, బ్రహ్మచర్యమేవ। తత్ బ్రహ్మచర్యేణ హి ఏవ యో జ్ఞాతా తం విన్దతే। అథ యదిష్టమ్ ఇతి ఆచక్షతే,...బ్రహ్మచర్యమేవ। తత్, బ్రహ్మచర్యేణ హి ఏవ ఇష్ట్వా ఆత్మానమ్ అనువిందతే॥** | బ్రహ్మచర్యము అనగా : బ్రహ్మము యొక్క అధ్యయనము, "బ్రహ్మమునందు బ్రహ్మమై చరిస్తున్నాను" అను రూపమగు "బ్రహ్మవిద్య", బ్రహ్మము గురించిన అధ్యాయన విద్యార్థిత్వము. **"యజ్ఞము నిర్వర్తించటము"** - అనగా అది బ్రహ్మము గురించిన అభ్యాసమే। బ్రహ్మచర్యమే। బ్రహ్మచర్యములో ఏ బ్రహ్మజ్ఞాన - ఆనందము లభిస్తూ వస్తుందో - అది ఇష్టము (యజ్ఞకర్మ సంస్కారము, శాస్త్రవిహిత పూజ ఇత్యాదిగా) - అనబడుతోంది. ఇష్టములు - బ్రహ్మచర్యమే! ఎందుచేతనంటే - అట్టి బ్రహ్మ చర్యము చేత ఆత్మతత్త్వప్రాప్తియే సిద్ధించగలదు. అట్లాగే యజ్ఞయాగముల ముఖ్యాశయము కూడా అదే. |
| 2. | **అథ యత్ సత్రాయణమ్ ఇతి ఆచక్షతే, బ్రహ్మచర్యమేవ॥ తత్ బ్రహ్మచర్యేణ హి ఏవ సత ఆత్మనః "త్రాణం" విన్దతే। అథ యత్ "మౌనం" ఇతి ఆచక్షతే బ్రహ్మచర్యం ఏవ తత్ బ్రహ్మచర్యేణ హి ఏవ ఆత్మానమ్ అనువిద్య మనుతే॥** | ఏది 'సత్రయాగము' అని (వేదములలో) అభివర్ణించబడి, విధివిధానంగా వేదములచే మానవాళికి ప్రసాదించబడుచున్నదో - అది బ్రహ్మచర్యమే। ఎందుకంటే ఆ సందర్భంలో బ్రహ్మచర్యము చేతనే - సత్ "ర" యాగము - పరమాత్మతో త్రాణ (Lively) పొందుచున్నాడు. ఇప్పుడిక ఏది 'మౌనము' అని చెప్పబడుచున్నదో - అది బ్రహ్మచర్యమే। ఎందుకంటే, అట్టి మౌనము (ఇంద్రియ విషయములను అంటించు కోకుండా ఉండటము)- బ్రహ్మము పట్ల మనస్సును ఉంచు అనువిద్య (లేక) విద్యార్జనయే। (ఇదియే ప్రత్యాహారము కూడా।) |
| 3. | **అథ యత్ అనాశకాయనమ్ ఇతి ఆచక్షతే। బ్రహ్మచర్యమేవ - "తత్, ఏష హి ఆత్మా న నశ్యతి, యం బ్రహ్మచర్యేణ అనువిన్దతే।** | ఆహారము స్వీకరించకుండా ఉండే "ఉపవాసము" అనే వ్రతము కూడా "బ్రహ్మచర్యమే" అని చెప్పబడుతోంది. ఏది "నాశనము లేదు" అని అనుకోబడుతూ, భావించబడుతోందో అది కూడా బ్రహ్మచర్యమే। అదే నష్టము చెందనిది, ఆకాశము, బ్రహ్మ విద్య కూడా। బ్రహ్మచర్యముచే "ఆత్మ నాశనము లేనిది" అని ఆనందించబడుచున్నది. - అది "బ్రహ్మచర్యము" వైపుగానే ఉద్దేశ్యించ బడుతోంది కదా! |
| | **అథ యత్ అరణ్యాయనమ్ ఇతి - ఆచక్షతే..., బ్రహ్మచర్యమేవ।** | ఏది అరణ్యాయనము (వనవాసము) అని (సాధన కొరకై అరణ్యములో ప్రవేశించి, సాధన కొనసాగించటము) అది కూడా 'బ్రహ్మచర్యము' గానే చూడబడుతోంది. |
| | **తత్ తత్ అరః చ హ వై ణ్యః చ అర్ణవౌ బ్రహ్మలోకే। తృతీయస్యాం ఇతో దివి తేదైరం మదీయం సరస్తత్** | బ్రహ్మలోకములో (1) 'అర' (త్వరితము, విచారణ) (2) ణ్య (మననము, Application) అనే రెండు సముద్రములున్నాయి. ఈ రెండు బ్రహ్మలోకమార్గములు (భూమి, అంతరిక్షములు). ఇక మూడవది ఐరము. దివి (దేవలోకము) 'మదీయ' సరస్సు (తనకు ఉపయోగించువానికి ముదము కలిగించునది). "ఐర, మదీయం" |

| | | |
|---|---|---|
| | అశ్వత్థః సోమ సవనః<br>తత్ అపరాజితా పూః - బ్రహ్మణః<br>ప్రభువిమితం - హిరణ్మయమ్॥ | అని కూడా ఈ సరస్సుకు పేరు. అక్కడ "సోమసవనము" అనే అశ్వత్థవృక్షము. ఇది అమృత వృక్షము. బ్రహ్మచర్య సాధన గల వారిచేత మాత్రమే దాటబడగలదు. అక్కడనే "అపరాజిత" పురము. అందులో "ప్రభు నిమిత్తము" సువర్ణ మండపము. |
| 4. | తద్య ఏవైతావరం చ<br>"ణ్యం" చ అర్ణవే బ్రహ్మలోకే<br>బ్రహ్మచర్యేణ అనువిన్దన్తి॥<br>తేషామ్ ఏవైష బ్రహ్మలోకః।<br>తేషాం సర్వేషు లోకేషు<br>కామచారో భవతి॥ | బ్రహ్మచర్య దీక్షాబలం చేత మాత్రమే అట్టి "అర", "ణ్య" అని పిలువబడే రెండు సముద్రములను పొందగలరు. దాటగలరు. అట్టివారలకే బ్రహ్మలోకము (సర్వత్రా బ్రహ్మముగా దర్శించు అవలోకనము) ప్రవేశము లభించగలదు. అట్టివారు సర్వలోకములలో ఇచ్ఛానుసారంగా సంచారము చేయువారు అగుచున్నారు. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - అష్టమాధ్యాయే పంచమః ఖండః

## 8-6. షష్ఠః ఖండః - హృదయ నాడులలో ఆదిత్యుని దాటించు నాడీ ఉపాసన

| | | |
|---|---|---|
| 1. | అథ యా ఏతా హృదయస్య<br>నాడ్యస్తాః పింగళస్య<br>అణిమ్నః తిష్ఠన్తి - శుక్లస్య,<br>నీలస్య - పీతస్య - లోహితస్య<br>ఏతి అసౌ వా ఆదిత్యః<br>పింగళ। ఏష శుక్ల।<br>ఏష నీల। ఏష పీత।<br>ఏష లోహితః। | (మాంసపిండరూపమగు) మానవుని హృదయమునుండి నాడులు, అట్టి నాడులు - పింగళ (గోరోజనరంగు) అనే పేరుగల వర్ణ విశేషము కలిగియుండి - "సూక్ష్మరసము" తమయందు కలిగి ఉంటున్నాయి. ఆ నాడులు తెలుపు, నీలము, పచ్చని, ఎరుపు రంగు రసము కలిగి ఉంటున్నాయి.<br>ఏ విధంగా అయితే పింగళవర్ణుడగు సూర్యునియందు పింగళ, శుక్ల (తెలుపు), నీల, పీత (పచ్చ), లోహిత కిరణములు బయల్వెడలుచున్నాయో, ఆ విధంగా హృదయమునుండి నాడులు బయలుదేరి, శరీరమంతా విస్తరించినవై ఉంటున్నాయి. |
| 2. | తత్ యథా మహాపథ ఆతత<br>ఉభౌ గ్రామౌ గచ్ఛతి ఇమం చ<br>అముంచ ఏవమేవ ఏతా ఆదిత్యస్య<br>రశ్మయ ఉభౌ లోకౌ గచ్ఛన్తి ఇమం చ,<br>అముం చ అముష్మాత్ ఆదిత్యాత్ ప్రతాయంతే।<br>తా అసు నాడీషు<br>సృప్తా ఆభ్యో నాడీభ్యః ప్రతాపయన్తే।<br>తే అముష్మిన్ ఆదిత్యే సృప్తాః॥ | ఒక సుదీర్ఘమైన రాజమార్గము దగ్గర - దూర గ్రామాల వరకు విస్తరించినదై ఉంటుంది, చూచావా? సూర్యకిరణములు క్రిందకు, ఊర్ధ్వమునకు విస్తరించి ప్రసరిస్తూ ఉంటున్నాయి కదా!<br>అట్టి కిరణములు సూర్యుని నుండి బయలుదేరి దేహములోని నాడులలో కూడా చేరుచున్నాయి.<br>నాడులలో ప్రసరించి, అటు తరువాత తిరిగి సూర్యుని వరకు విస్తరించి ఉంటున్నాయి. |
| 3. | తత్ యత్ర ఏతత్ సుప్తః సమస్తః। సంప్రసన్నః।<br>స్వప్నం న విజానాత్యాసు,<br>తదా నాడీషు సృప్తో భవతి।<br>తం న కశ్చన పాప్మా స్పృశతి,<br>తేజసా హి తదా సంపన్నో భవతి॥ | ఎప్పుడైతే ఈ జీవుడు నిద్రకు ఉపక్రమిస్తాడో అప్పుడు ఈతడు నాడులందు ప్రవేశించి సృప్తుడు (Silence) అగుచున్నాడు.<br>ఈతడు ఆ విధంగా గాఢనిద్ర పరవశుడై ఉన్నప్పుడు - ఎటువంటి దృశ్య సంబంధమైన పాపదృష్టుల చేతను స్పృశించబడనివాడై ఉంటాడు. ఆత్మ తేజస్సుచే సుసంపన్నుడై ఉంటాడు. |

**4. అథ యత్ర ఏతత్**
**అబలిమానం నీతో భవతి,**
**తమ్ అభిత ఆసీనా ఆహుః "జానాసి మాం?**
**జానాసి మాం?" – ఇతి। స యావత్**
**అస్మాత్ శరీరాత్ అనుత్క్రాన్తో,**
**భవతి....తావత్ జానాతి।**

ఈ జీవుడు శారీరకంగా కూడా బలహీనుడు అయినప్పుడు, ఆ చుట్టూ ఉన్న దగ్గరవారు

**"బాబూ! నాన్నా! తాతా! నన్ను గుర్తిస్తున్నావా? నేను ఎవరు? ఈయన ఎవరు?"** - అని అడుగుతూ ఉంటారు.

దేహములో జీవుడు ఉన్నంతవరకు ఆతడు ఆ బంధువులను గుర్తిస్తూ ఉంటాడు.

---

**5. అథ యత్ర ఏతత్ అస్మాత్**
**శరీరాత్ ఉత్క్రామతి,**
**అథ ఏతైరేవ రశ్మిభిః**
**ఊర్ధ్వం ఆక్రమతే।**
**స 'ఓం' ఇతి వా హోద్వా మీయతే।**
**స యావత్ క్షిప్యేత్ మనః,**
**తావత్ ఆదిత్యం గచ్ఛతి।**
**ఏతత్ వై ఖలు లోకద్వారం**
**విదుషాం ప్రపదనం – నిరోధో అవిదుషామ్॥**

దేహము విడచి వెళ్లుచూ ఉన్నప్పుడు ఈ జీవుడు శరీరము వదలి కిరణములలో ప్రవేశించి ఊర్ధ్వముగా వెళ్లుచున్నాడు.

'ఓం' అని పైకి పోవుచున్నాడు.

ఆతడు మనస్సు వెళ్లుచున్నంతవరకు ఆదిత్యునివైపు (సూర్యునివైపు) వెళ్లుచున్నాడు.

ఆదిత్య లోకప్రవేశమే లోకద్వారము.

(ఆత్మజ్ఞులు ఆ ద్వారము దాటి వెళ్లుచున్నారు). అజ్ఞానులు ఆ ద్వారము వద్ద ఆగిపోయి వెనుకకు మరలుచున్నారు.

---

**6. తత్ ఏష శ్లోకః।**
**శతం చ ఏకా చ హృదయస్య నాడ్యః।**
**తాసాం మూర్ధానమ్ అభినిః సృత ఏకా।**
**తయోః ఊర్ధ్వమ్ ఆయన్ అమృతత్వం ఏతి**
**విష్వన్ అన్యా ఉత్క్రమణే భవన్తి।**
**ఉత్క్రమణే భవన్తి।**

అట్టి దేహానంతర ప్రయాణం గురించి శాస్త్ర ప్రవచిత శ్లోక - గానములు ఈ విధంగా ఉన్నాయి.

హృదయమునుండి 101 నాడులు బయల్వెడలుచున్నాయి. ఈ నాడులలో జీవుడు దేహానంతరము ప్రయాణమునకు ఉపక్రమిస్తున్నాడు. ఆ 101 నాడులలో ఒక్క నాడి మాత్రమే శిరస్సుయొక్క ఉపరితల స్థానానికి బయల్వెడలుతోంది. అట్టి ఊర్ధ్వమునకు పోవుచున్ననాడిలో ప్రయాణము చేయు జీవుడు - 'మృతము' పరిధులను దాటి అమృతత్వము పొందుచున్నాడు. ఇక తక్కిన (100) నాడులలో ప్రయాణము చేయువాడు ఇంద్రియ విషయములవైపుగా ప్రయాణిస్తూ పునర్జన్మలవైపుగా ఎక్కుబెట్టబడి వెళ్లుచున్నాడు.

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - అష్టమాధ్యాయే షష్ఠః ఖండః**

# 8-7. సప్తమః ఖండః - కన్నులలో చూచువాడే ఆత్మ!

**1.** **య ఆత్మా - అపహత పాప్మా!**
**విజరో విమృత్యుః। విశోకో।**
**విజిఘత్సో అపిపాసః!**
**సత్యకామః। సత్య సంకల్పః।**
**సో అన్వేష్టవ్యః। స విజిజ్ఞాసితవ్యః**
**స సర్వాంశ్చ లోకాన్ ఆప్నోతి।**
**సర్వాంశ్చ కామాని అస్తమ్,**
**ఆత్మానమ్ అనువిద్య విజానాతి।**
**ఇతి - హ ప్రజాపతిః ఉవాచ।।**

గురుదేవుడు : ప్రజాపతి సృష్టించుచూ ఈ విధమైన సృష్టి మర్యాదను కల్పించారు. సమస్త దేవతలారా! మానవులారా!

ఓ సమస్త జీవులారా! ఆనందము కొరకై బాలా లీలా వినోదంగా, మీ అందరు ఆడుకోవాలనే నిమిత్తంగా క్రీడామైదానము వంటి (Play ground) - ఈ సృష్టిని గ్రహించి గమనించి ఆటలాడుకొంటూ పరస్పరము వినోదించండి. అయితే మిమ్ములను మీరు మరచిపోకండి. మీరు ఆత్మ స్వరూపులని జ్ఞాపకము పెట్టుకోండి . ఆత్మ ఎటువంటిదంటే...

- ఆత్మ పాపదోషములు అంటజాలనిది.

- ఆత్మకు జరామృత్యువులు ఉండవు. శోకరహితము. విజిఘత్సము (ఆకలి దప్పికలు లేనట్టిది)

- అత్మ ఏది కోరితే అది అట్లే సిద్ధించగలదు.

'సత్యకామము - అందుచేతనే నా ఇష్టమును అనుసరించి సృష్టించగలుగుచున్నాను'.

సత్యసంకల్పము ఏది ఎట్లా సంకల్పిస్తే అది ఆ తీరుగానే అనుభవము కాగలదు.

మీరు నిష్కారణంగా ఈ నా సృష్టియందు (ఇది లీలా వినోదమే అయినప్పటికి) దుఃఖితులు అవుతున్నారు. అందుకు ఉపాయం వినండి.

ఆత్మ గురించి శ్రద్ధగా అన్వేషించండి. అదియే తెలుసుకోండి. ఆత్మగురించి తెలుసుకున్నారా - సర్వలోకాలు, సర్వఇచ్ఛలు సిద్ధించగలవు. అందుచేత ఆత్మ గురించి తెలుసుకొని, మననం చేసి స్వానుభవంగా సిద్ధించుకోండి - అని ఒక సందర్భంలో ప్రజాపతి ప్రకటించారు.

---

**2.** **తద్ధా (తత్ హ) ఉభయే దేవ**
**అసురా అనుబుబుధిరే।**
**తే హ ఊచుః :**
**హంత తమ్ ఆత్మానమ్**
**అన్విచ్ఛామో యం**
**ఆత్మానమ్ అన్విష్య**
**సర్వాంశ్చ లోకాన్ ఆప్నోతి।**
**సర్వాంశ్చ కామాన్ ఇతి**
**ఇంద్రో హ ఏవ దేవానాం అభిప్రవవ్రాజ,**
**విరోచనో అసురాణం**
**తౌ హా సంవిదానావేవ**
**సమిత్పాణీ ప్రజాపతిః**
**సకాశమాజగ్మతుః।।**

"ఆత్మజ్ఞానముచే సర్వలోకాలు ఇచ్ఛానుసారంగా సంచరించి వినోదించగలరు" - అను బ్రహ్మభగవానుని వాక్యములను దేవతలు, రాక్షసులు, మానవులలో కొందరు విన్నారు.

దేవతల, అసురుల వారి వారి రాజసభలలో పై బ్రహ్మ దేవ ఆత్మజ్ఞాన సూచన వాక్యములు సుదీర్ఘంగా చర్చించుకున్నారు.

"ఆత్మగురించి అన్వేషించండి. అప్పుడు సర్వలోకాలు ఇచ్ఛానుసారంగా సంచారాలు చేస్తూ వినోదించగలరు".

అని చెప్పిన వాక్యములు వారంతా చర్చించారు.

దేవసభలో దేవతలు ఇంద్రుని, అసురసభలో అసురులు విరోచనుని - బ్రహ్మదేవుని దర్శనం చేసుకోవటానికై పంపారు.

"ఆత్మ గురించిన అన్వేషణ" ఏవిధంగా చేయాలో తెలుసుకొని తిరిగి

సభలో ప్రసంగించి తెలియజేయటానికి సభా నిర్ణయము చేసారు. అప్పుడు ఇంద్రుడు, విరోచనుడు గురుసేవా చిహ్నంగా సమత్పాణులై (చేత యజ్ఞ సమిధలు ధరించినవారై) బ్రహ్మలోకమునకు వెళ్లి ప్రజాపతియగు బ్రహ్మదేవుని దర్శనం చేసుకొన్నారు.

---

**3.** **తౌ హ ద్వాత్రింశతం**
**వర్షాణి బ్రహ్మచర్యం ఊషతుః।**
**తౌ హ ప్రజాపతిః ఉవాచ।**
**కిమ్ ఇచ్ఛన్తావవాస్తమ్ ఇతి।**
**తౌ హ ఊచతుః య ఆత్మా**
**అపహత పాప్మా, విజరో, విమృత్యుః,**
**విశోకో, విజిఘత్సో అపిపాసః**
**సత్యకామః సత్యసంకల్పః।**
**సో అన్వేష్టవ్యః।**
**స విజిజ్ఞాసితవ్యః।**
**స సర్వాంశ్చ లోకాన్ ఆప్నోతి।**
**సర్వాంశ్చ కామాన్**
**యః తం ఆత్మానమ్ అనువిద్య**
**విజానాతి – ఇతి, భవగతో**
**వచో వేదయన్తే**
**తమ్ ఇచ్ఛన్తావవాస్తమ్। ఇతి॥**

అప్పుడు ప్రజాపతి - ఆ ఇంద్ర విరోచనులిద్దరికి బ్రహ్మతత్త్వాన్వేషణ కొరకై 32 సంవత్సరములు బ్రహ్మచర్యము నియమించారు. ఆ ఇద్దరు బ్రహ్మలోకంలో 32 సంవత్సరాలు తపస్సు చేసి స్వామిని సమీపించారు. అప్పుడు ప్రజాపతి ఇట్లు సంభాషించసాగారు.

ప్రజాపతి : ఓ ఇంద్ర విరోచనులారా! ఏమి వాంఛించినవారై ఇక్కడ తపస్సు చేస్తున్నారో, ఏమి కోరుకొంటున్నారో అడగండి.

<u>ఇంద్ర - విరోచనులు</u>

"ఏ ఆత్మ స్వరూపమునకైతే ఎట్టి పాపదోషములు అంటజాలవో, జరా - మృత్యువులు ఏమాత్రము ఉండజాలవో, శోకరహితమో, ఆకలి దప్పికలు ఉండవో, తాను కోరుకొన్నది కోరుకొన్నట్లుగా సత్యము కాగలదో, ఏది ఎట్లా సంకల్పిస్తే అది ఆ తీరుగానే సత్యము కాగలదో అట్టి ఆత్మనే అన్వేషించాలి, బాగుగా తెలుసుకోవాలి. అట్టి ఆత్మగురించి ఎరుగుటచే సర్వ కామములు (Desires) తీరగలవు" అని మీ వచనములు మేమంతా విన్నాము. అట్టి ఆత్మ యొక్క అన్వేషణ గురించిన ఇచ్ఛతో మీ దర్శనం చేసుకొని, మీ ఆజ్ఞానుసారం '32' సంవత్సరములుగా ముని వేషధారులమై తపస్సు చేసే వచ్చాము. దయతో అనుగ్రహించండి.

---

**4.** **<u>తౌ హ ప్రజాపతిః ఉవాచ</u>**
**య ఏషో "అక్షిణి పురుషో"**
**దృశ్యత – ఏష ఆత్మేతి।**
**<u>హ ఉవాచ।</u>**
**ఏతత్ అమృతమ్, అభయమ్**
**ఏతత్ బ్రహ్మ ఇతి।**
**అథ యో అయం,**
**భగవో – అప్సు పరిఖ్యాయతే**
**యశ్చ అయం ఆదర్శే కతమ**
**ఏష ఇత్యేష ఉ ఏవ**
**ఏషు సర్వేషు అన్తేషు**
**పరిఖ్యాయత। ఇతి హోవాచ॥**

<u>ప్రజాపతి</u> (సృష్టికర్త, బ్రహ్మ భగవానుడు) : బిడ్డలారా! చెప్పుచున్నాను. వినండి. ఈ కళ్లలో ఎవ్వరైతే వేంచేసియుండి, సమస్తము చూస్తూ ఉన్నారో (సమస్తమునకు కేవల ద్రష్టయో) - అట్టి <u>"దృక్ పురుషుడే"</u> పరమాత్మ! ఆయనయే అమృతము, అభయము అగు బ్రహ్మము.

<u>ఇంద్ర - విరోచనులు</u>

(1) నీటిలోను (2) అద్దములోను ఏ పురుషుడు ప్రతిబింబితులై కనిపిస్తున్నాడో... వీరిలో ఆత్మపురుషుడు ఎవరు?

ప్రజాపతి : ఆత్మభగవానుడే ఇదంతా సమస్తమునకు ఆవలగాను, ఈవలగా కూడా! "ఎవ్వరు" కనిపిస్తూ ఉన్నారో ఆతడే ఆత్మపురుషుడు. సమస్తమునకు ఆవలగా పరిచ్యాయతము (Proclaimed) అగుచున్నది ఆ <u>అక్షిణి పురుషుడే।</u>

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - అష్టమాధ్యాయే సప్తమః ఖండః

## 8-8. అష్టమః ఖండః - ఇంద్ర - విరోచనులు నీటి పాత్రలో తమ ప్రతిబింబములు చూసి ఆత్మ అనుకొనుట

| | | |
|---|---|---|
| **1.** | **ఉదశరావ ఆత్మానమ్ అవేక్ష్య।<br>యత్ ఆత్మనో న విజానీథః<br>తన్మే ప్రబ్రూతమ్ ఇతి॥<br>తౌ హ ఉదశరావే అవేక్షాం చక్రాతే।<br>తౌ హ ప్రజాపతిః ఉవాచ :<br>"కిం పశ్యథ" ఇతి<br>తౌ హ ఊచతుః।<br>సర్వం ఏవేదం అవాం, భగవ!<br>ఆత్మానం పశ్యావ, ఆ లోమభ్యః।<br>ఆ నఖేభ్యః - ప్రతిరూపమ్ ఇతి।** | ప్రజాపతి : ఓ ఇంద్ర, విరోచన బిడ్డలారా! మీరిద్దరూ కలసి - ఒక పెద్ద ఉదశరావమును (మూకుడు వంటి పెద్ద పాత్రను) తీసుకు రండి. అందులో నిండుగా నీళ్లు పోయండి. మీ రూపములు ఆ నీళ్లలో ప్రతిబింబిస్తాయి కదా! చూడండి. ఆ తరువాత నా దగ్గరకు రండి. మీరు ఆత్మ గురించి ఇంకా ఏమి తెలుసుకోలేకపోయారో అది నన్ను అడగవచ్చు.<br><br>ఆ ఇంద్ర-విరోచనులు ఇద్దరు ఆ విధంగానే నీళ్లల్లో ప్రతిబింబము చూచుకొని తిరిగి వచ్చారు.<br><br>ప్రజాపతి : బిడ్డా! మీకు ఏమి కనబడింది? ఏమి అర్థమైనది?<br><br>ఇంద్ర-విరోచనులు : భగవన్! మేము అంతా చూచాము. జలములో నఖ-శిఖ పర్యంతము మా మా పూర్ణ ప్రతిబింబాన్ని చూచాము. బయట ఎట్లా ఉన్నామో - ఆత్మ ప్రతిబింబముగా జలంలో అట్లాగే కనిపించాము. |
| **2.** | **తౌ హ ప్రజాపతిః ఉవాచ<br>సాధు అలంకృతౌ, సువసనౌ,<br>పరిష్కృతౌ భూత్వా....<br>ఉదశరావే అవేక్షేథామ ఇతి।<br>తౌ హ సాధు - అలంకృతౌ<br>సువసనౌ, పరిష్కృతౌ<br>భూత్వా ఉదశరావే అవేక్షాంచక్రాతే।<br><br><br><br><br><br>తౌ హ ప్రజాపతిః ఉవాచ<br>కిం పశ్యథ - ఇతి?** | ప్రజాపతి : మంచిది. సంతోషము. ఇప్పుడు మీ మీ మునివేషధారణా సంబంధమైన (గడ్డము మొదలైన) ఇవన్నీ తొలగించండి. క్షురకర్మ చేయించుకొని మామూలు వస్త్రములు ధరించి మీరు మీ మీ అంతఃపురములో ఉండే విధంగా సాలంకృతులవండి. సువసునులై రాజవస్త్ర-అలంకరణలతో రండి.<br><br>ఇంద్ర-విరోచనులు : స్వామీ! భగవన్ మీరు ఆజ్ఞాపించిన తీరుగానే క్షురకర్మ మొదలైనవి చేయించి, రాజ వస్త్రములు మొదలైనవి ధరించి, తపోవనమునకు వెళ్లక ముందువలె చక్రవర్తి అలంకారములతో వచ్చాము.<br><br>ప్రజాపతి : వచ్చారా? ఇప్పుడు మీరు మరల ఉదశరావ పాత్ర (పెద్ద బానవంటి పాత్ర)లో గల జలములో మీ రూపములు చూచుకోండి.<br><br>ఇంద్ర-విరోచనులు : పితామహా! అట్లాగే చూచుకుంటున్నాము. ఇప్పుడు ఏమి మీ అనుజ్ఞ?<br><br>ప్రజాపతి : జలములో ఏమి కనిపించింది? |
| **3.** | **తౌ హ ఊచతుః<br>యథ ఏవ ఇదం ఆవామ్ భగవః,<br>సాధు అలంకృతౌ సువసనౌ<br>పరిష్కృతౌ స్వ ఏవమ్।<br>ఎవేమౌ భగవః।<br>సాధ్వలంకృతౌ సువసనౌ<br>ప్రరిష్కృతావిత్యేష ఆత్మేతి।<br><u>హ ఉవాచ :</u><br>ఏతత్ అమృతమ్। అభయమ్।<br>ఏతత్ బ్రహ్మేతి।<br>తౌ హ శాంత హృదయౌ ప్రవవ్రజతుః।** | ఇంద్ర-విరోచనులు : ఏవిధంగా మేము అంతఃపురములో ఉత్తమ వస్త్రములు ధరించి సాలంకృతులమై, సువాసన (Good Living) పరిష్కృతులము (Modified) అయి బయట ఉన్నట్లే జలములో ప్రతిబింబిస్తూ నఖ శిఖ పర్యంతం **మేమే** కనిపించాము.<br><br>ప్రజాపతి : బయట మునుల రూపము కలిగియున్నప్పుడు నీటిలో నఖశిఖపర్యంతరం ఆ రూపములుగానే ప్రతిబింబిస్తూ కనిపించారు కదా।<br><br>బయట-లోపల అదియే (లేక) ఆతడే అమృతము। అభయము। బ్రహ్మము। |

| | |
|---|---|
| | అప్పుడు ఆ ఇద్దరు "బయట ఏదై ఉన్నదో, అదే జలమునందువలెనే ఈ దృశ్యమునందు కూడా యథాతథంగా ప్రతిబింబిస్తున్నదే ఆత్మ" - అని అనుకొన్నారు కాబోలు! ఇద్దరు (అర్థమైనదనే భావనతో) శాంతచిత్తులై వారివారి నివాసములకు వెళ్లిపోయారు. |
| **4.** **తౌ హ అన్వీక్ష్య, ప్రజాపతిః ఉవాచ :**<br>**అనుపలభ్యమ్ ఆత్మానమ్**<br>**అనువిద్య – వ్రజతో, యతర**<br>**ఏతత్ ఉపనిషదో**<br>**భవిష్యన్తి, దేవా వా, అసురా వా**<br>**తే పరా భవిష్యన్తి – ఇతి।** | వారిద్దరు ఆ విధంగా మాకు 'ఆత్మ గురించి అర్థమైనది' అని తలచుచూ శాంతహృదయులై సంతోషించి తిరిగి వెళ్లుచుండగా అది చూచి ప్రజాపతి ఈ విధంగా అనుకున్నారు.<br><br>ప్రజాపతి : ఆత్మగురించిన విద్యను సరిగ్గా అర్థం పొందకుండానే 'అర్థమయింది' అని వెళ్లిపోతున్నారే? ఎవ్వరైతే ఇప్పుడు నేను చెప్పినదే ఆత్మ అనుకొని సంపూర్ణమైన ఆత్మసాక్షాత్కారము పొందకయే అధ్యయనమును విరమిస్తారో - వారు దేవతలైనా, అసురులైనా పరాభవము (ఇక్కడ ఉన్నదే పరస్వరూపము) అనే ఓటమి పొందక తప్పదు కదా! |
| **స హ శాంతహృదయ ఏవ।**<br>**విరోచనో అసురాన్ జగామ।**<br>**తేభ్యో హి ఏతామ్ ఉపనిషదం**<br>**ప్రోవాచ : "ఆత్మైవ ఇహ మహయ్య।**<br>**ఆత్మా పరిచర్య। ఆత్మానం ఏవ ఇహ మహయన్**<br>**ఆత్మానం పరిచరన్ ఉభౌ లోకౌ అవాప్నోతి।**<br>**ఇమం చ – అముం చ – ఇతి।** | అప్పుడు విరోచనుడు తన సహచరులైనట్టి ఇతర అసురులను కలిసారు. వారికి ఆత్మతత్త్వము గురించి తాను నేర్చుకున్నది ఈ రీతిగా బ్రహ్మదేవుని బోధగా చెప్పారు.<br><br>"నా యొక్క ఇహంలో కనిపిస్తున్న రూపమే ఆత్మ। ఆత్మ అనగా ఛాయా మాత్రమే। ఛాయాత్మనే పూజించాలి. సేవించాలి" అట్టి ఛాయాత్మను సేవిస్తే మనము ఇహపరములు ఉత్తమముగా పొందగలము. ఇక్కడి ప్రయత్నములే మనకు ముఖ్యము. |
| **5.** **తస్మాత్ అపి అద్య ఇహ అదదానమ్।**<br>**అశ్రద్ధధానమ్, అయజమానమ్,**<br>**ఆహుః "ఆసురో" బతేతి।**<br>**అసురాణాం హి ఏష**<br>**ఉపనిషత్ ప్రేతస్య శరీరం భిక్షయా వసనేన**<br>**అలంకారేణ ఇతి సంస్కుర్వన్తి ఇతి।**<br>**ఏన హి అముంలోకం**<br>**జేష్యన్తో మన్యంతే।।** | అందుచేతనే ఈ లోకంలో త్యాగభావములు లేనివాడు, దానము చేయాలని అనుకోనివాడు (దానము చేయుటయందు) అశ్రద్ధకలవాడు, యజనము చేయనివాడు - "ఈతడు రాక్షసుడురా!" - అని జనులు చెప్పుకుంటూ ఉంటారు.<br><br>అసురులకు ఈ శరీరమే, జీవాత్మయే సత్యం అనునదే ఉపనిషత్తు. ప్రేత శరీరమునకు "ఈతడు ఆ తరువాత కూడా ఆహార పదార్థములు, సంపదలు కోరుకుంటాడు" - అని తలచి చనిపోయినవాని శరీరమును గంధ, పుష్ప అన్నాదులు ప్రక్కన ఉంచుతారు. అలంకారాలతో సంస్కరిస్తారు. వాటి ద్వారా ఆ మరణించినవాడు ఆముష్మిక (పర) లోకము పొందగలడని విశ్వసిస్తారు. |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - అష్టమాధ్యాయే అష్టమః ఖండః**

# 8-9. నవమః ఖండః - నీటిలో ప్రతిబింబించు తన రూపమే ఆత్మయా?

**1. అథ హ ఇంద్రో అప్రాప్య ఏవ**
**దేవాన్, ఏతత్ భయం దదర్శ!**

దేవతల నాయకుడగు ఇంద్రుడు "ఏది జలములో ప్రతిబింబిస్తూ ఉన్నదో అదియే ఆత్మ" అనునది మననం చేస్తూ దేవలోకానికి బయలుదేరారు. ఆయన త్రోవలో ఉండగానే, దేవతలను ఇంకా కలవకముందే - ఏదో సందేహము, దానివలన భయము కలగసాగింది.

---

**యథైవ ఖలు వయమ్ అస్మిన్**
**శరీరే సాధ్వలంకృతే, సాధ్వలంకృతో భవతి।**
**సువసనే సువసనః।**
**పరిష్కృతే పరిష్కృత -**
**ఏవం ఏవ అయమ్ అస్మిన్**
**అన్ధే... అన్ధో భవతి।**
**స్రామే స్రామః। పరివృక్ణే పరివృక్ణో**
**అస్యైవ శరీరస్య నాశమ్ అన్వేష... నశ్యతి।**

"నేను తపోమునిరూపంలో ఉన్నప్పుడు, నీటిలో ముని వంటి రూపం కనిపించింది. సాధు (Fashion) అలంకృతమైనప్పుడు - సాధు (Royal) రూపం కనిపించింది. వస్త్రములు ధరించినప్పుడు సుందర వస్త్రములతోను, పరిష్కృత (సర్వాలంకారమైన) రూపము ధరించినప్పుడు పరిష్కృతంగాను కనిపించింది.

అట్లాగే ఒక గ్రుడ్డివాడు జలంలో చూస్తుంటే గుడ్డివాడే కనిపిస్తాడు. స్రామము (ఒంటి కన్ను ఉంటే) అతడు నీళ్లల్లో ఒంటికన్ను కలవానివలెనే ప్రతిబింబిస్తాడు. (కన్ను, ముక్కు మొదలైనవి వంకర టింకరగా ఉంటే, నీళ్లలో ప్రతిబింబము అట్లాగే కనిపిస్తుంది. శరీరము ఏ కారణంచేతనైనా నశిస్తే నీటిలో ప్రతిబింబము నశిస్తుంది. **కానీ ఆత్మకు నాశనము లేదు కదా!** మరి పితామహులు నీటిలో **"ఏది"** ప్రతిబింబిస్తోందో - అదే ఆత్మ అని అన్నప్పుడు నేను బహుశ సరిగ్గా అర్థం చేసుకోలేదు".

---

**న అహమ్ అత్ర భోగ్యం పశ్యామి ఇతి॥**

"నేను విన్నదానిలో నేను ఆత్మానందము పొందే విషయమేదీ నాకు కనబడటం లేదు".

---

**2. స సమిత్పాణిః పునరేయాయ।**
**తం హ ప్రజాపతిః ఉవాచ।**

ఈ విధంగా యోచించి ఇంద్రుడు మరల సమిత్పాణుడై (గురువులకు యజ్ఞము కొరకై ధరించే సమిధలు చేతబూని) - వెనుకకు మరలి - తిరిగి ప్రజాపతి దర్శనం చేసుకొన్నారు.

---

**మఘవన్, యత్ శాంత హృదయః ప్రావ్రాజీః**
**సార్థం విరోచనేన - "కిమ్**
**ఇచ్ఛన్ పునరాగమ?" - ఇతి।**

ప్రజాపతి : ఓ మఘవన్। ఇంద్రదేవా! అప్పుడు నేను చెప్పినదానికి ఆత్మగురించిన వివరణకు శాంతచిత్తుడవై విరోచనునితో సహా వెళ్లియున్నావు కదా! ఇంకా ఏమి తెలుసుకోగోరి వచ్చావు?

---

**<u>స హ ఉవాచ :</u>**
**యథైవ ఖలు అయం భగవో।**
**అస్మిన్ శరీరే సాధ్వలంకృతే**
**సాధ్వలంకృతో భవతి।**
**సువసనే సువసనః।**
**పరిష్కృతే పరిష్కృత।**
**ఏవం ఏవ అయం అస్మిన్**
**అంధే అంధో భవతి।**

**ఇంద్రుడు** : పితామహా! మీరు - 'నీటిలో ఏదైతే ప్రతిబింబిస్తోందో అదియే ఆత్మ" అని చెప్పినట్లున్నారు. భగవాన్! మీరు చెప్పినదానితో భోగము (ఆత్మానుభవము) నాకు లభించనే లేదు. ఎందుకంటే - సాధువుగా (Beautiful) అలంకరించుకొని చూస్తే, జలములో ప్రతిబింబము సాధువుగా కనబడుతోంది. చక్కటి వస్త్రములు ధరించి నీటిలో ప్రతిబింబము చూచుకుంటే - అట్లాగే కనబడుతోంది. అన్నీ సరిచేసుకొని పరిష్కృతుడై నీళ్లలో ప్రతిబింబము చూస్తే - ప్రతిబింబము పరిష్కృతమై కనిపిస్తోంది. గుడ్డివాడు నీళ్లల్లో గుడ్డివాడుగానే అగుపిస్తాడు. ఒంటికన్నువాడు ఒంటికన్నువాడుగాను,

**స్రామే స్రామః।**
**పరివృక్ణే పరివృక్ణో**
**అస్య ఏవ శరీరస్య నాశమ్ అన్వేష - నశ్యతి।**
**న అహం అత్ర భోగ్యం పశ్యామి - ఇతి।**

వంకర టింకర శరీరము కలవాడు వంకరటింకరగాను అగుపిస్తాడు. ఖండితమైనవాడు ఖండితమైనట్లే అగుపిస్తాడు.

ఈ శరీరము నశిస్తే నీళ్లల్లో ప్రతిబింబము నశించినట్లే అగుపిస్తుంది. మరి ఆత్మ నాశనము లేనిది కదా! జలములోని ప్రతిబింబం ఆత్మ ఎట్లా అవుతుంది?

నాకు ఇందులో భోగ్యమగు ఆత్మ యొక్క భోగము అగుపించలేదు.

---

**3.** **ఏవం ఏవ ఏష మఘవన్ ఇతి।**
**హ ఉవాచ : ఏతం త్వ ఏవ, తే**
**భూయో అనువ్యాఖ్యాస్యామి।**
**వసాపరాణి ద్వాత్రింశతం వర్షాణి ఇతి।**
**స హ అపరాణి ద్వాత్రింశతం**
**వర్షాణి ఉవాస।**
**తస్మై హ ఉవాచ।**

ప్రజాపతి : అవును. ఆత్మను అర్థం చేసుకోవటం అంతటి చమత్కారమైన విషయమే మరి. నీకు మరల కూడా బోధిస్తాను.

అయితే నీవు 32 సంవత్సరములు ఇక్కడ ఉపాసన చేయి. మరల ఈ విషయం చెప్పుకుందాము.

ఆ విధంగానే ఇంద్రుడు 32 సంవత్సరములు బ్రహ్మచర్యదీక్షలో వ్రతము నిర్వర్తించారు. అప్పుడు ప్రజాపతి ఇట్లా చెప్పనారంభించారు.

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - అష్టమాధ్యాయే నవమః ఖండః**

# 8-10. దశమః ఖండః - స్వప్న పురుషుడే ఆత్మయా?

**1.** **య ఏష స్వప్నే మహీయమానః**
**చరతి, ఏష ఆత్మేతి॥**
**<u>హ ఉవాచ :</u> ఏతత్ అమృతమ్।**
**అభయమ్। ఏతత్ బ్రహ్మేతి।**
**స హ శాంతహృదయః ప్రవవ్రాజ।**

ప్రజాపతి : ఎవ్వడైతే మహిమాన్వితుడై స్వప్నమునందు చరిస్తూ ఉంటాడో, ఆతడే ఆత్మ। ఆయన అమృత - అభయస్వరూపుడే। అదియే బ్రహ్మము।

ఆ మాటలు విని ఇంద్రుడు శాంతించిన హృదయము కలవాడై దేవలోకమునకు వెళ్లసాగారు.

---

**స హ అప్రాప్యైవ దేవాన్**
**ఏతత్ భయం దదర్శ।**
**తత్ యది అపి ఇదం శరీరమ్**
**అంధం భవతి అనంధః స భవతి।**
**యది స్రామమ్ - అస్రామో**
**న ఏవ ఏషో అస్య దోషేణ దుష్యతి।**

ఇంకా దేవలోకం చేరకముందే ఆయనకు (దేవతలకు అసలైన విషయం ఏం చెప్పాలి?) - అనే భయం మరల పట్టుకొన్నది. సంశయము మిగిలియే ఉన్నది.

ఇంద్రుడు ఇట్లా ఆలోచించసాగారు.

ఒకనికి ఏదో కారణం చేత గుడ్డితనం వచ్చినప్పటికీ ఆత్మ గుడ్డిది అవదు కదా! శరీరములోని కళ్లు మొదలైన వాటి నుండి దుర్వాసన జలము (స్రామము) కారుచున్నప్పుడు కూడా, తద్వారా 'ఆత్మ' నుండి ఏ దుష్టజలము కారదు కదా! ఆయా దోషములు ఆత్మకు అంటవు. ఆత్మ వాటిచే దుష్యము (దూషణార్హము) పొందదు.

---

**2.** **న వధేన అస్య హన్యతే।**
**న అస్య స్రామ్యేణ స్రామో।**
**ఘ్నంతిత్వ ఏవ ఏనం విచ్ఛాదయన్తి ఇవ**
**అప్రియవేత్తేవ భవతి అపి రోదితి ఇవ।**
**న అహమ్ అత్ర భోగ్యం**
**పశ్యామి - ఇతి॥**

దేహము వధించబడినప్పుడు కూడా ఆత్మ వధించబడేది కానేకాదు.

శరీరం నుండి చీము, నెత్తురు వంటివి కారినా కూడా ఆత్మ నుండి అవన్నీ స్రామించవు (స్రవించవు). అట్లే కొట్టబడినా, కోయబడినా శరీరముయొక్క రోత (Bad smell) చే ఆత్మ రోత పొందదు.

అందుచేత నేను పితామహులు ప్రజాపతులువారి వద్ద ఇంతవరకు విన్నదానిని అనుసరించి నాకు ఇంకా ఆత్మయొక్క ఆనందానుభవం లభించటంలేదు.

---

**3.** **<u>స సమిత్పాణిః పునరేయాయ।</u>**
**<u>తం హ ప్రజాపతిః ఉవాచ :</u>**
**"మఘవన్। యత్ శాంత హృదయః**
**ప్రావ్రాజీః కిమ్ ఇచ్ఛన్**
**పునరాగమ?" - ఇతి।**
**<u>స హోవాచ :</u> తత్ యద్యపి ఇదం**
**భగవః శరీరం అంధం**
**భవతి, అనంధః స భవతి।**
**యది స్రామమ్ అస్రామో**
**నైవ ఏషో అస్య దోషేణ దుష్యతి।**

ఇంద్రుడు మరల సమిత్పాణి అయి చేతితో యజ్ఞఉపకరణములు అగు సమిధలు పట్టుకొని మరల సృష్టికర్తయగు ప్రజాపతిని దర్శించారు.

ప్రజాపతి : ఓ మేఘనాయకా! మఘువన్! నేను చెప్పినదానిని విని శాంతి హృదయులై (సంతోషించినవాడివై) వెళ్లావు కదా! మరలా వచ్చావేమి? ఏమి కోరివచ్చావు?

ఇంద్రుడు : పితామహా। బ్రహ్మదేవా। భగవాన్। ఈ శరీరము గుడ్డిది అయినప్పటికీ స్వప్నాత్మ గుడ్డిది అవటం లేదు మరి? ఏది గుడ్డిది (Blind) కాదో అది కదా ఆ ఆత్మ।

- (బొంగవంటి, కన్నీరువంటి స్రావము) శారీరకమైన స్రామముచేత తాను స్రామము పొందినా, ఆ దోషము అద్దానికి (ఆత్మకు) అంటదు.

| | | |
|---|---|---|
| 4. | **న వధేన అస్య హన్యతే।**<br>**న అస్య స్రామ్యేణ స్రామో ఘ్నంతి**<br>**త్వేవైనం విచ్ఛాదయంతి ఇవ**<br>**అప్రియవేత్త ఏవ భవతి అపి రోదితి ఇవ।**<br>**న అహమ్ అత్ర భోగ్యం పశ్యామి।** | దేహము వధించబడినా ఏది వధించబడదో, చావదో, ఏది రక్తము స్రవించటము మొదలైన వాటిచే తాను విచ్ఛేదము పొందదో,<br><br>- శరీరము రోత (దుర్వాసన) పొందినా కూడా ఏది రోత పొందదో, అట్టి మహాభాగ్యమగు ఆత్మను నేను ఇంకా కూడా దర్శించలేకపోతున్నాను.<br><br>స్వప్నంలో ఒకడు తాను చచ్చినట్లు కూడా కలగంటున్నాడు. ఆత్మకు చావు లేదు కదా! ఈఈ కారణాలచేత - "ఆత్మ ఇట్టిది" అని నేను నిర్ణయించుకోలేకపోతున్నాను. |
| | **ఇత్యేవమేవ ఏష మఘువన్ ఇతి।**<br>**<u>హ ఉవాచ</u>: ఏతం త్వేవ**<br>**తే భూయో అనువ్యాఖ్యాస్యామి**<br>**వసాపరాణి ద్వాత్రింశతం**<br>**వర్షాణి – ఇతి।**<br>**స హ అపరాణి ద్వాత్రింశతం**<br>**వర్షాణి – ఉవాస।**<br>**<u>తస్మై హ ఉవాచ।</u>** | ప్రజాపతి : అవును. ఆత్మ గురించిన నిశ్చయానుభవము అంతటి కష్టమైనదే మరి! నీవు కావాలంటే మరల వివరణగా వ్యాఖ్యానించుకుందాము. అయితే నీవు "32" సంవత్సరములు బ్రహ్మచర్య దీక్షతో ఇక్కడ తపస్సు చేయి.<br><br>ప్రజాపతి సూచించిన విధంగానే ఇంద్రుడు మరల 32 సంవత్సరములు బ్రహ్మచర్యము చేసి తిరిగి ప్రజాపతివద్దకు వచ్చారు. అప్పుడు ప్రజాపతి ఇట్లు అన్నారు. |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - అష్టమాధ్యాయే దశమః ఖండః**

# 8-11. ఏకాదశః ఖండః - సుషుప్త పురుషుడే ఆత్మయా?

| | మూలము | అర్థము |
|---|---|---|
| 1. | తత్ యత్ర ఏతత్<br>సుప్తః సమస్తః సం ప్రసన్నః<br>స్వప్నం న విజానాతి ఏష।<br>"ఆత్మ" - ఇతి॥<br>హ ఉవాచ : ఏతత్ అమృతమ్।<br>అభయమ్। ఏతత్<br>"బ్రహ్మ" - ఇతి॥<br>స హ శాంత హృదయః ప్రవవ్రాజ!<br>స హ అప్రాప్యైవ దేవాన్,<br>ఏతత్ భయం దదర్శ | ప్రజాపతి : ఏదైతే గాఢనిద్రపొందుచూ సమస్తమును సంప్రసన్నముగా సమ్యక్ రూపముగా ఆనందించుచూ, జాగ్రత్ - స్వప్నములు తనకు అప్పుడు తెలియబడకయే ఉన్నదో - అదియే ఆత్మ। అద్దాని గుర్తులు ఏమిటంటే<br>- అది అమృతము<br>- అభయము<br>- అదియే బ్రహ్మము<br>ఆ సమాధానము విని ఇంద్రుడు తృప్తి పొంది, శాంతహృదయుడై బ్రహ్మలోకమునుండి వెనుకకు మరలాడు. ఇంకా దేవలోకము చేరకముందే ఆత్మయొక్క అవగాహన విషయంలో మరల కొంత భయం వచ్చింది. (అభయము సిద్ధించలేదు) |
| | న అహ ఖలు అయం ఏవం సంప్రతి ఆత్మానం<br>జానాతి। 'అయమ్ అహమ్ అస్మి'<br>ఇతి నో ఏవ ఇమాని<br>భూతాని। వినాశమేవ అపి అతో భవతి।<br>"న అహం అత్ర భోగ్యం పశ్యామి' ఇతి॥ | ఇంద్రుడు (తనలో) : పితామహుల వారు సూచిస్తున్న దశలో 'నేను ఇది' అని తెలియదు. అంతేకాదు. "వీరు ఈ ఈ తదితర జీవులు - అనేది కూడా తెలియదు కదా! ఆ గాఢ నిద్రా సమయంలో ఈ జీవుడు మరణించిన వానివలె ఉంటాడు।<br>అందుచేత నాయొక్క వాంఛిత ఫలము అయినట్టి - 'ఆత్మ' యొక్క అనుభవము ఈ సూచనచే కూడా సిద్ధించటం లేదే? |
| 2. | స సమిత్పాణిః పునరేయాయ<br>తం హ ప్రజాపతిః ఉవాచ-మఘవన్! యత్ శాంతహృదయః<br>ప్రావ్రాజీ కిం ఇచ్ఛన్ పునరాగమ ఇతి।<br>స హ ఉవాచ - న అహం ఖలు అయం,<br>భగవ! ఏవం సంప్రతి ఆత్మానం జానాతి<br>అయం అహం అస్మి ఇతి, నో ఏవ ఇమాని<br>భూతాని వినాశం ఏవ అపి అతో భవతి।<br>న అహం అత్ర భోగ్యం పశ్యామి ఇతి। | ఇంద్రుడు సమిధులను చేతిలో పట్టుకొని మరలా వెళ్లగా, ప్రజాపతి ఇట్లు అడిగెను - మేఘనాయకా! చెప్పినదానికి సంతృప్తిచెంది వెళ్లినవాడివి మరలా ఏమి కోరి తిరిగి వచ్చావు?<br>ఇంద్రుడు ఇట్లా చెప్పెను - భగవాన్! నిశ్చయముగా ఇదే నేను (ఆత్మ) అని సుషుప్తిలో తానే తెలుసుకొనలేడు. ఇక ఇతర భూతముల వినాశము తెలుసుకోలేడు. అందు ఆత్మీభావము నాకు కనబడుటలేదు. |
| 3. | ఏవం ఏవ ఏష మఘవన్ ఇతి।<br>హోవాచ : ఏతం త్వేవ తే<br>భూయో అనువ్యాఖ్యాస్యామి।<br>నో ఏవ, అన్యత్ర ఏతస్మాత్<br>వసాపరాణి। పంచవర్షాణి ఇతి।<br>స హ అపరాణి పంచవర్షాణి ఉవాస।<br>తాని ఏక శతం సంపేదుః<br>ఏతత్ తద్యత్ ఆహుః।<br>ఏకశతం హ వై వర్షాణి<br>మఘవాన్ ప్రజాపతౌ<br>బ్రహ్మచర్యమ్ ఉవాస।<br>తస్మై హోవాచ॥ | ఇంద్రుడు : మరల వెనకకు వెళ్లి ప్రజాపతితో "నేను ఆత్మానుభవం పొందలేక పోతున్నాను స్వామీ!" అని చెప్పారు.<br>ప్రజాపతి : ఔను. అది అలాగే ఉంటుంది మరి. మరల నీకు ఆత్మ విషయం గురించి అనువ్యాఖ్యానం చేస్తాను. అట్టి ఆత్మకు వేరుగా ఎక్కడా ఏదీ ఏమాత్రము లేదయ్యా। సరే! నీవు '5' సంవత్సరములు మాత్రం 'బ్రహ్మము ఎరుగుట' అనే బ్రహ్మచర్య దీక్షవహించి తపస్సుచేయి.<br>ఆ విధంగానే ఇంద్రుడు ఇంద్రలోకములోని భోగములన్నీ త్యజించి 32+32+32+5 = 101 సంవత్సరములు తపస్సు చేసారు.<br>అప్పుడు ప్రజాపతి ఈ విధంగా పలుకసాగారు. |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - అష్టమాధ్యాయే ఏకాదశః ఖండః

# 8-12. ద్వాదశః ఖండః - ఆత్మయే శరీరాదులుగా ప్రకటనమైనది

**1.** **మఘవన్। మర్త్యం వా ఇదం శరీరం। ఆత్తం మృత్యునా। తదస్య అమృతస్య అశరీరస్య ఆత్మనో అధిష్ఠానం ఆర్తో వై,**

ప్రజాపతి : హే మఘవన్! ఇంద్రదేవా! ఈ శరీరము 'మరణించటము' అనే స్వభావము కలిగియున్నది. అందుకే ఇది "మర్త్యము" - అనబడుతోంది. ఈ భౌతికశరీరం ముత్యువుచేత ఆత్తము (గ్రస్తము) అయి ఉన్నది.

అయితే ఈ శరీరము ఒక ఉపాధి (లేక) ఉపకరణముగా కలిగియుండి, దీనికి వేరైనవాడు - 'శరీరి'. 'శరీరి'కి మృత్యువు లేదు. కనుక 'అమృతుడు'.

శరీరమునకు వేరై ఉన్నాడు.

శరీరమునకు మునుముందే ఉన్నాడు.

ఈ శరీరము జడమై, దీనికి ఆధారము - అధిష్ఠానము, కనుక 'అశరీరి' ।

---

**సశరీరః ప్రియ - అప్రియాభ్యాం న హ వై సశరీరస్య సతః ప్రియ - అప్రియయోః అపహతిః అస్తి అశరీరం వావ సన్తం న ప్రియ అప్రియే స్పృశతః।**

అశరీరమగు ఆత్మ శరీరమును చేతనము చేయుచు 'సశరీరము' అనిపించుకుంటోంది. "నేను శరీరము కలవాడను"- అను భావముచే పరమగు ఆత్మ 'శరీరి'గా అయి "ప్రియ-అప్రియములు" పొందుతోంది.

ఎంతెంతవరకైతే ఆత్మ "నేను శరీరమునకు చెందినదానను" - అనే తాదాత్మ్యము ఏర్పడి ఉంటుందో, అంతంతవరకు ప్రియ - అప్రియములచే శరీరము బాధింపబడుచూనే (అపహతమై) ఉంటుంది. వాస్తవానికి.:

- సశరీరంగా ప్రియాప్రియములు ఉన్నప్పటికీ...
- (శరీరమునకు ముందే ఉన్న....కేవల చైతన్యముగా) అశరీరిని (శరీర-దృశ్య సంబంధమైన) ప్రియాప్రియములు స్పృశించలేవు.

---

**2.** **అశరీరో వాయుః అభ్రం విద్యుత్ స్తనయిత్నుః అశరీరాణి ఏతాని। తత్ యథా ఏతాని అముష్మాత్ ఆకాశాత్ సముత్థాయ "పరంజ్యోతిః" ఉపసంపద్య స్వేన రూపేణ అభినిష్పద్యన్తే।**

"ఈ జీవుడు వాస్తవానికి శరీరమునకు వేరై ఉండటంచేత అశరీరుడే" అనవచ్చును కూడా।

- వాయువునకు శరీరము ఉన్నదా? లేదు। అశరీరమే।

- అట్లాగే అభ్రము (ఆకాశము)నకు శరీరము లేదు। అశరీరమే।

- విద్యుత్తు (తేజస్సు/వెలుగు)కు శరీరము ఉన్నదా? లేదు.

- స్తనయత్నువు (ఉరుము, పిడుగు)కు మాత్రం శరీరమున్నదా? లేదు. ఇవన్నీ కూడా అశరీరములే.

ఇవన్నీ కూడా నిర్విషయము, అశరీరము అగు ఆకాశమునుండి సముత్థాయమ్ (Get generation) పొంది, పరంజ్యోతి (Basic Enlightenment) పొంది ప్రవర్తించిరి. వాటి వాటి స్వరూప

| | | |
|---|---|---|
| **3.** | **ఏవం ఏవ ఏష సంప్రసాదో అస్మాత్<br>శరీరాత్ సముత్థాయ పరంజ్యోతిః<br>ఉపసంపద్య, స్వేన రూపేణ అభి నిష్పద్యతే।** | స్వభావములతో సహా పరంజ్యోతినందే లీనమగుచున్నాయి.<br><br>(ఏవిధంగా అయితే వాయువు, ఆకాశము, విద్యుత్తు, ఉరుములు శరీరం కాక, ఆత్మాకాశమునుండి బయల్వెడలి తిరిగి ఆత్మ తేజస్సునందు లీనము అగుచూ ఉన్నాయో) ఆ విధంగానే - (నిర్మలమైన, సునిశితమైన, విస్తారమైన, బలముతో కూడిన బుద్ధిగల) సంప్రసాదుడు (జీవుడు) ఈ శరీరస్థితి నుండి (లేక) "శరీర భావన" నుండి తనను తాను సముత్థరించుకొని, (సమస్తజ్యోతులలోని మూలజ్యోతి స్వరూపము వలె) సర్వజీవులలో, సమముగా వేంచేసియున్న పరంజ్యోతి స్వరూపుడై స్వస్వరూపధారణ అనుక్షణికం చేసుకొని ఉంటున్నాడు. |
| | **స ఉత్తమ పురుషః।<br>స తత్ర పర్యేతి జక్షత్క్రీడన్ రమమాణః<br>స్త్రీభిః వా యానైః వా జ్ఞాతిభిః వా<br>న ఉపజనం స్మరన్।<br>ఇదం శరీరం స యథా ప్రయోగ్య<br>ఆచరణే యుక్త ఏవం ఏవ అయం<br>అస్మిన్ శరీరే ప్రాణో యుక్తః।** | ఆతడే ఉత్తమ పురుషుడు (First Person - "I") అట్టి సమస్తము నందు ఉన్నట్టి అంతరాత్మస్వరూపుడగు పరమాత్మ - తన సర్వాత్మత్వమును ఏమరచుచున్నాడు.<br><br>- "లీలావినోదమా?"<br><br>- అన్న తీరుగా (జక్షన్-నవ్వుకొంటూనే) - క్రీడించుచున్నాడు. స్త్రీ, వాహన, గృహ, బంధువులు మొదలైనవన్నీ స్మరించుచు నవ్వుచూ, ఆడుచూ, ఆనందిస్తూ విహరిస్తున్నాడు. అరుస్తూ పరిమితమునందు చక్రభ్రమణం చేస్తున్నాడు.<br><br>తనకు ఎక్కడి నుండో ప్రాప్తించిన ఈ పాంచభౌతిక శరీరము ఎటువంటిదో, తాను ఎటువంటివాడో విచారణ చేయకుండానే దృశ్యములో పరివర్తిస్తూ ఉన్నాడు.<br><br>ఈ విధంగా బండికి ఎద్దు కట్టబడియున్న విధంగా ఆతని ప్రాణము (ప్రాణశక్తి) జడమగు శరీరమునకు కట్టబడినదై ఉంటోంది. |
| **4.** | **అథ యత్ర ఏతత్ ఆకాశం<br>అనువిషణ్ణం చక్షుః స చాక్షుషః<br>పురుషో దర్శనాయ చక్షుః అథ యో<br>వేద ఇదం 'జిఘ్రాణి' ఇతి।<br>స ఆత్మా గంధాయ ఘ్రాణం<br>అథ యో వేద ఇదమ్ అభివ్యాహరాణి ఇతి॥<br>స ఆత్మా అభివ్యాహారాయ<br>వాక్ అథ యో వేద,<br>ఇదం శృణవాని ఇతి స ఆత్మా<br>"శ్రవణాయ" శ్రోత్రమ్॥** | - ఎక్కడ చూచువాడు (చాక్షుష పురుషుడు) దర్శనము నిర్వర్తించగలడో అట్టి స్థానమే "కన్ను". ఈ కన్ను అనేది ఉన్నదే కేవలం చూచువాని యొక్క ఉపయోగము కొరకు. అట్టి కళ్లలోని చూచువాడే, (మరియు) దర్శనచైతన్యమే "ఆత్మ".<br><br>గన్ధము (Smell) యొక్క ఎరుక - అనుభవముల కొరకే ఘ్రాణము (ముక్కు) ఆత్మకు వాసనయొక్క అనుభవైకస్థానముగా (ఘ్రాణాకాశముగా) ఉన్నది.<br><br>ఆత్మయొక్క అనుభవము నిమిత్తమే (అభివ్యహారము కొరకే) ఆత్మాకాశమునందు వాక్కు నోటి స్థానమునందు రూపుదిద్దుకొంటోంది.<br><br>ఆ వాక్కు వినటానికే ఆత్మాకాశము చెవులవద్ద శ్రవణతత్త్వముగా ఏర్పడి ఉంటోంది. |

| | |
|---|---|
| **5. అథ యో వేద ఇదం మన్వాని ఇతి।<br>స ఆత్మా 'మనో'। అస్య దైవం 'చక్షుః'।<br>స వా ఏష ఏతేన దైవేన<br>చక్షుషా మనసి ఏతాన్<br>కామాన్ 'పశ్యన్' రమతే।** | ఆత్మయొక్క శ్రవణము (Hearing) కొరకే శ్రవణాయము (చెవులు) అవర్తమానమై ఉన్నది.<br>"నేను మననము చేసెదను గాక" అని ఎవరి నిర్ణయమో, అదియే "ఆత్మ". ఆ విధంగా ఆత్మయే మనోరూపము దాల్చుచున్నది. ఆత్మయొక్క దివ్యచక్షువులు (కళ్లు) - మనస్సు.<br>అట్టి ఆత్మ తనయొక్క మనోచక్షువులచే భోగములను, మధురమగు భావములను, వస్తువులను దర్శించుచూ తనయందు తానే దృశ్యరూపముగా రమించుచున్నది. |
| **6. య ఏతే బ్రహ్మలోకే<br>తం వా ఏతం దేవా ఆత్మానం ఉపాసతే।<br>తస్మాత్ తేషాం సర్వే చ<br>లోకా ఆత్తాః సర్వే చ కామాః।<br>స సర్వాంశ్చ లోకాన్ ఆప్నోతి।** | ఓ ఇంద్రదేవా! బ్రహ్మలోకములో దేవతలు అట్టి శ్రవణము, చూపు, మనస్సు తనయొక్క స్వకీయ ప్రదర్శనమే అయి ఉన్న పరమాత్మనే ఉపాసించుచున్నారు.<br>నీవు కూడా "ఈ సమస్తము ఆత్మయే" అని ఉపాసించు.<br>ఎవ్వరైతే ఆత్మయే ఈ సమస్త జీవులుగాను, చూపు - వినికిడి - మాట్లాడటము - స్పర్శ - వాసనగా, మనస్సుగా తనకొరకు తానే తనయందు ప్రదర్శనమగును అని, ఈ సమస్త లోకములగాను ప్రదర్శనమగుచున్నదని, ఆత్మయే ఈ అంతటి వాస్తవరూపమని గ్రహిస్తారో అట్టివారు - సర్వలోకములను తమయందే పొందుచున్నారు. వారు ఏ లోకములో ఏది కోరుకొంటే అవన్నీ సిద్ధించగలవు. వారు కోరుకొన్న లోకము పొందగలరు. |
| **సర్వాంశ్చ కామాని అస్తమ్<br>ఆత్మానం అనువిద్య విజానాతి ఇతి।<br>హ ప్రజాపతిః ఉవాచ।<br>ప్రజాపతిః ఉవాచ।** | ఎవ్వరైతే ఈ ఆత్మశాస్త్రమును ఆచార్యోపాసన చేస్తూ అధ్యయనము చేస్తారో, ఆత్మవిద్యను తెలుసుకొని, ఆత్మయే తామై ప్రకాశమానులై ఉంటారో వారు వాంఛించినవన్నీ పొందగలరు.<br>ఈ విధంగా ఆత్మవిద్యను ప్రజాపతి ఇంద్రునికి విశదీకరించారు. తెలియపరచారు. |

**ఇతి - ఛాందోగ్యోపనిషత్ - అష్టమాధ్యాయే ద్వాదశః ఖండః**

## 8-13. త్రయోదశః ఖండః - కర్మలు దాటి బ్రహ్మలోకము పొందవలెను

1. శ్యామాత్ శబలం ప్రపద్యే।
శబలాత్ శ్యామం ప్రపద్యే।
అశ్వ ఇవ రోమాణి
విధూయ పాపం, చంద్ర ఇవ రాహోః
ముఖాత్ ప్రముచ్య ధూత్వా శరీరం
అకృతం కృతాత్మా బ్రహ్మలోకం
అభిసంభవామి ఇతి।
అభి సంభవామి ఇతి।

నీలిలోహిత వర్ణమగు హృదయమును, హృదయంలో విలసిల్లుచున్న శ్యామము (ఆత్మ)ను ఉపాసించుచూ ఆత్మనే పొందుచున్నాము.

- గుఱ్ఱము తన రోమములు విదల్చి ధూళి పోగొట్టుకొనువిధంగా

- రాహువు నోటిలో నుండి బయటకు వచ్చివేసిన చంద్రునివలెను

కృతకృత్యుడనై సర్వకర్మదోషములను తొలగించివేసుకొని సమస్తము బ్రహ్మముగా చూచు బుద్ధిస్థితియందు బ్రహ్మలోకములో ఉనికిని పొందుచున్నాము. బ్రహ్మలోకమునందు నివాసయోగ్యులము అగుచున్నాము.

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - అష్టమాధ్యాయే త్రయోదశః ఖండః

## 8-14. చతుర్దశః ఖండః - బ్రహ్మము నామరూపములకు ఉపాదాన కారణమైనా మార్పు చేర్పులు లేనిది

1. ఆకాశో వై నామ। నామ -
రూపయోః నిర్వహితా।
తే యత్ అన్తరా, తత్ బ్రహ్మ।
తత్ అమృతం। స ఆత్మా।
ప్రజాపతేః - సభాం వేశ్మ ప్రపద్యే।

- ఆకాశము (హృదయాకాశము) నామాత్మకమైయున్నది.

- అట్టి (దహర లేక హృదయ) ఆకాశమునందు నామరూపములు నిర్వహించబడుచున్నాయి.

- (ఆభరణములకు - బంగారమువలె, మట్టిబొమ్మలకు మట్టివలె, తరంగములకు జలమువలె) - నామరూపాత్మకమైన ఈ సమస్తమునకు అంతరమున బ్రహ్మము విరాజమానమైయున్నది.

అట్టి అంతరాంతర్గతమగు బ్రహ్మమే మార్పు చేర్పులకు విషయమే కానిదై, అమృతస్వరూపమై యున్నది. అదియే "ఆత్మ".

అట్టి బ్రహ్మమును, (లేక) ఆత్మను ఉపాసిస్తూ ఉన్నాను. "ప్రజాపతి సభ" అనే బ్రహ్మలోకమును ప్రవేశించి బ్రహ్మమునే సర్వత్రా సమస్వరూపంగా ఉపాసించుచున్నాను.

---

యశో అహం భవామి।
బ్రాహ్మణానాం యశః। రాజ్ఞాం యశః।
విశాం యశో। అహం అనుప్రాపత్సి,
స హ అహం యశసాం యశః శ్యేతం
అదత్కం - అదత్కం।
శ్యేతం లిన్దు మాభిగామ్।
లిన్దు మాభిగామ్॥

అధ్యయనము : బ్రాహ్మణములు అధ్యయనం చేస్తూ, బ్రహ్మము గురించి ఎరిగియున్న బ్రాహ్మణుల యశస్సు 'నేనే' అయి ఉన్నాను.

రక్షణ : 'రక్షణ' ధర్మము నిర్వర్తించు క్షత్రియులలోని క్షత్రియ యశస్సును కూడా నేనే।

క్రియాసామర్థ్యము : వైశ్యులలోని క్రియా సామర్థ్య యశస్సునూ నేనే।

యశస్సు : అట్టి యశస్సుల శోభచేత యశస్సుకే యశస్సును అయి ఉన్నాను. ఆత్మనగు నేను ఆత్మతత్త్వమునే దర్శిస్తూ సమస్తము ఆత్మగా పొందెదనుగాక। దంతవిహీనమై సర్వభక్షకమగు, స్వతఃగా లేని 'మాయ'కు ఎర కాకుండెదను గాక।

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - అష్టమాధ్యాయే చతుర్దశః ఖండః

## 8-15. పంచదశః ఖండః - ఆత్మ బోధ పరంపర

| | | |
|---|---|---|
| 1. | తద్ధైతత్ బ్రహ్మా ప్రజాపతయ ఉవాచ :<br>ప్రజాపతిః మనవే।<br>మనుః ప్రజాభ్యః<br>ఆచార్య కులాత్<br>వేదమ్ అధీత్య।<br>యథా విధానం<br>గురోః కర్మా అతిశేషేణ<br>అభి- సమావృత్య।<br><br>కుటుంబే శుచౌ దేశే స్వాధ్యాయం అధీయానో।<br>ధార్మికాన్ విదధత్।<br>ఆత్మని సర్వేన్ద్రియాణి సంప్రతిష్ఠ అపి<br>అహింసః సర్వభూతాని,<br>అన్యత్ర తీర్థేభ్యః।<br>స ఖలు ఏవం వర్తయన్ యావత్<br>ఆయుషం బ్రహ్మలోకం<br>అభిసంపద్యతే।<br>న చ పునః ఆవర్తతే।<br>న చ పునః ఆవర్తతే॥ | ఈ ఆత్మజ్ఞానమును సృష్టి సంకల్పియగు బ్రహ్మ సృష్టి అభిమానియగు ప్రజాపతికి ఉపదేశించారు.<br>ప్రజాపతి మనువుకు, మనువు జనులకు బోధించారు.<br>- ఆత్మతత్త్వజ్ఞులగు ఆచార్యులను ఆశ్రయించి, వేదము అధ్యయనము చేసెదరు గాక।<br>- గురువు బోధించిన యథావిధిగా కర్మానుష్ఠానమును నిర్వర్తిస్తూ ఆత్మభావనను నిర్దుష్టము చేసుకొనెదరు గాక।<br>- తరువాత కుటుంబము (గృహస్థాశ్రమము) నిర్వర్తించెదరు గాక।<br>- శుచి అయిన ప్రదేశము ఎన్నుకొని స్వాధ్యాయనము నిర్వర్తించెదరు గాక।<br>- ధార్మికమైన అభ్యాసములు కార్యక్రమములు కలిగి ఉండండి.<br>- ఇంద్రియములను సర్వత్రా ఆత్మదర్శనమునందు నియమించండి.<br>- తదితర జీవులపట్ల ఆప్యాయత కలిగి ఉండండి.<br>- సహజీవులపట్ల అహింసను వ్రతంగా నిర్వర్తిస్తూ ఉండండి.<br>- పురుషార్థములు చక్కగా శాస్త్రానుకూలంగా నిర్వర్తించండి. జీవితము మహత్తరమైన అవకాశంగా భావించండి.<br>పునరావృత్తిలేని బ్రహ్మలోక నివాసము సిద్ధించుకోండి. |
| 2. | ఓం ఆప్యాయన్తు మమ<br>అంగాని, వాక్ ప్రాణః చక్షుః<br>శ్రోత్రమ్ అథో బలం ఇన్ద్రియాణి<br>చ సర్వాణి।<br>సర్వం బ్రహ్మ ఉపనిషదం।<br>మా అహం బ్రహ్మ నిరాకుర్యాం।<br>మామా బ్రహ్మ నిరాకరోత్।<br>అనిరాకరణం అస్తు।<br>అనిరాకరణం మే అస్తు।<br>తత్ ఆత్మని నిరతే<br>య ఉపనిషత్ సు ధర్మాస్తే మయి సన్తు।<br>తే మయి సన్తు॥<br>ఓం శాంతిః శాంతిః శాంతిః | ఉపనిషత్తులన్నిటిలో ఎలుగెత్తి గానం చేయబడుచు, ప్రబోధించ బడుచున్న ఆత్మ-తత్త్వజ్ఞానము సంపాదించుకోవటానికి నా వాక్కు, ప్రాణము, చక్షువులు (కన్నులు), చెవులు ఆప్యాయము కలిగి తోడు అగును గాక।<br>- బ్రహ్మము నన్ను నిరాకరించకుండును గాక। నిరాదరణ చేయకుండును గాక.<br>- నేను తత్త్వార్థసారమగు బ్రహ్మము (సోఽహమ్ తత్త్వమ్ రూప సర్వస్వరూప, స్వస్వరూపము) పట్ల నిరాదరణ కలిగి ఉండ కుండెదను గాక।<br>- బ్రహ్మము నన్ను నిరాకరణము చేయకుండా అనుగ్రహించు చుండును గాక।<br>- ఉపనిషత్తులు చెప్పుచున్న ఆత్మధర్మము పట్ల నిరతి కలిగి ఉండెదను గాక.<br>- ఉపనిషత్తులు చెప్పుచున్న ఆత్మధర్మము మా హృదయమునందు సుస్థిరమగును గాక। |

ఇతి - ఛాందోగ్యోపనిషత్ - అష్టమాధ్యాయే పంచదశః ఖండః

**ఇతి - ఛాందోగ్యోపనిషది అష్టమ అధ్యాయః సమాప్తః॥**

**ఇతి ఛాందోగ్యోపనిషత్ సమాప్తా**

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

సామవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 16 ఛాందోగ్యోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

**అధ్యయన వచన పుష్పము**

## 1. ప్రథమ అధ్యాయము–ఉద్గీథ విద్య

"ఓం" → (1) పరమాత్మ యొక్క (మరియు) ఈ జీవుని యొక్క సహజ స్వరూపమైయున్నట్టి సంజ్ఞ.

(2) సమస్తము తనకు అనన్యమైయున్న ఏకము (Indivisible Unity).

(3) అక్షరము (కాలము, సంఘటనలు మొదలైన వాటిచే క్షరము పొందనిది) అగు తత్త్వమునకు సంజ్ఞ (గణితములో 'x' అనుకొనుము – వంటిది)

(4) దేవతా ప్రతిమ వలె **"పరమాత్మకు ప్రతీక".** ఈ ఈ లక్షణములు గల ఆత్మకు చిహ్నాక్షరము. 'అ', 'ఉ' 'మ'ల సమాహారము.

---

**ఉద్గీథము :** ఉత్ + గీథము : కర్మ యొక్క అంగములతో సంబంధము కలిగి, కర్మ యొక్క ఫలమునకు అతిశయము (Superiority) కలిగించునది. 'ఓం'కారము కూడా ఉద్గీథముగా అభివర్ణితము.

---

**ఉపాసన** = చిత్తమును శుద్ధము చేయుటము ద్వారా ఆత్మ వస్తువును ప్రకాశింపజేయటానికై శాస్త్రముచే చెప్పబడే నియమము – నిష్ఠ

**ఉపనిషత్** = (1) ఆత్మజ్ఞానము

(2) ఆత్మజ్ఞానము సిద్ధించటానికై ఉపాసనలు

**విధి విధానములతో కూడిన శాస్త్రీయ "కర్మలు":** 'నేను' అనునది సమస్తమునకు ఆవల, కేవలమై ఉన్నప్పటికీ – "నేను కర్తను, భోక్తను" అను భావము కేవలమును కప్పి ఉంచుతోంది.

కర్తృత్వ భోక్తృత్వములకు, ఉపాయముగా శాస్త్రములు కర్మలు సూచిస్తూ –

- మొట్టమొదట ప్రాపంచక ప్రయోజనములను "ప్రారంభాకర్షణ" కొరకు ఫలశ్రుతులుగా వర్ణిస్తున్నాయి.
- "మహదాశయము" – ఆత్మ యొక్క స్వరూప ఔన్నత్య జ్ఞానమే **ముఖ్యాశయము (లేక) మహదాశయము.**

# 1-1 ప్రథమ ఖండము - "ఉద్గీథ విద్య"

**"ఓం"**

సమస్త జీవులుగాను, వారి యొక్క బహిరంగ జగదానుభవము గాను, అంతరంగ చతుష్టయమగు మనోబుద్ధి చిత్త అహంకారములుగాను సంప్రదర్శనమగుచూ, తాను సమస్తమునకు పరమై ఉన్నట్టి "ఆత్మ-తత్త్వము"నకు 'బ్రహ్మము' అను పేరు.

**"ఓం" అను అక్షర సంజ్ఞ:** (ఒకని తండ్రికి ఆ తండ్రి యొక్క ఫొటో సంజ్ఞయగు తీరుగా) (సంహిత- బ్రాహ్మణ - ఆరణ్యక - ఉపనిషత్ - మొదలగునవి గల) వేదము యొక్క సమస్త విభాగములలోను, మంత్రానుష్ఠానములలోను ఉపయోగించబడుచున్న అక్షరము- **"ఓం".**

అట్టి 'ఓం'ను - "ఇది ఏకము, అక్షరము అగు ఆత్మయే" - అను ఎరుకచే ఆయా సమస్త కార్యక్రమముల నిర్వహణ చేస్తూ, ఉపాసించెదరు గాక!

**'ఓం' ఇతి ఉద్గాయతి -** ఈ దృశ్యమునకు ఆవల గల ఆత్మతత్త్వము వైపుగా గానము చేయిస్తూ, పరమగు స్వరూపము వైపుగా నడిపించు శాస్త్ర విభాగమునకు, ఉపవ్యాఖ్యానమునకు 'ఓం' అని పేరు. అట్టి ఉపవ్యాఖ్యానమును ఇప్పుడు ఈ ఛాందోగ్యోపనిషత్తులో సవివరించుకుంటున్నాము.

(రసము = గతి। ఉత్పత్తికి కారణము। పరాయణము - స్థితికి కారణము। విలీనమయ్యే స్థానము)

ఈ చర అచర భూతజాలమునకు "రసము" - **"పృథివి"** (దేహములన్నీ భూమి నుండి బయల్వెడలే అన్న రసము చేతనే నిర్మితమౌచున్నాయి కాబట్టి)

పృథివి (Solid) యొక్క రసము - **"జలము"** (జలమే చెట్టు చేమలుగా, ఆహారంగా, జంతు దేహములుగా పరిణామము అగుచున్నది కాబట్టి)

జలము యొక్క రసము - **'ఓషధులు (ఆహారము)'**

ఓషధుల యొక్క రసము - **'పురుషుడు'** (పురుషకార సమన్వితుడగు 'జీవుడు')

పురుషుని యొక్క రసము / సారము - **"వాక్కు"**

వాక్కు యొక్క రసము - **"ఋక్కు, ఋగ్వేద మంత్రములు"**

ఋక్కుల యొక్క రసము - **"సామము, సామవేద మంత్ర గానములు"**

సామవేదము యొక్క సర్వస్వము ఉద్గీథము / **'ఓం'కారము.**

ఓంకార రసమే - రసతమము (Superlative), పరము, సారములలో ఎనిమిదవదగు 'ఓం'కారము.

*(1) పృథివి (2) జలము (3) ఓషధులు (4) పురుషుడు (5) వాక్కు (6) ఋక్కులు (7) సామగానము (ఉద్గీథము, కర్మ వ్యవహారములు) (8) ఓంకారము - 8వది పరమాత్మ పరాకాష్ఠయగు 'ఓం'కార స్వరూపుడు.*

ఋక్కు - సామ - ఉద్గీథ - ఏమేమై ఉన్నాయి? దీనిని మనము విమర్శించుకొని చెప్పుకొందాము.

**"వాక్కుయే ఋక్కు" :** ఋగ్వేదములోని పరమాత్మ గురించు స్తుతి - వర్ణనల రూపములగు ఋక్కులు, వాక్కునకు ఋక్కు (అనుభవము) ఉత్పత్తి స్థానము.

**"ప్రాణమే సామము" :** ప్రాణమే సామము(గానము)నకు ఉత్పత్తి స్థానము.

**"ఓం" అను అక్షరమే ఉద్గీథము** (కార్యక్రమము) - (Programme of Action / Following a Procedure)

వాక్కులోంచి ఋక్కులు; ప్రాణము నుండి సామము. ఆ రెండింటి ఏకత్వము సిద్ధించటానికి 'ఓం' అనునది సాధన వస్తువు. కనుక 'ఓం' ఉద్గీథమే; ఋక్కులు (స్తుతులు), సామములు (గానము) - ఈ రెండూ కూడా "ఓం" అను అక్షర పరబ్రహ్మమును

సిద్ధించుకోవటానికి మార్గములు, ఉపాయములే. అందుచేత ఋక్ – సామములు మరియు వాక్–ప్రాణములు **"మిథునము"** (పరస్పర దాంపత్య ఏకత్వము, కలయిక)చే 'ఓం'ను పొందుచున్నాయి.

'ఓం'కారము నందు ఆ రెండింటి సంయోగమే **మిథునము.** ఆ రెండు ప్రకృతి – పురుషుల వలె పరస్పరము ఇచ్ఛాపూరితము అగుచున్నాయి. అట్టి వాక్–ప్రాణములు రెండు అక్షరమునందు ఏకము (ఉద్గీథము) చేయు కార్యక్రమము 'ఓం'గా తెలుసుకున్న విద్వాంసుడు తాను కోరుకొన్న లోకాంతర్గత లోకాతీత స్థితులు మొదలైనవన్నీ పొందుచున్నాడు.

ఒకడు తాను కోరుకొను వస్తువును మరొకరిని అడిగినప్పుడు ఆ రెండవవాడు "ఓ! ఇస్తాను" – అంటాడు. అందుకని 'ఓం' **"అనుజ్ఞాతాక్షరము"** అని కూడా అంటారు.

అనుజ్ఞ (Permission) ఇస్తున్నప్పుడు మనుజుడు "Oh! Yes! తప్పకుండా ఇస్తాను. (Oh, Alright) అట్లాగే చేస్తాను. ఓ! అట్లాగా?" (Is it so?) మొదలైన మాటలలో ఓంకారము అంగీకారాక్షరముగా ఏర్పడి ఉంటోంది.

"ఓం" – అనుజ్ఞ – అవగాహన – అనుమతి – సమృద్ధి – సమర్థత = తద్వా ఏతత్ అనుజ్ఞాక్షరమ్,

**యద్ధి కించ – అనుజానాతి** = 'తెలుసు' అనటానికి, పని ఒప్పుకోవటానికి, విషయము అంగీకరించటానికి, సమృద్ధి (Plenty) అని సూచించటానికి, సమర్థత తెలియజేయటానికి, సహాయం చేస్తాను' అనటానికి, 'తప్పకుండా' అని అనటానికి, అంతేలే – అని ప్రోత్సాహపరచటానికి, 'అట్లాగా' అని అర్థం చేసుకొనుచున్నట్లు ప్రకటించటానికి – మొదలైన ఆయా సందర్భాలలో 'ఓ' అని ఉపయోగిస్తున్నారు కదా! ఇన్ని అర్థాలు కలుపుకొని 'ఓం' అను అక్షరము ఉపాసించబడుగాక! **సమర్థయితా హ వై కామనాం భవతి య ఏతత్ ఏవం విద్వాన్ అక్షరమ్ ఉద్గీథమ్ ఉపాస్తే।**

ఎవ్వరైతే అక్షరము అగు ఆత్మ గురించిన తత్త్వమును అధ్యయనము చేయాలనుకుంటాడో – అట్టి విద్వాంసుడు 'ఓం'ను అక్షరమగు ఆత్మకు సంజ్ఞగాను, ఆత్మభావన సిద్ధించటానికి ఉపకరించే ఉపాసనా విధానము (కార్యక్రమము)గాను, ఆశ్రయించటం చేత స్థితులు, స్థానములు, ఉత్తరోత్తర జన్మలు, లోకములు తాను ఇష్టపడు విధంగా సిద్ధించుకోగలడు. (He can become independent of them all).

'ఓం' కార ఏకాక్షరోపాసనచే ఇంకా కూడా...,

– ఋక్కులు, యజస్సులు, సామములు (మరియు) ధర్మ–అర్థ–కామములు అనే త్రయీ విద్య యందు (ఓంకారముతో అర్థయుతంగా (ప్రారంభించుచుండగా) ఉత్తమ ప్రవృత్తి సిద్ధించగలదు.

**'ఓం' ఇతి ఆశ్రవయతి!** 'ఓం' అని ఆధ్వర్యుడు (లేక) అగ్నీధ్రుడు అగ్నిమంత్రము ప్రారంభిస్తూ, ఋత్విక్కు అయి ఋగ్వేదమంత్రము (ఋక్కు) పలుకుచూ, **"అగ్ని దేవా! ఇదిగో! హవిస్సులు మేము సిద్ధము చేస్తున్నాము"**.. అను అంతరార్థముతో పలుకుచున్నాడు. "మేము యజ్ఞోపాసన ప్రారంభిస్తున్నాము. అంతా సిద్ధము. యజ్ఞ పురుషా! దయచేయండి (Welcome)!" - అని 'ఓం' యొక్క ఉచ్చారణను ఆ ఋత్విక్కు పలుకుచున్నాడు. ("ఓం! అగ్ని మీళే పురోహితే" – మొదలైన ఋక్కులు) ఓంకారముతోనే సుస్వాగతం పలుకుచున్నాయి. "సర్వము సిద్ధము" అనునది ఋక్కుగా పలుకబడుతోంది. అదియే ఓంకారార్థము.

**ఓం ఇతి శగ్ంసతి!** "దేవతా శంసనములు (దేవతా స్తుతులు) – 'ఓం' అను అక్షరార్థముతో ప్రారంభించి అభివర్ణములు కొనసాగించబడుచున్నాయి. యజ్ఞపురుషుని ఆహ్వానము, తదితర సాంగ సపరివార సపత్నీ దేవతల ఆహ్వానములు, మహిమా వర్ణనలు 'ఓం' అను అక్షరార్థముతో ప్రారంభించి 'వర్ణన' రూపముగా కొనసాగించబడుచున్నాయి. **(శంసనములు = యజుర్వేద యజ్ఞపురుష సంబంధమైన స్తుతి వాక్యాలు)**

**'ఓం' ఇతి ఉద్గాయతి!** 'ఓం' అని ఉద్గానములు సామము (గానపూర్వక 'భావ తన్మయములు') గానరూపంగా ఆరంభించబడుచున్నాయి. సామవేద హృదయము యజ్ఞవిధులలో ఆవిష్కరించబడుచున్నది. **ఏతస్యైవ అక్షరస్యాత్ మహిమ్నరసేన।** ఈ విధంగా ఋక్కులు, శంసనములు, గానములు (మంత్రములు, స్తుతులు, గానములు) – ఇవన్నీ కూడా అక్షరమగు ఆత్మ రసము యొక్క మహిమను ఎలుగెత్తి ప్రకటించటానికే ఉద్దేశ్యము కలిగిఉన్నాయి. త్రైయీ (ఋక్–యజుః–సామ) వేదముల

హృదయము – ఏకము అక్షరము అయి, 'ఓం' సంజ్ఞార్థము అగు 'ఆత్మ' యొక్క ఔన్నత్యము ప్రకటించటమే అయిఉన్నది. ఒకడు 'ఓం'ను ఏకము – అక్షరము అగు ఆత్మయొక్క తత్త్వార్థము తెలిసికొని ఉంటున్నాడు. మరొకడు ఓంకారోపాసనగా తదితర ఉద్గీథములు (స్తుతులు, మంత్రములు, గానములు, (లౌకిక) క్రియలు) 'ఓం'కారముతో ప్రారంభించి, నిర్వర్తిస్తున్నాడు. ఇంకొకడు 'ఓం'కారము యొక్క పరార్థమును అర్థం చేసుకోకుండానే 'ఓం'తో ఆయా యజ్ఞ కార్యక్రమములు (లౌకిక) క్రియలు చేస్తున్నాడు. తత్త్వార్థము తెలియకపోయి కూడా ఓంకారముతోనే ప్రారంభిస్తున్నాడు. "తెలిసినవాడు, తెలియనివాడు" కూడా 'ఓం'కారముతోనే ప్రారంభిస్తున్నాడు. అనగా అక్షరమును ఉపాసిస్తున్నవాడు, అక్షరమును ఉపాసించకయే ఉన్నవాడు – ఇద్దరు కర్మలు చేస్తూనే ఉన్నారు. ఎవ్వడైనా (అక్షరము తెలిసినా తెలియకపోయినా) – కర్మలు చేయటము మాత్రము అనివార్యము (Doing is Unavoidable).

**నానా తు విద్యా చ, అవిద్యా చ।** అక్షరమగు ఆత్మ గురించి తెలిసి కర్మలు చేస్తూ ఉంటే అది 'విద్య'. అదంతా తెలియకయే చేస్తూ ఉంటే అది 'అవిద్య'.

మొత్తం మీద కర్మలు చేయకుండా మాత్రం ఎవ్వడూ ఉండలేదు. (న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠితి అకర్మకృత్– భగవద్గీత).

అయితే, ఏకర్మ చేసినా కూడా...,

→ **యదేవ విద్యయా కరోతి, "శ్రద్ధయా ఉపనిషదా", తదేవ వీర్యవత్తరం భవతి**

**నేను చేస్తున్న ఈ కర్మను (లేక) కార్యక్రమమును ఏకము, అక్షరము అగు ఆత్మ యొక్క (ఓం యొక్క) ఉపాసనగా చేస్తూ ఉన్నాను. ఆత్మ భగవానుని ఉద్దేశ్యము నెరవేరుస్తున్నాను.**

అని ఎరిగి శ్రద్ధగా, ఆత్మ యొక్క భావనా సామీప్యతతో (అంతా ఆత్మప్రదర్శనమే అనే ఎరుకతో) నిర్వర్తిస్తూ ఉంటే – అది వీర్యవత్తరము అవుతుంది. ఆత్మ **"తత్త్వప్రాప్తి"** అనే ఉత్తమ ప్రయోజనకరము–అని జనులు గమనిస్తూ గ్రహించి ఉండెదరుగాక!

**ఖలు ఏతస్యైవ అక్షరస్య ఉపవ్యాఖ్యానం భవతి।** ఏకము, అక్షరము అగు పరమాత్మ యొక్క ఉపాసన – భావనలతో కూడి సమస్త కర్మలు నిర్వర్తించటమే **"అక్షరోపాఖ్యానము"** అనబడుతోంది. అగుచున్నది.

## 1-2. ద్వితీయ ఖండము - మహదాశయ సందర్భాశయములు

**దేవతలు** = కర్మలు చేస్తూ ఉన్నప్పుడు అక్షరమగు ప్రయోజనము మహదాశయముగా కలవారు. అక్షరమగు ఆత్మయొక్క భావనను ఉద్దేశ్యించి కార్యక్రమము సాత్వికమగు సందర్భాశయముతో కౌశలముగా నిర్వర్తించువారు. (యోగః కర్మసు కౌశలమ్ – భగవద్గీత)

Maintaining and executing Incidental objectives for the purpose of Main objective of entering the zone of Alpervading Absolute Self (బ్రహ్మపదము).

(1) ద–ఏవత్ = "నేను ప్రపంచమునకు ఏమి ఇస్తున్నాను" అనే మహదోద్దేశ్యము పునికి పుచ్చుకున్నవారు, సేవా భావనిరతులు.

(2) నేను చేస్తున్న పనులు లోకమునకు ప్రయోజనకరములు అగు గాక.

(3) ఈ నా పనులు పరమాత్మను సేవించుచూ పరమాత్మతో ఉపనిషదము (సామీప్య – సారూప్యతలను సంపాదించటము) నా ముఖ్యోద్దేశ్యము.

(4) అంతేగాని క్షరమగు ప్రపంచములో ఏదో ఇంకా పొందాలి – అనేది నా ముఖ్యాశయము కాదు.

ఇట్టి మహదాశయము కలవారు దేవతలు.

**అసురులు** = ప్రాపంచక కర్మలు, శాస్త్రీయ ఉపాసనోత్యాది కార్యక్రమములు నిర్వర్తిస్తూ ఉన్నప్పుడు 'క్షరము' అను ధర్మము గల దృశ్యములోని ఏవో ప్రయోజనములు ముఖ్యోద్దేశ్యముగా కలవారు.

(Maintaining main objective as for what to get and own something in the world)

(1) అసురులు : "నేను ఏమి పొందాను?" అనే భావము పునికి పుచ్చుకొన్నవారు. "అధికారము, సొంతము" (Controlling, Owning) - ఇటువంటివి ముఖ్యాశయములుగా కలవారు.

(2) నేను చేస్తున్న కర్మలు నాకు మాత్రమే (లేక) మాకు మాత్రమే ప్రయోజనకరంగా ఉండాలి – అని భావించువారు.

(3) దృశ్యసంబంధమైన క్షరమగు విషయములే మహదాశయముగా భావించువారు.

(4) "నేను చేస్తున్న కర్మలు, కార్యక్రమములు పరమాత్మ యొక్క సామీప్యత ప్రసాదించు గాక" అనే ముఖ్యాశయమును ఏమరచినవారు.

ఈ దేవతలు, అసురులు – ఉభయులు అంతరమున జీవుని హృదయంలో చోటుచేసుకొనియున్నారు.

"పరమాత్మ కొరకు – లోకములోని నా కొరకు" – అను రెండు వేరైన ఉద్దేశ్యముల సంఘర్షణయే దేవ–అసుర యుద్ధము. అయితే ఉభయులు, సృష్టి కల్పనా చమత్కారములే!

❖ ❖ ❖

ఒకానొక సందర్భంలో ప్రజాపతి పుత్రులు అయినట్టి దేవతలు, అసురులు ఒకరితో మరొకరు వైరము పెంచుకొని యుద్ధము ప్రారంభించారు. ఆ యుద్ధంలో అసురులదే పైచేయి కాసాగింది. అప్పుడు గురుదేవులగు బృహస్పతులవారి సూచనను అనుసరించి దేవతలు అసురులను జయించే ఆశయముతో **"అక్షరమగు పరమాత్మ గురించిన ఉపాసన"** – సంబంధమైన ఉద్గీథము ప్రారంభించారు. ఏకము – అక్షరము అగు ఓంకారోపాసన చేయసాగారు.

అందుకు సాధన మార్గంగా ప్రాణోపాసనకు ఉపక్రమించారు.

## ఘ్రాణేంద్రియోపాసన (ఘ్రాణేంద్రియ ఉద్గీథము)

మొట్టమొదట దేవతలు ముక్కులోగల ఘ్రాణేంద్రియముగా (As Energy of Smell) ను విశ్వశక్తి రూపుడగు పరమాత్మను ఉద్గీథము (ఉపాసనా కార్యక్రమము) నిర్వర్తించసాగారు. "సువాసనా రూపుడే పరమాత్మ" అను భావనతో మానసిక పూజ ప్రారంభించారు.

ఇది గమనించి అసురులు తమ అసుర భావ సంపత్తితో ముక్కులో ప్రవేశించి, అక్కడ 'సువాసన' ప్రక్కగా పాపము కల్పించారు. అప్పుడిక జీవులకు సువాసన – దుర్వాసనలు ఉభయము అనుభవము కాసాగాయి. పుణ్యాపాపఫలములగు సువాసనలు, దుర్వాసనలు ప్రవర్తించసాగాయి. అందుచేత అక్షరోపాసన దేవతలకు సిద్ధించనేలేదు.

## చక్షురింద్రియ ఉద్గీథము

**అథ హ చక్షుః ఉద్గీథమ్ ఉపాసాం చక్రిరే।** ఆ తర్వాత దేవతలు చూపును విశ్వశక్తి స్వరూపముగా ఉద్గీథము చేయనారంభించారు. చూపు – సాత్వికమైన, ప్రశాంతమైన దృష్టి రూపము పొందసాగింది. ఇది గమనించి అసురులు చూపులో "పాపము" (False Look) మంత్రముగ్ధంగా (మానస రూపంగా) ప్రవేశింపజేయసాగారు. అప్పుడు చూపు పాపదృష్టిని పొందసాగింది.

**తస్మాత్ తేన ఉభయం పశ్యతి దర్శనీయం చ, అదర్శనీయం చ।** ఇక చూపు చూడతగినవి, చూడకూడనివి కూడా చూడటం ప్రారంభించింది. చూపు పాపముచే వేధించబడసాగింది.

## శ్రోత్రేంద్రియ ఉద్గీథము

అప్పుడు దేవతలు చెవులను (వినికిడిని) ఆత్మోపాసనగా ఆశ్రయించి ఉద్గీథము (ఉత్–గీథము = కర్మలచే ఉత్తమ స్థానమునకు మార్గము చేయునది) చేయసాగారు. అప్పుడిక ఆత్మ గురించిన శ్రవణము (అమృత వాక్కులు) శ్రవణము చేయబడసాగాయి. ఇది గమనించిన అసురులు 'వినికిడి'లో 'పాపము'ను ప్రవేశింపజేయసాగారు. ఇక అప్పుడు చెవులు వినతగినవి, వినకూడనివి కూడా వినటము ప్రారంభించాయి. పాపముచే వినికిడి (Hearing) వేధించబడసాగింది. ఆత్మోపాసన కుంటుపడసాగింది.

## మానస ఉద్గీథము

అప్పుడిక దేవతలు మనన రూపమగు తపస్సుతో అక్షరుడు, పరము అయి ఉన్న పరమాత్మను ఉపాసించటము చేయసాగారు. అప్పుడు మనస్సు ఏకము – నిత్యము అయిన పరమాత్మ గురించిన మనన సాధనలకు ఉద్గీథము కాసాగింది. ఇది తెలిసి అసురులు మనస్సును పాపపు ఆలోచనలతో, పాప భావనలతో వేధించసాగారు. అందుచేత మనస్సు "సంకల్పించతగినవి – సంకల్పించకూడనివీ" కూడా సంకల్పించనారంభించింది.

> **తస్మాత్ తేన ఉభయం సంకల్పనీయం చ,**
> **అసంకల్పనీయం చ – పాప్మనా హి ఏతత్ విద్ధమ్।**

సర్వ సమస్వరూపమగు ఆత్మ గురించిన ఆలోచనలకు అడ్డుగా పాపపు ఆలోచనలు వచ్చి చేరసాగాయి. దానితో ఆలోచనలు పుణ్యపాపముల ఉభయము పొందసాగాయి. ఇక ఆత్మ పట్ల మననము వెనకబడసాగింది. ఈ విధంగా మనస్సు పాప–పుణ్య (Negative and Positive) ఆలోచనలు కొనసాగుచుండగా మనస్సు పరమగు ఆత్మదేవుని పట్ల ఏకాగ్రము పొందలేకపోవటం జరుగసాగింది.

## ప్రాణ ఉద్గీథము

ఇక ఆపై దేవతలు అసురులను జయించే నిమిత్తము "ముఖ్యప్రాణము"ను ఆత్మశక్తికి ఉపకరణంగా తీసుకొని పరమాత్మ యొక్క తత్త్వమును ఉపాసించు ఉద్గీథము (ప్రాణాయామాది సాధన క్రియలు) నిర్వర్తించ ప్రారంభించారు. బ్రహ్మమును ఉపాసించసాగారు.

అప్పుడు అసురులు పాప భావములను కవ్వించే నిమిత్తమై ముఖ్య ప్రాణమును సమీపించారు. **తగ్ం హ అసురా ఋత్వా విదధ్వంసుః।** ఎప్పుడైతే రాక్షసులు ప్రాణమును పాపభూయిష్టము చేయటానికై సమీపించారో, వారంతా ప్రాణమును ఏమాత్రము వేధించలేకపోయారు. పైగా ప్రాణాగ్నికి వారే ధ్వంసము (వినష్టము) అయిపోసాగారు. బండరాయిని వేగముగా తాకిన మట్టిగడ్డవలె ముక్కలు ముక్కలై చెదిరిపోయారు.

ప్రాణమును ఉద్గీథము చేయుచు, ప్రాణమును ఆత్మగా భావించి ఉపాసనా క్రియలను నిర్వర్తించువాడు ఆత్మత్వము సిద్ధించుకోగలడు. అట్టి వాని ఆత్మోపాసనను విచ్ఛిన్నం చేయ తలచువాడు, తానే విధ్వంసము పొందగలడు. ఎవ్వడైతే ప్రాణాత్మను ఉపాసిస్తూ ఉంటాడో – అట్టివానిని పాపదృష్టులు, అల్పబుద్ధులు వైపుగా దృష్టిని మరల్చే ప్రయత్నము చేయువాడు, దూషణ చేయువాడు, సాంసారికమైన బాధలు కలుగజేయటానికి యత్నించువాడు, తానే నష్టపోగలడు. ప్రాణమును ఆత్మగా ఉపాసించువాడు చెడు దృశ్యము, చెడు సంభాషణ, చెడు వాసన, చెడు పలుకులు – మొదలైన వాటిచే – (పువ్వులతో కొట్టబడిన నాపరాయి వలె) – చెక్కుచెదరకయే ఉంటాడు.

ముఖ్యప్రాణమునకు సుగంధ – దుర్గంధ దోషములు అంటజాలవు. ప్రాణాగ్ని సమస్త పాపములను భస్మము చేయగలదు. 'ఘ్రాణము' పొందు వాసన భోగము ముక్కుకే పరిమితము. చూపు కంటికే పరిమితము. వినికిడి చెవులకే పరిమితము. కానీ ప్రాణము – తాను పొందు ఆహారముతో సర్వదా సర్వేంద్రియముల సంరక్షణ కొరకు వినియోగము చేస్తోంది.

**ఏష తేన యత్ అశ్నాతి, యత్ పిబతి, తేన ఇతరాన్ ప్రాణానవతి।** తాను పొందిన త్రాణను (బలమును) ప్రాణము సకలేంద్రియములకు పంచిపెట్టు త్యాగము కలిగి ఉంటోంది.

ముఖ్యప్రాణము ఇంద్రియములకు అన్నపానములు ప్రసాదించి మనుగడ (Ability to Servive) ప్రసాదిస్తోంది. ముఖ్యప్రాణము నుండి మనుగడ పొందనప్పుడు ఇంద్రియములు క్షీణించిపోతాయి. ఆ జీవుడు తినలేడు, త్రాగలేడు, తిరగలేడు. ఇంద్రియములు చచ్చుబడి శబ్దస్పర్శరూపరసగంధాలు గాలిలో కలిసిపోతాయి. అందుచేతనే మరణానంతరం శరీరములోని ఇంద్రియములన్నీ నోరు వెళ్ళబెడతాయి.

## దృష్టాంతములు

మహనీయుడగు అంగీరస మహర్షి ప్రాణమును బ్రహ్మముగా ఉపాసించుటలో గల ఔన్నత్యమును ప్రకటించి ఉన్నారు. అందుచేత **"ప్రాణరూప ఉద్గీథోపాసన"**కు అంగీరసము అని పేరు. *అంగముల రసము ప్రాణము కాబట్టి అంగీరసము.*

ప్రాణము దేహము యొక్క సర్వస్వము అయి ఉండటం చేత కూడా ప్రాణ ఉద్గీథోపాసనను **'అంగీరసము'** అని అంటారు.

---

→ ప్రాణోద్గీథమును దేవగురువగు బృహస్పతులవారు ఉపాసించి ఉండి, లోకములకు ప్రకటించి ఉండటం చేత **"బృహస్పతి ఉద్గీథోపాసన"** అని కూడా అంటారు.

ప్రాణమును 'బృహస్పతి' అని కూడా శబ్దార్థంగా పిలుస్తారు. ఎందుకంటే

**శబ్దార్థంగా :** "వాక్ హి బృహతి" = వాక్కు దేహములో అన్నిటికన్నా మహత్తరమైనది.

బృహత్ – పతి = వాక్కుకు కూడా ప్రాణము పతి కాబట్టి ప్రాణము 'బృహస్పతి'గా అనబడుచున్నది. ప్రాణమే వాక్ ఇంద్రియమునకు రక్షకుడు.

---

→ ఆయాస్య ఋషి ప్రాణ ఉద్గీథోపాసన నిర్వర్తించి సిద్ధిని పొందియున్నారు. అందుచేత ప్రాణమునకు "ఆయాస్యము" అనే పేరు వచ్చింది.

**శబ్దార్థము :** ప్రాణము నోటి నుండి (వాక్కు రూపంగా) బయటికి వస్తూ ఉంటుంది. కాబట్టి ప్రాణమే ఆయాస్యము.

---

దాల్భ్య మహర్షి కుమారుడు బక మహర్షి ప్రాణ ఉద్గీథము ఇట్టిదని (పైవిధంగా) స్వకీయ తపస్సు నందు గమనించి లోకమునకు ప్రకటించియున్నారు. వారి ప్రకటనను అనుసరించి నైమిశారణ్యంలోని అనేకమంది తదితర ఋషులు ప్రాణ ఉద్గీథమును ఉపాసించి ఉత్తమ ప్రయోజనము పొందియున్నారు.

ఏ ఉపాసకులైతే అక్షరమగు ఆత్మను ప్రాణస్వరూపంగా ఉద్గీథోపాసన చేస్తారో – అట్టివారు విద్వాంసులు అయి కోరుకొన్న విధంగా కోరుకొన్న లోకములో నివసించు స్వాతంత్ర్యము పొందగలరు.

((ప్రాణోపాసన – (1) ప్రాణాయామము. (2) సమస్తము ప్రాణ ప్రదర్శనగా దర్శించటము)

ఇతి – అధ్యాత్మమ్

## 1-3 తృతీయ ఖండము – ఆదిత్యోపాసన

ఇప్పుడు మనము అధిదైవిక ఉపాసనా రూపమగు ఉద్గీథము గురించి చెప్పుకుంటున్నాము. దేవోపాసనా మార్గముగా అక్షరమును సిద్ధించుకోవటం గురించి వివరించుకుంటున్నాము.

**య ఏవ అసౌ తపతి, తమ్ ఉద్గీథమ్ ఉపాసీత॥** ఏ సూర్యుడు తేజోరూపుడై ఆకాశములో ప్రకాసించుచూ సమస్తమును తపింపజేస్తున్నాడో, అట్టి ఆదిత్యుని (సూర్య నమస్కారము, ఆదిత్య హృదయము, మహాసౌరము మొదలైన ఆయా విధములుగా) ఉపాసించెదరు గాక!

సూర్యుడు ఉదయించిన మరుక్షణం భూమి అంతా ఉత్తేజము పొందుచున్నది. "బిడ్డలారా! నిదురలేవండి! జన్మించినందుకు మీ యొక్క అక్షరస్వరూపమును స్వాభావికము, అనుక్షణికము చేసుకోండి!" అని ఉషోదయ గానము వినిపిస్తూ ఉద్గానము (Song of Upliftment) పలుకుచున్నారు.

**ఉద్యగ్ం తమో భయం అపహన్తి॥** ఉదయిస్తూనే సూర్యుడు జీవులందరికీ చీకటి భయము తొలగించు అభయప్రదులు. "సూర్యుని ఉదయము – తమోభేదము"ను ఉపాసించువాడు సమస్త భయముల నుండి ఉపశాంతి పొందుచున్నాడు.

## ముఖ్యప్రాణోపాసన – లోపలికి వచ్చు వాయు ఉపాసన

ప్రాణము, సూర్యుడు సమస్వరూపులే. రెండు ఉష్ణమును కలిగించేవే! అందుచేతనే ప్రాణము బయటకు వెళ్లిన శరీరము చల్లబడి వెచ్చదనము కోల్పోతుంది.

ప్రాణమును → 'స్వరము' అని అంటారు. (ప్రాణము తొలగితే తిరిగి దేహములోనికి రాదు)

సూర్యుని → 'స్వర' అని 'ప్రత్యస్వర' అని కూడా అంటారు. (సూర్యుడు అస్తమించినా ఆ మరునాడు ఉదయిస్తారు.

(1) ప్రాణము మరియు (2) ఆదిత్యుని ఆధిదైవిక రూప ఉద్గీథోపాసన నిర్వర్తించెదరు గాక!

## (పంచ ప్రాణములలోని) వ్యాన ఉద్గీథము

*ఇప్పుడు 'వ్యానము'ను ఉద్గీథముగా ఉపాసించే ఉపాసన గురించి చెప్పుకుంటున్నాము.*

**"వ్యానము"** అనగా ఏది?

**యద్వై ప్రాణీతి స "ప్రాణో" =** ఈ జీవుడు తననుండి ప్రాణశక్తిని బయటకు పంపుచున్నాడు. అదియే 'ముఖ్యప్రాణము' అంటారు. అద్దాని భౌతిక ప్రదర్శనగా – "ఈ జీవుడు నోటితో ముక్కుతో గాలిని విడిచిపెట్టుచూ ఉన్న ప్రక్రియ 'ప్రాణము'. అట్టి వాయువు యొక్క విశిష్టవ్యాపారం 'ప్రాణము'

**(యద్వై పురుషః ప్రాణితి ముఖనాసికాభ్యాం బహిః నిస్సారయతి – స ప్రాణః – శ్రీశంకర భాష్యం)**

---

**యద్వై అపాణి – ఇతి అపానః।** ప్రాణశక్తిని లోనికి తీసుకొనుచున్నాడు. ఇది 'అపానము'. వాయువును లోపలికి పీల్చటము అనే వాయువు యొక్క విశిష్ట వ్యాపారము అపానము.

**(యత్ పానితి అపశ్యసితి తాభ్యాం ఏవ అంతర-ఆకర్షతి వాయుం-సో అపానః। అపాన అఖ్యావృతిః – శ్రీ శంకర భాష్యం)**

---

**అథయః ప్రాణ-అపానయో సంధిః – స"వ్యానః"।** ప్రాణశక్తి (ఆత్మనుండి) బయటకు వెళ్లు వ్యాపారము లోనికి తీసుకొని వచ్చు వ్యాపారముల మధ్యగా గల సంధి "అపానము".

---

అట్టి ప్రాణ-అపానముల మధ్య – ఆ రెండు మౌనము వహించినట్టి విశిష్టమగు 'వాయువృత్తి'ని 'వ్యానము' అంటారు.

అట్టి ప్రాణ– అపానముల మధ్య గల వ్యానము సమస్త భౌతిక వ్యవహారములకు కారణభూతమగు ప్రదర్శనము కలిగి ఉన్నది.

**యో వ్యానః స వాక్।** – ఏది వ్యానమో అది 'వాక్కు'. అందుచేతనే ఒకడు మాట్లాడుచూ ఉన్నప్పుడు గాలి బయటకు వెళ్ళకుండా – లోనికి పోకుండా ఉన్న స్థితి కలిగినవాడై ఉంటాడు.

**యా వాక్ – స ఋక్ –** ఏది వాక్కుయో అదియే 'ఋక్' (మంత్రము, ఉచ్చారణ). అందుచేతనే ఋక్కులు ఉచ్చరిస్తూ ఉన్నప్పుడు ప్రాణ-అపానములు కదలక, ఆ మధ్యలో గల వ్యానమునుంచే ఋక్ శబ్దము పలుకగలుగుచున్నాడు.

**యత్-ఋక్ స సామః।** శబ్దము పలకటము నుండి సామగానము ప్రదర్శనమౌతోంది. అందుచేత ప్రాణ – అపానములు లేనప్పుడే సామము గానము చేయబడుతోంది.

**యత్ సామ, స ఉద్గీథమ్।** ఏది సామగానమో అదియే ఉద్గీథము (ఊర్ధ్వ స్థాన యోగము). అందుచేతనే ప్రాణ అపానములు మౌనము వహించి ఉన్నప్పుడే 'ఉద్గానము' (Expression of Musical Sound) జరుగుతోంది.

ఈ అన్ని సందర్భములలో ప్రాణ– అపానముల మధ్య గల 'వ్యానము' ప్రసాదించే శక్తిచేతనే –

⌘ శరీరము వీర్యవంతము పొంది, అట్టి శరీరముతో చేస్తున్నవన్నీ సిద్ధిస్తున్నాయి.

⌘ కట్టెలను మధిస్తున్నప్పుడు, కట్టెలను గొడ్డలితో చీల్చుచున్నప్పుడు,

⌘ బరువైన ధనుస్సును ఎత్తుచూ ఉన్నప్పుడు,

⌘ బరువును ఎత్తి భుజముపై ధరిస్తూ ఉన్న క్షణములలోను,

ఊపిరి బిగబట్టియే అవన్నీ మానవుడు నిర్వర్తిస్తున్నాడు.

అందుచేత – **ఆయమనమ్ – అ(ప్రాణన్ – న అపానగ్ం – స్తాని కరోతి। ఏ తస్య హేతోః వ్యానమేవ ఉద్గీథమ్ ఉపానయేత్।** – 'వ్యానము'నే శాస్త్రీయ విధానములతో, క్రియా – కార్యక్రమములతో ఉపాసించెదరుగాక. **ప్రాణ–అపానములు స్థంభించినప్పటి 'ప్రాణనిశ్చలస్థితి' కొరకు వ్యానప్రాణమును అభ్యసించెదరు గాక।**

## ఉద్గీథాక్షర ఉపాసన – ఉద్గీథము అనగా?

ఇప్పుడిక ఉద్గీథాక్షరము యొక్క ఉపాసన (ఉద్గీథము) గురించి చెప్పుకుంటున్నాము.

**I.**

**ఉత్ =** పైకి లేచుట. ప్రాణమే 'ఉత్'. ప్రాణశక్తిచేతనే మనుష్యుడు కూర్చున్న చోటు నుండి పైకి లేవగలుగుచున్నాడు. 'ఉత్' అనే శబ్దమునందు 'ప్రాణము'ను భావన చేసెదరు గాక.

**గీ =** వాక్కుయే 'గీ', వాక్కునే 'గిర' అని అంటున్నారు.

**థమ్ =** 'అన్నము. అన్నమునే 'థమ్' శబ్దముగా పిలుస్తున్నారు. అన్నము నుండి ఆధారము లభించటం చేతనే అన్నీ నిలచి ఉంటున్నాయి. సమస్తము అన్నమునందే ప్రతిష్ఠితమై ఉంటున్నాం' – అని భావన చేస్తూ 'థమ్' 'అన్నమ్'ల ఏకావస్థను మననము చేసెదరు గాక।

**(అన్నము = సమస్త ఇంద్రియములకు అనుభవముగా అగుచున్న సమస్తము)**

"ఉద్గీథమ్" అన్నప్పుడు పై ప్రాణ – వాక్ – అన్నములను ఏకము చేస్తూ ఉపాసన చేయుదురు గాక।

ఇంకా 'ఉద్గీథము' గురించిన వాచికార్థము ఈ తీరుగా చెప్పబడుతోంది.

**II.**

**"ఉత్"** = "పై వైపుగా" – "ద్యులోకము (దేవతా లోకము)" (వాయువు –పైకి పోవు – పైకి తీసుకుపోవు స్వభావము కలది కాబట్టి – "వాయువు" అనే అర్థం కూడా చెప్పబడుతోంది)

**"గీః"** = గిరణము. గిరణాత్ లోకానామ్। అంతరిక్షము సమస్త లోకములను తన యందు ఇముడ్చుకొన్నది కాబట్టి "గీం" అనగా అంతరిక్షము లోకములన్నీ కలిగియున్నది. అందుచేత **'గీః'** – అనగా అంతరిక్షమే।

**"థమ్"**= పృథివి, ప్రాణులకు స్థానము అవటం చేత పృథివి. పృథివీ థమ్। ధరణియే థమ్।

ఇంకా కూడ "ఉద్గీథము" – గురించి

**III.**

**"ఉత్"** (ఆదిత్యుడు) = ఆదిత్య ఏవ ఉత్ – ఊర్ధ్వమ్। ఆకాశంలో (పైన) ఉండటం చేత ఆదిత్యుడే 'ఉత్'

**"గీః"** (వాయు ప్రసరణము) = వాయుః గీః (కిం తు) అగ్న్యాదీనామ్ గిరణాత్। అగ్ని, జలము, పృథివి మొదలైనవన్నీ తనయందు కలిగి ఉండటం చేత వాయువే 'గీః'

**"థమ్"** (సమస్తమునకు అధిష్ఠానము – ఆభరణములన్నిటికీ బంగారమువలె) అధిష్ఠానము. యజ్ఞంలో అగ్నియే సమస్త యజ్ఞ విధి విధానములకు అధిష్ఠానము అవటం చేత అగ్నియే 'థమ్'.

**IV.**

**"ఉత్"** – వేదమే ఉత్. వేదమునకు శబ్దార్థము "తెలియబడునది". తెలియబడేదంతా 'ఉత్' అయి ఉన్నది.

"తెలుసుకోవటము, తెలుసుకోవలసినది" అని కూడా అర్థము. సామవేదమే "ఉత్". సామ = గొప్ప. గొప్పగా తెలుసుకోవలసినది. సామవేదమే స్వర్గము – స్వర్గే హి సామః – అని నానుడి. సామవేదమే స్వర్గముతో సమానం. గొప్పగా చెప్పబడుతోంది కాబట్టి – సామము 'ఉత్'.

**"గీః"** (గిరణము) – "స్వాహా"। 'స్వాహా' అను యజుర్వేద మంత్రముతో అగ్ని ద్వారా సమర్పించు హవిస్సులను దేవతలు స్వీకరించటమును గిరణము అంటారు. అందుచేత యజుర్వేదమే 'గీః'.

**"థమ్"** (అధిష్ఠమ్) – అధిష్ఠితము. సామము (గొప్పగా తెలుసుకోవలసినది)

→ ఋక్కుల యందు (ఋగ్వేదము నందు) అధిష్ఠితమై ఉన్నది. అందుచేత ఋగ్వేదమ్ "థమ్"

ఎవ్వడైతే వేదముచే ప్రవచించబడిన (యజ్ఞ-యాగశాస్త్రములలో ఉపయోగించబడిన) – "ఉద్గీథము" అనే శబ్దమును (మాటను) పై నాలుగు విధానములుగా భావన చేస్తూ ఉపాసిస్తాడో, తెలుసుకొని మననం చేస్తూ ఉంటాడో... అట్టివాడు-

→ వాగ్దోగ్ధి ఆత్మానమేవ దోగ్ధి – పాలు పితుకువానికి పాలు లభించు విధంగా వాక్కు యొక్క సారము వాక్కే ప్రసాదించగలది.

→ ఆతడు అన్నము పొందువాడు, అన్నము ప్రసాదించువాడు కాగలడు.

అందుచేత "ఉద్గీథాక్షరము ఇట్టిది" – అని ఉద్గీథము (స్తుతి, ఉపాసన, మననము, ఉచ్చారణ) నిర్వర్తించబడును గాక.

# ఇష్టకామ్యార్థ సిద్ధికై ఉద్గీథము

(కర్త, హోత, ఉపాసక మొదలైన) యజ్ఞములో పాల్గొనుచున్న వారంతా...,

ఇష్టకామ్య సిద్ధి (కోరుకొన్నవి పొందుటకై) ఈ విధంగా ఉద్గీథ – ఉపాసన చేయుదురు గాక!

- ఉద్గాత (సామమంత్రములు చదువుచున్నవారు) ఏఏ దేవతలను ఉద్దేశ్యించి ఉద్గానము (స్తుతి, ఉద్గీతము) చేస్తున్నారో ఆయా సామములను శ్రవణము చేస్తూ, ఆ దేవత యొక్క నామాత్మిక రూపాత్మిక తాత్త్వికాత్మికములను మననము చేయుచుండును గాక!
- శ్రవణము చేయు కర్త, కార్యకర్తలు, యజ్ఞమును ఉపాసించుటకై వచ్చిన ఉపాసకులు – వీరందరు కూడా ఆయా దేవతా – ప్రత్యాధి దేవతల నామాత్మిక, రూపాత్మిక, తాత్త్వికాత్మికములను మనస్సుతో ఉపాసించెదరు గాక! మననము చేయుచుండెరు గాక!
- ఋక్కులను ఏ ఋషికి చెందినదో, ఏ దేవత గానము చేయబడుచున్నదో – ఆ ఋషికి దేవతలకు హృదయపూర్వకంగా నమస్కరించుచుండెదరు గాక!
- ఏ ఛందస్సుచే స్తుతించబడుచున్నదో ఆ ఛందస్సును, అద్దాని మంత్ర (మనన) రూపమును, శబ్ద సౌందర్యమును ఉపాసించెదరు గాక!
- ఉద్గాత ఏ దిక్కును ధ్యానము చేయుచున్నారో, ఆ దిక్కును ధ్యానము చేసెదరు గాక.
- చివరిగా తన యొక్క "సాక్షీ కేవలరూపము"ను ధ్యానము చేస్తూ అప్రమత్తుడై స్తుతించును గాక!
- తన యొక్క గోత్ర-నామ-వర్ణ – ఆశ్రమ మొదలైనవి పలుకుచూ ధ్యానించును గాక!

ఈ విధంగా యజ్ఞ సంబరములో పాల్గొను వారంతా శ్రద్ధగా, ఉద్గాత, ఋత్విజులు గానం చేస్తున్న మంత్రములను వినెదరుగాక! అచ్చులు, ఊష్మలు, హల్లులు, విసర్గలు, శ్రద్ధగా ఏకాగ్రతతో వినుచుండెదరు గాక!

భక్తిశ్రద్ధలతో తన కోర్కెను విన్నవించుకొని అభ్యర్థన సమర్పించెదరు గాక! **స కామః సమృధ్యేత యత్ కామః స్తువీతేతి। యత్ కామః స్తువీతేతి।**

ఋత్విక, ఉద్గాత, పురోహిత, అర్చకాచార్యుల సామమును పై విధంగా అనుసరించి శ్రద్ధాభక్తులతో ఏకాగ్రంగా శ్రవణము చేయువాడు తాను కోరిన దానిని పొందగలడు.

# 1-4 చతుర్థ ఖండము – "ఓం" ఇతి ఏతత్ అక్షరమ్ ఉద్గీథమ్

***'ఓం' అను ఏకము అక్షరమును ఉపాసించటం (ఉద్గీథము) గురించి ఇప్పుడు మనము వివరించుకుంటున్నాము.***

"ఓం" – అని దీర్ఘముగా ఉద్గానము చేయు ఉపాసన గురించి కూడా వ్యాఖ్యానించుకుంటున్నాము.

**దేవా వై మృత్యోః బిభ్యతః।** ఒకానొకప్పుడు దేవతలు "మృత్యువు" గురించి భయము పొందసాగారు. వారు త్రయీ విద్య (ఋక్ యజుః సామ) మంత్రములలో ప్రవేశించి, ఆ త్రయీవేద ఛందస్సులను ఆచ్ఛాదముగా కలిగి ఉండసాగారు.

మంత్రములను దేవతలు ఆచ్ఛాదనగా కలిగి ఉండటం చేతనే వాటికి 'ఛందస్సులు' – అని పేరు. అనగా జపము, హోమము, పారాయణము మొదలైన వాటిచే వారు మృత్యువు దరిచేరకుండా ఉపాయముగా ఆశ్రయించసాగారు.

క్రమంగా వారు, "ఋక్-యజుర్-సామము"లలోని కర్మానుష్ఠానములను ఆశ్రయించి, ఆ కర్మలే మహత్తరమని భావించసాగారు. కర్మలలో మునిగి అమృతమగు పరమాత్మ తత్త్వమును ఏమరచారు.

అప్పుడు మృత్యువు "ఈ దేవతలు ఎక్కడ దాగి ఉన్నారు" అని వెతుకసాగింది. వెతకగా వెతకగా మృత్యువుకు దేవతలు కనబడనే కనిపించారు. **తాను తత్ర మృత్యుః-యథా మత్స్యమ్ ఉదకే పరిపశ్యేత్-ఏవం పరిపశ్యత్-ఋచి, సామ్ని యజుషి॥**

జలజల పారుతున్న నీటి జోరులో చేపలు కనిపిస్తాయి చూచారా! ఆ విధంగా త్రయీ వేదముల కర్మ వ్యవహారములలో దాగి ఉన్న దేవతలు కనిపించారు. 'ఆహాఁ! ఈ దేవతలు నాకు కనిపించారు కదా!" – అని సంతోషపడి మృత్యువు వారిని సమీపించసాగింది.

ఇది గమనించి "ఇప్పుడు ఉపాయమేమిటి? ఈ మృత్యువు మనలను ఎట్లా గమనించగలిగింది?" అని యోచించారు. వెంటనే "ఓహో! మనము ఋక్-యజుర్-సామములలోని కర్మ విభాగములలో ఉండిపోవటం చేతనే మృత్యువు మనలను గమనించగలిగింది"... అని గ్రహించారు. మరుక్షణం వారు – కర్మలకు ఆవల గల 'ఓం' అను ఏకము, అక్షరము అగు స్వరాక్షర- తత్త్వమును ఆశ్రయించారు.

**ఋచస్సామమ్నో యజుషః సర్వమేవ ప్రావిశన్।** కర్మ విభాగములను దాటి స్వరము నందు ప్రవేశించారు. ఓంకారోపాసన యందు పూర్తిగా నిమగ్నమైనారు. అప్పుడు మృత్యువు మౌనము వహించింది. దేవతలకు అమృతము సిద్ధించింది. స్వరములో ప్రవేశించినవాడు ఋక్ – యజు – సామములను "ఏకము – అక్షరము" అగుచూ పరమార్థము, పరమాత్మ సూచకము అగు **"ఓం"తోనే ప్రారంభిస్తాడు. 'ఓం'తోనే తదితర మంత్రదేహ విభాగములను విస్తరింపజేస్తూ గానం చేస్తాడు.**

**'ఓం' యే స్వరము.. అదియే అమృతము, అభయము. అట్టి ఏకము అక్షరము అగు 'ఓం'లో ప్రవేశించిన దేవతలు అభయము పొందారు.**

అట్లాగే, ఎవ్వడైతే 'ఓం'ను ఏకము, అక్షరముగా తెలుసుకొని ఉపాసిస్తాడో, స్తుతిస్తాడో, అట్టివాడు...

- స్వరము, అమృతము, అభయము అగు అక్షరములో ప్రవేశిస్తాడు.
- అట్టివాడు దేవతల వలెనే అమృతుడై, మృత్యుపరిధులను దాటినవాడు అవగలడు.

-----

# 1-5 పంచమ ఖండము – "సామ ఉద్గీథము"

ఏది (ఏకము, అక్షరము అగు ఓంకారార్థ) ప్రణవమో అదియే ఉద్గీథము. ఏది ఉద్గీథమో అదియే ప్రణవము కూడా.

ఆకాశములో ప్రకాశించుచున్న ఆదిత్యుడే ఉద్గీథము. ఆదిత్యుడే ప్రణవము అగు 'ఓం' కూడా! ఆదిత్యుడే 'స్వరము' కూడా.

ఒకప్పుడు ఆదిత్యుడు తన కుమారుడగు కౌషీతకి మహర్షికి ఈ విధంగా బోధించారు.

*ప్రియ కుమారా! కౌషీతకీ! నేను ఏకము, అక్షరము అగు ఆదిత్య తత్త్వమును! అనగా మొట్టమొదటిగానే ఉన్న తత్త్వమును! అనేకముగానే కనబడుచున్నప్పటికీ ఏకమ్ నా రూపము, స్వభావము కూడా! సూర్యకిరణములు వేరువేరుగా బయల్వెడలి వేరువేరుచోట్ల ప్రసరించవచ్చు గాక! కాని కిరణములన్నీ బయల్వెడలేది నా ఆదిత్య తేజస్సు నుండియే।*

*నేను ఏకమగు తత్త్వమును ప్రణవ గానము చేస్తున్నట్లే నీవు కూడా చేయి. నా కిరణములను ఉద్గీథముగా భావించి (సాధనగా స్వీకరించి) అనేకముగా కనిపిస్తూ కూడా ఏకముగా ఉన్నదానిని ఉపాసించెదవు గాక!*

*ప్రాణము ఏకమే అయి ఉండి అనేక ప్రాణులుగా ప్రదర్శనమగుచున్నది. **ప్రాణాగ్ం స్త్వం భూమానమ్ అభిగాయతాత్ బహవో వై మే భవిష్యంతి।** నేను ప్రాణ స్వరూపుడనై ఈ అసంఖ్యాక జీవులలో ప్రాణస్వరూపముతో వెల్లివిరిస్తున్నాను.*

## ఆధ్యాత్మము

ఇంకా విను.

"అధ్యాత్మము" అనగా దేహము, ఇంద్రియములను ఉపయోగించి చేయు **"ఉపాసన".** 'ఓం'కార ప్రణవగానమే ఉద్గీథము. ఉద్గీథమే ప్రాణము.

---

పితృదేవులగు సూర్యభగవానుడు చెప్పిన ఓంకార ప్రణవోపాసనను అర్థం చేసుకొన్న కౌషీతకీ మహర్షి 'ప్రాణము'ను పుత్రుడుగా చేసుకొని **"ప్రణవోపాసన"** చేయనారంభించారు. "నాకు అనేక మంది పుత్రులు" అను భావనతో **ప్రాణ స్వరూపుడై తదితర సమస్త జీవులను తన ప్రాణస్వరూప తేజో కిరణములుగా భావము సిద్ధించుకున్నారు.**

ఆ విధంగా కౌషీతకీ మహర్షి నిర్వర్తించిన ఉపాసనయే ఉద్గీథము. అదియే ప్రాణమును ఉద్గీథ గానము చేయటము. "ప్రాణస్వరూపుడనగు నేను ఈ సమస్త ప్రాణులలో ప్రాణస్వరూపుడనై ప్రకాశించుచున్నాను" – అనునదే ఇక్కడి ఉద్గానము, ఉద్గీథము కూడా!

ఇట్టి ప్రణవోపాసనచే ఉద్గానము చేస్తున్నప్పుడు అపశృతుల దోషము ఉన్నప్పటికీ, అవన్నీ సరి అవగలవు. ఆ ఉద్గాతకు, శ్రవణము చేయువానికి దోషము కలుగదు.

## 1-6 షష్ఠి ఖండము– అధిదైవత ఉద్గీథోపాసన ("సా" + "అమ" = "సామ" – ఉపాసన)

**ఇయమేవ పృథివీ ఋక్। అగ్నీయేవ సామ।**

ఈ పృథివియే ఋక్కు (మంత్రాక్షరములు). అగ్నియే 'సామము' అని ఉపాసించెదరు గాక। ఋక్కునందు పృథివిని సామ యందు అగ్నిని భావించి ఉపాసించాలి.

ఋక్కు = అర్థము  సామ = లయ

సంగీతము వాఙ్మయము (Lyric) నందు అధిష్ఠితమై ఉన్న తీరుగా, సామము ఋక్‌పై ఆధారపడియున్నది. ఋక్కు (శబ్ద–అర్థము)ను అనుసరించే సామగానము చేయబడుతోంది. అర్థము లేకుండా గానము చేయటము (Music without word and meaning) - నిరర్థకము.

> **పృథివియే "సా"। అగ్ని – "అమ"। ఈ రెండూ కలిసి, 'సామ'... 'సామ' శబ్దము సగము పృథివిని, మిగతా సగము అగ్నిని ఉద్దేశ్యించుచున్నది – అని ఉపాసించబడు గాక।**

ఇంకా కూడా 'సామ' ఈ విధంగా ఉపాసించబడుతోంది.

**అంతరిక్షమేవ ఋక్–వాయుః సామ।** సమస్త లోకములు తనయందు ఇముడ్చుకొన్న అంతరిక్షమే ఋక్। వాయువు సామ। ఈ విధంగా అంతరిక్షము తనయందు వాయువును ఇముడ్చుకొన్న విధంగా ఋక్కునందు అధిష్ఠితమైయున్న 'సామ' గానము చేయబడుతోంది.

= అంతరిక్షము "సా"। వాయువు 'అమ' రెండూ కలిపి 'సామ'

ద్యు(దేవ)లోకమే ఋక్కు. ఆదిత్యుడు 'సామ'. ఆదిత్యుడు ద్యు లోకమునందు అధిష్ఠితుడై ఉన్నట్లు ఋక్కునందు అధిష్ఠితమైన సామమే గానము చేయబడుతోంది.

ద్యులోకమే 'సా'. ఆదిత్యుడు 'అమ'।
ఆ రెండు కలిపి ఉపాసన – సామోపాసన

నక్షత్రములు ఋక్కు. చంద్రుడు సామ. ఈ సామ ఆ ఋక్కునందు అధిష్ఠితము.

నక్షత్రములు 'సా'. చంద్రుడు 'అమ'.
ఆ రెండింటి కలిపి ఉపాసన "సామ"।

ఆదిత్యునిలోని శుక్ల (తెల్లటి) ప్రకాశము ఋక్కు. నీలపు – నలుపు రంగు సామము. సామము ఋక్కులో అధిష్ఠితము.

శుక్లము 'సా'. నలుపు – నీలము 'అమ'
ఆ రెండింటిని కలిపిన ఉపాసన 'సామ'

---

## "హిరణ్మయ పురుషోపాసన"

**అథ ఏష అంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే, – హిరణ్యశ్మశ్రుః, హిరణ్య కేశః ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః**

హిరణ్మయ పురుషుని ఈ విధంగా ఉపాసించెదరుగాక। – సూర్యునిలో ప్రకాశిస్తూ కనిపిస్తున్న పురుషుడే – హిరణ్మయ పురుషుడు.

**హిరణ్ మయ** = బంగారపు ఛాయగలవాడు

**పురుషుడు** = సమస్తము తన పురుషకారముగా ప్రదర్శించువాడు. సత్తాస్ఫూర్తిచే జగత్తులన్నీ నింపి ఉంచుచున్నవాడు.

బంగారు గడ్డము, మీసము; కేశములతో ఉపాసించబడువాడు. గోళ్ళతో సహా సర్వము బంగారు రంగుతో ప్రకాశించువాడు. బంగారు పక్షి వలె కనిపించు గోళ్లు కలవాడు.

– ఆతని కళ్ళు ఎర్రటి ఎరుపుగా ఎర్ర కలువల వలె ప్రకాశిస్తూ ఉంటాయి.

– ఆతనిని 'ఉత్' అని అంటారు, సమస్త పాపములు పోగొట్టువాడు కాబట్టి.

అట్టి హిరణ్మయ పురుషుని ఉపాసించటము ఎరిగినవాడు సర్వపాపముల నుండి విముక్తుడు కాగలడు.

ఆ హిరణ్యగర్భుడే ఋక్‌వేదము, సామవేదము తనయొక్క స్వరూపముగా కలిగి ఉన్నారు.

ఆయనయే ఉద్గీథము. హోత ఉద్గీథ। **ఆతడు అధిదైవ స్వరూపుడు.** దేవతలందరు అట్టి హిరణ్యగర్భునిపై ఆధారపడి ఉన్నవారే। **ఇది అధిదైవతోపాస.**

## 1–7 సప్తమ ఖండము – అధ్యాత్మోపాసన (లేక) శారీరకోపాసన

ఇప్పుడు మనము ఈ శరీరమునకు సంబంధించిన 'ఉద్గీథోపాసన' గురించి చెప్పుకుంటున్నాము.

**వాక్కుయే → "ఋక్కు"। ప్రాణము – "సామము"।** ఈ సామము ఈ ఋక్కుపై ఆధారపడి ఉన్నది. ఋక్కు ఆధారంగా చేసుకొని సామము గానం చేయబడుతోంది. అలాగే–

*ప్రాణమును ఆధారము చేసుకొని వాక్కు ప్రదర్శనమౌతోంది. వాక్కు – 'సా' ప్రాణము – 'అమ' ఈ రెండింటి కలయిక 'సామ'. ఈ విధంగా సామము ఉపాసించబడు గాక.*

**చక్షువులు (కన్నులు) – 'ఋక్కు'। ఆత్మ చూచువాడు – సామ।** ఈ సామ ఆ ఋక్ నందు అధిష్ఠితము. ఋక్కు నందు అధిష్ఠితమైన 'సామ' గానము చేయబడుతోంది.

"కన్ను"ను ఆధారం చేసుకొని చూచువాడు చూపును ప్రదర్శిస్తున్నాడు. కన్నులు 'సా', చూచువాడు 'అమ'

కన్ను - చూచువాడు కలయికయే - చూపు. ఆ కలయికయే 'సామ'.

**శ్రోత్రము (చెవి) 'ఋక్కు'। మనస్సు 'సామ'।** ఈ సామ ఆ ఋక్కునందు అధిష్ఠితమైయున్నది.

*చెవి 'సా'। మనస్సు 'అమ'। ఆ రెండింటి కలయిక 'వినికిడి'। అదియే 'సామ'।*

**కంటిలోని 'తెలుపు'** (White) **విభాగము 'ఋక్కు'। నల్లటి గ్రుడ్డు విభాగము 'సామ'।** ఈ సామము ఆ ఋక్కుపై ఆధారపడి ఉన్నది. ఋక్కు ఆధారముగా సామము గానము చేయబడుతోంది.

*కంటి యొక్క తెలుపు ప్రకాశము 'సా'. నల్లటి రంగు 'అమ'. ఈ రెండింటి యొక్క కలయిక - 'సామ'.*

- **కంటిలో ఉండి చూచుచూ ఉన్న పురుషుడు** (The Perceiver - **అంతర'క్షిణి' పురుషుడు) - 'ఋక్కు'.**
- **ఆతనికి కనబడుచున్నదంతా (దృశ్యతే తత్ -** That being perceived) **- 'సామ'।**
- ఆతడే ఉక్థము (చూడటము - Perception) కూడా!

కంటిలో వేంచేసి ఉండి 'చూపు' అనే పురుషకారము ప్రదర్శించుచూ, చూడబడుచున్న సమస్తముగా కూడా (ఉక్థముగా కూడా) వెలయుచున్నాడు.

కంటిలో ఉండి చూచుచూ ఉన్నవాడే 'పురుషుడు'. ఆతడే యజుస్సు (యజోవేదపురుషుడు). ఆతడే "బ్రహ్మము"।

సర్వము సూర్యుని తేజస్సులో కనిపిస్తూ ఉన్నది. అట్టి సూర్యునిలో "తాను వెలుగుచూ, సమస్తము చూపటము" అనే పురుషకారమును ప్రదర్శిస్తూ 'పురుషుడు' అనబడుచున్నాడు.

ఆదిత్యుని (సూర్యుని) అంతర్గతుడై ఏ పురుషుడు ఉన్నాడో, ఆతని రూపము ఏదై ఉన్నదో...,

అదియే ఈ భౌతికమున కంటిలో వెలయుచు 'చూడటము' అను క్రియను నిర్వర్తిస్తున్న (పురుషకారము ప్రదర్శిస్తూ ఉన్న) అక్షి పురుషుని రూపము కూడా।

"The Executor of showing" who is in the Sun, and "The Executor of seeing" who is in the eye of the Living Being are one and the same.

> **ఈ 'కన్ను'లో నివాసము కలిగియుండి సమస్తమును చూస్తూ ఉన్న పురుషుడే...,**
> **-సర్వలోకములకు ప్రభువు.**
> **-ఈ జీవుడు చూడాలనుకొంటూ, చూస్తున్న దృశ్యము కూడా ఆతని ప్రదర్శనమే।**

ఆదిత్యుని యందు సమస్తమును వెలిగించు పురుషకారుడై, కన్నులలో సమస్తము చూస్తూ ఉన్న పురుషకారుడై, చూడాలనిపించే సమస్త **ప్రదర్శన పురుషకారుడై** ఏ 'పరమ పురుషుడు' ఉన్నారో...

ఆయనను ఎవరు కీర్తిస్తూ ఉన్నారో, 'స-రి-గ-మ'ల వీణాగానముతో మహిమను పాడుచున్నారో, అట్టివారు సర్వ సంపదలను తాము కోరుకోకుండానే పొందగలరు. వారే సామవేద సిద్ధులు.

ఎవ్వరైతే ఆ పురాణ పురుషుని, పురుషోత్తముని - పరమాత్మగా, దేవాది దేవునిగా, ఉద్గీథ - భగవానునిగా తెలుసుకొని 'సామగానము' చేయుచున్నారో - వారు "చూపించువాడు - చూచువాడు - చూడబడునది" అను మూడిటినీ (జీవాత్మ-పరమాత్మ అనబడే) రెండు విధములుగానూ గానము చేసినవాడు అగుచున్నాడు.

ఈ విధంగా మూడుగా కనిపిస్తూ, రెండుగా (జీవాత్మ పరమాత్మలుగా) అనిపిస్తూ ఒకటిగా అయిన పరాత్పరుని - సూర్య లోకములో వేంచేసియున్న హిరణ్యగర్భుడుగా ఉపాసించెదరు గాక. అట్టి ఏకోపాసన చేయువానిని ఆహ్వానించి, దేవతలు దివ్యలోక ప్రాప్తిని, దివ్యలోక నివాసమును ప్రసాదించుచున్నారు.

నేత్రములో వేంచేసియున్న కేవల - ద్రష్టయగు దివ్యపురుషుని ఉపాసించినా కూడా (ఉద్గీథోపాసన చేసినా కూడా) - అట్టి ఫలము సిద్ధించగలదు.
కోరుకొన్నవారికి దివ్యలోకములు, ఇహములో సర్వభోగములు - అట్టి 'పురుషోత్తమ స్తుతి చేయువారు - పొందగలరు.

---

అందుచేత యజ్ఞ ప్రారంభంలో యజ్ఞకర్తను ఉద్గాత - "ఓ యజ్ఞ కర్తా! మీరు ఏమేమి లభించాలని కోరుకొంటున్నారు?" - అని ప్రశ్నిస్తున్నారు. అప్పుడు యజమాని "అయ్యా! ఈఈ ప్రయోజనములు ఈ విధంగా సిద్ధించు గాక।" - అని తెలియజేస్తున్నాడు. అప్పుడు ఆ ఉద్గాత యజ్ఞ విధానమునందు 'ఫలశ్రుతి'ని మంత్ర వాక్యములు జోడించి పలుకుచున్నాడు. అట్టి ఉద్గాతయే యజమానికి ఉత్తమ ప్రయోజనములు యజ్ఞ నిర్వహణ ద్వారా సిద్ధింపజేయటానికి సమర్థుడు. ఎందుకంటే ఉద్గాతయే యజ్ఞపురుష-యజ్ఞకర్తల మధ్య అనుసంధానము.

---

## 1-8. అష్టమ ఖండము - స్వర్గలోక - ఇహలోక ఉద్గీథము

పూర్వకాలంలో 'ఉద్గీథా ఉపాసన'లో అత్యంత నిపుణులు - అని ప్రసిద్ధికెక్కిన ముగ్గురు మహనీయులు ఉండేవారు. వారు ఉద్గీథా గానము నిర్వర్తించటములో గొప్ప ప్రావీణ్యులు.

(1) శాలావంతుని కుమారుడగు శిలక మహర్షి

(2) దాల్భ్య వంశీయుడైనట్టి చికితానుని కుమారుడు చైకితాయన దాల్భ్య మహర్షి

(3) జీవలుని కుమారుడైనట్టి ప్రవాహణ మహర్షి

ఒకానొక సందర్భములో ఆ ముగ్గురు ఒకచోట సమావేశము అవటం జరిగింది. ఆ ముగ్గురు ఈ విధంగా పరస్పరము చెప్పుకున్నారు.

> *మనము ముగ్గురము **"ఉద్గీథ గానము"** నిర్వర్తించు **'ఉద్గాతలు'**గా ప్రావీణ్యులమని మునిలోకము చెప్పుకుంటూ ఉంటుంది కదా! ఈ రోజు మన ముగ్గురము భగవత్కృప చేత ఒకచోట కలిసాము. ఈ సందర్భము సద్వినియోగమగు గాక! అందుకుగాను మనము ఉద్గీథ గానము (లేక) ఉద్గీథోపాసన గురించి సత్సంగపూర్వకంగా సంభాషించుకొందామా?*

ముగ్గురు అందుకు అంగీకరించినవారై ఒక చక్కటి ప్రవేశంలో సుఖాసీనులయ్యారు. (ఈ విధంగా పండిత చర్చ జరుగుతున్నప్పుడు సందేహములు పోతాయి. ఒకరిపై మరొకరికి గల అల్పాభిప్రాయములు తొలగుతాయి. విజ్ఞానము మరింతగా వికసిస్తుంది)

**ప్రవాహణ మహర్షి :** ఓ శిలక, చైకితాయన మహర్షులారా! **తావ అగ్రే వదతాం బ్రాహ్మణయోః వదతో, అర్వాచగ్ం శ్రోష్యామి!** మీరిద్దరు నాకు పూజనీయులు. అందుచేత మీరిద్దరు ఉద్గీథ గానము గురించి విశేషములు చెప్పటము ప్రారంభించండి. నేను శ్రవణము చేస్తాను.

అందరూ అందుకు అంగీకరించారు.

-----

**శిలక మహర్షి :** పూజ్యులగు చికితాయనుని కుమారులుగా ఓ చైకితాయన దాల్భ్య మహర్షీ! మీముందు కొన్ని ప్రశ్నలు వేస్తాను. అందుకు తమకు అంగీకారమేనా?

**చైకితాయన మహర్షి :** ఓ! తప్పకుండా। నాకు అంగీకారమే। అడగండి. తెలిసినంత వరకు చెప్పుతాను.

**శిలక మహర్షి :** కా 'సామ్నో' గతి - ఇతి? సామము యొక్క గతి (లేక) సారము (లేక) ఆశయము ఏదై ఉన్నది? సర్వోత్తమ గమ్యస్థానము ఏది?

**చైకితాయన దాల్భ్య మహర్షి :** స్వరము! ధ్వని భేదము! ఎందుకంటే, 'సామ' అనేది స్వరమే స్వరూపముగా కలిగి ఉండటం చేత. (స్వరము = అకార ఆది, ఉదాత్త - అనుదాత్తాది, షడ్జమము ఆది - కంఠధ్వని విశేషములు).

**శిలక మహర్షి :** బాగు। మరి స్వరము యొక్క గతి ఏది? **స్వరస్య కా గతిః ఇతి?**

**దాల్భ్య మహర్షి :** స్వరము యొక్క గతి "ప్రాణము". స్వరము యొక్క జనన స్థానము ప్రాణమే। ప్రాణము శక్తి రూపము. శక్తి ఉంటేనే స్వరము పలుకుతుంది.

**శిలక మహర్షి : ప్రాణస్య కా గతిః – ఇతి?** ప్రాణము యొక్క గతి (లేక) గమ్యము ఏదై ఉన్నది?

**దాల్భ్య మహర్షి :** ప్రాణము నిలవాలంటే ఆహారము కావాలి. అందుచేత – ప్రాణము యొక్క గతి అన్నమే.

(అన్నావష్టంభో ప్రాణః శుష్యతి వై ప్రాణరుతే అన్నాత్' – అన్నము లేకుంటే ప్రాణము శుష్కించిపోతుంది కదా! ప్రాణమునకు అన్నమే కట్టుత్రాడు – అని శ్రుతివాక్యము. ప్రాణాః అన్నం దామ – ఇతి హి శ్రుతే).

**శిలక మహర్షి :** అవును అయితే, **అన్నస్య కా గతిః?** అన్నమునకు గతి ఏది?

**దాల్భ్య మహర్షి :** అన్నమునకు గతి "జలము" (ఆపః). ఎందుకంటే **అప్ సంభవాత్ అన్నస్య।** అన్నము జలము నుండే కలుగుతోంది కదా।

**శిలక మహర్షి : అపాం కా గతిః?** జలమునకు ఆశ్రయము ఏదై ఉన్నది?

**దాల్భ్య మహర్షి : అసౌ లోకః ఇతి।** ఈ లోకమే జలమునకు ఆశ్రయము. వర్షము వర్షించేది పై నుండే కదా! ఊర్ధ్వ లోకము నుండే కదా! అందుచేత జలము యొక్క గతి స్వర్గలోకమే.

**శిలక మహర్షి : అముష్య లోకస్య కా గతిః ఇతి?** స్వర్గలోకము యొక్క గతి, ఉత్తరోత్తర స్థానము, అక్కడి నుండి వెళ్ళవలసినది ఏది?

**దాల్భ్య మహర్షి :** సామము స్వర్గలోకము నుండి మరెక్కడికి తీసుకొని పోదు. ఎవ్వడైనా కూడా స్వర్గలోకం దాటి మరొక లోకం ఏదీ ఆశ్రయము పొందలేడు. సామమునకు ప్రతిష్ఠ (The ultimate objective) స్వర్గమే.

**(స్వర్గో వై లోకః సామవేదః – ఇతి శ్రుతేః** – సామవేదమ్ స్వర్గలోకము – అని శ్రుతి వాక్యం)

**శిలక మహర్షి :** ఓ దాల్భ్య మహర్షీ! మీరు 'సామ' గురించి ముగింపుగా చెప్పినదానిలో 'దోషము' (Something wrong) ఉన్నది. మీరు చెప్పినది ప్రతిష్ఠ (Final placement) కాదు. ఎవ్వరైనా పరాకాష్ఠ తెలుసుకొనియున్న సామవేత్త – మీరు 'ఇంతే। స్వర్గో వై లోకః। ఇంత మాత్రమే।" అని అన్నప్పుడు – **"మీ తల నేలకూలగలదు. అనగా, అంతకుమించిన అసలైన సత్యము గమనిస్తే మీరు తలవంచుతారు – "** అని సామవేత్త అనగలడు. అప్పుడు మీరు "నేను చెప్పినది పరాకాష్ఠ కాదు" – అని తలవంచక తప్పదు.

-----

**దాల్భ్య మహర్షి :** హంత। అహమ్ ఏతత్, భగవతో వేదాని – ఇతి। హే భగవాన్! శిలక మహర్షి! ఇంతకుమించిన 'సామ' గురించిన "ఉత్తరోత్తర గతి" నాకు తెలియదు. మీకు తెలిసి ఉండవచ్చు. దయతో వివరించండి. నేను తెలుసుకోవటానికి నేర్చుకోవడానికి సంసిద్ధుడనై ఉన్నాను. **స్వర్గలోకస్య కా గతిః ఇతి?**

స్వర్గలోకము దాటిన ఆవల గతి ఆశ్రయం ఏది?

**శిలక మహర్షి :** అటులనే సంభాషించుకుందాము. స్వర్గలోకమునకు ఆశ్రయము "ఇహలోకమే"। ఈ భూలోకమే। ఎందుకంటే, **– ఆయం హి లోకో యాగ దాన హోమ అభిః అముం, లోకం పుష్యతి – ఇతి।** యాగము, దానము, హోమము మొదలైన వాటితో ఈ లోకమే స్వర్గలోకమును పోషిస్తోంది. కనుక స్వర్గము – ఈ లోకం నుండి సమర్పించిందే 'ప్రతిష్ఠ' పొందుతోంది. "యజ్ఞములో సమర్పించబడే హవిస్సులే దేవతలకు ఆహారము" – అని ప్రతులు చెప్పుచున్నాయి కదా!

**దాల్భ్య మహర్షి : అస్య లోకస్య కా గతిః?** ఈ లోకమునకు గతి, తరవాతి స్థానము ఏది?

**శిలక మహర్షి : న ప్రతిష్ఠాం లోకమ్ అతినయేత్ ఇతి।** ఈ సామము యొక్క గతి విషయమై ఈ లోకమును (భూలోకమును) అతిక్రమించిపోకూడదు. అందుచేత ఈ లోకమునకు అభిముఖంగానే సామము యొక్క మంత్ర–ఫలములను ప్రతిష్ఠ చేయటము 'హోత'గా మన విధి. సామమునకు ప్రతిష్ఠగా ఈ పృథివియే స్తుతించబడుతోందని శ్రుతివాక్యం. **ఇయం వై "రథంతరమ్ సామ" ఇతి చ శ్రుతిః।** ఈ లోకమే నిశ్చయంగా 'రథంతరము' – అని శ్రుతులు చెప్పుచున్నాయి.

అది వింటున్న జీవలుని పుత్రుడు ప్రవాహణ మహర్షి ఈ విధంగా స్పందించారు.

**ప్రవాహణ మహర్షి :** ఓ శాలావత్యా! శిలక మహర్షీ! "ఈ లోకమే సామము యొక్క పరాకాష్ఠ ఫలము. అటు తరువాత మరే ఫలమునకు మార్గము లేదు" – అనే మీ అభిప్రాయము పరిమితము, సంకుచితము అయినట్టిది. అసంపూర్ణము. సామము యొక్క సంపూర్ణార్థము తెలిసిన వాని సమక్షంలో 'ఇహలోకమునకే యజ్ఞ ఫలము పరిమితము' అనే మాట మీరు చెప్పితే, – ఆతడు – "మీ తల నేల కూలుతుంది" అని పలికితే అది అట్లే జరుగగలదు. ఎందుకంటే, అంతకంటే ఉత్తమమైన 'సత్యము' సామోపాసన విషయమై ఏర్పడినదై ఉండగా, మీరు తలవంచక తప్పదు కదా!

**శిలక మహర్షి :** భగవన్తా! ప్రహరణ మహర్షీ! నేను చెప్పుదానికంటే ఆవలకు త్రోవచేయు సామోపాసన – తదనంతర ఫలము యొక్క క్రమము ఎట్టిదో నాకు తెలియదు. దయచేసి మాకు నేర్పమని ప్రార్థన.

**ప్రవాహణ మహర్షి :** ఓ! తప్పక వివరించుకుందాము. నేను సిద్ధముగా ఉన్నాను.

## 1-9. నవమ ఖండము – ఆకాశ ఉద్గీథ ఉపాసన

**శిలక మహర్షి : అస్య లోకస్య కా గతిః?** ఈ ఇహ లోకము యొక్క గతి, ఆశ్రయము ఏదై ఉన్నది?

**ప్రవాహణ మహర్షి :** ఈ ఇహలోకమునకు గతి, ఆశ్రయము – "ఆకాశము". సర్వాణి హ వా ఇమాని భూతాని ఆకాశాత్ ఏవ సముత్పద్యంత। (ఆకాశాత్ వాయుః; వాయుః అగ్నే; అగ్నే ఆపః; ఆపః పథ్వీ అను వేదోపనిషత్ వివరణను అనుసరించి) – వాయు అగ్ని జల పృథ్వి తత్త్వములన్నీ 'ఆకాశము' నుండే సముత్పన్నము అగుచున్నాయి (జనించుచున్నాయి). తిరిగి మరొకప్పుడు ఆకాశములోనే లయిస్తూ ఉన్నాయి కూడా. పై భూతములకంటే పంచభూతములలోని ఆకాశమే బహు విస్తారమైనది. అన్నిటికీ ఆధారము, అనంతమైనది. అందుచేత ఉద్గీథములు ఎరిగిన ఉద్గాతలు (ఉద్గీథ గానము తెలుసుకొనియున్న వేద్యులు) 'ఆకాశము'నే ఉత్తమోత్తమమైన ఉద్గీథముగా ధ్యానము చేస్తున్నారు. అట్టి విద్వాంసులు ఉత్తమోత్తమమైన ఇహ–పరములు, దివ్యలోకములు సిద్ధించుకొంటున్నారు.

ఒకానొకప్పుడు శునక మహాముని కుమారుడు అతిధన్వ మునీశ్వరుడు తన ప్రియశిష్యుడగు ఉదర శాండిల్యునికి ఈ విధంగా బోధించటం జరిగింది.

**యావత్ త ఏనం ప్రజయాం ఉద్గీథం వేదిష్యంతే, పరోవరీయో హి అభ్యస్తావత్ అస్మిన్ లోకే జీవనం భవిష్యతి।** మీ శిష్యులు, సంతానము ఆకాశ ఉద్గీథ గానము కొనసాగిస్తూ ఉన్నంతకాలం వారివారి జీవితములు ఉత్తమోత్తమమై ప్రకాశించగలవు. వారి కీర్తి స్వర్గలోకములో కూడా విస్తరించి ఉండగలదు.

అట్టి ఆకాశ ఉద్గీథోపాసకులు పై రీతిగా వర్తమాన లోకము నందు, ఉత్తరోత్తర లోకములందు ప్రకాశవంతులై ఇచ్ఛానుసారం ఉండగలరు.

## 1-10. దశమ ఖండము – ప్రతిహారముల ఉపాసన

పూర్వం ఒకప్పుడు కురుదేశములో ఒక సమయంలో గొప్ప వడగళ్ళ వాన అకస్మాత్తుగా వర్షించం చేత అక్కడి పంటలన్నీ నేలమటమై పాడైపోయాయి. ఆ రాజ్యములోని "ఇభ్య" అనే గ్రామములో ఒకచోట చక్రముని కుమారుడగు ఉషస్తిముని చిన్న వయసు కలదైన భార్యతో ఒక ఆశ్రమంలో నివసిస్తూ ఉండేవారు. ఆ గ్రామము ఒక మావటీవానికి (ఏనుగులను తొలుచూ, పోషిస్తూ ఉండేవానికి) చెందిన గ్రామము. ఆ ఉషస్తిముని తిండిలేక, చిన్నవయసు గల భార్యను పోషించలేక అగచాట్లు పడుతూ ఉండేవాడు. ఒకరోజు ఆకలికి తాళలేక అన్నమును భిక్షగా అడగడానికి ఆ మావటీ వాని ఇంటికి వెళ్ళారు.

**ఉషస్తి చక్రముని :** ఓ గృహస్థా! గృహ యజమానీ! మావటీవాడా! భిక్షాం దేహి! భిక్షాం దేహి! అన్నదానం చేయండి.

**మావటివాడు :** ఓ అభ్యాగతి! ఉషస్తిమునీ! క్షమించాలి. మా వద్ద ఆహారమేదీ లేదు. అయితే మాయింటిలో ఎప్పటివో – పుచ్చిపోయిన కొన్ని ఉలవలు దాణా మాత్రమే ఉన్నది (లేక పుచ్చిన మినుగులు మాత్రమే ఉన్నాయి).

**ఉషస్తి చక్రముని :** మీ ఇంటిలో గల ఆ పుచ్చిపోయిన ఉలవగుగ్గిళ్ళనే కొంచెము భాగము అన్నదానముగా భావించి నాకు భిక్ష వేయండి.

**మావటివాడు :** అట్లా అయితే మావద్ద మిగిలి ఉన్న ఉలవ గుగ్గిళ్ళలో కొంత మీకు సంతోషంగా ఇస్తాను. స్వీకరించండి. కానీ, మా వద్ద శుద్ధమైన మంచినీళ్ళు కూడా లేవు. పశువులకు పట్టే కుడితి నీళ్ళు మాత్రమే ఉన్నాయి. అవి ఎంగిలివి. మురికిగా కూడా ఉన్నాయి.

**ఉషస్తి ముని :** అయ్యా! ఈ పుచ్చిన గుగ్గిళ్ళు మాత్రం ఎగిలివి కావా? పురుగులు కొంత తిని ఉన్నాయి కదా! అందుచేత మీరు త్రాగే నీరే మాకు కూడా దానం చేయండి. మేము స్వీకరించి సంతోషిస్తాము.

ఇట్లా పలికి ఉషస్తిముని కొన్ని ఉలవలు తిని మరికొని తన ఇంటికి తీసుకొనివెళ్లారు. అయితే, అప్పటికే ఆయన భార్య భిక్షము ఎత్తుకొని కొంచము ఆహారము భుజించి ఉండటం చేత భర్త తెచ్చిన గుగ్గిళ్లను దాచి పెట్టింది.

ఆ మరునాడు నిదుర లేచి ఆయన తన భార్యను పిలచి ఈ విధంగా చెప్పసాగారు.

**ఉషస్తి ముని :** భార్యామణీ! ఈ రోజున ఇప్పుడు ఆహారము కొంచము ఉండి ఉంటే నేను కొంత ధనం సంపాదించగలిగే వాడినే కదా!

**భార్యామణి :** స్వామీ! ఎట్లా ధనము సంపాదించగలరు?

**ఉషస్తిముని :** మనకు కొంత దూరములో ఈ దేశపురాజు ఒక గొప్ప యజ్ఞము చేయటానికి సిద్ధపడుచున్నారు. నేను అడిగితే – ఆయన ఋత్విక్కు కర్మల కొరకై ఋత్విజునిగా నన్ను నియమించి నా సేవలు స్వీకరించగలరు. అప్పుడు కొంత ధనము, ఆహారము మనకు లభించగలదు కదా!

**భార్యామణి :** ప్రాణేశ్వరా! మీరు రాత్రి తెచ్చిన పుచ్చిపోయిన ఉలవలు కొన్ని ఉన్నాయి కదా! అవి ఉడికించి ఇస్తాను. ఆహారముగా స్వీకరించి, మీరు అనుకొన్న తీరుగానే వెళ్ళిరండి.

ఆ ఉలవలను ఆహారముగా స్వీకరించి, శక్తి తెచ్చుకొని యజ్ఞము జరుగబోవుచున్న చోటికి బయలుదేరి వెళ్ళారు. ఋత్విక్కులు కూర్చుని ఉన్నచోటికి వెళ్ళారు. అక్కడ ఉద్గాతము (మంత్రగానము చేయువారు) స్తోత్రములు చదివే స్థానము చేరి, స్తుతులను చేయబోవుచున్న ఉద్గాతలకు దగ్గిరగా కూర్చున్నారు.

ఉద్గాతృ గణములో ఒక ముఖ్యుడగు ప్రస్తోతను ఉద్దేశించి ఉషస్తిముని ఈ విధంగా సంభాషించసాగారు.

---

**ఉషస్తి ముని :** ఓ ప్రస్తోతా! నమస్కారము. ఒక చిన్న విషయం. మీరు ప్రస్తావము (Description of the Invitee Divinity)కి చెందిన ఏ దేవత ఆహ్వానించబడుచున్నదో, – ఆ దేవత ఏమిటో తెలియకుండా ప్రస్తావన గానము చేస్తున్నారా? లేదు కదా! ఒకవేళ ఆహ్వానిత దేవతను తత్వార్థంగా – తెలుసుకోకుండా (Without understanding the Actual Form of Divinity) **'ప్రస్తావగానము'** చేయనారంభిస్తే మాత్రం మీ తల నేల కూలగదు. దేవతాతత్త్వము, స్తుతుల శబ్దార్థములు తెలియకుండానే కేవలము నోటితో పాఠము వలె స్తోత్రములు, (అష్టోత్తర శతనామము వంటి) నామములు వల్లిస్తే ఎప్పటికైనా అర్థము తెలిసినవారి ముందు తలవంచి సిగ్గుపడవలసి రాక తప్పదు.

ఓ ప్రతిహర్తారా! మీకు కూడా పై సూచన వర్తిస్తుంది సుమా! ప్రతిహర్తార్యా దేవత యొక్క తాత్త్వికార్థము తెలియకుండా, కేవలము శబ్దములు నోటితో పలుకుచూ ప్రతిహార గానము చేస్తూ ఉంటే మీ శిరస్సు క్రిందపడగలదు. ప్రతిహార గానమును వల్లె వేస్తే, అంతరార్థము – ముఖ్యోద్దేశ్యము తెలిసిన ప్రతిహర్తారుల సమక్షంలో ఎప్పుడో సిగ్గుతో తలవంచుకోవలసి వస్తుంది.

---

ఈ విధంగా ఉషస్తిముని గొంతు ఎత్తి ప్రస్తోతమ, ప్రతిహర్తారుని (ఆగమార్థంతు దేవానాం, గమనార్థంతు రాక్షసాం.. మొదలైన వాక్యములు చెప్పువానిని) హెచ్చరిక చేస్తూ ఉండగా, అక్కడ ఉన్నవారంతా వారువారు చేస్తున్న పనులు ఆపి, ఇటువైపుగా చూడసాగారు. "ఓహో! ఈయన కర్మ మాత్రమే తెలిసి తాత్త్వికార్థము, ఆహ్వానిత దేవతా మహిమ సరిగ్గా తెలియకపోతే – అట్టివారికి ప్రస్తోతగాను, ప్రతిహర్తారుడుగాను సేవించే అధికారము ఉండదని ఆక్షేపిస్తున్నారే! ఒకవేళ శాస్త్ర ప్రమాణికంగా కర్మలు చేయిస్తూ, మంత్రములు నోటితో పలికినప్పటికీ, – కర్తకు దోషము అంటకపోయినప్పటికీ, ప్రస్తోత – ప్రతిహర్తారులు తమ విధ్యుక్త ధర్మముల ఉత్తమ ప్రయోజనము పొందలేరని గుర్తు చేస్తున్నట్లున్నారు!" – అని అనుకొంటూ అక్కడివారు గుసగుసలాడుకోసాగారు.

ఇది గమనించి యజమానియగు ఆ దేశపురాజు ఉషస్తిమునిని ఉద్దేశించి ఇట్లా సంభాషించసాగారు.

## 1-11. ఏకాదశ ఖండము – ప్రాణ – ఆదిత్య – అన్న ఉద్గీథము

**యజమాని అగు మహారాజు :** పూజనీయా! మీరు ఎవ్వరో మేము తెలుసుకోవచ్చునా? దయచేసి సభకు పరిచయం చేసుకోండి.

**ఉషస్తి ముని :** యజ్ఞకర్తయగు మహారాజా! మీకు జయమగుగాక! ఈ యజ్ఞ కార్యక్రమము దిగ్విజయము, లోకకళ్యాణ ప్రదము అగు గాక! మీకు ఇక్కడ ఆహూతులకు, ఋత్విక్కులకు, ప్రస్తోతలకు, పరిహర్తారులకు, హృదయపూర్వకంగా నమస్కరిస్తున్నాను. మహారాజా! నేను మన ఈ కురుదేశ పౌరుడను. నా పితృదేవులు శ్రీ చక్రముని. ఉషిస్తి నామ – అహంభో అభివాదయే।

**మహారాజు :** ఓహో! మీరు ఉషస్తి మునీశ్వరులా! నమస్కారము. అయ్యా! "మీరు ఎక్కడ ఉన్నారా?" అని చాలా వెతికించాను. మీరు ఎక్కడున్నారో తెలియలేదు. మీరు సమస్త యజ్ఞవిధులలో ప్రావీణ్యులని రాజగురువర్యులవారు మీ గురించి సూచించియే ఉన్నారు.

పూజనీయులగు ఓ ఉషస్తి మునిచంద్రుడా! మీకు సుస్వాగతము.

**భగవాన్! అస్తు త్వయేవ మే సర్వైః ఋత్విజైః ఇతి తథేతి।** హే భగవాన్! మీరే ఋత్విక్ – కర్మలన్నింటికి పూజనీయులై ఉండండి.

**ఉషస్తి ముని :** మహారాజా! మీ ఆదర – అభిమానములకు హృదయపూర్వక సంతోషము ప్రకటిస్తున్నాను. ఈ యజ్ఞ – కార్యక్రమము సేవించటానికి నేను సిద్ధము. మీ యొక్క ఆజ్ఞ శిరసా వహించగలను. నేను కూడా ఒక ఋత్విక్‌నై ఉంటాను.

అయితే మీచే ప్రేమగా అనుమతి ఈయబడినవారై ఇక్కడ ఇప్పటికి నియమితులైన ఋత్విజులంతా ఉద్గానము చేసెదరు గాక!

ఓ యజ్ఞకర్తా! మహారాజా! ఇక్కడి ప్రస్తోత, ఉద్గాత మొదలైన ఋత్వికులకు ఎంత ధనమును తాంబూలంగా ఇస్తున్నారో, నాకు కూడా ఒక ఋత్విజునిగా అంత మాత్రమే ఇవ్వండి. అధికముగా వద్దు. వారంతా ముందే ఆహ్వానించబడ్డారు కదా!

**మహారాజు :** హే ఋత్విజ మహాశయా! ఉషస్తి మునీశ్వరా! మీరు కోరినట్లే జరుగగలదు. ఇక కొద్ది సమయంలో యజ్ఞవిధులను ప్రారంభించటానికి అనుజ్ఞ ఇవ్వండి.

---

అప్పుడు అక్కడి ప్రస్తోత ఉషస్తిమునిని సమీపించారు. వినయంగా ఇట్లా ప్రస్తావించారు.

**ప్రస్తోత:** హే ఉషస్తి భగవాన్! "ప్రస్తోతము చేయుచున్న దేవతను తెలుసుకోకుండానే ప్రస్తావన గానం చేయటం జరిగితే అట్టి ప్రస్తోత యొక్క శిరస్సు క్రిందపడగలదని మీరు ఇంతకుముందు ప్రస్తావించారు కదా! అట్టి ప్రస్తోత కార్యక్రమమునకు అధిష్ఠానము ఎవరు? (లేక) – గతి, ఆశ్రయము ఎవరు?

**ఉషస్తి ముని :** ప్రస్తోతమునకు దేవత "ప్రాణమే"। ఎందుకంటే ఈ చరాచర జీవులంతా చివరికి "ప్రాణము"లోనే లీనము అగుచున్నారు కదా. ప్రలయంలో సమస్తము ప్రాణములోనే ఏకమగుచున్నది. మరల సృష్టి జరుగుచున్నప్పుడు సమస్తము 'ప్రాణము' నుండే ఉద్భవించటము జరుగుతోంది కూడా. ప్రస్తానగానమునకు ప్రాణమే దేవత. అందుచేత, ***ఎవ్వరైనా సరే ప్రాణదేవతను తెలుసుకోకుండా ప్రస్తానగానము చేస్తే, అట్టివారి శిరస్సు క్రిందపడక తప్పదు. వారు ప్రాజ్ఞులముందు తలవంచక తప్పదు.***

**ఈ విధంగా "సమస్త యజ్ఞయాగములలోను ప్రస్తుతి ప్రాణదేవత (ప్రాణశక్తి) గురించియే" – అని ప్రస్తోత అంతరమును గుర్తు కలిగి ఉండాలి.**

---

అప్పుడు అక్కడి ఉద్గాత ఈ విధంగా అడిగారు.

**ఉద్గాత :** ఓ ఉద్గాత ప్రాజ్ఞా! "ఉద్గీథమునకు చెందిన దేవత తెలియకుండా 'ఉద్గానము' చేస్తే అట్టి ఉద్గాత తల తెగగలదు. విజ్ఞుల సభలో తలవంచవలసి వస్తుంది" – అని శలవిచ్చారు గదా! మరి ఉద్గీథమునకు ఉద్గాత తెలుసుకొని ఉండవలసిన **అధిష్ఠాన దేవత (గతి, ఆశ్రయము అగు తత్త్వము) ఎవరు?**

**ఉషస్తి ముని :** ఉద్గీథ గానమునకు అధిష్ఠాన దేవత ఆదిత్యుడే! **సర్వాణి హ వా ఇమాని భూతాని ఆదిత్యమ్ ఉచ్చైః సన్తం గాయన్తి।** ఈ సమస్త జీవులు సూర్యోదయంతో బాటు నిదురులేవగానే ఆదిత్యుని నుండి పగటి వెలుగు పొందుచూ ఆదిత్యుని కీర్తిస్తున్నారు. ఆ సూర్యభగవానుడే ఉద్గీథమును అధిష్ఠించినవారై ఉన్నారు. అట్టి ఆదిత్యుని (ఆది–సమస్తమునకు మొట్టమొదటిదగు "కేవలాత్మ పురుషుని") తెలుసుకోకుండా ఉద్గీథగానము ఎవ్వరైనా సరే – చేస్తే,… అప్పుడు విజ్ఞుల సభలో తలదించుకోవలసి వస్తుంది. అందుచేతనే ఆ విధంగా – "తల తెగిపోగలదు" – అని చెప్పటం జరిగింది.

**ప్రతిహర్త :** ఓ ఉషస్తి మునీశ్వరా! ఋత్విక్ మహాశయా! ప్రతిహారమునకు సంబంధించిన దేవత ఎవరో తెలుసుకోకుండా ప్రతిహారము (సమావయవమును సాంగ, సపరివార, సాయుధ, సపత్నీ సమేతంగా ఆహ్వానించటము) నిర్వర్తిస్తే తల తెగగలదని చెప్పినారుకదా! హే పూజనీయా! అట్టి ప్రతిహార దేవత ఎవరు?

**ఉషస్తి ముని :** ఆ ప్రతిహార దేవత – "అన్నమే। ప్రాణులంతా అన్నము తీసుకొనియే జీవిస్తున్నారు కదా. ఆ ఈ దేవతయే యజ్ఞములో "ప్రతిహార క్రియావిభాగము" మాత్రమే. ఇది ఎరిగి ప్రతిహారమునకు సమావయవమునకు అధిష్ఠాన దేవత అగు 'అన్నము' యొక్క తత్త్వము, తత్ ఉపాసనా దృష్టి కలిగి ఉండకపోతే – అది నామమాత్రపు ప్రతిహార వృత్తి మాత్రమే. అన్నము స్వీకరించుట చేతనే జీవులంతా జీవించగలుగుచున్నారు.

ప్రతిహరణము = లోపలికి తీసుకొనుట

ఈ విధంగా ప్రస్తావము (Introduction)నకు **'ప్రాణము'.**

ఉద్గీథ (Uplifting)కు **"ఆదిత్యుడు".**

ప్రతిహార భక్తి (Inviting into inside)కి **"అన్నము".**

దేవతలుగా అర్థం చేసుకొని ప్రస్తోత, ఉద్గాత, ప్రతిహార్తుడు అనబడే ఋత్విజులు తమ యజ్ఞవిధులు నిర్వర్తించెదరు గాక – అని నా మనవి!

# 1-12. ద్వాదశ ఖండము

## శునకములకు (ఇంద్రియముల) ఆహారము కొరకు - "ఉద్గీథము"

***ఇక ఇప్పుడు శునకములు (ఇంద్రియములు) ఆహారము కొరకై ఉద్గీథము చేయు విధిని చెప్పుకుంటున్నారు.***

ఒకప్పుడు దల్భ్యుని కుమారుడగు దాల్భ్య బక ముని వేదాధ్యయనము, స్వాధ్యాయము నిర్వర్తించే నిమిత్తమై మైత్రేయ గ్లావ మహర్షి ఆశ్రమం ప్రవేశించారు. ఆ గురుకులములో వేదాధ్యయనము, అభ్యాసము చేస్తూ ఉండేవారు. ఒకరోజు దాల్భ్యముని సహపాఠకులతో కలిసి ఆ ఆశ్రమమునకు దగ్గరలో గల గ్రామమునకు సమీపించారు. గ్రామమునకు చివరలో ఒక నిర్జన - ఏకాంత ప్రదేశములో వేదమంత్రములను పెద్దగాను, ఆరోహణ - అవరోహణ క్రమంగాను, 'అ'కారాది - 'ఉ'దాత్తాది - 'అను'దాత్తాది షడ్జాది స్వరయుక్తంగా వల్లెవేయటం ప్రారంభించారు.

అప్పుడు వేదగాన దేవతలు (ఇంద్రియ దేవతలు) కుక్కల రూపంగా ప్రత్యక్షమైనారు. ఆ కుక్కలలో ఒక తెల్లని కుక్క (ప్రాణదేవత) - ***"ఓ వేదగానమును వల్లె వేస్తున్న పూజనీయులగు మునికుమారులారా! మేము చాలా ఆకలిగొని ఉన్నాము. అందుచేత మీరు ఆకలితీర్చే శక్తిని ఇచ్చే ఆహారమునకు సంబంధించిన ఉద్గీథ గానము చేసి మాకు తద్వారా ఆహారము సిద్ధము చేయండి"!***

అప్పుడు దాల్భ్య బక ముని ఆ తెల్ల కుక్కతోను తదితర కుక్కలతోను ఇట్లా పలికారు. **"మీరు చెప్పిన ఆహార రసము ప్రసాదించే ఉద్గీథము ఉదయంలోనే గానం చేయాలని శాస్త్రములు సూచిస్తున్నాయి కదా! అందుచేత మీరు రేపు ఉదయం రండి. మీరు కోరినట్లే ఆహార వేదగానము చేసి ఆహారశక్తిని అందునట్లు చేయగలము!"**

ఆ మరునాడు ఉదయము దాల్భ్య బక ముని, మైత్రేయగ్లావ మహర్షి, తదితర వేద అధ్యయనులు - వారంతా ఆ కుక్కలు కనబడిన చోటికి వచ్చి నిరీక్షించారు. అప్పుడు క్రిందటి రోజు వచ్చిన కుక్కలు ఆ ఉదయం అక్కడికి వచ్చాయి. అప్పుడు దాల్భ్య బక ముని, గ్లావమహర్షి మొదలైనవారు అక్కడ - బహిష్పవమాన స్తోత్రములను ఋత్విక్కులై గానం చేశారు.

అప్పుడు ఆ శునకములు ఒకదానితో మరొకటి జతకట్టి, ఒకదాని తోకను మరొకటి నోటితో పట్టుకొని బహిష్పవమాన స్తోత్రములను శ్రవణం చేస్తూ గుండ్రముగా ◯ స్థానము స్వీకరించి (taken position), కాసేపు గుండ్రముగా తిరుగాడినాయి. ఆ తరువాత గుండ్రముగా ఆసీనములై ఈ విధంగా 'హిం' కారము చేయసాగాయి. మధురముగా ఆహారమునకు సంబంధించిన వేదమంత్రములు 'వంతపాట'గా గానం చేయసాగాయి.

"ఓం ఆదా".. మేము ఇప్పుడు తినుచున్నాము।

"ఓం పిబా".. మేము ఇప్పుడు త్రాగుచున్నాము।

"ఓం దేవోవరుణః" ఓం ప్రకాశరూపుడగుటచేత "ఆదిత్యుడు" దేవదేవుడు,
"ప్రజాపతిః సవితా" వర్షము ప్రసాదించటం చేత "వరుణుడు".
జీవులకు ఆహారము ఇచ్చి పోషించటం చేత "ప్రజాపతి",
ప్రాణుల ఉత్పత్తి నిర్వర్తించటం చేత "సవిత".

ఈ విధంగా 'హిం'కారము చేసి ఆ శునకములు (ఇంద్రియదేవతలు, ప్రాణదేవత) - ఇంకా ఇట్లా పలికాయి.

**ఓం అన్నమిహా అహరద :** మమ్ములను అన్నము తిననిండు.

**అన్నపతే! అన్నమిహా అహర అహర ఓం ఇతి॥** ఓ అన్నపతీ! ప్రతి దినము అన్నమును తిని, పానీయము త్రాగనిండు.

వరుణ దేవుడు, ప్రజాపతి, సూర్యభగవానుడు సమస్త జీవులకు అన్నము సమకూర్చుటకై యజ్ఞనిష్ఠులై ఉండెదరు గాక!

ఓ అన్నపూర్ణాదేవి! మాకు ఇక్కడ మేమున్న చోట అన్నమును ప్రియముగా సమకూర్చి ఇచ్చెదవు గాక!

ఈ విధముగా వేదమంత్రములలోని అన్నమంత్రముల ఉద్గీథముచే జీవులకు అన్నప్రదాతలగు ఆదిత్యుడు, వరుణదేవుడు, ప్రజాపతి, సవితృదేవత ప్రత్యుత్సాహము పొంది జీవులకు అన్నప్రదాతలై కరుణించటము కొనసాగించగలరు.

# 1-13 త్రయోదశ ఖండము - సామగానము - "స్తోభ"

**"భక్తి"** – గానముగా ప్రదర్శనమౌతుంది. **"గానము"**– 'సామ'కు సంబంధించినది. **'సామ'** (లేక) సంగీతములో **'స్తోభాక్షరములు'** ఉంటాయి. అట్టి స్తోభాక్షరములు వాఙ్మయము (Lyric / Language) కాదు. సంగీతములో పలికే శబ్దములను కలుపుతూ ఉండే శ్రుతి రూపములే స్తోభాక్షరములు. ఉదాహరణకు

"హా" – ఉ...। "హా" – "ఇ". 'అథ్' "ఈ" "ఊ" "ఇహా" "ఈ"

ఇవన్నీ సంగీతమును లయబద్ధంగా ఉండటానికి అక్షరాల ఉచ్చారణ మధ్య పలుకుతారు. సంగీత విద్వాంసులు శబ్దము (musical sound)గా ఉపయోగిస్తారు. ఇవన్నీ సంగీతమునకు (సామకు) అవయవములుగా ఉంటూ ఉంటాయి. సామము (సంగీతము)నకు స్తోభాక్షరములకు, "అర్థముగల అక్షరములకు" తేడా లేనట్లే సంగీత విద్వాంసులు పలుకుతారు. అట్టి స్తోభాక్షరములను దృష్టాంతంగా తీసుకొని, ఈ స్వప్న సమానమైన దృశ్య వ్యవహారమును దర్శించు ఉపాసనను (ఉద్గీథమును) మనము ఇప్పుడు చెప్పుకుంటున్నాము.

**స్తోభ = మాయమాట! గుర్తు! అర్థమును ఆపాదించే శబ్దరూపము.**

**అయం వావ లోకో "హా ఉకారో"** ఈ సమస్త లోకము "హా..ఉ" స్తోభాక్షరము

**వాయుః "హా ఇకారః"** వాయువు "హా–ఇ" స్తోభాక్షరము

**చంద్రమా.. 'అ' 'థ' కారః।** చంద్రుడు 'అథ' –అనే స్తోభ. చంద్రుడు 'ఆహార' రూపుడు. "అథ – అన్నము"లలో 'అ'కారము

**ఆత్మే హ కారో** – శ్రుతి – లోని 'హ'రమే ఆత్మ।

**అగ్నిః 'ఈ' కారః ఆదిత్యః 'ఊ' కారః।'** అగ్ని – 'ఇ' కారము. ఆదిత్యుడు (సూర్యుడు) – 'ఊ'కారము.

**నిహారే 'ఏ'కారా** – ప్రార్థన (లేక) ఆహ్వానము 'ఏ'కారము (ఏహి = రమ్ము)

**విశ్వేదేవా "ఔ హో ఇ" కారః –** విశ్వే దేవతలు (Workers of the Universe) "ఔ హో ఇ" కారము. "వైశ్య దేవ్య సామము"లోను, అన్న సూక్తములోను ఇట్టి విశ్వేదేవతలకు అభ్యర్థన చెప్పబడుతోంది.

**ప్రజాపతిః 'హిం' కారః** – సృష్ట్యభిమానియగు ప్రజాపతిని తలచుచు 'హుం' కారము. 'హుం' అనునది కూడా 'స్తోభ'యే!

ఈ విధంగా ప్రజాపతిని కూడా (సృష్టి సంకల్పమును కూడా) నామవర్ణాత్మకంగా చెప్పలేము కనుక 'హిం' అన్నది కూడా స్పష్టమైన 'వర్ణము' కాదు. స్తోభయే.

ప్రాణము → స్వరము    అన్నము – స్తోభ!

స్వరమునకు (వాక్కుకు) ప్రాణము మూలకారణము.

అందుచేత "స్వరము" అనే స్తోభయందు "ప్రాణశక్తి"ని స్వరాంతర్గతంగా భావన చేస్తూ, ప్రాణమును ఉపాసించెదరు గాక!

**"యా" స్తోభ య** = పొందుట.

***'యా' అనునదే 'అన్నము'నకు స్తోభ। 'యా' అనే స్తోభ (స్వరము)నందు అన్నమును భావించి ఉపాసించెదరు గాక।***

**'య'** – అనగా పొందటం. ఈ జగత్తు అన్నముచే ఉనికిని పొందుతోంది. అందుచేత 'య' అనగా – (1) అన్నము (2) జగత్తు కూడా. అందుచేత 'యా' అనే స్తోభ వచ్చినప్పుడెల్లా అన్నము, జగత్తులను ఉపాసనా వస్తువులుగా అనుకొంటూ ఉండెదరు గాక!

అట్లాగే 'వాక్' అనే స్తోభ' 'విరాట్' యొక్క ఉపాసనగా (విరాట్ స్వరూపుని గుర్తు చేసుకొనుచున్నట్లుగా) భావించెదరు గాక!

**సామ (గానము) లేక సంభాషణ యందు**

**"హా ఉ అథ హ ఇ ఏ ఓ హో ఈ ఈం హి"** (12)

ఈ విధంగా స్తోభాక్షరములు పలకబడుచుండగా ఇవన్నీ హావభావ ప్రకటనా రూపమగుచూ, స్పష్టమైన అర్థమంటూ ఏదీ లేనట్టి స్తోభాక్షరములు. గాన సిద్ధి కొరకై ప్రయోగించబడే అర్థము లేని అక్షరాలు. అయితే ఈ స్తోభలను పైన చెప్పినట్లుగా ఉపాసనా పూర్వకంగా భావించి, ప్రయోగించబడుచుండెదరు గాక!

**అనిరుక్తాః త్రయోదశః స్తోభః సంచరో 'హుం' కారః**

ఈ విధంగా, "వాక్కు... హుంకారము"

అనిర్వాచ్యమగు 13వ అక్షరము "స్తోభ" (స్వరము) అనిర్వాచ్యమగు ఆత్మక సూచనగా భావించి గానము చేసెదరు గాక. పై విధంగా ఎరిగి స్తోభాక్షరములను, వాఙ్మయాక్షరములను ఎరిగి గానము (సామగానము) చేయువారి యొక్క వాక్కు 'అమృతము'.

అట్టి స్తోభ– స్వర – అర్థాక్షరములు ఎరిగి గానము చేయువారికి అన్నము సమృద్ధిగా లభించగలదు. వారు తృప్తిగా భుజించగలరు.

అట్టి పవిత్ర సామగానము చేయువారు పూతాత్ములు (పవిత్రాత్ములు).

ఈ విధంగా సామముల యొక్క ఉపాసన తెలుసుకొని అనుష్ఠించువారికి

⌘ వారి వాక్కు పితికిన పాలవలె మాధుర్యము సిద్ధించి ఉండగలదు.

⌘ స్వరము, ఉచ్చారణ మధురార్థసారభూతమై ఉండగలవు.

ఆతడు ఆహార సమృద్ధి, జీర్ణశక్తి కలిగి ఉండగలడు.

**అట్టివాని వాక్కుతో మాధుర్యమగు ఆత్మగానము వెంటనంటినదై**

**"అఖండాత్మమేవాహమ్" భావన క్రమంగా సుస్థిరము, నిశ్చలము, నిశ్చితము అవగలదు!**

**ఇతి ఫలశ్రుతిః**

# ఛాందోగ్యోపనిషత్
# ద్వితీయ అధ్యాయము
## 2-1 ప్రథమ ఖండము - 'సామ' ఇతి సాధుః
## ఓం ఇతి ఏకమ్ - అక్షరమ్

*ఇప్పుడు మనము సర్వశ్రేష్ఠము, శుభప్రదము అగు 'సామ' యొక్క గానము, ధ్యానముల గురించి వివరించుకుందాము.*

**ముందుగా..** "సామ" - శబ్దార్థము

**సామ =** మధురమగు వేదగానము, 'మంచి'ని కలిగించేది. మంచి మాట. అనుకూల ప్రవర్తనము. శుభము. శోభ కలిగించ గల ఉపాయము - సాత్వికము.

**సామరస్యము =** స్నేహము, కలిసి ఉండి పనిచేయటము, ఒకరినొకరు సరిగా అర్థం చేసుకొని ప్రవర్తించటము.

**సమస్తస్య ఖలు సామ్న :** అన్ని అవయవములు కలిసియుండి, సమవర్తనమై, 'సమస్తము'గా సంతరించుకొని ఉండటము.

'సామ' ఉపాసన సాధు (మంచిది).

**యత్ ఖలు సాధు - తత్ 'సామ' ఇతి ఆచక్షతే।।** "ఇది మంచిదే।" - అది చెప్పటానికి 'సామ' అని అంటారు. "మంచిదే। అట్లాగే చేయి అనటానికి 'సామ' శబ్దము ఉపయోగించబడుతోంది.

"ఇదిగో అట్లా చేయవద్దు! అది మంచిది కాదు!" అని చెప్పునప్పుడు అది 'అసామ' అనబడుతోంది. **యత్ అసాధు, తత్ అసామ।** 'సాధు'కు (మంచికి) వ్యతిరేకమైన సూచన చేసేటప్పుడు **"అసామ"** అనబడుతోంది.

"ఆతడు 'సామ'ను కోరుకొని వచ్చారు" అనగా - లేక "సామగానముతో అభ్యర్థిస్తున్నారు" - అని అన్నప్పుడు - **"ఆతడు మనలను సద్బుద్ధితో అర్థించటానికి వచ్చాడు"** - అని వార్త అందిస్తున్నట్లు. అట్లా కాకుండా, "అదిగో! ఆతడు 'అసామ' అయి వస్తున్నాడు" అని అన్నప్పుడు "ఆతడు కామ్యబుద్ధితో తన స్వార్థమును దృష్టిలో పెట్టుకొని మనలను ఇబ్బంది పెట్టటానికే వస్తున్నాడు! జాగ్రత్త" - అని సూచించటమే అగుచున్నది.

**'ఇది సామగానము'** - అన్నప్పుడు "అయ్యా! శ్రద్ధతో వినండి! ఇది మనకు శుభమును, సద్బుద్ధిని ప్రసాదించగలదు. సంతోషము కలిగించగలదు" - అని చెప్పటము.

**"అది అసామగానము"** - అన్నప్పుడు "బాబూ! ఆతని గానము వినటం వలన ఆవేశకావేశములు పెచ్చుపెరిగి, మనకు అశుభమును, దుర్బుద్ధిని పెంచి పోషించగలదు. చివరికి దుఃఖమే పర్యవసానము. అందుచేత జాగరూకులై విని ఆతనిని త్వరగా పంపివేయండి!" - అని జాగరూకత చెప్పటం వంటిది.

**'సామము'గా మాట్లాడువారు 'సాధువులు'గా స్తుతించబడుచున్నారు.**

**"మీరు అసామంగా చెప్పుచున్నారు"** - అని అంటున్నప్పుడు మీరు కామ్య బుద్ధితో, సరి అయిన - సమగ్రమైన అవగాహన లేకుండా మాట్లాడుచున్నారు. మీరు చెప్పేది మాత్రమే వింటే మాకు దోషము, పాపము కలుగగలదు" అని అనటము అవుతుంది.

**"సామగానంగా మీరు చెప్పుచున్నారు!"** - అని అన్నప్పుడు - **"మీరు వివరములన్నీ తెలుసుకొని శుభ-శోభాయమానంగా చెప్పుచున్నారు. మేము అనుసరించటం చేత సంపదలు పొందగలము"** అని చెప్పటము వంటిది.

'సామ'గా మాట్లాడువారు, గానము చేయువారు శుభములు పొందగలరు. తదితరులకు శుభము కలిగించగలరు.

**అందుచేత సామగానమే చేయాలి। 'సామము'గా సంభాషించాలి. "సామము"నే ఉద్దేశ్యించాలి.**

# 2-2. ద్వితీయ ఖండము - పంచవిధ (5) సామగాన ధ్యానములు

లోకంలో "సామగానోపాసన" (లేక) సామ ధ్యానము ఐదు తీరులుగా జరుగుచూ ఉన్నది। (లేక) లోకములో కనిపించే ఈ ఐదింటిని 'సామ'గా భావించాలి, చూడాలి, ఉపాసించాలి. ఈ ఐదు సామగుణ విశిష్టమగు **"పూర్ణసామము"**గా ఎరుగబడును గాక!

**I.ఊర్ధ్వ లోక సామోపాసన:**

**(1) పృథివీ "హిం"కారః :** ఈ భూమి, ఈ ఘనీభూతమైన సమస్తము ఆత్మభగవానుని **'హిం'**కార సామగానము (లేక) ఉద్గీథ గానము.

**'హిం'** అను బీజాక్షరముతో ఘనీభూతమైన సమస్త - దర్శనమును ఆత్మోపాసన చేయుదురు గాక!

పంచభూతములలో పృథివి మొదటిది. (అట్లాగే) సావయవములలో 'హ్రీం' అనునది మొదటి బీజాక్షరము. (ఓం-హ్రీం-క్లీం-శ్రీం-ఓం).

**(2) 'అగ్నిః' ప్రస్తావో :** అగ్నియే ప్రస్తావము, అగ్నియందే కర్మలన్నీ ప్రస్తుతము (materialize) అగుచున్నాయి. అగ్నియే **"సమాయవయ ముఖ్యము"** గా యజ్ఞమునందు ప్రస్తుతించబడుచున్నది. ఆత్మను ప్రస్తుతించువాడు 'తేజస్సు'ను దర్శిస్తున్నాడు.

**(3) అంతరిక్షమ్ ఉద్గీథ :** అంతరిక్షమే (లేక) గగనమే (లేక) ఆకాశమే ఉద్గీథము. ఆత్మవలెనే అంతరిక్షము శూన్యమే అయి ఉండి కూడా తన యందు గ్రహ-ఉపగ్రహ- నక్షత్రమండలములో సహా సమస్తము తన యందు కలిగి ఉంటున్న లక్షణము ఉపాసించుచున్నారు.

**(4) ఆదిత్యః ప్రతిహారో :** సూర్యుడే ప్రతిహారము. సూర్యుడు కళ్ళకు ఎదురుగా జీవులకు కనిపించటం చేత 'ప్రతిహారము'. ప్రతిజీవుడు ఆదిత్యుని తనకు అభిముఖంగా దర్శిస్తూ ఉన్నాడు కదా!

**(5) ద్యౌః నిధనమ్। :** ద్యులోకము (దేవతాలోకము, స్వర్గలోకము). ఇక్కడి నుండి వెళ్ళిన పుణ్యజీవులు ద్యులోకమునందే ప్రతిష్ఠితులగుచున్నారు కదా!

ఈ విధంగా ఊర్ధ్వలోక విషయములన్నీ ఈ ఐదింటి ఉపాసనచే - ప్రార్థన చేయబడినవి అగుచున్నాయి.

**II ఇహ (అథో) లోకముల "పంచసామ" సామ ఉపాసన (ఉద్గీథము) :**

ఈ లోకములలో జీవులు రావటము - పోవటము జరుగుచుండు ధర్మము కలిగి ఉంటున్నాయి. కాబట్టి 'అథోలోకములు' అనబడుచున్నాయి. (The Reverse of "I" Above)

**(1) ద్యౌః - 'హిం' కార।** ద్యు (లేక) దివ్యలోకములు **'హిం'**కారము

**(2) ఆదిత్యః-ప్రస్తావో।** ఆదిత్యము **ప్రస్తావము.** సూర్యుడు ఉదయించగానే జీవులు వారి వారి పనులు ప్రారంభిస్తున్నారు కదా!

**(3) అంతరిక్షమ్ ఉద్గీథో।** అంతరిక్షము (లేక) ఆకాశము (లేక) గగనము **ఉద్గీథము.**

**(4) అగ్నిః ప్రతిహారః।** అగ్నియే-ప్రతిహారము. ప్రాణులు అగ్నిని వెలిగించి ఆ వెలుగులో అటూ ఇటూ తిరుగుచున్నారు కదా!

**(5) పృథివీ నిధనమ్।** భూమియే నిధనము. భూమి యొక్క స్వరమే నిధనము (సమాప్తి, ముగింపు). దేవతాలోకం నుండి తిరిగి భూమిపైకి వచ్చి ప్రతిష్ఠితులు అగుచున్నారు కదా!

ఈ విధంగా అథోలోకముల గురించి వెలిసియున్న యోగులు పంచ విధములుగా సామగానోపాసన చేయుచున్నారు. (ఒక్కొక్కచోటు బుద్ధిని నిలిపి ఆత్మోపాసన నిర్వర్తిస్తున్నారు)

# 2-3 తృతీయ ఖండము - "వృష్టి" పంచవిధ సామోపాసన

**వృష్టి =** వర్షము; విజ్ఞులగు తత్త్వోపాసకులు వర్షమునందు '5' రకముల ఉపాసనను నిర్వర్తిస్తూ ఉన్నారు. ఇది అభ్యాసులచే అధ్యయనము చేసి ఉపాసించబడుతోంది. ప్రాణులు జీవించాలంటే 'వర్షము' అత్యావశ్యకము కదా! అందుచేత "లోకోపాసన" తరువాత ఈ 'వర్షోపాసన' చేయబడుచున్నది.

**(1) పురోవాతో 'హిం'కారో।** : తూర్పు నుండి వీచుచున్న వాయువు 'హిం'కారముగా ఉపాసించబడుగాక। "తూర్పు గాలితో మొదలై వర్షమునకు సంబంధించిన ప్రక్రియ వర్షము వెలియమవటముతో అంతము అవటము"-ను ఉపాసిస్తూ ఉన్నారు.

**(2) మేఘోజాయతే స ప్రస్తావో।** మేఘము ఆకాశములో ఉత్పన్నమవటము **"ప్రస్తావము"** మేఘాలు ఆవరిస్తేనే వర్షం వస్తుంది కదా!

**(3) వర్షతి స ఉద్గీథో।** మేఘము వర్షించటమే **"ఉద్గీథము"** (స్తుతి, గానము)గా ఉపాసించటము.

**(4) విద్యుత్ - మెరుపులు స్తనయతి - మేఘగర్జనలు - ప్రతిహారము** - నలువైపులా చెల్లాచెదరమవటమును ఉపాసించటము "ప్రతిహారము"

**(5) ఉద్గృహ్ణాతి - తత్ నిధనమ్ :** అంతటా జలము విస్తరించటము - నిధనము (పరిసమాప్తి)

ఈ వివరణ తెలిసిన ఉపాసనా యోగి పంచవిధ సామగానములచే 'వర్షము'ను ఎరిగి సాధన కొరకై ఆరాధిస్తున్నాడు. ఆత్మ భావనా సిద్ధికై ఉపాసన ఉపకరణముగా 'అవగాహన'ను తీర్చిదిద్దుకుంటున్నాడు.

# 2-4 చతుర్ధ ఖండము - 'జల' - పంచవిధ సామోపాసన

సమస్త జలమును ఈ విధంగా '5' రీతులుగా ఉపాసన కొరకై (కొందరు) ఉపాసించుచున్నారు. ఈ '5' రకములైన "సామ" (ఉపాసనాభ్యాసము) నిర్వర్తించబడుచున్నది.

**(1) మేఘే యత్ సంప్లవతే, స 'హిం'కారో। :** మేఘములు దట్టముగా క్రమ్ముకోవటము - **'హిం'**కారము.

**(2) యః వర్షతి - స "ప్రస్తావో"।** - వర్షించటమే **"ప్రస్తానము".**

**(3) యాః ప్రాచ్యస్స్యందంతే స ఉద్గీథః** - జలము ప్రాచీదిశ (తూర్పుదిశ)గా ప్రవహించు నదులు **"ఉద్గీథము".**

**(4) యా ప్రతీచ్యస్స ప్రతిహారః।** - పడమరవైపుగా ప్రవహించు నదులు **"ప్రతిహారము".**

**(5) సముద్రో నిధనమ్।** సముద్రములో నదీ జలములు కలియటము **"నిధనము"** (ముగింపు).

ఈ విధమైన భావనతో ఎవరైతే సకల జలములను పంచవిధ జల - సముద్ర సామముగా ఉపాసన చేస్తూ ఆత్మోపాసన చేస్తూ ఉంటారో - అట్టివానికి జల గండము ఉండదు. జల సమృద్ధి కలిగి ఉంటాడు.

# 2-5 పంచమ ఖండము - ఋతు పంచవిధ సామోపాసన

ఋతువులను పంచ విధమగు సామోపాసన (ధ్యానము) చేయు విధిని చెప్పుకుంటున్నాము.

**(1)** **వసన్తో 'హింకారో'** - వసంత ఋతువు - **"హింకారము".**

**(2)** **గ్రీష్మః 'ప్రస్తావో'** - గ్రీష్మ ఋతువు - **"ప్రస్తావము".**

**(3)** **వర్షా ఉద్గీథః** - వర్షఋతువు - **"ఉద్గీథము".**

**(4)** **శరత్ ప్రతిహారో** - శరదృతువు - **ప్రతిహారము.**

**(5)** **హేమన్తో నిధనమ్ -** హేమంత ఋతువు - **నిధనము.**

ఇట్టి సామగానము చేయువారు అన్ని ఋతు బాధల నుండి రక్షించబడగలరు. ఆయా ఋతువుల సంపదలు వారిని ఆశ్రయించి ఉంటాయి.

## 2-6 షష్ఠి ఖండము - పశు పంచవిధ సామోపాసన

పశు సంతతి / సంపద గురించి పంచవిధ సామగానము (మరియు) ధ్యానము ఈ విధంగా నిర్వర్తించబడుతోంది.

(1) **అజా 'హిం' కారో -** మేకలను 'హిం'కారముగాను,

(2) **అవయవః ప్రస్తావో -** గొఱ్ఱెలను 'ప్రస్తావము'గాను,

(3) **గావ ఉద్గీథో -** గోవులును 'ఉద్గీథము'గాను,

(4) **అశ్వాః ప్రతిహారః -** గుఱ్ఱములను 'ప్రతిహారము'గాను,

(5) **పురుషో నిధనమ్ -** పశువులు మానవుని ఆశ్రయించి ఉంటాయి కాబట్టి - మానవుడు 'నిధనము'గాను

ఈ విధంగా భావిస్తూ ఉపాసించువారికి - **భవంతి హాస్మ పసవః** - పశు సంపద వృద్ధి కాగలదు. సంపదవంతులు కాగలరు.

## 2-7 సప్తమ ఖండము - ఇంద్రియ పంచవిధ సామోపాసన

ప్రాణము యొక్క సర్వోత్కృష్టమైన (పరోవరీయమైన) ఐదు ఇంద్రియ ప్రదర్శనములను ఆత్మశక్తి ప్రదర్శనా భావంగా (సామగానంగా) ఉపాసించుచున్నారు.

(1) **ఘ్రాణో 'హిం'కారో =** ఘ్రాణేంద్రియము - హింకారము.

(ప్రాణోహి హింకారో) పాఠాంతరము - ప్రాణము - హింకారముగా ఉపాసించుట.

(2) **'వాక్' ప్రస్తావః -** వాక్కు - ప్రస్తావము. సర్వ తదితర ఇంద్రియములను ప్రస్తావము (తెలియజేయునది) చెప్పగలుగునది వాక్కుయే కదా!

(3) **చక్షుః ఉద్గీథః -** కన్నులు ఉద్గీథము

(4) **శ్రోత్రం ప్రతిహారో -** చెవులు ప్రతిహారము

(5) **మనో నిధనం -** మనస్సు నిధనము

ఇవన్నీ ఒకటి కంటే ఆ తరువాతది విస్తారమైనది. ఈ విధమైన శ్రేష్ఠమైన గాన వివరములు పంచవిధ సామగానము ఎవరు నిర్వర్తించెదరో, అట్టి వాడి జీవితము సర్వోత్కృష్టము కాగలదు. లోకములను జయించగలడు. "లోకములన్నీ మమాత్మయందే ప్రదర్శనమై ఉన్నాయి" అని ఆత్మతత్త్వానుభవము సిద్ధించుకోగలడు.

## 2-8 అష్టమ ఖండము - సప్తవిధ వాక్ సామోపాసన

ఇప్పుడిక '7' అవయవములు గల వాక్కుకు సంబంధించిన "సప్తవిధ సామోపాసన" వివరించుకుంటున్నాము.

(1) **వాచో 'హుమ్' ఇతి 'హిం'** వాక్కు యొక్క 'హమ్/హుమ్" అనే స్వరము - 'హిం' కారము

(2) **యత్ ప్రేతి స ప్రస్తావో** "ప్ర" అను శబ్ద రూపము (స్వరము) - ప్రస్తావము.

(3) **యదేతి స ఆదిః** 'యత్' ఏతి అను స్వరము - "ఆది" సర్వమునకు ఆది కాబట్టి 'ఓం'!

(4) **యత్ ఉత్ స ఉద్గీథో।** "ఉత్" అను శబ్ద రూపము - ఉద్గీథము

(5) **యత్ ప్రతీతి - ప్రతిహారో** "ప్రతి" అనే స్వరము - ప్రతిహారము

(6) **యత్ 'ఉప' ఇతి స ఉపద్రవో** - 'ఉప' - అను స్వరము ఉపద్రవము

(7) **యన్నీతి - తత్ నిధనం** - "నీ" - అను స్వరము - నిధనము

***"హమ్" "ప్ర" "యత్" "ఉత్" "ప్రతి" "ఉప్" "నీ" - స్వరములు***

ఈ విధంగా స్వరము ఎరిగి వాక్కును '7' విధములుగా ధ్యానము చేసెదరుగాక! (సప్తవిధ సామోపాసన) – అట్టివారికి 'వాక్ – అమృతము' లభిస్తుంది. అప్పుడే పితికిన పాల వలె వారి వాక్కు మాధుర్యమును, నవ్యతను సంతరించుకోగలదు. అన్న సంపదను సమృద్ధిగా పొందగలరు. ఇతరులకు తృప్తిగా ఆహారము అందించగలరు. ఉత్తమ జీర్ణశక్తి కలిగియుండగలరు.

## 2-9 నవమ ఖండము – ఆదిత్య సప్తవిధ సామోపాసన

ఇప్పుడిక 'ఆదిత్య' సామగానోపాసన గురించి ప్రస్తావించుకుంటున్నాము.

'7' అవయవముల సామమును ఆదిత్య భగవానుని (ప్రకాశిస్తున్న సూర్యుని) ఉద్దేశించి ఉపాసించబడుగాక। అనగా, ఆదిత్యుని 'పూర్ణసామము' కొరకై అవయవ విభాగ క్రమంగా '7' విధములైన సామములు ఉపాసించెదరు గాక!

దేని నుండి ఆదిత్యుడు ఉద్గీథము (ఉత్–గీథము=పైకి ప్రజ్వలితుడు) అగుచున్నాడో – 'సామగానము' కూడా అద్దాని నుండే బహిర్గతంగా ప్రకాశమానమగుచున్నది.

ప్రతి జీవుడు సూర్యుని చూస్తున్నప్పుడు **"ఈ సూర్యుడు నన్ను సమీపిస్తున్నాడు"** – అని అనిపిస్తూ ఉంటుంది. కాబట్టి "సూర్యుడే సామగానము" అని సామవేద వాక్కు.

***<u>సూర్యుని విశేషములు:</u>***

(1) సూర్యుడు అందరి పట్లా సమానముగా ప్రకాశించుచున్నారు.

(2) జీవులంతా సూర్యునితో నిత్యము సంబంధము కలిగియున్నారు.

(3) సమస్త జీవులు సూర్యునిపైనే జీవించుటకై ఆధారపడి ఉన్నారు.

ఈ భావనలు 'ఆదిత్య సామము'లో ఉపాసకుడు ఉపాసన కలిగి ఉంటున్నాడు.

ఇంకా --

(4) పైన ప్రకాశిస్తూ ఉండటం చేత ఉద్గీథుడు

(5) లోకములన్నిటికీ మొట్టమొదటివాడు కాబట్టి 'ఆదిత్యుడు'

## ఆదిత్య సప్త సామోపాసనలు

**(1) తస్య యత్ పురోదయాత్ స 'హిం' కారః (ఉదయానికి ముందు తెల్లవారుఝాము)**

ఉదయించటానికి పూర్వము ఉదయించు ధర్మము కలిగియున్న సూర్యుడు 'హిం' కారము. అట్టి సూర్యోదయానికి ముందటి రూపము సంధ్యావందనము మొదలైన ధర్మకార్యములచే ప్రోత్సాహము కలుగజేయువాడు. సమస్త జంతువులు ఆదిత్యుని ఉదయించటానికి ముందటి రూపము యొక్క "హింకారము"పై ఆధారపడి ఉంటున్నాయి. "సూర్యుడు ఉదయించబోతున్నాడు" – అనుదానికి గుర్తుగా తెల్లవారుఝామున పక్షుల కిలకిలా రావాలు వినిపిస్తూ ఉంటాయి. అదియే 'హింకార సామగానము'గా శ్రవణము అగుచున్నది. (ఇది పశువులచే ఆరాధ్యము).

**(2) అథ యత్ ప్రథమ – ఉదితా స "ప్రస్తావః" (ఉదయిస్తూ ఉన్నప్పటి సూర్యబింబ ప్రతిరూపము)**

సూర్యుడు ఉదయిస్తూ ఉండగా మునుముందుగా కనిపించే ఉదయసూర్యుని (బాలసూర్యుని) రూపము – ప్రస్తావము. ప్రస్తాన రూపములుగా (సామవేదములోను, తదితర పురాణములలోని ఉదయించు సూర్యున్ని మానవులు అనుసరిస్తూ నిదురలేవటం, కాలకృత్యములు మొదలైనవన్నీ) నిర్వర్తించుకుంటున్నారు. అట్టి ఉదయించు సూర్యుని ప్రత్యక్షముగాను, పరోక్షముగాను (భావనలో) ఆరాధిస్తూ మానవులు వాంఛితార్థములు పొందగలరు.

(ప్రస్తుతి = ప్రత్యక్షంగా; ప్రశంస = పరోక్షంగా) (మానవులకు ఈ ఉషోదయము సంబంధించనదై ఉంటుంది).

**(3) అథ యత్ సంగవేలాయాగ్ం స ఆదిః।**

*(సూర్యోదయము అయి 2 గం॥ తరువాత మధ్యాహ్నం లోపు సూర్యబింబము)*

ఆ తరువాత సూర్యకిరణములు జగత్తునందు అంతటా విస్తరించటమే "ఆది" – అని ఉపాసించబడుతోంది. (సూర్యోదయం తరువాత 2 గం॥ వరకు 'ఆది'గా భావన చేయుదురు).

అట్టి విస్తరిత కిరణ సూర్యుని సామగాన బలము పొంది పక్షులు ఆకాశంలో తిరుగగలుగుచున్నాయి. పక్షులు ఈ రూపమును అనుసరిస్తూ ఉంటాయి. **(ఇది పక్షులకు ఆరాధ్యము)**

**(4) అథ యత్ సంప్రతి మధ్యం దినే స ఉద్గీథమ్। (మిట్ట మధ్యాహ్నం 12 గంటల నుండి 2 గంటల వరకు)**

మధ్యాహ్నము ప్రకాశిస్తూ కనబడు సూర్యుడు ఉద్గీథము. ఈ మధ్యాహ్న తేజోప్రకాశ తేజస్సు దేవతలచే అనుసరించబడుతోంది. అట్టి సేవచే ప్రజాపతి సంతానములో శ్రేష్ఠులు అగుచున్నారు.

**(5) అథ యత్ ఊర్ధ్వం మధ్యం దినాత్ ప్రాక్– అపరాహ్నాత్ ప్రతిహారః।**

(పగటి మూడవ భాగము సూర్యాస్తమయ సమయంలోపు సూర్యబింబము మధ్యాహ్నం 2 నుండి సాయంత్రం 4 గంటల వరకు)

పగలు ఆఖరి మూడవ భాగ – (అపరాహ్ణ) సూర్యుడి ఉపాసనము ప్రతిహారము. ఆదిత్యుని ఈ అపరాహ్నరూపము గర్భస్థ పిండములచే అనుసరించబడుతోంది. ఈ సమయములో పిండము గట్టిపడుతుంది. సూర్యుని ప్రతిహార భక్తిచేతనే గర్భస్థ శిశువులు క్రిందపడక గర్భమునందు నిలిచి ఉండగలుగుచున్నారు.

**(6) అథ ఊర్ధ్వమ్ అపరాహ్ణాత్ ప్రాక్ అస్తమయాత్ ఉపద్రవః।**

(మధ్యందినము తరువాత సూర్యాస్తమయ సమయానికి ముందు సూర్యబింబము )

అపరాహ్ణము తరువాత – సూర్యాస్తమయమునకు ముందు సూర్యుని రూపము 'ఉపద్రవము'(సమావయవము) ఈ సూర్యాస్తమయమునకు ముందు సూర్యుని రూపమును అడవి జంతువులకు అనుసరణీయము. అందుకే ఆ అడవి జంతువులు మనుష్యులను చూచినప్పుడు పొదలలోకి, గుహలలోకి పరుగులు తీస్తూ ఉంటున్నాయి. అవి ఆదిత్యుని ఉపద్రవమును సేవిస్తూ ఉన్నాయి.

**"అథ యత్ ప్రథమ – అస్తమితే → తత్ నిధనమ్"**

(సూర్యుడు అస్తమిస్తూ ఉన్న సూర్యబింబ రూపము)

సూర్యుడు అస్తమించిన తరువాత ప్రకాశము నిధనము. అట్టి నిధనముపై పితృదేవతలు అస్తమయానంతర సూర్యతేజో విభవముపై ఆధారితులు. వారు అనుసరించువారై ఉంటారు. ఈ సూర్యుని రూపమునే పితృ కార్యము చేయు కర్త దర్భలపై తండ్రి – తాత – ముత్తాతల రూపంగా పిండముల రూపంగా స్థాపించి ఉపాసిస్తున్నారు.

సూర్యాస్తమయంలో పగలు సమాప్తము అవుతుంది. సాయం నిధనమును పితృదేవతలు ఆదిత్యరూపమగు సామమును సేవిస్తూ ఉన్నారు.

ఈ విధంగా సప్తాశ్వ సమారూఢుని గాను, సప్తావయవిగాను ఎవ్వరైతే సూర్యభగవానుని ఉపాసిస్తూ ఉంటారో, – అట్టివారు "ఆదిత్య సాయుజ్యము" – అనే ఉత్తమ ఫలము పొందగలరు.

ఈ విధంగా ఫలశ్రుతి పలుకుచూ "ఆదిత్య సామోపాసన" చెప్పబడుచూ ఉన్నది.

---

## 2-10. దశమ అధ్యాయము - "అతిమృత్యు సప్తవిధ సామోపాసన"

ఆదిత్యుడే "రాత్రి - పగలు - రోజులు - నెలలు - సంవత్సరములు - దశాబ్దములు - శతాబ్దములు - యుగములు" మొదలైన రూపములు గల కాలమును నిర్మిస్తూ ఉన్నారు. ఇక ఈ దృశ్యములోని సమస్తము కాలమాయచే ఉత్పత్తి అగుచూ, కాలముచేతనే దిగమ్రింగబడుతోంది. అందుచేత కాలమునకు నియామక సంజ్ఞయగు ఆదిత్యుడే (కాలముచే హరించుచూ) అతిమృత్యు స్వరూపుడు కదా! క్షరము మృత్యు ధర్మము. అక్షరోపాసనయే అట్టి మృత్యువును దాటివేయు సాధనగా అభ్యాసులకు ఈ "అపమృత్యు సప్త సామ ఉపాసన" గా చెప్పబడుతోంది.

ఆత్మ యొక్క స్వానుభవమునకై - "ఆత్మ సమ్మతమ్ అతిమృత్యు సప్త (7) విధ సామోపాసన" ఈ విధంగా అభ్యాసము చేయబడుచున్నది.

**(1)** **"హింకారః"** - 3 అక్షరములు (Preparation)

**(2)** **"ప్రస్తావః"** - 3 అక్షరములు (Introduction)

తత్సమమ్ - ఈ రెండు సమాన శక్తి గలవు. (సమరూపముగా భావించి ఉపాసించెదరు గాక)!

**(3)** **"ఆది"** - 2 అక్షరములు

**(4)** **"ప్రతిహారః"** - 4 అక్షరములు

ఆది + ప్రతిహారము = ఆవల + ఈవల. "ప్రతిహారః" నుండి ఒక అక్షరము తీసి "ఆది" యొక్క రెండు అక్షరములతో కలిపితే ఇవి కూడా (3+3) (తత్సమము) సమము అవగలవు.

**(5)** **"ఉద్గీథః'** - 3 అక్షరములు

**(6)** **"ఉపద్రవ"** - 4 అక్షరములు

రెండింటిలోను '3' '3' అక్షరములు తీసుకుంటే ఇవి సమము "ఉద్గీథ - ఉపద్రవ" చేసి తీసుకుంటే ఇంక ఒక అక్షరం మాత్రము మిగిలిపోతోంది. ఆ ఒక్క అక్షరము (వ) - విభాగము (Divisibility) - "నిమిత్తము"।

**(7)** **నిధనం =** '3' అక్షరములు పేరు. ఇది సమమే అగుచున్నది (మిగతా వాటితో సమానమే).

ఇవన్నీ కలిపి **"సప్త విధ సామగానము"**నకు 22 అక్షరములు.

| | | |
|---|---|---|
| హింకార | = | 3 |
| ప్రస్తావ | = | 3 |
| ఆది | = | 2 |
| ప్రతిహార | = | 4 |
| ఉద్గీథ | = | 3 |
| ఉపద్రవ | = | 4 |
| నిధన | = | 3 |
| | | 22 |

- ఈ దృశ్యము నుండి ఆదిత్యుని వరకు 21 అక్షరములు
- 22వ అక్షరము - ఆదిత్యునకు ఆవలి లోకము (The zone before / beyond the main begining)

- "21" అక్షరములలో యోగి ఆదిత్యుని పొందబడుచున్నారు.
- అనగా ఆదిత్యుడు ఇక్కడి నుండి 21వ వాడు
- 21వ అక్షరము ద్వారా 22వ అక్షరము పొందగలడు. అనగా -

**ఆదిత్యునికి (ఆదికి) ఆవల గల నిర్విషయ కేవల స్వస్వరూపము**

పొందగలడు. అట్టి 22వ స్థానమే - మృత్యువుకు (మార్పుకు) ఆవల గల అమృత (మార్పు-చేర్పులకు సంబంధించని) ఈ

జీవుని యొక్క "స్వస్థానము", "సహజరూపము". అదియే **"అతిమృత్యుస్థానము"** - అదియే "కేవలస్వరూపోపాసన". అట్టి స్వస్థానము ఆనంద స్వరూపము. అందుకే 'సాపేక్ష' (Comparison) చే కనిపించే దుఃఖము (Worry) కి తావు ఉండదు. **తన్నాకమ్! అదికమ్. (దుఃఖము) లేనిది! తద్విశోకమ్। శోకము ఉండనట్టిది.**

"సప్తవిధ అతిమృత్యు ద్వావింశతి అక్షర సామోపాసన" ఎరిగి ఉపాసించువారు ఆదిత్యునికి ఆవల గల "కేవలమగు స్వస్వరూపము"తో సోఽహమ్'ను సిద్ధించుకొని ఉంటున్నారు. "కేవలమగు నా స్వరూపము నిశ్చలము. యథాతథము. అది మార్పు చేర్పులకు (మృత్యువుకు) సాక్షియేగాని, జనన-మరణాది కాలచక్రములో ప్రవేశించదు"- అని భావన చేస్తూ తనయందు 'త్వమ్' యందు, ఈ 'జగత్తు'నందు అట్టి కేవల రూపమును కప్పి సమాహ్వానించి ఉపాసించటమే "అతిమృత్యు ఉపాసన".

## 2-11. ఏకాదశ ఖండము - గాయత్ర పంచవిధ సామోపాసన

*ఇప్పుడు "గాయత్రము" అనబడే ప్రాణసామోపాసన ఎట్లా చేయబడుచున్నదో చెప్పుకుంటున్నాము..*

(యజ్ఞకర్మయందు యాగ యజ్ఞశాస్త్రముచే చెప్పబడిన వరుసయే ఇక్కడ ఉదహరించబడుతోంది)

(1) **'మనో' హింకారో।** - ఇంద్రియ వ్యాపారములన్నిటిలో మొట్టమొదటిది, మననమే రూపముగా గల మనస్సు "హింకారము"

(2) **'వాక్'** ప్రస్తావః - మనస్సులో వచ్చే ఆలోచనలు మాటలతో చెప్పితేనే మరొకరికి తెలుస్తుంది కాబట్టి - వాక్కు "ప్రస్తావము"

(3) **చక్షుః ఉద్గీథః।** చూడటం వలన వాక్కు, మనస్సు విషయములు పొందుచున్నాయి. కనుక చక్షువులు (కళ్ళు) ఉద్గీథము.

(4) **శోత్రం ప్రతిహారః।** చెవులు (వినికిడి) ప్రతిహారము. శబ్దములే ప్రతిహృతం అవుతుంది కాబట్టి.

(5) **ప్రాణో నిధనమ్।** ప్రాణము నిధనము. నిద్రాసమయంలో ఇంద్రియములన్నీ ప్రాణము నందే విలీనము అవుతాయి కాబట్టి ప్రాణమే నిధనము.

---

ప్రాణమే ఇంద్రియములందు [ వాక్కు, కళ్లు, చెవులు, చర్మము (స్పర్శ), నాలుక (రుచి) యందు] - ప్రతిష్ఠితమైయున్నది. ప్రాణమే గ్రాయత్ర సామము.

ఈ ఇంద్రియములు, ఇంద్రియార్థములు, వాటివాటి విషయములు గాయత్ర సామము. (గాతయత్ త్రాయతే!) ప్రాణమే గానము చేస్తూ, ఇంద్రియములన్నిటికీ 'కాపలా' కాస్తోంది!

ఎవ్వరైతే ఈ విధంగా 'గాయత్ర ప్రాణము'ను తెలుసుకొంటాడో, అట్టివాడు సుఖప్రాణి అగుచున్నాడు. పూర్ణమైన ఆయుష్షు కలవాడగుచున్నాడు. తేజోవంతుడై జీవిస్తూ ఉంటాడు. ఉత్తమ ప్రజలను (సానుకూలురగు పుత్రులు), మిత్రులు మొదలైన సహజనమును, పశుసంపదను కలవాడు, కీర్తిమంతులు కాగలరు.

***మహామనస్యాత్ - తత్ వ్రతమ్। "అట్టి ప్రాణశక్తియందు ఇంద్రియములను ఏకము చేసి దర్శించటము" అనే మహామనో - ఉపాసనావంతులు అగుదురు గాక! ఇది వ్రతముగా అగును గాక!***

## 2-12. ద్వాదశ ఖండము - రథంతర పంచవిధ సామ ఉపాసన
## (అగ్ని యొక్క అంతరమున పుట్టిన సామ ఉపాసన)

(1) **అభిమందతి-స 'హింకారో'।** అగ్నికై మథించే (జనింపజేసే) అరణికొయ్యలు (Wood pieces used to generate "Fire" at the Begining of యాగ/యజ్ఞ)

'హింకార' (యజ్ఞకర్మలో అరణి కొయ్యలతో అగ్నిని పుట్టించటము మొట్టమొదటి విధి).

(2) **ధూమో జాయతే, స ప్రస్తావో!**

అగ్ని నుండి పొగ బయల్వెడలటము - **'ప్రస్తావము'** (అగ్ని మండించగానే మొదట పొగ జనిస్తుంది కాబట్టి)

**(3)** **జ్వలతి స ఉద్గీథో।** అగ్ని ప్రజ్వలనము అవటము ఉద్గీథము. జ్వలించే అగ్నియందు మాత్రమే హవిస్సు హోమం చేయబడుతుంది కదా!

**(4)** **అంగారా భవంతి - స ప్రతిహార**

మండే బొగ్గలుగా ఏర్పడేది - అది ప్రతిహారము. మంటలకు మండే నిప్పుకణికలు క్రింద ఉంటాయి కదా.

**(5)** **ఉపశామ్యతి - తత్ నిధనం** అగ్నిచల్లారటము నిధనము (నిధనమ్ = సమాప్తి)

అట్టి రథంతర సామ (5 విశేషాలు) అగ్నియందు ప్రతిష్ఠితమైయున్నది. అగ్నిలో జరుగుచున్న అట్టి 'రథంతర సామ'ను ఎవరు ఈ విధంగా తెలుసుకొని సామగానము నిర్వర్తిస్తూ ఉంటారో (ఉపాసిస్తారో), అట్టివారు బ్రహ్మవర్చస్సు కలిగి ఉంటారు. అన్నాదులై (అన్నము పొందువారై) ఉంటారు. పూర్ణాయుష్కులౌతారు. జ్యోతిష్మంతులై జీవిస్తారు. చక్కటి బంధుజనమును, పశుసంపదను పొందగలరు. కీర్తిమంతులై ఉంటారు.

అగ్నికి అభిముఖంగా కూర్చుని ఏదీ తినరాదు. త్రాగరాదు. **న ప్రత్యన్ అగ్నేః అభిముఖో + న ఆచమేత్, న భక్షాయేత్ కించిత్। అగ్నికి ఎదురుగా ఉమ్మివేయరాదు, న నిష్ఠీవేత్ శ్లేష్మనిరసనం చ।**

ఇతి ఉపాసకులకు నియమై (వ్రతమై) ఉండు గాక!

## 2-13. త్రయోదశ ఖండము - వామదేవ- మిథున పంచవిధ సామోపాసన

**(1)** **ఉపమంత్రయతే స 'హింకారః'।** - ఉపమంత్రణము (పిలుపు, బుజ్జగించటం) - 'హింకారము'

**(2)** **జ్ఞపయతే స 'ప్రస్తావః'।** జ్ఞపము - (తెలియజేయటము) - ప్రస్తావము

**(3)** **'స్త్రీ' యా సహశేతి స ఉద్గీథః।** - పురుషుని నుండి ప్రసరించు శుక్లము! వీర్యము - ఉద్గీథము

**(4)** **ప్రతిస్త్రీ సహ శేతి ప్రతిహారః।** స్త్రీకి చెందిన శోణితము ప్రతిహారము

**(5)** **కాలం గచ్ఛతి - తత్ నిధనమ్। 'పారం' గచ్ఛతి తత్ నిధనమ్।** కాలగతి, దేహ నిర్మాణము, జీవుని జీవితము - జీవితాంతము - నిధనము.

అట్టి (స్త్రీ, పురుష) మిథునమును ఉపాసనగా ఉద్గీథ గానము తెలుసుకొన్నవారు ఉత్తమ దాంపత్యము, ఆరోగ్యము - ఉత్తమ గుణములు గల సంతతిని పొందు మిథునము (జంట) అవగలరు. మిథునము యజ్ఞమై ఉత్తమ ప్రజలు, ఆయుష్షు ప్రసాదించగలదు. వారి దాంపత్యము జ్యోతి (తేజో) ప్రదము కాగలదు.

పశు సంపద వర్ధిల్లగలదు. కీర్తిని పొందగలరు.

**న కాంచ న పరిహారే। తత్ వ్రతమ్। పరకాంతను, పరధనమును ఏమాత్రము ఆశించరాదు. ఇది 'వ్రతము'గా నిర్వర్తించబడు గాక।** "ఏకపత్నీ వ్రతము, అపరిగ్రహము" ఈ రెండూ వామదేవ మిథునోపాసన యందు ముఖ్య నియమములు.

## 2-14. చతుర్దశ ఖండము - బృహత్ ఆదిత్య పంచవిధ సామోపాసన

**(1)** **ఉద్యన్ దిన - హింకార** ఉదయిస్తూ దర్శనమిస్తున్న సూర్యుడు 'హింకారము'

**(2)** **ఉదితః - ప్రస్తావో** ఉదయించిన తరువాత సూర్యుడు జీవులను కర్మలయందు ప్రేరేపిస్తున్నారు కనుక ఉదయానంతర సూర్యుడు - "ప్రస్తావము"

**(3)** **మధ్యందిన - ఉద్గీథా -** గొప్ప ప్రకాశము కలవారు కాబట్టి మధ్యందిన (మధ్యాహ్న) సూర్యుడు "ఉద్గీథము" (మధ్యాహ్నం - 12 గం॥).

**(4)** **అపరాహ్ణః ప్రతిహారో -** మధ్యాహ్నం తరువాత - సాయంకాలం వరకు సూర్యుడు "ప్రతిహారము". పశువులు మొదలైనవాటికి తిరిగి ఇళ్ళకు త్రోలుకువచ్చే ప్రతిహరణ (వెనుకకు మళ్ళించటము) చేస్తారు కదా!

(5) **అస్తం యత్ – నిధనమ్।** సూర్యాస్తమయము, ఆ తరువాత సమయము 'నిధనము'. జీవులు పనులను విరమించి ఇళ్ళల్లో ఉంటారు కాబట్టి నిధనము (విరమించటము).

ఈ **బృహత్ సామము** సూర్య భగవానుని యందు ప్రతిష్ఠితమైయున్నది. అందుచేత అధిష్ఠాన దేవత సూర్యుడు.

ఆదిత్యునియందు ప్రతిష్ఠితమైయున్న ఈ బృహత్సామ ప్రకృతి యజ్ఞమును ఎవ్వరైతే ఉపాసిస్తారో,... అట్టివారు తేజోసంపన్నులు కాగలరు. ఉత్తమ జీర్ణశక్తి, మధురమగు అన్నము, ఉత్తమ ఆయుర్దాయము జన-పశు సంపద, జ్యోతిత్వము, మహత్ కీర్తి పొందగలరు. అట్టి సూర్యభగవానుని ప్రేమతో ఉపాసించండి. యండ- వేడిమి ఇటువంటి సూర్య తేజస్సును నిందించకూడదు. ఆరాధించాలి. **(సూర్యో) మహత్ కీర్త్యా తపంతమ్। న నిందేత్। ఇతి వ్రతమ్।**

ఇది వ్రతమై ఉండును గాక।

## 2-15. పంచదశ ఖండము – పర్జన్య పంచవిధ సామోపాసన – వైరూపోపాసన

వర్షమును ఉపాసన చేస్తూ ఆత్మోపాసనగా తీర్చిదిద్దుకోవటము గురించి చెప్పుకుంటున్నాము.

(1) **అభ్రాణి సంప్లవంతే స 'హిం కారో'।** – అభ్రము (నీటి ఆవరి) ఒకచోట సమావేశమగుచూ ఉండటము, హింకారము. మేఘము రూపుదిద్దుకొనే ప్రకృతిలోని ప్రక్రియ – 'హిం'కారము.

(2) **మేఘోజాయతే స ప్రస్తావో।** వర్షజలముతో నిండుగా కనిపించే కారు మేఘముల – 'ప్రస్తావము'

(3) **వర్షతి – స ఉద్గీథో।** మేఘము వర్షించటము – 'ఉద్గీథ'।

(4) **విద్యోతతే స్తనయతి స 'ప్రతిహార'** ఉరుములు, మెఱుపులు – ప్రతిహారము.

(5) **ఉద్గృహ్ణాతి తత్ నిధనో** మేఘములు వర్షించటము ముగించి అదృశ్యమవటము – 'నిధనము'.

ఇది మేఘములను ఉపాసించే "వైరూప సామగానము". ఇట్టి సామగానము చేయు ఉపాసకుడు రంగురంగుల పశువుల సంపదను, పూర్ణమగు ఆయుర్దాయమును, ప్రశస్తమగు జీవనమును, సంతానమును, కీర్తిని పొందగలడు.

**వర్షంతం న నిన్దేత్। ఇతి వ్రతమ్।** వర్షము కురియటమును నిందించరాదు.

ఇది వ్రతము।

-----

## 2-16. షోడశ ఖండము – 'వైరాజ ఋతు' పంచవిధ సామ ఉపాసన

(1) **వసంతో హింకారో। :-** ఋతువులలో మొదటిదగు వసంత ఋతువు – 'హింకారము'

(2) గ్రీష్మః ప్రస్తావో। :- గ్రీష్మఋతువు – "ప్రస్తావము"

(3) **వర్ష ఉద్గీథః। :-** వర్షఋతువు "ఉద్గీథము"

(4) **శరత్ ప్రతిహారో।** – శరదృతువు – 'ప్రతిహారము' (మార్గము/Procedures)

(5) **హేమన్తో నిధనమ్।** హేమన్త ఋతువు – "నిధనము" (ఉపసంహారము)

ఇట్టి వైరాజ ఋతుసామోపాసన ఎరిగి ఉపాసించువారు ప్రజలు, పశుసంపద, బ్రహ్మవర్చసు, ఉత్తమ ఆయుష్షు, స్వయంజ్యోతి స్వరూపము, సుసంతానము, పశుసంతతితో గొప్పకీర్తిని పొందుచున్నారు.

**వైరాజ ఋతుమ్ న నిన్దేత్। తత్ వ్రతమ్।** ఋతువులను స్తుతించి ఆత్మోపాసన చేయాలి. అంతేగాని నిందించరాదు. ఇది వ్రతమై ఉండుగాక।

## 2-17. సప్తదశ ఖండము – శక్వరీ – లోకప్రతిష్ఠిత పంచవిధ సామ ఉపాసన

ఈ ఎదురుగా తారసబడుచున్న లోకమును సామోపాసన చేయటము గురించి.

(1) **పృథివీ 'హింకారో' : –** ఈ సమస్త పృథివి (All that is Solidly Visible) – "హింకారము"

(2) **అంతరిక్షం 'ప్రస్తావో।' –** ఆకాశము 'ప్రస్తావము'

(3) **ద్యౌః ఉద్గీథో :–** దేవతా (స్వర్గము మొ॥) లోకములు 'ఉద్గీథము'

(4) **దిశః ప్రతిహారో। : –** 10 దిక్కులు – ప్రతిహారము

(5) **సముద్రో నిధనమ్ : –** సముద్రము నిధనము

ఈ శక్వరీ సామగాన విధానము తెలిసి అనుష్ఠించువాడు పూర్ణమగు ఆయుష్షును, ప్రశస్తమగు జీవితమును, సత్–సంతానమును పశుసంపదను, కీర్తిని పొందగలడు.

**లోకాః న నిందేత్. ఇతి వ్రతమ్।** లోకములను ఉపాసించాలేగాని, నిందించరాదు. ఇది వ్రతము.

## 2-18. అష్టాదశ ఖండము – రేవతీ పంచవిధ సామోపాసన

(1) **అజా హింకారో। :–** జంతువులలో మేకలు – 'హింకారము'

(2) **అవయవః ప్రస్తావో। :–** గొర్రెలు – 'ప్రస్తావము'

(3) **గావ ఉద్గీథో।:–** ఆవులు – ఉద్గీథము

(4) **అశ్వాః ప్రతిహారః।–** గుఱ్ఱములు – ప్రతిహారము

(5) **పురుషో నిధనమ్ :–** పురుషుడు – నిధనము (పరిసమాప్తి)

ఈ 'రేవతీ పశు సామోపాసన'ను ఎరిగి ఉపాసించు యోగి – పశుసంపద, ఆయుష్షు యొక్క ఉత్తమ ప్రయోజనము, పూర్ణాయుర్దాయము, సత్సంతానము, ఉత్తమ పశుసంతతి, వంశవృద్ధి – ఇవన్నీ పొందగలరు.

**పశూన్ న నిన్దేత్। ఏతత్ వ్రతమ్।** పశువులు మనకు పాలు, వస్త్రములు మొదలైనవి ప్రసాదిస్తూ ఉన్నాయి కదా! అందుచేత పశువులను దూషించకూడదు.

## 2-19. ఏకోనవింశ ఖండము – "అంగ – యజ్ఞా–యజ్ఞీయ" పంచవిధ సామోపాసన

దేహములో నిత్య ప్రకాశిత – ప్రదర్శనమైయున్న ఆత్మ చైతన్యమును ఈ యజ్ఞా – యజ్ఞీయ సామోపాసనగా ఉపాసించెదరుగాక।

(1) **లోమ హింకారో।** 'వెంట్రుకలు 'హింకారము'।

(2) **త్వక్ ప్రస్తావో** చర్మము ప్రస్తావము।

(3) **మాగ్ంసం ఉద్గీథో।** మాంస విభాగము – ఉద్గీథము।

(4) **అస్థి ప్రతిహారో।** దేహము దహించిన తరువాత ఎముకలు తీసుకొని పోతారు కాబట్టి – ఎముకలు "ప్రతిహారము"

(5) **మజ్జా నిధనమ్।** ఎముకలలోని మెత్తటి మూలుగు విభాగము – చివరిది కాబట్టి – 'నిధనము'

ఈ విధంగా అంగ సంబంధమైన అంగ – యజ్ఞా–యజ్ఞీయ సామోపాసన ఎరిగి, భావనచే ఉపాసించువారు – ఉత్తమమైన దేహ ఇంద్రియ పుష్టి, పూర్ణాయుర్దాయము, సుసంతానము, పశుసంపద, కీర్తి పొందగలరు. సంవత్సర కాలము మజ్జ – మాంసములను తినకపోవటము వ్రతము। శాఖాహార జీవనము వ్రతమైయుండు గాక!

## 2-20 వింశ ఖండము - రాజన (ప్రకాశక) పంచవిధ సామదేవతా ప్రతిష్ఠోపాసన

ప్రకాశ రాజనమును ఈ విధంగా ఉపాసించెదరు గాక।

**(1)** **అగ్నిః హింకారో :-** దేవతల సమావయవ హింకారము మొదటిది. కాబట్టి అగ్ని - 'హింకారము'.

**(2)** **వాయుః ప్రస్తావమ్ :-** వాయువు ప్రస్తావము.

**(3)** **ఆదిత్య ఉద్గీథో :-** సూర్యుడు ఉద్గీథము.

**(4)** **నక్షత్రాణి ప్రతిహార :-** నక్షత్రములు ప్రతిహారము.

**(5)** **చంద్రమా నిధనమ్ -** చంద్రుడు - నిధనము.

ఈ రాజనము (ప్రకాశము) సామవేద దేవతలలో ప్రతిష్ఠితము అయి ఉన్నది.

**ఇట్టి రాజనము** (Enlightening/Firing) దేవతల ప్రతిష్ఠిత సామగానము తెలిసి ఉపాసించువారు - ఆయా అట్టి దేవతా లోకములలో సమానమైన ఐశ్వర్యమును, సాయుజ్యమును పొందుచున్నారు. పూర్ణాయుర్దాయము, గోసంపద, జన సంపద, ప్రశస్త జీవితము, ఉత్తమ జన-పశు సంతానము, కీర్తి పొందుచున్నారు.

**బ్రాహ్మణో న నిందేత్। తత్ వ్రతమ్।** బ్రహ్మజ్ఞులగు బ్రాహ్మణులను ఉపాసించాలి. నిందించకూడదు. ఇది 'వ్రతము'గా ఆచరించబడు గాక।

## 2-21 ఏకవింశ ఖండము - సర్వస్మిన్ పంచవిధ సామోపాసన

**(1) త్రయీ విద్యా హింకారః।** ఋక్ సామ యజుర్వేద విద్య 'హింకారము'.

**(2) త్రయ ఇమే లోకాః ప్రస్తావో।** ఈ పాతాళ - భూ-స్వర్గ త్రిలోకములు "ప్రస్తావము".

**(3) అగ్నిర్వాయు ఆదిత్యః స ఉద్గీథో।** అగ్ని - వాయువు- ఆదిత్యుల ఉపాసన - ఉద్గీథము.

**(4) నక్షత్రాణి వయాగ్ంసి మరీచయః ప్రతిహారం** నక్షత్రములు, పక్షులు, సూర్యకిరణములు ప్రతిహారము.

**(5) సర్పా గంధర్వాః పితరః తత్ నిధనమ్** సర్పములు, గంధర్వులు, పితృదేవతలు - నిధనము.

ఈ విధం 5 × 3 = 15 స్తుతులు మించిన సామ గానము మరింకొకటి లేదు.

ఈ వివరములు తెలుసుకొని ఉపాసించువారు - సర్వజ్ఞులు కాగలరు. 10 దిక్కులు అట్టి వానికి సహాయ కారకములు అవుతాయి.

**సర్వమస్మి - ఇతి ఉపాసీత। "ఈ సమస్తముగా ఉన్నది నేనే"** అని ఉపాసించెదరు గాక। **తత్ వ్రతమ్। తత్ వ్రతమ్।।**

## 2-22 ద్వావింశ ఖండము - వినర్ది వృణే సప్తవిధ సామోపాసన

వినర్ది - (శబ్దార్థము) = ఒక విశిష్టమైన స్వరము - ఎద్దు యొక్క శబ్దముతో సమానమైనది. సామము యొక్క 'వినర్ది' అనే గానము మరియు ఉపాసన గురించి ఇప్పుడు మనము చెప్పుకుందాము. పశువులకు (జీవులకు) ఇది శుభప్రదము హితకరము అయి ఉన్నది.

**(1)** **అగ్నే ఉద్గీథరో।** అగ్నికి సంబంధించినది ఉద్గీథము (పశువులకు ఆనందకరం).

**(2)** **అనిరుక్తః ప్రజాపతే।** ప్రజాపతికి సంబంధించినది ఉద్గీథము. అనిరుక్తము (సృష్టికర్త రూపము "ఇది" అని చెప్పలేము కాబట్టి 'అనిరుద్ధము').

**(3)** **నిరుక్తమ్ సోమస్య।** చంద్రునికి సంబంధించిన ఉద్గీథము "ఇది" అని నిర్వచించి చెప్పగలిగినది - 'నిరుక్తము'.

(4) **మృదుః శ్లక్ష్ణం వాయో (శ్లక్ష్ణం = Soft)।** వాయువుకు సంబంధించినది ఉద్గీథము మృదువు మరియు సరళము అయినట్టిది.

(5) **శ్లక్ష్ణం బలవత్ ఇంద్రస్య।** ఇంద్రునికి సంబంధించినది – సరళము మరియు బలముతో కూడినది.

(6) **క్రౌంచం బృహస్పతే।** బృహస్పతికి సంబంధించిన ఉద్గీథము – క్రౌంచ పక్షి (ఒకానొక జాతి కొంగ) యొక్క కూతను పోలి ఉంటుంది.

(7) **అవధ్యాంతం వరుణస్య।** వరుణుని గురించి అవధ్యాంతము. పగిలిన కంచు శబ్దముబోలినది ఈ వరుణ గానము విడచి పెట్టవలసినది.

ఈ విధమైన సామగానోపాసన నిర్వర్తించబడునుగాక। ఈ క్రింది విధంగా ఫలశ్రుతి చెప్పబడుతోంది.

- "అమృతత్వము కొరకై (To Cognise state beyond Death/Change) దేవతలను ఉపాసన చేస్తున్నాను।"
  నేను చేస్తున్న ఈ సామగానము వలన...,
- దేవతలకు అమృతత్వము,
- పితృదేవతలకు 'స్వాహా' – తర్పణములు,
- మానవులకు వారి వాంఛితములు,
- పశువులకు నీరు, గడ్డి,
- యజమానికి స్వర్గలోకము,
- నాకు శుభము, సుఖము, రుచికరము అగు ఆహారము లభించుటకై సమర్పిస్తున్నాను.

ఈ విధంగా భావన చేస్తూ అత్యంత శ్రద్ధతో గానము చేయుదురు గాక।

ఉద్గాథ గానము చేస్తూ ఈ విధంగా ప్రార్థన చేస్తూ ప్రారంభించెదరు గాక।

---

**సర్వేస్వరా ఇంద్రస్య ఆత్మానః – స్వరములన్నీ కూడా దేవేంద్రుని రూపములు**

**"యది స్వరేషు ఉపాలభేత్, ఇంద్రగ్ం శరణం ప్రపన్నో అభూవం।**
**స త్వా ప్రతివక్ష్యతి ఇత్యేనమ్" – బ్రూయాత్॥**

*"స్వరములన్నీ ఇంద్రుని ఆత్మస్వరూపమే! నేను ముందుగా దేవేంద్రుని భక్తితో శరణువేడి – గానమునకు ఉపక్రమిస్తున్నాను. కనుక ఇంద్రుడు నా స్వరములలోని దోషములు తొలగించెదరు గాక – ఎవ్వరైనా తప్పుపడితే "అయ్యా! ఇంద్రుని నేను శరణువేడాను. దోషములు చెప్పండి. అవసరమైనంతగా సరిచేసుకోగలను" – అని అనెదరుగాక।*

**సర్వ ఊష్మాణః ప్రజాపతేః ఆత్మానః।**
**అథ యద్యేనమ్ ఊష్మసు తథైవ ఉపాల భేత,**
**ప్రజాపతిం శరణం ప్రపన్నో అభూవం**
**స త్వా త్వాం ప్రతి ప్రేక్ష్యేతి। సంచూర్ణయిష్యతి**

*"ఊష్మములన్నీ సృష్టికర్తయగు ప్రజాపతి యొక్క ఆత్మయే".*

***ఊష్మములు = (1) గాలిని ఊదుచూ పలుకు – వర్ణములు (2) "శ ష స హ" అను వర్ణములు (3) 'అనుస్వారము' (బిందువు; సున్న, విణ – స్వరమును అనుసరించి వచ్చేవి).*** *ఊష్మముల తప్పులు దొర్లకుండా ప్రజాపతిని శరణు వేడెదరు గాక। ఎవ్వరైనా "మీ ఊష్మములు తప్పులు" – అని అంటే మేము ప్రజాపతిని శరణు వేడాము, వారే సమాధానం. తప్పులుంటే సరిచేసుకుంటాము" – అనెదరు గాక।*

**సర్వే స్పర్శాః మృత్యో ఆత్మానస్తం।**
**యది ఏనగ్ం స్పర్శేషు ఉపాలభేత – "మృత్యుగ్ం శరణం ప్రపనో అభూవం।**
**సత్వాప్రతిధక్ష్యతి– ఇత్యేనం బ్రూయాత్**

*స్పర్శలన్నీ (వర్ణాక్షరములన్నీ) మృత్యుదేవత యొక్క ఆత్మ (వర్గములు (1) 'క'వర్గము – క–ఖ–గ–ఘ–ఙ*
*(2) 'చ'వర్గము = చ–ఛ–జ–ఝ–ఞ (3) 'ట'వర్గము – ట–ఠ–డ–ఢ–ణ*
*(4) 'త' వర్గము = త – థ – ద–ధ–న (5) 'ప' వర్గము = ప– ఫ – బ –భ – మ*
*వర్గ యుక్కులు = వర్గము నందలి రెండు – నాలుగు వర్ణములు. ఇవే 'మహాప్రాణములు'*
*"ఖ–ఘ–ఛ–ఝ–ఠ–ఢ–థ–ధ–ఫ–భ)*
*మృత్యుదేవతకు నమస్కరించి వీటి ఉత్తమ ఉచ్చారణ సంపాదించుకొంటున్నాము. ఎవరైనా తప్పుపడితే "మృత్యుదేవతను ప్రార్థించాము. పొరపాట్లు సరికాగలవు" – అని చెప్పాలి.*

సమస్త స్వరములకు (అచ్చులను; స–రి–గ–మ–ప–ద–ని లను) బలముగా, సుశబ్దంగా, నిర్దుష్టంగా భావయుక్తంగా పలికెదరు గాక।

"త్రిలోక పాలకుడగు ఇంద్రునకు సుశబ్దయుక్తమగు ఉత్తమ పరిపాలనకు శక్తి కలుగును గాక"– అని ఉష్మాణములు ఎలుగెత్తి, అగ్రములుగా, అనిరస్తములుగా, వివృత్తములుగా భావయుక్తంగా పలికెదరు గాక. స్పష్టముగా, నిర్దుష్టముగా స్వరములు (హల్లులు మొదలైనవి) పలుకుటచేత పరిపాలించువారి వలన ప్రజలకు శుభము సిద్ధించు ప్రయోజనము లభించగలదు.

**ప్రజాపతేః ఆత్మానం పరి దదాని – ఇతి సర్వే స్పర్శాః –** "విరాట్టు అగు ప్రజాపతికి ఆత్మసమర్పణము చేయుచున్నాను" అని భావించి స్పర్శలను నిదానంగా పలకాలి. ఆయా అక్షరములు ఒకదానితో మరొకటి కలిసిపోకుండాను, భావయుక్తంగాను విడివిడి చేస్తూ పలకాలి.

పై విధములైన ఉపాసనలచే, అట్టి గానము చేయువాడు మృత్యు పరిధులను జయించి వేయగలడు. **మృత్యోః ఆత్మానం పరిహరాణీతి॥**

## 2-23 త్రయోవింశ ఖండము – "ధర్మము" యొక్క త్రయా స్తంభములు

"ధర్మము"నకు స్కందములు (ఆధార స్తంభములు) మూడు.

(1) యజ్ఞము = అధ్యయనము – దానము. ఇవి నిర్వర్తించువాడు గృహస్థుడు.
అగ్నికార్యములు, వైదిక కర్మలు – వేదమంత్రముల అభ్యాసము. అర్థవిచారణ

(2) తపస్సు = సత్యము, నిత్యము అయిన దాని గురించి 'తపన'.

(3) బ్రహ్మచర్యము = ఆచార్యకుల వాసము (గురుకులవాసము)

గురుకులవాసములో బ్రహ్మచారి ఆచార్యులవారిని సేవిస్తూ విద్యనేర్పటము – గొప్ప ఉపాసన అయి ఉన్నది. ఆచార్య సేవనముచే పుణ్యలోక ప్రాప్తి, బ్రహ్మలోక నివాసము, బ్రహ్మదేవుని సామీప్యము, అమృతత్వము లభించగలదు.

**బ్రహ్మ సంస్థో అమృతత్వమేతి।**

## సృష్టి చమత్కారము – ఓంకారమేవ ఇదగ్ం సరమ్।

ప్రజాపతి "లోకములను నేను సృష్టించెదను గాక।" అని సంకల్పము కలవాడై, అందుకొరకై తపస్సు చేయసాగారు.

- తపస్సు చేసి లోకములను సృష్టించారు.
- లోకములకొరకై త్రయో విద్యలగు ఋక్ – యజుర్ – సామ వేదములు సృష్టించారు.

- అట్టి త్రైయీ వేదముల నుండి "భూః" 'భువః' "సువః" (Matter - Thought - Divine workers of the Universe) అను అక్షర తత్త్వములు / వ్యాహృతులు (Parmanent platforms) ఆవిర్భవించాయి. అట్టి త్ర్యక్షరములకు (త్రివ్యాహృతులకు) అభిముఖుడై మరల తపస్సు చేసారు. అట్టి ధ్యానము నుండి ఎదురుగా "ఓంకారము" ఆవిర్భవించింది.

**తత్ యథా శంకునా సర్వాణి పర్ణాని సంతృణ అన్యేవ 'ఓం'కారేణ 'వాక్'సంతృణ।** ఒక ఆకులో ఈనెలు, ఆ ఈనెల వెంట ఈనె-ఉప ఈనెలతో విస్తరించు తీరుగా 'ఓం'కారము వాక్కుగా (సమస్త అక్షర-శబ్ద-వాక్య-వాఙ్మయముగా) విస్తరించినది.

"ఈ సమస్తము - ఓంకారమే"

**"ఓం కార ఏవ ఇదగ్ం సర్వమ్"**

## 2-24 చతుర్వింశ ఖండము - యజ్ఞాంగములు : సామగానము -హోమము

**మంత్రము - ఉత్థానములు: "బ్రహ్మతత్త్వము"** ఎరిగిన బ్రహ్మజ్ఞులు బ్రహ్మయజ్ఞము గురించి ఈ విధంగా విభజిస్తూ విశదీకరించి చెప్పుచున్నారు.

**యత్ వసూనాం ప్రాతఃసవనగ్ం -** ప్రాతః సమయంలో (Early in the morning): వసువులను (That which is present - అందరిలో వసించు దేవతారూపము)ను ఉపాసించెదరు గాక! **- ఈ దృశ్య ప్రపంచము వసువుల వశము.**

**రుద్రాణాం మధ్యన్దివగ్ం సవనగ్ం।** మధ్యాహ్న సమయంలో సమస్తముపై తన తేజస్సును ప్రసరింపజేయు - రుద్రుడు ఉపాసనా దైవము। **అంతరిక్షము రుద్రుల వశము.**

**ఆదిత్యానాం చ, విశ్వేషాం చ, దేవానామ్ చ తృతీయం సవనగ్ం।** ఆదిత్యుడు, విశ్వేదేవుడు మాదవ (సాయం) సవన - ఉపాస్యులు, **దేవతాలోకము వారికి వశమై ఉంటోంది.**

ఈ విధంగా పురుషుడు యజ్ఞము చేయువాడు, భూ-ఆకాశ -స్వర్గ లోకములు ఉపకరణములుగా భావించి యజ్ఞము చేస్తున్నాడు.

మరి యజ్ఞకర్త ఆశయముగా కలిగి ఉండవలసిన లోకము ఏది? క్వ తర్హి యజమానస్య లోక ఇతి? తాను ఏ లోకము ఆశయముగా కలిగి ఉండాలో, అది తెలియనప్పుడు ఏ తెలివిగలవాడైనా యజ్ఞము ఎందుకు నిర్వర్తిస్తాడు? **స యస్తం న విద్యాత్, కథం కుర్యాత్ అథ విద్వాన్ కుర్యాత్?**

***తాను పొందవలసినది - "తానున్న చోటే! తన స్వస్వరూపము యొక్క సహజమగు అఖండత్వ, అప్రమేయత్వ, నిత్యత్వ, సత్యత్వముల యొక్క స్వాభావిక అనునిత్య స్వానుభవ సిద్ధియే సమస్త యజ్ఞముల యొక్క పరాకాష్ఠ ప్రయోజనము.***

యజ్ఞ విధులలో

**(1) ప్రాతః సవన - వసువుల స్తుతి**

**ఉదయ శస్త్రము** - ఉదయ సవనము (శస్త్రము=గానముగా చేయని, మంత్రయుక్తంగా మాత్రమే చదివే ఋక్) (Non-musical chanting)ను పఠిస్తున్నారు.

అట్టి ప్రాతారనువాకము ప్రారంభించటానికి ముసు-ముందుగానే - యజమాని "గార్హపత్యాగ్ని"కి వెనుకగా ఉత్తరాభిముఖం (Facing North)గా కూర్చొనుగాక! ఆ యజమాని (యజ్ఞకర్త) వసువులను అధిష్ఠాన దేవతలుగా గల సామగానము చేయాలి.

ఈ విధంగా అగ్నిదేవుని స్తుతించాలి.

**లోక ద్వారమ్ అపావార్ణూ పశ్యేమ।**
**త్వా వయగ్ం రా। హు। మ్।**
**ఆ! జ్యా! యో! ఆ! ఇతి॥**

**ఓ అగ్ని దేవా! మేము ఈ చోటనే బ్రహ్మమును స్వానుభవము చేసుకోదలచాము. కనుక ఈ లోకమునకు ద్వారమును తెరువండి। భూలోకరాజ్యము (భౌతిక ప్రపంచము/ ఈ దృశ్య ప్రపంచము)నందు మీ యొక్క తేజోరూపమే (కనులు తెరిచి, మూసి కదా) దర్శించెదము గాక।**

అప్పుడు యజ్ఞకర్త (యజమాని), ఆహుతులను సమర్పించాలి. సమర్పిస్తూ, ఇంకా ఇట్లా స్తుతించాలి. (హోమము చేస్తూ, చేసిన తరువాత ప్రార్థన)

**శ్లో॥ అథ జుహోతి। నమో అగ్నయే**
**పృథివీ క్షితే। లోక క్షితే।**
**లోకం మే యజమానాయ। విన్ద ఏష వై**
**యజమానస్య లోక ఏతాఽస్మి॥**

యజమాని (మరియు) యజ్ఞమునందు పాల్గొనుచున్నవారు - ఇట్లా గానం చేయాలి! భూమిలోను, లోకమంతా తేజోరూపులై, ప్రకాశమానులై వేంచేసియున్న ఓ అగ్ని భగవాన్! మీకు నమస్కరిస్తున్నాము. ఈ ఆహుతులను సమర్పిస్తూ హోమము చేయుచున్నట్టి మాకు విశ్వమును తేజోమయం చేస్తూ దర్శనము ప్రసాదించండి. ఈ యజ్ఞము చేయుచున్న మా కొరకు ఈ స్థానమునకు "దివ్య ప్రసాద సంకల్పులై' వేంచేయండి। యజమానినగు నాకు దర్శనమివ్వండి। అనుగ్రహించండి. ఈ యజ్ఞములో పాల్గొనుచున్న జనులందరికీ శుభ శాంతి ఐశ్వర్య ఆనందములు ప్రసాదించండి.

"ఓ అగ్నిదేవా!"

(యజ్ఞమునకు) యజమానినగు నేను ఆయుర్దాయము కొనసాగునంత వరకు నా యొక్క సమస్త కార్యక్రమములు తేజోస్వరూపుడగు మీకు ఆహుతులుగా సమర్పిస్తూ ఉంటాను. "స్వాహా" - అని ఘృతము (నేయి) సమర్పిస్తూ ఉన్నాను. లోకము యొక్క మూసిన ద్వారమునకు ఉండే 'అడ్డగడియ'ను తొలగించండి।"

ఈ విధంగా ప్రాతః సవనము (Early Morning Yagna Programme)చే సామ-మంత్ర-హోమ ఉత్థానములను సమర్పించబడు గాక। అప్పుడు వసువులు యజమాని కొరకై ప్రాతః సవన దివ్య ప్రయోజనము ప్రసాదించగలరు.

"ఈ స్థానము యొక్క ద్వారములోనే" - అని మేల్కొని చెప్పుచున్న స్తుతికి వసువులు ఆయా కోరుకొన్న ప్రయోజనములు సిద్ధించగలరు.

### (2) యజ్ఞ విధులలో మధ్యందివస (మధ్యాహ్న) సవనము - రుద్రస్తుతి

**శ్లో॥ పురా మధ్యన్ దినస్య సవనస్య ఉపాకరణాత్**
**జఘనేన అగ్నీ ధ్రీయస్య ఉదఙ్ముఖ ఉపవిశ్య**
**స రౌద్రగ్ం సామాభిగాయతి।**

మధ్యాహ్న యజ్ఞ విధిని ప్రారంభించటానికి ముందుగా దక్షిణాగ్ని (ధ్రియాగ్ని)కి ప్రక్కగా ఆసీనుడు అవాలి. ఉత్తర దిక్కుగా చూచుచూ రుద్రుల గురించి సామగానము చేసెదరు గాక!

**శ్లో॥ లోక ద్వారమ్ అపావార్ణూ। పశ్యేమ।**
**త్వా వయం వైరా హుమ్**
**ఆ। జ్యా। యో। ఆ। ఇతి॥**

ఆకాశములో స్వేచ్ఛగాను, ప్రాణప్రదాతగాను, హాయిగాను సంచారములు చేస్తున్న ఓ వాయుదేవా! మీకు నమస్కారము. ఈ లోకము యొక్క (భువః యొక్క) ద్వారమును తెరవండి. 'విరాట్ పదము' కొరకై మిమ్ములను దర్శించుచున్నాము. ఆహుతులు ఇస్తూ ఉపాసిస్తున్నాము.

**శ్లో॥ అథ జుహోతి। నమో వాయవే! అంతరిక్ష క్షితే।**
**లోకక్షితే। లోకం మే యజమానాయ విన్ద ఏష వై యజమానస్య లోక ఏతాఽస్మి॥**

యజమాని హోమము చేస్తూ, ఆహూతులను సమర్పిస్తూ చేసే ప్రార్థన. ఓ వాయుదేవా! నమో నమో నమో నమః. అంతరిక్షమునందు నివాసము కలిగి అంతరిక్షమంతా సంచారములు చేస్తున్న మీకు నమస్కారము. ఇక్కడ యజ్ఞములో మధ్యందివస కార్యక్రమము ప్రారంభించబోవుచున్నాను. ఇక్కడికి రండి! లోకగతుల గురించిన విజయము నాకు ప్రసాదించండి.

**అత్ర యజమానః పరస్తాత్ ఆయుషః స్వాహా।**
**"అపజహసి పరిఘమ్" ఇతి ఉక్త్వ, ఉత్తిష్ఠతి।**
**తస్మై "రుద్రా మాధ్యందినగ్ం సవనగ్ం" సంప్రయచ్ఛంతి।।**

"ఈ యజ్ఞ కార్యక్రమమునకు యజమానినగు నేను ఆయుర్దాయము ఉన్నంతవరకు సమస్త కార్యక్రమములను మీకు హోమద్రవ్యములుగా సమర్పిస్తున్నాము. మేము సమర్పిస్తున్న సమస్తము స్వీకరించండి. ఈ లోక సంబంధమైన అడ్డగడియలను తొలగించండి".

ఈ విధంగా పలికి యజమాని పైకి లేచి నిలబడి రెండు చేతులు జోడించి రుద్రుల కొరకు "రుద్రా మాధ్యందినగ్ం సవనమ్"ను భక్తి పూర్వకంగా సమర్పించాలి. ఆ తరువాత మధ్యాహ్న యజ్ఞ కార్యక్రమమును కొనసాగించును గాక!

**(3) యజ్ఞ విధులలో తృతీయ-సాయం- ఆదిత్య విశ్వేదేవ సవనము**

**శ్లో।। అథ జుహోతి।నమ ఆదిత్యేభ్యశ్చ। విశ్వేభ్యశ్చ।**

**దేవభ్యో దివిక్షిత్భ్యో। లోక క్షిత్భ్యో।**

సాయంకాల హోమము ప్రారంభిస్తూ యజమాని ఈ విధంగా ప్రార్థన చేయును గాక!

ద్యులోకవాసులగు ద్వాదశాదిత్యులారా! విశ్వేదేవా! మీకు నమస్కరించుచున్నాను. యజ్ఞము చేస్తూ ఉన్న నా కొరకు ఇక్కడికి వేంచేయండి. నాకు లోకజయము ప్రసాదించండి.

**"ఏష వై యజమానస్య లోక ఏతా అస్మి।**

**అత్ర యజమానః పరస్తాత్ ఆయుషః స్వాహా। అపహత పరిఘమ్!"**

**ఇతి ఉక్త్వా ఉత్తిష్ఠతి।**

"ఈ లోకములో ఈ యజ్ఞమునకు యజమానినై ఈ కార్యక్రమము సమర్పణగా సాయం సవనము ప్రారంభిస్తున్నాము. ఈ సమస్త యజ్ఞవిధులను హోమముగా సమర్పిస్తున్నాము. ఓ ఆదిత్య దేవతలారా! ఓ విశ్వేదేవా! (O! Worker of the Universe!) ఈ లోక పరిమితములు అడ్డగడియలు తెరవండి!" అని పలుకుచూ పైకి లేచును గాక!

**తస్మా ఆదిత్యాశ్చ విశ్వే చ దేవాః "తృతీయ సవనగ్ం" సంప్రయచ్ఛన్తి। ఏష వై యజ్ఞస్య మాత్రాం వేద। య ఏవం వేద। య ఏవం వేద।**

స్వర్గభూములలో నివసించు ఆదిత్య, విశ్వేదేవతలకు ఈ విధంగా ఆరాధన సమర్పిస్తూ యజమానినగు నాకు స్వర్గ లోక ద్వారములు తెరువండి। ఇదియే స్వర్గ ద్వారము. "స్వాహా"! అని పలుకుచూ లేచి హోమద్రవ్యము సమర్పిస్తూ ఉండగా – ఆదిత్యులు, విశ్వేదేవతలు వేంచేసి యజ్ఞ ఫలమును యజమానికి, ప్రసాదిస్తున్నారు. ఇది ఎరిగి యజమాని సాయం సవనములను కొనసాగించును గాక!

**ఇతి సామ వేదాంతర్గత ఛాందోగ్యోపనిషత్**

**ద్వితీయ అధ్యాయః సమాప్తః**

# ఛాందోగ్యోపనిషత్
# 3. తృతీయ అధ్యాయము

## 3-1. ప్రథమ ఖండము - మధు విద్య - ఆదిత్య తూర్పు దిక్ కిరణములు - సామోపాసన

ఈ సృష్టి అంతా పరమాత్మ యొక్క మాధుర్య రూపము. ("మధురాధిపతేః సర్వమ్ మధురమ్।" అని శ్రీకృష్ణ తత్త్వము గానము చేస్తాము కదా!)

2వ అధ్యాయము చివరలో యజ్ఞము యొక్క చతురంగములైనట్టి సామ-హోమ-మంత్ర-ఉత్థాన సంబంధమైన త్రికాల ప్రారంభ సవనములు చెప్పబడినాయి. వాటి యొక్క విశేష ఫలములు కూడా చెప్పుకున్నాము.

ఇప్పుడిక కర్మసాక్షి, కర్మఫల ప్రదాత అగు ఆదిత్యుని శోభ మాధుర్యముల గురించి (ఇంకా) సృష్టి యొక్క మాధుర్యమును గమనిస్తూ, ఉపాసిస్తూ సృష్టికర్తతో **"అనన్యత్వము"** సిద్ధించుకోవటము గురించి చెప్పుకోబోవుచున్నాము.

❖ ❖ ❖

**ఓం! అసౌ వా ఆదిత్యో దేవ మధు।** (ఎదురుగా కనిపిస్తున్న) ఈ ఆదిత్యుడు మానవులకు, సర్వజీవులకు, దేవతలకు ఆనందము కలిగిస్తూ ఉన్నారు. అందుచేత ఆదిత్యుడు దేవతలకు 'తేనె' వంటివారు.

ఆయన సకల యజ్ఞముల ఫలరూపము. ఆదిత్య లోకమే ఉత్తమ యజ్ఞఫలము.

***దేవతలకు మధువు "ఆదిత్యుడు".***

**అట్టి ఆదిత్యునికి ద్యులోకము** తేనెపట్టు వ్రేలాడు అడ్డముగా ఉండే వెదురు కట్టె (తిరశ్చీనము)! **ద్యౌరేవ తిరశ్చీనవగ్ంశమ్।**

**అంతరిక్షము** - వ్రేలాడు తేనెపట్టు. **అంతరిక్షమ్ ఆపూపో।**

**సూర్యకిరణములు** - తేనెటీగల సంతానములు. **మరీచయః పుత్రాః।**

**సూర్యుని తూర్పువైపు కిరణములు** - తూర్పువైపు తేనెపట్టు మధునాడ్యములు (తేనెపట్టు అరలు), తేనె నిలువ ఉండే నాడులు.

**ఋగ్వేదములోని ఋక్కులు** - తేనెటీగలు.

**ఋగ్వేదము** - తేనెటీగలు తేనె రసమును పీల్చి తెచ్చే **"పుష్పము"** - ఋగ్వేదము నియమించు కర్మలు, ఉపాసనలు పుష్పములు వంటివి.

**అమృతము (జనన-మరణ రహితమగు స్వస్వరూప నిశ్చల - సుస్థిరానుభవము)** - ఆ తేనె పట్టులోని తేనె (మధు)

**కీర్తి, ప్రకాశము, ఇంద్రియ బలము, వీర్యము, భుజించుటకు ఆహారము లభ్యమవటము మొ॥వి** - రసము పొంగిపోవటము.

అట్టి అమృతరసము (హృదయము నుండి) విశేషముగా బయల్వెడలి ఆదిత్యునికి అభిముఖంగా ఆశ్రయించినదై ఉంటోంది.

**తత్ ఆదిత్యగ్ంస్య రోహితగ్ం రూపమ్।** ఆ విధమైన రసము సూర్యుని చుట్టూ రూపుదిద్దుకొనటముచే సూర్యబింబము ఉదయము అరుణ రూపము వలె కనిపించగలదు.

---

## 3-2. ద్వితీయ ఖండము - ఆదిత్య దక్షిణ దిక్ కిరణములు - సామోపాసన

**సూర్యుని దక్షిణ దిక్కు కిరణములు** → తేనె పట్టు యొక్క దక్షిణము వైపు 'తేనె' నిలువ ఉండ గల నాడులు తేనెపట్టు యొక్క దక్షిణ నాడ్యములు. (నాడ్యములు = Bits wherein Honey gets preserved).

**యజుర్వేద 'యజస్సులు' అనబడే యజుర్వేదమంత్రములు** - తేనెటీగలు.

**యజుర్వేదము** - తేనెటీగలు తేనెను తెచ్చే పుష్పము.

**అమృతజలములు** - ఆ నాడ్యములలోని తేనె.

యజుర్వేద మంత్రముల గానము 'యజుర్వేదము' అనే తేనె తుట్టెకు 'వేడి' కలుగజేస్తోంది. అట్టి వేడి (Boiling) చేసిన 'యజుర్వేదము' అనే తేనెతుట్టె నుండి కీర్తి, తేజస్సు, ఇంద్రియములు, వీర్యము, అన్నాద్యములు ఇవన్నీ రసరూపంగా జనిస్తున్నాయి.

అట్టి యజుర్వేదగాన అమృతరసము – (అట్టి వేదగాన అభ్యాసి నుండి) – బయల్వెడలి ఆదిత్యుని ఆశ్రయిస్తున్నాయి. అదియే ఆదిత్యునిలో కనిపించే – **"శుక్లగ్ం రూపమ్"** – తెల్లటిరూపము (మధ్యాహ్న సూర్యుడు)

## 3-3 తృతీయ ఖండము – ఆదిత్య పడమర దిక్ కిరణములు – సామోపాసన

సూర్యుని పడమర దిక్కు కిరణములే – "తేనెపట్టు' యొక్క పడమర వైపు తేనె నిలువ ఉండే నాద్యములు.

సామగానములు = తేనే టీగలు
సామవేదము = పుష్పము

ఆ సామవేద పుష్పముపై తేనెటీగలు తెచ్చే జలములే 'అమృతము' అనబడే తేనె రసము. అట్టి సామ మంత్రముల పఠనముచే సామవేదము 'అనే' తేనెతుట్టె ఉష్ణము పొంది – ఆ గానము చేయువానికి కీర్తి, తేజస్సు, బలమైన ఇంద్రియములు, వీర్యము, అన్నాద్యము – ప్రసాదించగలవు.

అట్టి **"గాన (పఠన) విశేషము"** అనే రసము ఆదిత్యుని అభిముఖముగా ఆశ్రయిస్తున్నాయి. ఆదిత్యునియందు నల్లని రంగుగా అలంకారము అగుచున్నాయి.

## 3-4 చతుర్ధ ఖండము – ఆదిత్య ఉత్తర దిక్ కిరణములు – సామోపాసన

సూర్యుని ఉత్తర దిక్కు వైపు ప్రసరించు కిరణములు – తేనెపట్టు యొక్క ఉత్తరము వైపు తేనె నిలువ ఉండే నాద్యములు (ఉదీచీ మధు నాద్యములు) (నాద్యము = Bits wherein Honey is getting preserved).

అథర్వణ వేదమంత్రములు – తుమ్మెదలు.

ఇతిహాస పురణములు – ఆ తుమ్మెదలు వ్రాలే పుష్పము అథర్వణ వేదము. ఇతిహాస పురాణములు అధ్యయనము చేయుటచే జనించే "కీర్తి తేజస్సు, ఇంద్రియ బలము, వీర్యము, అన్నాద్యము" అనే రసము పుట్టుచున్నది. 'అట్టి రసము' అనే తేనె సూర్యునికి అభిముఖమై సూర్యుని యందు నీలపు రంగుగా అగుచున్నది.

## 3-5 పంచమ ఖండము – ఆదిత్య ఊర్ధ్వ దిక్ కిరణములు – సామోపాసన

- సూర్యబింబము (సూర్యదేవుని) నుండి ఊర్ధ్వము వైపు కిరణములే తేనెతుట్టె యొక్క ఊర్ధ్వమున (Upper Side) గల మధు నాధ్యములు.
- రహస్యములగు తాత్త్వికమగు ఆదేశములు – తేనెటీగలు.
- 'ఓం'కారము (ప్రణవము) – ఆ తేనెటీగలు తేనెకొరకై వ్రాలు పుష్పము.
- అమృతమ్ – ఊర్ధ్వనాడులలోని జలము (తేనె)

రహస్య బోధలు అమృతమును ఆలింగనము చేస్తున్నాయి. అట్టి ఆలింగనము వలన – రసము, కీర్తి, అవయవముల బాహ్య సౌందర్యము, ఇంద్రియముల ప్రత్యుత్సాహము, వీర్యము, భుజించటానికి ఆహారము కలుగుచున్నది.

అట్టి ఊర్ధ్వము వైపు జనించిన అమృతరూపమగు మధువు పొంగి పొరలి సూర్యుని చుట్టూ రూపము దిద్దుకుంటోంది. అదియే సూర్యమండలములో మధ్యభాగమున 'క్షోభ' వలె కనిపిస్తోంది.

ఆ మధునాద్యములే రసములు।
వేదములే ఆ రసములు।

ఇవన్నీ వేదామృతములు. మధు నాధ్యములన్నీ మధువు యొక్క అమృతమే।

***వేదములన్నీ నాద-తాత్త్వీక మధువు యొక్క అమృతమే.***

# 3-6. షష్ఠి ఖండము - ఆదిత్యామృతము - ఆదిత్యుని మొదటిదగు ఎరుపు రంగు రూపము

ఇంతవరకు మనము "అమృతమును సూర్యుని ఆశ్రయించటములో" - "ఎరుపు", "తెలుపు", "నలుపు", "నీలము" మొదలైన ఆదిత్యుని రంగులకు కారణమగుచున్న "చతుర్వేద-పురాణ - ఇతిహాస సారము" - అను మధుతత్త్వము గురించి చెప్పుకుంటూ వస్తున్నాము. ఇంకా ఉపాసన విధిగా మరికొన్ని విశేషాలు చెప్పుకోబోవుచున్నాము.

[ వసువుల భోగ కాలమునకు రెట్టింపు రుద్రుల భోగ కాలము. దానికి రెట్టింపు ఆదిత్యులది. దానికి రెట్టింపు మరుత్తులది. దానికి రెట్టింపు సాధ్యులది. (ఇది కాక) సూర్యుడు మేరు పర్వతము చుట్టూ ప్రదక్షిణము చేస్తున్నప్పుడు - దిక్కులు తారుమారు అవుతాయి. ఈ రెండు పౌరాణిక విశేషాలు ఇక్కడ (బహుశా) దృష్టాంతము కొరకు తీసుకొనబడుచున్నాయి]

**ఆదిత్యుని మొదటిదగు 'ఎరుపురంగు' (అరుణ) లక్షణము గల అమృతము**

అమృతమునకు నాయకుడు అగ్నిదేవుడు

ఆధారపడి జీవించువారు / అనుభవముగా పొందువారు / భుజించువారు వసువులు.

దేవతలు అవి భుజించరు. **ఏత దేవా అమృతం దృష్ట్వా తృప్యంతి।** వారు ఆ రూపములలో (ఎరుపు రంగులో) లీనమగుచున్నారు. ఆ రూపములో మునిగి తృప్తి కలిగి ఉంటున్నారు. ఆ రూపము వలననే ఉద్యమిస్తూ ఉంటారు.

(దేవతలు = ఇంద్రియములు. ఇంద్రియములు స్వయముగా ఏదీ అనుభవించవు)

ఎవరు ఈ విషయము తెలిసికొనుచున్నారో -

→ వారు వసువుల రూపము పొందుచున్నారు.

→ అగ్నిని తమ నాయకునిగా రక్షణ పొందుచున్నారు.

→ అమృతపానము (దర్శనము)చే తృప్తి పొందుచున్నారు.

→ ఆదిత్యుని రూపములో లీనమై, ఆ రూపమునే పొందుచున్నారు.

→ అట్టివారు సూర్యుడు తూర్పున ఉదయించి, పడమర అస్తమించునంత కాలము వసువుల ఐశ్వర్యము పొందుచున్నారు. ఆధిపత్యము, స్వారాజ్యము ఆస్వాదించుచున్నారు.

---

# 3-7. సప్తమ ఖండము - ఆదిత్యామృతము - ఆదిత్యుని రెండవదగు శుక్ల రూపము

***సూర్యునిలోని శుక్ల (తెలుపు) అమృతరూపమునకు :-***

నాయకుడు = ఇంద్రుడు.

అనుభవించువారు = రుద్రులు.

(ఇంద్రియ) దేవతలు భుజించరు. త్రాగరు. చూచుచూ తృప్తి చెందుతూ ఉంటారు. వారు ఆ 'తెలుపు' రూపములో లీనమై ఉంటారు.

ఇది ఎరిగినవారు...

- రుద్రులలో ఒకరు కాగలరు.
- ఆదిత్యునిలో తెలుపు రూపము పొందుచున్నారు.
- ఇంద్రుడు వారికి నాయకుడు కాగా, దేవతలవలె అమృతపానము చూచినంత మాత్రంచేత తృప్తి పొందగలరు.

సూర్యుని ఉదయాస్తమయములు జరుగుచున్నంత వరకు అద్దానికి రెట్టింపు (2 times) కాలము (లేక)

సూర్యుడు దక్షిణ దిక్కులో ఉదయించి ఉత్తర దిక్కులో అస్తమించునంతకాలము...,

రుద్రుల ఐశ్వర్య భోగములు అనుభవించుచుండగలరు.

## 3-8. అష్టమ ఖండము - ఆదిత్యామృతము - ఆదిత్యుని మూడవదగు నల్లని రూపము

**సూర్యునిలోని నల్లని రూపమే మూడవ అమృతమునకు -**

నాయకుడు = (చంద్రుడు) వరుణుడు

అమృతము అనుభవించువారు = ఆదిత్యులు

దేవతలు మాత్రం పై విధంగానే భుజించక, పానము చేయక చూచుచూ తృప్తి చెందుచున్నారు. వారు ఆ మూడవ అమృతము పొందుచున్నారు.

ఇది ఎరిగినవారు - ఆదిత్యులలో ఒకడు అగుచున్నారు. వరుణుడు వారికి నాయకుడు (రక్షకుడు) అగుచున్నారు.

దేవతలు తినక, త్రాగక - చూచుచూ తృప్తిపొంది ఉంటున్నారు.

అట్టి వివరణ ఎరిగినవాడు - ఆదిత్యులలో ఒకడై, వరుణుడు రక్షించువాడై, అమృత దర్శనముచే తృప్తి పొంది ఉంటున్నాడు. ఆదిత్యులలో ఒకడై

(1) ఆదిత్యులతో సమానమైన సంపదను - సూర్యుడు దక్షిణము ఉదయించుచు ఉత్తర దిక్కులో అస్తమించునంత కాలము (లేక) రెండు అంతలు;

(2) సూర్యుడు పడమట ఉదయించి తూర్పు దిక్కులో అస్తమించునంత కాలము ఆదిత్యులలో సమానమైన దేవభోగములు, సంపదలు అనుభవించుచున్నారు.

---

## 3-9. నవమ ఖండము-ఆదిత్యామృతము-నాలుగవదగు అమృతము-ఆదిత్యుని నీలపు రంగు రూపము

**సూర్యుని నీలపు నాలుగవ అమృతరూపమునకు** "సోముడు" నాయకుడు. ఆ అమృతమును "మరుత్తులు" అనుభవించువారు. దేవతలు భుజించరు, త్రాగరు. అభిముఖులై చూచి తృప్తిచెందుచున్నారు. లీనమై ఉంటున్నారు. ఇది ఎరిగినవారు మరుత్తులలో ఒకరు అయి మరత్తులతో సమానమైన సంపద అనుభవించగలరు.

(1) పడమట దిక్కు ఉదయము - తూర్పు దిక్కు అస్తమయము, దానికి రెట్టింపు కాలము

(2) ఉత్తర దిక్కులో ఉదయించి - దక్షిణ దిక్కులో అస్తమించు కాలము

అంతకాలము మరుత్తుల సంపద - ఆనందములు పొందగలరు.

## 3-10. దశమ ఖండము - ఆదిత్యామృతము - ఐదవదగు అమృతము - ఆదిత్యుని అంతరామృత రూపము

సూర్యుని లోపలగా గల 'అమృతము' 5వది .

ప్రధానుడు - ప్రజాపతి.

అనుభవము పొందువారు - సాధ్యులు.

దేవతలు ఈ అమృతమును దర్శించుచూ తృప్తులై ఉంటున్నారు. తినరు, త్రాగరు, అభిముఖులై ఆనందిస్తూ ఉంటారు.

ఇట్టి ఉపాసన చేయువాడు సాధ్యులలో ఒకడై, ప్రజాపతి తన రక్షకుడుగా కలిగి ఉంటారు. అమృతము వైపు అభిముఖుడై తృప్తుడౌతారు. సాధ్యుల రూపుడై ఉద్యమిస్తూ ఉంటారు.

(1) ఎంతకాలము ఆదిత్యుడు ఉత్తరమున ఉదయించి దక్షిణమున అస్తమిస్తాడో... - దానికి రెట్టింపు కాలము

(2) పై వైపు ఉదయించి క్రింద వైపు అస్తమించుకాలము

.... సాధ్యుల ఆనందము, స్వయం ప్రకాశత్వము పొంది ఉండగలరు.

# 3-11. ఏకాదశ ఖండము : మధు జ్ఞానము ఫలశ్రుతి

పై విధమైన ఉపాసనలు ఎరిగినవాడు, నిర్వర్తించువాడు క్రమంగా సమస్తమునకు పైన (ఊర్ధ్వుడై), స్వస్వరూపమునందు ఉదయాస్తమయములు లేనివాడై, (ఏకోసత్-ఒంటివాడు – చుట్టమొకడు లేడు – అను వాక్యముల అర్థమగు) – ఒంటరివాడుగా, మధ్యగా నిలచిఉండగలడు. సూర్యదేవుని తన ఆత్మగా పొందగలడు.

*ఈ విశేషము మంత్రయుక్తంగా ఇట్లు చెప్పబడుతోంది.*

'ఉదయాస్తములు పొందడు' అనునది ఏ విధంగానంటే – సూర్యునకు భూమి యొక్క మన ఉనికి దృష్ట్యా ఉదయాస్తమయములు కనబడుచున్నాయి. ఎప్పుడూ కూడా స్వయంప్రకాశరూపుడగు సూర్యునికి ఉదయించటమేమిటి? అస్తమించటం ఎక్కడున్నది? అదే విధంగా ఆత్మను ఎరిగినవానికి ఉదయాస్తమయములు ఉండవు. జనన-మరణములు, జన్మ-పునర్జన్మలు "లేనివే" అవుతాయి.

**"దేవా! అస్తేన అహగ్ం సత్యేన। మా విరోధిషి బ్రహ్మణేతి।** ఓ దేవతలారా! నేను సత్యమును ఆశ్రయించినవాడనై ఉండెదను గాక! స్వయంప్రకాశకము, సమస్తము అయి ఉన్న బ్రహ్మదేవునితో (బ్రహ్మముతో) విరోధము కలవాడను కాకుండెదను గాక! (అనగా బ్రహ్మజ్ఞానమునకు విముఖుడను అవకుండా ఉండెదము గాక!). ఓ దేవతలారా! మీవలెనే సర్వసాక్షినై ఉండెదను గాక।"

ఈ ఉపాసన చేయువాడు చీకటిని, సూర్యాస్తమమును పొందడు. సర్వత్రా తేజోరూపము దర్శించువాడై ఉంటాడు.

---

ఈ విధముగా "మధుజ్ఞానము"ను బ్రహ్మదేవుడు (భావికుడు) ప్రజాపతికి (నిర్వాహకుడికి), ప్రజాపతి మనువుకు, మనువు సర్వజనులకు బోధించటం జరిగింది. ఇట్టి విశేషముల రహస్యమును ఎరిగినవాడు అర్హుడైన కుమారునికి లేదా శిష్యునికి బోధించును గాక। తపస్సు, ధ్యానము, భక్తిలేని వారికి బోధించరాదు. అట్టివారు రాజ్యమిచ్చినా కూడా లేక మరేది ఇవ్వజూపినా కూడా – "మధు విజ్ఞానము" బోధించటము నిషేధము.

# 3-12. ద్వాదశ ఖండము - గాయత్రీ ఉపాసన

ఇప్పుడు మనము "గాయత్రీ తత్త్వము" ద్వారా బ్రహ్మవిద్యను చెప్పుకుంటున్నాము.

– బ్రహ్మము "నిర్విషయము" ఎందుకంటే,... సమస్త విషయములు నిషేధించగా శేషించునది "బ్రహ్మము"

బ్రహ్మజ్ఞానము యొక్క బోధ కొరకై గాయత్రీ ఛందస్సు ఉత్తమ ఉపకరణముగా శాస్త్రములచే స్వీకరించబడుతోంది.

---

**గాయత్రీ వా ఇదగ్ం సర్వం భూతం।** ఈ సమస్త జీవజాలము గాయత్రీ స్వరూపమే। ఇదంతా 'వాక్' (expression) స్వరూపమే। గాయత్రియే వాక్కు.

**ఇదగ్ం సర్వం భూతం గాయతీ చ। త్రాయతే చ।** ఈ సమస్త చరాచరములంతా గాయత్రీ గానమే। గాయత్రియే రక్షణ। గాతయత్ త్రాయతే।

- ఈ పృథివి గాయత్రీ స్వరూపమే। ఈ సకల ప్రాణులు పృథిపైనే నిలచియున్నాయి. పృథివిని అతిక్రమించలేవు.
- అట్టి పృథివీ తత్త్వము చేతనే ఈ భౌతిక శరీరము నిర్మితమౌతోంది.
- అట్టి భౌతిక శరీరములో 'గాయత్రీ జగత్ శక్తి' చేతనే ప్రాణము ప్రవేశిస్తోంది. ప్రాణము శరీరములో 'గాయత్రీ' చేతనే నిలుస్తోంది. ప్రాణములు గాయత్రీ స్వరూపమే।

దేహములో ఉండే హృదయము, ప్రాణము, ఇంద్రియములు... ఇవన్నీ కూడా గాయత్రీ స్వరూపములే।

అట్టి గాయత్రి '4' పాదములుగాను, '6' ప్రకారములుగాను ఉన్నది. **సైషా చతుష్పదా (4) షట్ (6) విధా గాయత్రీ, తత్ ఏతత్ ఋచా అభ్యసూక్తమ్।** '6 6 6 6' అక్షరములుగల 4 పాదములతో కూడియున్న ఛందస్సు (6 × 4 = 24 అక్షరములు) 6 రూపములు = (1) వాక్కు (2) ప్రాణులు (3) పృథివి (4) దేహము (5) హృదయము (6) ప్రాణములు.

ఈ సమస్తము గాయత్రీ రూపమగు బ్రహ్మము యొక్క సాకారవికారమే। ఇదంతా గాయత్రీ మహిమయే! అద్దాని పురుషకారమే! పురుషకారమునకు ఆవల పురుషుడు। ఇదంతా ప్రకృతి స్వరూపం. దానికంతటికీ ఆవల, ఇదంతా దాటివేసినట్టి శ్రేష్ఠాతిమగు పురుషుడు – గాయత్రియే।

అట్టి పురుషునకు **"నాలుగు పాదములు".**

(1) ఈ మార్పు–చేర్పులతో కూడినదంతా, సమస్త జగత్తు ఒక పాదము (1/4th). మార్పు చెందుతుంది కాబట్టి మృతము (All that undergoes change is "Mrutham").

(2) మిగతా '3' పాదములు (3/4) అమృతము (That does not have any change)

ఉదా : (1) మనస్సులోని విషయాలు మృతము. 'మనస్సు' – అమృతము.

(2) బుద్ధికి తెలియవచ్చేవి మృతము. తెలివి (బుద్ధి) – అమృతము.

(3) చిత్తము (ఇష్టము) అయ్యే విషయాలు మృతము. చిత్తము అమృతము.

'అహం' (నేను) అనునది పురుషుడు. మిగతావన్నీ 'నేను' యొక్క పురుషకారములే।

## బహిర్పురుషాకాశము

అట్టి పరబ్రహ్మము గురించి

**1) యద్వైతత్ బ్రహ్మేతి ఇదం వా। తత్ యోయం బహిర్ధా పురుషాత్,**
**ఆకాశో యో వై – స బహిర్ధా పురుషాత్ ఆకాశః।**

*ఈ సమస్తము కూడా బ్రహ్మమే అయిఉన్నది. బ్రహ్మము యొక్క బాహ్య పురుషకారము ఏదై ఉన్నదో – అదియే ఈ బాహ్యాకాశముగా వ్యాపించి ఉన్నది.*

---

## అంతర్ పురుషాకాశము

**(2) అయం వావ స యో అయమ్।**
**అన్తర్‌పురుష ఆకాశో యో వై సో "అన్తర్పురుషాకాశః।**

*బాహ్యము ఆకాశముతో సహా ఆయా పంచ భౌతిక జగత్తుగా విస్తరించియున్నట్లే, అంతరాకాశము (హృదయాకాశము)గాను (మనోబుద్ధిచిత్త అహంకారముల రూపంగాను) విస్తరించి వ్యాపించి ఉన్నది.*

→ ఒకే భూతాకాశము (పంచభూతములలో మొదటిది) దేహమునకు బాహ్య – అభ్యంతరములలో వేంచేసి ఉన్నట్లే,

→ చిత్తాకాశము కూడా ఈ జీవునికి బయట – లోపల ఏకరూపమున విస్తరించి ఉన్నది. ఆ పరబ్రహ్మమే భూతాకాశముగాను, చిత్తాకాశముగాను – చిదాకాశముగాను శరీరమునకు విశ్వమునకు కూడా బయట, లోపల ఏకరూపమై వ్యాపించినదై ఉంటోంది.

**అయం వావ స యో అయమ్ అంతర్హృదయ ఆకాశః తదేతత్ పూర్ణమ్ అప్రవర్తినీగ్ం।**

*బాహ్య–అభ్యంతరములలో విస్తరించి యున్న ఆకాశమే అంతరహృదయమున చిదాకాశముగా ఉన్నది. అనగా చిదాకాశమే చిత్తాకాశముగా, భూతాకాశముగా కూడా భావించబడుచూ ఉన్నది. అట్టి అంతర్హృదయములో ఏర్పడినదై ఉన్న చిదాకాశమే "పరబ్రహ్మము". అది పూర్ణము. అప్రవర్తితము.*

**భూతాకాశముగా అనుభవమయ్యేదంతా చిత్తము యొక్క కల్పనా విన్యాసమే। చిత్తాకాశమంతా ఆత్మాకాశము యొక్క స్వకీయ కల్పిత లీలా వినోదమే। ఈ విధంగా సమస్తము చిదాకాశమే అయి ఉన్నది. అట్టి చిదాకాశమే 'బ్రహ్మము'గా కూడా పిలువబడుతోంది.**

హృదయములోంచే ఆలోచన, భావన అనునవన్నీ పుడుచున్నాయి. భావన నుండే జగత్తుల అనుభవము ఏర్పడుతోంది. కనుక **ఈ జగద్దృశ్యమంతా అనుభవమగుచున్నది అంతర్హృదయములోనే।** అట్టి అంతర్హృదయాకాశము సర్వదా పూర్ణము. అది ఎప్పుడూ తన పూర్ణత్వము నుండి చ్యుతి పొంది జీవుడు, జగత్తు, జాగ్రత్ స్వప్న సుషుప్తులుగా ఏమాత్రమూ అగుటయే లేదు.

అట్టి అంతర్హృదయాకాశము (లేక) చిదాకాశమునకు "బయట–లోపల" వంటివేమీ లేవు. **నబాహ్యం। నోఽంతరమ్।**

సమస్తము తానే అయి, ఏ మార్పు – చేర్పులు ఏమాత్రము పొందకయే ఉన్నది. అది 'పరబ్రహ్మము'గా చెప్పబడుచున్నది. అట్టి పరబ్రహ్మము సర్వదా యథాతథంగానే ఉన్నదిగాని ఏదీగా ప్రవర్తించటం లేదు. అప్రవర్తితం। అది అప్రవర్తనీయం।

*ఎవ్వరైతే స్వకీయ హృదయస్థము, హృదయరూపము, స్వాభావిక స్వస్వరూపము అగు పరబ్రహ్మమును "పూర్ణము, అప్రవర్తనీయము (దేనిచేతను ప్రవర్తింపజేయబడేది కాదు), అప్రవర్తితము" – అని తెలుసుకుంటారో, – పూర్ణ అప్రవర్తనీగ్ం,... శ్రియం లభతే య ఏవం వేద। → అట్టివారు మహత్తరమగు శ్రేయస్సు, యశస్సు, భాగ్యము పొందగలరు.*

## 3-13. త్రయోదశ ఖండము – గాయత్రీ బ్రాహ్మీసిద్ధికి పంచ సుషి ద్వారములు

### *హృదయాంతర్గత – బాహ్యాభ్యంతరస్థిత గాయత్రీ బ్రహ్మము చేరుటకు '5' దారులు (సుషులు – ద్వారములు)*

'గాయత్రి' అనే బ్రహ్మము యొక్క ఉపాసన (సామీప్యత పొందటము) కొరకై ఐదు ద్వారములు, (సుషులు, సుషిరగము) మరియు వాటి యొక్క ఐదు ద్వారపాలకులు (ఈ ఉపనిషత్‌చే) సూచించబడుచున్నాయి.

మనము ఒక రాజు వద్దకు వెళ్ళాలంటే, ద్వారపాలకులు ఆపేస్తారు. అట్టి ద్వారపాలకులను ఉపాసనా ప్రీతులను చేస్తే, వారు లోనికి వెళ్లనిస్తారు. రాజు దర్శనానికి మార్గము చూపిస్తారు కూడా!

ఉపాసన – శ్రద్ధకొరకు।
శ్రద్ధ – ఉత్తమ గుణముల కొరకు.

---

**తస్య హ వా ఏతస్య హృదయస్య పంచ దేవ సుషయః।** హృదయాంతరతుడై జగత్పాలకుడయి, బాహ్యాభ్యంతర స్వరూపుడైయున్న "పరమాత్మ" (లేక) "పరబ్రహ్మము" – అనే చక్రవర్తిని దర్శించటానికై '5' దేవ సుషులు(లేక) దేవతలచే కాపలా కాయబడుచున్న ఐదు ద్వారములు ఉన్నాయి. వాటిని గురించి ఇప్పుడు చెప్పుకుంటున్నాము.

### (1) హృదయము యొక్క తూర్పు వైపు ద్వారము – "ప్రాణము"

**స యో అస్య ప్రాక్ సుషిః – స ప్రాణః।** హృదయము యొక్క తూర్పు వైపున (పంచ ప్రాణములలోని) ప్రాణమే ద్వార పాలక దేవత. ఈ ప్రాణ దేవతయే శరీరములో నేత్రము. చూపు రూపమున ఉన్నవారు. ప్రాణము ఉంటేనే చూపు. లేకుంటే చూపు ఉండదు. ఆయనయే ఆకాశమున సూర్యుడై ప్రకాశించుచున్నారు. ఆయనయే ఆదిత్యుడు. (బుద్ధిరూపుడు). ఆయనయే తేజస్సు (అగ్ని). అన్నాదుడు (ఆహార ప్రదాత). తినిన ఆహారము జీర్ణము చేసి శక్తిగా మారుస్తున్న వైశ్వానరుడు కూడా ఆయనయే। ఈ విధంగా ఎవ్వరైతే – చూపును, ఆదిత్యుని, అన్నాదమును, జీర్ణశక్తిని – ప్రాణేశ్వర రూపంగా ఉపాసిస్తాడో – అట్టివాడు తేజో సంపన్నుడు, అన్నాదుడు (సమస్తము తనకు రుచికరము ఆహారము వంటిదిగా) పొందుచున్నాడు.

### (2) హృదయము యొక్క దక్షిణము వైపు ద్వారము – "వ్యానము"

**అథ యో అస్య దక్షిణః సుషిః సవ్యానః। సశ్రోత్రగ్ం। స చంద్రమాః।** 'హృదయము' అనే ముఖ్యపట్టణమునకు దక్షిణము వైపు సుషి (ద్వారము)నకు ద్వారపాలకుడు – (పంచ ప్రాణేశ్వరులలో) – 'వ్యానము' అను వ్యానప్రాణేశ్వరుడు.

ఆయనయే – చెవి (వినికిడి)
– చంద్రుడు (మనోరూపుడు)

⌘ ప్రాణ – అపానములను నిలిపి ఒకచోట ఉంచగల చేష్ట నిర్వర్తించునది – కాబట్టి 'వ్యానము'

⌘ వివిధ చేష్టలను నిర్వర్తిస్తుంది కాబట్టి కూడా – 'వ్యానము'

అట్టి వ్యానమే శ్రీ (సంపద). తత్ ఏతత్ శ్రీశ్చ। యశశ్చ। చెవి జ్ఞానమునకు (శృతము), చంద్రుడు ఆహారమునకు కారణభూతము.

ఈ సమస్తము వ్యానబ్రహ్మ (వ్యాన ప్రాణేశ్వరుడు) యొక్క కీర్తి, సంపదయే! అట్టి వ్యానమును పై రీతిగా (శ్రవణము, చంద్రుడు రూపములుగా) ఉపాసించువాడు సంపద, కీర్తి పొందగలడు.

## (3) హృదయము యొక్క పడమర వైపు (ప్రత్యన్) ద్వారము – "అపానము"

హృదయాంతఃపురము ప్రవేశించటానికి పడమర (West) వైపు ద్వారము – "అపానము". ఇది "వాక్కు", "అగ్ని"గా ఉపాసించబడు గాక।

**అపానము** = మూత్రము, పురీషములను శరీరము నుండి బయటకు పంపి శరీరము నుండి తొలగించునది కాబట్టి అపానము. (అప–అనితి)

– గాలిని విడుస్తూ మాట్లాడుతాము. అందుచేత వాక్కుకు అపానమునకు పరస్పర సంబంధము. గాలిని విడుస్తూ ఉండి తింటాము. కనుక అన్నాద్యము.

– వాక్కు అగ్ని రూపము.

అట్టి అపానమును బ్రహ్మవర్చస్సుగాను, అన్నాద్యము (పరిపోషకము)గాను ఉపాసించెదరు గాక।

అపానమును పైవిధంగా ఉపాసించుచుండగా అట్టివాడు బ్రహ్మవర్చస్సు, సమృద్ధి అయిన ఆహారము, జీర్ణశక్తి పొందగలడు.

## (4) హృదయము యొక్క ఉత్తర (ఉదన్) సుషి (ద్వారము) – "సమాన ప్రాణము"

హృదయము యొక్క ఉత్తర (ఉదన్) దిక్కువైపు ఛిద్రము (ద్వారము) – "సమానప్రాణము"

– ఇది ఆలోచనా రూపమగు "మనస్సు".

– భూమిని సస్య సమృద్ధము చేయు – "పర్జన్యము (వర్షము)".

సమాన ప్రాణమును సమాన బ్రహ్మ కీర్తి, లావణ్యముగా ఉపాసించెదరు గాక।

**సమాన ప్రాణము** = తినబడుచున్న, త్రాగబడుచున్న ఆహార పానీయములను శరీరమంతా 'సమము'గా అందించగ విశేషము స్వభావముగా గల వాయువు.

ఈ వాయువుకు అంతఃకరణముతో సంబంధము ఉన్నది.

సమాన ప్రాణమే వర్షరూపములో ఉండే దేవత.

మనస్సు యొక్క విజ్ఞానము, కీర్తికి సమానప్రాణము కారణము అవుతోంది.

ఈ విధంగా సమాన ప్రాణమును గమనిస్తూ ఉపాసించువాడు కీర్తివంతుడు, లావణ్యవంతుడు కాగలడు.

## 5. హృదయము యొక్క పై భాగమున గల సుషి (ద్వారము) – "ఉదాన ప్రాణము"

హృదయమనే ఇంటికి పైనగా ఉండే ద్వారము (ఛిద్రము) ఉదాన ప్రాణము. ఇది వాయు ఆకాశ రూపములుగా ఉపాసించబడు గాక।

**ఉదాన ప్రాణము** = ఇది ఈ దేహము యొక్క → అరికాళ్ళు మొదలు శిరస్సు వరకు 'పైకి లేచుట' అను క్రియకు శక్తి ప్రసాదకము. పైకి లేచుటకై ఉపాసన వస్తువు కాబట్టి 'ఉదానము'. ఆకాశమునకు 'ఉత్' అని పేరు. ఉదాన ప్రాణ ప్రదర్శనమే ఆకాశముగా ఉపాసిస్తున్నారు.

ఉదాన బ్రహ్మ – బలము. ఆకాశము యొక్క విస్తార రూపము. అట్టి ఉదాన బ్రహ్మను బ్రహ్మముగా ఉపాసించువాడు బలము, విస్తారము మొదలైన విశేషములు పొందుచున్నాడు.

---

ఈ విధంగా (1) ప్రాణ బ్రహ్మ పురుషుడు (2) వ్యాన బ్రహ్మ పురుషుడు (3) అపాన బ్రహ్మ పురుషుడు (4) సమాన బ్రహ్మ పురుషుడు (5) ఉదాన బ్రహ్మ పురుషుడు – ఈ ఐదుగురు బ్రహ్మ పురుషులు.

**తేవా ఏతే పంచ బ్రహ్మపురుషాః స్వర్గస్య లోకస్య ద్వారపాః।**

వీరు ఐదుగురు స్వర్గ (ఊర్ధ్వ)లోక ద్వారపాలకులు. ఈ ఐదుగురు ద్వారపాలకులను ఉపాసనచే ఆశ్రయించువాడు, ఎల్లప్పుడు ప్రార్థనలు సమర్పించువాడు –

- తాను వీర్యవంతుడు కాగలడు.
- ఈతని వంశములో వీర్యవంతులు జన్మిస్తారు.
- అట్టివాడు స్వర్గ (ఊర్ధ్వ) లోకము సిద్ధించుకోగలడు.

వీరు 'బ్రహ్మ' అనే స్వర్గలోకమునకు ద్వారపాలక దేవతలవంటివారు.

కన్ను – చెవి – వాక్కు – మనస్సు – ప్రాణము – అనే ఐదుగురు ద్వారపాలకులు ఈ భౌతికదేహమున తిష్ఠించుకొని ఉండటము మనమందరము చూస్తూనే ఉన్నాము కదా। **(ఏతైర్హి చక్షుః శ్రోత్ర వాక్ మనః ప్రాణైః బహిర్ముఖ ప్రవృత్తైః బ్రహ్మణో హార్దస్య ప్రాప్తిః ద్వారాణి నిరుద్ధాని – శంకర భాష్యం)** ఇవన్నీ కూడా బహిర్ముఖమై దృశ్యమువైపు ఎక్కుపెట్టి ఉండటము చేత, – అంతర్హృదయములోనే వేంచేసియున్న పరమాత్మ (లేక) పరబ్రహ్మము వైపు మార్గదర్శకమైయుండే ఛిద్రములు (ద్వారములు) (సుషిలు) మూసుకుపోయి ఉంటున్నాయి.

**"ఇంద్రియ విషయములు నిజమే। నిత్యమే"** అని తలచుచూ ఉన్నంత కాలము, వాటి పట్ల ఆసక్తి (Inquisitiveness) కొనసాగించునంత కాలము – "అసత్యము"నందే మనస్సు తగుల్కొని ఉంటోంది. అట్టి మనస్సు హృదయమునందు సర్వదా వేంచేసియున్న బ్రహ్మమునందు నిలవటము లేదు.

అందుచేత ఈ ఐదుగురు బ్రహ్మపురుషులను ఉపాసించి నేత్ర – శ్రోత్ర – వాక్ – మనో – ప్రాణములను ద్వారములుగాను, ప్రాణ – వ్యాన – అపాన – సమాన – ఉదాన దేవతలను ద్వారపాలక పురుషులుగాను భావించి ఉపాసన, అధ్యయనములు చేయమని ఉపనిషత్తు మార్గసూచకము మనకు చేస్తున్నది.

## అఖండ జ్యోతి

అసంఖ్యాక దీపములు (ఉదా: సహస్ర దీపార్చన) ఒకచోట వెలుగుచూ ఉండవచ్చు గాక! కానీ, అన్ని దీపములలో తేజోరూపమగు అగ్ని సర్వదా 'ఒక్కటే' గాని, అనేక దీపములు కారణంగా అనేకములుగా అవటం లేదే!

అట్లాగే ఈ లోకములన్నీ కూడా విశ్వజ్యోతి యొక్క తేజోరూప చమత్కారమే। అంతే కాదు, ద్యు(దేవ) లోకముతో సహా సమస్త లోకములకు ఆవల ఏ జ్యోతి స్వరూపాత్మ వెలుగొందుచున్నదో, – ఆ అఖండజ్యోతియే।

ఈ అట్టి జ్యోతి – పురుషుని యందు, సమస్త జీవుల దేహములలో బాహ్య – అభ్యంతరముగా వెలుగొందుచున్నది.

**తస్య ఏషా దృష్టి యత్ర ఏతత్ – అస్మిన్ శరీరే సగ్ంస్పర్శేన ఉష్ణిమానం – విజానాతి।**

ఒకని శరీరము స్పృశించినప్పుడు ఆ స్పర్శగా ఆ ఆత్మజ్యోతియే స్పర్శానుభవమై వెచ్చదనము అనుభూతమౌతోంది. "స్పర్శగా అనుభవమైయ్యే అట్టి ఉష్ణము ఆత్మ యొక్క ఉనికి – స్పర్శయే" – అని భావించబడు గాక।

**తస్య ఏషా శ్రుతిః యత్ర ఏతత్ కర్ణావపి గృహ్య నినదమివ, నదథురివ,**
**అగ్నేరివ జ్వలత ఉపశృణోతి – తత్ ఏతత్ దృష్టం చ, శ్రుతం చ ఇతి ఉపాసీత।**

రెండు చెవులను (రెండు చూపుడు) వ్రేళ్లతో మూసుకొన్నప్పుడు రథము వెళ్లుచూ ఉన్నప్పటి ఘోషవలెను, ఎద్దు మెడకు కట్టిన గజ్జెల ధ్వని వలెను, ఫటఫట మండే అగ్ని యొక్క ధ్వనివలెను వినపడుతుంది. అట్టి ధ్వనిని వింటూ "ఇది అఖండాత్మ జ్యోతి యొక్క విశేష శబ్ద చమత్కారమే" – అని ఉపాసించెదరు గాక!

ఎవ్వరైతే ఈ సమస్తము ఆత్మ దృష్టితో చూస్తారో, వింటారో – వారు ఏది చూడాలో అది చూస్తున్నవారు, ఏది వినాలో అది వినుచున్నవారు అగుచున్నారు.

---

# 3-14. చతుర్దశ ఖండము - శాండిల్య విద్య - సమస్తము బ్రహ్మమే।

**సర్వం ఖలు ఇదం బ్రహ్మ।** నామరూపాత్మకంగా అనేక భేదములతోను, సామాన్య- అసామాన్య విశేషములతోను, ఇంద్రియములకు విషయముల రూపముగా కనిపిస్తున్న ఈ సమస్తము "బ్రహ్మమే" అయి ఉన్నది. ప్రతి జీవునిలో అఖండముగా కేవలుడై వెలుగొందుచున్నది ఆ ఆత్మపురుషుడే! సమస్తమునకు కారణకారణమై వెలుగొందుచున్న పరమాత్మ యొక్క స్వయం ప్రదర్శనారూపమే ఇదంతా!

**తత్ జలాన్।** జలములో నుండి బుడగలు, తరంగములు బయలుదేరి జలములో సాకారంగా కనిపిస్తూ తిరిగి జలము నుండే లయము పొందినవి అగుచున్నాయి కదా! అట్లాగే 'ఆత్మ' అనే జలము నుండి అసంఖ్యాక తరంగాల వలె అసంఖ్యాక జీవాత్మలు బయల్వెడలి, 14 లోకములలో సంచారములు చేస్తూ తిరిగి ఆత్మయందే లీనము అగుచున్నాయి.

**తత్ జవాని** → ఇదంతా ఆత్మయందలి గర్భస్త పిండమే।

అట్టి సమస్తమునకు సర్వదా అధిష్ఠానమైయున్న "ఆత్మ"నే దర్శించాలి. ఉపాసించాలి. అనన్య భావనను అనుక్షణీకరించుకోవాలి.

**పరమాత్మయే ఈ కల్పిత జగత్తు యొక్క నిర్మాత** (The worker of the Universe). అందుచేత పరమాత్మ క్రతుమయుడు. యజ్ఞకర్త. ఈ సృష్టియే - "యజ్ఞము".

ఈ జీవుడు పరమాత్మయే అయి ఉండి కూడా, "స్వయం కృత లీలా వినోదరూపమా?" - అన తగిన ఈ "సృష్టి" క్రతువులో 'జీవుడు' అనే పురుషకారము ఆశ్రయించి ఉంటున్నాడు. అట్టి స్వయంకృత సృష్టి కల్పనలో ఆత్మ యొక్క ఒక అంశగా ప్రవేశించి ఈ జీవుడు జన్మ-కర్మల పరంపరలను పొందుచున్నాడు. ఆతడు ఏది ఎట్లు సంకల్పిస్తే అట్లాగే ఈ దేహమున్నప్పుడు దేహానంతరము కూడా పొందుచున్నాడు. ఈ విధంగా జీవుడు సంకల్పమయుడు.

తాను ఏది ఎట్లు నిశ్చయించుకుంటే ఆ రూపమునే తనకు తాను దాల్చుచున్నాడు. ఆ లోకములోనే ప్రవేశము పొందుచున్నాడు. మరణ సమయంలో ఏ సంకల్పములు, నిశ్చయములు కలిగి ఉంటే, వాటిని అనుసరించే తదనంతర ఉపాధికి మరల ఉపక్రమించుచున్నాడు. సంకల్పములచేతనే 'మనస్సు' రూపుదిద్దుకుంటోంది. అయితే...,

బ్రహ్మమే మనస్సు రూపముగా ప్రకటనమగుచున్నది. బ్రహ్మమునకు మనస్సు మొదలైన అన్యమేదీ మొదలే లేదు.

**<u>బ్రహ్మము ఇంకా ఎట్టిదంటే -</u>**

**మనోమయః :** మనస్సునంతా ఆక్రమించియున్నది బ్రహ్మమే। బ్రహ్మము మనోమయము కూడా.

**ప్రాణ శరీరో :** బ్రహ్మము "ప్రాణశక్తి"ని శరీరముగా కలిగి ఉంటున్నది.

**భారూపః :** బ్రహ్మము స్వయం తేజోరూపము - స్వయం ప్రకాశరూపము.

**సత్య సంకల్ప :** బ్రహ్మము ఏది 'సత్యము' అని సంకల్పిస్తే అది అట్లే సత్యము అయి ఉండగలదు.

**సర్వకర్మా :** అంతరంగమగు మనో బుద్ధి చిత్త అహంకారములకు మరియు బాహ్యములగు ఈ జగదనుభవములకు తానే 'కర్త' అయి ఉంటోంది.

**సర్వకామ :** సమస్తము బ్రహ్మము యొక్క ఇచ్ఛా శక్తి నుండే బయల్వెడలుచున్నది. బ్రహ్మము యొక్క కోరిక చేతనే జగన్నాటకమంతా పరిఢవిల్లుతోంది.

**సర్వగంధ। సర్వరస। సర్వమిదమ్ అభ్యత్తో।** ఇంద్రియానుభములగు సర్వవాసనలు, సర్వరుచులు... ఇదంతాగా విస్తరించుచున్నది బ్రహ్మమే।

**అవాక్య నాదరః :** "వాక్కు మొదలైన ఇంద్రియములు లేనిదే" - అయి ఉండి కూడా, సర్వేంద్రియ వాక్యములు బ్రహ్మమునందే జగదృష్టిచే కనబడుచున్నవగుచున్నాయి.

**బ్రహ్మమునకు వేరుగా ఎక్కడా ఏదీ లేదు. బ్రహ్మము మరింకొకటేదీ అగుట లేదు.**

---

అట్టి నా–నీ–సర్వుల స్వస్వరూపమే అయి ఉన్న ఆత్మ స్వకీయ హృదయములోనే వేంచేసియున్నది. సూక్ష్మాతిసూక్ష్మమగుటచే హృదయకమలములోని ఆత్మ ఇంద్రియములకు అనుభవ విషయమే కాదు।

**సర్వాంతర్యామి అయి, సర్వహృదయ నివాసియగు ఆత్మ :–**

**అణీయాన్ :** అణువుకే అణువు. పరమసూక్ష్మము. నీవారశూకము (వడ్ల గింజ) యొక్క చిట్టచివరి అణువిభాగము కంటే, ఆవగింజలో దాగియున్న అంకురశక్తి కంటే, యవములు (మినపగింజ) కంటే, సర్షపము (ఆవగింజ) కంటే, శ్యామాకములకంటే (పెసలు మొదలైన తృణ ధాన్య విశేషముల కంటే)... అత్యంత సూక్ష్మాతిసూక్ష్మము. వాటన్నిటిలో దాగిఉండే "అంకురము" కంటే కూడా సూక్ష్మాతిసూక్ష్మము.

**ఇంకా కూడా... బ్రహ్మము గురించి**

**నా హృదయములో నివసించు నీ ఆత్మ, నీ హృదయములో నివసించు నా ఆత్మ ఎటువంటిదంటే...**

→ సమస్త సృష్టికి కర్మాధికారి.

→ సర్వ కామములు కూడా సర్వభూతాశయ స్థితమగు ఆత్మకు చెందినవే.

→ సకల గంధములు, సర్వ రసములు తనవే అయి ఉండి – (నాటకములోని సర్వపాత్రలు, వర్తనములు నాటక రచయిత యొక్క రచనా కళలోనివే వలె) – సమస్తము తనయందే కలిగి ఉంటోంది.

→ వాక్కు లేకపోయినా సర్వ శబ్దములు ఆత్మలోనివే। కాళ్ళు లేకపోయినా నడకలన్నీ ఆత్మవే! చేతులు లేకపోయినా సర్వ చేతలు ఆత్మకు చెందినవే. ఇంద్రియములు లేకపోయినప్పటికీ సర్వేంద్రియముల అనుభూతములు ఆత్మదేవునివే!

→ సంభ్రమము లేనిదే అయినప్పటికీ, ఈ 14 లోకములలోని సంభ్రమములన్నీ ఆత్మయందే – దర్పణంలో దృశ్యములాగా – ప్రతిబింబితము అగుచున్నాయి.

→ అట్టి ఆత్మ భూగోళము కంటే, ఆకాశము కంటే, దేవలోకము కంటే, సమస్త లోకముల కంటే "పెద్దది".

→ నా – నీ హృదయములో నివసించు బ్రహ్మమే సృష్టికర్త. సర్వకామములు, సర్వగంధములు, సర్వరసములు – ఆత్మభగవానుని రూపమే। ఆతడే పరబ్రహ్మము.

**ఎవరు ఈ సత్యము పట్ల శ్రద్ధ కలిగి ఉంటారో – వారికిక ఏ సందేహములు ఉండవు.**

ఈ విధంగా శాండిల్య ముని ప్రకటించి ఉండటం చేత, ఇది – "శాండిల్య విద్య" –గా లోక ప్రసిద్ధము.

## 3–15. పంచదశ ఖండము – విరాట్ కోశ – ఉపాసన

ఈ విశ్వమునకు ఆకాశమే పొట్ట. అనగా లోపలగా ఖాళీ ప్రదేశము. ఆ ఖాళీలో అనేక విశేషములు కలిగియున్నది. అట్టి ఈ విశ్వమునకు పీఠము 'భూమి'. **న జీర్యతి!** అట్టి ఈ 'విశ్వము' అనబడునది అనాది. నాశనము లేనిది. (ప్రకృతిం పురుషం చైవ విద్ధి అనాది ఉభావసి – భగవద్గీత)।

ఈ విశ్వమునకు మూలములు – అష్టదిక్కులు
పై భాగము – స్వర్గము

ఈ విశ్వము సర్వమునకు ఆధారము, ఆలవాలము కూడా! అట్టి ఈ 'విశ్వము' అనే గృహంలో జీవులందరు విశ్రమిస్తున్నారు. తమ స్వరూపమును తామే ఏమరచి (స్వప్నములో వలె) ఈ విశ్వములోని దృశ్య జగత్తునందు ఇంద్రియముల ద్వారా తన్మయులై చూస్తూ ఉంటున్నారు. ఆత్మవిషయమై కునుకులు తీస్తూ ఉన్నారు.

ఈ విశ్వము యొక్క :–

తూర్పు దిక్కు పేరు – **"జుహూ"।**

దక్షిణ దిక్కు పేరు – **"సహమానా"।**

పడమట దిక్కు పేరు – **"రాజ్ఞీ"।**

ఉత్తర దిక్కు పేరు – **"సుభూతా"।**

వాటి యొక్క వత్స (దూడ) / ప్రియపుత్రుడు – **"వాయువు"।**

**స య ఏతమేవం వాయుం దిశాంవత్సం వే, న పుత్ర రోదనం రోదతి।** ఈ విధంగా నాలుగు దిక్కుల యొక్క వత్స (దూడ) వంటిదే 'వాయువు' – అని ఎవరు ఉపాసిస్తారో – అట్టివారు సంతానము వలన ఎట్టి దుఃఖము, కష్టము పొందరు. సంతానము ఆతనికి ఆనందము కలిగించువారు అవగలరు. నేను ఆ తీరుగా వాయువును దిక్కుల యొక్క (మధ్యలోగల) వత్సగా (ప్రియపుత్రుడు, ఆవుదూడ)గా ఉపాసిస్తున్నాను. నాకు పుత్రశోకము ఉండదు. నా సంతానము పూర్ణాయుష్కులై ఉంటారు. నా "జీవాత్మ" అనే పుత్రుడు నాకు సంతోషము కలిగించువాడే అవుతాడు.

## విశ్వోపాసన

→ ఈ విధంగా "అంతరిక్షము – భూమి – దిశలు – దిశావత్సయగు వాయువు"తో సహా 'అవినాశి'యగు "విశ్వకోశము"ను (వాంఛలు ఈడేరుటకై) ఉపాసిస్తున్నాను.

→ వీటితో బాటుగా "ప్రాణము"ను శక్తి కొరకై ప్రాణాభ్యాస పూర్వకంగా శరణువేడుచున్నాను.

→ వీటన్నిటితోబాటు భూలోకమును ఆరాధిస్తూ దైవీ – సంపత్తి కొరకై శరణాగతుడనై ఉంటున్నాను.

→ 'అమరము' అయి ఉన్న స్వర్గలోకమును కూడా అవసరములు తీరుటకై ఆరాధిస్తూ ఉన్నాను.

→ సంతానము యొక్క ఆయుర్దాయము కొరకై వాయువును ఉపాసిస్తున్నాను.

- ప్రాణమును శరణు వేడుచున్నాను. సర్వభూతజాలము ప్రాణస్వరూపమే। కనుక ప్రాణోపాసనచే సర్వభూతజాలము ఉపాసించువాడను అగుచున్నాను. ప్రాణస్వరూపముగా దర్శించుచున్నాను.
- భూలోకమును ఆరాధిస్తున్నాను. భూలోకములో ఆకాశము అంతర్ – బహిర్ సంస్థము కాబట్టి ఆకాశమునకు నమస్కరించువాడనే అగుచున్నాను.
- ఆకాశమునకు నమస్కరిస్తూ ఉన్నప్పుడు ఆకాశమునందు అంతర్లీనమైయున్న ద్యులోకమును, ద్యులోక దేవతలను స్తుతించువాడను అగుచున్నాను. సువర్లోకమును శరణువేడుచున్నట్లే అగుచున్నది.
- సువర్లోకమును ప్రార్థిస్తూ ఉన్నప్పుడు వేదముల గానమునకు నమస్కరిస్తూ ఉన్నట్లే!
- ఈ తీరుగా ఋగ్వేదమునకు, యజుర్వేదమునకు, సామవేదమునకు నమస్కారము సమర్పిస్తున్నవాడను అగుచున్నాను.

---

## 3-16. షోడశ ఖండము – పురుషోవా యజ్ఞః

ఈ జీవుడు పురుషకారము కలిగి ఉన్నాడు – (He has quality of workmanship). కనుక 'పురుషుడు' అనబడుచున్నాడు. జాగ్రత్-స్వప్న – సుషుప్తులు స్వకీయ పురుషకార చమత్కారములే కాబట్టి కూడా 'పురుషుడు' – అనబడుచున్నాడు.

అట్టి ఈ జీవుని పట్ల 'జీవితము' అనబడునది 'యజ్ఞము'గా అభివర్ణించబడుచున్నది.

యజ్ఞమునందు (1) "ప్రాతః" సవనము (ఉదయము సమయము యజ్ఞకార్యక్రమము) (2) "మధ్యాహ్న" సవనము (మధ్యాహ్న యజ్ఞ విధులు) (3) "సాయం" సవనము (సాయంకాల యజ్ఞ విధానములు) ఉంటాయి.

జీవుని జీవిత కాలము కూడా అట్టిదే (బాల్య యౌవన వార్థక్యములు ఆ తీరైనవే)।

### (1) ప్రాతః పురుష సవనము

ఈ జీవుడు పుట్టినప్పటి నుండి 24వ సంవత్సరము వరకు – పురుష ప్రాతః సవనము (లేక) ప్రాతఃకాల యజ్ఞము.

- ఇది గాయత్రీ ఛందస్సుకు 24 అక్షరములు కలిగియుండటము వంటిది.
- ఈ ప్రాతః పురుష సవనమునకు సవన దేవతలుగా వసువులు అధిష్ఠించి ప్రభువులై ఉంటున్నారు.

- శరీరమంతా వ్యాపించి ఉండు ధర్మము ప్రాణములు కలిగి ఉంటాయి కాబట్టి – ప్రాణములే వసువులు (వాసయతేతి వసవః). ప్రాణములు ఉన్నప్పుడే పంచేంద్రియములు (మరియు) పంచేంద్రియార్థములైనట్టి శబ్ద స్పర్శ రూప రస గంధములు శరీరములో నిలచి ఉంటాయి. కాబట్టి ప్రాణములకే 'వసువులు' అనే బిరుదు ఇవ్వబడుతోంది.

**తం చేత్ అస్మిన్ వయసి కించిత్ ఉపతపేత్, స బ్రూయాత్ :...।** ఈ పురుష ప్రాతః సవనమగు 24 సంవత్సరముల ప్రారంభ జీవిత కాలంలో ఏదైనా వ్యాధి వలన బాధ కలుగుచూ ఉంటే, వసు రూపులగు ప్రాణములను ఈ విధంగా ప్రార్థించాలి.

**ప్రాణాః! వసవ ఇదం మే ప్రాతః సవనం మాధ్యన్దినగ్ం సవనమ్ అనుసన్తనుతేతి।**
**మాఽహం ప్రాణానాం మధ్యే యజ్ఞో విలోప్సేయేత్ ఉద్ధై వ।**

ఓ ప్రాణదేవతలారా! ఈ ఉదయ సవనమును నా చేత చక్కగా చేయిస్తూ, మధ్యాహ్న సవనమునకై నన్ను చక్కగా సంసిద్ధుడయేట్లు తీర్చిదిద్దండి. యజ్ఞము మధ్యలోనే నేను వినష్ఠుడను కాకుండెదను గాక! (యజ్ఞరూపుడగు నేను మీ మధ్యలో విచ్ఛేదము పొందకుండెదను గాక!)

ఈ విధమైన ప్రార్థనచే అప్పుడు ఆతడు రోగము నుండి విముక్తుడై (వ్యాధినుండి కోలుకొని) ఆరోగ్యవంతుడు కాగలడు.

## (2) పురు మాధ్యందిన సవనము

ఆ తరువాత 44 సంవత్సరముల వరకు (68 సంవత్సరముల వయసు వరకు) – పురుషుడు (జీవుడు) నిర్వర్తించు జీవితము యొక్క ఆయుష్షును మాధ్యందిన సవనము (మధ్యాహ్నము నిర్వర్తించు యజ్ఞ విభాగము) అని అంటారు.

ఇది 44 సంవత్సరాల కాలము అవటం చేతనే త్రిష్టుమ్ ఛందస్సు "44" అక్షరములతో కూర్చబడింది. మధ్యం దిన సవనము త్రిష్టుప్ ఛందస్సుకు చెందినది. అది రుద్రులకు సంబంధించి ఉంటోంది.

**రుద్రులు =** రోదనము కలిగించునవి. సకల ప్రాణులను రోదింపజేయుచూ ఉండటం చేత రుద్రులు.

ప్రాణములే రుద్రులు. ఎందుకంటే ప్రాణులందరినీ ప్రాణములే తపింపజేస్తాయి, రోదింపజేస్తాయి – కాబట్టి! ఈ జీవుల దేహములలో ఉండి ఏడ్చునని, ఈ జీవుని ఏడ్పించునవి – ప్రాణములే కాబట్టి, ప్రాణములే **'రుద్రులు'.**

**తమ్ చేత్ ఏతస్మిన్ వయసి కించిత్ ఉపతపేత్ – స బ్రూయాత్ –** అట్టి రుద్రులకు సంబంధించిన మధ్యాహ్న జీవిత సవనము (24 సం॥ నుండి 68 సం॥ వరకు) ఏవైనా శారీరక వ్యాధులుగాని, మానసిక వేదనలు (ఆధులు)గాని సందర్భమైనప్పుడు ఈ విధంగా మధ్యాహ్న సవన రుద్రప్రార్థన (స్తుతి) సమర్పించెదరు గాక!

**ప్రాణా రుద్రా! ఇదం మే మధ్యం దినగ్ం సవనం తృతీయ సవనమ్ అనుసంతనుతేతి।**
**మాఽహం ప్రాణానాగ్ం రుద్రాణాం మధ్యే యజ్ఞో విలోప్సీయేత్ ఉద్ధైవ॥**

ప్రాణరూపులగు ఓ రుద్ర దేవతలారా! ఈ మా మాధ్యందిన సవనమును క్షేమముగా తృతీయ (మూడవ) సవనములో ఏకం చేయండి. ఈ మధ్యాహ్న యజ్ఞమును మూడవ యజ్ఞముతో కలపండి. యజ్ఞస్వరూపుడనైయున్న నేను ప్రాణదేవతలైన రుద్రుల మధ్యలో వినష్టుడను, నశించువాడను కాకుండెదను గాక।

ఈ విధమైన ప్రార్థనచే ఆ రోగి శారీరక, మానసిక బాధల నుండి విముక్తుడై ఆరోగ్యవంతుడు కాగలడు.

## (3) తృతీయమగు పురుష సాయం సవనము

24+44 సంవత్సరముల తరువాత (68 సంవత్సరముల తరువాత) – ఆపై 48 సంవత్సరముల జీవితకాలము (ఆయుష్షు)ను **"పురుష తృతీయ సవనము"** అని పిలుస్తున్నారు.

ఈ 48 సంవత్సరముల తృతీయ సవన ఆయుష్షును (జీవితమును) దృష్టిలో పెట్టుకొనే "జగతీ ఛందస్సు" నిర్మితమైనది. అందుచేతనే జగతీ ఛందస్సు 48 అక్షరములు కలిగి ఉంటోంది. ఈ మూడవ విభాగమనే జీవిత యజ్ఞము జగతీ ఛందస్సుకు చెందినది అగుచున్నది.

- జగతీ ఛందస్సు ఆదిత్యులకు సంబంధించినది. ఈ జగతీ ఛందస్సును ఆదిత్యులు అధిష్ఠించి ఉన్నారు.
- ఆదిత్యులు సమస్తము గ్రహించువారై ఉన్నారు.
- ఈ శరీరములో అంతటా నిండి ఉండి ఇటు ఆహార సారమును, అటు ఇంద్రియముల అనుభవములను స్వీకరించునది 'ప్రాణములు'.

కనుక ప్రాణములే శరీరమునకు బాహ్య – అభ్యంతరములందు వేంచేసియున్న 'ఆదిత్యులు':

శబ్దస్పర్శాది సర్వ విషయములు – ఆదిత్యులు ప్రాణ స్వరూపులై స్వీకరించుచున్నారు.

అట్టి ఈ తృతీయ సవన ఆయుఃకాలములో ఏవైనా శారీరకమైన (లేదా) మానసికమైన రోగములు, వేదనలు (ఆధులు) కలుగుచున్నప్పుడు–

**తం సేత్ ఏతస్మిన్ వయసి కించిత్ ఉపతపేత్, స బ్రూయాత్...** ప్రాణ స్వరూపులగు ఆదిత్యులను ఈ విధంగా పార్థనలు చేసి ఉపశమనము పొందెదరు గాక।

> **ప్రాణా ఆదిత్యా। ఇదం మే తృతీయ సవనమ్ ఆయుః అనసన్తనుతేతి।**
> **మా೭హం ప్రాణానామ్ ఆదిత్యానాం మధ్యే యజ్ఞో విలోప్సియేత్ ఉద్ధైవ॥**

ఓ ప్రాణస్వరూప ఆదిత్యులారా! ఈ మూడవ సవనము (యజ్ఞము) నిర్వర్తించబడుటకై ఆయుష్షు ప్రసాదించండి. నేను పూర్ణాయుర్దాయుడను అగుదును గాక! 'యజ్ఞరూపుడనే' అయి ఉన్న నేను ప్రాణరూపులగు ఆదిత్యుల మధ్య వినష్టుడనై, నాశనము పొందకుండెదను గాక।

**తత ఏత్యగదో హైవ భవతి।** అప్పుడు అట్టివాడు ఆ శారీరక రోగముల నుండి, మానసిక రుగ్మతుల నుండి విముక్తుడు కాగలడు.

---

ఈ యజ్ఞ సిద్ధాంతమును అనేకులు ఆచరిస్తూ శారీరక, మానసిక రుగ్మతల నుండి విముక్తిని పొందుచున్నారు. తదితరులకు ఆయురారోగ్యములను ఆశీర్వదించు వాక్ శుద్ధి పొందుచున్నారు.

ఒక సందర్భములో ఐతరేయ మహిదాస మునీశ్వరునితో ఆయన శిష్యులు ఈ విధంగా సత్సంగపూర్వక సంభాషణ నిర్వర్తించారు.

**శిష్యులు :** గురుదేవా! ఐతరేయ మహిదాస మునీంద్రా! మీరు 116 సంవత్సర పూర్ణాయుష్కులై, మా యొక్క శారీరక మానసిక రుగ్మతలను మీ ఆశీర్వాదములచే తొలగిస్తూ మమ్ములను ఆత్మవిద్యావంతులుగా తీర్చుదిద్దుచున్నారు. మీకు సాష్టాంగ దండప్రణామములు సమర్పిస్తున్నాను.

గురు మహరాజ్! మీ ఇట్టి అత్యంత శుభఫలప్రదమగు దీర్ఘాయుష్షు సిద్ధించుటకు కారణము ఏమిటి? ఎట్టి ఉపాసనా సంపన్నులై ఉన్నారు?

**ఐతరేయ మహిదాస మునీంద్రులు :** నేను ప్రాతఃసవన (24 సం॥) – మాధ్యందిన సవన (44 సం॥) సాయంసవన (48 సం॥) పురుష జీవిత యజ్ఞమును నిర్వర్తిస్తూ ఉన్నాను. మీరు కూడా స్తుతించండి. ఉపాసించండి. మహిమను తెలుసుకోండి. అంతేగాని నన్ను ప్రశ్నించటమెందుకు?

ఈ విధంగా శ్రీ ఐతరేయమహిదాస మునీంద్రులవారు నిండు 116 సం॥లు జీవించి ఆధ్యాత్మక మార్గదర్శకులై అనేక మంది అధ్యయన విద్యార్థులను తీర్చిదిద్దారు. అట్టి ఈ జీవిత యజ్ఞమును (జీవన సవనమును) ఎవరు ఎరుగుచూ, ఉపాసిస్తూ ఉంటారో, అట్టివారు 116 సం॥ల పూర్ణాయుష్కులు కాగలరు. శక్తిమంతులై జ్ఞానవంతులై జీవించగలరు.

> "ఓ రోగమా! నీవు నాకు తాపము కలిగించలేవు. ఎందుకంటే యజ్ఞ రూపుడనగు నేను నీవు కలిగించబోవు తాపముచే మరణించువాడను కాను!" – అని రోగి రోగమును ప్రార్థన చేయును గాక! నిశ్చయము కలిగి ఉండును గాక!

# 3-17. సప్తదశ ఖండము - జీవితమే యజ్ఞము

**యజ్ఞము :** ఆత్మ నిర్వర్తిస్తూ ఉన్న "సృష్టికల్పన" అనే యజ్ఞములోని ఒక కర్తృత్వ కల్పనా స్వరూపమే - ఈ 'జీవుడు'!

**యజ్ఞ దీక్షలు :** ఈ జీవుడు ఆకలి దప్పికలు కలిగి ఉంటున్నాడు. అస్వతంత్రుడైనట్లు అనుభవమంతా పొందుచున్నాడు. సుఖదుఃఖములు అనుభవిస్తున్నాడు. ఏవేవో కోరికలు (Expectations, Anticipations and Wishes) కలిగి ఉంటున్నాడు. ఊరకే నవ్వుచున్నాడు. ఊరకే ఏడుస్తున్నాడు. కొన్ని కోరికలు తీరినప్పుడు "నేను బలముచే, సంపదచే, బంధువులచే సమృద్ధుడను" అని తలచుచున్నాడు. ఇంతలోనే కొన్ని లోటు-పాట్లను గమనించి, "ఇదీ నా గతి! ఏమి చెప్పాలి? దేవుడు నా పట్ల సుముఖుడు కాదు" - అని బాధితుని వలె ప్రవర్తిస్తూ ఉంటున్నాడు. యజ్ఞవిధులు పాటించటములో కర్తకు కొన్ని కష్టములు, దుఃఖములు ఉంటాయి కదా! ఇక్కడి జీవుని జీవిత యజ్ఞము కూడా అట్టిదే।

**ఉపసత్తు (అనుభూతులు) :** ఈతడు ఆహార పదార్థములు తినుచున్నాడు. పానీయములు త్రాగుచున్నాడు. కోరుకొన్న పదార్థములు మొదలైనవి ఆస్వాదిస్తూ, రమిస్తూ ఉండటము, ఆయా నవ్వుకోవటము మొదలైన ఉల్లాసములన్నీ యజ్ఞ విధులలోని ఉపసత్తులు (ఓపిక కొరకు యజమాని తీసుకొనే పాలు, పళ్ల రసము మొదలైన పానీయములు) వంటివి.

**స్తుత-శస్త్రములు :** యజ్ఞములో స్తుతులు, ఋక్కుల పఠణములు అనే శస్త్రములు ఉంటాయి కదా! ఈ జీవుని 'జీవితము'లో నవ్వులు తిని ఆనందించటము, మైథునము (సంభోగించటము)... ఇవన్నీ జన్మ సంబంధమైన స్తుత- శస్త్రములు (దైవస్తుతులు, వేద పఠణములు మొదలైన) యజ్ఞ విభాగముల వంటివి.

**దక్షిణలు :** యజ్ఞంలో దక్షిణలు ఇస్తారు కదా! అట్లాగే తపస్సు చేయటం; దానము ఇవ్వటం, మాటలో ఆర్జవము (కుటిలత్వము లేకపోవటము); ఎవ్వరిని బాధించనట్టి అహింసా స్వభావము; సత్యమే చెప్పటము - ఇవన్నీ - యజ్ఞములో దక్షిణ ఇవ్వటము వంటివి.

**ఇష్ట :** ఈతడు తల్లి గర్భంలోనుండి బయటపడి పుట్టాడు. ఇదియే యజ్ఞములో ఇష్ట విభాగము. ప్రారంభ స్తుతులు, గానములు వంటివి.

**పునరుత్పాదనము :** "జన్మ" అనగా అంతకుముందు శరీరము వదలి క్రొత్త శరీరము తీసుకోవటము వంటిదే కదా! కనుక పుట్టటమే 'పునరుత్పాదనము'.

**అవభృథ స్నానము :** యజ్ఞము సమాప్తి అయిన తరువాత యజ్ఞకర్త దంపతులచే ఋత్విక్కులు మంత్రజలముతో స్నానం చేయిస్తారు కదా! మరణించినవాని భౌతిక దేహము స్నానము చేయించటమే - జీవిత యజ్ఞము యొక్క "అవభృథ స్నానము"

ఇట్టి ఈ ఆత్మయజ్ఞోపాసన (లేక) "జీవిత యజ్ఞము" అనే విశేషమును యజ్ఞ విధానమును ఒకానొక సందర్భములో ఘోర అంగీరస మునివర్యులవారు దేవకీపుత్రుడు, నారాయణ అవతారమూర్తి అగు శ్రీకృష్ణ భగవానునికి బోధించటము జరిగింది.

"ఈ ఆత్మ యజ్ఞోపాసన → సమస్త యజ్ఞముల అనివార్య ఆవస్యకత (అవసరము) లేకుండా చేయగలదు" - అని శ్రీకృష్ణునికి అంగీరసముని బోధించారు. అది అట్లే ప్రసంశించబడి శ్రీకృష్ణునిచే స్వీకరించబడింది. అన్యము పట్ల అతీతత్వము సిద్ధించుకొని శ్రీకృష్ణుడు అనన్యులు అచ్యుతులు అయ్యారు. సమస్తమునకు పరమగు, సమస్తము అయి ఉన్న స్వస్వరూపమునందు స్వస్థితిని, సుస్థితిని స్వాభావికము చేసుకొన్నవారైనారు.

ఘోర ఆంగీరస మహాశయులవారు ఇంకా ఇట్లా బోధించారు.

ఓ శ్రీకృష్ణా! స్వతఃగానే ఆత్మగా చ్యుతి లేనివాడవు. మార్పు లేనివాడవు. ప్రాణశక్తికే సూక్ష్మాతి సూక్ష్మమగు ఆత్మవు!

---

ఆత్మయజ్ఞము నిర్వర్తించు యోగి '3' మంత్రములు ఆశ్రయించువాడై ఉంటున్నాడు.

**సో అంతవేలాయామ్ ఏత త్రయం ప్రతిపద్యేత।** అధ్యాత్మ జ్ఞాన యోగాభ్యాసి నిరంతరము తన కేవలమగు పరస్వరూపము గురించి (లేక) పూర్ణమగు ఆత్మ గురించి ఈ విధమైన '3' ధ్యానములు (లేక) '3' మననములు నిర్వర్తించుచుండును గాక! ఈ విధంగా ఆత్మ గురించిన గానము చేయుచుండును గాక।

**(1) అక్షితమసి।**

నా యొక్క పరాత్పరత్వమగు ఓ ఆత్మస్వరూప భగవాన్!

మీరు క్షీణించటము అనే ధర్మము ఏమీ లేనివారు. సదా యథాతథమైయున్నవారు। అందుచేత మమ 'అక్షితమ్' (క్షితము లేనివారు)!

ఆత్మ తత్త్వమా! నీవు సమస్తమునకు వేరైన కేవల ద్రష్టవు.

**(2) అచ్యుతమసి।**

– ఓ స్వస్వరూప నిర్మల పరాత్మా! నీవు నీ యొక్క స్వస్థానమునందు నిశ్చలమయ్యే ఉన్నారు. అంతేగాని జీవాత్మగా గాని, జగత్తుగా గాని అగుటలేదు. కేవలము, నిర్మలము, అఖండము నుండి చ్యుతి పొందటం లేదు. అందుచేత అచ్యుతము (Non – Slipped).

**(3) ప్రాణసగ్ంశితిమసీతి।**

– సూక్ష్మమగు ప్రాణ(శక్తి) స్వరూపము అయి ఉన్నావు. సూక్ష్మమగు ప్రాణమునకే ప్రాణేశ్వరుడవు.

ఈ విధమైన '3' సవనములను జీవాత్మగా (As a Unit) "తన యొక్క, సమస్త జీవుల యొక్క, ఈ జగత్తు యొక్క ఆత్మ" అగు 'పరమాత్మ' (Unity) గురించి గానము, సవనము, స్తుతి, మననము, బుద్ధి యొక్క ఏకాగ్రతను నిర్వర్తించునుగాక।

## ద్వే–ఋక్ గానములు

ఆత్మ గురించి విచారణ తపస్సులను చేసిన మహనీయులు ఆత్మ గురించి అనుభవము పొందినవారై, ఆత్మ – తత్త్వమును గానం చేసి ప్రపంచమునకు వినపించినవే "ఋక్కులు". పరమ సత్యము గురించి స్తుతి – ప్రబోధము – గుర్తు చేయటము – సూచనము అగు మార్గదర్శక సూత్ర వాక్యములు ఋక్కులు. అనుభవం నుండి వచ్చిన శాస్త్ర వాక్యములు కాబట్టి ఋక్కులు (ఋక్= పరమసత్యము); అవి గానము చేసిన వారిని 'ఋషులు' అని, అవి గ్రంథస్థమైన వేద విభాగమును ఋగ్వేదము అని చెప్పబడుతోంది.

> అనగా ఋక్కులు గాని, సమస్త వేదములు గాని – "తెలుసుకొన్నవారు" → తెలుసుకోవాలని అనుకునే వారిని తీర్చిదిద్దడానికి ఎలుగెత్తి గానము చేయబడినవి.
>
> అనుభవమే గ్రంథకర్తగాని ఒకరు మాత్రమే గ్రంథకర్త కాదు. అందుచేత వేదములు 'అపౌరుషేయములు' అని, విని తెలుసుకోవలసినవి కాబట్టి 'శ్రుతులు' అని అనబడుచున్నాయి.

**అక్షితము** (వేరై చూచుచున్నట్టిది), **అవినాశి** (నాశము లేనిది), **అచ్యుతము** (చ్యుతి లేనిది) **'ప్రాణసంశితము'** అగు ఆత్మ గురించి (About the one's own Absolute I) – రెండు ఋక్కులు ఇక్కడ చెప్పుకుంటున్నాము.

**ఓ సర్వజనులారా! శృణ్వంతి విశ్వే।** ఈ రెండు ఋక్కులు వినండి।

**(1) ఆది తత్ పత్నస్య రేతసః। జ్యోతిః పశ్యంతి వాసరమ్। పరో యదిధ్యతే దివి।**

సమస్తమునకు ముందే ఉండటం చేత "ఆది" (సనాతనము). ఈ జగత్తుకు తానే కారణం కాబట్టి 'జగత్ కారణము'. అట్టి బ్రహ్మమును సర్వవ్యాపకతా విశేషముగా తత్త్వజ్ఞులగు మహనీయులు సదా దర్శిస్తున్నారు. అగ్నికి ప్రకాశమువలె **బ్రహ్మము**

**యొక్క ప్రకాశ స్వరూపమే ఈ జగత్స్వరూపము.** ఈ ఇంద్రియములకు తారసబడుచున్న సమస్తము చైతన్యరూపమగు బ్రహ్మమునందే సుప్రతిష్ఠితము.

**ఇట్టి సందర్శనము అభ్యసిస్తూ క్రమంగా బ్రాహ్మీదృష్టిని స్వాభావికము, అనునిత్యము, అచ్యుతము చేసుకోండి.**

**(2) ఉత్ వయం తమసః పరిజ్యోతిః పశ్యన్త। ఉత్తరగ్ం స్వః పశ్యన్త।**
**ఉత్తరం దేవం దేవత్రా సూర్యమ్ అగన్మ జ్యోతిః 'ఉత్తమ'మితి। జ్యోతిః 'ఉత్తమమ్' ఇతి॥**

మేము తమస్సును దాటినట్టి ఆవల గల పరిజ్యోతిని చూస్తున్నాము. ఆవల గల స్వస్వరూపమునే అట్టి పరంజ్యోతిగా దర్శిస్తున్నాము. అది దేవతా లోకమునకు కూడా ఉత్తరము (ఆవల). సూర్యునివలె మహత్తరమగు ఆవల గల జ్యోతి స్వరూపమే నేను. సర్వదా పరంజ్యోతి స్వరూపమును పొందియే ఉన్నాను.

సకల దేవతలయందు ప్రకాశరూపుడై తన రస స్వరూప కిరణములచే సర్వదా ప్రేరేపించుచున్న జ్యోతిని గమనిస్తున్నాము. జ్యోతులకే ఉత్తమ జ్యోతిని పొందుచున్నాము.

ఈ విధంగా సర్వాత్మకమగు స్వస్వరూపము గురించి గానము చేయుచుండెదరు గాక!

## 3-18. అష్టాదశ ఖండము-బ్రహ్మము గురించిన చతుష్పాద ఉపాసన

**అధ్యాత్మోపాసన - మనో ఉపాసన :** మననము చేయుటమే మనస్సు యొక్క రూపము.

అద్దము నిశ్చలముగా (కదలక) ఉండగా, అందులో ప్రతిబింబించే దృశ్యములు (కదులుతూ) అనిశ్చలము కదా! 'మనస్సు' అనేది దర్పణము వంటిది.

దృశ్యముగా అనుభవమయ్యేదంతా మనోదర్పణ - అంతర్గత ప్రతిబింబ వ్యవహారము వంటిది. అందుచేత :

**మనో బ్రహ్మేతి। "మనస్సే బ్రహ్మము"।** ఈ భౌతిక దేహములో ఏ మనస్సు ప్రవర్తించుచూ కనిపిస్తోందో - అట్టి మనస్సు బ్రహ్మముగా ఉపాసించబడుగాక! (గమనిక : నిజమునకు సూక్ష్మమైన మనస్సులోనే దేహములు ప్రకటితమగుచున్నాయి).

మననము చేయటమే మనస్సు. "మననము చేయటము" అనుదానిని బ్రహ్మముగా ఉపాసించటమే "మనో బ్రహ్మోపాసన" తనలోని మనస్సే బ్రహ్మముగా ఉపాసించటమును "తనయందు తాను- ఆత్మోపాసన" కాబట్టి **"అధ్యాత్మోపాసన'** అనబడుతోంది.

**అధ్యాత్మము (దేహము యొక్క తత్త్వము) ఉపాసించటము :** దేహమునకు సంబంధించిన ఈ ధ్యానము (అధ్యాత్మ ధ్యానము) '4' పాదములు కలిగి ఉన్నది. **తదేతత్ చతుష్పాదే బ్రహ్మ।**

(1) వాగింద్రియము (2) ప్రాణము (3) నేత్రములు (చూపు) (4) శ్రోత్రియము (వినికిడి) - ఇవి 'మనస్సు' అనే బ్రహ్మము యొక్క 4 పాదములు. వీటి గురించి వివరించుకుంటున్నాము.

## అధ్యాత్మిక '4' పాదముల గురించి (లేక) 'మనస్సు' యొక్క '4' పాదముల గురించి

### 1. వాక్ ఏవ బ్రహ్మణః

**మనస్సు యొక్క మొదటి పాదము :** వాక్ ఇంద్రియము : ఇది అగ్ని యొక్క జ్యోతి (తేజో) రూపమైనట్టి పాదము. ఒకడు తాను మనస్సుతో ఏది యోచిస్తాడో ఆ ఆలోచించినది ఎదుటివాడికి చెప్పాలంటే - అది చెప్పగలిగేది వాక్కు ద్వారానే కదా! వాక్కుగా ప్రదర్శనమయ్యేది ఆత్మస్వరూపమగు మనస్సు చేసే భావన యొక్క తేజో ప్రదర్శనమే.

**వాగేవ బ్రహ్మణః చతుర్థ పాదః। సో అగ్నినా జ్యోతిషా భాతి చ। తపతి చ।** బ్రహ్మము యొక్క అగ్ని - జ్యోతి స్వరూపమే 'వాక్కు'గా జీవునియందు, దేహమునందు వెలుగొందుచున్నది.

**భాతి చ తపతి చ కీర్త్య యశ, సా బ్రహ్మవర్చసేన య ఏవం వేద!** ఎవ్వరైతే "బ్రహ్మమే వాక్కు రూపంగా ప్రకాశించుచు, సమస్తమును శబ్దములుగా, వాక్యములుగా, వేదమంత్రములుగా, ఉపనిషత్ పరమార్థములుగా ప్రదర్శనమగుచున్నది" - అని

"వాక్కు"ను "బ్రహ్మము"గా ఉపాసిస్తారో, తపస్సు చేస్తూ ఉంటారో – అట్టివారు గొప్ప కీర్తిని, యశస్సును పొందగలరు. బ్రహ్మము యొక్క వర్చస్సును పొందుచూ, క్రమంగా తమ యొక్క స్వరూపము బ్రహ్మముగా దర్శించువారై ఫలశ్రుతిగా బ్రహ్మానందము సిద్ధించుకోగలరు.

## 2. ప్రాణ ఏవ బ్రహ్మణః

ప్రాణమే బ్రహ్మము. అట్టి ప్రాణ బ్రహ్మమే పూర్ణ బ్రహ్మము యొక్క 4 పాదములలో ఒకటి.

'ప్రాణము' అనగా 'శక్తి'. ఆ శక్తి చేత వాయువులో చలనములు ఏర్పడి వాయు తరంగములు అంతటా విస్తరించి కదలికలు ప్రదర్శించుచున్నాయి. **కదిలించేది ప్రాణబ్రహ్మము. కదిలేది వాయు తరంగములు.**

**స వాయునా జ్యోతిషా భాతి చ। తపతి చ।** అట్టి శక్తిచే కదలించి వాయు తరంగములు కల్పించుటచే వాయు చేతనముల నుండి (వాయు తరంగముల కదలిక నుండి) కాంతి, వేడి కలుగుచున్నాయి. అట్టి వాయువుగా ఆత్మజ్యోతియే భాసించుచున్నది. సమస్తమును తపింపజేయుచున్నది.

ఎవ్వరైతే వాయు చలనమును ఆత్మచైతన్య ప్రదర్శనముగా ఉపాసిస్తారో, తపస్సు చేస్తారో – అట్టివారు కీర్తి, యశస్సు, బ్రహ్మవర్చస్సు పొందినవారగుదురు. బ్రహ్మమే తామై వాయు చలనమును చైతన్యపరచుచూ ప్రకాశింపజేయువారై ఆనందించగలరు. సర్వత్రా స్వాభావిక ప్రాణ నిరోధమును సిద్ధించుకోగలరు.

## 3. చక్షురేవ బ్రహ్మణః

బ్రహ్మము యొక్క 4 పాదములలో మరొక పాదము "చక్షువులు – చూపు", ఆదిత్యుడగు సూర్యభగవానుని తేజస్సే సమస్త జీవుల నేత్రములలో 'చూపు' అనే తేజోరూపమై విలసిల్లుతోంది. చక్షుః తేజో। చూపు తేజోరూపమై దృశ్యమంతా సాకారముగా తపింపజేయుచు ఆస్వాదిస్తూ ఉన్నది. అట్టి దృష్టి (చూపు)యే నేత్ర ప్రకాశము, ఆత్మ యొక్క స్వయం తేజో – చైతన్య స్వరూపము అయి ఉన్నది. ఎవడైతే నేత్రములలోని చూపును బ్రహ్మము యొక్క తేజస్సుగాను, బ్రహ్మము యొక్క ఒక పాదముగాను తెలుసుకొని ఉపాసిస్తాడో, – అట్టివాడు కీర్తిని, యశస్సును, బ్రహ్మతేజస్సును పొంది జీవితమును పావనము చేసుకోగలడు.

## 4. శ్రోత్రమేవ బ్రహ్మణః

"చెవి– వినికిడి" బ్రహ్మము యొక్క చతుఃపాదములలో ఒకటి. ఆత్మచైతన్యమే – చెవులలో 'వినుట' అనే రూపముగాను, దిక్కులలో చైతన్యప్రకాశముగాను ప్రభవించుచున్నది. ఎవరు చెవులలో వినికిడి రూపముగాను, 10 దిక్కులలో శబ్దరూపముగాను గల ఆత్మతేజోచైతన్యమును ఎరిగి ఆత్మ యొక్క పాదముగా ఉపాసిస్తారో – వారు కీర్తిని, యశస్సును, బ్రహ్మతేజస్సును పొంది జీవితమును సాఫల్యము, ఆత్మ తేజోమయము చేసుకోగలరు.

# 3–19. ఏకోనవింశ ఖండము – ఆదిత్యో బ్రహ్మ – ఇతి ఆదేశః

ఏ తేజస్సు సూర్యునిలో వెలుగొందుచున్నదో, ఆ తేజస్సే సమస్త దేహములలో ప్రాణశక్తిగాను, చూపు–వినికిడి – స్పర్శ మొదలైన తేజస్సులుగా వెలుగొందుచున్నది. సమస్తమునకు 'ఆది' అయినట్టి అట్టి ఆదిత్య తేజస్సే బ్రహ్మము. అది బ్రహ్మము యొక్క పాదము. అందుచేత ఆదిత్యుని యందు 'పూర్ణ బ్రహ్మోపాసన'ను విధించటము గురించి చెప్పుకుంటున్నాము.

---

**ఆదిత్యో బ్రహ్మ – ఇతి ఆదేశః।** "ఆదిత్యుడు (సూర్యుడు) బ్రహ్మమే।" – అని ఉపాసించాలి. ఇది ఆదేశము (This is an order to be complied with). అట్టి ఆదేశము గురించి ఇప్పుడు వ్యాఖ్యానించుకుంటున్నాము.

**మొట్టమొదట బ్రహ్మమే ఉన్నది. అట్టి తరువాతిదంతా బ్రహ్మము యొక్క వ్యాఖ్యానము మాత్రమే** (Interpretation of Brahman). **బ్రహ్మము యొక్క స్తుతియే!**

ఆదిత్య తేజస్సే ఈ కనబడే దృశ్యము యొక్క సమస్తమునకు ముందు ఏర్పడినదై ఉన్నది. అనగా మొట్టమొదట ఈ జగత్తు లేదు (అసత్తు). ఆత్మ తేజము మాత్రమే ఉండిఉన్నది. అట్టి కేవల తేజస్సు "నేను ఉన్నాను"... అను రూపము గల "సత్"గా అగుచున్నది.

అట్టి 'సత్' – అంకురించినది (The Feature of generating commenced). అట్టి అంకురము నుండి అండము బయల్వెడలింది. **ఇదియే "బ్రహ్మాండము" అనబడుతోంది.** అట్టి అండము (బ్రహ్మమాన) సంవత్సర కాలము అదే అండము ఆకారముగా ఉండి, ఆ తరువాత పగిలింది (Blasted Big Bang).

బ్రహ్మాండము పగిలి – రెండు విభాగములుగా అయినది. ఆ రెండు భాగములలో ఒక ఒర (part) వెండి రంగులోను, మరొకటి బంగారపు రంగులోను మెరువసాగాయి.

**(1) తత్ యత్ రజతగ్ం సేయం "పథివీ"।**

రజతము (వెండి)గా వెలుగొందుచూ ఉన్నట్టిది "పృథివి (భూమి)".

**(2) యత్ సువర్ణగ్ం సా 'ద్యౌః"** బంగారపు రంగులో ప్రకాశించునది ద్యు(స్వర్గ) లోకము.

(3) బ్రహ్మాండము యొక్క బాహ్యమున చర్మముగా ఉన్నట్టిది. **యత్ జరాయుజే పర్వతా।** – అవియే పర్వతములు – పర్వత శిఖరములు.

**(4) యత్ ఉద్బలగ్ం స మేఘో, నిహారో।**

ఉద్బలము (మావి) వంటివి – మేఘములు. మేఘములతో కూడిన 'మంచు'.

**(5) యా ధమన, యస్తా నద్యో।**

శరీరములోని నాడులు నదుల వంటివి.

**(6) యద్వ అస్తేయమ్ ఉదకగ్ం స సముద్రః।** సముద్రములు

అడుగు భాగమున ఉన్న జలము – మూత్రాశయములోని జలములు వంటివి.

## "బ్రహ్మాండము శరీరము వంటిది"

ఆ బ్రహ్మాండము నుండి ఆదిత్యుడు (సూర్యగోళ తత్త్వము) జనించారు. అట్టి సూర్యగోళము జనించిన తరువాత పెద్దపెద్దగా ఘోషశబ్దములు (Big Bang) జనించాయి. ఆ ఘోష శబ్దముల నుండి సర్వ జీవరాశులు, ఆయా వివిధ వస్తు జాలములు పుట్టుకువచ్చాయి. "ఆదిత్యుడు బ్రహ్మాండమునకు 'శరీరి' వంటివాడు" అందుచేతనే సూర్యోదయము కాలమునందు, అస్తమయ కాలమునందు సునిశితమైన చెవులు కలవారికి వేదఘోషల వంటి శబ్దముల వినబడుచూ ఆనందము కలిగిస్తున్నాయి. ఈ సృష్టి సర్వదా ఆనందము కొరకే!

**అభ్యాసో హ యదేనగ్ం సాధవో ఘోషా**
**ఆ చ గచ్ఛేయుః ఉప చ నిమ్రేడేరన్। నిమ్రేడేరన్।**

పైన మనము చెప్పుకొన్న ఉపాసనలు నిర్వర్తించుచూ బ్రహ్మమునే ఉపాసించువారికి (భావించువారికి) ఉత్తమము, శోభాయమానము, సముద్ధరించునవి అగు ఘోష శబ్దములు వినబడగలవు. అవి ఆతనికి ఆత్మ సుఖమును కలిగించగలవు.

**బ్రహ్మానందము, సర్వానందము కలిగించగలవు.**

# ఛాందోగ్యోపనిషత్
# చతుర్థ అధ్యాయము

## 4-1. ప్రథమ ఖండము - దానము మొదలైన కర్మల తేజస్సు - ఆత్మోపాసనా తేజస్సు

మనము బ్రహ్మము యొక్క 4 పాదముల (వాక్కు, ప్రాణము, చూపు, వినికిడి) గురించి ఇప్పటివరకు చెప్పుకున్నాము కదా! ఇప్పుడు వాటిని **"సాక్షాత్ బ్రహ్మము"**గా ఉపాసించే (త్వమేవ ప్రత్యక్షమ్ బ్రహ్మాసి।) విధానము గురించి ఒక దృష్టాంతము సహాయముతో వివరించుకుంటున్నాము.

విద్యను నేర్చుకోవటానికి శ్రద్ధ, దానము, నిగర్వము, తత్పర మొదలైన లక్షణముల ఆవస్యకత దృష్టిలో పెట్టుకొని ఒక సంఘటన చెప్పుకుంటున్నాము.

---

"ఓం"! మహావృషల దేశమును వంశపారంపర్యంగా పరిపాలించే జనశ్రుతి వంశములో పుట్టినవాడు, ఆ జనశ్రుతుని మునుమనుడు జానశ్రుతుడు - రాజుగా ఉండేవారు. ఆయనకు 'దానము' విషయములో ఎంతో ఇష్టము, మరెంతో శ్రద్ధ ఉండేవి. అనేక దానములు చేస్తూ ఉండేవారు. గొప్ప యజ్ఞాలు చేస్తూ, అన్నదానమే మహాయజ్ఞంగా భావించేవారు. స్వయముగా అనేక ధర్మసత్రములు కట్టించారు. ఆ ధర్మశాలలో కూడా బాటసారులకు, పేదవారికి అన్నదానం నిర్వర్తించేవారు. ఈ విధంగా ఆ రాజ్యంలో ఎవరికీ ఎక్కడా ఆకలి బాధ ఉండేదేకాదు.

ఒకానొకరోజు సాయంకాలం చీకటిపడుచున్న సమయంలో జానశ్రుతుడు రాజమందిరపు మేడపై గల విశాల ప్రదేశంలో (రాజప్రాసాదము పైభాగముపై) అటూ ఇటూ పచార్లు చేస్తూ, నిండు పున్నమి ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదిస్తూ, ఇష్ట దైవ ప్రార్థన చేసుకొంటూ ఉన్నారు. అప్పుడు ఆకాశంలో రెండు రాజహంసలు ఆ మేడ పైభాగపు విశాలాకాశంలో ఏదో సంభాషించుకొంటూ, విహారములు చేస్తూ తన వైపు చూస్తూ ఉండటము ఆయనకు కనిపించింది. **"ఈ రాజహంసలు ఏదో ముఖ్యమైన విషయం నా గురించి సంభాషించుకుంటున్నట్లు ఉన్నాయి. ఏమిటది? విందాము"** అని తలిచారు. బుద్ధిని సూక్ష్మతరం చేసి, పక్షుల భాషను ఎరిగి ఉండటం చేత, ఆ సంభాషణను ఏకాగ్రంగా వినసాగారు.

---

**మొదటి రాజహంస : (ముందుగా ఉండి ఎగురుచున్న రెండవ రాజహంసను చూచి)** మిత్రమా! భల్లాక్షా! ఆగుః! ఏమిటా పరుగు? ఇక్కడ మనం సంచరించేటప్పుడు కొంచం జాగ్రత్తగా ఎగరాలయ్యా! కళ్లు తెరచి చుట్టూ చూస్తూ ఎగరండి మరి!

**రెండవ రాజహంస :** ఏం? ఎందుకట? జాగ్రత్తగా చూస్తూ ఎగరమని మీరు ఎందుకు అంటున్నారు? ఇక్కడి ప్రత్యేకత ఏమిటి?

**మొదటి రాజహంస :** హోహోయ్! భల్లాక్ష! భల్లాక్ష! ఇదిగోః మీరు అటూ ఇటూ సరిగా గమనించకుండా ముందుకు పోతున్నారేమోనని "భల్లాక్షా!" హ్రస్వదృష్టి! రోష దృష్టి కలవాడా!" - అన్నాను లేః!

**రెండవ హంస :** ఇక్కడ ఏ ప్రత్యేకత ఉన్నది? ఏమి ప్రమాదము మీకు కనిపిస్తోంది?

**మొదటి హంస :** ఏమున్నదని అడుగుచున్నారేమిటి?

అక్కడి జానశ్రుతుని చూస్తున్నారా? **జానశ్రుతేః పౌత్రాయణస్య సమం దివాజ్యోతిరాతతం!** ఈయన యొక్క అన్నదానము, ధర్మశాల నిర్మాణములు మొదలైన కార్యక్రమముల పుణ్యతేజస్సు ఊర్ధ్వ స్వర్గలోకము (ద్యులోకము) వరకు తేజో అగ్నిరూపంగా వ్యాపిస్తూ ఉండటం గమనించటం లేదా ఏమి? అందుచేత ఈ జానశ్రుతి పౌరాయణుని అన్నదానము చేసిన పుణ్యతేజస్సు తాకవద్దు. తాకారో ... అది మిమ్ములను కాల్చగలదు సుమా! అందుకని జాగ్రత్తగా ఎగురుచూ ఉండండి! హెచ్చరిక చేసి చెప్తుతున్నాను. సరేనాః!

**రెండవ హంస :** (పకపక నవ్వుచూ) ఓయీ! అజ్ఞాన మిత్రమా! అదా, మీరు అనేది! ఈతని అన్నదాన - అన్న సత్ర నిర్మాణ పుణ్య తేజస్సు చూసి అంత గొప్పగా చెప్పుచున్నారే? కొంచెము చూసి 'ఘనం' అంటున్నారేం? మీరు విషయం సమగ్రంగా చూడటం లేదు. అన్నివైపులా సరిగ్గా గమనించక అజ్ఞానంగా మాట్లాడుచున్నారే? ఈ జానశ్రుతునిది ఒక గొప్పా? ఇందులో

ఏమి ఘనత మీకు కనిపిస్తోంది? **కం వర ఏనమ్ ఏతత్ సంతగ్ం – సయుగ్వానమివ రైక్వమ్ ఆత్థేతి?** అన్నదానము చేసిన "కర్మ" తేజస్సు గురించి ఇంతగా హెచ్చరికగా చెప్పుచున్నారే? అటు చూడండి! అది ఆ బండి రైక్వుని (బండి క్రింద విశ్రాంతి తీసుకొంటున్న రైక్వుడు అను పేరు గలవాడు యొక్క) "జ్ఞాన" తేజస్సు అద్దానిని స్తుతించటం లేదేమి?

**మొదటి హంస : యో ను కథం సయుగ్వా రైక్వ – ఇతి?** బండి క్రింద ఉన్న ఆ రైక్వుడు ఎవరు? ఎట్టివాడు? ఆతని కీర్తి ఎట్టిది? ఎందుచేత జానశ్రుతుని కీర్తి – తేజస్సుల కంటే శ్రేష్ఠము? ఏదీ! ఆయా వివరాలన్నీ చెప్పండి। నేను శ్రద్ధగా వింటాను।

**రెండవ హంస :** ఆ రైక్వుడు సుస్పష్టముగా, ఆత్మసాక్షాత్కార యుక్తంగా, నిస్సందేహంగా, అనునిత్య స్వానుభవ పూర్వకంగా ఏదైతే తెలుసుకొని ఉంటున్నాడో అట్టివాడు 'కృతాయము' అనే ఆటను గెలిచినవాడితో సమానం. మిగతావారు గెలిచిన ఆటలన్నీ ఆతడు గెలిచినట్లే!

**జూదములో 1, 2, 3 పందేములు నెగ్గినవానికంటే 4 పందములు నెగ్గినవాడు – 'కృతయామ'।**

'కృతాయమ'వలె సమున్నతుడు. అందరికంటే శ్రేష్ఠుడు. అనగా ఆ రైక్వుడు 4 పందెములు గెలిచినవాడితో సమానము. సమస్తము ఎరిగినవాడు. జనులు ఏఏ సత్కర్మలు చేస్తూ ఉంటారో, అవన్నీ 'కృతాయమ' వలె ఆతనికి వశమై ఉంటాయి.

జనులు ఏ ఏ ధర్మకార్యములు చేస్తారో, అవన్నీ ఆ రైక్వుని ధర్మమునందు స్వాభావికంగానే అంతర్భాగమై ఉంటాయి.

ఏదైతే తెలుసుకోవాలో అది తెలుసుకున్న తరువాత ఇక అట్టివాడు ఎవరైనా సరే, – అట్లే సమస్త ధర్మములు పరాకాష్ఠగా నిర్వర్తించినవాడు కాగలడయ్యా! సమస్త ఉత్తమ కర్మ ఫలములు ఆతనికి అభిముఖమై ఉండగలవు. ఆతడు కృతాయమ (4 ఆటలు గెలిచినాడు) అగుచున్నాడు.

---

తనను అల్పుడుగా నిందిస్తూ రైక్వుని ప్రశంసిస్తూ ఆకాశంలో సంభాషించుకుంటున్న ఆ రెండు హంసల మాటలు జనశ్రుతి పౌత్రాయణుడు అయిన జానశ్రుతుడు – సూక్ష్మబుద్ధితో అత్యంత శ్రద్ధగా విన్నాడు. తను ఆ మాటలలోని అంతరార్థము యోచిస్తూ ఆ రాత్రి నిద్రకు ఉపక్రమించాడు. ఆ తెల్లవార్లూ ఆతని ఆలోచనల మూలంగా సరిగ్గా నిద్రపట్టలేదు. మరునాడు తెల్లవారగానే అంతరంగిక మిత్రుడు రథసారథి, వైతాళికుడు కూడా అయిన సేవకుడు జనశ్రుతుని సమీపించాడు.

**రథసారథి :** ఓ జనశ్రుతి ప్రపౌత్రుడా (మునిమనుమడా)! జానశ్రుత మహారాజా! నిదురలేవండి. తెల్లవారింది. మీ యొక్క అన్నదాన, ధర్మసత్ర సేవలకు సంతోషించనివారు లేరు. మీ పుణ్యఫలము దేవలోకమును కూడా ఆశ్చర్యంలో ముంచివేస్తోంది. మీ దాన ధర్మములు విశ్వమంతా మార్మోగుచున్నాయి. మీకు శుభమగు గాక! సూర్యుడు కూడా మీ దాన – ధర్మములు చూచి సంతోషించటానికై అదిగో! తూర్పున ఉదయిస్తున్నారు. మీవంటి దానగుణము కలవారు ఇతః పూర్వం లేరు. ఇక ఉండబోరు!

**జానశ్రుతుడు :** ఓ ఆంతరంగిక మిత్రమా! రథసారథీ! నీవు నన్ను బండితో కూడిన రైక్వునితో సమానం చేసి పొగడుచున్నావే? అది సరికాదు కదా?

**రథసారథి :** యజమానీ! బండితో కూడిన రైక్వుడా? ఆయన ఎవరు?

**జానశ్రుతుడు :** ఆతడా? ఆయన సర్వ పుణ్యఫలములు ఆయనను ఆశ్రయించి ఉన్నట్టివాడు. ఎక్కడో దగ్గిరలోనే ఉన్నారు. పోయి, ఎట్లాగైనా సరే, ఆతనిని నీవు పిలుచుకురమ్ము. ఆయనతో సంభాషించి మనము తరిద్దాము.

**రథసారథి :** ఆ రైక్వుడు అనగా ఎట్టివాడు?

**జానశ్రుతుడు :** జూదము నందు 4 పందెములు గెలిచి కృతాయనుని వలె –ఏది ఆ బండి క్రింద రైక్వుడు తెలుసుకొనియున్నాడో, ఆతడు '4' పందెములో గెలిచినట్లు. ఇక 1, 2, 3 పందెములు గెలిచినవారు ఆతనికి వశమై ఉన్నవారే! జనులు చేస్తున్న సమస్త కర్మల ఫలములు ఆతనికి వశమై ఉంటాయి. ఆతనికి ఉండియున్న జ్ఞానమే జ్ఞానము. ఇక నావంటివారి పుణ్యకర్మలు ఎంతటివి చెప్పు? ఇవన్నీ సుఖలోక ప్రాప్తివరకే పరిమితము. శాశ్వతమగు ఆత్మానందమును ప్రసాదించలేవు.

**రథసారథి:** అట్లాగా? ఓ యజమానీ! మీరు చెప్పేది ఆశ్చర్యం కలిగిస్తోంది.

**జానశ్రుతుడు :** ఔను! ఆశ్చర్యమే! మరి! సరేం! నీవు వెళ్లు. సమస్త సుకృతాత్ముడు, జ్ఞానవంతుడు అగు ఆ బండి రైక్వుని ఆదరణ – మర్యాదలతో ఇప్పుడే రథముపై తీసుకొని రమ్ము.

**రథసారథి :** స్వామీ! ఆతడు ఎక్కడ ఉంటాడు?

**జానశ్రుతుడు :** అది నాకూ తెలియదు. కానీ మన ఈ ప్రదేశమునకు సమీపములోనే ఉండి ఉంటారు.

రాజుగారి ఆజ్ఞను స్వీకరించి ఆ "రైక్వుడు ఎక్కడ?" అని నగరంలోను, గ్రామాలలోను అడుగుతూ వెతికాడు. కానీ కనబడలేదు. అప్పుడు ఆ రథసారథి తిరిగివచ్చి "యజమానీ! అంతటా వెతికాను. కానీ మీరు చెప్పిన ఆ 'రైక్వుడు' అనే ఆయన ఎక్కడా కనిపించలేదు" – అని పలికారు.

**జానశ్రుతుడు :** ఓ సారథీ! మీరు వెతికారు, బాగానే ఉన్నది. కానీ, బ్రహ్మవేత్త ఎక్కడ ఉంటారో ఆయా చోట్లు వెతకాలి. అంతేగాని, ఏదో గ్రామ–పట్టణ వీధులలో, కొన్ని గృహములలో వెతికి ఏమి లాభం?

**రథసారథి :** బ్రహ్మవేత్తలు ఉండేది ఎక్కడ?

**జానశ్రుతుడు :** ఏకాంతంగా ఉండవచ్చు. అరణ్యంలోనో, నదీ–సముద్ర తీరాలలోను, ఏవైనా దేవాలయాది పవిత్ర స్థలాలలోనో ఉండవచ్చు. అన్యుల సాంసారిక వ్యవహారములు వారిని ఆకర్షించవు కదా! మరల వెతకండి.

ఆ సేవకులు మరల వెతుకుచుండగా వారికి ఒకచోట బండి క్రింద ఉండి దురద పొక్కులను గోక్కుంటూ ఒకాయన కనిపించారు. అప్పుడు ఆ జనశ్రుత సేవకుడు – "ఓ బండి క్రింద ఆశీనులై ఉన్న మహానుభావా! 'రైక్వుడు' అనగా తమరే కదా?" అని అడిగారు.

అప్పుడు ఆ బండి క్రింద పొక్కులు గోక్కుంటూ కూర్చున్న ఆయన – "అవును! నేనే! మీకు సందేహమెందుకు?" – అని పలికారు.

అప్పుడు ఆ సేవకుడు "ఈయనే రైక్వుడు" అని నిశ్చయించుకొని గబగబా జానశ్రుతుని మందిరానికి పరుగుపరుగున వెళ్లి – "అయ్యా! మీరు అడుగుచున్న రైక్వుడు దగ్గరలో గల గ్రామములో ఒక బండి క్రింద ఆశీనుడై ఉన్నాడు".. అని తెలియజేసారు.

## 4-2. ద్వితీయ ఖండము – విద్యార్హత – 6 లక్షణములు

అప్పుడు జానశ్రుతుడు గోవులను, ఒక రతనాల హారమును, కంచరగాడిదల రథమును తీసుకొని రైక్వుడు ఉన్న స్థానమునకు వెళ్లాడు.

**జానశ్రుతుడు :** మహనీయుడవు, ఆత్మతత్త్వము ఎరిగినవాడవు. బండి క్రింద ఆశీనులైనవాడవు అగు – ఓ రైక్వ మహాశయా! నమస్కారము! జనశ్రుత వంశోద్భవస్య, జనశ్రుత ప్రపౌత్రస్య జానశ్రుత నామధేయస్య – అహంభో అభివాదయే!

**రైక్వుడు :** (బండి క్రింద నుండి బయటకు వచ్చి) ఓహో! జానశ్రుత నామధేయుడా? మంచిది. శుభమగు గాక! ఎందుకు నన్ను పిలిచి నమస్కరిస్తున్నారు?

**జానశ్రుతుడు :** అయ్యా! తమకు సమర్పించే ఉద్దేశ్యముతో 600 గోవులను, కంఠహారమును, రెండు కంచరగాడిదలు లాగుచున్న రథమును తీసుకొచ్చాను. దయతో స్వీకరించండి.

**రైక్వుడు :** ఓ జానశ్రుత రాజా! 'ఈ సంపదలతో నాకేమి పని? అయినా, ఎందుకు సమర్పించ వచ్చారు?

**జానశ్రుతుడు : భగవో దేవతాగ్ం శాధి, యాం దేవతామ్ ఉపాస్స – ఇతి?** స్వామీ! మీరు బ్రహ్మజ్ఞులు అవటానికి ఏ దేవతను ఏరీతిగా ఉపాసించారు? అదంతా దయతో నాకు ఉపదేసిస్తూ, వివరించి చెప్పండి. నేను కూడా ఉపాసించగలను.

**రైక్వుడు :** ఓయీ! శూద్రుడా! ఆ గోవులు, ఆ ఆభరణములు, ఆ రథము మీరే ఉంచుకోండి.

(**శూద్రుడు** అని సంబోధించుటలో – నీవు ఇంద్రియములకు తారసబడే దృశ్యమునందే ఆనందము యొక్క ముఖ్యాశయముగా కలిగి ఉండటమును కొనసాగిస్తూ ఉన్నావు అను సూచన.)

**జానశ్రుతుడు :** పోనీ, మీకు '1000' గోవులను తదితర కంఠహారాదులను, కంచరగాడిదలు పూన్చిన రథమును సమర్పించుకుంటాను. మీరు ఉపాసించే తీరు, నాకు మార్గదర్శక – 'బోధ'గా ప్రసాదించండి.

**రైక్వుడు :** శూద్రుడా! అవి కూడా నీవే ఉంచుకో!

**జానశ్రుతుడు :** భగవాన్! ఈ వేయి గోవులు, కంఠహారము, కంచరగాడిదల రథముతో బాటుగా నా కుమార్తె మీకు భార్యగా సమర్పిస్తున్నాను. అంతే కాదు! మీరు ఉన్న ఈ గ్రామమును సమర్పిస్తున్నాను. ఓ పూజనీయా! ఈ సర్వము స్వీకరించండి. మీరు ఆత్మానుభవము సిద్ధించటానికై నిర్వర్తించిన దేవోపాసనను నాకు దయతో ఉపదేశించండి. ఇక నుండి ఈ గ్రామము "రైక్వపర్ణ" పేరుతో ప్రసిద్ధమై మీకు సేవార్హము కాగలదు.

**రైక్వుడు :** ఓ జనశ్రుత పౌత్రేయా! మీ కుమార్తె జానశ్రుతపుత్రిక ముఖమును చూస్తూ ఉన్నాను. ఓ శూద్రా! ఈమె ముఖము పరమశాంతముగా, బ్రహ్మవర్చోయుతముగా, విద్యాదానమునకు తీర్థముగా నాకు అగుపిస్తోంది. బ్రహ్మవిద్య గురించిన మీ అర్హత గురించి కొంచము పరీక్షించాను. అంతే!

(1) బ్రహ్మచారి (2) దానము ఇచ్చేవాడు (3) బుద్ధిమంతుడు (4) బహుశ్రుతుడు (వినగలిగిన సామర్థ్యము కలవాడు) (5) ప్రియమైనవాడు (6) విద్యను గ్రహించు ఉత్సాహము కలవాడు – ఈ ఆరుగురు నాకు తీర్థములతో సమానము. ఇవన్నీ సమర్పించి నీవు నన్ను బోధకుడుగా సంపాదించుకొనుచున్నావు. ఈ లక్షణములన్నీ మీలో కనిపిస్తున్నాయి. కనుక మీరు బోధకు అర్హులు. ఇట్లా పలికి రైక్వుడు అక్కడే జనశ్రుత మహారాజుకు తన ఉపాసన గురించి బోధించటము ప్రారంభించారు.

## 4-3. తృతీయ ఖండము – సంవర్గ విద్య

**రైక్వుడు :** పూజ్యులగు జనశ్రుత ప్రపౌత్రా! జానశ్రుత మహారాజా! సర్వత్రా ఆత్మసందర్శనమునకై నేను అనుసరించిన, అనుసరిస్తున్న – ఉపాసన గురించి వినండి!

**ఆధిదైవోపాసనా। "వాయుర్వావ సంవర్గో" (వాయువే సంవర్గము, సమస్తము తనయందు లీనము చేసుకొనుచున్నట్టిది)**

**వాయుః =** చలనము స్వభావము గల వాయువే

**వావ =** నిశ్చయముగా

**సంవర్గః = అన్నీ** తనయందు లీనము చేసుకొంటున్నట్టిది. సంసర్జనము చేసుకొనుచున్నది. (క్రితం అధ్యాయంలో కృతాయనము – 4 ఆటలు గెలిచినవాడు – 1,2,3 ఆటలు గెలిచినవాడిని అధిగమించి తనయందు కలుపుకొను తీరుగా)

***వాయువు నిశ్చయముగా సంవర్గమే! ఎందుచేత?***

**యదా వా "అగ్నిః" ఉద్వాయతి → వాయుమేవ అప్యేతి!** అగ్ని ఆరిపోయినప్పుడు ఎక్కడికి పోతోంది? వాయువునందే ఆ ఆరిన అగ్ని లీనము అవుతోంది. (మరల మరొకప్పుడు వాయువు నుండే పుడుతోంది కూడా)।

**యదా "సూర్యో" అస్తమేతి వాయుమేవ అప్యేతి।** సూర్యుడు అస్తమించిన తరువాత రోజంతటి సూర్యతేజస్సు ఎక్కడికి వెళుతోంది? వాయువునే పొంది, వాయువులో లీనము అవుతోంది.

**యదా "చంద్రో" అస్తమేతి వాయుమేవ అప్యేతి।** చంద్రుడు అస్తమించిన తరువాత భూమిపై అప్పటివరకు వెల్లివిరిసిన చంద్రకిరణములు, భూమిపై ప్రసరించిన వాటి తేజోమాధుర్యము ఎక్కడికి వెళ్లుచున్నాయి? వాయుత్వమును పొంది, వాయువునందే లీనమౌతున్నాయి.

**యదా "అప" ఉచ్ఛుష్యంతి, వాయుమేవ అపియంతి।** జలము ఎండిపోయినప్పుడు ఆ జలము ఏమగుచున్నది? ఆవిరి అయి వాయుత్వము పొంది, వాయువునందే లీనమగుచున్నది.

**వాయుర్హి ఏవ ఏతాన్ సర్వాన్ సంవృంక్త!** ఈ విధంగా వాయువే అగ్నిని, సూర్యుని, జలమును తనయందు ఏకము చేసుకొనుచున్నది. అందుచేత నేను వాయువును సమస్తము లీనము చేసుకొను దేవతగా గమనించి ప్రాణాయామము మొదలైన శాస్త్ర ప్రవచిత విధి విధానముల ద్వారా వాయు దేవతను ఉపాసిస్తూ ఉన్నాను.

(నమస్తే వాయో! త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి। త్వామేవ **"ప్రత్యక్షం బ్రహ్మ"** వదిష్యామి)–

ఈ విధంగా (1) వాయువు యొక్క చలనమును, (2) ఆ వాయువును కదల్చు శక్తిని కలిపి – దేవతా రూపంగా భావించి వాయోపాసన చేయుచున్నాను. ఇది నా **"అధిదైవతోపాసన"।**

విశ్వమందలి శక్తులన్నీ వాయు రూపంగా భావిస్తూ వాయు దైవోపాసన చేస్తూ ఆత్మను సమీపించసాగాను.

❖ ❖ ❖

**ఆధ్యాత్మోపాసన! "ప్రాణో వావ సంవర్గః"** (అన్నీ చివరికి కలిసిపోయేది ప్రాణమునందే)

ఓ జానశ్రుత మహారాజా! ఈ విధంగా వాయువును "అగ్ని-సూర్య-జల" ఇత్యాదులకు "లయమయే స్థానము"గా ఉపాసిస్తూ "బాహ్య దృశ్యమును ఉపాసించటము" (లేక) "విశ్వశక్తులను ఉపాసించటము" అనే నా యొక్క అధిదైవోపాసన" గురించి విన్నారు కదా!

ఇప్పుడు ఈ శరీరములో ఏ ఉపాసన నిర్వర్తించసాగానో అట్టి నా యొక్క "అధ్యాత్మోపాసన" గురించి వినండి. అనగా, ఈ శరీరములోని శక్తులను ఈఈ విధములుగా ఉపాసిస్తున్నాను.

## ప్రాణోపాసన – ప్రాణ సంవర్గము

ఈ శరీరంలో వాక్కు, చూపు, వినికిడి, మనస్సు ఇవన్నీ తమ తమ ధర్మములు నిర్వర్తిస్తున్నాయి కదా! ఇవన్నీ ఎందులో ఏకము అగుచున్నాయి?

**ప్రాణో వావ సంవర్గః।** ప్రాణశక్తియే నిశ్చయముగా సంవర్గము.

ఒకడు మెలకువగా ఉన్నప్పుడు నోటితో మాట్లాడుచున్నాడు. కళ్లతో చూస్తున్నాడు. చెవులతో వింటున్నాడు. మనస్సుతో ఆయా దృశ్య విషయముల అనుభవము పొందుచున్నాడు.

సరే! ఇప్పుడు ఈతడు నిద్రించినప్పుడు **(యదా యస్మిన్ కాలే స్వపితి)** ఇంద్రియశక్తులన్నీ ఏమౌతున్నాయి?

> **యదా స్వపితి ప్రాణమేవ వాక్ ఆప్యేతి।** నిద్రపోయినప్పుడు శరీరములోని 'వాక్‌శక్తి' → ప్రాణమును చేరి, ప్రాణశక్తితో ఏకము పొందుతోంది. (అగ్ని వాయువులో లీనమగుచున్న తీరుగా) వాక్కు ప్రాణమునందు లీనమౌతోంది.
>
> **చక్షుః ప్రాణగ్ంః** చక్షు (చూపు ఇంద్రియము) ప్రాణమునందే లీనమౌతోంది.
>
> **శ్రోత్రం ప్రాణగ్ం :** శ్రవణేంద్రియము (వినికిడి) కూడా ప్రాణమునందే లీనము అవుతోంది.
>
> **మనః ప్రాణో :** దృశ్య విశేషములను మాట్లాడుతూ చూస్తూ వింటూ ఉన్న మనన రూపమగు మనస్సు కూడా 'ప్రాణము' నందే విలీనము పొందుతోంది.

**ప్రాణో హి వై తాన్ సర్వాన్ సంవృంక్తమ్ ఇతి॥** ప్రాణమే అన్నిటినీ తనయందు కలిపేసుకుంటోంది. లీనము చేసుకుంటోంది. అందుచేత వాక్కుతో (నోటితో) మాట్లాడేది, కళ్లతో చూచేది, చెవులతో వినేది, నాలుకతో రుచి చూచేది, చర్మముతో స్పర్శించేది – ఇదంతా ప్రాణస్వరూపమే! సమస్తమును ప్రాణమే భుజిస్తోంది. సమస్తమును ప్రాణమే భరిస్తోంది కూడా!

ఈ విధంగా:–

(1) దేవతలయందు వాయువు సంవర్గము. వాయు ఉపాసనచే దేవతలంతా ఉపాసించబడువారగుచున్నారు.

(2) ఇంద్రియములందు ప్రాణశక్తి సంవర్గము. ప్రాణశక్తి యొక్క ఉపాసనచే ఇంద్రియములు ప్రియము కాగలవు.

**తే వా ఏతే ద్వే సంవర్గౌ।** వాయువు, ప్రాణము ఈ రెండు సంవర్గములు – అని గ్రహించి అధిదైవతోపాసన, అధ్యాత్మికోపాసన నిర్వర్తిస్తున్నాను. ఈ వాయు–ప్రాణములు రెండూ కూడా బాహ్య – అభ్యంతరములను "తమయందు విలీనము చేసుకోవటము" అనే ధర్మమును నేను గమనించి, ఆ రెండింటినీ "అధి దైవోపాసన, ఆధ్యాత్మికోపాసన" అనుక్షణికంగా నిర్వర్తిస్తూ ఉన్నాను. అట్టి వాయు– ప్రాణములను బాహ్య–అభ్యంతర పుష్పములతో స్తుతిస్తూ ఉన్నాను. ఆరాధిస్తూ ఉన్నాను. సమస్త ఇంద్రియ విషయములతో, యోచనలతో ఆరాధిస్తూ ఉన్నాను. అట్టి నాయొక్క అధి దైవిక – ఆధ్యాత్మికోపాసనలను మరికొంత వివరణగా చెప్పటానికి ఈ సందర్భములో ఒక గాథ (Event) చెపుతాను. వినండి.

✲ ✲ ✲

ఒకప్పుడు ఇద్దరు స్నేహితులు ఉండేవారు.

(1) శునకముని కుమారుడు, కాపేయ గోత్రీకుడైన **శౌనకుడు.**

(2) కక్షసేనముని కుమారుడు అగు **అభిప్రతారి.**

ఈ స్నేహితులిద్దరూ ఒకరోజు ఆశ్రమంలో కబుర్లు చెప్పుకుంటూ ఉన్నారు. మధ్యాహ్న భోజన సమయమైనది.

ఇద్దరూ భోజనమునకు కూర్చున్నారు. ఆశ్రమములోని వంటవారు (cooks) వారికి భోజనము వడ్డించబోతూ ఉన్నారు.

ఇంతలో వేదాధ్యయనములో దిట్ట (expert) అయిన ఒక బ్రహ్మచారి అక్కడకి వచ్చి – "వేదాధ్యయనము చేసిన వేద పండితుడను. బిక్షాం దేహి। అన్నము ప్రసాదించండి" అని పెద్దగా పలికాడు. శౌనకుడు, అభిప్రతారి అది విని కూడా – "ఈతనికి వేద పండితుడననే గర్వం కొంచం ఉన్నట్లుగా కనబడుతోంది. మనము ఏమీ మాట్లాడ వద్దు. ఏమంటాడో చూద్దాము.." అని అనుకొన్నారు. ఆ ఇద్దరు ఏమీ మాట్లాడకుండా ఊరుకొని ఉన్నారు. అప్పుడు అభ్యాగతి (Unexpected Guest) అగు ఆ బ్రహ్మచారి ఈ విధంగా సంభాషించసాగాడు.

**బ్రహ్మచారి :** ఓ కాపేయగోత్ర శౌనకమునీ! **మహాత్మన్ చతురో ఏకః కః స జగార గోపాః।** ఈ శరీరంలో (వాక్కు, చూపు, వినికిడి, మనస్సు అనబడే) నలుగురు మహాత్ములగు దేవతలు వేంచేసియున్నారు. ఈ నలుగురు మహాత్ములను మ్రింగివేస్తున్న ఏకస్వరూపుడగు ప్రాణేశ్వరుడు ఈ దేహమంతా వేంచేసి ఉన్నారు. ఆయనయే ప్రజాపతి అయి భువనములను, తదితర సమస్తమును రక్షించుచూ ఉన్నారు.

**తాం న అభి పశ్యంతి మర్త్యా?** అట్టి ప్రాణశక్తి ఈ ప్రాణులకు సర్వశక్తిమంతుడుగా, సర్వసంరక్షకుడుగా ఉన్నారు కదా! అట్టి ప్రాణప్రదాత, సర్వరక్షకుని ఈ మానవులు గమనించటమే లేదేమి? ఆయనను ఉపాసించటమే కాదు. రక్షణ పొందుతూ కూడా రక్షకుని చూచుచూ గుర్తించరేమీ? ఆ సమస్త సంరక్షకుని ఉపాసించరేమి? సమర్పించరేమి? ఓ శౌనక మునీ! ఏమిటి మీ సమాధానం?

ఓ కక్షసేనముని కుమారుడగు అభిప్రతారీ! **బహుధా వసంతం – యస్మై వా ఏతత్ అన్నం, తస్మా ఏతత్ న దత్తమ్ – ఇతి?** ఎవ్వరైతే సమస్తమైన అన్నమును ప్రసాదిస్తూ ఉండగా మీరు ఆ అన్నమును తినబోతూ కూడా, ఆ అన్నదాత వచ్చి వాకిట నిలుచుని "భిక్షాం దేహి।" అని అన్నమును అడిగినప్పుడు కూడా, ఆయనకు అన్నము సమర్పించరేమి? నిరంతరము యజ్ఞము మొ॥న వాటిచే యజ్ఞవేత్తలు ఎవరిని సంతృప్తి పరుస్తున్నారో అన్నమంతా వారి ప్రసాదమే కదా?

శౌనక కాపేయుడు ఆ బ్రహ్మచారి పలికిన మాటలన్నీ అత్యంత శ్రద్ధగా విన్నారు. "ఈయన మాటల యొక్క అంతరార్థము ఏమిటి?" అని మనస్సుతో విశ్లేషణ చేస్తూ ఆ బ్రహ్మచారి వద్దకు వెళ్లారు.

**శౌనకముని :** వేదార్థములు సమీకరించుచూ పలుకుచున్న ఓ బ్రహ్మచారీ! నమస్తే! అభ్యాగతులుగా వేంచేసియున్న మీకు నమస్కరిస్తూ ఉన్నాము. దయచేయండి! మేము సమర్పించు అన్నము స్వీకరించెదరు గాక!

మీరు చెప్పినది నిజమే! మేము ఈ విధంగా ఉపాసిస్తున్నాము :-

**ఆత్మా సర్వస్య స్థావర జంగమస్య।** ఈ జగత్తులో స్థావర – జంగమ (కదలని మరియు కదిలే) సమస్తమునకు 'ఆత్మ' (The Self) ఆ ప్రజాపతియే! దేవతలకు ఆత్మ ఆయనయే। ఆయనే అంతటికీ సృష్టికర్త। వాయు రూపుడై అగ్ని ఆదిత్యుడు మొదలైన

దేవతలందరిని తనయందు ఉపసంహరించుచు మ్రింగివేయుచు, (మరల) తన నుండి అగ్ని, ఆదిత్యాది దేవతలను పునః ఆవిర్భవింపజేయుచున్నది ఆ ప్రజాపతియే! **ఇది ఆయన యొక్క అధిదైవతా విన్యాసము.**

ఆయనయే ప్రాణశక్తి రూపుడై వాక్కు, కన్ను, చెవి మొదలైన ఇంద్రియ దేవతలను ఒకప్పుడు తనయందు ఉపసంహారము (withdrawal) చేసి ఇంకొకప్పుడు లీలాక్రీడా వినోదంగా ఆవిర్భవింపజేయుచున్నారు. సమస్త ప్రాణులకు ఆ ప్రజాపతియే ప్రాణప్రదాత! ఆయన అందరికి ప్రాణేశ్వరుడు! వాక్కు– ఆకాశము, అగ్ని – ఆదిత్యుడు, మనస్సు – చంద్రుడు మొదలైన వాటికి 'ఆత్మ' (The self) ఆ ప్రజాపతియే! ఆయన అనసూరి (సూరి, అసూరి కానివాడు).

ఆయనయే బంగారు దంతములతో సమస్తము భక్షించువారు. 'అన్నము' అయినదానిని, అన్నము కానిదానిని కూడా భక్షిస్తున్నది ఆయనయే! ఆయన దేనికీ ఆహారము కాదు. భక్షింపబడువాడు కాదు. అన్నము ఆయన రూపమే! భక్షించేదీ, భక్షించబడేదీ ఆయనయే! ఓ బ్రహ్మచారీ! బ్రహ్మమునే సర్వత్రా మేము భావన చేస్తున్నాము. అట్టి మహాంతమగు మహిమగల సృష్టికర్తయగు ప్రజాపతి స్వరూప బ్రహ్మమునే ఉపాసిస్తున్నాము. సమస్తమునందు బ్రహ్మమే మాకు కనబడుతోంది. బ్రహ్మమే స్వరూపముగల బ్రహ్మచారీ! మీరు మేము ప్రియముగా సమర్పిస్తున్న ఈ ఆహారము (అన్నము) స్వీకరించండి. మీరు చెప్పిన వాక్యముల సారము మేము స్వీకరిస్తున్నాము.

**"ఓ వడ్డన చేయు సేవకులారా! ఈ బ్రహ్మచారికి సుష్టుగా భోజనము వడ్డించండి' –** అని అక్కడి వారికి శౌనకుడు ఆజ్ఞ ఇచ్చారు. ఆ విధంగా ఆ బ్రహ్మచారికి భిక్షపెట్టారు. ఆయన భోజనము చేసి తృప్తి చెంది, ఆశీర్వదించారు.

**అంతరార్థము :**

వారు బ్రహ్మచారికి భిక్షను ఇచ్చారు. ఏ భిక్షను? **తస్మా ఉ హ దదుస్తే వా ఏతే పంచాన్యే (5) పంచాన్యే (5) – దశ (10) సంతస్తత్ కృతమ్।** కృతము అగుచున్న "5+5 =10" ఆత్మభగవానునికి సమర్పించారు.

I. **అధిదైవిక పంచకము :** (1) భుజించుచున్నట్టి వాయువు; (2) అగ్ని, సూర్యుడు, చంద్రుడు, జలము "4" – మొత్తము ఐదు (5)

II. **ఆధ్యాత్మిక పంచకము :** (1) సమస్తము భుజించుచున్న ప్రాణము (2) వాక్కు, నేత్రము, చెవి, మనస్సు అను "4" – మొత్తం ఐదు (5)

III. ఈ దిక్కులన్నిటియందు ఆ అన్నమే '10' అయిన కృతము – విరాట్ భగవానుడే – సమస్తము భక్షించువాడు.

ఇవన్నీ ప్రజాపతి యొక్క అన్నములే। ఈ అన్నమే ప్రజాపతిచే కృతము (Worked out by the Worker of the Universe).

- ☞ ఆ విరాట్ ప్రజాపతియే అన్నము సృజించువాడు.
- ☞ ఆయనయే అన్న భక్షకుడు కూడా!
- ☞ అన్నమే "కృతము"।
- ☞ ఆయనయే సమస్తమును "సాక్షి"గా సర్వదా చూస్తూ ఉన్న ఆత్మ।
- ☞ **ఈ జీవుడు సర్వదా స్వతఃగా ఆత్మస్వరూపుడే।**

అన్నము = భక్షింపబడుచున్నది / **"కృతము".**

అన్నాదము = భక్షించువాడు / **"కృతుడు".**

అన్నము ప్రసాదించునది.

ఈ విధంగా పరమాత్మను ఎరిగి ఆరాధించువాడు అన్నము (దృశ్యమును) జీర్ణించుకోగలడు. అన్నాదుడై సమస్తమును ఆత్మయందు ప్రతిక్షేపించి, ఆత్మకు అనన్యుడై, ఆత్మానందము పొందుచుండగలడు. కృతకృత్యుడు కాగలడు।

# 4-4. చతుర్థ ఖండము - సత్యకామ గురుకుల ప్రవేశము

జబాలి అనే ఒకావిడ ఉండేవారు. వారి కుమారుడు "సత్యకాముడు".

ఒకరోజు జబాలి తన కుమారుని కూర్చోబెట్టి ఇట్లా బుజ్జగించింది.

**జబాలి :** బిడ్డా! సత్యకామా! ఏమిటి కొంచము ఆలోచనగా కనిపిస్తున్నావు?

**సత్యకామ :** అమ్మా! నేను ఇక విద్యాభ్యాసము చేయాలి కదా! గురుకులము చేరి గురువులను విద్యకొరకై శరణు వేడదలిచాను. అందుకు నీ అనుమతిని అర్థించుచున్నాను. అనుజ్ఞ ఇచ్చి నా ఆశయము నెరవేర్చెదవుగాక।

**జబాలి :** నాయనా! మంచి ఆలోచన. శుభస్య శీఘ్రం. వెంటనే వెళ్లి గురుకులంలో ప్రవేశించు. గురువు అనుజ్ఞ తీసుకొని వారి వద్ద విద్య అభ్యసించు. వారు ఏ విధంగా ఆజ్ఞాపిస్తే ఆ విధంగా సేవించి, గురు అనుగ్రహం పొందు. విద్యావంతుడవు అగుము!

**సత్యకామ:** అమ్మా! గురువును దర్శించగానే గోత్రనామాలు చెప్పి నమస్కరించాలి కదా!

**జబాలి :** అవును నాయనా! "చతుస్సాగర పర్యంతం గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు।"

"ఇదమ్" ఋషిస్య,

"ఇదమ్" గోత్రోద్భవస్య

"ఇదమ్" నామధేయస్య

"ఇదమ్ - వేద శాఖా అధ్యాయీ అహంభో అభివాదయే।"

అని గురుదేవుల పాద పద్మములను కళ్లకు అద్దుకొని విద్యాభ్యాసమునకు గురుకులంలో చేరటానికి బ్రహ్మచర్య దీక్షకు అనుజ్ఞను అర్థించాలి.

**సత్యకామ :** అమ్మా! అట్లాగే చేస్తాను. అయితే నేను నా గోత్రము, ఋషులు ఏమని చెప్పాలి? తండ్రి పేరు అడిగితే ఏమని బదులివ్వాలి? **అసలు నేను ఏ గోత్రమునకు చెందినవాడను?**

**జబాలి : న అహమ్ ఏతత్ వేద, తాత! - యత్ గోత్రమ్ - ఇతి।** నాయనా! నీది ఏ గోత్రమో నాకు తెలియదు.

**సత్యకామ : కస్మాన్ న వేత్సి?** నా గోత్రము, ఋషులు ఎవ్వరో ఎందుచేత నీకు తెలియదు?

**జబాలి : బహు అహం చరంతీ పరిచారిణీ యౌవనే। త్వామ్ అలభే సా అహమ్ ఏతత్ న వేద।** నేను యౌవనవతిగా ఉన్నప్పుడు చాలా ఇళ్లల్లో పరిచారికగా పనిచేస్తూ ఉండేదానను. ఆ కాలంలో నీవు నా కడుపున పడ్డావు. నీవు ఎవరివలన నాకు పుట్టావో - నేను కూడా చెప్పలేను. ఎవరికి పుట్టావో తెలుసుకొనే అవకాశమే లేదు కదా! అందుచేత నీ గోత్రమేమిటో నాకు తెలియదు. తెలిసియున్నంతవరకు సత్యము ఇది।

- నేను 'జబాల' అనే పేరుతో పరిచారికగా చెప్పబడుచూ వచ్చాను. అందరు ఆ పేరుతో నన్ను పిలిస్తూ ఉండేవారు. - **జబాలాతు నామాహమస్మి।**
- నీకు 'సత్యకాముడు' అనే పేరు పెద్దలు పెట్టారు. **సత్యకామో నామ త్వమసి.**

తల్లి పేరు మాత్రమే తెలుసు కాబట్టి గోత్రము తెలియదు. అందుచేత "సత్యకామ జాబాల"- ... అని పేరు గురువులకు చెప్పు.

❖ ❖ ❖

అప్పుడు ఆ సత్యకాముడు హరిద్రుమత మునీంద్రులవారి కుమారుడగు గౌతముని ఆశ్రమమునకు చేరారు. గౌతమ గురుదేవుని పాదపద్మములకు సాష్టాంగ దండప్రణామములు చేసి వినమ్రుడై నిలుచున్నారు.

**సత్యకాముడు : బ్రహ్మచర్యం భగవతి వత్స్యామి ఉపేయం భగవంతమితి।** హే భగవన్! హారిద్రుమత గౌతమ గురుదేవా!

నమోనమః। బ్రహ్మచర్య వ్రతము స్వీకరించి తమ పర్యవేక్షణలో విద్యాభ్యాసము చేయటానికై గురుకులవాసమునకు వచ్చాను. తమకు శిష్యుడై విద్యను అభ్యాసించటానికి అనుజ్ఞ ప్రసాదించ వేడుకొంటున్నాను. విద్యకై మిమ్ములను శరణు వేడుచున్నాను.

**హారిద్రుమత గౌతముడు :** ప్రియదర్శనా! సౌమ్యా! పేరు చెప్పు। **కిం గోత్రో ను సోమ్యా!** ఏ గోత్రమునకు చెందినవాడవు?

**సత్యకామ జాబాల : న అహమ్ ఏతత్ వేద భో! యత్ గోత్రో అహమ్।** గురుదేవా! నేను ఏ గోత్రమునకు చెందినవాడనో నాకు తెలియదు. నా గోత్రము గురించి నేను ఇంటి నుండి బయలుదేరేటప్పుడు నా మాతృదేవతను ప్రశ్నించాను। అప్పుడు మా అమ్మ "బిడ్డా! నేను యౌవనంలో ఉన్నప్పుడు అనేక చోట్ల పరిచారికగా పనిచేసాను. ఆ కాలంలో నీవు జన్మించావు. నీ గోత్రము తెలియదు. అయితే నా పేరు 'జబాల' అని లోకప్రసిద్ధము. నీకు 'సత్యకాముడు' అనే పేరు నిర్ణయించబడింది" అని చెప్పెను.

నా పేరు సత్యకాముడు.

నా తల్లి పేరు జబాల.

అందుచేత నేను సత్యకామ జాబాలి।

అహం భో అభివాదయే! ఇంతవరకే చెప్పగలను. ఓ పూజనీయా! గురుభగవాన్। నన్ను అనుగ్రహించండి।

**హారిద్రమత గౌతముడు :** స్వభావతః నీవు బ్రాహ్మణుడవే! ఇంత చిన్న వయస్సులో బ్రహ్మ విద్య పట్ల ఆశయము కలవాడు మాత్రమే నీ వలె ఉన్నది ఉన్నట్లు చెప్పగలడు. సత్యము చెప్పావు కాబట్టి సత్యకామ నామధేయుడవగు నీవు 'బ్రాహ్మణుడవు' అని సిద్ధాంతీకరిస్తున్నాను. ఇప్పుడే అడవికి వెళ్లి హోమము కొరకు యజ్ఞ విధులకు సమిధలు (కట్టెలు) తీసుకొని రమ్ము. నీవు సత్యము నుండి దూరము కాలేదు. ఉపనయనమునకు సంసిద్ధుడువు అగుము. మేము దంపతులము నీకు ఉపనయనము జరుపుతాము.

---

ఈ విధంగా పలికి, తానే పీటలపై దంపత సమేతంగా కూర్చుని సత్యకామునకు ఉపనయనము జరిపించారు.

ఆ మరునాడు గురుకులములోని గోసంపదలో బక్కచిక్కిన '400' గోవులు విడి చేయబడ్డాయి. గురుదేవులు "ఓ సత్యకామా! నీవు ఈ '400' గోవుల వెంట అడవికి వెళ్లు. వాటిని చక్కగా మేపి తిరిగి తీసుకువస్తావు కదా!".. అని ఆజ్ఞాపించారు.

**సత్యకాముడు :** గురువర్యా! తమ ఆజ్ఞను నిర్వర్తిస్తాను. ఈ '400' గోవులు '1000' గోవులు అయిన తరువాత తిరిగి గోసంపదతో వచ్చి మీ దర్శనం చేసుకుంటాను.

కొన్ని సంవత్సరములు ఆ గోవులను సంరక్షించగా అవి 1000 గోవులు అయ్యాయి.

ఒకరోజు ఆ గోవులతో ఉన్న వృషభము (ఎద్దు) – సత్యకాముడు కాపలాగా కూర్చున్న చోటికి వచ్చి ఇట్లా సంభాషించసాగింది.

## 4-5. పంచమ ఖండము-బ్రహ్మము యొక్క "ప్రకాశవాన్" పాదము – "4" దిక్కులు

**<u>తూర్పు – పడమర – దక్షిణ – ఉత్తర :-</u>**

**వృషభము :** ఓయీ! సత్యకామా! సత్యకామా! సత్యకామా!

**సత్యకాముడు :** భగవాన్! పూజనీయా! వృషభరాజమా? చెప్పండి. ఏమి మీ అవసరము (లేక) సందేశము?

**వృషభము :** మేము వేయి (1000) ఆవులము అయ్యాము. గురుదేవుల వద్ద మీరు చేసియున్న ప్రతిజ్ఞ నెరవేరినట్లే కదా! ఇక మమ్ములను గురుకులము ఉన్న ప్రదేశమునకు తోలుకువెళ్లండి. ఆచార్యుల వారికి, ఆశ్రమవాసులకు పాలు ఇచ్చి సేవించుకుంటాము.

**సత్యకాముడు :** అట్లాగే చేయాలని నేను కూడా అనుకుంటున్నాను. అయితే "గురుదేవుల వద్ద బ్రహ్మవిద్య కొరకై నేను అర్హుడను అగుదునో? కానో?" – అని కొంచము మీమాంసపడుతూ ఉన్నాను.

**వృషభము :** ఓహో! అదియా నీ అనుమానము? అయితే ఒకపని చేద్దాం. నీ కొరకు నేను బ్రహ్మము యొక్క పాదము బోధిస్తాను. బోధించమంటావా? **బ్రహ్మంశ్చ తే పాదం బ్రవాణీతి?**

**సత్యకాముడు : బ్రవీతు మే భగవన్!** ఓ వృషభ దేవా! పూజనీయులగు తమరు దయచేసి 'బ్రహ్మము' యొక్క పాదము నాకు బోధించండి.

**బ్రహ్మము యొక్క మొదటి పాదము – "ప్రకాశవాన్" పాదము.**

**వృషభము :** బ్రహ్మమునకు

తూర్పు దిక్కు – ఒక కళ
పడమర దిక్కు – రెండవ కళ
దక్షిణ దిక్కు – మూడవ కళ
ఉత్తర దిక్కు – నాలుగవ కళ

ఈ నాలుగు దిక్కులు బ్రహ్మము యొక్క ఒక పాదము యొక్క నాలుగు కళలు. **ఇది ప్రకాశవాన్** (Function of manifesttaion) **పాదము.**

ఎవ్వడైతే "ఈ నాలుగు దిక్కులు బ్రహ్మము యొక్క ఒక పాదమునకు సంబంధించిన నాలుగు కళలు"... అని భావించి నాలుగు దిక్కులను బ్రహ్మోపాసనగా స్వీకరిస్తాడో అట్టివాడు ప్రకాశమయ లోకములలో (బ్రహ్మము గురించిన జ్ఞానబోధ, బ్రహ్మాభావన కలుగుచోట్లకు) పోగలడు. ఆతడు భౌతిక లోకములను జయించగలడు. (లోకములు బ్రహ్మమునకు అన్యము – అనే భ్రమ తొలగగలదు)

ప్రకాశవంతుడై ప్రకాశపూర్ణ లోకములకు వెళ్లగలడు. (దేవతలు, గంధర్వులు ఉండే) ప్రకాశవంతుల లోకము సిద్ధించుకోగలడు.

- దిక్కులను బ్రహ్మముగా ఉపాసించెదవు గాక!
- బ్రహ్మము యొక్క ఒక పాదపు 4 కళలుగా భావించి బ్రహ్మోపాసనను చేయుచుండెదవుగాక। **ఇది "ప్రకాశవాన్" పాద బ్రహ్మోపాసన।**

ఇట్లా చెప్పి వృషభము బోధను విరమించింది.

**సత్యకాముడు :** ఓ వృషభ రాజ గురూ! మీరు చెప్పినట్లు 4 దిక్కులను బ్రహ్మ చతుష్పాదములలో ఒక పాదము యొక్క కళలుగా 4 దిక్కులను ఉపాసిస్తూ ఉంటాను.

**వృషభము :** సంతోషము

**సత్యకాముడు :** వృషభ రాజమా! మరి బ్రహ్మము యొక్క రెండవ పాదము గురించి శ్రవణము చేయటానికి నేను సంసిద్ధుడనై ఉన్నాను. దయచేసి బోధించండి.

**వృషభము :** సత్యకామా! బ్రహ్మము యొక్క రెండవ పాదము గురించి నీకు బోధించటానికి అగ్నిదేవుడే తగినవారు. వారిని అర్థించు.

## 4-6. షష్ఠి ఖండము – బ్రహ్మము యొక్క "అనంతవాన్" పాదము (పృథివి – అంతరిక్షము – ద్యులోకము – సముద్రము)

ఆ మరునాడు తెల్లవారగానే సత్యకాముడు రోజూలాగానే ఆవులను త్రోలుకొని, వాటిని మేపటానికై అడవికి వెళ్లాడు. ఆవులు మేస్తూ ఉన్నాయి. అవి ఉన్నచోటే ఒక చెట్టు క్రింద కూర్చుని అక్కడి రాళ్లతో అగ్నిని పుట్టించి, ఎండుపుల్లలు ఏరుకొచ్చి (అగ్నిని) ప్రజ్వలింపజేయసాగాడు. మండుచున్న అగ్నికి దగ్గరగా తూర్పు ముఖంగా ఆశీనుడైనాడు. అగ్నిదేవుని మనసా వాచా ప్రార్థించసాగాడు. అగ్నిదేవుడు సాకారుడై ప్రత్యక్షమైనారు.

**అగ్ని :** ఓ సత్యకామా! సత్యకామా! సత్యకామా!

**సత్యకాముడు :** భగవాన్! అగ్నిదేవా! నమోనమః।

**అగ్ని :** సత్యకామ జాబాలా! నన్ను ఎందుకు, ఏమికోరి ఆహ్వానిస్తున్నావు?

**సత్యకాముడు :** హతాశనుడవు, హవ్యవాహనుడవు అగు ఓ అగ్నిదేవా! మీకు శ్రమ ఇస్తున్నందుకు క్షంతవ్యుడను. బ్రహ్మము గురించి మీరు చెప్పగా వినదలచి మిమ్ములను ఆహ్వానించాను.

**అగ్ని :** మంచిది। **బ్రహ్మణః సోమ్య తే పాదం బ్రవాణీతి।**

నీ ప్రార్థనను మన్నించి నీకు బ్రహ్మము యొక్క (ఒక) పాదము గురించి బోధించగలను,

**సత్యకాముడు :** అగ్ని భగవాన్। బ్రహ్మచర్యవ్రతుడనై జగత్ తేజోవిహారులగు మీకు శరణు। శరణు। దయచేసి గురువై బోధించండి.

**అగ్నిదేవుడు :** బ్రహ్మము యొక్క రెండవ పాదమునకు '4' అంశలు (కళలు) ఉన్నాయి.

(1) పృథివి (భూమి) (2) అంతరిక్షము (ఆకాశము) (3) ద్యులోకము (స్వర్గలోకము) (4) సముద్రము

ఇవి ఈ 4 రూపములు బ్రహ్మము యొక్క కళలే. ఈ నాలుగు అనంతములు.. అనంతమగు బ్రహ్మము యొక్క అనంత ప్రదర్శనములు. **ఇది అనంతవాన్ పాదము.**

**ఈ పృథివి, అంతరిక్షము, ద్యులోకము, సముద్రములను ఎవ్వరైతే బ్రహ్మము యొక్క అనంతవాన్ పాదములుగా ఉపాసిస్తారో, అట్టివారు ఆత్మ యొక్క అనంతత్వము సంతరించుకోగలరు.**

ఓ సత్యకామా! ఇక నేను బ్రహ్మము యొక్క పాదము గురించిన బోధను విరమించుచున్నాను. బ్రహ్మము గురించిన '3'వ పాదము గురించి – **హగ్ంసః తే పాదం వక్త ఇతి।** – హంస నీకు బోధించగలదు.

ఈ విధంగా పలికి అగ్నిదేవుడు అంతర్ధానమైనారు.

## 4-7. సప్తమ ఖండము – బ్రహ్మము యొక్క "జ్యోతిష్మాన్" పాదము
## (అగ్ని – సూర్యుడు – చంద్రుడు – విద్యుత్)

ఆ మరురోజు యథావిధిగా సత్యకాముడు మేతకై గోవులను అడవిలోకి తోలుకొని మేపసాగాడు. సాయం సమయంలో ఒకచోట సత్రాగ్ని (రాళ్ల ఒరిపిడితో తయారు చేసిన అగ్ని)ని వెలిగించారు. వెనుకగా తూర్పుముఖంగా ఆసీనులైనారు. "హంస"ను భక్తితో ధ్యానం చేసారు. ఒక హంస వచ్చి ఎదురుగా నిలుచున్నది.

**హంస :** సత్యకామా! సత్యకామా! సత్యకామా! నన్ను ఉపాసించావు కదా! ఎందుకొరకు?

**సత్యకాముడు :** హే సోఽహమ్ ప్రతీతి గల హంస భగవాన్! నమస్కారము. నాకు బ్రహ్మము యొక్క '3'వ పాదము గురించి బోధించగలరని అగ్నిదేవులవారు నిన్న చెప్పి ఉన్నారు. నాపై అనుగ్రహముతో బ్రహ్మము యొక్క '3'వ పాదము ఉపదేశించండి.

**హంస :** బ్రహ్మము యొక్క '3'వ పాదమునకు '4' కళలు.

(1) అగ్ని (2) సూర్యుడు (3) చంద్రుడు (4) విద్యుత్తు(తేజస్సు). ఇవి బ్రహ్మము యొక్క 'జ్యోతిష్మాన్' పాదము – యొక్క '4' కళలు. ఈ విధముగా జ్యోతిష్మాన్ పాదము యొక్క 4 కళలు అగ్ని, సూర్యుడు, చంద్రుడు, విద్యుత్తు (మెరుపు/వెలుగు) అని తెలుసుకుని ఎవరు ఉపాసిస్తారో, అట్టివారు జ్యోతిర్మయ లోకములను జయించగలరు. ఆత్మయందే జ్యోతిర్మయ లోకములను ఆత్మకు అనన్యముగా దర్శించగలరు.

ఓ సత్యకామా! ఈ 'జ్యోతిష్మాన్' అను బ్రహ్మము యొక్క '3'వ పాదము గురించి చెప్పాను కదా! నేను బోధను విరమించుచున్నాను.

ఇక బ్రహ్మము మొక్క నాలుగవ పాదమును గురించి 'ముద్గుష్ట' అనే నీటికాకి నీకు బోధించగలదు.

ఈ విధంగా పలికి హంస అంతర్ధానమైనది.

# 4-8. అష్టమ ఖండము - బ్రహ్మము యొక్క 'ఆయతన' పాదము (ప్రాణశక్తి-చూపు-వినికిడి-ఆలోచన)

ఆ మరునాడు తెల్లవారగానే గోవులను తోలుకుపోయి, అవి గుమికూడినచోట సత్యకాముడు అగ్నిని ప్రజ్వలింపజేసాడు. అగ్నికి వెనుకవైపుగా తూర్పుదిక్కుగా ఆసీనుడై "ముద్గుష్ట జలచపక్షి దేవత"ను ఉపాసించసాగారు. ముద్గుష్ట ఎదురుగా ప్రత్యక్షమైనది.

మద్గురు - ముద్గుష్ట (జలచర పక్షి) : ఓ సత్యకామా! సత్యకామా! సత్యకామా!

**సత్యకాముడు :** ఓ మద్గురు జలచరదేవతా! నమోనమః

**ముద్గుష్ట :** సత్యకామా! నన్ను ఎందుకు తలచుకున్నావు?

**సత్యకాముడు :** నాకు బ్రహ్మము యొక్క నాలుగవ పాదము గురించి దయతో బోధించండి.

**ముద్గుష్ట :** సత్యకామా! వినండి. బ్రహ్మము యొక్క 4వ పాదమునకు 4 అంశలు-

(1) ప్రాణము (2) చక్షుః (కనులు) (3) శ్రోతం (చెవులు) (4) మనస్సు **(ప్రాణశక్తి - చూపు - వినికిడి - ఆలోచన)**

ఈ నాలుగు బ్రహ్మము యొక్క పాదముగా బ్రహ్మోపాసకుల సమక్షములో సుప్రసిద్ధము.

ఈ విధమైన ఈ పాదము యొక్క (ప్రాణ - చక్షు - శ్రోత్ర - మనస్సులనబడే) 4 కళలను బ్రహ్మము యొక్క పాదముగా ఎవడు ఉపాసిస్తాడో, ఆతడు సర్వలోకములలో సర్వాశ్రయుడు కాగలడు. ఏది ఆశ్రయిస్తే అది పొందగలడు. లోకములను జయించగలడు. '14' లోకములను తన యందు దర్శించగలడు. ఇది ఆయతన పాదము.

---

# 4-9. నవమ ఖండము - గురుచరణాశ్రయము - (సర్వం ఖల్విదమ్ బ్రహ్మ)

400 బక్కచిక్కిన గోవులతో సుదూరమైన అడవులకు వెళ్లిన సత్యకాముడు కొన్ని సంవత్సరముల తరువాత తాను ప్రతిజ్ఞ చేసిన ప్రకారము '1000' గోవులను చేసి హరిద్రుమత గౌతమాచార్యుల వారి ఆశ్రమమునకు తిరిగి వచ్చాడు.

**హరిద్రుమత గౌతమాచార్యులు :** సత్యకామా! సత్యకామా! సత్యకామా!

**సత్యకాముడు :** గురుదేవా! పూజనీయా! భగవాన్! సాష్టాంగ దండప్రణామమ్ స్వీకురు।

**హరిద్రుమత గౌతములు :** బిడ్డా! శుభమగుగాక! సౌమ్యా! నీవు బ్రహ్మవేత్త వలె ప్రకాశిస్తున్నావయ్యా! **బ్రహ్మ విదివ వై, సోమ్య। భాసి కో।**

- **- ప్రసన్నేంద్రియః -** ప్రసన్న - ప్రశాంతమైన ఇంద్రియములతో,
- **- ప్రహసిత వదనశ్చ -** నవ్వులు విరజల్లు మోముతో,
- **- నిశ్చితః -** చింతలు లేనివాడవై
- **- కృతార్థో -** పరమార్థమును కృతము (Fulfilled) చేసుకొన్నవాడవై
- **- బ్రహ్మవిత్ భవతి -** బ్రహ్మవేత్తవై కనిపిస్తున్నావు. **కో ను త్వా అనుశశాసేతి?** నీకు ఆత్మబోధ ఉపదేసించినది ఎవరు?

**సత్యకాముడు : గురోత్తమా! అన్యే మనుష్యేభ్య।** నాకు మనుష్యులెవ్వరు బోధించలేదు. మానవులకు వేరైన వారు బ్రహ్మము యొక్క నాలుగు పాదముల గురించి బోధించారు. ధేనువు, అగ్ని, హంస, నీటి కాకి (మద్గు) నాకు ఉపదేశించారు. అయితే నేను మీకు శిష్యుడను కదా! అందుచేత ఆత్మతత్త్వము యొక్క పరాకాష్ఠను మీరే నాకు బోధించి ధన్యునిగా తీర్చిదిద్ద ప్రార్థన. **మీ వంటి ఉత్తమోత్తములగు ఆచార్యుల దగ్గర అధ్యయనము చేస్తేనే సర్వసందేహాలు విడివడతాయి. సద్గురువు షోడశకళా విద్యలను బోధించినప్పుడే మేము సాధుత్వము పొందగలము. అదియే బ్రహ్మజ్ఞానము అవగలదని ఆర్యుల సూక్తి కదా!**

అప్పుడు హరిద్రుమత గౌతమ గురువరేణ్యులు సత్యకామునకు బ్రహ్మము గురించిన 4 పాదములు మరియు బ్రహ్మము యొక్క అంతర్గత తత్త్వము గురించి సమగ్రంగా, సవివరంగా ప్రసాదించారు. ఏ విధంగా "తత్ త్వమ్"ను ఉపాసిస్తూ, "సోఽ

హమ్"ను సిద్ధించుకొని, "త్వమేవాహమ్" నిశ్చలము చేసుకొని, "సర్వమ్ ఖల్విదమ్ బ్రహ్మ" భావనను అనుక్షణికము, స్వాభావికము, అనునిత్యము, అప్రతిహతము చేసుకోవాలో - అవన్నీ బోధించి, సత్యకాముని పూర్ణకామునిగా తీర్చిదిద్దారు. సగుణ బ్రహ్మోపాసన ఫలము గురించి, అగ్న్యోపాసన గురించి కూడా వివరించారు.

## 4-10. దశమ ఖండము - ఉపకోసల విద్య
## (ప్రాణో బ్రహ్మ - కం బ్రహ్మ - ఖం బ్రహ్మ)

పూర్వము ఒకప్పుడు కమలుని కుమారుడు - "ఉపకోసల కామలాయనుడు" అనే ముని ఉండేవారు. ఆయన బాల్యములోనే సత్యకామ జాబాలి సన్నిధిలో బ్రహ్మచర్య వ్రతము స్వీకరించారు. ఆయన నిరంతరంగా ఆశ్రమంలో 12 సంవత్సరములు అగ్నికార్యములకు ఎంతో శ్రద్ధతో పరిచర్యలు చేసారు.

ఇప్పుడు మనము వారి గురించి దృష్టాంతంగా

- సగుణ బ్రహ్మోపాసనా ఫలము గురించి,
- అగ్ని ఉపాసన యొక్క మహత్తర ప్రయోజనము చెప్పుకుంటున్నాము. శ్రద్ధ మరియు తపస్సు బ్రహ్మోపాసనకు ముఖ్య సాధనములవటం గురించి వివరించుకోబోతున్నాము.

---

ఒకరోజు సత్యకామ జాబాలాచార్యులవారు 12 సం॥ విద్య ముగించి, వేదాధ్యయనము పూర్తి చేసుకొని, గృహస్థులు అవవలసిన వారందరిని సమావేశపరచారు. వీడ్కోలు సభ జరిపి వీడ్కోలు - ఉపదేశములు ప్రసాదించారు. అయితే 12 సం॥ విద్య ముగించినప్పటికీ - ఉపకోసల కామలాయునుని మాత్రం ఆ వీడ్కోలు సభకు పిలువలేదు.

ఇది గమనించి గురుమాత సత్యకామజాబాల మహర్షితో ఇట్లా సంభాషించారు.

**గురుమాత :** ప్రాణనాథా! మీరు 12 సంవత్సరముల కాలము విద్య అభ్యసించి, అధ్యయనము పూర్తి చేసిన వారందరికి వీడ్కోలు సభకు పిలిచి 'గృహస్థాశ్రమము' స్వీకరించుటకై అనుజ్ఞ - అభిభాషణము ప్రసాదించారు. కానీ ఉపకోసల కామలాయనుని మాత్రం ఆ సభకు పిలువలేదు. ఆతడు 12 సంవత్సరముల కాలము విద్యను అభ్యసించాడు. విద్యలో ప్రావీణ్యుడైనాడని మీరే అంటూ ఉంటారు. అంతే కాకుండా, ఆ ఉపకోసలుడు అందరికంటే అధికమైన భక్తితో ఆశ్రమమును సేవించి ఉన్నాడు. బ్రహ్మచర్యదీక్ష శ్రద్ధగా నిర్వర్తించాడు. ఈ పిల్లవానికి వీడ్కోలు ప్రసాదించలేదేమి? అగ్నిదేవతలను ఈతడు ఎంతో శ్రమతో సేవించాడు కూడా కదా! అందుచేత నిత్యాగ్ని దేవతలు మీ పట్ల తప్పుపట్టుకోవచ్చునేమో? ఈ విషయము దయచేసి ఆలోచించి, తగిన విధంగా చేయండి. ఆ పిల్లవానికి వీడ్కోలు - గృహస్థాశ్రమమునకు అనుజ్ఞ ఇస్తే బాగు - అని నా మనవి.

సత్యకామ జాబాలుడు తన ధర్మపత్ని చెప్పినదంతా శ్రద్ధగా విన్నారు. అందుకు ఏ సమాధానమూ చెప్పకుండానే ఆశ్రమము విడచి సంచారమునకు బయల్వెడలారు. (చాతుర్మాస్యమునకు, వేద అధ్యయన సభలకు, రాజులు జరిపే సత్సంగ సభలకు ఆచార్యులు సంచారములు చేస్తూ ఉంటారు కదా!)

**సహ వ్యాధినా అనశితుం।** తనను గురువర్యులు వీడ్కోలు సభకు పిలువకపోవటము, గురుమాత చెప్పినా పట్టించుకోక సంచారమునకు వెళ్లటము - ఈఈ విషయాలకు ఉపకోసల కామలాయనుడు గమనించి ఎంతో మనోవ్యాధిగ్రస్తుడు అయినాడు. ఆ దిగులుతో ఆహారము తినటము మానివేశాడు. అగ్నిహోత్ర గృహములో నీరసముగా పడి ఉండిపోయాడు. ఇది గమనించి గురుమాత ఉపకోసలునితో ఈ విధంగా పలకరించారు.

**గురుమాత :** బిడ్డా! ఉపకోసలా! బ్రహ్మచారీ! అన్నము తినటము మానివేస్తున్నావేమి? అది సరికాదు. నాయనా! భగవంతుని కృపచే దేహము నీకు ఉపకరణముగా ప్రసాదించబడింది. దీనిని బలహీనము చేయరాదు. లేఁ। లేచి చక్కగా భోజనము చేయి. అన్నముపై కోపగించటము నిషిద్ధమని నీకు తెలుసు కదా!

**ఉపకోసల కామలాయనుడు :** గురుమాతా! మీకు తెలియనిది ఏమున్నది? ఈ పురుషుడు (జీవుడు) ఏదైనా తీవ్రంగా కోరుకొంటే, ఒకవేళ అది నెఱవేరకపోతే, ఆతనికి ఆకలి చచ్చిపోతుంది. ఈ జీవునిలో అనేక కోరికలు దాగి ఉంటాయి. అవి విషయ భోగములవైపుగా లాగుతూ ఉంటాయి. నేను మానసిక చింతలో పడిపోయాను.

⌘ అయ్యో! గురువర్యుల దృష్టిలో నేను నేర్చిన విద్య గృహస్థాశ్రమ స్వీకారమునకు అనుమతి ఇవ్వబడిన సహవిద్యార్థులతో సరితూగదా?

⌘ నా తల్లితండ్రులను త్వరలో చూస్తానేమోనని ఆశించాను. ఆ ఆశ నిరాశయేనా?

⌘ మా గ్రామములోని స్నేహితులను, బంధువులను ఎప్పటికి చూస్తానో!

.... మొదలైన చింతలు ఏవేవో మనస్సులో దాగి ఉండి ఉంటాయి. నేను ఆత్మజ్ఞానిని అయిండలేదు. అందుకే ఈఈ విషయాలు నా యొక్క 'శాంతి'కి విఘ్నములు కలిగిస్తూ ఉన్నాయి. అందుచేత ఆహారము భుజించనని నిర్ణయము చేసుకున్నాను. కనుక క్షమించండి మాతా!

---

అగ్నిహోత్ర గృహములో ఉపాసించబడే **త్రైయాగ్ని** దేవతలు సమావేశమై ఇట్లా సంభాషించుకున్నారు.

> **"ఈ బ్రహ్మచారి తీవ్రమైన తపస్సు చేసాడు. మనలకు ప్రతిరోజు తెల్లవారుఝామునుండి రాత్రి అయి యజ్ఞాగ్ని ముగింపు వరకు ఎన్నో సేవలందించి, మనలను ఎంతగానో సంతోషింపజేసాడు. కనుక ఈతడు మనము బ్రహ్మతత్త్వము బోధించటానికి అర్హుడు. మనము ఇప్పుడు ఉపదేశము ఇద్దాము."**

ఈ విధంగా నిర్ణయించుకొని సాకారము ధరించినవారై త్రైయాగ్ని దేవతలు ఇట్లా సంభాషించసాగారు.

**పంచాగ్నిహోత్ర దేవతలు :** బిడ్డా! ఉపకోసలా! లేచి ఈ ఆహారము తిని, పానీయం త్రాగు. మేము యజ్ఞాగ్ని దేవతలము. నీకు ఏది క్షేమమో అది ప్రసాదించటానికి వచ్చాము. నీవు మా సంకల్పముచే సమస్త శారీరక బలహీనతలు తొలగి శారీరకంగా ఓపిక కలవాడవై బలవంతుడవు, తేజోవంతుడవు అయ్యెదవు గాక!

**ఉపకోసల కామలాయనుడు :** ఓ యజ్ఞాగ్ని దేవతలారా! నమో నమః। మీ దర్శనమాత్రం చేతనే, మీ అనుగ్రహం చేత నేను ఉపావాస సంబంధమైన నీరసములన్నీ తొలగి బలవంతుడనయ్యాను. ఇప్పుడు మీ బోధకై సిద్ధముగా ఉన్నాను. అయ్యలారా! బ్రహ్మము గురించి శ్రవణం చేయ ఇచ్ఛగిస్తున్నాను. దయతో నాకు బోధించండి.

**త్రయీయజ్ఞాగ్ని దేవతలు :** ప్రాణో బ్రహ్మ। కం బ్రహ్మ। ఖం బ్రహ్మేతి। ఈ ప్రాణమే బ్రహ్మము. 'కం' అనునదీ బ్రహ్మమే। 'ఖం' బ్రహ్మమే।

**ఉపకోసల కామలాయణుడు :** పూజ్యాతి పూజ్యులగు ఓ అగ్ని దేవతలారా! మీరు చెప్పుచున్న దానిలో నాకు కొంత అర్థము కాలేదు. దయచేసి నా సందేహములు వినండి.

**(1) ప్రాణో బ్రహ్మ!** 'ప్రాణము' యొక్క అర్థము లోకవిదితమే. ప్రాణము ఉంటేనే ఈ భౌతిక దేహము జీవించి ఉండగలదు. ప్రాణము తొలగితే ఇది నిస్సారమగు ఎండుకట్టె వంటిదే. ఏది పోతే ఈ దేహము జడవస్తువు వంటిదో – అట్టి "ప్రాణము బ్రహ్మమే" అనేది నేను అర్థం చేసుకోగలుగుచున్నాను. నేను ఒప్పుకుంటున్నాను. నాకు సువిదితమే కూడా! కానీ రెండు, మూడు శబ్దములైనట్టి "కం", "ఖం" ఎట్లా బ్రహ్మము అయి ఉండగలవో నేను సమన్వయించుకోలేకపోతున్నాను. నాకు అది తెలియదు.

**(2) 'కం' బ్రహ్మ :** 'కం' అనగా శబార్థము 'సుఖము' అని కదా। కాసేపు సుఖముగా ఉన్నా కూడా ఇంతలోనే ఏవేవో కారణాలచేత దుఃఖం వచ్చిపడుతోంది కదా! సర్వదా సుఖంగా మాత్రమే ఉండేవాడు ఎవ్వడూ ఉండడు. బ్రహ్మము సర్వదా యథాతథమై ఉండగా 'సుఖము బ్రహ్మము' అనేది ఎట్లా నేను అన్వయించుకోవాలి. **"సర్వం ఖల్విదం బ్రహ్మ"** అనే వేదోపనిషత్ మహావాక్యము కదా!

'కం' (సుఖము) బ్రహ్మమైనప్పుడు, దుఃఖము బ్రహ్మము కాదా! సుఖము మాత్రమే బ్రహ్మమా?

**(3) 'ఖం' బ్రహ్మ :** 'ఖం' అనగా శబ్దార్థము 'ఆకాశము' కదా! ఈ ఆకాశము స్వతఃగా జడము కదా! బ్రహ్మము సర్వదా చైతన్యస్వరూపము. మరి 'ఆకాశము బ్రహ్మము' అనేది ఎట్లా సమన్వయించుకోవాలి?

ఓ యజ్ఞాగ్ని దేవతలారా! మీరు అనృతము (అబద్ధము) చెప్పరు. కానీ నా వివేచనకు 'కం', 'ఖం' పట్ల 'బ్రహ్మము' అనేది ఆయా లక్షణముల దృష్ట్యా నాకు యుక్తియుక్తము (Logical) అని అనిపించటం లేదే? దయచేసి వివరించండి.

**త్రయాగ్ని దేవతలు : యద్వావ 'కం' తదేవ 'ఖం'। యదేవ 'ఖం', తదేవ 'కం' ఇతి।** ఏది ఆకాశమో అదియే సుఖము. ఏది సుఖమో అదియే ఆకాశము.

"ఆకాశము" అనే శబ్దమునకు అర్థము "భూతాకాశము" అనునది సంకుచితార్థము. ఎందుకంటే 'ఆకాశము' మూడు తీరులు.

(1) భూతాకాశము – జడము

(2) చిత్తాకాశము – మనో నిర్మితము

(3) చిదాకాశము – ఆత్మాకాశము

'ఆకాశము' అనగా చిదాకాశమే। ఆత్మాకాశమే। కేవలమగు ఆత్మయొక్క స్వకీయకల్పిత ఆనందరూపమే ఈ ఇంద్రియ జగత్తు. ఆత్మాకాశము తన ఇచ్ఛానుసారంగా చిత్తాకాశము, భూతాకాశము కల్పించుకొంటోంది.

ఇంకా చెప్పాలంటే **'ఆత్మాత్ ఆకాశమ్'** అను వేదవాక్కు ప్రకారము ఆత్మనుండియే భూతాకాశము బయల్వెడలుతోంది. ఆత్మ నుండి బయల్వెడలునట్లు చెప్పబడేవన్నీ ఆత్మకు అన్యము కాదు.

ఆత్మ జగత్ కల్పనను లీలగా, క్రీడగా, వినోదముగా మాత్రమే స్వీకరిస్తోంది.

అంతేగాని ఆత్మ తన కేవలానందము నుండి 'చ్యుతి' పొందటం లేదు. కనుక 'కం' అనగా ఆత్మా యొక్క కేవలానంద స్వరూపము. 'ఖం' అనగా ఆత్మాకాశము.

'మట్టిబొమ్మ'లో మట్టి, బొమ్మ వేరు కావు కదా! అట్లాగే ఆ ఆత్మ, ఆనందము వేరు వేరు కాదు.

అందుచేత – **యద్వావ 'కం', తదేవ 'ఖం', యదేవ 'ఖం' తదేవ 'కం' – ఇతి।** ఏది ఆత్మానందమో అదియే ఆత్మాకాశము. ఏది ఆత్మాకాశమో, అదియే ఆత్మసుఖము – అని మేము సిద్ధాంతీకరించి చెప్పుచున్నాము.

**ఇంకా కూడా ప్రాణము శక్తి రూపమని, ప్రాణము ఆత్మశక్తియేనని, "శక్తి – శక్తి తనదైనవాడు ఒక్కటే" – అను తీరుగా ప్రాణమే ఆత్మ అని, ఆత్మ ప్రాణ స్వరూపమేనని కూడా త్రైయాగ్ని దేవతలు విశదీకరించి చెప్పారు.**

**"ప్రాణమే హృదయము. ప్రాణమే ఆత్మ. హృదయమే ఆత్మ" – అని వివరించారు.**

## 4-11. ఏకాదశ ఖండము – గార్హపత్యాగ్ని పురుష ఉపదేశము
## "పృథివి – అగ్ని – అన్నమ్ – ఆదిత్యమ్ బ్రహ్మ"

**ఉపకోసల కామలాయనుడు :** ఓ త్రైయగ్ని దేవతలారా! ఇప్పుడు "ప్రాణము బ్రహ్మము. సుఖము బ్రహ్మము. ఆకాశము బ్రహ్మము"... అన్న మీ వాక్యములను నేను అర్థము చేసుకోగలుగుచున్నాను.

'ప్రాణము (శక్తి) – సుఖము – ఆకాశము' అనునవి భౌతిక రూప రహితములు కాబట్టి నిర్గుణ బ్రహ్మము గురించి మీరు బోధించినవారయ్యారు.

ఓ ఆత్మానంద స్వరూప త్రైయాగ్నులారా! ఇప్పుడు బ్రహ్మము యొక్క గుణసహితత్వము (సగుణత్వము) గురించి మీ వద్ద శ్రవణం చేయాలని భావిస్తున్నాను. దయతో బోధించండి.

**గార్హపత్యాగ్ని పురుష బోధ – పృథివి అన్నమ్ అగ్నిః। ఆదిత్య – సోఽహమస్మి॥**

**గార్హపత్యాగ్ని :** ఓ ఉపకోసలా! ఆత్మ సగుణము, గుణాతీతము (నిర్గుణము) కూడా కాబట్టి శాస్త్రములు సగుణోపాసనను కూడా సూచిస్తూ ఉన్నాయి. ఉపాసనచే ఆత్మతత్త్వానుభూతి తప్పక పొందవచ్చు. అది సగుణమైనా ఫరవాలేదు; నిర్గుణమైనా ఫరవాలేదు.

ఇప్పుడు నీకు నీ స్వస్వరూపము, ఈ జగత్తు యొక్క వాస్తవ రూపము, తదితరులుగా కనిపిస్తున్న స్థావర – జంగమ (నీవు–ఆతడు – అది – ఇది) రూపముల సహజ–వాస్తవ రూపమగు ఆత్మను ఏ విధంగా ఉపాసించాలో అనుశాసనము (Thumb-Rule Approach) చేస్తూ చెప్పుతున్నాను. విను.

> **"పృథివి అగ్నిః అన్నమ్ ఆదిత్య" ఇతి య ఏష**
> **ఆదిత్యే పురుషో దృశ్యతే, సోఽహమస్మి। స ఏవ అహమస్మి"**

> **సమస్తమునకు మొట్టమొదటే ఏర్పడియున్న ఏ పురుష కారణమైతే 'ఆదిత్య పురుషుడు' అయి ఉన్నాడో, ఆతడే "పృథివి, అగ్ని, ఆహారము, సూర్యుడు" – రూపములుగా ప్రదర్శనమగుచున్నారు. అట్టి సమస్త సంప్రదర్శనుడగు ఆదిత్య పురుషుడే నేనై ఉన్నాను. నేనే ఆ ఆదిత్య పురుషుడై ఉన్నాను.**

**నేనుగా ఉన్నది ఆ ఆదిత్య పురుషుడే। ఆ ఆదిత్య పురుషుడుగా ఉన్నది నేనే।**

ఈ గార్హపత్యాగ్నిగా నేనే ఆదిత్యునిలో ఉన్నది కూడా। ఆదిత్యునిలో ఉన్న నేనే నాలో నేనుగా ఉన్నది. నాలో 'నేను'గా ఉన్నదే పృథివి–అగ్ని – ఆహారము – సూర్యుల యందు 'నేను'గా ప్రకాశమానమై ఉన్నది.

- ఎవ్వరైతే అగ్నిని ఆదిత్య పురుష భావనతో ఉపాసిస్తారో,
- ఎవ్వరైతే ఈ విధంగా – "నాలోని 'నేను' అనే పురుషకార పురుషుడే భూమియందు, అగ్నియందు, అన్నమునందు, సూర్యునియందు ప్రకాశమానులై ఉన్నారు. ఆ పురుషోత్తముడే నాలో 'నేను' అయి ఉన్నారు. నేనే ఆ పురుషోత్తముడను" – అని ఉపాసిస్తారో

- సర్వ సంసార దృష్టిదోషములను తొలగించుకోగలరు – **అపహతే పాపకృత్యం।**
- సమస్త లోకములను తమయందు దర్శించగలరు – **లోకీ భవతి।**
- పూర్ణాయుర్దాయము కలవాడు అవగలరు. ఆయుర్దాయము సద్వినియోగ పరచుకొన్నవారగుచున్నారు – **సర్వమయురేతి।**
- జ్యోతిస్వరూపుడై జీవించగలడు – **జోగ్జీవతి।**
- వారి వంశము లోనివారు క్షీణత, అజ్ఞానము పొందరు. – **న అస్య అవర పురుషాః క్షీయన్తే॥**

**ఉప వయం తం భుంజామో – అస్మిగ్ంశ్చలోకే, అముష్మిగ్ంశ్చ ఏతమ్ ఏవం ఉపాసతే।**

> *ఎవ్వరైతే ఆదిత్య పురుషుడై భూమి – అగ్ని – అన్నము – సూర్యుడుగా వెలుగొందుచున్నారో – ఆయనయే నేనుగా ఉన్నారు. నేనే ఆ ఆదిపురుషుడనై ఉన్నాను.*

→ అని ఉపాసిస్తూ ఉంటారో, వారి యొక్క ఐహిక (ఇహలోక) – ఆముష్మిక (పరలోక) సంపదలను, ఫలములను గార్హపత్యాగ్నినగు నేను సంరక్షించు ధర్మము కలవాడనై ఉంటున్నాను. ఇహ– పరములను కాపాడువాడనై ఉంటున్నాను.

**ఈ విధంగా గార్హపత్యాగ్ని పురుషుడు (దేవత) ఉపకోసల కామలాయనునికి ఉపదేశించి మౌనము వహించారు.**

## 4-12. ద్వాదశ ఖండము – దక్షిణాగ్ని పురుష ఉపదేశము
## జల–దిక్–నక్షత్ర–చంద్రమసో బ్రహ్మ–సోఽహమస్మి

అప్పుడు "అన్వాహార్యము" అనబడే హవిస్సును వండించువాడగు "దక్షిణాగ్ని పురుషుడు" (దేవత) ఈ విధంగా బోధించసాగారు.

చంద్రునిలోని చంద్రమస పురుషకారమే జలము, దిక్కులు, నక్షత్రములు, చంద్రుడు రూపములను దాల్చుచున్నది.

**య ఏష చంద్రమసి పురుషో దృశ్యతే – సోఽహమస్మి। స ఏవ అహమస్మి।**

చంద్రునిలో ఏ పురుషకారము కనిపిస్తోందో, ఆ చాంద్రమస పురుషకారమే నాలో 'నేను'గా ఉన్నది. నేనే ఆ చాంద్రమస పురుషకారమై ఉన్నాను.

(దక్షిణాగ్నితో అన్నము వండగా, అది 'అన్వాహార్యము' అగుచున్నది. అట్టి అన్వాహార్యము అగ్నికి హవిస్సుగా సమర్పించుచున్నప్పుడు, అది చంద్రలోకము పొంది 'అన్నము' అగుచున్నది. అది తిరిగి అన్నమై జీవులను పరిపోషిస్తోంది).

అన్వాహార్య పచనాగ్ని (హవిస్సు వండబడే అగ్ని) పురుషుడు (లేక) దక్షిణాగ్ని పురుషుడు ఇంకా ఇట్లా ఉపదేశించారు.

ఓ ఉపకోసలా!

ఎవ్వరైతే ఈ విధంగా –

"జలము, దిక్కులు, నక్షత్రములు, చంద్రుడుగా ఉన్న చాంద్రమస పురుషకారమే (లేక పురుషుడే) నాలో 'నేను'గా ఉన్నది. నేనుగా ఉన్నది ఆ చాంద్రమస పురుషుడే। కనుక నేనే జలము, దిక్కులు, నక్షత్రములు, చంద్రుడుగా ఉన్న పురుషకారుడను। చాంద్రమస పురుషుడను"

– అని ఎరిగి హవిస్సులు నాకు (దక్షిణాగ్నికి) సమర్పిస్తారో…,

- అట్టివారి పాపములు తొలగి పవిత్రులౌతారు.
- ఆయుష్షు సదుపయోగమౌతుంది.
- స్వయంజ్యోతి జీవనులౌతారు.
- ఆతని వంశములో బలహీనులు పుట్టరు.

అట్టివారి ఇహ-పరములను అగ్ని స్వరూపులమై మేము సర్వదా రక్షిస్తూ ఉంటాము. కనుక ఈ విధంగా అగ్ని గురించి తెలుసుకొని హవిస్సులను సమర్పిస్తూ ఉపాసించెదవుగాక।

ఈ విధంగా బోధించి దక్షిణాగ్ని పురుషుడు తన బోధను విరమించి మౌనము వహించారు.

## 4-13. త్రయోదశ ఖండము-ఆహవనీయాగ్ని పురుష ఉపదేశము (ప్రాణ-ఆకాశ-ద్యౌ-విద్యుత్ బ్రహ్మ – సోఽహమస్మి)

ఆ తరువాత ఆహవనీయాగ్ని దివ్యపురుషుడు చెప్పటం ప్రారంభించారు.

"ప్రాణము ఆకాశము స్వర్గము విద్యుత్తు – ఈ నాలుగు నా రూపములే।

అట్టి ఆకాశ ప్రాణ స్వర్గ విద్యుత్ (మెఱుపు) రూపుడగు విద్యుత్ పురుషుడే 'నేను'। నేనే అట్టి విద్యుత్ పురుషుడుగా దృశ్యమానమగుచున్నాను! **య ఏతత్ విద్యుతి పురుషో దృశ్యతే సోఽహమస్మి, స యేవ అహమస్మి।**

ఇట్టి స్వస్వరూపాత్మ నిర్వచనమును ఎవరు ఉపాసిస్తారో, వారికి సంసార దోషములు అంటవు. ఆయుష్షు సద్వినియోగమౌతుంది. జ్యోతిష్మతులు అవుతారు. ఏ ఆత్మజ్ఞాన విద్వాంసుడైతే ఈ విధంగా ఉపాసిస్తాడో అట్టి వాని ఇహ – పరములు అగ్ని స్వరూపుడనై కాపాడుతాను.

ఓ బ్రహ్మచారీ! ఉపకోసలకామలాయనా!

ఏ పరమాత్మ అయితే విద్యుత్ పురుషుడై ప్రాణ, ఆకాశ, దేవలోక, విద్యుత్ రూపమై ఉన్నాడో అదియే నేను, నేను అది అయి ఉన్నాను.

అని ఉపాసన చేయి. ఇదియే ఆత్మోపాసన యొక్క సాకారోపాసన।

**త్రైయాగ్ని దేవతలు (గార్హపత్య-దక్షిణ - ఆహవనీయాగ్ని దేవతా పురుషులు):** మేము ఇంతవరకై నీ కొరకై ఈ ఈ కొన్ని విషయాలు బోధించాము.

ఓ సౌమ్యా! ప్రియదర్శనా! ఇక మరికొంత ఆత్మోపాసనా – ఉత్తమ ఫలము కొరకు ఆచార్యులగు సత్యకామ జాబాల మహర్షులవారిని ఆశ్రయించు. వారు పూర్ణబోధను ప్రసాదించగలరు. వారు విద్య యొక్క ఫలము పొందే మార్గమేమిటో చెప్తుతారు.

**ఈ విధంగా పలికి, ఆ త్రైయాగ్ని దివ్యదేవతలు తమ బోధను విరమించి అంతర్ధానం అయినారు.**

## 4-14. చతుర్దశ ఖండము - లోకోపాసన - బ్రహ్మోపాసన

కొన్నిరోజులు గడిచి, ఒకానొకరోజు గురుదేవులు శ్రీ సత్యకామ జాబాలమహర్షి సంచారము పూర్తి చేసుకొని నిజాశ్రమమునకు తిరిగివచ్చారు. ప్రయాణం చేసిన శ్రమ అంతా తీరిన తరువాత విశ్రాంతిగా ఆసీనులైయున్న గురువర్యులను ఉపకోసల కామలాయనుడు సమీపించి వారి పాదపద్మములను రెండు చేతులతో స్పృశించి కళ్లకద్దుకొని – నమస్కరిస్తూ వినమ్రుడై ఎదురుగా నిలుచున్నారు.

**సత్యకామ :** ఉపకోసలా! ఉపకోసలా! ఉపకోసలా!

**ఉపకోసలుడు :** పూజనీయా! ఆచార్యా!

**సత్యకామ :** సౌమ్యా ప్రియదర్శనా! **బ్రహ్మ విద్య ఏవ తే ముఖం భాతి।** నీ ముఖము బ్రహ్మమును ఎరిగిన బ్రహ్మవేత్తవలె భాసిస్తోంది! ఏమిటి విశేషం! నీవు ఎవరి దగ్గర బ్రహ్మము గురించి శ్రవణం చేశావు?

**ఉపకోశలుడు :** ఆచార్యా! పూజనీయా! నాకు మానవులెవ్వరు ఉపదేశించలేదు. మీరు సంచారము వెళ్లగా, నాకు మానవులెవ్వరు ఉపదేసిస్తారు?

అయితే తమరు సంచారమునకు వెళ్లే ముందు నిర్వర్తించిన బ్రహ్మచర్య – వీడ్కోలు సభకు నన్ను పిలువనందుచేత నాకు ఎంతో వేదన కలిగింది. ఆహారము మానివేసి యజ్ఞ వేదికా గృహంలో నీరసంగా పరుండిపోయాను. గురుమాత ఆహారము తినమని బ్రతిమలాడినా నేను వినలేదు. అప్పుడు గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని, ఆహవనీయాగ్ని దేవతా పురుషులు వచ్చి ఆయా ఉపాసనలు బోధించారు.

**సత్యకామ జాబాల :** అట్లాగా? వారు ఏమేమి నీకు బోధించారు?

**ఉపకోసల కామలాయన్ :** వారు ఈ విధంగా ఉపదేశించారు.

**గార్హపత్యాగ్ని దివ్య పురుషుడు**

> ***"ఆదిత్య పురుషుడనగు నేనే పృథివి (భూమి) - అగ్ని - అన్నము - సూర్యుడనై ప్రకాశిస్తున్నాను. ఆ ఆదిత్య పురుషుడే 'నేను'గా నేనే ఆ ఆదిత్య పురుషుడుగాను ఉన్నాము" - అను ఉపాసన।***

**అన్వాహార్య పచనాగ్ని (దక్షిణాగ్ని) దివ్య పురుషుడు**

> ***"చంద్రమస పురుషుడనగు నేనే ఆపో(జలము) - దిశో (దిక్కులు) - నక్షత్రాణి - చంద్రమా (చంద్రుడు) రూపములుగా వెలుగొందుచున్నాను. ఆ చంద్రమ పురుషుడే నాలోని నేను. నేనే చంద్రమస పురుషుడను" - అను ఉపాసన.***

**ఆహవనీయాగ్ని దివ్య పురుషుడు**

> ***విద్యుత్ పురుషుడనగు నేనే సర్వజీవులలోని ప్రాణశక్తి-ఆకాశము-దేవతాలోకములు-విద్యుత్ (మెఱుపు) రూపములుగా భాసిస్తున్నాను. ఆ విద్యుత్ పురుషుడే నాలోని 'నేను' కూడా! నేనే ఆ విద్యుత్ పురుషుడను - అను ఉపాసన।***

ఇంకా కూడా ఆ యజ్ఞాగ్ని దివ్య పురుషులు ఇట్లా చెప్పారు.

| నీవు ఈ విధంగా ఆత్మోపాసన నిర్వర్తిస్తూ ఉండు, ఇవి నీ ఉపాసన కొరకై చెప్పాము. త్వరలో ఆచార్యులవారు వస్తారు కదా. వారైతే వీటి ఫలములను, గతిని బోధించగలరు. |
|---|

అందుచేత గురుదేవా! "పూర్ణాత్మజ్ఞానము" బోధించవలసినదిగా మిమ్ములను వేడుకుంటున్నాను. అప్పుడిక గురుదేవులు సత్యకాములవారు బోధించటం ప్రారంభించారు.

**సత్యకామ జాబాల :** బిడ్డా! ఉపకోసలా! ఆ త్రైయాగ్ని దివ్యపురుషులు నీవు యజ్ఞ పురుషునికి చేసిన సేవలకు సంతోషించినవారై "ఇది – ఇది నేనే! నేనే ఇది – ఇది" అనే ఆత్మవిద్యను నీ సాధన కొఱకు ఉపదేశము చేసారు. మంచిదే. సాధన చేతనే ఆత్మజ్ఞానము సిద్ధించగలదు. అట్లాగే నిర్వర్తించు.

అయితే, వారు పృథివి, అగ్ని, ద్యు మొదలైన లోకముల గురించి మాత్రమే ఉపదేశించారు. మరి నీ మనస్సులో ఉన్న కోరిక "బ్రహ్మజ్ఞానము" గురించి – అని నీ గురువుగా నేను ఎఱిగియే ఉన్నాను. అందుచేత నీకు నేను బ్రహ్మజ్ఞానము గురించియే బోధిస్తాను.

యథా పుష్కర పలాశా ఆపో న శ్లిష్యంత, ఏవమేవం విది, పాపం కర్మ న శ్లిష్యత– ఇతి॥

తామరాకును నీరు అంటని విధంగా బ్రహ్మజ్ఞాన ప్రభావము చేత ఈ ఇంద్రియ దృశ్య వ్యవహారములేవీ నిన్ను స్పృశించజాలవు.

**ఉపకోసల కామలాయనుడు :** గురుమహాదేవా! మీరు చెప్పు ఆత్మజ్ఞాన విద్యను బ్రహ్మచారినైన నేను శ్రవణ – మనన – నిదిధ్యాసలకు సంసిద్ధుడను. మీకు శరణాగతుడను. దయతో ఆత్మవిద్య నాకు బోధించండి. మీరు చెప్పబోవు బ్రహ్మవిద్యను శ్రద్ధగా శ్రవణం చేసి హృదయస్థము చేసుకొనగలను. **బ్రవీతు మే భగవన్!**

## 4–15. పంచదశ ఖండము–కంటిలోంచి దృశ్యమును చూస్తూ ఉన్న పురుషుడే 'ఆత్మ'

తస్మై హోవాచ! అప్పుడు సత్యకామజాబాల ఆచార్యులవారు ఉపకోసల కామలాయనునికి ఇట్లా బోధించసాగారు.

**కనులలో నివసిస్తూ కనులతో చూస్తున్న ద్రష్ట – పురుషుడే "ఆత్మ"**

య ఏషో అక్షిణి పురుషో దృశ్యత – ఏష ఆత్మేతి



- దృశ్యము ఎదురుగా ఉన్నది.
- ఆ దృశ్యము కనులకు కనిపిస్తోంది.
- కనులలో చూచువాడు ఉన్నాడు.
- ఆ చూచువాడిని నియమించి, చూచేవాడిని చూస్తున్నవాడే (The Appointer and Observer of the one who is seeing is) - "ఆత్మ".

కనబడేవన్నీ మారుచూన్నాయి. చూచేవాడో! చూస్తున్నప్పుడు, చూడనప్పుడు కంటిలో పురుషకారుడై (చూచువాడై) ఉన్నాడు. తాను మారక, సమస్త మార్పుచేర్పులను దృశ్యంగా చూస్తూ ఉన్నదే ఆత్మ! అట్టి దృశ్యమును చూస్తూ ఉన్న దృక్ పురుషుడు.

**అమృతమ్ :** కన్ను ఉన్నా లేకున్నా, (లేక) దేహము ఉన్నా లేకున్నా కూడా "చూచుచున్నవాడు" మాత్రం మృతించడు. చూడబడేది మారవచ్చు గాక! చూచుచున్నవాడు మారడు. అందుచేత చూచువాడే (One who is using the Eyes to see all else) అమృతమగు ఆత్మస్వరూపుడు– "యత్ దృశ్యమ్, తత్ నశ్యమ్" చూడబడేదానికి 'నశించటము' అనే 'ధర్మము' ఉన్నది. కానీ 'చూచువాడు' నశించు ధర్మమే లేదు.

**అభయమ్ :** చూచువాడే చూడబడే సమస్తముగా స్వకీయమైన 'చూపు' చేత విస్తరించి ఉంటున్నాడు. ఆతడు స్వకీయమైన 'చూపు' చేత విస్తరించి ఉంటున్నాడు. ఆతడు తనకు ద్వితీయము లేనివాడు. (ఆతనికి చూడబడేదంతా వేరుకాదు). 'చూపు'లోని అంతర్విభాగమే. అందుచేత ఆత్మగా ఆతనికి భయము లేదు. అభయమ్।

[ (చూడబడునది, చూపు, చూచువాడు) అనే త్రిపుటి యొక్క ఏకత్వం అవగాహనతో ఏర్పడే అనుభూతియే దైవ దర్శనము]

**ఏతత్ బ్రహ్మేతి :** అట్టి చూచువాడే ఈ జీవునిలో బాహ్య-అభ్యంతరముల కంటే మనో బుద్ధి చిత్త అహంకారము మొదలైన వాటి కంటే మునుముందువాడు. మహత్తరుడు. ముఖ్యుడు. ఆ చూచేవాడే బ్రహ్మము.

ప్రతి దేహములోను 'చూచేవాడు'గా ఉన్నది బ్రహ్మమే। చూచువాడు సర్వదా కనబడే సమస్తమునకు పరమై ఉన్నాడేగాని, చూడబడుదానిచే తాకబడేవాడు కాదు. తాకబడి దోషము పొందేవాడు కాడు. అనగా దృశ్యము యొక్క దోషములు గాని, దృశ్యము యొక్క రాకపోకలు గాని చూచువానిని తాకజాలవు.

**దృష్టాంతంగా...,** (తామరాకును నీరు అంటని తీరుగా) నేయిగాని నీరుగాని కళ్లకుతాకిస్తే అవి కనెరెప్పలకు అంటుతాయేగాని, కనుగ్రుడ్డులకు అంటవు కదా! కంటిలోని స్థానము కలిగియున్న పూర్ణాత్మ నిర్దోషము (నిత్యనిర్మలము). అసంగము (Non Related / concerned with what is being experienced).

అట్టి ఆత్మను "సంయద్వామ" (యత్ – ఏదైతే, సం – సత్ స్వరూపమై, వామ– సమస్తమునకు వేరై ఉన్నదో) అని పిలుస్తున్నారు. సమస్త దృశ్య వస్తువులు అట్టి దృష్టి ప్రసరించుటచేతనే 'దృశ్యము' రూపము దాల్చుచున్నది.

ఎవ్వడైతే అట్టి కంటిలోని అక్షిపురుషుని ('చూచుట' అను పురుషకారత్వము నిర్వర్తిస్తూ ఉన్న కేవల పురుషుని) ఆత్మస్వరూపముగా ఉపాసిస్తాడో – ఆతనికి సర్వలోకముల తత్త్వము సుస్పష్టమై తెలియగలవు. అట్టి భానుని (ప్రకాశ స్వరూపుని) గురించి ఎరిగి ఆత్మగా దర్శించువాడు ఏ లోకములో ఉన్నా కూడా శ్రేష్ఠుడై ప్రకాశించగలడు.

అక్షిణి పురుషుని ఆత్మగా దర్శిస్తూ ఉపాసించువాని – ఫలశ్రుతి (ఉత్తరోత్తరా పొందు ప్రయోజనములు) (Travel from Ignorance to Bliss) .

- అట్టి కనులలో చూచువానిని ఆత్మోపాసన చేస్తున్నవాడు స్వాభావికంగానే ప్రకాశ దేవతను పొందగలడు. పితృకార్యము – ఆతని పట్ల నిర్వర్తించబడినా, నిర్వర్తించబడకున్నా కూడా ఆతడు 'చీకటి'ని వీడి వెలుతురు (Englightenment) ఆశ్రయించువాడై ఉంటాడు. అర్చిస్సులలో (కాంతి కిరణములలో) ప్రవేశిస్తాడు. (Optimistic Rays)
- అర్చిస్సుల నుండి (సూర్యకిరణముల నుండి) పగటి కాంతి (పగటి వెలుగు)లో ప్రవేశించి ప్రయాణము సాగించగలడు. (Positive Frame of mind)
- పగటి కాంతి నుండి "శుక్లపక్ష దేవతలో ప్రవేశించి ప్రయాణించగలడు. (Progress towards Divinity i.e. opposite to worldly differences)
- శుక్లపక్షము నుండి (ఉత్తరాయణము నుండి) సంవత్సర దేవతను చేరుచున్నాడు. (Witness of Time)
- సంవత్సర దేవత నుండి ఆదిత్యుని యందు ప్రవేశము పొందుచున్నాడు. **(సంవత్సరమ్ ఆదిత్యామ్)**
- ఆదిత్యుని నుండి చంద్రమసము చేరుచున్నాడు. – **(ఆదిత్యాత్ చంద్రమసమ్)।**
- చంద్రుని నుండి విద్యుత్ (తేజోమయ) దేవతను పొందుచున్నాడు **(చంద్రమసో విద్యుతమ్)।**
- విద్యుత్ (తేజస్సు) నుండి 'బ్రహ్మము'ను పొందుచున్నాడు. **విద్యుతం తత్పురుషో।**

**అమానవః** – జనన మరణ చక్రముల నుండి విడివడి మానవాతీతలోకములో స్థానము పొందగలడు.

స ఏనాత్ 'బ్రహ్మ' గమయత్యేష దేవపథో బ్రహ్మపథ।

> అట్టి కంటిలోని అక్షిపురుషుని (one who is seeing through the eyes) - బ్రహ్మముగా సమస్త నేత్రములలో దర్శిస్తూ ఉపాసించువాడు దేవపథములో బ్రహ్మపథములలో ప్రవేశించి బ్రహ్మమే తానగుచున్నాడు.

అట్టివాడు జనన మరణ చక్రాంతర్గతమగు మనుష్య జన్మకు తిరిగిరాడు. జన్మ–కర్మల పరిధులను అధిగమించి అఖండమగు బ్రహ్మమే తానై వెలుగొందగలడు.

# 4-16. షోడశ ఖండము - యజ్ఞోపాసన - యజ్ఞఫలము

**ఏష హ వై యజ్ఞో యోయం పవత।**

**వాయువు వీచికలు :** "వాయువు వీచటము" - (సృష్టి కార్యక్రమమునందు) జరుగుచున్న యజ్ఞమే। యన్నిదగ్ం సర్వం పునాతి। ఆ వాయువు వీచికలు ఈ సమస్త జగత్తును పునీతము, స్వచ్ఛము చేయుచున్నది.

అట్టి వాయు వీచికలు మనస్సు, వాక్కు రూపముగా కూడా వర్తించుచున్నాయి. వాయువు యొక్క ప్రసరణకు → మనస్సు వాక్కు మార్గములు అయి ఉన్నాయి.

"మంత్రము" → ఉచ్చరించే వాక్కును, 'వాక్' → ఇంద్రియమును ఉచ్చరింపజేసే మనస్సును యజ్ఞమునందు వాయు ప్రసరణమును విస్తరింపజేస్తూ నియమించుచున్నది. వాక్ - మనస్సులను విస్తరింపజేసేది వాయువే।

ఉచ్ఛ్వాస-నిశ్వాసల చేతనే వాక్కునకు భావనను జత చేర్చే మనస్సునకు ముందు (వెనుకలందు) - వాయువు చలనము కారణమవటమే యజ్ఞము.

---

ఎవ్వరు యజ్ఞము చేయుచున్నారో - వారు సర్వమును వాయువుచే మొదట పవిత్రముగా చేయుచున్నారు. వాయువుచే ఆరంభింపబడిన యజ్ఞమునకు వాక్కు, మనస్సు అత్యంత ప్రాధాన్యములు.

**వాక్కు మనో సంస్కారములు**

**మనో సంస్కారము :** తయో అన్యతరాం మనసా సగ్ంస్కరోతి బ్రహ్మా!

ధర్మాధర్మ విచక్షణ చేస్తూ "బ్రహ్మ" - అనే ఋత్విక్కు యజ్ఞక్రియనంతటినీ మనస్సుతో (ఉపాసనచే) సంస్కరిస్తూ ఉంటారు.

అధిదేవత, ప్రత్యధి దేవతల ఆహ్వానమును ఉపాసనను మనస్సుతో సంకల్ప విధులు నిర్వర్తిస్తూ యజ్ఞపురుషునికి సమర్పిస్తూ ఉంటారు.

**వాక్ సంస్కారము :** వాచా హోతా ఆధ్వర్యుః ఉద్గాతా అన్యతరామ్।

యజ్ఞ విధానమును వాక్కుతో సంస్కరించువారు హోత (హోమము చేయువాడు), ఆధర్యుడు (యజ్ఞమునందు యజుర్వేదమంత్రములు చదువువాడు), ఉద్గాత (యజ్ఞమునందు సామవేద మంత్రములు గానము చేయువాడు), ఋత్విక్ (మంత్రములను, విధానమును నడిపించువాడు) - వీరందరూ యజ్ఞమునకు వాక్ సంస్కార సేవ నిర్వర్తిస్తూ ఉంటారు.

యజ్ఞప్రారంభంలో-

మొట్టమొదట తెల్లవారి ఉషోదయ సమయంలో యజ్ఞ ప్రారంభంలో - 'బ్రహ్మ' అనే ఋత్విక్కు (ఋత్విక్కులలో పెద్దనాయకుడు) "ప్రాతరనువాకము" ప్రారంభిస్తారు. యజమాని దంపతులకు, బంధువులకు, సందర్శకులకు, తదితర ఋత్విక్కులకు, హోతకు, ఆధ్వర్యునికి, ఉద్గాతలకు, తదితరులకు ప్రేమగా యజ్ఞ క్రియాహ్వానము అందిస్తూ నియమ - నిష్టలు నిర్దేశిస్తారు. ప్రారంభ ప్రార్థనగా - (" ఆగమార్థంతు దేవానాం- గమనార్థంతు రాక్షసామ్" "అపవిత్రః పవిత్రో వా, సర్వావస్థాం గతోపివా।" "యఃశివో నామరూపాభ్యాం యా దేవీ సర్వమంగళాం" - మొదలైన) - శుభాహ్వాన మంత్రములు, వేదములోని కొన్ని అనువాకములు (పనసలు గల వేద విభాగములు) గానం చేస్తారు. ఈ విధంగా ప్రాతరనువాకము నిర్వర్తిస్తారు. అందరూ యజ్ఞ విధులకు ఉత్సాహముగా ఉద్యుక్తులగుచు, వాక్-మనో-బుద్ధులను ఏకాగ్రం చేస్తూ, భక్తిగా ఆ బ్రహ్మ ఋత్విక్కు చదివే "ప్రాతరనువాక వేద విభాగ పనస"లను - పలుకుచున్నారు.

ఆ తరువాత బ్రహ్మ మౌనం వహిస్తారు. ఇక ఋత్విక్కు "పరిధానీయము" (యజ్ఞ దిగ్విజయముకై దేవతా ప్రార్థనలు/ అభ్యర్థములు/ అనుమతి వేడుకొనుటములకు సంబంధించిన వేదమంత్రములు) చదువుతారు. అవన్నీ పూర్తి అయ్యే వరకు బ్రహ్మ (ముఖ్య

ఋత్విక్కు) మౌనము వహించి ఉంటారు. బ్రహ్మతో సహా అందరూ ఆ పరిధానీయ మంత్రములతో తమ మనస్సును ఆయా దేవతలకు అభ్యర్థనపూర్వకంగా నియమిస్తూ, మంత్రములను శ్రద్ధగా, భక్తిగా 'శ్రవణం' చేయుదురు గాక। ఆ సమయంలో వాక్కు, మనస్సు యజ్ఞ విధుల కొరకై సంస్కరించబడి, సంసిద్ధత సంతరించుకుంటూ ఉంటాయి.

యజ్ఞము → "వాక్కు- మనస్సు"ల కలయికచేతనే ఉత్తమ ఫలితము ప్రసాదించగలదు. అర్థము - విధి విధానము - ఈ రెండింటినీ బ్రహ్మ, తదితర ఋత్విక్కులు అందరికీ తెలియజేస్తూ ఉంటారు. "ఏమి చేయాలి? ఎట్లా చేయాలి? ఎందుకు చేయాలి"... ఇవన్నీ ఋత్విక్కు, ఆధ్వర్యుడు మొదలైనవారు తెలిసియున్నవారై, వేదసభికులకు తెలియజేయుచుండెదరు గాక!

మానవుడు రెండు కాళ్ళతోనే నడవగలడు. రెండు చక్రములు కదిలితేనే రథము కదలగలదు. యజ్ఞము కూడా...,

వాక్కు - మనస్సు

విధి విధానము - అంతరార్థము

బుద్ధినిశ్చలత-మనో నియమము

మొదలైన ద్వంద్వములు యజ్ఞకార్యక్రమంలో అంతర్లీనగానములై ఉండాలి.

ఈ విధంగా ప్రతిష్ఠ పొందినప్పుడు యజమానికి, సందర్శకులకు, యజ్ఞము చేయించు ఋత్విక్కు మొదలైన వారికి ఉత్తమ యజ్ఞఫలము లభించగలదు. యజ్ఞము అశ్రద్ధ, అన్యచింతన మొదలైన వాటిచే లోపభూయిష్టము కారాదు. యజ్ఞము తృప్తిగా జరగటము అందరికీ క్షేమము. యజ్ఞపురుషుడు ఆత్మతత్త్వజ్ఞానమునకు మార్గదర్శకుడై ఉంటారు. యజ్ఞము లోకక్షేమము, వ్యక్తిగత శోభ ప్రసాదించగలదు.

## 4-17 సప్తదశ ఖండము-"వ్యాహృతి ఉపాసన"

యజ్ఞము జరుగుచున్న సందర్భంలో బ్రహ్మ (ముఖ్య ఋత్విక్కు) సమస్తము పర్యవేక్షిస్తూ మౌనము వహించి ఉంటారు. "మౌనము పాటించవలెను" అనునది శ్రుతి నిర్ణయము.

ఎక్కడైనా కర్మలయందు పొరపాటో, లోపమో వచ్చినప్పుడు - అప్పుడు శ్రుతి ప్రాయశ్చిత "భూస్స్వాహా। భువస్స్వాహా। సువస్స్వాహా" మొదలైన మంత్రములతో "ప్రాయశ్చిత్తం కొరకై ఘృతము (నేయి) హోమముగా సమర్పణ" చెప్పబడుతోంది.

ప్రజాపతి (సృష్టికర్త) - "నేను లోకములను కల్పన చేసెదను గాక।".. అని భావించి ధ్యాసను నిలిపి "ధ్యానము" చేయసాగారు. ధ్యానము చేయు 'రసము'ను, ఆ రసము (Essence) నుండి రసాత్మకమైన - సారభూతమైన - కళాత్మకమైన వస్తు సమూహములను - భావనామాత్రంగా కల్పించ (సృష్టించ)సాగారు.

పృథివి (Solid) నుండి - సారభూతంగా అగ్నిని

అంతరిక్షము నుండి - సారభూతమగు వాయువును

ద్యులోకము నుండి - సారభూతమగు ఆదిత్యుని పైకి తీసారు. (రసరూపంగా కల్పించారు)

అట్టి అగ్ని-వాయు-ఆదిత్యుల నుండి అనేక కల్పనా పరంపరల కొరకై ధ్యానము చేశారు. ఆ ముగ్గురు దేవతల నుండి అనేక సారభూతములైనవాటిని వెలికితీసి సృష్టిలో స్థానము ఇవ్వసాగారు.

అగ్ని నుండి - ఋక్కులను (ఋగ్వేదమంత్రములను)

వాయువు నుండి - యజుర్వేద యజస్సులను (యజుర్వేద మంత్రములను)

ఆదిత్యుని (సూర్యుని) నుండి - సామములను (సామవేద సంగీత-స్తుతి గానములను) రసముగా ప్రజాపతి స్వీకరించారు.

ఆ ప్రజాపతి - అట్టి త్రైవేదముల నుండి మరల ధ్యానం చేసి కొన్ని సారభూతమగు వస్తువులను 'ధ్యానము'చే వేరు చేసారు.

ఋక్కుల నుండి (ఋగ్వేదము నుండి) – "భూః" (Solid) అనే వ్యాహృతిని, (భూలోకమును)

యజస్సుల నుండి (యజుర్వేదము నుండి) – "భువః (Thought / Feelings) అనే వ్యాహృతిని, (భువర్లోకమును)

సామముల నుండి (సామవేదము నుండి) "స్వః" (Thinker/Feeler) అనే వ్యాహృతిని (స్వర్గలోకమును)

అట్టి "భూః" మొదలైన వ్యాహృతులు – లోకముల, దేవతల, వేదముల సారము.

అట్టి సృష్టియే "యజ్ఞము" ద్వారా ఆత్మజ్ఞానముగా ఉపాసించబడుచున్నది. అనగా ముముక్షువుకు ఈ సమస్త సృష్టి ఆత్మజ్ఞానము కొరకు ఉపకరణము (పంచపాత్ర, ఉద్ధరిణ వంటిది) అగుచున్నది.

అట్టి యజ్ఞము విధి విధానంగా, మంత్రయుక్తంగా నిర్వర్తించబడు గాక!

యజ్ఞ శాస్త్రములో దోషములు దొర్లితేనో? వాటికి కొన్ని దోష ప్రాయశ్చిత్తములు (వృత్త ఉపశాంతులు) కూడా చెప్పుచున్నాయి.

I. ఋక్కుల విభాగములో ఏవైనా దోషములు దొర్లితే → **"భూస్స్వాహా" ఇతిగార్హపత్యే జుహుయాత్।** "భూస్స్వాహా" అని గార్హపత్యాగ్ని యందు నేయి హోమము చేసెదరుగాక। ఇది ఋక్కుల ఉచ్చారణలో పొరపాట్లకు పాయశ్చిత్తము. ఈ విధంగా ఋక్కుల శక్తి – సారములచే ఋక్కులకు చెందిన దోషములు లోటు నివారణము కాగలదు.

II. యజుర్మంత్ర – యజస్సులలో ఏవైనా లోటుగాని, దోషములు గాని జరిగితే → "భువస్స్వాహా" ఇతి దక్షిణాగ్నే జుహుయాత్। "భువస్స్వాహా" అని మంత్రము చెప్పుచు దక్షిణాగ్ని యందు నేయి హోమము చేయుదురు గాక! అది అన్ని దోషములకు ప్రాయశ్చిత్తము.

III.సామముల (సామవేద మంత్ర ధ్యాన విధులలో) ఏవైనా లోటు దోషములు జరిగితే...

**"స్వస్స్వాహా" ఇతి ఆహవనీయే జుహుయాత్।** "స్వస్స్వాహా" అను మంత్రము చెప్పుచూ నేయిని ఆహవనీయాగ్ని యందు హోమము చేసెదరు గాక! ఇది దోషములకు ప్రాయశ్చిత్తము.

ఒకవేళ బ్రహ్మ (ముఖ్య ఋత్విక్కు) మౌనము వీడటము మొదలైన ఏవైనా దోషములు జరిగినప్పుడు మాత్రము పాయశ్చిత్తంగా – గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని, ఆహవనీయాగ్ని – త్రిఅగ్నులకు (నేయిని) హోమము చేయటము – ప్రాయశ్చిత్తమగుచున్నది. "బ్రహ్మ" యొక్క దోషము – వేద విద్య చేతనే అగుచున్నది – అని శ్రుతి ప్రవచనము.

దృష్టాంతంగా→

క్షారద్రవ్యము చేతనే (Borox) బంగారముతోనే తెగిన బంగారం ముక్కలను అతికించగలము.

తగరముతోనే – సీసము అతికించగలము.

సీసముతోనే – ఇనుమును అతికించగలం.

ఇనుముతోనే – కట్టె (wood)ను అతికించగలము.

ఈ తీరుగానే దేనికి ఏది ప్రాయశ్చిత్తమో ఆ విధంగానే (పైన చెప్పబడినట్లు) – యజ్ఞ విధులలో లోటు, పొరపాటు, దోషములను నివారించుకొనెదరు గాక!

ఋత్విక్కు లోకముల యొక్క, యజ్ఞపురుషుని యొక్క, యజ్ఞ విధుల ప్రకారము ఆహ్వానించి పూజించవలసినట్టి దేవత – ప్రత్యధి దేవతల యొక్క మంత్రతంత్రములకు సంబంధించి ఉత్తమ పరిజ్ఞానము కలిగి ఉండాలి. ఆతడు వేద విద్యాశక్తితో యజ్ఞములోని లోటుపాటులను మంత్ర–తంత్రముగ్ధంగా సరిచేయటము ఎరిగినవాడై ఉండును గాక! అట్టి (బ్రహ్మ ముఖ్య ఋత్విక్కు) ఒక వైద్యుని వంటివాడు. యజ్ఞ విధి, ప్రాయశ్చిత్తము, వ్యాహృతి హోమము తెలిసిన బ్రహ్మ యజ్ఞము దిగ్విజయమై ఉత్తమోత్తమ ప్రయోజనము ప్రసాదించగలడు.

గుఱ్ఱము రౌతును రక్షించుతీరుగా యజ్ఞమును బ్రాహ్మణ ఋత్విక్కు యజ్ఞము పూర్తి అయ్యే వరకు రక్షించాలి. యజమానిని, కార్యకర్తలను, హోత - అధ్వర్యుడు - ఉద్గాత - మొదలైన యజ్ఞమును నిర్వర్తింపజేయు ఋత్విజులను సర్వదా కాపాడుకుంటూ ఉండాలి. యజ్ఞము మొదలు - చివర వరకు ఉత్తమ ఫలితము లభించుటకై ప్రోత్సహించాలి. హెచ్చరించాలి. దోషములు జరిగితే ప్రాయశ్చిత్తం చేయించాలి. సరిఅయిన విధి - విధానములను ఆచరించునట్లు నడిపించాలి. బ్రహ్మ, ఋత్విజుడు, హోత మొదలైనవారు ఏకాగ్రతతో తమ తమ విధులను నిర్వర్తిస్తూ ఉండాలో తెలుసుకొని ఉండాలి. బ్రహ్మ (ముఖ్యఋత్విజుడు) శాంతపురుషుడై ఉండాలి. మౌనంగా ఉంటూనే అన్నీ పర్యవేక్షించాలి. ఆతనికి కోపము, ఆవేశము, అరుపులు ఉండరాదు. ఈ విధంగా బ్రాహ్మణ బ్రహ్మ యజ్ఞమును, యజ్ఞ విధులను ప్రాయశ్చిత్త మంత్రములను నిర్వర్తించేవారి శారీరక మానసిక సౌకర్యములను తెలిసి, జ్ఞప్తి యందు కలిగినవాడై ఉండాలి. పరమశాంత స్వభావుడై ఉండాలి. అందరినీ స్నేహపూరితంగా కలుపుకుంటూ యజ్ఞమును సమర్థవంతముగా నడిపించగలవాడై ఉండాలి. అందుచేత ముఖ్యఋత్విక్కుగా (బ్రహ్మగా) శ్రేష్ఠుని ఎన్నుకొని (యజమాని) నియమించుకోవాలి. పై గుణ విశేషములు కలవానిని ఎన్నుకోవాలి. అన్నివైపులా యజ్ఞమును వేదమంత్ర పఠన నిష్ఠలను తదితర హోత మొదలైనవారిని రక్షించవలసిన ధర్మజ్ఞుడు బ్రహ్మయే (ముఖ్య ఋత్విజుడే).

ఆతనికి "పరమశాంతము" నియమము. ఎప్పుడైనా కోపగించటము, విసుగుకోవటము, ఏవైనా పొరపాట్లను గమనించక పోవటము, తెలియక నిర్వహణలోని వారిని తొందరపెట్టటము - ఇటువంటి పొరపాట్లు జరిగితే, అప్పుడు బ్రహ్మ (ముఖ్య ఋత్విజుడు)

- యజ్ఞకర్త హోమద్రవ్య సమర్పణ ముగిస్తూ ఉండగానే - బ్రహ్మ లేచి హోమమును '3' '3' సార్లు ఈ విధంగా చేయాలి.

**(1) గార్హపత్యాగ్నికి :-**

**"తత్ తత్ర యజ్ఞే యద్యృక్త ఋక్ సంబంధాత్ ఋత్ నిమిత్తం రిష్యేత్ - యజ్ఞః క్షతం ప్రాప్నుయాత్ -"భూస్స్వాహా"। "ఇతి - గార్హపత్యే జుహుయాత్॥**

**అని '3' సార్లు చదువుతూ '3'సార్లు గార్హపత్యాగ్నికి హోమద్రవ్యము (నేయి) సమర్పించాలి.**

**(2) అథ యది యజుషో రిష్యేత్ - యజుర్నిమిత్తం "భువస్స్వాహా।" - ఇతి - దక్షిణాగ్నౌ జుహుయాత్॥**

అని 3 సార్లు చదువుచూ 3సార్లు దక్షిణాగ్నికి హోమద్రవ్యము సమర్పించాలి.

---

**(3) అథ యది సామతో రిష్యేత్ సామ నిమిత్తం "స్వస్స్వాహా।" - ఇతి - ఆహవనీయే జుహుయాత్।**

అని '3' సార్లు చదువుతూ '3' సార్లు ఆహవనీయాగ్నికి హోమద్రవ్యము సమర్పించాలి.

---

- ఈ విధంగా బ్రహ్మ అనే ఋత్విక్కు త్రై అగ్నులకు సమర్పించాలి.

- అదేవిధంగా హోత, అధర్వుడు, ఉద్గాత కూడా వారు సేవించిన విభాగములకు హోమము ముగియటానికి ముందు పై మంత్రములతో హోమద్రవ్యమును ఆయా గార్హపత్య, దక్షిణ, ఆహవనీయాగ్నులకు ప్రాయశ్చిత్త త్రయీద్రవ్య సమర్పణ (దోష నివారణ కొరకు) సమర్పించెదరు గాక!

ఈ విధంగా ఋత్విక్కుల మౌనభ్రంశమునకు తదితరములైన హోతము - ఓద్గాత్రములకు - కర్మలలో లోపము కలిగినప్పుడు 'వ్యాహృతులతో హోమము' అనే ప్రాయశ్చిత్తముగా (ఆరణ్యకములలో) చెప్పబడినది నిర్వర్తించి శాంతిని పొంది ఉండెదరు గాక!

# ఛాందోగ్యోపనిషత్
# పంచమ అధ్యాయము
## 5-1. ప్రథమ ఖండము - ప్రాణము యొక్క జ్యేష్ఠత్వ శ్రేష్ఠత్వములు

ఎవ్వరైనా సరే, "నేను ఈ రోజు నుండి అత్యంత శ్రద్ధగా ఉపాసించటము ప్రారంభిస్తాను" - అని అనుకుంటే, అప్పుడు ఆయన

> "ఏది అత్యంత శ్రేష్ఠమో, ఏది అత్యంత జ్యేష్ఠమో (That which is very Importantly Special and the Biggest / Finest) - అద్దానినే ఉపాసించు వస్తువుగా, గమ్యముగా ఎన్నుకుంటాను!...."

అని అనుకోవటము స్వాభావికమే కదా!

ఈ శరీరములో చూపు, వినికిడి, వాక్కు, రుచి, స్పర్శ, వాసన, ఆలోచన, తెలివి, ఇష్టము మొదలైన అనేక విశేషాలు ఉన్నాయి. అయితే వీటిలో ఉపాసనకై ఏది జ్యేష్ఠము (The Biggest), శ్రేష్ఠము (The most Important) అయి ఉన్నది?

ఈ ప్రశ్నకు ఋషి సమాధానము! **ప్రాణో వావ జ్యేష్ఠః - శ్రేష్ఠశ్చ।** ప్రాణమే వాక్కు, చూపు, వినికిడి, ఆలోచన, విచక్షణ మొదలైన వాటికంటే మునుముందే ఉన్నట్టిది. **అట్టి ప్రాణశక్తితో జీవుడు గర్భమునందు ప్రవేశించగా, ఆ తరువాత కాళ్ళు, చేతులు, చర్మము, చెవులు, ముక్కు, కళ్లు మొదలైనవన్నీ రూపుదిద్దుకుంటున్నాయి.** ముందుగా గర్భస్థ శిశువుకు క్రమంగా కన్ను - చెవి గోళకములు ఏర్పడుచున్నాయి. శిశువు భూమిపై పుట్టిన తరువాతే చెవులు, కళ్లు మొదలైన ఇంద్రియములు వ్యవహరించటం ఆరంభిస్తున్నాయి. కాబట్టి ప్రాణమే అన్నిటికంటే పెద్దది అగుచున్నది.

ఎవ్వడైతే అతిశయించి అన్నిటినీ కప్పి ఉంచు వసిష్ఠమైన దానిని (అనగా - ప్రాణమును) ఉపాసిస్తాడో - అట్టివాడు అందరిలో 'వసిష్ఠుడు' (శ్రేష్ఠుడు) అగుచున్నాడు.

**వాగ్వా వసిష్ఠః।** వాక్కు నిశ్చయముగా శరీరములో వసిష్ఠమైనది (అతి ముఖ్యమైనది). చక్కగా మాట్లాడటము తెలిసినవాడు (వాక్ చాతుర్యము కలవాడు) అందరిచేత గౌరవించబడగలడు. ఇష్టబడగలడు. **అందుచేత వాక్కు వసిష్ఠముగా** (Very effectively) **ఉపయోగించబడు గాక।**

= మాట మంచిగా ఉంటే ఊరు మంచిది అవుతుంది.

**(వాక్ తపస్సు : అనుద్వేగకరం వాక్యం, సత్యం, ప్రియం, హితం చ యత్, స్వాధ్యాయాభ్యాసనం చ ఏవ "వాఙ్మయం తపః" ఉచ్యతే॥ - భగవద్గీత - 17-15)**

వసిష్ఠమగు వాక్కును ఉపాసనగా ఉపయోగించువాడు లోకమున వసిష్ఠుడు అగుచున్నాడు.

**చక్షుర్వావ ప్రతిష్ఠా!** : ఎవ్వడైతే ప్రతిష్ఠమైన దానిని (అంతటా ఏర్పడినదై ఉన్నదానిని) దర్శిస్తూ ఉపాసిస్తాడో, అట్టివాడు లోకములో ప్రతిష్ఠవంతుడు అవుతాడు. **దృష్టియే సృష్టి.** అట్టి దృష్టిని (చూపును) ఎవడు ఆత్మగా ఉపాసిస్తాడో **- స అస్మిం లోకే, అముష్మిగ్ంశ్చ (పరే) ప్రతితిష్ఠతి హ।** అట్టి ప్రతిష్ఠితమగు చూపు (దృష్టి)ని **"పరమాత్మ"** భావనతో ఉపాసించువారు ఇహమునందు, పరమునందు కూడా సుప్రతిష్ఠత సముపార్జించుకోగలరు.

**శ్రోత్రం వావ సంపత్** : చెవియే జీవునికి సంపద. వినటము చేతనే వేదములు, వేదార్థములు, గురువాక్యముల శ్రవణ మననములు చేయగలరు. శ్రద్ధగా విననప్పుడే జీవుడు బుద్ధిమంతుడు, సత్కర్మనిష్ఠుడు కాగలడు. శ్రవణము చేతనే జీవితము సమృద్ధమవగలదు. ఉత్తమ శ్రవణము చేయువాడు దేవతల - మానవుల సంపదలు పొందగలడు.

**మనో హ వా ఆయతనమ్** : ఎవడు మనో - ఆయతనమును (ఆశ్రయమును) ఉపాసిస్తాడో, అట్టివాడు ఉత్తమమైనవి ఆశ్రయించగలడు. మనస్సే ఆశ్రయించు ధర్మము కలిగి ఉన్నది. కనుక మనస్సే ఆయతనము. పంచేంద్రియములు దృశ్య

సమాచారములను తీసుకువచ్చి 'మనస్సు'కు అందిస్తున్నాయి. మనస్సు తన వృత్తులను ఉపయోగించి 'ప్రతిస్పందనము'ను ఇంద్రియములకు ఆజ్ఞాపిస్తోంది. అందుచేత 'మనస్సే ఆయతనము' అని చెప్పబడుతోంది.

సమస్తమునకు ఆశ్రయము మనస్సే। బంధమోక్షములకు కూడా మనస్సే ఆశ్రయము (మనయేవ మనుష్యాణాం కారణం బంధమోక్షయో)॥

## ఇంద్రియములు పరస్పరం విరోధించుట

ఒకానొక సందర్భములో మనము పైన చెప్పుకున్న "వసిష్ఠము", "ప్రతిష్ఠ", "సంపద", "ఆయతనము" మొదలైన విశేషములు గల 'ప్రాణదేవతలు'గా వర్ణించబడు ఇంద్రియములు శరీరములో ఒకచోట సమావేశమైనాయి. అవి తాము శరీరమునకు కల్పిస్తున్న శ్రేయస్సు గురించి సంభాషించుకోసాగాయి. ఇంతలో వారి సంభాషణ 'చర్చలు'గా మారి, వాదనలై తీవ్రతరం కాసాగాయి. **"అహం శ్రేయసి। అహం శ్రేయానస్మి। అహం శ్రేయోనస్మి।"** – "మేమే ఈ శరీరమునకు గొప్పగా శ్రేయస్సు కలిగిస్తున్నాం" – అని వాదించుకుంటూ, ఒకరికొకరు గురించి విరుద్ధంగా కూడా వాదోపవాదములు చేసుకోసాగాయి. ఆత్మ స్తుతి, పరనింద చేసుకోసాగాయి. ఆ సమావేశములో "వాక్కు – చూపు – వినికిడి – మనస్సులలో ఏది గొప్ప?" అనేది అవి ఇదమిత్థంగా తేల్చుకోలేకపోయాయి. అప్పుడా ఇంద్రియ దేవతలు తమ పితృదేవులగు ప్రజాపతిని సమీపించాయి.

**ఇంద్రియ దేవతలు** : పితృదేవా! ప్రజాపతీ! వాక్కు – చూపు – వినికిడి – మనస్సులను జీవులకు ప్రసాదిస్తున్న మా ఇంద్రియ దేవతలలో ఎవరు గొప్పయో మేము తేల్చుకోలేకపోతున్నాము. పూజనీయా! దయచేసి మీరు నిర్ణయించండి, మాలో ఎవరు శరీరములో గొప్పయో!

**ప్రజాపతి** : ఓ ఇంద్రియ దేవతలారా! శరీరములో మీరంతా ముఖ్యులే!

**ఇంద్రియ దేవతలు** : పితృదేవా! అది సరేలెండి. మాలో అత్యంత ప్రాధాన్యులెవరో, అది మీరు నిశ్చయించి చెప్పండి.

**ప్రజాపతి** : ఆదాఁ! అది మీరే తేల్చుకోండి. అయితే అందుకు పరీక్షించుకొనే ఒక విధానము మాత్రం నేను చెపుతున్నాను, వినండి!

**యస్మిన్ వ ఉత్క్రాన్తే** (ఇదం) **శరీరమ్ పాపిష్ఠతరమివ దృశ్యేత స వః "శ్రేష్ఠ" ఇతి।**

మీలో ఎవ్వరైతే శరీరమును వీడిపోయినప్పుడు, ఈ శరీరము ఎందుకూ కొరగాకుండా (ఉపయోగించకుండా) పోతుందో, పాపిష్ఠతరము అవుతుందో అదియే (ఆ దేవతయే) శ్రేష్ఠాతిశ్రేష్ఠమని, జ్యేష్ఠమని మీరు కావాలంటే నిర్ణయించుకోవచ్చును.

- ఈ విధంగా చెప్పి ఆ ఇంద్రియ దేవతలకు కోపం రాకుండా సంతోషపరచి తిరిగి పంపారు.
- ఇంద్రియ దేవతలు యథాప్రకారం శరీరములో ప్రవేశించారు.

## వాక్ ఇంద్రియము ఉత్క్రమ్యము (లేచిపోవటము)

అప్పుడు వాక్ ఇంద్రియము – "నేనే లేకపోతే ఈ జీవుడు నోరు విప్పి మాట్లాడనే లేడు కదా! అందుచేత శరీరమునుండి బయటికి వెళ్లి నా గొప్ప చూపిస్తాను" – అని తలచింది. శరీరమునుండి పైకి వెళ్ళిపోయింది. ఆ జీవుడు మూగగా అయిపోయాడు. సంవత్సరకాలము గడచిన తరువాత తిరిగి వాక్కు శరీరంలో ప్రవేశించింది. ఆశ్చర్యం! శరీరము ఇంకా జీవించటము కొనసాగిస్తూనే ఉన్నది.

**వాక్ ఇంద్రియము** : ఇదేమిటి? నేను శరీరమును విడచి వెళ్లి సంవత్సరకాలము అయినప్పటికీ, ఈ శరీరము ఇంకా జీవించటము కొనసాగిస్తూనే ఉన్నదే? ఇది ఎట్లా జరుగుతోంది?

**తదితర ఇంద్రియ దేవతలు** : ఏమున్నది? మూగవాడు జీవించటం లేదా? అట్లాగే మీరు పైకి వెళ్లి సంవత్సరకాలమైనా ఈ జీవుడు జీవితమును కొనసాగిస్తూనే ఉన్నాడు. ప్రాణము నిలచియే ఉన్నది. కళ్ళతో చూస్తున్నాడు. చెవితో వింటున్నాడు. మనసుతో కల్పనలు కొనసాగిస్తూనే ఉన్నాడు. మేమంతా శరీరంలో జీవిస్తూనే ఉన్నాము.

**వాక్ ఇంద్రియము** : ఓహో! కాబట్టి– **ఆత్మనో అశ్రేష్ఠతాం।** నేను శ్రేష్ఠుడు కాదన్నమాట।

- ఈ విధంగా నిర్ణయించుకొని సిగ్గుపడుతూ మరల శరీరంలో వాక్‌ధర్మము నిర్వర్తించసాగించి
- అప్పటి నుండి ఆ శరీరి మరల ఇదివరకటివలె మాట్లాడగలగటం ప్రారంభించాడు.

## చక్షురింద్రియ - ఉత్క్రమ్యము (లేచిపోవటము)

అప్పుడు దృష్టి (చూపు) దేవత – "మేమెంత ముఖ్యమో ఇప్పుడు అందరికీ తెలియజేస్తాను"....అని చెప్పి శరీరము నుండి పైకి వెళ్ళిపోయింది. ఆ జీవుడు గ్రుడ్డివాడైనాడు. ఒక ఏడాది గడిచిన తరువాత తిరిగి శరీరములో ప్రకాశించింది. అప్పటికే జీవుడు, తదితర ఇంద్రియములు తమ పని తాము కొనసాగిస్తూనే ఉన్నారు. "ఇది ఎట్లా? ఈ సంవత్సరకాలం ఎట్లా మీరంతా జీవిస్తూనే ఉన్నారు?" – అని అడిగింది.

ఔను! గుడ్డివాడు మనస్సు – వాక్కు – వినికిడిలతో జీవిస్తూనే ఉన్నాడు కదా! అట్లాగే ఇది।" – అని తదితరం ఇంద్రియములు సమాధానమిచ్చాయి. "అనగా నేను వరిష్ఠము (The Most Important) కాదన్నమాట" – అని తలచి సిగ్గుతో తిరిగి శరీరంలో ప్రవేశించింది.

## శ్రోత్రేంద్రియ - ఉత్క్రమ్యము (లేచిపోవటము)

అప్పుడు 'శ్రోత్రేంద్రియదేవత శరీరమునుండి లేచి పైకి వెళ్లిపోయింది. ఆ జీవుడు చెవిటివాడయ్యాడు. సంవత్సరకాలం గడచిన తరువాత తిరిగి ఆ శ్రోత్రేందియము శరీరంలోకి వచ్చి చూస్తే, ఆ శరీరము జీవిస్తూనే కనిపించింది. **ఇది ఎట్లా సాధ్యం? మిగతా ఇంద్రియ దేవతలు శరీరంలో ఉండియే ఉన్నారే?"** – అని ప్రశ్నించింది.

**తదితర ఇంద్రియ దేవతలు** : అవును మరి. ఒక చెవిటివాడిలో తదితర ఇంద్రియములు ఎట్లా కొనసాగుతూనే ఉంటాయో అట్లాగే – కళ్లు చూస్తూనే ఉంటాయి, మనస్సు సంకల్పములు చేస్తూనే ఉంటాయి కదా! ఇదీ అంతే।

**అప్పుడు శ్రోత్రేంద్రియము** – "ఓహో! ప్రజాపతి చెప్పిన సిద్ధాంతం ప్రకారం నేను వరిష్ఠము కాదన్న మాట।" – అని పలికి సిగ్గుతో తిరిగి శరీరంలో ప్రవేశించింది.

## మనో హ ఉచ్చక్రామ (లేచిపోయింది)

అప్పుడు మనస్సు శరీరమునుండి నిష్క్రమించి (బయటకువెళ్లి) సంవత్సరము కాలము తరువాత తిరిగి వచ్చింది. జీవుడు, పంచేంద్రియాలు జీవించియే ఉన్నాయి. **"అదేమిటి? కథం అశకతర్తే మత్ – జీవితుమితి? నేను లేకుండా ఈ జీవుడు సంవత్సర కాలంగా ఎట్లా జీవిస్తున్నాడు?"** – అని ఆశ్చర్యంగా పలికింది.

తదితర ఇంద్రియములు ఇట్లా సమాధానమిచ్చాయి:

**యథా బాలా అమనసః ప్రాణన్తః ప్రాణేన, వదంతో వాచా, పశ్యంతః చక్షుషా, శృణ్వంతః శ్రోత్రేణైవమ్** – ఇతి

"అప్పుడే పుట్టిన ఒక పసిపిల్లవాడు జగత్తు గురించిన మనస్సు ఏమాత్రము లేకపోయినప్పటికీ ప్రాణముతో జీవిస్తూ, నోటితో 'ఆ' 'ఉ' 'ఏ' అని పలుకుచూ, కళ్లతో అటు – ఇటు చూస్తూ, చెవులతో అమ్మపాడే లాలిపాటలు వింటూ జీవించటం లేదా? అట్లాగే మనస్సు బహిర్గతమైనప్పటికీ ఒక పసిపిల్లవానిలాగానో, పిచ్చివానిలాగానో – జీవిస్తూనే ఉన్నాడు. పంచేంద్రియాలు తమ పని కొనసాగిస్తూనే ఉన్నాయి"

**"అనగా, ప్రజాపతి చెప్పిన సూత్రమును అనుసరించి నేను అన్నిటికంటే శ్రేష్ఠము, జ్యేష్ఠము కాదన్నమాట!"** అని తలచి మనస్సు తిరిగి యథాస్థానం సిగ్గుతో ప్రవేశించి తన పని తాను నిర్వర్తించసాగింది.

## ప్రాణ ఉచ్చిక్రమిషన్ (లేచిపోబోవటం)

అప్పుడు ప్రాణము శరీరమునుండి లేచిపోవటానికై సిద్ధమై కదలసాగింది. అంతేఁ! గుఱ్ఱము కాళ్లకు కట్టిన త్రాళ్ళను త్రెంచుకొని గుఱ్ఱపుశాలనుండి బయటకు ఉదకసాగుతుంది చూచారా? ఆ విధంగా శరీరములోని వాక్కు, చూపు, వినికిడి, మనస్సు, స్పర్శ మొదలైన ఇంద్రియములన్నీ కట్టుతాడు తెగినట్లు బయటపడసాగాయి. ప్రాణము తనవెంట ఇంద్రియములన్నిటినీ పెకలించి వేయసాగింది. అప్పుడు పంచేంద్రియములు, మనస్సు ప్రాణదేవతకు అభిముఖమై ఇట్లు ప్రార్థించసాగాయి.

**ఇంద్రియ దేవతలు, (ఆరవదగు) మనస్సు** : ఓ ప్రాణేశ్వరా! పూజనీయా! మీరు వెళ్ళకండి। ఉండండి। ఉండండి। నిష్క్రమించండి। మా అందరిలో మీరే గొప్ప. మీరు లేకుంటే ఈ దేహము మేము నివసించటానికి ఎందుకూ పనికిరాదు ప్రభూ! దేహమును వీడి పైకి పోవద్దు.

**వాక్ దేవత** : **ఓ ప్రాణమా!** వాక్కుగా నేను ఏవిధముగా వసిష్ఠమో, మీరు అంతగానూ ఈ శరీరములో వసిష్ఠము (Highly Important) అయి ఉన్నారు. వెళ్ళకండి.

**చూపు (చక్షు) దేవత** : ఓ ప్రాణశక్తీ! నేను ఏవిధంగా దృశ్యమంతటికీ ఆశ్రయమైయున్నానో, మీరూ అంతగానూ సమస్తమునకు ఆశ్రయమైయున్నారు. అందుచేత మీరు ఈ శరీరమును వీడకండి.

అందుకే ఒక జీవిని చూచి..

– ఈతడు 'వాక్కు' అని చెప్పరు. 'చూపు' అని పిలువరు. 'చెవులూ!" అని పిలువరు.

మరి ఏమని పిలుస్తారు? "ప్రాణీ!" అని అంటారు. ఒకేశక్తి అనేక రూపములు ధరిస్తున్నట్లు ప్రాణశక్తియే దేహములో వాక్కు, చూపు వినికిడి, స్పర్శ, రుచి మొదలైన ఇంద్రియ శక్తులుగా ప్రదర్శితము అవుతోంది.

సమస్త జీవులు ప్రాణస్వరూపులే! అన్నిటికీ భోక్త ప్రాణములే! "ప్రాణం హాయిగా ఉన్నది।", "ప్రాణం బాగోలేదు", "ఆతడంటే నాకు ప్రాణము" మొదలైన వాక్యములు జనులు "పరాకాష్ఠ ప్రాణకర్తృత్వము" చేతనే సంభాషించుకుంటున్నారు.

ఈ విధంగా ప్రాణము "పూజ్యోతి పూజ్యము" – అయి ఉన్నది. **"ప్రాణోపాసన"చే సమస్తము సిద్ధిస్తున్నాయి.**

## 5-2. ద్వితీయ ఖండము – ప్రాణమునకు ఆహారము ఏది?

**ప్రాణదేవత** : ఓ ఇంద్రియ దేవతలారా! మీరు అభ్యర్థిస్తున్నట్లు నేను దేహమును విడచివెళ్ళను. దేహములో ఉంటూ, మీ మీ శక్తులను ప్రదర్శింపజేస్తాను. అయితే మరి నాకు అన్నము (ఆహారము) ఏమి? కిం అన్నం భవిష్యతి – ఇతి?

**ఇంద్రియ దేవతలు**: ఓ ప్రాణేశ్వరా! కుక్కలకు, పక్షులకు, మానవులకు, తదితర సమస్త జీవులకు ఏదేది ఆహారముగా ఉన్నదో, అదంతా మీకు ఆహారమే। సమస్తము ప్రాణదేవతలగు మీకు అన్నమే. సమస్తము భక్షించేది మీరే.

ఏదేది వాక్కుచే మాట్లాడబడుచున్నదో, ఏదేది కళ్ళతో చూడబడుతోందో, ఏదేది చెవులకు వినబడుతోందో, ఏదేది చర్మముచే స్పృశించబడుతోందో, ఏదేది రుచి చూడబడుతోందో, ఏదేది త్రాగబడుతోందో – అట్టి సమస్తము ప్రాణదేవతకు ఆహారమే। ఇంద్రియములగు మేము మీకు ఆహారము అందించు మీ హస్తములవంటివారము।

ఎవ్వరు ఏది ఎక్కడ 'అన్నము'గా తినినా, అది ప్రాణమునకే ఆహారము అవుతుంది.

---

ఈ విషయము తెలుసుకొని ప్రాణదేవతను **సర్వజీవరాసులలోను, సర్వ ఆహార పదార్థములందు** ఉపాసించువారు – అన్నోపాసన చేసినవారు కూడా అగుచున్నారు. వారికి అన్నములోటు ఉండదు.

అన్ని చేష్టలందు ప్రాణమే వ్యాపించి ఉన్నది. అందుచేతనే ప్రాణమునకు "అనము" – అని శాస్త్రీయ నామము.

అన = గతి శీలము సూచించే ధాతువు।

ప్ర = విశేషమగు 'గతి'।

ప్రాణము = విశేషమైన గతి గలది।

అన్నము = ప్రాణము అన్నిచోట్ల స్వీకరిస్తూన్న ఆహారము.

**<u>ప్రాణోపాసన</u>** (1) నేను ప్రాణదేవతా స్వరూపుడను.

(2) సకల దేహములలో ప్రాణస్వరూపుడనై ఆహారమును భుజించుచున్నాను.

ఇట్టి ఉపాసనయే ప్రాణోపాసన (మరియు) అన్నోపాసన కూడా।

ఇట్టి ఉపాసనను ఎరిగినవానికి "ఇది తినకూడదు" అన్న నిషిద్ధము ఉండదు. అన్నీ ఆతనికి ప్రియ ఆహారములే అవగలవు.

'సమస్తము ప్రాణదేవతా ప్రదర్శనమే' అని ఎరిగినవాడు, ఉపాసించువాడు – తానే ప్రాణదేవత అయి, సమస్తమును తన ప్రియ – ప్రాణ రూపముగా దర్శిస్తూ ఆనందించగలడు. ఈ విధంగా ప్రాణేశ్వర రూపము సిద్ధించుకున్నవాడు సూర్యుని ఉదయ – అస్తమయములు తనయందే దర్శించగలడు.

ఇంకా కూడా ప్రాణదేవత ఇంద్రియములతో ఈ రీతిగా సంభాషణ కొనసాగించింది.

**ప్రాణశక్తి (ప్రాణదేవత)** : ఓ ఇంద్రియములారా! నా ఆహారము గురించి మీరు చెప్పినదానికి సంతోషమే। మరి నాకు "వస్త్రము" సంగతి ఏమిటి?

**ఇంద్రియములు** : సమస్త జలములు మీకు వస్త్రములే.

అందుచేతనే భోజనము చేసేముందు, భోజనము చేసిన తరువాత కూడా జలము స్వీకరిస్తాము. జలము ప్రాణమును కప్పి ఉంచుతుంది కాబట్టి , – ఆ జలము ప్రాణమునకు **"వస్త్రము"** అగుచున్నది. పితృదేవతలకు పితృకార్యములలో అనేకమార్లు జలతర్పణము సమర్పిస్తున్నది అందుకే!

భోజనం చేయునప్పుడు "ఆచమనము"ను "ప్రాణదేవతకు వస్త్రము సమర్పిస్తున్నాను" – అని ఉపాసించువానికి, ఇక వస్త్రముల 'లోటు' ఉండదు.

ఈ "ప్రాణోపాసన విద్య"ను ఒకప్పుడు సత్యకామ జాబాల మహర్షి 'గోశ్రుతి' అనే పేరు గల వ్యాఘ్రపదముని కుమారినికి – (ఆతడు ప్రాణతత్త్వము గురించి బోధ అర్థించినప్పుడు) – చెప్పియున్నారు.

ఒక ఎండిన మోడుకు ఈ ప్రాణతత్త్వ వివరణను ప్రాణోపాసకుడు చెప్పితే, అట్టి మోడు కూడా తిరిగి చిగురించగలదు. ఇక జీవించియున్నవాడు శ్రవణము చేస్తే ఉత్తమ ప్రయోజనము ఎందుకు ప్రసాదించదు? తప్పక ప్రసాదిస్తుంది।

## ప్రాణోపాసన – మంథన విద్య

ఇప్పుడు మనము "మంథనము" అనబడే ప్రాణోపాసనా విధానము గురించి చెప్పుకుంటున్నాము. ఉపాసకి ఔన్నత్యము కొరకై ఇది ఉపకరించగలదు.

- అమావాస్యనాడు "ప్రాణోపాసన"ను దీక్షగా స్వీకరించాలి. (యాగదీక్ష స్వీకరించాలి) (1) నేలపై పరుండటము (2) సత్యమునే పలకటము (3) బ్రహ్మచర్యము (4) కొంతసేపు తపస్సు నిర్వర్తించటము – ఈ విధంగా అంతఃకరణ శుద్ధికి నియమములు పాటించాలి.
- పౌర్ణమి రోజున 'సంపూర్తి' చేయాలి.

***పున్నమి నాటి రాత్రి:***

I. నవ ధాన్యముల గింజలను పిండిలాగా చేయాలి.

II. ఆ పిండిని పెరుగు – తేనెలయందు కలిపి (అన్నిటినీ కలిపి) పిష్ఠము (ముద్ద) తయారు చేయాలి.

[ఇంకొక విధానము

(1) బియ్యము (2) అడవిలో దొరికే నివ్వెర ధాన్యము మొదలైన వాటిని పొట్టుతీసి – పిండిని తేనె – పెరుగులో కలిపి పిష్ఠము (ముద్ద) చేయటము]

III. ఆ పిష్ఠమును జ్యేష్ఠుడు, శ్రేష్ఠుడు అగు ప్రాణదేవతను పూజిస్తూ నివేదనగా (నైవేద్యముగా) సమర్పించాలి.

IV. ❖ వసిష్ఠ వాక్ స్వరూప ప్రాణదేవాయ నమః।

❖ ప్రతిష్ఠ చక్షు స్వరూప – ప్రాణ దేవాయ నమః।

❖ సంపత్ శ్రోత్రం స్వరూప – ప్రాణదేవాయ నమః।

❖ ఆయతన మనో స్వరూప – ప్రాణదేవాయ నమః।

❖ ఓం జ్యేష్ఠాయ స్వాహా। శ్రేష్ఠాయ స్వాహా।

అని హవిస్సుకు పిండితో చేసిన ముద్దను అగ్నిలో తేల్చాలి.

V. అగ్నికి నేతితో హోమము చేసి, ఆ తరువాత స్రువము (గరిటె)కు అంటుకొన్న నెయ్యిబొట్లను పిష్ఠము (పిండిముద్ద) పై వేయాలి.

VI. ఆ పిష్ఠమును "వరిష్ఠాయ స్వాహా! శ్రేష్ఠాయ స్వాహా!" అని చెప్పుచూ అగ్నికి సమర్పించాలి.

VII. స్వాహా అని పలుకుచు ప్రత్యేకముగా ఏర్పరచిన అగ్నిలో హవిస్సులు సమర్పించాలి.

VIII. మిగిలిపోయిన పిష్ఠమును, భస్మమును ఒక మూలగా పారవేయాలి.

ఐశ్వర్యము, ఆరోగ్యము కోరుకొనువారు కూడా పైవిధంగా ఆజ్యమును అగ్నికి హవిస్సులుగా సమర్పిస్తూ యజ్ఞవిధి (ప్రాణోపాసనా యజ్ఞము) నిర్వర్తించెదరు గాక!

హవిస్సులను ఉంచిన కుండలను చేతితో పట్టుకొని –

**"ఇదం హి జ్యేష్ఠః। ఇదం హి శ్రేష్ఠః।"**
**ఇదం హి రాజాధిపతిః। ఇదం హి – అన్నపతిః। అన్నభక్షకః"**

అను మంత్రములతో హవిస్సులను మునుముందుగా ఉపాసించుచుండెదరు గాక।

మంథనము చేతిలో ఉంచుకొని చదువవలసిన మంత్రము.

**అమో నామాస్య హి తే। 'అమ' ఇతి ప్రాణస్య నామ। అన్నేన హి ప్రాణః।**
**ప్రాణితి దేహ। ఇత్యతో మంథద్రవ్యం ప్రాణస్య అన్నత్వాత్ ప్రాణత్వేన స్తూయతే అమో నామాసి।**

| **ప్రాణస్తుతి** | **ఓ ప్రాణదేవా!** |
|---|---|
| – అమా హి తే సర్వమిదమ్ | ఈ సమస్తము తమ సమక్షములోనే ఉన్నది। |
| – స హి జ్యేష్ఠః శ్రేష్ఠః | మీరే జ్యేష్ఠులు। శ్రేష్ఠులు। |
| – రాజా అధిపతిః స మా జ్యైష్ఠ్యగ్ం శ్రైష్ఠ్యగ్ం | మీరే జ్యేష్ఠులు, శ్రేష్ఠులు అగు రాజాధిపతులు। |
| రాజ్యమాధిపత్యం గమయతి – అహమేవ ఇదగ్ం సర్వమ్ అసానీతి॥ | నాకు జ్యేష్ఠము, శ్రేష్ఠము, ఆధిపక్షము, ప్రకాశత్వము, ప్రసాదించండి. నేను ఈ సర్వము అగుదను గాక। |

ఈ విధంగా ప్రాణోపాసన చేయుదురు గాక। ఆ తరువాత ప్రతిపాదనము చేయబడిన ప్రసాదము భక్షించాలి.

ఆ తరువాత ఋక్కు (మంత్రము)ను పఠిస్తూ (ఒక్కొక్క అడుగుకు ఒక ఋక్‌మంత్రము చదువుచూ) ప్రతి అడుగుకు ఆచమనము చేయాలి.

**తత్సవితుః వృణీమహ – ఇతి ఆచామీతి** – అని ప్రసాదము భక్షించాలి.

**త్వా వయమ్ దేవస్య భోజనమ్ ఇతి ఆచామీతి।** – ఆచమనము చేయాలి.

**శ్రేష్ఠగ్ం సర్వధాతమం ఇతి ఆచామీతి।** – మరల ఆచమనము చేయాలి.

**"తురమ్ భగస్య ధీమహి" ఇతి సర్వం పిబతి** – కంచన పాత్ర (ఉద్ధరణ)ను కడిగి, పంచపాత్రలోని నీరు త్రాగాలి.

<u>ఆ తరువాత</u>

- అగ్నికి వెనుకగా
- తూర్పు దిక్కుగా
- చర్మ ఆసనముపై (లేక) నేలపై
- మౌనము పాటిస్తూ
- అలజడి లేని ప్రశాంతమైన చిత్తముతో పరుండాలి.

**యదా కర్మసు కామ్యేషు స్త్రియగ్ం స్వప్నేషు పశ్యతి సమృద్ధం తత్ర జానీయాత్ తస్మిన్ స్వప్న నిదర్శనే। తస్మిన్ స్వప్న నిదర్శనే॥**

ఆతనికి పరుండినప్పుడు స్త్రీ ఆకారము కనబడితే వేదమాత సంతోషించి దర్శనము ప్రసాదించినట్లు భావించెదరు గాక।

---

# 5-3. తృతీయ ఖండము - పంచప్రశ్నలు

అరుణిముని పుత్రుడు ఆరుణి. ఆరుణి కుమారుడు శ్వేతకేతువు. ఆ శ్వేతకేతువు తండ్రి వద్ద విద్య ముగించుకొని ఆనాటి ఆచారము ప్రకారము లోకజ్ఞానము కొరకై దేశసంచారము ప్రారంభించారు. ఆ సందర్భముగా పాంచాల రాజ్యమునకు వెళ్లారు. ఆ పాంచాల దేశమునకు అప్పటికి జీబలుని కుమారుడగు 'ప్రవాహణుడు' రాజుగా ఉన్నారు. శ్వేతకేతువు పాంచాల దేశములోని అనేక విశిష్ఠ ప్రదేశములు, ఆశ్రమములు దర్శించారు.

ఆ తరువాత రాజదర్శనానికి రాజ సభకి వెళ్లారు. ప్రవాహణరాజు శ్వేతకేతువును ఆరుణి మునీంద్రుల కుమారుడుగా తెలుసుకొని ఆహ్వానము పలికి తన అంతఃపురములోనే అతిథి మర్యాదలు సమర్పించారు. ఆ తరువాత ఈ విధంగా సంభాషించసాగారు.

**ప్రవాహణ మహారాజు** : వత్సా! క్షేమమా? తమ పిత్రుదేవులు అగు ఆరుణి మునీంద్రులు సకుశలమే కదా! గురుకులాశ్రమ వ్యవహారములన్నీ చక్కగా జరుగుచున్నాయి కదా? వారు మాకు పూజ్యులు. వారి గురుకులాశ్రమ సేవకై మేము సర్వదా సంసిద్ధులము.

**శ్వేతకేతువు** : మహారాజా! అంతాక్షేమమే! గురుకులము సర్వవిధముల దిగ్విజయంగా జరుగుతోంది. నేను విద్య ముగించుకొని దేశాటనకై పాంచాల దేశము వచ్చాము. జ్ఞానులు, ప్రజ్ఞావంతులు అగు మీ దర్శనము చేసుకోమని మా నాన్నగారు ఆదేశించియున్నారు. అందుచేత సంచారములో భాగముగా మీ దర్శనము చేసుకుంటున్నాను.

**ప్రవాహణ మహారాజు :** మంచిది. సంతోషము. మీ పిత్రుదేవుల పాదపద్మములకు హృదయపూర్వకంగా మననపూర్వకంగాను నమస్కరించుచున్నాను. ఓ బ్రహ్మచారీ! కుమారా! మీ నాన్న గారి వద్ద విద్యాభ్యాసము చేస్తున్నారా? తండ్రిగారి వద్ద విద్యాబుద్ధులు చక్కగా నేర్చుకొనుచున్నారు కదా!

**శ్వేతకేతువు** : పూజనీయా! నా విద్యాధ్యయనము పూర్తి అయినది. నాన్నగారు విద్యలన్నీ నాకు నేర్పి ఉన్నారు కూడా! పారంగతుడను అయ్యాను. విద్య పూర్తి అయిన తరువాత లోకజ్ఞానము కొరకై దేశసంచారములు నిర్వర్తిస్తూ ఉన్నాను.

**ప్రవాహణ మహారాజు** : ఓ! సంతోషము. అయితే మనము వేదాత్మకమగు విద్యా విషయమై కొన్ని విశేషాలు, ప్రశ్న-సమాధానాలు చెప్పుకుందామా!

**శ్వేతకేతువు** : తప్పకుండా. మీరు బ్రహ్మవిద్య, వేదవిద్య విషయమై ఏవైనా ప్రశ్నించదలిస్తే అడగండి. మనము సత్సంగపూర్వకంగా సంభాషించుకుందాము.

**ప్రవాహణ మహారాజు** : అయితే కొన్ని ప్రశ్నలు మీముందు ఉంచుతాను.

**శ్వేతకేతువు** : అడగండి!

## ఒకటవ ప్రశ్న

**ప్రవాహణ మహారాజు : వేత్థ యదితో అధి ప్రజాః ప్రయంతి – ఇతి?** ఈ జీవులంతా భూమిపై జీవించిన తరువాత ఎక్కడికి వెళ్లుచున్నారో ఆ స్థానము మీకు తెలుసు కదా? దయచేసి చెప్పండి!

**శ్వేతకేతువు: న భగవ ఇతి!** భగవాన్! ఈ జీవులు మరణానంతరము ఎటు వెళ్లుచున్నారో, ఆ స్థానము గురించి నాకు తెలియదే!

## రెండవ ప్రశ్న

**ప్రవాహణ మహారాజు: వేత్థ యథా పునరావర్తంత–ఇతి? :** పైకి వెళ్లిన జీవులు పునరావృత్తులై ఏ ప్రకారం తిరిగి ఏ విధముగా భూలోకములో జన్మిస్తారో మీకు తెలుసు కదా?

**శ్వేతకేతువు: న భగవ ఇతి!** పైకి వెళ్లిన జీవులు తిరిగి ఏ విధములుగా భూమిపై జన్మించుటకు వస్తున్నారో – ఇది కూడా నాకు తెలియదే!

## మూడవ ప్రశ్న

**ప్రవాహణ మహారాజు: వేత్థ పథోః దేవయానస్య, పితృయాణస్య చ వ్యావర్తనా ఇతి?** ఒకానొక గొప్ప పథము (బాట) ఉన్నది. అందులో ఈ అసంఖ్యాక జీవులు ప్రయాణిస్తూ ఉంటారు. ఆ బాట (పథము) ఒకచోట రెండు వేరు వేరు మార్గములుగా చీలిపోతోంది. ఆ వేరుమార్గములు (1) దేవయానము (2) పితృయానము. ఆ రెండు మార్గములుగా చీలిపోయేది ఎక్కడ? ఆ యానములో ఎవరెవరు, ఎటు వెళ్లుచున్నారు? అట్టి పథము, చీలుచున్న చోటు, ఆ వేరువేరైన మార్గములు ఏమో మీకు తెలియునా?

**శ్వేతకేతువు : ఇతి న, భగవ!** ఈ మీ ప్రశ్నకు ఏమి సమాధానమో, ఇది కూడా నాకు తెలియదు.

## నాలుగవ ప్రశ్న

**ప్రవాహణ మహారాజు : వేత్థ యథా అసౌ లోకో న సంపూర్యత ఇతి?** ప్రతిరోజు ఎందరో జీవులు మరణిస్తూ ఉన్నారు. అయినా కూడా పితృలోకము నిండటమే లేదు. ఏ కారణం చేత?

**శ్వేతకేతువు :** ఈ విషయానికి కూడి ఏమి సమాధానమో నాకు ఏ మాత్రము తెలియదు.

## ఐదవ ప్రశ్న

**ప్రవాహణ మహారాజు : యథా పంచమ్యామ్ ఆహుతావ ఆపః పురుషవచసో భవన్తి ఇతి?** యజ్ఞములో ఆహుతులు సమర్పిస్తాము కదా! ఒకానొక యజ్ఞములో ఐదవ (5వ) ఆహుతి హోమము చేయబడిన తరువాత, అట్టి 5వ ఆహుతిచే రూపము పొందిన జలములు క్రమంగా ఆరవ (6వ) ఆహుతి రూపము పొందుచున్నాయి. ఆ ఆరవ ఆహుతి రూపము 'పురుషుడు' అనే పేరుగా ప్రసిద్ధమౌతోంది. అట్టి ఐదవ, ఆరవ ఆహుతులు 'పురుషుడు'గా అవటము – అను క్రమము ఏమిటో మీకు తెలియునా?

**శ్వేతకేతువు :** ఓ పాంచాల దేశమహారాజా! మహాప్రాజ్ఞా! మీ ఈ ప్రశ్నకు ఏమి సమాధానమో నాకు కొంచము కూడా తెలియదు? మీరు అడిగిన ప్రశ్నలలో ఒక్కదానికి కూడా నేను సమాధానము తెలుసుకొని ఉండలేదు.

**ప్రవాహణ మహారాజు :** వత్సా! శ్వేతకేతూ! ఈ ప్రశ్నలకు మీరు సమాధానము తెలుసుకొని ఉండలేదు కదా! మరి "నేను విద్యను పూర్తిగా పూర్తి చేశాను" – అని మీరు ఎట్లా చెప్పారు? నేనడిగిన ప్రశ్నలకు సమాధానము తెలియనివాడు విద్యను పూర్తిచేసినవాడవు ఎట్లా అవుతారు? మహాపండితులగు మీ తండ్రిగారు ఆరుణి మునీంద్రుల వద్ద శిక్షణ పొందినట్లు ఎట్లా అనుకోగలరు?

⌘

ప్రవాహణ మహారాజు అడిగిన ప్రశ్నలకు తాను సమాధానము ఎరిగి ఉండకపోవటమునకు, రాజు యొక్క "విద్యను పూర్తి చేసానని ఎట్లా అంటారు?" అను అభిప్రాయమునకు – శ్వేతకేతువు ఎంతగానో కలత చెందారు. సిగ్గుతో తలవంచారు. ప్రవాహణ మహారాజు వద్ద శలవు తీసుకుని వెనువెంటనే దేశసంచారము ముగించుకొని ఆరుణి మునీశ్వరుని ఆశ్రమానికి తిరిగివచ్చారు.

⌘

**ఆరుణీ మునీంద్రులు :** కుమారా! శ్వేతకేతూ! నీ లోకసంచారము పూర్తిగా జరిగినదా? ఇంత తొందరగా తిరిగి వచ్చావేమి? ఏమి నీ అనుభవములు? ఏమి నేర్చుకొన్నావు?

**శ్వేతకేతువు :** తండ్రీ! నా లోక సంచారము భాగంగా పాంచాల దేశము సందర్శించాను. అక్కడ జీవలుని కుమారుడగు ప్రవాహణుడు రాజ్యము పాలిస్తున్నారు. ఆయనకు మీరు తెలుసు. మీ గురించి ఎంతో గౌరవంగా సంభాషించారు. నన్ను కూడా అంతఃపురమునకు ఆహ్వానించి ఆతిథ్యమిచ్చి గౌరవించారు. 5 ప్రశ్నలు అడిగారు. ఆ '5' ప్రశ్నలలో ఏ ఒక్క ప్రశ్నకు నాకు సమాధానము తెలియలేదు. "ఈ ప్రశ్నలకు సమాధానం తెలియకుండా విద్య ఎట్లా పూర్తి చేసినట్లు?" – అని ఎగతాళిగా మాట్లాడారు. నేను విద్యను పూర్తి చేసాను – అను దానిని కించపరచారు. ఆ రాజబంధువు అడిగిన '5' ప్రశ్నలకు సమాధానము చెప్పలేకపోటవమే నాకు అవమానమనిపించింది. ఇక ఆ దుష్టుడు దెప్పిపొడవటము ఎంతో బాధ అనిపించి, లోక సంచారమును విరమించి మీ వద్దకు వచ్చాను. (రాజబంధువు = రాజును బంధువుగా కలిగియుండి, అది చూపి జనులను ఇబ్బంది పెట్టువాడు, చెడు నడవడిక గలవాడు)

**ఆరుణీ మునీంద్రులు :** బిడ్డా! పెద్దలను "రాజబంధువు, దుష్టుడు" మొదలైన మాటలతో కించపరచవచ్చునా? కూడదు సుమా! ఆ పాంచాల రాజ్యపరిపాలకుడగు ప్రవాహణ మహారాజు మాకు తెలిసినవాడే! మునుల సభలో ఆతడు ప్రశంసనీయుడు కూడాఁ! సరేఁ! ఇంతకీ ఆయన అడిగిన '5' ప్రశ్నలు ఏమేమని? నీవు ఎందుకు సమాధానాలు చెప్పలేకపోయావో నన్ను తెలుసుకోనీ, (Let me know)!

**శ్వేతకేతువు** : పితృదేవా! ఆ పాంచాలరాజు ప్రవాహణోజైవలి అడిగిన '5' ప్రశ్నలు చెపుతాను వినండి.

(1) ఈ లోకమునుండి బాటసారులవంటి ఈ జీవులు పైకి ఎక్కడికి, ఏ స్థానమునకు వెళ్లుచున్నారు? **యదితో ప్రజా ప్రయాతి ఇతి?**

(2) వెళ్లుచున్న ఈ జీవులంతా ఏవిధంగా ఈ లోకమునకు తిరిగి వస్తున్నారు? **యథా పునరావర్తంత ఇతి?**

(3) ఈ లోకమునుండి బయలుదేరే (మరణించే) జీవులు ఏ బాటలో వెళ్లుచున్నారో – ఆ బాట ఒకచోట రెండు మార్గములుగా విడిపోతూ ఉన్నది. ఆ విడిపోతున్న రెండు బాటలు (i) దేవయానము (ii) పితృయానము.




ఆ విధంగా దేవ – పితృ యానములుగా విడిపోతున్న మార్గములు ఏ స్థానములో ఏర్పడి ఉన్నాయి? **పథోః దేవయానస్య, పితృయానస్య వ్యావర్తనా ఇతి?**

(4) ఈ అసంఖ్యాక జీవులు మరణిస్తూ పితృలోకమువైపు ప్రయాణిస్తూ ఉన్నప్పటికీ – ఆ పితృలోకము ప్రవేశించినవారితో నిండిపోవటము లేదు. ఎందుచేత? **యథా అసౌ లోకో న సంపూర్యత?**

(5) ఐదవ ఆహుతిలో జలము హోమము చేయుబడుచూ ఉండగా ఆ జలము 'పురుషుడు' రూపమును పొందుచున్న క్రమము ఏమిటి? **యథా పంచమ్యామ్ ఆహుత్వా ఆపః 'పురుష' వచసో భవంతి ఇతి? – (తథా కం)?**

ఈ ఐదు ప్రశ్నలలో ఒక్కదానికి కూడా నేను సమాధానము చెప్పలేకపోయాను. 'నాకు తెలియదు' అని మాత్రమే అన్నాను. ఓ పూజనీయా! పితృదేవా! తమరు నాకు శిక్షణ పూర్తి చేయకుండానే విద్యాభ్యాసము పూర్తి అయిన తరువాత నిర్వర్తించే వైదిక కర్మ అయినట్టి 'సమావర్తన' – నిర్వర్తించారా ఏమి?

**ఆరుణి** : కుమారా! **యథా మా త్వం తదైతాన్ అవదో, యథా అహమ్ ఏషాం న ఏకంచన వేద।** నీవు నాకు వినిపించిన ప్రవాహణోజైవలి ఐదు ప్రశ్నలు నాకే తెలియదు. సమాధానము అసలే తెలియదు. **యది అహమ్ ఇమాన వేదిష్యం, కథం తే న అవక్ష్యమ్?** నాకు ఈ ప్రశ్నల గురించియే తెలియనప్పుడు, వాటికి సమాధానాలు ఏం తెలుస్తాయి? నాకు తెలియని ప్రశ్నలు వాటి సమాధానాలు నేనెట్లా బోధించగలను?

నీ విద్యాభ్యాసము ముగించిన తరువాత సమావర్తన వైదిక కర్మ నిర్వర్తించినది – "గురువుగా నాకు తెలిసి, నేను నేర్పవలసిన విధిని అనుసరించి విద్య బోధించటము పూర్తి చేసాను" అను ఉద్దేశ్యము. అంతేగాని వేదవిద్యనంతా నీకు బోధించానని కాదు. అనంతమైన వేదవిద్య విషయంలో "నాకు మొత్తము తెలిసింది" అని నేనెట్లా అనగలను? "వేదవిద్యనంతా నేర్పాను" అని ఎట్లా అనుకోగలను? "అంతా నేర్చుకున్నాను!" – అని నీవెట్లా అనగలవు? వేదవిద్యలో అసంఖ్యాక విశేషాలు ఉన్నాయి. ఎందరో వేదవిద్యాపారంగతులు ఉన్నారు. అవన్నీ మన ఊహకు అందనివి. వేదవిద్యయొక్క విశేష ప్రాశస్త్యత "వేదమనన్తమ్" అను సూత్రమును అర్థము చేసుకోవటానికేగదా, నీవు 'లోకసంచారము' అనే ప్రయత్నములో శీలుడవై ఉన్నావు! మహనీయుల, ఆశ్రమముల సందర్శనము అప్పటి వరకు నేర్చుకొన్న విద్యను పదునుపెట్టుకోవటానికే కదా!

సరేం! పుత్రా! ఆ ప్రవాహణజైవలి యొక్క ఐదు ప్రశ్నలకు సమాధానము కొరకై వారినే ఆశ్రయిద్దాము.

ఈ విధంగా పలికి ఆరుణిముని అప్పటికప్పుడే శిష్య సమేతులై పాంచాల రాజదర్శనముకొరకై గురుకులము నుండి బయలుదేరారు. గౌతమ గోత్రీయుడైన ఆ ఆరుణిముని పాంచాలరాజ్యమునకు వచ్చి రాజదర్శనము చేసుకొన్నారు. ప్రవాహణజైవలి మహారాజు ఆరుణిమునికి సుస్వాగతము పలికి అనేక విధములుగా సత్కారములు చేసారు. ప్రయాణపు బడలికతో ఉన్న ఆరుణి మునికి వారి శిష్యబృందమునకు ఆ రోజు రాత్రి విశ్రాంతి గృహములో వసతి చూపబడింది.

⌘

ఆ మరునాడు ఉదయము ఆరుణి మునీశ్వరులు రాజదర్శనము చేసుకొన్నారు.

**ప్రవాహణ జైవలి** : గురుదేవా! గౌతమకులదీపకా! ఆరుణి మునీంద్రా! నమోనమః! సుస్వాగతం! **మానుషస్య-భగవాన్! గౌతమ! – విత్తస్య వరం వృణీథ!** మానవులకు కావలసిన సంపదలు ఏమేమి కావాలో, గ్రామములు, ధనము మొదలైనవి కోరుకోండి. మీకు సమర్పించుకోవటానికి సంసిద్ధుడను.

**ఆరుణి**: రాజా! మానవులకు సంబంధించిన సంపదలు నాకేమీ వద్దు. మీరు నా కుమారుడగు శ్వేతకేతువును ఐదు (5) ప్రశ్నల రూపంగా ఏ మాటలు పలికియున్నారో, ఆ వచనములు నాకు బోధించమని ప్రార్థన.

అప్పుడు ప్రవాహణుడు **"ఇదేమి? ఈ మునీంద్రులు ఇట్లా అడిగారు? నేను అడిగిన ఐదు ప్రశ్నలు, వాటి సమాధానాలు నేర్చుకొవాలనుకుంటున్నారా? వారేమో మునివర్యులు. నేనో, ఒక సామాన్య రాజును. అయినా వేదవేత్తలు ఏదైనా కోరితే అది తిరస్కరించరాదు కదా! విద్యా నియమమును పాటిస్తూ విద్యను బోధించవలసినదే కదా? వేరే త్రోవలేదు"** – అని తలచారు. మునీశ్వరునితో ఇట్లా పలికారు.

**ప్రవాహణ జైవలి** : స్వామీ! గౌతమా! ఆరుణీ! మీరు ఆజ్ఞాపించినట్లే ఆ ఐదు ప్రశ్నలు, వాటి సమాధానములు మీతో సంభాషిస్తాను. అయితే ఒక విన్నపము. **తగ్ం హ చిరం కాలం వసేతి, ఆజ్ఞాపయాంచకార!** తమరు కొంత కాలము ఇక్కడ ఉండి మా ఆతిథ్యము స్వీకరించండి. మీరు కోరినట్లు అప్పుడు బోధించగలను. అంతేకాకుండా మరో ముఖ్య విషయం కూడా! **యథా మా త్వం, గౌతమ! అవేదో యథేయం న ప్రాక్ త్వత్తః పురా విద్యా బ్రాహ్మనాన్ న గచ్ఛతి।** ఓ గౌతమా! మీరు వేదవేత్తలు! తెలుసుకోవలసింది తెలుసుకొనియున్న బ్రాహ్మణోత్తములు అయి కూడా నేను అడిగిన 'పంచప్రశ్నవిద్య' చెప్పమని మీరు అడుగుచున్నారు. బ్రహ్మవిద్య సమస్త విద్యలకు పరాకాష్ఠ కదా!

ఈ పంచ ప్రశ్న విద్య బ్రాహ్మణులకు (బ్రాహ్మణములు, బ్రహ్మతత్త్వము ఎరిగియున్నవారికి) – చెప్పబడియుండలేదు. బ్రాహ్మణులు (బ్రహ్మవిద్యా వరేణ్యులు) ఇదివరకు వారి శిష్యులకు బోధించటమనేది గురుకులములలో జరగటము లేదు.

ఇతఃపూర్వము ఈ విద్య క్షత్రియులలో ప్రసిద్ధము. క్షత్రియులు క్షత్రియులకే బోధించటము ఆనవాయితీ అయిఉంటూ వచ్చింది. అయినా కూడా మునివరేణ్యులగు మీరు అడిగితే 'చెప్పను' అనే అహంకారము మీముందు ప్రదర్శించలేను. ఎందుకంటే మీరు జగద్గురువులు. గురుకులములో అనేకమంది బ్రహ్మచారులను తీర్చిదిద్దటములో లోకవిదితులు.

మీకు నేను ఈ "పంచాగ్ని విద్య" అనబడే పంచప్రశ్న – సమాధానములను బోధిస్తాను. మీరు మీ శిష్యులకు పరంపరగా బోధించవచ్చు. అప్పుడు ఈ విద్య బ్రాహ్మణములను ఉపాసంచే బ్రహ్మవేత్తలలో కూడా ప్రసిద్ధి పొందగలదు.

మీరు మానవ సంబంధమైన కోరికలతో రాలేదని, అధ్యాత్మ సంబంధమైన విద్యకొరకై వచ్చారని నేను ముందే ఊహించాను. అయినా కూడా శాస్త్ర మర్యాదానుసారం లోకసంబంధమైన సంపదలను ఇవ్వపలికాను. అందుకు నేను క్షంతవ్యుడను. మీరు, మీ ప్రియశిష్య బృందము కొద్దిరోజులు మా పాంచాలదేశంలో విశ్రాంతి తీసుకోండి. మా ఆతిధ్యము, అతిధి మర్యాదలు స్వీకరించండి. కొద్దిరోజులలో మీరు అడిగిన "పంచాగ్నివిద్య" గురించి సవివరంగా సంభాషించగలను. ఎందుకంటే మేము ఇప్పుడు ఒక యజ్ఞకార్యక్రమంలో నిమగ్నమై ఉన్నాము.

## 5-4. చతుర్థ ఖండము-

## 'శ్రద్ధ' సృష్ట్యభిమాని ఇంద్రియాధిష్ఠాన దేవతలు - 'శ్రద్ధ' ఆహుతులు - సృష్ట్యభిమాని ఆవిష్కరణ

కొద్దిరోజుల తర్వాత ఒకరోజు ఒక ప్రశాంత స్థలములో ఆరుణి మునీంద్రుడు, ప్రవాహణ జైవలిరాజు మరియు తదితర విద్యార్థులు (వేదవిద్యాభ్యాసులు) సమావేశమైనారు.

**ప్రవాహణ జైవలిరాజు:** ఓ గౌతమ గోత్రీయ ఆరుణి మహాశయా! నేను అడిగిన ఐదు ప్రశ్నలు – సమాధానములు వేదములలో (శతపథ బ్రాహ్మణము మొదలైన చోట్ల) వివరించబడినవే. ఆహుతులు – సూక్ష్మశరీరము – పుణ్యలోకములు, పుణ్యలోక నివాసము, జన్మకై మరలిరావటం, మరల పుణ్యలోకములకొరకై దేహము నుండి బయలుదేరటము మొదలైన వివరములకు సంబంధించిన ఆత్మ భగవానుని సృష్టి కల్పనా యజ్ఞవిశేషములకు సంబంధించిన విద్య అని ముందుగా గమనిద్దాము.

మనము ముందుగా ఐదవ ప్రశ్న అయినట్టి "ఐదవ ఆహుతియందు జలములు పురుషుడు (పురుషకారము కలవాడు) అనే పేరు ఎట్లా పొందుతోంది?....అనే ప్రశ్నకు సమాధానము వివరించుకుంటున్నాము.

**(శతపథ బ్రాహ్మణములోని వివరములు)**

యజ్ఞములో సమర్పించబడిన 'హోమము' గురించి ఇట్లా వివరించబడుతోంది.

- 'హోమము' చేయబడిన మొదటి రెండు ఆహుతులు పైకి లేచుచున్నాయి.
- పైకి లేచి అంతరిక్షం (ఆకాశం)లో వ్యాపిస్తున్నాయి.
- అవి ఆకాశంతో యజ్ఞవిధిని నిర్వర్తిస్తున్నాయి.
  - అంతరిక్షము (ఆకాశము)ను ఆహవనీయాగ్నిగాను
  - వాయువును (వాయువీచికలను) సమిధలుగాను (కట్టెపుల్లలు గాను)
  - సూర్యకిరణములను ఆహుతిగాను చేయబడి

అవి అంతరిక్షమును తృప్తిపరచుచున్నాయి.

ఆ తరువాత ద్యులోకమునందు ప్రవేశించి 'తృప్తి' పరచుచున్నాయి.

ద్యులోకము = దేవతల లోకము. చూపు, వినికిడి, స్పర్శ, రుచి, వాక్కు (పంచ తన్మాత్రలు) మొదలైన శక్తులే దేవతలే 'ద్యులోకము'.

– ఆ రెండు ఆహుతులు మరల భూలోకములో ప్రవేశించి భూలోకమును తృప్తిపరచి మగవానిలో ప్రవేశిస్తున్నాయి.

– వాని నుండి స్త్రీయందు వ్యాపించి 'జీవుడు'గా పుట్టుచున్నాయి.

– ఆ జీవులలో ఉత్తమ కర్మలు నిర్వర్తించి పుణ్య లోకములు చేరుచున్నాయి.

ఈ విధంగా జరుగుచున్న సృష్టియజ్ఞ విశేషము దృష్ట్వా ఇప్పుడు బ్రాహ్మణములు (శ్రుతులు) 'అగ్నిహోత్ర కర్మ' విధి గురించి చెప్పుచున్నాయి. ('అగ్ని', 'సమిధలు', 'ధూమము', 'జ్వాల', మండే 'బొగ్గలు', మిణుగురులు – అను ఆహుతుల యొక్క '6' రూపములు అభివర్ణిస్తున్నాయి.)

– ఆ ఆహుతులు అంతరిక్షంలో ప్రవేశించటము.
– సూక్ష్మరూపంగా ద్యులోకము (సూక్ష్మశక్తులు ఏర్పడి ఉన్న లోకము)లో ప్రవేశము.
– అవి జలరూపము దాల్చటము.
– అవి సృష్టి కార్యము నిర్వర్తించటము అనే తతంగమంతా ఇప్పుడు భూలోక అగ్నిహోత్రముతో పోల్చుచూ చెప్పబడుతోంది.

## దేవతల యజ్ఞము – సోమరాజు (సృష్టికర్త) సంభవము

మొట్టమొదట (ఆత్మనుండి) పంచాగ్ని దేవతలగు శబ్ద–స్పర్శ–రూప–రస–గంధ దివ్యశక్తులు (దేవతలు) సమావేశమై సృష్టికొరకై 'శ్రద్ధ' అని పిలువబడే హోమము ప్రారంభిస్తున్నారు. వారు నిర్వర్తిస్తున్న హోమమునకు (చిదగ్నికుండ సంభూత! దేవకార్య సముద్యత! – అని లలితా సహస్రంలో వర్ణించినట్లు) పరమాత్మయే యజ్ఞపురుషుడు, దేవతలే యజ్ఞకర్త.

- ద్యులోకము (స్వర్గలోకము) – "అగ్ని"!
- ఆదిత్యుడు (సూర్యుడు) – "సమిధ"!
- ఆదిత్యుని సూర్యకిరణములు – సమిధ నుండి వచ్చు "పొగ".
- ఆదిత్యుని నుండి జ్వాల అగు పగలు (పగటి వెలుగు) – అగ్ని నుండి వచ్చు "జ్వాల".
- చంద్రుడు – మండే బొగ్గలు.
- "నక్షత్రములు" – మిణుగురులు (మెఱుపులు) – విస్ఫురంగములు.

ఈ విధంగా ఇంద్రియాభిమాన దేవతలు "శ్రద్ధ" అనే ఆహుతులను అగ్నికి సమర్పించుచుండగా ఆ హవిస్సు నుండి "సృష్టికల్పనాభిమాన పురుషుడు" – పుట్టుకొస్తున్నాడు. ఆతనికి "సోమరాజు" – అను శాస్త్రీయ నామము. 'శ్రద్ధ' కు 'జలము' అని కూడా మరొక పేరు.

## 5–5 పంచమ ఖండము – ఇంద్రియాభిమాన దేవతల – సోమరాజుకు ఆహుతులు

ఆ ఇంద్రియాధిదేవతలు ఇంకా కూడా సృష్ట్యభిమాని అగు 'సోమరాజు' (సృష్టి పురుషుడు)కు ఆహుతులు వర్షము కొరకై సమర్పిస్తున్నారు.

| | |
|---|---|
| **పర్జన్యుడే – "అగ్ని"** | మేఘముల అభిమాన దేవతయే పర్జన్యుడు (ఇంద్రుడు) |
| **వాయువు – "సమిధ"** | వాయువు వీస్తూ ఉంటే వర్షము. వాయువు పర్జన్యుడు (మేఘదేవత) అనే అగ్నిని ప్రజ్వలింపజేయుచున్నారు. |
| **మేఘము – పొగ** | మేఘము పొగవలె ఆకారము కలిగి ఉంటుంది. పొగ మేఘాకారము పొందుతోంది. |
| **మెఱుపు – జ్వాల** | ప్రకాశించు ధర్మము కలిగి ఉన్నది కాబట్టి, |
| **పిడుగులు – మండే బొగ్గలు** | పిడుగులు మండే బొగ్గవలె కఠినము కాబట్టి |
| **మేఘగర్జనలు, ఉరుములు –విస్ఫులింగములు** | మేఘగర్జనలు – మిణుగురులు (అగ్గి రవ్వలు). |

⌘ ఆ దేవతలు పర్జన్యాగ్ని యందు ఇంద్రియాధిష్ఠాన దేవతలు ఓషధులకు (ఆహారమునకు) ప్రభువు అయినట్టి చంద్రుని హోమము చేస్తున్నారు.

⌘ పర్జన్యుడే అగ్నిరూపము పొంది వర్షముగా వర్షిస్తున్నారు.

## 5-6 షష్ఠి ఖండము - దేవతల వర్షహవనము - అన్నము యొక్క ఉత్పత్తి

అప్పుడు ఇంద్రియాధిష్ఠాన దేవతలు 'అన్నము' కొరకు హవనము సమర్పించసాగారు. అట్టి అన్నము కొరకు-

| | |
|---|---|
| పృథివియే → అగ్ని<br>సంవత్సరమే → సమిధ | సంవత్సర కాలములో ఆహార ధాన్యములు, పెసలు - మినుగులు వంటి అపరాలు లభిస్తాయి కనుక। |
| ఆకాశము → పొగ | ఆకాశము నుండి పృథివి (మేఘ రూపంలో) పొగ వలె బయల్వెడలుతోంది కనుక। |
| రాత్రియే → జ్వాల (అర్చిః) | వెలుగు లేనప్పుడు భూమి చీకటైపోతుంది కనుక। |
| దిక్కులు(తూర్పు, పడమర, ఉత్తర, దక్షిణ)→ మండే అంగారములు (బొగ్గులు) | మండిన తరువాత బొగ్గులు మిగిలినట్లు (చీకటిపోతే దిక్కులు కనబడతాయి కాబట్టి) |
| అవాంతరదిక్కులు (ఈశాన్యము, అగ్నేయము, నైరుతి, వాయువ్యము)→ | విస్ఫులింగములు (నిప్పురవ్వలు) |

ఈ విధంగా దేవతలు 'వర్షము'ను అగ్నియందు హోమము చేయగా ఆ ఆహుతి నుండి 'ఆహారము' పుట్టుచున్నది.

## 5-7 సప్తమ ఖండము - దేవతల అన్నహోమము - రేతస్సు ఉత్పత్తి

పురుషుని అగ్నిగాను, వాక్ ఇంద్రియమును సమిధిగాను, ప్రాణమును ధూమముగాను, జిహ్వను జ్వాలగాను, కన్నులు అంగారములు (మండే బొగ్గులు)గాను, వినికిడి విస్ఫులింగములుగాను దేవతలు హోమము నిర్వర్తించసాగారు.

ఈ విధంగా అన్న హోమము చేయుచుండగా ఆ 'ఆహుతి' నుండి 'రేతస్సు' పుట్టుకువస్తోంది.

## 5-8. అష్టమ ఖండము - గర్భయజ్ఞము

యోషా వావ అగ్నిః - యువతియే అగ్ని
ఉపస్థ ఏవ సమిధః - జననేంద్రియమే సమిధ
ఉపమంత్రయతే సధూమో। యువతియొక్క పురుషుని ఆహ్వానము ధూమము
యోనిః అర్చిః - యోనియే జ్వాల
యదన్తః కరోతి తే అంగారా - తినుట అంగారకము
మైథునమే అగ్ని
అభినన్దా విస్ఫులింగా - విస్ఫులింగములు
(రతిసుఖమ్)- (బొగ్గు కిరణములు)

**ఆ అగ్నియందు దేవతలు 'ప్రాణములు' అనే రేతస్సును హోమము చేస్తున్నారు. అట్టి ఆహుతుల హోమము నుండి 'గర్భము' జనిస్తోంది.**

ఈ విధంగా జలములే "శ్రద్ధ - చంద్ర - వర్ష - అన్న - రేతస్సు" అనే ఐదు ఆహుతుల హోమములుచే పురుషుడు (The Experiencer) జనిస్తున్నాడు. యథా పంచమ్యామ్ ఆహుతావ ఆపః 'పురుష'-వచసో భవంతి" - **<u>ఇది ఐదవ ప్రశ్నకు (5) మనము చెప్పుకున్నదంతా సమాధానము.</u>**

ఇది దేవతలు యజ్ఞము కొరకు (for the sake of the entirity) చేయుచున్న హోమము.

ఆహుతులతో జలమునకు విడరాని బంధము కాబట్టి 'పంచమ ఆహుతి జలము' అని ఇక్కడ ప్రయోగించబడుతూ ఉన్నది.

---

## 5-9. నవమ ఖండము - నేను అగ్ని స్వరూపుడను అను ఉపాసన

ఇప్పటివరకు చెప్పబడిన సృష్టి పంచాగ్ని హోమము, జీవుల దేహ ప్రవేశ- నిష్క్రమములు, ఉత్తమ కర్మలచే స్వర్గలోకప్రాప్తి - మొదలైన విషయములు తెలుసుకొన్నవారు, తెలుసుకొని తపస్సు శ్రద్ధగా ఆచరించువారు - స్వయం ప్రకాశ కాంతివంతమగు లోకములు సిద్ధించుకోగలరు. **ఏ చమే అరణ్యే శ్రద్ధా ఉపాసతే** - ఎవ్వరైతే శ్రద్ధగా గ్రహించి అరణ్యము నందు బుద్ధిని నిలిపి (న-రణ్యము, Beyond the world - Head in the forest (God) and Hands in the world) దృశ్యమునకు ఆవల గల తత్త్వమును ఉపాసిస్తూ ఉంటారో, (అనగా)

"మేము ద్యులోకము, పర్జన్యుడు, 'వర్షము' 'అన్నము' 'రేతస్సు'ల నుండి క్రమముగా జన్మించిన అగ్నిస్వరూపులము.

ఈ ఐదు అగ్నిలే మా యొక్క స్వరూపము" అని ఎరిగి ఉపాసిస్తారో, శ్రద్ధాతత్పరులై ఉంటారో...అట్టివారు→

- ముందుగా చీకటిమయ లోకములను (Zones of ignorance) దాటినవారై అగ్నిజ్వాల (అర్చిషు) - కాంతిమయ (Zone of Awareness) లోకములను సమీపించగలరు. అగ్నిజ్వాల అభిమాన దేవతల లోకము ప్రవేశించగలరు.
- అట్టి స్వప్రకాశక అగ్నిజ్వాల నుండి 'పగటివెలుగు' (అహర) అభిమాన దేవతను సమీపించగలరు.
- 'పగటి వెలుగు' నుండి శుక్లపక్షము అభిమాన దేవతను సమీపించి శుక్లపక్ష తేజస్సును (Enlightenment day after day till finest sense of one's own Self) సిద్ధించుకోగలరు.
- (ఆపూర్యమాణ పక్షము) శుక్ల పక్షము నుండి ఆరు మాసములగు ఉత్తరాయణము (షట్ ఉదన్ ఏతి మాసాగ్ం స్తాన్ The zone beyond what is being experienced by senses) ప్రయాణించి ఇంద్రియ దృశ్యమునకు ఆవలి వైపుగా ప్రయాణించి "ఉత్తరాయణ అభిమాన దేవత"ను (సూర్యదేవుని ఉత్తరాయణ మార్గమును) సమీపించి, ప్రవేశించగలరు.
- 6 మాసముల 'ఉత్తరాయణము' నుండి వారు **'సంవత్సరాదిత్య దేవత'**ను సమీపిస్తున్నారు.
- అటు తరువాత **'చంద్రమస అభిమాన దేవత'**తో సామీప్యము పొందుచున్నారు.
- చంద్రమసము నుండి విద్యుద్దేవత (కేవల తేజోరూపస్థానము)ను చేరుచున్నారు.

**అట్టి జీవుడు**

"అమాన తత్పురుషుడు" - (మానవాతీతమైన 'తత్' అను పురుషస్థానము) చేరుచున్నాడు. 'ఈ సమస్తము నా పురుషకారమే' అనే కేవల స్థాన తత్పురుషత్వము మానవాతీత్వము (జనన-మరణ చక్ర అతీతత్వము) సిద్ధించుకుంటున్నాడు. ఆతడు బ్రహ్మమే తానగుచున్నాడు. ఈ సమస్తము ఏదై ఉన్నదో, ఏది నేను - నీవు మొదలైనవాటిగా ప్రదర్శనమగుచూనే సమస్తమునకు వేరై ఉన్నదో - "అదియే తానగుచున్నాడు" - 'బ్రహ్మవేత్త' బ్రహ్మమే అగుచున్నాడు.

## 5-10. దశమ ఖండము

### ఈ జీవులు ఈ లోకము విడచినప్పుడు ఎక్కడికి వెళ్లుచున్నారు? అనే మొదటి ప్రశ్నకు సమాధానము

### (1) దేవయాన మార్గము

- 'అన్నము' ద్వారా పురుషుని దేహములో ప్రవేశించిన రేతస్సు 'శుక్లము' రూపము దాల్చి, స్త్రీని యోనిలో ప్రవేశించి, శ్రోణితములో ఏకమై స్త్రీ గర్భము దాల్చుచున్నది.
- గర్భము గర్భవేష్ట చర్మమగు 'జరాయువుచే కప్పబడియుండగా గర్భములో పురుషుడు '(జీవుడు) "9" లేక "10" నెలలపాటు గర్భసంచిలో ఉంటూ క్రమంగా ఇంద్రియ దేవతల నుండి వినికిడి, స్పర్శ, చూపు, మాట మొదలైన పంచేంద్రియ తేజస్సు పొందుచున్నాయి. అయితే ఆయా వివిధ ఇంద్రియ దేవతల ప్రదర్శనములన్నీ 'ప్రాణశక్తి' యొక్క వివిధములైన రూపాంతరములే!

- రక్తము, రేతస్సు మొదలైన అశుచిద్రవ్యములే 'పిండము' యొక్క బీజము.
- తల్లి తినుచు, త్రాగుచూ ఉన్న అన్నపానీయముల సారము పొందుచూ ఆ శిశువు పిండ స్థితి నుండి క్రమంగా దేహబలము, చూపు, వాక్కు, స్పర్శ, వినికిడి – ఇవన్నీ ప్రాణశక్తి బీజమునుండి తనలోకి పొందుతోంది.
- శిశువు రూపము పొందిన ఆ పిండము స్త్రీ జననాంగమునుండి బయటపడి 'పుట్టుక' అను సంఘటనను పొందుతోంది.
- ఆ పుట్టిన శిశువు ఎదుగుచూ పుణ్య–పాప కర్మలు నిర్వర్తించుచున్నది.
- ఆ వ్యక్తి (జీవుడు) ఆయుర్దాయము ఉన్నంతవరకు జీవిస్తున్నాడు.
- ఆయుష్షు తీరిన తరువాత ఆ జీవుడు భూలోక (Zone of Matter) స్వర్గలోక (Zone of Divine Form)ల మధ్య చేరి, – అటు స్వర్గలోకమునకు గాని, (లేదా) తిరిగి భౌతిక స్థితులను (దేహములకు) గాని చేరుచున్నాడు.

కుమ్మరివాని చక్రము తిరుగు విధంగా ఈ జీవుడు తనయొక్క కర్మలయొక్క – జ్ఞానములయొక్క స్థితిగతులను అనుసరించి త్రిలోకములలో అనేక ఉపాధులుగా రాక – పోకలు అవిశ్రాంతంగా, చర్వితచర్వణంగా కొనసాగిస్తున్నాడు.

ఏ పంచాగ్నులనుండి ఈ జీవుడు భౌతిక రూపము పొంది జీవిస్తున్నాడో, మరల అవే అగ్నులచే కొనిపోబడుచున్నాడు.

**తన మూలకారణమైన అగ్నిని పొందుచూ, తిరిగి అగ్నిచేతనే దేహ దేహాంతరములకు తీసుకొనిపోబడుచున్నాడు. ఇందుచేత కూడా అగ్నికి 'హవ్యవాహనుడు' అనే పేరు వచ్చింది. అగ్నిచే ఈ దేహము అర్పితమైన 'ఆహుతి' రూపము సంతరించుకుంటున్నది.**

**ఇది దేవయానమార్గము (లేక) 'దేవయాన పంథా' అని, ఉత్తరాయణ మార్గము అని పిలువబడుతోంది. ఇది ఆత్మోపాసనా మార్గము. ద్రష్టవైపు మార్గము. జ్ఞానమార్గము – అని కూడా అంటారు.**

## 2. పితృయాన మార్గము – దక్షిణాయన పంథా (కర్మిష్ఠుల మార్గము)

ఇది దృశ్యము వైపుగా మార్గము. "ఉత్తమ లోకములు పొంది ఆనందించాలి" అనేది ముఖ్యాశయమై యుండి, – ఈ లోకములో ఈ ఈ విధమైన అభ్యాసములు చేయుచున్నారు.

- **ఇష్టము** (వేదోక్తములైన అగ్నిహోత్రము, వైశ్వ దేవతలు, పూజ, వ్రతములు మొదలైన కర్మలు).
- **పూర్తము** (అన్నదానము, నూతులు – చెరువులు త్రవ్వించటము, సత్రములు కట్టించటము, తదితర సంఘ సేవలు, దానము మొదలైనవి)

వీరు ఆత్మతత్త్వానుభవమును ముఖ్యాశయముగా కలిగి ఉండక, దృశ్యములోనే ఉత్తమ స్థితిగతులు పొందాలనే ముఖ్యాశయము కలిగి ఉంటున్నవారు. అందుచేత ఇది "దక్షిణాయణ మార్గము, ధూమ మార్గము' – అని కూడా అంటారు. అట్టివారి ముందుముందు మార్గము ఏవిధంగా ఉంటుందో చెప్పుకుంటున్నాము.

- ఇట్టివారు మొదట ధూమమార్గము పొందుచున్నారు. **ధూమమ్ అభిసంభవంతి।** ప్రాపంచక (దృశ్య సంబంధమైన, ఇంద్రియానుభవ సంబంధమైన) ఆశయములు → నిర్మలమగు స్వస్వరూపాత్మను కప్పి ఉంచేవి కాబట్టి దీనిని **'ధూమమార్గము'** అని పిలుస్తున్నారు.
- ధూమలోకములు ప్రవేశించి, అక్కడినుండి 'రాత్రి' (చీకటి)ని చేరుచున్నారు.
- రాత్రి నుండి 'కృష్ణపక్షము' (ఆత్మానుభూతిని ఏమరచుచు, దృశ్యానుభవ ఆశయము) చేరుచున్నారు.
- కృష్ణపక్షము నుండి దక్షిణాయనము, దక్షిణాయనము నుండి 'సంవత్సరము' చేరుచున్నారు.
- సంవత్సరము నుండి 'ఆకాశము'ను, ఆకాశము నుండి 'చంద్రమార్గము'ను చేరుచున్నారు.
- చంద్రుడే సోమరాజు. ఆయన బ్రాహ్మణులకు (బ్రాహ్మణములు అధ్యయనము చేయువారికి) ప్రభువు. దేవతలకు ఆహారము. ఓషధరూపుడు. ఇంద్రుడు, అగ్నిలకు ఆహారము ఇచ్చువారు.

ఈ విధంగా ఇంద్రియభోగములే ఆశయముగా కలవారు ఆయా దేవతలు ప్రసాదించే సుఖానుభవములు పొందుచున్నారు.

ఆ విధంగా సుఖమయ ఇంద్రియానుభవలోకములు ప్రవేశించిన ఆ "దక్షిణాయన బాటసారి జీవుడు" అట్టి (దేవతలచే ప్రసాదించబడే) సుఖానుభవములు (స్వర్గలోక నివాసము వంటివి) ఎంతకాలం పొందుతాడు? **తస్మిన్ యావత్ సంపాతమ్ ఉషిత్వా అథ ఏతం ఏవ అధ్వానం పునః నివర్తంతే।** ఏ పుణ్య కార్యముల ఫలానుభవముకోసమై పుణ్య (సుఖమయ) లోకములు పొంది ఉన్నాడో, అట్టి పుణ్యకర్మఫలము ఖర్చు అయ్యేంతవరకు చంద్రమండలములో నివాసముండి తిరిగి భౌతిక లోకములకు వస్తున్నారు. "ఇష్టా-పూర్వ-దాన" కర్మల ఫలములను, సంస్కారములను అనుసరించి మరల పుణ్యకార్యములు నిర్వర్తిస్తూ ధూమ మార్గంలో చంద్రమండలము చేరుచున్నారు. ఈవిధంగా ఇది "పునరావృత్తిమార్గము" (రావటము-పోవటము అగుమార్గము) అగుచున్నది.

**తిరోగమన మార్గము:**

భౌతిక లోకము నుండి చంద్రమండలము (పితృలోకము) చేరిన మార్గముననే – ఆకాశము, ఆకాశమునుండి వాయువు, వాయువునుండి ధూమము, ధూమమునుండి పృథివి (Solid Form) పొందుచున్నాడు.

- చంద్రమండలము (పితృలోకము) నుండి ఆకాశము
- ఆకాశము నుండి మేఘమును చేరుచున్నారు.
- మేఘము వర్షించినపుడు భూలోకములో ధాన్యము, యవలు, మొక్కలు, చెట్లు, నువ్వులు, మినుములు రూపముగా అగుచున్నారు.

**అతో వై ఖలు దుర్నిష్ప్రపతరమ్।** ఈ విధంగా పితృలోకమునుండి భూలోకమునకు జరిగే తిరుగు ప్రయాణము అనేక దుఃఖములతో కూడినవై ఉన్నది. అనేకచోట్ల ఎండుచూ, తినబడుచూ బహుయాతనలు పడుతూ 'మానవస్థితి'కి సుదీర్ఘతర/కష్టతర ప్రయాణము చేయుచున్నాడు.

ఆహారము రూపము పొందిన జీవుడు ఎవరు ఏ అన్నము తింటే ఆ సంబంధమైన 'రేతస్సు' రూపమే పొందుచున్నాడు. ఆ జీవ జాతి జీవుని రూపమే సంతరించుకుంటున్నాడు. **యో యో అన్నమ్ అత్తి, యో రేతః సించతి, తత్ భూయ ఏవ భవతి॥** జీవులు ఏ అన్నము భుజిస్తారో, ఏ రేతస్సు విడుస్తాడో, స్త్రీ నుండి ఆ అన్నగత ప్రాణులుగానే పుట్టుచున్నారు. మనిషి నుండి మనిషే పుట్టుచున్నాడు. ఆవు నుండి ఆవే పుట్టుచున్నది. [(భగవద్గీత 3-14) అన్నాత్ భవంతి భూతాని].

ఏ జీవులైతే రమణీయమగు ఆచరణము, నడవడిక, అభ్యాసములు ఇతఃపూర్వము కలిగియున్నారో వాటి ఫలితంగా వారు తిరిగి ఉత్తమ యోనులలో జన్మింతురు.

**<u>ఇతఃపూర్వము శుభప్రదమైన అభ్యాసములు</u>**

(1) శమము, దమము, తపస్సు, శౌచము, ఆర్జవము (లోపల ఒకటి బయట మరొకటి భావించకుండటము, అకుటిలత్వము) జ్ఞానము, విజ్ఞాన ఆస్తిక్యము (పరమాత్మను గుర్తెరుగు అభ్యాసములు కలవారు)

**అట్టివారు బ్రాహ్మణ యోనులందే జనిస్తారు.**

**(సత్వగుణ సంపన్నులు, వివేకము, అధ్యయన దృష్టి కలవారు)**

(2) శౌర్యము, తేజస్సు, ధృతి, దాక్షణ్యము, విజయము పట్ల పట్టుదల, దానము, ఈశ్వరభావన కలవారు

**అట్టివారు క్షత్రియ యోనులందు జన్మలు పొందుచున్నారు (సత్వ-రజోగుణ సంపన్నులు)**

(3) కృషి, గోరక్షణ, వాణిజ్యము అనే వైశ్వకర్మ సంస్కారములు కలవారు

**వైశ్య యోనులందు జన్మిస్తున్నారు (రజోగుణ సంపన్నులు).**

(చాతుర్వర్ణములు కూడా త్రిగుణములు, కర్మలకు సంబంధించిన స్వభావ విభాగములేగాని, లోకములో ప్రసిద్ధి అయి ఉన్న సాంఘిక విభాగ కులము సంబంధమైనవి కావు – అని ఉపనిషత్ వాఙ్మయ హృదయము)

**కపూయచరణా అభ్యాశో హ యత్తే కపూయాం యోనిం**
**ఆపద్యేరన్ శ్వ యోనిం వా, సూకర యోనిం వా, చాణ్డాల యోనిం వా॥**

ఎవ్వరైతే పైన చెప్పబడిన బ్రాహ్మణ క్షత్రియ వైశ్య వర్ణితమైన కర్మ–జ్ఞానములు ఆశ్రయించక తమోగుణ స్వభావములైనట్టి దురాచారములు (కోపము, ద్వేషము, పరహింస మొదలైనవి) అభ్యాసము కలిగియున్నవారు – కుక్క, పంది, చండాల యోనులందు ప్రవేశము పొందుచున్నారు.

**పరలోకము ఎందుకు జీవులచే నిండిపోదు? (నాలుగవ ప్రశ్న)**

కొందరు జీవులు దేవయానముగాని, పితృయానముగాని ఆశ్రయించకపోవటంచేత అల్పప్రాణులుగా (జంతు, కీటక ఇత్యాది) ఉపాధులను మరల మరల పొందటము జరుగుతోంది. అందుచేతనే 'పితృలోకము' 'స్వర్గలోకము' వంటి ఊర్ధ్వలోకములు జీవులతో నిండటము లేదు.

అందుచేత జీవులు జుగుప్సమగు కర్మలు చేయకుండెదరు గాక। ఏవేవి నిషిద్ధకర్మలో, పర్యవసానము అనేక దుఃఖ స్థితుల ప్రాప్తియో – జాగరూకత కొరకై శ్లోకములు (శాస్త్రములు) ఈ విధంగా చెప్పుచున్నాయి:-

(1) **స్తేనో హిరణ్యస్య :** బంగారము దొంగిలించటము.

(2) **సురాం పిబగ్ంం :** మత్తుపానీయములు సేవించటము.

(3) **గురోః తల్పం ఆవసన్ :** గురుపత్నిని కామించటము.

(4) **బ్రహ్మ హా :** బ్రహ్మజ్ఞులగు బ్రాహ్మణులను చంపటము (బ్రాహ్మణహత్య).

**పతంతి చత్వారః॥** ఈ నలుగురు మానవ జన్మ నుండి పతితులు (downfall) అగుదురు. వీరితో స్నేహపూర్వకంగా కలిసి తిరుగువాడు పతితులలో '5'వ వాడు అగుచున్నాడు.

✠

ఓ ఆరుణిమునీంద్రా! ఎవ్వరైతే మనము చెప్పుకున్న పంచాగ్నులను ఉపాసిస్తారో, అట్టివాడు పాపిగా ఇతఃపూర్వం వ్యవహరించినా కూడా ఆ దోషములు ఆతనిని అంటవు. పవిత్రుడై పుణ్యలోకములు చేరగలడు.

## పంచాగ్నుల ఉపాసన

| | | | |
|---|---|---|---|
| (1) | ద్యులోకాగ్ని ఉపాసన | – | ఆదిత్యుడే సమిధ; కిరణముల పొగ, పగలే మంట; చంద్రుడు అంగారము (బొగ్గులు); నక్షత్రములే విస్ఫులింగములు (మిణుగురులు) |
| (2) | పర్జన్య వర్షదేవతా అగ్ని | – | వాయువు → సమిధ; మేఘము → పొగ, మెరుపులే 'జ్వాల', పిడుగులే మండే బొగ్గులు; గర్జనలు విస్ఫులింగములు (కిరణములు). |
| (3) | పృథివీ అగ్ని | – | సంవత్సరము → సమిధ; ఆకాశము → పొగ; రాత్రియే – జ్వాల; దిక్కులు → కాలే బొగ్గులు; మూలలు → విస్ఫులింగములు. |
| (4) | పురుషాగ్ని | – | వాక్ ఇంద్రియము → సమిధ; ప్రాణము → పొగ; జిహ్వయే (నాలుకయే) – జ్వాల; కన్ను → మండే బొగ్గు; చెవి – విస్ఫులింగములు. |
| (5) | యువతియే అగ్ని | – | జననేంద్రియము ఉపస్థ → సమిధ; సంకేతము → పొగ; రాత్రి బొగ్గులు యోనియే – జ్వాల; మైథునమే మండే బొగ్గులు; రతి సుఖమే కిరణములు; దీని నుండి గర్భము, జీవుల జననము జరుగుతోంది. |

అట్టి పంచాగ్నులను ఎరిగి ఉపాసించువాడు సర్వదోషములు తొలగి ఉత్తమ లోకములు సిద్ధించుకోగలడు.

# 5-11. ఏకాదశ ఖండము - వైశ్వానరోపాసన

అశుద్ధకర్మల పర్యవసానంగా ఈ జీవుడు క్రిమికీటములవంటి జన్మలు పొందటము, సంసార దుఃఖములను అనుభవించవలసి రావటము జరుగగలదు. అట్టి దుఃఖములను నిరోధించటానికై ఉపనిషత్‌వాణి ఇప్పుడు 'వైశ్వానరోపాసన' అనే ఉపాయము మనకు చెప్పుతోంది. వైశ్వానర సంబంధమైన జ్ఞానబోధ మనకు అందిస్తోంది.

⌘

పూర్వకాలంలో ఒకప్పుడు గృహస్థులైన ఐదుగురు స్నేహితులు ఉండేవారు. వారు గొప్ప శ్రోత్రియులుగా (శ్రుతులను ఎరిగినవారు)గా మన లోకములో సుప్రసిద్ధులు. వారి పేర్లు :

(1) ఉపమన్యముని కుమారుడు - **ప్రాచీనశాల ఔపమన్యుడు।**

(2) పులుషిముని కుమారుడు - **సత్యయజ్ఞ పౌలుషి।**

(3) భల్లవిముని కుమారుడు - **ఇంద్రద్యుమ్న భాల్లవేయుడు।**

(4) శర్కరాక్షముని కుమారుడు - **జనశ్శారాక్ష్యుడు।**

(5) అశ్వతాశ్వముని కుమారుడు - **బుడిల అశ్వతరాశ్వి।**

వీరు ఐదుగురు సంపన్నులు. వేదశాస్త్రములు అధ్యయనము చేసియున్నవారు. సదాచార సంపన్నులు కూడా! ఒకానొక సందర్భములో ఈ ఐదుగురు ఒక ప్రదేశములో సమావేశమైనారు. వారు ఒక గొప్ప ఆధ్యాత్మికమైన సంవాదమునకు సంసిద్ధమైనారు.

విషయము **(1) కో ను ఆత్మా?** నా ఆత్మ ఎటువంటిది?

**(2) కిం బ్రహ్మ - ఇతి?** బ్రహ్మము అనగా ఏది?

కొంతసేపు శాస్త్ర సంబంధమైన విషయాలు సంభాషించుకున్నారు - తరువాత ఆ ఐదుగురు ఇట్లా నిర్ణయించుకున్నారు.

"మన ఆత్మ ఎట్టిది? బ్రహ్మము అనగా ఏది? ఈ రెండు ప్రశ్నలయొక్క సమాధానము వేదాంత శాస్త్రముయొక్క (లేక) వేదాంత శాస్త్రముయొక్క పరాకాష్ఠ సారము. అందుచేత మనము శాస్త్రానుభవము, లోకానుభవము, ఆత్మానుభవము గల సద్గురువును ఆశ్రయించి శ్రవణము చేద్దాము. అరుణి మహర్షి కుమారుడు ఉద్దాలకారుణి మహర్షి 'ఆత్మవిద్య' అయినట్టి వైశ్వానరవిద్యలో బహుప్రావీణ్యులని మునిలోకము ప్రశంసిస్తూ ఉన్నది. మనము వారిని దర్శించి, 'ఆత్మవిద్య' కొరకై శరణువేడుదాము.

ఇట్లా నిర్ణయించుకొని వారు ఐదుగురు అప్పటికప్పుడే ఉద్దాలక మహర్షి ఆశ్రమం సందర్శించారు. అప్పుడు ఉద్దాలక మహర్షి ఇట్లు పలికారు।

ఓ మునీశ్వరులారా! మీరు ఐదుగురు గొప్ప - శ్రోత్రియులు. ఉత్తమ గృహస్థులు. శాస్త్రములను, లోకమును తరచి తరచి పరిశీలించి ఉన్నవారు. అట్టి మీకు "వైశ్వానర విద్య" అమూలాగ్రము బోధించగల పూర్ణజ్ఞానినని నా గురించి నేను అనుకోవటము లేదు. ఓ పూజనీయులారా! కేకయు రాజు కుమారుడగు అశ్వపతి రాజు 'ఆత్మవిద్య' లేక వైశ్వానర విద్య బోధించటానికి నాకంటే అధికమైన సామర్థ్యము, ప్రజ్ఞకలవారని నేను అభిప్రాయపడుచున్నాను. మనము అందరము ఆయన వద్దకు వెళ్ళి శ్రవణము చేద్దాము।

అప్పుడు ఆ ఆరుగురు (ఉద్దాలకుడు, ప్రాచీనశాలుడు, సత్యయజ్ఞుడు, ఇంద్రద్యుమ్నుడు, జనుడు, బుడిలుడు) - అశ్వపతి రాజు రాజ్యమునకు వెళ్లారు. ఆ వచ్చినవారికి వేరువేరుగా అతిథి మర్యాదలకు సంబంధించిన సత్కారములు అశ్వపతిరాజు సమర్పించారు.

**అశ్వపతి** : పూజ్యులారా! సుదీర్ఘమైన ప్రయాణం చేసి అలసిపోయినట్లు కనిపిస్తున్నారు. మా సేవకులు మీకు వసతులు చూపి సేవలు అందిస్తారు. ఈ రోజు రాత్రి హాయిగా విశ్రాంతి తీసుకోండి. రేపు ఉదయం ప్రాతఃకాలమే మీ దర్శనం చేసుకోగలను.

ఆ రోజు ఆ విధంగా విశ్రాంతి తీసుకున్నారు. ఆ మరునాడు ఉదయమే - అశ్వపతి మహారాజు ఆ వచ్చిన ఉద్దాలక, ప్రాచీనశాల, సత్యయజ్ఞ, ఇంద్రద్యుమ్న, జడ, బుడిల మునులను కలిసారు.

⌘

**అశ్వపతి రాజు** : మహనీయులు, పూజనీయులు అగు మునివర్యులారా! మీ అందరికి నమస్కరిస్తున్నాను. మా రాజ్యమునకు, మేము ప్రారంభిస్తున్న యజ్ఞాదులకు మీ ఆశీర్వాదము, శుభాకాంక్షలు అర్థిస్తున్నాను. దయచేసి నేను సమర్పిస్తున్న ఈ గోవులు, ధనము స్వీకరించండి.

**ఉద్దాలకాది మునులు** : మహారాజా! మీ అతిథి మర్యాదలకు సంతోషము ప్రకటిస్తున్నాము. అయితే మీరు ఇచ్చే ధనముతో మాకు పనిలేదు.

**అశ్వపతి రాజు :** మునీశ్వరులారా! ఒకవేళ మేము సమర్పిస్తున్న ధనము దోషముతో కూడి ఉన్నదేమోనని సందేహిస్తున్నారా? మా రాజ్యములో ఇతరుల ధనము అపహరించే దొంగతనములు లేవు. దొంగలు లేరు. లోభి లేడు. మా దేశములో మద్యపానము నిషేధము. మా ప్రజలందరు అగ్నికార్యము చేస్తున్నారు. లోభులు, వ్యభిచార వృత్తి కలవారు కాదు. ఇక కులట వృత్తి – కులటలు ఉండే మాటయే ఉండదు కదా! **న స్వైరీ, స్వైరిణీ!** మీవంటి మునిసత్తములకు మేము ధనము మొదలైనవి సమర్పించటానికి అర్హులమే అయి ఉన్నామని నా విన్నపము. అందుచేత మేము సమర్పించే ధనము మొదలైనవి దయచేసి స్వీకరించ ప్రార్థన.

**ఉద్దాలకుడు** : రాజా! మీరు, మీ ప్రజలు పరమ పవిత్రులు – సందేహమే లేదు. అయితే, మేము మీ వద్దకు ధనము కోరి రాలేదు.

**అశ్వపతి రాజు** : ఓహో! మేము ఈ రోజు ప్రారంభిస్తున్న యజ్ఞము సందర్శించి ఆశీర్వదించటానికి మీరు వేంచేసి ఉంటారా! అయితే చాలా సంతోషము. మీ రాకతో ఈ యజ్ఞము ధన్యము అవుతోంది. ఈ యజ్ఞము నిర్వర్తించబోతున్న ఋత్విక్కులందరికి ఎంతెంతగా ధనము (సంభావన) సమర్పిస్తానో, అంతగా మీ అందరికీ భక్తితో సమర్పించగలను. యజ్ఞము వీక్షించి యజ్ఞమునకు యజమానినగు నాకు, మా ప్రజలకు మీ ఆశీర్వాదములు ప్రసాదించెదరు గాక।

**మునులు** : **ఏన హి ఏవ అర్థేన పురుషః చరేత్ తగ్ం హి ఏవ వదేత్।** ఎవరి వద్దకు ఎందుకోసము వచ్చామో ఆ విషయమే కోరుకోవాలి గాని, తదితరములు కాదు కదా! ఆ అడిగినదే మీవంటి గొప్పదాతలు ఇస్తారు. మేము ధనము కోరి ఇక్కడికి రాలేదు. **ఆత్మానమ్ ఏవ ఇమం 'వైశ్వానరగ్ం' సంప్రత్యధ్యేషి! తమేవ నో బ్రూహి – ఇతి।** మీరు "వైశ్వానర విద్య" బోధించటంలో బహు ప్రావీణ్యులని మునిలోకము కీర్తిస్తూ ఉంటుంది. అందుచేత మీవద్ద ఆ అట్టి ఆత్మవిద్య నేర్చుకోవటానికై శిష్యులమై ఆశ్రయిస్తున్నాము. దయచేసి మాకు వైశ్వానర విద్య బోధించవలసినదిగా వేడుకొనుచున్నాము. మీరు నిర్వర్తిస్తున్న యజ్ఞమునకు సమిధలు మొదలైన యజ్ఞ పరికరములు గురుభక్తితో తెచ్చి ఉన్నాము. సమర్పించగలము.

**అశ్వపతి రాజు** : ఓహో! అట్లాగా! ఓ మునివర్యులారా! మీతో "వైశ్వానర విద్య" గురించి నేను ఎరిగినంతవరకు తప్పక సంభాషిస్తాను.

అయితే ఈ రోజు మేము యజ్ఞము ప్రారంభిస్తున్నాము. రోజంతా కార్యక్రమములు ఉంటాయి కదా! అందుచేత రేపటి రోజు నుండి ప్రాతఃకాలములో మీరు నా వద్దకు రండి. మనము "వైశ్వానర విద్య" గురించి మా అంతఃపుర ధ్యాన మందిరములో సుఖాసీనులమై మననము చేద్దాము.

ఆ మరునాడు ప్రాతఃకాలమే ఆ '6' గురుమునులు చేతిలో సమిధలు, యజ్ఞపరికరములు ధరించి (సమిత్పాణులై) అశ్వపతిరాజు ధ్యానమందిరానికి వెళ్ళారు.

**అశ్వపతి రాజు** : ఓ మునీశ్వరులారా! మనము చెప్పుకోబోతున్న 'వైశ్వానర విద్య' బోధించటానికి అగ్నికార్యముతో కూడిన 'ఉపనయన దీక్ష'ను శ్రవణము చేయువారికి విధించటము ఆచారమైయున్నది. అయితే మీరంతా తపోధనులు. అనేకమందికి గురువులై ఉండి కూడా శిష్యులుగా మానసిక దీక్ష స్వీకరించగలరు. నిరహంకారులు. అందుచేత నేను మీకు ఉపనయనదీక్ష నియమించకుండానే 'వైశ్వానర విద్య' వివరించబోవుచున్నాను. మీరందరు శ్రద్ధగా ఈ ప్రశ్నలకు సమాధానములు ఇస్తూ శ్రవణ, మనన, నిదిధ్యాసలు నిర్వర్తించెదరు గాక।

**మునివర్యులు :** ఓ గురుదేవా! అశ్వపతి మహారాజా! యజ్ఞకార్యముల ప్రయత్నములలో నిమగ్నమైయుండి కూడా, మీరు శ్రమ తీసుకొని ఉదయ సమయాలలో 'వైశ్వానర విద్య' బోధించటానికి సంసిద్ధులైనందుకు మేము కృతజ్ఞులము. శిష్యులముగా భావించి మీరు అడగబోవు ప్రశ్నలకు వినమ్రులమై సమాధానము ఇవ్వగలము. ఆ తరువాత భక్తిశ్రద్ధలతో శరణాగతులమై మీ బోధ వినటానికి సంసిద్ధులమైయున్నాము. బ్రాహ్మీముహూర్త ప్రారంభములో ఉపనయన సంస్కారములు నిర్వర్తించియే (ఏకాగ్రమైన సామీప్య దృష్టిని సంస్కరించుకొనియే) మేము వస్తున్నాము.

మాపై దయతో మీ బోధామృతమును మాకు ప్రసాదించ వేడుకొనుచున్నాము.

## 5-12. ద్వాదశ ఖండము - ద్యులోకో (స్వర్గలోకో) నామ ఆత్మోపాసన

**అశ్వపతి రాజు** : పూజనీయులగు మునివర్యులారా! ఇక మనము 'వైశ్వానర విద్య' గురించి వివరించుకొనే సంభాషణము ప్రారంభిస్తున్నాము.

మేము గురుతుల్యులుగా భావించు ఉపమన్య ఋషీశ్వరుని కుమారులగు ఔపమన్యా! ప్రాచీనశాలా! మీరు ఇంతవరకు ఆత్మోపాసన చేస్తూనే ఉన్నారు కదా!

**ఔపమన్య ప్రాచీనశాలుడు** : మహాత్మా! అవును నేను ఆత్మభగవానుని ఉపాసిస్తూనే ఉన్నాను.

**అశ్వపతి రాజు** : మీరు దేనిని 'ఆత్మ'గా ఉపాసిస్తున్నారు?

**ప్రాచీనశాలుడు**: పూజనీయా! నేను 'ద్యులోకము' అనబడే దేవతాలోకము (లేక) స్వర్గలోకమును ఆత్మగా ఉపాసిస్తూ ఉన్నాను. అది పుణ్యాత్ములగు దివ్యపురుషులు, తపో తేజః సంపన్నులు చేరు స్థానము కదా!

**అశ్వపతి రాజు** : మీరు చేసే 'ద్యులోక-ఆత్మోపాసన'ను వైశ్వానర విద్యకు 'సుతేజ ఉపాసన' అనబడే 'వైశ్వానరాత్మ' యొక్క ఒక 'అంశ' మాత్రమే! అనగా 'ఆత్మ శోభాయమైన తేజస్సు గలది' అని ఆత్మను ఉపాసించినట్లుగా అవుతోంది. అట్టి సుతేజ-ఆత్మోపాసన వలన **'సుతము'** అనబడే వైదిక కర్మలు మీ వంశము వారంతా నిర్వర్తిస్తూ ఉన్నవారగుచున్నారు.

ఈ విధంగా (సుతేజముగా) ఆత్మోపాసన చేయటం చేత 'సోమరసము'ను పొందుచూ మీ వంశమువారంతా సత్కర్మానుష్ఠానపరులై ఉండగలరు. ప్రియమైన ఆహారము పొందగలరు. వంశములోని వారంతా పవిత్రమగు బ్రహ్మతేజస్సు కలిగినవారగుచున్నారు. అందరిచే గౌరవించబడుచున్నారు.

అయితే, మీ సుతేజ - వైశ్వానరోపాసన (ఆత్మోపాసన)చే ఆత్మయొక్క శిరస్సును మాత్రమే పూజించినవారగుచున్నారు. అనగా, మీరు నిర్వర్తిస్తున్నది సమగ్రమైన పూర్ణాత్మోపాసన కాదు - అని నా మనవి. అందుచేత మీరు ఇప్పుడు నా దగ్గరకు పూర్ణాత్మరూపమగు 'వైశ్వానర విద్య' కొరకై వచ్చి ఉండకపోతే, ఏమయ్యేదంటే - **మూర్ధా తే వ్యపతిష్యతి యద్యత్ మాం న ఆగమిష్యతి - ఇతి॥**

పూర్ణాత్మజ్ఞానము (వైశ్వానర విద్య) ఎరిగినవారి సభలో మీ తల తెగి ఉండేది (తల వంచవలసివచ్చేది) - ఎందుకంటే మీ ఉపాసన ఆత్మధ్యాన ఆత్మోపాసన విషయమై సమగ్రము (comprehensive) కాదు కాబట్టి!

## 5-13. త్రయోదశ ఖండము - ఆదిత్య-విశ్వరూప ఆత్మోపాసన

**కేకయ కుమారుడగు అశ్వపతి మహారాజు** : మహాశయా! శ్రేష్ఠులగు పులిషముని కుమారా! పౌలిష సత్యయజ్ఞా! ప్రాచీనయోగ్యా! మీరు 'ఆత్మ' అనగా దేనిని ఉపాసిస్తున్నారో చెప్పండి!

**సత్య యజ్ఞుడు** : భగవాన్! మహారాజా! నేను ఆదిత్యుని (సూర్యుని) ఆత్మభావనతో ఉపాసిస్తున్నాను - ఆదిత్యుడే జగత్తు అంతటికీ తేజోరూపుడై, సమస్తమును వెలిగించుచున్నారు కదా! చీకట్లు తొలగిస్తున్నారు కదా!

**అశ్వపతి మహారాజు** : మంచిది। శుక్ల నీలాది రూపత్వాత్ విశ్వరూపత్వమ్ ఆదిత్యస్య। సర్వరూపత్యాద్వా। తెలుపు-నలుపు మొదలైన రూపములు గలవాడు గనుక, 'ఆదిత్యుడే విశ్వరూపుడు' అనబడుతోంది. రూపములన్నీ ఆదిత్యునివే కాబట్టి కూడా ఆదిత్యుడే విశ్వరూపుడు.

ఆదిత్యుని ఆత్మపురుషునిగా ఉపాసిస్తున్నారు కాబట్టి మీ కులము (వంశము)లోని వారికందరికీ సాధన సంపత్తి సమృద్ధిగా లభించగలదు. మీకు, మీవారికి గుఱ్ఱములు, కంచరగాడిదల రథములు, దాస-దాసీజనులు, వెండి, బంగారము - ఇవన్నీ చక్కగా ప్రాప్తిస్తూ ఉంటాయి. సమస్త భోగములు మిమ్ములను చేరి ఉంటాయి. మీ కులములో బ్రహ్మవర్చస్సు ప్రకాశమానమై ఉంటుంది. అయితే మీరు వైశ్వానరాత్మ యొక్క 'విశ్వరూపము' అనే 'అంశ'ను మాత్రమే ఉపాసిస్తూ ఉన్నవారగుచున్నారు. అనగా మీ విశ్వరూపాత్మోపాసన సమగ్రము (Full Form) కాదు. **వైశ్వానరాత్మ యొక్క కన్ను మాత్రమే ఉపాసిస్తున్నట్లు.** వైశ్వానరాత్మను ఆదిత్యునిగా ఉపాసించేవారు ప్రియమగు భోజనము పొందగలరు. బ్రహ్మవర్చస్సు వంశమువారినందరిని ఆశ్రయించి ఉండగలదు.

అయితే కూడా, ఆత్మ యొక్క కన్నులను మాత్రమే ఉపాసిస్తున్నారు కదా! అందుచేత సమగ్రమగు వైశ్వానరాత్మను ఉపాసించువారి సభలో మీరు సిగ్గుతో తలవంచవలసి వస్తుంది.

మీరు నా దగ్గరకు 'వైశ్వానర విద్య' శ్రవణము చేసి, తెలుసుకోవటానికి వచ్చి ఉండకపోయి ఉంటే అట్టి పండితులు సభలో మీ తల తెగేదే (తల వంచుకొనవలసి వచ్చేదే) మరి!

## 5-14. చతుర్దశ ఖండము - "వాయు-ఆత్మోపాసన"

**అశ్వపతి మహారాజు** : భల్లవి మునీంద్రుని ప్రియకుమారుడవగు ఇంద్రద్యుమ్నా! వైయాఘ్రపద్యా! మీరు ఆత్మను ఏ అర్థముగా ఉపాసిస్తున్నారు?

**ఇంద్రద్యుమ్నుడు** : అశ్వపతి మహారాజా! నేను వాయువును ఆత్మభావనతో (ప్రాణాయామాది సాధనలచే) ఉపాసిస్తున్నాను. వాయువే విశ్వమంతా సంచరిస్తూ సమస్త జీవులను ఉజ్జీవింపజేయుచున్నది కదా.

**అశ్వపతి మహారాజు** : మీరు చేస్తున్న "వాయువును ఆత్మగా ఉపాసించునది (సమస్తే వాయో। త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాఽసి - అను ఉపాసన) - వైశ్వానరుని యొక్క **"పృథక్ వర్మాత్మోపాసన"** అని 'వైశ్వానరోపాసన'లోని ఒక విభాగముగా చెప్పబడుతోంది. గాలి - ఎదురుగా వీచే గాలి, పైకి లేచే గాలి, సుడిగాలి, దేహములలో సంచరించే గాలి - ఈ విధముగా అనేక వర్తనములుగా కలిగి ఉంటోంది కాబట్టి **"పృథగ్వర్మా"**గా అనబడుతోంది. అటువంటి పృథక్ - వర్మ రూపుడగు వైశ్వానర రూపమును ఉపాసించటము చేత -

- మీ దగ్గరకు అనేక దిక్కులనుండి బలిదానములు (ఉపాహారములు) చేరుతూ ఉంటాయి.
- అనేక వైపులనుండి బలములు మీకు చేకూరుతూ ఉంటాయి.
- అనేక రథశ్రేష్ఠులు (Groups of Travelling Vehicles) మీరు ఎక్కడికి వెళ్లితే అక్కడికి మీసేవకై వెంటనంటి నడుస్తూ ఉంటాయి.
- మీరు చక్కటి ఆహారము భుజించగలరు. ఉత్తమ భోక్త అయి ఉంటారు.
- **ప్రియం భవత్యసి।** అందరికీ ప్రీతిపాత్రులౌతారు.
- మీ కులములోని వారంతా బ్రహ్మవర్చస సంపన్నులు అయి ఉంటారు.

అయితే మీరు పృథక్ వర్మ ఆత్మ వైశ్వానరోపాసనగా పరమాత్మ యొక్క ఒక 'అంశ' అయినట్టి 'ప్రాణము'ను మాత్రమే ఉపాసించువారు అగుచున్నారు. అనగా అది సమగ్రమైన 'వైశ్వానరోపాసన' కాదు. మీరు సమర్థమగు 'వైశ్వానరవిద్య' యొక్క శ్రవణ - మననములకు నా వద్దకు రాకుండా ఉండి ఉంటే, 'వైశ్వానర సమగ్ర విద్య' తెలిసియున్నవారి సభలో మీ తల తెగేదే! అనగా మీరు 'నాది సమగ్రమైన ఉపాసన కాదు' - అని ఎరిగి తలవంచవలసి వచ్చేది.

## 5-15. పంచదశ ఖండము - 'ఆకాశ' వైశ్వానరోపాసన

**అశ్వపతిరాజు** : మహనీయుడగు శర్కరాక్ష్యుని ప్రియకుమారా! జన మహానుభావన్! మీరు ఆత్మను ఏ పరమార్థముగా ఉపాసన చేస్తున్నారు? చెప్పండి!

**జనుడు** : మహాశయా! నేను నిర్విషయము, అనంతము అయినట్టి 'ఆకాశము'ను ఆత్మభావనగా ఉపాసిస్తున్నాను. ఆకాశము ఆత్మయొక్క అనంతత్వము, అప్రమేయత్వము మొదలైన లక్షణములు కలిగి ఉన్నది కదా!

**అశ్వపతిరాజు** : మీరు నిర్వర్తిస్తున్న 'ఆకాశోపాసన'ను 'వైశ్వానరోపాసన విద్య' యొక్క 'బహుళము' అని ప్రసిద్ధి (బహుళ వైశ్వానరోపాసన). అట్టి బహుళ వైశ్వానరోపాసన (ఆకాశమును ఆత్మోపాసనగా నిర్వర్తించటము) వలన బహు సంతానము, సంపదలతో వర్ధిల్లగలరు. శ్రేష్ఠమగు అన్నము పొందగలరు. అందరికి ఇష్టము కాగలరు. సర్వత్రా ప్రియమును దర్శించగలరు. వంశములో అందరు బ్రహ్మవర్చసులు కాగలరు.

అయితే మీరు వైశ్వానరుని యొక్క సందేహము (దేహమధ్యభాగము)ను మాత్రమే ఉపాసించుచున్నట్లౌతుంది. అనగా సమగ్రము కాదు. కాబట్టి వైశ్వానర సమగ్రార్థము తెలిసినవారి సభలో తల తెగేదే! నా వద్దకు వైశ్వానర విద్య శ్రవణము చేయకపోతే అక్కడ తలవంచవలసివచ్చేది।

## 5-16. షోడశ ఖండము - జలమును ఆత్మగా ఉపాసన (రయి ఉపాసన)

**అశ్వపతి రాజు** : జ్ఞానులు అయినట్టి అశ్వతరాశ్యుని కుమారులగు బుడిల మునీ! మీరు ఆత్మను ఏ రూపముగా ఉపాసిస్తున్నారు.

**బుడిలముని** : పూజనీయా! భగవాన్! ("యో ఆపో మాం ఆయతనం వేద" అను వేదవాక్యానుసారం) నేను 'జలము'ను ఆత్మతేజోవిభవముగా ఉపాసిస్తున్నాను. జలము లేకపోతే జీవనము, జీవ - జంతు - వృక్షజాతులు మనలేవు కదా.

**అశ్వపతి రాజు** : మీరు నిర్వర్తిస్తున్న జలతత్త్వ ఆత్మోపాసన 'రయి' అను వైశ్వానరాత్మోపాసనయే।

అట్టి రయీ వైశ్వానరోపాసనచే పుష్టి, సంపద బహుళముగా పొందగలరు. అన్నమును తృప్తిగా భుజించగలరు. బ్రహ్మవర్చస్సు మీ వంశజులను ఆశ్రయించి ఉండగలరు.

**అయితే మీది వైశ్వారుని సమగ్ర ఉపాసన కాదు.** అది వైశ్వానర వస్తి (మూత్రపిండము) ఉపాసన మాత్రమే. నా దగ్గరకు వచ్చి వైశ్వానర సమగ్రోపాసన విని ఉండకపోతే విజ్ఞుల సభలో మీ మూత్రపిండము పగిలిఉండేదే మరి! అనగా, మీ ఉపాసన అసమగ్రమని ఎరిగి తలవంచవలసి వచ్చేది.

## 5-17. సప్తదశ ఖండము - పృథివీ వైశ్వానరోపాసన

**అశ్వపతి రాజు** : గౌతమా! బ్రహ్మజ్ఞులగు ఆరుణి మహర్షి ప్రియకుమారులగు ఉద్దాలక మునివర్యా! **కం త్వం ఆత్మానం ఉపాస సః ఇతి?** మీరు దేనిని ఆత్మతత్త్వభావనకై ఉపాసిస్తున్నారు?

**ఉద్దాలకుడు** : మహారాజన్! భగవాన్! నేను పృథివిని ఆత్మతత్త్వముగా ఉపాసించుచున్నాను.

**అశ్వపతి రాజు** : పూజనీయా! ఉద్దాలకా! మీరు నిర్వర్తిస్తున్న "పృథివీతత్వ-ఆత్మోపాసన"ను 'ప్రతిష్ఠ' అని ప్రసిద్ధి చెందిన వైశ్వానరోపాసన అంటారు.

అట్టి 'పృథ్వి-ప్రతిష్ఠా వైశ్వానరోపాసన' చేస్తున్న మీరు సంతానము, పశుసంపద, గొప్పదగు ఆహారము, సర్వత్రా ప్రియత్వము, బ్రహ్మ వర్చస్సుతో కూడిన వంశపారంపర్యము సిద్ధించుకోగలరు. అయితే మీరు వైశ్వానర పూర్ణోపాసన చేయటం లేదని నా మనవి. వైశ్వానరుని పాదములవరకే ఉపాసిస్తున్నట్లు అవుతుంది. మీరు నా దగ్గరకు సమగ్రమైన వైశ్వానరోపాసన గురించి వినటానికి వచ్చి ఉండకపోతే, - మీ రెండు పాదములు శిథిలమైపోయేవి. (అనగా) పూర్ణమగు వైశ్వానరోపాసన ఎరిగిన పండితుల సమక్షంలో "నాది సమగ్రమైన ఉపాసన కాదు" - అని గ్రహించి సిగ్గుతో తలవంచవలసి వస్తుండేది.

## 5-18. అష్టాదశ ఖండము - వైశ్వానరాత్మ విద్య

**అశ్వపతిరాజు** : ఓ మునిపుంగవులారా! మనము ఇప్పుడు వైశ్వానరాత్మ విద్య యొక్క 'సమగ్రమగు ఆత్మోపాసన' గురించి చెప్పుకుంటున్నాము. **యూయం పృథగివేమమ్ ఆత్మానం వైశ్వానరం విద్వాగ్ంl సో అన్నమత్థl**

మీరంతా కూడా...ప్రాదేశ మాత్రంగా (confined at one area) ఉపాసిస్తున్నారు. అనగా,

ద్యులోకముగా - "సుతేజా"

ఆదిత్యుడుగా - "విశ్వరూపా"

వాయువుగా - "పృథక్ వర్త్మాత్మా"

ఆకాశముగా - "బహుళ"

జలముగా - "రయి"

పృథివిగా - "ప్రతిష్ఠ"

గా "ఆత్మ"ను ఉపాసిస్తూ ఉన్నామని వివరించి ఉన్నారో అది ప్రాదేశమాత్రోపాసన. వేరువేరు కాకుండా, 'ఒక్కటే' అయి ఉన్న ఆత్మను వేరువేరు రూపాలుగా ఉపాసిస్తూ ఆయా ఆహారములను (ఫలములను) స్వీకరించుచున్నారు. ఇది ఎటువంటిదంటే కొందరు గ్రుడ్డివారు ఏనుగుయొక్క వేరువేరు అవయవములను స్పృశించి,

> **ఒకడు (చెవులను తాకి) 'చాట'వలె ఉంటుందని, మరొకడు (తోకను తాకి) "పాము"వలె ఉంటుందని, ఇంకొకడు (నడుమును తాకి) "గోడ"వలె ఉంటుందని, వేరొకడు (తొండము తాకి) "పెద్దగొట్టము" వలె ఉంటుందని ఏనుగు గురించి నమ్మిక కలిగి ఉండటము వంటిది.**

**సమగ్రోపాసన**

- ఎవరు ఏ రకంగా ఉపాసిస్తే వారికి అంతవరకు ప్రయోజనము ప్రసాదిస్తారు కాబట్టే ఆత్మదేవుడు 'వైశ్వానరుడు' అనబడుచున్నారు.
- సర్వ ప్రాణులకు ఆత్మగాను, సర్వ ప్రాణుల రూపముగాను ఉన్నారు కాబట్టి కూడా వైశ్వానరుడు.
- సర్వ జీవులలో వేంచేసియుండి సర్వ ఇంద్రియముల అనుభవములను తనవిగా పొందుచున్నారు కాబట్టి వైశ్వానరుడు.

అనగా, మీరు ఏ 'వైశ్వానరాత్మ'ను ప్రాదేశమాత్రంగా (As if confined to one zone / area / place)గా భావించి ఉపాసిస్తున్నారో, అట్టి వైశ్వానరాత్మ సమగ్రోపాసనచే ఎట్టివాడని తెలుస్తాడో? ఇంకా గమనిద్దాము.

**ఏతమేవం ప్రాదేశమాత్రమ్ అభివిమానమ్ ఆత్మానం వైశ్వానరం ఉపాస్తే**
**- స సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు, సర్వేషు ఆత్మసు అన్నస్తుతిl**

"లోకంలో పరమాత్మను ఒక రూపమనో, ఒక నామమనో ఒక ప్రదేశమనో (శ్రీకృష్ణుడుగానో, శ్రీరాముడుగానో, శివుడుగానో అల్లాగానో, యెహోవా అనియో మరింకేదైనా నామ-రూప-ప్రదేశాత్మకంగా) ఉపాసిస్తున్నారో అట్టి పరమాత్మ

- సర్వలోకములలో...,
- సర్వజీవులలో ....,
- సర్వాత్మకుడై సర్వత్రా సర్వదా వెలయుచున్నాడు!"

- అను ఉపాసనను "వైశ్వానరాత్మోపాసన" అని ఎరిగి ఉండెదరు గాక! అట్టి వైశ్వానరాత్మ యొక్క దేహమే ఈ సమస్తము కూడా!

ఏతస్య ఆత్మనో వైశ్వానరస్య...

| | | |
|---|---|---|
| మూర్ధ ఏవ సుతేజా! | 'సుతేజము' అను ద్యులోకమే (దివ్యలోకమే దేవలోకమే) | మూర్ధము (శిరస్సు/ముఖము) |
| చక్షుః విశ్వరూపః। | 'విశ్వరూపుడు' అగు ఆదిత్యుడే | నేత్రములు |
| ప్రాణః పృథ్వగ్వర్త్మా | అనేక వర్తనములతో కూడిన ఆయన యొక్క –"పృథక్ వర్త్మాత్మత్వమే" | వాయువు, వాయు వీచికలు |
| సందేహో బహులో | 'బహుళము'గా సర్వత్రా ఏర్పడి ఉండటమే | ఆకాశము |
| బస్తిరేవ రయిః। | 'రయి' అగు శరీరమధ్య భాగమే | జలము |
| పృథివ్యే చ పాదౌ। | 'ప్రతిష్ఠ' అగు పృథివియే | పాదములు |

ఇంకా...యజ్ఞ పరిభాషగా....

యజ్ఞవేదికయే – ఆయనకు వక్షఃస్థలము
దర్భలు – ఆయనకు రోమములు (వెంట్రుకలు)
గార్హపత్యాగ్ని – ఆయనకు 'హృదయము'
దక్షిణాగ్ని – ఆయనకు 'మనస్సు'
ఆహవనీయాగ్ని – ఆయనకు 'నోరు'

"సమస్త విశ్వయజ్ఞము, విశ్వపురుషుడు ఆ వైశ్వానరాత్మయే" – అనునది 'సమగ్రోపాసన' అగుచున్నది.

## 5-19. ఏకోన వింశతి ఖండము – వైశ్వానరాత్మోపాసన – "ప్రాణాయ స్వాహా"।

**"యాం ప్రథమాహుతిం జుహుయాత్, తాం జుహుయాత్ ప్రాణాయ స్వాహేతి।" –**

భోజనము చేయునప్పుడు 'భోక్త' వైశ్వానరుని ఉపాసించే విధము.

| | | |
|---|---|---|
| మొదటగా లభించిన ఆహారమును బొటనవ్రేలితో కొంచము తీసుకొని నోటిలో వేసుకొనుచూ... | **ఓం ప్రాణాయ స్వాహా** | అని ఆత్మపురుషుడగు వైశ్వానరాగ్నికి హోమము చేయుదురు గాక! (నోటితో మ్రింగెదరు గాక!) |

అప్పుడు ఇట్టి 'భావన'ను చేస్తూ ఈ విధంగా వైశ్వానర ప్రాణదేవతను (ఓం ప్రాణాయస్వాహా మంత్రముచే)

| | |
|---|---|
| **ప్రాణే తృప్యతి<br>చక్షుః తృప్యతి।** | పంచ ప్రాణములలో మొదటిదగు 'ప్రాణము' తృప్తిపొందుచున్నది.<br>ప్రాణతృప్తిచే చక్షువులు 'తృప్తి' చెందుచున్నాయి. |
| **చక్షుః తృప్యతి<br>ఆదిత్యః తృప్యతి** | నేత్రముల తృప్తిచే ఆదిత్యుడు తృప్తి చెందుచున్నారు.<br>(సూర్యుడు సేవించబడుచున్నారు) |
| **ఆదిత్యే తృప్యతి<br>ద్యౌః తృప్యతి** | ఆదిత్యుడు తృప్తిపొందటం చేత ద్యులోకము<br>(దేవతాలోకము) తృప్తి చెందుచున్నది. |
| **దివితృప్యన్త్యాం, యత్ కించ<br>ద్యౌశ్చ ఆదిత్యశ్చ<br>"అధిష్ఠతః" తత్ తృప్యతి।** | ద్యులోకతృప్తిచే దేవతలపై, ఆదిత్యునిపై ఆధారపడినవైయున్న<br>ఈ సమస్తము తృప్తి చెందుచున్నది. |

ఈ విధంగా పంచ ప్రాణములలో మొదటిదగు ప్రాణము **'ప్రాణాయ స్వాహేతి" –** అని ఉపాసించటంచేత ఆ వైశ్వానరోపాసకునకు ప్రజలు (జనసంపద), పశుసంపద, అన్నము, బ్రహ్మతేజస్సు లభించగలవు. జీర్ణశక్తి, ఆయురారోగ్యములు పొందుచున్నాడు. ఈ ఉపాసన చేయువాడు సంతృప్తుడై, సంతృప్తిని తదితరులకు పంచిపెట్టగలడు.

## 5-20. వింశ ఖండము - వైశ్వానరాత్మోపాసన - "వ్యానాయ స్వాహా"

**అథ-యాం ద్వితీయాం జుహుయాత్ తాం జుహుయాత్ వ్యానాయ స్వాహేతి।**

| | | |
|---|---|---|
| రెండవదిగా లభించిన ఆహారమును బొటనవ్రేలుతో కొంచము తీసుకొని నోటిలో వేసుకొని | **"ఓం వ్యానాయ స్వాహా"** | అంటూ ఆత్మపురుషుడగు వైశ్వానరాత్మ దేవునకు హోమద్రవ్యముగా సమర్పించెదరు గాక। (నోటితో స్వీకరించెదరు గాక।) |

అట్టి సమర్పణచే (ఓం వ్యానాయ స్వాహా మంత్రముచే-'వ్యానము' అను ప్రాణపంచకములో రెండవదగు వ్యానదేవత తృప్తి పొందుచున్నది.

| | |
|---|---|
| **వ్యానే తృప్యతి - శ్రోత్రం తృప్యతి** | వ్యానము తృప్తి చెందుచుండగా శ్రోత్రేంద్రయము (వినికిడి దేవత) తృప్తి చెందుతోంది. |
| **శ్రోత్రే తృప్యతి - చంద్రమాః తృప్యతి** | శ్రోత్రేంద్రియము (చెవి) తృప్తి చెందటంచేత చంద్రమసము (చంద్రదేవత) తృప్తిచెందగలరు. |
| **తృప్యతి చంద్రమాః తృప్యతి దిశః।** | చంద్రదేవత తృప్తిచే దిక్కులు తృప్తి చెందగలవు. |
| **దిక్షు తృప్యన్తీషు యత్కించ దిశశ్చ, చంద్రమాశ్చ అధితిష్ఠన్తి తృప్యతి** | దిక్కులు తృప్తిచే దిక్కులు, చంద్రుడు అధిష్ఠానమైన సమస్తము (ఆహారము, ఓషధులు, వనస్పతులు, దృశ్యము మొదలైన సమస్తము) తృప్తి పొందుచున్నాయి. |

ఈ విధమైన **'వ్యానాయ స్వాహాయేతి'** అను మంత్ర మనన-సమర్పణలచే అట్టి యజ్ఞకర్త బంధు-పశు-అన్న-బ్రహ్మవర్చస సంపదలు సమృద్ధిగా పొందుచున్నాడు.

జీర్ణశక్తి, ఆయురారోగ్యములు సిద్ధించుకొనగలడు. తాను సంతృప్తుడై, సర్వజనులను సంతృప్తింపజేయగలడు.

## 5-21. ఏకవింశ ఖండము - వైశ్వానరాత్మోపాసన - "అపానాయ స్వాహా"

**అథ యాం తృతీయం జుహుయాత్ తాం జుహుయాత్**
**"అపానాయ స్వాహేతి" అపానః తృప్యతి**

మూడవదిగా లభించిన ఆహారము - బొటనవ్రేలుతో కొంచము తీసుకొని నోటిలో వేసుకొని

**"ఓం అపానాయ స్వాహా"**

అని చెప్పుతూ ఆత్మపురుషుడైనట్టి వైశ్వానర భగవానునకు హోమద్రవ్యముగా సమర్పించెదరు గాక! (నోటితో మింగెదరు గాక) ఈ విధమైన 'సమర్పణ'చే (ఓం-'అపానాయస్వాహా' ఇతి మంత్రముచే) "అపానము" అను పంచ ప్రాణములలోని మూడవ ప్రాణము తృప్తిచెందగలదు.

| | |
|---|---|
| **అపానే తృప్యతి - 'వాక్' తృప్యతి।** | అపానతృప్తిచే 'వాక్' ఇంద్రియము తృప్తి చెందుతోంది. |
| **వాచి తృప్యతి - అగ్నిం తృప్యన్తి** | వాక్కు తృప్తిచే "అగ్నిదేవత" తృప్తి చెందగలదు. |
| **అగ్నిస్తృప్యతి - పృథివీ తృప్యతి** | అగ్ని తృప్తిచే "పృథివి" (భూమి) తృప్తిచెందగలదు. |
| **పృథివ్యాం తృప్యన్త్యాం యత్కించ పృథివీ చ, అగ్నిశ్చ అధితిష్ఠన్తః తృప్యతి** | పృథివీ తృప్తిచే - అగ్నులు వేనివేనియందు (మట్టిబొమ్మలలో మట్టిలాగా) అధితిష్ఠితమై ఉన్నాయో, అవన్నీ కూడా తృప్తిచెందగలవు. |

ఆ విధంగా అవన్నీ తృప్తిచెందటంచేత వైశ్వానరాత్మ (సర్వాత్మకుడు) తృప్తిచెందినవారై ఆ ఉపాసకునకు పశుసంపద, ఉత్తమ సంతానము, పవిత్రమగు అన్నము, బ్రహ్మ తేజస్సు ప్రసాదించగలదు. ఆతడు సుసంపన్నుడు, సంతృప్తుడు అవగలడు.

## 5-22. ద్వావింశ ఖండము - వైశ్వానరాత్మోపాసన - “సమానాయ స్వాహా”

**అథ యాం చతుర్థీం జుహుయాత్ తాం జుహుయాత్**
**“సమానాయ స్వాహేతి”। సమానః తృప్యతి**

నాలుగవదిగా లభించిన ఆహారమును బొటనవ్రేలుతో కొంచము తీసుకొని

**“ఓం సమానయ స్వాహా”** ఇతి

అని పలుకుచూ సమస్త స్వరూపాత్మ పురుషుడు అయి ఉన్న వైశ్వానర భగవానునికి హోమద్రవ్యముగా సమర్పించెదరు గాక (మ్రింగెదరు గాక)

**“ఓం సమానాయ స్వాహా”** అను చతుర్థ ఆహార (హోమద్రవ్య) సమర్పణచే 4వది అగు ‘సమానము’ తృప్తిచెందగలదు.

| | |
|---|---|
| **సమానే తృప్యతి - మనః తృప్యతి।** | సమాన వాయు తృప్తిచే “మనస్సు” తృప్తి చెందగలదు. |
| **మనః తృప్యతి - పర్జన్యః తృప్యతి।** | మనస్సు తృప్తి పొందితే ‘వర్షము’ తృప్తి చెందగలదు. |
| **పర్జన్యే తృప్యతి విద్యుత్ తృప్యతి** | పర్జన్యము (వర్షము) తృప్తి చెందితే మెఱుపు (తేజస్సు) తృప్తి చెందగలదు. |
| **విద్యుతి తృప్యన్తాం యత్ కించ విద్యుచ్చ పర్జన్యశ్చ అధితిష్ఠః తత్ తృప్యతి** | విద్యుత్ (ప్రకాశము) తృప్తి చెందితే, ఏవేవి వర్షమును, విద్యుత్తును అధితిష్ఠముగా కలిగి ఉన్నాయో - అవన్నీ తృప్తి చెందగలవు. |

అట్టి 4వదగు ‘సమానము’నకు హోమద్రవ్యముగా ఆహారము సమర్పించు అభ్యాసి (ఉపాసకుడు) పశుసంపద, జనసంపద, ఆరోగ్యకరమగు అన్నము, బ్రహ్మతేజస్సు కలవాడై సంతృప్తుడవగలడు.

## 5-23. త్రయోవింశ ఖండము - వైశ్వానరాత్మోపాసన - “ఉదానాయ స్వాహా”

**అథ యాం పంచమీం జుహుయాత్ తాం జుహుయాత్**
**“ఉదానాయ స్వాహా” ఇతి। ఉదానః తృప్యతి**

ఇప్పుడు ఐదవదిగా లభించిన ఆహారమును బొటనవ్రేలుతో కొంచము తీసుకొని

**“ఓం ఉదానాయ స్వాహా।”** ఇతి

అని అంటూ **సర్వాత్మకుడు, స్వస్వరూపుడు** అగు వైశ్వానరాత్మదేవునికి సమర్పిస్తూ మ్రింగెదరు గాక।

ఈ విధమైన ‘ఉదానము’ అను 5దవ ప్రాణశక్తికి చేయు వైశ్వానరాగ్ని సమర్పితముచే ‘ఉదానప్రాణము’ తృప్తి పొందగలదు.

| | |
|---|---|
| **ఉదానే తృప్యతి - త్వక్ తృప్యతి।** | ఉదాన తృప్తిచే స్పర్శ (చర్మము) తృప్తి చెందగలదు. |
| **త్వచి (త్వక్చి) తృప్యతాం వాయుః తృప్యతి।** | స్పర్శ యొక్క తృప్తిచే “వాయువు” తృప్తి చెందగలదు. |
| **వాయౌ తృప్యతి ఆకాశే తృప్యతి** | వాయు తృప్తిచే పంచభూతములలో మొట్టమొదటిదగు ‘ఆకాశము’ తృప్తి చెందగలదు. |
| **ఆకాశే తృప్యతి యత్కించ వాయుశ్చ, ఆకాశశ్చ అధితిష్ఠతః తృప్యతి** | ఆకాశ తృప్తిచే, వాయు - ఆకాశములు వేటివేటియందు అధితిష్ఠితమై ఉన్నాయో - అవన్నీ తృప్తి పొందగలవు. |

**తస్య అనుతృప్తిం తృప్యతి।** అద్దానిచే వైశ్వానరాత్మ స్వరూపుడే అయి ఉన్న ఈ జీవుడు తనకు తాను తృప్తి పొందగలడు. అట్టి ఉపాసకుడు సత్సంతానము, పశుసంపద, ఉత్తమమగు ఆహారము, బ్రహ్మవర్చస్సు మొదలైనవన్నీ పొంది సంతృప్తుడవగలడు.

## 5-24. చతుర్వింశ ఖండము - ఆత్మజ్ఞాన ఫలశ్రుతి

**అశ్వపతి రాజు** : ఓ ఉద్దాలక, ప్రాచీనశాల, సత్యయజ్ఞ, ఇంద్రద్యుమ్న, జన, బుడిల మునివర్యులారా! ఈ విధంగా సమస్తము అయి ఉన్న **'సర్వాత్మకుడు - స్వస్వరూపాత్ముడు'** అగు వైశ్వానర ఆత్మదేవుని స్మరిస్తూ సమస్త ఇంద్రియ వ్యాపారములు నిర్వర్తించటము - **"వైశ్వానరోపాసన"** అని మహనీయులచే నిర్వచించి బోధించబడుతోంది. ఇదియే **'వైశ్వానరవిద్య'** అని మహర్షుల సభలలో ప్రసిద్ధమైయున్నది.

### ఫలశ్రుతి

**అథ ఏతత్ ఏవం విద్వాన్ అగ్నిహోత్రం జుహోతి, తస్య సర్వేషు లోకేషు, సర్వేషు భూతేషు, సర్వేషు ఆత్మసు హుతం భవతి॥**
ఎవ్వరైతే మనము చెప్పుకున్న 'వైశ్వానరోపాసన' ఎరిగియుండి అగ్నిహోత్రమునకు సమస్త ఇంద్రియ వ్యవహారములు సమర్పించు భావన కలిగి ఉంటాడో, (మరియు) హోమము మొదలైన దైవీ కార్యక్రమములు నిర్వర్తిస్తాడో - అట్టివాడు - సకల లోకములయందు, సకల ప్రాణులయందు, సకల దేహేంద్రియములయందు, సమస్త దృశ్యమునందు "హోమము" చేసిన ఉత్తమ ప్రయోజనము పొందుచున్నాడు. తానే సర్వాత్మకుడై సర్వ తత్త్వస్వరూపుడై వెలయుచున్నాడు.

ఇట్టి వైశ్వానర విద్యను (నేను సమర్పిస్తున్నదంతా సర్వాత్మకుడగు వైశ్వానరాగ్ని భగవానునికే - ) అనే అవగాహన లేకుండా అగ్నిహోత్రమునకు హోమద్రవ్యము సమర్పించువాని సమర్పణ - మండే కట్టెలను ప్రక్కకు నెట్టి, ఆ మిగిలియున్న బూడిదలో హోమము చేసినట్లే అవుతుంది. బూడిదలో పోసిన పన్నీరువలె నిష్ప్రయోజనమే! (అత్యుత్తమ ప్రయోజనము చేతికందదు)

ఎవ్వరైతే సర్వతత్త్వస్వరూపముగా వైశ్వానరాత్మశోభను ఎరిగి పైరీతిగా పంచప్రాణోపాసన పూర్వకంగా ఎరిగి సమస్త స్వీకారములు నిర్వర్తిస్తాడో (ఆహారాదులు పొందుతాడో) అట్టివాని జన్మజన్మల పాపములన్నీ కూడా (కర్మ దోషములన్నీ కూడా) - నిప్పులో వేయబడిన ఎండుగడ్డిపోచవలె భగభగమండి కాలిపోగలవు. అనేక జన్మల కర్మఫలములు భస్మమై ఆత్మజ్ఞానము వెలుగొందగలదు. (జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణః)!

అట్టివాడు తాను తినగా మిగిలిన ఆహారమును పశుహింసకునికి (పాపికి) ఇవ్వటము జరిగినా కూడా - అది వైశ్వానరాగ్నికి హోమము చేసినట్లే అవుతుంది. ఇక పేదవారికి, అర్హత కలిగిన అతిథి అభ్యాగతులకు, 'దేహీ' అని అడిగినవారికి సమర్పించినది హోమద్రవ్యము కాక ఏమౌతుంది?

దానికి సంబంధించిన మంత్రము ఇట్లున్నది :

**యథేహ క్షుధితా బాలా మాతరం పర్యుపాసతే, ఏవగ్ం సర్వాణి భూతాని అగ్నిహోత్రం ఉపాసత ఇతి। అగ్నిహోత్రం ఉపాసత ఇతి॥**

ఏవిధంగా అయితే ఆకలిగొన్న పిల్లలు తల్లిచుట్టూ చేరి "అమ్మా! అన్నము పెట్టవా? ఆకలేస్తోందమ్మా!" అని అమ్మను ఉపాసిస్తారో ఆ విధంగా వైశ్వానరాగ్ని హోత్రమునే అందరూ (తెలిసినా, తెలియకున్నా) ఉపాసిస్తున్నారు.

అందుచేత తెలిసి వైశ్వానరాగ్ని భగవానుని సర్వదేహములలో దేహిగా సందర్శించుచూ వైశ్వానరాగ్న్యుపాసన (వైశ్వానరోపాసన) నిర్వర్తించి ధన్యులయ్యెదరు గాక.

**ఇతి వైశ్వానర విద్యేతి॥**
**వైశ్వానరాయ విద్మహే! లాలీలాయ ధీమహి। తన్నో అగ్నిః ప్రచోదయాత్॥**
**ఇతి ఛాందోగ్య ఉపనిషత్ పంచమ అధ్యాయః సమాప్తః॥**

# ఛాందోగ్యోపనిషత్
# 6. షష్ఠి అధ్యాయము

**(1 నుండి 5 అధ్యాయములు - ఉపాసనా విభాగములు)** **(6 నుండి 8 అధ్యాయములు - జ్ఞానోపదేశము)**

## వేదము (బ్రాహ్మణము, ఉపనిషత్తుల) ముఖ్యపాఠ్యాంశము

### (శాస్త్రముల అంతిమ ఆదేశము)

- సమస్త జగత్తు బ్రహ్మమునందే జలంలో తరంగాలవలె ఉదయిస్తోంది. బ్రహ్మమునందే లయిస్తోంది కూడా! కనుక సమస్తము బ్రహ్మమే అయి ఉన్నది.

ఇప్పుడు - "ఏవిధంగా జగత్తు ఉత్పన్నమౌతోంది? ఏవిధంగా చరిస్తోంది? ఏవిధంగా బ్రహ్మమునందే లయిస్తోంది?" అనే ప్రశ్నలకు సమాధానములు 6వ అధ్యాయములో సంభాషించబడుచున్నాయి. ఆత్మయొక్క **"ఏక-అక్షర-అఖండత్వము"**లు నిరూపిస్తూ వివరణలు చెప్పబడుచున్నాయి.

## 6-1. ప్రథమ ఖండము - వాచారంభణం వికారో నామధేయం - మృత్తికైవ సత్యం

అరుణి మహర్షి కుమారుడు ఉద్దాలక ఆరుణి. ఆయన కుమారుడు శ్వేతకేతు. 12 సం॥ల వయసు గల శ్వేతకేతువును ఒకరోజు ఉద్దాలకుడు తన దగ్గరకు పిలిచారు.

**ఉద్దాలకుడు (ఆరుణి) :** కుమారా! శ్వేతకేతు! నీవు చతుర్వేదములు అధ్యయనము చేయవలసిన సమయము వచ్చింది. 'బ్రహ్మచర్యదీక్ష' తీసుకోవాలి. 'సద్గురువు'ను ఆశ్రయించాలి. ("నీవు బ్రహ్మమే" - అని నిరూపిస్తూ బోధించువారు సద్గురువు).

నాయనా! మన వంశములో అందరూ వేదములు అధ్యయనం చేసి బ్రాహ్మణ నామధేయమునకు అర్హత పొందారు. అంతేగాని జన్మతః బ్రాహ్మణ వంశములో పుట్టి, మన వంశములో వేదములు అధ్యయనము చేయకుండా కేవలము నామకః బ్రాహ్మణులు (బ్రాహ్మణబంధువులు) ఎవ్వరూ లేరు. వేదములు, వేద హృదయము అధ్యయనము చేయకపోతే నీవు 'బ్రాహ్మణ బంధువు' అనిపించుకుంటావేగాని, బ్రాహ్మణుడవు కాలేవు. అందుచేత వెనువెంటనే గురుకులము జేరి, సద్గురువును ఆశ్రయించి, వేదములు అధ్యయనము చేసి బ్రాహ్మణ నామధేయమునకు అర్హుడవు అయ్యెదవు గాక।

తండ్రి ఉద్దాలకముని చెప్పినదంతా విని, వెనువెంటనే శ్వేతకేతు గురుకులాశ్రమం చేరారు. 4 వేదములు, యజ్ఞవాఙ్మయము మొదలైనవి 12 సంవత్సరముల కాలము అభ్యాసము చేసారు. విద్య పూర్తి చేసుకొని తోటి విద్యార్థులలో శ్రేష్ఠుడు - అని అనిపించుకున్నారు.

అధ్యయనము పూర్తి అయినట్లుగా గురువులవద్ద వీడ్కోలు సంస్కారము / అనుజ్ఞ పొంది విద్యా గర్వ అభిమానములు కలవాడై తిరిగి ఇంటికి చేరారు. రోజులు గడుస్తూ ఉన్నాయి.

తండ్రి ఉద్దాలకుడు కుమారుడు శ్వేతకేతు యొక్క ప్రవర్తనను గమనించి - "నేను 4 వేదములు ఆమూలాగ్రము అధ్యయనము చేసి తెలుసుకున్నాను" - అనే అభిమానముతో ప్రవర్తిస్తూ ఉండటం గమనించారు.

"నేను అనేక మందికన్నా వేదవిద్యలో విద్యాధికుడను" - అనే అభిమానము చూచి, ఒకరోజు కుమారుని దగ్గరకు పిలిచి ఏకాంతంగా సంభాషించసాగారు.

**ఉద్దాలకుడు** : కుమారా! శ్వేతకేతూ! నీవు ఈ 12 సంవత్సరముల కాలము శ్రద్ధగా వేదములు అధ్యయనం చేసి విద్యా పారంగతుడవయ్యావా?

**శ్వేతకేతు** : తండ్రీ! మీరు చెప్పిన విధంగా నేను 4 వేదములు, ఉపాంగములు, మంత్ర తంత్ర జ్యోతిష్య మీమాంస శాస్త్రములు అధ్యయనము చేసి నేర్చుకున్నాను. అస్మత్ గురువులు నా అధ్యయనము తదితర సహ విద్యార్థులకంటే గొప్పగా ఉన్నదని నన్ను అనేకసార్లు మెచ్చుకున్నారు. వీడ్కోలు సభలో కూడా నా విద్యాధిక్యతను ప్రశంసించారు కూడా!

**ఉద్దాలకుడు** : అవునా? అందుచేతనా, నీలో కించిత్ విద్యా గర్వము, అభిమానములతో కూడిన గాంభీర్యత కనిపిస్తోంది!

**శ్వేతకేతువు** : ఓహో! అవునా? ఏమో మరి!

**ఉద్దాలకుడు** : సోమ్యా! నీ ముఖము చూస్తున్నప్పుడు అన్నీ తెలిసిన 'అనుచానమాని'విగాను ప్రత్యేకతగలవాడిని అనే స్తబ్దత కనిపిస్తోంది. చిన్నతనములోనే విద్యావంతుడవు, అనేకుల కంటే గొప్పవాడివి అయినట్లు భావిస్తున్నావని అనిపిస్తోంది.

**శ్వేతకేతు** : మరి, గురుకులములో అనేక వేద – వేదాంగ విద్యలు శ్రద్ధగా కష్టపడి చదువుకున్నాను, తండ్రీ!

**ఉద్దాలకుడు :** చాలా సంతోషము. అయితే శాస్త్రముల అంతిమ ఆదేశము (The Finest Order) ఏమో గ్రహించావు కదా? గురువులను అడిగి అట్టి 'ఆదేశము' ఏమో తెలుసుకున్నావా? **ఆదేశమ్ అప్రాక్ష్యో?**

**శ్వేతకేతు** : ఆదేశమా? ఏమిటా ఆదేశము?

**ఉద్దాలకుడు** : ఏమిటా? **యేన అశ్రుతగ్ం శ్రుతం భవతి, అమతం మతమ్, అవిజ్ఞాతం విజ్ఞాతమ్ – ఇతి।**

ఓ భగవత్ ఆనంద స్వరూపా! ప్రపంచములోని వస్తు విశేషములలో వినిపించేది కాదో, అది విని ఉన్నావా? ఏది అభిప్రాయములలో దొరకనిది (అమతమ్) అని తెలియగలదో, అది తెలుసుకున్నావా? దేనిచేత తెలియనిదంతా కూడా తెలిసినవే అగుచున్నదో, అదియే ఆదేశము. అట్టి సద్గురు – సత్‌శాస్త్ర హృదయమగు ఆదేశము నీవు నేర్చుకున్నావా? ఏది తెలుసుకున్న తరువాత మోహము ఉండదో, ఇంక తెలుసుకోవలసినది ఇంకేమీ శేషించదో – అది గ్రహించావా మరి?

**శ్వేతకేతు: కథం ను భగవః స ఆదేశో భవతి ఇతి? భగవాన్!** మీరు చెప్పుచున్న విశేషణములతో కూడి వేదహృదయమగు 'ఆదేశము' అనగా ఏమిటో నాకు అర్థం అగుటలేదే?

**ఉద్దాలకుడు :** అయితే కొన్ని దృష్టాంతాల సహాయముతో వేదముల 'ఆదేశము' ఏమిటో గుర్తు చేస్తూ చెపుతాను, సోమ్యా (నాయనా)! విను!

**యథా సోమ్య! ఏకేన మృత్పిండేన**
**సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్**
**వాచారంభణమ్ వికారో నామధేయమ్।**
**మృత్తిక – ఇత్యేవ సత్యమ్॥**

ఒకచోట మట్టితో తయారైన కుండ, కూజా, మూత, మట్టి బొమ్మ–ఇవన్నీ ఉన్నాయి. ఒకనికి అవన్నీ మట్టితో తయారైనవేనని తెలిసింది. అతడు మట్టి గురించి తెలిసిన తరువాత – కుండ, కూజ, మూత, బొమ్మ మొదలైనవన్నీ 'వాక్కు'తో కల్పించబడ్డాయని, అవన్నీ నీళ్లల్లో కలిపితే? 'మట్టి' గానే అవుతుంది. మట్టియే సత్యమని కుండలు మొదలైనవి సత్యము కాదని తెలుస్తుంది కదా!

**యథా సోమ్య! ఏకేన లోహమణినా**
**సర్వం లోహమయం విజ్ఞాతగ్ం స్యాత్**
**వాచారంభణం। వికారో నామధేయమ్।**
**లోహం – ఇత్యేవ సత్యమ్॥**

ఒకచోట కొన్ని లోహమణి (బంగారము)తో తయారైన గాజులు, గొలుసు, ఉంగరము, పాపిడిబిళ్ల మొదలైనవి ఉన్నాయి. అంతా బంగారమే అని బంగారము గురించి తెలిసిన తరువాత ఆ ఆభరణములలో ఒక్కొక్కదాని గురించి తెలుసుకోవలసినది ఏముంటుంది? గాజులు, గొలుసు మొదలైనవి వాచారంభణము (మాటల తేడా) యేగాని, ఆకారముల అనేకత్వమేగాని – వాటన్నిటిలో బంగారమే సత్యము – అని (బంగారము గురించి తెలిసినవాడికి) తెలిసిపోతుంది కదా!

**యథా సోమ్య! ఏకేన నఖ నికృంతనేన**
**సర్వం కార్ష్ణాయసం విజ్ఞాతగ్ం స్యాత్**
**వాచారంభణమ్ వికారో నామధేయమ్।**
**'కృష్ణాయసమ్' – ఇత్యేవ సత్యమ్।**

లోహము (ఇనుము)తో పార, పలుగు, తీగలు, పాత్రలు మొదలైనవి అనేకం కనబడవచ్చుగాక। 'ఇనుము' గురించి తెలిస్తే అన్నిటి గురించి తెలిసినట్లేగదా! ఆయా పేర్లన్నీ మాటల విశేషమే. లోహమే సత్యము.

**సోమ్యా! ప్రియకుమారా! అట్టి సమస్త జీవులకు సంబంధించి ఏది సత్యమో - జీవజాతులు, గుణములు ఏ 'ఎరుక' చేత వాచారంభణము (మాటల భేదము మాత్రమే) గాను, వికార విశేషములుగాను తెలియవచ్చి, 'ఆత్మయే సత్యము' అగుచున్నదో- అదియే వేద విజ్ఞానము యొక్క "ఆదేశము".**

**శ్వేతకేతు :** తండ్రీ! పూజనీయులగు ఉద్దాలక మహర్షివర్యా! నేను 4 వేదములు క్షుణ్ణంగా నేర్చుకున్నాను. నా గురువులు వద్ద మీరు చెప్పిన 'వేద - ఆదేశము' విద్య గురించి నేను నేర్చుకొని ఉండలేదు. మా గురువులు అది ఎరిగి ఉన్నారో లేదో మరి? వారికి అది తెలిసి ఉండి ఉంటే, నాకు తప్పక చెప్పేవారేనేమో! పితృదేవా! వేదశాస్త్రము యొక్క 'ఆదేశము' అను మీరు ఉదహరిస్తున్న విషయమై నాకు శాస్త్రీయ విశేషమంతా మీరే నాకు బోధించండి. నేను అధ్యయనుడనై శ్రవణం చేయటానికి శ్రద్ధ-ఆసక్తులతో సంసిద్ధుడను. పితృదేవా! మీకిప్పుడు ఆదేశవిద్యకై అధ్యయన విద్యార్థినై శరణు వేడుచున్నాను. గురు నమస్కారం సమర్పిస్తున్నాను.

అప్పుడు ఉద్దాలక మహర్షి - **"సరేఁ! నాయనా! అట్లాగే వివరించుకుందాము"** అని పలికి, ఇక ఈ విధంగా చెప్పసాగారు. అందుకుగాను ఉద్దాలకుడు, శ్వేతకేతు, కొందరు ఉద్దాలక శిష్యులు ఒక ప్రశాంతమైన ప్రదేశముతో సమావేశమైనారు.

## 6-2. ద్వితీయ ఖండము - సదేవ సోమ్య। ఇదమ్ అగ్రమ్ ఆసీత్। ఏకం ఏవ అద్వితీయం।

**సత్** = (1) ఉనికి. "నేను ఉన్నాను" - అను స్వకీయ స్వాభావిక అనునిత్య అనన్యానుభవము. అదియే 'అస్తిత్వము' అని కూడా అనబడుచ్నుది.

(2) అట్టి **'ఉనికి'** చేతనే సమస్తము అనుభవమౌతోంది. నేనే లేకపోతే అనుభవము ఎక్కడుంటుంది?

(3) అనుభవమయ్యే 'ఉనికి'కే ఉన్నదంతా అనుభవమౌతోంది. అందుచేత **సమస్తము ఉనికి (సత్)** లోనే ఉన్నది.

**ఏవ** = నిశ్చయముగా; "అదియే! అంతే! ఇంకేమి కాదు" - అని అనటము.

**ఇదమ్** = 'ఇది' అను రూపముగా అనుభవమౌతున్న సమస్తము. తెలియబడుచున్నదంతా కూడా 'చిత్' అని కూడా అనబడుతోంది. నేను(First person) - నీవు (Second person) - అది/అతడు/ఆమె (Third person)లతో కూడిన జగదృశ్యమంతా - 'ఇదమ్' యే!

**అగ్రమ్** = ముందుగా! మొట్టమొదటగా! ఇది ఉండనప్పుడు కూడా!

**ఆసీత్** = ఉన్నది;
బంగారు ఆభరణము అను దానిలో ఆభరణము ఏర్పడటానికి ముందుగా బంగారము ఏర్పడి ఉండి ఉన్నట్లు,
తరంగానికి ముందు జలము ఏర్పడి ఉండి ఉన్నట్లు,
మట్టి బొమ్మకు ముందు 'మట్టి' ఉండి ఉన్నట్లు -
= 'సత్' యే (ఇచ్చట) "ఏర్పడి ఉన్నది"

(**సోమ్య!** = అధ్యయన సామర్థ్యము కలవాడా! సోమ = పరాక్రమము)

**సత్ ఏవ సోమ్య! ఇదమ్ అగ్రమ్ ఆసీత్ - ఏకం ఏవ అద్వితీయమ్।**

శ్రవణము, గ్రహించటములలో సామర్థ్యవంతుడా! బిడ్డా। ఈ కనబడే సమస్తమనకు ముందుగా (బంగారు ఆభరణమునకు ముందు బంగారపు లోహము ఉన్న తీరుగా) - సత్ (The Existence, The Presence) 'ఉండటము' అనే తత్త్వము మాత్రమే ఉన్నది. అట్టి సత్ (ఉనికి) అద్వితీయమై యున్నది. అనగా దానికి 'రెండవది' అంటూ ఏదీ లేదు.

- అట్టి సత్ మాత్రమే 'అస్తిత్వము' కలిగి ఉన్నది.

**శ్వేతకేతు** : **మరి ఈ నేను - నీవు - దృశ్యానుభవము - దృశ్యములతో కూడిన 'జగత్తు' అనబడేది ఎక్కడి నుండి వచ్చింది?**

**ఉద్దాలకుడు** : ఈ ఇంద్రియానుభవమై కనిపించేదంతా స్వతఃగా ఉండక, సత్ (అస్తి)కి తరువాతనే ఏర్పడినది. అందుచేత ఇదంతా మొట్టమొదట అసత్తు (లేనిది)గా ఉండి ఆ తర్వాత సత్‌గా (ఉన్నదానిగా, అస్తిగా) బయల్వెడలుతోంది.

అని కొందరు (జగదీశ్వర) వాదులు చెప్పుచూ ఉన్నారు. అనగా వారి అభిప్రాయము ప్రకారము – ఇదంతా ఒకప్పుడు 'నాస్తి'లో ఉండి ఆ తరువాత అస్తిగా అగుచున్నదని!

**శ్వేతకేతు** : అనగా, ఈ జగత్తు ఒకప్పుడు సత్తులో 'అసత్తు'గా ఉండి, ఎప్పుడో సత్తుగా రూపుదిద్దుకుంటోందనియా?

**శ్వేతకేతు** : 'సత్తు' అనుదానిలో అసత్తు ఎట్లా ఉంటుంది? **కుతస్తు ఖలు, సోమ్యా! ఏవగ్ం స్యాత్ ఇతి।** 'ఇతి' అనే ఈ జగత్తు మొట్టమొదట అసత్తే, సత్తులో ఉన్నదని ఎట్లా అంటాము? **కథం అసతః సత్ జాయతే!** ఉన్నదానిలో లేనిదానికి ఉనికి ఎక్కడ ఉంటుంది? ఉన్నదానిలో ఉన్నదే ఉంటుంది కదా! కనుక **'సత్ ఏవ సోమ్య! ఇదమ్ అగ్రం ఆసీత్।** అందుచేత ఇదంతా మొదట 'సత్తు' (ఉన్నదే) అయి ఉన్నది. ఇదంతా 'అస్తి'లోనే ఉన్నది.

అయితే...

అట్టి 'అస్తి' అనబడు 'సత్తు'లో 'ఉనికి–ఇది' (సత్–జగత్) అనే రెండు ఉన్నాయా? సత్తులో సత్తుయే ఉంటుంది. 'అస్తి' (ఉండటము) అనునది ఏకమే అయి ఉంటుంది. అనగా బంగారు ఆభరణములో ఆభరణము అను విభాగము లేని విధంగా, జగత్తుగా ఉన్నది సత్తుయే! ఎందుకంటే –

**"సత్ ఏవ అగ్రం ఆసీత్ – ఏకం ఏవ – అద్వితీయమ్।"**

'బంగారపు ఉంగరము' అను దానిలో బంగారమే ఉన్నది. ఒక ఆకారమునకు 'ఉంగరము' అని అన్నామే కాని, ఉంగరము బంగారములో ఉన్నదనిగాని, బంగారం ఉంగరంగా మారుతోందనిగాని ఏమాత్రము మన ఉద్దేశ్యము కాదు. అట్లాగే 'సత్'యే వ్యవహారరీత్యా 'ఇదమ్ జగత్'గా చెప్పబడుతోందేగాని 'సత్' మరొకటేదీగా (జగత్తు మొదలైనవిగా) అవటం లేదు. అనగా ఉంగరము అనబడునది బంగారమే అయిఉన్న తీరుగా, 'జగత్తు' అనబడేది 'సత్' రూపమేగాని సత్ నుండి వేరొకటేదీ అయి ఉండలేదు.

**అనగా 'జగత్'గా మనము ఏది చెప్పుకుంటున్నామో అది సర్వదా 'సత్'యే గాని మరొకటేదీ కాదు.**

---

ఒకప్పుడు, ఇప్పుడు, మరొకప్పుడు కూడా సర్వదా 'సత్'యే అస్తి / ఉన్నది. నాటకంలో పాత్రధారుడు పాత్రకు వేరై ఉన్న తీరుగా అది 'పరము' (Beyond) అయి అప్రమేయమై ఉన్నది కాబట్టి 'పరబ్రహ్మము' అని వేదవాఙ్మయముచే చెప్పబడుతోంది. "అదియే నీవు" అని (నిరూపించే 'తత్త్వశాస్త్రము'చే) శబ్దీకరించబడుతోంది.

**శ్వేతకేతు** : సద్గురువర్యా! పితృదేవా! "బంగారములో ఉంగరము అనబడునది వేరే లేనట్లే సర్వదా సర్వత్రా సత్తు (పరబ్రహ్మము, అస్తి)యే ఉన్నది" – అనేది యుక్తియుక్తమే. ఒప్పుకుంటున్నాను. కానీ మాకు ఈ జగత్తు, ఇందులో అనేక భేదవిశేషాలు (జ్ఞాని–అజ్ఞాని, చదువుకున్నవాడు–చదువుకోలేనివాడు, సద్గుణుడు–దుర్గుణుడు మొదలైన) అనేక విశేషాలతో ఈ జగత్తు అనుభవమౌతోంది కదా! అనుభవమగుచూ ఉండటమే కాకుండా, ఇక్కడ మేము సుఖ–దుఃఖములు, బంధము – ఇటువంటివన్నీ పొందుచున్నామే!

**ఉద్దాలకుడు** : ఓహో! అదా? ఈ జగత్తు సద్రూప పరబ్రహ్మము (లేక) స్వస్వరూపానందరూపమగు 'ఆత్మ'గా కాకుండా (అనన్యముగా కాకుండా) 'అన్యము'వలె ఎందుకు అనుభూతమౌతోందో – ఆత్మజ్ఞుల, శాస్త్రముల విశ్లేషణము చెప్పుచున్నాను–విను!

## ద్రష్టత్వము అనే 'తేజస్సు'

మొట్టమొదట, ఇప్పుడు, ఇక ఎప్పటికీ 'సమస్తము తానే' అయిన సద్రూపము **"తత్ ఈక్షత బహుస్యాం ప్రజాయేతి।"** – ఏకముగా ఉన్న నేను 'అనేకము' అనే బహుళత్వము కల్పించుకొని ఆస్వాదించెదను గాక।" – అని భావించుచున్నది.

**"ఏకమగు నేను అనేక ప్రకారములుగా అయ్యెదను గాక। (Let me Diversify myself as many for the pleasure of it)"** – అని ఈక్షణము (perception) కల్పించుకొంటున్నది. అప్పుడు కేవలమగు సత్తు (అస్తి) నుండి 'ద్రష్టత్వము' అనే తేజోవిభజనము సృష్టించుకోవటం లీలగా, క్రీడగా జరుగుతోంది – **తత్ తేజో సృజత।।**

## తేజస్సు నుండి జలము

**తత్ తేజ ఐక్షత బహుస్యాం ప్రజాయేతి।** "అనేకమును సృష్టించుకొని చూద్దాము" అనునది ఏకమగు సత్తు నుండి బయల్వెడలుతోంది. అట్టి కల్పనా తేజోభిమాని మొట్టమొదట 'అపో' (జలము)ను సృష్టించారు. అందుచేత ఈ జీవుడు ఏకారణంచేతనైనా శోకించినప్పుడు (శోచతి-దుఃఖించినప్పుడు) (లేక) తప్తుడు (Worried) అయినప్పుడు స్వేదము (చెమటలు) పుట్టుకొస్తోంది. **పురుషః తేజస ఏవ తదత్ ఆపో జాయన్తే।** అ సత్‌స్వరూపుడగు పురుషుని 'అనుభవి' అనే తేజస్సే జలమును పుట్టిస్తోంది.

## జలము నుండి అన్నము

తేజస్సు జలమును వీక్షించింది కదా! ఆ జలము 'మేము అనేకముగా అయ్యెదము' అని తలచింది. (ఈక్షణము – Perceiving చేయసాగింది). ఆ విధంగా అనేక ప్రకారములుగా అయ్యెదననే జలముయొక్క తలంపునుండి "అన్నము" జనిస్తోంది.

అందుచేతనే, ఎక్కడ వర్షము ఎక్కువగా కురుస్తూ ఉంటే అక్కడ పంటలు పండి అన్నము సృజించబడుతోంది.

జలము – అన్నాద్యము (అన్నము ప్రసాదించునది) – అగుచున్నది.

# 6-3. తృతీయ ఖండము - అగ్ని - జల - అన్న దేవతలు

**ఉద్దాలకుడు** : బిడ్డా శ్వేతకేతూ! 'అన్నము' నుండి ఆ అన్నము తిని జీవించటానికై (జీవనము అనే సంఘటనను ప్రదర్శించటానికి) – 'జీవులు' బయల్వెడలుచున్నారు. అట్టి జీవ జాలము (లేక) భూతజాలము మూడు విధములైన ఉత్పత్తి చమత్కారములు ఏర్పడినవి అగుచున్నాయి.

**(1) అండజములు :** గ్రుడ్డు (అండము) నుండి జనించే పక్షులు, సర్పములు మొదలైనవి.

**(2) జరాయుజములు :** మానవులు, పశువులు మొదలైనవి.

**(3) ఉద్భిజ్జములు :** భూమి నుండి పైభాగమువైపుగా మొలుచుకొస్తున్నట్టివి.

ఉద్భిదములు = ఆహార ధాన్యము, పెసలు – మినుగులు వంటి ఆహారములు

స్వేదజములు = చెమట నుండి పుట్టే క్రిములు మొ॥వి.

ఈ విధంగా సత్ నుండి బయలుదేరిన సంకల్పశక్తి "నేను జీవాత్మరూపంగా 'అగ్ని జల అన్నములు' అనే ముగ్గురు దేవతలుగా ('3' దివ్యశక్తుల రూపముగా) ప్రవేశించి అనేకములైన నామరూపాత్మకములుగా ప్రదర్శనమయ్యెదను గాక" అని సృష్టి సంకల్పమును ప్రదర్శించుచున్నది, వ్యక్తీకరించుచున్నది.

ఈ విధంగా అనేక శబ్దరూపములగు నామములు, అనేకములగు రూపములు బయల్వెడలసాగాయి. అందుచేత **ఈ సృష్టి భావనా మాత్రమే।** సమస్త జీవులకు ఏకమగు సత్ పరబ్రహ్మమే అఖండమగు అంతర్యామి. 'సత్'యే సత్యము. తదితరమైనదంతా భావనాకల్పితము కనుక 'అసత్' – అనబడుచున్నది.

త్రివృత్‌కరణము 3 × 3

అంతేకాకుండా **'అగ్ని జల అన్నము'**లనబడే దేవతలను మూడు – మూడుగా త్రివృత్ కరణము (సత్‌చే) చేయబడుతోంది.

(1) నామము (2) రూపము (3) వ్యావృత్తి (ఆలోచన, స్వభావము) (ఈ నామము గలది. ఈ రూపముగలది. ఈ ధర్మములు(Functions) గలది)–గా 'త్రివృత్ కరణము' రూపము దిద్దుకుంటోంది.

ఒక్కొక్క దివ్యతత్త్వము (అగ్ని జల అన్నములను) ఏవిధంగా మూడు – మూడుగా (త్రివృత్‌కరణముగా) అగుచున్నదో కొన్ని విశేషాలు వివరించుకుందాము.

# 6-4. చతుర్థ ఖండము - త్రివృత్‌కరణమునకు దృష్టాంతములు

అగ్ని - జల - అన్న (భూ) (Heat, Liquid, Solid) కలయికలే ఈ కనబడే సమస్త పదార్థములు. అట్టి 'త్రివృత్కరణము' గురించి మనము దృష్టాంతముల ద్వారా వివరించుకుంటున్నాము.



- మూడు పుల్లలను (లేక) రేఖలను ఒకవిధానంగా జేరిస్తే అది త్రిభుజము (Triangle) అగుచున్నది.

ఆ మూడు పుల్లలు తీస్తే? త్రిభుజము ఎక్కడ ఉన్నది? **"మొదలే లేనిది"** అగుచున్నది.

ఈ జగదనుభవం → సత్‌పురుషుడు- తేజోరూపమగు అనుభవి - కల్పనా పురుషకారము ఒకచోట ఏకమైతే 'జగత్తు'

→ అవి విడివిడిగా తీసి చూస్తే త్రిభుజమువలెనే 'జగత్తు' అనబడునదే లేదు.

స్వప్నానుభవము కూడా → సత్‌పురుషుడు - తేజోరూపుడగు స్వప్నద్రష్ట - ఊహ, అపోహలరూపమగు స్వప్నభావన కలిస్తేనే స్వప్నము అనే త్రిభుజమువంటి అనుభవం ఏర్పడి ఉంటుంది. స్వప్నద్రష్ట లేకుంటే స్వప్నము ఎక్కడ ఉంటుంది?

పై ఉదాహరణలు దృష్టిలో పెట్టుకొని ఇప్పుడు ఈ దృశ్య వ్యవహారము యొక్క 'ఆత్మతో అనన్యత్వము' వివరించుకుంటున్నాము.

దృశ్యము (లేక) జగత్తు స్వతఃగా ఉన్నది కాదని, భావనచే అన్యముగా అనుభవమౌతోందని నిరూపించుకుంటున్నాము.

తేజస్సు-జలతత్త్వము-అన్న (భూ)తత్త్వములను (Light, Liquid and Solid) విడదీస్తే ఆ పదార్థము యొక్క నామ - రూపములు గలిగినదేదీ ఉండదని గమనించబడుతోంది.

**<u>'త్రివృత్కరణము' - స్వతఃగా లేదు.</u>**

**అగ్ని :**

(1) యత్ అగ్నే రోహితగ్ం రూపం తేజసః — (1) అగ్నిలో ఎరుపు తేజస్సు

(2) యత్ శుక్లం తత్ రూపం — (2) అగ్నియొక్క తెలుపు జలము

(3) యత్ కృష్ణం తత్ 'అన్నం' — (3) అగ్నిలో నల్లటి రూపం పృథివి (అన్నము)

**ఈ మూడు వర్ణములు తొలగిస్తే అగ్నిత్వము వాచారంభణమే। వికార నామధేయమే। ఈ మూడింటిని ఎరిగిన వానికి అగ్నిత్వ బుద్ధి తొలగిపోగలదు. తేజో-జల-పృథివియే సత్యము.**

**ఆదిత్యుడు :**

(1) యత్ ఆదిత్యస్య రోహితగ్ం। తేజోః తత్‌రూపం — ఆదిత్యుని రోహిత రూపము (ఎరుపు) తేజస్సు

(2) యత్ శుక్లమ్ తత్ అపామ్ — శుక్లరూపము జలము

(3) యత్ కృష్ణం తత్ అన్నమ్। — ఆదిత్యునిలోని నల్లటి ఛాయ అన్నరూపము

**తేజోరూపము, జలము, అన్నరూపము విడివిడిగా తీసి వేరేచోట ఉంచితే - అప్పుడు అక్కడ 'ఆదిత్యరూపము' ఎక్కడ ఉన్నది? ఆదిత్యుడు (సూర్యుడు) అనునది వికార నామమాత్రమే.**

**చంద్రుడు :**

(1) యత్ చంద్రమసో రోహితం రూపమ్ - తత్ తేజసః — చంద్రునిలో ఎర్రటి రూపము - 'తేజస్సు'

(2) యత్ శుక్లం తత్ అపామ్ — తెల్లటి రూపము - జలము

(3) యత్ కృష్ణమ్ తత్ అన్నమ్ — నల్లటి విభాగము - అన్నము

**ఈ మూడు విడివిడిగా చేసి చూస్తే అక్కడ 'చంద్రుడు' అనేది (గొలుసు అను మాటలాగా) వాచారంభణమ్। పేరుకు సంబంధించిన వికారమే.**

పైవన్నీ విడివిడిగా (త్రీణిరూపాణి) మాత్రమే సత్యము. ఒకచోటికి తేజస్సు - జలము - అన్నము (Light, Liquid and Solid) వచ్చినప్పుడు మాత్రమే అగ్ని, ఆదిత్య, చంద్రమస నామరూపాత్మక వాచారంభములు, నామధేయ వికారములు చెప్పుకొనబడుచున్నాయి. **<u>ఈ జగత్తులో ప్రతి వస్తువు ఇంతే।</u>**

**విద్యుత్తు (మెఱుపు):**

| | | |
|---|---|---|
| యత్ విద్యుతో రోహితగ్ం రూపం తేజసః। | మెఱుపులోని ఎరుపు 'తేజస్సు'కు సంబంధించినది | **తేజో జల అన్న(భూ)తత్త్వములను విడదీసి ఆవల పెట్టితే అక్కడ 'విద్యుత్' అనునదేమీ ఉండదు. అనగా 'విద్యుత్' అన్నది వాక్కు కల్పన, మూడిటి కలయిక యొక్క నామ రూపాత్మ వికారమే.** |
| యత్ శుక్లం సద్రూపం అపాం | తెలుపుగా కనిపించేది జలతత్త్వము | |
| యత్ కృష్ణం తత్ అన్నమ్। | ఏది నలుపుయో అది 'అన్నము' | |

ఈ విధంగా సమస్త వస్తువులలో అగ్ని (తేజో), జల (ద్రవ్య), అన్న (భౌతిక) తత్త్వములను విడదీసి ఆవల పెట్టి చూస్తే – ఈ ప్రపంచంలో కనిపించే బంగారము, ఇనుము, చెట్లు, చేమలు, దేహాలు ఇవన్నీ కూడా వాచారంభణము (మాటవరసకు కల్పించి చెప్పేవి) నామరూప వికారాత్మకము (త్రిభుజమువలెను, పైన చెప్పుకొన్న విశేషములవలెను) అయి ఉన్నాయి.

అందుచేత ఈ జగత్తంతా కూడా కల్పితమాత్రము (వాచారంభణము, వికారో నామధేయము) – అని చెప్పబడుతోంది.

ఎరుపురంగు 'తేజస్సు' (Heat) అని, తెలుపు రంగు (Liquid) జలస్వరూపమని, నలుపురంగు అన్నతత్త్వము (Solid) అని, ఈ సమస్త పదార్థములు అగ్ని – జల – భూ కలయికలేనని ఎవరు గ్రహిస్తారో అట్టివారిపట్ల సమస్తమును "అశ్రుతము (విననది) అమతము (ఏదో వేరైనది), అవిజ్ఞాతము (తెలియనిది)" అగు ఏదీ ఈ సమస్త దృశ్యజగత్తులో శేషించి ఉండదు. ఆ మూడు తత్త్వములు తెలిసియున్నవారు సమస్త పదార్థముల మూలము తెలిసియున్నవారే అగుచున్నారు.

ఈ సమస్తము అగ్ని – జల – భూ తత్త్వముల వేరు వేరు పాళ్ల (ratios) కలయికయేనని గ్రహించి సమస్త వస్తుజాలము పట్ల – ఆశ్చర్యము, అలభ్యము, అశ్రవణము మొదలైన భావాలు జయించి వేసి ఉంటారు.

## 6-5. పంచమ ఖండము - మనస్సు అన్నమయము, ప్రాణము జలమయము, వాక్కు తేజోమయము

**శ్వేతకేతు** : సద్గురూ! పితృదేవా! సాకారమైన పదార్థములన్నీ అగ్ని (తేజో) – జల (ద్రవ) – అన్న (స్థూల) తత్త్వముల అనేక పాళ్ల (ratios) కలయికయేనని మీరు చెప్పినది, తదితర నామరూపములన్నీ వాచారంభణము అనునది – అత్యంత యుక్తియుక్తమే। తండ్రీ! మరి మనస్సు మాట ఏమిటి? వాక్కు, చూపు శక్తులు ఎట్టివి?

**ఉద్దాలకుడు : అన్నమ్ అశితన్ త్రేధా విధీయతే।**

జీవులంతా ఆహారము స్వీకరించి మాత్రమే జీవించగలుగుచున్నారు. అట్టి భుజించిన అన్నము దేహములో ప్రవేశించిన తరువాత '3' భాగములుగా అగుచున్నది.

**(1) తిన్న (స్థూల) ఆహారము యొక్క (అన్నము యొక్క) :**

(i) **తస్య యః స్థవిష్ఠో ధాతుః తత్ పురీషం భవతి :** అత్యంత స్థూలభాగము 'మలము'గా అగుచున్నది.

(ii) **యో మధ్యమః తత్ మాంసమ్ :** మధ్యభాగము దేహములో 'మాంసము'గా అగుచున్నది.

(iii) **యో అణిష్ఠః తత్ మనః –** అత్యంత సూక్ష్మభాగము 'మనస్సు'గాను అగుచున్నది.

**(2) అట్లాగే త్రాగబడుచున్న జలము (ద్రవము) యొక్క :**

(i) అత్యంత స్థూల భాగము – 'మూత్రము' (Urine) గా అగుచున్నది.

(ii) మధ్య భాగము – "అస్థి' (బొమికల విభాగము)గా అవుతోంది.

(iii) అత్యంత సూక్ష్మవిభాగము – 'ప్రాణశక్తి (ఉత్తేజము)'గా అగుచున్నాడు.

**(3) ఆహారముగా స్వీకరించబడుచున్న తైలము (Oils) యొక్క :**

(i) స్థూల విభాగము – శరీరములో ఎముకల పుష్టిగా వృద్ధి రూపము చెందుతోంది.

(ii) మధ్య విభాగము – 'మజ్జ' (ఎముకలలోని మెత్తటి నేయి - Oily) విభాగముగా అవుతోంది.

(iii) అత్యంత సూక్ష్మ విభాగము – 'వాక్' ఇంద్రియముగా అవుతోంది.

ఓ సోమ్యా! కుమారా! శ్వేతకేతూ!

ఈ విధంగా మనస్సు అన్నమయము (అన్నమయో మనః), ప్రాణము ఆపో (జల)మయము, వాక్కు తేజోమయము అయి ఉన్నాయని తెలుసుకొనెదవు గాక।

**శ్వేతకేతువు** : గురుదేవా! తండ్రీ! ప్రాణము జలమయమని, వాక్కు తేజోమయమని మీరు చెప్పినది యుక్తియుక్తమేనని విన్నాను. వేదములలో అనేక చోట్ల ఈ విధంగా స్తుతించబడింది. గురుకులంలో గురువులవద్ద నేర్చాను.

కానీ "మనస్సు అన్నమయము" అనే వాక్యము నేను తగినంతగా సమన్వయించుకోలేకపోతున్నాను. కాబట్టి ఈ విశేషములను ఏవైనా దృష్టాంతములతో బోధించ ప్రార్థన.

## 6-6. షష్ఠి ఖండము - అన్నిటి యొక్క సూక్ష్మాంశమే 'మనస్సు'

**ఉద్దాలకుడు** : నీకు మరింత స్పష్టమవటానికి నీవు అడిగినట్లుగా ఒక దృష్టాంతము తీసుకొని చెపుతాను విను!

పెరుగు (Curd) ను చల్లకవ్వముతో చిలికినప్పుడు (మథించినప్పుడు) ఆ పెఱుగులోని సూక్ష్మ భాగము పైకి తేలి వెన్న అగుచున్నది. ఆ వెన్న కాచినప్పుడు కమ్మటి 'నేయి' (Ghee) అగుచున్నది కదా! సోమ్యా! అదే విధంగా,

**ఏవమేవ ఖలు సోమ్య। అన్నస్య అశ్యమానస్య యో అణిమా, స ఊర్ధ్వః సముదీషతి - తత్ మనో భవతి।**

అదే విధంగా ఈ జీవునిచే తినబడుచున్న అన్నమునందలి సూక్ష్మాంశము వాయువుతో కూడిన 'జఠరాగ్ని' ద్వారా మథించినదై పైకి తేలుచున్నది. ఆ విధంగా తేలుచున్న విభాగమే **'మనస్సు'నకు పుష్టిని కలిగిస్తోంది.**

అట్లాగే, త్రాగబడుచున్న 'జలము'లోని అణిమా (సూక్ష్మాంశము) పైకి తేలి ప్రాణములో చేరి **ప్రాణమును ఉత్తేజపరుస్తోంది.**

భుజించబడుచున్న తేజోపదార్థములైనట్టి నేయి, నూనె మొదలైనవాటి యొక్క సూక్ష్మాంశము (సూక్ష్మవిభాగము) పైకి తేలి 'వాక్కు'ను ప్రత్యుత్సాహముగా పలకటానికి తోడు అగుచున్నది.

| | |
|---|---|
| **అన్నమయం హి మనః।** | మనస్సు అన్నమయము |
| **ఆపోమయః ప్రాణః।** | ప్రాణము ఆపో(జల)మయము |
| **తేజోమయీ వాక్।** | వాక్కు తేజోమయము |

**శ్వేతకేతు** : పితృదేవా! గురువర్యా! భగవాన్। **భూయ ఏవ మాం విజ్ఞాపయతు - ఇతి।** ఇంకా మరికొంత విస్తరించి చెప్పండి.

**ఉద్దాలకుడు :** ఇంకా చెప్పాలా? సరేఁ! **తథా సోమ్య! ఇతి।** అట్లాగే మరికొంత దృష్టాంతంగా కూడా చెప్పుచున్నాను. విను.

## 6-7. సప్తమ ఖండము - షోడశ కళా మనో పురుష న్యాయము

**ఉద్దాలకుడు** : శ్వేతకేతూ! ఇంధనము వాహనమునకు చలనము కలిగించు విధంగా, "తిన్న అన్నము యొక్క సూక్ష్మాంశ మనస్సునందు చేరి, మనస్సుకు శక్తి, సంచారత్వము కలిగిస్తోంది". అప్పుడు మనస్సు యొక్క శక్తి '16' విభాగములుగా విభాజ్యమై ఈ పురుషుని (జీవుని) దేహములో పంచేంద్రియములు పనిచేయనారంభిస్తున్నాయి. ఈ జీవుడు అప్పుడు "ద్రష్ట" (చూచువాడు), "శ్రోత" (వినువాడు), "స్పర్శి" (స్పర్శించువాడు), "మన్త" (ఆలోచించువాడు), బోద్ధ (అర్థము చేసుకొనువాడు), "కర్త" (పనిచేయువాడు), "విజ్ఞాత" (తెలుసుకొనువాడు), "ఆనంది" (రమించువాడు) మొదలైన సమస్త క్రియలు చేయ సమర్థుడు అగుచున్నాడు. "షోడశకళా పురుషుడు" అగుచున్నాడు.

అన్నము వలన - శక్తి

శక్తి వలన - మనోబలము

మనోబలముచే - ఇంద్రియ వ్యాపార సమర్థత పొందుచున్నాడు.

అయితే కొందరు 'ధ్యానము' చేతనే ఆహారము పొందుచూ ధ్యానాహారులు కూడా అగుచున్నారు. ధ్యానముచే ప్రకృతి నుండి ఆహార రసశక్తి పొందవచ్చును కూడా!

- అన్నము సర్వస్వరూపము
- అన్నము వలననే మానసిక బలము కలుగుతోంది.
- మనస్సు చేతనే సమస్తము ఆస్వాదించబడుతోంది.

**శ్వేతకేతు** : మీరు చెప్పిన ఈ "షోడశ కళాపురుషకారము" గురించి మరికొంత ప్రయోగాత్మకంగా (Practically) నాపై దయతో నాకు బోధించండి.

**ఉద్దాలకారుణి** : ఓహో! నీకు ప్రయోగాత్మకంగా **'షోడశ కళా పురుష న్యాయము'** గురించి వివరించి చెప్పమంటావా! అయితే ఒక పని చేయి. ఈ రోజు నుండి 15 రోజులు ఏమీ తినకుండా ఉపవాసము చేయి. అయితే మంచినీళ్లు మాత్రం త్రాగుతూ ఉండు. 16వ రోజు నా దగ్గరకు రా! జలము త్రాగుతూ ఉంటావు కాబట్టి నీ ప్రాణము నిలచి ఉండగలదు.

**శ్వేతకేతు** : తండ్రీ! మీరు సూచించినట్లే నిర్వర్తిస్తాను.

శ్వేతకేతువు 15 రోజులు ఏదీ భుజించలేదు. నీరు మాత్రము త్రాగుచూ ఉన్నాడు. 16వ రోజు తండ్రి సమక్షమునకు నీరసముగా వచ్చాడు.

**శ్వేతకేతు** : నాన్నగారూ! మీరు చెప్పినట్లే 15 రోజులు ఏమీ తినక నీరు మాత్రము త్రాగుతూ గడిపాను. ఇప్పుడు ఏమి చేయమంటారు?

**ఉద్దాలకుడు** : అయినదా! మంచిది! నీవు గురుకులంలో ఋక్కులు, యజస్సులు, సామములు క్షుణ్ణంగా పఠించి, పారాయణము చేసి ఉన్నావు కదా!

**శ్వేతకేతు** : అవును ధారాళంగా చదివాను. ఋక్కు సామ యజస్సులు పఠనము చేయగలవాడనే.

**ఉద్దాలకుడు** : అయితే కొన్ని ఋక్కులు, యజస్సులు, సామములు నాకు పారాయణం చేస్తూ వినిపించు.

**శ్వేతకేతు** : తండ్రీ! **న వై మా ప్రతిభాన్తి భో ఇతి।** నాకు అనేవీ జ్ఞాపకము రావటం లేదు. గురువుల దగ్గర నేర్చుకొన్న మంత్రోచ్చారణలు తెలిసినా పలకటానికి జ్ఞప్తికి రావటం లేదు, క్షమించండి.

**ఉద్దాలకుడు**: మండుచున్న అగ్నిలో పుల్లలన్నీ తీసివేస్తే, అప్పటికీ ఉండి ఉన్న చిన్న నిప్పురవ్వలు – మరల కట్టెలు అగ్నిలో ఉంచినా – ఆ కట్టెలను వెలిగించలేదు కదా! అట్లాగే నీ దగ్గర 16 జీవకళలలో ఒక్క ప్రాణకళ మాత్రమే మిగిలి ఉన్నది. అది వాక్కు, వినికిడి, చూపు, గ్రహణము, జ్ఞాపకము, వల్లెవేయగలగటం – మొదలైన వాటిని వెలిగించలేకపోతున్నాయి. కాబట్టి శ్వేతకేతూ! నీవు వెళ్లు, వెళ్ళి అమ్మను అడిగి సుష్టుగా భోజనము చేయి. కొంచము విశ్రాంతి తీసుకొని, ఆ తరువాత సాయంకాలము నా దగ్గరకు రమ్ము.

శ్వేతకేతు తల్లి దగ్గరకు వెళ్లి, సుష్టుగా భోజనం చేసి ఆ సాయంకాలము ప్రశాంత సమయములో మరల తండ్రి వద్దకు వచ్చారు.

**శ్వేతకేతు** : పిత్రుదేవా! శుభ్రముగా అమ్మచేతి భోజనము చేశాను. ఇప్పుడు చెప్పండి. ఏమి మీ ఆజ్ఞ?

**ఉద్దాలకారుణి** : కుమారా! ఋగ్వేదములోని ఋక్కుల, యజుర్వేదములోని యజస్సుల, సామవేదములోని సామముల కొన్ని 'పనసలు' శ్రవణానందకరంగా వినిపించు.

అప్పుడు శ్వేతకేతు కొన్ని పనసలను అవరోహణ – ఆరోహణ – భావ – రాగయుక్తంగాను, అమోఘంగాను వినిపించారు.

**ఉద్దాలకుడు** : నీవు గురుకులం నుండి రాగానే చదివిన పనసలకంటే "అగ్నిమీళే పురోహితే" మొదలైన ఋక్కులు, యజుఃసామములు రసవత్తరంగాను, మనోహరంగాను మధురంగా వినిపించావు.

అనేక కట్టెలతో మండుచున్న అగ్ని – ఆ కట్టెలు తొలగించగా కొన్ని నిప్పు కణికలు మాత్రమే మిగిలి ఉండగా, కొన్ని ఎండుగడ్డి పరకలు వేసినప్పుడు  ఇతఃపూర్వంకంటే తేజోవంతముగా వెలుగొందుచున్నది కదా!

ఆ రీతిగా నీ స్వరము మరింతగా ఎంతో మాధుర్యము సంతరించుకొన్నది.

అట్లాగే 15 రోజులు ఉపవాసము తరువాత  నీ యొక్క 16 కళలలో ఒక్కటి మాత్రమే మిగిలి ఉండగా, ఇప్పుడు భోజనము చేసిన తరువాత వేదగానములన్నీ జ్ఞాపకమునకు వచ్చి, సుమధురంగా పాడావు. నీ యొక్క మనస్సు ఎంతో ఉత్సాహము పుంజుకున్నది. కాబట్టి :

- మనస్సు అన్నమయము।
- ప్రాణము జలమయము।
- వాక్కు తేజోమయము।

అని ప్రయోగాత్మకంగా (Practically) నిరూపించబడుతోంది.

**తద్ధాస్య (తత్ హ అస్య) విజజ్ఞావితి। విజజ్ఞావితి।**

శ్వేతకేతువు తన తండ్రి ఉద్దాలకుడు వద్ద తివృత్ – కరణ విద్యా విశేషములు తెలుసుకున్నారు. వివరముగా, సుస్పష్టముగా తెలుసుకున్నారు.

---

## 6-8. అష్టమ ఖండము – సుషిప్తి సమయములో జీవుని స్థితి ఎట్టిది?

**శ్వేతకేతు** : తండ్రీ! జాగ్రత్‌లో మనము ఈ ఇంద్రియ విషయ జగత్తును మనస్సు ద్వారా అనుభవిస్తూ ఉన్నాము. ఇక నిద్రపోయిన తరువాత స్వప్నము (Dream)ను పొందుచున్నాము. అట్టి స్వప్నస్థితి (వేదాంత విద్యానుసారము) ఎట్టిది? ఎట్లా ఏర్పడుతోంది? మెలకువవచ్చి 'జాగ్రత్'లో ప్రవేశించగా, కల (స్వప్న) యొక్క దృశ్య వ్యవహారమంతా ఏమౌతోంది? దయచేసి ఈ విషయాలు నాకు బోధించవలసినదిగా నా అభ్యర్థన.

**ఉద్దాలకుడు** : **స్వప్నాన్తం, సోమ్య! మే విజానీ హి – ఇతి** స్వప్నాంతము (కలయొక్క తత్త్వము, స్వరూపము) గురించి నీవు కోరినట్లు వివరిస్తాను.

ఈ జీవుడు 'జాగ్రత్'లో ప్రాణశక్తి ఉపయోగిస్తూ పంచేంద్రియముల ద్వారా శబ్ద స్పర్శ రూప రస గంధ విషయములను బాహ్యమున అనుభవముగా పొందుచున్నాడు. మనస్సుతో వాటి అర్థ–అపార్థములన్నీ ఆపాదించుచూ అనుభవ పరంపరలుగా పొందుచున్నాడు. కొంత సమయమైన తరువాత "ఇక వీటితో చాలు. కొంతసేపు విరామమును ఆశ్రయిస్తాను" అని నిర్ణయించుకుంటున్నాడు.

అప్పుడిక మనస్సును ఇంద్రియ విషయములనుండి ఇంద్రియములనుండి వెనుకకు మరల్చుచున్నాడు. క్రమంగా బాహ్యమునకు వెళ్లియున్న మనో విభాగమును కేవల రూపమగు మనస్సునందు ఏకము చేసి ఉంటున్నాడు. అప్పుడు ఈ ఈ విశేషములు ఏర్పడుచున్నవగుచున్నాయి.

### 1. దృశ్యము నుండి విరమించటము

మనస్సు భౌతికమగు ఇంద్రియములను, వాటి సూక్ష్మ బాహ్యశక్తులగు – చూడటము, వినటము, స్పర్శించటము, మాట్లాడటము, రుచిచూడటము, వాసనానుభవము – ఇవన్నీ పూర్తిగా వదలినదై ఉంటోంది.

ఈ విరామం పొందటం ఎటువంటిదంటే

- **ధ్యాయతీవ లేలాయతి ఇవ స ధీః స్వప్నో భూత్వ ఇమం లోకమ్ అతిక్రామతి।** ధ్యానము చేస్తున్నవాడు ప్రాపంచక విశేషములనుండి ఈవలకు రావటము వంటిది. ఇంద్రియ – ఇంద్రియ విషయములను నుండి ధ్యాసను ఈవలకు తేవటము వంటిది (వాజనేయ శ్రుతి)

- ఒకడు ఉద్యోగరీత్యా అనేక వ్యాపకములలో మునిగి ఉంటూ, సాయంత్రము అవన్నీ అక్కడే వదలి, ఇంటికి వచ్చి, కుటుంబ సభ్యులతో ఒకడై వ్యవహరించటము ఎట్లా జరుగుతోందో – ఈ జీవుడు ఇంద్రియ విషయములను బయటనే వదలి, తన ప్రాణశక్తితో సామీప్యము పొందటము అట్టిది. **ప్రాణాన్నేవ ప్రాణో నామ భవతి।** ప్రాణము ఇంద్రియములను వదలి ప్రాణముతో ఏకమై ఉండు స్థితి!
- ఒకడు వాహనమును అనేక జాగరూకతలతో నడుపుచూ, ఇంటికి వచ్చిన తరువాత ఆ జాగరూకతతో కూడిన నడిపించటము (Driving) ను విరమించి ఆ ధ్యాసలను (Avocations) తన యొక్క వాహనము నడుపు కళ (Art of Driving) యందు విరమింపజేయడము వంటిది.

## 2. స్వస్వరూప సామీప్యత

**యత్ర ఏతత్ పురుషః స్వపితి నామ –** ఇప్పుడు అట్టి జగద్దృశ్యము నుండి విరమించిన తరువాత తనయొక్క సామీప్యతను తాను పొందటము జరుగుతోంది. అనగా స్వకీయ తేజో రూపమగు ఆత్మతో తాను తిరిగి సామీప్యము పొందటము. **సతా తదా సంపన్నో భవతి।** సద్రూపమగు ఆత్మతో 'లయము' పొందుచున్నాడు. అందుచేత 'స్వప్నము' అనుదానిని <u>'స్వం + అపీతో'</u> = <u>'స్వమపీతో' ఇతి భవతి।</u> – అంటున్నారు. తనయందు తానై తాను ఉంటున్నాడు.

**తస్మాత్ ఏనగ్ం 'స్వపితి' ఆచక్షతే।** తనను తానే ఆస్వాదిస్తూ ఉన్నాడు – అని చెప్పుకోబడుచున్నాడు. **(స్వగ్ం అపీతో భవతి।)**

**(3) స్వప్నానుభవము** : ఇంతకుముందు ఇంద్రియములతో శ్రమిస్తూ వస్తున్న మనస్సు, అద్దాని నుండి విరామము పొంది తనయందు తానే విరమించటం ప్రారంభిస్తోంది.

**స్వప్నాన్తమ్ స్వప్నమధ్యమ్ 'స్వప్న' ఇతి దర్శన వృత్తేః 'స్వప్న'స్య ఆఖ్యా।** దేనియందైతే వాసనా రూపమగు విషయములు జీవునిచే కల్పించబడి, అనుభవించబడుచున్నాయో – అట్టి అంతర్వృత్తి మనో అనుభవమే 'స్వప్న'గా చెప్పబడుతోంది.

**'స్వ'** (తనను తాను) **ఆప్నోతి** (అట్లు పొందుచున్నాడు) **ఇతి స్వప్నః।**

అయితే స్వప్నము చివరివరకు ఈ జీవుడు దృశ్యానుభవములాగానే (1) బాహ్య వస్తురహితంగా కానీ (2) బాహ్య వస్తువులు ఉన్నట్లుగానే ఊహించి కానీ సుఖదుఃఖములు అనుభవముగా పొందుచున్నాడు.

జాగ్రత్‌లో 'స్వప్నము అసత్యము' అని అనుకుంటున్న తీరుగానే, స్వప్నానుభవ సందర్భములో 'జాగ్రత్ అసత్యము' అను భావము తనయందు కలిగినవాడై ఉంటున్నాడు.

**(4) స్వప్నములో సంచారములు** : స్వప్నములో ఏవేవో ప్రదేశములలో ఏవేవో సంఘటనలు కల్పించుకొని తనకు బాహ్యముగా ఉన్నట్లు అనుభవము పొందుచున్నాడు. కాని 'ప్రాణము' అనే కట్టుకొయ్యకు 'దృశ్యమననము' అనే త్రాడుతో కట్టబడియే ఉంటున్నాడు.

**స యథా శకునిః సూత్రేణ ప్రబద్ధో దిశమ్ దిశమ్ పతిత్వా –** త్రాడుతో కాలు కట్టబడిన పక్షివలె పది దిక్కులవైపుగా ఎగురుచూ అక్కడక్కడే తిరుగుచున్నాడు. **అన్యత్ర ఆయతనమ్ అలబ్ధ్వా, బంధనమేవ ఉపశ్రయత।** బయటకు వెళ్ళటం చేతకాక ప్రాణ–బంధనము కలిగి ఉంటున్నాడు. **మనో దిశం దిశం పతిత్వా అన్యత్ర ఆయతనమ్ అలబ్ధ్వా ప్రాణమేవ ఉపశ్రయతే।** మనస్సు అన్ని దిక్కులా తిరిగి తిరిగి కాలు త్రాడుతో కట్టుకొయ్యకు కట్టబడిన పక్షివలె ఎటూ వెళ్ళలేక తిరిగి ప్రాణమునే ఆశ్రయించుచూ ఉంటోంది. మనస్సు ప్రాణరూపంగా బంధనము కలిగి ఉంటోంది. <u>**ఇదియే స్వప్నానుభవము**</u>.

ఈ విధంగా ఉద్దాలకమహర్షి 'స్వపితి' (స్వ–అపితి) నామము యొక్క విశ్లేషణచే 'జీవునియొక్క సత్ స్వరూపమే జగత్తునకు మూలము. (The Experience of the World has its roots in one's own Self)' అను ఉపనిషత్ సత్యవాక్కును స్వానుభవంగా ఏర్పరచి శ్వేతకేతుకు సుస్పష్టపరచారు.

## ఆకలి దప్పికల తత్త్వము

**శ్వేతకేతు** : స్వామీ! చాలా సంతోషము. ఇప్పుడిక ఈ జీవుడు దేహమువలన పొందుచున్న 'అశన-పిపాసల (ఆకలి-దాహముల)' స్వరూప-స్వభావ తత్త్వముల గురించి వినగోరుచున్నాను. దయతో వివరించండి.

**ఉద్దాలకుడు** : సరే! "అశన-పిసాసలు" అనబడే ఆకలి - దప్పికల స్వరూపముల గురించి వివరించుకుందాము.

ఈ జీవునిలో ప్రాణశక్తి జ్వలిస్తూ ఉంటుంది. కట్టెలు తరుగుతూ ఉంటే అగ్ని తగ్గువిధంగా ప్రాణశక్తి ఆహారము తగ్గినప్పుడు బలహీనపడసాగుతుంది. అప్పుడు అగ్నికి ఇంధనమువలె ఆహారమును దేహమునకు సమార్చు అవసరము, అగత్యము ఏర్పడుతోంది. అప్పుడు ఈ జీవుడు 'అశిషతి' (అన్నము ఆకలి తీరటానికై కోరుకొనువాడు) అగుచున్నాడు. ప్రకృతిచే ప్రసాదించబడుచున్న అన్నము (ఆహారము) తినుచున్నాడు. నీరు త్రాగుచున్నాడు. ఆ విధంగా తినిన అన్నమును జలము వ్యవస్థాబద్ధంగా (In a Very Systematic Way) ప్రాణశక్తిచే శరీరములలోని అన్ని భాగములకు తీసుకొనిపోతోంది.

⌘ గోవులను మేతకు తీసుకొని పోవువానిని 'గోనాయ' అంటారు.

⌘ గుఱ్ఱములను తోలుకొని పోవువానిని 'అశ్వనాయ' అంటారు.

⌘ యుద్ధ సందర్భములలో మనుష్యులను తీసుకొని పోవువానిని 'పురుషనాయ' అంటారు.

అదేవిధంగా జలము ఆహారమును శరీరమంతా తీసుకొనిపోతుంది. కాబట్టి **'అశనాయ'** అని పిలుస్తున్నారు. విత్తనమునకు నీరు లేకుండా 'వేరు'కు 'అంకురము' రాదు కదా! అదేవిధంగా ఈ దేహము జలవృద్ధి చేతనే ఉత్సాహ సృజనాత్మకములు పొందుతోంది.

- అన్నమునకు మూలము (వేరు) - జలము
- జలమునకు మూలము (వేరు) - తేజస్సు
- తేజస్సునకు మూలము (వేరు) - సత్ (ఉనికి/Existence)

ఈ జీవులంతా సత్ స్వరూపులే! ఈ సమస్తము 'సత్' పైనే ఆధారపడినదై ఉన్నది.

మనము పైన చెప్పుకొనియున్న గోనాయ, అశ్వనాయ, పురుషనాయ వలెనే తేజస్సుకు జలమును అందించు దానిని 'ఉదన్య' అంటారు. తేజస్సుకు మూలము జలము. మూలము లేకుండా ఏదీ ఉండజాలదు కదా! జలముచేతనే దేహ మనోబుద్ధులు తేజోవంతమగుచున్నాయి.

జలమే ఈ దేహముయొక్క మూలము.

- జలము యొక్క అంకురమును అధ్యయనము చేసి 'తేజస్సు'ను మూలముగా తెలుసుకొనెదవు గాక।
- తేజస్సు యొక్క అంకురమును అధ్యయనము చేస్తూ 'సత్త'ను మూలముగా తెలుసుకో!

**ఇమాః సర్వాః ప్రజాః సదాయతనాః సత్ ప్రతిష్ఠా।** సత్తయే సర్వ జీవులకు ఆశ్రయము. సర్వులు సత్ - స్వరూపులే। సమస్తము 'సత్' నందే ప్రతిష్ఠమైయున్నది.

ఓ శ్వేతకేతూ! ఈ విధంగా ఈ జీవునియందు 'తేజ-జల-అన్నము' అనబడే ముగ్గురు దేవతల 'త్రివృత్కరణము' ఈ పాంచభౌతిక జగత్తుగాను, అంతరంగ చమత్కారముగాను నిర్మితమవటము గురించి చెప్పుకున్నాము. 'ఒక్కొక్కటి' మూడు మూడుగా అవటం గురించి కూడా మనము చెప్పుకొని ఉన్నాము. ఇంకేమీ తెలుసుకోవాలనుకుంటున్నావు?

## మరణము - త్రివృత్కరణము

**శ్వేతకేతు** : తండ్రీ! ఈ జీవుడు మరణించునప్పుడు ఏది ఏ తీరుగా అవుతోంది?

**ఉద్దాలకుడు** : సోమ్యా!

**పురుషస్య ప్రయతో వాక్ → మనసి సంపద్యతి** - ఈ జీవుడు దేహమును త్యజించినప్పుడు వాక్కు మనస్సునందు లయమౌతోంది.

**మనః → ప్రాణే।** – మనస్సు 'ప్రాణము'నందు లయము పొందుతోంది.

**ప్రాణః → తేజసి ।** – ప్రాణము తేజస్సునందు లయమౌతోంది.

**తేజః → పరస్యాం దేవతాయాం।** – తేజస్సు పరదేవత (పరస్వరూపము, పరమాత్మ) యందు లయము అవుతోంది।

అట్టి అణిమ (సూక్ష్మాతిసూక్ష్మము) అగు పరదేవతా స్వరూపమే పరబ్రహ్మ స్వరూపము. అదియే సత్యము (తదితరమైనదంతా కల్పనాచమత్కారము మాత్రమే)। అదియే ఆత్మ. **శ్వేతకేతో! తత్ త్వమ్ అసి।** అట్టి ఆత్మయే నీవై ఉన్నావు".

---

## 6-9. నవమ ఖండము - ఈ జీవుడు ఉపాధిగా భావన చేసినప్పటికి సత్స్వరూపుడే।

**శ్వేతకేతు** : తండ్రీ! ఈ జీవులంతా కూడా స్వతఃగానే (By one's own Self) – నిర్మలము, స్వాతంత్ర్యము, సర్వమునకు అతీతము, నిత్యము అగు 'సత్' స్వరూపులే అయి ఉన్నారు కదా! మరి మేము ఇంద్రియ విషయపరంపరల, 'దేహముల రాక–పోకల' ప్రహసనములలో చిక్కుకున్నాము। బద్ధులము! మోక్షము మాకు సుదూరంగా ఎప్పటికో, ఎన్నటికో, ఎంతో ప్రయత్నం చేసి పొందాలి – అని మాత్రమే అత్యధికులు తలచుచున్నారు – ఎందుచేత?

**ఉద్దాలకారుణి** : సోమ్యా! తేనెటీగలు (మధుకృతములు) తేనెపట్టునుండి బయలుదేరి, ఎకడెక్కడో ఏవేవో అనేక పుష్పములపై వ్రాలి, పుష్పములోని రసమును తెచ్చి తేనెపట్టులో నింపుతాయి. అట్టి తేనెలోని ఒక బిందువు (Drop of Honey)ని "ఏవమ్మా! తేనెచుక్కా! నీవు ఏ పుష్పమునకు చెందినదానవై ఉండగా తేనెటీగలచే పీల్చబడి ఇక్కడకు తేబడ్డావు?" అని అడిగితే ఆ తేనె బిందువు ఏమాత్రము చెప్పలేదు కదా! అట్లాగే సమస్త జీవులు సత్తులో లీనమైయుండి, సత్‌స్వరూపులే అయి ఉండి కూడా, "మేము సత్‌స్వరూపులమే। సత్‌యే మా స్వభావము" – అనేది గమనించలేకపోవుచున్నారు. **ఏవ ఖలు ఇమాః సర్వాః ప్రజాః 'సత్' సంపద్య, న విదుః సతి సంపద్యామ్ అహమ్ – ఇతి।**

ఈ జీవుడు "నేను సత్ (కేవలమగు ఉనికి) స్వరూపుడనే" అని అనుకోవటము లేదు. "నేను పులిని, సింహమును, తోడేలు. వరాహము (పంది)ని। కీటకమును, మానవుడను" – అని ఏదేది అనుకుంటే ఈ సత్తు (సంత్యసంకల్పుడు కాబట్టి) – ఆ రూపమే తానని (కలలో జరుగు తీరుగా) అనుకొనుచున్నారు. ఉన్న సత్యము ఏమిటంటే...,

పరమాత్మయే సమస్త జీవులలోని ప్రతి ఒక్కరి యొక్క సహజమగు సత్యస్వరూపము. అదియే 'ఆత్మ' అనబడుచున్నది. ఓ శ్వేతకేతూ! **తత్త్వమసి।** అట్టి ఆత్మయే నీవై ఉన్నావు.

## 6-10. దశమ ఖండము - నది సముద్ర ప్రవేశ దృష్టాంతము

**శ్వేతకేతు** : **భగవాన్! భూయ ఏవ మా విజ్ఞాపయతు।** తత్ ఆత్మ! తత్ త్వమసి అను పరమ సత్యమగు మహావాక్యము యొక్క మా స్వానుభవము కొరకై మరికొంత సవివరణ, దృష్టాంతముల పూర్వకంగా మరల వివరించ ప్రార్థన.

**ఉద్దాలకుడు :** 'సత్–తత్త్వమసి' గురించిన విశేషమును మరొక దృష్టాంతముతో చెప్పుచున్నాను. విను.

---

సముద్రములో యండ వేడిమికి నీరు ఆవిరి అయి మేఘములుగా కొండలపైన, కోనలపైన వర్షిస్తున్నది. ఆ జలము కొండలనుండి జాలువారి నదీ ప్రవాహములుగా అగుచున్నాయి. నదులలో కొన్ని తూర్పుదిక్కుగా ప్రవహిస్తున్నాయి. మరికొన్ని పశ్చిమ దిక్కుగా ప్రవహిస్తున్నాయి. "నదీనాం సాగరో గతిః" అను సూత్రముగా నదీ జలములన్నీ సముద్రజలమును చేరుచున్నాయి. సముద్రములో జేరిన తరువాత సమస్త నదీజలములు సముద్ర జలరూపమే అవుతాయి. అంతేగాని – జలబిందువులకు "నేను గంగానదీ జలమును. నేను సింధూనదీ జలము. నేను యమునా నదికి చెందిన జలమును" అన్న భేదముంటుందా?

మనము సముద్రములోని ఒక బిందెడు జలమును తీసుకొని "నీవు ఎప్పుడు ఆవిరి అయినావు? ఎప్పుడు వర్షించావు? ఏ నదిలో వర్షించావు? తూర్పు–పడమరలలో ఏ దిక్కు నుండి ప్రవహించి సముద్రములో కలిసావు?"....అని ప్రశ్నిస్తే ఆ బిందెలోని సముద్రజలము సమాధానము చెప్పగలదా? లేదు.

అదే విధంగా – **ఏవమేవ ఖలు, సోమ్యా! ఇమాః ప్రజాః 'సత' ఆగమ్య, న విదుః – సత్ ఆగచ్ఛామి అహమ్।** ఈ జీవులంతా 'సత్త' నుండి బయల్వెడలి సత్తులోనే పునఃఏకమగుచు, సత్‌స్వరూపులే అయి ఉండి కూడా తమ యొక్క సత్స్వరూపమును ఆస్వాదించటము లేదు. 'సత్‌భావన'ను కలలో లాగా ఏమరచి దేహభావమును ఆశ్రయించి "నేను పులిని। సింహమును। పందిని। కీటకమును। దోమను, మానవుడను। దేవతను" అను శరీర భావమును మాత్రమే కలిగి ఉంటున్నాడు.

ఏదైతే అణిమ (సూక్ష్మము) అయి ఉన్నదో – అత్మయే ఇదంతా। అదియే సత్యము। అదియే ఆత్మ। ఓ శ్వేతకేతూ! అట్టి ఆత్మ నీవే అయి ఉన్నావు। ఆత్మ నీవై ఉన్నది।

## 6-11. ఏకాదశ అధ్యాయము – వృక్షాభిమాన జీవ దృష్టాంతము

**ఉద్దాలకుడు** : ఇప్పుడు మనము వృక్షము – ఆ వృక్షమును తన శరీరముగా భావించు 'వృక్షాభిమానజీవుడు' గురించి చెప్పుకుందాము.

ఒక మహావృక్షము యొక్క (రావిచెట్టువంటిదాని యొక్క) మూలమును నరికామనుకో ఆ వృక్షము మరల చిగురిస్తుంది. రసము ద్రవిస్తూనే ఉంటుంది కాని చావదు. అట్లాగే కొమ్మలు నరకటం జరిగిందనుకో, అప్పుడు కూడా రసము ద్రవిస్తూ ఉండవచ్చు గాక. అంతే గాని, చావదు. చెట్టుయొక్క అగ్రభాగం కత్తిరించినా కూడా ఆ చెట్టు స్రవిస్తూ జీవిస్తూనే ఉంటుంది. కాని ఆ మహావృక్షము మొదలంట్లా పెరికి ప్రక్కకు పడేస్తేమాత్రం ఆ వృక్ష జీవుడు ఆ వృక్షమును త్యజించి వెళ్ళిపోతాడు. అందుచేత ఆ మహావృక్షము ఎండిపోతుంది.

- ఆ వృక్షముయొక్క ఒక శాఖ (Branch)ని ఖండిస్తే ఆ శాఖ ఎండిపోతుంది.
- రెండవ శాఖను ఖండించి ఆవల పారవేస్తే అది కూడా ఎండిపోతుంది.
- మూడవ శాఖను ఖండిస్తే – ఆ శాఖ ఎండిపోతుంది.
- మొత్తము వృక్షమును ఖండిస్తే మొత్తము మహావృక్షము ఎండిపోగలదు.

అట్లాగే

- ఈ జీవుడు దేహమును త్యజిస్తే అప్పటివరకు జీవిస్తూ ఉన్న శరీరము మాత్రమే మరణిస్తుంది.
- దేహి (లేక) జీవుడు మరణించడు.

అందుచేత ఎప్పుడైతే ఈ జీవుడు 'జీవితము ముగించబడితే నేను ముగుస్తాను (I will end with the Body) – అనే బుద్ధిని త్యజిస్తే అప్పుడు ఈ జీవుడు 'దేహి'గా (లేక) 'జీవుడు'గా నాకు శరీరముతో ప్రారంభ–ముగింపులు లేవు" – అని గ్రహించి అమృతత్వము సిద్ధించుకోగలడు.

కనుక ఓ చిరంజీవా! శ్వేతకేతూ! నీవు దేహముతో ప్రారంభమయ్యేవాడివి కావు, దేహము నశిస్తే నీవు నశించవు. (దేహే జాతే న జాతోసి। దేహే నష్టే న నశ్యసి – యోగవాసిష్ఠము). నీవు 'దేహి'గా 'నిర్దోషము, సర్వాతీతము సూక్ష్మాతిసూక్ష్మము' (అణిమ)" అగు **ఆత్మవే।**

ఓ శ్వేతకేతూ! తత్త్వమసి। ఏది కాలబద్ధము, దేహబద్ధము, దృశ్యబద్ధము, గుణబద్ధము కాదో – అట్టి తత్ స్వరూపుడవే అయి ఉన్నావు. **నీవు ఆత్మవే అయి ఉన్నావు.**

**శ్వేతకేతువు** : పితృదేవా! నేను ఇంకా కూడా నా సహజస్వరూపమగు 'ఆత్మ' గురించి మీవద్ద మరికొంత శ్రవణం చేయాలని అభిలషిస్తూ ఉన్నాను. అందుకని నా సంశయములు మీ ముందు ఉంచటానికి అనుజ్ఞ ఇవ్వండి.

# 6-12. ద్వాదశ ఖండము - నిర్విషయాకాశము (శూన్యము) నుండి సవిషయ జగత్తు

**శ్వేతకేతు** : "అదియే నేనై ఉన్నాను (సోఽహమ్)" అని మీరు సిద్ధాంతీకరించి చెప్పుచున్న ఆత్మతత్త్వ నిర్వచనమునకు కృతజ్ఞుడను. అయితే నాదొక సంశయము.

మాకు సుస్పష్టముగా ఘనీభూతమై అనుభవమగుచున్న ఈ దృశ్యజగత్తుకు ఉత్పత్తి స్థానము ఏది? ఎట్లు ఏర్పడినదై ఉంటోంది? ఎందులో ఇదంతా ఉన్నది?

**ఉద్దాలకుడు** : ఇదంతా ఆత్మయందే ఆత్మకు అనన్యమై వెలయుచున్నది. నీవు చూస్తున్నదంతా - నీవు నీ ఆత్మనే ఈ రీతిగా చూస్తున్నావు.

**శ్వేతకేతు : "నిర్విశేషమగు ఆత్మనుండి సవిశేషమగు ఈ జగత్తు ప్రదర్శనమౌతోంది"** - అనునది నాకు మరికొంత దృష్టాంత పూర్వకంగా దయచేసి చెప్పండి. 'శూన్యము' నుండి వస్తుజాలమంతా పుట్టుకొస్తోంది - అనునది ఎట్లా అర్థం చేసుకోవాలి?

**ఉద్దాలకుడు** : అవును. ఆత్మ శూన్యమే। అయితే, పూర్ణము కూడా! ఆ రెండు పరస్పర వ్యతిరేక శబ్దములు ఒకదానికొకటి యుక్తియుక్తమే అగుచున్నాయి కూడా! అట్లా అనేక దృష్టాంతాల సహాయముతో తత్త్వశాస్త్రము చెప్పుకొస్తూనే ఉన్నది.

- **ఒక నవలా రచయిత వ్రాసిన** నవలలోని పాత్రలు, సంఘటనలు మొదలైనవన్నీ రచయిత నుండి వచ్చినవే! రచయిత పాత్రలచే **'పూర్ణుడు'**.

  కానీ రచయితలో వెతికి చూస్తే - ఆ పాత్రలు లేవు. సంఘటనలు ఉండవు. కనుక, కథా విషయాల దృష్ట్యా 'శూన్యుడు' కూడా।

- **బంగారపు ఆభరణములో** ఆభరణముగా (లేక) ఆకారముగా కనిపించేదంతా బంగారమే। కనుక ఆభరణమంతా బంగారముచే **'పూర్ణము'**.

  కానీ బంగారమునకు 'ఇది' అనబడే ఆకారమేదీ ఉండదు. కనుక ఆకారము దృష్ట్యా బంగారము ఎల్లప్పుడు నిరాకరమే. కాబట్టి, **'శూన్యము'** (నిరాకారము).

- ఈ జీవుడు స్వతఃగా పరమాత్మ స్వరూపుడే కాబట్టి, **'పూర్ణుడే'** .

  కాని జీవుడు కాల - దేశ - సందర్భ పరిమితుడు. తనకు చెందినదేదీ వాస్తవానికి దృశ్యమునుండి / దృశ్యమునందు లేనివాడు కనుక, **శూన్యుడే।**

ఈ విధంగా ఈ జగత్తంతా కూడా ఆత్మకు అనన్యము కాబట్టి, ఆత్మ పూర్ణము! ఈ జగత్తు పూర్ణమే। ఎందుకంటే ఇది ఆత్మకు వేరు కాదు కాబట్టి.

కానీ, ఈ జగత్తు మనో కల్పన - స్వప్న సదృశము - స్వతఃగా లేనిది - స్వకీయ భావనను అనుసరించే అనుభవమగుచున్నట్టిది కాబట్టి - వ్యవహారరీత్యా కనబడుచున్నప్పటికీ - వాస్తవానికి శూన్యమే।

**శ్వేతకేతు : తండ్రీ! "పరమాత్మ పూర్ణుడు - శూన్యుడు కూడా। ఈ జగత్తు పూర్ణము - శూన్యము కూడా! ఈ జీవుడు పూర్ణుడు - శూన్యుడు కూడా! నేను పూర్ణుడను - శూన్యుడను కూడా"** - అని నాకు మీ నుండి వినబడే మహత్తర సిద్ధాంతము నాకు అంగీకారమే అగుచున్నప్పటికీ నేను ఇంకా నిస్సందేహుడను (One who is doubtless) అవలేకపోతున్నాను. ఏదైనా ప్రయోగాత్మకమైన విధానంగా (As a Practically shown methodology) నాకు బోధించండి.

**ఉద్దాలకుడు** : ఓం! అట్లాగా, ప్రయోగాత్మకంగా చెప్పాలా? సరేం! మంచిది. నీవు ఒక పని చేయి. చూడు! అక్కడ అంత దూరంగా మఱ్ఱివృక్షము (వటవృక్షము) కనిపిస్తోంది కదా!

**శ్వేతకేతు** : అవును తండ్రీ! అక్కడ పెద్ద మఱ్ఱివృక్షము ఉన్నది. ఉన్నమాట నిజమే కదా!

**ఉద్దాలకుడు** : అక్కడికి వెళ్లి ఒక మఱ్ఱి పండును పట్టుకురా. **న్యగ్రోధఫలం అత ఆహరేతి।** (వెంటనే శ్వేతకేతువు వెళ్లి ఒక మఱ్ఱి పండు (న్యగ్రోధ ఫలము) తెచ్చారు).

**శ్వేతకేతు : భగవ ఇతి।** భగవాన్। మీరు ఆజ్ఞాపించినట్లు ఈ మఱ్ఱిపండును తెచ్చాను. ఎదురుగా ఇక్కడ పెట్టుచున్నాను.

**ఉద్దాలకుడు** : మంచిది! ఇప్పుడు ఈ మఱ్ఱి పండును పైపెచ్చు చీల్చి తొలగించు. **భింధీతి।**

**శ్వేతకేతు** : సద్గురూ! మీరు చెప్పినట్లే చీల్చాను. **భిన్నం భగవ।**

**ఉద్దాలకుడు** : ఏమి కనిపించింది? **కిం అత్ర పశ్యసి?**

**శ్వేతకేతు** : **అణుః।** అణు ప్రమాణమైన చిన్న చిన్న బీజములు కనిపిస్తున్నాయి.

**ఉద్దాలకుడు** : సరే౹ ఆ అణు ప్రమాణగింజను కూడా పగలగొట్టు. **సామ్ అంగైకాం భిధీతి।**

**శ్వేతకేతు** : **భిన్నా భగవాన్ ఇతి।** అట్టి సూక్ష్మమైన గింజను కూడా పగలగొట్టాను.

**ఉద్దాలకుడు :** ఆ మఱ్ఱి పండులో కనిపించిన చిన్న గింజ (విత్తు)ను పగలగొట్టితే నీకు ఇంకా ఏమి కనిపించింది? **కిం అత్ర పశ్యసి ఇతి?**

**శ్వేతకేతు : న కించన, భగవ ఇతి।** ఈ మఱ్ఱివిత్తు గింజను పగలకొట్టి చూస్తే, అందులో నాకు ఏదీ కనిపించడం లేదు.

**ఉద్దాలకుడు : యం వై సోమ్య! ఏతమ్ అణిమానం న నిభాలయ** – బిడ్డా! శ్వేతకేతూ! చూచావా! ఆ మఱ్ఱిపండులోని చిన్న మఱ్ఱి విత్తు (సూక్ష్మగింజ)ను పగలగొట్టగా, **ఏషో అణిమ్న ఏవం** ఏమీ కనబడని శూన్యాకాశము నుండి – **మహాన్ న్యగ్రోధః తిష్ఠతి!** అనేక కొమ్మలు, ఆకులు, కాయలు, పూవులు మొదలైన వాటితో సువిశాలంగా విస్తరించియున్న వటవృక్షము (మఱ్ఱి వృక్షము) కాలానంతరము బయలుదేరుతోంది కదా!

**శ్రద్ధస్వ!** శ్రద్ధగా విను!

- కంటికి కనిపించని అత్యంత శూన్యమైన ఆకాశము (Space) చుట్టూ 'అంకురము' అనే శక్తి ఏర్పడుతోంది. అంకురము నుండి మఱ్ఱివిత్తు ఏర్పడినదై ఉన్నది.
- ఆ మఱ్ఱి విత్తు చుట్టూ మఱ్ఱి పండు విభాగము ఏర్పడి ఉన్నాయి.
- ఆ మఱ్ఱిపండు నేలలో మొలకగా, భూసారము స్వీకరించి, మరింతగా అంకురించి చిగురిస్తోంది.
- ఆ చిగురించిన మొలక మహావృక్షంగా విస్తరించి, పక్షుల నివాసముతోను, తొర్రలో పురుగుల నివాసములతోను ప్రదర్శనమై కనిపిస్తోంది. ఇదంతా శ్రద్ధగా గమనిస్తే నీకు ఏమి తెలుస్తోంది?

**శ్వేతకేతు** : బీజములోగల శూన్యమునుండి అనేక విశేష పరంపరలన్నీ బయల్వెడలి సంప్రదర్శనమగుచున్నాయి.

**ఉద్దాలకారుణి** : అవును. అతి సూక్ష్మమగు 'అణిమ' అగు 'శూన్యాకాశము' నుండి వృక్ష విశేషాలన్నీ బయల్వెడలుచున్నట్లే నిర్విశేషము నిరాకారము అగు చిదాకాశము నుండి ఈ సాకార "ఆకాశ – వాయు – అగ్ని – ఆపః – పృథ్వీ సంపుటీ ఉపసంపుటీకరణములు రూపుదిద్దుకుంటున్నాయి. సూర్య–చంద్ర–నక్షత్ర–గ్రహ–అసంఖ్యాక దేహి–దేహ పరంపరలన్నీ– బయల్వెడలి ప్రదర్శనమగుచున్నాయి. ఈ అంతరంగ (మనోబుద్ధి చిత్త అహంకార) – బహిరంగ (పాంచభౌతిక సృష్టి) విశేషాలు ఆ నీళ్ళలో బుడగలవలె ఆత్మయందే బయల్వెడలి, ఆత్మయందే సంచారములు చేస్తూ, ఆత్మయందే లయమైపోతున్నాయి. అంతేకాదు ఇదంతా సర్వదా ఆత్మకు అభిన్నమై ఉంటున్నాయి.

"ఆత్మనుండి ఆకాశము, ఆకాశము నుండి ఈ సమస్తము ఏర్పడుచున్నాయి" – అను వేదవాక్యము ఈ విధంగా సుస్పష్టమౌతోంది.

| | |
|---|---|
| **స య ఏషో అణిమాది ఆత్మ్యమిదమ్ పరమ్।** | – అట్టి సూక్ష్మమగు ఆత్మ చమత్కారమే ఈ సమస్తము కూడా! |
| **తత్ సత్యమ్।** | – అదియే (ఆత్మయే) సత్యము – తదితరమైనదంతా సందర్భ కల్పిత చమత్కారము మాత్రమే! |
| **స ఆత్మా తత్త్వమసి।** | – ఓ శ్వేతకేతూ! అట్టి ఆత్మ నీవే అయి ఉన్నావు. **"అహమ్ ఆత్మ"** అను భావనను ఆశ్రయించినవాడవై తత్ నిశ్చలత కొరకు అభ్యాసవంతుడవై ఉండుము. |

# 6-13. త్రయోదశ ఖండము - లవణ దృష్టాంతము - ఆత్మ ఎక్కడ ఉన్నది?

**శ్వేతకేతు** : తండ్రీ! గురువర్యా! అట్టి ఆత్మ మా స్వరూపమే అయి ఉండి కూడా, మేము జగత్తును తెలుసుకుంటున్నట్లుగా స్వస్వరూపమగు ఆత్మను ఎందుకు తెలుసుకొని ఉండలేకపోతున్నాము? ఎట్లా తెలుసుకొని ఉండాలి? ఈ విషయమై ఇంకా కూడా దయచేసి వివరించండి. ఇంకా ఏవైనా దృష్టాంతముల సహాయముతో బోధించండి.

**ఉద్దాలకారుణి** : తెలుసుకోబడుతూ ఉంటూ కూడా, ఒక్కొక్కటి తెలియబడనిదానివలెనే అనిపిస్తూ ఉంటుంది. 'ఆత్మ' కూడా జీవునిపట్ల తెలిసియున్నదే అయి ఉండి కూడా, 'తెలియబడనట్లే' ఉండే తీరు గురించి ఒక దృష్టాంతముతో చెప్పుకుందాము. సోమ్య! కుమారా! విను.

ఇప్పుడు నీవు వెళ్ళి ఉప్పురాళ్ళను (లవణము)ను తీసుకో - ఒక గాజుపాత్రలో జలము పోయి, ఆ జలములో ఆ ఉప్పురాళ్ళు వేయి. రేపు ఉదయం ఆ పాత్రను తీసుకొని నా దగ్గరకు రా.

శ్వేతకేతు ఆ విధంగానే కొన్ని ఉప్పురాళ్ళను ఒక పాత్రలోగల నీటిలోవేసి, ఆ మరునాడు ఆ పాత్రతో సహా తిరిగి తండ్రి వద్దకు వచ్చారు.

**ఉద్దాలకుడు** : బిడ్డా నిన్న నేను చెప్పినట్లు చేసావా?

**శ్వేతకేతు** : భగవాన్! మీరు చెప్పినట్లు కొన్ని ఉప్పుగడ్డలను రాత్రి నీటిలో వేసాను. ఇదిగో ఆ పాత్ర.

**ఉద్దాలకుడు** : సరేఁ! ఇప్పుడు నీవు ఒక చిన్న పని చేయి. నిన్న నీటిలో జార్చిన ఉప్పు గడ్డలను ఇటు పట్టుకురా. నా చేతిలో పెట్టు.

**శ్వేతకేతు** : (ఉప్పు గడ్డలు జార్చిన పాత్రలో చేతులతో వెతకి) - తండ్రీ! నిన్న చేతులతో ఈ నీళ్ళలో వేసిన ఆ ఉప్పుగడ్డలు చేతికి తగలటం లేదు. అవి రాత్రే ఈ నీళ్లలో కరిగిపోయి ఉంటాయి కదా! అందుచేత నిన్న నీళ్లలో జార్చిన ఉప్పుగడ్డలను తేలేను.

**ఉద్దాలకుడు** : అనగా నిన్నటి ఆ ఉప్పుగడ్డలు లేకుండా పోయినాయా? (లేక) నీటిలో ఎక్కడున్నాయి?

**శ్వేతకేతు** : అంతేకదా, తండ్రీ? కరిగిపోయినాయి కదా!

**ఉద్దాలకుడు** : అట్లాగా! అయితే ఈ జలము లోని పైభాగములో కొంచము జలము నోటిలో వేసుకొని చూడు. ఎట్లా ఉన్నాయో చెప్పు.

**శ్వేతకేతు** : అలాగే చేస్తున్నాను (కొంచము పై జలము నోట్లో పోసుకొని) - నోట్లో వేసిన నీరు ఉప్పగా ఉన్నది.

**ఉద్దాలకుడు** : పోనీ! మధ్యభాగంలోని నీటిని తీసుకొని రుచి చూచి చెప్పు.

**శ్వేతకేతు** : (ఆవిధంగానే చేసి) - ఈ నీరు కూడా ఉప్పగానే ఉన్నది.

**ఉద్దాలకుడు** : ఇక ఆ నీటిలో అడుగున ఉండే నీరు కొంచెము తీసుకొని రుచి చూడు.

**శ్వేతకేతు** : (అట్లాగే రుచి చూచి) ఈ నీరు కూడా ఉప్పగానే ఉన్నది.

**ఉద్దాలకుడు** : సరేఁ! ఈ నీరంతా పారపోసి చూడు. అప్పుడు నీవు రాత్రి నీటిలో విడచిన ఉప్పుగడ్డలు సాకారముగా లభిస్తాయేమో గమనించి నాకు చెప్పు.

**శ్వేతకేతు** : (నీరంతా బయట పారబోసి) తండ్రీ! నీరు మొత్తము పారబోసాను. కానీ నిన్న నీటిలో వేసియున్న ఉప్పుగడ్డలు నామరూపాత్మకంగా కనబడనే లేదు. అయినా ఎట్లా కనబడతాయి? నీటిలో ఉప్పుగడ్డలు కరిగిపోయాయి. అవి నీటిలో 'ఉప్పురుచి'గా మారాయి. నీరు పారబోసినప్పుడు ఉప్పుదనము కూడా నీటివెంటే పారబోయబడినట్లు అవుతుంది కదా.

**ఉద్దాలకారుణి** : సోమ్యా! శ్వేతకేతూ! నీటియందు ఏవిధంగా ఉప్పు గడ్డలను సాకారంగా చూడలేకపోయావో, కానీ నీవు వేసిన

ఉప్పుగడ్డలు నామరూపములు త్యజించి 'ఉప్పునీరు' గా అయినదో, ఆ నీటిలో నీవు ఉప్పుగడ్డలను చేతితోగాని – కళ్ళతోగాని గమనించలేకపోయావో, కానీ రుచి చూసి ఉప్పు గమనించేవో – అట్లాగే

- ❊ (ఉప్పునీటిలో అంతటా ఉప్పు ఉన్నట్లే) సద్రూపమగు 'బ్రహ్మము' నీవు అనుభవముగా పొందుచున్న జగద్దృశ్యమంతా వ్యాపించి ఉన్నది.
- ❊ (1) తేజస్సు (2) జలము (3) అన్నముల కార్యభూతమగు ఈ 'శరీరము' రూపంగా కారణరూప బ్రహ్మమే కనిపిస్తున్నది. పై మూడిటి కారణరూపమగు బ్రహ్మము (లేక) సత్తు సర్వత్రా వేంచేసియే ఉన్నది.
- ❊ అట్టి ఇంద్రియములకు విషయమై (ఉపలబ్ధముగా) పొందలేకపోతున్నావు.
- ❊ శాస్త్ర గురుప్రసాదితమగు వివేచన – విచక్షణలచే (నాలుక చేత నీటిలో ఉప్పు ఉన్నదని గ్రహించినట్లు) ఈ జగత్తులోని సర్వత్రా బ్రహ్మమును స్వవివేకము సహాయంతో (with your own Common Sense) తప్పక గమనించవచ్చును.

అట్టి 'అణిమ'యే బ్రహ్మము! ఈ సమస్తము కూడా అదియే! అదే సత్యము! అదియే **'ఆత్మ'। స ఆత్మా। తత్త్వమసి శ్వేతకేతో।** ఓ ప్రియ సోమ్యా! శ్వేతకేతూ! అట్టి ఆత్మ 'నీవు' అయి ఉన్నది. నీవు అట్టి ఆత్మవే అయి ఉన్నావు.

## 6-14. చతుర్దశ ఖండము - కళ్ళకు కట్టిన గంతలు విప్పి త్రోవ చూపితే స్వస్థలానికి వెళ్లటము

**శ్వేతకేతు** : ఆత్మగురించి తెలుసుకొని మరల ఆత్మభావన సిద్ధించుకోవటము గురించి ఇంకా కూడా మీవద్ద వినాలని ఉత్సుకత కొనసాగుతోంది. తండ్రీ! ఇంకా ఏదైనా మరొక దృష్టాంతము సహాయంతో ఆత్మను ఏమరచిన మేము ఆత్మభావనకు చేరటము గురించి చెప్పండి.

**ఉద్దాలకారుణి** : సరేఁ! నీవు అడిగిన విషయమై శాస్త్రములలో ప్రసిద్ధమైన – మరొక దృష్టాంతము ద్వారా చెపుతాను విను.

❋ ❋ ❋

గాంధార దేశములో ఒక ధనికుడు ఉండేవాడు. ఒకరోజు రాత్రి కొందరు దొంగలు ఆ ధనికుని (జమీందారు) ఇంట్లో దొంగతనంగా ప్రవేశించారు. దొరికిన ధనమంతా నిశ్శబ్దంగా మూటకట్టుకున్నారు. ఇక ఆ ఇల్లు విడచి వెళ్లబోతున్నారు. ఈలోగా జమీందారు తమను చూచాడేమోనని అనుమానం వచ్చింది. వెంటనే ఆ దొంగలు ఇట్లా తలచారు.

"అయ్యబాబోయ్! ఈ జమీందారు మన ముఖాలు చూచాడేమోరా? ఒకవేళ మనలను ఎక్కడన్నా గుర్తుపట్టి రాజభటులకు చూపిస్తే, మన పని అయిపోయినట్లే! అందుచేత ఈ జమీందారుని బందీగా చేసి తీసుకువెళ్లిపోదాము".

ఇట్లా తలచి ఆ దొంగలు జమీందారును నెమ్మదిగా మెలకువరాకుండా పట్టుకొని కళ్లకు గంతలు కట్టారు. కాళ్లు చేతులు తాడుతో కట్టి తమవెంట తీసుకొనిపోయారు. ఎక్కడో దూరంగా ఉండే అరణ్యంలో ఒకచోట వదలి, ధనము తీసుకొని తమ త్రోవ తాము వెళ్ళిపోయారు.

ఆ జమీందారుకు మెలకువ వచ్చింది. ఇక తాను బంధించిన చోటునుండి కేకలు వేయటం ప్రారంభించాడు!

"అయ్యా! ఎవ్వరైనా ఇక్కడ ఉన్నారా? ఎవరో నా కళ్ళకు గంతలు కట్టారు. రండి. నా ఈ కట్లు ఊడదీయండి! రక్షించండి!" అని అరవటం ప్రారంభించాడు.

అటుగా వెళ్లుచూ ఉన్న కొందరు బాటసారులు ఆ జమీందారు వేస్తున్న కేకలు విన్నారు. దగ్గరగా వెళ్లి చూచారు. కళ్ళకు గంతలు, చేతులకు, కాళ్లకు బంధనములు ఉండటము చూచారు.

"అయ్యో! పాపం! ఈతనిని ఎవరో త్రాళ్ళతో బంధించి కళ్ళకు గంతలు కట్టి ఇక్కడ పడవేసారు" అని గమనించి జాలిపడ్డారు. గబగబా ఆతని వద్దకు వెళ్లి

- గంతలు తొలగించారు. ఆతడు పరిసరాలు చూడగలగటం ప్రారంభించాడు. 'ఓహో! నేనిప్పుడు ఈ అడవిలో ఉన్నానా?" అని తెలుసుకొన్నాడు.
- కాళ్లకు త్రాళ్ళ ముడులు తొలగించారు. ఆతడి కాళ్లు కదల్చి నడువగలుగు స్థితికి వచ్చాడు.
- చేతుల త్రాళ్ళ – ముడులు తొలగించారు. ఆతని చేతులు కదల్చగలుగసాగాడు.

**జమీందారు** : ఓ బాటసారులారా! కళ్ళకు కట్టిన గంతలు, కట్టుత్రాడులు తొలగించినందుకు మీకు కృతజ్ఞుడను.

**బాటసారులు** : మిత్రమా! మీరు ఇక్కడ ఎందుకు బంధించబడ్డారు?

**జమీందారు** : ఎవరో దొంగలు మా ఇంటిలో ప్రవేశించి, దొంగతనము చేసి, ఆ తరువాత నా కళ్ళకు గంతలు, కాళ్లు, చేతులకు బంధనములు కట్టి తెచ్చి ఇక్కడ వదలి వెళ్లినట్లున్నారు. మెలకువ వచ్చేసరికి – ఇక్కడ ఉన్నాను.

**బాటసారులు** : సరేఁ! వెళ్లండి.

**జమీందారు** : ఓ బాటసారులారా! ఈ అరణ్యం ఎక్కడిదో, నేను ఎటు వెళ్లితే గాంధార దేశం చేరగలనో తెలియదు. దయచేసి దారి చెప్పండి.

**బాటసారులు** : ఇదిగో! ఈ తూర్పు వైపుగా గల బాటలో ప్రయాణించండి.

**ఏతాం దిశం వ్రజేతి। స గ్రామ గ్రామాత్ పృచ్ఛన్।**

అప్పుడు ఆ బాటసారులు చూపిన త్రోవలో నడవటం ప్రారంభించాడు. త్రోవలో కొన్ని గ్రామములు కనిపించసాగాయి. పండితుడు, మేధావి అయిన జమీందారు అక్కడి గ్రామవాసులను అడుగుచూ, వారు చెప్పుచున్న గుర్తులను వింటూ, జ్ఞాపకం పెట్టుకొంటూ, కొంత సమయంలో గాంధారదేశము ప్రవేశించాడు.

**"అమ్మయ్య! గండం గడిచిందిరా బాబూ!"** అని తలచి, తన ఇంటిలో ప్రవేశించాడు. ప్రశాంతుడైనాడు. సుఖవంతుడైనాడు.

ఓ శ్వేతకేతూ! **ఏవమేవహి ఆచార్యాన్ పురుషో వేద, తావదేవ చిరం యావత్ న విమోక్ష్యే, అథ సంపత్స్య – ఇతి।** ఆ బాటసారి లాగానే ఈ జీవుడు ఇంద్రియ దొంగలచే జ్ఞాన ధనము పోగొట్టుకొన్నాడు. ఆ దొంగలు అంతటితో వదలలేదు. 'అజ్ఞానము' అనే కామ–క్రోధ–లోభ–మోహ–మద–మాత్సర్య (అరిషట్) మృగములున్న కారడివికి తెచ్చి, కళ్ళకు (వివేకమునకు) గంతలుకట్టి, కాళ్లు–చేతులు సత్కార్యములు చేయకుండా కట్టివేసి వదలారు.

ఈ సంసారారణ్యములో ఈ జీవుడు తెలివి తక్కువవాడై ఏమిచేయాలో తోచక దుఃఖముతో కేకలు వేస్తున్నాడు. 'నేను ముక్తుడను కావాలి' అని ఆశయము పొందుచున్నాడు.

⌘ "నా పశువులు, నా గృహములు, నా మిత్రులు, నా సంతానము ఇవన్నీ నాకు జన్మజన్మల బంధమే అగుచున్నాయి కదా!" – అని గుర్తెరుగుచున్నాడు.

⌘ పుణ్యాతిశయంచేత సత్యము ఎరిగిన మహనీయులు ఆతనిని సమీపించి "అవి నీకు బంధములేమిటి? నీవు వాటికి సంబంధించినవాడివి కావు. అవి నీకు సంబంధించినవి కావు" – అను బోధచే కట్లు విప్పుచున్నారు. కళ్ళు తెరిపిస్తున్నారు.

⌘ అప్పుడు "నేను ఎవరు?" అనే ప్రశ్నకు వస్తున్నాడు. క్రమంగా శాస్త్ర వాక్యములు, గురుబోధలు శ్రవణం చేస్తున్నాడు. విజ్ఞులగు మహనీయులను సంప్రదించి తన సహజరూపమగు 'సత్తు'పై ఏర్పరచుకొన్న అనేక సందేహములను క్రమక్రమంగా తొలగించుకుంటున్నాడు.

⌘ మెల్లమెల్లగా దృశ్య విషయములపై ఏర్పడిన అనురక్తిని ఉపసంహరించుకొంటూ, **"వీటిపై, వీరిపై నేను ఆధారపడి ఉన్నాను. ఇవి, వీరు నాపై ఆధారపడి ఉన్నారు"** అను ప్రమేయత్వము తగ్గించుకొంటున్నాడు. మమకార–అహంకారములు సన్నగిల్ల చేసుకుంటున్నాడు.

⌘ ఉత్తమ కర్మలు, ఉపాసనలు, ధ్యానములు, యోగాభ్యాసములు ఆశ్రయిస్తున్నాడు.

⌘ తన స్వస్థానమగు 'సర్వాంతర్యామిత్వము' – "సర్వ తత్త్వ స్వరూపత్వము"లతో కూడిన **'ఆత్మమ్ ఏవ అహమ్'** అను స్వానుభవమును, **'తత్త్వమసి'** అను గురువాక్యమును సిద్ధించుకొనుచున్నాడు.

అట్టి సూక్ష్మమగు ఆత్మత్వమే **"సత్యము"**! ఓ శ్వేతకేతూ! అట్టి ఆత్మ నీవే అయి ఉన్నావు. 'నీవు'గా ఉన్నది ఆత్మయే అయి ఉన్నది.

## 6-15. పంచదశ ఖండము-మరణశయ్యపై పురుషుని దృష్టాంతము

**శ్వేతకేతు** : నాన్నగారూ! గురుదేవా! ఇంకా కూడా 'తత్త్వమ్' అను తత్త్వశాస్త్ర మహావాక్యము గురించి ఏదైనా మరొక దృష్టాంతముచే బోధ ప్రసాదించండి.

**ఉద్దాలకుడు :** మరొక దృష్టాంతం విను. ఒకడు మరణశయ్యపై మరణించటానికి సిద్ధమై ఉన్నాడు. చుట్టూ బంధువులు కూర్చుని ఉన్నారు. అక్కడి దగ్గిర బంధువులు "(నాన్నా! బాబాయి! మావయ్య! ఏమండీ! అంటూ) నన్ను గుర్తుపడుచున్నావా?"

**జానాసి మాం? జానాసి మాం? – ఇతి॥** నన్ను గుర్తు పడుచున్నావా?" అని అడుగుచూ ఉన్నారు. "ఆఁ! ఆఁ!" అని ఆతడు కళ్ళతో ముఖము యొక్క కించిత్ కదలికతోనో "గుర్తుపడుతున్నాను" – అని సంజ్ఞగా చెప్పుచూ ఉన్నాడు.

క్రమంగా ఆ మరణించువాని

వాక్కు → ఆలోచన (మనస్సు)నందు లీనమౌతోంది!

ఆలోచన (మనస్సు) → ప్రాణమునందు లీనమౌతోంది।

ప్రాణము → తేజస్సునందు లీనమౌతోంది

తేజస్సు → ఇహమును దాటి పరస్వరూపము (The Self beyond all else) నందు లీనమౌతోంది.

ఆ విధంగా లీనముకానంతవరకు మాత్రమే ఆతడు ఇహమును, ఇహములోని బంధువులను గుర్తుపడతాడు. ఆ తరువాత గుర్తుపట్టలేడు. ఈ విధంగా వాక్కు మనస్సునందు, మనస్సు ప్రాణమునందు, ప్రాణము తేజస్సునందు, తేజస్సు 'పరదేవత' (ఆత్మ) యందు లీనమవగా ఈ జీవునియొక్క ఏ నిజస్వరూపము శేషిస్తోందో – అట్టిది సూక్ష్మాతిసూక్ష్మము.

**స ఏషత అణిమ, ఏతద్యాత్మ్ ఇదగ్ం సర్వమ్।** అట్టి సూక్ష్మస్వరూపమునందే (నీటిలో ఉప్పు గడ్డలులాగా, తరంగము జలంలో లాగా) ఈ సమస్తానుభవములు, మనో చిత్త బుద్ధి అహంకారములు లీనమై ఉంటున్నాయి. ఎందులో లీనమౌతున్నాయో అట్టి నీ స్వరూపమే ఆత్మ। ఓ శ్వేతకేతూ! తత్త్వమసి। అదియే నీవు। నీవే ఆత్మవు। ఆత్మయే నీవు।

## 6-16. షోడశ ఖండము - సత్యనిష్ఠ - దృశ్యము యొక్క అస్పృశ్యత - ఆత్మ నమ్మకము

**శ్వేతకేతు** : మీ బోధలకు కృతజ్ఞుడను! ఇంకా కూడా దృష్టాంతపూర్వకంగా నిజస్వరూపమగు 'ఆత్మ' గురించి చెప్పవలసినదిగా అర్థిస్తున్నాను. వినటానికి ఉత్సాహపడుచున్నాను.

**ఉద్దాలకుడు** : ఇంకొక దృష్టాంతము విను. పూర్వకాలంలో ఒక న్యాయాధికారి దగ్గరకు ఇద్దరు పౌరులను తీసుకువచ్చారు.

**న్యాయాధికారి** : రక్షక భటులారా! వీరిద్దరి గురించి ఏమిటి అభియోగము?

**రక్షకభటులు** : న్యాయాధికారీ! ఈ మొదటివాడు ఆ రెండవ వాడినుండి కొన్ని రత్నములు దొంగిలించాడని ఆ రెండవ వాని అభియోగము. ఈతని వద్ద మాకు ఆ రత్నము కనబడినది. అందుకని న్యాయస్థానమునకు తీసుకువచ్చాము.

**న్యాయాధికారి** : ఓ మొదటి పురుషుడా? నీవు ఈ రత్నములు రెండవ పురుషుని నుండి దొంగిలించావా?

**మొదటి పురుషుడు** : హే! న్యాయాధినేతా! ఈ అభియోగము నిజము కాదు. నేను ఈ రత్నము దొంగిలించలేదు.

**రెండవ పురుషుడు** : న్యాయాధికారీ! ఆ రత్నము నాదే అయి ఉన్నది.

**న్యాయాధికారి** : మొదటి పురుషుడా! ఈ రత్నము రెండవ పురుషుడు తనకు చెందినదని ఈతడు అంటున్నాడు కదా! మరి నీ సమాధానమేమిటి?

**మొదటి పురుషుడు** : "ఈ రత్నము ఈ రెండవ పురుషునదే" అనేది నిజమే ప్రభు!

**న్యాయాధికారి** : ఆతనికి చెందినదేనన్నప్పుడు మరి అతడు అభియోగము చేస్తున్నట్లు నీవు దొంగతనము చేసినట్లే కదా మరి?

**మొదటి పురుషుడు** : కాదు అధికారీ! ఎందుకంటే నేను దొంగతనము చేయలేదు. ఆతనికి ధనము ఇచ్చి ఇది నేను ఖరీదు చేసాను. అతడు డబ్బు తీసుకొని కూడా, రక్షక భటులకు నాపై అభియోగము చేసాడు. నేను దీనిని ప్రమాణపూర్తిగా చెప్పుచున్నాను.

**న్యాయాధికారి** : ఏమయ్యా! రెండవ పురుషా! ఈ మొదటి పురుషుని వద్ద ధనము తీసుకొని నీవు అమ్మావని, తనది దొంగతనము కాదని చెప్పుచున్నాడు. మరి ఈతడు చెప్పేదానికి నీ సమాధానం?

**రెండవ పురుషుడు** : లేదు. నేను ఈతనికి అమ్మలేదు. నేను ధనము పుచ్చుకోలేదు. ఈతడు నావద్ద దొంగిలించిన మాట నిజము. నేను ప్రమాణపూర్తిగా చెప్పుచున్నాను.

**న్యాయాధికారి** : మీరిద్దరు ఒకడు తాను దొంగిలించలేదని (కొన్నానని), రెండవవాడు తాను అమ్మలేదని, అది దొంగతనమేనని ప్రమాణము చేసి చెప్పుచున్నారు.

మీరిద్దరిలో ఎవరో ఒకరు నిజము చెప్పుచున్నారు. రెండవవాడు అబద్ధము పలుకుచున్నారు. "అమ్మకమా? దొంగతనమా? అనటానికి మీ ఇద్దరి వద్ద ఏ సాక్ష్యము లేదు.

అందుచేత ఇందుకు నేను ఒక పరీక్ష పెడతాను. మనము అనుసరిస్తున్న ఒక 'ఆచారము'ను ఇప్పుడు నిర్వర్తించాలని నిర్ణయిస్తున్నాము.

ఓ రక్షకభటులారా! మీరు బొగ్గులతో అగ్నిని వెలిగించండి. ఒక పరశువు (గొడ్డలి)ని పట్టుకురండి. ఆ బొగ్గులలో బాగుగా కాల్చండి. ముందుగా ముద్దాయి అయిన మొదటి పురుషుడు ఆ ఎర్రగా కాలిన పరశువును (గొడ్డలిని) రెండు చేతులతో పట్టుగొనుగాక! ఈతడు 'కొన్నాను' అనేది నిజమైతే ఈతని చేతులు కాలవు. కాదూ, దొంగతనమే అయి ఉంటే ఈతని చేతులు కాలుతాయి. చేతులు కాలితే ఈతడు దొంగతనము చేసినట్లే కాబట్టి రత్నము రెండవ పురుషునికి ఇవ్వటము జరుగుతుంది. అంతేకాకుండా, ఈ మొదటివాడు పరిహారము చెల్లించవలసివస్తుంది. అందుకు సిద్ధమేకదా!

**మొదటి పురుషుడు** : సత్య ప్రమాణకంగా నేను ఈ రెండవ పురుషునివద్ద ధనము ఇచ్చి కొన్నానే గాని నాది దొంగతనము కాదు. అందుచేత "కాలుచున్న గొడ్డలిని రెండు చేతులతో పట్టుకోవటము" అను న్యాయనిర్ణయ విధానమునకు నేను సంసిద్ధుడను.

ఈ విధంగా మొదటి పురుషుడు నిజమే చెప్పుతూ ఉంటే ఆతని చేతులు కాలవు. ఒకవేళ ఆతను చెప్పేది అసత్యమైతే ఆతని చేతులు కాలగలవు. ఆతనికి న్యాయాధికారిచే శిక్ష నిర్ణయించబడుతుంది కూడా!

**ఏవడు సత్యమునందు నిష్ఠ కలిగిఉంటాడో, అట్టివాని ఆత్మనమ్మకము కారణంగా ఆ కాలుచున్న గొడ్డలి ఆతనిని ఏమీ చేయదు.**
అదేవిధంగా...

> **ఏ పురుషుడైతే సత్యమగు ఆత్మయందు నిష్ఠ, అవధానము కలిగి ఉంటాడో, అట్టివాడు ఈ ప్రాపంచక విషయములను స్పృశిస్తూ ఉండవలసి వస్తున్నా కూడా, ఆతనిని వేదన, కామ క్రోధ లోభములు మొదలైనవి తాకవు. ఇవేమీ ఆతనిని బాధించలేవు. ఆతడు బద్ధుడు కాడు.**

అట్లా కాకుండా, ఎవడు **'ఈ సమస్తము ఆత్మయే'** అను సత్యము నోటితో శాస్త్రీయంగా సంభాషించగలిగినప్పటికీ, వాస్తవమగు ఆత్మనిష్ఠ లేక, 'చ్యుతి లేని ఆత్మభావన' సుస్థీకరించకపోయి ఉంటే, ఈ దృశ్య విషయములు ఆతనిని బాధించగలవు. అంతే కాకుండా అనేక భ్రమాత్మకమగు అజ్ఞాన జన్మ పరంపరలోనికి ఆతడు త్రోసివేయబడగలడు.

సత్యము పట్ల (ఆత్మయొక్క సమస్తత్వము పట్ల) నమ్మిక కలిగియున్నవాడు ఈ జన్మ కర్మల రూపమగు జగద్విషయములచే సంతప్తుడు (తాపములు పొందువాడు) అవనే అవడు.

ఓ శ్వేతకేతూ!

> **ఇదంతా కూడా ఏతత్‌రూపమే।**
> **ఇదంతా కూడా తత్‌రూపమగు సత్యమే।**
> **సమస్తము బ్రహ్మమే। సత్యమగు ఆత్మయే ఇదంతా।**
> **అట్టి ఆత్మయే నీవై ఉన్నావు. ఆత్మయే సర్వదా 'నీవు'గా అగుపిస్తోంది.**

**ఇతి ఛాందోగ్యోపనిషత్**
**6వ అధ్యాయము సంపూర్ణము**
**ఓం తత్‌సత్**

# ఛాందోగ్యోపనిషత్
# సప్తమ అధ్యాయము
## 7-1. ప్రథమ ఖండము-శ్రీ నారద - సనత్కుమార సంవాదము

లోకంలో అనేక విద్యలు ఉన్నాయి. అవన్నీ ఆశ్రయించటంచేత ఈ జీవునికి పేరు – ప్రతిష్ఠలు, ధనము తదితరులపై ఆధిపత్యము, ఆయురారోగ్య ఐశ్వర్యములు ప్రసాదించగలవు. ఈ జీవుని ఉన్నతస్థితికి జేర్చగలవు. అయితే, ఈ జీవునియొక్క మూలశోకకారణములు (Root causes of Inner Worries) మొదలంట్లా తొలగించగలిగినది మాత్రము 'ఆత్మవిద్య' ఒక్కటే. మిగతావన్నీ అందుకు పనికివచ్చేవి కావు. **"ఆత్మవిద్య"** అనగా? అది జగత్తులోని విశేషములకు సంబంధించినది కాదు. అపరావిద్య కాదు, మరి? ఆ విద్యను అభ్యాసించు వానియొక్క – **"ఈవల"** (ఇహ జగత్‌లోని), **"ఆవల"** (జగత్తుకు పరమైయున్న) స్వరూపముల సమన్వయ – ఏకత్వములు బోధించే విద్య, ఆ అధ్యయనుడు తనయొక్క పూర్ణత్వము గురించి తెలుసుకోగల విద్య! పరమాత్మము సంతరించుకొని ఉండగల నేర్పరితనము ప్రసాదించు విద్య. అదియే **'బ్రహ్మవిద్య' భూమా విద్య**. "తనలో లోకములను – లోకములలో తనను" – సమగ్రంగా తెలుసుకొని ఏకత్వము సిద్ధింపజేయు విద్యయే ఆత్మ విద్య (భూమా విద్య). ఎవ్వడు ఎక్కడ ఎంతకాలము ఎన్ని విద్యలు నేర్చినప్పటికి, ఎప్పటికైనా 'ఆత్మవిద్య' నేర్చుకోనంత కాలము ఈ జీవునికి శాంతి ఉండదు.

బ్రహ్మమానస పుత్రుడగు శ్రీ నారదమహర్షి ఒక సందర్భములో బ్రహ్మవిద్యారేణ్యులగు శ్రీ సనత్కుమారుని ఆశ్రమమునకు వచ్చి హృదయపూర్వక నమస్కారము సమర్పించారు.

**శ్రీ నారదమహర్షి** : గురుదేవా! సనత్కుమార భగవాన్! పరమేశ్వరా! బ్రహ్మవిద్యా ప్రావీణ్యా! ఆత్మతత్త్వవేత్తా! నమో నమః। నమో నమః। నమో నమః।

**శ్రీ సనత్కుమారుడు** : ఆత్మానంద స్వరూపా! లోకశుభకరా! బహువిద్యాప్రావీణ్యా! నారదా! సుస్వాగతము. అంతా క్షేమమే కదా! ఏమిటి ఇటువచ్చారు?

**శ్రీ నారదమహర్షి** : గురువర్యా! అంతాక్షేమమే. **హ ఉపససాద।** తమ వద్ద 'ఉపదేశము' పొందటానికై శరణు వేడుతూ వచ్చాను.

**శ్రీ సనత్కుమారుడు** : ఉపదేశమా? మీరు అనేక విద్యలు నేర్చినవారు గదా! దేనిగురించి నేను ఉపదేశించాలి?

**శ్రీ నారదమహర్షి** : అవును. అనేక విద్యలు నేను సుదీర్ఘకాలం అధ్యయనము చేసాను.

**శ్రీ సనత్కుమారుడు** : అనేక విద్యలలో మీరు ప్రావీణ్యులైనారు కదా! ఏ విద్య కొరకై నావద్దకు వచ్చారు?

**శ్రీ నారదమహర్షి** : **సోఽహం భగవో! మంత్రవిదేవాస్మి। న ఆత్మవిత్।** అనేక విద్యలు నేను నేర్చిన మాట నిజమేగాని, వాటన్నిటి చేత **'మంత్రవేత్త'**ను మాత్రమే అయ్యాను. **'ఆత్మవేత్త'**ను కాలేదని నాకు అనిపిస్తోంది.

ఈ విషయం ఆలోచించాను. 'మీరే దిక్కు' అని గ్రహించాను. ఆత్మవేత్తను అవటానికై ఉపదేశము కొరకు మిమ్ములను ఆశ్రయిస్తున్నాను.

**శ్రీ సనత్కుమారుడు** : మంచిదే! అయితే ముందుగా మీరు ఏ ఏ విద్యలు నేర్చి ఉన్నారో చెప్పండి. ఆ తరువాత మనము 'ఆత్మవిద్య' గురించి ప్రస్తావించుకుందాము.

**శ్రీ నారదమహర్షి** : గురువర్యా! మీరు ఆజ్ఞాపిస్తున్నట్లే నేను ఇప్పటివరకు నేర్చిన విద్యలు ఏమేమిటో ప్రస్తావిస్తాను. దయతో వినండి.

- ఋక్కులు ప్రాధాన్యమైనట్టి భగవంతుని గురించి స్తోత్రమంత్రములతో కూడిన **'ఋగ్వేదము'.**
- యజ్ఞ యాగాది యజస్సుల ప్రాధాన్యమైన **'యజుర్వేదము'.**
- సామగానముల ప్రాధాన్యమైనట్టి **'సామవేదము'.**

- శారీరక మానసిక ప్రాకృతిక విశేషముల ప్రాధాన్యమగు **'అథర్వణవేదము'**
- "పంచమ వేదము" అని ప్రసద్ధికెక్కియున్న

  **– ఇతిహాసములు** (– ఇతి – హ – ఆసీత్ = ఇతిహాసము. "ఇట్లు జరిగినది" అని పూర్వరాజుల చరిత్రలు చెప్పునది. ఉదా॥ భారతము మొ॥వి)

  **– పురాణములు** : నేర్చుకోవలసిన విషయములు గల ఇతఃపూర్వపు సంఘటనలు. పురాతన చరిత్రలు. సమస్తమునకు మునుముందే ఉన్న తత్త్వము గురించిన దృష్టాంతపూర్వక చారిత్రాత్మకములు.
- **వేదనాం వేదాః** : వేదములకే వేదములు వంటి వ్యాకరణము (పదముల సంధుల సమన్వయములు), నిఘంటువు.
- **పిత్ర్యాగములు** : శ్రాద్ధకల్పము. పితృదేవతా ఉపాసనలు. ఈ శరీరము నిర్మించి, ప్రసాదించి, సంరక్షిస్తున్న ప్రకృతిలోని దివ్యప్రజ్ఞల ఉపాసనలు.
- **రాశి** : గణితశాస్త్రము (Mathematics), సాంఖ్యము.
- **దైవము** : దేవతా విద్య. ఈ ప్రకృతిని నిర్మించి పరిపోషిస్తున్న దివ్యశక్తుల, దేవతా ప్రజ్ఞల ఉపాసన, సమస్తము ప్రసాదిస్తున్న దేవతకు భక్తిసమర్పణలు.
- ధూమకేతుల ఉత్పాతములను చెప్పే శాస్త్రము.
- నిధి శాస్త్రము
- కాల మహాకాల సిద్ధాంతములను చెప్పు శాస్త్రము.
- **వాకోవాక్య విద్య** (తర్కశాస్త్రము - Logic)
- **ఏకాయనము** (నీతిశాస్త్రము)
- **దేవవిద్య** (నిరుక్తము, పదముల అవయవార్థముల వివరణ, అర్థనిర్వచనములు వివరించు శాస్త్రము)
- **బ్రహ్మ విద్య** : ఋక్ సామ యజుర్వేద మంత్రముల అర్థ తాత్పర్యములు చెప్పు విద్య
- **శిక్షా** : విద్యాభ్యాస విధానము బోధించటము.
- **కల్పము** : న్యాయశాస్త్రము – సృష్టిప్రళయముల గురించి చెప్పినది. నిశ్చయ – నిబంధనలు చెప్పునది.
- **ఛందస్సు** : పద్యలక్షణములు చెప్పు శాస్త్రము.
- **భూత విద్య** – పంచభూతముల తత్త్వము, వశము చేసుకోవటము మొదలైన విశేషములు గల విద్య
- **క్షత్ర విద్య** – ధనుర్వేదము (శస్త్రాస్త్ర విద్యలు)
- **నక్షత్ర విద్య** – నక్షత్ర మండలముల గురించి చెప్పు శాస్త్రము
- **జ్యోతిషము** – గ్రహములు, ఉపగ్రహములు, సూర్యమండలముల కదలికలు, ఉత్పాతములు, నిరోధములు, ఉపశమనముల గురించి చెప్పు శాస్త్రము.
- **సర్వదేవ జనవిద్య** – ఆదిశేషుడు మొదలైన సర్వదేవతలను కొలచుచూ, ఆయా శక్తులను పొందు విద్య.
- **గారుడ (గారిడీ) విద్య** – మాయావిద్య (Art of Magic).
- **సర్ప విద్య** – సర్పజాతులు, విషప్రభావములు, విషమును ఔషధముగా ఉపయోగించటము మొదలైనవి చెప్పు 'విద్య'.
- **ఆయుర్విద్య** – వైద్య విద్య.
- **చతుః షష్టి (64) కళలు** – సంగీత విద్య, నృత్య విద్య, వాయిద్య విద్యలు, శిల్ప విద్య మొదలైనవి.

ఈ విధంగా నేను అనేక విద్యలు అధ్యయనం చేసాను. ఇవన్నీ చదివి కర్తవేత్తను మంత్రవేత్తను అయ్యానేగాని, ఆత్మవేత్తను కాలేకపోయాను. శబ్దార్థజ్ఞానం సంపాదించినవాడనయ్యాను. అంతమాత్రమే! అంతేగాని 'రాజవిద్య'గా చెప్పబడు స్వస్వరూప విద్య నేను ఇంకా సిద్ధించుకోలేదు – అని అనుకుంటున్నాను.

**శ్రుతగ్ం హి ఏవ మే భగవద్దృశేభ్యః తరతి శోకమ్ ఆత్మవిత్"।** తమవంటి మహనీయులచే "ఆత్మవేత్త మాత్రమే శోకము జయించగలడు" – అని సిద్ధాంతీకరించబడుతోంది. **సోऽహం భగవన్ శోచామి।** భగవన్! ఈ విషయమై ఎంతో ఆలోచించి తమను ఆశ్రయించవచ్చాను.

## 'నామ' బ్రహ్మోపాసన

**సనత్కుమారుడు** : **యద్వై కించిత్ ఏతత్ అధ్యగీష్ఠా 'నామ' ఏవ ఏతత్।** మీరు చెప్పిన విద్యలన్నీ (The big list of learnings) – అన్నీ కూడా 'నామము' పై ఆధారపడి ఉన్నవి. వికారమంతా 'నామము'పై ఆధారపడి ఉంటోంది కాబట్టి 'నామమాత్రవిద్యలు' అని తత్త్వజ్ఞుల అభిప్రాయము. పేరుకు విద్యలేగాని అసలైన విద్యకాదు.

ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము, ఐదవ వేదమగు ఇతిహాస పురాణములు, వ్యాకరణము, శ్రాద్ధకల్పము, గణితము, సిద్ధాన్త శాస్త్రము, నీతి శాస్త్రము, తర్క శాస్త్రము, నిరుక్త శాస్త్రము (పదముల అవయవార్థ వివరణలు), శిక్ష, కల్పము, భూత తంత్ర – మంత్రములు, ధనుర్వేదము, జ్యోతిషము, క్షత్రవిద్య, నక్షత్రవిద్య, సర్పవిద్య, సర్వదేవవిద్య, సంగీత నృత్య శిల్పాది కళలు – ఇవన్నీ బ్రహ్మము యొక్క నామములే. అయితే ఈ నామ విద్యలతో బ్రహ్మమును తప్పక ఉపాసించవచ్చు.

ఎవ్వరైతే ఇవన్నీ 'నామవిద్య'గా భావించి వాటి సహాయముతో 'బ్రహ్మము'ను ఉపాసిస్తాడో, అట్టివాడు నామము యొక్క గతి (Extension of Nomenlature) (లేక) నామము యొక్క వ్యాప్తి ఉన్నంతవరకు 'వ్యాప్తి' కలవాడై ఆత్మ యొక్క పూర్ణఫలమును తప్పక పొందగలడు.

"నామాత్మకమైనదంతా బ్రహ్మమే" అను ఉపాసనచే బ్రహ్మమే పొందబడగలదు. **నామ్నో భూయ ఇతి।**

## 7-2. ద్వితీయ ఖండము – 'వాక్' బ్రహ్మోపాసన

**శ్రీ నారదుడు** : గురువర్యా! సనత్కుమారా! బ్రహ్మము గురించిన ఉపాసనలో 'నామము' కంటే ఉత్తమమైనది ఏదైనా ఉన్నదా?

**సనత్కుమారుడు** : ఉన్నది. నామము కంటే **'వాక్కు'** గొప్పది. ఒక 'నామము' (పేరు) చెప్పాలంటే వాక్కు (Speaking) ఉండాలి కదా! వాక్కుచేతనే ఋగ్వేదము విజ్ఞాపితము (బోధించటము) జరుగగలదు. 4 వేదములు, ఇతిహాసపురాణములు, వ్యాకరణ, శ్రాద్ధ, కల్ప, గణిత, దైవజ్ఞ, నిధి, తర్క, నీతి, నిరుక్తి, కల్ప, శిక్షా భూతతంత్ర, ధనుర్వేద, జ్యోతిష, గారుడ, దేవజన అనే విద్యలు; ద్యులోక, భూలోక, పంచభూత దేవతల, మానవ, పశుపక్ష్య, తృణ వనస్పతి, కీటక ధర్మాధర్మ, సత్యాసత్య ప్రియ – అప్రియ...మొదలుగా గల సమస్త విశేషములు – ఇవన్నీ 'వాక్కు' చేతనే తెలియజేయబడుచున్నాయి.

అందుచేత నారదా! మీరు 'వాక్కు'ను బ్రహ్మముగా ఉపాసించండి. అట్టి వాక్ బ్రహ్మోపాసకుడు వాక్కు విస్తరించి ఉన్నంతవరకు స్వేచ్ఛగా విహరించగలడు. ఆతనికి 'వాక్‌బంధనము' అనేది ఉండదు. **వాచో భూయ ఇతి।**

## 7-3. తృతీయ ఖండము – 'మనః' బ్రహ్మోపాసన

**శ్రీ నారదుడు** : భగవాన్! సనత్కుమారా! ఆత్మోపాసనకై వాక్కుకంటే కూడా గొప్పదైన వస్తువేదైనా ఉన్నదా?

**శ్రీ సనత్కుమారుడు** : ఉన్నది. **మనో వావ వాచో భూయో!** వాక్కు కంటే మనస్సు మరింత అధికమైన ఉపాసన వస్తువు. ఒకడు తన పిడికిలి (గుప్పిట / ముష్టి)లో రెండు ఉసిరికాయలు (ఆమలకములు), (లేదా) రెండు రేగుపండ్లు, (లేదా) రెండు కరక్కాయలు (అక్షములు) ఉంచుకొనుతీరుగా మనస్సే (1) వాక్కు (2) నామములను తనయొక్క గుప్పిటలో ఉంచుకొని వ్యవహరిస్తోంది. అనగా నామము, వాక్కు మనస్సు యొక్క వ్యావహారిక – అంతర్భాగములుగా ఉంటున్నాయి.

(మననయేవ మంత్రః) ఒకడు మనస్సులో **"నేను ఇప్పుడు మంత్రమును పఠిస్తాను. మననం చేస్తాను"** అని మనస్సుతో కోరుకొన్నప్పుడే మంత్రమును ఆతడు ఉచ్చరిస్తాడు. 'కర్మలను నిర్వర్తించాలి' అని మనస్సుతో అనుకుంటేనే కర్మలు నిర్వర్తిస్తాడు. 'నా సంతానము, నా పశుసంపద నేను పొంది ఉండాలి' అని మనస్సుతో అనుకున్న తరువాతయే అవన్నీ విలువైన వస్తువులుగా పొందబడుచున్నాయి.

(మనో యః కరోతి, తత్ కృతం భవతి। మనో య న కరోతి తత్ న కృతం భవతి। అతో మననయేవ కర్తృః। న దేహః – యోగ వాసిష్ఠము).

మనస్సుతో ఏది చేస్తే అదియే 'చేయబడినది' అవుతుంది. మనస్సుతో చేయనిది 'చేయబడనిది'యే అవుతుంది. అంతేగాని, దేహానికి స్వకీయమైన కర్తృత్వము లేదు. ఇహలోక–పరలోకములందు మనస్సు ఏది కోరుకుంటే అదియే ఆ జీవుడు పొందటము జరుగుతోంది. కాబట్టి...

**మనస్సే ఆత్మ। మనస్సే లోకము। మనస్సే బ్రహ్మము।**

అందుచేత ప్రియ నారద మహర్షి! మీరు అట్టి 'మనస్సు'ను 'బ్రహ్మమే' – అని ఉపాసించండి. ఎవ్వడైతే మనస్సును బ్రహ్మముగా ఉపాసిస్తాడో – అట్టివాడు ఎంతవరకైతే మనస్సు విస్తరించి (వ్యాపించి) ఉంటుందో, అంతవరకు యథేచ్ఛగా విహరించగలడు. ఆతనికి మనస్సు వలన బంధము ఉండదు! **మనసో భూయ ఇతి। మనస్సును బ్రహ్మముగా ఉపాసించువానికి మనోబంధము ఉండదు.**

## 7-4. చతుర్థ ఖండము – 'సంకల్పో' బ్రహ్మేతి ఉపాసన

**శ్రీ నారద మహర్షి** : గురుదేవా! భగవాన్! మనస్సు కంటే కూడా ఇంకా ఏదైనా ఉపాసనా వస్తువు ఉన్నదా?

**శ్రీ సనత్కుమారుడు** : అవును. ఉన్నది. మనస్సు కన్నా కూడా 'సంకల్పము' (Assumption and Presumption) అనబడేది గొప్ప ఉపాసన వస్తువు. మానవుడు ముందుగా సంకల్పించి, ఆ తరువాత మనస్సును నియమించుచున్నాడు. అప్పుడు ఆ మనస్సు వాక్కును ప్రేరేపిస్తోంది. వాక్కు నామమును పలికింపజేస్తోంది. నామము మంత్రములతోను, మంత్రము కర్మలతోను చేరి ఉంటోంది.

- మనస్సు మొదలైనవాటికన్నిటికీ సంకల్పమే ఆధారము.
- నామము, వాక్కు మొదలైనవన్నీ మనస్సునందు సంకల్పము చేతనే ఉనికిని పొందుచున్నాయి.
- స్వర్గలోకము, భూలోకము, వాయువు, ఆకాశము, తేజస్సు, అన్నము, ప్రాణము, మంత్రము మొదలైనవన్నీ కూడా 'సంకల్పము' వలననే కలుగుచున్నాయి.
- **సంకల్పము వల్లనే కర్మ – కర్మఫలములు ఉనికిని పొందగలుగుచున్నాయి. సంకల్పించకపోతే అవి లేనివే అవుతాయి.**

ఓ నారదమహర్షీ! ఈ సమస్త సృష్టి కూడా సంకల్పముచే నిర్మించబడి, సంకల్పమయమే అయి ఉన్నది. "దృష్టియే సృష్టి" అన్నప్పుడు సంకల్పమునే 'దృష్టి' – అని అంటున్నాము. అందుచేత 'సంకల్పము'నే బ్రహ్మముగా ఉపాసించండి.

ఎవ్వడైతే 'సంకల్పము' అనుదానిని పరబ్రహ్మస్వరూపముగా ఉపాసిస్తాడో, అట్టివాడు

- ధృవలోకములందు ధృవముగా ఉండగలడు (స్వాతంత్రుడు కాగలడు).
- ప్రతిష్ఠితమైన లోకములలో ప్రతిష్ఠితుడై ఉండగలడు (ఉన్నచోటే ఆత్మగా ప్రకాశించగలడు).
- దుఃఖములు (worries) లోకములలో ప్రవేశించినా కూడా దుఃఖరహితుడు కాగలడు.

ఎంతవరకైతే సంకల్పము వ్యాపించి ఉంటుందో అంతవరకు (సంకల్పమును బ్రహ్మముగా ఉపాసించునట్టి) ఆతడు స్వేచ్ఛగా సంచారములు చేయగలడు. (He can be free and Independent). **యావత్ సంకల్పస్య గతం, తత్ర అస్య యథా కామచారో భవతి – యః సంకల్పం బ్రహ్మేతి ఉపాస్తే।**

కనుక నారదా! 'సంకల్పము'ను బ్రహ్మముగా ఉపాసిస్తూ ఉండండి.

# 7-5. పంచమ ఖండము - "చిత్తం బ్రహ్మ" ఇతి ఉపాసన
## (చిత్తము-ఇష్టము-అభిరుచి)

**శ్రీ నారద మహర్షి** : బ్రహ్మన్! ఆత్మోపాసన గురించినదై 'సంకల్పము' కంటే గొప్పదైన ఉపాసన మరింకేదైనా ఉన్నదా?

**శ్రీ సనత్కుమారుడు** : చిత్తమును బ్రహ్మముగా ఉపాసించటము సంకల్పబ్రహ్మోపాసన కన్నా గొప్పదై ఉన్నది. ఈ జీవుడు 'ఇష్టము' రూపముచే చేతనవంతుడు అయి ఉన్నప్పుడే సంకల్పము చేయుచున్నాడు. చిత్తముచేతనే ఏదైనా కోరుకొనుచున్నాడు. చిత్తము చేతనే వాక్ ఇంద్రియము ప్రేరణ (Inspiration) పొందుతోంది. అప్పుడు వాక్కు నామమును పలుకుచున్నది. నామము మంత్రముతో ఏకమగుచున్నది. మంత్రము (మననము) కర్మలతో ఏకత్వము పొందుతోంది.

చిత్తము చేతనయిత్వమై కాలముతో ఏకత్వము (Inspiration getting related to contexts) పొందుతోంది. సంకల్పము మొదలైనవన్నీ చిత్తములోనే ప్రతిష్ఠితమౌతున్నాయి. (చిత్తము = Factor of Attention). ఒకానొకడు అనేక విషయములు తెలిసియున్నవాడు అయినప్పటికీ కూడా, ఆతడు మనము చెప్పే విషయము పట్ల చిత్తుడు (Paying Attention) కాకుండా అచిత్తుడు (Not Paying Attention) అయి ఉంటే ఆతని గురించి మనము "ఈతడు కొంచెము తెలిసియున్నాకూడా మనము చెప్పేదంతా వినేవాడే। కానీ ఏం లాభం? మనము చెప్పేదానిపట్ల చిత్తము లేనివాడై (అచిత్తుడై) ఉంటున్నాడు" - అని అతని గురించి మనము వ్యాఖ్యానించుకుంటాము. చిత్తము ఉన్నవానికే ఏదైనా చెప్పగలము.

ఎవ్వడైనా అల్పజ్ఞుడు (Poorly knowing) అయినప్పటికీ ఆతడు చిత్తము కలిగి ఉంటే ఆతనికి మనము చెప్పగలుగుతాము. అందుచేత..

❋ చిత్తమే ఆత్మ. ❋ చిత్తమే అన్నిటికీ మూలము.

ఎవ్వడైతే చిత్తము (Interested involvement)ను పరబ్రహ్మస్వరూపముగా ఉపాసిస్తాడో, అట్టివాడు దృఢమైన చిత్తము పొందగలడు. చిత్త-చాంచల్యమును జయించగలుగుతాడు.

**చిత్తమును పరమాత్మగా ఉపాసించువాడు సర్వత్రా ఆత్మను దర్శించుచు**
**వ్యథలేని లోకములలో ప్రవేశించి వ్యథలేనివాడు కాగలుగుచున్నాడు.**

అట్టివాడు చిత్తము విస్తరించియున్నంత వరకు స్వేచ్ఛా గతిని ప్రాప్తించుకోగలడు.

అందుచేత 'చిత్తము'ను మీరు బ్రహ్మముగా ఉపాసించండి.

# 7-6. షష్ఠ ఖండము - 'ధ్యానం' బ్రహ్మేతి ఉపాసన
## ధ్యానము యొక్క మహతత్త్వము

**శ్రీ నారదుడు** : మహనీయా! చిత్తము కంటే కూడా అధికంగా ఉత్తమమైన ఆత్మభావనోపాసన మరొకటేదైనా ఉన్నదా?

**శ్రీ సనత్కుమారుడు** : 'చిత్తము' కంటే ధ్యానము శ్రేష్ఠమైనది. **ధ్యానం వావ చిత్తాత్ భూయో।**

"ఈ భూమి (పృథివి), ఆకాశము (అంతరిక్షము), ద్యులోకము (స్వర్గలోకము), నీరు, కొండలు, దేవతలు, మానవులు"

ఇవన్నీ ధ్యాన స్వరూపములే. అవన్నీ ధ్యానము చేస్తున్నవిగానే కనబడుచున్నాయి కూడా. ఎవ్వరైనా ఎక్కడైనా ఒకానొక మహతత్త్వము (Something great, something special) - పొందుచున్నారంటే దానికి కారణము ధ్యానమే। ధ్యానసిద్ధి వలననే వారు ఆ ఔన్నత్యము పొందుచున్నారు సుమా! ఎవరు ధ్యానమును ఆశ్రయించుచూ ఉండరో అట్టివారు అల్ప విషయములను పట్టుకు వ్రేలాడువారు (క్షుద్రులు) గాను, పోట్లాడటం స్వభావంగా కలవారు (కలహప్రియులు) గాను, త్యాగబుద్ధి లేనివారు (పిసినారులు)గాను, వెనక-ముందు చూడకుండా ఇతరులను దూషించువారుగాను, ఇతరుల తప్పుల గురించి అధికంగా సంభాషించువారుగాను అగుచున్నారు.

**అథ యే అల్పాః, కలహినః, పిశునా, ఉపవాదినస్తే। ధ్యాన అపాదాంశా ఇవైవ తే భవన్తి।** ప్రపంచంలో అనేకులు ఒక్కొక్క విభాగంలో ఒక్కొక్క గొప్ప ప్రావీణ్యత కలిగి ఉంటున్నారు కదా! వారంతా 'ధ్యానము' వలననే ఆయా సమర్థతలు పొందుచున్నారు. అందుచేత ఓ నారదా! మీరు **'ధ్యానము బ్రహ్మమే'** అని ఉపాసించెదరు గాక।

ధ్యానము బ్రహ్మముగా ఉపాసించువారు వారి ధ్యానము విస్తరించి ఉన్నంత దూరము 'స్వేచ్ఛ' (Freedom) కలిగి స్వాతంత్రులై ఉండగలరు.

## 7-7. సప్తమ అధ్యాయము - 'విజ్ఞానం' బ్రహ్మేతి ఉపాసన

**శ్రీ నారదుడు** : స్వామీ! బ్రహ్మము గురించిన ఉపాసన కొరకై 'ధ్యానము' కంటే శ్రేష్ఠమైనది ఏదైనా ఉన్నదా?

**శ్రీ సనత్కుమారుడు** : అవును. ఉన్నది. **విజ్ఞానం వావ ధ్యానాత్ భూయో।** ధ్యానము కంటే 'విజ్ఞానము' (తెలివి, ఎరుక) - శ్రేష్ఠమైనది. విజ్ఞానము (Intellectual Factor) చేతనే ఋక్ యుజుర్ సామ అథర్వణ చతుర్వేదములను, పంచమ వేదములనే ఇతిహాస పురాణములను, వ్యాకరణము, శ్రాద్ధకల్పము, గణితము, ఉత్పాతశాస్త్రము (శకునశాస్త్రము), నిధిశాస్త్రము (నిక్షేపముల శాస్త్రము), తర్కశాస్త్రము (Logic), నీతిశాస్త్రము, శబ్దముల ఉత్పత్తి శాస్త్రమగు నిరుక్తము, బ్రహ్మవిద్య, భూతవిద్య, ధనుర్వేదము, జ్యోతిషము, గారుడ విద్య, శిల్ప విద్య, ద్యులోక (దేవతాలోక) విద్య, పృథివి, వాయువు, ఆకాశము, జలము, తేజస్సు, దేవ-మానవ-పక్షి ఇత్యాది జీవుల గురించి, ధర్మాధర్మములు, సత్యాసత్యముల గురించి, సాధు అసాధులు, హృదయజ్ఞ-అహృదయజ్ఞములు, అన్నరసములు, ఇహ - పరలోకములు గురించి-ఇవన్నీ జీవుడు తెలుసుకోగలుగుచున్నాడు. అందుచేత ఓ నారదా! మీరు 'విజ్ఞానము'ను బ్రహ్మముగా ఉపాసన చేయండి. అప్పుడు 'విజ్ఞానము' యొక్క గతి విస్తరించి ఉన్నంతవరకు గల విజ్ఞానమయ లోకములలో స్వతంత్రులై సంచారములు చేయగలరు.

## 7-8. అష్టమ ఖండము - 'బలం' బ్రహ్మేతి ఉపాసన

" 'విజ్ఞానము' కంటే విశేషమైన ఉపాసనా వస్తువు ఏదైనా ఉన్నదా?" - అను నారదమహర్షి ప్రశ్నకు - సనత్కుమారుడు ఈ విధంగా సమాధానము చెప్పసాగారు.

**శ్రీ సనత్కుమారుడు** : **బలం వావ విజ్ఞానాత్ భూయో।** విజ్ఞానము కంటే కూడా 'బలము' ఆత్మోపాసనకై శ్రేష్ఠమగు ఉపాసనా వస్తువు అయిఉన్నది.

**శతం విజ్ఞానవతాం ఏకో బలవాన్ అకంపయతే।** నూరుమంది విజ్ఞానవంతులు (తెలివిగల వాళ్లు) కూడా ఒక్క బలవంతుని చూచి వణుకుతారు.

- ఎప్పుడు ఈ జీవుడు బలవంతుడౌతాడో, అప్పుడే ఆతడు కూర్చున్నచోటునుండి లేవగలడు. 'పరిచరితుడు' కాగలడు. (బాగుగా చరించువాడు కాగలడు)
- లేచినవాడే నడువగలడు.
- నడిచినవాడే అనుకున్నచోటికి వెళ్లగలడు.
- అన్నుకున్నచోటికి వెళ్లినవాడే దగ్గరకువెళ్లి చూడగలడు.

**పరిచరన్ ఉపసత్తా భవతి।** బలవంతుడే గొప్ప పరిచరితుడు (Efficient) అవగలడు. గురువు సమక్షంలో ఏకాగ్రతకలవాడై మననములు చేయగల - ఉపసీదనుడు (కదలక కూర్చునువాడు) కాగలడు.

**ఉపసీదన్ - ద్రష్టా భవతి। శ్రోతా భవతి। మన్తా భవతి।** ఉపసీదనుడే బలవంతుడై నిశ్చలముగా ఆసీనుడై చక్కగా విషయములను సరిగ్గా (నిత్యానిత్యములు) దర్శించగలడు. సూక్ష్మమగు గురుబోధల అంతరార్థములు ఏకాగ్రంగా శ్రవణము చేయగలడు. శ్రవణము చేసినది సరి అయిన త్రోవలో మననము చేయగలడు.

**బోద్ధా భవతి।** సరి అయిన రీతిగా అర్థము తెలుసుకొనగలడు. **కర్తా భవతి।** "ఏది చేయాలి, ఎట్లా చేయాలి? ఏది చేయకూడదు? చేయకుండువాడై ఎట్లా ఉండాలి" - మొదలైనవి ఎరిగినవాడై సరి అయిన కర్మలు, ధర్మములు నిర్వర్తించువాడు అవగలడు.

**విజ్ఞాతా భవతి।** బలము చేతనే అన్నీ అర్థము చేసుకొన్నవాడు కాగలడు. 'బలము' అనగా కేవలము శారీరక బలమునకు పరిమితమైనది కాదు.

**బలము అనగా** : శారీరక రోగ్యము; మనోనిశ్చలత్వ బలము (మనస్సు చాంచల్యమును జయించి ఉండటము); బుద్ధియొక్క ఏకాగ్రతా బలము (బుద్ధి సాధికారికమైన అనేక విషయముల గురించిన ప్రాధాన్యత (Multi Priorities) కలిగి ఉండకపోవటము; యోగాభ్యాస బలము; తపో సంపదా బలము; సత్యవాక్ బలము; దానపుణ్య బలము; స్వధర్మనిరతి బలము; గురువులను, ఆర్యులను సేవించినప్పటి సేవా బలము - ఇవన్నీ కూడా! ఇవన్నీ సుదీర్ఘ సాధన, సాత్విక కర్మలచేతనే సిద్ధించగలవు.

బలము చేతనే - నేల, నింగి (ఆకాశము), పర్వతములు, పక్షులు, దేవ-మనుష్య-జంతువులు, పతంగములు నిలుస్తున్నాయి. ఇంతెందుకు? ఒక పురుగు నుండి సమస్త ప్రాణులు బలము చేతనే సుస్థితులై ఉన్నారు. బలముచేతనే ఈ సమస్తము (గడ్డిమొక్క నుండి కూడా) ప్రాణులు జీవించువారై ఉన్నారు.

**'బలో బ్రహ్మేతి'** ఉపాసనచే అట్టి ఉపాసకుడు - తన బలము ఎంతవరకు విస్తరించుచున్నదో - అంతవరకు స్వేచ్ఛాయుతుడై ఉండగలడు. బలమును బ్రహ్మముగా ఉపాసించువాడు సర్వత్రా బలవంతుడై ఉండగలడు.

అందుచేత ఓ నారదా! "బలో బ్రహ్మేతి" సూత్రమును సుస్పష్టపరచుకొన్నవాడవై, బలమునే బ్రహ్మముగా ఉపాసించండి.

## 7-9. నవమ ఖండము - 'అన్నం' బ్రహ్మేతి ఉపాసన

**శ్రీ నారద మహర్షి** : మహనీయా! ఆత్మ తత్త్వోపాసనకై 'బలము' కంటే అధికమైనది ఇంకా కూడా ఏదైనా ఉన్నదా?

**శ్రీ సనత్కుమారుడు** : **అన్నం వావ బలాత్ భూయః।** అన్నము బలముకంటే ఎక్కువైన ఆత్మోపాసనా సాధనము.

**తస్మాత్ యద్యపి దశరాత్రీః న అశ్నీయాత్, యద్యుహ జీవేత్ అథవా,** - ఒకడు ఒక 10 రోజులు కనుక అన్నము తినకపోవటం జరిగితే, ఒకవేళ అతడు ఇంకా జీవిస్తూ ఉండి ఉన్నప్పటికి కూడా...

ఓపిక పోయి కళ్లు తెరచి చూడలేడు - **న ద్రష్టా! న శ్రోతా।** (చెవులతో వినలేడు)। **న మన్తా।** (మననము చేయలేడు. మనస్సు పనిచేయదు) **న బోద్ధా।** (ఆతడు బోధించబడలేడు)। **న కర్తా।** (దేనికీ కర్త (చేయువాడు) అయిఉండలేడు) **న విజ్ఞాతా।** (అధ్యయనం చేసి నేర్చుకొని విజ్ఞాతుడు కాలేడు)। 11వ రోజు అన్నం తింటేనో? ద్రష్ట, శ్రోత, మన్తా, బోద్ధ, కర్త, విజ్ఞాత - ఇవన్నీ తిరిగి అవగలడు. అందుచేత **"అన్నం బ్రహ్మ"** అని ఉపాసించెదవు గాక!

అన్నమును బ్రహ్మముగా ఉపాసించువాడు సమృద్ధి అయిన అన్నము, ఉత్తమమైన ఉదకములు లభించు లోకములు పొందుతాడు. అవి తృప్తిగా పొందగలడు. అన్నముయొక్క గతి ఎంతవరకో, అంత స్థానము వరకు కామచారుడు (స్వేచ్ఛా విహారుడు) కాగలడు। అన్నముచే భాగ్యవంతుడై ఉండగలడు.

## 7-10. దశమ ఖండము - 'జలం' బ్రహ్మేతి ఉపాసన

శ్రీ నారదుడు అడిగిన తరువాత ప్రశ్నకు -

**శ్రీ సనత్కుమారుడు :** జలముయొక్క బ్రహ్మోపాసన అన్నోపాసన కంటే అధికము. అందుచేతనే -

- వర్షములు సరిగ్గా పడినప్పుడు ధాన్యములు సరిగ్గా పండి, జనులు ఆహారవంతులు, ఆరోగ్యవంతులు అవుతారు.
- వర్షములు సరిగ్గా పడనప్పుడు ఆహారము లభించక జనులు వ్యాధిగ్రస్తులు అవుతారు.

వర్షము కాలయుక్తంగా, తగినంతగా వర్షిస్తే 'అమ్మయ్య! ఈ సంవత్సరం అన్నమునకు లోటు ఉండదు' - అని జనులు సంతోషిస్తూ సంక్రాంతి పండుగ సందడిగా చేసుకుంటారు.

**ఆప ఏవ మూర్తాయేయం పృథివీ।** ఈ భూమి మూర్తీభవించిన (ఘనీభవించిన) జలము రూపమే।

**యత్ అన్తరిక్షం, యత్ ద్యౌః, యత్ పర్వతా**
**యత్ దేవ మనుష్యా, యత్ పశవశ్చ వయాంసి చ,**
**తృణవనస్పతయః శ్వాపద అన్యా కీటక పతంగ పిపీలికమ్ "ఆప" ఏవ ఇమా మూర్తా।**

ఇక్కడ కనిపిస్తున్న ఆకాశము, ద్యు(తేజో-దేవతా) లోకము, పర్వతములు, దేవతలు, మనుష్యులు, పశువులు, పక్షులు, తృణవనస్పదులు, శ్వాపదములు (ఇతర జంతువులను హింసించు పులి, సింహము మొదలైన జంతువులు), తదితర కీటకములు, పతంగములు (మిడతలు), పురుగులు (పిపీలికములు) - **ఇవన్నీ మూర్తీభవించిన (లేక) ఘనీభవించిన జలము యొక్క రూపములే।**

**(ఆపోవా ఇదగ్ం సర్వం। విశ్వాభూతాని ఆపః।**
**అన్నమ్ ఆపో। సమ్రాడ ఆపో! విరాడ ఆపః। స్వరాట్ ఆపో।**
**ఛందాగ్ంసి ఆపో। యజుగుస్య ఆపో। సర్వమ్ ఆపో భూర్భువస్సువః 'ఓం')**

అందుచేత ఓ నారదా! మీరు జలమును పరబ్రహ్మస్వరూపంగా ఉపాసించెదరు గాక। అట్టి ఉపాసనచే ఈ జీవులు సర్వము పొందగలరు. కోరుకొన్నవన్నీ లభించగలవు. జనులు తృప్తి పొందగలరు.

అట్టి 'ఆపో బ్రహ్మేతి' అని జలమును పరబ్రహ్మ స్వరూపంగా ఉపాసించువాడు బ్రహ్మమును పొందగలడు.

## 7-11. ఏకాదశ ఖండము - 'తేజో' బ్రహ్మేతి - ఉపాసన

శ్రీ నారదులవారు మరల అడిగిన 'జలముకంటే గొప్పదైన "ఉపాసన వస్తువు" గురించి శ్రీ సనత్కుమారులవారు ఇట్లా చెప్పుకొస్తున్నారు.

**శ్రీ సనత్కుమారుడు** : తేజస్సు జలముకంటే ఉత్కృష్టమైనది. గొప్ప ఉపాసన వస్తువు.

- మొట్టమొదట తేజస్సే (ఆకాశమునుండి) రూపుదిద్దుకోవటం జరుగుతోంది. **(తేజోమయమ్ విశ్వమనన్తమాద్యమ్)।**
- **ఏతత్ వాయుం ఆగృహ్య ఆకాశం అభితపతి।** ఎప్పుడైతే తేజస్సు వాయువును నిశ్చలముగా చేసి ఆకాశమంతా వ్యాపించినదై ఉంటుందో అప్పుడు జీవులు "అబ్బా! బాగా ఉక్కబోస్తోందే।" - అని అంటూ ఉంటారు.
- ఎండలు బాగా కాస్తున్నప్పుడు "ఇక ఎప్పుడో వర్షం వస్తుంది" - అంటూ ఉంటారు.
- తేజస్సే మొదట జనించినదై, ఆ తరువాత జలము (ఆపః)ను ఉద్భవింపజేయుచున్నది.
- తేజస్సే జలమును ఆవిరిచేసి, పైకి తీసుకుపోయి మేఘములను, మెఱుపులను నిర్మించుచున్నది. తేజస్సుయొక్క స్పర్శచేతనే మేఘములు మెఱవటము (విద్యుత్) ఉరుములు ఏర్పడుచున్నాయి. అందుకే "ఆహా! ఆకాశం మేఘావృతం అయింది. ఉరుములు ఉరుముచున్నాయి. ఇక వర్షం వస్తుంది" - అని జనులు పలుకుచూ ఉంటున్నారు.

కనుక మొట్టమొదట తేజస్సే కనిపిస్తోంది. (ఇది యోగాభ్యాసుల శ్రేష్ఠానుభవము కూడా!) అందుచేత ఓ నారదా! మీరు "తేజస్సు బ్రహ్మమే" అని ఉపాసించండి.

ఆ విధంగా **"తేజో బ్రహ్మేతి"** అని ఉపాసించువారు తేజస్వులు, తేజో సంపన్నులు అగుచున్నారు. తేజో భాస్కరులై సర్వత్రా చీకట్లను తొలగించివేయగలరు. అట్టివారు - ఎంతవరకు తేజస్సు విస్తరించి ఉన్నదో, అంతవరకు- ఇచ్ఛాపూర్వకంగా సంచరించగలరు (కామచారులు అవగలరు). అందుచేత తేజస్సును "తేజోబ్రహ్మేతి" అని ఉపాసించెదవు గాక!

## 7-12. ద్వాదశ ఖండము - 'ఆకాశో' బ్రహ్మేతి - ఉపాసన

**శ్రీ నారదమహర్షి** : మహానుభావన్! సనత్కుమార మహాశయా! తేజస్సు కంటే గొప్పదైన ఉపాసనా వస్తువు ఇంకొకటి ఏదైనా ఉన్నదా?

**శ్రీ సనత్కుమారుడు : ఆకాశో వావ తేజసో భూయాన్।** తేజస్సు కంటే ఆకాశము మహత్తరమైనది.

- ఆకాశంలోనే తేజోవిభవ స్వరూపులగు సూర్య-చంద్రమసులు ఇరువురు సంచారములు చేస్తున్నారు.
- విద్యుత్ (తేజో మెఱుపు), నక్షత్రములు, అగ్ని ఆకాశమునందే సంస్థితములై ఉన్నాయి.

- ఆకాశమువలననే ఒకడు "ఓయీ!" అని తన స్నేహితుని పిలుస్తూ ఉంటే, ఆ స్నేహితుడు విని 'ఓయ్! వస్తున్నాను' అని సమాధానము అందించగలుగుచున్నాడు. **ఆకాశేన శృణోతి। ఆకాశేన ప్రతిశృణోతి।**
- సర్వత్రా ఆకాశమే రమిస్తోంది. అంతటా ఆకాశమే ఉన్నది కాబట్టి ఆకాశము దేనికీ మరొకచోట రమించటము లేదు. ఆకాశము తనయందు తానే రమిస్తోంది. జనులంతా ఆకాశములోనే రమిస్తున్నారు. కానీ, ఆకాశమునందు రమించటము లేదు కూడా. (తమయందు తామే రమిస్తున్నారు).
- సమస్త జీవులు, సమస్త అంకురములు (Seedlings) సమస్త వస్తువులు, వాయువు, అగ్ని, జలము, భూమి – అన్నీ కూడా ఆకాశమునుండే బయల్వెడలుచున్నాయి. తిరిగి ఆకాశము (Space) నందే లయిస్తున్నాయి.

  **(ఆకాశాత్ వాయుః। వాయోః అగ్నిః। అగ్నిః ఆపః। ఆపః పృథ్వీ)।**

అందుచేత ఓ నారద! మీరు 'అకాశో బ్రహ్మేతి' – అని తలచుచు ఆకాశమును పరబ్రహ్మస్వరూపంగా ఉపాసించండి. అప్పుడు ఆకాశము విస్తరించి ఉన్నంతవరకు ఆకాశవంతులు, ఇచ్ఛాసిద్ధులు, సర్వస్వాతంత్రులు అయి ఆనందమయ విశాల లోకములలో బ్రహ్మానందముగా సంచారములు చేయగలరు.

## 7-13. త్రయోదశ ఖండము - 'స్మరో' బ్రహ్మేతి - ఉపాసన

**శ్రీనారదమహర్షి** : ఆకాశముకంటే ఉత్తమమైనదేది? ఉపాసనకొరకై ఇంకా కూడా ఉత్తమమైనది ఉన్నదా?

**శ్రీ సనత్కుమారుడు** : ఆకాశము కంటే కూడా ఆత్మోపాసనకొరకై ఉత్తమమైనది – 'స్మరణము' (లేక) జ్ఞప్తి (జ్ఞాపక శక్తి). (స్మరణము = ఆలోచన; జ్ఞాపకము; మననము; జ్ఞప్తి; గుర్తించటము; గమనించటము).

స్మరణము (జ్ఞాపకము) లేకపోతే అనేకమంది ఒకచోట కూర్చుని ఉన్నా కూడా ఒకరినొకరు గుర్తించలేరు. ఒకరితో మరొకరు మాట్లాడుకోలేరు. స్మరణము వలననే ఒకడు కళ్ళతో ఏదైనా చూడగలడు, చెవులతో వినగలడు, స్పర్శించి గుర్తించగలడు, మననము చేయగలడు. స్మరణమువలననే ఒకడు భార్య-పుత్ర-బంధు-పశు సంపదలను గుర్తించగలుగుచున్నాడు. అందుచేత స్మరణము (The Factor of Remembrance) ను బ్రహ్మముగా ఉపాసించెదరు గాక! ఆ విధంగా స్మరణమును బ్రహ్మముగా ఉపాసించువారు – **యావత్ స్మరస్య గతం తత్ర అస్య యథా కామచారో భవతి।** – స్మరణము విస్తరించి ఉన్నంత వరకు కామచారుడు (స్వేచ్ఛగా వర్తించువాడు) అగుచున్నాడు. బంధము లేనివాడై ఉండగలడు.

## 7-14. చతుర్దశ ఖండము - 'ఆశా' బ్రహ్మేతి - ఉపాసన

**శ్రీ నారదమహర్షి** : 'స్మరణ' కంటే కూడా ఉత్తమ ఆత్మోపాసన-ఉపకరణము ఉన్నదా? ఉంటే అది ఏది?

**శ్రీ సనత్కుమారుడు** : 'స్మరణము' కంటే 'ఆశ' అధికమైన ఆత్మోపాసనా ఉపకరణము. ఒకడు ఆశ చేతనే స్మరణము, స్మరణ చేతనే మంత్రములు (మననములు) స్మరించటము, పఠించటము నిర్వర్తిస్తూ ఉన్నాడు. 'ఆశ' చేతనే సంతానము, పశుసంపద కోరుకొనుచున్నాడు. (కామికానివాడు మోక్షకామికాడు). ఇహ పరలోకములన్నీ కూడా 'ఆశించటము' చేతనే కల్పనా మాత్రమై సిద్ధిస్తున్నాయి. **అందుచేత నీవు 'ఆశ' (లేక) ఆశించటము పరబ్రహ్మముగా భావించి, ఉపాసించు.** 'ఆశ'ను బ్రహ్మముగా భావన చేయువానియొక్క సమస్త కామనములు, చేసే సకల ప్రార్థనలు సిద్ధించ గలవు. ఈ విధంగా 'ఆశించటము' అనేది బ్రహ్మమే అయి ఉన్నది.

## 7-15. పంచదశ ఖండము - 'ప్రాణో' బ్రహ్మేతి - ఉపాసన

**శ్రీ నారదమహర్షి** : 'ఆశ' కన్నా అధికమైనదేదైనా ఉన్నదా?

**శ్రీ సనత్కుమారుడు** : 'నామము' నుండి 'ఆశ' వరకు కార్య-కారణ, నిమిత్త-నైమిత్త సంబంధములు కలిగి ఉంటున్నాయి. ఆశచేతనే మానవుడు బద్ధుడు అగుచున్నాడు. అట్టి ఆశవరకు ప్రాణముచే పూదండలో దారమువలె విస్తరించి, సమస్తము ప్రాణమునందే సమర్పితమై (ఉనికి కలిగి) ఉన్నాయి. ఈ విధంగా ప్రాణము ఆశ కంటే కూడా అధికమైన ఆత్మోపాసన ఉపకరణము అయి ఉన్నది. రథముయొక్క అరలన్నీ నాభియందు, నాభి రంధ్ర చక్రమునందు సమర్పితమైన తీరుగా సమస్తము 'ప్రాణము' నందే సమర్పితమైయున్నది.

- ప్రాణము ప్రాణమువైపుగానే వెళ్లుచున్నది (మరణము)
- ప్రాణమే ప్రాణమును ఇచ్చుచున్నది (జననము)
- తండ్రి ప్రాణస్వరూపుడే. అట్లాగే ప్రాణమే తల్లి. ప్రాణమే సోదరుడు. ప్రాణమే సోదరి. ప్రాణమే ఆచార్యుల వారు (గురువు). ప్రాణమే బ్రహ్మము ఎరిగిన బ్రాహ్మణుడు.
- అందుచేతనే తండ్రి, తల్లి, సోదరులు, సోదరిలు, ఆచార్యులు, బ్రాహ్మణుడు – వీరిలో ఎవరినైనా దూషిస్తే **'తండ్రి కదా! ఎట్లా దూషిస్తావు? అమ్మ, సోదర, సోదరిలే కదా! అట్లా అనకూడదు। నీకు విద్య నేర్పే గురువును ఎక్కిరించవచ్చా? ఆయన బ్రహ్మతత్త్వము ఎరిగినవాడు! చిన్న విషయాలకు తప్పు పట్టకూడదు!"** – అని సహజనులు గర్తు గుర్తుగా చెప్పుతూ ఉంటారు. అధికంగా దూషిస్తూ ఉంటే "వీడు వాళ్ళను చంపుకు తింటున్నాడురా।" – అని అంటారు.

అదేఁ..., ఒకని తల్లిగాని, తండ్రిగాని మరణించినప్పుడు "చూడండి! అతడు అమ్మ నాన్నల ప్రాణం తీస్తున్నాడు"– అని ఎవ్వరూ అనరు.

**ప్రాణం ఉంటేనే శారీరకంగాను, మానసికంగాను బాధ గాని, సుఖము గాని ఉండగలవు.**

అందుచేతనే **"(దేహమునకు సంబంధించిన) జన్మ–జీవన–మరణములు, బాధ–అబాధలు, (మనస్సుకు సంబంధించిన) సుఖ–దుఃఖ మాన–అవమానములు – ఇవన్నీ ప్రాణ సంబంధమైనవే"** అని చెప్పబడుతోంది. "నా ప్రాణము బాగుండక నేను అదంతా గమనించలేకపోయాను" అని జనులు అంటూ ఉంటారు. కాబట్టి దేహ మనో బుద్ధి చిత్తములు ప్రాణమునందే సమర్పితమై (అలంకరించబడినవై, అమర్చబడినవై) ఉన్నాయి.

**ప్రాణో హి ఏవ ఏతాని సర్వాణి భవతి।** తండ్రి, తల్లి, సోదరుడు, సోదరి, ప్రియమైన బంధువులు మొదలైనవారంతా ఈ జీవునికి ప్రాణస్వరూపులే అయిఉన్నారు. అందుచేత...

**"ఈ సమస్తము నీ ప్రాణ స్వరూపమే!"**.... అని జగద్దృశ్యముపట్ల భావన చేయును గాక। ఎవ్వడైతే సమస్తము తన ప్రాణ స్వరూపముగా చింతన చేయునో, ఆ విధంగా గ్రహించువాడు ప్రాణస్వరూపుడే అవుతాడు.

ఈ విధంగా ప్రాణమును బ్రహ్మముగా ఉపాసన చేయువాడు – **"బ్రహ్మాది స్తంభపర్యంతస్య హి జగతః 'ప్రాణ' ఆత్మాహమితి"।** – బ్రహ్మదేవుని నుండి ఒక తృణము వరకు సమస్తమునకు ప్రాణస్వరూపుడను నేనే!" – అని ఎలుగెత్తి గానము చేస్తూ చెప్పుచున్నాడు.

అట్టి "సమస్త జీవుల ప్రాణస్వరూపుడను నేనే" – (అహమాత్మా గుడాకేశ! సర్వభూతాశయ స్థితః – భగవద్గీత) – అని చేతులెత్తి ప్రకటించువాడు – ఇతరులచే "ఈతడు అతివాది। **విజానన్ అతివాదీ భవతి।**" – అని అనబడవచ్చు గాక. అప్పుడు మీరు ఇట్లా అనాలి **తం చేత్ బ్రూయః "అతి వాద్యసీతి।" అతి వాద్యస్మి ఇతి।**

ఔను! నేను సమస్త సృష్టికి ప్రాణస్వరూపుడనే। ఉన్న సత్యమైతే ఇదే! ఇందులో సందేహము లేదు. ఒకవేళ నేను 'అతివాదిని' – అని మీరు అనుకోదలిస్తే, అది మీ ఇష్టము – సత్యము అతివాదమనుకుంటే నేను అతివాదినే మరి!" – అని అనాలి. అంతేగాని అట్టి ప్రాణదర్శన–ఉపాసన–అవగాహనలనుండి మీరు చ్యుతి పొందనక్కర్లేదు! **న అపహ్నువీత।** సత్యము నుండి తప్పుకోవలసిన పని – ప్రాణోపాసకునికి (ప్రాణమును ఆత్మగా దర్శించువానికి) – ఏమాత్రము ఉండదు. అందుచేత 'ప్రాణము'ను పరబ్రహ్మముగా ఉపాసించెదరు గాక!

## 7-16. షోడశ ఖండము - స్వాత్మయే సర్వాత్మక సర్వప్రాణాత్మకము

**స ఏష నారదః – "సర్వాతిశయం ప్రాణం స్వమాత్మానం।"** "అన్నిటికంటే ఉత్కృష్టమైన స్వాత్మరూపమగు ప్రాణమే సర్వాత్మ స్వరూపము" – అను శ్రీ సనత్కుమారుని ప్రాణతత్త్వ ప్రవచనమును శ్రీ నారదమహర్షి శ్రద్ధగా విన్నారు. "ప్రాణమునకు మించి మరొక ఉపాసనా వస్తువు ఉన్నదా?" – అని ఇతఃపూర్వము వలె అడగాలని అనిపించలేదు. "నేను సర్వదేహములలోని ప్రాణస్వరూపుడనై ఉన్నాను కదా! ఇంకా కొత్తగా అంతకుమించిన ఉపాసనతో పని ఏముంటుంది?' – అని భావించి సంతోషము పొందారు. ఏమీ అడగక ఊరుకున్నారు.

⌘

అయితే సనత్కుమారుడు ఈవిధంగా అనుకోసాగారు. **"ఈ నా శిష్యుడు నారదుడు ఇంకా అకృతార్థుడు. అట్లా అయి ఉండి కూడా తనను పరమార్థమగు సత్యవాదిగా అనుకుంటున్నాడు. వికార రూపము, మిథ్య అయిన బ్రహ్మజ్ఞానముతో సంతృప్తి చెంది మరల ప్రశ్నించక ఊరుకుంటున్నాడు. అయితే ఈతడు ఉత్తమార్హత గల శిష్యుడు. గురువుగా నన్ను ఆశ్రయించినప్పుడు ఈతని మిథ్యాజ్ఞానము తొలగించి ఏది పరమసత్యమో, అటువైపుగా మార్గము చూపాలి కదా!**

**కాబట్టి ఇప్పటికి అయోగ్యుడైయున్న ఈ శిష్యుని మిథ్యాగ్రహణము నుండి చ్యుతి పొందిస్తాను"** – అని తలచాడు.

⌘

**శ్రీ సనత్కుమారుడు** : ఓ నారదా! ఇప్పటిదాకా మనము సంభాషించుకున్నదంతా శ్రద్ధగా విన్నారు కదా! వాస్తవానికి 'ప్రాణము' గురించి తెలుసుకున్నంత మాత్రంచేత అట్టివాడు అతివాదిత్వము (వాదనలకన్నిటికీ ఆవల ఉన్నట్టిది) సిద్ధించుకొన్నట్లు కాదు సుమా! 'ప్రాణోపాసన' వరకు వాస్తవానికి ఇంకా నామాదుల దృష్టి మాత్రమే.

**శ్రీ నారదమహర్షి** : గురుదేవా! నేను ప్రాణముయొక్క సర్వాత్మకత్వము మీవద్ద శ్రవణం చేసి, "నేను అతివాదిని అయ్యాను" ...అని తృప్తి చెంది ఇక మిమ్ములను ప్రశ్నించలేదు.

"మీరు చెప్పినదాన్నిబట్టి "ఆత్మ తత్త్వజ్ఞానము" లేక "ఆత్మ తత్త్వోపదేశము" యొక్క సర్వోత్తమమగు పాఠ్యాంశము నేను ఇంకా మీవద్ద విననేలేదని తెలుసుకున్నాను. ఇంకా నేను ప్రాణతత్త్వముతో సహా నామాదుల దృష్టిలో మాత్రమే ఉన్నాను గాని ఆత్మదృష్టికి ఇంకా చేరలేదని మీరన్న మాటలుబట్టి గ్రహించాను.

ఇప్పుడు ఆత్మ దృష్టి గురించిన తరువాత పాఠ్యాంశమును మీరు నాకు బోధించుటకై శరణాగతుడను అగుచున్నాను.

**శ్రీ సనత్కుమారుడు** : ఓ పరమాత్మానందస్వరూపా! నారదా! మనము ఆత్యంతిక సత్యమును ఆశ్రయించి సమస్త ఉపాసనల అంతిమ ప్రయోజనము సిద్ధించుకోవాలి కదా! అట్టి స్థానము "భౌమా" అని 'అతివాదము' అని, అద్దానిని సిద్ధించుకున్నవానిని 'అతివాదన కర్త' అని అంటారు. వాస్తవానికి ప్రాణము యొక్క తత్త్వము (సర్వత్రా ఏకత్వము) తెలుసుకున్నంతమాత్రం చేత 'అతివాది' కాదు. ఎవడు అంతిమ (పరాకాష్ట) సత్యము కొరకై 'అతివాదనము' చేయునో, ఆతడే అతివాదనుడు అవగలడు.

**శ్రీ నారదమహర్షి : సోఽహం భగవః సత్యేయన అతివదానీతి।** భగవాన్! సామీ! గురుదేవా! నేను పరమార్థ సత్య విజ్ఞానము పొంది అతివాదనుడను అగుటయే లక్ష్యముగా కలిగి ఉన్నాను.

**శ్రీ సనత్కుమారుడు** : మంచిదే! అయితే నీవు సాధనపరంగా నీ వెంటనంటి వస్తూ ఉన్న సర్వజిజ్ఞాసలు ప్రక్కకుపెట్టుచూ, పరమసత్యమే (The Finest and The Final Truth) కొరకు మాత్రమే నీయొక్క జిజ్ఞాసను కేంద్రీకృతం చేయాలి మరి! **సత్యం తు ఏవ విజిజ్ఞాసితవ్యమితి।**

**శ్రీ నారదమహర్షి : సత్యం భగవో విజిజ్ఞాస ఇతి।** అవును, ప్రభూ! నేను అంతిమ సత్యముకొరకే విజిజ్ఞాసుడను (Determination to know) అగుచున్నానని మరల మనవి చేసుకుంటున్నాను।

మీ నుండి విశేషమగు పరమ సత్యమును తెలుసుకోవాలని వాంఛిస్తున్నాను.

# 7-17. సప్తదశ ఖండము
# దేనితో తెలుసుకొనుచున్నావో అదియే తెలుసుకోవలసినట్టిది
### విజ్ఞానం బ్రహ్మ / ప్రజ్ఞానం బ్రహ్మ - విజ్ఞానం విజిజ్ఞాసితవ్య

**శ్రీ సనత్కుమారుడు** : "నేను ఉన్నాను" అనబడునది మరొకరు ఎవ్వరూ చెప్పకుండానే (తల్లిగాని, తండ్రిగాని – అమ్మ–నాన్న మాటలు నేర్పకముందే) ఈ జీవునికి తనకు తనకే తెలుస్తోంది కదా. అట్టి దానిలో రెండు విశేషాలు.

(1) 'ఉనికి' (I Exist)

(2) 'ఎరుక' (తన ఉనికి తనకే తెలియటము - Knowing – విజ్ఞానము).

సత్ = ఉనికి :: చిత్ = ఎరుక.

**యదావై విజానాతి అథ సత్యం వదతి।** పురుషుడు (పురుషకారము ప్రదర్శిస్తున్న జీవుడు) ఎప్పుడైతే 'సత్యము' (యమ్ సత్)ను తెలుసుకుంటాడో, అప్పుడే ఆతడు సత్యమును మాట్లడుతాడు. తెలియని సత్యము ఎవ్వడు మాత్రం మాట్లాడగలడు?

**విజానన్నేవ సత్యం వదతి।** ఈ సత్యము తెలుసుకోవటం జరిగితేనే సత్యము మాట్లాడగలడు కదా!

తెలుసుకోవటమే → విజ్ఞానము

| ఒకడు ఏమి తెలుసుకొనుచున్నాడు? అనేది ప్రక్కనపెట్టి , "తెలుసుకోవటము" అనే లక్షణము గురించి (About Feature of Knowing, but not what is being known)ను తెలుసుకోవటములో (గమనించటంలో) జిజ్ఞాసులై ఉండెదరు గాక! అదియే బ్రహ్మము. |
|---|

**శ్రీ నారదమహర్షి** : మహాత్మా! నేను ఇప్పుడు అట్టి "విజ్ఞానము" యొక్క విశేషరూపమునే తెలుసుకోగోరుచున్నాను. **విజ్ఞానం భగవో। విజిజ్ఞాస ఇతి।**

అనగా...

వేరు వేరు దీపములు వేరు వేరు వస్తువులను వెలిగిస్తూ ఉండవచ్చు. అన్ని దీపములలోని జ్యోతి (తేజస్సు), ఉష్ణము 'ఒక్కటే'. అట్లాగే–

> నాకు గాని, సమస్త జీవులకుగాని ఏదేది తెలియబడుచున్నదో...అద్దానిలో 'అనేకత్వము' ఉండవచ్చు గాక। "తెలుసుకోవటము" (The Future of Knowing) మాత్రము సర్వదా ఏకమే అయి ఉన్నది. అట్టి ఏకమగు ప్రజ్ఞానము (లేక) విజ్ఞానమునే తెలుసుకొనుచున్నవాడనై ఉన్నాను. అది సర్వత్రా సమరూపమై ఉన్నది. అట్టి బ్రహ్మము గురించి ఎరుగుచున్నాను.

## 7-18. అష్టాదశ ఖండము - మతిస్తు ఏవ విజిజ్ఞాసితవ్యేతి। మననము (మతి) గురించే తెలుసుకోవాలి।

**శ్రీ సనత్కుమారుడు : ఓ నారదా! మననయేవ మనః।** 'మనస్సు' అనగా 'మననము' యొక్క రూపమే, ఒకడికి ఒక విషయము తెలియాలంటే..

(1) తాను ఉండాలి! (ఉనికి – సత్యమ్).

(2) తాను తెలుసుకొనేవాడై ఉండాలి (విజ్ఞానం/ప్రజ్ఞానం–చిత్). అంతటితో సరిపోదు.

(3) **యదా వై మనుతే, అథ విజానాతి।** తద్విషయము మననము చేసినప్పుడే ఆ సత్యమును ఆతడు తెలుసుకొని చెప్పగలడు.

**న అమత్వా విజానాతి।** ఆ విషయము మననము చేయకపోతే 'ఇది ఇక్కడ ఇట్లా జరిగింది'–అని చూచి కూడా చెప్పలేడు. ఈ జనులు మననము చేస్తున్న విషయాలు వేరు వేరు. ఒకడు మననము చేస్తున్నట్లుగా మరొకరు మననము చేయటము లేదు. వేరువేరు మననములననుసరించి మంచి–చెడు–జ్ఞానము–అజ్ఞానము కనిపిస్తున్నాయి. అట్టి మననమే మనోరూపము.

ఇప్పుడు నీవు... నామము నుండి → ప్రాణము వరకు మననము చేయబడు విషయాలను ఆవల పెట్టు.

ఏ మతిచే మనమంతా మననము చేయుచున్నామో, దానిని గురించి తెలుసుకొనెదవు గాక! మతి (తెలుసుకొనుచున్నవాని మనన శక్తి) గురించి తెలుసుకొనుచున్నవాడవై ఉండు. అట్టి 'మతి' మాత్రమే అసలైన తెలుసుకోవలసినట్టిది (జ్ఞేయము)– **'మతిస్తు ఏవ విజిజ్ఞాసితవ్యేతి।'**

**శ్రీ నారదమహర్షి** : గురుదేవా!

**మతిం భగవో విజ్ఞాస ఇతి।** ఏదేది జీవులచే మననము చేయబడుచున్నదో – అట్టి దానినిబట్టి భేదములన్నీ కనిపిస్తున్నాయి. మనన శక్తి ఒక్కటే. అందుచేత,

> **సమస్త జీవులలో మననము రూపమగు మనస్సును వ్యక్తీకరించుచున్న మతిని మాత్రమే తెలుసుకొంటూ "మనో విజిజ్ఞాసితవ్యుడను" అగుచున్నాను. సమస్త జీవులలో ఏకరూపమై ఉన్న 'మతి'ని మాత్రమే తెలుసుకొంటున్నవాడనై, మననము చేయబడువాటిని అధిగమించినవాడనై ఉంటాను.**

## 7-19. ఏకోనవింశ ఖండము - "శ్రద్ధ"యే తెలుసుకొనతగినది - తెలుసుకోవలసినది

**ఇప్పుడు - ఇక శ్రద్ధ గురించి!**

ఎవ్వడైనా ఏదైనా 'మననము' చేయాలంటే ఆతడు శ్రద్ధ (Attention) ఆ విషయము పట్ల కలిగి ఉండాలి. (లేక) మననము చేస్తే (అనుకుంటూ) ఉంటే సరిపోదు. శ్రద్ధను వినియోగిస్తేనే ఆ పని చేయగలడు.

"నేను చదువుకోవాలనే అనుకుంటున్నాను. కాని చదువుపై శ్రద్ధ కలిగి ఉండను. మరకటేదో ఆటలు వంటి వాటిపై శ్రద్ధ చూపుతాను" – అని అంటే ఆ విద్యార్థికి చదువు వస్తుందా? రాదు. ఎందుచేత? శ్రద్ధ లేదు కాబట్టి.

⌘

ఒక పని చేయాలంటే శ్రద్ధ ఉంటేనే మననము చేయగలడు. శ్రద్ధ లేకపోతే ఆ పని చేయాలనే మననము ఆరూఢమవదు. **యదా వై శ్రద్ధధాతి అథ మనుతే। న అశ్రద్ధధన్ మనుతే। శ్రద్ధథత్ ఏవ మనుతే।**

ఈ జనులంతా వేరు వేరు విషయాలపై శ్రద్ధ కలిగి ఉంటున్నారు. శ్రద్ధ వేరు వేరు విషయములపై ఎక్కుబెట్టబడినప్పటికీ అందరిలోనూ "శ్రద్ధ" (Attention) అనేది ఒక్కటే! **'శ్రద్ధా తు ఏవ విజిజ్ఞాసితవ్యేతి।** నీవు ఆత్మ గురించి తెలుసుకోవాలంటే "శ్రద్ధ" అను దాని గురించి (The concept of Attention) తెలుసుకోవాలి. అందుచేత శ్రద్ధ గురించి విజిజ్ఞాసితవ్యుడవు అగుము. అప్పుడు 'ఆత్మ' (లేక) 'బ్రహ్మము' గురించి దానంతట అదే తెలుస్తుంది.

**శ్రీ నారదుడు** : మహాత్మా! "ఎవరి శ్రద్ధ ఎటువైపు ఉన్నది?" – అనే విషయము ఆవలబెట్టి, అసలు "శ్రద్ధ" గురించి తెలుసుకోనారంభిస్తున్నాను. **శ్రద్ధాం భగవో విజిజ్ఞాస ఇతి।**

## 7-20. వింశ ఖండము - నిష్ఠాయేవ విజిజ్ఞాస ఇతి

**శ్రీ సనత్కుమారుడు** : ఒకడికి శ్రద్ధతో బాటు నిష్ఠ (Commitment Functioning) ఉండాలి. నిష్ఠ లేకుండా "నాకు శ్రద్ధ ఉన్నది" అంటే ఏమి లాభము?

**యదా వై నిస్తిష్ఠతి అథ శ్రద్ధధాతి। "నిష్ఠ"** ఉంటేనే (If only determined to do) 'శ్రద్ధ' అనేది రూపుదిద్దుకుంటుంది. శ్రద్ధ ఉంటేనే మననము చేయగలడు. మననము చేస్తేనే తెలుసుకోగలడు. తెలుసుకుంటూ ఉంటేనే ఉనికిని చాటుకోగలడు.

**నిష్ఠ లేని వానికి శ్రద్ధ ఎక్కడ ఏర్పడుతుంది? ఏర్పడదు. న అనిస్తిష్ఠన్ శ్రద్ధధాతి।** నిష్ఠ (Determination) ఉన్నవాడికే శ్రద్ధ బలపడుతోంది. **నిస్తిష్ఠన్ ఏవ శ్రద్ధధాతి।**

ఓ నారదా! సమస్త జీవులలో ఏర్పడియే ఉన్నట్టి 'నిష్ఠ' గురించి మీరు విజ్ఞాతులై ఉండండి (Be aware of the concept of Determination)! అనగా, ఒకడు దేనిపట్ల నిష్ఠ కలిగి ఉంటున్నాడో, అది ఆవలపెట్టి, 'నిష్ఠ' గురించే తెలుసుకోండి. **నిష్ఠా తు ఏవ విజిజ్ఞాసతవ్యేతి।**

**(**నిష్ఠ = నిష్ఠ గురించి – **నిష్ఠా గురుశుశ్రూషాదిః తత్పరత్వం బ్రహ్మ విజ్ఞానాయ!** – బ్రహ్మతత్త్వము కొరకై తత్పరుడై ఉంటూ గురుసేవ వంటి కార్యములను నిర్వర్తించటమే నిజమైన నిష్ఠ అని చెప్పబడుతోంది)

**శ్రీ నారదమహర్షి** : భగవాన్! సనత్కుమారుడా! నేను 'నిష్ఠ' అను దాని గురించి తెలుసుకొనువాడనై ఉంటాను. సమస్త జీవులలోని 'నిష్ఠ'ను తెలుసుకొంటూ, వేరువేరు భేదములను జయిస్తాను **నిష్ఠా భగవో! విజిజ్ఞాస – ఇతి।**

---

## 7-21. ఏకవింశ ఖండము - కృతియేవ విజిజ్ఞాసితవ్యమ్ - కర్మానుష్ఠానము

**శ్రీ సనత్కుమారుడు** : మానవునికి బద్ధకమే పెద్ద శత్రువు. అందుచేత కర్మానుష్ఠానపరుడై ఉండాలి. అది శాస్త్రానుకూలంగాను, లోకానుకూలంగాను, గురు శుశ్రూషానుకూలంగాను ఉండును గాక। **యదా వై కరోతి అథ నిస్తిష్ఠతి।** 'నిష్ఠ' అనేది, శ్రద్ధ అనేది కర్మలను నిర్వర్తించటముపైన ఆధారపడి ఉంటాయి. ప్రయత్నించేవానికే ప్రయోజనం. బుద్ధి కూడా కర్మలను అనుసరించే రూపుదిద్దుకుంటోంది (బుద్ధిః కర్మానుసారిణీ)। **న అకృత్వా నిస్తిష్ఠతి। కృత్వైవ నిస్తిష్ఠతి।** కర్మలు నిర్వర్తించని వానికి నిష్ఠ ఏర్పడదు.

కర్మలు చేయువానికే నిష్ఠ ఉంటుంది. అందుచేత సత్కర్మలను ఈ జీవుడు చక్కగా తెలుసుకొని ఉండాలి. సత్కర్మలను నిర్వర్తించాలి. దుష్టకర్మల నుండి విరమించాలి. 'కృతము (కర్మ)' గురించి తెలుసుకోండి.

**శ్రీ నారదమహర్షి : కృతిం భగవో। విజిజ్ఞాస ఇతి।** భగవాన్! కర్మ, అకర్మ, వికర్మల గురించి తెలుసుకొనువాడనై ఉంటాను.

## 7-22. ద్వావింశ ఖండము - సుఖం విజిజ్ఞాసితవ్యేతి।

**శ్రీ సనత్కుమారుడు** : కర్మలు సుఖప్రదంగా ఉండాలి. సాధ్యమయినదే సాధన. **యదా వై సుఖం లభతే అథ కరోతి।** తనకు, సహజనులకు సానుకూల్యంగా ఉండేటట్లుగా కర్మలు తీర్చిదిద్దుకోవాలి. **న అసుఖం లబ్ధ్వా కరోతి। సుఖమేవ లబ్ధ్వా కరోతి।** కర్మలు సుఖప్రాప్తి కొరకే నిర్వర్తించాలిగాని బాధలు పర్యవసానంగా కలిగి ఉండకూడదు.

(ప్రారంభే విషమివ - పరిణామో అమృతో భవతి - అన్నట్లుగా కర్మలు ఉండాలి).

**సుఖంతు ఏవ విజిజ్ఞాసితవ్యమ్ ఇతి।** కర్మలు సుఖప్రదమయ్యేది ఎట్లాగో తెలుసుకొని ఉండాలి.

**శ్రీ నారదుడు** : కర్మలు సుఖప్రదంగా తీర్చిదిద్దుకునేటట్లు ఎరిగినవాడనై ఉంటాను. **సుఖం, భగవో! విజిజ్ఞాస ఇతి।**

## 7-23. త్రయోవింశ ఖండము - "భూమా" సుఖమితి।

**శ్రీ సనత్కుమారుడు** : ఇంద్రియ సుఖము వాస్తవమైన సుఖము కాదు. అనేక దుఃఖములకు దారి చూపేదే। **(యే హి సంస్పర్శజా భోగాః దుఃఖయోనయ ఏవ తే - భగవద్గీత).** ఏది మహత్తరమో (బ్రాహ్మీసుఖమో, ఆత్మసుఖమో, గొప్పదో) అదియే **'భూమ"।**

**యా వై భూమ, తత్ సుఖమ్। న అల్పే సుఖమస్తి।** ఏది మహత్తరమైయున్నదో, అదియే 'సుఖము', అల్పమైనవి సుఖము కాదు. ఏది 'భూమ' అయి ఉన్నదో అది తెలుసుకొని ఉండాలి. ఆత్మయే సుఖము. ఆత్మ గురించే తెలుసుకొనుచూ ఉండాలి.

**శ్రీ నారదుడు: భూమానం, భగవో! విజిజ్ఞాస - ఇతి।** గురువర్యా! భూమానము అయినదేదో అట్టిదాని గురించియే తెలుసుకుంటూ ఉంటాను.

## 7-24. చతుర్వింశ ఖండము - "భూమా" స్వరూపము ఎట్టిది?

**శ్రీ సనత్కుమారుడు** : **కిం లక్షణో అసౌ 'భూమా?'** అట్టి 'భూమా' అని మనము చెప్పుకొంటున్న దానియొక్క లక్షణములు ఏమిటి? వినండి.

**యత్ర న అన్యత్ పశ్యతి।** ఎద్దానిని చూస్తూ ఉన్నప్పుడు అద్దానికి 'అన్యము' అంటూ ఏదీ కనిపించదో...

**న అన్యత్ శృణోతి।** దేనికైతే వేరు అయినది వినబడనే వినబడదో (బంగారు గాజులు, బంగారు ఉంగరము - అన్నప్పుడు బంగారమే శ్రేష్ఠమై వినిపిస్తుంది కదా!)

**న అన్యత్ విజానాతి।** దేనికైతే వేరుగా ఏదీ తెలియబడటము లేదో... సమస్తము కూడా 'అదియే' అని తెలియబడుతోందో...

**అదియే 'భూమా'।** అట్టి ఆత్మకు వేరుగా ఏదైనా కనబడుచూ, వినబడుచూ, తెలియబడుచూ ఉన్నదో, అది 'అల్పము' (Very low way of seeing hearing and knowing). సత్యమును వీడి కల్పనలో సంచరించటము వంటిది.

- ఏది 'భూమా'యో, అది 'మృతము-మార్పు' లేనట్టి **"అమృతము"।**
- ఏది అల్పమో అది మర్త్యము (మృత ధర్మము, నశించు ధర్మము కలిగియున్నట్టిది)

**శ్రీ నారదమహర్షి** : అట్టి అమృతము, అనన్యము అగు 'భూమా' - ఎందులో ప్రతిష్ఠితమైయున్నది? **స, భగవః। కస్మిన్ ప్రతితిష్ఠత?**

**శ్రీ సనత్కుమారుడు** : అట్టి అమృతము, అనన్యము, మహిమాన్వితము అగు భూమా (ఆత్మ) మరింకేదానియందు ప్రతిష్ఠితమై లేదు. **స్వే మహిమ్ని।** తన మహిమయందు తానే ప్రతిష్ఠితమై ఉన్నది.

అంతేకాదు. **న మహిమ్నీతి?** తన మహిమయందు తాను ప్రతిష్ఠితమై లేదు కూడా। ఎందుకంటే అద్దాని మహిమ అద్దానికి అన్యము కాదు కాబట్టి। అది అనన్యము కాబట్టి। లోకరీతిగా 'గో సంపద, అశ్వ సంపద, ఏనుగుల సంపద, దాసులు-భార్య-గృహములు ఇవన్నీ ఆత్మయొక్క మహిమయే।" అని అంటూ ఉంటారు.

> **న అహం బ్రవీమి।** నేనైతే అట్లా చెప్పను. అనను. నేనేమంటానంటే... పై విశేషములే కాకుండా సమస్త జీవులు, సమస్త దృశ్యము ఆత్మయందే ప్రతిష్ఠితమై, ఆత్మకు అనన్యమై ఆత్మస్వరూప కారణంగా మహిమాన్వితమై ఆత్మకే స్వానుభవమగుచున్నాయి - అని।

## 7-25. పంచవింశ ఖండము - 'భూమా'యే నేను।

ఒక రచయిత యొక్క రచనా కళయే రచన అంతా నిండి ఉన్న రీతిగా, ప్రతి ఒక్క జీవునియందు 'భూమా' అయి

- క్రింద, పైన, వెనుక, ముందు, తూర్పు, పడమర, దక్షిణ, ఉత్తర ముఖములను నిండి ఉన్నది.
- **స ఏవ ఇదం సర్వమ్।** ఈ సమస్తము కూడా ఆత్మయొక్క ఔత్సాహిక ప్రదర్శనా చమత్కారమే।
- ఆత్మయందే అహంకారము "ఆదేశము" - (ఆరోపణ/ఒకటి దాచి మరొకటి చోటు పొందటము) - అనే చమత్కారమంతా (జలంలో అసంఖ్యాక తరంగములు వాటివాటి వివిధ ఆకారములు వలె) పరిఢవిల్లుతోంది.

## నేనే ఇదంతా

**అట్టి "భూమా"యే నేనై ఉన్నాను - "నేను" పై ఆదేశము!**

నేనే క్రింద, పైన, వెనుక, ముందు, కుడి, ఎడమ, ఉత్తర, దక్షిణ, తూర్పు, పడమరలలో (ఆభరణములో బంగారము వలె) నిండిఉన్నాను.

సమస్తము ఆత్మపై ఆరోపించబడుతోంది. కానీ సర్వదా ఆత్మయే సమస్తమునందు అంతరసత్యమై, బాహ్యప్రదర్శనమై, ఉభయత్రా అభేదమై వెలుగొందుచున్నది.

## ఆత్మయే ఇదంతా।

**ఇప్పుడు మనము "ఆత్మ"పై ఆదేశము (Attribution) చేసి చెప్పుకుందాము.**

- ఆత్మయే క్రింద, పైన, ఆవల, ఈవల, తూర్పు, పడమర, ఉత్తరము, దక్షిణము యందు నిండి ఉన్నది. ఆత్మయే నిండుకుండలో అంతటా నీరువలె, పాలలో సర్వత్రా వెన్నవలె ఏర్పడి ఉన్నది.

**- ఆత్మ ఏవ ఇదం సర్వమితి।** ఈ కనబడేదంతా ఆత్మయే।

ఎవ్వడైతే ఆత్మను ఈ విధంగా సర్వత్రా విస్తరించియున్నట్లు , సర్వులలో బాహ్య-అభ్యంతరములలో ప్రదర్శనమగుచున్నట్లు తెలుసుకోవటము, మననము చేయటము నిర్వర్తిస్తూ ఉంటాడో అట్టివాడే...

- సర్వదా ఆత్మయందు రమించువాడు.
- ఆత్మయందే క్రోడించువాడు.
- ఆత్మతో మిథునము (దాంపత్యము) పొందగలడు.

అట్టివాడు స్వరాట్ అయి ఇచ్ఛానుసారంగా సమస్త లోకములందు యథేచ్ఛగా సంచారవంతుడై ఉండగలడు. అమృత లోకములలో ప్రవేశించగలడు.

**యే అన్యథా అతో విదుః, అన్యరాజాన్ అస్తే, క్షయ్య లోకా భవన్తి।** ఎవడు ఆత్మను ఒక బాహ్య దేవతగానో, అన్యలోక నివాసిగానో, ఎప్పటికో - ఎప్పటికో సిద్ధించవలసినట్టిదిగాను భావిస్తాడో (లేక) ఉపాసిస్తాడో...

- అట్టివాడు రాజుకు లోబడి చరించే సేవకునివలె "నేను బద్ధుడనే" - అను భావమును వీడడు.

- 'వినాశనము' అనే ధర్మము ప్రవర్తించు లోకములలో ప్రవేశ-నిష్క్రమణములు నిర్వర్తిస్తూ ఉంటాడు.
- ఆతడు అస్వతంత్రుడై (Dependent, Non-liberated) ఉంటాడు.
  (HE CAN NOT PICK UP "THE SENSE OF INDEPENDENT SELF")

- ఆతడు సర్వలోకాలలో తన ఇష్టానుసారం విహరించలేడు - **తేషాం సర్వేషు లోకేషు అకామచారో భవతి।**

## 7-26. షట్‌వింశ ఖండము

## ఫలశ్రుతి

ఎవ్వరైతే **'ఈ సమస్త లోక - లోకాంతరములుగా లోకాంతర్గత సర్వ - స్థావర జంగములుగా పాంచభౌతికముగా, అభౌతికముగా కనిపిస్తున్నదంతా ఆత్మానంద స్వరూపమే"** - అని దర్శన - మనన - ఉపాసన - భావనలు చేస్తారో... ఎరిగి ఉంటారో...అట్టివారికి

- **ఆత్మవలననే** (By own self) - ప్రాణము.

- **ఆత్మవలననే** → స్మరణము, ఆకాశము, తేజస్సు, జలము, రాక-పోకలు (ఆవిర్భావ తిరోభావములు) అన్నము, బలము, విజ్ఞానము, ధ్యానము, చిత్తము, సంకల్పము, మనస్సు, వాక్కు, నామము, మంత్రము, కర్మ....

**ఆత్మవలననే సమస్తము లభ్యమైనవే ఉండగలవు.**

ఆత్మ తత్త్వము శ్రవణ మనన నిదిధ్యాసలచే ఎరిగి ఉన్నవాడు...దర్శించటము, అనుకోవటము, అనిపించటములను ఆశ్రయిస్తాడో - అట్టివాడు →

**- న పశ్యో మృత్యుం। పశ్యతి న రోగం। నోత దుఃఖితాం**

మృత్యు-రోగ దుఃఖములు పొందడు. సర్వము దర్శించగలడు. సర్వము సర్వత్రా పొందినవాడై ఉండగలడు.

ఆతడు....,

- ఏకమాత్రుడై ఉంటాడు.

ఏకమాత్రుడై...,

- మూడు రూపములు (జాగ్రత్ స్వప్న సుషుప్తులు) దర్శించువాడై ఉండగలడు.
- (ఏకమే అయిన బ్రహ్మము) స్వకీయ మాయచే రెండు, మూడు, పది, వంద, వేయి, వేలాది అనేక రూపములుగా తానే తనలో కలిగియున్నవాడు అయి ఉండగలడు.

## శాస్త్ర హృదయము

**ఆహారశుద్ధిః** : ముందు ఆహారము పరిశుద్ధముగా ఉండాలి (సాత్వికాహారము, న్యాయార్జితాహారము, దైవార్పితాహారము, మితాహారము) ఆహారశుద్ధి = శబ్దాది విషయ శుద్ధి।

**ఆహారశుద్ధే సత్త్వశుద్ధిః** ఆహార శుద్ధిచే సత్త్వశుద్ధి (అంతఃకరణ శుద్ధి) సిద్ధించగలదు.

**సత్త్వ శుద్ధే ధ్రువా స్మృతిః** : అంతఃకరణ శుద్ధిచే స్మృతి చాంచల్యము త్యజించి ధృవము (Stronger, Pure) అగుచున్నది. జ్ఞాపకశక్తి సునిశితమౌతుంది. బుద్ధియందు ధృవత్వము ఏర్పడగలదు. అనేక జన్మల బుద్ధిదోషములు, బుద్ధి చాంచల్యములు తొలగగలవు.

**స్మృతిలంభే సర్వగ్రంథీనాం విప్రమోక్షః** : స్మృతియొక్క ధృవత్వముచే సృష్టి - స్థితి - లయముల పట్ల ఏర్పడియున్న అనేక విషయవాసనల - మనోసంబంధ పాశముల విమోచనము (ప్రమోక్షము - Relieving) జరుగగలదు.

- **బ్రహ్మ గ్రంథి** = జన్మించుచున్నప్పటి మనోపాశములు, ఈ సృష్టి (జగత్తు) నిజంగానే సృష్టించబడింది – అనే భావనాత్మకమైన చిక్కుముడి.
- **విష్ణు గ్రంథి** = ఈ సృష్టితో సంబంధములను కొనసాగించు భావనలను బంధముల చిక్కుముడులు.
- **రుద్ర గ్రంథి** = ఈ సృష్టి (దృశ్యము)తో సంబంధ పాశములు తొలగాలనే వేదన (నిజమైతే కదా తొలగేది?)

అనేక జన్మలలో సంబంధములు కలిగియున్న కారణంగా నిర్మించుకొనియున్న కఠినీకృత భావనలతో ఏర్పడిన అవిద్యారూప అనర్థపాశములు తెగిపోగలవు.

కనుకనే నారదా! మీరు సర్వాత్మకమైన మీ కేవలాత్మయొక్క ఔన్నత్యము ఎరిగినవారవండి.

అట్టి ఆత్మయొక్క స్వకీయ స్వప్నమువంటి కల్పిత చమత్కారముగా ఈ జగత్తులను, జన్మకర్మలను, సంబంధ–బాంధవ్యములను వీక్షించండి.

సమస్తము మీ స్వరూపమేనని, సమస్తమునకు వేరు కూడా అయి ఉన్నారని మీ సహజస్వరూపమును దర్శించుచూ,

- సర్వాత్మకులై,
- సర్వతత్త్వస్వరూపులై,
- ప్రకృతి – పురుషుల సమాగమ చమత్కారమును సాక్షిగా వీక్షించుచు,
- సర్వలోకములు మీయందే ఉన్నట్లు గ్రహించినవారై

14 లోకములలో లీలగా, క్రీడగా కామచారులై (ఇచ్ఛాపూర్వకంగా సంచారములు చేయువారై) విహరించండి.

ఈ విధంగా శాస్త్రముల హృదయమును సనత్కుమారుడు – వేద హృదయమేమిటో – యుక్తియుక్తంగా నారదమహర్షికి విశదీకరించి బోధించారు.

కషాయము వలన శారీరక రోగములైనట్టి పైత్య జఠర దోషములు పొట్టలో తొలగి, జీర్ణశక్తి వృద్ధియై తిన్న ఆహారము జీర్ణమయి రసరూపంగా శరర భాగములన్నిటికీ శక్తి చక్కగా అందగలదు కదా।

శ్రీ సనత్కుమార – నారద సంవాదము యొక్క శ్రవణ మననములచే మనోబుద్ధులలో పేరుకొనియున్న భవరోగము (జగత్తే నిజమే అను) సాంసారిక దోషములు ఆ విధంగా తొలగిపోగలవు. సమస్తము ఆత్మభావనయందు జీర్ణమైపోగలవు.

ఈ ఉపనిషత్ విశేషములు అజ్ఞానమును చీల్చివేయగలదు.

కాబట్టి జగద్గురువగు శ్రీ సనత్కుమారుడు స్కందుడు (చీల్చివేయగలవాడు) అని స్తుతించబడుచున్నారు. **తం 'స్కన్ద' ఇతి ఆచక్షతే। తం 'స్కన్ద' ఇతి ఆచక్షతే।**

**26వ ఖండము సమాప్తము**

**ఛాందోగ్యోపనిషత్ సప్తమ (7వ) అధ్యాయః సమాప్తః ఇతి।**

**ఓం తత్ సత్ బ్రహ్మార్పణమస్తు।**

# ఛాందోగ్యోపనిషత్
# అష్టమ అధ్యాయము
## 8-1. ప్రథమ ఖండము - హృదయ పుండరీకము (పద్మము) - బ్రహ్మోపాసన

ఒక రాజుగారు ఉన్నారు. ఆయన రాజు కాబట్టి సమస్తమునకు అధికారి. ఆయన ముఖ్య పుర (పట్టణ) రాజాంతఃపురంలోను, రాజసభలోను వేంచేసినవారై ఉన్నారు. ఆ పట్టణములో అనేకమంది ప్రజలు, ఆయన అంతఃపురములో అనేకమంది సేవకులు ఉన్నారు. వారంతా రాజుగారిచ్చిన అధికారముతో రాజుయొక్క ఉద్దేశ్యములు, సంకల్పములు, ఆజ్ఞలు నిర్వర్తిస్తూ వారివారి విద్యుక్తధర్మములను నిర్వర్తిస్తూ ఉన్నారు. మంత్రులు సమాలోచనలు రాజుగారికి అందిస్తూ ఉన్నారు. సైన్యాధికారి రాజ్యపరిరక్షణ నిర్వర్తిస్తూ ఉన్నారు. బ్రహ్మాండముగా రాజ్యపాలన లీలగా జరుగుతోంది. రాజుగారి అధికారము ఆ రాజ్యములో ఎక్కడ ఉన్నది? సామ్రాజ్యమంతా విస్తరించి ఉన్నది.

ఇట్టి దృష్టాంతము సహాయముతో ఇప్పుడు గురుశిష్యుల మధ్య జరుగుచున్న హృత్ పుండరీక (పద్మ) - అంతరాకాశ - హృదయాంతఃపుర జగత్ కల్పనా - “ఆత్మ” యొక్క పరివేష్ఠిత్వము, మనోబుద్ధి చిత్త అహంకారముల సేవనములు శాస్త్రములచే బోధించబడుతోంది.

---

కొందరు శిష్యులు గురుదేవులవారిని ఆత్మజ్ఞాన భిక్షకై ఆశ్రయించారు.

---

**శిష్యులు** : గురుదేవా! బ్రహ్మపురము - అన్వేషణ అను విశేషముల గురించి మీ సవివరణను శ్రవణం చేయాలని ఉత్సుకత పొందుచున్నాము. దయతో వివరించ ప్రార్థన. మేము అన్వేషించవలసిన పరాకాష్ఠ వస్తువు ఏది?

**గురుదేవుడు** : పరబ్రహ్మ స్వరూపులగు ఓ విద్యాధ్యయునులారా! మీరు అడిగిన దానిగురించి వేదాంత విజ్ఞాన సంబంధమైన ఆర్య వచనములను దృష్టిలో పెట్టుకొని వివరించి చెపుతాను. శ్రద్ధగా వినండి.

---

దేహిచే ధారణ చేయబడుచున్న ఈ దేహములో **“విశ్వానంద స్వరూపుడు, విశ్వగతుడు, విశ్వుడు, అవిశ్వుడు”** అగు పరబ్రహ్మమూర్తి వేంచేసినవారై ఉన్నారు. అందుచేత ఇది “బ్రహ్మపురము” అని పిలువబడుతోంది.

అట్టి ఈ బ్రహ్మపురములో దహరము (హృదయము) అనే సూక్ష్మమగు ఆకాశ గృహము, ఆ దహరాకాశ గుహలో ఒక తెల్లటి పద్మము (పుండరీకము) (జ్ఞాన పుష్పము), ఆ పద్మములో మరెంతో సూక్ష్మమగు అంతరాకాశము, అట్టి అంతరాకాశములో గల దానిని మీరంతా చక్కగా పరిశోధించి తెలుసుకొని ఉపాసించండి. దానిపట్ల జిజ్ఞాసువులై ఉండండి. గురు ఆశ్రయము, శ్రవణ మననములు నిర్వర్తించండి.

**శిష్యులు** : గురుదేవా!

- ఈ (దేహ) బ్రహ్మపురమునందుగల సూక్ష్మమైనట్టి కమలాకార హృదయాకాశమును ఎట్లా గుర్తించాలి? అట్టి హృదయ పద్మములోగల అంతరాకాశమును మేము దర్శించేది ఎట్లా? అట్టి అంతరాకాశములో మేము దర్శించవలసినది దేని గురించి?

**గురుదేవులు** : ఈ బాహ్యాకాశము అంతుపొంతు లేనిదై కనిపిస్తోంది కదా! అట్లాగే హృదయములోని ఆకాశము కూడా అనంతమైనది. ఈ దృశ్య బ్రహ్మాండములో కనిపించే దేవతాలోకములు, భూమి (పృథివి) - ఉభయము ఈ అంతరాకాశములోనే సంవేద్యమై (Encompassed) ఉన్నాయి. అంతేకాదు! ఇక్కడ కనిపిస్తున్న అగ్ని, వాయువు, సూర్యుడు, చంద్రుడు, విద్యుత్తు (తేజము), నక్షత్రములు, ఇంకా ఇక దృశ్యములో కంటికి - అనుభవానికి లభించనివి- మొదలైనవన్నీ హృదయాకాశములోనే సంస్థితమై ఉన్నాయి. సర్వజగత్తులు అట్టి హృదయాకాశమునందే కథలోని వర్ణనములు వలె, అద్దములో ప్రతిబింబములు వలె కల్పించబడి, ఉనికిని పొందుచున్నాయి.

**శిష్యులు** : గురువర్యా! ఆకాశమే ఉపాధి రహితం కదా! ఇక 'బ్రహ్మపురము' అనదగు ఈ శరీరములోని హృదయాకాశములోనే ఈ కనబడే సర్వభూతములు (జీవులు), వారివారి ఇచ్ఛలు (కామములు) మొదలైనవన్నీ ఏర్పడి ఉన్నట్లుగా గమనిస్తూ ఉపాసించవలసినదిగా మీరు ఆజ్ఞాపిస్తున్నారు.

**ఇప్పుడు ఒక సందేహము.**

**అట్టి ఈ శరీరము ఒకప్పటికి వార్ధక్యదశ పొంది, ఆ తరువాత నశించి పోవటం జరుగుచున్నప్పుడు, అప్పుడు హృదయాకాశములోని లోకాలు, భూతజాలము మొదలైనవన్నీ ఏమౌతున్నాయి**? అవి కూడా నశిస్తున్నాయా? దేహము నశించిన తరువాత ఇంకా కూడా ఏమేమి శేషిస్తున్నాయి?

కుండ పగిలినప్పుడు కుండలోని పాలు నేలపై పడి నశించిపోయినట్లు, దేహము నశించవచ్చు గాక। హృదయాకాశములోని అగ్ని, వాయువు, సూర్యుడు, చంద్రుడు,విద్యుత్తు, నక్షత్రములు, లోకములు మొదలైనవి కూడా నేలపై పాలు కారినట్లు కారి నశిస్తాయా? అప్పటికీ హృదయంలో అంతటికీ భిన్నంగా ఏదైనా శేషిస్తున్నదా? అద్దానిగురించి వివరించండి.

**గురుదేవుడు :** ఆత్మ స్వరూపులగు తత్త్వాధ్యయనులారా! మీ ప్రశ్నకు సమాధానము సూక్ష్మ దృష్టితో వినండి.

ఆకాశములో ఏర్పడినవైయున్న వస్తువులు, నశించినప్పుడు (అనగా) అగ్ని ఆరిపోయినప్పుడు గాని, గాలి తొలగినప్పుడు గాని – ఆకాశము నశిస్తుందా? నశించదు కదా!

అట్లాగే **న అస్య జరయ ఏతత్ జీర్యతి? న వధేన అస్య హన్యత।** దేహము యొక్క వార్ధక్యము చేతగాని, దేహము నశించటము చేతగాని హృదయాకాశము నశించదు. కలలో చూచిన జీవులకు, సమస్త వస్తుజాలమునకు 'నశించటము' అనే ధర్మము ఏముంటుంది? అవన్నీ మొదలే సత్యము కావు కదా! ఈ దేహము, అద్దాని జనన – మరణములు హృదయాకాశము దృష్ట్యా కలలో చూచిన సంగతి, సందర్భముల వంటివి మాత్రమే! మిథ్యయే! ఆత్మ వేరు. దేహము వేరు. దేహమునకు దెబ్బ తగిలితే, అది ఆత్మకు తగలదు.

**"బ్రహ్మపురము"**లో ప్రకాశమైయుంటున్న బ్రహ్మాకాశము (దహరాకాశము, హృదయాకాశము) 'సత్యము'. ఇక ఈ దేహమో? కలలో కనబడిన వస్తువువంటిది. కాబట్టి సత్యము కాదు.

సమస్త కామములు (చూడాలని అభిలషించేవన్నీ) 'బ్రహ్మము' అని పిలువబడే ఆత్మయందే – దర్పణంలో దృశ్య పరంపరలవలె – సమాహితమై ఉన్నాయి. రాజు కోరినట్లు సభ ఉన్నట్లే – 'ఆత్మ' కోరుకున్నట్లే సమస్తము రూపము పొంది వర్తిస్తున్నాయి.

అట్టి **"కేవలము, నిత్యము, సత్యము"** అగు మనందరి అఖండాత్మ ఎట్టిది? ఎట్టిదో వినండి.

దేనియందు సమస్తము సమాహితమై (ఏర్పడినదై) ఉన్నదో, …అట్టి ఆత్మ –

**అపహత పాప్మా** : సమస్త దోషములు తొలగించుకోగా అనుభవమయ్యేది. **ఎట్టి దోషములు అంట జాలనిది.**

**విజరో** : జరామరణములు లేనట్టిది. వార్ధక్యము, నశించటము అనుధర్మములచే స్పృశించబడనది.

**విమృత్యో** : శరీర ధర్మమైనట్టి 'మృత్యువు' అనునది ఆత్మకు (బ్రహ్మాకాశమునకు) లేదు.

**విశోకో** : ఇష్టమైనవి లభించినప్పుడు సంతోషించటము, అవి కోల్పోయినప్పుడు శోకించటము – ఇవన్నీ మనస్సు యొక్క ధర్మములు. ఆత్మ నిత్య ప్రకాశకము. అద్దానికి శోకించటము, ఆదుర్దాపడటము, వేదన చెందటము, విసుగుపడటము – మొదలైన ధర్మములు (Features) ఏమాత్రమూ లేవు. మానసిక సంతాపములు మనస్సుకు సంబంధించినవేగాని ఆత్మకు సంబంధించినవే కావు.

**విజిఘత్సో అపిపాసః** : ఆకలి – దప్పిక అను భౌతిక ధర్మములు లేనట్టిది. భోజనేచ్ఛ, పిపాసేచ్ఛలచే బద్ధము, పరిమితము కానట్టిది.

**సత్యకామః** : అది ఏది కోరుకొంటే అదే సత్యమౌతుంది. అది ఏది ఇష్టమని తలిస్తే అది అట్లే ఇష్టముగా అనుభూతమౌతుంది. 'సత్యము'గా ప్రాముఖ్యత పొందగలదు.

**సత్యసంకల్పః** : అది దేనిని ఏదిగా (తుచ్ఛముగానో, అధికమనియో, జీవుడనో, ఈశ్వరుడనో, పరమాత్మ అనో) సంకల్పిస్తే – అది అట్లే సంకల్పితము అవుతుంది. **'ఈ దృశ్యము సత్యమే'** అని సంకల్పిస్తే సత్యమనియే అనుభూతమవగలదు.

అట్టి ఆత్మ గురించియే తెలుసుకోవాలి సుమా? ఈ విశ్వ సభలో ఆత్మయే రాజాధిరాజు.

ఒకవేళ అట్టి ఆత్మను తెలుసుకోపోతేనో? ఏవిధంగా రాజు వద్ద తమ ఆయా విద్యుక్త ధర్మములు నిర్వర్తించే మంత్రి, సేనాని, సైనికుడు, సేవకులు, ద్వారపాలకులు మొదలైనవారంతా రాజాజ్ఞకు రాజశాసనమునకు లోబడి అస్వతంత్రులై కర్మలు నిర్వర్తించుచూ ఉంటారో – ఆ తీరుగా ఈ జీవుడు అస్వతంత్రుడై ఉంటాడేగాని ఆత్మ స్వాతంత్ర్యమును అనుభూతపరచుకోలేడు. (ఆత్మవాన్ ఏవ **బలవాన్।** ఆత్మవాన్ ఏవ **జీవతి।** ఆత్మవాన్ ఏవ **సుఖవాన్।** తస్మాత్ ఆత్మమయో భవ – యోగవాసిష్ఠము)

**శిష్యులు** : అయితే కర్మఫలములు ప్రయోజనములు ప్రసాదించేవి కావా? కర్మలచే ఉత్తమ లోకములు లభించవా? 'సత్కర్మలు సుఖ లోకములను ప్రసాదించటము' ఉంటుంది కదా!

**గురువర్యులు** : ఇహ కర్మలకు ఉత్తమ – అధమ లోక ప్రవేశముల ప్రయోజనము దృశ్యముపై దృఢమైన నమ్మకము ఉన్నంత వరకు ఉంటాయి. అయితే ఇక్కడే ఎవరైనా డబ్బు సంపాదించి, ఆ తరువాత ఖర్చు చేసివేస్తూ ఉంటే ఆ డబ్బు కరిగిపోతుంది కదా! అట్లాగే పుణ్యకర్మల వలన లభించిన పుణ్యలోకములు కూడా (సుఖమయ లోకములు కూడా) పుణ్యక్షయముచే ఆతనిపట్ల నశించగలవు.

అయితే ఆత్మజ్ఞానముచే పుణ్య – పాప లోకములు, కర్మలు, కర్మఫలములు స్వప్నములోని వస్తువువలె లేనివే అవుతాయి.

ఎవ్వరైతే ఆత్మ తత్త్వజ్ఞానము (ఆత్మయొక్క సత్యకామన జగత్కల్పనా చమత్కారములు) తెలుసుకోకుండానే పరలోకము (State of Post death) ప్రవేశిస్తారో, వారు కర్మఫలవశులై ఉంటారు. "యథేచ్ఛా గమనము, యథేచ్ఛా సంచారము (Wandering as they themselves like it) సిద్ధించుకోలేదు. ద్వంద్వ మోహములు ఆత్మజ్ఞానికి ఆత్మతత్త్వానుభవము సిద్ధిస్తుండగా దీపము వెలిగిన తరువాత చీకట్లు వలె తొలగిపోతాయి. ఎవరైతే "ఆత్మయొక్క సత్యకామ – సత్య సంకల్ప" విశేష లక్షణములు తెలుసుకొనినవారౌతారో అట్టివారు సర్వలోకములలో కామచారులై (యథేచ్ఛగా సంచరించగలుగువారై) ఉంటారు. సమస్త లోకములను తయమందు దర్శిస్తూ, సమస్త లోకములలో వారు కోరుకొన్న తీరుగా, కోరుకొన్నచోట స్థితి – స్థానములను లీలగా, క్రీడగా ఆస్వాదించగలరు.

కనుక బిడ్డలారా!

శాస్త్ర – గురు వాక్యముల పరమార్థమును శ్రవణం చేసి స్వతంత్రులు (Liberated, Independent) అయ్యెదరు గాక! అందుకు ఉపాయము ఆత్మజ్ఞానమే! **(తరతి శోకమ్ ఆత్మవిత్)**

## 8-2. ద్వితీయ ఖండము – ఆత్మ ఇచ్ఛాలోక విహారి

ఆత్మయొక్క "సత్యకామ–సత్యసంకల్ప" తత్త్వములు ఎట్టివో ఎరిగినప్పుడు – అట్టివాడు స్వేచ్ఛావిహారుడై, సర్వలోకపూజ్యుడై వెలుగొందగలడు. **సర్వత్రా ఆత్మను దర్శిస్తూ, సమస్తమునందు ఆత్మను ఉపాసించుచూ, ఆత్మయందే సమస్తము చూచువాడు సర్వశ్రేష్ఠుడై ఉంటాడు.**

**అట్టివాడు పితృలోకము కోరుకుంటే** – జీవుల ఉత్పత్తికి కారణమై సుఖరూప హేతు భూతములైన పితృలోకములలో సంకల్పమాత్రంగా ప్రవేశించగలరు. శుద్ధచిత్త ప్రభావముచేత పితృలోక సంపన్నుడగుచూ, పితృలోకములో మహిమాన్వితుడై పూజింపబడగలడు.

**ఆతడు మాతృలోకములో ప్రవేశము కోరుకొంటే** – మాతృవాత్సల్యముతో నిండిన మాతృలోకమును సంకల్పమాత్రంగా ప్రవేశించి – సముత్తిష్ఠత (శ్రేష్ఠత్వము) పొందగలడు. మాతృలోక ప్రవేశ సంపన్నుడై, మాతృలోకములో గౌరించబడగలడు.

**భ్రాతృలోక ప్రవేశము కోరుకుంటే** – సంకల్పమాత్రంగా భ్రాతృలోకము (Zone of Brotherhood) ప్రవేశించి భ్రాతృగణములో ఒకడై ఉపస్థితుడు కాగలడు. భ్రాతృలోక సిద్ధి మహిమలను పొందగలడు.

**ఒకవేళ సోదరీ (స్వప్న) లోకము ప్రవేశించ ఇచ్ఛగిస్తే** – సంకల్పము చేతనే 'సోదరీ' లోకములో ప్రవేశించి, సోదరీలోక సంపన్నుడై గౌరవించబడగలడు. సోదరీ లోకములో పూజింపబడువాడు అవగలడు.

**సర్వత్రా "స్వస్వరూపాత్మ" యొక్క విన్యాసముగా దర్శించు ఆతడు** – "సఖీ (స్నేహితుల) లోక కాముడు" అయితే సంకల్పమాత్రం చేత సుఖాలతో సుసంపన్నుడై మహిమాన్వితుడు కాగలడు.

**గంధమాల్యలోకము పట్ల ఇష్టుడైతే** – సంకల్ప మాత్రంచేతనే గంధమాల్య లోకవాసుడై అక్కడ పూజనీయుడు కాగలడు.

**అన్న – పాన సంబంధ లోక కాముడైతే** – సంకల్పమాత్రంచేత అన్న పానములచే సముపత్తిష్ఠుడు అయి సుసంపన్నుడు పూజనీయుడు కాగలడు.

**గీతావాద్య సంబంధ లోకమును ఆతడు కావాలని అనుకుంటే** – గీతావాద్యముల ప్రాప్తిచే సంపన్నుడై, శ్రేష్ఠుడు కాగలడు.

**ఆతడు స్త్రీలోక కాముడైతే** – స్త్రీ లోకములో సంకల్పమాత్రంగా ప్రవేశించి, శ్రేష్ఠుడుగా పూజించబడగలడు.

> **ఆ సమస్తము "ఆత్మ"గా ఎరుగుచు, దర్శించుచు ఆత్మయందు ప్రవేశము పొందినవాడు ఏఏ భోగములు వాంఛిస్తే అవన్నీ సంకల్పమాత్రం చేతనే ఆతనికి ప్రాప్తించగలవు.**

ఆత్మజ్ఞాని స్వేచ్ఛావిహారి అయి లోకములలో సంచరించుచూనే సమస్త లోకములను (దర్పణంలో ప్రతిబింబమువలె) తనయందే దర్శించగలడు కూడా.

## 8-3. తృతీయ ఖండము – "సత్యమును ఆవరించి ఉంటున్న అసత్యము"

**శిష్యులు** : ఆత్మ సర్వస్వాతంత్ర్యమైనదని, ఈ జీవుడు స్వతఃగా "ఆత్మస్వరూపుడే" అని, ఆత్మయొక్క ఔన్నత్యము ఎరిగినప్పుడు, సంకల్పమాత్రముచే ఇష్టానుసారము సమస్త లోకములలో ప్రవేశము పొంది, ప్రతిష్ట కలిగియుండగలడని తమరు ప్రవచించుచున్నారు కదా! మరి ఈ జీవుడు 'నేను స్వర్గలోకము చేరెదను గాక' అని అనుకున్నప్పటికీ "కర్మానుసారంగా భూ–పాతాళాది లోకములు చేరును" అని శాస్త్రములు ఎందుకు హెచ్చరిస్తున్నాయి? **ఈ జీవుని నడిపేది ఆతని ఇచ్ఛయా? లేక కర్మలా? కాక మరింకేదన్నానా?** ఈ ప్రశ్నకు మరల సమాధానము ప్రసాదించండి.

**గురుదేవుడు** : ప్రియ ఆత్మ స్వరూపులారా! ముముక్షు శ్రేష్ఠులారా! ఈ జీవుడు స్వతఃగా ఆత్మస్వరూపుడే! ఆత్మయే సత్యము. ఇందులో సందేహము ఉండవలసిన పనిలేదు. ఇది వేద వాఙ్మయము వాక్కు కదా! అయితే మీరు చెప్పినట్లు ఈ జీవుడు సుఖమయ లోకాలు కావాలనుకొని కూడా దుష్టకర్మల ప్రభావంచేత 'దుఃఖము–బంధము' రాజ్యమేలు లోకాలకు రాకపోకలు కొనసాగిస్తున్నాడు. ఎందుచేతా? వినండి.

### సత్యాః కామా అనృతా అపిధానాః।

ఈ జీవుని "సత్యకామము, సత్యసంకల్పము" ఈ రెండూ కూడా "అసత్యము, మిథ్య" అయిన విశేషాలతో కప్పబడుచున్నాయి. (అపిధానము అగుచున్నాయి. The Truth is being covered by false and merely illusionary perceptions).

"సత్యము – యమ్ సత్ – ఎప్పటికీ ఉండేది అయి ఉంటుంది.

స్వస్వరూపము స్వతఃగా ఆనందరూపమే! కానీ అద్దానిపై...

- బంధుమిత్రుల గురించిన సంబంధ అనుబంధ బాంధవ్యములు
- ధన – భూ – గృహ – బంగారు – పశు సంపదలపట్ల ఉచ్ఛ – నీచ భావావేశములు,
- ఆశ–నిరాశ–భయ–ఆందోళనలు

మొదలైనవన్నీ దృశ్యముతో ఏర్పడుచున్న అవిచక్షణాపూర్వక సంబంధముల రూపం దాల్చి జన్మజన్మాంతరములుగా రూపుదిద్దుకొని ఉంటున్నాయి. ఆత్మయొక్క వాస్తవానుభవమును, స్వస్వరూపముయొక్క నిత్యస్వాతంత్ర్యమును ఏమరిపింపజేయుచున్నాయి.

సత్యకామ-సత్యసంకల్పరూప "ఆత్మకామమే - ఆత్మ సంకల్పములే" సత్యము అని ప్రతి జీవునికి తెలిసి కూడా సందర్భమాత్రములు అగు అనృతములే (Falsehood) దృష్టిని (అభ్యాసవశంగా) ఆక్రమించుకొని ఉంటున్నాయి.

మిథ్యయగునది ఎప్పటికీ (సర్వవేళలో) మిథ్యయే అయి ఉన్నది. మిథ్య అయినది మరల 'సత్యము'గా మారుతుందా? మారదు. కలయే సత్యము కదా! మరి 'కలలో అదే చూడాలి. ఇది చూడనే కూడదు" అను రూపముగల సంకల్పములు అసత్య సంకల్పములు, అసత్యకామములు అగుచున్నాయి. అందుకే అవి సిద్ధించటము లేదు.

**శిష్యులు** : **గురుదేవా !** ఈ తల్లి, తండ్రి, పుత్ర, పుత్రికా, మిత్ర, గృహ ఇత్యాది ఆశించు విషయాలన్నీ ఎదురుగా ఘనీభూతమై ప్రాప్తిస్తూ ఉండగా, అవి 'అనృతము' అనేది కుదురకున్నది కదా! ఇవి 'నిజము కాదు' అనేది ఎట్లా యుక్తి యుక్తం? అట్టి ఆశ మొదలైనవన్నీ అసత్య సంకల్ప - అసత్య కామములేనని మీ ఉద్దేశ్యమా?

**గురుదేవుడు** : **యో యో హి అస్యేతః ప్రైతి, న తమ్ ఇహ దర్శనాయ లభతే။** "ఈ దృశ్యములో జీవులకు ఒకరితో ఒకరికి బంధు-మిత్ర-శత్రు-ప్రియ-అప్రియ-జాతి...ఇత్యాది పరస్పర సంబంధములు ఎంతవరకు శాశ్వతము?" - ఇది గమనించి జీవులచే నిత్య అనిత్యా వివేకము ఆశ్రయించబడుగాక। ఎందుకంటే ఈ ప్రాణియొక్క ఏ ఏ తల్లి-తండ్రి - తాత-ముత్తాత ఇత్యాది బంధువులున్నారో వారంతా కూడా వారి మరణానంతరము - ఆ ప్రాణి ఎంతగా కోరుకున్నా తిరిగి ఈ లోకములో లభించటమే లేదు కదా!

అయితే జీవించియున్న, మరణించియున్న ప్రియమైన బంధువుల జ్ఞాపకాలు మాత్రం హృదయమునందు ఈ ప్రాణి కలిగి ఉంటున్నాడు. అనగా **ఇక్కడి ప్రియానుభవములన్నిటికీ స్థానము హృదయమే।** అట్టి హృదయములో ఆత్మస్వరూప స్వభావములు నిత్యసత్యమై ఉన్నప్పటికీ, "సత్యకామ సత్య సంకల్ప ఆత్మ"ను ఇహ సంబంధమైన జ్ఞాపకములు కప్పి ఉంచుచున్నాయి. సత్యమును అనృతము కప్పి ఉంచుతోంది. అదియే 'మాయ', 'సంసారము', భవబంధము - మొదలైన శబ్దములచే ఉద్దేశించబడుతోంది. వాస్తవానికి ఈ జీవుడు (ప్రాణి) ఆత్మస్వరూపుడేనని చెప్పుకున్నాము కదా! కనుక ఆత్మ యొక్క మహదత్వము సత్యకామము, సత్యసంకల్పముల గురించి తెలియని జీవుడు (ప్రాణి) ఎవ్వడూ లేడు. (గాఢనిద్రలో నిర్విషయమగు ఆత్మ యొక్క సామీప్యము ప్రతి జీవునికి అనుభవమగుచున్నదే కూడా)। అయితే స్వప్న-జాగ్రత్తులలో తనను తాను ఏమరచుచూ లీలగానో, క్రీడగానో, ఏమరపుగానో-అసత్యకాముడు అసత్యసంకల్పుడు అయి సంచారములు చేస్తున్నాడు.

## అందుకు ఒక దృష్టాంతము చెపుతాను, వినండి.

ఒక ధనికుడు ఉన్నాడు. ఆతడు తీర్థయాత్రలకు బయలుదేరబోతున్నాడు. దొంగల బాధను దృష్టిలో పెట్టుకొని తన తోటలో ఒకచోట భూమిని త్రవ్వి 'రత్నములు, బంగారము' మొదలైన వస్తువులను రహస్యంగా పాతిపెట్టి ఇక తీర్థయాత్రలకు బయలుదేరాడు. సుదీర్ఘకాలం తరువాత తీర్థయాత్రలు ముగించుకొని ఇంటికొచ్చాడు. తాను నేలలో పాతిపెట్టి దాచి ఉంచిన ప్రదేశ స్థలమునకు వెళ్లాడు. అక్కడ గడ్డి మొక్కలు పెరగటంచేత ఏ స్థలములో పాతిపెట్టాడో గుర్తుపట్టలేక "ఎక్కడ త్రవ్వాలి"...అనుకుంటూ అక్కడక్కడే తచ్చాడుతూ ఉండసాగుచున్నాడు. మధ్యమధ్యలో తాను దేనికి వెతుకుచున్నాడో అది మరచి "ఈ మొక్కలు ఏ జాతివి? ఈ పూలు ఎటువంటివి?- ఇటువంటి విషయాలు దీర్ఘకాలంగా పరిశీలించటం, పరిశోధించటం చేస్తున్నాడు.

అదే విధంగా ఈ జీవుడు తన ఆత్మస్వరూపమును దాచి, జన్మకర్మల చమత్కార రూపముగా దృశ్యపరంపరలలో ప్రవేశించి సుదీర్ఘ కాల గమనానంతరము తన హృదయమునందు దాచి ఉంచిన ఆత్మానుభవజ్ఞానమును తానే గుర్తించలేక రాత్రింబవళ్ళు వెతుకుచున్నాడు. కాని లభించటం లేదు. ఈ జీవులంతా కూడా నిత్యము బ్రహ్మలోకమునకు (గాఢనిద్రా సమయంలో) వెళ్ళి వస్తూ ఉన్నప్పటికీ బ్రహ్మమును గుర్తించకపోవటము జరుగుతోంది. **ఇమాః సర్వాః ప్రజాః అహరహః గచ్ఛన్త్య, ఏతం బ్రహ్మలోకం న విన్దన్తి।**

ఎందుచేత?

**అనృతే న హి ప్రత్యూఢాః။** అసత్యము (అనృతము) చేత మోహితులై ఉన్నందువలననే తమ సత్య-నిత్య నిర్గుణ-నిరాకార-అప్రమేయ ఆత్మస్వరూపము యొక్క అనుభవమును ఆరూఢము (Fix up) చేసుకోలేక పోవుచున్నాడు.

# సంప్రసాదుడు

**శిష్యులు** : స్వామీ! ఆత్మను ఎక్కడ దర్శించాలి? ఎట్లా దర్శించాలి?

**గురుదేవుడు** : ఈ విషయం మరల చెప్పుచున్నాను. వినండి.

అమృత స్వరూపమగు ఆత్మ మీలో ప్రతి ఒక్కరి యొక్క, నాయొక్క ప్రతి ప్రాణియొక్క హృదయముననే వేంచేసి ఉన్నది. 'హృదయము' అను శబ్దము నిరుక్త శాస్త్రానుసారము (శబ్దోత్పత్తి శాస్త్రానుసారము) ఈ విధంగా చెప్పబడుతోంది.

హ+ఋత్+ఇ = సత్యమగు 'అహమ్' రూపంగా

**హృదయము =** హృది (అంతరముననే) = (హృదయమునందే)

అయమ్ = ఏర్పడి ఉన్నదై ఉన్న "ఆత్మ"

– సత్యమగు ఆత్మ అందరికి అంతరముననే ఉన్నది.

– అనగా తాను చూడలేకపోతున్న ఆత్మ తనయందే ఉన్నది.

తనయందే ఉన్న ఆత్మను తెలుసుకున్నవాడు "సంప్రసాదుడు" అని పిలువబడుచున్నాడు.

**సంప్రసాదము =** "దేహాత్మ భావము, దృశ్యాంతర్గతాత్మ భావము" – అనే "అజ్ఞానము" నుండి ఈవలికి వచ్చి "పరంజ్యోతి స్వరూపమగు ఆత్మ"ను ఆశ్రయించి అట్టి ఆత్మతో మమైక్యమవటము.

ఈ జీవుడు తానే ఆత్మ అయి ఉన్నాడు. "జీవాత్మ" అనగా జీవుడుగా ఉన్న ఆత్మ! అంతేగాని 'ఆత్మకు వేరైన జీవుడు' అని కాదు సుమా! అట్టి "ఆత్మ"యే

❋ అమృతమ్ – మృతము (చావు) అనే ధర్మము లేనిది కాబట్టి **అమృతము.**

❋ అనన్తమ్ – అంతము లేనిది కాబట్టి **అనన్తము.**

❋ అభయమ్ – అద్దానికి ద్వితీయమే లేదు. కాబట్టి – **అభయము.**

– అట్టి మన సహజ సత్ (Sense of Existence) అనునదే "యత్ – సత్" = సత్యము.

– అదియే ఈ జీవునికి సంబంధించిన పరాకాష్ఠ సత్యము కాబట్టి 'బ్రహ్మము' అనబడుతోంది.

**ఈ విధంగా ఈ జీవుడు సత్ – చిత్ – ఆనందస్వరూపమగు బ్రహ్మము – సత్యము – నిత్యము అయియే ఉన్నాడు.**

---

ప్రియ శ్రోతలారా! బిడ్డలారా! ఇప్పుడు మనము 'సత్యము' అను శబ్దముయొక్క వ్యుత్పత్త్యార్థము నిరుక్తశాస్త్రార్థము (మరల) చెప్పుకుందాము.

## "సత్యమ్"

**"స" "తీ" "యమ్"** – అనునది '3' నామాక్షరములు.

"స" కారము: ఎప్పటికీ యథాతథమై ఉండేది. మృతము లేనిది. 'అమృతము'

సత్ లో 'త్' = సద్ – ధాతువు → అమృతమునకు వాచకము.

"తి" = ('త'కారము) మర్త్యము 'మార్పు' అను ధర్మము కలిగి ఉన్నట్టిది.

"యమ్" = 'స' కార అమృతమునకు – తకార 'మర్త్యము'నకు రెండు అక్షరములను నియమనము (coincide) చేయునది కలుపునది.

సత్–యమ్= సత్యము

మర్త్–యమ్ = మర్త్యము – 'యమ్' చే 'సత్యమ్' అని పలుకువాడు ఆ రెండిటిని నియమనము (వశీభూతము) చేసుకొనగలడు.

యమ్ = నియమనము - నియమించువాడు.

'నియమనము' చేయువాడే - "ఎరిగినవాడు"! తెలుసుకొనుచున్నవాడు।" **ఏవమ్ ఏవ 'విత్'।** ఈ విధంగా సత్యము, బ్రహ్మముల గురించి తెలుసుకొన్నవాడు దివ్యలోక ప్రవేశము, దివ్యత్వము సిద్ధించుకోగలడు. అట్టి సత్యము, బ్రహ్మము తానే అయి సర్వత్రా ప్రకాశమానుడై ఉండగలడు. తాను ఆద్యంతరహితుడై తనయందు తానే సమస్త లోకముల రూపముగా వినోదిస్తూ విహరించగలడు.

## 8-4. చతుర్థ ఖండము - "పరమాత్మ సేతువు వంటిది"

**శిష్యులు** : గురుభగవాన్! **"సేతురాత్మ", "ఆత్మైవహి సేతుః"** - అని చెప్పుకోబడే ఆత్మతత్త్వ వివరణ సూత్రము తత్త్వశాస్త్రములో ప్రసిద్ధమైయున్నది కదా! అట్టి **'ఆత్మ సేతువు వంటిది'** (Athma is like a bridge that connects two ends) గురించి వివరించమని మీకు వినతి! (సేతురాత్మ, సేతు మాధవ, సేతుశివ మొదలైన శబ్దముల అంతరార్థము చెప్పండి - అని శిష్యుల అభ్యర్థన).

**గురుదేవుడు** : ప్రియ బిడ్డలారా! మనము ఇప్పుడు "ఆత్మ ఏవ హి సేతుః" అను ఆధ్యాత్మిక విశేషము గురించి ప్రవచించుకుంటున్నాము. మీరంతా శ్రద్ధ, ఏకాగ్రతలతో వినండి.

జీవుడు ఎల్లప్పుడు

ఒక ఆలోచన నుండి → మరొక ఆలోచనకు

ఒక సందర్భమునుండి → మరొక సందర్భమునకు

ఒక విషయజ్ఞానము నుండి → మరొక విషయ జ్ఞానమునకు

ప్రయాణీకునివలె అనుక్షణము ప్రయాణిస్తూనే ఉంటున్నాడు. బహుదూరపు బాటసారివలె దేహమునుండి దేహమునకు, లోకమునుండి లోకమునకు ప్రయాణములు సలుపుచున్నాడు.

ఆత్మ ఎక్కడున్నది?

ఆలోచన - ఆలోచనల మధ్యగా

సందర్భము - సందర్భము మధ్యగా

విషయము - విషయము మధ్యగా

వారధివలె (సేతువువలె) ఏర్పడినదైయున్నదని ఆత్మ గురించిన గుర్తును విశ్లేషించు మహనీయులు మనకు చెప్పుచున్నారు. **య ఆత్మ స సేతుః విధృతిః।** ఇటు ఇహము - అటు పరము (నాటక పాత్ర - నటుడు)లను విశేషమైన ధృతితో (గట్టిగా) పట్టుకొని ఉన్నట్టిదే 'ఆత్మ'. (నటుడు -నాటకంలోని పాత్రల మధ్యలో నిర్విషయమై ఏర్పడి ఉన్నదే ఉపాసనకై ఆత్మవస్తువు). అట్టి ఆత్మను అతిక్రమించి ఎక్కడా ఏదీ లేదు. కాలము, కాల విశేషములగు పగలు - రాత్రి మొదలైనవి ఆత్మకు ఈవలనే లోబడినవై ఉంటాయి. ఆత్మ కాలాతీతము, కాలమును కల్పించి నియమించునది కూడా! జీవుడు అను 'అనుభవి (The Experiencer)' - (మరియు) అనుభవములు (Experiences) రెండిటినీ నియమించునది కూడా ఆత్మయే! అట్టి ఆత్మను శారీరక ధర్మములైనట్టి జన్మ-జరా-మృత్యువులు, మనోధర్మములైనట్టి శోక-మోహములు, సుఖదుఃఖ కారణములైనట్టి పుణ్య-పాపములు కించిత్ కూడా సమీపించలేవు, స్పృశించలేవు. ఈ జగత్తులో కనిపించే అనేకములైనట్టి జాతుల-వర్ణాశ్రమముల, క్రియల, కారకముల, కర్మఫలముల భేదములు ఆత్మచేతనే 'ధారణ' చేయబడుచున్నప్పటికీ 'ఆత్మ'ను తాకజాలవు. అవన్నీ ఈశ్వరుడే ధరించి యుండటంచేత "ఈశ్వరుడే (ఆత్మయే) సేతువు"గా చెప్పబడుతోంది.

ఎవ్వరైతే ఆత్మను లేక బ్రహ్మజ్ఞానమును ఉపాసిస్తాడో, అట్టివాడు సర్వపాప దోషముల నుండి నివృత్తుడై నిర్మలమగు 'బ్రహ్మలోకము' నందు ప్రవేశము పొందగలడు. ఎవరి దృష్టిలో శరీరమే కల్పితమాత్రమో, అట్టివాని దృష్టి పుణ్య-పాప పరిధులనుండి దాటివేయక ఏం చేస్తుంది?

ఈ జీవుడు 'ఆత్మజ్ఞానము' చేతనే 'ఆత్మ' గురించి తెలుసుకొని, సేతు సహాయంగా అజ్ఞానము నుండి సుజ్ఞానమును చేరగలడు అట్టివాడు –

- **అంధః సన్–న అంధో భవతి।** గ్రుడ్డివాడైనప్పటికీ గ్రుడ్డివాడై ఉండడు.
- **విద్ధః సన్–అవిద్ధో భవతి।** శరీరముతో సంబంధము కలిగి ఉండి కూడా, శరీరముతో సంబంధమే లేనివాడై ఉంటాడు.
- **ఉపతాపీ సన్ – అనుపతాపీ భవతి।** – అనారోగ్యముచే బాధపడుతూ కూడా, బాధలు లేనివాడై ఉంటాడు. సంకటములు ఉన్నప్పుడు కూడా అవి లేనివాడై ఉంటాడు.

"ఆత్మ" అనే సేతువును ధరించినవానికి చిమ్మచీకటి రాత్రి కూడా "పగలు' (Day Time)తో సమానము అవుతుంది. ఎందుచేతనంటే– సూర్యున్ని చీకటి ఎట్లా తాకుతుంది? స్వయంప్రకాశకమగు బ్రహ్మమునందు చీకటి, దుఃఖము మొదలైనవి ఎట్లా ఉంటాయి?

**శిష్యులు** : అట్టి నిర్మలము, స్వయం ప్రకాశకము అగు బ్రహ్మలోకము ఎట్టివారికి లభిస్తుంది?

**గురుదేవుడు** : ఎవ్వరైతే 'ఇదంతా బ్రహ్మమే' అని 'అనుకోవటము' అనే ఆచరణ కలిగి ఉంటారో, అట్టి బ్రహ్మచర్యము (బ్రహ్మచరణము) చేత బ్రహ్మలోకము వారికి తప్పక సిద్ధించగలదు. అట్టి బ్రహ్మలోకము సిద్ధించుకున్నవాడు – తదితర స్వర్గ లోకములలో తన ఇచ్ఛానుసారంగా స్వేచ్ఛా విహారి కాగలడు. **తేషాం సర్వేషు లోకేషు కామచారో భవతి। (ఇతి తథ్యమ్।)**

## 8–5. పంచమ ఖండము – "బ్రహ్మచర్యము" – అనగా ఏమి?

**శిష్యులు** : గురువర్యా! 'బ్రహ్మచర్యము' శబ్ద – అర్థ – అంతరార్థములు తెలుపండి.

**గురుదేవుడు :** యజ్ఞము – బ్రహ్మచర్యము (యద్యజ్ఞం ఇత్యాచక్షతే–బ్రహ్మచర్యమేవ)

**యజ్ఞము** = యః జ్ఞమ్ = పరమాత్మను తెలుసుకోవటము

యో జ్ఞాతా – ఇతి యజ్ఞమ్।

**చర్యము** = చరించటము

**బ్రహ్మచర్యము** = బ్రహ్మము నందు ఆచరణము

ఈ విధంగా ఏది 'యజ్ఞము' అని చెప్పబడుతోందో – అది "బ్రహ్మచర్యమే" – అయి ఉన్నది. జ్ఞాని బ్రహ్మచర్యము (బ్రహ్మమును ఉపాసించటము) అను చర్యలచే "పరమాత్మ గురించిన ఎరుక" అను అర్థముగల యజ్ఞఫలము పొందుచున్నాడు.

**ఇష్టము – బ్రహ్మచర్యము :**

**"ఇష్టము " = యత్ 'ఇష్టమ్' ఇతి ఆచక్షతే బ్రహ్మచర్యమేవ**

**ఇష్టము** = ఉపనయనము మొదలైన సంస్కారములు జగత్తుకు విహిత కార్యక్రమములు. పూజించబడేవి, యజించబడేవి (ఉపాసించబడేవి). "ఇష్టము" అని చెప్పబడేవి కూడా బ్రహ్మచర్యమే అయి ఉన్నది. బ్రహ్మచర్యముచే బ్రహ్మమును పొందటమే కాబట్టి యజ్ఞము (ఈశ్వర పూజ) మొదలైన 'ఇష్టము'లచే 'ఆత్మప్రాప్తి'యే పొందుచున్నాము. 'ఏషణ' కారణంగానే ఇష్టము బ్రహ్మచర్యమే అవుతోంది.

**సత్త్రాయణము - బ్రహ్మచర్యము - యత్సత్త్రాయణమ్ ఇతి బ్రహ్మచర్యమేవ।**

**సత్త్రాయణము** = సత్ (పరమాత్మతో) + త్రాయణము (రక్షణ పొందటము)

**– సత్ ఆత్మనః త్రాణం విన్దతే।**

'పరమాత్మా! నేను అజ్ఞానిని। మీరు ఆర్తత్రాయణ పరాయణులు। దయతో రక్షించండి" – అని ప్రార్థనలు, గానములు, శరణాగతులు "బ్రహ్మము" యొక్క సిద్ధి కొరకే కాబట్టి సత్త్రాయణము బ్రహ్మచర్యమే.

**మౌనము – బ్రహ్మచర్యము**

**యత్ 'మౌనమ్' ఇతి ఆచక్షతే, తత్ బ్రహ్మచర్యమేవ।** 'మౌనము' అని దేనిని అంటున్నారో అది బ్రహ్మచర్యమే అయి ఉన్నది. ఎందుకంటే మౌనము అను శబ్దార్థములు రెండు ప్రక్రియలు కలిగి ఉన్నది. (1) ప్రాపంచక విషయములు "మననము చేయకపోవటము" (2) పరమాత్మ గురించిన మననము కలిగి ఉండటము.

**తత్ బ్రహ్మచర్యేణ హి ఏవ ఆత్మానమ్ అనువిద్య మనుతే।** బ్రహ్మచర్య – మౌనములు రెండు. ఆత్మవిద్య యొక్క మననమే। కనుక మౌనము బ్రహ్మచర్యమే అయి ఉన్నది.

**అనాశకాయనము – బ్రహ్మచర్యము – యదనాశకాయనమ్ ఇతి ఆచక్షతే బ్రహ్మచర్యమేవ।**

**అశనము** = ఆహారము తినటము.

**అనాశకాయనము=** ఆహారము స్వీకరించకుండా ఉండు 'ఉపవాసము'. నష్టము పొందకుండటము.

**ఉపవాసము** = ఆత్మతో వసించటము.

బ్రహ్మచర్యముచే సిద్ధించే ఆత్మకు నాశనము లేదు. అనాశకాయనము – అట్టి నాశనరహితమగు ఆత్మకొరకే 'అనశనము'. అందుచేత అనాశకాయ వ్రతములన్నీ బ్రహ్మచర్యమే. ఏకాదశి ఉపవాసము మొదలైనవన్నీ బ్రహ్మచర్యమే.

## అరణ్యాయనము – బ్రహ్మచర్యము

**(అథ) యత్ అరణ్యాయనమ్ ఇతి ఆచక్షతే బ్రహ్మచర్యమేవ।** ఏది 'అరణ్యవాసము' అనే 'ఉపాసన'గా చెప్పబడుతోందో, అది కూడా బ్రహ్మచర్యమే.

- **అరణ్యము** అనగా సన్న్యాసము.
- సన్న్యాసము = సత్ న్యాసము (అసత్తును అసత్తుగా చూస్తూ, 'సత్తు'ను ఆశ్రయించి ఉండటము)

ఈ సమస్తము బ్రహ్మమే।

అట్టి ఈ బ్రహ్మలోకము '3' విభాగములు

(1) భూమి (2) అంతరిక్షము (3) ద్యులోకము

{(1) Zone of Matter (2) Zone of Thought / Feeling (3) Zone of Self అని కూడా ఇక్కడ మనము అనుకోవచ్చు.}

అట్టి '3'వది అగు బ్రహ్మలోకము

- రెండు సముద్రములు (1) అర (2) ణ్య
- ఆ రెండిటికీ ఆవల ద్యులోకము
- ఆ మూడవదానిలో (ద్యులోకములో)

**'ఐరం మదీయ'** అనే సరోవరము.

– ఐర = అన్నము (ఇరా)। ఐరము,

మదీయ = నిండియున్నది

అన్నము = ఇంద్రియ విషయములు / హర్షములు కలిగించునది. మదము (సంతోషము కలుగజేయునవి)

– అక్కడ "సోమరసము" అనే అశ్వత్థ వృక్షమున్న వనము, 'అపరాజిత' అనే బ్రహ్మపురము, ఆ బ్రహ్మపురములో హిరణ్యగర్భునిచే సంకల్పించబడిన 'సభా మంటపము'.

ఎవ్వరైతే తమయొక్క "సమస్తము బ్రహ్మముగా దర్శించటము" అను అనునిత్యమగు బ్రహ్మచర్యవ్రత ఫలముగా 'అర', 'ణ్య' ములనే సముద్రములను దాటి బ్రహ్మలోకము ప్రవేశించి శాశ్వత బ్రహ్మలోక నివాసులౌతారో, అట్టివారు – **"తేషాం సర్వేషు లోకేషు కామచారో భవతి॥"** – సర్వలోకములలో స్వతంత్రులై ఇచ్ఛానుసారం సంచరించువారు కాగలరు.

**సమస్త లోకములు తమయందే దర్శించగలరు.**

# 8-6. షష్ఠి ఖండము - హృదయ నాడీ విస్తరణము

హృదయము నుండి (72000) సూక్ష్మనాడులు బయల్వెడలి శరీరమంతా ఒక మహావృక్షముయొక్క శాఖ - ఉపశాఖలవలె విస్తరించి ఉన్నాయి. ఇవన్నీ పింగళ (గోరోజనము) వంటి రంగుగల రసముతో నిండి ఉంటున్నాయి. ఆ నాడులన్నీ కూడా పింగళ, తెలుపు, నీల, పసుపు పచ్చని, ఎరుపు రంగుల రసము కలిగినవై ఉంటున్నాయి. సూర్యకిరణములు ఏవిధంగా పింగళ, తెలుపు, నీల, పసుపుపచ్చని, ఎరుపు రంగులలో ఉంటాయో ఈ సూక్ష్మ నరములు కూడా అట్లే ఉంటున్నాయి. రంగుల రసమయమై ఉంటున్నాయి. ఆదిత్యుని సంబంధముచేతనే నాడులలో అనుస్యూతమైన ఆయా రంగులతో కూడిన రసము తమయందు కలిగియుండటము జరుగుతోంది.

(నాడులలోని రసములు సప్తవర్ణములుగా ఎట్లా ఏర్పడుచున్నాయి?)

రసము → వాత, పిత్త, రక్తముల వేరువేరు మిశ్రమములు వలన.

పిత్తము అనే సూర్యతేజస్సు పరిపక్వమై (దట్టమై) కొంచము కఫముతో సంపక్కరమైనప్పుడు - 'పిత్తము' అనే సౌర తేజస్సు పింగళవర్ణం పొందుతోంది.

వాతముయొక్క ఆధిక్యతచేత కఫము యొక్క ఆధిక్యతచే - నీలవర్ణము, తెలుపు

కఫ-వాతములు సమపాళ్లలో కలిసనవైతే - పీత (పసుపుపచ్చ) వర్ణము

రక్తము అధికంగా ప్రవేశించు నాడులలో - ఎరుపురంగు

ఇవన్నీ సూర్యునితో సంబంధము వలననే ఈ సప్తవర్ణముల రసములు ఏర్పడుచున్నాయి.

⌘

ఒక మహాపథము (Long Main Road - రాజమార్గము) కొన్నిచోట్ల కుడి, ఎడమల వైపుగా కూడా విస్తరించి, రెండు వేరువేరు గ్రామములకు (చోట్లకు) చేరుతూ ఉంటుంది కదా! అట్లాగే ఆదిత్య తత్త్వమగు తేజస్సు అటు సూర్యమండలములోను, ఇటు జీవుని శరీర మండలములోను ప్రవేశించి ఆయా వ్యాపారములు (Functions) నిర్వర్తిస్తున్నాయి.

| | |
|---|---|
| **ఆదిత్యస్య రశ్మయ ఉభౌలోకౌ** | **సూర్యుని నుండి బహిర్గతమైన కిరణములు శరీర నాడులలో ప్రవేశిస్తున్నాయి.** |
| **గచ్ఛన్తి - ఇమంచ అముంచ।** | **నాడుల నుండి బహిర్గతమైన కిరణములు సూర్యమండలములో (సృప్తా) ప్రవేశిస్తున్నాయి.** |
| **అముష్మాత్ ఆదిత్యాత్ ప్రతాయన్తే తా** | **పరము నుండి ఇహములోనికి, ఇహమునుండి పరములోనికి కిరణములు ప్రవేశించటము** |
| **ఆసు నాడీషు సృప్తా** | **జరుగుచూ ఉన్నది.** |
| **ఆభ్యో నాడీభ్యః ప్రతాయన్తే।** | |
| **తే ఆముష్మిన్ ఆదిత్యే సృప్తాః।** | |

సప్తకిరణములు పరమునుండి ఇహమునకు, ఇహము నుండి పరమునకు ప్రసరించటము

**జాగ్రత్** : జాగ్రత్‌లో ఉన్నప్పుడు ఈ జీవుని వృత్తులు దృశ్యములోనికి, దృశ్యమునుండి వృత్తులు జీవునిలోనికి ప్రసరిస్తున్నాయి. అట్టి వృత్తులు సప్తవిధములై ఉంటున్నాయి.

**స్వప్నము** : స్వప్నదశలో కూడా వృత్తులు జీవుని నుండి స్వప్నములోనికి, స్వప్నములో నుండి జీవునిలోనికి విస్తరిస్తూ ఉంటున్నాయి. (నిద్రపోయినప్పుడు రెండు అవస్థలు (1) స్వప్న (2) సుషుప్తి)

**సుషుప్తి** : మానవుడు గాఢ నిద్రలో ఉన్నప్పుడు ఈ జీవుడు వృత్తులన్నీ ఉపసంహరించి నాడులలో ప్రవేశించి (సృప్తుడై) - వృత్తి రహితుడుగా ఉంటున్నాడు. అట్టి నివృత్తి (వృత్తి రహిత గాఢ నిద్రాస్థితిలో ఉన్నప్పుడు - **తన్న కశ్చిన పాప్మా స్పృశతి।** ఏ పాప (దోష) వృత్తులచేతను (లేక) దోష భావనలచేతను స్పృశించబడటము లేదు. ఎందుచేతనంటే **తేజసా హి తదా సంపన్నో భవతి।** గాఢనిద్రా సమయంలో ఈ జీవుడు కేవలమగు 'ఆత్మతేజో సంపన్నుడు' అయి ఉంటున్నాడు. ఆత్మతేజో వ్యాప్తుడై ఉంటున్నాడు. తనకు అన్యము లేనివాడై ఉంటున్నాడు.

# నాడీమండలమునుండి ఆదిత్య మండల ప్రవేశము

ఈ జీవుడు దేహము ఉన్నంతవరకు శరీరమునుండి ఆదిత్యమండలమునకు, ఆదిత్యమండలము నుండి శరీరమునకు తేజోరూపంగా నాడుల ద్వారా నిత్యము ప్రయాణము చేస్తున్నాడు.

ఇది ఇహము నుండి → పరమునకు, పరము నుండి → ఇహమునకు చిత్తవృత్తుల ప్రయాణము కూడా. ఇదియే – సహజము నుండి → సందర్భములకు, సందర్భముల నుండి →సహజమునకు ప్రయాణము కూడా!

(ఆదిత్యుడు = జీవుని సహజరూపము; దేహము = జీవుని సందర్భ రూపము)

**సహజము (ఆదిత్యుడు)**

↓ ↑

**సందర్భము (జీవుడు)**

ఆత్మస్వరూపుడగు ఈ జీవుడు దేహ భావన ఉన్నంతవరకు ఆదిత్యాత్మ – జీవాత్మల మధ్య అవిశ్రాంత బాటసారివలె ప్రయాణిస్తూ ఉన్నాడు.

**శిష్యులు** : గురువర్యా! ఈ విధంగా "గాఢనిద్ర జాగ్రత్ స్వప్నములు సందర్భములలో, ఈ జీవుడు "నిర్వృత్తి" నుండి వృత్తులలోనికి, "వృత్తులలోనుండి– నిర్వృత్తికి చేయు ప్రయాణములే ఆదిత్యుని నుండి నాడులలోనికి, నాడులలో నుండి ఆదిత్య మండలమునకు నిత్య ప్రయాణము అని మేము అర్థము చేసుకుంటున్నాము.

గాఢనిద్రా సమయంలో ఆ ప్రయాణములు కట్టబెట్టి ఆత్మతేజస్సుయొక్క సామీప్యత పొందుచున్నాడని కూడా మీరు బోధిస్తున్నట్లు తెలుసుకుంటున్నాము. బాగానే ఉన్నది. మరి ఈ జీవుడు మరణించినప్పుడు ఏమి జరుగుతోంది?

**గురుదేవుడు** : చెపుతాను వినండి. **యత్రైతత్ అబలిమానం నీతో భవతి** : ఈ జీవుని భౌతికశరీరము దుర్బలమై, క్షీణిస్తూ 'మరణము' అను సంఘటనను సమీపిస్తున్నప్పుడు 'మరణశయ్య' (The Bed of Death)ను అవధరించాడు" అని అంటూ ఉంటారు.

ఆ విధంగా మరణశయ్యపై ఉన్నప్పుడు (మరణించటానికి సిద్ధమగుచున్నప్పుడు) – చుట్టూ ఆతని బంధువులు చేరి **"తమభిత ఆసీనా ఆహుః – జానాసి మాం? జానాసి మాం? – ఇతి।"** – "ఏమయ్యోయ్! నన్ను గుర్తుపడుచున్నావా? నన్ను గుర్తుపడుచున్నావా?" అని అడగటం లోకంలో జరుగుచూ ఉంటుంది కదా! అట్టి మరణ సమయంలో ఈ జీవుడు ఈ శరీరము నుండి ఉత్క్రమణము (vacate and get out) చేయనంతవరకు ఆయా పలకరించుచున్న బంధువులను గుర్తిస్తూ "ఆఁ! తెలుసు! ఊఁ! గుర్తుపడుతున్నాను"! అన్నట్లుగా తల ఊపుతాడు. **యావత్ అస్మాత్ శరీరాత్ అనుత్క్రాన్తో భవతి, తావత్ జానాతి।**

---

**అథ యత్రైతత్ అస్మాత్ శరీరాత్ ఉత్క్రామత్ అథ ఏతైరేవ రశ్మిభిః ఊర్ధ్వమ్ ఆక్రమతే।**

ఎప్పుడైతే ఈ శరీరము శిథిలమగుచూ, ఇక నివాసయోగ్యము కాకుండాపోతుందో, ఒకప్పుడు ఈ జీవుడు తన ప్రాణశక్తిని కూడగట్టుకొని శరీరమునుండి కిరణములలో ప్రవేశించి బయల్వెడలుచున్నాడు. అనగా **శరీరము నుండి 'ఊర్ధ్వగతి'** (Path upward / way out) ఆశ్రయిస్తున్నాడు.

దేహము వదిలి పెట్టినప్పటికీ మనస్సు (The Form of Thinking and Feeling) చావదు. అందుచేత – **స 'ఓం' ఇతి వా హోద్వా మీయతే, స యావత్ క్షిప్యేత్ మనః, తావత్ – ఆదిత్యం గచ్ఛేత్।**

- శరీరము విడిచిన జీవుడు ఒక వాహనము నుండి వేరే వాహనము ఎక్కి ప్రయాణించు తీరుగా మనస్సుతో వృత్తిపూర్వకంగా ప్రయాణిస్తున్నాడు.
- మనస్సు ఎటువైపుగా వెళ్లుచూ ఉంటే, తాను అటువైపు వృత్తరూపంగా వెళ్లసాగుతాడు.

– ఆ ప్రయాణము అధోలోకములు (అతల – వితల – సతల – తలాతల – రసాతల – మహాతల – పాతాళ లోకములు) కావచ్చును, లేదా ఊర్ధ్వలోకములు (భూః – భువర్ – సువర్ – మహర్ – జనో – తపో – సత్య లోకములు కావచ్చును. (అంతా కూడా మనో ప్రయాణమే)।

'ఓం' అని ఆత్మను మననము చేయుచు, మనస్సు ఎంతవరకు విస్తరించి ఉంటుందో, అంతవరకు ప్రయాణించి – క్రమంగా 'ఆదిత్య లోకము' (The Point where the concept of Bodies has been begining. The State where external Factor has been taking off) వరకు చేరుచున్నాడు.

**– తద్వైఖలు లోకద్వారమ్।** అట్టి ఆదిత్య లోకమే (లేక) సూర్యమండలమే లోకద్వారము (Gate). ఎందుకంటే,

**– విదుషాం ప్రపదనమ్।** జ్ఞానులు ఆ సూర్యమండల లోకద్వారము తెరుచుకొని ఆవలకు వెళ్లుచున్నారు.

**– నిరోధో అవిదుషామ్ ।** ఆత్మజ్ఞానమును గుర్తుచేసుకోనివారు ఆదిత్యలోకము వద్ద నిరోధము (Hindrence) పొంది ఆగిపోతున్నారు. మరల భౌతిక లోకములకు మరలుచున్నారు. పునః జన్మ–కర్మల చక్రములో ప్రకాశించుచున్నారు.

ఈ విషయమే (నాడీ ప్రయాణ యోగమే) ఈ విధంగా వేదజ్ఞులచే, వేదోపనిషత్తులచే మరొక విధంగా గానము చేయబడుతోంది. (ఊర్ధ్వనాడీ అయనము)

**"శతం చ ఏకా (101)" హృదయస్య నాడ్యః।**

హృదయస్థానము నుండి '101' నాడులు బయల్వెడలి శరీరమంతా విస్తరించినవై ఉంటున్నాయి.

**తాసాం మూర్ధానమ్ అభినిః సృత్ 'ఏకా' (1)**

ఆ నాడులలో ఒక్కనాడి మాత్రమే (సుషుమ్న నాడి) శిరస్సు వైపుగా (ఊర్ధ్వముగా) పోవుచూ ఉన్నది.

**'తయో ఊర్ధ్వమ్' అయన అమృతత్వమేతి।**

ఆ ఊర్ధ్వమునకు పోవుచున్న ఒక నాడిలో ఎవరు ప్రయాణిస్తూ ఉన్నారో వారు మృత పరిధులను దాటి 'అమృతత్త్వము' పొందుచున్నారు. అమరత్వము వానికి సిద్ధిస్తోంది.

**విష్వన్ అన్యా ఉత్క్రమణే భవన్తు ఉత్క్రమణే భవన్తి**

ఇక తక్కిన 100 నాడులలో ప్రయాణించువాడు ఉత్క్రమణము (ప్రయాణము) పొందుచూ మరల మరల ఆయా అనేక దిక్కులుగా ప్రయాణిస్తూ జనన–మరణ చక్రములో తిరుగాడుచూ ఉన్నాడు.

## 8–7. సప్తమ ఖండము – ఆత్మతో అనుసంధానము ఎట్లా? ఇంద్ర విరోచనుల యుద్ధము – ప్రజాపతి సందర్శనము

ఒకప్పుడు దేవతలకు దానవులకు ఆకాశంలో గొప్ప యుద్ధము ప్రారంభమైనది. ఆ యుద్ధము భీకరం కాసాగింది. మానవులు, తదితర లోకజనులు ఎంతో 'అశాంతి' పొందసాగారు. యుద్ధాలు జరుగుతుంటే ఎవ్వరికిమాత్రం 'శాంతి' లభిస్తుంది?

దేవతల నాయకుడు ఇంద్రుడు, అసురుల నాయకుడు విరోచనుడు (ప్రహ్లాదుని పుత్రుడు) ఇరువైపులా నాయకత్వం వహిస్తున్నారు.

ఆ విధంగా భయంకరంగా దేవ – దానవ యుద్ధం జరుగుచూ ఉండటము, లోకములన్నీ అల్లకల్లోలం అవటము సృష్టికర్తయగు ప్రజాపతి భగవానుడు గమనించారు. అప్పుడు 'అశరీర వాణి'తో ఈ విధంగా పలకసాగారు.

ఓ దేవ – దానవులారా? ఎందుకు భీకరంగా ఒకరితో ఒకరు యుద్ధం చేసుకుంటున్నారు? అసలు మీకు ఏమి కావాలని ఈ యుద్ధం? నేను ఎందుకు ఈ లోకాలు సృష్టించానో గమనిస్తున్నారా?

(1) జీవులంతా ఆనందంగా విహరించటానికి!

(2) 'ఆత్మ' కొరకు మీరంతా అన్వేషించి ఆత్మతత్త్వజ్ఞానులు అవటానికి!

ఈ రెండు పనులు మానివేసి యుద్ధం చేసుకుంటున్నారేమి? సమస్త (సంబంధమున్న, సంబంధము లేని) జీవులకు మీ యుద్ధం ఎంత దుఃఖకరము? ఆలోచించటము లేదా?

**ఏదైతే పాప దోషములచే స్పర్శించబడదో, జరా మరణ రహితమో, మృత్యు పరిధులచే పరిమితమవదో, శోకరహితమో, ఆకలి దప్పికలచే బాధింపబడజాలదో, సత్యకామమో, సత్యసంకల్పమో అట్టి 'ఆత్మ' గురించిన అన్వేషణ చేయండి. ఆత్మనే మీరు తెలుసుకోవాలి. ఆత్మజ్ఞానముకొరకై తత్త్వదర్శుల దగ్గర శ్రవణం చేయాలి! గురువుయొక్క ఉపదేశమును అనుసరించి ఆత్మ గురించి తెలుసుకోవాలి. అప్పుడు మాత్రమే మీరు కోరుకొనే ఆనందము పొందగలరు సుమా! లోకములను జయించగలరు.**

ప్రజాపతియొక్క 'అశరీరవాణి'ని అటు దేవతలు, ఇటు అసురులు విన్నారు. కొంతసేపు యుద్ధము విరమించి 'అశరీర వాక్కు' చెప్పిన పాఠ్యాంశము ఏమిటో ఎవరికివారే విశ్లేషణము చేసి అర్థం చేసుకోవటానికై ఇట్లా తలచారు.

**మనము ఈ అశరీర వాక్కును విన్నాము కదా! దేనివలన మనము సమస్త కోరికలు తీరిన వారమై సమస్త లోకములు జయించిన వారమౌతామో, అద్దాని గురించి ప్రజాపతి అశరీరవాక్కు ద్వారా మనలను హెచ్చరించారు. మనకు కావలసినది కూడా**

**(1) మనకు సమస్త లోకములపై ఆధిపత్యము**

**(2) మన కోరికలన్నీ తీరటము**

**– ఇదే కదా! కాబట్టి ప్రజాపతులవారు సూచిస్తున్న ఆత్మ గురించిన అన్వేషణను 'అమృతసిద్ధి' కొరకు యోచన చేద్దాము. తెలుసుకుందాము.**

ఈ విధంగా ఇంద్రుని నాయకత్వములోని దేవతలు, విరోచనుని నాయకత్వములోని అసురులు అనుకొని వారి వారి స్వస్థలాలకు వెళ్లిపోయారు. దేవతలు స్వర్గలోకము, అసురులు పాతాళలోకము చేరారు. వారి వారి లోకాలలో సమావేశము అయ్యారు.

⌘

వారి వారి సభలలో దేవతలు స్వర్గములోను, అసురులు పాతాళములోను విడివిడిగా ఈ విధంగా నిర్ణయములు చేసుకొన్నారు.

**మనకు కావలసింది సమస్త లోకములపై ఆధిపత్యము, సుఖంగా ఉండటము – ఇవియే కదా! అశరీరవాణి సలహా ఇచ్చినట్లు మనము ఆత్మ గురించియే అన్వేషిద్దాము. కాని ఎట్లా? ఈ విషయము మనకు తెలియటము లేదు. అందుచేత మనము మన నాయకులను సత్యలోకం పంపించి, పరమాత్మ అగు ప్రజాపతి వద్ద సత్యకామ–సత్య సంకల్ప సమన్వితమగు ఆత్మ గురించి అన్వేషణ, ఆత్మసిద్ధి గురించి త్రోవ ఏమిటో తెలుసుకొందాము. ఆ తరువాత ఏమి చేయాలో ఆలోచిద్దాము.**

ఈ విధంగా దేవదానవ ఉభయ సభలలో తమ తమ నాయకులైనట్టి ఇంద్ర విరోచనులను ప్రజాపతి వద్ద 'ఆత్మాన్వేషణ గురించిన విద్య నేర్వటానికై పంపించ నిర్ణయించుకున్నారు.

అప్పటికప్పుడే ఇంద్ర–విరోచనలు ఒకరికి తెలియకుండా ఒకరు సత్యలోకము ప్రవేశించారు. అఖండానంద జ్యోతి స్వరూపులై వెలుగొందుచున్న సమస్త సృష్టి నిర్ణేత ప్రజాపతి నామాంకితులు అగు బ్రహ్మదేవులవారిని సమిత్పాణులై (చేతిలో యజ్ఞ సమిధలు ధరించినవారై) దర్శనం చేసుకొన్నారు. శ్రీ సరస్వతీ సమేతులై కోటి సూర్యుల కాంతితో వెలుగొందుచున్న ప్రజాపతికి త్రిప్రదక్షిణ – సాష్టాంగ దండ ప్రణామములు సమర్పించారు.

⌘

**ప్రజాపతి** : ఇంద్ర–విరోచనులారా! దీర్ఘాయుష్మాం భవ। ఏమిటి ఇద్దరు ఇక్కడికి వచ్చారు? ఏమి మీ కోరిక?

**ఇంద్ర – విరోచనులు** : పితామహా! లోక కళ్యాణమూర్తీ! ప్రజాపతి భగవాన్! నమో నమో నమో నమః! కొన్ని కారణాల వలన దేవ – దానవులమగు మేము ఆకాశంలో ఒకరితో మరొకరము యుద్ధము చేస్తూ ఉండగా "సృష్టిని ఆస్వాదిస్తూ ఆనందించండి. ఆత్మకై అన్వేషించండి. అప్పుడు సత్యకామ సత్యసంకల్పులై సమస్త లోకములపై ఆధిపత్యము, ఆనందము పొందగలరు. యుద్ధాలు ఎందుకు చేస్తున్నారు?" ...అనే అశరీరవాణి యొక్క హెచ్చరిక వినిపించింది. **'ఆత్మను అన్వేషించటమెట్లా?'** అనే

విషయం మీవద్ద శ్రవణం చేసి తిరిగి రావాలని దేవ దానవ సభలలో నిర్ణయము చేయబడింది. అందుచేత ఆత్మ గురించిన అన్వేషణ ఎట్లా చేయాలో, ఆత్మ సాక్షాత్కారము పొంది లోకములపై ఆధిపత్యము ఎట్లా పొందాలో – అట్టి బోధకొరకై మిమ్ములను శరణువేడుచున్నాము.

**శ్రీ ప్రజాపతి** : ఓహో! అట్లాగా! చాలా సంతోషము. అయితే ఏదైనా సిద్ధించాలంటే, అందుకు 'తపస్సు' చేయవలసి ఉంటుందని మీకు తెలిసిన విషయమే కదా! అందుచేత మీరిద్దరు కలసి ఇక్కడ ఆశ్రమంలో బ్రహ్మచర్య వ్రతములో కూడిన తపస్సు నిర్వర్తించండి. యోగ సంసిద్ధులై రండి. అప్పుడు మీరు ఏమి తెలుసుకోదలచుకున్నారో అడగండి.

⌘

అప్పటికప్పుడే వారు తమ రాజా అలంకారములన్నీ ఒకచోట పెట్టి ముని కుమారుల రూపము దాల్చారు. ఒక ఆశ్రమము నిర్మించుకొని, ఆ ఇంద్ర విరోచనులు ఇద్దరు భక్తి–ప్రపత్తి–శ్రద్ధలతో కూడిన బ్రహ్మచర్య వ్రతరూపమగు తపస్సు ప్రారంభించారు. అప్పటినుండి 32 సంవత్సరములు తపస్సు చేశారు. వారి గడ్డాలు, మీసాలు పెరిగిపోయి, మునివర్యులవలె రూపములు దాల్చారు. 32 సంవత్సరములు గడచిన తరువాత ఒకరోజు ప్రజాపతి వారిద్దరిముందు ప్రత్యక్షమైనారు.

**ప్రజాపతి** : బిడ్డలారా! ఇంద్ర విరోచనులారా! మీ బ్రహ్మచర్య దీక్షకు సంతోషించాను. ఏమి వరము కావాలో కోరుకోండి.

**ఇంద్ర విరోచనులు** : భగవాన్! జీవులందరికీ త్రాణను ప్రసాదించు దేవాదిదేవా! ఏదైతే పాపదోషరహితమో, దేనికి జరామరణముల ప్రసక్తి ఉండదో, ఎద్దానియందు శోకము ఏమాత్రము కానరాదో – దుఃఖ రహితమో, దేనియందు ఆకలి దప్పికల ఊసు ఉండదో, ఏది సత్యకామమై సత్య సంకల్పమై వెలయుచున్నదో (ఏది పొందుటచే కోరుకొన్నదంతా సిద్ధించటము, సంకల్పించినది నెరవేరటము స్వాభావికమో) – అట్టి ఆత్మ గురించి మేము అన్వేషించదలచాము. ఎవడు ఆత్మను అన్వేషించి తెలుసుకుంటాడో అట్టివాడు – **విజిజ్ఞాసితవ్యః స సర్వాంశ్చ లోకాన్ ఆప్నోతి సర్వాంశ్చ కామాన్ ఆప్నోతి** – సర్వలోకములు జయిస్తాడు, సర్వకోరికలు నెరవేరినవౌతాయి" అని మీరు అశరీర స్వరముతో పలికినదంతా శిష్టజనులు చెప్పుచున్నారు. వేదములు కూడా ఎలుగెత్తి గానం చేస్తున్నాయి. అట్టి 'ఆత్మాన్వేషణ' గురించి తెలుసుకోవటానికై తమరి దర్శన – ప్రవచనములకై ఎదురుచూస్తున్నాము. ఈ రోజు సుదినము. సృష్టికర్త అగు మీ దర్శనం మాకు అయింది. మాపై దయతో ఆత్మాన్వేషణ సాక్షాత్కార విధి గురించి బోధించండి.

**ప్రజాపతి** : (వారిద్దరు తపస్సుచే దోషములు పోగొట్టుకొని ఉంటారు. ఆత్మబోధకు అర్హులు – అని తలచి) సరే! ఇప్పుడు చెప్పుకుందాము వినండి.

**య ఏషో అక్షిణి పురుషో దృశ్యత – ఏష ఆత్మేతి।**

ఏ పురుషకారము ప్రదర్శించు పురుషుడైతే ఈ కనులలో కానవచ్చుచున్నారో, దర్శనమిస్తూ ఉన్నారో ఆ పురుషుడే అన్వేషించవలసినవారు.

– ఆతడే ఆత్మ। అభయుడు। బ్రహ్మము। పరబ్రహ్మము। ఆయన యొక్క ఛాయయే ఈ దృశ్యమానమగుచున్న సమస్తము.

## ఛాయా పురుషోపదేశము
## 'ఏవైష సర్వేషు అన్తేషు పరిఖ్యాయత"

**ఇంద్ర–విరోచనులు** : "ఏ పురుషుడైతే కనులలో కనబడుచున్నాడో – ఆతడే 'ఆత్మ' – అని మీరు సెలవిస్తూ ఉన్నారు కదా! ఇప్పుడు మాదొక చిన్న సందేహము ఇది తీర్చండి!

(1) ఏ పురుషుడైతే జలములో అంతటా పరిఖ్యాతుడై (పరి = అన్నివైపులా; ఖ్యాతుడై = ప్రదర్శితుడై) ఉన్నారో – ఆ నీటిలో ప్రతిబింబించు పురుషుడు ఆత్మయా? (లేక)

(2) ఏది అద్దములో (దర్పణములో) ప్రతిబింబిస్తూ కనిపిస్తోందో – అది ఆత్మయా?

(అప్పుడు ప్రజాపతి "కళ్ళలో కనబడు పురుషుడు" బ్రహ్మమని నేను గుర్తు చేస్తూ ఉంటే, వీళ్ళేమో నీళ్లలోను అద్దములోను కనిపించే ప్రతిబింబములలో ఏది ఆత్మ? – అని అడుగుచున్నారే? – అని తలచారు).

**ప్రజాపతి** : ఇంద్ర విరోచనులారా! నేను "నేత్రములలోని అంతర్గత పురుషుడే ఆత్మ" – అని ఎవరిని వర్ణించి చెప్పానో – ఆయన అన్నిట్లా, సర్వత్రా పరిఖ్యాతుడై (ప్రతీతుడై, సంప్రదర్శితుడై) ఉన్నారు సుమా! **ఏవైష సర్వే పరిఖ్యాయత।** (ఆత్మయే సమస్తమునందు కనబడుతోంది – అని ప్రజాపతి రహస్యార్థముగా సూచించారు).

## 8-8. అష్టమ ఖండము – ఎవరైతే నీటి పాత్రలో కనబడుచున్నారో అదియే "ఆత్మ"

**ఇంద్ర విరోచనులు** : పితామహా! "మీరు అన్నిట్లా సర్వత్రా కనిపిస్తున్నదే ఆత్మ" అని బోధిస్తున్నారు కదా! అనగా "అద్దములోను – జలములోను కనిపిస్తున్న ఇరువురూ ఆత్మయే" – అని అభిప్రాయం కదా?

**ప్రజాపతి** : (వారు ఇంకా ఆత్మయొక్క సమస్తమును గ్రహించక అద్దము(దర్పణము)లోనో, జలములోనో, మరి ఒకచోటో ఎక్కడో ఒకచోట ప్రతిబింబమగుచున్న దానిని మాత్రమే ఆత్మగా అనుకుంటున్నారని ప్రజాపతి గమనించారు. "వీళ్ళకు ముఖాముఖిగా, ప్రత్యక్షంగా, కించిత్ ప్రయోగాత్మకంగా (Like in a Lab) చెప్పితే గాని గ్రహించలేరు" – అని తలచారు).

ఓ ఇంద్రపురుషులారా! నేను చెప్పు ఆత్మ గురించిన వచనములు మీరు పూర్ణార్థంగా గ్రహించినట్లు లేరు. సరేః! మీరిద్దరు ఆశ్రమంలోకి వెళ్లి ఒక విశాలపాత్రను ఏదైనా తీసుకురండి.

**ఇంద్ర విరోచనులు** : స్వామీ! ఆజ్ఞ! (అంటూ లోనికి వెళ్ళి పెద్ద మూకుడు వంటి పాత్రను తెచ్చి బ్రహ్మభగవానునికి ఎదురుగా ఉంచారు).

**ప్రజాపతి** : నిండుగా నీరు పోయండి.

**ఇంద్ర విరోచనులు** : భగవాన్! మీరు చెప్పినట్టే ఇదిగో నిండుగా జలము (నీరు) పోసాము.

**ప్రజాపతి** : మంచిది. ఇప్పుడు ఈ జలపాత్ర (ఉదశరావ, మూకుడు) యందు మీ మీ ముఖములు చూచుకొని, అప్పుడు రండి.

**ఇంద్ర విరోచనులు** : (తమను తాము జలములో శ్రద్ధగా చూచుకొని తిరిగివచ్చి) – పితామహా! మీరు చెప్పినట్లు మమ్ములను మేము జలపాత్రలో సవివరంగా చూచుకొని వచ్చాము.

**ప్రజాపతి** : చూచారు కదా! సరేః! మీరు అడిగిన ఆత్మ గురించిన అన్వేషణను దృష్టిలో ఉంచుకొని – మీకు ఏమి కనిపిస్తూ ఉన్నదో ఇప్పుడు వివరించి చెప్పండి.

**ఇంద్ర విరోచనులు** : మేము మా మా ఈ రూపముల యొక్క కాలిగోళ్ళ నుండి – తలవెంట్రుకల వరకు (నఖ శిఖ పర్యంతరము) మా ప్రతిరూపమే (ప్రతిబింబరూపమే) మాకు కనిపించింది.

**ప్రజాపతి** : అంతమాత్రమేనా?

**ఇంద్ర విరోచనులు** : జలము – అందులో నఖశిఖ పర్యంతము ఈ పెరిగిన గడ్డము – మీసములతో కూడి 'ముని రూప ప్రతిబంబములు" అగుపించాయి.

**ప్రజాపతి** : ఆహాః! సరేః! ఇతఃపూర్వ 32 సంవత్సరముల క్రితం ఇక్కడికి మీ దేవతల – అసురుల నాయక – అలంకారములతో వచ్చారు కదా! ఈ ముని వేషములు తొలగించుకొని, ఇదివరకటిలాగా చక్రవర్తి అలంకారాలన్నీ ధరించి రండి. వచ్చి ఆ పాత్రలోని జలములో మీ మీ రూపములు చూచుకోండి.

---

అప్పుడు ఇంద్ర విరోచనులిద్దరు తపస్సుకు సంబంధించిన వస్త్రములు, దీర్ఘ గడ్డములు, కేశములు త్యజించి, నాయకుల కిరీటము, పట్టు వస్త్రములు మొదలైనవన్నీ ధరించారు. తిరిగి పాత్రలోని జలములో తమ తమ రూపురేఖలన్నీ ప్రతిబింబరూపంగా చూచుకొని వచ్చి ప్రజాపతి ముందు నిలుచున్నారు.

**ఇంద్ర విరోచనులు** : పితామహా! ప్రజాపతీ! మేము మా మా ఆభరణములు, పట్టు వస్త్రములు మొదలైనవి ధరించి మీరు చెప్పినట్లు నీటిలో మా మా ప్రతిబింబములను పరిశీలనగా చూచుకొని, ఇదిగో – వచ్చాము. ఇప్పుడు ఆజ్ఞాపించండి.

**ప్రజాపతి** : ఇప్పుడు మీరు ఏమి చూచారు? ఆత్మాన్వేషణను దృష్టిలో పెట్టుకొని వివరించి చెప్పండి.

**ఇంద్ర విరోచనులు** : మా మా సాధు – అలంకృతమైన (As per our usual decorations) రాజవస్త్రములు ధరించిన, (మునివేషముల కంటే) పరిష్కృతము (Re-arranged) అయిన రూపములగు మా రూపములు జలములో ప్రతిబింబించటం మాకు కనిపించింది. మేము అలంకరించుకొన్న తీరుగానే మమ్ములను మేము నీటిలో చూచాము.

**ప్రజాపతి** : **"ఏదైతే" – జలములో ప్రతిబింబిస్తూ ఉన్నదో "తత్బ్రహ్మ! అదియే బ్రహ్మము।"**

అదియే మీరు అన్వేషించి తెలుసుకోవలసిన 'ఆత్మ' అయి ఉన్నది! అదియే బ్రహ్మము, ఏదైతే ప్రతిబింబిస్తోందో అట్టి ఆత్మను తెలుసుకుంటే మీరు సర్వలోకములపై ఆధిపత్యము సంపాదించగలరు.

**శాంతహృదయౌ ప్రవ్రజతుః।** ఆ ఇంద్రవిరోచనులు ఇద్దరూ "ఆఁ! తెలిసింది।" అని తలచుచూ శాంతహృదయులైనారు. 'మేము ఆత్మ గురించి తెలుసుకొని కృతార్థులము అయినాము" – అని అనుకున్నారు. లేచి నిలబడి, ప్రజాపతికి హృదయపూర్వకంగా నమస్కరించారు. ఇక తమ తమ స్వస్థానములకు బయలుదేరారు.

ఆ ఇంద్ర విరోచనులిద్దరూ ఆ విధంగా 'అర్థమైనది' అని శాంతిని పొంది అక్కడి నుండి బయల్వెడలటము మౌనంగా చూస్తూ ప్రజాపతి ఏమీ అనలేదు. కానీ, వాళ్ళు వెళ్లగానే ఇట్లా అనుకోసాగారు.

**ప్రజాపతి** : (తనలో) **అనుపలభ్యం ఆత్మానం అనువిద్య వ్రజతో** వీళ్లిద్దరూ 'ఆత్మజ్ఞానము గురించి పూర్తిగా పరిశీలించి తెలుసుకోకుండానే వెళ్లిపోవుచున్నారే? దేవత అయినా, అసురుడైనా సరే – నేను చెప్పినది సరిగా వివరము తెలుసుకోకుండా "ఇంతే బ్రహ్మజ్ఞానము" – అనుకున్నచో వారు **పరాభవము** (పర–అభవము = పరవస్తుజ్ఞానము చేతికి అందక పోవటము) పొందక తప్పదు కదా! ఎందుకంటే సరి అయిన అవగాహన లేకపోతే దేహాత్మ బుద్ధికి పరిమితులై పరిమితమైనదానిని ఆత్మగా జీవులు భావించటం జరుగగలదు.

విరోచనుడు అసురుల సభకు తిరిగివచ్చారు.

**విరోచనుడు** : ఓ అసురమిత్ర జనులారా! "జలములోగాని, అద్దములోగాని "ఏది ప్రతిబింబిస్తుందో" అదియే ఆత్మ" – అని ప్రజాపతులవారు బోధించారు. కాబట్టి ఏ మన రూపము ఈ జగద్దృశ్యములో ప్రతిబింబిస్తూ ఉన్నదో అదియే ఆత్మ. అందుచేత, జగత్తులో చరించే మన రూపములే మనము ఆత్మగా, పూజనీయముగా ఉపాసించాలి. సేవించతగినదిగా భావించాలి. ఈ విధంగా జగత్తులో కనిపించే మన ఈ రూపమును ఉపాసిస్తూ ఉంటే, మనము క్రమంగా సర్వలోకములపైన ఆధిపత్యము సంపాదించగలము. పూర్ణ సుఖము పొందగలము. దృశ్యములో కనిపించే మన రూపమునకు సమస్త ఉపాసనా కార్యక్రమములచే ఔన్నత్యము కల్పించటమే ఆత్మకొరకై చేయవలసిన అన్వేషణ. మరల చెప్పుకుందాము :

(1) జీవుల ఆనంద విహారము కొరకే (like Amusement Park) ఈ జగత్తు ప్రజాపతి కల్పించారు.

(2) అట్టి జగత్తులో కనిపించే మన రూపమునకు ఔన్నత్యము కల్పించటమే ఆత్మాన్వేషణ.

అసురులంతా 'అర్థమయింది! అట్లాగే ఆత్మాన్వేషణ, ఆత్మోపాసన చేద్దాము" అని నిర్ణయించుకొని వారివారి పనులలో నిమగ్నమైనారు.

అందుచేతనే ఈ లోకంలో దానము చేయనివానిని, వ్యష్ఠిగతాత్మ పారాయణమునకు పరిమితమై సర్వగతాత్మ గురించిన శ్రద్ధలేనివానిని, యజ్ఞార్థము కర్మలు నిర్వర్తించాలని తలచనివానిని "అరెఁ! ఈతడు ఆసురీస్వభావి! రాక్షసుడు!" – అని లోకంలో చెప్పుకుంటూ ఉంటారు. "తనకోసమే తాను బ్రతుకుతాడురా! ఏం ప్రయోజనం?" అని తలచుచూ ఉంటారు.

**ఎవడు తనను తాను లోకములో గొప్పవానిగా గుర్తించబడాలని ఉపాసనలు మొదలైనవి నిర్వర్తిస్తూ ఉంటాడో, అట్టివాడు ఆసురీస్వభావుడే!**

ఇదియే "దేహాత్మబుద్ధి" అని కూడా చెప్పబడుతోంది. కొందరు మరణించినవారి శరీరమునకు (శవమునకు) గంధ–పుష్ప–అన్న–భిక్ష ఇత్యాది అలంకారములతో మరణించిన వాని శరీరమును లోయలలో విడువటమో, ఖననము చేయటమో చేస్తూ ఉంటారు. "ఈతడు మనము చేసే భౌతికమైన అలంకారములు, వస్త్రములు, రుచికరమగు ఆహారములు, మణులు మొదలైనవి పరలోకంలో కూడా పొందగలడు" – అని మరణించినవాని గురించి భావిస్తూ ఉంటారు. "ఇది ఆసురోపనిషత్" అని "శరీర పరిమిత ఆత్మోపాసన" అని ఆత్మశాస్త్రజ్ఞులచే చెప్పుకోబడుతోంది. అట్టివారు ఆత్మయొక్క వాస్తవ తత్త్వమేమిటో గమనించటము లేదు.

## 8-9. నవమ ఖండము – ప్రజాపతితో ఇంద్రుని పునఃసమాగమం

ఇంద్రుడు దేవలోక సభకు బయల్వెడలారు. కొంత దూరము వచ్చిన తరువాత విజ్ఞతకు సంబంధించి ఏదో భయము ఆయనలో తొనికిసలాడింది. **దేవాన్ ఏతత్ భయం దదర్శ।** అంతేగాని, ఆత్మజ్ఞానము ప్రసాదించే 'అభయస్థితి' ఆయనకు కానరాలేదు.

"ఏదైతే" ఆ పాత్రలోని జలములో కనిపిస్తోందో అదియే "ఆత్మ" – అని పితామహులవారు అని ఉన్నారు. ఆయన బ్రహ్మజ్ఞానమునకు పరాకాష్ఠ. సమస్త సృష్టిని సృష్టించుచున్న మహాప్రజ్ఞావంతులు. వారు సూనృతమే (సత్యమే) చెప్పుతారుగాని అనృతము (అబద్ధము) చెప్పరే! అయితే వారు చెప్పిన వాక్యము నేను సరిగా అర్థము చేసుకొన్నానో లేదో అని నా అనుమానము.

నేను ముని రూపధారణలో ఉన్నప్పుడు జలములో ముని రూపమే కనిపించింది. ఇంద్రప్రస్థానమునకు అధిపతినగు నన్ను ఆభరణ–వస్త్రధారణలతో చూచినప్పుడు జలంలో సాలంకృతంగానే ప్రతిబింబిస్తూ కనిపించాను. మంచిబట్టలు ధరించినవాడు నీళ్లలో అట్లాగే కనిపిస్తాడు. గ్రుడ్డివాడు నీళ్లల్లో గ్రుడ్డివాడుగానే కనిపిస్తాడు. స్రామ (వంకరటింకర అంగములు కలవాడు) అట్లానే కనిపిస్తాడు. శరీరం నశించిపోయినప్పుడు జలంలో శరీరము కూడా నశించిపోతుంది.

నీటిలో కనిపించిన ప్రతిబింబము సత్యకామ, సత్యసంకల్ప ఆత్మ ఎట్లా అవుతుంది? ఆత్మ అమృతము, సర్వదా యథా తథము, అపహత పాప్మము, విజరము, విమృత్యువు, విశోకము కదా! కనుక నాకు తెలిసింది సరికాదు. దేవలోక సభలో నేను ప్రతిబింబమే 'ఆత్మ' అని పలికితే అనుమానము చాలామందికి వస్తుంది. అందుచేత తిరిగి పితామహులు ప్రజాపతివారినే మరల ఆశ్రయిస్తాను. ఈ విధంగా ఆలోచించి ఇంద్రుడు వెనుకకు తిరిగారు. "నేను యదార్థమేమిటో, సత్యమేమిటో గుర్తించలేదు. నాకు అర్థమైనది – నీటిలో ప్రతిబింబంగా కనిపించేది మాత్రం ఆత్మ అయి ఉండదు" – అని ఆలోచనలు చేస్తూ సమిత్పాణులై (చేతిలో యజ్ఞపరికరములు ధరించి) ప్రజాపతి ఆసీనులై ఉన్నచోటికి తిరిగివచ్చారు.

**ప్రజాపతి** : మఘువన్ (మేఘనాయకా)! ఏమిటి మళ్ళీ వచ్చావు? ఇంతకుముందే 'ఆత్మ' గురించిన (నేను చెప్పిన) వివరణను విని నీవు, విరోచనుడు కూడా సంతృప్తిపడి వెళ్లినారు కదా!

**ఇంద్రుడు** : అవును ప్రభూ! కానీ స్వర్గలోకమును సమీపిస్తూ ఉండగా, నేను మీ ఉద్దేశ్యమును సరిగా అర్థం చేసుకొని ఉండలేదని నాకు సందేహముతో కూడిన భయము కలిగింది?

**ప్రజాపతి** : ఏమా సందేహము?

**ఇంద్రుడు** : ఆత్మ ఎల్లప్పుడు అమృతము – మార్పుచేర్పులు లేనట్టిదికదా?

**ప్రజాపతి** : అవును. "విజరో। విమృత్యు। విశోకో। పరిణామ రహితము। సర్వదా 'అస్తి' ధర్మము కలిగియున్నట్టిది"। – అనునది సశాస్త్రీయమే కదా.

**ఇంద్రుడు** : "ఏదైతే జలము, అద్దములలో ప్రతిబింబిస్తూ కనిపిస్తోందో – అదియే ఆత్మ (లేక) బ్రహ్మము" అని మీరు ప్రవచించారు కదా!

**ప్రజాపతి** : అవును. 'ఏతత్ బ్రహ్మేతి' అని చెప్పుకున్నాము కదా!

**ఇంద్రుడు** : జలములోని ప్రతిబింబము – నేను మునిరూపంగా ఉన్నప్పుడు మునిరూపంగాను, అలంకారములతో దేవతానాయకుడై ఉన్నప్పుడు అట్లాగే కనిపించాను. గ్రుడ్డివాడు నీటిలో చూస్తే గ్రుడ్డివాడుగాను, వంకరటింకరవాడు వంకరటింకరగాను కనిపిస్తారు. ప్రతిబింబించువాడు తొలగితే ప్రతిబింబము కూడా తొలగుతుంది. మరి ఆత్మ అమృతమై మార్పు చేర్పుల ధర్మం లేనిదై ఉండగా, "జలములో ఏది ప్రతిబింబిస్తుందో – అది ఆత్మ ఎట్లా అవుతుంది?". 'ఆత్మ నిర్వికారము' అని చెప్పబడుచుండగా, "వికారములుగల ప్రతిబింబము ఆత్మ" – అని మీరు అంటారని నేననుకోను. మీరు చెప్పినది "ఏది నీటిలో ప్రతిబింబిస్తోందో అదే ఆత్మ" – అన్న వాక్యములో ఏదో గూఢార్థం ఉండి ఉంటుంది. నేను ఆలోచించి కూడా అదేమో కనిపెట్టలేకపోయాను. అందుకని 'ఆత్మాన్వేషణ'కై మరల బోధించ ప్రార్థన.

**ప్రజాపతి** : దేవేంద్రా! **తే భూయో అనువాఖ్యాస్యామి.** సరేః! ఆత్మాన్వేషణ గురించి మరల మరికొంతగా చెప్పుకుందాము. అయితే నీవు "ఆత్మతత్త్వము తెలుసుకోవాలి" అనే ఆశయ సిద్ధికొరకై మరల వెళ్లి 32 సంవత్సరముల కాలము తపస్సు చేయి.

ప్రజాపతి చెప్పిన విధంగా ఇంద్రుడు 32 సంవత్సరములు నియమ నిష్ఠలతో తపస్సు చేసి తిరిగి ప్రజాపతి సమక్షమునకు వచ్చారు.

## 8-10. దశమ ఖండము – స్వప్నములో ఏదైతే విహారము చేస్తూ ఉన్నదో – అదే 'ఆత్మ'.

**ప్రజాపతి** : మఘువన్! ఇంద్రదేవా! నీవు శ్రద్ధగా 32 సంవత్సరములు 'ఆత్మ' గురించి తెలుసుకోవటానికి తపస్సు చేసావు. సంతోషము. ఇప్పుడు ఆత్మ గురించి నీవు ఎక్కడ అన్వేషించాలో ఒక స్థానం చెపుతాను విను.

**య ఏష స్వప్నే మహీయమానః చరతి, ఏష ఆత్మేతి!**

ఏదైతే తనయొక్క మహిమచే (మహీయమానమై / మహత్త్వము కలిగినదై స్వప్నములో సంచారములు చేస్తోందో, స్వప్న దృశ్యమును అనుభవిస్తోందో) – అది ఆత్మయే అయి ఉన్నది.

అది అమృతము, అభయము। ఏతత్ బ్రహ్మేతి। అది బ్రహ్మమే అయి ఉన్నది.

---

ప్రజాపతి యొక్క 'ఆత్మవివరణ'ను శ్రద్ధగా విని ఇంద్రుడు కాసేపు మననం చేసారు. "ఆః! అవును! ఇప్పుడు 'ఆత్మ' గురించి అర్థమైనది" – అని శాంత హృదయుడైనారు. మరింకేమీ ప్రశ్నించలేదు. లేచి, ప్రజాపతికి కృతజ్ఞతలు తెలిపి, పాదాభివందనము చేసి అక్కడినుండి బయలుదేరారు. ఇంద్రలోక సభకు చేరటానికి ప్రయాణించసాగారు. "ఇంద్ర సభలో దేవతలందరికీ ప్రజాపతి చెప్పిన "ఏష స్వప్నేతి మహిమానః చరతి – ఏష ఆత్మేతి" – అనునది ఉపన్యసించి చెప్పాలని అనుకుంటూ ఉండగా, దేవలోకము చేరకముందే, మరింకేదో సందేహము ఆయనలో బయలుదేరింది. ఆ సందేహము వలన 'భయము'నే దర్శించారు గాని 'అభయము'ను పొందలేకపోయారు. ఇట్లా ఆలోచించసాగారు. "ఏదైతే" స్వప్నము ఆస్వాదించుచున్నదో అది ఆత్మ" అని కదా పితామహ వాక్యం.

- స్వప్నం సమయంలో ఈ జీవుడు కళ్ళు మూసుకొని నిద్రించి ఉంటాడు. కాని, స్వప్నపురుషుడు గ్రుడ్డివాడై ఉండడు. స్వప్నంలో అంతా చూస్తూ అనుభవిస్తూ ఉంటాడు.
- ఒకడు వంకర టింకర అవయవములు కలవాడైనప్పటికీ స్వప్నములోని అనుభవికి అవన్నీ ఉండవు.
- భౌతికదేహము మలము మాత్రము స్రవించినప్పుడు కూడా స్వప్న దేహము అవన్నీ స్రవించటం లేదు. స్వప్నాత్మ దేహదోషములు పొందటంలేదు.
- స్వప్నములో ఒకడు ఒకచోట నుండి ఇంకొక చోటికి భయముతో పరుగులు తీస్తున్నప్పటికీ, జాగ్రత్ దేహము పరుండియే ఉంటోందిగాని పరుగులు తీయదు.

అందుచేత "ఎవడు" స్వప్నములో పూజితుడై, ఆధిక్యము పొంది సంచరిస్తున్నాడో ఆతడే "ఆత్మ" – అనే బోధతో 'ఆత్మబోధ' వలన కలుగవలసిన శ్రేయస్సును నేను పొందలేకపోతున్నాను.

ఈ విధంగా తలచి ఆ ఇంద్రుడు వెనుకకు తిరిగి మరల ప్రజాపతిని దర్శించారు.

**ఇంద్రుడు** : పితామహా! **"ఏష పురుషః స్వప్నే మహీయతే** – ఎవడు స్వప్నములో పురుషుడుగా శ్రేష్ఠత్వము కలిగి ఉంటున్నాడో, ఆతడే ఆత్మ" – అనే బోధచే నేను 'ఆత్మ' గురించిన అన్వేషణ అవగాహన పూర్తి చేసుకొన్నానని అనిపించటము లేదు. భయము తొలగి అభయము సిద్ధించలేదు. అందుచేత మరల మీ నుండి 'ఆత్మాన్వేషణ' గురించి బోధించబడటానికై మీ సమక్షమును శరణువేడుచున్నాను.

**ప్రజాపతి** : అట్లాగా! ఇంకా కూడా ఆత్మయొక్క అమృతత్త్వము అభయత్వము నీకు సిద్ధించలేదన్న మాట. అవును. ఆ విషయం అటువంటిదేమరి! మరల 32 సంవత్సరాలు తపస్సు చేసి బ్రహ్మచర్య వ్రతము నిర్వర్తించి ఇటురా! అప్పుడు మరల వ్యాఖ్యానించుకుందాము.

ఇంద్రుడు మరల తపస్సు చేసి విద్యార్థి అయి తత్త్వ జ్ఞాన శ్రవణమునకై ప్రజాపతిని ఆశ్రయించారు.

**ప్రజాపతి** : మఘువన్। ఏమిటి విశేషము?

**ఇంద్రుడు** : "ఎవ్వడైతే స్వప్నములో పురుషుడో" అను మీ వ్యాఖ్యానముచే నాపట్ల ఆత్మాన్వేషణ గురించిన సందేహము తొలగలేదు. స్వామీ! మీరు ఆజ్ఞాపించినట్లు '32' సంవత్సరములు తపస్సు చేసి మీ వ్యాఖ్యానము వినటానికై వచ్చాను.

**ప్రజాపతి** : అయితే విను।

## 8-11. ఏకాదశ ఖండము – 'సుషుప్తి పురుషుడు ఆత్మయే'

**తత్ యత్ర ఏతత్ సుప్తః సమస్తః సంప్రసన్నః స్వప్నం న వివిజానాతి ఏష ఆత్మేతి।**

> ఏదైతే సంపూర్ణమైన ప్రసన్నతతో సుషుప్తి (గాఢనిద్ర) పొందుచూ, స్వప్న దృశ్యము పొందకయే ఉంటోందో– అదియే 'ఆత్మ'.

**అట్టి ఆత్మ అమృతము, అభయము। అదియే "బ్రహ్మము" గా పిలువబడుతోంది.**

ఇంద్రుడు అది విని ...."నేను సమాధానము పొందాను" అని తలచినవాడై బ్రహ్మలోకమునుండి దేవసభకు బయల్వెడలారు. దేవతలను చేరకముందే మరల అనుమానముతో కూడిన భయము రాసాగింది. అభయము సిద్ధించనేలేదు.

**నాహ ఖలు అయమేవం సంప్రతి ఆత్మానం జానాతి అయమహమస్మి।** ఈ జీవుడు గాఢనిద్రాపరవశుడై ఉన్న సందర్భములో అట్టి గాఢనిద్రలో ఆ సుషుప్త్యాత్మము "నేను ఇట్టివాడను కదా!" – అనే తెలివియే (ఎరుకయే) ఉండటములేదు. "వారు అది – వీరు ఇది" అనునది కూడా గాఢనిద్రా పురుషునికి తెలిసినవై ఉండవు.

**ఏ నిశ్చయము జ్ఞానము కూడా సుషుప్త పురుషునికి ఉండదు.** అట్టి గాఢనిద్రలో ఉన్న జీవుడు మరణించినవానివలెనే ఉంటాడాయె। అందుచేత "సత్యకామ–సత్యసంకల్ప" అను ఆత్మయొక్క లక్షణములేమి ఉంటాయి?

ఈ విధంగా తలచినవాడై ఇంద్రుడు సమిత్పాణి అయి మరల ప్రజాపతి దర్శనము చేసుకున్నారు.

**ప్రజాపతి** : ఓ మఘవన్! నేను చెప్పినది విని శాంతమగు మనస్సుతో వెళ్లావు కదా! మరల వచ్చావేమిటి?

**ఇంద్రుడు** : భగవాన్। పితామహా। గురోత్తమ। ఆత్మ గురించిన విషయములో 'నేను సుషుప్తి మాత్ర పురుషుడనే।" – అనేది నాకు తృప్తి కలగటము లేదు. గాఢనిద్రలో ఉన్నప్పుడు నన్ను నేను 'ఇట్టివాడను' అని తెలుసుకోలేను. ఇతర జీవులను తెలుసుకోలేను. అప్పుడు నేను వినాశనము పొందినవానివలె ఉంటానుగాని, ఆత్మను ఎరిగినవాడివలె ఉండను కదా! అందుచేత అభయము, అమృతము అగు శుభమును శోభను పొందలేకపోయాను. **నాహం అత్ర భోగ్యం పశ్యామి।** అందుకే మరల మిమ్ములను శరణువేడి మరికొంత వ్యాఖ్యానము వినగోరుచున్నాను.

**ప్రజాపతి** : **ఏవమేవైష మఘువన్ ఇతి।** మేఘనాథా! ఇంద్రదేవా! అది అంతే మరి! దీనికి వేరుగా ఎక్కడా ఏదీ లేదు కదా! **ఏతంతు ఏవ తే భూయో అనువ్యాఖ్యాస్యామి।** మరల నీకు వ్యాఖ్యానించి చెపుతాను. అయితే నీవు "5" సంవత్సరములు బ్రహ్మచర్యోపాసన చేసి రమ్ము.

ఇంద్రుడు అట్లాగే 5 సంవత్సరములు బ్రహ్మచర్యవ్రతము నిర్వర్తించారు. ఈవిధంగా 32+32+32+5 = 101 (బ్రహ్మమాన) సంవత్సరములు ఇంద్రుడు బ్రహ్మచర్యనిరతిలో తపస్సు చేసినవారైనారు.

**తాని ఏకశతం సంపేదుః ఏతత్ అద్యత్ ఆహుః ఏకశతం హ వై వర్షాణి మఘవాన్ ప్రజాపతౌ బ్రహ్మచర్యమ్ ఉవాస!'**

> **అందుకే – దేవేంద్రుడు సకలభోగములు విడచి బ్రహ్మజ్ఞానముకొరకై 101 సంవత్సరములు కఠోర తపస్సు చేసినట్లే – ఎన్ని కష్టములకైన సిద్ధపడి జీవుడు ఆత్మజ్ఞానము కొరకు ప్రయత్నించును గాక।**

## 8-12. ద్వాదశ ఖండము - అమృతము, అశరీరము అగు ఆత్మకు దేహము ఉపాధి

**ప్రజాపతి** : ఓ మఘవన్। 101 సంవత్సరములు ఇంద్ర వైభవములన్నీ విడచిపెట్టి కఠోరమగు బ్రహ్మచర్య వ్రతము నిర్వర్తించిన నీ బుద్ధి **ఆత్మాన్వేషణకై** అత్యంతకమైయున్నదని తలచుచున్నాను. ఇప్పుడిక మనము 'ఆత్మ' (లేక) 'బ్రహ్మము' గురించి సూటిగా మరికొన్ని ముఖ్యమైన విశేషాలు వ్యాఖ్యానించుకుందాము.

సమస్త జీవులు "శరీరము + శరీరి" అనే రెండు విశేషముల సమ్మేళనము అయి ఉన్నారు, శరీరి ఆత్మయొక్క చేతనా చమత్కారమే!

**శరీరము** : ఇది పాంచభౌతిక నిర్మితము. ఒకప్పుడు రూపుదిద్దుకొని, బాల్య యౌవన వార్ధక్యములు పొందుచూ, మరొకప్పుడు మరణించు స్వభావము కలిగియున్నది. మృత్యుగ్రస్తము (will be inevitably swallowed by Death).

**ఆత్మ** : మరణధర్మము లేనిది. అమృతస్వరూపము. అట్టి ఈ ఆత్మకు శరీరము అధిష్ఠానము (అనగా) ఇది ఆత్మకు ఉపాధి. ఆత్మచే ఉపయోగించబడుచున్న ఒక ఉపకరణ వస్తువు. భోగవస్తువు.

జాగ్రత్ స్వప్న సుషుప్తులు ఆత్మయొక్క '3' దశలైన స్వయంకృత - స్వయంకల్పిత అనుభవములు (The Zones of experiencing).

ఆత్మ దేహమునందు తన యొక్క ఒక అంశచే వేంచేసినదై ఉన్నది.

ఆత్మ స్వతః అనన్తము.

**జీవుడు :** మానవునికి 'బట్ట' (Wearing clothes) అనేది స్వరూపము కాదు, స్వభావము కాదు కదా। అట్లాగే ఆత్మకు స్వతఃగా 'శరీరము' అనేది స్వరూపము కాదు, స్వభావము కాదు. అయినా ఒకప్పుడు స్వకీయ లీలావినోదముగా శరీరమును ధారణ చేసి 'శరీరి' అని అనిపించుకొనుచున్నది.

"నాకు శరీరముతో సంబంధము, పరిమితత్వము ఉన్నది" అని ఆత్మ తలచినపుడు "సశరీరి" అని (ఆత్మయే) చెప్పబడుతోంది.

"నేను శరీరము కంటే సర్వదా వేరు. శరీరముయొక్క లక్షణములు అయినట్టి జన్మ, జరా, మరణములు ఆత్మగా నాకు లేవు" అని ఆత్మ తలచినప్పుడు "అశరీరి" అని (ఆత్మయే) పిలువబడుతోంది.

**సశరీరము** : శరీర సంబంధంచేత 'జీవాత్మ' అని పిలుస్తున్నారు. సశరీరభావముచే శరీరము దృష్ట్యా ఈ జీవునకు

"– జన్మ మృత్యువులు

– ధర్మ – అధర్మములు; ప్రియ–అప్రియములు"

ఏర్పడి ఉంటున్నాయి. ఎందుచేత? ఆత్మయే ఒక సందర్భముగా – "నేనే ఈ శరీరమును। ఈ శరీరమే నేను" – అనే భావనతో, స్వస్వరూపమగు కేవలాత్మ గురించిన జ్ఞానమును ఏమరువటము చేతనే దేహభావనతో తదాత్మ్యము చేతనే పాప–పుణ్యములు,

ప్రియాప్రియములు, సుఖదుఃఖములు మొదలైన ద్వంద్వములు మోహరూపముగా వచ్చిపడుచున్నాయి (ఉన్నట్లు అనిపిస్తున్నాయి).

- దేహాత్మ బుద్ధి ఉన్నంతవరకు రాగద్వేషములు తొలగవు.
- అశరీరి అయిన ఆత్మకు పైన చెప్పిన ద్వంద్వములు లేవు.

ఎప్పుడైతే జీవుడు 'దేహానుభవము' నుండి నిదురలేచి, "అశరీరమునకు సంబంధించిన విజ్ఞానము" చేత తనయొక్క అవివేక జ్ఞానమునుండి నివృత్తుడౌతాడో, అప్పుడు –

– అట్టి జీవుడు ఆత్మ స్వరూపుడే అవుతాడు. అనగా తనను తాను సమస్తమునకు పరమైనట్టి 'ఆత్మస్వరూపము' గానే దర్శించుచూ, సమస్తమునకు వేరైనట్టి 'తత్త్వ స్వరూపుడు' అగుచున్నాడు.

**ఇంద్రుడు** : శరీరము లేకుంటే ఈ జీవునికి ఉనికి ఉంటుందా? ఉండదేమో కదా? ఆతడు శరీరము లేనప్పుడు ఏ కర్మ కూడా నిర్వర్తించలేడు కదా!

**ప్రజాపతి** : బిడ్డా! ఈ దేహికి "దేహము లేకుంటే నేను లేను" – అనేది ఐహికమైన (ఇహ సంబంధమైన) మోహము (Illusion) మాత్రమే.

- వాయువుకు శరీరము ఉన్నదా? లేదు. కానీ వాయువు (శరీరము లేకపోయినా) ఉన్నది. అనేక కార్యక్రమములు నిర్వర్తిస్తోంది.
- అట్లాగే మేఘమునకు శరీరము లేదు. ఆకాశము, విద్యుత్తు, పిడుగు వీటికి కూడా శరీరము లేదు. ఇవి అశరీరములే అయి కూడా ఆకాశములో ఆయా ప్రయోజనములు నిర్వర్తిస్తున్నాయి. ఆ తరువాత తమ పుట్టుక స్థానమగు ఆకాశమునందే లీనమగుచున్నాయి.

అట్లాగే ఆత్మాకాశమునుండి జనించిన జీవుడు నిరాకారుడే. అయితే సాకారము ధరించి "నేను ఈతని కుమారుడు. ఈమెకు పుట్టాను. ఇప్పుడు ముసలివాడను. ఇప్పుడు మరణిస్తూ ఉన్నాను" – మొదలైనవి పొందుచూ ఉన్నాడు. ఆత్మాకాశమునందే తాను జనించినా ఆత్మశరీరము (చిదాకాశము) గుర్తుకు రావటంలేదు. స్త్రీ–బంధు–ధన– ప్రతిష్ఠ వంటి వ్యవహారములతో రమిస్తూ ఆత్మయందు రమించకయే ఉంటున్నాడు. తన 'ధారణ'చే పట్టిన ఈ శరీరమునకు బద్ధుడై రోజులు గడపుచున్నాడు.

– ఒక బండికి గుర్రము (లేక) ఎద్దు కట్టబడతాయి చూచావా? అట్లాగే 'ప్రాణము' అనే విశ్వశక్తి ఈ శరీరమునందు కట్టబడి ఉన్నది.

ఈ జీవుడు పరంజ్యోతి స్వరూపుడే। అట్టి జ్యోతి యొక్క అనేక కిరణములు ఈ దేహములో ప్రవేశించినవై ఉంటున్నాయి. [సహస్ర శీర్ష సద్రూపా! శ్రీ సహస్ర శీర్షా పురుషా (సూర్యకిరణములు అనేకచోట్ల ప్రసరిస్తూ అనేక వస్తువులను వెలిగిస్తున్నట్లు)] – పరాత్మయొక్క కిరణములే దేహములో అనేకచోట్ల ప్రసరిస్తూ అనేక కార్యక్రమములు నిర్వర్తిస్తున్నాయి.

ఆత్మ స్వరూపుడే అయి ఉన్న ఈ పరంజ్యోతి స్వరూప జీవునియొక్క –

- చూపుశక్తి (చూపు అనే కిరణము) – కళ్ళలో ప్రదర్శితమై, కళ్ళ నుండి దృశ్యానుభవముగా విస్తారితమౌతోంది. (Getting Extended) (దృశ్యేంద్రియము)
- గంధశక్తి (వాసనానుభవ కిరణము) – ముక్కులో ప్రదర్శితమై వాసనా రూపములుగా విస్తారితమౌతోంది (నాశికేంద్రియము.)
- మాట్లాడుశక్తి (మాట్లాడు కిరణము) – నోటిలో ప్రవేశించి అనేక శబ్ద – వాక్య పరంపరలుగా ప్రదర్శితమౌతోంది (వాగింద్రియము).
- వినికిడి శక్తి (వినికిడి కిరణము) – చెవులో ప్రవేశించి వినుచుండు సమస్తముగా శ్రవణ శబ్దరూపము దాల్చుచున్నది (శ్రవణేంద్రియము).

నేను చూస్తాను – ఇది చూస్తున్నాను!
నేను వాసన చూస్తున్నాను – ఇది ఇట్టి వాసన।
నేను మాట్లాడుచున్నాను – ఇవి నా మాటలు।
నేను వినుచున్నాను – ఇదంతా నా వినికిడి।

ఇదంతా కూడా జీవాత్మయే ఆ సమస్తముగా విస్తరించి ఆస్వాదిస్తున్నది.

స్వప్నములో ఒకడు చూస్తూ ఉన్నదంతా తాను కోరుకొనుచున్నదే కదా! అట్లాగే ఆత్మ పొందుచున్నదంతా తనను తాను ఇచ్ఛగించునదే! అందుకే ఆత్మ 'సత్యకామ', 'సత్యసంకల్ప' అయి ఉన్నది.

- ఆత్మ ఒక్కటే సత్యము।
- తదితరమంతా ఆత్మయొక్క స్వకీయ లీలా – క్రీడా వినోద చమత్కారమే।
- ఇహ పరములందు ఆత్మయే సత్యము.
- సముద్ర జలములో తరంగము బయల్వెడలి, సముద్ర జలంలో సంచరించి, తిరిగి సముద్ర జలమునందే లయమౌతోంది చూచావా! అట్లాగే 'పరమాత్మ' అనే మహాసముద్రంలో 'జీవాత్మలు' అనే తరంగములు బయల్వెడలుచున్నాయి. పరమాత్మయందే శబ్ద స్పర్శ రూప రస గంధములతో కూడి సమస్త అనుభవములు బయలుదేరి, ఆత్మయందే తిరిగి లయమొందుచున్నాయి.

**సమస్తము సర్వదా ఆత్మయే అయి ఉన్నది.** ఇదియే నేను గుర్తు చేసిన ఆత్మాన్వేషణ। ఆత్మదర్శనము।

ఓ ఇంద్రదేవా! ఇట్టి **సర్వత్రా బ్రహ్మముయొక్క సందర్శనమే 'బ్రహ్మలోక ప్రవేశము'గా శాస్త్రవర్ణితము.**

అంతేగాని పంచభూతములు ప్రవర్తించే మరొక చోటేదో కానేకాదు.

**అథ యో వేదేదం మన్వానీతి – స ఆత్మా।** మననము చేయువాడు / (లేక) మనస్సు తనదైనవాడు 'ఆత్మ'

ఏదైతే – "నేను మననము చేస్తున్నాను" – అని తెలుసుకొంటున్నదో – అదియే ఆత్మ – మననము చేయబడేది అద్దాని ఛాయయే।

- జలంలో చూచు నీవు 'ఆత్మ'. జలంలో కనబడే నీ ప్రతిబింబము – ఆత్మయొక్క ఛాయ <u>(కాబట్టి ఆత్మకు అనన్యమే)</u>
- స్వప్నము నీదైన నీవు – ఆత్మ' – స్వప్నములోని నీ ద్రష్టత్వము, స్వప్న దృశ్యానుభవములు – 'ఛాయ'.
- సుషుప్తి నీదైన నీవు 'ఆత్మ' – సుషుప్తి యొక్క ఆయా విశేష లక్షణములు 'ఛాయ'

⌘ మననము చేయునది 'ఆత్మ'।

⌘ ఆ మననమును తెలుసుకొనుచూ ఉన్నది 'ఆత్మ'।

⌘ మనస్సు ఆత్మయొక్క దివ్య నేత్రము। **మనో అస్య దివ్యంచక్షుః।**

⌘ ఆత్మ అట్టి 'మనస్సు' అనే దివ్య చక్షువుచే జగత్‌కల్పన చేసుకొని లీలగా, క్రీడగా, వినోదముగా సమస్తమును దర్శించుచున్నది. సమస్తమునందు రమించుచున్నది.

"సమస్తము బ్రహ్మమే" అను అవలోకనమే బ్రహ్మలోకము.

---

అట్టి ఆత్మను దేవతలు ఉపాసించుచున్నారు. అందుచేతనే దేవతలకు సమస్త లోకములలో సమస్త భోగములు లభిస్తున్నాయి.

ఓ ఇంద్రదేవా! సమస్తము ఆత్మగా ఉపాసించువాడు సత్యకామ, సత్యసంకల్పుడై సమస్త లోకములలో స్వేచ్ఛావిహారి అగుచు లోకములన్నీ ఆత్మయందే (తనయందే) దర్శించగలడు.

---

ఈ విధంగా పూర్ణార్థపూర్వకంగా పలికిన ప్రజాపతి వాక్యములను ఇంద్రుడు శ్రద్ధగా శ్రవణం చేసారు. ఆత్మాన్వేషణ ఆత్మోపాసనల పరాకాష్ఠార్థము పొందినవారై 'మోక్షభావులు' అయ్యారు.

## 8-13. త్రయోదశ ఖండము - శ్యామలా బ్రహ్మము - శబలా బ్రహ్మము

ఈ విధంగా సమాధానము పొందిన ఇంద్రుడు సంతృప్తుడై ప్రజాపతికి నమస్కరించి సెలవు తీసుకొన్నారు. స్వర్గలోకము వచ్చి 'దేవతాసభను సమావేశపరచారు.

**ఇంద్రుడు**: ఓ దేవతలారా! నేను సర్వదా స్వయముగా బ్రహ్మమే అయి ఉన్నాను. కానీ శ్యామా – నీలలోహితమైన 'స్వయంకృత కల్పన' యందు ప్రవేశించి, స్వస్వరూపమును ఇంతకాలం ఏమరచాను. జగద్గురువగు ప్రజాపతిచే బోధించబడి అరణ్యమువలె సమస్తము తనయందు ఇముడ్చుకొన్నట్టి పరబ్రహ్మస్వరూపమునందు పునఃప్రవేశితుడను అగుచున్నాను.

ఇప్పుడు "నేను పూర్ణుడను" అని ఎరిగి మాయాశబలిత జగద్వ్యవహారమంతా ఆత్మస్వరూపుడగు నాకు అభిన్నమైనదిగా దర్శించుచున్నాను.

- గుర్రము తన వెంట్రుకలను విదిల్చి ధూళిని వదిలించుకొనురీతిగా
- రాహు గ్రహమునుండి విముక్తుడైన పూర్ణచంద్రునివలె
- మకిలి వదలగా తళతళమెరుస్తున్న పంచపాత్రవలె

"దృశ్యము సత్యము, నిత్యము. దృశ్యము నన్ను బాధిస్తోంది. ఏదో చేస్తే ఎప్పటికో ఎట్లాగో ఎవ్వరో చేయి సాయమిస్తేగానీ నాకు దృశ్య (సంసార) బంధము ముడివీడదు"...మొదలైన బద్ధభావములనుండి విడివడుచున్నాను.

దృశ్యమును అధిగమించి ద్రష్టయొక్క కేవలీ తత్త్వమును గ్రహించుచూ కృతకృత్యుడనగుచున్నాను.

**శ్యామాః శబలం ప్రపద్యే।** (నీలము నుండి తీయబడిన నీల వర్ణము వలె) హృదయస్థ బ్రహ్మమునుండి 'సమస్తము బ్రహ్మమే" అను శబలము (నిశ్చయము) పొందుచున్నాను.

**శబలాః శ్యామం ప్రపద్యే।** "సమస్తము బ్రహ్మమే" అనే బలముచే సర్వ హృదయాలలో బ్రహ్మము దర్శించుచున్నాము.

⌘ బ్రహ్మములోనే సమస్తము

⌘ సమస్తమునందు బ్రహ్మమును ఉపాసిస్తూ పొందవలసిన బ్రాహ్మీ స్వరూపమును సిద్ధించుకొనుచున్నాను.

**మనస్సుచే బ్రహ్మమును దర్శిస్తూ బ్రహ్మమునందే మనస్సును దర్శిస్తూ బ్రహ్మీ స్వస్వరూపమును అమనిత్యముగా తీర్చిదిద్దుకుంటున్నాను.**

ఓ దేవతలారా! మనందరము సమస్త లోకములను జయించి, సర్వాత్మస్వరూపులమై ఆనందించటానికి ఇది ఒక్కటే మనకు మార్గము.

## 8-14. చతుర్దశ ఖండము - ఆత్మయే సమస్తము!

**ఆకాశో వై నామరూపయోః నిర్వహితా।** బ్రహ్మాకాశము (లేక) ఆత్మాకాశమే (లేక) హృదయాకాశమే (దహరాకాశము) (లేక) నిర్విషయ చిదాకాశమే – ఈ కనబడే నామరూపాత్మకమైన సమస్త జగత్తును నిర్వహించుచున్నది. వ్యక్తీకరణము చేయుచున్నది. ఇదంతా దర్పణములో (లేక) జలములో ప్రతిబింబమువలె ఆత్మయందే ఏర్పడినదై ఉన్నది.

**తే యత్ అన్తరా తత్ 'బ్రహ్మ'। తత్ అమృతమ్।** ఈ సమస్త ఇంద్రియ విషయరూప జగత్తు 'దేనియందైతే' అంతరముగా (భావనామాత్రమై, కల్పనామాత్రమై) నామరూపాత్మకమై కనిపిస్తోందో – అదియే బ్రహ్మము। అట్టి బ్రహ్మమే అమృతము।

ఏ సృష్టికర్త ఇంద్ర దేవునికి, విరోచనునికి అట్టి 'ఆత్మాన్వేషణ', 'ఆత్మోపాసన'ను అశరీరవాణి అయి వినిపిస్తూ మార్గదర్శనం చేయిస్తున్నారో, ....అట్టి ప్రజాపతికి హృదయపూర్వకంగా నమస్కరించుచున్నాము.

**స ఆత్మా ప్రజాపతేః సభాం వేశ్మ ప్రపద్యే।** ప్రజాపతియొక్క సభలో ప్రవేశించి అట్టి 'ఆత్మ' (లేక) బ్రహ్మమును ఉపాసించుచున్నాము.

అట్టి "సమస్తము ఆత్మయందే। ఆత్మయే సమస్తమునందు" అను స్వస్వరూపాత్మ ప్రబోధ – ధ్యాన – ఆరాధనలచే బ్రహ్మజ్ఞానులగు బ్రాహ్మణులయొక్క, అభ్యాస సామర్థ్య సంపన్నులగు క్షత్రియులయొక్క, కృష్ణ గోరక్షణ సంపన్నులగు వైశ్యుల యొక్క యశస్సు (యశోరూపమగు ఆత్మను) పొందియుండెదము గాక।

సమస్తము నేనైన నేను – యశస్సులకే యశస్సును। ఆత్మనగు నేను సర్వదా అఖండాత్మగానే ఉండి ఉన్నాను. ఉండి ఉంటాను. అంతేగాని దంతములు లేకుండానే "భక్షణ" చేయునట్టి రోహితమగు (కుంకుమ రంగు వంటి) 'మాయ' అనే గోతిలో మేము పడకుండెదముగాక! మాయయందు చరించము. ఆత్మయందే చరించెదము గాక।

## 8-15. పంచదశ ఖండము – పరంపర – నియమ – ఫలశ్రుతులు

ఇట్టి ఆత్మ తత్త్వజ్ఞానమును (తమ్ ఆత్మయేవ – ఇతి జ్ఞానో)

- సృష్టికర్తయగు బ్రహ్మ – సృష్ట్యభిమానియగు ప్రజాపతికి ఉపదేశించారు.
- ప్రజాపతి మానవ సృష్టి నిర్మాత అగు 'మనువు'కు బోధించారు.
- 'మనువు' ప్రజలకు నేర్పారు.

ఎవ్వరైతే....

- తమకు నియమితమైన కర్మలను ధర్మబుద్ధితో, సేవక భావనతో, పరమాత్మకు సమర్పిస్తూ నిర్వర్తిస్తూ ఉంటారో...,
- గురుభక్తి కలిగి ఉంటారో,
- వేదముల అంతరార్థమును అధ్యయనము చేస్తూ ఉంటారో,
- సునిశితము, విశాలము, నిర్మలము, తితిక్షా సమన్వితము అగునట్లుగా స్వకీయ ప్రజ్ఞ–అవగాహనలను తీర్చిదిద్దుకుంటూ ఉంటారో,
- సద్గురువుల సూచనానుసారం ఆశ్రమ ధర్మములను పాటిస్తూ, పరమాత్మకు సమర్పిస్తూ ఉంటారో...,
- సంతానమును, ఆశ్రితజనులను అధ్యయన సంపన్నులుగా తీర్చిదిద్దుతూ ఉంటారో,
- శాస్త్ర విహితమైన సాధన సంపత్తిని పెంపొందించుకుంటూ ఉంటారో,
- అహింసావ్రతులై, జీవితమును భగవత్ – ప్రసాదముగా భావిస్తూ, జీవితము అనే సందర్భమును సద్వినియోగపరచుకుంటూ ఉంటారో...

అట్టివారు ఈ శరీరమున్నప్పుడే బ్రహ్మలోకము ప్రవేశించినవారై, (అనగా సర్వము బ్రహ్మముగా, ఆత్మగా చూడటం సిద్ధించినవారై) బ్రహ్మసాయుజ్యమును తప్పక పొందగలరు.

**ఇతి ఛాందోగ్యోపనిషత్ సమాప్తమ్**

**ఓం। ఆప్యాయన్తు మమాంగాని వాక్ ప్రాణః చక్షుః శ్రోత్రమ్ అథో బలమ్ ఇన్ద్రియాణి చ సర్వాణి।**
**సర్వం బ్రహ్మోపనిషదం। మాऽహం బ్రహ్మనిరాకుర్యాం।**
**మామా బ్రహ్మ నిరాకరోత్। అనిరాకరణమస్తు। అనిరాకరణం మేऽస్తు।**
**తత్ 'ఆత్మ'ని నిరతే య ఉపనిషత్సు ధర్మాః తే మయిసన్తు। తే మయిసన్తు।**
**ఓం శాంతిః। శాంతిః। శాంతిః**

అథర్వణ వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 23 త్రిపురాతాపిన్యుపనిషత్
## (త్రిపురా తాపినీ మహోపనిషత్)

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

### శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ త్రిపురా తాపినీ విద్యా
వేద్య చిచ్ఛక్తి విగ్రహమ్।
వస్తుతః చిన్మాత్ర రూపం
పరం తత్త్వం భజామ్యహమ్ ॥



"చిత్‌శక్తి" స్వరూపము తెలియజేయు త్రిపురా తాపినీ విద్యను ఆశ్రయిస్తున్నాను. వస్తుతః ''చిన్మాత్రమే'' అయినట్టి పరతత్త్వమును భజించుచున్నాను.

## ప్రథమోపనిషత్

1 ఓం। అథ ఏతస్మిన్ అంతరే భగవాన్ ప్రజాపత్యం వైష్ణవం విలయకారణం రూపం ఆశ్రిత్య,

"ఓంకారార్థమగు పరమాత్మకు నమస్కరిస్తూ'' :-

సమస్తము తన చిత్ - (ఎరుక) తేజస్సునందు వెలిగించువాడగు భగవానుడు సమస్తమునకు అంతర్యామిగా ఆశ్రయించి ఉంటున్నారు.

(1) "ప్రజాపత్యము''ను (సృష్టికర్తృత్వము), (2) వైష్ణవము (సృష్టి కొనసాగటానికి పరిపోషణ), పరిరక్షణ ప్రదర్శనమును మరల (3) "ఉపసంహారము''లగు విలయ కారణమును ఆశ్రయిస్తూ ఉన్నారు.

"త్రిపుర అభిధా భగవతి" ॥
ఇతి ఏవం ఆదిశక్త్యా "భూర్భువః స్వః"

భగవానుని ఆదిశక్తి రూపమే (వెలిగించు రూపమే) - భగవతి. అట్టి భగవానుని సంకల్ప - భావనా రూపి అగు భగవతి భూ, భువ సువర్లోకములను తన శక్తి ప్రదర్శనములు కలిగి ఉంటుంది.

---

త్రీణి స్వర్గ, భూ, పాతాళాని త్రిపురాణి హర।
మాయాత్మకేన, హ్రీంకారేణ హృల్లేఖాఖ్యా (హృత్ లేఖ ఆఖ్యా)
భగవతీ త్రికూట అవసానే నిలయే
విలయే ధామ్ని మహసా ఘోరేణ వ్యాప్నోతి

మాయాత్మకమైన 'హ్రీం' కారముచే "హృల్లేఖ (హృత్ లేఖ)'' బిరుదాంకిత అగు ఆ భగవతి త్రికూట శిఖరముపై నుండి ఆవలనుండి "స్వర్గ భూ పాతాళములు'' అనే త్రిపురములను ఆక్రమించి'' విలయము చేస్తూ ధామమునందు గొప్ప ఘోరమైన (ఘనీభూతమైన) తేజస్సుచే వ్యాపించి యున్నది.

---

2. స ఏవ ఇయం భగవతీ త్రిపుర ఇతి వ్యాపత్యతే

ఆ భగవతియే 'త్రిపుర'గా పఠించ బడుచున్నది. (చెప్పబడుచున్నది)

త్రిపదా గాయత్రి

"తత్సవితుర్వరేణ్యం" (1)

**తత్ సవితుః వరేణ్యం**। వేదోపనిషత్తులచే స్తుతించబడు (ఉనికి ఎరుక రూపమగు) సవితృదేవతకు నమస్కారము.

"భర్గోదేవస్య ధీమహి" (2)

సమస్తమును (ఎరుకచే) వెలిగించు భర్గోదేవుని "ధీ (బుద్ధి)'' మహిమను ఉపాసించుచున్నాము.

"ధియో యో నః ప్రచోదయాత్। (3)

అట్టి వరేణ్యుడగు తత్-సవిత్ స్వరూప భర్గో దేవుడు మా యొక్క బుద్ధిని (ఆత్మజ్ఞాన - స్వానుభవ మార్గముగా) ప్రచోదితము చేయును గాక। ఇతి త్రిపదా గాయత్రి।

| | |
|---|---|
| **పరోరజసే సావత్ "ఓం" ।** | పై త్రిపాదములకు ఆవల 4వ పాదము, అట్టి నాలుగవ పాదము 'పరోరజసే సావత్' 'ఓం'కార రూపమై విలసిల్లుచున్నది. |
| **జాత వేదసే సునవామ సోమం అరాతీ, యతో నిదహాతి వేదః ।** | ఓ జాతవేదా ! అగ్నిదేవా ! మేము సోమలతనుండి సోమరసమును తీసి, ఇదిగో, మీకు సమర్పిస్తున్నాము. |
| **స నః పరుషత్ అతి దుర్గాణి విశ్వా నావ ఇవ సింధుం దురితాత్యగ్నిః (దురిత అతి అగ్నిః)।** | ఓ అగ్ని భగవాన్ ! మేము పరమాత్మను ఎరుగుటలో దుర్గమములను (తారసపడే అడ్డంకులను) కరుణామూర్తులై తొలగించండి. సముద్రంలో మునుగువానికి నావ లభిస్తే, దానిని ఎక్కి ఒడ్డుకు చేరునట్లుగా, మమ్ములను మీరే 'నావ' అయి సంసార దోషములనుండి కాపాడండి. సర్వదురితములను మీ తేజస్సుచే భస్మము చేయండి. |
| **ఓం। త్ర్యంబకం యజామహే, సుగంధిం పుష్టివర్ధనమ్ ।** | ఉత్తమ గంధములకు (Positive tendencies) పుష్టిని వర్ధనము (Develop) చేయుటకు త్రిపురముల (జాగ్రత్-స్వప్న - సుషుప్తుల) లయకారుడగు త్ర్యంబకుడగు పరమశివుని ఉపాసిస్తున్నాము. పూజిస్తున్నాము. |
| **ఊర్వారుకమివ బంధనాత్ మృత్యోః ముక్షీయ మాஉమృతాత్। (మా-అమృతాత్) ।** | దోసపండు దోసతీగ తొడిమనుండి విడివడదీయు విధంగా మమ్మ మృత్యువునుండి విడదీసి వేయండి. అమృతము నుండి విడివడనీయకుండా అనుగ్రహించండి. |
| **శతాక్షరీ పరమా విద్యా త్రయీమయీ స-అష్టార్ణా త్రిపురా పరమేశ్వరీ।** | **ఆ భగవతీదేవి యొక్క విశేషణములు :**<br>**శతాక్షరీ** :- పూర్ణము, అక్షరము<br>**పరమా విద్యా** :- 'పరమ్'అగు (ఈ సమస్తమునకు ఆవలిదగు పరతత్త్వము (లేక) ఆత్మ గురించిన విద్యా స్వరూపిణి.)<br>**త్రయీమయీ** : ముజ్జగములు తానే అయి ఉన్నది.<br>**స అష్టార్ణా** : పంచభూత - మనోబుద్ధి చిత్తములనే, అష్టవిధ ప్రకృతితో కూడి ఉన్నది.<br>**త్రిపురా** :- జాగ్రత్ స్వప్న సుషుప్తులు, త్రిలోకములు, త్రికాలములు - తాను సంచరిస్తూ వినోదిస్తున్న - దేవి<br>**పరమేశ్వరీ** :- ఆవల స్వరూపిణి అయి సమస్తముగా విస్తరించి యున్న స్వరూపిణి । |
| **ఆద్యాని చత్వారి పదాని పరబ్రహ్మ వికాసినీ,** | పరబ్రహ్మముయొక్క వికాస (వికసించిన) స్వరూపమగు ఆ దేవి : మొదటగా జాగ్రత్-స్వప్న-సుషుప్తి - తురీయములనే (లేక) మనో-బుద్ధి - చిత్త - అహంకారములనే 4 పదములు తనవైనట్టి దేవి । |
| **ద్వితీయాని శక్త్యా ఆఖ్యాని,** | రెండవ విశేషముగా - 'శక్తి' స్వరూపిణి అయి ఉన్నట్టిది. |
| **తృతీయాని శైవాని,** | మూడవదిగా - శివ (కేవల) స్వరూపిణి, ప్రతిజీవుని నిజస్వరూపము. |
| **తత్రలోకా వేదాః శాస్త్రాణి పురాణాని ధర్మాణి వై చికిత్సితాని,** | ఆ దేవీ తత్త్వము గురించి చెప్పటానికే చతుర్వేదములు, సహితులు మొదలైనవాటి రూపంగా వేదాంత శాస్త్రములు, ధర్మశాస్త్రములు - ఇవన్నీ ఎలుగెత్తి గానం చేయటానికే ఏర్పడి ఉన్నాయి. అవి అనాత్మభావనకు చికిత్సా విధానము వంటివి. |
| **జ్యోతీగ్ం షి శివశక్తి యోగాత్ ఇతి ఏవం ఘటనా వ్యాపత్యతే,** | జ్యోతి స్వరూపము, శివశక్తి యోగము మొదలైన పాఠ్యాంశములుగా (ఘటనా విశేషముల ద్వారా) ఉపాసించబడేది - ఆ దేవీతత్త్వమే। |

| | |
|---|---|
| **అథ ఏతస్య పరం గహ్వరం వ్యాఖ్యాస్యామో ।**<br>**మహామను సముద్భవం తత్ ఇతి**<br>**బ్రహ్మ శాశ్వతం**<br>**పరో, భగవాన్**<br>**నిర్లక్షణో, నిరంజనో నిరుపాధిః**<br>**ఆధి రహితో – దేవః ।** | అట్టి పరమేశ్వర పరమేశ్వరీ తాత్త్విక రహస్యము గురించి ఇప్పుడు కొన్ని విశేషములు చెప్పుకుంటున్నాము. వివరించుకుంటున్నాము. వ్యాఖ్యానించుకుంటున్నాము.<br>ఈ జగత్ వ్యవహారమంతా ఆ పరమాత్మ యొక్క మహామనస్సు నుండే సంభవిస్తోంది.<br>శాశ్వతమగు పరబ్రహ్మమే ఆ దేవదేవి రూపము<br>ఆ దేవీ రూపము సమస్తమునకు ఆవలిది కనుక పరము.<br>సమస్తమును చిత్ (ఎరుక) చే వెలిగించువాడు కనుక - భగవాన్ । భగవత్ స్వరూపము.<br>సమస్త లక్షణములు ఆ పరమాత్మవే అయికూడా ఆ దేవి సర్వ లక్షణ విలక్షణ । లక్షణ రహిత । ఎట్టి దోషములచే స్పృశించబడనిది. ఉపాధులన్నీ తన చేతనే కదల్చబడుచూ కూడా ఆ త్రిపురాదేవి ఉపాధికి ఆవలిది. ఉపాధి రహితమైనది. అధి (మానసిక రుగ్మత) లేనట్టిది. సమస్త దేవతా స్వరూపిణి । |
| **3. ఉన్మీలతే పశ్యతి । వికాసతే చైతన్య భావం**<br>**కామయత ఇతి ।**<br>**స ఏకో దేవః శివరూపీ దృశ్యత్వేన**<br>**వికాసతే యతిషు**<br><br>**యజ్ఞేషు యోగిషు, కామయతే కామం జాయతే**<br><br>**స ఏవ నిరంజనో అకామత్వేనోత్ జృంభతే** | ఆ కేవలానంద ఆత్మ స్వరూపిణి అగు దేవదేవి<br>- కనులు తెరిచి, చూడటం ఆరంభించి చైతన్య భావము వికసింపజేసుకొని - "దృశ్యము ఆస్వాదిస్తాను" - అనే కామమును (wish)ను ఆశ్రయిస్తోంది.<br>సర్వదా ఏక శివ (ఆనంద) రూపిణి అయి ఉండి కూడా ప్రయత్న పూర్వకంగా అనేక రూపములుగా వికాసము పొందుచున్నది.<br>యోగులు దేవతల యజ్ఞ కార్యములయందు ఇష్టములను కోరుకుంటారు. అక్కడ నుండి దృశ్య సంబంధమైన కోరికలు కోరబడుచున్నాయి.<br>అయితే ఆ దేవి సర్వాంతర్యామి. జగత్ కల్పన నిర్వర్తిస్తూ కూడా, సర్వదా నిరంజన (నిర్మల, దోషరహిత) అకామ అయియే తన కామత్వ అంశం నుండి జగత్తులుగా విజృంభిస్తోంది. |
| **అ క చ ట త ప యశాన్ సృజతే**<br>**తస్మాత్ ఈశ్వరః కామో అభిధీయతే ।**<br>**తత్ పరిభాషయా కామః కకారం వ్యాప్నోతి ।**<br>**'కామ' ఏవ ఇదం తత్ తత్ ఇతి**<br>**'క'కారో గృహ్యతే ।**<br>**తస్మాత్ తత్ పదార్థ ఇతి**<br>**య ఏవం వేద ॥** | "అ క చ ట త ప" యశస్సుతో ఇదంతా సృష్టిస్తోంది. (అ) తనంతట తానుగా (క) స్వ - అర్థము, (చ) ఇంకా కూడా భావాత్మకంగా (త) తత్ స్వరూపి అయి (వ) వశించుచున్న దేవీ తన తేజస్సుతో ఇదంతా సృజించుచున్నది.<br>అందుచే ఈ దృశ్యజగత్తు ఈశ్వరుని (కామేశ్వరుని) కామ ప్రదర్శనగా చెప్పబడుతోంది.<br>ఈ సర్వము కాముడే (Presentation of one's own desire) అనటానికే 'క' కారముగా అదియే విస్తారమౌతోంది.<br>ఇదంతా ఈ దృశ్య జగత్తు ఇదం తత్ తత్ కామయేవయే 'క' కారముగా చెప్పబడేది. అందుచేత ఇదంతా ఆత్మయొక్క కామమే కాబట్టి "ఆత్మయే" - అయి ఉన్నది - అని తెలియబడు గాక. |

| | |
|---|---|
| **"సవితుః వరేణ్యం।" ఇతి షూఞ్ ప్రాణి ప్రసవే<br>సవితా ప్రాణినః సూతే ప్రసూతే శక్తిమ్ ।<br>సూతే త్రిపురా శక్తిః ।** | **'సవితుః వరేణ్యం'**<br>- "సత్ - విత్" (ఉనికి, ఎరుక) గా ఆత్మపురుషుడు వరేణ్యుడు<br>షూన్ = ప్రసవము.<br>సవిత = ప్రాణులను కనుచున్నాడు.<br>ప్రసూతే = శక్తి శక్తితో నిర్వర్తించునది.<br>త్రిపురా శక్తియే ఈ సమస్తమునకు సూతము (ప్రసవము)- Place of Birth (కన్నతల్లి). |
| **ఆద్య ఇయం త్రిపురా పరమేశ్వరీ<br>మహా కుండలినీ దేవీ జాతవేదస మండలం<br>యో – అధీతే సర్వం వ్యాప్యతే, త్రికోణ<br>శక్తిః ఏకారేణ మహాభాగేన ప్రసూతే ।<br>తస్మాత్ ఏకార ఏవ గృహ్యతే ।** | ఎవ్వడైతే ఇప్పుడే ఇక్కడే త్రిపురాశక్తి, త్రిపురా - పరమేశ్వరీ, మహా కుండలినీ దేవి జాతవేద 'మండలా' (అగ్ని లోకేశ్వరీ) దేవిని (జాగ్రత్ స్వప్న సుషుప్తులు కల్పనలుగా సంచార స్థానములుగా) ఎవ్వడు ఉపాసిస్తాడో, అట్టివాడు తానే ఆత్మ భావనాసిద్ధుడు కాగలడు. త్రి-స్థానములలో సర్వవ్యాపకుడు, త్రికోణ (జాగ్రత్-స్వప్న-సుషుప్తిల (మరియు) ద్రష్ట - దర్శన - దృశ్యముల) ఏకారేణమును (ఏకత్వమును) పొందగలడు. |
| **"వరేణ్యగ్ం" శ్రేష్ఠం భజనీయం<br>అక్షరం నమస్కార్యం ॥** | "వరేణ్యము" - అనగా శ్రేష్ఠమైనదిగా భజనీయమైనది, అక్షరమైనది, నమస్కరించతగినది (ఉపాసించతగినది) |
| **తస్మాత్ వరేణ్యం ఏక అక్షరం గృహ్యత ఇతి,<br>య ఏవం వేద ।** | ఏకము, అక్షరము (Unity and changeless) అగునదే (పరబ్రహ్మమే) వరేణ్యము. ఇది తెలుసుకున్నవాడు ఏకము అక్షరముగా స్వస్వరూపము గాంచగలడు. |
| **4. "భర్గో దేవస్య ధీమహి" ఇతి ఏవం వ్యాఖ్యాస్యామః।<br>ధకారో ధారణా । ధియైవ ధార్యతే।** | ఇప్పుడిక "భర్గో దేవస్య ధీమహి" - అను దాని గురించి వ్యాఖ్యానించుకొంటున్నాము.<br>**'ధ'** = ధారణ<br>**'ధీ'** = బుద్ధి<br>**'ధియైవ ధార్యతే'** = బుద్ధి చేతనే 'ధారణ' చేయబడుతోంది. |
| **భగవాన్, పరమేశ్వరో భర్గోదేవః<br>మధ్యవర్తి తురీయం అక్షరగ్ం<br>సాక్షాత్ తురీయగ్ం సర్వగ్ం ।** | **భర్గోదేవః**<br>❖ సర్వమును వెలిగించువాడు కాబట్టి - **భగవంతుడు** (One who enlightens all).<br>❖ ఈ జగదనుభవమునకు ఆవలివాడు (పరమ్) అయి అనుభవమంతా తానేగా విస్తరించి ఉన్నవాడు (ఈశ్వరుడు) కనుక **పరమేశ్వరుడు** (All beyond while extending as all).<br>❖ కేవలజ్ఞాన దివ్యస్వరూపుడు కాబట్టి-**భర్గో దేవుడు** (Absolute Knower and is divine by Himself).<br>- సమస్త జీవుల హృదయాంతరంగుడు కనుక **మధ్యవర్తి.** జీవాత్మ - పరమాత్మ స్వరూపములుగా వర్తించువాడు కనుక **మధ్యవర్తి.**<br>- జాగ్రత్ స్వప్న సుషుప్తులు తనవై, ఆ మూడు తన యొక్క విహార స్థలములుగా కలవాడు కనుక - **తురీయుడు.**<br>- మార్పు చేర్పులచే స్పృశించబడడు కనుక - **అక్షరుడు.**<br>- తురీయమునకు కూడా సాక్షి కాబట్టి - **సాక్షాత్ తురీయుడు.**<br>- ఈ సమస్తము తానే అయినవాడు కనుక - **సర్వగుడు.** |

| | |
|---|---|
| **సర్వాంతర భూతమ్।**<br>**తురీయ అక్షరం 'ఈ' కారం ।** | సర్వాంతర్యామి, త్రి అవస్థలకు సాక్షి (తురీయుడు, అక్షరుడు - "ఈ'' కారుడు (ధ + ఈ = ధీ) |
| **పదానాం మధ్యవర్తి ఇతి ఏవం**<br>**వ్యాఖ్యాతం భర్గోరూపం**<br>**రూపం వ్యాచక్షతే ॥** | జీవ - ఈశ్వర - పర (కేవల) పదములకు మధ్యవర్తి (మధ్యగా వర్తించువాడు). అందుచేత **"భర్గోరూపుడు, భర్గోదేవుడు"** - అని వ్యాఖ్యానించబడుచున్నాడు. |
| **తస్మాత్ "భర్గోదేవస్య ధీమహి" ఇతి ఏవం**<br>**"ఈ"కారాక్షరం గృహ్యతే ।** | ఇంకా కూడా ఆత్మ స్వరూపిణి అగు త్రిపురేశ్వరి గురించి....<br>అందుచేత **"భర్గోదేవస్యం ధీమహి"** - అను వాక్యము యొక్క సంజ్ఞార్థము **"ఈ-కారాక్షరము"** గా గ్రహించబడుతోంది.<br>ఇప్పుడు ''మహి'' అను శబ్దము యొక్క ఉద్దేశ్యమును (అంతరార్థమును) వ్యాఖ్యానించుకుంటున్నాము. |
| **"మహి" ఇతి అస్య**<br>**వ్యాఖ్యానం । మహత్వం జడత్వం కాఠిన్యం విద్యతే**<br>**యస్మిన్ అక్షరే – తత్ – "మహి" ।** | ఏ అక్షరము →<br>❖ స్వస్వరూపము యొక్క సర్వాత్మత్వము సూచిస్తోంది - అది **"మహత్" (లేక) మహత్వము.**<br>❖ 'స్పందన'కు సాక్షి అయి (తరంగమునకు అంతరమైన జలమువలె) సర్వదా నిశ్చలమవటముచేత **"జడత్వము".**<br>❖ మహాశిలవలె సుస్థిరము కాబట్టి **కాఠిన్యము.**<br>❖ క్షరము లేనిది కనుక **అక్షరము.**<br>ఈ విధంగా "మహి''అనునది వ్యాఖ్యానముగా వివరించబడుతోంది. |
| **లకారః పరంధామ కాఠిన్య ఆఢ్యగ్ం**<br>**ససాగరగ్ం సపర్వతగ్ం ససప్తద్వీపగ్ం**<br>**సకాననం ఉజ్జ్వలద్రూపం మండలం**<br>**ఏవ ఉక్తం 'ల' కారేణ పృథ్వీదేవీ**<br>**మహీత్యనేన వ్యాచక్షతే।** | ఇంకా కూడా "ధీమహి'' లోని "మహి" గురించి సూక్ష్మార్థంగా→<br>(''లక్ష్మి'', ''లలిత'', ''శుక్ల'' అను శబ్దములలోని) 'ల'కారము "పరంధామము'' (The Finest State) యొక్క సూచన.<br>కాఠిణ్యార్థంగా - స సాగరము (సముద్రము వలె యథాతథము), స పర్వతము (పర్వతమువలె నిశ్చలము). స-సప్తద్వీపము (పంచభూత-బాహ్య అభ్యంతర సమన్వితము). స-ఏకాననము (ఏకముఖ రూపము, అనేకంగా కనిపిస్తూ ఏకమే అయి ఉన్నట్టిది). నవ నవానుభవము కాబట్టి ఉజ్జ్వల (ఉత్ జ్వల) (Ever blossoming) రూప మండలము పృథివీ దేవిగా విభవము ఇదంతా "మహి'' అనబడుతోంది. |
| **5. "ధియో యో నః ప్రచోదయాత్ ।"**<br><br>**పరమాత్మా సదాశివ ఆదిభూతః ।**<br><br>**పరః స్థాణు భూతేన**<br>**'ల'కారేణ జ్యోతిర్లింగం ।**<br><br>**ఆత్మానం "ధియో" బుద్ధయః**<br>**పరే। వస్తుని ధ్యాన ఇచ్ఛారహితే, నిర్వికల్పకే।** | **"ధియో యోనః ప్రచోదయాత్" గురించి వ్యాఖ్యానించుకుంటున్నాము.**<br>ఆ త్రిపురేశ్వరియే (లేక) త్రిపురాసుర సంహారుడు అగు స్వామియే...,<br>- సమస్తమునకు పరమై (ఆవలగా) గల ఆత్మేశ్వరుడు కాబట్టి "పరమాత్మ''.<br>- జీవాత్మగా (జగత్ దృష్టికి) కనిపిస్తూ కూడా సర్వదా "సదాశివుడే''।<br>- సమస్త జీవాత్మలకు, పంచభూతములకు మునుముందువాడు. కాబట్టి ఆదిభూతుడు.<br>- ఆయన 'ల'కారణుడై (లయమై)నట్టి పరస్వరూపుడైన స్థాణువు.<br>- జ్యోతిర్లింగ (తేజో-సూక్ష్మ) స్వరూపుడు.<br>- ఆత్మయందు బుద్ధి ప్రకాశవంతుడు కనుక - ఆత్మానం ధియో బుద్ధాయః । పరస్వరూపుడు. వస్తు పరిమితములందు ధ్యాన - ఇచ్ఛలు లేనట్టివాడు - నిర్వికల్పుడు. |

**ప్రచోదయాత్ ప్రేరయేత్ ఇతి ఉచ్ఛ స్వర రహితం చేతస ఏవ చింతయిత్వా భావయేత్ - ఇతి ॥**

ప్రచోదయాత్ = ప్రేరేపించును గాక ।

ఈ శబ్దము పెద్ద గొంతుకతో కాకుండా (ఉచ్ఛ స్వర రహితమ్), బుద్ధి (చేతస్సు)లో చింతన చేస్తూ మనస్సుతో భావన చేయాలి.

---

**పరో రజసే సావత్ 'ఓం' ఇతి ।**

రజస్సుకు పరమై ఏర్పడి ఉన్న రూపము. ఓంకారార్థము.

**తత్ అవసానే । పరంజ్యోతిః ।**
**అమలగ్ం । హృది దైవతం । చైతన్యం చిల్లింగగ్ం హృదయాగార వాసినీ।**

సమస్తమునకు ఆవల 'తత్' స్వరూపమైనది. పరంజ్యోతి స్వరూపము, నిర్మలము. సమస్త జీవుల హృదయములలో దివ్య స్వరూపుడై వెలుగొందువాడు. చైతన్యమూర్తి । చిత్ స్వరూపముగా హృదయములలో నివాసము కలవాడు. అంతర హృదయుడు.

**హృల్లేఖే ఇతి । ఆదినా స్పష్టం ।**
**వాగ్భవకూటం । పంచాక్షరం ।**

హృల్లేఖగా హృదయములో సుస్పష్టమగువాడు - ఆయా రూప - అవగాహన - భావనలచే ఉపాసనా ఫలముగా లభించువాడు. స్పష్టమగువాడు. వాక్కు జనించు స్థానమగు కూటస్థుడు. పంచాక్షరుడు (దృశ్య-ద్రష్ట-జీవాత్మ-ఈశ్వర-పర అను ఐదు - అక్షర స్వరూపము తనదైనవాడు).

**పంచభూత జనకం పంచకలామయం**
**వ్యాపతృత ఇతి, య ఏవం వేద ॥**

(ఈ భూ - జల - అగ్ని - వాయు - ఆకాశ) పంచ భూతములకు జనన స్థానమైనవాడు. పంచకల స్వరూపుడు / పంచకలామయుడు. ఆ విధంగా త్రిపురాసుర సంహారిణి లయకారాన్ని ఉపాసిస్తున్నాము.

---

**అథ తు పరం కామకళా భూతం కామకూటం ఆహుః ।**

"ఈ విశ్వము (జగద్దృశ్యము) అంతాకూడా పరతత్త్వము యొక్క కామకళాభూతము (లేక) కామకూటమే" - అనబడుచున్నది.

**"తత్సవితుః వరేణ్యం" -**
**ఇత్యాది ద్వాత్రిగ్ంశత్ (32)**
**అక్షరీం పఠిత్వా**

"తత్సవితుః వరేణ్యం" ఇత్యాది '32' అక్షరముల మంత్రమును పఠిస్తూ "తత్ అనగా ఇది" అని ధ్యానము ధ్యాసలతో నిర్వర్తించాలి.

**'తత్', ఇతి - పరమాత్మా ।**
**సదాశివో అక్షరం విమలం నిరుపాధి**
**తదాత్మ్య ప్రతిపాదనేన**

తత్-పరమాత్మ, సదాశివము అక్షరము, విమలము, నిరూపాధికముతో తాదాత్మ్యము ప్రతిపాదన కలిగి ఉండాలి. శివరూపము - 'హ'కారాక్షరము.

**'హ' కార అక్షరం, శివరూపం**
**నిరక్షరం అక్షరం వ్యాలిఖ్యత ఇతి**

శివుడు-సమష్ఠి రూపమైన "నేను". అట్టి తత్ శివ తత్త్వమును నిరక్షరము గాను (అఖండాత్మమేవాహమ్ - 'భావన' గాను), అక్షరపూర్వకంగాను (ఓం) - హృదయ ఫలకముపై లిఖించి ఉపాసించాలి.

---

**తత్ పరాగ వ్యావృత్తిం ఆదాయ,**
**శక్తిం దర్శయతి తత్సవితుః**
**(తత్ సవితుః) - ఇతి ।**

'తత్' నుండి బయలుదేరు "పరాగ వ్యావృత్తి (Extended form)ను స్వీకరించి, కేవలము నుండి బయల్వెడలుచున్న బాహ్య విశేషమును గమనిస్తూ - తత్సవితుః మంత్రమును పలకాలి

పూర్వ (సూర్యోదయ వైపు అగు తూర్పు) మార్గంగా - సూర్యుని, అర్ధాని క్రిందగా చంద్రికను లిఖించాలి.

**పూర్వేణాధ్వనా సూర్య, అధః చంద్రికాం వ్యాలిఖ్య**

"ఇదంతా పరమాత్మకు అన్యము కాదు" అను "అద్వితీయము"ను 'స' అక్షర మహదర్థంగా -

**మూలాది బ్రహ్మరంధ్రగం 'స' అక్షరం,**
**అ'ద్వితీ'యం ఆచక్షత - ఇతి ఆహ ।**

మూలాధారమునుండి - బ్రహ్మరంధ్రము వరకు మూలాధారము - స్వాధిష్ఠానము - మణి పూరకము, అనాహతము - విశుద్ధము - ఆజ్ఞ - బ్రహ్మరంధ్రము వరకు - కేవలమగు "అహంబ్రహ్మ" తత్త్వమును భావించాలి. ఉద్దేశ్యించాలి.

| | |
|---|---|
| **6. భగవంతం దేవగ్ం<br>శివశక్త్యాత్మికం ఏవ ఉదితమ్ ।** | కేవలుడు, ఆదిస్వరూపుడు, నిర్విషయుడు అవటంచేత దివ్య స్వరూపుడగు భగవంతుని నుండి శివ + శక్త్యాత్మకంగా ఈ సృష్టి అంతా బయల్వెడలింది. లీలగా ఉదయించింది. |
| **శివోఽయం పరమం దేవగ్ం ।** | సమస్త జీవులలోని నిజరూపమే శివుడు. అట్టి శివుడే పరమాత్మ, దేవాది దేవుడు. సమస్తమునకు పరమైనవాడు. |
| **"శక్తిః" ఏషా తు జీవజా ।** | ఆయన యొక్క శక్తియే జీవజాలముగా జనించుచున్న "జీవజ". |
| **సూర్యాచంద్రమసోః యోగాత్ హగ్ంసః<br>తత్పదం – ఉచ్యతే ।** | సూర్య పరమాత్మయొక్క - చంద్రమస యోగముచే 'శక్తి'నుండి సూర్యచంద్రులు బయల్వెడలుచున్నారు. అట్టిస్థానమే "తత్పదము". అదియే "హంస" - అనబడుతోంది. |
| **తస్మాత్, ఉజ్జృంభతే (విజృంభతే)** | అట్టి 'పదము' లేక 'స్థానము' నుండి ఇష్టము రూపం నుండి కాముడు విజృంభిస్తున్నారు. |
| **కామః । కామాత్ కామః పరః శివః ।** | కామము (అన్యము పట్ల ఇష్టము) నుండి 'కాముడు'గా పరమశివుడే ఉదయిస్తున్నారు. |

| | |
|---|---|
| **కార్ణోఽయం కామదేవోఽయం<br>వరేణ్యం "భర్గ" ఉచ్యతే ।** | "క" వర్ణుడగు కామదేవుడే "వరేణ్యుడగు భర్గ" అని పిలువ బడుచున్నారు. |
| **"తత్సవితుః వరేణ్యం భర్గోదేవః"<br>క్షీరగ్ం సేచనీయం అక్షరగ్ం<br>సమధుఘ్నం అక్షరం** | "తత్ సవితుః వరేణ్యం భర్గోదేవః" ఈ మంత్రము - క్షీరమును సేవించునట్లు (పాలు త్రాగినట్లు) సేవించ తగినది. అక్షరము.<br>పరమాత్మ - జీవాత్మ (పరము - ఇహము ) యోగము తత్ అని ఏర్పడుచున్నది. |
| **పరమాత్మ జీవాత్మనోః యోగాః తత్ ఇతి<br>స్పష్టం అక్షరం తృతీయగ్ం "హ" ఇతి ।** | స్పష్టమైన అక్షరంగా (శివ, శక్తులకు) - మూడవదిగా "హ" అయి ఉన్నది. సోఽహంలో "హం"-అక్షరుడగు జీవాత్మయే। మధుఘ్నముతో కూడినది. |
| **తదేవ సదాశివ ఏవ నిష్కల్మష<br>ఆద్యో దేవో అంత్యం అక్షరం వ్యాక్రియతే ।** | "హ" అనే సదాశివుడు నిష్కల్మషుడు. ఆదిదేవుని అంశయే జీవుడు. ఆది - అంతముగా "అ" - "క్ష" → అక్షరము (శివుని జీవాత్మాక్షరము) అనబడుతోంది. |

| | |
|---|---|
| **పరమం పదం 'ధీ' ఇతి ధారణం విద్యతే ।<br>జడత్వ ధారణం మహి ఇతి** | శివుడే 'అహం'లో 'హ' స్వరూపుడగుచున్నవారు. సదాశివుడే ఆద్యుడు. ఆయన - నిష్కల్మషుడు. అక్షరుడు. అట్టి శివతత్త్వమే ఇక్కడ జీవాత్మ - పరమాత్మలుగా వ్యవహరిస్తోంది. |
| **'ల'కారః శివ అధస్తాత్ తు లకార అర్థః** | 'ధీ' అను ధారణయే "పరమపదము"గా చెప్పబడుతోంది.<br>నిత్యచైతన్య స్వరూపమగు పరతత్త్వము జడరూపమగు జీవుడే - అర్థముగా "మహి" । ఇది లకార శబ్దము.<br>'ల'కారార్థము - లయకారుడుగా శివదత్తమైనది. |
| **స్పష్టం అంత్యం అక్షరం పరమం చైతన్యం ।** | ఆది శివతత్త్వ స్పష్టము. ఆద్యంతికము అక్షర స్వరూపము, పరమ చైతన్య స్వరూపము. |
| **"ధియో యో నః ప్రచోదయాత్"<br>పరో రజసే సావత్ "ఓం" ఇతి ఏవం** | "ధియో యో నః ప్రచోదయాత్" పరో రజసే సావత్ ఓం।<br>మా యొక్క ధీ (బుద్ధిని) ప్రచోదింప జేయుదురు గాక ।<br>సమస్తమునకు పరోరజసము (పరతత్త్వ ప్రకాశము) అయి ఉన్న 'ఓం'గా ఉపాసిస్తూ ఉన్నాము. |

**కూటం కామ కలాలయగ్ం**

కూటస్థము, సమస్తము తన 'కామ కళ'గా కలిగియున్నట్టిది, (దృశ్య - దేహ - దేహి - జీవాత్మ - ఈశ్వర - పరమాత్మ అనబడే) షడత్వం (ఆరు తత్త్వములుగా) పరివర్తనము ప్రదర్శించునది,

**షడధ్వ పరివర్తకో వైష్ణవం పరంధామ – ఇతి భగవాన్ చ ఏతస్మాత్ య ఏవం వేద ।**

(ఉనికి - ఎరుకల రూపమైనట్టి) వైష్ణవము అగు పరంధామమును ఉపాసిస్తూ ఉండగా ఈ జీవుడు భగవత్ స్వరూపమగు 'ఓం' స్థానమును సంతరించుకోగలడు.

---

**7. అథ ఏతస్మాత్ అపరం తృతీయగ్ం శక్తి కూటం ప్రతిపద్యతే ద్వాత్రింశత్ (32) అక్షర్యా గాయత్ర్యా "తత్సవితుర్వరేణ్యం" ।**

అట్టి సర్వత్రా ఏకము అయి ఉన్న "పరతత్త్వము" నుండి "మూడవది" అయినట్టి శక్తి కూటము బయల్వెడలుచున్నది.

"32" అక్షరములతో కూడిన "తత్సవితుర్వరేణ్యం" మంత్రము - గాయత్రీ (ఛందో) సంబంధితము.

| ఉదా: | | | |
|---|---|---|---|
| భూర్భువస్సుః | 4 | | |
| ఓం | 1 | | |
| తత్సవితుః | 4 | పంచభూత | 5 |
| వరేణ్యం | 3 | (భూ-జల-అగ్ని-వాయు-ఆకాశ) | |
| భర్గోదేవస్య | 5 | పంచ పురుష | 5 |
| ధీమహి | 3 | (దృశ్య-ద్రష్ట-జీవ-ఈశ్వర-పర) | |
| ధియోయోనః | 4 | పంచప్రాణ | 5 |
| ప్రచోదయాత్ | 4 | పంచ ఉప ప్రాణ | 5 |
| అపోజ్యోతి | 4 | అంతరంగ చతుష్టయ | 4 |
| రసోమృతం | 4 | త్రిగుణములు | 3 |
| బ్రహ్మ | 2 | | |

---

**తస్మాత్ ఆత్మన ఆకాశ । ఆకాశాత్ వాయుః స్ఫురతి తత్ అధీనం వరేణ్యగ్ం సముదీయమానగ్ం సవితుర్వా యోగ్యో జీవాత్మ పరమాత్మ సముద్భవస్తం ప్రకాశ శక్తి రూపం జీవ అక్షరగ్ం స్పష్టం ఆపద్యతే॥**

ఆత్మ నుండి ఆకాశము, ఆకాశము నుండి వాయువు ప్రకటితమగుచున్నవి. స్తుతికి అర్హమగు తత్ పరమాత్మ ఆధీనములోనిది పంచభూత ప్రపంచము. అదియే సముదీయమానము. అది సవిత్ శబ్దయోగ్యము. అది జీవాత్మ - పరమాత్మలు సముద్భవిస్తున్న స్థానము. సర్వమును ప్రకాశించునది. అది జీవాత్మ (అంశ)ను అక్షరముగా స్పష్టీకరించటం జరుగుతోంది.

**"భర్గోదేవస్య" ధీ ఇతి అనేన ఆధారరూప, శివాత్మ । అక్షరం । గణ్యతే మహీత్య ఆది ।**

సమస్తమునకు ఆధారరూపముగా "భర్గోదేవస్య" అను ఆత్మ ధర్మము ఉపాసించబడు గాక । అది శివాత్మకము. అక్షరము (క్షరము కానిది) మహత్తుకు ఆదిగా గణించబడుచున్నట్టిది.

**నా అశేషం కామ్యగ్ం ।**
**రమణీయం దృశ్యం**
**శక్తికూటగ్ం స్పష్టీకృతం ఇత్యేవం ।**
**పంచ దశాక్షరం త్రైపురం యో అధీతే,**
**స సర్వాన్ కామాన్ అవాప్నోతి ।**
**స సర్వాన్ భోగాన్ అవాప్నోతి ।**
**స సర్వాన్ లోకాన్ జయతి ।**
**స సర్వాన్ వాచో విజృంభయతి ।**
**స గురుత్వం ప్రాప్నోతి । స వైష్ణవం ధామ భిత్త్వా "పరంబ్రహ్మ" ప్రాప్నోతి – య ఏవం వేద ।**

అది కామము ఏ మాత్రము శేషించనట్టిది. అయితే ఏది అద్దాని కామ్యము (ఇచ్ఛ) చేతనే రమణీయ జగద్దృశ్యము, రమణీయమైన ఇచ్ఛాస్వరూపం - శక్తి కూటముగా స్పష్టీకృతమగుచున్నాయో,

అట్టి పరబ్రహ్మము
- 15 అక్షరములతో కూడినది
- త్రిపురములతో కూడినది

అట్టి పరబ్రహ్మ తత్త్వమును ఎవరు ఉపాసిస్తారో / ఎరుగుచున్నారో అట్టివాడు కోరుకున్న సమస్తము సిద్ధించుకోగలడు. సకల భోగములు పొందగలడు. లోకములన్నీ జయించగలడు. సమస్త మహావాక్యములతో కూడి ('సోఽహమ్', 'తత్త్వమ్', త్వమేవాఽహమ్ లతో కూడి) విజృంభించగలడు. సమస్త లఘువులను అధిగమించి 'గురుత్వము' సిద్ధించుకోగలడు. వైష్ణవ ధామమును చేరినవాడై "పరబ్రహ్మ స్వరూపము - ప్రాప్తించుకోగలడు.

| | |
|---|---|
| ఇతి ఆద్యాం విద్యాం అభిధాయ<br>ఏతస్యాః శక్తికూటగ్ం శక్తి శివాద్యం<br>లోపాముద్రేయం ద్వితీయే ధామని | ఈ విధముగా "ఆది" (మొదటిదిగా, That prior to everything) గురించిన విద్యను ఆశ్రయించాలి.<br>"శక్తి - శివ ఆద్యము", "శక్తి-కూటము" అయినట్టిది. రహస్యముద్ర (స్థానము). అద్దాని ద్వంద్వ (శివా - శివ, శక్తి - శక్తిమంతుడు, జీవ-ఈశ్వర, ప్రకృతి - పురుష) ధామమును ద్వితీయముగా (రెండవదిగా) ఆశ్రయించాలి । |
| పూర్వేణ ఏవ మనునా, బిందుహీనా,<br>శక్తి భూత హృల్లేఖా<br>క్రోధమునినా అధిష్ఠితా । | అట్టి జీవేశ్వరోపాసనచే సమస్తమునకు పూర్వమే వేంచేసి ఉన్నట్టిది, నామ-బిందు-కళాతీతమైనది అగు శక్తి భూతమును హృదయాకాశంలో దర్శించాలి. పూర్వపు హృల్లేక - క్రోధమును అధిష్ఠించియున్న దేవిని "తృతీయము" (మూడవది) గా ఎరిగి ఉపాసించాలి. |
| తృతీయే ధామని పూర్వస్యా ఏవ విద్యాయా<br>యత్ వాగ్భవ కూటం<br>తేన ఏవ మానవీం<br>చాంద్రీం కౌబేరీం విద్యాం అచక్షతే। | ఆ తృతీయ (మూడవ) ధామమును సమస్తమునకు పూర్వము (పూర్వతత్ పూర్వము)గా గమనించాలి. తెలుసుకోవాలి. అదియే వాగ్భవకూటము. (వాక్కుకు జనన స్థానమైన కూటస్థము).<br>అదియే మానవీయము. అది "చాంద్రి" కౌబేరి విద్య - అని పిలుస్తున్నారు. |
| **8.** మదనాథః శివం వాగ్భవం। | ఆ వాక్ జనన స్థానములో వేంచేసి ఉన్న తత్త్వస్వరూపమే 'శివము'. ఆ పరమపురుషుడే మదనాథుడు, వాగ్భవుడు అని అభివర్ణితుడు. |
| తత్ ఊర్ధ్వ కామ కళామయగ్ం। | 'తత్' అగు పరబ్రహ్మమే పైపైకి 'కామకళ'ను ప్రదర్శించటమే ఈ సమస్త సృష్టి విన్యాసము. |
| శక్తి – ఊర్ధ్వం శాక్తం – ఇతి | శక్తికి ఆవలగా ఉన్నవాడే శక్తి తనదైనట్టి 'శాక్తుడు'. |
| మానవీ విద్యా చతుర్థే ధామని | అట్టి శాక్త (శక్తి తనదైనవాడి) స్థానమే కేవలబుద్ధి రూపమగు "మానవీ" అని, చతుర్థ ధామము (తురీయ స్థానమని) ప్రశంసించబడుతోంది. ప్రస్తావించబడుతోంది. స్తుతించబడుతోంది. |
| శివ శక్తి ఆఖ్యం వాగ్భవం తత్ ఏవ। | **శివ శక్త్యాఖ్యం వాగ్భవం తదేవ।** అట్టి వాగ్భవమే "శివశక్త్యాత్మకము" అని కూడా పిలువబడుతోంది |
| అధః శివ శక్తి ఆఖ్యం అన్యత్ తృతీయం చ | ఆ శివశక్త్యాత్మకమైనదే దిగువగా (అనన్యము నుండి) అన్యముగా ప్రదర్శనమౌతోంది. ఇది తృతీయము అనబడుతోంది. |
| ఇయం చాంద్రీ విద్యా పంచమే ధామని ।<br>ధ్యేయ ఇయం చాంద్రీ కామాధః శివాద్యకామా<br>స ఏవ కౌబేరీ షష్ఠే ధామని<br>వ్యాచక్షత ఇతి – య ఏవం వేద । | ఇదియే "చాంద్రీ విద్య" - పంచమ (తురీయాతీత) ధామము. అదియే చాంద్రీ కామాధము, శివ-ఆద్య-కామము అని ధ్యానించవలసినది. దానిని "కౌబేరీ విద్య"గా 6వ ధామము - అని వర్ణించబడుతోంది.<br>ఇది ఎరిగిన వాడు సమస్తము ఎరిగిన వ్యాచక్షులు (వ్యాచక్షత సిద్ధించుకున్నవారు). |
| హిత్వా 'ఈ' కారం (హిత్వేకారం)<br>తురీయస్వరగ్ం, | మొదటిదైన "విష్ణు" స్థానమును ఆభేదించి, రెండవదగు "శక్తి కూటము" "శక్తి శివాద్యము"తో సాముద్ర అనే రెండవస్థానమును అధిగమించి, మూలమంత్రము చేత బిందు హీనమైన శక్తిరూపమగు "హృల్లేక క్రోధము" "చాంద్రి-కౌబేరి విద్యా" అను మూడవస్థానమును ఎరిగి, ఉపాసనచే అధిగమించి (పైదంతా 'ఈ'కారము) అట్టి 'ఈ' కారమును వదలి, "తురీయ స్వర్గము"ను అధిగమించి, |

| | |
|---|---|
| సర్వ ఆదౌ సూర్యచంద్రమస్కేన<br>కామేశ్వర్య ఏవ అగస్త్య సంజ్ఞా | ఆదియందుగల సూర్య - చంద్రా తేజో (దేవతా) రూపమగు "కామేశ్వరీదేవి"కి సంజ్ఞ సమస్తము చేర్చినప్పుడు (సమర్పించినప్పుడు) కలుగు సంజ్ఞను "అగస్త్య సంజ్ఞ" - అంటారు. |
| సప్తమే ధామని తృతీయం<br>ఏతస్యా ఏవ పూర్వోక్తాయాః కామాద్యం । | సప్తమ ధామమందు పూర్వోక్తము (పైన చెప్పుకొన్న) మూడవ ధామము "కామాద్యం". |
| ద్విధా అధః కం మదనకళాద్యగ్ం శక్తిబీజం । | మొదట - రెండు (ద్విధా) క్రిందగా - "మదన కళాద్యము" అనే శక్తి బీజము (ఆలోచన భావన) జనించు స్థానము. |
| వాగ్భవ ఆద్యంతయోః అర్ధావశిరస్కం కృత్వా | వాగ్భవకూటమునకు ఆది - అంతముగా (అటు - ఇటు చివరలుగా) "అర్ధావ శిరస్కము" (సహనముగా తలవంచి) నమస్కరించాలి. |
| నంది విద్యేయం అష్టమే ధామని వాగ్భవం ఆగస్త్యం | "నంది విద్య" అనబడు అష్టావధానము (మరియు) "వాగ్భవము" అయి ఉన్న (నవమ) ధామమునందు ఏకాగ్రం చేయటము "ఆగస్త్యము" |
| వాగర్థ కళామయం కామకళాభిధం<br>సకలమాయా శక్తిః ప్రభాకరీ విద్యేయం | అది వాగర్థ (వాక్ + అర్థ) కళామయము, కామ కళాభిధము, సకల శక్తి సమన్వితము - "ప్రభాకరీ విద్యా" ఇది - 9వ ధామము. |
| నవమే ధామని పునరాగస్త్యం వాగ్భవగ్ం<br>శక్తి మన్మథ శివశక్తి మన్మథ ఉర్వీమాయా కామకళాలయమ్ | అట్టి 9వ ధామములో మరల వచ్చి ఉపాసన చేయాలి. అది "వాగ్భవ మన్మథము", శివశక్తి మన్మథము, "ఉర్వీమాయా" కామకళాలయము అనబడుతోంది. |
| **9.** చంద్ర సూర్య అనంగ ధూర్జటి<br>మహిమాలయం తృతీయగ్ం । షణ్ముఖీయం | ఈ '9'వ స్థానములో - చంద్ర సూర్య, అనంగ, ధూర్జటి- షణ్ముఖీ మహిమాలయ తృతీయము, ఆరు ముఖములు గల షణ్ముఖీయము. |
| విద్యా దశమే ధామని విద్యా ప్రకాశితయా<br>భూయ ఏవ అగస్త్య విద్యాం పఠిత్వా | 10వ ధామము : విద్యా ధామము : ఈ 10వ ధామము, విద్యా ప్రకాశ పూర్వకమైన "అగస్త్య విద్య"ను పఠించాలి. |
| భూయ ఏవ ఇమాం అంత్య మాయాం<br>పరమశివ విద్యేయం ఏకాదశే ధామని<br>భూయ ఏవ అగస్త్యం పఠిత్వా | 11వ ధామము : "అంత్యమాయ". ఈ 11వ ధామము నందు పరమశివ స్థానముగా ఉపాసించాలి. మరల అగస్త్య విద్య (మంత్రమును) ఈ 11వ ధామములో పఠించాలి. |
| ఏతస్యా ఏవ వాగ్భవం యద్ధనజం<br>కామకళాలయం చ, తత్ సహజం<br>కృత్వా, లోపాముద్రాయాః శక్తికూట<br>రాజం పఠిత్వా, వైష్ణవీ విద్యా ద్వాదశే (12)<br>ధామని వ్యాచక్షత ఇతి య ఏవం వేద । | 12వ ధామము : దీనినే "వాగ్భవము" (వాక్కు జనించు) స్థానముగాను (కుబేరుని) ''కామకళాలయు'' మంత్రములతో ''సహజ స్వరూపము''తో, ఏకం చేయాలి. "లోపాముద్రా మంత్రము"ను "శక్తి కూట రాజము"ను పఠించాలి.<br>ఇది ద్వాదశ ధామము. ఇది వైష్ణవీ విద్యా ధామముగా చెప్పుకుంటున్నారు. |
| తాన్ హ ఉవాచ భగవాన్ :<br>సర్వే యూయగ్ం శ్రుత్వా పూర్వాం<br>కామాఖ్యాం తురీయ రూపాం తురీయాతీతాగ్ం<br>సర్వోత్కటాగ్ం సర్వమంత్రాసనగతాం<br>పీఠ ఉపపీఠ దేవతా పరివృతాగ్ం<br>సకల కలా వ్యాపినీం దేవతాగ్ం<br>సామోదాగ్ం సపరాగాగ్ం సహృదయాగ్ం,<br>స అమృతాగ్ం సకలాగ్ం స ఇంద్రియాగ్ం<br>సదోదితాం పరాం విద్యాగ్ం ॥ | ఈ '12'వ ధామము యొక్క ఉపాసనాశీలురకు పరమాత్మ యొక్క బోధ.<br>భగవంతుడు (సద్గురువు) : దేవతలారా మీరందరూ శ్రవణ - అభ్యాసులై, ఇతఃపూర్వమే<br>1) కామాఖ్యము 2) తురీయ రూపము 3) తురీయాతీతము 4) సర్వోత్కటము 5) సర్వమంత్రాసన గతము లకు సంబంధించి పీఠదేవతలను, ఉపపీఠ దేవతలను ఉపాసిస్తూ వస్తున్నారు కదా !<br>అట్టి సమస్తముచే చుట్టూ కానబడి ఉన్న సకల కళావ్యాపిని అయిన ఆ ఆత్మ దేవాదిదేవిని ఎరుగచుండెదరు గాక ।<br>ఆ దేవత ఆమోదము పరాగములతో కూడి, హృదయముతో కూడి. అమృత సహితము, అట్టి నిత్యోదితము అయిన పరావిద్యను (ఆత్మవిద్యను) సుస్పష్ట పరచుకొనెదరు గాక. |

**10. స్పష్టీకృత్వా హృదయే నిధాయ**
**విజ్ఞాయా నిలయం గమయిత్వా**

స్వస్వరూపిణి, సర్వ స్వరూపిణి అగు త్రిపురసుందరీదేవీ తత్త్వమును స్పష్టముగా హృదయమునందు భావించి, నిలుపుకొని, అట్టి తత్త్వమును (విజ్ఞాయా) తెలుసుకొని, (గమయిత్వా) అద్దాని యందు ప్రవేశించెదరు గాక! (జ్ఞాతుం। ద్రష్టుం। ప్రవేష్టుం।)

**త్రికూటాం త్రిపురాం పరమాం**
**మాయాగ్ం శ్రేష్ఠాం పరమాం**
**వైష్ణవీగ్ం సన్నిధాయ**

### దేవీతత్త్వము

**త్రికూటము :** ద్రష్ట-దర్శన-దృశ్యముల జనన స్థానము.

**త్రిపురాం :** జాగ్రత్ - స్వప్న - సుషుప్తులు తన సంచార పురములుగా కలిగినట్టి దేవి।

**పరమాం :** సమస్తమునకు "పరము" అయినట్టి

**మాయాగ్ం :** మాయా తన స్వకీయ కల్పితము అయినట్టి - దేవదేవి।

**శ్రేష్ఠాం :** సమస్తమునకు శేష్ఠాతిశ్రేష్ఠమైనది.

**మాయాం :** మాయ కూడా తన స్వరూపమే అయినట్టిది.

**వైష్ణవీం :** సర్వత్రా సర్వదా ఏర్పడి ఆక్రమించుకొని ఉన్నట్టిది.

అట్టి ఆత్మానందరూపిణి యగు త్రిపురేశ్వరిని హృదయములో సన్నిధానము, సమీపము, ఆశ్రయము చేసుకోవాలి.

---

**<u>ఆ దేవిని ఈ విధంగా ధ్యానము చేయాలి.</u>**

**హృదయ కమల కర్ణికాయాం పరాం భగవతీం**
**లక్ష్మీం మాయాగ్ం సదోదితాం,**
**మహా వశ్యకరీం,**
**మదన ఉన్మాదన కారిణీం**
**ధనుర్బాణ ధారిణీం,**
**వాక్ విజృంభిణీం,**
**చంద్రమండల మధ్యవర్తినీం,**
**చంద్రకళాగ్ం సప్తదశీం,**
**మహా నిత్య ఉపస్థితాం।**

- ❈ హృదయ కమలము అనే కర్ణికపై (కృష్ణాజనముపై) వేంచేసి సమస్తమునకు పరమై యుండియే ఆశీనురాలై ఉన్న ఆత్మాదేవీ।
- ❈ సమస్తమును వెలిగిస్తూ ఉన్న భగవతీ।
- ❈ సమస్తము తన సంపదయే అగుటచే శ్రీలక్ష్మీ। శ్రీ మహాలక్ష్మీదేవీ।
- ❈ రచయితవలె సమస్తము తన మాయా కల్పనా విశేషముగా కలిగి ఉన్నట్టిదానా।
- ❈ సత్ (ఉనికి) నుండి ఉదితము (ఉదయించినది) అగుటచే "సదోదితా"।
- ❈ సమస్తము తన వశములో కలిగి ఉండటంచేత మహావశ్యకరీ!
- ❈ సమస్త జీవులలోని ఇచ్ఛాశక్తి, ఆశయ చమత్కారములు తానే అయి ఉండటం చేత మదన ఉన్మాదన కారిణీ !
- ❈ ఉత్తేజ రూపిణీగా సర్వదా ధనుర్బాణ ధారిణీ !
- ❈ వాక్ రూపములో జీవులందరి నోటిలో వేంచేసిన వాక్ విజృంభిణీ!
- ❈ ("మనస్సు" అనే) చంద్రమండల మధ్యవర్తిణీ। - చంద్ర(జీవ) కళాస్వరూపిణీ।
- ❈ షోడశ కళలకు ఆవల సప్తదశ (17) రూపీ !

ఈ విధంగా మహానిత్యముగా - ఉపస్థితమైనదిగా ఆ దేవి ఉపాసించబడు గాక।

**పాశ అంకుశ మనోజ్ఞ, పాణి పల్లవాగ్ం**
**సముద్యత్ అర్కనిభాం, త్రినేత్రాం విచింత్య**

ఇంకాకూడా - ఆ త్రిపురేశ్వరి - పాశము అంకుశము ధరించిన లేత హస్తములు కలది। ఉదయిస్తున్న సూర్యుని వలె తేజోవిభవము గలది. ఆ త్రినేత్రిని విచింత్యం (విచారణ పూర్వకంగా) భావించెదరు గాక।

**దేవీం మహాలక్ష్మీగ్ం సర్వలక్ష్మీమయీగ్ం సర్వలక్షణ సంపన్నాగ్ం, హృదయే చైతన్య రూపిణీం, నిరంజనాం త్రికూటాఖ్యాగ్ం స్మితముఖీం సుందరీం మహామాయాగ్ం**

ఇట్లా ఇంకా ధ్యానించాలి :- మహాలక్ష్మీదేవి । తన జ్ఞాన సంపదచే సర్వత్రా నిండి ఉన్న సర్వలక్ష్మీమయి । సర్వలక్షణ సంపన్న । హృదయమున వేంచేసియున్న చైతన్యరూపిణీ । నిరంజన (నిర్మలా)। జాగృత్ స్వప్న సుషుప్తులకు జనన స్థానము (త్రికూట) । చిరునవ్వు చిందించే ముఖముగలది, మహామాయా స్వరూపిణీం ।

**సర్వసుభగాం, మహాకుండలినీం**

- సమస్త శుభములు ప్రసాదించునది, జ్ఞాన ప్రకాశినీ।

- మహాకుండలినీ (విశ్వ కుండలినీ స్వరూపిణి) ।

**త్రిపీఠ మధ్యవర్తినీం అకథాది శ్రీపీఠే**

- త్రిపీఠముల (త్రికాలముల, త్రి-అవస్థల) మధ్యగా వర్తించునది ।

"అకథ" ఆది పీఠము నందు ఉపాసీనమై యున్న (కూర్చునియున్న)

**పరాం, భైరవీం, చిత్కళాం మహా**

భైరవీ చిత్కళ ।

**త్రిపురాం దేవీం ధ్యాయేత్ ।**

మహా త్రిపురదేవీ ।

**మహా ధ్యాన యోగేన। ఇయం**

**ఏవం వేదేతి మహా ఉపనిషత్**

**ఇతి ప్రథమోపనిషత్ ॥**

ఈ విధంగా సర్వాత్మకి అగు త్రిపురాదేవిని మహాధ్యానయోగంగా తెలుసుకోవటమే మహోపనిషత్.

## ఇతి త్రిపురాతాపిన్యుపనిషత్ అంతర్గత "ప్రథమోపనిషత్"

# ద్వితీయోపనిషత్

శ్లో॥ "ఓం" అథ అతో "జాతవేదసే సునవామ సోమం"
ఇత్యాది పఠిత్వా త్రైపురీ వ్యక్తిః లక్ష్యతే॥

**ఋషయః ఊచుః ।**
**ఋషులు భగవానుని అడుగుచున్నారు ।**

ఓం॥ భగవన్ ! ఇప్పుడిక "జాతవేదసే సునవామ సోమం అరాతీయతో నిదహాతి వేదః॥" - మొదలైన మంత్రములు పఠనము చేస్తూ ఉండగా త్రిపురములను వ్యక్తీకరిస్తున్న త్రైపురీవ్యక్తి (పరమశివుడు) ఎట్లా అనుభవమవగలడు ?

జాతవేదస ఇతి ఏకర్చ సూక్తస్య,
ఆద్య మధ్యమ్ అవసానేషు తత్ర
స్థానేషు, విలీనం బీజనాగర రూపం
వ్యాచక్ష్వ ఇతి ఋషయ ఊచుః ।

ఏది ఏక ఋక్కు రూపము అగు 'జాతవేదసే' అనే సూక్తము (ఋక్కు, మంత్రము) ఆది బీజములో ఆది - మధ్య - అంతము (మొదలు, మధ్య, చివర)గా స్థానము కలిగి ఉన్నదో, లీనమైయున్నదో అట్టి సూక్తము గురించి వివరించి చెప్ప ప్రార్థన.

తాన్ హ ఉవాచ, భగవాన్ !
జాతవేదసే సునవామ సోమం
తత్ అంత్యమవాణీం విలోమేన
పఠిత్వా ప్రథమస్యాద్యగ్ం

**భగవానుడు:** ఋషులారా ! వినండి

**జాతవేదసే । సునవామ సోమం॥** దీనిలోని అంత్యమ వాణి (2వ వాక్కు)ను విలోమముగా (అవరోహణ క్రమంగా, పైనుండి క్రిందకు) పఠించాలి - ఇది మొదటిసారి.

తదేవ దీర్ఘం ద్వితీయస్య ఆద్యగ్ం
"సునవామ సోమం" ఇతి ।

ఇక రెండవసారి ఈ "సునవామ సోమం" అనే ద్వితీయ భాగమును దీర్ఘముగా "సు-న-వా-మ-సోమం" (దీర్ఘముగా గానం చేయాలి, పఠించాలి).

---

అనేన కౌళం వామగ్ం శ్రేష్ఠగ్ం సోమం
మహా సౌభాగ్యం ఆచక్షతే ।

అట్టి పఠనము - కౌళము (ఉత్తమ సాధనము) వామము, శ్రేష్ఠము, "సోమము, మహత్ భాగ్యము అవగలదు" అని మంత్రసిద్ధి పొందిన గురువుల సూచన.

స సర్వ సంపత్తి భూతం
ప్రథమం నివృత్తి కారణం॥

మొదటిదైన "జాతవేదసే" అనే ఋక్కులోని ప్రథమ భాగము సర్వసంపత్తిని ప్రసాదించునది. నివృత్తి (Withdrawal from the world of differences) కారణము.

ద్వితీయగ్ం స్థితి కారణం ।

ఇక రెండవది ("సునవామ సోమం") (ఆత్మ భావనయందు) - స్థితి కారణము.

తృతీయగ్ం సర్గ కారణం ।

ఇక మూడవది "సర్గ" (అరాతీయతో నిదహాతి వేదః అనునది ఆత్మతో మమైక) - కారణము.

ఇతి అనేన కరశుద్ధిం కృత్వా,
త్రిపురా విద్యాగ్ం స్పష్టీకృత్వా జాతవేదసే
సునవామ సోమం ఇత్యాది పఠిత్వా
మహా విద్యేశ్వరీ విద్యాం ఆచక్షతే ॥

ఈ మంత్రములో కరశుద్ధి (కర్మలు పవిత్రము) నిర్వర్తించుకొని, త్రిపురవిద్య (జాగ్రత్ స్వప్న సుషుప్తులు తనవే అయినట్లు) త్రిపురా విద్యను హృదయములో సుస్పష్టీకరించుకొని, "జాతవేదసే సునవామ సోమం" మొదలుగా గల మంత్రమును పఠనం చేస్తూ ఉండటమును "మహా విద్యేశ్వరీ విద్య" అని అంటారు.

---

2. త్రిపురేశ్వరీం – "జాతవేదస" ఇతి ।
"జాతే" ఆద్య అక్షరే మాతృకాయాః శిరసి
బైందవం అమృతరూపిణీం కుండలినీం
త్రికోణ రూపిణీం చ ఇతి వాక్యార్థ॥

## "సర్వరక్షాకరీ విద్య"

త్రిపురేశ్వరిని "జాతవేదసే" - అని ఉపాసించాలి. "జాత" అను మొదటి రెండు అక్షరములు మాతృకల యొక్క శిరస్సునందు "బైందవము, అమృతరూపినీ, కుండలినీ, త్రికోణ రూపిణీ" అని వాక్యార్థము.

ఏవం ప్రథమస్య ఆద్యం వాగ్భవం
ద్వితీయం కామకళాలయం ।

ఈ విధంగా ప్రథమము (ప్రారంభము) యొక్క ఆద్యము "వాగ్భవము".

రెండవది - "కామకళాలయము".

"జాత" ఇతి అనేన పరమాత్మన
ఉత్ జృంభణం

"జాత" ఇతి ఆదినా 'పరమాత్మా శివ' ఉచ్యతే ।
జాత మాత్రేణ కామీ కామయతే
కామం ఇతి ఆదినా పూర్ణం వ్యాచక్షతే ।

తత్ ఏవ సునవామ గోత్ర ఆరూఢం
మధ్యవర్తినా అమృత మధ్యేన అర్ణేన
మంత్రార్ణాన్ స్పష్టీకృత్వా।

గోత్ర ఇతి నామ గోత్రాయాం ఇత్యాదినా స్పష్టం

"జాత" - అను శబ్దము "పరమాత్మ" యొక్క "విజృంభణము" సూచించునది.

"జాత" యొక్క ఆది (The basic begining)ను "పరమాత్మ శివ" అని చెప్పబడుతోంది.

"జాత" మాత్రము చేతనే శివతత్త్వము పట్ల "కామ" (one who desires) అయి శివతత్త్వమును "కామీ కామయతే కామం" - అనబడుతోంది. 'ఇత్యాదిచే పూర్ణము' అని అంటారు.

అదే "సునవామ" గోత్ర అరూఢము - మధ్యవర్తి అయిన అమృత మధ్యమైన "అర్ణము" మంత్రార్ణమును స్పష్టీకరించుకోవాలి.

"గోత్ర" అనే నామముచే "గోత్రము" (Raise up)ను స్పష్టం చేసుకోవాలి (స్పష్టీకరించుకోవాలి).

---

కామకళాలయగ్ం శేషం
వామం ఇత్యాదినా పూర్వేణాధ్వనా
విద్యేయగ్ం సర్వరక్షాకరి ఇతి ఆచక్షతే ।

ఏవం ఏత ఏన విద్యాం త్రిపుర ఈశీగ్ం
స్పష్టీకృత్వా "జాత వేదస" ఇతి
ఆదినా జాతో దేవ ఏక ఈశ్వరః ।

పరమో జ్యోతిః మంత్రతో వేతి తురీయం
వరం దత్వా బిందుపూర్ణ జ్యోతిః స్థానం కృత్వా

ప్రథమస్య ఆద్యం, ద్వితీయం చ
తృతీయం చ సర్వ రక్షాకరీ సంబద్ధం కృత్వా ।

కామకళాలయమును తెలుసుకొని, "వాం" మొదలైన పూర్వమార్గముచే ("సునవాం"లో 'సున' మార్గముచే) ప్రవచితమైన "శ్రీవిద్య - సర్వరక్షాకరి" అని చెప్పబడుతోంది.

అట్టి త్రిపురీ విద్యను స్పష్టీకరించుకొని, "జాతవేదస" అను ఆదిచే "జాతోదేవ ఏకీశ్వరః" - "ఈశ్వరుడు ఏకరూపుడు మొదటగా, సర్వదా కూడా ।" అని గ్రహించబడు గాక ।

అట్టి ఈశ్వరుడు సమస్తమునకు పరమజ్యోతి స్వరూపుడు. "పరమోజ్యోతి" - మనన రూప మంత్రం వలన తురీయవర స్థానమును చేరి, దానిని "బిందుపూర్ణ జ్యోతిస్థానము"గా దర్శించాలి.

"జాతవేదసే సునవామ సోమః" మంత్రము యొక్క ప్రథమంచే ఆద్యమును (మొదటి దాని యొక్క మొదలును), రెండవదానిని మూడవదానిని "సర్వరక్షాకరీ సంబద్ధము"గా చేయాలి.

---

3. విద్యాం ఆత్మా ఆసన రూపిణీగ్ం స్పష్టీకృత్వా,
'జాతవేదసే సునవామ సోమం'
ఇత్యాది పఠిత్వా, రక్షాకరీ విద్యాగ్ం స్మృత్వా,

ఆద్యంతయోః ధామ్నోః
శక్తి శివరూపిణీం వినియోజ్య

స ఇతి 'శక్తి' ఆత్మకం, వర్ణం సోమం ఇతి ।
శైవాత్మకం ధామ జానీయాత్ యో జానీతే
"స" సుభగో భవతి

ఏవం ఏతాం చక్ర-ఆసనగతాం
త్రిపుర వాసినీం విద్యాగ్ం స్పష్టీకృత్వా,
"జాతవేదసే సునవామ సోమం"
ఇతి పఠిత్వా, త్రిపురేశ్వరీ విద్యాగ్ం సదోదితాగ్ం
శివశక్త్యాత్మికాం ఆవేదితాం, జాతవేదాః 'శివ' ఇతి ।
'స' ఇతి (సేతి) శక్త్యాత్మా అక్షరం ఇతి !

**"జాతవేదసే సునవామ సోమం"** ఇత్యాదిగా గల (దుర్గాసూక్త) మంత్రమును (ఋక్కును) పఠిస్తూ, శ్రీ విద్యచే "ఆత్మాసనరూపిణి" - అగు త్రిపుర సుందరిని స్పష్టీకరించుకొంటూ, "రక్షాకరీవిద్య"ను ధారణచే స్మరించుకుంటూ ఉండాలి.

ఆద్యంతము (From the begining till the end) శక్తి - శివ ఏకరూప ధామము (స్థానము)ను వినియోగించుకుంటూ ఉండాలి.

"సోమ"లో "స" - శక్త్యాత్మక వర్ణము. "సోమ" - ఇతి (అని) శైవాత్మక వర్ణమును తెలుసుకుంటూ, "ద్యో"ను ఎరుగుచున్నవాడు సర్వసుభాగములను (సుందరము, యోగము ఐనవన్నీ) పొందగలడు. మంగళ ప్రదమైనవన్నీ సిద్ధించుకుంటున్నాడు.

ఈ విధంగా "చక్రాసనగతము" అయినట్టి "త్రిపురవాసినీ విద్య"ని హృదయంలో సుస్పష్టపరచుకోవాలి. అందుకుగాను "జాతవేదసే సునవామ సోమం..." ఋక్కును పఠిస్తూ ఉండాలి. అట్టి త్రిపురేశ్వరీ విద్యచే సదోదితము ("సత్" నుండి ఉదితము), శివశక్త్యాత్మకము నుండి బయల్వెడలినది అగు జాతవేదసుడే **"శివుడు"**.

"స" - అనగా అక్షరమగు శక్త్యాత్మకము.

| | |
|---|---|
| **శివాదిశక్తి అంతరాళ భూతాం త్రికూటాది చారిణీగ్ం సూర్యా చంద్రమస్కాం మంత్రాసన గతాం త్రిపురాం మహాలక్ష్మీగ్ం సదోదితాగ్ం స్పష్టీకృత్వా** | "శివ" అనబడు శివాదిశక్తికి అంతరభూతమును ("శక్తియే శివ"గా) గమనించాలి. "త్రికూట-ఆది సంచారణి", "సూర్య చంద్రాత్మికము", "మం"త్రాసన గతము (మర్దనము యొక్క అంతర ధ్యానదేవి), అగు త్రిపురేశ్వరీ మహాలక్ష్మిని బుద్ధికి స్పష్టీకరించుకోవాలి. |
| **'జాతవేదసే సునవామ సోమం' ఇత్యాది పఠిత్వా, పూర్వాగ్ం సదాత్మాసన రూపాం విద్యాగ్ం స్మృత్వా** | "జాతవేదసే సునవామ సోమం" ఋక్కు (మంత్రము)ను పఠిస్తూ సమస్తమునకు "పూర్వమే" ప్రకాశమానమై ఉన్న "ఆత్మాసనరూప" విద్యను స్మరిస్తూ ఉండాలి. |
| **వేద ఇత్యాదినా విశ్వా హాసంత ఉదయ బైందవం ఉపరి విన్యస్య సిద్ధాసనస్థాం త్రిపురాం మాలినీ విద్యాగ్ం స్పష్టీకృత్వా ॥** | వేదోపనిషత్ - మొదలైన వాటిచే విశ్వాహాసంత-ఉదయ బైందవము (ఈ విశ్వరచనా చమత్కృతి)కి ఆవల విన్యాస రూపిణి అయి సిద్ధాసనము నందు వేంచేసిన "త్రిపురా మాలిని" గురించిన విద్యను స్పష్టీకరించుకోవాలి. |
| **4. "జాతవేదసే సునవామ సోమం" ఇత్యాది పఠిత్వా త్రిపురాగ్ం సుందరీగ్ం శ్రిత్వా,** | ఈ విధంగా **"జాతవేదసే సునవామ సోమం...'** ఇత్యాదిగా గల సూక్తమును పఠిస్తూ, బాల త్రిపుర సుందరీదేవిని ఆశ్రయించాలి. |
| **కలే అక్షరే విచింత్య మూర్తి-భూతాం** | కలే (రేతస్సు రూపంగా ఉండి ఉన్నట్టి) అక్షర రూపమును విచారణ చేస్తూ ఉండాలి. |
| **మూర్తి రూపిణీగ్ం, సర్వ - విద్యేశ్వరీం త్రిపురాం విద్యాగ్ం స్పష్టీ కృత్వా** | ఈ త్రిజగత్తులుగా మూర్తీభవించినది, మూర్తి రూపిణీ సర్వ విద్యలకు ఈశ్వరి అయినట్టి త్రిపురీ సంబంధమైన త్రిపురా విద్యను స్పష్టీకరించుకోవాలి. |
| **"జాతవేదస" ఇత్యాది పఠిత్వా త్రిపురాం లక్ష్మీగ్ం శ్రిత్వా అగ్నిం నిదహాతి ॥** | "జాతవేదస..." ఇతి ఆదిగా గల సూక్తమును పఠిస్తూ త్రిపురా లక్ష్మీదేవిని ఆశ్రయిస్తూ అగ్నిని ప్రజ్వలింపజేయాలి. |
| **స ఏవ ఇయం అగ్ని ఆసనే జ్వలతి ఇతి విచింత్య** | ఆ త్రిపురేశ్వరీదేవి అగ్నియందు ప్రజ్వలిస్తూ ఉన్నదని (విచింత్యము) భావించాలి. |
| **త్రిజ్యోతిషం ఈశ్వరీం త్రిపురాం అంబాం విద్యాగ్ం స్పష్టీకుర్యాత్,** | అట్టి త్రి-జ్యోతి స్వరూపిణి (జగత్ జ్యోతి, జీవజ్యోతి, అఖండజ్యోతి స్వరూపిణి) సమస్తముగా విస్తరించియున్న **ఈశ్వరీ,** జాగ్రత్-స్వప్న-సుషుప్తి పురములు తానే అయివున్న<br>**త్రిపురాం** - త్రిపురముల స్వరూపిణి,<br>**"అంబాం"**-"అంబ" అను పేరుగలది.<br>**"త్రిజ్యోతిషం ఈశ్వరీం త్రిపురాం అంబాం విద్య"** -ను స్పష్టీకరించుకోవాలి |
| **ఏవం ఏత ఏన స నః పర్షదతి దుర్గాణి విశ్వా ఇతి ఆది, పరమ ప్రకాశినీ ప్రత్యక్ భూతా కార్యా విద్యేయం ఆహ్వాన కర్మణి సర్వతోధీరా ఇతి వ్యాచక్షతే ।** | "స నః పర్షదతి దుర్గాణి విశ్వా" - ఈ సంక్లిష్టమగు విశ్వమును చిత్రీకరించి ప్రసాదించు దేవి । పరమప్రకాశిని (ఆ సమస్తమునకు, పరమ-ఆవలగా ప్రకాశమానమై యున్నది) పంచభూతములకు ప్రత్యేకమై (వేరై) సమస్త భౌతికమునకు నిర్మాత । సృష్టి కార్యమును నిర్వర్తించునది। అట్టి ఆ దేవ దేవియే సర్వత్రా 'ధీ' (బుద్ధి) రూపిణి - అయి సమస్త కర్మలు నిర్వర్తించుచున్నది. |
| **ఏవం ఏతత్ విద్యాష్టకం మహా మాయా దేవీ - అంగభూతం వ్యాచక్షతే ।** | ఇదంతా కూడా ఆ దేవి యొక్క మహామాయా - విద్యాష్టకమే । (అష్టవిధ ప్రకృతి = పంచభూతములు + మనో బుద్ధి చిత్తములు / అపరేయం ఇతి) ఇదంతా శ్రీదేవి యొక్క అంగములకు శరీరము వంటిదని - దేవీ అంగభూతము గురించి చెప్పబడుతోంది. |

| | |
|---|---|
| దేవ ఆహా వై భగవంతం అబ్రువన్ | **దేవతలు భగవానుని ఈ విధంగా అర్థించారు :** |
| | **దేవతలు :** ఓ మహాదేవా ! "మహాచక్ర నాయకము" గురించి మాకు దయతో వివరించి చెప్పండి. |
| "మహాచక్ర నాయకం నో బ్రూహి ఇతి" ।<br>సార్వ కామికగ్ం సర్వా ఆరాధ్యగ్ం సర్వరూపం<br>విశ్వతోముఖం మోక్షద్వారం యత్ యోగిన<br>ఉపవిశ్య పరంబ్రహ్మ భిత్వా నిర్వాణం ఉపవిశంతి ఇతి ।<br>తాన్ హ ఉవాచ : | "సర్వకామికము, అందరికీ ఆరాధ్యము, సర్వస్వరూపము, ఈ విశ్వమంతా తన ముఖముగా కలిగియున్నది" - అగు ఏ పరబ్రహ్మము అనే మోక్షద్వారము తెరచి "నిర్వాణము" అను స్థానములో యోగులు ప్రవేశించి ప్రశాంతానందులై ఉంటున్నారు ? |
| భగవాన్ । శ్రీచక్రం వ్యాఖ్యాస్యామ – ఇతి । | **భగవానుడు :** మీరు అడిగిన దానికి సమాధానముగా మనము "శ్రీచక్రము" గురించి వివరించుకుందాము. వ్యాఖ్యానించుకుందాము. |
| **5.** త్రికోణం త్ర్యశ్రం కృత్వా | - మూడు భుజములుగల త్రికోణము చేసి  |
| | - ఆ త్రికోణములోపల "మధ్యవర్తి" అయి మానయష్ఠీ రేఖను లాగి |
| తత్ అంతర్మధ్యవర్తి వృత్తమాన యష్టీరేఖాం ఆకృష్య<br>విశాలం నీత్వా అగ్రతో యోనిం కృత్వా అపూర్వా | ఆ మధ్యవర్తిని విశాలము చేసి, పైనగా 'యోని' (రంధ్రము) చేసి, పూర్తి చేయాలి. |
| యోని అగ్రరూపిణీం మానయష్టిం<br>కృత్వా తాగ్ం సర్వ "ఊర్ధ్వాం" నీత్వా యోనిం<br>కృత్వాద్యం త్రికోణం చక్రం భవతి ' | యోని అగ్రరూపిణి అయినట్టి మానయష్ఠి (దండ)వలె చేసి, అంతకు ఊర్ధ్వముగా పొడిగించి, 'యోని'గా చేస్తే మొదటిది "ఆద్య త్రికోణం చక్రము" అగుచున్నది. |
| ద్వితీయం అంతరాళం భవతి । | - ద్వితీయము (రెండవది) - "అంతరాళము" అగుచున్నది. |
| తృతీయం అష్టయోని అంకితం భవతి ॥ | - మూడవది "అష్ఠయోనీ అంకితము"గా అవుతోంది. |
| అథ అష్టార చక్ర ఆద్యంత విదిక్ కోణాగ్రతో<br>రేఖాం నీత్వా, సాధ్యాది ఆకర్షణ బద్ధరేఖాం<br>నిత్వేతి, ఏవ మధోర్ధ్వ సంపుట యోని అంకితం<br>కృత్వా, కక్షాభ్య ఊర్ధ్వగ రేఖాచతుష్టయం<br>కృత్వా యథా క్రమేణ మానయష్టిద్వయేన<br>దశయోని అంకితం చక్రం భవతి ॥ | ఇక అష్టభుజ (8) చక్రమును ఆద్యంతము, అన్ని దిక్కుల కోణాగ్రములతో కూడిన రేఖలను పొడిగించి, సాధ్యాది ఆకర్షణ బద్ధ రేఖను పొడిగించాలి. పైన క్రింద సంపుట యోనీ - అంకితము చేయాలి. కక్ష్యల నుండి, ప్రక్కలకు రేఖలను పైకి పోవు విధంగా గీసి యథాక్రమంగా "మానయష్టిద్వయము" చేసినప్పుడు - ఆది "దశయోని అంకితము" అవుతోంది. |
| అనేన ఏవ ప్రకారేణ పునః దశ అర చక్రం భవతి । | ఈ ప్రకారంగా మరల (పునఃనిర్వర్తించటం చేత "దశార చక్రము" అవుతుంది. |
| మధ్య త్రికోణ అగ్ర చతుష్టయాత్ రేఖా అచర అగ్ర కోణేషు<br>సంయోజ్య తత్ దశారాంశతో నీతాం మానయష్టి<br>రేఖాం యోజయిత్వా చతుర్దశారం చక్రం భవతి । | మధ్య త్రికోణము - అగ్ర చతుష్టయము - రేఖాచార - అగ్ర చతుష్టయము యొక్క కోణములందు కలిపి, దశార చక్రాంశలను పొడిగించి, మానరేఖను కలిపితే అది **"చతుర్దశార చక్రము"** అవుతుంది. |
| తతో అష్ట పత్ర సంవృతం చక్రం భవతి | పై విధంగా **"అష్టపత్ర సంవృత చక్రము"** అగుచున్నది. |
| షోడశ పత్ర సంవృతం చక్రం చతుర్ద్వారం భవతి ।<br>తతః పార్థివ చక్రం చతుర్ద్వారం భవతి । | షోడశ (16) పత్ర సంవృతము అగు చక్రము చతుర్ద్వారము కలిగినది అవుతుంది. అద్దాని పార్థివ చక్రము **"చతుర్ద్వారము".** |
| ఏవగ్ం సృష్టి యోగేన చక్రం వ్యాఖ్యాతమ్ | ఈవిధంగా **"సృష్టియోగ చక్రము"** వ్యాఖ్యానించబడుతోంది. |
| నవాత్మకం చక్రం ప్రాతి లోమ్యేన వా వచ్మి । | "నవాత్మక చక్రము"ను ప్రతిలోమ్యముగా (అవరోహన క్రమంగా) చెప్పుకొందాము. |
| ప్రథమం చక్రం త్రైలోక్య మోహనం భవతి ॥ | **ప్రథమ (మొదటి) చక్రము "త్రైలోక్య మోహనము".** |

| | |
|---|---|
| **6.** స అణిమాది అష్టకం భవతి।<br>స మాత్ర అష్టకం భవతి ।<br>స సర్వ సంక్షోభిణీ ఆది దశకం భవతి ॥ | అట్టి ఈ చక్రోపాసనము "అణిమ, గరిమ, లఘిమ, మహిమ, ఈశిత్వ వశియా, ప్రాకామ్య, ఇచ్ఛా'' అనబడే - అష్ట సిద్ధులు ప్రసాదించునది.<br>అట్టి వానికి మాత్రాష్టకము (బ్రాహ్మి, మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, చాముండి, వారాహి, ఇంద్రాణి) అనుగ్రహము సిద్ధించగలదు.<br>"సర్వ సంక్షోభిణి'' మొదలుగా గల దశకము యొక్క అనుగ్రహము పొందగలరు. |
| స ప్రకటం భవతి । త్రిపురయాధిష్ఠితం భవతి । | **త్రిపురేశ్వరీ ఆత్మవిద్య** ప్రకటనమవగలదు. |
| స సర్వ సంక్షోభిణీ ముద్రయా జుష్టం భవతి । | **"సర్వసంక్షోభిణీ ముద్ర"** ధారణ చేసిన ఫలము లభించగలదు. |
| ద్వితీయగ్ం సర్వ ఆశా పరిపూరకం చక్రం భవతి ।<br>స కామాది ఆకర్షిణీ షోడశకం భవతి ।<br>స గుప్తం భవతి । త్రిపురేశ్వరి అధిష్ఠితం భవతి।<br>"సర్వవిద్రావిణీ" – ముద్రయా జుష్టం భవతి ॥ | ద్వితీయ (రెండవ) చక్ర సిద్ధి : ఇది సర్వ ఆశలు, ఆశయాలు సిద్ధింపచేయు చక్రము. 'కామ' ఆదిగా గల "ఆకర్షిణీ షోడశకం'' (16) అనే ఫలము పొందగలరు. గుప్తమగు ఆత్మభావన అనునిత్యమవగలదు. "త్రిపురీ, అధిష్ఠితము లభించగలదు - **"సర్వ విద్రావిణీ ముద్ర"** ఫలము పొందగలరు. |
| తృతీయగ్ం సర్వ సంక్షోభణం చక్రం భవతి ।<br>స అనంగ కుసుమాది అష్టకం భవతి ।<br>స గుప్తతరం భవతి । త్రిపుర సుందర్యా అధిష్టితం భవతి ।<br>సర్వాకర్షిణీ ముద్రయా జుష్టం భవతి । | తృతీయ (మూడవ) చక్రోపాసనచే సర్వ సంక్షోభణ చక్రము "అనంగ కుసుమ''తో మొదలయ్యే అష్ట 5 (అష్టమాతృక) అనుగ్రహము, గుప్త తరము లభించగలవు. **త్రిపుర సుందరీ అధిష్ఠానము** పొందగలరు. సర్వాకర్షిణీ ముద్ర సిద్ధించగలదు. |
| తురీయగ్ం సర్వ సౌభాగ్యదాయక చక్రం భవతి ।<br>స సర్వ సంక్షోభిణీ ఆది ద్విసప్తకం భవతి ।<br>స సంప్రదాయం భవతి । త్రిపురవాసిని అధిష్ఠితం భవతి ।<br>స సర్వవశంకరీ ముద్రయా జుష్టం భవతి । | 4వదగు "తురీయగము'' అనబడే చక్రము "సర్వ సౌభాగ్యదాయక చక్రము''. అది 'సర్వసంక్షోభిణీ' ఆదిగా **"ద్విసప్తకము"** (14) అనబడుతోంది. అది సంప్రదాయకము. త్రిపురవాసిని యొక్క అధిష్ఠము. అది **"సర్వ వశంకరీ ముద్ర"** తో కూడినది. |
| తురీయాంతగ్ం "సర్వార్థ సాధకం చక్రం" భవతి ।<br>స సర్వసిద్ధి ప్రదాది దశకం భవతి। సకల కౌళం భవతి।<br>త్రిపురా మహాలక్ష్మి అధిష్ఠితం భవతి ।<br>మహా ఉన్మోదినీ ముద్రయా జుష్టం భవతి । | అట్టి తురీయాంతం (5వది) సర్వార్థ సాధకము. "సర్వసిద్ధి ప్రదము'' మొదలగు దశకము (10) లభించగలదు. "సకల కౌళము'' అవగలదు.<br>మహాలక్ష్మి అధిష్ఠితము, మహా ఉన్మోదినీ ముద్రతో కూడినది. |
| షష్ఠగ్ం సర్వరక్షాకరం చక్రం భవతి । స సర్వజ్ఞత్వాది దశకం భవతి । స నిర్గర్భం భవతి । త్రిపురమాలిని అధిష్ఠితం భవతి । మహా అంకుశ ముద్రయా జుష్టం భవతి। | "6''వ చక్రము సర్వరక్షాకర చక్రము, 'సర్వజ్ఞత్వము' మొదలుగా దశకము, నిర్భరము (అతిశయము) త్రిపురామాలినీ అధిష్ఠితము. మహా అంకుశ ముద్రతో కూడినది. |
| సప్తమగ్ం సర్వరోగ హరం చక్రం భవతి ।<br>స 'వశిని' ఆది – అష్టకం భవతి । | సప్తమ చక్రము సర్వరోగ హర చక్రము. వశిని ఆది (వశిన్యాది) అష్టకముతో (అష్ట సిద్ధితో) కూడినది.<br>పై విశేషముతో కూడిన శ్రీచక్రోపాసనచే (త్రిపురా రహస్యం) । (దష్ట-దృశ్యముల ఏకత్వ రూపమగు సోఽహమ్ తత్త్వమ్) ను పొందుతాడు. |
| స రహస్యం భవతి । త్రిపుర సిద్ధయా అధిష్ఠితం భవతి ।<br>ఖేచరీ ముద్రయా జుష్టం భవతి । | త్రిపుర తత్త్వసిద్ధిచే అధిష్ఠితుడు (Achieved) అవుతాడు. ఖేచరీముద్రను సేవించినవానికి అది తేలికగా లభించగలదు. |
| **7.** అష్టమం సర్వసిద్ధిప్రదం చక్రం భవతి ।<br>స ఆయుధ చతుష్టయం భవతి ।<br>స పర – అపర రహస్యం భవతి ।<br>త్రిపుర అంబయా అధిష్ఠితం భవతి ।<br>బీజ ముద్రయాం జుష్టం భవతి । | అష్టమ (8వ) చక్రోపాసన సర్వసిద్ధి ప్రదమైనది. ఆయుధ చతుష్టయము (విష్ణుదేవుని బాణము, ఖడ్గము, శంఖము, చక్రముల ప్రభావము) పొందగలడు. త్రిపురాంబికచే అధిష్టితము. బీజము ధరించిన వానికి సులభ్యము.<br>(బీజోపాసన = సమస్త భావపరంపరలకు 'ఆది' అగు ఉత్పత్తి స్థానమును బుద్ధితో గమనించి ఉపాసించటము). |

**నవమం చక్రనాయకగ్ం సర్వ ఆనందమయం చక్రం భవతి ।**
**స కామేశ్వరి ఆది త్రికం భవతి ।**
**స అతి రహస్యం భవతి ।**
**మహా త్రిపుర సుందర్యా అధిష్ఠితం భవతి ।**
**యోని ముద్రయా జుష్టం భవతి ।**

**నవమ (9వ) చక్రము** : ఇది చక్రనాయకము, సర్వానందమయ చక్రము. కామేశ్వరి ఆదిగా - "త్రి (3) క యుక్తము" అతి రహస్యము. మహాత్రిపుర సుందరిచే అధిష్ఠితము. 'యోనిముద్ర'తో కూడినది. (త్రికోణయుక్తము = కామేశ్వరీ । భగమాలినీ । వారాహీ । ఇచ్ఛ-బుద్ధి-ఆలోచనా స్రవంతుల అధిదేవతలు)

**సంక్రామంతి వై సర్వాణి ఛందాగ్ంసి చక్రారాణి**

సమస్త ఛందస్సులు (వేదములు) చక్రపుటాలుగా సంక్రమిస్తున్నాయి.

**తత్ ఏవ చక్రగ్ం శ్రీ చక్రమ్ ।**

ఈ చక్రమే "శ్రీచక్రము".

---

**తస్యనాభ్యాం అగ్నిమండలే సూర్యా చంద్రమాసౌ ।**
**తత్ర ఓంకార పీఠం పూజయిత్వా**

**మహాదేవులు దేవతలతో శ్రీచక్రము గురించి ఇట్లు చెప్పసాగారు.**

**మహాదేవుడు** : అట్టి శ్రీచక్రము యొక్క నాభియందు (మధ్యగా) అగ్నిమండలము. ఆ మండలమునందు సూర్య-చంద్రులను భావించాలి. అందు 'ఓం'కార పీఠమును పూజించాలి.

**తత్ర అక్షరం బిందురూపం ।**

అందు (.) బిందురూపాక్షరమును, బిందువు క్షరము లేని ఆత్మకు సంజ్ఞగా ఉపాసించాలి. 'ఓం'కారమును పఠించాలి.

**తత్ అంతర్గత వ్యోమరూపిణీం । విద్యాం పరమాగ్ం స్మృత్వా మహాత్రిపుర సుందరీం ఆవాహ్య।**

ఆకాశ రూపిణి పరమ విద్యాస్వరూపిణి అగు దేవిని స్మరించాలి. మహా త్రిపురసుందరిని ఆహ్వానించి మానసిక పూజ, ఆయా పూజా ద్రవ్యములుతో పూజ నిర్వర్తించాలి.

---

**క్షీరేణ స్నాపితే దేవీ చందనేన విలేపితే ।**
**బిల్వపత్ర అర్చితే మాతః**
**దుర్గే అహం శరణం గతః ।**

ఓ త్రిపుర సుందరీదేవీ ! నీకు ఇదిగో క్షీరముతో స్నానము చేయించి, చందనము (గంధము)తో పూత పూస్తూ పూజిస్తున్నాను. బిల్వ (మారేడు) పత్రములతో సేవిస్తున్నాను. ఓ దుర్గాదేవీ ! నీకు శరణాగతుడను అగుచున్నాను.

**ఇతి ఏకయర్చా ప్రార్థ్య**
**మాయా లక్ష్మీ మంత్రేణ పూజయేత్ ।**

ఈ విధంగా ఋక్కులతోనూ "నమస్తేస్తు మహామాయే ! శ్రీపీఠే । సురపూజితే....!'' అను లక్ష్మీ అష్టకముతో (మాయా లక్ష్మీ మంత్రముతో) పూజించాలి.

**ఇతి భగవాన్ అబ్రవీత్ ।**

**ఏతైః మంత్రైః భగవతీమ్**
**యజేత్, తతో దేవీ ప్రీతా భవతి ।**
**స్వ ఆత్మానం దర్శయతి।**

**భగవానుడు** : ఓ దేవతలారా ! అట్టి మంత్రముతో, పూజా ద్రవ్యములతో, శ్రీచక్ర అంతర్గతమైన శ్రీదేవిని పూజిస్తూ ఉండగా ఆ త్రిపురాదేవి ప్రీతి చెందును.

ఆ విధంగా తుష్టి చెందిన ఆ దేవి ఆత్మయొక్క స్వరూపమును దర్శింపజేయగలదు.

---

**తస్మాత్ య ఏతైః మంత్రైః యజతి**
**స బ్రహ్మ పశ్యతి । స సర్వం పశ్యతి ।**
**సో అమృతత్వం చ గచ్ఛతి య ఏవం వేద।**
**ఇతి మహోపనిషత్॥**

ఈ విధంగా శ్రీచక్ర నాభిస్థాన అంతర్గత అగు ఆ శ్రీచక్ర త్రిపుర సుందరిని ("జాతవేదసే", "నమస్తేస్తు మహామాయే" మొదలైన) మంత్రములతో ఉపాసించువాడు బ్రహ్మమును దర్శించగలడు. జనన మరణ చక్రమునుండి విడివడి అమృతత్వము సిద్ధించుకోగలడు. ఆత్మను ఎరుగగలడు.

**॥ఇతి ద్వితీయోపనిషత్॥**

# తృతీయోపనిషత్

1. "ఓం" దేవా హ వై ముద్రాః సృజేమేతి ।
భగవంతం అబ్రువగ్ం ।
తాన్ హ ఉవాచ।
భగవాన్! అవనికృతజాను మండలం విస్తీర్య,
పద్మాసనం కృత్వా, ముద్రాః సృజత ఇతి ।

స సర్వాన్ ఆకర్షయతి యో యోనిముద్రాం అధీతే,
స సర్వం వేత్తి ।
స సర్వఫలం అశ్నుతే ।
స సర్వాన్ భంజయతి ।
స విద్వేషిణగ్ం స్తంభయతి ।

**దేవతలు** : భగవాన్ ! ఇప్పుడు ఇక మేము దేవీధ్యానము కొరకై ముద్రలను సృజించదలచుచున్నాము.

భగవానుడు ! ఓ దేవతలారా ! అట్లాగే సృజించండి. నేలపై ఆశీనులై మోకాళ్ళను "విస్తరించి, పద్మాసనము" ధరించి ముద్రలను సృజించెదరు గాక !

**యోనిముద్ర** : ఎవ్వరైతే యోనిముద్రను అధ్యయనము చేస్తాడో, అట్టివాడు అందరినీ ఆకర్షించగలడు. సర్వఫలములను పొందగలడు. అందరినీ జయించగలడు. శత్రువులందరినీ స్తంభింపచేయగలడు.

(యోనిముద్ర = అరచేతిని గుంటగా చేసి చేతివేళ్ళను పైకి ధారణ చేయటము).

---

<u>మొదటి ముద్ర :</u>
మధ్యమే అనామికా ఉపరి విన్యస్య కనిష్ఠికా
అంగుష్ఠతో అధీతే, ముక్తయోః తర్జన్యోః
దండవత్ అధస్తాత్ ఏవం విధా ప్రథమా సంపద్యతే ॥

<u>రెండవ ముద్ర :</u>
స ఏవ మిళిత మధ్యమా ద్వితీయా ।

<u>మూడవ ముద్ర :</u>
తృతీయా అంకుశ ఆకృతిః ఇతి ।

<u>నాలుగవ ముద్ర :</u>
ప్రాతిలోమ్యేన పాణీ సంఘర్షయిత్వా
అంగుష్ఠౌ సాగ్రిమౌ సమాధాయ తురీయా !

## ముద్రలు

**మొదటిముద్ర** : చేతి మధ్యవేలును అనామిక (చేతి ఉంగరం వ్రేలు)పై విస్తరించి ఉంచి, - కనిష్ఠ (చిటికన) వ్రేలు బొటన వ్రేలుతో తాకించి ఉంచి, తర్జనిని (చూపుడు వ్రేలును) దండమువలె ధరించి ఉంచటము.

**రెండవ ముద్ర** : మధ్యమ వేలుపై చూపుడు వేలును ధరిస్తే అది రెండవ ముద్ర.

**మూడవ ముద్ర** : మధ్యవేలు విస్తరించి అంకుశము వలె వ్రేళ్ళను ధరించునది - మూడవ ముద్ర.

**నాలుగవ ముద్ర** : చేతులను ఎదురెదురుగా (ప్రాతిలోమముగా) చొనిపి, బొటన వ్రేలు చివరలను కలిపి కదలకుండా ధారణచేయు 'ముద్ర' - నాలుగవ ముద్ర.

---

<u>ఐదవ ముద్ర :</u>
పరస్పరం కనీయసేదం మధ్యమా ఆబద్ధే
అనామికే, దండిన్యౌ తర్జన్యా వా ఆలింగ్యోవష్టభ్య
మధ్యమా నఖ – మిళిత అంగుష్ఠౌ పంచమీ ।

<u>ఆరవ ముద్ర :</u>
స ఏవ అగ్రే అంకుశ ఆకృతిః షష్ఠీ ।

<u>ఏడవ ముద్ర :</u>
దక్షిణశయే వామబాహుం కృత్వా
అన్యోన్య అనామికే – కనీయసీ మధ్యగతే
మధ్యమే తర్జన్య ఆక్రాన్తే
సరళాసు అంగుష్ఠౌ ఖేచరీ సప్తమీ ।

**ఐదవ ముద్ర** : చిటికిన వ్రేలును మధ్య వ్రేలుతో కట్టి (తాకించి) అనామిక (చూపుడు వ్రేలు)ను కర్రలా చేయటము (లేదా) చూపుడు వ్రేలుతో చిటికెన మధ్యవ్రేలులను చుట్టబెట్టి బొటనవ్రేలు - మధ్యమ వ్రేలు గోళ్ళను తాకించి ఉంచటము - ఐదవ ముద్ర.

**ఆరవ ముద్ర** : 5వ ముద్రలోవలెనే "చిటికిన వ్రేలు, మధ్యమ వ్రేలు"లను అన్యోన్యగా తాకించి చూపుడు వ్రేలును చుట్టి సూటిగా 'అంకుశము' వలె ధరించటము - ఆరవ ముద్ర.

**ఏడవ ముద్ర - "ఖేచరీ"** : కుడి చేతిని ఎడమ భుజము (బాహువు)పై ఉంచి,

చిటికిన వ్రేలును ఉంగరపు వ్రేలును అన్యోన్యం చేసి (చిటికిన వ్రేలుపై ఉంగరపు వ్రేలును తాకించి), మధ్యగతం చేసి, ఉంగరపు వ్రేలును చిటికిన వ్రేలుపైనుండి మధ్యగా విస్తరింప చేసి,

మధ్యమ వ్రేలును చూపుడు వ్రేలుతో ఆక్రమింపచేసి,

సరళముగా (విడిగా) బొటనవ్రేలును ధారణ చేయటము. ఇది "ఖేచరీ" - "సప్తమీ" - ఏడవ ముద్ర

ఎనిమిదవ ముద్ర :

**2.** సర్వ ఊర్ధ్వే సర్వసగ్ంహృతి,
స్వ మధ్యమా అనామికా అంతరే కనీయసీ
పార్శ్వయోః తర్జన్యా అంకుశాద్యే యుక్తా
స అంగుష్ఠ యోగతో అన్యోన్యగ్ం సమం
అంజలిం కృత్వా అష్టమీ
తొమ్మిదవ ముద్ర :
పరస్పర మధ్యమా పృష్ఠ వర్తిన్యాః
అనామికే తర్జన్యా ఆక్రాంతే, సమే
మధ్యమే, ఆదాయ అంగుష్ఠౌ మధ్యవర్తినౌ
నవమీ ప్రతిపద్యత ఇతి ॥

**ఎనిమిదవ ముద్ర :** అన్ని వ్రేళ్ళను పైకి చాచి, అన్నింటిని మడచి, మధ్యవ్రేలు, ఉంగరపు వ్రేలు క్రిందగా చిటికిన వ్రేలును ఉంచి, చూపుడు వ్రేలును సూటిగా అంకుశము వలె ఉంచి, బొటనవ్రేలును చూపుడు వ్రేలుతో తాకించి, ఈ రెండింటిని సమముగా ఉంచి, అంజలి (దోసెలి)గా ఉంచటము - 8వ ముద్ర.

**తొమ్మిదవ ముద్ర :** మధ్యమ - ఉంగరపు వ్రేళ్ళను పరస్పరం చేసి (తాకించి / మధ్యమ వ్రేలును ఉంగరపు వ్రేలుపై ఉంచి) చూపుడు వ్రేలుతో మధ్యమ వ్రేలును ఆక్రమించి సూటిగా ఉండేటట్లు తెచ్చి బొటన వ్రేలును సమవర్తనము (Straight) తాకి ఉంచటము - 9వ ముద్ర.

---

స ఏవ ఇయం కనీయసే సమే అంతరితే అంగుష్ఠౌ
సమాః అంతరితౌ కృత్వా త్రిఖండా సంపద్యత ।

**త్రిఖండముద్ర :** పై 9వ ముద్రవలెనే చిటికిన వ్రేలును మధ్యగా - సమముగా ఉండునట్లుగాను, బొటన వేలును కనిష్ఠకమునకు చిటికిన వ్రేలుకు సమాంతరముగా చేస్తే - అది "త్రిఖండ" అనబడుతోంది.

ఇతి పంచబాణా, పంచాద్యా ముద్రాః స్పష్టాః
'క్రోం' అంకుశా హ సఖ ప్రేం ఖేచరీ హస్రౌం బీజ అష్టమీ
వాక్ భవాద్యా నవమీ
దశమీ చ సమృద్యత ఇతి
య ఏవం వేద

ఈ విధంగా **"పంచబాణే పంచాద్యా"** ముద్రలను స్పష్టం చేసుకోవాలి. "క్రోం" అంకుశా "సప్రేం" ఖేచరీ "హస్రౌం" - బీజాష్టమీ ఈవిధమైన ముద్రలన్నీ ఎరిగినవాడు నవమీ, దశమీ స్థానము ఎరిగినవాడు అగుచున్నాడు.

(జీవాత్మ - పరమాత్మల గురించి తెలుసుకొనుచున్నాడు)

---

**కామకళాభూత చక్రము**

అథ అతః (అథాతః) కామకళా భూతం చక్రం
వ్యాఖ్యాస్యామో।

ఓ దేవతలారా ! ఇప్పుడు మనము "కామకళాభూత చక్రము" గురించి వ్యాఖ్యానించుకుంటున్నాము.

"హ్రీం క్లీం ఐం బ్లూం సౌః"
ఏతే పంచకామాః సర్వచక్రం వ్యాప్య వర్తం

**"హ్రీం" "క్లీం" "ఐం" "బ్లూం" "సౌః"** ఈ "పంచకామము" - సమస్త చక్రములో వ్యాపించి, వర్తిస్తూ ఉంటుంది.

తే మధ్యమం కామగ్ం సర్వావసానే సంపుటీ కృత్య,

ఇందలి మధ్యమ కామమును ("ఐం"ను) - సర్వావసానంగా సంపుటి చేసి,

'బ్లూం' కారే సంపుటం వ్యాప్తం కృత్వా,

"బ్లూ" కారములోకి ఆ సంపుటమును వ్యాప్తము చేసి,

ద్వైరైం ద్వయేన మధ్యవర్తినా సాధ్యం బధ్వా
భూర్జపత్రే యజతి ॥

రెండుసార్లు "ఐం" ద్వయముచే మధ్యవర్తిచే సాధ్యమును బంధించి "భూర్జపత్రము"ను సేవించాలి. (ఇది ఒకానొక ముద్రగా చెప్పుతూ ఉంటారు.)

---

**3.** తత్ చక్రం యో వేత్తి, స సర్వం వేత్తి।
స సర్వలోకాన్ ఆకర్షయతి । సర్వగ్ం స్తంభయతి ।

అట్టి కామకళా చక్రమును ఎవరు తెలుసుకుంటారో వారు సర్వము తెలుసుకొన్నవారౌతారు. సర్వలోకములలో ఆకర్షించబడువారు అవుతారు. సర్వమును స్తంభింపచేయగల సామర్థ్యము పొందుతారు.

నీలీయుక్తం చక్రగ్ం
శత్రూన్ మారయతి । గతీగ్ం స్తంభయతి

నీలియుక్తమైన చక్రము శత్రువులను చంపివేయగలదు. "గతి"ని స్తంభింపజేయగలదు.

లక్షాయుక్తం కృత్వా సకలలోకం వశీ కరోతి ।
నవలక్షజపం కృత్వా రుద్రత్వం ప్రాప్నోతి ।

"లక్ష" యుక్తముగా ఉపాసిస్తే సకల లోకాలు వశమౌతాయి. తొమ్మిది లక్షల జపముచే రుద్రత్వము ప్రాప్తించగలదు.

మాతృకయా వేష్టితం కృత్వా విజయీ భవతి ।

"మాతృకావేష్టితము" ఉపాసిస్తే దిగ్విజయుడు అవుతాడు.

భగాంక కుండలం కృత్వా, అగ్నిం ఆధాయ
హవిషా యోషితో వశీ కరోతి ।

"భగాంక కుండలము"ను నిర్వర్తిస్తూ, అగ్నిని ఉపాసిస్తూ హవిస్సులను సమర్పించిన వానికి సమస్తము వశమై ఉంటుంది.
భగాంకకుండలము = వృత్తములో జ్యోతిని ఉపాసించటము.

| | |
|---|---|
| **(పురుషే హుత్వా) వర్తులే హుత్వా శ్రియం అతులాం ప్రాప్నోతి ।** | వర్తుల మండలము నందు హోమము చేస్తే అంతులేని, నిరుపమానమైన శ్రేయస్సు ప్రాప్తించగలదు. |
| **చతరుశ్రే హుత్వా వృష్టిః భవతి ।** | చతురస్ర కుండలమున హోమం చేస్తే వర్షము కురియ గలదు. |
| **త్రికోణే హుత్వా శత్రూన్ మారయతి । గతిగ్ం స్తంభయతి।** | త్రిభుజ మండలములో హోమం చేస్తే శత్రువులుతో శత్రుత్వం తొలగుతుంది. శత్రువుల గతులు స్తంభించబడతాయి. |
| **పుష్పాణి హుత్వా విజయీ భవతి ।** | పుష్పములతో హోమము చేస్తే 'విజయము' పొందగలరు. |
| **మహారసైః హుత్వా పరమ ఆనంద నిర్భరో భవతి ।** | మహా రసము (పండ్ల రసములతో) హోమము చేస్తే, అట్టివాడు పరమానంద పూర్ణుడు కాగలడు. |
| **మహారసా వై షఢ్రసాః ।** | "మహా రసములు" అనగా షఢ్రసములు (ఉప్పు, పులుపు, కారము, చేదు, ఒగరు, తీపి). |
| **4. గణానాం త్వా గణపతిగ్ం హవామహే । కవిం, కవీనాం ఉపమశ్రవస్తమమ్ ।** | ముందుగా → "ఓం । గణానాం త్వా గణపతిగ్ం హవామహే । కవిం కవీనాం ఉపమశ్రవస్తవమ్ । |
| **"జ్యేష్ఠరాజం బ్రహ్మణాం । బ్రాహ్మణస్పత ఆనః శృణ్వన్ ఊతిభిః సీదసాదనం ।" ఇతి ఏవం ఆద్యం అక్షరం । తత్ అంత్య బిందు । "పూర్ణమ్" - ఇతి అనేన అంగగ్ం స్పృశతి ।** | జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనః శృణ్వన్ ఊతిభిః సీదసాదనమ్" - ఈ మంత్రము ఆద్యక్షరముగా (ప్రారంభాక్షరంగా) గానం చేయాలి.<br>అటు తరువాత "బిందు - పూర్ణమ్ ఇతి" - అని పలుకుచూ అంగాంగములు స్పృశించాలి. |
| **"గం గణేశాయ నమః" ఇతి గణేశం నమః కుర్వీత ।** | "ఓం గం గణేశాయ నమః" అని పలుకుచూ గణేశ్వరునకు మనసా-వాచా - కర్మణా నమస్కరించుచున్నాము. |
| **ఓం నమో భగవతే భస్మాంగరాగాయ । ఉగ్ర తేజసే హన హన । దహ దహ । పచ పచ । మథ మథ । విధ్వగ్ంసయ విద్వగ్ంసయ । హల భంజన శూలమూలే వ్యంజన సిద్ధిం కురు కురు ।** | క్షేత్రాధ్యక్షుని ఈ విధంగా పూజిస్తున్నాము. ఓం । ఓ అంగ రాగములను భస్మము చేయు భగవతీ । మీ యొక్క ఉగ్రతేజముతో మాలోని విషాదమును, బద్ధకమును, అరిషట్ వర్గమును-"హన" సంహరించండి (చంపండి) । దహించి వేయండి. పచనము చేసివేయండి. మధించి వేయండి । విధ్వంసము చేసి వేయండి. అవిద్యను తొలగించి "విద్య"ను ప్రసాదించండి. హలము (నాగలి బరువు) తొలగించు స్వామీ ! శూలమూలమున బయలు పరచువాడా । మాకు సిద్ధిని ప్రసాదించండి. |
| **సముద్రం పూర్వ ప్రతిష్ఠితగ్ం శోషయ శోషయ । స్తంభయ స్తంభయ । పరమంత్ర పరయంత్ర పరతంత్ర పరదూత పరకటక పరచ్ఛేదన కర విదారాయ । విదారాయచ్ఛింధి ఛింధి । హ్రీం ఫట్ స్వాహా అనేన క్షేతాధ్యక్షం పూజయేత్ - ఇతి** | సంసార (సముద్రము)నకు ముందే ప్రతిష్ఠితమైయున్న ఆత్మతత్త్వము కొరకై ఈ సంసార సముద్ర జలమును శోషింపజేయండి - స్తంభింప చేయండి.<br>పరమంత్ర, పరయంత్ర, పరతంత్ర, పరదూత, పరకటక, పరిచ్ఛేదనమును కొరకై నిర్వర్తించండి.<br>"ఛింది ఛింది హ్రీం ఫట్ స్వాహా" ఈ విధమైన మంత్రముతో క్షేత్రాధ్యక్షుని పూజించెదరు గాక । |

### కుళ కుమారీ గాయత్రి

| | |
|---|---|
| **కుళ కుమారి విద్మహే మంత్రకోటి సుధీమహి । తన్నః కౌళిః ప్రచోదయాత్ ।** | "కుళ కుమారీ" తత్త్వము ఎరుగుటకై మంత్రకోటీశ్వరీ మహిమను కీర్తిస్తున్నాము. అట్టి కౌళీదేవి మా యందలి కౌళీదేవి తత్త్వమును ప్రచోదింపజేయును గాక । |
| **ఇతి కుమారి అర్చనం కృత్వా యో వై సాధకో అభిలిఖితి । సో, అమృతత్వం చ గచ్ఛతి । స యశ ఆప్నోతి । స పరమ ఆయుష్యం । అథవా పరంబ్రహ్మ భిత్వా, తిష్ఠతి - య ఏవం వేద ।** | ఈ విధంగా "కుమారీ అర్చనము"ను ఎవరు నిర్వర్తిస్తాడో, లిఖిస్తాడో, అట్టివాడు అమృతత్వమును పొందగలడు - అమృతత్వముతో బాటు 'యశము'ను పొందుతాడు. ఉత్తమ ఆయుష్మంతుడు కాగలడు, లేదా<br>"స్వస్వరూప - పరబ్రహ్మము" అనే సంబంధమైన పరిమితమంతా అధిగమించగలడు. బ్రహ్మము నందు స్థానము పొందగలడు. |

**ఇతి - త్రిపురా తాపిణ్యుపనిషత్ - తృతీయోధ్యాయః**

# చతుర్థోపనిషత్

శ్లో॥ "ఓం" దేవా హ వై భగవంతం
అబ్రువన్ దేవ గాయత్రగ్ం
హృదయం నో వ్యాఖ్యాతం
త్రిపురగ్ం సర్వ ఉత్తమమ్ ।
జాతవేదస సూక్తేన ఆఖ్యాతం ।
నః త్రైపురాష్టకమ్ ।

**దేవతలు : భగవంతునితో**

ఓ దేవాదిదేవా ! మీరు దేవ "గాయత్రీ హృదయము" వ్యాఖ్యానము అయినట్టి ఉత్తమమగు "త్రిపురము" గురించి చెప్పారు. చాలా సంతోషము.

ఇప్పుడిక "త్రైపురాష్టకము" అని చెప్పబడే **"జాతవేద సూక్తము"** గురించి వ్యాఖ్యానిస్తూ బోధించ ప్రార్థన.

యదిష్ట్వాముచ్యతే యోగీ జన్మసగ్ం సార బంధనాత్,
అథ మృత్యుంజయం నో బ్రూహీతి॥

అట్లాగే - యోగులు దేనిచే బంధములనుండి విడివడుచున్నారో - అట్టి "మృత్యుంజయము" గురించి కూడా దయచేసి వివరించండి.

ఏవం బ్రువతాగ్ం సర్వేషాం
దేవనాగ్ం శ్రుత్వా ఇదం వాక్యమ్

భగవంతుడగు మహాదేవుడు దేవతలందరి విన్నపమును విన్నవారై ఈ ఈ వాక్యములు ప్రసాదించసాగారు.

అథ అతః 'త్ర్యమ్బకే'న, అనుష్టుభేన
మృత్యుంజయం దర్శయతి ।

**మహాదేవుడు :** "అనుష్టుప్" ఛందస్సుచే నిర్మించబడిన "త్ర్యంబకం యజామహే। సుగంధిం పుష్టివర్ధనం। 'ఉర్వారుకమ్' ఇవ బంధనాత్ మృత్యోః ముక్షీయ । మాఽమృతాత్" -అను మృత్యుంజయ మంత్రమును ఈ విధంగా "వివరణ"ను వినండి.

---

కస్మాత్ "త్ర్యంబకం" ఇతి ? త్రయాణాం
పురాణాం అంబకగ్ం స్వామినం
తస్మాత్ ఉచ్యతే "త్ర్యంబకం" ఇతి ।

**ఏ కారణంగా "త్రయంబకమ్" అని అంటున్నారు?**

ఆయన మూడు అత్యంత పురాణమైన (ప్రాచీనమైన) పురములకు స్వామి (ప్రభువు) కనుక "త్ర్యంబకం" (త్రయంబకుడు) అని అంటున్నారు.

(జాగ్రత్ - స్వప్న - సుషుప్తులే ఆ త్రిపురములు - అని వ్యాఖ్యానించబడుతోంది. అట్లాగే "త్రికాలములు" అని కూడా).

అథ కస్మాత్ ఉచ్యతే "యజామహ" ఇతి ?
యజా మహే సేవా మహే వస్తు

ఎందుచేత "యజామహ" అని అంటున్నారు ? "స్వామీ! మిమ్ములను అనుష్ఠిస్తున్నాము. సేవిస్తూ ఉన్నాము. స్తుతిస్తున్నాము. మీ మహిమను ఉపాసిస్తున్నాము.

"మహే" ఇతి అక్షరద్వయేన కూటత్వేన
అక్షరైకేన "మృత్యుంజయమ్" ఇతి ఉచ్యతే।
తస్మాత్ ఉచ్యతే 'యజామహ' – ఇతి ।

"మహే" అనే అక్షర ద్వయముతో, ఏకాక్షరము అయినదే మృత్యుంజయము (మృత్యువుకు 'సాక్షి' అయి ఉన్న ఆత్మస్వరూప సిద్ధి) అట్టి మృత్యుంజయము అగు కూటస్థ స్థానము కొరకై మహిమను అనుష్ఠిస్తున్నాము. (యజామహ - ఇతి)

---

2. అథ కస్మాత్ ఉచ్యతే 'సుగంధిం' ఇతి?
సర్వతః యశ ఆప్నోతి,
తస్మాత్ ఉచ్యతే సుగంధిం ఇతి ।

ఎందుచేత "సుగంధిం" అనబడుతోంది ? శివ తత్త్వము సర్వత్రా యశోమయము కాబట్టి "సుగంధిం" అంటున్నాము. (సర్వత్రా విస్తరించియున్న సువాసన వంటిది - అని త్ర్యంబకుని స్వరూపము గురించిన విశేషణము)

అథ కస్మాత్ ఉచ్యతే పుష్టివర్ధనం ఇతి ?
యః సర్వాన్ లోకాన్ సృజతి
యః సర్వాన్ లోకాగ్ంస్తారయతి
యః సర్వాన్ లోకాన్ వ్యాప్నోతి,
తస్మాత్ ఉచ్యతే 'పుష్టివర్ధనం' ఇతి ।

ఎందుచేత "పుష్టివర్ధనమ్" అని అంటున్నాము ?

ఏ శివతత్త్వమైతే సమస్త లోకములకు రక్షణయో (రక్షించుచూ ఉన్నట్టిదో)

- ఏది సమస్త లోకములుగా వ్యాపించి ఉన్నదో

- ఏది సమస్త జీవులకు పోషణ, పుష్టి ప్రసాదిస్తోందో, ఆ కారణం చేత - ఆ పరమ పురుషుడగు శివుని "పుష్టివర్ధనమ్" అను శబ్దముతో (ఈ మృత్యుంజయ మంత్రములో) వర్ణిస్తూ ఉన్నాము.

**అథ కస్మాత్ ఉచ్యతే "ఉర్వారుకం ఇవ బంధనాత్ మృత్యోః ముక్షీయ" ఇతి ? సంలగ్నత్వాత్ ఉర్వారుకం ఇవ మృత్యోః సగ్ంసార బంధనాత్, సంలగ్నత్వాత్ బద్ధత్వాత్ మోక్షీ భవతి । ముక్తో భవతి ।**

ఎందుచేత **"ఉర్వారుకమ్ ఇవ బంధనాత్ మృత్యోః ముక్షీయ"** అని మంత్రము నందు అభ్యర్థనపూర్వకంగా అనబడుతోంది ? దోసకాయ దోసతీగకు అతికి ఉన్నట్లుగా, ఈ జీవుడు మృత్యు సంసారమునకు సంబంధుడై దేహ-దేహాంతరములు గడుపుచున్నాడు.

**"స్వామీ ! దోసపండు దోసతీగనుండి వేరుచేయు విధంగా సంసార బంధము నందు సంలగ్నవై ఉన్నాము. బంధము నుండి తొలగించండి"** - అని కోరుతున్నాము.

**అథ కస్మాత్ ఉచ్యతే 'మామృతాత్' ఇతి**
**అమృతత్వం ప్రాప్నోతి ।**
**అక్షరం ప్రాప్నోతి ।**
**నిత్యత్వం ప్రాప్నోతి ।**
**స్వయం రుద్రో భవతి ॥**

ఎందుచేత "మామృతాత్" అని మంత్రము చెప్పుతోంది ?
- నన్ను మృత్యువు నుండి అమృతత్వమునకు చేర్చండి.
- క్షరము నుండి మా ధ్యాసను అక్షరమునకు నడపండి.
- అనిత్యమైన దానిని దాటించి నిత్యోత్వమును ప్రాప్తింపచేయండి.

అట్టి ఉపాసకుడు స్వయంగా రుద్రుడే అగుచున్నాడు. (నా రుద్రో రుద్రమర్చతి) ।

---

**దేవా హ వై భగవంతం ఊచుః "సర్వం నో వ్యాఖ్యాతమ్" ।**

**దేవతలు :** హే భగవాన్ । మాపై అనుగ్రహముతో సర్వమును వ్యాఖ్యానిస్తూ మాకు బోధిస్తున్నారు. కృతజ్ఞులము.

**అథ కైః మంత్రైః స్తుతా భగవతీ స్వ ఆత్మానం దర్శయతి ? తాం తు సర్వాం చ శైవాన్ వైష్ణవాన్ సౌరాన్ గణేశాన్ నో బ్రూహి - ఇతి ॥**

ఈ విషయం కూడా మిమ్ములను బోధించవలసినదిగా ప్రార్థిస్తున్నాము.

ఏ మంత్రముచే స్తుతించబడినదై ఆ భగవతి అగు త్రిపురేశ్వరీ దేవి మాకు స్వయం ఆత్మస్వరూపంగా దర్శనము ప్రసాదించగలదు? అట్టి అన్ని "శైవము, వైష్ణవము, సౌరము, గణేశము" అని చెప్పబడేవి మాకు విశదీకరించి చెప్పండి.

---

**స హ ఉవాచ భగవాన్ త్రయంబకేన అనుష్టుభేన మృత్యుంజయం ఉపాసయేత్।**

**భగవానుడు :** "అనుష్టుప్" ఛందో బద్ధమైన (మనం పైన చెప్పుకొన్న) మృత్యుంజయ మంత్రమును ఉపాసించెదరు గాక "త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్ । ఊర్వారుకమివ బంధనాత్ మృత్యోర్ముక్షీయ । మామృతాత్" అని మృత్యుంజయ మంత్రము మృత్యువును దాటించి ఈ దేవీ దర్శనము తప్పక ప్రసాదించగలదు.

**పూర్వేణ అధ్వనా వ్యాప్తం 'ఏకాక్షరం' ఇతి స్మృతమ్ ।**

సమస్తమునకు మునుముందే మార్గదర్శకమైనది ఏకాక్షరము "ఓం" ఇతి । ఏకము, అక్షరము అగు బ్రహ్మమే మృత్యుంజయ మంత్రము యొక్క మహదార్థము. కనుక ఒక్క 'ఓం' అను అక్షరోపాసనచే

**"ఓం నమః శివాయ" - ఇతి యాజుష మంత్ర ఉపాసకో రుద్రత్వం ప్రాప్నోతి । కల్యాణం ప్రాప్నోతి య ఏవం వేద ।**

**"ఓం నమః శివాయ"** అను ఈ (విశ్వయజ్ఞ రూపార్థమగు) యాజుషీ మంత్రమును ఉపాసించువాడు "రుద్రత్వము" పొందగలడు. రుద్రమంత్రార్థమును ఎరిగి ఉపాసించు వాడు సమస్త శుభములు పొందగలడు. దేవీ స్వరూపమగు స్వస్వరూపాత్మానుభవము పొందగలడు.

---

## విష్ణోః యత్ పరమం పదమ్

**3. తత్ విష్ణోః పరమం పదం సదా పశ్యన్తి సూరయః।**

(ఆత్మోపాసనచే సంసారబంధములను త్రెంచివేసికొనియున్న)

సూరులు (విద్వాంసులు) "తత్ విష్ణోః" అను పరమ పదమును సర్వత్రా సర్వదా దర్శించుచున్నారు. ఇదంతా విష్ణుతత్త్వముగా ఎరుగుచున్నారు.

ఆకాశము వలె ఇదంతా కూడా విష్ణుమహిమ చేతనే విస్తరించ బడినది. విష్ణుతత్త్వమే ఇదంతాగా విస్తరించుచున్నది.

**'దివి' ఇవ చక్షుః ఆతతం ।**

అట్టి విష్ణుధ్యానయోగముచే ఆత్మదేవీ దర్శనము కాగలదు.

**విష్ణోః సర్వతోముఖస్య స్నేహః యథా**
**పలలపిండమ్ ఓతప్రోతం అనువ్యాప్తం ।**

సర్వత్ర ముఖము కలవాడు, ఈ సమస్తము తన ముఖమే అయి ఉన్నవాడు - "సర్వతోముఖుడు" - అగు విష్ణువు (విష్ణుతత్త్వము) "నువ్వులలో, మాంసములో నూనె" వలె ఈ సమస్తమునందు ఓత - ప్రోతమై (వస్త్రములో నిలువు - అడ్డముగా దారము విస్తరించి ఉండు విధంగా సమస్తమునందు, సమస్తముగా వేంచేసి ఉన్నారు.

**వ్యతిరిక్తం, వ్యాప్నుత ఇతి ।**

ఈ సమస్తమునకు వేరై విస్తరించి ఉన్నారు కూడా ।

**వ్యాప్నువతో విష్ణోః తత్ పరమం పదం**
**పరం వ్యోమేతి పరమపదం పశ్యన్తి ।**
**వీక్షంతే సూరయో బ్రహ్మాదయో దేవా స ఇతి**
**సదా హృదయ ఆదధతే తస్మాత్ విష్ణోః స్వరూపమ్ ।**

ఆ విధంగా (నవలలో ఆ నవలా రచయితవలె) వేంచేసియున్నట్టి పరమ పదమగు పరంజ్యోతి స్వరూపుడగు విష్ణు తత్త్వమును - దృశ్య వ్యవహారము జయించిన సూరులు సదా దర్శిస్తూనే ఉంటారు. ఆ యొక్క విష్ణు స్వరూపమును బ్రహ్మ మొదలైన బ్రహ్మజ్ఞులు తమ యందే దర్శించుచున్నారు.

---

**వసతి తిష్ఠతి భూతేషు ఇతి వాసుదేవ ఇతి ।**

సమస్త జీవుల హృదయ గృహములలో ఏ పరమాత్మ సర్వదా ప్రకాశమానుడై వేంచేసి ఉన్నారో - ఆయన "వాసుదేవుడు" అను శబ్దముతో చెప్పబడుచున్నారు. ఇదియే "వాసుదేవ" నిర్వచనము. వాసుదేవ భావనచే ఆత్మ దేవీ దర్శనము కాగలదు.

**"ఓం నమ" – ఇతి త్రీణి అక్షరాణి ।**
**"భగవత" – ఇతి చత్వారి ।**
**"వాసుదేవాయ" – ఇతి పంచాక్షరాణి।**

**"ఓం నమో భగవతే వాసుదేవాయ"**
**ద్వాదశాక్షరీ మంత్రము**

**"ఓం నమో"** - త్రీణి (3) అక్షరములు.
**"భగవత"** - చత్వారి (4) అక్షరములు.
**"వాసుదేవాయ"** - ఇతి పంచ (5) అక్షరములు.

**ఏతత్ వై వాసుదేవస్య ద్వాదశార్ణం అభ్యేతి**

ఇదియే వాసుదేవపరమైనట్టి (3+4+5=12) ద్వాదశాక్షరీ ఉపాసించబడు గాక ।

---

**స ఉపప్లవం తరతి, స సర్వం ఆయుః ఏవ ఏతి ।**
**విన్దతే ప్రాజాపత్యగ్ం, రాయః పోషం**
**గౌపత్యం చ సమశ్నుతే ।**

అట్టి **"ఓం నమో భగవతే వాసుదేవాయ"** - ద్వాదశాక్షరీ మంత్రమును ఉపాసించువాడు సమస్తమైన ఉపప్లవముల నుండి (ఉపద్రవముల నుండి) తరించగలడు. పవిత్రమైన, సద్వినియోగమగు ఆయుష్షును పొందగలడు. సమస్త ప్రాజాపత్యములకు (అధికారములను), రాయసోషములను (Royal), గౌపత్యములను (గౌరవములను) సంపాదించుకోగలడు.

**ప్రత్యక్ ఆనందం, బ్రహ్మపురుషం**
**ప్రణవ స్వరూపమ్ ।**

ద్వాదశాక్షరీ మహా మంత్ర జపముచే ప్రత్యక్ష ఆనందమును, బ్రహ్మానందమును, బ్రహ్మపురుషమును, ప్రణవ స్వరూపమును సంతరించుకోగలడు.

---

**'అ'కార, 'ఉ'కారో, 'మ'కార ఇతి,**
**తాన్ ఏకధా సంభవతి**
**తత్ 'ఓం' ఇతి ॥**

'అ'కార (కేవలమగు పరమాత్మ), 'ఉ' కార (ప్రకృతి, దృశ్యము, అనుభవములో), 'మ'కార (జీవాత్మ, అనుభవి) ఈ మూడింటిని ఏకము చేసినప్పటి "అక్షర సంజ్ఞ"యే **"ఓం"**కారము.

(పరమ పురుషుడు) **ఆత్మ అంతటా కూడా సమస్త జీవులలో**

**హగ్ంసః శుచిషద్ వసుః అంతరిక్ష।**
**సత్ హోతా వేదిషత్**
**అతిథిః, దురోణసత్**

- ఆకాశములో సూర్యునివలె హంస (సొ౽హమ్) అయి,
- ఆకాశములో వాయువు వలె,
- గృహములో అతిథివలె ప్రవేశించి సంచారము కలిగి ఉంటున్నారు. అంతటా అగ్నివలె, జీవులలో పురుషకారమువలె, ఆకాశము వలె ఆత్మదేవుడు వేంచేసి ఉన్నారు.

**నృషత్ వర సత్। ఋత సత్ । వ్యోమ సత్ ।**
**అబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్ ॥**

జలములో 'రుచి' వలె ఉంటున్నారు. భూమిలో 'సారము'గా ప్రదర్శనమగుచున్నారు. వేదములలో వాక్స్వరూపుడుగాను, కొండలలో 'ఘనము' (Solid)గాను, ఋతము, బృహత్ అయి వుండి సర్వత్రా వేంచేసి ఉంటున్నారు.

4. “హగ్ంస ఇతి ఏతత్ మనోః అక్షర ద్వితీయేన, ప్రభాపుంజేన, సౌరేణ ధృతం

అబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతగ్ం
సత్యాప్రభా పుంజని ఉషాసంధ్యా ప్రజ్ఞాభిః
శక్తిభిః పూర్వగ్ం సౌరం అధీయానః
సర్వ ఫలం అశ్నుతే । స వ్యోమ్ని పరమే
ధామని సౌరే నివసతే ।

'హగ్ం'-“స” (హంస) అనే “సోఽహమ్” అర్థమును ప్రతిపాదించే రెండు అక్షరములు సూర్యుడు కిరణములను ధరించు విధంగా ఆత్మార్థంగా ధరించబడుతోంది.

అట్టి ఆత్మపురుషుడు “అబ్జా గోజా ఋతజా అద్రిజా” ఉన్నా అత్మయే జలములోను రుచిగా, భూమియందు భూసారముగా, వేదములందు “ఓం”కారముగా (సత్యమగు తత్త్వోపాసనగా), ఉదయించు సూర్యుని కిరణముల వలె సత్యమై నిత్యమై వెలుగొందుతోంది. ఆత్మ పురుషుడే సమస్త జీవులలో ప్రజ్ఞా (wisdom) రూపమై, సర్వత్రా శక్తి రూపమై, సమస్తమునకు మునుముందే ఏర్పడిన వారై ఉన్నారు.

ఆకాశములో సూర్యునివలె సర్వజీవులలో ప్రకాశించుచున్నారు. అట్టి ఆత్మదేవుని ఉపాసనచే సర్వము లభించగలదు. ఆయన సూర్యమండలమునకు ఆవల ఆకాశమంతా విస్తరించి ఉన్నారు.

---

## గణేశ మంత్రము

“గణానాం త్వా” ఇతి త్రైష్టుభేన
పూర్వేణ అధ్వనాం అనునైకార్ణేన
గణాధిపం అభ్యర్చ్య గణేశత్వం ప్రాప్నోతి ।

### “గణేశ మంత్రము”

“గణానాం త్వా...” అను త్రైష్టుభమును ఉపాసించుటచే సమస్తమునకు పూర్వముగా ఉన్న పరంధామము అని పూజించెదరు గాక. అవి ఏకార్ణము శబ్దము యొక్క ఆశ్రయముచే గణాధిపుని (సమస్త గణములకు అధిపతిని) అభ్యర్థించటం చేత, అట్టి ఉపాసకుడు గణాధిపత్యము - సిద్ధించుకోగలడు.

---

అథ గాయత్రీ సావిత్రీ సరస్వత్య జపా మాతృకా
ప్రోక్తా తయా సర్వం ఇదం వ్యాప్తమ్ ।

### గాయత్రి-సావిత్రి-సరస్వతీ మంత్రోపాసన

అట్టి త్రిపురేశ్వరీదేవియే గాయత్రీ, సావిత్రీ సరస్వతి “జపామాతృక”చే సమస్తము వ్యాప్తమై ఉన్నది.

### శక్తి గాయత్రీ మంత్రము

“ఐం” వాగీశ్వరీ విద్మహే,
‘క్లీం” కామేశ్వరీ ధీమహి ।
‘సౌః’ తన్నః శక్తిః ప్రచోదయాత్” – ఇతి

“ఐం” వాక్ స్వరూపిణీదేవి యొక్క మహిమ ఎరుగుచున్నాము. ‘క్లీం’ ఈ సమస్త తన ఇచ్ఛగా కలిగియున్న ఆ దేవి యొక్క మహిమను ధీ (బుద్ధితో) యోచిస్తున్నాము. ఉపాసిస్తున్నాము. అట్టి శక్తి దేవి మా బుద్ధులను ప్రచోదింపజేయును గాక ।

---

గాయత్రీ ప్రాతః, సావిత్రీ మధ్యందినే,
సరస్వతీ సాయం – ఇతి ।

ఆ త్రిపురేశ్వరీ-త్రిపుర శక్తి దేవిని ఉదయమున - గాయత్రీ దేవి గాను, మధ్యాహ్నమున - సావిత్రీ దేవిగాను, సాయంకాలమున - సరస్వతీ దేవిగాను ఉపాసించెదరు గాక ।

నిరంతరం అజపాహగ్ంస ఇతి ।

జపమునకు, శబ్దమునకు ఆవల ఈశ్వరీదేవిగా (కేవల రూపంగా, నామరూపాతీతంగా) అజపారూపంగా నిరంతరము ఆరాధిస్తూ ఉన్నాము.

ఏవం మాతృకా, పంచాశత్ వర్ణ విగ్రహేణ
‘అ’కార ఆది ‘క్ష’కార అంతేన వ్యాప్తాని
భువనాని శాస్త్రాణి ఛందాగ్ంసి

ఈ విధంగా ఆ దేవీ స్వరూపము పంచాశత (50) వర్ణ మాతృకా విగ్రహము అయినట్టిది. ‘అ’ కారమునుండి ‘క్ష’ కారము వరకు ఆవలగా వ్యాపించి ఉన్నది. భువనమంతా విస్తరించి ఉన్నది. వేద శాస్త్రములచే అభివర్ణితము.

ఇతి ఏవం భగవతీ సర్వం వ్యాప్నోతి ।
ఇతి ఏవ తస్య ఏవై నమో నమః ।

ఈ విధంగా మాతృకావర్ణ రూపిణిగా సమస్తముగా వ్యాపించి ఉన్నది అగు త్రిపురసుందరీ మాతకు నమస్కారము. (మాతృకం = వర్ణమాల మంత్రం = అక్షరావయవము).

ఇతి తాన్ భగవాన్ అబ్రవీత్ :

ఈ విధంగా భగవంతుడు దేవతలతో పలికారు.

ఏతైః మంత్రైః నిత్యం దేవీగ్ం స్తౌతి స సర్వం పశ్యతి ।

ఈ మంత్రములతో ఎవరు దేవిని స్తుతిస్తారో, అట్టివారు సర్వమును దర్శించగలరు.

సః అమృతత్వం చ గచ్ఛతి య ఏవం వేద ।

ఆ దేవీతత్త్వము తెలుసుకోవటం చేత అమృత స్థానమును చేరగలరు.

**ఇతి - త్రిపురా తాపిన్యుపనిషత్ - చతుర్థ అధ్యాయః**

# పంచమోపనిషత్

1. "ఓం" దేవా హ వై భగవంతం అబ్రువన్ :
స్వామిన్ । నః కథితగ్ం స్ఫుటం క్రియాకాండగ్ం
స విషయం త్రైపురం । ఇతి ।
అథ పరమం నిర్విశేషం కథయస్వ – ఇతి ।

తాన్ హ ఉవాచ భగవాన్ :
తురీయయా మాయయా అంత్యయా నిర్దిష్టం
పరంబ్రహ్మ ఇతి ।
పరమపురుషం చిద్రూపం పరమాత్మ – ఇతి ।

**దేవతలు** (భగవానునితో): స్వామీ ! భగవన్ ! "త్రైపురము" గురించిన క్రియాకాండను సవిషయంగా ప్రస్ఫుటం (clarified) చేసారు. ఇప్పుడు "పరమము" (finest) అయినట్టి "నిర్విశేషము" గురించి విశ్లేషముగా బోధించమని ప్రార్థన.

**శ్రీ భగవానుడు** : "పరంబ్రహ్మము" అనునది ఎటువంటిదంటే...,

**తురీయము** : జాగ్రత్ స్వప్న సుషుప్తులకు ఆవలగా, సాక్షిగా "నాలుగవది". అంతేగాని మూడు అవస్థల అంతర్గతం కాదు. 'మాయ'కు ఆవల, నిర్దుష్టమై ఉన్నట్టిది. అది "పరమపురుషము", చిద్రూపము (Absolute form of Knowing) "పరమాత్మ"గా చెప్పబడేది.

---

శ్రోతా, మన్తా, ద్రష్టా అద్వేష్టా ప్రష్టా
స్రష్టా ఘోష్టా విజ్ఞాతా ప్రజ్ఞాతా
సర్వేషాం పురుషాణాం అంతఃపురుషః
స ఆత్మా । స విజ్ఞేయ ఇతి ।

అట్టి ఆత్మపురుషుడు - సమస్తమునకు శ్రోత (వినువాడు), మన్తా (మనోరూపుడు, మననము చేయువాడు), ద్రష్ట (perceiver), అద్వేష్టా దేనిపట్ల ద్వేషము లేనివాడు, ప్రష్ట (ముందర నడిచెడివాడు / leader), స్రష్టా (Clear), ఘోష్టా (చాటించువాడు / publisizer), విజ్ఞతా (సమస్తము ఎరుగుచుండువాడు), ప్రజ్ఞాతా (తెలివి స్వరూపుడు, ఎరుగువాడు), సమస్త జీవుల అంతర్యామి - (ఆత్మ) అయి ఉన్నారు.

---

న తత్ర లోకా అలోకా ।
న తత్ర దేవా అదేవాః ।
పశవో, అపశవః, తాపసో న తాపసః।
పౌల్కసో, న పౌల్కసః ।
విప్రా న విప్రాః ।
స ఇతి ఏకం ఏవ పరంబ్రహ్మ
విభ్రాజతే నిర్వాణమ్ ।
న తత్ర దేవా ఋషయః
పితర ఈశతే ప్రతిబుద్ధః సర్వ విద్యేతి ॥

తత్ర ఏతే శ్లోకా భవన్తి

(సమస్త జీవుల స్వాభావిక స్వస్వరూపమే అయిఉన్న - అట్టి) ఆత్మాకాశము (లేక) చిదాకాశములో
- లోకములు లేవు, అలోకములు ఉండవు.
- దేవతలు ఉండరు. అదేవతలు ఉండరు. తాపసులు ఉండరు. అతాపసులు ఉండరు
- పశువులు లేవు, అపశువులు లేవు.
- పౌల్కసుడు (illegal child) లేడు. అపౌల్కసుడు లేడు.
- విప్రుడు లేడు, అవిప్రుడు లేడు.

ఏకము అగు పరబ్రహ్మము మాత్రమే నిర్వాణ (నిశ్చల) రూపమై విభ్రాజమానమై యున్నది.

అట్టి నిర్వాణ స్థానములో దేవతలు, ఋషులు, తెలివిగలవారు (ప్రబుద్ధులు) మొదలైనవారంతా సర్వ భేదములు తొలగి ఏకస్వరూపులే అగుచున్నారు.

అద్దాని గురించి శాస్త్రములచే శ్లోకపూర్వకంగా గానము చేయబడియే ఉన్నది.

---

అతో నిర్విషయం నిత్యం
మనో కార్యం ముముక్షుణా ।
యతో నిర్విషయో నామ
మనసో ముక్తిః ఇష్యతే ।
మనః హి ద్వివిధం ప్రోక్తం ।
(1) శుద్ధం చ (2) అశుద్ధం ఏవ చ

అందుచేత ముముక్షువైనవాడు మనస్సును నిర్విషయముగా ధారణ చేయు కార్యమునందు నిత్యము ప్రయత్నశీలుడై ఉండును గాక!

ఎప్పుడైతే మనస్సు దర్పణమువలె నిర్విషయంగా అనుభూతమగుచూ తెలియవస్తుందో అట్టి 'స్థితి'యే "మోక్షము" అనబడుతోంది.

అట్టి ఈ మనస్సు రెండు విధములుగా (విభాగములుగా విశ్లేషించబడుతోంది.

(1) శుద్ధ మనస్సు (కేవలమగు మనస్సు) (2) అశుద్ధమగు మనస్సు (విషయ సహితముగా మనస్సు).

**అశుద్ధం కామ సంకల్పం ।**
**శుద్ధం కామ వివర్జితమ్ ॥**

"ఏదో కావాలి, పొందాలి, చేరాలి" అను కామముతో కూడినప్పుడు అది అశుద్ధమగు మనస్సు. సమస్త కామములు (desires, expectations, wishes, dependencies, etc.,) రహితం అయినప్పుడు - అదియే శుద్ధమగు మనస్సు.

---

**2.** **మన ఏవ మనుష్యాణాం**
**కారణం బంధ - మోక్షయోః।**

**మనస్సుకే బంధము**

ఆత్మస్వరూపముగా ఈ జీవుడు నిత్యముక్తుడు. మరి బంధము ఎట్లా వచ్చిపడుతోంది. ('మననము' అను అడ్డ దిడ్డ దారములతో నిర్మితము అయినట్టి) మనస్సే బంధమునకు, మోక్షమునకు కూడా కారణము.

**బంధనం విషయ ఆసక్తిః।**
**ముక్త్యై నిర్విషయం మనః।**

ఇంద్రియ విషయములపట్ల కలిగి ఉంటున్న "ఆసక్తి" (అపేక్ష, ఆశించటము, అభిలషించటము, తనకు తానై ఆధారపడి ఉండటము)- ఇదియే బంధము. మనస్సు విషయరాహిత్యము సంతరించుకొని ఉన్నదా.. అదియే 'ముక్తి'.

**నిరస్త విషయా సంగం,**
**సన్నిరుధ్య మనో హృది।**

అందుచేత విషయములతో ఏర్పడుచున్న 'సంగము' (Relatedness) నిరస్తము చేయాలి. పోగొట్టుకోవాలి. తిరస్కరించివేయాలి. త్రోసివేయాలి (Leave, thow off). అందుకుగాను మనస్సును నియమ పూర్వకంగా నిరోధించాలి.

**యదా యాతి అమనీభావః**
**తదా తత్ పరమం పదమ్।**

ఎప్పుడైతే మనన రహితరూపమగు అమనీభావము (భావ రాహిత్యము) పొందుతామో, అదియే 'పరమపదము' అయి ఉన్నది.

---

**తావత్ ఏవ నిరోద్ధవ్యం**
**యావత్ ధృది గతం క్షయమ్।।**

ధృతిగతమైనదంతా (దృశ్య సంబంధమై పట్టుకున్నదంతా, ఆత్మకు అన్యమైనదంతా) ఏదైతే ధరించబడుతోందో - అదంతా కూడా పూర్తిగా క్షయించే వరకు ఈ మనస్సును నిరోధించే ప్రయత్నము చేయవలసిందే.

**ఏతత్ జ్ఞానం చ ధ్యానం చ।**
**శేషో అన్యో గ్రంథవిస్తరః।।**

విషయములవైపు పరుగులు తీస్తున్న మనస్సును వెనుకకు మరల్చి ఈ మనస్సును నిర్విషయము చేసే అనునిత్యమైన ప్రయత్నమే 'జ్ఞానము', 'యోగము' కూడా. ఇక శాస్త్రములలోను, సాధనములలోను (ప్రాణాయామ, పూజ, తపస్సు మొదలైన వాటి గురించి) చెప్పేదంతా- ఇదే విషయము (ప్రయత్నము) యొక్క గ్రంథ విస్తారమే.

**న ఏవ చింత్యం। న చ అచింత్యం।**
**న చింత్యం। చింత్యం ఏవ చ।**

మనస్సు నిరోధించబడిందా, ఇక - చింతన చేయవలసినదేదీ ఉండదు. చింతన చేయకూడనిది ఉండదు. దేనికి చింతించు ధర్మమే లేదో అట్టి ఆత్మ మాత్రమే చింతింపతగినది.

**పక్షపాత వినిర్ముక్తం**
**బ్రహ్మ సంపద్యతే ధ్రువమ్।।**

"ఇది ఇటువంటిది, వారు ఇటువంటి వారు. ఇప్పుడు ఇది, అప్పుడు అది" - అను రూపము గల పక్షపాతములన్నీ (Different interpretations) నుండి విముక్తుడు అయినవాడు 'బ్రహ్మము'ను సిద్ధించుకోగలడు.

---

**స్వరేణ సల్లయేత్ యోగీ**
**సర్వం సంభావయేత్ పరమ్।**

('అ'కారము మొదలైన అక్షరములు పలుకుచూ, ఉదాత్త అనుదాత్త షడ్జములతో కూడిన) 'స్వరము'తో సత్ స్వరూపమగు పరమాత్మయందు జగదనుభవములన్నీ యోగి లయించివేయాలి. అప్పుడు 'పరతత్త్వము' యొక్క స్వరము (పరమాత్మ తత్త్వము) సంభావన (Shaping the sense, placing the sense) సిద్ధించుకోవాలి.

అస్వరేణ తు భావేన
న భావో భావ ఇష్యతే
తత్ ఏవ నిష్కళం బ్రహ్మ
నిర్వికల్పం నిరంజనమ్।

అట్టి స్వరము (శబ్ద పరిమితమైనది, All that within range of sound)ను దాటిన "అస్వర భావన"ను చేయాలి. అది "అభావ భావము" అనబడుతోంది. అప్పటి యోగి యొక్క ఆత్మ తదాత్మ్య స్థితియే నిష్కళంకము (కళంకములు లేనిది), నిరంజనము (ధూళి రహితము), నిర్వికల్పము (సమస్త వికల్పనలు లయించినది) అగు **"బ్రహ్మము"**.

---

"తత్ బ్రహ్మ అహం" ఇతి జ్ఞాత్వా
బ్రహ్మ సంపద్యతే క్రమాత్।

"అట్టి నిష్కళంక, నిర్వికల్ప, నిరంజనము అగు ఆ బ్రహ్మమే నేను" అనునది తెలుసుకున్నవాడు ఇక క్రమముగా బ్రహ్మమే తానై, బ్రాహ్మీ స్థితి సంపాదించుకుంటున్నాడు.

నిర్వికల్పం అనంతం చ
హేతు దృష్టాంత వర్జితమ్।
అప్రమేయం అనాద్యంతం
యత్ జ్ఞాత్వా ముచ్యతే బుధః।

అట్టి నిర్వికల్పము, అనంతము అగు బ్రహ్మము - హేతువులు (Reasons), దృష్టాంతములు లేనట్టిది. అది దేనికీ సంబంధించినది కాదు. అప్రమేయము. ఆద్యంత రహితము. అట్టి ఆత్మను తమ సహజ స్వరూపముగా, నిజస్వరూపముగా తెలుసుకొని బుధులు (తెలివి కలవారు) సమస్త సంసార బంధముల నుండి విడివడుచున్నారు.

---

న నిరోధః। న చ ఉత్పత్తిః।
న బద్ధో। న చ సాధకః।।

వాస్తవానికి పారమార్థికంగా చూస్తే - ఇక్కడ ముముక్షువు లేడు. నిరోధములు లేవు. ఉత్పత్తి లేదు. బద్ధుడు లేడు. సాధకుడు లేడు. ముముక్షువు లేడు. ముక్తుడు లేడు.

న ముముక్షుః న వై ముక్త
ఇతి ఏషా పరమార్థతా।

అందుచేత అఖండము, అప్రమేయము, నిత్య నిర్మలము అగు ఆత్మ మాత్రమే జాగ్రత్ స్వప్న సుషుప్తులలో మననము చేయతగినట్టి వస్తువు.

ఏక ఏవ ఆత్మా మంతవ్యో జాగ్రత్ స్వప్న సుషుప్తిషు।
స్థాన త్రయ వ్యతీతస్య పునర్జన్మ న విద్యతే।

ఎవ్వడైతే (జాగ్రత్-స్వప్న-సుషుప్తి) - స్థాన త్రయమునకు ఆవలిదగు తన యొక్క తురీయ స్వరూపమును చేరి, సర్వమును దాటి వేస్తాడో, ఆతడు పునర్జన్మ రహితుడు అవుతాడు.

ఏక ఏవ హి భూతాత్మా
భూతే భూతే వ్యవస్థితః।

ఆకాశంలో ఒకే చంద్రుడు ప్రకాశిస్తూ అనేక నుయ్యి-తటాక-నదీ-సముద్ర జలములలో అనేక చంద్ర బింబముల వలె ప్రతిబింబిస్తున్న విధంగా,

ఏకధా బహుధా చ ఏవ
దృశ్యతే జల చంద్రవత్।

ఒకే (ఏకము అయిన) భూతాత్మ అనేక అసంఖ్యాక జీవులలో వ్యవస్థితమై (Having been placed) ఉన్నది. ఒకే రీతిగాను, అనేక రీతులుగా కూడా (ఏకమగు ఆత్మ) ఇక్కడ (భేద దృష్టికి) కనబడుచూ ఉన్నది.

---

**3.** ఘట సంవృతం ఆకాశం
నీయమానే ఘటే యథా,
ఘటో నీయేత న ఆకాశం
తథా జీవః నభ ఉపమః।

ఒకచోట ఒక కుండ (ఘటము) ఉన్నది. ఆ కుండ ఆక్రమించుకొని ఉన్న చోటును 'ఘటాకాశము' అంటాము. ఆ కుండ ఏ కారణం చేతనో పగిలిపోయింది. ఇంక అక్కడ 'ఘటాకాశము' అనేదేదీ ఉండదు. 'ఆకాశము' అనుదానిలో ఘటాకాశము గుర్తు లేకుండా పోయింది కదా! జీవాత్మ యొక్క లయము ఇట్టిదే.

ఘటవత్ వివిధ ఆకారం భిద్యమానం పునః పునః,
తత్ భేదే చ న జానాతి
స జానాతి చ నిత్యశః।।

ఆకాశము అనేక కుండలలో అనేక ఘటాకాశములగుచున్న ఉపమానంలాగానే - ఈ జీవులు కూడా (మట్టియే అనేక కుండలుగా అగుచున్నట్లే) అనేక దేహములలో దేహి అనేక రూప నామములు దాల్చుచున్నాడు. ఒకే మట్టి అనేక కుండలవడం జరుగుతోంది. అవన్నీ పగిలితే, మట్టిగా శేషించి, తిరిగి అనేక వేరైన కుండలు అగుచున్నట్లే - ఈ జీవులు ఏకాత్మరూపులై ఉన్నారు. అజ్ఞానముచేతనే అనిత్యమగు జీవాత్మలు కనిపిస్తున్నారు. జ్ఞానముచే నిత్యమగు ఏకాత్మ స్వానుభవము కాగలదు.

| | |
|---|---|
| **శబ్ద మాయ అవృతో యావత్,<br>తావత్ తిష్ఠతి పుష్కలే।** | అనేక నామరూపాత్మకమైన "శబ్దమాయ" (శబ్దమయము)చే దృష్టి ఆవరించబడినంతసేపూ కూడా, అనేకమే కనిపిస్తుంది. అఖాండాత్మ దృష్టిచే ఏకత్వమే అనిపించగలదు. |
| **భిన్నే తమసి చ ఏకత్వం<br>ఏక ఏవ అనుపశ్యతి।** | చీకటి తొలగితే అంతా స్పష్టము అగు తీరుగా అజ్ఞానాంధకారము తొలగిందా, ఏకత్వమే స్వానుభవము అవగలదు. |
| **శబ్దార్ణం అపరబ్రహ్మ<br>తస్మిన్ క్షీణే యత్ అక్షరమ్,** | శబ్దము రూపంగా విస్తరించి చెప్పబడేది-"స్వయం బ్రహ్మానుభవము" నకు దారి మాత్రమే. అందుచేత "అపరం బ్రహ్మ" అనబడుతోంది. 'స్వానుభవము'చే శబ్ద రూపమంతా క్షయించగా, 'అక్షరరూపము' అగు ఆత్మానుభవము రూపుదిద్దుకోగలదు. |
| **తత్ విద్వాన్ అక్షరం ధ్యాయేత్<br>యత్ ఇచ్ఛేత్ శాన్తిం ఆత్మనః।** | "శాంతి సంపాదించుకోవాలి" - అని అనుకున్నవాడు ఆత్మజ్ఞానము సముపార్జించుకొని, విద్వాంసుడై అక్షరమగు ఆత్మతత్త్వమునే ఉపాసించాలి. |
| **ద్వే బ్రహ్మణీ హి మంతవ్యే<br>శబ్ద బ్రహ్మపరం చ యత్।** | (1) శబ్ద బ్రహ్మమును (2) స్వానుభవము మాత్రమే అయి ఉన్న "పరబ్రహ్మము"ను - రెండిటినీ మననపూర్వకంగా ఉపాసించెదరు గాక! |
| **శబ్ద బ్రహ్మణి నిష్ణాతః<br>పరంబ్రహ్మ అధి గచ్ఛతి।** | ఎవడైతే శబ్ద బ్రహ్మమునందు నిష్ణాతుడై ఉంటాడో, అట్టివాడు క్రమంగా 'పరబ్రహ్మము'ను పొందగలడు (సిద్ధించుకోగలడు). శబ్ద బ్రహ్మము సాధన. పరబ్రహ్మము సిద్ధి. |
| **గ్రంథం అభ్యస్య మేధావీ జ్ఞాన విజ్ఞాన తత్పరః,<br>పలాలం ఇవ ధాన్యార్థీ త్యజేత్ గ్రంథం అశేషతః,** | గ్రంథమును అభ్యసిస్తూ మేధావి అయి, జ్ఞాన (Theoretical) - విజ్ఞాన (Practical) తత్పరుడై, ధాన్యముయొక్క పొట్టు వదలి బియ్యమును తీసుకొను విధముగా, గ్రంథము క్రమంగా వదలి, జ్ఞాన-విజ్ఞాన సంబంధమైన సారమును మాత్రమే స్వీకరించు గాక! అట్టివాడే మేధావి. |
| **గవాం అనేక వర్ణానాం, క్షీరస్య అపి ఏక వర్ణతా,<br>క్షీరవత్ పశ్యతి జ్ఞానం<br>లింగినస్తు గవాం యథా<br>జ్ఞాననేత్రం సమాధాయ<br>స మహత్ పరమం పదమే॥** | అనేక రంగులు గల ఆవులు ఉండవచ్చు గాక! అవి ఇచ్చే పాలు మొత్తం తెలుపు రంగులో ఉంటాయి. అనేక శాస్త్రములు, గురువులు ప్రసాదిస్తున్న జ్ఞానసారము ఏకమగు ఆత్మజ్ఞానమే। జ్ఞాన నేత్రంతో అవన్నీ దర్శించి స్వీకరించుచు ఆ మహత్ **ఆత్మపదము**ను సిద్ధించుకోవాలి. |
| **నిష్కళం నిశ్చలం శాంతం<br>బ్రహ్మ అహం ఇతి సంస్మరేత్ ఇతి।<br>ఇతి ఏకం పరంబ్రహ్మ రూపం<br>సర్వ భూత అధివాసం<br>తురీయం జానీతే<br>సో అక్షరే పరమే వ్యోమన్ అధివసతి** | "నిష్కళంకము, నిశ్చలము, పరమశాంతము - అగు బ్రహ్మమే నేను" - అనియే సంస్మరిస్తూ ఉండాలి. స్ఫురణ కలిగి ఉండాలి.<br>అట్టి పరంబ్రహ్మము సర్వజీవుల అంతరమున నివాసము కలిగి ఉన్నది. అట్టి తురీయమును ఎవడు తెలుసుకుంటాడో, అట్టివాడు సర్వ క్షరములను జయించి అక్షర పరమాకాశమును స్వరూపముగా పొందగలరు. |
| **య ఏతాం విద్యాం తురీయాం<br>బ్రహ్మయోని స్వరూపాం<br>తామ్ ఇహ ఆయుషే<br>శరణం అహం ప్రపద్యే॥** | "ఎవరైతే బ్రహ్మయోని స్వరూపమగు '**తురీయము**'ను స్పష్టముగా తెలుసుకొని ఉంటారో, అట్టి మహనీయులను **తురీయవిద్య** కొరకై నేను శరణు వేడుచున్నాను". |

| | |
|---|---|
| 4. **ఆకాశాత్ అనుక్రమేణ సర్వేషాం వా<br>ఏతత్ భూతానాం ఆకాశః<br>పరాయణగ్ం సర్వాణి హవా** | **"ఆకాశాత్ వాయుః। వాయోః అగ్నిః। అగ్నేః ఆపః। ఆపః పృథివీ"** అను అనుక్రమణమును (ఉపనిషత్ వాణిచే చెప్పబడిన పాంచభౌతిక నామరూపాత్మక దృశ్యముయొక్క ఉత్పత్తి వివరణ వాక్యమును) అనుసరించి, - ఈ సమస్త భూతజాలము (జీవజాలమంతా కూడా) ''ఆకాశము'' నుండే పరాయణము (జనించటము, బయల్వెడలటము) జరుగుతోంది. |
| **ఇమాని భూతాని ఆకాశాత్ ఏవ జాయంతే।<br>ఆకాశ ఏవ లీయంతే<br>తస్మాత్ ఏవ జాతాని జీవన్తి।<br>తస్మాత్ ఆకాశజం బీజం వింద్యాత్।** | ఈ భూతజాలమంతా 'ఆకాశం'లోనే జనిస్తూ, తిరిగి 'ఆకాశము'నందే లీనము పొందుచున్నది. ఆకాశమునందే (జనన-విలీనముల మధ్య) జీవిస్తున్నాయి.<br>"ఆకాశమే ఈ సమస్తమునకు బీజము'' - అని తెలుసుకొనబడు గాక! ఎరుగబడు గాక! |
| **తత్ ఏవ ఆకాశపీఠం స్పార్శనం పీఠగ్ం తేజః<br>పీఠం అమృతపీఠం రత్న పీఠం జానీయాత్<br>యో జానీతే సో అమృతత్వం చ గచ్ఛతి।** | అట్టి ఆకాశ పీఠము - స్పార్శనం పీఠము, తేజో పీఠము, అమృత పీఠము, రత్న పీఠము అని ఎరుగబడు గాక। ఆ విధంగా ఎరగటంచేత అట్టివారు "అమృత స్థానము''నకు చేరుకొనుచున్నారు. |
| **తస్మాత్ ఏతాం తురీయాగ్ం<br>శ్రీకామ రాజీయాం ఏకాదశధా భిన్నాం,<br>ఏకాక్షరం బ్రహ్మ ఇతి యో జానీతే<br>స తురీయం పదం ప్రాప్నోతి<br>– య ఏవం వేద** | జాగ్రత్ స్వప్న సుషుప్తులతో సహా ఈ సమస్తము తురీయపురుషుని ఇష్టా చమత్కార ప్రదర్శనమే।<br>అట్టి "తురీయగ కామరాజీయము'' '11' రకములుగా (పంచ ప్రాణ-పంచేంద్రియ - జీవాత్మ సమేతంగా) భిన్న భిన్న రూపములు దాల్చుచున్నది.<br>ఇదంతా కూడా సర్వదా **'ఏకము, అక్షరము'** అగు బ్రహ్మమే అయి ఉన్నది.<br>ఈ పరమ సత్యము ఎరిగినవాడు 'తురీయ పదము'ను స్వాభావికంగానే పొందుచున్నాడు. |

**ఇతి - త్రిపురా తాపిణ్యుపనిషత్ - పంచమోపనిషత్**

**త్రిపురా తాపిన్యుపనిషత్ సమాప్తా**

ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥

అథర్వణ వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 23 త్రిపురాతాపిన్యుపనిషత్

## (త్రిపురా తాపినీ మహోపనిషత్)

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన వచన పుష్పము

"త్రిపురా తాపినీ విద్య"చే ఏ చిచ్ఛక్తి (చిత్ శక్తి) విగ్రహము (తత్త్వము) – "వస్తుతః చిన్మాత్రరూపం"గా (The Form of mere Absolute Awareness) విశదీకరించబడుతుందో, అట్టి "పరతత్త్వము"ను ఉపాసించుచున్నాము.

### త్రిపుర తాపిన్యుపనిషత్ – ప్రథమోపనిషత్

భగవానుడగు పరమశివుడు కేవలుడు, నిష్క్రియుడు, సమస్త విషయాతీతుడై బ్రహ్మానందమయుడై ఉన్నారు. ఆయన నిర్విషయానందుడై ఉండియే – లీలగా, క్రీడగా, వినోదముగా మూడు రూపములు ధారణ చేస్తూ ఉంటున్నారు.

**1. ప్రజాపత్యము:** (కల కనేవాడు కలలో అనేకమందిని కల్పించుకొని, వారందరితో వ్యవహరిస్తున్న తీరుగా) – సృష్టిలో అనేకమంది జీవాత్మల కల్పన (తనకు అనన్యముగా) కల్పించుకొంటున్నారు.

**2. వైష్ణవం :** (జలము తనయందు తరంగములను కొనసాగిస్తూ ఉన్న తీరుగా) ఆ జీవుల పరిపోషణను కొనసాగిస్తూ ఉన్నారు. సమస్త జీవులలో అంతర్లీనులై ఉంటున్నారు.

**3. విలయం :** (ఆలోచన బయలుదేరి, కొనసాగి – తిరిగి ఆలోచించువానితో లయము పొందు తీరుగా) సమస్తము సర్వాత్మకుడు, స్వస్వరూపుడు అగు శివభగవానునియందే విలయము పొందుతోంది.

ఈవిధంగా త్రి (3) కారణరూపములను ధరించుచున్నారు (ఆశ్రయిస్తూ ఉన్నారు).

"త్రిపుర అభిధా భగవతి" అనబడే తనయొక్క ఆదిశక్తి **"భూ । భువః । సువః** (Matter, Thought, Self) " అనబడే త్రిరూపములను, స్వర్గ–భూ–పాతాళములు – అనబడే త్రిపురములను ధరిస్తోంది. హర మాయాత్మిక (శివుని స్వయంభావిత మాయాత్మిక) అయి తన స్వరూపమును సర్వత్రా నింపినదై ఉన్నది. ఆ హృల్లేఖ్య (శివుని హృదయేశ్వరి) అయినట్టి ఆ దేవి తనయొక్క "హ్రీం" కారముతో భగవతి అయి ఉన్నది. $\Delta$ త్రికూట శిఖరమే తనయొక్క నిలయమై (స్థానము కలిగి ఉన్నదై), తనయొక్క మహత్తరమైన, ఘోరమైన తేజస్సుతో (జాగ్రత్–స్వప్న–సుషుప్తులు తనవే అయి ఉన్న నేనుగా) వ్యాపించినదై ఉన్నది.

ఈవిధంగా ఆ భగవతి "త్రిపుర" అని **వ్యాపత్యతే** – అధ్యయనపూర్వకంగా స్తుతించబడుతోంది.

**త్రిపదా గాయత్రి**

**1. తత్సవితుర్వరేణ్యం। (తత్ సవితుః వరేణ్యం)**

**2. భర్గో దేవస్య ధీమహి। (8)**

**3. ధియో యోనః ప్రచోదయాత్ (8)**

ఇవి గాయత్రి యొక్క **మూడు పాదములు.**

ఇక **4వ పాదము: పరో రజసే సావదోం** (సమస్తమునకు ప్రేరేపన స్వరూపిణి). 4 పాదములతో సమగ్రమైన స్వరూపమునకు సంజ్ఞ – "ఓం".

## అమ్మవారి ఉపాసనా మహా మంత్రములు

**జాతవేదసే సునవామ సోమం అరాతీయతో నిదహాతి వేదః।** *దేవి యొక్క **'జ్ఞానాగ్ని'**ని మాయందు వెలిగించటానికై మేము **'సోమము'**ను సమర్పిస్తూ ఉన్నాము. **"వేదము"** (తెలియబడుచున్న సమస్తము కూడా) ఆ దేవి యొక్క తేజోరూపముచే దహించబడుచున్నది. మాతా! అజ్ఞానము యొక్క వీచికలైనట్టి మాయొక్క **'కర్మలు'** అనే కట్టెలు దహించబడి, **'జ్ఞానాగ్ని'** మాయందు వెలుగొందును గాక!*

**స నః పరుషదతి దుర్గాణి విశ్వా నావ ఇవ సింధుం దురితా అతి అగ్నిః।** *సముద్రములో మునిగిపోకుండా 'నావ' ఉపకరణము అయి సముద్రమును దాటివేయించు తీరుగా, అగ్ని దేవుడు (జాతవేదుడు) మమ్మల్ని సమస్త క్లేశములనుండి, దురితములనుండి తప్పిదముల నుండి కాపాడుదురు గాక!*

---

**ఓం। త్ర్యం బకం యజామహే, సుగంధిం, పుష్టి వర్ధనమ్।** *ఉత్తమ గంధమును-పరిమళములను వెదజల్లువాడు, పుష్టిని వృద్ధి (వర్ధనము) చేయువాడు అగు (భూత-చిత్త-చిత్ ఆకాశములను ఆక్రమించుకొని ఉన్నట్టి) త్ర్యంబకుని (త్రినేత్రుడిని) – **"యజామహే"** – ఆరాధిస్తూ ఉన్నాము. ఉపాసిస్తున్నాము. పూజిస్తూ ఉన్నాము.*

**ఉర్వారుకమివ బంధనాత్ మృత్యోః ముక్షీయ।** *దోసపండును తొడిమనుండి వేరు చేయునట్లు, ఆ శివభగవానుడు మమ్ములను **'మృత్యువు'** నుండి వేరు చేసెదరు గాక।*

**మా అమృతాత్।** *'అమృతము' నుండి వేరు కాకుండా పరిరక్షించెదరు గాక!*

## త్రిపురా తాపినీ విద్య।

త్రిపురా విద్య ఈ విధంగా అభివర్ణించబడుతోంది.

## ప్రప్రథమ స్వరూపిణీ – 'శతాక్షరీ'

**శతాక్షరీ।** పూర్ణమైన అక్షర స్వరూపిణీ! **పరమా విద్యా!** ఈ జీవుని కేవల-పర (సమస్తమునకు ఆవలిదగు) పరమా విద్యా స్వరూపిణీ! **త్రయీమయీ!** (సత్వ రజో తమో) – **త్రిగుణాత్మకా!** (భూత-వర్తమాన-భవిష్యత్) త్రికాల, (స్వర్గ భూ పాతాళ), (జాగ్రత్-స్వప్న-సుషుప్తి) త్రి అవస్థా, (జీవ-ఈశ్వర-పర) త్రిమూర్తీ స్వరూపిణీ! **స అష్టార్ణా!** (అర్ణము, తరంగము) (పంచభూతములు, మనో బుద్ధి చిత్తములు అనే) ఎనిమిది తరంగములుగా విశ్వమునందు ప్రవహించు దేవీ! **త్రిపురా!** (జాగ్రత్ స్వప్న సుషుప్తులనే) త్రిపురములను పాలించు త్రిపురేశ్వరీ! దృశ్యము-ద్రష్ట-దృక్ త్రిరూపములుగా విస్తరించియున్న – త్రిపురేశ్వరీ! పరమేశ్వరీ! సమస్తము 'తానే' అయి, అట్టి సమస్తమునకు 'పరము' (Beyond) అయినట్టి ఈశ్వరీ!

**ఆద్యాని చత్వారి పదాని పరబ్రహ్మ వికాసినీ।** మొట్టమొదటే ఏర్పడి ఉండి (జాగ్రత్-స్వప్న-సుషుప్తి-తురీయములని పిలువబడే) **4 పదములను** పరబ్రహ్మ స్వరూపిణిగా వికసింపజేయుచున్న ఆది స్వరూపిణీ! పరబ్రహ్మ స్వరూపిణీ! ఇదంతా నీయొక్క ప్రప్రథమ స్వరూపము.

## ద్వితీయాని – "శక్త్యాఖ్యాని"।

ఏకము, అఖండము అగు పరబ్రహ్మ స్వరూపము నుండి ఆ దేవాదిదేవి – ద్వితీయమైన (As 2nd) "శక్తి"గా ప్రదర్శనమగుచున్నది.

పరబ్రహ్మము + శక్తి।
పురుషుడు + ప్రకృతి।
నేను + నాది / నాయొక్క।
కేవల స్వరూపిణి + సందర్భ స్వరూపిణి।

# తృతీయాని - "శైవాని"।

అట్టి దేవియొక్క శివ + శక్తి ద్వయము సుఖ, శుభ, శాంతి, ఐశ్వర్య, ఆనందరూపమగుచున్నది. 'శైవము'గా - ఆ దేవియే అఖండాత్మ నుండి మూడవ తత్త్వమై బయల్వెడలుతోంది.

అట్టి శివశక్తి శైవము నుండియే →

- [(సప్త (7) అధో లోకములైనట్టి - అతల, వితల, సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళ లోకములు, సప్త (7) ఊర్ధ్వలోకములైనట్టి - భూ, భువః, సువః, మహః, జనో, తపో, సత్య లోకములు] - అనబడే - **14 లోకములు,**
- (ఋక్-యజుః-సామ-అథర్వణములనబడే) **చతుర్ (4) వేదములు,**
- సమస్త **శాస్త్రములు, పురాణములు,** (మను ధర్మము, ఆర్ష ధర్మము, పారాశర్య సంహిత మొదలైన లోక-క్షేమ సంబంధమైన) **ధర్మశాస్త్రములు,**

ఇవన్నీ కూడా చికిత్సతముగా (ప్రతిక్రియగా) - నిర్మితమై దేవీ తేజస్సుచే సృష్టియందు ప్రక్షిప్తం అయినవగుచున్నాయి.

ఇవన్నీ సంసార రోగ చికిత్సగా అమ్మవారిచే లోకములకు ప్రసాదించబడుచున్నాయి.

ఆ జనని "జ్యోతి" స్వరూపిణి అయి తనయొక్క శివశక్తి యోగంచేత ఇక్కడ ఘటనా అఘటనములన్నీ నవలా రచయితవలె రచిస్తూ జగన్నాటకమునకు కారణమై ఉంటోంది. ఘటనాఘటన విభూతులను సంప్రదర్శనము చేస్తోంది.

[ఘటన = Incidental (ప్రతిబింబము)     అఘటన = Non-Incidental (దర్పణము)]

| అట్టి పరము (Beyond and Prior to all), గహ్వరము (ఇహము, అపరము)ల గురించి ఆయా కొన్ని విశేషాలు ఇప్పుడు వ్యాఖ్యానించుకుంటున్నాము. |
|---|

## అమ్మవారి తత్ స్వరూపము (లేక) పరస్వరూపము

అది 'మహాన్' మను స్వరూపము. (విశ్వమంతా తానై, సమస్తమునకు 'వేరు' అయినట్టి) "తత్"ను తన స్వరూపముగా కలిగి ఉన్నట్టిది. 'బ్రహ్మము' అని శాస్త్రములచే ఎలుగెత్తి గానము చేయబడుచున్నట్టిది. త్రికాలములకు ఆవలిదై శాశ్వతమైనట్టిది. పాత్రధారుని నాటకమునకు, ఆ పాత్రధారుని నాటకమునకు సంబంధించని సహజరూపముల భేదము వలె - ఈ జగన్నాటకమునకు రచయితగా 'పరము' స్వరూపముగా కలిగియున్నట్టిది. (నాటకములోని పాత్రా విశేషాలు = ఘటన. పాత్రకు వేరైన నటుడు = అఘటన).

సమస్తమునకు వెలుగు (Enlightenment)గా "భగవాన్" స్వరూపిణి. సమస్త లక్షణములకు ఆవల నిర్లక్షణము (విలక్షణము) అయినట్టిది. (ఎట్టి దోషములు స్పర్శించని) **నిరంజన స్వరూపిణి.** ఉపాధికి వేరైనట్టి (దేహిగా) నిరుపాధిక స్వరూపిణి। ఆధిరహితము (మనో దోష రహితము) అయినట్టి దేవాదిదేవి। శివస్వరూపిణి।

ఈవిధంగా **'మహాన్', 'బ్రహ్మము', 'రచయిత', 'చేతనరూపిణి'** అయినట్టి శ్రీ త్రిపుర సుందరీ దేవి ఇంకా కూడా ఎటువంటిదంటే-

**నిరుపాధి :** ఈ బ్రహ్మాండమంతా ఆ దేవియొక్క "ఉపాధి"యే అయి ఉంటూనే, ఆ తల్లి నిరుపాధి. 'ఉపాధి'కి వేరై, ఉపాధిలపై ఆధారపడనట్టి ఉనికి కలిగినది. నిరుపాధికము. (ఉపాధి = Something under usage).

**'ఆధి' రహిత :** జగత్తులను కల్పిస్తూ వినోదిస్తూ ఉన్నప్పటికీ, జగత్తుపట్ల మానసికమైన "వ్యసనము, ఆధారపడటము" అను ఆధి (మనోవ్యాధి) లేనట్టిది. మనస్సు ఆ త్రిపురేశ్వరికి స్వయంగా నియమించుకొన్న ఉపకరణమేగాని, మనస్సుచే బంధింపబడునది కాదు. అందుచేత ఆధి (వ్యధ, ప్రత్యాశ) లేనట్టిది.

**ఉన్మీల్యతే పశ్యతి :** ఈ విశాల విశ్వమంతా ఆ జగన్మాతయొక్క **"కనులు తెరచి చూడటము"** అనే చమత్కార రూపమే! ఈ జగద్దృశ్యమంతా ఆ తల్లియొక్క దర్శన (Perceiving) ప్రదర్శనమే।

**వికాసతే చైతన్య భావమ్।** : ఆ దేవియొక్క చైతన్య భావనయే ఈ సమస్తములుగా వికసిస్తూ ఉన్నది. ఈ లోకములు, లోకపాలకులు, లోకులు - ఇదంతా ఆ మాతయొక్క చైతన్య భావనా వికాసమే (Manifestation of Her own enlightenment of feeling).

**కామయత ఇతి** : ఆ దేవియొక్క "ఇష్టము" చేతనే, ఈ సమస్తము వెల్లివిరుస్తోంది. అందుకే కామాక్షీదేవిగా మనము ఉపాసిస్తున్నాము. ఆ మాతయొక్క కోరికను అనుసరించియే ఈ జగన్నాటకమంతా ప్రదర్శనమగుచున్నది. సమస్త జీవులందు, సమస్తమునందు **"నా యిష్టము"** అను రూపముగా ప్రదర్శనమగుచున్నది ఆ త్రిపురసుందరియే.

**స ఏకో దేవః శివరూపీ।** : అనేకముగా కనిపిస్తూ ఉన్న ఈ జగత్తులో **"ఏక-శివ"** రూపిణియై విరాజిల్లుచున్నది. 'ఏకోదేవః' అగు శివస్వరూపిణి అగుచున్నది.

**దృశ్యత్వేన వికాసతే।** : "దృశ్యము"గా కనబడేదంతా ఆ దేవి యొక్క దృశ్యత్వ వికాసమే। ద్రష్ట-దృశ్య సంబంధ చమత్కారమే।

**యతిషు యజ్ఞేషు యోగిషు కామయతే కామం జాయతే।** : ఈ సమస్తము స్వస్వరూపముగా దర్శిస్తూ వినోదించు యతులందు, యజ్ఞములందు, యోగాభ్యాసపరులగు యోగులందు - వారి ఇష్టరూపముగా, లక్ష్యముగా ఏర్పడి ఉన్నది ఆ ఆనందవల్లీ దేవియే। కోరికలు గలవారియందు 'కోరుకొనుట' అనే **"కామయతే కామ"** రూపమై ప్రదర్శనమగుచున్నది.

**నిరంజనో, అకామత్వేన విజృంభతే।** : సమస్త జీవులలో కామయతే కామరూపిణి అయి ఉండియే, సర్వదా సర్వత్రా నిత్య నిర్మలమై, అకామ స్వరూపముగా (నిర్మల నిర్గుణ చైతన్యముగా) విజృంభించుచున్నది.

"అ క చ ట త ప" యశాన్ సృజతే। "క్+అ", "చ్+అ", "ట్+అ", "త్+అ", "ప్+అ" అనే హల్లుల - అచ్చుల కలయికతో ఏర్పడేవన్నీ ఆ మాతయొక్క కంఠ (శబ్ద) సౌందర్యములే.

## అక్షర ఉచ్చారణ విశేషములు

| | |
|---|---|
| **సరళములు** = 'క' 'చ' 'ట' 'త' 'ప' | **అల్పప్రాణములు** = 'య' 'ర' 'ల' 'వ' |
| **ఆదేశ సరళములు** = 'గ' 'జ' 'డ' 'ద' 'బ' | **ఇక్కులు** = 'ఇ' 'ఉ' 'ఋ' 'ఒ' అను నాలుగు అక్షరములు |
| **అచ్చులు, ఆదులు** = 'అ' నుండి 'ఔ' వరకు వర్ణనములు (16 అక్షరములు) | **'ఏ'త్వము, 'ఐ'త్వము, 'ఓ'త్వము** |
| **హల్లులు** = 'క' నుండి 'హ' వరకు (వ్యంజనములు అని కూడా పేరు) | **ఓష్ఠ్యములు (పెదవులతో ఉచ్చరించేవి)** = ఉ ఊ ప ఫ బ భ మ |
| **స్థిరాలు** = 'య, ర, ల, వ, శ, ష, స, హ, ళ' | **కంఠోష్ఠ్యములు (కంఠముతో పలికేవి)**= క ఖ గ ఘ ఙ 'హ' కారము |
| **అంతసాలు, ఘోషలు** = 'య ర ల వ' | |
| **అనునాశికములు (ముక్కుతో ఉచ్చరించేవి)** = ఙ ఞ ణ న మ (అనువర్ణములు) | **కంఠోష్ఠ్యములు (కంఠము+పెదవి)** = ఓ ఔ<br>**గతాదులు** = ఠ డ ఢ ద ధ క్ష గ జ బ మ - 10 వర్ణములు |
| **తాలవ్యములు (దవడ)తో పలికేవి** = ఇ ఈ చ ఛ జ ఝ ఞ య శ | **తురీయ వర్ణములు/వర్ణ చతుర్థ వర్ణాలు** = ఘ ఝ ధ భ |
| **తృతీయలు వర్ణములు** = 'గ జ డ ద బ' అను సరళ వర్ణములు | **త్రికము** = ఆ (దూర నిర్దేశ సర్వనామము),<br>ఈ (సమీప నిర్దేశ సర్వనామము),<br>ఏ (ప్రశ్నార్థక సర్వనామము) |

| | |
|---|---|
| **దంత్యములు (దంతములు స్థానముగా ఉచ్చరించే వర్ణములు)** = 'కా' కారము, 'ల' కారము, 'స' కారము త థ ధ న | **దంత్యోష్ఠ్యములు (దంతములు, పెదిమలతో పలికేవి)** = 'వ'కారము |
| **మూర్ధన్యములు (శిరస్సును నాలుకతో తాకుతూ ఉచ్చరించబడే అక్షరాలు)** = ఋ ౠ ట ఠ డ ఢ ణ ర ష | **యణ్ణులు** = 'య ర ల వ' |
| **వక్ర తమములు** = 'ఐ' 'ఔ' | **వక్రములు** = 'ఏ ఏ ఒ ఓ' |
| **వర్గ యుక్కులు, మహాప్రాణములు** = ఖ – ఘ<br>చ – ఝ<br>ఠ – ఢ<br>థ – ధ<br>ఫ – భ | **వర్ణకము** = 'డు ము వు లు' |

(పైవన్నీ అక్షర–ఉచ్చారణంగా జనించిన శబ్ద విశేషములు).

**తస్మాత్ ఈశ్వరః :** కావున ఈశ్వరియే సమస్తమైన నామరూపాత్మకంగా విస్తరించి ఉన్నది. ఈ సమస్తము ఆ జననియొక్క చిత్త (ఇచ్ఛా) విశేషమే ఇదంతా. 'కామః'లో 'క'కారముగా 'కామేశ్వరి' అను నామముచే పిలువబడుచున్నది. **కామ ఏవ ఇదం తత్ తత్ ఇతి।** దేవియొక్క ఇచ్ఛా-కల్పనలను అనుసరించి, ఆ దేవియొక్క వినోద–ఆనంద నిర్మితమే ఇక్కడి భౌతిక వస్తుజాలము. అట్టి భౌతికమైనదంతా అమ్మవారి ఇచ్ఛా (కావాలనుకొన్న) రూపమే।

పదార్థములన్నీ దేవీ ఇచ్ఛగా ఎరిగి, దర్శించువాడు, ఇక్కడి సంగతులు, సందర్భములు, అనుబంధములు, బాంధవ్యములు రూపంగా ఈ శరీరముతోను, తదితర శరీరములతోను ఏర్పడుచూ ఉన్నదంతా ఆ కామాక్షీదేవి (చిత్ శక్తి) యొక్క నాటకీయ – వినోదమే అని ఈవిధంగా తత్త్వదర్శి దేవీ – ఉపాసనా భావము స్వీకరించుచున్నాడు.

ఆతడు ఆ జగన్మాతయొక్క దర్శనము చేయుచున్నవాడే అగుచున్నాడు.

## సవితుర్వరేణ్యమ్

ఆ జగన్మాతయే "సవితుర్వరేణ్యం" – అని వర్ణించబడుతోంది. ఇదంతా "సవితుర్వరేణ్యం"।

"సత్ (ఉనికి, Being) + విత్ (ఎరుక, Knowing)"

**ఇతి 'షూన్' :** జగన్మాతయే 'సత్-విత్' స్వరూపిణి అయి, సమస్తమునకు జనని–జనించు స్థానము అయి ఉన్నది.

- షూన్ = ప్రసవము, ఉనికి–ఎరుకల మధ్య సంబంధము
- సవిత = ప్రాణులను కనుచున్నవాడు.
- శక్తి = కనుచుండటము

— **త్రిపురాశక్తి**

ఆ దేవియే త్రి ప్రదర్శనములు కారణంగా **"త్రిపురా పరమేశ్వరి", "మహాకుండలినీ దేవి"** అని పిలువబడుతోంది.

అట్టి దేవియొక్క తేజోరూపమైనట్టి "జాతవేదస మండలము"ను ఎవ్వరు ఉపాసిస్తారో, అట్టివారు తమయొక్క సర్వత్రా వ్యాప్యత్వమును అనుభవముగా పొందగలరు. (ద్రష్ట–దర్శన–దృశ్యములతో కూడిన) త్రికోణశక్తిని అధిగమించి, సాక్షీరూపమగు 'ఏ' (ఆవల గల కేవల సాక్షిత్వ) కారణత్వము సిద్ధించుకోగలరు. అట్టి 'ఏ'కారత్వమే గ్రహించవలసినది, వరేణ్యము (ఉపాసించవలసినది), శ్రేష్ఠము, భజించవలసినది కూడా.

అందుచేత అట్టి ఏకారత్వమునే సర్వత్రా, సహజీవులందరిలో చూస్తూ, స్తుతిస్తూ, గ్రహించవలసినది. దేవీతత్త్వమును ఎరిగినవాడు 'ఏ'కార (సాక్షీ) తత్త్వమును స్వస్వరూపముగా స్వీకరించగలడు.

## భర్గో దేవస్య ధీమహి – వ్యాఖ్యాస్యామః

ఇప్పుడు "భర్గో దేవస్య ధీమహి" అను దాని గురించి వ్యాఖ్యానించుకుందాము.

**"ధ"** – అనగా "ధారణ"।

**"ధీ"** – బుద్ధి చేతనే 'ధారణ' చేయబడుతోంది.

**"భర్గో దేవో"**– భగవానుడగు పరమేశ్వరుడే సమస్తమును వెలిగించుచు 'భర్గోదేవుడు' అయి ఉన్నారు. (One who enlightens everything else). ఆ పరమేశ్వరియే ఇహము – పరములకు (Here what I am - Originally what I am లకు) 'మధ్యవర్తి'. జాగ్రత్-స్వప్న సుషుప్తులకు ఆవలి, అవన్నీ తనవైనట్టి అక్షరమగు **'తురీయుడు'**. సాక్షాత్ తురీయము. సర్వత్రా విస్తరించి **'సర్వము'** అయి ఉన్నట్టిది.

## "తుః" : "ఈ" : "యమ్"

'ఈ' కారము 'మధ్యవర్తి' వలె పరమేశ్వరి కూడా సమస్తమునకు మధ్యవర్తియే. అట్టి మధ్యవర్తిత్వమే "భర్గో రూపము" – అని వ్యాఖ్యానించబడుతోంది.

అందుచేత **"భర్గో దేవస్య ధీమహి"** అను మంత్ర వాక్యము పలుకుతూ **"ఏకము-అక్షరము అగు ఆత్మయొక్క మహిమను స్తుతిస్తున్నాము"** – అను ఉద్దేశ్యమును ఆశ్రయించి ఉండాలి.

### 'మహీ'తి అస్య వ్యాఖ్యానం।

***"మహ్వత్వం, జడత్వం, కాఠిణ్యం"*** ఈ మూడు కూడా ఏ అక్షరమునందు ఏర్పడి ఉన్నదో, – అదియే **"మహి"**.

'ల'కారము = పరంధాముని కాఠిన్య-అర్థమును సూచించునది. ఆయనయొక్క కాఠిన్యమే (The Solidness): –

– సాగరములతో (సముద్రములతో కూడిన)

– పర్వతములతో కూడిన, సప్త ద్వీపములతో కూడిన, అరణ్యములతో కూడిన **ప్రకాశరూపము** (Manifesting form).

'ల'కార మండలరూపమే ఈ పృథ్వి (భూమి).

"ఈ భూమి అంతా ఆ దేవీ మహత్మ్యమే" అని దేవీతత్త్వవేత్తల ప్రవచనము.

## ధియో యోనః ప్రచోదయాత్

ఈ మంత్రము పరమాత్మ అగు పరమశివుని ఆధిభూతత్వమును స్తుతిస్తోంది. సమస్తమునకు ఆయన పరము (Beyond, ఆవల) అయి ఉండియే, దీనికంతటికీ ప్రకాశమానుడు. మార్పు చేర్పులు లేని స్థానువు (Constant) అయి ఉన్నవారు.

"ల"కారముచే జ్యోతిర్లింగ స్వరూపుడగు (జ్యోతి చిహ్నముగా సూచించబడు) ఆ పరమశివ భగవానుడు మాయొక్క – ధియః – బుద్ధులను –

- భగవత్ ధ్యానమునందు, ధ్యానేచ్ఛయందు
- నిర్వికల్పమునందు

→ **ప్రచోదయాత్।** – ప్రేరేపించెదరు గాక।

**– ఇతి ఉచ్చస్వర రహితం, చేతసైవ చింతయిత్వా, భావయేత్।** ఈ విధమైన "స్వామీ! మా బుద్ధిని ఆత్మ భావనవైపు ప్రేరేపించండి" – అనే మంత్ర-మంత్రార్థములను పెద్ద గొంతుకతో కాకుండా, (నిశ్శబ్దంగా) – బుద్ధితో చింతనచేస్తూ, మనస్సుతో భావన చేయాలి.

---

***ఆ దేవ దేవి!***

- పరోరజము (మన పరస్వరూపము) అను తత్–అవసానమున ప్రకాశించుచున్న పరంజ్యోతి. అత్యంత అమలము (స్వచ్ఛమైనది). సమస్తమును 'చేతనము' (Inspired) గా చేస్తున్న చిత్–చైతన్య స్వరూపిణి. 'చిత్' లింగ స్వరూపిణి.
- హృదయము అనే ఆగారములో (గృహములో) సదా నివసించునది.
- 'హ్రీం' మొదలైన బీజాక్షర సంపుటిలచే **'వాక్ భవ కూటము'** వాక్కు యొక్క జనించు స్థానము.
- 'ఓం ఐం హ్రీం క్లీం శ్రీం' అను పంచాక్షర స్వరూపిణి.
- ఇక్కడి ఆకాశము–వాయువు–అగ్ని–జలము–భూమి అనబడే పంచభూతములకు – **పంచభూత జనకము** – జనక స్థానము, జనింప జేయునది.
- (శబ్ద–స్పర్శ–రూప–రస–గంధములు) (దృశ్యము–ఇంద్రియములు–దేహము–జీవుడు–పరమాత్మ) (భూతకాల– వర్తమానకాల–భవిష్యత్‌కాల–కర్మ ఫలములు అనే) పంచవిధములైన రీతులుగా – **పంచకలాత్మకము, పంచకలామయము.**
- సర్వదా సర్వత్రా వ్యాపించి యున్నది.

అట్టి బాలత్రిపుర సుందరీ స్వరూపమును ఎరిగినవాడే జగన్మాత తత్త్వమును ఎరిగినవాడు.

ఆ దేవి – సమస్తము తన 'ఇచ్ఛ'గా కలిగి ఉండటంచే **"కామ కళాభూతమైన కామకూటము"** (The Root of the Desire to have all these dramatic events of this world) – అని చెప్పబడుతోంది.

| | | |
|---|---|---|
| (ఓం) | తత్ సవితుః వరేణ్యం భర్గోదేవస్య ధీమహి | 16 |
| | ధియో యోనః ప్రచోదయాత్ | 8 |
| (ఓం) | ఆపోజ్యోతి రసోమృతం। | 8 |
| | "ఓం" | 32 |

ఈ 32 అక్షరములను 'ఓం'తో జోడించుచూ, పఠించాలి.

**"తత్"** = పరమాత్మ। సదాశివుడు। 'ఓం'।
అక్షరము। విమలము। ఉపాధికి ఆతీతమై 'నిరుపాధికము'।

అట్టి 'తత్'తో 'సో౭హం' లోని 'సో'గా భావించాలి.

"హ"కారాక్షరం = శివరూపం. నిరక్షరము. అక్షరము కూడా!

***తత్సవితుః తత్ సరాగ వ్యావృత్తిం ఆదాయ, శక్తిం దర్శయతి తత్సవితుః ఇతి।*** తత్ 'స'విత్‌లోని సరాగమును వృత్తిగా స్వీకరించి, 'శక్తి'గా భావించాలి.

పూర్వ (తూర్పు) మార్గంగా సూర్యుని, ఆ క్రిందగా చంద్రికను 'శ్రీచక్రము'లో లిఖించాలి.

**"మూలాధార చక్రము"** నుండి **"బ్రహ్మరంధ్రము"** వరకు సాక్షరము, అద్వితీయము గురించి శ్రీచక్రము సూచించుచున్నది.

## శివ శక్త్యాత్మకమ్

***భగవంతం దేవగ్ం శివ–శక్త్యాత్మకమ్ ఉదితమ్।*** దేవ దేవుడగు పరమాత్మ **"శివ"** – **"శక్త్యాత్మకము"**గా ఉదయించుచున్నారు.

అయం "శివో" – శివుడు → పరమదైవము.

ఆయన శక్తియే – ఈ జీవజాలమంతాగా ప్రదర్శనమగుచున్నది.

సూర్య – చంద్రమస యోగముచే ఏర్పడుచున్న 'తత్' పదమే "హంస" అనబడుతోంది.

ఆ పరమ శివస్వరూపునినుండి "సృష్టి సంకల్పము" అనే కామము బయల్వెడలుటచే 'కాముడు' అని స్తుతించబడుచున్నారు. అట్టి 'క' వర్ణము బయల్వెడలుచున్న మూలా స్వామి అగు కామదేవుడు ఉపాసనకు విషయమై "భర్గ" – అనబడుచున్నారు.

**'తత్ సవితుః వరేణ్యం భర్గో దేవః'** ఈ మంత్రము క్షీరము (పాలు) వలె సేవించాలి. దీనిచే అక్షరము (క్షరమనునదే లేని సహజ స్వరూపమగు పరబ్రహ్మము) ఆరాధించబడుతోంది. మధుఘ్నముతో కూడినది.

(1) పరమాత్మలో (2) జీవాత్మ యోగము అనునదే – "తత్" అను శబ్దార్థము.

మూడవ (3) అక్షరము = "హ" అనబడుచున్నది.

"హ" అక్షరార్థము = పరమశివుడు

ఆయనయే ఎట్టి దోషములు స్పృశించని నిష్కల్మషుడు.

ఆ దేవదేవుడు ఆది – అంతములకు ఆవల దివ్యరూపుడుగా వ్యాకరించబడుచున్నది (నిర్ణయించబడుచున్నది).

అట్టి పరమపదము (శివపదము) యొక్క ధారణమే 'ధి' – అను అక్షరముగా చెప్పబడుతోంది. జడత్వ ధారణము – 'మహి' శబ్దముగా అనబడుతోంది.

'మహి' ఇతి 'ల' కారః। 'ల' అనే అక్షరము 'మహిమ'కు సంజ్ఞ.

'ల'కారార్థము = **అంత్యమ్ సృష్టమ్।** ఈ సమస్తమునకు ఆవలగల అక్షరము – **"పరమ చైతన్యము"**.

**ధియో యోనః ప్రచోదయాత్।** పరో రజసమును (లేక) పరతత్త్వమును స్పష్టపరచ వేడుకొనుచున్నాము. ఆవలి స్వస్వరూపమే 'ఓం' అను అక్షరముతో ఉపాసించబడుతోంది.

కూటము = పద్మము (కామకలాలయము శ్రీచక్రములోని కూటము).

ఈ మంత్రోపాసన, కూటము, కామకలాలయము. షడధ్వపరివర్తకుడు ('6' చక్రములను దాటించి) బ్రహ్మరంధ్రము ద్వారా "ఈ సమస్తము నాలోని నేనైన నేను" – అను సహస్రారమునకు జేర్చుచున్నది. అట్టి స్థానమును సుస్థీకరించుకొను స్థానము – "వైష్ణవ స్థానము" అని, "పరంధామము" అని కూడా పిలువబడుతోంది.

32 అక్షరముల గాయత్రి : "ఓం భూర్భువస్సుః (4), తత్సవితుర్వరేణ్యం (7), భర్గో దేవస్య (5), ధీమహి (3), ధియో యోనః (4) ప్రచోదయాత్ (4) ఓం ఆపోజ్యోతిః।" (5).

ఈ మంత్రార్థమగు ఆత్మనుండి "శక్తి కూటము" (The original source from where energy stems out).

దేని నుండి 'ఆకాశము', ఆకాశము నుండి వాయువు స్ఫురిస్తున్నాయో అదియే వరేణ్యము (స్తుతించవలసినది, ఉపాసించవలసినది). **అధీనం।** ఆశ్రయించవలసినది.

'సవితుః' – ఎద్దాని నుండి జీవాత్మ–పరమాత్మలు ఉభయము సముద్భవిస్తున్నాయో (జనిస్తున్నాయో), వారే సవిత్రు భగవానుడు. సత్–విత్–ఋత్ స్వరూపుడు. ఈవిధంగా "సవిత్ృ" శబ్దము గురించి ఎరిగినవాడు 'జీవాత్మ'గా కనిపిస్తున్నదానియొక్క అక్షర–స్పష్టమును పొందగలడు.

**భర్గోదేవస్య 'ధీ' – ఇతి।** సమస్తమునకు ఆధారరూపమైనట్టి "శివాత్మాక్షరము"గా గణింపబడుతోంది (నిర్ణయించబడుతోంది).

'మహి' – మొదలైనదంతా అశేషమైన, కామ్యరూపమయినట్టి రమణీయమైనట్టి **"శక్తి కూటము"**గా స్పష్టీకరించబడుతోంది.

| | | |
|---|---|---|
| ఈవిధంగా | తత్సవితుర్వరేణ్యం | (7) |
| | భర్గో దేవస్య | (5) |
| | ధీ మహి | (3) |
| | | 15 |

త్రైపురస్వరూపమగు పై **పంచదశాక్షరీ మంత్రము**ను ఎవరు ఉపాసిస్తారో, అట్టివారు తాము కోరుకొన్నవన్నీ పొందగలరు. **స సర్వాన్ కామాన్ ఆప్నోతి।** వారు సర్వభోగములు పొందగలరు. **స సర్వాన్ భోగాన్ అవాప్నోతి।** వారు సర్వ లోకములు జయించగలరు. **స సర్వాన్ లోకాన్ జయతి।** వారు సమస్త వాక్కులను బలపూర్వకంగా విజృభించి పలుకగలరు. **స సర్వాన్ వాచో విజృంభతి।** అట్టివారు (లఘువు అగు సమస్తమును అధిగమించి) గురుత్వమును పొందగలరు. **స గురుత్వం ప్రాప్నోతి।**

వారు వైష్ణవ ధామమును (విష్ణు గ్రంధిని) కూడా ఛేదించి పరబ్రహ్మమును పొందగలరు.

# శ్రీ చక్రంలో ధామములు

**ప్రథమ ధామము** : ఈవిధంగా 'ఆద్యా విద్య'ను పూర్వ మనువు చెప్పియున్నారు. ఇది ప్రథమ ధామము.

**ద్వితీయ ధామము** : శక్తి కూటము. శక్తి + శివ ఆద్యము (The Basic Begining) లోపాముద్రేయము.

**తృతీయ ధామము** : బిందు రహితముగా, భూతహృత్ లేఖనము, **క్రోధమునినా అధిష్ఠితా।** క్రోధ మౌన అధిష్ఠానరూపము. ఇతః పూర్వమే ఉన్న వాక్‌భవకూట విద్య. **"చాంద్రీం విద్య", "కౌబేరీ విద్య"** అని కూడా పిలుస్తారు.

**చతుర్థ (నాలుగవ) ధామము** :

- మదనాథుడగు శివతత్త్వము (శివుడు). (వాగ్భవకూటము).
- అద్దానిపైన కామ కళామయమగు 'శక్తి'. దానికి పై 'శాక్త్యము'.

ఇది **'మానవీ విద్య'** అని పిలుస్తున్నారు.

**పంచమ (5వ) ధామము** : శివ-శక్తిల ఏక రూపమగు వాగ్భవము. ఇది శివశక్త్యాఖ్యము. ఇది తృతీయము పైనది. ఈ పంచమీ ధామమే చాంద్రీవిద్యగా ధ్యేయము (ధ్యానింపతగినది).

**షష్ఠో ధామము** : చాంద్రీ। క్రింద కామరూపిణి. పైన శివాద్య కామరూపము. దీనిని **"కౌబేరీ షష్ఠే ధామము"** అని పిలుస్తున్నారు.

**సప్తమ ధామము** : ఇది హిత 'ఏ'కార రూపము. తురీయ స్వరరూపము. అన్నిటికీ ఆది స్వరూపము. సూర్య-చంద్రమసములతో కూడిన కామేశ్వర వాగస్త్య (వాక్-అస్త్య) సంజ్ఞా రూపము. **"వాగస్త్య"** అని పిలువబడునది.

**అష్టమ ధామము** : పైన 3వ ధామముగా చెప్పబడినదానికి కామాద్యము (కామము-ఇచ్ఛ) ప్రారంభరూపముగా కలిగియున్నట్టిది. రెండు అరలు క్రిందగా 'కం' మదన కళారూపము. శక్తి బీజము. వాగ్భవమునకు చివరిగా అర్థావ శిరస్కం చేయటము. ఇది **"నంది విద్య"** అని కూడా పిలువబడితోంది.

**నవమ ధామము** : "వాగ్భవమును, ఆగస్త్యమును, శక్తిని కలిగి ఉన్నట్టిది. "మన్మథ ఉర్వీమాయా"। **"కామ కళాలయం"** అను బీజాక్షర నిర్మితము.

**దశమ ధామము** : చంద్ర, సూర్య, అనంగ, ధూర్జటిల 'మహిమ'తో కూడిన ధామము. షణ్ముఖీ విద్య యొక్క మూడవదిగా ప్రకాశించునది. **షణ్ముఖీ త్రయీ విద్య।**

**ఏకాదశ ధామము** : మరల ఆగస్త్య విద్యను పఠించి, మరల 'ఏ'-వమును మాయగా ఆమంత్ర్యము చేయు ధామము. ఇది **'పరమశివ విద్య'.**

**ద్వాదశ ధామము** : మరల ఆగస్త్యమును పఠించి వాగ్భవమును ధ్యానిస్తూ కామ కాళాలయమును సహజముగా చేసుకొంటూ, లోపాముద్రతో శక్తి కూటరాజమును పఠించటము. ఇది **'వైష్ణవీ విద్య'** - అనబడుతోంది.

-----

భగవానుడగు శివుడు పై '12' ధామములు చెప్పి, ఇంకా (మునులతో, దేవతలతో) ఈవిధంగా పలికారు.

**పరమేశ్వరుడు** : ఇవన్నీ శ్రద్ధగా విన్నారు కదా! ఇంత వరకు "కామాఖ్య తురీయము" అని, పూర్వరూపమని గ్రహించెదరు గాక।

**తురీయాతీతము** : ఇది సమస్తమును దాటివేసినట్టిది. కాబట్టి "సర్వ ఉత్కటము". సర్వ మంత్రములకు ఆసనగతము (Final Sitting) అయినట్టిది. పీఠ-ఉపపీఠములచే పరివృతమైనది.

**ఆ తురీయాతీత దేవి**:

- సకల కళా వ్యాపిని. సామోదకమైనది. (అన్ని సిద్ధాంతములకు మోదకమైనది).
- పరాగముతో కూడినది.
- సర్వహృదయగతమైనది. అమృత స్వరూపము. సకల స్వరూపము. ఇంద్రియ సమస్తము తన అలంకారముగా కలిగినది. సదోదితమైనది. (సత్ నుండి ఉదయించినది).

అదియే **"పరా విద్య"** అయినట్టిది.

----

## మహా త్రిపురసుందరీ ధ్యానము

- 'స్వస్వరూపము' యొక్క "సర్వాంతర్యామిత్వము"ను "స్వకీయ భావనా జగత్ - భావికుని" రూపముగా స్పష్టీకరించుకోవాలి.
- అట్టి తత్త్వమును స్వాభావికం చేసుకుంటూ హృదయమున నిలుపుకోవాలి.
- హృదయమును విజ్ఞాన నిలయముగా చేసుకోవాలి.
- ("జాగ్రత్-స్వప్న-సుషుప్తి", "దృశ్య-జీవ-పర స్వరూపములు", "ఇహ-పర-పరాత్పరములు" అనబడే) త్రిపురములను, సమస్తమునకు పరము అయి ఉన్న 'మాయ'ను, శ్రేష్ఠము, పరము అయిన వైష్ణవము (Al-pervading and Al-present SELF)ను 'హృదయము' అనే కమలకర్ణిక (Heart of the flower) యందు సన్నిధానము (Placed inward) చేసుకోవాలి.
- **పరస్వరూపిణి। భగవతి। లక్ష్మి। మాయా స్వరూపిణి। సదోదిత।** (సత్ నుండి ఉదయించినది)। **మహావశ్యకరి।** (ఈ సమస్తము ఆ దేవియొక్క ఇచ్ఛారూపమే కాబట్టి) **మదన। ఉన్మాదనకారిణీ।** చేతిలో ధనస్సును, బాణములను ధరించిన దేవి। వాక్కుగా సర్వత్రా విజృంభిస్తున్న వాక్ విభూషిణి। చంద్రమండల (మనో మండల) రూపిణి। సప్తదశ (17) (పంచభూతములకు, పంచప్రాణములకు, పంచ ఉప-ప్రాణములకు ఆవల 17వదిగా) సాక్షీ-ఆత్మ స్వరూపిణి। మహా నిత్య ఉపస్థిత (నిత్య సత్యమై ఆసీనురాలై ఉన్న తత్త్వము)।

పాశ-అంకుశములను అలంకరించిన మనోహరమైన పాణి పల్లవములు (లేత, సుకుమారమైన చేతులు) కలిగినది। **సముద్యత్ అర్క నిభాం।** ఉదయించుచున్న సూర్యునివలె సర్వత్రా తన ప్రకాశమును వెదజల్లునది।

**దేవీ లక్ష్మీ।** సమస్తము తన సంపదగా గల **సర్వలక్ష్మీమయి।** ఈ జగత్తులన్నీ తన లక్షణములుగా కలిగియున్న **సర్వలక్షణ సంపన్న।** హృదయములోనే వేంచేసియున్న చైతన్య స్వరూపిణి। నిర్మల స్వరూపిణి కాబట్టి **నిరంజన।** ద్రష్ట-దర్శన-దృశ్యములను తన అంతరమున కలిగి ఉండటంచేత **త్రికూటాఖ్య।** ఆనందముతో కూడిన చిరునవ్వు చిందించు **స్మితముఖి।** సుందరీ। మహామాయా స్వరూపిణి।

సర్వ శుభములను ప్రసాదించునది। **'మూలాధారము'** నుండి **'సహస్రారము'** వరకు విస్తరించియున్న **మహాకుండలినీ దేవి।** "జీవ-ఈశ్వర-పర" అనబడే 3 పీఠముల మధ్యగా వర్తించు **త్రిపీఠ మధ్యవర్తిని। అకథా** అనే ఆది పీఠమునందు వేంచేసి ఉన్న మాత। పరాం భైరవీ। చిత్ (ఎరుక) అనబడు కళచే **చిత్కళా స్వరూపిణి। మహా త్రిపురాదేవి।**

**అట్టి త్రిపురేశ్వరిని కేవలమగు స్వస్వరూపముగా మహాధ్యాన యోగముచే ధ్యానించి తెలుసుకొనెదము గాక।**

**ఇతి త్రిపురా తాపినీ మహోపనిషత్ - ప్రథమోపనిషత్**

# త్రిపురా తాపిన్యుపనిషత్ - ద్వితీయోపనిషత్

**"త్రైపురీవ్యక్తి"** అగు త్రిపురీదేవిని గుర్తించటమెట్లా?

అందుకుగాను వేదము చెప్పుచున్న (కృష్ణ యజుర్వేదాంతర్గత తైత్తిరీయారణ్యకే ఖిలాకాండే ఇత్యాది చోట్ల సూత్రముగా చెప్పబడిన) సూత్రమంత్రమును ఉపాసన పూర్వకంగా పఠించటము గురించి చెప్పబడుతోంది.

**ఓం। అథాతో "జాతవేదసే సునవామ సోమమ్" ఇత్యాది పఠిత్వా...।**

## (దుర్గా) సూక్తము

నారాయణ యాజ్ఞాన్ ఖిలోపనిషత్ – 2వ అనువాకము

**మం॥శ్లో॥** **జాతవేదసే! సునవామ। సోమం అరాతీయతో నిదహాతి వేదః।**
**స నః పర్షదతి దుర్గాణి, విశ్వా నావేవ సింధుం దురితాత్యగ్నిః (దురితా అతి అగ్నిః) ॥**

**తామ్ అగ్ని వర్ణాం తపసా జ్వలన్తీం వైరోచనీం కర్మఫలేషు జుష్టామ్।**
**'దుర్గాం దేవీగ్ం శరణం' అహం ప్రపద్యే। సుతరసి తరసే నమః॥**

**అగ్నే! త్వం పారయా నవ్యో అస్మాన్ స్వస్తిభిః అతి దుర్గాణి విశ్వా।**
**పూః చ పృథ్వీ బహులా న ఉర్వీ, భవా తోకాయ తనయాయ శంయోః॥**

**విశ్వాని నో దుర్గహా జాతవేదః సింధుం నః నావా దురితా అతి పర్షి।**
**అగ్నే అత్రివన్ మనసా గృణానో అస్మాకం బోధి అవితా తనూనామ్॥**

**పృతనా జితగ్ం సహమానమ్ ఉగ్రమ్ అగ్నిగ్ం। హువేమ పరమాత్ సధస్థాత్।**
**స నః పర్షదతి దుర్గాణి విశ్వా క్షామత్ దేవో అతి దురితా అతి అగ్నిః॥**

**ప్రత్నోషి కం ఈడ్యో అధ్వరేషు సనాత్ చ హోతా నవ్యః చ సత్సి।**
**స్వాంచ అగ్నే తనువం పిప్రయ స్వాస్మభ్యన్చ సౌభాగమాయ జస్వ॥**

**గోభిః జుష్టమ్ అయుజో నిషిక్తం తవ ఇంద్ర విష్ణోః అనుసన్చరేమ।**
**నాకస్య పృష్ఠమ్ అభిసంవసానో వైష్ణవీం లోక ఇహ మాదయన్తామ్॥**

**ఓం కాత్యాయనాయ విద్మహే। కన్యకుమారి ధీమహి। తన్నో (తత్ నో) దుర్గిః ప్రచోదయాత్।**

"జాత వేదసే సునవామ సోమమ్" మొదలైన 'స్తుతి' అనే ఉపాసనచే ఆ త్రైపురీ దేవిని స్వ-దేహమునందే గుర్తించ గలుగుతాము. ఋషులు దేవదేవుడగు శివభగవానుని ఈవిధంగా ఇంకా అర్థించారు.

---

**ఋషులు: "జాతవేదస"** – ఇది ఏకర్చసూక్తము (ఋక్కు)కు ఆద్యము (Begining) – మధ్య (In Between) – అవసానము (At the end) – ఆయా స్థానములలో బీజనాగర రూపము ఉన్నట్లుగా చెప్పబడుతోంది కదా! ఓ మహాదేవా! దేవాది దేవా! శివభగవాన్! దయచేసి అట్టి **"బీజ నాగర రూపము"** గురించి బోధించండి.

**దేవ దేవుడు (శివభగవానుడు):** మునులారా! ఋషులారా! వినండి.

'జాతవేదసే సునవామ సోమం' అను మంత్రమును అంత్యమవాణిని (చివరి వరకు) విలోమంగా (అవరోహ క్రమంగా, పై నుండి క్రిందికి దిగుచున్న స్వరంగా) పఠనము (చదవటము) చేయాలి.

**జాతవేదసే :** "జా" (మొదటి పదములోని మొదటి అక్షరము)ను దీర్ఘంగాను,

**"సునవామ సోమమ్"** –

**సోమమ్** – కౌళము, శ్రేష్ఠము, మహా సౌభాగ్యము అను అర్థంగా చెప్పుచున్నారు.

**స-ఉ-మమ్** – మొదటిది (స) – నివృత్తికారణము.
రెండవది (ఉ) – స్థితి కారణము.
మూడవది (మమ్) – సృష్టికారణము.

– **కరశుద్ధిం కృత్వా** – చేతులను 'శుద్ధి' చేసుకొని
– **త్రిపురా విద్యాగ్ం సృష్టీ కృత్వా** – 'త్రిపుర విద్య' అయినట్టి దేవీతత్త్వమును (సమస్తమునకు ప్రేరేపించు తత్త్వమును) హృదయంలో స్పష్టీకరించుకొని

అప్పుడిక **"జాతవేదసే సునవామ సోమమ్"** ఇత్యాదిగా గల సూక్తమును పఠించాలి.

దీనిని **"మహా విద్యేశ్వరీ విద్య"** గా చెప్పబడుతోంది.

## త్రిపురేశ్వరీం జాతవేదస ఇతి।

**"జాత వేదస"** అనగా? ఆ త్రిపురేశ్వరియే।

**"జాత"** – అనే మొదటి రెండు అక్షరములను మాతృకయొక్క శిరస్సునందు – బైందవము. (బిందు సంబంధమైనది). **అమృతరూపిణి చ ఇతి వాక్యార్థమ్।**

**జా** = మొదటిదానియొక్క మొదటిది. వాగ్భవము (జనించటము). "పరమాత్మయగు శివ" – అనబడుతోంది.

**త** = కామ కళాలయము (జనించుటయందు ఇచ్ఛ).

'జాత' ఈవిధంగా పరమాత్మ యొక్క విజృంభణము. 'జాత' మాత్రము చేత 'కామి' అయి కామమును కోరుకొనుచున్నారు. 'కామేశ్వరుడు' అనబడుచున్నారు. ఈవిధంగా "ఆదిచే శివుడు పూర్ణుడే" – అని చెప్పబడుతోంది. ఆ పూర్ణుడగు శివుడే **'సునవామము'** గోత్రరూపము (గోత్రప్రవరుడుగా, మూల పురుషకారముగా, సృష్టి వంశమునకు కూటస్థుడుగా) రూపిగా దేవియే ఆరూఢమైనది. సమస్తమునందు **మధ్యవర్తి.** అమృతరూపిణిగా సమస్త జీవులలో వేంచేసి ఉన్నట్లు మంత్రార్థమును స్పష్టీకరించుకోవాలి.

**గోత్ర** = 'వామ గోత్రము' అమ్మవారికి చెందినదే। ఈ సమస్తము దేవియొక్క కామకళాలయంగాను, శేషము (మిగిలినదంతా) అమ్మవారి వామము (సంపద) గాను భావించాలి.

**పూర్వేణ అధ్వనా విద్యేయగ్ం।** సమస్తమునకు ఇతః పూర్వమే ఉన్న స్వరూపిగా 'దేవి'ని ఎరిగెదరు గాక! సర్వము తానై, సమస్తమునకు **'రక్షాకర్త్రీ'** – రక్షించునది అని దర్శించబడును గాక!

---

ఈవిధంగా త్రిపురేశ్వరీ విద్యను స్పష్టీకరించుకోవాలి. "జాతవేదస" – అను మొదలైన మంత్రముల సారమేమిటో, అదియే శ్రీవిద్య.

**జాతో దేవ ఏక ఈశ్వరః** – "ఈ సమస్త జగత్తులు, జగత్పాలకులు, జీవులు... ఇదంతా, వీరంతా జనిస్తున్న స్థానము దేవదేవుడు, ఏక-అఖండ స్వరూపుడు అగు ఈశ్వరుడే। ఇదియే **త్రిపురేశ్వరీ విద్య** యొక్క అంతిమసారము, ఇది సిద్ధించుకోవలసిన అనుభవము కూడా!

పరమోజ్యోతి మంత్రముతో (జ్యోతిర్జ్యోతిః పరం జ్యోతిః। ఆత్మ జ్యోతిశ్శివోస్మ్యహమ్ – మంత్రముతో) అనుష్ఠానముగా అనుసంధానం చేస్తూ, తురీయపరమును (తురీయాతీతము)ను ధ్యానిస్తూ – శ్రీ చక్రములోని మొదటిదాని యొక్క మొదటిదానిని, రెండవదానిని, మూడవదానిని – సర్వ రక్షాకరీ సంబద్ధము చేయాలి.

---

- ఆత్మను అధిష్ఠించే "ఆత్మాసన రూపిణీ విద్య" స్పష్టము చేసుకుంటూ,
- **"జాతవేదసే సునవామ సోమమ్"** మొదలైనదంతా పఠిస్తూ,
- 'సర్వ రక్షాకరీ విద్య'ను మననము చేస్తూ (స్మృతిస్తూ),
- ఆది – అంతములందు 'శివ–శక్తి' రూపిణిని వినియోగిస్తూ చేయు ఉపాసన – "సోమోపాసన".

**– ఇతి శక్త్యాత్మకం వర్ణం 'సోమ' ఇతి।** ఈ తీరైనది **"శక్త్యాత్మక వర్ణము"** అంటారు.

సోమం = సః + ఉమం = శైవాత్మక ధామము. ఇది గ్రహించినవాడు సుభగుడు (సుఖములన్నీ పొందినవాడు) కాగలడు.

ఈవిధంగా **'చక్రాసనగత'** అయిన **"త్రిపురవాసినీ విద్య"**ను (శ్రీచక్రమును) స్పష్టము చేసుకుంటూ, "జాతవేదసే సునవామ సోమమ్" – ను పఠిస్తూ, **"సదోదిత (సత్–ఉదిత), శివశక్త్యాత్మికము"** అయిన శివుడే "స" అను శక్తిచే "ఆత్మాక్షరము" అని ఉపాసించబడును గాక।

**శ్లో॥ 'శివ' ఆది – 'శక్తి' – అంతరాళ భూతాం త్రికూటాదిచారిణీగ్ం**
**సూర్యా–చంద్రమస్కాం మంత్రాసనగతాం త్రిపురాం**
**మహాలక్ష్మీగ్ం సదోదితాం స్పష్టీకృత్వా, –**

'శివ'యందు ఆరంభమై, శక్తిని అంతరమున ఆదిభూత స్వరూపియే "శివ శక్తీదేవి"। అంతరమున ఉన్న శివ–శక్తి ఐక్యము, ఆ దేవి త్రికూటముతో సహా సమస్తమునందు సంచారము కలిగినది. సూర్య–చంద్ర రూపములు తానే అయినది. 'మంత్రము'ను ఆసనముగా కలిగినది, "మహాలక్ష్మి" అని పిలువబడునది. సదానంద స్వరూపిణి అగు అట్టి స్వస్వరూపాత్మను స్పష్టీకరించుకొంటూ, అట్టి స్వస్వరూపమును ధ్యానం చేయాలి.

ఇంకా కూడా,

**"జాతవేదసే సునవామ సోమమ్"** పఠిస్తూ పూర్వాతిపూర్వమైన సదాత్మాసన రూపము గురించిన విద్యను స్మరణము చేస్తూ "వేద" – మొదలైన **'విశ్వాహా సంతోదయ బైందవం'** (విశ్వాహంకార జననమును) పై స్థానంలో ప్రతిక్షేపించి చూస్తూ, "త్రిపురాం మాలినీ" విద్యను స్పష్టీకరించుకుంటూ ఉండాలి. శ్రీ త్రిపురసుందరిని శ్రీచక్రములో ఆరాధించాలి. ఆవిధంగా ఆరాధిస్తూ "కల" అక్షరమును విచింతన చేయాలి. అనగా ఈ సమస్తమును తన మూర్తీభవముగా కలిగియున్న

–"సర్వవిద్యేశ్వరి। త్రిపుర। లక్ష్మీదేవి" – అయిన ఆ వేద వేదాంతార్గత మాతను హృదయములో – 'నిదహాతి' – ప్రజ్వలింపజేసుకోవాలి.

ఆ జననియే – **సైవేయమ్ అగ్న్యాసనే జ్వలతీతి। విచింత్య।** – అగ్నిగా సర్వత్రా ప్రజ్వలిస్తున్నట్లు భావన చేయాలి. ఆ దేవియొక్క "త్రిజ్యోతిషము ఈశ్వరీ, త్రిపురా, అంబా" విద్యను స్పష్టం చేసుకోవాలి. **స నః పర్షదతి దుర్గాణి విశ్వా।** ఆ దేవియొక్క జ్యోతి – ప్రకాశమే ఈ విశ్వముగా మననము చేయాలి. పరప్రకాశిని, ప్రత్యక్‌భూత (సమస్తమునకు ఆవలి ప్రదర్శనము)గా భావించాలి. ఆ శ్రీదేవీ విద్యయే ఆహ్వాన కర్మయందు **"సనః పర్షదతి దుర్గాణి"** మంత్రముచే ఆహ్వానించబడుతోంది.

ఈవిధంగా **'అష్టవిద్యా స్వరూపిణి'**, అని దేవీ అంగభూతంగా చెప్పుకుంటున్నాము.

## మహాచక్రనాయకము

**దేవతలు :** దేవా! శివభగవాన్! సర్వకామములను సిద్ధింపజేయునది, సమస్త జనులకు ఆరాధ్యము, సర్వస్వరూపము, విశ్వతోముఖము, మోక్షద్వారము అయి ఉన్నట్టిది, యోగులు 'పరబ్రహ్మము'ను భేదించి ఏ **'నిర్వాణస్థానము'** చేరుచున్నారో, అట్టి **'మహాచక్రనాయకము'** గురించి విశదీకరించి చెప్పండి.

# శ్రీచక్రము

**శ్రీచక్రము :** అద్వైత సత్ చిత్ ఆనంద ("Non-dual", "Being", "Knowing", "Enjoying" సంబంధమైన) బ్రహ్మవిద్యా స్వరూపము. అఖండాత్మస్వరూపిణి అగు జగన్మాతయే – శ్రీచక్ర రూపిణి, జగత్–పోషిణి, ఈ చరాచర జగత్ వ్యాపిణి కూడా.

***శ్రీచక్రములో రచించబడే దేవీ నామములు***

1. దుర్గ 2. భద్రకాళి 3. విజయ 4. వైష్ణవి 5. కుముదా 6. చండికా 7. బగళా 8. మాధవి 9. కన్యా 10. లక్ష్మీ 11. సరస్వతి

## శ్రీచక్రములో శ్రీదేవి – ప్రతివారిలోని కేవలాత్మ స్వరూపమే।

**బిందురూపిణి :** బిందువు నుండి రేఖలు, చతురస్రములు, పంచ–సప్త–అష్ట–దశ–ఇత్యాది కోణ భుజములు – ఇవన్నీ ఏర్పడుచున్నట్లే, శ్రీదేవియొక్క తత్త్వము నుండే ఆలోచనలు, భావములు, అనుభూతులు, జగదనుభవములు, దేహ–దేహాంతర స్వయం కల్పిత సంబంధ – అనుబంధ – బాంధవ్యములు,.... ఇవన్నీ కూడా ఏర్పడుచున్నాయి. అందుచేత శ్రీచక్రములో మధ్యగా 'బిందురూపిణి'గా ఉపాసించబడుతోంది.

**నిర్గుణి :** గుణములకు, స్వభావములకు, కల్పిత జగత్తులకు మునుముందే ఉన్నది కాబట్టి – నిర్గుణి.

**త్రిగుణ ప్రదర్శిని :** ఇక్కడి లోకవ్యవహారములన్నీ త్రిగుణాత్మకమైనవి. అయితే, అట్టి త్రిగుణములు ప్రతి జీవునిలోని ఆత్మస్వరూపిణి అగు శ్రీదేవీ చిత్కళలే!

**శక్తిస్వరూపిణి :** సమస్తము తన శక్తి ప్రదర్శనముగా కలిగి ఉన్నట్టిది. ఆత్మయొక్క శక్తి ప్రదర్శనముగా సర్వత్రా వేంచేసి యున్నట్టిది. సర్వత్రా ప్రవేశించినదై, సమస్త సృష్టికి ఆధారభూతమైనట్టి "శక్తి" స్వరూపమే "శ్రీదేవి"గాను, "శ్రీచక్రము" గాను ఉపాసించబడుతోంది.

**అట్టి శ్రీచక్రము :** "చిత్స్వరూప బ్రహ్మజ్ఞానైక్యము" కొరకై సాధనము.

వేద – వేదాంత ఆత్మతత్త్వార్థములకు, వేద పురాణ ఇతిహాసార్థములకు మూలము.

## శక్తి రూపమగు శ్రీచక్రము

| | | |
|---|---|---|
| – సృష్టి – స్థితి లయములకు ఆధారభూతము<br>– చేతులు – కాళ్ళు కలిగిన ఈ భౌతిక దేహమునకు ఆధారము<br>– శరీరములోని రక్త – మాంస మజ్జ మొదలైన వాటికి జీవనము, చలనములకు చేతన (కదిలించు, జీవింపచేయు) **"శక్తి రూపము"** | జీవుడు, మనస్సు, బుద్ధి, అహంకారములకు మూల పదార్థము (Raw Material) **"సూక్ష్మమూలము"** | బ్రహ్మ జ్ఞానమునకు సాధనము **"జీవ బ్రహ్మైక్య బోధకము"** |

అట్టి శ్రీచక్రము ఉపాసనకొరకై నిర్మించే సాం్రప్రదాయములు అనేకము. ముఖ్యముగా రెండు రీతులైనవి.

| | |
|---|---|
| "సృష్టి క్రమము" | "సంహార క్రమము" |
| మార్గంగా నిర్మించే / పూజించే శ్రీచక్రము | అనుసరిస్తూ నిర్మించే శ్రీ చక్రమును ఉపాసించు వారు |
| వీరు సృష్టిక్రమ నిర్మాణ చక్ర ఉపాసకులు | "కళాచారులు". |
| "సమయాచారులు". | వారు బిందు రహిత కారణమును పూజించువారు. |
| వీరు బిందుసహిత కారణమును పూజించువారు. | |

శ్రీ చక్రమును మైథున క్రియాత్మకంగా పూజించువారికి "కక్రోళికేళులు" అనబడుచున్నారు.

## శ్రీ చక్రోపాసన ముఖ్యముగా రెండు పద్ధతులు

**అంతర్యజనము** | **బహిర్యజనము**

**అంతర్యజననము**

తమ ఈ శరరీరమునే శ్రీచక్రము గా భావించటము

- కేవలము స్వస్వరూపాత్మను **- బిందువుగాను**
- పరమాత్మ (సహజము) జీవాత్మ (సందర్భము)లను | **బిందువు నుండి బయల్వెడలే రేఖలు గాను** 
- సహజ సందర్భ రూపముల సంధిని **- కోణము గాను** 
- పరమాత్మ - జీవాత్మ దృశ్యానుభవములను **త్రికోణముగాను** 
- పంచేంద్రియములను వాటి తన్మాత్రలైనట్టి శబ్ద స్పర్శరూప రస గంధములను | **పంచ భుజాకారము గాను** 
- మనోబుద్ధి చిత్త అహంకారములను **చతుర్భుజములుగాను** 
- పంచ భూత మనో బుద్ధి చిత్తములను **అష్టభుజాకారము గాను** 
- వాటి బాహ్య అంతరములను **8 × 2 షోడశ భుజాకారముగాను**

ఆత్మ యొక్క (దేవి యొక్క) అంతర - బహిర్ ప్రదర్శనములను | **వృత్తము యొక్క బాహ్య అంతరములుగాను** 

మొదలైన విశేషణములుగా సమస్తము తమయందే భావించి - ఉపాసించటము **అంతర్యజనము**

## బహిర్యజనమును

పైన "అంతర్యజనము"గా చెప్పబడినదంతా కర్మవిధానముల పట్ల "ఆసక్తి" కలవారికొరకై రేఖా త్రిభుజ - త్రికోణము, బహుభుజ వృత్త - ఇత్యాదులతో రచించి, చక్రముగా ఉపాసించేది - బహిర్యజన శ్రీ చక్రోపాసన.




ఇత్యాది రేఖ – భుజ – కోణ బిందు సమన్వితంగా శ్రీ చక్రము రచించబడుతోంది.

ఈ ఈ మొదలైన వాటితో శ్రీచక్రమును నిర్మించి, మధ్యగల బిందువును ఆత్మగా భావిస్తూ, తక్కినవన్నీ "ఆత్మశక్తి" ప్రదర్శనములుగా ఉద్దేసిస్తూ గంధ పుష్ప అక్షతలతో, వర్ణనములతో శ్రీ దేవి యొక్క 11, 32, 108, 1000 నామములను నామరూపాత్మకంగా ఉచ్చరిస్తూ చేయు పూజా విధానమును అనుసరించటము "శ్రీచక్ర బహిర్వజనము".

## శ్రీ చక్రము – షట్చక్రములు

శ్రీ చక్రము మూలాధారము నుండి ఆజ్ఞాచక్రము వరకు షట్ చక్ర సమన్వితముగాను, "బ్రహ్మరంధ్రము" ఆవరణ యొక్క లోవిభాగముగాను, శిరస్సు నుండి ఆవల గల "సహస్రారము" – బాహ్య ఆవరణగాను భావించి ఉపాసించబడటము అంతర్యోజన శ్రీ చక్రోపాసన.

**పూర్వమార్గము :** మూలాధారము నుండి బ్రహ్మరంధ్రము వరకు గల షట్ చక్రస్థానములను, ఆజ్ఞాచక్రము నుండి – బ్రహ్మరంధ్రము వరకు గల మార్గమును ఉపాసిస్తూ యోగాభ్యాస మార్గంగా సహస్రారమును చేరి, ఆక్రమించి సమస్తమును తన యందు దర్శించటము – సహస్రార శ్రీ చక్ర మార్గము.

## శ్రీ చక్రము – మహా చక్రనాయకము

### వ్యాఖ్యానము



- త్రికోణమును (త్రిభుజములతో) వ్రాసి
- దానిలోపల "మానయష్టి (సన్నని) రేఖ"ను అకృష్యము చేసి (పొడిగించి), విశాలము చేసి
- ముందటగా 'యోని' (రంధ్రము) చేసి, పూర్తిచేసి
- అగ్రయోనిని "మానయష్టి"గా చేసి
- దానికి అంతకు పైగా (ఊర్ధ్వముగా) పొడిగించి 'యోని'గా చేసి, పూర్తి చేయాలి.
  పూర్తి చేస్తే... ఇది మొదటి "త్రికోణ చక్రము" అవుతుంది.
- రెండవది "అంతరాళము"
- మూడవది "అష్ట (8) యోని అంకితము"

ఈ విధంగా పైన క్రింద సంపుటయోని – అంకితము చేయాలి.

'8' భుజ చక్రముల – ఆది అంత అగ్రమున రేఖలకు పొడిగించాలి. 'సాధ్యము' మొదలైన ఆకర్షణ బద్ధ రేఖను పొడిగించాలి.

ఈ విధంగా పైకి – క్రిందకు 'సంపుటయోని' అంకితము చేయాలి.

కక్ష్యల నుండి ప్రక్కల నుండి పైకి పోయేటట్లుగా నాలుగు రేఖలు గీయాలి. యథాక్రమంగా మాన యష్టిద్వయంలో "దశయోని అంకితము" అనే **"అంకిత చక్రము"** అవుతుంది.

మధ్య "త్రికోణాగ్ర చతుష్టయము" – రేఖచర అగ్రకోణములందు కలిపి దశ (10) అగ్రముల నుండి పొడిగిస్తే **"చతుర్దశ (14) అర చక్రము"** అవుతుంది. దీనితో **"అష్ట పత్ర సంయుతము"** కూడా కాగలదు. తరువాత షోడశ (16) పత్ర చక్రము – పార్థివ చక్రము – చతుర్ద్వారము (4 Gates)తో కూడినది అవగలదు.

ఈ విధంగా "సృష్టియోగము" రేఖా పూర్వకంగా వ్యాఖ్యానించబడుతోంది. **"నవాత్మ చక్రము", "ప్రతిలోమ చక్రము"** ప్రథమ **"త్రైలోక్య మోహనచక్రం"** అవుతుంది.

## శ్రీచక్రము – నవావరణ చక్రములు / ముద్రలు

(1) ప్రథమంగా: **సర్వ సంక్షోభినీ ముద్రా చక్రము** – "సాణిత్ అష్టకము", "సమాత్ర–అష్టకము" "సర్వ సంక్షోభిణి" మొదలైన దశకము, సప్రటము, త్రిపురాయాధిష్ఠితము, "ససర్వసంక్షోభిణీ ముద్ర" అగుచున్నాయి.

---

(2) ద్వితీయంగా : **సర్వ విద్రావిణీ ముద్రా చక్రము** – "సర్వాశాపరిపూరక చక్రము", సకామ–ఆది ఆకర్షిణీ షోడశకము (16), సగుప్తము అవుతుంది. త్రిపురేశ్వరీ అధిష్ఠితముగాను "సర్వ విద్రావిణీ ముద్రా స్వీకారము" గాను అవగలదు.

---

(3) తృతీయంగా : **సర్వవశంకరీ ముద్రా చక్రము** – సర్వ సంక్షోభణ చక్రము, స–అనంగ కుసుమ – ఆది అష్టకము (8), త్రిపురసుందరీ – అధిష్ఠితము అగుచున్నది. ఇది సర్వాకర్షణీ ముద్రగా చెప్పబడుతోంది.

---

(4) తురీయంగా : **సర్వ వశంకరీ ముద్రా చక్రము** – ఇది 4వది. సర్వ సౌభాగ్యదాయక చక్రము అగుచున్నది. సర్వసంక్షోభిణి మొదలుగా ద్విసప్తకము (7×2 = 14) గీతలు / కోణములు అయిఉన్నది. ఇది "సంప్రదాయ చక్రము" అనబడుతోంది. త్రిపురావాసిని (త్రిపురేశ్వరి)చే అధిష్ఠితము (సింహాసనము). దీనిని "సర్వవశంకరీ ముద్ర" అంటారు.

---

(5) తురీయాంతగ్ం : **మహోన్మాదనీ ముద్రా చక్రము** – ఇది సర్వ అర్థములను సిద్ధింపజేయగల "సర్వార్థసాధక చక్రము". సర్వసిద్ధి ప్రదాదికంగా దశకము సకల కౌళము (సహస్రారమునుండి మూలాధారము వరకు విస్తరించి ఉన్నట్టిది). త్రిపురామహాలక్ష్మిచే అధిష్ఠానమైయున్న స్థానము. మహోన్మాదనీ (గొప్ప శబ్దవతిగా) ముద్ర.

---

(6) షష్ఠగ్ం (6వది) – **మహాంకుశ ముద్రా చక్రము** – ఇది సర్వ రక్షాకరం చక్రము. సర్వజ్ఞత్వము మొదలైన దశ (10) కళాత్మకము నిర్గర్భము (జన్మరాహిత్యము) ప్రసాదించునది. త్రిపురమాలిన్య చక్రముగా పిలువబడునది. **"మహాంకుశ ముద్ర"**గా చెప్పబడునది.

---

(7) సప్తమగ్ం (7వది)। **ఖేచరీ ముద్రా చక్రము** – ఇది సర్వరోగహర చక్రము. వశిని మొదలైన అష్ట (8) దేవతలతో కూడుకొన్నది. 'రహస్యము' అని పిలుస్తారు. త్రిపుర సిద్ధ దేవత వేంచేసి ఉన్నట్టిది. "ఖేచరీముద్ర"గా స్వీకరించబడునది.

---

(8) అష్టమమ్ (8)। **బీజముద్రా చక్రము** – సర్వసిద్ధి ప్రదచక్రము : నాలుగు ఆయుధములతో కూడి "సాయుధ చతుష్టయము" – అయి ఉన్నట్టిది. పరాపర రహస్యమును తెలియజేయునది. త్రిపురాంబా దేవిచే అధిష్ఠితము. బీజముద్రగా పిలువడునది.

---

(9) నవమం చక్రం – **యోని ముద్రా చక్రము** – ఇది చక్ర నాయకము. సర్వానందమయ చక్రము. కామేశ్వరుడు మొదలుగా త్రిచక్రముగా ఉన్నట్టిది. అతి రహస్యమైనదగుచున్నది. మహా త్రిపుర సుందరిచే అధిష్ఠితము. **'యోనిముద్ర'** అని పిలువబడుతోంది.

---

ఈ విధంగా నవావరణ చక్రముల గురించి సంక్షిప్తంగా చెప్పుకున్నాము. సర్వ ఛందస్సులు (4 వేదములు) ఈ నవ చక్రపు ఆకులలో ప్రక్షిప్తము. ఇవియే శ్రీ చక్రములు. అట్టి శ్రీచక్రము యొక్క నాభియందు అగ్ని మండలము. ఇది సూర్య – చంద్రమసముల నిలయము.

అందులో 'ఓం'కార పీఠము –

- ❖ అట్టి శ్రీ చక్రములోగల 'ఓం'కార పీఠమును పూజించాలి.
- ❖ అట్టి శ్రీచక్ర ఓంకార పీఠములో బిందురూపము.
- ❖ అట్టి బిందురూపమునందు అంతర్గతంగా త్రిపురాదేవి వ్యోమ (ఆకాశ) రూపిణి అయి ప్రకాశించుచున్నది. ఆత్మాకాశ స్వరూపిణి అయి విరాజిల్లుచున్నది.

అట్టి శ్రీదేవీ **"ఓంకార బిందు అంతర్గత వ్యోమ రూపిణి"**ని స్మరించాలి. మహా త్రిపురసుందరికి ఆహ్వానము పలకాలి.

**శ్లో॥ క్షీరేణ స్నాపితే దేవీ । చందనేన విలేపితే ।**
**బిల్వపత్రార్చితే మాతః । దుర్గే । అహం శరణం గతః ॥**

**ఓ మహాత్రిపురదేవీ! నీకు క్షీరముతో (పాలతో) స్నానము చేయించి, చందనముతో విలేపనము చేస్తున్నాము. ఇదిగో! బిల్వ పత్రములచే (మారేడు ఆకులతో) పూజిస్తున్నాము. మాతా! శ్రీ దుర్గా దేవీ! నీకు శరణాగతులము అగుచున్నామమ్మా!**

ఈ విధంగా ఆ త్రిపురాదేవిని "ఏక బుక్కు"తో ప్రార్థించి, "మాయా లక్ష్మీ మంత్రము"తో పూజించాలి.

**మాయామంత్రము :**

**(1)** **నమస్తేస్తు మహామాయే । శ్రీపీఠే । సురపూజితే ।**
**శంఖ చక్ర గదా హస్తే । మహాలక్ష్మీ । నమోస్తు తే ।**

**(2)** **నమస్తే గరుడారూఢే । డోలాసుర భయంకరీ ।**
**సర్వపాపహరే దేవీ । మహాలక్ష్మీ । నమోస్తు తే ।**

**(3)** **సర్వజ్ఞే । సర్వవరదే । సర్వదుష్ట భయంకరీ ।**
**సర్వదుఃఖ హరే దేవీ । మహాలక్ష్మీ । నమోస్తు తే ।**

**(4)** **సిద్ధి బుద్ధి ప్రదే దేవీ! భుక్తి ముక్తి ప్రదాయనీ!**
**మంత్రమూర్తే సదా దేవీ! మహాలక్ష్మీ! నమోస్తు తే!**

**(5)** **స్థూల సూక్ష్మే । మహారౌద్రే । మహాశక్తీ । మహోదరే ।**
**మహాపాపహరే దేవీ । మహాలక్ష్మీ । నమోస్తు తే ।**

**(6)** **ఆది-అంత రహితే దేవీ । ఆదిశక్తీ । మహేశ్వరీ ।**
**యోగజ్ఞే । యోగసంభూతే । మహాలక్ష్మీ । నమోస్తు తే ।**

**(7)** **పద్మాసన స్థితే దేవీ । పర బ్రహ్మ స్వరూపిణీ ।**
**పరమేశి జగన్మాతః । మహాలక్ష్మీ । నమోస్తు తే ।**

**(8)** **శ్వేతాంబర ధరే దేవీ । నానాలంకార భూషితే ।**
**జగద్ధితే (జగత్ హితే) జగన్మాతః । మహాలక్ష్మీ । నమోస్తు తే ।**
**మహాలక్ష్మి అష్టకం స్తోత్రం యః పఠేత్ భక్తిమాన్ నరః**
**సర్వసిద్ధిమ్ అవాప్నోతి । రాజ్యం ప్రాప్నోతి సర్వదాః ॥**

**ఫలశృతి:**

ఏకకాలే పఠేత్ నిత్యం మహాపాతక నాశనం।
ద్వికాలం యః పఠేత్ నిత్యం ధనధాన్య సమన్వితః ।
ద్వికాలం యః పఠేత్ నిత్యం మహా శత్రు వినాశనం ।
మహాలక్ష్మిః భావేత్ నిత్యం ప్రసన్నాః వరదాః । శుభాః।

---

ఇంకాకూడా భగవానుడగు పరమశివుడు దేవతలతో ఈ విధంగా పలుకసాగారు.

**శివభగవానుడు :** దేవతాలారా ! పై మాయా మహాలక్ష్మి మంత్రముచే పూజించటం చేత, యజించటము చేత (ఉపాసించటం చేత) భగవతియగు శ్రీ బాలాత్రిపురసుందరీ దేవి ప్రీతి పొందగలరు. సంతోషముతో స్వాత్మానముగా (స్వస్వరూపాత్మగా) విశదమవగలదు. అట్టి దేవీ అనుగ్రహముచే అట్టివాడు సృష్టికర్త అగు బ్రహ్మదేవుని దర్శించగలడు. దేవీతత్త్వమును తెలుసుకున్నవాడు సర్వమును దేవీ స్వరూపముగా దర్శించగలడు. అమృతత్త్వము సిద్ధించుకోగలడు.

**ఇతి మహోపనిషత్ – త్రిపురాతాపిన్యుపనిషత్**

**ద్వితీయ అధ్యాయః సమాప్తః**

---

# త్రిపురాతాపిన్యుపనిషత్ – తృతీయోపనిషత్

**దేవతలు :** భగవాన్ ! మాకు ఇప్పుడు "ముద్రలు" గురించి బోధను అనుగ్రహించండి. మేము ముద్రతో శ్రీదేవిని ఏకాగ్రులమై సేవిస్తాము.

**శ్రీ శివభగవానుడు : నవని కృత జానుమండలం విస్తీర్య పద్మాసనం కృత్వా ముద్రాః సృజతేతి।** ఓ దేవతలారా! మోకాళ్లను నేలపై మోపి, విస్తరించి, పద్మాసనము ధరించండి. అప్పుడిక ముద్రలను సృజించెదరు గాక ! అట్టివాడు అందరినీ తనవైపుగా ఆకర్షించగలడు. 'యోనిముద్ర'ను అనుష్ఠించినవాడు సమస్తమును ఎరుగగలడు. సర్వ ఫలములు పొందగలడు. సర్వము సంభవింపచేసుకొనగలడు. హృదయ దోషములను అన్నింటినీ స్తంభింప చేసి వేయగలడు.

## వివిధ ముద్రలు

**(1) ప్రథమ – "ముద్ర"**

**మధ్యమే – అనామికా ఉపరి విన్యస్య, కనిష్ఠిక అంగుష్ఠతో అధీతే, ముక్తయోః తర్జన్యో దండవత్ తథస్తాత్।**

*చేతుల మధ్యవ్రేళ్ళను అనామికపై (ఉంగరపువ్రేళ్ళపై తాకించి, విస్తరించి) తరువాత విడదీసి చిటికిన వ్రేలు–బొటన వ్రేలు కలిపిచూపుడు వ్రేళ్ళను క్రిందకు కర్రవలె ధారణ చేయుటము.*

**2) ద్వితీయ – "ముద్ర"**

**సైవ మిళిత మధ్యమా – ద్వితీయా ।**

*మధ్యమ వ్రేలుతో కూడి పైవిధంగా ఉంటే రెండవ ముద్ర*

**3) తృతీయ – "ముద్ర"**

**తృతీయా అంకుశాకృతిః ఇతి ।**

*అంకుశములాగా పై మొదటి ముద్ర ధరిస్తే – అది మూడవ ముద్ర*

**4) చతుర్థ – "ముద్ర"**

**ప్రాతిలోమ్యేన పాణీ సంఘర్షయిత్వా**
**అంగుష్ఠౌ సాగ్రిమౌ సమాధాయ – తురీయా ।**

*ప్రతిలోమంగా (ఎదురుబొదురుగా చేతిని చేతితో బొనిపి బొటన వ్రేళ్లను, చివర్లలో కలిపి కదలకుండా ధరిస్తే – అది నాలుగవ ముద్ర*

**5) పంచమ "ముద్ర"**

**పరస్పరం కనీయస ఇదం, మధ్యమా ఆబద్ధే అనామకే దండిన్యౌ**
**తర్జన్యావా ఆలింగ్యో అవష్టభ్య మధ్యమ నఖ । మిళిత అంగుష్ఠౌ ।**

*కనిష్ఠిక (చిటికిన)ను మధ్యమ వ్రేలుచే కట్టబడి అనామిక (ఉంగరపు వ్రేలు)ను కర్రలా చేయటము (లేక) మధ్యమ వ్రేలును బొటనవ్రేలు గోరుపై తాకించటము*

**6) షష్ఠీ "ముద్ర"**

**స ఏవ అగ్రే అంకుశ ఆకృతిః - షష్ఠీ ।**

*పై 5వ ముద్రలో మధ్యమ ఉంగరపు వ్రేలు - బొటన వ్రేలులను అంకుశము వలె ఆకృతిని ధరించటము*

**7) సప్తమీ "ముద్ర"**

**- దక్షిణశయే వామబాహుం కృత్వా**
**- అన్యోన్య అనామికే - కనీయసీ మధ్యగతే,**
**- మధ్యమే తర్జని ఆక్రాన్తే**
**- సరళ స్వ అంగుష్ఠౌ - ఖేచరీ సప్తమీ ।**

*కుడి చేతిని ఎడమ భుజము పై వేసి, ఉంగరపు వ్రేళ్ళను, చిటికెన వ్రేళ్లపై మధ్యగతంగా (ఒకదానికొకటి మధ్యగా ధరించి) మధ్యమ వ్రేళ్ళను ఉంగరపు వ్రేళ్ళతో చుట్టబడినట్లుగా చేసి బొటన వేలులను సరళం చేయు ముద్ర - ఖేచరీ।*

**8) అష్టమీ "ముద్ర"**

**సర్వ ఊర్ధ్వే, సర్వసగ్ంహృతి స్వమధ్యమ్ అనామికా అంతరే కనీయసీ పార్శ్వయోః ।**
**తర్జన్యావ అంకుశాధ్యే యుక్తా, స - అంగుష్ఠయోగతో**
**అన్యోన్యం సమం అంజలిం కృత్వా - అష్టమీ ।**

*రెండు చేతుల యొక్క అన్ని వ్రేళ్ళను పైకిగా పెట్టి అన్ని వ్రేళ్ళను మడచి, మధ్యవ్రేలు - ఉంగరపు వ్రేలు ప్రక్కగా చూపుడు వేలును అంకుశము వలె సూటిగా కలిపి ఉంచి, రెండు చేతుల బొటన వ్రేళ్ళను కలిపి ఉంచి పరస్పరము సమంగా దోసిలి పట్టి ఉంచటము.*

**9) నవమీ "ముద్ర"**

**పరస్పర మధ్యమ ఆపృష్ఠ వ్యర్తిన్యావ అనామికే తర్జన్యా క్రాంతే**
**సమే మధ్యమే ఆదాయ అంగుష్ఠౌ మధ్య వర్తినౌ - నవమీ ప్రతిపద్యత - ఇతి।**

*- మధ్య వ్రేలిని ఉంగరపు వ్రేలుపై ఆనించి - సమమైన మధ్యవ్రేలును తీసుకొని*
*- రెండు బొటన వ్రేలులను మధ్యవర్తులముగా చేయుటము - 9వ ముద్ర అగుచున్నది*

**త్రిఖండ ముద్ర**

**సైవేయం కనీయసే సమే అంతరితే అంగుష్ఠౌ సమావంతరితే కృత్వా -**
**త్రిఖండీ - సంపద్యత ఇతి।**

*అదే చిటికిన వ్రేళ్ళను సమములుగా, మధ్యనుండేట్లుగాను, బొటన వ్రేళ్ళను సమాంతరముగా చేస్తే అది "త్రిఖండి ముద్ర"।*

## కామకళాభూతము గురించి వ్యాఖ్యానము

**పరమేశ్వరుడు :** ఓ దేవతలారా! కాబట్టి ఇక ఇప్పుడు కామకళాభూతము గురించి వ్యాఖ్యానించుకుంటున్నాము.

**హ్రీం క్లీం ఐం బ్లూం సౌః**

ఈ ఐదు బీజాక్షరములు - "పంచకామ" అనబడుతోంది. ఇది శ్రీ చక్రమంతా వ్యాపించి వర్తించుచూ ఉన్నట్టిది.

- ❑ ఈ "పంచకామ"ను ("ఐం"ను) - చిట్టచివరగా సంపుటం చేయాలి.
- ❑ "బ్లూం" కారమునందు సంపుటమును వ్యాప్తించేయాలి.
- ❑ రెండుసార్లు "ఐం" ద్వయమును మధ్యవర్తిచే సాధ్యమును బంధించాలి.
- ❑ భూర్జపత్రము (బుజపత్తిరి ఆకు) పై (శ్రీచక్రమును) పూజించాలి.

ఈ కామ కళాభూతమైన శ్రీచక్రమును ఎరిగినవాడు సర్వమును ఎరిగినవాడు అవగలడు. లోకములన్నీ ఆకర్షించువాడగుచున్నాడు. సర్వమును స్తంభింపజేయగలడు. "లక్షాయుక్తము" అయినట్టి ఈ చక్రము సకల లోకమును వశముగా చేయగలదు.

నవలక్ష (9లక్షలు) జపం చేసినవాడు రుద్రత్వము పొందగలడు.

"మాతృకా - ఆవేష్టితము" చేస్తే దిగ్విజయుడు కాగలడు.

- ❋ "భంగాంక కుండలము" చేసి, అగ్నిని ఆహ్వానించి హనిస్సుతో హోమము చేస్తే సర్వము వశము కాగలదు.
- ❋ వర్తులము (Circular)గా అగ్నికి హోమము సమర్పిస్తే గొప్ప శ్రియము (శ్రేయస్సు) లభించగలదు.
- ❋ చతురస్రముగా అగ్నిగుండము నిర్మించి హోమము చేయుటచే వర్షము కురియగలదు.
- ❋ త్రికోణ అగ్నిగుండము చేసి హోమము చేస్తే శతృవులు మిత్రులు కాగలరు. అట్టివారు 'గతి'ని స్థంభింపచేయగలరు. సంసారమును జయించగలరు.
- ❋ పువ్వులతో హోమం చేస్తే, విజయము లభించగలదు.
- ❋ మహారసములతో హోమం చేస్తే అట్టివాడు పరమానందపూర్ణుడు (Fully Satisfied, Happy) కాగలడు.
  (మహారసములు : ఉప్పు, పులుపు, కారము, చేదు, ఒగరు, తీపి షట్ రసములు)

## శ్రీచక్ర ఉపాసనా విధి - విధానము

ముందుగా సిద్ధి - బుద్ధి సహిత మహాగణపతిని భక్తిపూర్వకంగా మనస్సులో తలచుకుంటూ, వాక్కుతో గణేశమంత్రం జపం చేస్తూ ప్రారంభాక్షరమును ("గ్"ను) చివరి అక్షరమును ("మ్"ను), బిందుపూర్ణమును, శమ్‌ను విడివిడిగా అంగస్పర్శ చేయాలి (చేతులతో హృదయమును, భుజములను, చెవులను తాకుతూ కళ్ళకు హద్దు కావాలి (గం గం గం ఇతి).

**మహాగణేశ స్తుతి మంత్రము**

**గణానాం త్వా గణపతిగ్ం । హవామహే ।**
**కవిం । కవీనామ్ ఉపమశ్రవస్తవమ్ । జ్యేష్ఠరాజం ।**
**బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనః । శృణ్వన్ ఊతిభిః సీద సాదనమ్ ।**
**గం గణేశాయ నమః ।**

***తాత్పర్యము :*** *ఓ విఘ్నేశ్వరా ! మీరు సృష్టిలోని ఇంద్రియ - ఇంద్రియార్థములకు నాయకుడు, గణపతి! అట్టి మీకు స్తుతి సమర్పించుచున్నాము. నవలకు నవలా రచయితవలె ఈ బ్రహ్మాండములన్నిటికీ మీరే రచయిత. సృష్టి కవిత్వమును పాలించువారు. సమస్తమునకు ముందే ఉండి, సమస్తమును నడిపించు జ్యేష్ఠరాజు మీరే, బ్రహ్మము గురించిన విశేషములన్నీ వినుటకై అవి సిద్ధించుటకై అనుగ్రహించండి.*

ఈ విధంగా పలుకుచూ ముందుగా **"గ" నమః । ఆది – అక్షరం । అంత్య బిందు పూర్ణమిత్ – అనేన అంగేన పూరయేత్।** మొదలు – చివర కూడా మరియు బిందు పూర్ణమను అంగస్పర్శ పూర్వకంగా "ఓం । గం। గణేశాయనమః" – అని పలుకుతూ గణేశునికి రెండు చేతులు జోడించి నమస్కరించాలి.

## శ్రీ చక్రము యొక్క క్షేత్రాధ్యక్ష ఉపాసనా మంత్రము

ఓం నమో భగవతే । భస్మాంగ రాగాయ ।
ఉగ్రతేజసే । హన హన । దహ దహ ।
పచ పచ । మథ మథ ।
విధ్వగ్ంసయ । విధ్వగ్ంసయ । హలభంజన ।
శూలమూలే వ్యంజన । సిద్ధిం కురు కురు ।
సముద్రం పూర్వ ప్రతిష్ఠితగ్ం శోషయ । శోషయ ।
స్తంభయ । స్తంభయ ।
పర **మంత్ర** పర **యంత్ర** పర **తంత్ర** పరదూత
పరకటక పరచ్ఛేదన కర విదారయ । విదారయ ।
ఛింది । చింది । హ్రీం ఫట్ స్వాహా॥

*సమస్తమును వెలిగిస్తున్న ఓ భగవతీదేవీ ! ఇంద్రియ విషయములపట్ల మాకు కలుగుచున్న రాగద్వేషములను భస్మము చేయగల దేవీ! గొప్ప తేజో రూపమా ! మా సాంసారిక భావావేశములను హననము చేసివేయండి. చెండాడండి । దహించి వేయండి । పచనము చేసి వేయండి । మథించి వేయండి । చిలికి వేయండి । మా అజ్ఞానమును పూర్తిగా విధ్వంసము చేసివేయండి । మమ్ములను బాధించు నాగలిలను విరగగొట్టి వేయండి । శూలబాధలను వ్యంజనము (Push out) చేసి వేయండి । మాకు మా ఆధ్యాత్మిక మార్గములలో సిద్ధి (fulfilment) ప్రసాదించు మార్గము చూపండి. సంసార సముద్రము యొక్క పూర్వ ప్రతిష్ఠలన్నీ శోషించి వేయండి । మా యొక్క దుష్ట సాంసారిక భావనలను, తాపత్రయములను స్తంభింపజేసివేయండి । (మేము "అనన్య భావనను" సిద్ధింప చేసుకునే మార్గంలో దృశ్యము నుండి మమ్ము తాకుచున్న) బాహ్య సంబంధమైన పర మంత్రములను (అన్య మననములను), పర యంత్రములను (అడ్డుగావున్న సామాగ్రిని), పర దూతలను (అన్యభావములను పేర్చేపే వార్తలను), మమ్ములను ఛేదన (Break up)చే బాధించే, వ్యవహారములను తొలగించి వేయండి. ఛింది। కోసి వేయండి । "హ్రీం ఫట్ స్వాహా" అని బీజాక్షరములతో నిన్ను ఉపాసిస్తున్నాము.*

ఈ పైన చెప్పిన బీజాక్షర మంత్ర – అర్థములతో శ్రీచక్రములోని క్షేత్రపాలకుని పూజించాలి.

## శ్రీచక్ర కౌళ కుమారీదేవీ గాయత్రీ మంత్రోపాసన

**కుళకుమారి విద్మహే । మంత్ర కోటి సుధీమహి ।**
**తన్నః కౌళిః ప్రచోదయాత్ ॥**

*శ్రీచక్ర మహాయంత్రములో కుళకుమారి యొక్క తత్త్వమును, మహిమను తెలుసుకుంటూ, ఆ మంత్రకోటీదేవి యొక్క మహిమను స్తుతిస్తున్నాము. అట్టి సర్వమంత్ర స్వరూపిణియగు కౌళకుమారీదేవి మా బుద్ధులను ఉత్తేజింపజేయును గాక ।*

ఈ విధంగా కుమారీదేవిని మంత్రముగ్ధంగా, శ్రీచక్ర పూర్వకంగా అర్చించాలి.

ఏ సాధకుడైతే పై కౌళీ కుమారీ గాయత్రీ మంత్రమును లిఖించి (అభిలిఖించి, వ్రాసి), పూజిస్తాడో, అట్టివాడు మృత్యుపరిధులను దాటిపోయి, అమృతత్వమును సిద్ధించుకోగలడు. యశస్సును పొందుతాడు. ఉత్తమమైన, తాత్త్విక ప్రయోజనముతో కూడిన "ఆయుష్మంతుడు" కాగలడు.

☞. **బ్రహ్మరంధ్రమును ఛేదించి, తానే పరబ్రహ్మయై ఉండగలడు.**

☞. బ్రహ్మమును తెలుసుకొని, బ్రహ్మయే తానవగలడు ॥

**ఇతి త్రిపురాతాపినీ మహోపనిషత్ – తృతీయ అధ్యాయః॥**

# త్రిపురాతాపిన్యుపనిషత్ – చతుర్థోపనిషత్

## దేవ గాయత్రీ హృదయము – మృత్యుంజయ విద్య

**దేవతలు :** భగవన్ ! మహాదేవా !! "దేవగాయత్రీ హృదయము" అని చెప్పబడే ఆధ్యాత్మిక విశేషము గురించి మాకు వ్యాఖ్యానించి చెప్పండి. అనుగ్రహించండి.

- ఏది త్రైపురము, సర్వోత్తమము అయిన **"జాతవేదస సూక్తము"**గా వ్యాఖ్యానించబడుచున్నదో,
- దేనిని ఉపాసించటంచేత, యోగాభ్యాసము చేత సమస్త జీవులు జన్మ మృత్యు సంసార బంధముల నుండి విముక్తులు కాగలరో – అట్టి మృత్యువును జయించు మృత్యుంజయ విద్యను బోధించండి.

**పరమేశ్వరుడు :** ఓ సమస్త దేవతలారా ! **"మృత్యుంజయ విద్య", "దేవగాయత్రీ హృదయము"** అను పేరుగలది అగు ఆత్మ విద్యను వివరించి చెప్పుచున్నాను, వినండి.

**మృత్యుంజయ మంత్రము**

**ఓం త్ర్యంబకం యజామహే । సుగంధిం । పుష్టివర్ధనమ్ ।**
**ఉర్వారుకమివ బంధనాత్ మృత్యోర్ముక్షీయ । మా అమృతాత్ ॥**

**త్ర్యంబకేన అనుష్టుభేన మృత్యుంజయం దర్శయతి ।** త్ర్యంబక మంత్రము 'అనుష్టుప్' ఛందస్సు (ఛందోబద్ధ) మంత్రముచే మృత్యువును జయించు సిద్ధిని తప్పక పొందవచ్చును.

**దేవతలు : కస్మాత్ 'త్ర్యంబకమ్' ఇతి ?** త్ర్యంబకము అని ఎందుకంటున్నారు ?

**పరమేశ్వరుడు :** మూడు పురములు = (జీవ, ఈశ్వర, పరమాత్మలు); (స్థూల – సూక్ష్మ – కారణ దేహములు) ; (ఇహ – పర – పరాత్పరములు) ; (జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు) ; భూత – వర్తమాన – భవిష్యత్తులు – ఇత్యాది త్రిపురములు.

పై త్రయీ విశేషములన్నీ కూడా స్వస్వరూపముగా కలవాడు, ప్రదర్శనము చేయువాడు కాబట్టి – **"త్ర్యంబకమ్"** అనబడుచున్నారు.

**దేవతలు : అథ కస్మాత్ ఉచ్యత "యజామహే" ఇతి ?** ఎందుచేత ఆ మృత్యుంజయ స్వామి యగు పరమశివుని (మిమ్ములను) "యజామహే" అని స్తుతిస్తున్నారు ?

**పరమేశ్వరుడు :** పరమాత్మ కూటస్థుడు (The Root of all from which everything stems up), **అక్షరుడు,** అనేకముగా కనిపిస్తున్న ఈ దృశ్యమంతా ఏకస్థుడై ఉన్నవాడు – అనే అర్థము చెప్పటానికి 'య' 'జా' అని అంటున్నాము.

"మ హే" అనే ద్వౌ అక్షరములతో "స్వామీ ! మీ యొక్క మహిమను స్తుతిస్తూ సేవిస్తున్నాము" అని ఉద్దేశ్యించబడుతోంది. మృత్యుంజయుడు కనుక "యజామహే" అను వర్ణనము సముచితమై చెప్పబడుతోంది.

**దేవతలు : అథ కస్మాత్ ఉచ్యతే "సుగంధిమ్" ?** సుగంధిమ్ అని ఎందుకు పలుకబడుతోంది ?

**పరమేశ్వరుడు : సర్వతో యశమ్ ఆప్నోతి, తస్మాత్ ఉచ్యతే 'సుగన్ధిమ్' ఇతి ।** ఆ పరమాత్మ యొక్క యశస్సుయే సర్వత్రా వ్యాపించినదై ఉండటం చేత "సుగంధిం" అనబడుతోంది.

**దేవతలు : అథ కస్మాత్ ఉచ్యతే "పుష్టివర్ధనమ్" ఇతి ?** 'పుష్టివర్ధనమ్' అను మృత్యుంజయ మంత్రములోని శబ్దము యొక్క ఉత్తమార్థము వివరించండి.

**పరమేశ్వరుడు : యః సర్వాన్ లోకాన్ సృజతి, యః సర్వాన్ లోకాగ్ం తారయతి, యః సర్వాన్ లోకాన్ వ్యాప్నోతి – తస్మాత్ ఉచ్యతే "పుష్టివర్ధనమ్" ఇతి ।** ఈ సమస్త లోకములను సృష్టించునది, సమస్త జీవులు తనను ఆశ్రయించునప్పుడు సమస్త బంధములనుండి తరింపచేయునది, (అంతేకాకుండా) సమస్త లోకములుగా విస్తరిస్తూ పరిపుష్టి చేస్తున్నది – ఆ పరమాత్మయే కాబట్టి "పుష్టివర్ధనమ్" – అను శబ్దము (మృత్యుంజయ మంత్రములో) ఉపయుక్తము చేయబడినది.

**దేవతలు : అథ కస్మాత్ ఉచ్యతే "ఉర్వారుకమివ బంధనాత్ మృత్యోః ముక్షీయేతి" ?** "ఉర్వారుకము వలె (దోసకాయ వలె) మృత్యుబంధనము నుండి ముక్తము" – అను ప్రయోగము యొక్క ఉద్దేశ్యము దేనిచేత చెప్పబడినది?

**పరమేశ్వరుడు : సంలగ్నాత్ ఉర్వారుకమివ మృత్యోః సంసార బంధనాత్ । సంలగ్నత్వాత్ బద్ధత్వాత్ మోక్షీ భవతి। ముక్తో భవతి ।** ఉర్వారుకము (దోసకాయ) పెద్దదై పండిపోతూ కూడా దోసతీగ నుండి తనకు తానుగా విడివడదు. ఎవరైనా కత్తిరిస్తేగానీ తీగకు వేరవదు.

'ఓ పరమాత్మా ! మేము కూడా అనేక జన్మ – మృత్యువుల రూపమగు "సంసారము" అనే దోసతీగనుండి దోసకాయవలె విడివడలేకపోతున్నాము. మా సాధనలు పరిపక్వమవటము లేదు. పరమశివా ! మాపై జాలిపడి, ఈ మృత్యు రూప సంసారము నుండి (దోసతీగనుండి దోసకాయను విరచి విడదీసినట్లుగా) మమ్ములను విడదీయండి" – అను ప్రార్థన సూచిస్తోంది. ఈ దృశ్య వ్యవహారముతో మనస్సు వలన కలుగుచున్న సంబంధరూప బంధము తొలగిందా, ... ఇక అది మోక్షమే ।

**దేవతలు : అథ కస్మాత్ ఉచ్యతే "మాఽమృతాత్" ఇతి ? "మాఽమృతాత్"** – అని ఎందుకు మృత్యుంజయ మంత్రములో 'శబ్దము'గా చెప్పబడుతోంది ?

**పరమేశ్వరుడు : అమృతత్వం ప్రాప్నోతి । అక్షరం ప్రాప్నోతి । నిత్యత్వం ప్రాప్నోతి । స్వయం రుద్రో భవతి ।** ఓ దేవతలారా ! ఈ జీవుడు స్వతఃగానే ఆత్మగా అమృత స్వరూపుడు – అక్షరుడు, నిత్యుడు. ఇవన్నీ రుద్ర రూప లక్షణములు కాబట్టి స్వయముగా రుద్రుడే. అయితే, ఈ మార్పుచేర్పులతో కూడిన, సంగతి – సందర్భములతో కూడిన దృశ్యవ్యవహారమంతా కూడా – ఈ జీవునియొక్క (మృత్యువుకు కూడా సాక్షి అయిన) అమృత స్వరూపమును ఏమరపింపజేస్తోంది. అందుచేత, **"అమృతత్వమును మేము విడివడకుండెదము గాక।"** అని ప్రార్థన చేయబడుతోంది. అమృతత్వము జీవుని స్వాభావికము. మార్పు – చేర్పులతో కూడి దృశ్య విషయములతో ధ్యాస వాస్తవానికి అస్వాభావికము.

**దేవతలు :** హే భగవాన్ ! మాకు అంతరార్థమంతా విశదీకరించి చెప్పుచున్నారు. చాలా సంతోషము. అయితే మాదొక అభ్యర్థన. **కైః మంత్రైః స్తుతా భగవతీ స్వాత్మానం దర్శయతి?** అట్టి శైవ, వైష్ణవ, సౌర, గణేశ మంత్రములను బోధించండి. ఏ ఏ మంత్రములు అనుష్ఠానముచే భగవతి అగు త్రిపురాదేవిని దర్శించగలమో విశదీకరించండి.

**పరమేశ్వరుడు :** దేవతలారా ! వినండి.

(1) మనము ఇప్పుడు చెప్పుకున్న **త్ర్యంబకం యజామహే సుగంధిం, పుష్టివర్ధనమ్ । ఉర్వారుకమివ బంధనాత్ మృత్యోర్ముక్షీయ । మాఽమృతాత్"** – అనే త్ర్యంబక – మృత్యుంజయ మంత్రమును – ఉచ్చరణ మనోశబ్ద భావన – అర్థతాత్పర్య మననముల పూర్వకంగా ఉపాసన చేయటంచేత ఆ భగవతి స్వాత్మ స్వరూపమై సిద్ధించగలదు.

ఆ దేవదేవి పూర్వ – తత్పూర్వంగా 'ఓం' అను ఏక – అక్షర స్వరూపిణి అయి విరాజిల్లుచున్నది. ద్రష్ట – దృశ్య – దర్శన (అ–ఉ–మ)గా ఉపాసించబడు గాక । అదియే ఓంకారోపాసన.

ఇంకా కూడా....,

(2) **"ఓం నమశ్శివాయ"** అనే పంచాక్షరీ మంత్రోపాసన చేత కూడా ఆ భగవతి యొక్క స్వానుభవము సిద్ధించగలదు. కనుక ఈ యాజుషీ మంత్ర అనుష్ఠానముచే రుద్రత్వము, కల్యాణము ప్రాప్తించగలదు. అందుచేత । ఓ సమస్త జీవులారా ! ఈ 'ఓం నమశ్శివాయ" పంచాక్షరీ యాజుషీ మంత్రమును శబ్దార్థ మనన పూర్వకంగా ఉపాసించండి.

**(3) తద్విష్ణోః పరమం పదమ్**

**తద్విష్ణోః పరమం పదగ్ం సదా పశ్యన్తి సూరయః । దివీవ చక్షుః ఆతతమ్ "విష్ణో"ః ॥ విష్ణోర్యత్ పరమం పదమ్ ।**

ఏ విధంగా ఆకాశంలో అన్ని వైపులా సూర్యకాంతి ప్రసరిస్తూ, విస్తరించి ఉన్నదో, అట్టి కాంతిని జనులు సందర్శిస్తూనే ఉన్నారో,

– ఆ విధంగా,

శాస్త్ర హృదయమును అధ్యయనం చేస్తూ అర్థం చేసుకొన్నట్టి విద్వాంసులు, అజ్ఞానముతో యుద్ధం చేసి జయించివేసిన సూరులు (విద్వాంసులు) సర్వత్రా స్వాత్మ – సర్వాత్మ స్వరూపమగు తత్ – విష్ణు తత్త్వమునే సర్వత్రా దర్శిస్తూ ఉన్నారు.

ఎట్లాగా ? దృష్టిని జ్ఞానముచే దివ్యము చేసుకొని, దివ్య చక్షువులతో దర్శిస్తూ ఉండటం చేత! వేరుశనగ గింజలలో అంతటా నూనె ఓత ప్రోతమై ఉన్న తీరుగా, చెరుకుగడ్డలో చెరకు రసంలాగా, – విష్ణువే సత్‌స్వరూపుడై (ఉనికిచే, The Being చే) సర్వత్రా అనుస్రుతమై, సర్వమునకు వ్యతిరిక్తమై (వేరై) వ్యాపించి ఉన్నారు (లేక ఆత్మతత్త్వమే, స్వస్వరూపమై అన్ని వైపులా ఓతప్రోతమై ఉన్నది).

అట్టి సర్వత్రా వ్యాపించి ఉన్న "సర్వతోముఖుడు – సర్వము తన ముఖమే అయినట్టి" సర్వవ్యాపక విష్ణుతత్త్వదర్శనమే పరమపదము. ఆకాశము వలె అంతటా విష్ణు విభవానుభవమే, విష్ణుముఖ దర్శనమే పరమ పదము. అట్టి విష్ణుతత్త్వమును సూరులు (ధీశక్తిచే) సర్వత్రా వీక్షిస్తూ ఉన్నారు. ప్రియజీవులారా ! అట్టి సూరులమార్గమును ఆశ్రయించండి.

**సూరయో బ్రహ్మాదయో దేవా స ఇతి, సదా హృదయ ఆదధతే తస్మాత్ విష్ణోః స్వరూపమ్। వసతి తిష్ఠతి భూతేషు ఇతి। వాసుదేవ ఇతి।**
అట్టి 'సమస్తము విష్ణుస్వరూపమే' అను భావన – అవగాహన – అనుభవములను సూరులగు బ్రహ్మ మొదలైన దేవతలు ఎల్లప్పుడు హృదయమునందు – **ఆదధతే** – విచారణ కలిగినవారై ఉంటారు. విష్ణు స్వరూపమునందే నివసించువారై ఉంటారు. "సర్వభూతజాలమునందు నిత్య నివాసుడై ఉన్నవాడే ఆ వాసుదేవుడు" అని సందర్శిస్తూ ఉంటారు.

## వాసుదేవ మంత్రము – "ఓం నమో భగవతే వాసుదేవాయ"

### (ద్వాదశాక్షరీ మంత్రము)

| | |
|---|---|
| "ఓం–నమ" 'త్రి' అక్షరాణి । | (3 అక్షరములు) |
| "భగవత" – చత్వారి । | (4 అక్షరములు) |
| "వాసుదేవాయ" – పంచాక్షరాణి । | (5 అక్షరములు) |

**"ఓం నమో భగవతే వాసుదేవాయ"**

(1) (2) (4) (5) = (12)

పరమ పవిత్రమగు ఈ ద్వాదశాక్షరీ (12 అక్షరముల) మంత్రము సర్వతత్త్వ స్వరూపుడగు వాసుదేవభావనతో (పరమార్థంతో) ఉపాసించువాడు – **స ఉపప్లవం తరతి ।** – సమస్త గ్రహణ దోషములనుండి, అన్ని ఉపద్రవముల నుండి, సకల భయముల నుండి తరించగలడు. అతని పట్ల సర్వ విఘ్నములు నిర్విఘ్నము కాగలవు.

(ఉపప్లవములు = చంద్ర–సూర్యగ్రహణ దోషములు, ఉపద్రవములు, భయములు, విఘ్నములు, ఉల్కాపాతము మొదలైన ఉత్పాతములు)

ఆతడు పూర్ణాయుష్కుడు కాగలడు. ప్రాజాపత్యము (సర్వాధికారము) పొందగలడు. **రాయసోషము** (Royalty, రాజసము), **గౌపత్యము** (ఇంద్రియములపై ఆధిపత్యము) కలిగి ఉండగలడు.

## "ఓం" । – ప్రత్యగానందమ్ । ప్రణవ స్వరూపమ్ ।

'ఓం' యే ప్రణవస్వరూపంగా (అన్య – అనన్యములతో కూడిన పూర్ణస్వరూపంగా) ఉపాసించబడుతోంది. ఆత్మయొక్క సత్–చిత్‌లతో కూడిన ఆనంద స్వరూపమే ఓం । అందుచేత "ప్రత్యగానందము" అని వర్ణించబడుతోంది. బ్రహ్మ పురుషమ్ – బ్రహ్మము యొక్క పురుషకారమే ఇదంతా – అనునది 'ఓం' సంజ్ఞార్థము.

**"ఓం" = 'అ' కార, 'ఉ' కార, 'మ' కార ఇతి ।**

'అ' = కేవలమగు ఆత్మ (లేక) కేవల స్వస్వరూపము (The Absolute)

'ఉ' = ప్రకృతి. కల్పనా – భావనా – అనుభూత స్వరూపము (All that being Experienced)

'మ' = అనుభవి. 'జీవుడు' అని పిలువబడుచున్నవాడు (The Experiencer)

అట్టి **'అ'** కార, **'ఉ'** కార, **'మ'** కారములు ఏక స్వరూపమే **'ఓం'.**

**హగ్ంసః శుచిషత్ । వసు అంతరిక్ష సత్ ।**
**హోతా వేదిషత్ । అతిథిః దురోణ సత్ ।**
**నృషత్ వరసత్ । ఋత సత్। వ్యోమ సత్।**
**అబ్జా, గోజా, ఋతజా, అద్రిజా ఋతం బృహత్ ॥**

**'ఓం' అను అక్షరము దేని యొక్క సంజ్ఞయో, అట్టి ఆత్మ ఏ విధంగా సర్వత్రా వేంచేసినదై ఉన్నది ?**

**హగ్ంసః శుచిషత్ ।** ఒకే సూర్యుడు అన్ని చోట్లా కనబడుచూ ప్రకాశమానుడగుచున్నతీరుగా ఆత్మ భగవానుడు (లేక, విష్ణు భగవానుడు) అనేక అసంఖ్యాక దేహములలో అనేక జీవచైతన్యములను ప్రదర్శించుచున్నారు.

**వసుః అంతరిక్ష సత్ ।** ఒకే వాయువు అసంఖ్యాక వాయుతరంగాలుగా ఆకాశమంతా సంచరిస్తూ ఉన్న తీరుగా – ఒకే ఆత్మ తాను అఖండమై ఉండియే – అసంఖ్యాక జీవులలో అసంఖ్యాక మనోవృత్తులుగా ప్రదర్శనమౌతోంది.

**అతిథిః దురోణసత్ ।** యజ్ఞ వేదికలన్నిటిలో ఒకే అగ్ని వెలుగొందుచున్న విధంగా, ఒకే ఆత్మ సమస్త జీవుల బుద్ధులలో వెలుగొందుచున్నది.

**నృషత్ । వరసత్ । ఋతసత్ । వ్యోమసత్ । – అబ్జా, గోజా, ఋతజా, అద్రిజా ఋతమ్ బృహత్ ।** మానవులందరిలో, దేవతలలో, ఋగ్వేద ఋక్కులలో (ఋగ్వేద మంగళశ్లోక స్తుతులలో), సర్వత్రా ప్రదర్శనమగుచున్న ఆకాశము వలె, అబ్జములలో (సరస్సులలో, పద్మ సమూహములలో), గోవులలో, యజ్ఞములో, కొండలపై –

**బృహత్తర – మహత్తర సత్యమై ఆత్మయే వెలుగొందుచున్నది.**

## హంస (హగ్ంస)

సూర్యుడు తన యొక్క కిరణములచే సమస్తము తేజోమయము చేస్తున్న విధంగా,

– హంస (హగ్ంస)" అను అక్షరద్వయ – పరమార్థమైన కేవల – స్వస్వరూపాత్మా యొక్క తేజో పుంజములుగా ఈ దృశ్యములో కనిపించే "జల – గో – కొండ – గాలి ప్రజ్ఞాభిశక్తిచే పూర్వసౌరభముగా (పూర్వము ఆత్మయే అయి ఉన్నట్లుగా) అభిషేకిస్తూ ఉపాసించువాడు – ఆత్మాకాశ సౌర పరంధామమునందు నివాసము పొందగలడు.

## గణ – ఈశత్వము

ఈ దృశ్య సంబంధమైన సమస్తము (గణము) ఆత్మ చేతనే విస్తరించబడింది. ఎవరైతే

**"గణానాం త్వా గణపతిగ్ం హవామహే । కవిం కవీనాం ఉపమశ్రవస్తమమ్, జ్యేష్ఠరాజం బ్రహ్మాణాం బ్రహ్మాణస్పత ఆనః శృణ్వన్ ఊతభిః సీదసాదనం"** – అని మనము పైన చెప్పుకున్న త్రైష్టుభము (ద్రష్ట – దర్శన – దృశ్యముల ఏకత్వభావన)తో "పూర్వమార్గంగా ఏకార్ణమనువు" చే గణపతిని పూజిస్తూ ఉండగా గణేశత్వమును పొందగలడు.

## గాయత్రీ సావిత్రీ సరస్వతీ జపా మాతృక

గాయత్రీ సావిత్రీ సరస్వతీ మాతృకంగా చెప్పబడిన ఆత్మార్థముతో ఈ సమస్తము వ్యాప్తమై ఉన్నది. ఈ క్రింది మూల మంత్రముచే ప్రోక్తమై (చెప్పబడి) ఉన్నది.

**మూలమంత్రము**

1 **"ఐం" వాగీశ్వరీ విద్మహే, "క్లీం" కామేశ్వరీ ధీ మహి ।**
**"సౌః" తన్నో శక్తిః ప్రచోదయాత్ ॥** ఇది ఉదయ కాలమున ఉపాసించవలసిన –

2 ప్రాతఃకాల **"గాయత్రీ"** ।

3 మధ్యాహ్నోపాసన – **"సావిత్రీ"** ।

4 సాయంకాలోపాసన – **"సరస్వతీ"** ।

5 నిరంతరము – **"అజపా హంస"** ।

## మాతృకా పంచాశత్ (50) వర్ణ విగ్రహోపాసన

"పంచాశత్ వర్ణ విగ్రహము" 50 అక్షరముల శబ్ద తత్త్వముచే సమస్త భువనములు, శాస్త్రములు, ఛందస్సులు వ్యాప్తములై ఉన్నాయి. భగవతీ స్వరూపమే అట్టి 50 (పంచాశత్) వర్ణములుగా విస్తారితమై ఉంటున్నది.

ఓ దేవతలారా ! అట్టి భగవతీ దేవికి నేను ఎల్లప్పుడు నమస్కరిస్తూ ఉంటాను.

పైన చెప్పిన బీజాక్షర మంత్రమును (**"ఐం వాగీశ్వరి విద్మహే; క్లీం కామేశ్వరి ధీమహి । సౌః తన్నశ్శక్తిః ప్రచోదయాత్"** – అను మంత్రములో) నిత్యము త్రిపురసుందరీదేవిని ఉపాసించువాడు –

**– సర్వం పశ్యతి ।** సర్వమును చూడగలడు

**– సో అమృతత్వం చ గచ్ఛతి ।** అమృత స్థానమునకు వెళ్లగలడు

ఇది ఎరుగుటయే – ఉపనిషత్

***ఇతి త్రిపురాతాపినీ మహోపనిషత్ చతుర్థోపనిషత్ ।***

-----

## పంచమోపనిషత్ – "త్రైపురము"

**దేవతలు :** హే భగవాన్ । పరమేశ్వరా । దేవాది దేవా । స్వామీ । క్రియాకాండ విషయమై త్రిపురసుందరీదేవి నామమునందు "త్రైపురము" గురించి మీరు చెప్పినందుకు కృతజ్ఞులము.

ఇప్పుడిక సవివరణగా "పరము" గురించి నిర్విశేషంగా (without leaving anything) చెప్పమని ప్రార్థన.

**పరమేశ్వరుడు :** దేవతలారా ! వినండి.

"జాగ్రత్–స్వప్న–సుషుప్తులు" ఈ జీవుడు ప్రాపంచికంగా పొందుచున్న మూడు అవస్థలు కదా । ఈ మూడిటిని "త్రైపురములు" అని కూడా – పిలుస్తారు. ఈ మూడు అవస్థలు స్వయం కల్పిత సంచార పురములుగా కలిగియున్న ఈ జీవుని (త్రి అవస్థల) సాక్షీ చైతన్యమే తురీయము, అదియే **"తురీయ పురుషుని రూపము"** అని **"జీవుని తురీయ స్థానము"** అని, జీవుని **"సాక్షీమాత్ర స్వరూపము"** అని వర్ణితమై వివరించబడుతోంది.

తురీయము మాయ యొక్క అంత్యము (ఆవలిది) కూడా । అట్టి తురీయ స్వరూపమే పరబ్రహ్మము యొక్క నిర్దుష్టరూపము. అదియే "పరమ పురుషుడు" కూడా । అట్టి ఈ జీవుని యొక్క తురీయ స్థానమే (లేక) రూపమే కేవల జ్ఞానస్వరూపము (Knower prior to Knowing) కాబట్టి – **"చిద్రూపము"** సమస్తమునకు ఆవలిది కాబట్టి (పరమ్ – ఆత్మ) – **"పరమాత్మ"** ।

అట్టి తురీయ స్వరూపుడగు పరమపురుషుడే (లేక) కేవల చిద్రూపుడే (లేక) పరమాత్మయే

- సమస్త "వినటము"లకు **"శ్రోత"** । అందరిలో ఉండి వింటున్నవాడు పరమాత్మయే!
- సమస్తము ఆయన యొక్క మనన స్వరూపమే కనుక ఆయనయే "మన్త" । అందరి మనస్సులలో ఆలోచనలు చేస్తున్నవాడు ఆయనయే!
- సమస్తమునకు 'ద్రష్ట' ఆ పరమాత్మయే (He is the perceiver of all)।
- ద్రష్టత్వమునకు పరమాత్మ మునుముందటివాడే కనుక, – ఆయన అద్రష్ట కూడా (The One prior to perception)।
- సమస్తమునకు ప్రష్ట (అడుగువాడు, ప్రశ్నించువాడు) అగ్రేశ్వరుడు ఆయనయే । ( He is the One who is extending as all and He is the Inquiry Objective for all).

- సమస్తమునకు స్రష్ట (స్పష్టీకరించుచున్నవాడు కూడా ఆ పరమాత్మయే। (He is clarity of all).
- సమస్త ధ్వనులు ఆయననుండే బయల్వెడలుచున్నాయి. అందుచేత ఆయనయే ఘోష్ట (The Maker of all sounds).
- సమస్తము తెలుసుకుంటున్నది ఆ భగవానుడే కాబట్టి ఆయనయే "విజ్ఞాత" (He is the Knower of all else).
- ఆయన ప్రజ్ఞాన స్వరూపుడు. సర్వము తెలియజేయువాడు. కాబట్టి ప్రజ్ఞాత (The One who is making everything known).

అట్టి పరమాత్మయే జనులంతా మననము చేయవలసిన "మంతః పురషః" । ఆయనను తెలుసుకోవటము ఎట్లా ! ప్రతివాడు **"తన యొక్క ఆత్మయే ఆయన"** అని తెలుసుకోవలసిందే ! తనను తాను తెలుసుకుంటే ఆయనను తెలుసుకున్నట్లే ।

-----

**అట్టి పరమాత్మ యొక్క సమక్షమునందు గాని, ఆయన యందు గానీ...,**

⌘ లోకములు లేవు – అలోకములు లేవు.

⌘ దేవతలు లేరు. దేవతలు కానివారు లేరు.

⌘ **పశవో అపశవో న ।** జీవులు లేరు, జీవులు కాని వారు లేరు.

⌘ తాపసులు లేరు. అతాపసులు లేరు.

⌘ పౌల్కసుడు (శూద్రుడు) లేడు. అపౌల్కసుడు లేడు. ఎవడూ తక్కువ కాదు ।

⌘ విప్రుడు లేడు. విప్రుడు కానివాడు లేడు.

**స ఇతి ఏకమేవ పరంబ్రహ్మ విభ్రాజతే నిర్వాణమ్ ।** ఆ పరబ్రహ్మమే తరంగ కదలికలు లేని నిశ్చలమైన గాలివలె అనేకంగా (అజ్ఞాన దృష్టికి) కనిపిస్తూ సర్వత్రా సర్వదా ఏకస్వరూపుడై విభ్రాజమానుడై (ప్రకాశించువాడై, విలాసపురుషుడై) ఉన్నారు. ఆయనయే నిర్వాణ స్వరూపుడు.

అట్టి స్వస్వరూప – సర్వస్వరూప ఆత్మ పురుషుని పట్ల దేవతలు, ఋషులు, పితృదేవతలు మేలుకొని ఉన్నవారై (అనిమేషులై, కనులు మూయనివారై) సర్వ విద్యల అంతిమ సారముగాను, లక్ష్యముగాను దర్శిస్తూ ఉంటారు.

## "మనస్సు" – నిశ్చలము / చంచలము

ఇంకా పరమాత్మ గురించి ఈ విధంగా శ్లోకపూర్వకంగా బోధించబడుతోంది. గానం చేయబడుతోంది.

⌘ ఈ మనస్సు ఎల్లప్పుడూ అనేక దృశ్య విషయ పరంపరలపై వ్రాలే దుర్వ్యసనము (Bad Tendency) కలిగి ఉంటోంది.

**అతో నిర్విషయం నిత్యం మనః కార్యం ముముక్షుణా ।** ముముక్షువు (బంధవిముక్తి కోరువాడు) మనస్సును నిర్విషయము చేయు అభ్యాసమును ఆశ్రయించాలి.

**ముక్తి : యతో నిర్విషయో నామ మనసో "ముక్తిః" ఇష్యతే ।** మనస్సును నిర్విషయంగా కలిగియుండు ధారణయే ముక్తి, ఇంతకు మించి మరొక వేరైన అర్థమేదీ "ముక్తి" అనబడుదానికి – లేదు.

**దేవతలు :** మనస్సును నిర్విషయం చేయటం గురించి మరికొంత వివరించండి.

**పరమేశ్వరుడు :** 'మనస్సు' అనేది – ఆలోచించటము ప్రారంభించిన తరువాత – ఆలోచనలు యొక్క అభ్యాసరూపముచే ఏర్పడుచున్నట్టిదే. అట్టిది రెండు రీతులుగా రూపము కలిగి ఉంటోంది.

మనస్సు యొక్క

| "కేవలము" (Basic form) శుద్ధమగు కేవలీ స్వరూపమగు మనస్సు | "విషయాసక్తము" (Act of Extending) అశుద్ధమగు మనస్సు |
|---|---|
| కామ వివర్జితము | కామ సంకల్ప సహితము |
| నిశ్చలము | చంచలము |
| జలము | జల తరంగములవలె। |
| నిర్విషయ మనస్సు | సవిషయాసక్త మనస్సు |

- మనస్సు నిర్విషయాసక్తి అయి ఉన్న విభాగము - శుద్ధము / ముక్తము
- మనస్సు దృశ్య విషయముల పట్ల ఆసక్తిని అనుక్షణికంగా కలిగి ఉండటం జరుగుతూ ఉండే విభాగము - అశుద్ధము / బంధము
- ఆత్మ సర్వదా నిత్యనిర్మలము. కనుక, ఆత్మకు బంధమే ఉండదు.
- శరీరమో ? అది జడము. కాబట్టి శరీరానికి బంధమేముంటుంది ?

మన బంధము ఎవరికి ? మోక్షము ఎవరికి ?

**శ్లో॥ మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః ।**
**బంధనం విషయాసక్తిః । ముక్త్యైః నిర్విషయం మనః ॥**

ఈ జీవుని యొక్క బంధనమునకు గాని, (లేక) ముక్తికి గాని (మోక్షమునకు గాని) మనస్సే కారణం. అందుచేత బోధగాని, చికిత్సగాని చేయవలసినది మనస్సుకే। అంతేగాని జడమాత్రమగు శరీరమునకు గాని, స్వయం చైతన్యానంద స్వరూపమగు ఆత్మకు గాని కాదు.

అందుచేత ముక్తి కొరకై →

(1) **నిరస్త విషయా సంగమ్ ।** ఇంద్రియములకు ఎదురుగా కనిపిస్తున్న ఇంద్రియ విషయములతో స్నేహం చేస్తూ, సంగము (సంబంధము) కల్పించుకొని, విషయముల కామ సంకల్పములను కలిగి ఉన్న మనస్సును -

"వైరాగ్య - భక్తి - యోగ - జ్ఞాన" సాధనముల సహాయంతో నిరోధించాలి. విషయముల నుండి వెనుకకు మరల్చాలి.

(2) క్రమంగా మనస్సు తన యొక్క చాంచల్య స్వభావమును విడచిపెట్టే విధంగా అభ్యాసములను అతి జాగరూకతతో కొనసాగించాలి.

(3) ఆ విధంగా మనస్సు నుండి "ఏదో కావాలి, పొందాలి, తొలగాలి, ఎక్కడికో పోవాలి, ఇంకేదో రావాలి" మొదలైన అనేక రూపములతో కూడిన కామవాసనలను పారద్రోలి వేయాలి. దూరంగా విడచిపెట్టివేయాలి.

(4) క్రమంగా నిశ్చలమైన మనస్సును "అంతటా ఆత్మనే దర్శించటము" - అనే ఔషధముతో హృదయమును నిశ్చలము చేసే ప్రయత్నం ఎల్లప్పుడూ నిర్వర్తిస్తూ ఉండాలి.

(5) అట్టి హృదయములో ఆత్మభావనా రూపముగా నిశ్చలమైన మనస్సు యొక్క స్థితిని "అమనీ" లేక "అమనస్కము" అంటారు. అట్టి అమనీ (మనో అతీత) భావనను ఈ జీవుడు సంపాదించుకొంటూ ఉండగా అట్టి జీవుడు "పరమపదము" (The state of Al-Beyond, state of Self) పొందగలడు. "సమస్తము ఆత్మ ప్రదర్శనమే" అని అనుకుంటూ, అనుకుంటూ ఉండగా, ఇక "అనిపించటము" సిద్ధించగలదు.

**(6) తావదేవ నిరోర్ధవ్యం, యావత్ హృదిగతం క్షయమ్ ।** ఈ విధంగా హృదయములో జనించి – గతించే స్వభావంగల 'జగత్తు' అనబడేదంతా స్వస్వరూపాత్మగా నిశ్చలభావన కలిగే వరకు, హృదయములో భేదదృష్టులన్నీ తొలగేవరకూ – హృదయము అఖండమగు ఆత్మతో ఏకం అయే వరకు కొనసాగించాలి. ఆత్మభావన స్వాభావికంగా సిద్ధించిందా, ఇక ప్రయత్నములతో (సాధనలతో) పని లేదు.

**ఏతత్ జ్ఞానం చ, ధ్యానం చ ।** సమస్తమును ఆత్మగా భావన చేస్తూ, అట్టి ఆత్మయే సహజ స్వస్వరూపముగా దర్శించు ప్రయత్నమే జ్ఞానము, ధ్యానము కూడా. ఇక మిగతా గ్రంథ విశేషాలంటారా? అదంతాకూడా **శేషో అన్యో గ్రంథ విస్తరః ।** సమస్తము స్వస్వరూపాత్మగా దర్శించు "సాధన–సిద్ధులే" విస్తారంగా ఉపనిషత్, పురాణ అఖ్యాయిక, వ్యాఖ్యాన – ఇత్యాదుల పూర్వకంగా గ్రంథ విస్తరణగా జరుగుతోంది.

ఎప్పుడైతే సమస్తము ఆత్మగా సందర్శించటము – స్వాభావికము, అనునిత్యము అవుతుందో... అప్పుడిక చింతనలేదు. అచింతన ఉండదు. సమస్త పక్షపాతములు (Taking sides) తొలగిపోయి, బ్రహ్మము యొక్క (అహం బ్రహ్మస్మి । తత్త్వమసి – అను మహావాక్యముల) నిశ్చల స్వానుభవము సిద్ధించగలదు.

## యోగభావన

అందుచేత యోగి "స్వరం"తో ప్రారంభించి, ఆ స్వరమును అస్వరము (శబ్దము యొక్క జనన స్థానమగు ఆత్మ)యందు లయింపజేయాలి. అప్పుడిక **"పరము"** (All-beyond and All-present Self of one's own Self) – అనే స్వ–రము సిద్ధించుకోవాలి. అట్టి అస్వరస్వర స్థానములో – భావము లేదు. అభావము లేదు.

అది సంయోగ – వియోగమములకు ఆవలిది (అతీతమైనట్టిది). **తదేవ నిష్కళం బ్రహ్మ నిర్వికల్పం, నిరంజనమ్ ।** అదియే నిర్వికల్పము (సర్వ కల్పనలు లేనట్టిది), నిష్కళంకము (సమస్త కళంకములు – Mis attributions –తొలగినట్టిది) అగు **బ్రహ్మము । తత్ బ్రహ్మమ్–ఇతి జ్ఞాత్వా బ్రహ్మ సంపద్యతే క్రమాత్ ।** "అట్టి బ్రహ్మమే నేనై ఉన్నాను" – అని తెలుసుకుంటూ అనుకుంటూ ఉండగా క్రమంగా బ్రహ్మమే తానై ప్రకాశించుచున్నాడు.

సమస్తము అఖండమగు ఆత్మగా భావించటమే **"నిర్వికల్పము"** కూడా. అట్టి నిర్వికల్ప మనస్సును సంపాదించుకొన్నవానికి **"ఇదంతా నా ఆత్మయే"** అనుభవమునకు (శాస్త్రాలలో చెప్పుచున్న) ఎట్టి హేతువులతో, దృష్టాంతాలతో ఇక క్రమంగా అవసరము ఉండదు. **నిర్వికల్పమనన్తస్చ హేతు – దృష్టాంత వర్జితమ్ ।**

ఈ దృశ్య కల్పన యొక్క మొదలు – చివరలకు సంబంధమే లేనట్టి (అప్రమేయమైనట్టి) మనస్సు యొక్క రూపమును (ఉన్మనీ స్వరూపమును) ఎరిగిన బుద్ధుడు (అప్రమేయమగు ఆత్మను ఎరిగిన జ్ఞాని) – ఇక దేని చేతను బంధము పొందదు. దేని చేతను పరిమితుడు, సంబంధితుడు కాదు. దేని కొరకు దుఃఖించడు. ఆయా సందర్భములచే ఉత్సాహ – నిరుత్సాహములకు లోనుకాదు.

ఓ దేవతలారా ! అఖండమగు ఆత్మయే సర్వే సర్వత్రా వేంచేసినదై ఉన్నది. అట్టి ఆత్మయొక్క అవగాహన పొందిన తరువాత ఇక ఆతని పట్ల విరోధము ఏమున్నది ? Who can stop? ఉత్పత్తి అనునది లేదు । నాశనమగునది లేదు. బద్ధుడు లేడు. సాధకుడు లేడు. ముముక్షువు లేడు. ముక్తి లేదు. పరమార్థంగా ఇవన్నీ శాస్త్రములు సాధనకొరకై (సాధన దశలో) వర్ణిస్తూ ఉన్నప్పటికీ, ఆత్మజ్ఞానము సిద్ధించుకొన్నవానికి అవేమీ మొదలే లేవు. పరమార్థంగా (In its finest and highest meaning or sense)చూచే వానికి 'అవన్నీ లేవు' అనియే తెలిసిరాగలదు. అవన్నీ శాస్త్రములు ఎందుకు కల్పిస్తూ ఉపసంహారము (withdrawal) బోధిస్తూ ఉన్నాయో, – అతనికి తెలిసిపోతుంది.

జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు ఒకదానితో మరొకటి సంబంధము లేకుండా కనబడుచూ ఉన్నప్పటికీ, అవన్నీ తన అనుభవములుగా కలిగి ఉంటున్న (అవి నావైన) నేను ఒక్కటే. ఈ విధంగా,

"జాగ్రత్ స్వప్న సుషుప్తులు నావైన నేను" గురించి ఎవ్వడైతే సుస్పష్ట పరచుకుంటారో, అట్టి వాడు ఇక్కడి "జనన – మరణ చక్రము" నుండి విడివడి పునర్జన్మ రహితుడు అగుచున్నాడు.

**శ్లో॥ ఏక ఏవ భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః ।**
**ఏకధా బహుధా చ ఏవ దృశ్యతే జలచంద్రవత్ ॥**

సమస్త జీవులలోను వేంచేసి యున్న ఆత్మ ఒక్కటే. అట్టి నిత్యసత్యము – అమృత స్వరూపము అగు ఆత్మ సమస్త జీవులలో సమముగా వెలయుచున్నది. ఆకాశంలో చంద్రబింబము ఒక్కటే అయినప్పటికీ అనేక తటాకములలో (తరంగముల కదలికలను అనుసరించి) అనేక ఆకారములుగా కనబడుచున్నట్లుగా, **ఒకే ఆత్మ ఈ సమస్త జీవులలో అనేక రీతులుగా లౌకిక దృష్టికి కనబడుతోంది.**

## "కుండలోని ఆకాశము" దృష్టాంతము

ఒకచోట ఒక కుండ ఉన్నది. అప్పుడు మనము (1) కుండలోని ఆకాశము (చోటు, Place) అని పిలుస్తాము. కుండ పగిలితే ? లేక అక్కడినుండి కుండను తొలగిస్తే ? అప్పుడిక అది "కుండలోని ఆకాశము" అని అనిపించుకోదు. అట్లాగే ఆత్మ "శరీరమునకు చెందినది" అను విధంగా అనిపిస్తూ ఉన్నప్పటికీ కూడా, శరీరము నశించినప్పుడు ఆత్మ నశించదు. ఎవ్వడు కుండలోని ఆకాశము – అంతటా ఉన్న ఆకాశము (Space in the pot and all-present Space) ఏకమగు రీతిగా 'శరీరములు' అనే కుండలు పగిలినా జీవాత్మాకాశమునకు, పరాకాశమునకు భేదము లేదని, పరాకాశ స్వరూపమే ఈ జీవుని పట్ల సత్యమగు నిజస్వరూపమని గ్రహించువాడు పరమాత్మను ఇప్పుడే, ఇక్కడే ఎరుగగలడు.

బ్రహ్మము గురించి మొట్టమొదటగా శబ్దములతో చెప్పుకోవటం జరుగుతోంది. **శబ్ద మాయావృతో యావత్ – తావత్ తిష్ఠతి పుష్కలే।** అట్టి శబ్ద జాలమంతాకూడా మాయలోదే అయినప్పటికీ, అట్టి వారు 'బ్రహ్మము' గురించి ఉపాసన చేస్తూ ఉండగా, క్రమంగా తమస్సు (Ignorance, Misconceptions) తొలగుచుండగా, ఆతడు సర్వత్రా (అనేకములోని) ఏకత్వమును, ఆ ఏకత్వమే స్వస్వరూపముగాను దర్శించగలడు.

**శబ్దార్ణమ్ అపరమ్ బ్రహ్మ । తస్మిన్ క్షీణే యత్ అక్షరమ్ ।** శబ్దజాలమంతా అపర పరబ్రహ్మము (Process Level)। శబ్దము క్రమంగా క్షీణిస్తూ, శబ్దార్థ ప్రవేశము, అక్షరమగు ఆత్మయొక్క మహత్తారనుభవము సిద్ధించగలదు.

ఆత్మ శాంతి లభించాలంటే శబ్ద విద్యాంసుడైనవాడు అర్థము యొక్క అవగాహనతో ఆత్మస్వరూపమునందు మనో బుద్ధి ఇచ్ఛలను లయింపచేసి అక్షర స్వరూపము సిద్ధించుకోవాలి.

అందుచేత ఓ దేవతలారా ! (1) శబ్దము (2) ఆ శబ్దము సూచిస్తూ ఉన్న అక్షర బ్రహ్మము రెండూ మననము చేయవలసినవే.

**శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరంబ్రహ్మ అధిగచ్ఛతి ।** "శబ్ద బ్రహ్మము"నందు నిష్ణాతుడైనవాడు స్వయముగా "పరంబ్రహ్మము" స్థానము చేరుచున్నాడు.

అందుచేత ఓ సమస్త జీవులారా ! ఈ జీవుడు మేధావంతుడై క్రమంగా జ్ఞాన–విజ్ఞాన తత్పరుడై గ్రంథ పఠణము (శాస్త్ర అధ్యయనము) చేయునుగాక. అయితే గ్రంథము పఠించి ఊరుకుంటే సరిపోతుందా ? సరిపోదు. ఇంటి ఇల్లాలు ధాన్యమును దంచి, పొట్టును తొలగించి, అప్పుడు శేషించే బియ్యముతో వంటకు ఉపక్రమిస్తుంది కదా ! అట్లాగే **పలాలమివ ధాన్యార్థీ త్యజేత్ గ్రంథమ్ అశేషతః।**

ధాన్యపు పొట్టులాగా తాను చదువుతున్న చారిత్రక సంఘటనా సందర్భములను, పాత్రల గుణ దుర్గుణములను, సంబంధ బాంధవ్యములను, స్థలమహత్యములను, వ్యక్తిగత విశేషములను వదలి, గ్రంథములోని ఆత్మజ్ఞాన సంబంధ విశేషాలను స్వీకరించాలి.

**దేవతలు :** స్వామీ ! మరి శాస్త్ర గ్రంథములు అనేకములు ఉన్నాయి కదా ?

**పరమేశ్వరుడు:** అవును, అనేక గ్రంథములు ఉంటాయి. అయితే మాత్రం ఏమి ?

**శ్లో॥ గవాం అనేక వర్ణానాం । క్షీరస్యాపి ఏకవర్ణతా ।**
**క్షీరవత్ పశ్యతి జ్ఞానం, లింగినస్తు గవాం యథా ।**

ఒకాయనకు అనేక గోవులు ఉన్నాయి. అవన్నీ (గోధుమ, తెలుపు, నలుపు, చారలు మొదలైన) అనేక రంగులు కలిగి ఉన్నాయి. ప్రతీరోజూ ఆ యాజమాని అన్ని గోవుల వద్ద పాలు పితికి ఒక బిందెలో నింపుకుంటూ ఉంటాడు. ఆ పాలు బిందెలో పోసిన తరువాత – పాలన్నీ కలసిపోయి తెలుపుగా ఉంటాయేగాని, "ఆ పాలు ఏవి ఏ రంగు ఆవువి ఎంతెంత ?" అనే ప్రశ్న ఏమి ఉంటుంది ?

అట్లాగే ఒకడు ఆయా అనేక గ్రంథములు అధ్యయనము చేస్తూ చివరికి తెచ్చుకునేది "స్వస్వరూపాత్మ యొక్క స్వాభావిక – స్వరూప ఔన్నత్యము"యే అయివున్నది.

- – క్షీరము → ఆత్మ జ్ఞానము
- – అనేక ఆవులు → అనేక ఆధ్యాత్మ జ్ఞానము ప్రతిపాదించే గ్రంథములు వంటివి

అట్టి గ్రంథములన్నీ తెలుసుకుంటూ, నిశ్చయము చేసుకోవలసింది ఏమిటి ?

**శ్లో॥ జ్ఞాననేత్రం సమాధాయ సమహత్ పరమం పదం**
**నిష్కళం నిశ్చలం శాంతం "బ్రహ్మోఽహమ్" ఇతి సంస్మరేత్ ఇతి ॥**

"మహత్ పదము" అనే ఆత్మ తత్త్వానుభవమునకు సంబంధించినదైయున్న, నిష్కలము (కలనము – కల్పన లేనట్టిది), నిశ్చలము, పరమశాంతము అయిఉన్న

**"బ్రహ్మోఽహమ్ । అహం బ్రహ్మాస్మి॥"** అను పదమును స్మరించుట కొరకే గ్రంథముల అధ్యయనము సుమా !

ఎవ్వడైతే స్వస్వరూపమే అయి ఉన్న తురీయ బ్రహ్మయోనిని (జాగ్రత్ స్వప్న సుషుప్తులకు ఆవలిదగు కేవల స్వస్వరూపమును) తెలుసుకుంటాడో, అట్టివాడు అక్షరమగు ఆత్మాకాశమునందు స్థిరనివాసము సిద్ధించుకుంటున్నాడు.

అట్టి తురీయమగు బ్రహ్మయోని స్వరూప సంబంధమైన బ్రహ్మము గురించిన విద్యకొరకై పరమాత్మను మేము సర్వదా శరణు వేడుచున్నాము.

---

ఓ దేవతలారా !

పంచభూతములగు ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి, వాయువు మొదలైనవన్నీ కూడా "ఆకాశము" నుండే బయల్వెడలి, ఆకాశము నందే ఉనికి కలిగి ఉండి చివరికి ఆకాశమునందే లీనమగుచున్నాయి. "పాంచభౌతిక నిర్మితమైన ఈ భౌతిక దేహాలన్నీ కూడా (చిత్) ఆకాశము నుండే జనించి, ఆకాశము నందే చరించి, ఆకాశము నందే లీనమౌతున్నాయి"–అని గమనించబడు గాక!

ఎవ్వడైతే,

ఆత్మాకాశమే భౌతికాకాశమునకు జనన స్థానము అని గమనిస్తాడో,

అట్టి ఆత్మాకాశము భౌతికాకాశమునకు పీఠమని, స్పర్శించబడేదంతటికి పీఠమని, తేజస్సుకు పీఠమని, అమృతమునకు (జనన మరణములకు ఆవలి స్వస్వరూపమునకు) కూడా పీఠము అని – గ్రహించి ఉపాసిస్తాడో,

అట్టివాడు అఖండాత్మ – బ్రహ్మస్వరూపుడై వెలుగొందగలడు. 'తురీయపదము'ను పొందగలడు.

అట్టివాడే "శ్రీపీఠము, శ్రీచక్రము" ఎరిగినవాడు.

శ్రీ కామరాజీయమగు శ్రీచక్రములో అంతర్గతమైయున్న ఏకాదశ (11) భిన్నములైన – (పంచభూత, పంచప్రాణ, జీవాత్మ) విశేషములకు ఆది (The Begining Point) – ఏకము, అక్షరము అగు స్వస్వరూపాత్మయే – అని తెలుసుకుంటాడో, గ్రహిస్తాడో అట్టివాడు తురీయ స్వరూపుడై విరాజిల్లగలడు. తురీయాతీతుడై వెలుగొందగలడు

---

**ఇతి త్రిపురాతాపినీ మహోపనిషత్ సమాప్తమ్ ।**

**ఏతత్ సర్వం శ్రీ త్రిపురాదేవీ పాదారవిందార్పణమస్తు**

అథర్వణ వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 24 నారద పరివ్రాజకోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ పారివ్రాజ్య ధర్మపూగా,
అలంకారా యత్ ప్రబోధతః।
దశ ప్రణవ లక్ష్యార్థం యాంతి
తం రామమ్ ఆశ్రయే॥



ఈ సమస్త జగద్దృశ్యమును జగత్తుగా మొదలంట్లా సన్యసించి వేసి (సమర్పించివేసి), ఈ సమస్తమును బ్రహ్మముగాను, సత్‌విన్యాసముగాను స్వీకరించిన సన్న్యాసులగు పరివ్రాజకులు ఏ ఆత్మధర్మముచే అలంకరించబడుచూ దేనిగురించి ప్రబోధితులై ఉంటున్నారో...,

అట్టి దశ ప్రణవ (పంచ భూతములు + పంచ ఇంద్రియ మనస్సు) లక్ష్యార్థమగు ఆత్మారాముని ఆత్మబుద్ధి కొరకై ఆశ్రయిస్తున్నాము. ఆత్మారామ సిద్ధి కొరకై శ్రీరామచంద్రుని ఉపాసిస్తున్నాము.

## ప్రథమోపదేశః (1వ ఉపదేశము)

## శ్రీ నారదులవారి నైమిశారణ్య ఆగమనము

| | శ్లోకము | తాత్పర్యము |
|---|---|---|
| 1 | పరివ్రాట్ త్రిశిఖీ సీతా చూడా<br>నిర్వాణ మండలమ్।<br>దక్షిణా శరభం స్కందం<br>మహా నారాయణ అద్వయమ్॥ | ఇప్పుడు మనము (పాల యొక్క సారము స్వీకరించు హంస విధంగా) పదకొండు (11) ఉపనిషత్తుల సారమును స్మరిస్తున్నాము.<br>1. పరమహంస పరివ్రాజకోపనిషత్ 2. త్రిశిఖి బ్రాహ్మణోపనిషత్ 3. సీతోపనిషత్ 4. యోగచూడామణ్యుపనిషత్ 5. నిర్వాణోపనిషత్ 6. మండల బ్రాహ్మణోపనిషత్ 7. దక్షిణామూర్త్యుపనిషత్ 8. శరభోపనిషత్ 9. స్కందోపనిషత్ 10. మహోపనిషత్ (మహా నారాయణోపనిషత్) 11. అద్వయ తారకోపనిషత్ |
| | ఓం అథ కథాచిత్ పరివ్రాజక ఆభరణో<br>నారదః సర్వలోక సంచారం కుర్వన్,<br>న పూర్వ పుణ్య స్థలాని పుణ్య తీర్థాని<br>తీర్థీ కుర్వన్ అవలోక్య। | ఒకానొకప్పుడు పరివ్రాజక - ఆభరణుడు, దేవర్షి అగు నారదమహర్షి సమస్త లోకములలో సంచారము చేస్తూ ఉన్నారు. వెళ్లినచోట ఇతః పూర్వము సామాన్య స్థలములు కూడా ఆయన పాదస్పర్శచే పుణ్యతీర్థములు అవసాగాయి. |
| | చిత్తశుద్ధిం ప్రాప్య। | అట్టి తీర్థయాత్రల ఫలితంగా త్రిలోకసంచారి అగు శ్రీ నారదమహర్షి చిత్తశుద్ధిని మహత్తరంగా సంతరించుకొన్నారు. |
| | నిర్వైరః శాంతః దాంతః<br>సర్వతః నిర్వేదం ఆసాద్య। | ఇక దేని పట్ల ఏమాత్రము వైరము (Enemity) లేనివారైనారు - నిర్వైరః।<br>మనస్సుయొక్క చాంచల్యము **శాంతించింది.** ఇంద్రియములు నిగ్రహించబడినవై, క్లేశములను (All Difficulties) సహించునవై, ఓర్పు - ధైర్యము కలిగినవై, **'దాంతుడు'** అయినారు. సమస్త విశేషముల పట్ల వేదన (Worry) జయించి, నిర్వేదుడు అయినారు. నిర్వేదము సిద్ధించుకున్నారు. |
| | స్వరూప అనుసంధానం అనుసంధాయ, | సహజము, స్వాభావికము అగు 'స్వస్వరూపము'తో అనుసంధానము (Wel-connected) పొందసాగారు. |

| | | |
|---|---|---|
| | **నియమ ఆనంద విశేష గణ్యం మునిజనైః**<br>**ఉపసంకీర్ణం నైమిశారణ్యం పుణ్యస్థలం అవలోక్య** | ఆవిధంగా తీర్థయాత్రలు చేస్తూ, ఒక సమయంలో -<br>**"నియమమైన ఆత్మానంద విశేషముతో కూడినది, మహనీయులగు మునిగణముతో సమావేశమైనట్టిది - అగు నైమిశారణ్య పుణ్యస్థలము"**నకు వేంచేసారు. |
| | **స రి గ మ ప ద ని స సంజ్ఞైః,**<br>**వైరాగ్య బోధకరైః స్వర విశేషైః**<br>**ప్రాపంచిక పరాఙ్ముఖైః హరి కథాలాపైః।** | ఆ ప్రదేశమంతా కూడా - "స రి గ మ ప ద ని" - సప్తస్వర నాదములతోను, వైరాగ్యమును బోధించునది అగు సంగీత వాయిద్యములతోను, జ్ఞాన స్వర విన్యాసములతో నిండి ఉన్నది.<br>అక్కడి వారందరు ప్రాపంచక విశేషముల నుండి వెనుకకు మరలినవారై, నివృత్తి మార్గదర్శనములైనట్టి హరికథలను చెప్పుకుంటూ ఉన్నారు. |
| | **స్థావర జంగమ నామకైః**<br>**భగవత్ భక్తి విశేషైః**<br>**నర మృగ కింపురుష అమర**<br>**కిన్నర అప్సర ఉరగ గణాన్ సంమోహయన్।** | అక్కడి మునులు మొదలైనవారంతా తాము చెప్పుకుంటున్న భగవత్‌భక్తి విశేషములతో, కథలతో అక్కడి స్థావర జంగములను (కదలని రాళ్లను, కదిలే జీవులను), నరులను, మృగములను, అక్కడి వనములలో నివసించే కింపురుషులను, దేవతలను, కిన్నెరులను, అప్సరసలను, పాములను తన్మయులను, సంమోహితులను చేస్తున్నారు. |
| **2.** | **ఆగతం బ్రహ్మాత్మజం భగవత్ భక్తం**<br>**నారదం అవలోక్య,**<br>**ద్వాదశ వర్ష సత్రయాగ ఉపస్థితాః,** | బ్రహ్మ మానసపుత్రుడు, భగవత్ భక్తి సంపన్నుడు, దేవర్షి అగు శ్రీ నారద మహర్షియొక్క రాకను - అక్కడి ద్వాదశ (12) సంవత్సరముల సత్రయాగము నిర్వర్తిస్తూ పాల్గొనుచూ ఉన్న ముని గణము గమనించారు. |
| | **శృత అధ్యయన సంపన్నాః**<br>**సర్వజ్ఞాః తపోనిష్ఠా పరాః చ**<br>**జ్ఞాన వైరాగ్య సంపన్నాః శౌనక ఆది మహర్షయః**<br>**ప్రతి ఉత్థానం కృత్వా, నత్వా, యథా ఉచిత**<br>**ఆతిథ్య పూర్వకం ఉపవేశయిత్వా,**<br>**స్వయం సర్వే అపి ఉపవిష్టా।**<br>**భో భగవన్! బ్రహ్మపుత్ర! కథం ముక్తి ఉపాయో ప్లవ**<br>**అస్మాకం వక్తవ్యం? ఇతి ఊచుః ఇతి ఉక్తః।**<br>**తాన్ స హ ఉవాచ నారదః।** | వేదాధ్యయన సంపన్నులు, సర్వజ్ఞులు, తపోనిష్ఠాగరిష్ఠులు, పరతత్త్వ జ్ఞాన, వైరాగ్య సంపన్నులు అగు శౌనకుడు మొదలైన ఋషులంతా నారదునికి సుస్వాగతము పలికారు. నమస్కరించి, ఆతిథ్యపూర్వకంగా ఆహ్వానించి ఉచితాసనంపై ఆశీనులను చేశారు.<br>**శౌనకాది మునులు :** హే భగవన్! శ్రీ నారదమహర్షీ! బ్రహ్మమానస పుత్రా! మీ రాకతో మేము పునీతులమైనాము. మాకు ముక్తి కలిగే ఉపాయము ఏదో, అది బోధించి మమ్ములను అనుగ్రహించండి.<br>**శ్రీ నారద మహర్షి ఆ ప్రశ్న విని, సంతోషము పొందినవారై ఈవిధంగా పలుకసాగారు.** |
| | **సత్ కుల భవః, ఉపవీతః, సమ్యక్ ఉపనయన**<br>**పూర్వకం చతుః చత్వారింశత్ సంస్కార సంపన్నః,**<br>**స్వ అభిమతైక గురుసమీపే**<br>**స్వశాఖ అధ్యయన పూర్వకం**<br>**సర్వ విద్యాభ్యాసం కృత్వా,**<br>**ద్వాదశ వర్ష శుశ్రూషాపూర్వకం**<br>**బ్రహ్మచర్యం పంచవింశతి వత్సరం**<br>**గార్హస్థ్యం, పంచవింశతి వత్సరం వానప్రస్థ ఆశ్రమం**<br>**తత్ విధివత్ క్రమాత్ నిర్వర్త్య,**<br>**చతుర్విధ బ్రహ్మచర్యం షట్ విధ గార్హస్థ్యం** | 'మానవజన్మ' అనే సత్కులమున జనించినవాడు ఈ అవకాశమును సద్వినియోగం చేసుకోవాలి. చక్కగా ఉపవీతుడై, ఉపనయన సంస్కార పూర్వకంగా (జంధ్యము, విభూతి మొదలైన) 44 సంస్కారములను నిర్వర్తిస్తూ అనుష్ఠానపరుడై ఉండాలి.<br>తనకు అభిమతము (ఇష్టము) అయినట్టి గురువును సమీపించాలి. తనకు సంబంధించిన వేదవిభాగమును అధ్యయనపూర్వకంగా విద్యాభ్యాసం చేయును గాక.<br>ఆ విధంగా గురుశుశ్రూష నిర్వర్తించాలి.<br>12 సం॥ల - గురుశుశ్రూషా పూర్వక గురుకుల బ్రహ్మచర్యముచే,<br>25 సం॥ల - గృహస్థాశ్రమము నిర్వర్తించి,<br>25 సం॥ల - 'వానప్రస్థాశ్రమము' సేవించి<br>ఆయా శాస్త్రవిధులను నిర్వర్తించును గాక. |

**చతుర్విధ (4) – వానప్రస్థ ధర్మం సమ్యక్ అభ్యస్య,**

చతుర్ (4) విధములైన **బ్రహ్మచర్యమును** (వినటము, చదవటము, తెలుసుకోవటము, ఆచరణలోకి తెచ్చుకోవటము) ఆచరించును గాక.

షట్ (6) విధములైన గార్హపత్యమును (గార్హపత్య, ఆహవనీయ, దక్షిణ, సభ్య, అవసధ్య, ఔపాసనాగ్నులగు షట్ అగ్నులతో) అగ్ని కార్యముతో గార్హపత్యము (గృహస్థాశ్రమము) నిర్వర్తించటము.

(పూజ-ధ్యానము-గానము-యోగాభ్యానము అనబడు) నాలుగువిధములైన చతుర్విధ వానప్రస్థ ధర్మములు నిర్వర్తిస్తూ, సర్వత్రా సమదృష్టిని అభ్యసించాలి.

**తత్ ఉచితం కర్మ సర్వం నిర్వర్త్య,**

చతుర్విధ ఆశ్రమములైనట్టి బ్రహ్మచారి-గృహస్థ-వానప్రస్థ సన్న్యాసములలో - ఎక్కడ ఉంటే అక్కడ అక్కడి ఉచితమైన ఆర్యప్రకటిత ధర్మములు నిర్వర్తిస్తూ ఉండెదరు గాక!

**సాధన చతుష్టయ సంపన్నః.**
**సర్వ సంసార ఉపరి**

ఇంద్రియ నిగ్రహముతో కూడిన **శాంతము,** ఆత్మతత్త్వము గురించిన **విచారణ,** లభించిన దానితో తృప్తి రూపమగు **సంతోషము, సత్సంగము** అనబడే సాధన చతుష్టయమును అనుష్ఠించును గాక।

**"మనో వాక్ కాయ" కర్మభిః**
**యథా ఆశా నివృత్తః,**
**తథా వాసన ఈషణా ఉపరి అపి,**

మనస్సు, వాక్కు, శరీరముల సమస్త కర్మ విశేషములను, సర్వసంసార విశేషములను అధిగమించివేయాలి. సమస్త ఆశ-నిరాశలను నివృత్తింప (Withdrawal) జేయాలి. వాసన (Tendencies), ఈషణ (Expectations and Attachments) అధిగమించివేయును గాక.

**నిర్వైరః, శాంతో, దాంతః**

నిర్వైరః సర్వభూతేషు। ఎవ్వరిపట్ల ఎటువంటి వైరము కించిత్ కూడా కలిగి యుండకుండు గాక। జలంలో తరంగమువలె, ఈ జగత్ భావన (దృశ్యము) ఆత్మభావనయందు "సశాంతించినది" అగును గాక।

బాహ్య ఇంద్రియ నిగ్రహము కలిగి ఉండును గాక।

**సన్న్యాసీ పరమహంస ఆశ్రమేణ**
**అస్ఖలితః స్వస్వరూప ధ్యానేన**
**దేహ త్యాగం కరోతి –**

"సన్న్యాసీ పరమహంస" ఆశ్రమము స్వీకరించినవాడగు గాక। అస్ఖలిత (చలించని, చెడని, తొట్రుబాటు లేని) స్వస్వరూప ధ్యానము ఆశ్రయించును గాక। సర్వదా ఈ పాంచ భౌతిక దేహమును మానసికంగా త్యజించినవాడై ఉండును గాక।

**స ముక్తో భవతి।**

అట్టివాడు **'ముక్తుడు'** అగుచున్నాడు.

**ఇత్యుపనిషత్ – నారద పరివ్రాజకోపనిషత్ – "ప్రథమ ఉపదేశః"**

# ద్వితియోపదేశః (2వ ఉపదేశము)

## సత్యలోక ప్రవేశము

**1.** **అథ హ ఏనం భగవంతం నారదం సర్వే
శౌనకాదయః పప్రచ్ఛుః।
భో! భగవన్! సన్యాస విధిం నో బ్రూహి ఇతి।
తాన్ అవలోక్య నారదః –
"తత్ స్వరూపం సర్వం పితామహ ముఖేన
ఏవ జ్ఞాతుం ఉచితం" ఇతి ఉక్త్వా।**

అప్పుడు భగవంతుడగు నారదమహర్షికి శౌనకుడు మొదలైన మహర్షులు ఈవిధంగా విన్నపము చేసారు.

**శౌనకుడు మొదలైన ఋషులు** : హే భగవాన్! మాకు **"సన్న్యాస విధి"** గురించి దయచేసి బోధించండి.

**నారద మహర్షి** : మహనీయులగు మహర్షులారా! మునిసత్తములారా! అట్టి "సన్న్యాసము" యొక్క స్వరూపమంతా కూడా మనము నా పితృదేవులు, జగత్ పితామహులు అగు బ్రహ్మ భగవానుని ముఖతః వినటమే మనకు ఉచితము. ఆయనయే నాకంటే సుస్పష్టంగా చెప్పగలిగినవారు.

---

**సత్ర యాగ పూర్తి అనంతరం, తైః
సహ సత్యలోకం గత్వా,**

ఆ మాట విని శౌనకాది ఋషులంతా "సరే! అట్లాగే అగు గాక" అని పలికారు.

అక్కడ 12 సం॥ల సత్రయాగము పూర్తి అయినది.

ఆ తరువాత నారద మహర్షి తదితర శౌనకాది ఋషులు, మునులు అంతా "సత్యలోకము"నకు వెళ్లారు. సృష్టికర్త, ప్రేమమూర్తి అగు శ్రీ బ్రహ్మదేవుని దర్శించారు.

---

**విధివత్ బ్రహ్మ నిష్ఠాపరం పరమేష్ఠినం నత్వా,
స్తుత్వా, యథా ఉచితం,
తత్ ఆజ్ఞయా తైః స హ ఉపవిశ్య,**

విధివిధానంగా - బ్రహ్మ నిష్ఠాపరుడు, పరమేష్ఠి అగు బ్రహ్మభగవానునికి నమస్కరించారు. వారి అనుజ్ఞతతో వారు ప్రసాదించిన ఉచితాసనములపై నారదమహర్షి మొదలైనవారంతా సుఖాసీనులైనారు. నారదులవారు పితామహునితో ఇట్లా పలికారు.

---

**<u>నారదః పితామహం ఉవాచ :</u>
గురుః త్వం। జనకః త్వం। సర్వ విద్యా రహస్యజ్ఞః।
సర్వజ్ఞః। త్వం అతో మత్ ఇష్టం
రహస్యం ఏకం వక్తవ్యం।
త్వత్ వినా మత్ అభిమత రహస్యం వక్తుం।
కః సమర్థః। కిం ఇతి చేత్,
పారివ్రాజ్య స్వరూప క్రమం నో బ్రూహి ఇతి।
నారదేన ప్రార్థితః పరమేష్ఠీ సర్వతః
సర్వాన్ అవలోక్య,**

**<u>శ్రీ నారదమహర్షి</u>** : మహాత్మా! తమరు జగత్ గురువులు. సృష్టిలోని సమస్త జీవులకు తండ్రి. సమస్త విద్యల రహస్యము ఎరిగి ఉన్నవారు. సర్వజ్ఞులు. ఈ సృష్టి అంతటికీ మీరే బుద్ధిశాలురు.

ఒకానొక రహస్యమైన విషయం గురించి మీరు మాకు చెప్పవలసినదిగా ప్రార్థిస్తున్నాము. మేము తెలుసుకోగోరుచున్నది మీరు తప్ప, మాకు బోధించగలవారు ఇంకెవరు ఉంటారు?

మేము వినదలచిన అట్టి రహస్య విశేషము ఏమిటంటే "పరివ్రాజము" యొక్క స్వరూప క్రమము ఏమిటో దయచేసి మాకు వివరించి చెప్పండి.

ఈవిధంగా శ్రీ నారదమహర్షిచే ప్రార్థించబడినవారైన పరమేష్ఠి అగు బ్రహ్మభగవానుడు - అన్నివైపులా అక్కడ ఆసీనులైన మహర్షులను, మునులను ఒక్కసారి పరికించి చూచారు.

---

**ముహూర్తమాత్రం సమాధినిష్ఠో భూత్వా,**

ముహూర్త కాలము (12 సెకనుల సమయము) సమాధి నిష్ఠులు అయినారు.

**"సంసార ఆర్తి నివృత్తి అన్వేషణ ఇతి" – నిశ్చిత్య,**

"అవును. ఈ త్రిలోక జీవుల 'సంసారార్తి' యొక్క నివృత్తి ఏది?" అని అన్వేషణ చేసి, "సరే! సవివరణగా చెప్పుకుందాము" - అని నిర్ణయించుకున్నారు.

**నారదం అవలోక్య తమ్ ఆహ పితామహః।**

పితామహులవారు నారదుని చూచి ఈవిధంగా పలుకసాగారు.

---

**2.** **పురా, మత్ పుత్ర! పురుషసూక్త
ఉపనిషత్ రహస్య ప్రకారం నిరతిశయ
ఆకార అవలంబినా, విరాట్ పురుషేణ
ఉపదిష్టం రహస్యం। తే వివిచ్య ఉచ్యతే,**

ప్రియ కుమారా! నారదా! పూర్వము ఒకానొకపుడు విరాట్ పురుషునిచే పురుషసూక్తోపనిషత్ రహస్యము చెప్పబడింది.(వాసుదేవ నారాయణ ప్రోక్తమైన ముద్గలోపనిషత్ - ఋగ్వేదాంతర్గతము - ఇంద్రునిచే శ్రవణము చేయబడినది). ఆ రహస్యమునే నీకు వివరంగాను, విపులంగాను చెప్పుచున్నాను. అందరూ వినండి.

**తత్ క్రమం అతి రహస్యం బాధం**
**అవహితో భూత్వా శ్రూయతామ్।**

అట్టి పురుషసూక్తోపనిషత్ (ముద్గలోపనిషత్) క్రమవిధానము అతి రహస్యమైనది సుమా!

అందుచేత సావధానచిత్తులై వినెదరు గాక!

---

**భో నారద! విధివత్ ఆదౌ అనుపనీత**
**ఉపనయన అనంతరం తత్ సత్కుల**
**ప్రసూతః పితృ మాతృ విధేయః,**
**పితృ సమీపాత్ అన్యత్ర సత్ సంప్రదాయస్థం**
**శ్రద్ధావంతం సత్ కులభవం, శ్రోత్రియం,**
**శాస్త్ర వాత్సల్యం, గుణవంతం, అకుటిలం,**
**సద్గురుం ఆసాద్య, నత్వా, యథా ఉపయోగం**
**శుశ్రూషా పూర్వకం స్వ అభిమతం విజ్ఞాప్య,**
**ద్వాదశ వర్ష సేవాపురస్సరం సర్వ విద్యాభ్యాసం కృత్వా**

ప్రియ నారదా! 'అనుపనీతుడు', సత్కులజాతుడు అయినవాడు ముందుగా తల్లి - తండ్రులకు విధేయుడై ఉపవీత సంస్కారము (ఉపనయనము) పొందాలి.

అటు తరువాత తండ్రికి వేరైనట్టి సద్గురువును సంప్రదాయంగా సమీపించాలి. సత్-సంప్రదాయ సంపన్నుడు, శ్రద్ధావంతుడు, ఉత్తమ కుల సంజాతుడు, కుటిలము లేనివాడు అగు సద్గురువును ఆశ్రయించి నమస్కరించాలి. యథోచితంగా, శుశ్రూషపూర్వకంగా తనయొక్క విద్యార్థిత్వమును విజ్ఞాపనపూర్వకంగా తెలియజేయాలి.

12 సంవత్సరముల కాలము గురు సేవ నిర్వర్తిస్తూ సద్గురువు వద్ద సమస్త విద్యలు నేర్చుకోవాలి.

---

**తత్ అనుజ్ఞయా స్వకుల అనురూపాం అభిమత**
**కన్యాం వివాహ్య, పంచవింశతి (25) వత్సరం**
**గురుకులవాసం కృత్వా, అథ గురు అనుజ్ఞయా**
**గృహస్థ ఉచిత కర్మ కుర్వన్।**
**దౌః బ్రాహ్మణ్య నివృత్తిం ఏత్య**
**స్వ వంశవృద్ధి కామః పుత్రం ఏకం ఆసాద్య,**
**గార్హస్థ్య ఉచిత పంచవింశతి (25) వత్సరం తీర్త్వా,**
**తతః పంచవింశతి వత్సర పర్యంతం త్రిషవణం**
**ఉదక స్పర్శన పూర్వకం చతుర్థకాలం**

ఆ తరువాత గురు అనుజ్ఞ పొంది ఇంటికి మరలి గృహస్థాశ్రమం స్వీకరించును గాక। స్వకుల-నియమ-నిష్ఠలను అనుసరించి కన్యను వివాహమాడాలి. 25 సం॥లు గురుకులంలోగాని, (లేక) గురు అనుజ్ఞచే గృహస్థుడై గాని ఉచిత కర్మలు నిర్వర్తించాలి. బ్రాహ్మణ నిషిద్ధములగు కర్మలను విడచి తన వంశ వృద్ధి నిమిత్తంగా ఒక్క కుమారుని పొంది మరొక 25 సం॥లు గృహస్థుడుగా గడపాలి.

ఆ తరువాత 50 సం॥ నుండి (75 సం॥ల వయసు వరకు) 25 సంవత్సరముల కాలము జలస్పర్శ పూర్వకంగా నాలుగవ కాలము (50 - 75) గడపాలి.

---

**ఏకవారం ఆహారం ఆహరన్ నయం**
**ఏక ఏవ వనస్థో భూత్వా,**
**పురగ్రామ ప్రాక్తన సంచారం విహాయ,**
**నికర విరహిత తత్**
**ఆశ్రిత కర్మ ఉచిత కృత్యం నిర్వర్త్య,**
**దృష్ట శ్రవణ విషయ వైతృష్ణ్యం ఏత్య,**
**చత్వారింశత్ (40) సంస్కార సంపన్నః**
**సర్వతో విరక్తః చిత్తశుద్ధిం ఏతి**
**ఆశా అసూయా ఈర్ష్యా అహంకారం దగ్ధ్వా**
**సాధన చతుష్టయ సంపన్నః సన్యస్తుం అర్హతి।**

ఆ తరువాత (75 సం॥ తరువాత) ఒక పూట భోజనం (ఆహారము) తీసుకుంటూ, ఏకాకి అయి వనములో (అరణ్యంలో, ఏకాంత ప్రదేశంలో) వానప్రస్థుడై గడపాలి.

పట్టణ, గ్రామ సంచారములు విడచి పెట్టాలి. జనసమూహము లేనిచోట పర్ణశాలను నిర్మించుకొని వానప్రస్థాశ్రమమునకు ఉచితమైనట్టి యోగ-ధ్యాన-అధ్యయన-భక్తి కర్మలను నిర్వర్తిస్తూ వింటున్న, చూస్తున్న విషయములనుండి వైతృష్ణము (Non - desiring, Non depending) వృద్ధి చేసుకొనును గాక।

ముక్తికి కావలసిన (దాన-ధర్మ-ధ్యాన-ప్రాణాయామ-దైవోపాసన మొదలైన) 40 దైవీ సంస్కారములను (భగవద్గీతలో చెప్పిన భక్తి-జ్ఞాన-దైవీ సంపత్తి - గుణాతీత లక్షణములను) ఆశ్రయించి సర్వత్రా విషయములపట్ల విరక్తుడగును గాక। చిత్తశుద్ధిని సంతరించుకొనును గాక।

ఆత్మజ్ఞానాగ్నిచే ఆశ, అసూయ, ఈర్ష్య, అహంకారము మొదలైన జనన-మరణ-పునర్జన్మలతో కూడిన సంసార చక్రములో త్రోయుచున్న మనో దోషములను దగ్ధము చేసివేయును గాక।

సాధన చతుష్టయము (శమము, విచారణ, సత్సంగము, సంతోషములను) సుసంపన్నము చేసుకోవాలి. అప్పుడు వానప్రస్థము నుండి (లేక) తదితర బ్రహ్మచర్య గృహస్థాశ్రమముల నుండి, సన్న్యసించటానికి అర్హుడు కాగలడు.

**ఇత్యుపనిషత్ – నారద పరివ్రాజకోపనిషత్ – "ద్వితీయ ఉపదేశః"**

# తృతీయోపదేశః (3వ ఉపదేశము)
# క్రమ - ఆతుర సన్న్యాసము - అంతః సూత్రము

| | |
|---|---|
| **1.** **అథ హ ఏనం నారదః పితామహం పప్రచ్ఛః భగవన్! కేన సన్న్యాస అధికారీ వేతి ఏవమ్ ఆదౌ సన్న్యాస అధికారిణం నిరూప్య। పశ్చాత్ సన్న్యాస విధిః ఉచ్యతే।** | అప్పుడు నారదమహర్షి పితామహులవారిని ఈవిధంగా అడుగసాగారు.<br>**శ్రీ నారదమహర్షి :** భగవన్! బ్రహ్మ భగవన్। ఏఏ కారణాలుగా ఒకడు సన్న్యాసము స్వీకరించడానికి అర్హుడు. ఆ తరువాత సన్న్యాసము స్వీకరించి ఏఏ లక్షణములను, విధి-నిషేధములను కలిగి ఉంటారు? |
| **<u>పితామహ ఉవాచ:</u>**<br>**అవహితః శృణు।** | **పితామహుడు (సృష్టికర్త బ్రహ్మదేవుడు) :** ఓ నారదా! సమస్త శ్రోతలారా! మీరంతా అవహితులై (అవధానము పొందినవారై, ఇతర ధ్యాసలు లేనివారై) వినండి. |
| **అథ షండః, పతితో, అంగవికలః, స్త్రైణో, బధిరో, అర్భకో, మూకః, పాషండః, చక్రీ, లింగీ, వైఖానస, హర ద్విజౌ, భృతక, అధ్యాపకః, శిపివిష్టో, అనగ్నికో- వైరాగ్యవంతో అపి ఏతే న సన్న్యాస అర్హాః।** | ముందుగా సన్న్యాసము స్వీకరించడానికి ఎవరు అర్హులు కారో, వారి గురించి చెప్పుకుందాము. ఆ తరువాత సన్న్యాసవిధి విధానములు వివరించుకుందాము.<br>**సన్న్యాసమునకు అనర్హులు :**<br>షండుడు (నపుంసకుడు), పతితుడు (కుల-సంఘ శాస్త్రీయ, శ్రేయో మార్గములను విడచి అధర్మ మార్గములో పడినవాడు), అంగ వికారుడు (అంగ లోపములు కలవాడు), స్త్రైణుడు (అనుచితమైన స్త్రీ సంపర్కములు కొనసాగించువాడు), బధిరుడు (చెవిటివాడు), అర్భకుడు (బాలుడు, శాస్త్ర విషయములు ఎరుగనివాడు), మూగవాడు, పాషండుడు (వేదములపట్ల మొండితనముతో కూడిన దురభిప్రాయము కలవాడు, నాస్తికుడు), చక్రీ (ఇతరులపై కొండెములు చెప్పుచూ పరులను అల్పభావముతో చూచువాడు), లింగీ (ధన సంపాదనయే లక్ష్యముగా కలిగి, ఇతరుల గృహములు ఆశ్రయించువాడు), వైఖానసుడు (దేవాలయములో అర్చక వృత్తి చేయువాడు), హర ద్విజుడు (శివాలయంలో అర్చకుడు), భృతకుడు (భృతి-జీవనోపాధి కొరకై వేదాధ్యయనము చేయువాడు), అధ్యాపకుడు (వేద విద్య నేర్పువాడు), శిపి విష్టుడు (శారీరక దీర్ఘరోగములు కలవాడు), అగ్నికార్యములపట్ల విముఖత గల అనగ్నికుడు - వైరాగ్య భావములు కలిగియున్నా కూడా - వీరు అనర్హులు. |
| **సన్న్యస్తా యది అపి మహావాక్య ఉపదేశే న అధికారిణః।** | ఒకవేళ వీరు సన్న్యసించినా కూడా మహావాక్యములు బోధించటానికి అర్హులు అవరు. |
| **పూర్వ సన్న్యాసీ పరమహంసో అధికారీ।** | సత్-న్యాసమును ఆశ్రయించి, ఆత్మోపాసనకు సిద్ధపడ్డవాడే పరమహంసత్వమునకు అర్హత (అధికారము) పొందగలడు. |
| **పరేణ ఏవ ఆత్మనః చ అపి, పరస్య ఏవ ఆత్మనా తథా అభయం సమవాప్నోతి (సమ్ అవాప్నోతి) స "పరివ్రాట్" ఇతి స్మృతః।।** | ఆత్మకు పరమైనదంతా (వేరైనదంతా) విడచి, సమస్తమునకు ఆవల సాక్షీభూతమైయున్న ఆత్మస్వరూపమును ఆశ్రయించి, అభయము పొందినవాడు - పరివ్రాట్. |

**2.** **షండో, అథ వికలో అపి, అంధో**
**బాలకః చ అపి పాతకీ,**
**పతితః చ పరద్వారీ వైఖానస హరద్విజౌ,**
**చక్రీ, లింగీ చ పాషండీ శిపివిష్టో అపి అనగ్నికః,**
**ద్వి త్రి వారేణ సన్న్యస్తో భృతక**
**అధ్యాపకః అపి చ ఏతే న అర్హంతి**
**సన్న్యాసం ఆతురేణ వినా క్రమమ్॥**

పైన చెప్పుకొన్న షండుడు (నపుంసకుడు), వికలుడు (అంగలోపము కలవాడు), గ్రుడ్డివాడు, బాలుడు, పాతకములు చేసిన పాతకుడు, పతితుడు (ధర్మమార్గముల నుండి దిగజారినవాడు), వైఖానసుడు (వేదములకు వేరైన ఉపాసకుడు), హర ద్విజుడు (శివాలయములో అర్చకుడు), చక్రి (శంఖ చక్రములను చర్మముపై రచించుకొన్నవాడు), లింగీ (లింగార్చకుడు), పాషండ మతము (దైవ-వేద తిరస్కారము) ఆశ్రయించినవాడు, దీర్ఘరోగి అగు శిపివిష్టుడు, అనగ్నికుడు (అగ్ని కార్యములను తిరస్కరించువాడు), ఒకసారి సన్న్యసించి మరల సంసారము ఆశ్రయించిన ద్వి త్రి వారేణ సన్న్యస్తుడు, జీవనభృతిపై ఆశలు చావని భృతకుడు - వీరంతా క్రమ సన్న్యాసమునకు అర్హులు కారు. కానీ, **ఆతుర సన్న్యాసము తీసుకున్నా అర్హులు కారు.**

---

**<u>మునులు:</u> ఆతురస్య కథం కాలః?**
**కథం ఆర్యస్య సమ్మతః?**

**మునులు :** ఆతుర సన్న్యాసమునకు సరి అయిన సమయము ఏది? ఏ విధమైన ఆతుర సన్న్యాసము ఆర్యులచే (వేదజ్ఞులచే) అంగీకారము అవుతోంది?

**<u>బ్రహ్మ భగవానుడు:</u> ప్రాణస్య ఉత్క్రమణ**
**ఆసన్నకాలస్తు ఆతుర సంజ్ఞికః॥**

**బ్రహ్మ భగవానుడు :** "ఆతురము" అనగా మరణ కాలము సమీపించి, ప్రాణములు వదలటము సమీపిస్తున్న సందర్భము.

**నేతరస్తు (న ఇతరస్తు) ఆతురః కాలో**
**ముక్తిమార్గ ప్రవర్తకః॥**

ఆ విధంగా మరణ కాలము సమీపిస్తూ ఉండగా సన్న్యాసము స్వీకరించటము - ఆతుర సన్న్యాసము. అట్టి ఆతుర సన్న్యాసము ఆతుర కాలము కానప్పుడు స్వీకరిస్తే అది ముక్తి మార్గముగా అవదు.

---

**ఆతురే అపి చ సన్న్యాసే తత్ తత్ మంత్ర పురస్సరమ్**
**మంత్రా వృత్తిం చ కృత్వా ఏవ, సన్న్యసేత్ విధివత్ బుధః॥**

'ఆతుర సన్న్యాసము' అయినప్పటికీ, అది కూడా సన్న్యాస మంత్ర - విధి విధానంగా, మంత్రవృత్తిని పురస్కరించుకొనే శాస్త్ర పద్ధతిగా విబుధుడు సన్న్యసించాలి.

**ఆతురే అపి క్రమేచా అపి ప్రైష భేధో న కుత్రచిత్॥**
**న మంత్రం కర్మరహితం కర్మ మంత్రం అపేక్షతే॥**

ఆతుర సన్న్యాసము, క్రమ సన్న్యాసము - రెండు సందర్భములలో కూడా ప్రైష భేదము (శాస్త్రీయ విధి విధానము)లో భేదము ఏదీ ఉండదు.

**ఆకర్మ మంత్ర రహితం।**
**న అతో మంత్రం పరిత్యజేత్॥**

మంత్రరహితమైన కర్మ ఏదీ ఉండదు. అందుచేత మంత్రమును విడువనే కూడదు.

**మంత్రం వినా కర్మ కుర్యాత్ భస్మని ఆహుతివత్ భవేత్॥**

"మంత్ర రహితంగా కర్మను నిర్వర్తించటము" అనేది బూడిదతో ఆహుతి చేయటముతో సమానమౌతుంది.

---

**విధి ఉక్త కర్మ సంక్షేపాత్ సన్న్యాసస్తు**
**'ఆతురః' స్మృతః॥**

అందుచేత శాస్త్రములు సంక్షిప్తంగా నియమించిన కర్మకాండతో నిర్వర్తించునదే 'ఆతుర సన్న్యాసము' - అనబడుతోంది.

**తస్మాత్ ఆతుర సన్న్యాసే**
**మంత్ర ఆవృత్తి విధిః, మునే॥**

నారదా! అందుచేతనే ఆతురసన్న్యాసమునకు కూడా సంక్షిప్తంగా మంత్ర - ఆవృత్తి విధించబడుతోంది.

**ఆహిత అగ్నిః విరక్తః చేత్ దేశాంతరగతో యది,**
**ప్రాజాపత్యేష్టిం అప్సు ఏవ**
**నివృత్త్యైవ (నివృత్య ఏవ) అథ సన్న్యసేత్॥**

ఒకడు వేరే ప్రదేశమునకు తరలి వెళ్ళిపోవటంచేత అగ్నికార్యము (ఆహితాగ్ని) ఉపాసించుటపట్ల అనురక్తి కోల్పోయి, విరక్తుడు అయినప్పుడు కూడా సన్న్యసించదలచినప్పుడు, ఆ వేరే ప్రదేశములో జలముతో "ప్రజాపత్యేష్టి' నిర్వర్తించి, అప్పుడు 'నివృత్తి - ధర్మము' అయినట్టి సన్న్యాసము స్వీకరించాలి. సర్వ స్వదక్షిణ రూపంగా ఆచరించాలి.

| | | |
|---|---|---|
| | మనసా వా, అథ విధ్యుక్త<br>మంత్ర ఆవృత్య అథ వా జలే<br>శ్రుతి – అనుష్ఠాన మార్గేణ,<br>కర్మానుష్ఠానం ఏవ వా, | మనస్సుతోగాని, సశాస్త్రీయ మంత్రముగ్ధంగా గాని, జలము (నీటి) యందు 'శ్రుతి-అనుష్ఠానము' మార్గంగాగాను, కర్మానుష్ఠానపూర్వంగా "అనుష్ఠానము"ను పూర్తి చేయాలి. ఆ తరువాతనే విరక్తుడైన ఆతడు సన్న్యసించును గాక। |
| | సమాప్య సన్న్యసేత్ విద్వాన్<br>నో చేత్ పాతిత్యమ్ ఆప్నుయాత్॥ | విధి విధాన మంత్ర కర్మనిష్ఠాపూర్వకంగా ఆచరించకపోతే, అట్టి (అవిధి అవిధాన పూర్వకంగా) సన్న్యసిస్తే పతితము (Down Fall) పొందే అవకాశము ఉంటుంది. |
| **3.** | యదా మనసి సంజాతం వైతృష్ణ్యం సర్వ వస్తుషు, | ఎప్పుడైతే సమస్త దృశ్య విశేషములపట్ల, వస్తుజాలముపట్ల అనురక్తి తొలగుతుందో, తృష్ణారహితుడు (Sans all World-related Avocational urges) అవుతాడో, అట్టివాడే సన్న్యసించాలి. |
| | తదా సన్న్యాసం ఇచ్ఛంతి పతితః స్యాత్ విపర్యయే। | అట్లా కాకుండా తృష్ణ, అనురక్తి కలిగియే ఉండి సన్న్యసిస్తే, మనో వైకల్యములు జయించకుండా సన్న్యసిస్తే, అట్టివాడు పతితము (Down Fall) పొందగలడు. విపర్యుడు అవవచ్చు కూడా. |
| | విరక్తః ప్రవ్రజేత్ ధీమాన్,<br>సరక్తస్తు గృహే వసేత్। | సమస్త దృశ్య సంబంధమైన విషయములపట్ల 'విరక్తి' (Non-inquisitiveness, non-relatedness) కలిగినప్పుడు మాత్రమే సన్న్యసించాలి. అనురక్తి కలిగి ఉంటే గృహస్థాశ్రమమే ఉచితము. |
| | సరాగో నరకం యాతి<br>ప్రవ్రజన్ హి ద్విజ అధమః। | విషయములపట్ల 'అనురాగము' వదలక సన్న్యసిస్తే అట్టివాడు 'నరకము' అను అధమస్థానము పొందగలడు. |
| | యస్య ఏతాని సుగుప్తాని<br>జిహ్వా ఉపస్థ ఉదరం కరః<br>సన్న్యసేత్ అకృతో ద్వాహో<br>బ్రాహ్మణో బ్రహ్మచర్యవాన్ | **బ్రహ్మచర్యము నుండి సన్న్యాసాశ్రమం :** ఎవ్వనిపట్ల అయితే (1) నోరు (2) ఉపస్థ (శృంగారావయవము) (3) పొట్ట (4) చేతులు - ఈ నాలుగు తన వశమున ఉన్నవై కాపాడబడుచున్నాయో, అట్టివాడు (వ్రతనిష్ఠుడు) మాత్రమే బ్రహ్మచర్యమునుండి వివాహము మాని, సన్న్యాసాశ్రమము స్వీకరించవచ్చును. |
| | సంసారం ఏవ నిస్సారం<br>దృష్ట్వా సారది వృక్షయా | "ఈ సంసారము మొదలు - మధ్య - చివర కూడా నిస్సారమైనది. సారది వృక్షమువలె (బూరుగ చెట్టువలె) లేక (ముళ్ల చెట్టువలె) నిరుపయోగమైనది" - అని గమనించి, |
| | ప్రవ్రజంతి అకృతో ద్వాహః<br>పరం వైరాగ్యం ఆశ్రితాః | కర్మల పరిధులను అధిగమించివేసి పరమం అగు వైరాగ్యము ఆశ్రయిస్తూ సన్న్యసించుదురు గాక। |
| | ప్రవృత్తి లక్షణం కర్మ।<br>జ్ఞానం సన్న్యాస లక్షణమ్। | **"కర్మ" అనునది - ప్రవృత్తి రూపము.**<br>**"జ్ఞానము" అనునది - సన్న్యాస లక్షణము.** |
| | తస్మాత్ జ్ఞానం పురస్కృత్య<br>సన్న్యసేత్ ఇహ బుద్ధిమాన్। | అందుచేత బుద్ధిమంతుడైనవాడు - కర్మ, కర్మఫలముల పరిధులను క్రమంగా దాటివేసి, 'ఆత్మజ్ఞానము'ను పురస్కరించుకొని (ఆశ్రయించి) సమస్తమును సన్న్యసించినవాడై ఉండును గాక। |
| | యదా తు విదితం తత్త్వం (తత్ త్వం)<br>పరంబ్రహ్మ సనాతనమ్।<br>'తత్' ఏకదండం సంగృహ్యా<br>స ఉపవీతం, శిఖాం త్యజేత్॥ | ఓ నారదమహర్షీ! ఎప్పుడైతే 'తత్త్వజ్ఞానము'ను సంపాదించుకొని సనాతనమగు "పరబ్రహ్మము" అనే ఏకదండమును గ్రహిస్తాడో, - అట్టివాడు (తత్త్వభావనను ఆశ్రయిస్తూ), ఇక క్రమంగా భౌతికమైన దారపు నిర్మిత ఉపవీతమును, శిఖను త్యజించుచుండును గాక। |

**4. పరమాత్మాని యో రక్తో,**
**విరక్తో అపరమాత్మని**
**సర్వ-ఈషణా వినిర్ముక్తః**
**స భైక్షం భోక్తుం అర్హతి॥**

ఎవ్వడైతే సర్వాత్మకుడు, సర్వతత్త్వ స్వరూపుడు అగు "పరమాత్మ" పట్ల **'అనురక్తి'**ని పెంచుకుంటూ, (మరొకవైపు నుండి) - ("భార్యేషణ, పుత్రేషణ - ధనేషణ" అనబడే) త్రయ-ఈషణములనుండి 'విముక్తుడు' (getting relieved) అగుచూ ఉంటాడో, - అట్టివాడు భిక్షకుడు అవటానికి, భిక్షాన్నము భుజించటానికి అర్హుడు (Deserved) అగుచున్నాడు.

**పూజితో వందితః చ ఏవ**
**సుప్రసన్నో యథా భవేత్**
**తథా చేత్ తాడ్యమానస్తు**
**తదా భవతి 'భైక్షభుక్'।**

ఎవడైతే కొందరిచే పూజింపబడుచున్నప్పుడు, నమస్కరించబడుచున్నప్పుడు ఏవిధంగా సుప్రసన్నుడై ఉంటాడో,...

ఇతరులచే బాధించబడుచున్నప్పుడు కూడా అట్లాగే శాంతుడై, సుప్రసన్నుడై ఉండగలవాడే "భైక్షకభుక్తుడు".

---

**అహం ఏవ అక్షరం బ్రహ్మ**
**వాసుదేవాఖ్యమ్ అద్వయమ్**
**ఇతి భావో ధ్రువో యస్య**
**తదా భవతి 'భైక్ష భుక్'।**

**'వాసుదేవ' అని చెప్పబడుచు, అద్వయము, అక్షరము అయి ఉన్న బ్రహ్మము - అనగా ఎవరు? 'నేనే' అయి ఉన్న నాయొక్క పరబ్రహ్మ స్వరూపమే** - అను ధృవమైన భావము ఎవరిపట్ల చ్యుతి లేనిదై, స్వాభావికమై, నిశ్చయమై ఉంటుందో, - ఆతడే **'భైక్ష భుక్'**.

**యస్మిన్ శాంతిః శమః శౌచం**
**సత్యం సంతోష ఆర్జవమ్,**
**ఆకించన్యం అదంభః చ**
**స 'కైవల్య ఆశ్రమే' వసేత్॥**

**కైవల్య స్థానము** : ఎవనిపట్ల అయితే **శాంతము**, అంతరింద్రియ రూపమగు శమము, శుచి అయిన భావములు **(శౌచము), సత్యము, తృప్తి, సంతోషములు, ఆర్జవము** (ఋజుస్వభావము, మనసా-వాచా-కర్మణ ఏకత్వము, కుటిలత్వము లేకపోవటము), **అకించత్వము** (దీనత్వము లేకపోవటము), **దంభము లేకుండటము** - ఈ లక్షణములు స్వాభావికమో, - అట్టివాడు **"కైవల్య ఆశ్రమము"**లో నివాసము కలవాడు అగుచున్నాడు.

**యదా న కురుతే భావం**
**సర్వభూతేషు పాపకం**
**కర్మణా మనసా వాచా,**
**తదా భవతి భైక్షుకమ్॥**

కర్మణా మనసా వాచా (త్రికరణ శుద్ధిగా) - ఏ జీవునిపట్ల పాప (దోష, హింసా) భావములు, అభిప్రాయములు కలిగి ఉండడో (సమస్త జీవులు శుద్ధమగు పరబ్రహ్మ స్వరూపులే - అను భావము కలిగి ఉంటాడో) - అట్టివాడే **"భిక్షకుడు"**.

---

**దశలక్షణకం ధర్మం**
**అనుతిష్ఠన్ సమాహితః,**
**వేదాంతాన్ విధివత్ శ్రుత్వా**
**సన్న్యసేత్ అనృణో ద్విజః॥**

**సన్న్యాసమునకు అర్హత** : (1) దశ (10) లక్షణ ధర్మమును అనుష్ఠించువాడు (2) వేదాంత విద్యను సద్గురువు వద్ద విధి, విధానంగా విని హృదయస్థం చేసుకున్నవాడు, (3) ఋణగ్రస్తుడు కానివాడు- అట్టివాడు సన్న్యాసాశ్రమునకు అర్హుడు.

**ధృతిః క్షమా దమో అస్తేయం**
**శౌచం ఇంద్రియనిగ్రహః,**
**ధీః విద్యా సత్యమ్ అక్రోధో**
**దశకం ధర్మలక్షణం॥**

**ధర్మ లక్షణ దశకము : 1. ధృతి** (ఆత్మతత్త్వోపాసన పట్ల స్థిరత్వము. ధైర్యముతో కూడిన పట్టుదల) **2. క్షమాగుణము** (తప్పులు మన్నించగలగడం, ఓర్పు, సహనము) **(3) దమము** (బాహ్య ఇంద్రియ నిగ్రహము) **(4) అస్తేయము** (తనది కానిది స్వీకరించకపోవటము, దొంగ బుద్ధి లేకుండటము) **(5) శౌచము** (శుచి అయిన భావములు) **(6) అంతరింద్రియ నిగ్రహము** (శమము) **(7) ధీః** (ఉత్తమమైన తెలివితేటలు. నిర్మలమైన, సునిశితమైన, విస్తారమైన బుద్ధి) **(8) విద్య** (ఆత్మవిద్యా అధ్యయనము) **(9) సత్యము** (కల్పనా జగత్తును అధిగమించి ఉండటము) **(10) అక్రోధము** (క్రోధరాహిత్యము, ఎవ్వరిపై క్రోధము లేకుండటము) - ఇవి ధర్మలక్షణ దశకము (10).

**5. అతీతాన్ న స్మరేత్ భోగాన్**
**న తథా అనాగతాన్ అపి।**
**ప్రాప్తాంశ్చ న అభినందేత్ యః**
**స కైవల్య ఆశ్రమే వసేత్।**

ఎవ్వడైతే - జరిగిపోయిన కాలమునకు సంబంధించిన (మరియు) రాబోవు కాల సంబంధమైన ఇహ-పర భోగముల గురించి (ఇంద్రియ విషయానందముల గురించి) ఏ మాత్రము చింతించడో (One who does not worry at all), వర్తమాన భోగ సంపదల గురించి అభినందించడో (Does not depend on the sense enjoyments) - అట్టివాడు 'కైవల్యాశ్రమము'నందు వసించును.

**అంతస్థాని ఇంద్రియాణి అంతః,**
**బహిష్ఠాన్ విషయాన్ బహిః**
**శక్నోతి యః సదా కర్తుం**
**స కైవల్య ఆశ్రమే వసేత్।**

అంతరింద్రియములు అయినట్టి మనో-బుద్ధి-చిత్త-అహంకారములను అంతరముననే (లోనయే) నిరోధించి, బాహ్య కర్మ-జ్ఞాన దశ (10) ఇంద్రియ విషయములను బయటనే ఉంచివేసి (అంతరంగా ప్రవేశించనీయకుండా) ఎల్లప్పుడు వశము చేసికొని ఉండగలడో, - అట్టివాడే "కైవల్యాశ్రమవాసుడు".

---

**ప్రాణే గతే యథా దేహః**
**సుఖం దుఃఖం న విందతి,**
**తథా చేత్ ప్రాణయుక్తో అపి**
**స కైవల్య ఆశ్రమే వసేత్।**

ఏవిధంగా అయితే ప్రాణము పోయిన తరువాత ఈ భౌతిక దేహము సుఖముగాని, దుఃఖముగాని పొందటము లేదో, ఆవిధంగా ప్రాణములు శరీరములో ఉన్న సందర్భములో కూడా సుఖ-దుఃఖ భావములు ఎవడు పొందడో, అట్టివాడే కైవల్యాశ్రమ నిష్ఠుడు.

**కౌపీన యుగళం కంథా**
**దండ ఏకః పరిగ్రహః,**
**యతేః పరమహంసస్య**
**న అధికం తు విధీయతే।**

(1) కౌపీన యుగళము (గోచీల జతను), (2) కంథా (కంబళి), (3) ఏకదండము - యతి అయినట్టి పరమహంస. ఈ మూడింటిని మాత్రమే కలిగినవారై ఉంటారు. అంతకుమించి ఇంకేమీ కలిగి ఉండరు.

---

**యది వా కురుతే రాగాత్**
**అధికస్య పరిగ్రహమ్,**
**రౌరవం నరకం గత్వా**
**తిర్యక్ యోనిషు జాయతే,**
**విశీర్ణాని అమలాని ఏవ**
**చేలాని గ్రథితానితు,**
**కృత్వా కంథాం బహిః వాసో**
**ధారయేత్ ధాతురంజితమ్,**
**ఏకవాసా అవాసా వా**
**ఏకదృష్టిః అలోలుపః,**
**ఏక ఏవ చరేత్ నిత్యం**
**వర్షాసు ఏకత్ర సం వసేత్॥**

ఒకవేళ పై మూడుకు మించి ఇంకేమైనా 'రాగము'లో అధికంగా కలిగి ఉంటే, అట్టివాడు రౌరవాది నరకములో ప్రవేశించటమే కాకుండా, జంతు యోనులలో జన్మలు పొందగలరు.

చిరిగిన వస్త్ర ఖండములతో (with pieces of cloth) బొంతగా కుట్టుకొని, అట్టి వాటితోనే ఏక వస్త్రముగా కుట్టుకొని ధరించాలి.

(లేదా) బాహ్య వస్త్రములు త్యజించి, దిగంబరుడై చరిస్తూ, ఏకాగ్రత కలవాడై, అభేద దృష్టితో నిశ్చలుడై, భేద దృష్టులన్నీ జయించినవాడై, ఆశారహితుడై ఏకాకిగా సంచరిస్తూ ఉండును గాక! ఒకేచోట నివాసము కలిగి ఉండరాదు.

వర్షాకాలపు (వర్షఋతు) 4 నెలలు మాత్రమే ఒకచోట (ఒక్క ప్రదేశంలో) నివాసము చేయాలి.

---

**6. కుటుంబం పుత్రదారాంశ్చ**
**వేదాంగాని చ సర్వశః,**
**యజ్ఞం యజ్ఞోపవీతం చ**
**త్యక్త్వా గూఢః చరేత్ యతిః।**

**"యతి"** - అయినవాడు కుటుంబము, సంతానము, భార్య, వేదాంగములు (సాంఘికంగా, శాస్త్రీయంగా చేయవలసినవి, చేయకూడనివి) మొదలైనవన్నీ దాటిపోయినవాడు. యజ్ఞము-యజ్ఞోపవీతము కూడా త్యజించి ఉన్నవాడై ఉంటాడు. రహస్యంగా **"సమస్తము ఆత్మయే"** - అనే ఆత్మభావనయందు స్థితిని వీడకుండా ఈ ప్రపంచంలో సంచరిస్తూ ఉంటారు. తనయందు తానే, సమస్తము తానై సంచారము కలిగి ఉంటారు.

**కామః క్రోధః తథా దర్పః**
**లోభ మోహా ఆదయః చ యే,**

**తాంస్తు దోషాన్ పరిత్యజ్య**
**పరివ్రాట్ నిర్మమో భవేత్।**

**"పరివ్రాట్"** - ఏదో ఇంకా కావాలి, పొందాలి అనే **కామమును,** అంతరంగంలో ఉండే 'కోపము' రూపమగు **క్రోధమును,** "నేను అంతటి వాడిని, ఇంతటి వాడిని" - అనే **దర్పమును,** అవి-ఇవి నేను కలిగి ఉండి, నాకే చెందినవిగానే కనిపిస్తున్నాయి అనే **'లోభము'**ను, ఊహ-అపోహలతో కూడిన **మోహము** మొదలైన దోషములన్నీ పరిత్యజించి, "నాది-నేను" అనే మమకారము లేనివాడై ఉంటున్నాడు.

---

**రాగ ద్వేష వియుక్తాత్మా**
**సమ లోష్ట అశ్మ కాంచనః**
**ప్రాణి హింసా నివృత్తః చ**
**మునిః స్యాత్ సర్వ నిస్పృహః।**

**"ముని"** - రాగ ద్వేషములను వదలివేసినవాడై, మట్టి రాయి మరియు బంగారములను ఒకే దృష్టితో చూస్తూ, సహప్రాణులపట్ల బాధించటము, హింసలను విడనాడినవాడై, ఈ సమస్తము పట్ల నిస్పృహుడై (ధ్యాస, అభిరుచి, అభిప్రాయములను వీడినవాడై) ఉంటున్నాడు.

---

**దంభ అహంకార నిర్ముక్తో**
**హింసా పైశున్య వర్జితః।**
**ఆత్మ జ్ఞాన గుణ ఉప ఏతో**
**యతిః మోక్షం అవాప్నుయాత్॥**

ఎవ్వడైతే - యతి అయి, దంభము-అహంకారములనుండి పూర్తిగా విడివడినవాడై, హింస-లోభత్వ-దీనత్వములను త్యజించినవాడై, **"ఆత్మ అనగా ఏది?"** అని ప్రశ్నించి, తెలుసుకున్న ఆత్మజ్ఞాన గుణోపేతుడైన యతి - మోక్షమును పొందుచున్నాడు. **"నేను దేనికీ బద్ధుడను కాను"** అను స్వాభావికతను పునికిపుచ్చుకుంటున్నాడు.

---

**ఇంద్రియాణాం ప్రసంగేన**
**దోష మృచ్ఛతి అసంశయమ్।**

ఓ నారదా! శౌనకుడు మొదలైన మునీశ్వరులారా!

- ఇంద్రియ విషయముల గురించి ప్రసంగము (Talking repeatedly) కొనసాగిస్తూ ఉంటే, అప్పుడు సమస్త దోషములు ఈ జీవునిపట్ల వచ్చిపడుచూనే ఉంటాయి. ఇందులో అనుమానమే లేదు.

**సత్ నియమ్యతు తాని ఏవ**
**తతః సిద్ధిం నిగచ్ఛతి।**

అందుచేత, ఎవ్వడైతే ఈ ఇంద్రియములను సరిఅయిన (జ్ఞాన సముపార్జనా) మార్గంగా నియమిస్తాడో, అట్టివాడు తప్పక సిద్ధిని పొందగలడు.

---

> **న జాతు కామః కామానాం**
> **ఉపభోగేన శామ్యతి,**
> **హవిషా కృష్ణవర్త్మ ఇవ**
> **భూయ ఏవ అభివర్ధతే॥**

> "ఈ-ఈ కోరికలు తీరితే ఇక నాకు కోరికలు ఉండవు" - అనునది నిజం కాదు. అగ్నిలో హెూమ ద్రవ్యములు (నేయి మొదలైనవి) వేస్తున్న కొలదీ అగ్ని ఆరుతుందా? లేదు. కొంచెం తగ్గినట్లే తగ్గి ఇంకా ప్రజ్వరిల్లుతుంది. అట్లాగే విషయములు ఆశ్రయించిన కొలదీ 'కామము' అనే అగ్ని కొంచెము తగ్గినట్లే తగ్గి ఇంకా ఇంకా వృద్ధి చెందుతూనే ఉంటుంది.

**శ్రుత్వా స్పృష్ట్వా చ భుక్త్వా చ**
**దృష్ట్వా ఘ్రాత్వా చ యో నరః।**
**న హృష్యతి గ్లాయతి వా**
**స విజ్ఞేయో జితేంద్రియః।**

ఏ విజ్ఞాని అయితే - శుభ అశుభ విషయములను వింటున్నప్పుడు (while hearing), ఆయా వస్తు విశేషములను స్పృశిస్తున్నప్పుడు (while touching), ఆహారపదార్థాలను తింటూ ఉన్నప్పుడు (while eating), వాసన చూస్తున్నప్పుడు (while experiencing smell) - సంతోషముగాని, దుఃఖముగాని పొందడో, - అట్టివాడే జితేంద్రియుడు (ఇంద్రియములను జయించినవాడు).

---

**యస్య వాక్ మనసీ శుద్ధే**
**సమ్యక్ గుప్తే చ సర్వదా,**
**స వై సర్వం అవాప్నోతి**
**వేదాంత ఉపగతం ఫలమ్॥**

ఎవ్వడైతే, -

- తనయొక్క వాక్కును, మనస్సును శుద్ధము (pure) చేసుకొని,
- సర్వదా సమ్యక్ (సమ) దృష్టిని అంతరమున పదిలపరచుకొని ఉంటాడో,

అట్టివాడు వేదాంత శాస్త్రముచే ఎలుగెత్తి గానము చేయబడుచున్న "సోఽహమ్ - తత్త్వమ్" భావన అనే ఉత్తమ ఫలమును ఇప్పుడే, ఇక్కడే పొందుచున్నాడు.

| | |
|---|---|
| **7. సన్మానాత్ బ్రాహ్మణో నిత్యం ఉద్విజేత విషాత్ ఇవ** | బ్రాహ్మీదృష్టిని సంతరించుకొన్న బ్రహ్మనిష్ఠుడు - సన్మానములను స్వీకరించక, అట్టి సందర్భములను 'విషము' వలె భావిస్తూ ఉంటాడు. |
| **అమృతస్య ఏవ చ ఆకాంక్షేత్ అవమానస్య సర్వదా।** | అవమానము సందర్భమగుచున్నప్పుడు, "ఆహాఁ! ఇది నా మానసిక దోషములను తొలగించగలదు'' - అని భావిస్తూ సర్వదా అమృతప్రాయంగా భావిస్తూ ఉంటాడు. |
| **సుఖం హి అవమతః శేతే సుఖం చ ప్రతిబుధ్యతే।** | తన వలన ఇతరులకు అవమానము కలిగినప్పుడు తన అహంకారము వృద్ధి చెందుతుంది. పైకి సుఖముగా కనిపించి, చివరికి దుఃఖమునకు దారి తీయగలదు. |
| **సుఖం చరతి లోకే అస్మిన్ అనవమంతా వినశ్యతి।** | తనకు అవమానము ఎవరివలన అయినా కలిగినప్పుడో? అది ఇతః పూర్వపు కర్మదోషములను తొలగించి, సంచిత పాపములనుండి శుభ్రము చేయగలదు. కనుక అది సుఖమునకే దారి తీయగలదు.<br>అవమానము అమృతముగా భావించువాడు ఆనందముగా మేల్కొనుచున్నాడు. అవమానించినవాడు పాపచిత్తుడు అవటంచేత దుఃఖముతో నిదురించి, తిరిగి దుఃఖముతోనే మేల్కొనుచు చివరకు నాశనము పొందుచున్నాడు. "వినశ్యతి।'' |
| **అతివాదాన్ తితిక్షేత న అవమన్యేత కంచన।** | అంతే కాకుండా సామాన్య ప్రయత్నములచే లభించనట్టి "తితిక్ష'' అనే (అష్టాంగ యోగములలోని) యోగసిద్ధి లభించగలదు. |
| **న చ ఇమం దేహం ఆశ్రిత్య వైరం కుర్వీత కేనచిత్।** | అందుచేత ఏ ఒక్క ప్రాణితో కూడా వైరము కూడదు. ఈ దేహ-ఇంద్రియములతో ఏ జీవితోను శత్రుభావన కలిగి ఉండరాదు. |
| **క్రుధ్యంతం న ప్రతి క్రుధ్యేత్ ఆకృష్టః కుశలం వదేత్।** | ఎవరైనా కోపము ప్రదర్శిస్తున్నప్పుడు 'శాంతము' వహించి ఉండాలి. అంతేగాని తిరిగి క్రోధము ప్రదర్శించరాదు. 'కుశలము'నే (మీకు శుభము అగు గాక అని) పలకాలి. |
| **సప్త ద్వార అవకీర్ణం చ న వాచం అనృతాం వదేత్॥** | శబ్దము (Expression) సప్తద్వారముల నుండి (పంచేంద్రియములు, మనస్సు, బుద్ధిలనుండి) జనిస్తోంది. అట్టి సప్తద్వారముల నుండి ఎక్కడా అనృతము (అసత్యము) కూడదు. సత్యమునే పలకాలి, ప్రకటించాలి. |
| **అధ్యాత్మరతిః ఆసీనో, నిరపేక్షః నిరాశిషః, ఆత్మనా ఏవ సహాయేన సుఖార్థీ విచరేత్ ఇహ॥** | 'యతి' అయినవాడు అధ్యాత్మజ్ఞాన మార్గమునందు ఆసీనుడై ఉండును గాక. దేనినీ అపేక్షించనివాడై, దేనినీ అనుభవముగా పొందనివాడై, సమస్తము ఆత్మరూపముగా దర్శిస్తూ, ఆత్మభావనా సంపన్నుడై, సుఖ స్వరూపుడై సంచరించును గాక! (అనుభవములు ఉండి కూడా, అనుభవములు పొందనివాడు). |
| **ఇంద్రియాణాం నిరోధేన, రాగద్వేష క్షయేణ చ, అహింసయా చ భూతానాం అమృతత్వాయ కల్పతే।** | ఎవ్వడైతే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ క్రియలను ప్రదర్శిస్తున్న పంచేంద్రియములను విషయములనుండి ఉపసంహరించి, నిరోధించి ఉంటాడో, రాగ-ద్వేషములను క్షయింపజేసుకుంటాడో, సహజీవులపట్ల అహింస (బాధించకుండటము) ఆచరణగా (As a practice) కలిగి ఉంటాడో, అట్టివాడు మృత్యుపరిధులను దాటివేసి, అమృతత్వమును సిద్ధించుకోగలడు. |

| | |
|---|---|
| అస్థి స్థూణం స్నాయు బద్ధం,<br>మాంస శోణితలేపితమ్,<br>చర్మ అవబద్ధం, దుర్గంధ పూర్ణం<br>మూత్ర పురీషయోః।<br>జరా శోక సమావిష్టం<br>రోగ ఆయతనం ఆతురమ్। | ఈ దేహము ఎటువంటిది?<br>ఎముకలతోను, కండరములతోను, నరములతోను నిర్మితము, బంధితము అయిన పంజరము వంటిది. మాంస రక్తములతో నిండినది. చర్మముతో కప్పబడినట్టిది. మూత్రము, పురీషము (మలము)లతో దుర్వాసన కలిగి ఉన్నట్టిది. ముసలితనము, దుఃఖములతోను అనేక రోగములతోను కూడి ఉన్నది. |
| రజస్వలం అనిత్యం చ<br>భూతావాసం ఇమం త్యజేత్। | దుమ్ము, ముట్టు రూపమగు రజస్వలము (దుష్ట రక్తము) కలిగి ఉన్నట్టిది. పంచ భూత నిర్మితమైన ఈ భౌతిక శరీరము ఏమాత్రము నిత్యము కాదు. అట్టి ఈ భౌతిక దేహమును త్యజించి ఉండెదరు గాక। (దేహము ఉన్నా, లేనివారై ఉండండి). |
| మాంసా సృక్ పూయ విత్ మూత్రా<br>స్నాయు మజ్జ అస్థి సంహతౌ,<br>దేహే చేత్ ప్రీతిమాన్ మూఢో,<br>భవితా నరకేఽపి సః॥ | అటువంటి మాంస, రక్త, మూత్ర (ఉచ్చ), స్నాయు (సన్నటి నరములు), మజ్జ (ఎముకలలోని నూనె పదార్థము), బొమికలతో ఒక పంజరమువలె నిర్మితమైయున్న ఈ భౌతిక దేహముపట్ల ఎవడు ప్రీతి కలిగి ఉంటాడో, - అట్టి మూఢుడు భవిష్యత్తులో అనేక నరక మార్గములలో ప్రయాణించటానికి సిద్ధమగుచున్నవాడు. |
| సా కాలసూత్ర పదవీ<br>సా మహావీచివాగురా,<br>సా అసి పత్రవనశ్రేణీ<br>యా "దేహో అహమ్" ఇతి స్థితిః॥ | ఎవ్వడైతే **"ఈ దేహమే నేను. నేనుండాలంటే ఈ దేహము ఉండి తీరవలసిందే. దేహమునకు-నాకు అవినాభావ సంబంధము. దీని బాధలన్నీ నాకే చెందుతాయి. దీనితో ఏర్పడే సంబంధాలు నాకు చెందిన సంబంధాలే"** - అని తలుస్తాడో, అట్టివాడు కాల సూత్ర, మహావీచి మొదలైన నరకములన్నిటికీ లోను అగుచున్నాడు. |
| సా త్యాజ్యా సర్వయత్నేన<br>సర్వనాశే అపి ఉపస్థితే, | **"ఈ శరీరము ఒక శవము వంటిది. సర్వదా నశించినదే"** అను దృష్టితో సర్వయత్నపూర్వకంగా దీనిని త్యజించి ఉండాలి. |
| స్పృష్టవ్యా సా న భవ్యేన<br>స శ్వమాంసేవ పుల్కసీ॥ | ఒకడు కుక్క మాంసమును తింటున్న వానిని ఏవిధంగా తాకటానికి వెనుకాడుతాడో, ఇష్టపడడో, ఆవిధంగా ఈ శరీరమును స్పృశించకూడని (తాకకూడని) వస్తువుగా చూస్తూ ఉండాలి. |
| **8.** ప్రియేషు స్వ ఏషు సుకృతం<br>అప్రియేషు చ దుష్కృతమ్,<br>విసృజ్య, ధ్యాన యోగేన<br>'బ్రహ్మ' ఆప్యేతి సనాతనమ్॥ | (1) సుకృతమువలన (పుణ్యకర్మల వలన) కలిగే ప్రియమైన కర్మ ఫలములను, (2) దుష్కృతముల వలన కలిగే అప్రియమైన కర్మ ఫలములను - ఈ రెండిటిని విడచివేసి ధ్యానయోగము ఆశ్రయించిన వారై, సమస్తమునకు మునుముందే ప్రకాశమానమైయున్న - సనాతనమగు - బ్రహ్మమును పొంది ఉండెదరు గాక! |
| అనేన విధినా సర్వాన్<br>త్యక్త్వా సంగాన్ శనైః శనైః<br>సర్వ ద్వంద్వైః వినిర్ముక్తో<br>బ్రహ్మణ్యేవ అవతిష్ఠతి॥ | ఆయా కర్మ-భక్తి-జ్ఞాన-త్రిగుణాతీత - సర్వ సమర్పణ - ఇత్యాది ఆయా సర్వ ప్రయత్నములతో దృశ్యముతో (ఇంద్రియ విషయములతో) ఏర్పడే 'సంగము' (Attachment)ను నెమ్మది నెమ్మదిగా త్యజించి, సమస్త ద్వంద్వ భావములనుండి వినిర్ముక్తులై బ్రహ్మమునందే అవతిష్ఠుతులై ఉండెదరు గాక। |
| ఏక ఏవ చరేత్ నిత్యం<br>సిద్ధి అర్థం అసహాయకః। | **"అనేకముగా కనిపిస్తూ ఇదంతా కూడా ఏకమగు బ్రహ్మమే అయి ఉన్నది"** - అను భావనచే అసహాయమగు (sans all dependences) ఆత్మభావనా సిద్ధికై ప్రయత్నశీలురు కావాలి. |
| సిద్ధిం ఏకస్య పశ్యన్ హి,<br>న జహాతి। న హీయతే॥ | ఎవ్వడైతే ఏకత్వమును చ్యుతిలేని బుద్ధితో సిద్ధించుకొని ఉంటాడో, అట్టివాడు ఆత్మతత్త్వ మాధుర్యము విడువడు, తిరిగి హీనత పొందడు. |

**కపాలం వృక్షమూలాని**
**కుచేల అన్యసహాయతా,**

- "భిక్షాటనకు ఒక కపాలము (భిక్షపాత్ర), నివసించటానికి ఒక వృక్షము యొక్క మూలము, ఒళ్ళు కప్పుకోవటానికి ఒక వస్త్రం సరిపోతాయి" అని భావించువాడు ముక్తుడు.

**సమతా చ ఏవ సర్వస్మిన్**
**ఏతన్ ముక్తస్య లక్షణమ్।**

- చెట్టు మొదలే... కపాలము (భిక్ష గృహము)... సమస్త జగత్తు అన్యసహాయకము. సమతయే సర్వస్వము - ఈవిధంగా భావించటము ముక్తి లక్షణము.

---

**సర్వభూత హితః శాంతః।**
**త్రిదండీ, సకమండలుః,**
**ఏక ఆరామః పరివ్రజ్య**
**భిక్షార్థం గ్రామం ఆవిశేత్।।**
**'ఏకో' భిక్షుః అథ ఉక్తః స్యాత్**
**'ద్వా'వేవ మిథునం స్మృతమ్,**
**త్రయో గ్రామః సమాఖ్యాత**
**ఊర్ధ్వం తు నగరాయతే,**
**నగరం న హి కర్తవ్యం**
**గ్రామే వా మిథునే తథా।।**

"శాంతము" అనగా సమస్త జీవుల హితము (శ్రేయస్సు) కోరుకొనువాడై, పరమశాంతుడై జాగ్రత్ - స్వప్న - సుషుప్తులనే త్రిదండము ధరించినవాడై, కమండలువు ధరించినవాడై, ఏకమగు బ్రహ్మమునందు రమించువాడై ఉండువాడే భిక్షువు. **జీవాత్మ-పరమాత్మల మిథునము (పరస్పర సంయోగము) ఎరిగినవాడే భిక్షువు.**

ముగ్గురు భిక్షువులు / సన్న్యాసులు కలిసి ఉంటే అది "గ్రామము" అని పిలువబడుతోంది. ముగ్గురు కంటే ఎక్కువగా కలిసి ఉంటే అది "నగరము" అనబడుతోంది. నగరముగా గాని, గ్రామముగాగాని ఉండటము ఆత్మానుభవమునకు ఉచితం కాదు.

---

**ఏతత్ త్రయం ప్రకుర్వాణః**
**స్వధర్మాత్ చ్యవతే యతిః।**
**రాజ వార్తాది తేషాం స్యాత్**
**భిక్షావార్తా పరస్పరమ్।।**
**స్నేహ పైశున్య మాత్సర్యం**
**సత్ నికర్షాత్ (సన్నికర్షాత్)। అసంశయః।**

మిథునము (ఇద్దరు కలిసి ఉండుట), గ్రామము (ముగ్గురితో కలసి ఉండటము), నగరము (ముగ్గురికంటే ఎక్కువ మందితో కలసి ఉండటము), రాజకీయమైన వార్తలు (Political News) భిక్షువులు సంభాషించుకోవటము శ్రేయము కాదు. స్నేహము, పైశున్యము (లోభము), మాత్సర్యము మొదలైనవన్నీ వచ్చిపడతాయి. సత్య తత్త్వోపాసనకు నిరోధకాలు అవుతాయి. అనుమానం లేదు.

---

**ఏకాకీ నిస్పృహః తిష్ఠేత్,**
**న హి కేన సహాలపేత్।।**
**దద్యాత్ 'నారాయణ' ఏతి ఏవం**
**ప్రతివాక్యం సదా యతిః**

ఎవ్వరియొక్క ఏ సహాయము కూడా ఆశించకుండా ఏకాకిగా, జగత్ విషయాలు పట్టించుకోనివాడై యతి ఉండాలి. ఎవరితోనైనా మాట్లాడేటప్పుడు "నారాయణా! నారాయణా! నారాయణ!" అని ఎల్లప్పుడు పలుకుతూ ఉండు గాక!

---

**ఏకాకీ చింతయేత్ బ్రహ్మ**
**మనో వాక్ కాయ కర్మభిః।।**

ఏకాంతంగా ఏకాకి అయి మనో-వాక్-కాయము (శరీరము)లను 'బ్రహ్మము' గురించిన జ్ఞానానుభవసిద్ధికై నియోగించాలి. (ఉపనిషత్ వాఙ్మయము పఠించును గాక).

**మృత్యుం చ న అభినందేత**
**జీవితం వా కథంచన।**
**కాలం ఏవ ప్రతీక్షేత**
**యావత్ ఆయుః సమాప్యతే।।**

యతి మృత్యువును గాని, జీవించి ఉండటమునుగాని ఏ పరిస్థితులలోను అభినందించరాదు. అభిశంసించరాదు. రెండూ సమదృష్టితో చూస్తూ ఉండాలి.

ఆయుష్షు ముగుస్తున్న క్షణము వరకు కూడా పరతత్త్వ స్మరణ స్మరిస్తూ, భగవంతుని ఉపాసిస్తూనే ఉండుగాక!

**న అభినందేత మరణం న అభినందేత జీవితం।**
**కాలం ఏవ ప్రతీక్షీత నిర్దేశం (నిదేశం) భృతకో యథా।।**

జీవితమును, మరణమును అభినందించక, సేవకుడు రాజుగారి ఆజ్ఞను శిరసావహిస్తున్నట్లు కాలమునకు అంగీకారబుద్ధి కలిగి ఉండాలి.

| | మూలము | తాత్పర్యము |
|---|---|---|
| 9. | "అజిహ్వః", "షండకః" "పంగుః"<br>"అంధః" "బధిర" ఏవ చ।<br>"ముగ్ధః చ" ముచ్యతే భిక్షుః<br>షడ్భిః ఏతైః న సంశయః॥ | **భిక్షక పరివ్రాజక విశేష లక్షణములు**<br>నాలుక ఉండికూడా లేనివాడివలెను, పుంసత్వము ఉండికూడా ఉండనట్లు, కాళ్లు ఉండి నడవలేనట్లు, కళ్లు ఉండికూడా చూడలేని వానివలె, చెవులు ఉండికూడా చెవిటివానివలెను - ఈవిధమైన జ్ఞానముతో కూడిన ఆరు లక్షణములచే ఆ భిక్షకుడు సర్వ సంసార బంధములనుండి విముక్తుడు కాగలడు. సందేహమే లేదు. |
| | ఇదం ఇష్టం, ఇదం న ఇతి,<br>యో అశ్నన్ అపి న సజ్జతి,<br>హితం సత్వం మితం వక్తితం<br>అజిహ్వం ప్రచక్షతే। | **1. భిక్షక అజిహ్వుడు (నోరు లేనివాడు)**: తినేటప్పుడు "ఇది ఇష్టమైనది... అది కాదు" అనే ఇష్టాయిష్టములను వదలి, ఏ షడ్రుచులు లభిస్తే వాటిని యతి స్వీకరిస్తాడు. ఆహారము హితముగాను, సత్వము (ఉప్పు, కారము అధికం కానిది), మితముగాను - స్వీకరించటమును 'అజిహ్వము' అంటారు. |
| | అద్య జాతాం యథా నారీం, తథా షోడశ వార్షికీమ్<br>శతవర్షాం చ యో దృష్ట్వా నిర్వికారః, స షండకః॥ | **2. భిక్షక-షండకన్ (నపుంసకుడు)**: ఒక 16 సం॥ల యౌవన స్త్రీని, 100 సంవత్సరముల వయసు గల స్త్రీని ఒకే 'నిర్వికార' దృష్టితో చూడటము - షండకము (పుంసత్వమును అధిగమించటము). |
| | భిక్షార్థం అటనం యస్య,<br>విణ్మూత్ర కరణాయ చ।<br>యోజనాత్ న పరం యాతి,<br>సర్వదా 'పంగుః' ఏవ సః॥ | **3. భిక్షక-పంగుడు (కుంటివాడు)**: కర్మేంద్రియములలో ఒకటి అయిన పాదములను తన వశములో ఉంచుకున్నవాడు - సుదూరంగా యోజన దూరం నడవ కలిగి ఉండికూడా, భిక్షాటనము సందర్భంలో తప్పితే తదితర సమయాలలో ఎటూ వెళ్లక, కాళ్ళు ఉపయోగించువాడు - 'పంగుడు' అనబడుచున్నాడు. |
| | తిష్ఠతో వ్రజతో వా అపి,<br>యస్య చక్షుః న దూరగమ్<br>చతుః యుగాం భువం ముక్త్వా<br>పరివ్రాట్ సో 'అంధ' ఉచ్యతే॥ | **4. భిక్షక-అంధుడు (గ్రుడ్డివాడు)**: ఎవ్వనిచూపు అయితే ఆతడు కూర్చున్నప్పుడు, నడుస్తూ ఉన్నప్పుడు కూడా 4 యుగముల (నాలుగు బారల) దూరము దాటి ఉండదో (భూత-భవిష్యత్తులను) వదలి వర్తమానమునందు సందర్శనము కలదై ఉంటుందో, అట్టి పరివ్రాట్ - 'అంధుడు' అని అనబడుచున్నాడు. |
| | హిత-అహితం మనోరామం<br>వచః శోకావహం తు యత్,<br>శ్రుత్వా అపి న శృణోతి ఇవ<br>బధిరః స ప్రకీర్తితః॥ | **5. భిక్షక-బధిరుడు (చెవిటివాడు)**: మనస్సును రంజింపజేసేవి, హితంగాను - మెప్పుదలగాను అనిపించేవి, అహితంగాను-అవమానించినట్లుగాను, శోక భూయిష్టంగాను అనిపించేవి అగు ఆయా శబ్దజాలములు వింటూ కూడా విననివానివలెనే ఉండగలగటమే **బధిరము.** ఆతడే భిక్షక బధిరుడు (చెవిటివాడు) అగు పరివ్రాట్. |
| | సాన్నిధ్యే విషయాణాం యః సమర్థో వికల ఇంద్రియః,<br>సుప్తవత్ వర్తతే నిత్యం, స భిక్షుః 'ముగ్ధ' ఉచ్యతే॥ | **6. భిక్షక-ముగ్ధుడు (ప్రతిచర్యరహితుడు)**: ఎదురుగుండా (సాన్నిధ్యంగా) ఇంద్రియార్థాలు వచ్చి ఉన్నప్పటికీ, వాటిని స్వీకరించి అనుభవించే సమర్థత కలిగి ఉండి కూడా, ఎవ్వడైతే అత్యంత సుప్తము (మౌనము) వహించినవాడై ఉంటాడో ఆతడే - **భిక్షక ముగ్ధుడు.** (ముగ్ధుడు = ఏమీ తెలియనట్లుగా ఉండువాడు). |
| 10. | నటాది ప్రేక్షణం ద్యూతం<br>ప్రమదాం సుహృదం తథా,<br>భక్ష్యం భోజ్యం ఉదక్యాం చ<br>షట్ న పశ్యేత్ కదాచన॥ | **ఈ క్రింది ఆరు కూడా మొదలంట్లా వదలి ఉండాలి.**<br>**పశ్యేత్ న - షట్**<br>1. నటకుల నాట్య విన్యాసము చూచి ఆనందించటము.<br>2. ద్యూతక్రియ (పేకాట, పందెములు మొ॥).<br>3. ప్రమదము (కామ వాంఛలు) గల వారితో స్నేహము.<br>4. తిండిపోతుతనము.<br>5. రుచులపట్ల ఆకర్షణ.<br>6. ఉదక్యాం (రజస్వల స్త్రీతో సంభాషణ).<br>ఈ ఆరు భిక్షక పరివ్రాట్‌కు నిషేధము. |

| | |
|---|---|
| **రాగం, ద్వేషం, మదం, మాయాం<br>ద్రోహం, మోహం – పరాత్మను,<br>షట్ (6) ఏతాని యతిః నిత్యం<br>మనసా అపి న చింతయేత్॥** | **షట్ - నియతి**<br>1. వస్తు - విషయ - వ్యక్తుల పట్ల **రాగము**.<br>2. పైవాటి కొన్నిటిపట్ల ద్వేషము<br>3. మదము (గర్వము).<br>4. మాయ (లేనిది ఉన్నట్లుగా భావించి వెంటబడటము).<br>5. ద్రోహము (వంచన).<br>6. అన్యము పట్ల మోహము (Illusion).<br>ఈ '6' యతి ఆశ్రయించకపోవటమే 'నియతి'. వీటిని మనస్సులో కూడా అనుకోరాదు. తలచుకోకూడదు. |
| **మంచకం శుక్ల వస్త్రం చ<br>స్త్రీ కథా లౌల్యం ఏవ చ,<br>దివా స్వాపం చ, యానం చ,<br>యతీనాం పాతకాని షట్ ।** | **షట్ - పాతకములు**<br>యతి అగువాడు ఈ '6' కూడా పాతకములుగా గమనించు గాక।<br>1. మంచకము (మంచముపై పరుపులు వేసుకొని నిద్రించటము).<br>2. తెల్లటి వస్త్రములు ధరించటము.<br>3. స్త్రీల శృంగార సంబంధమైన వార్తలను, వర్ణనలను, దుష్ట సంభాషణలను మాట్లాడటము, వినటము, మననము చేయటము.<br>4. చంచలంగా (అశాంతిగా, ఆవేశముగా) ప్రవర్తించటము.<br>5. పగటి నిద్ర<br>6. ఇష్టమైన ప్రదేశాలకు సుదీర్ఘప్రయాణాలు -<br>ఈ ఆరు సుఖములు ఆశ్రయించటం పతన హేతువులు కాగలవు. |
| **దూర యాత్రాం ప్రయత్నేన<br>వర్జయేత్ ఆత్మ చింతకః।**<br><br>**సదా ఉపనిషదం విద్యాం<br>అభ్యసేత్ ముక్తి హైతుకీమ్॥** | ఆత్మ గురించిన చింతనయందు (ఆత్మతత్త్వజ్ఞాన విద్య యందు) అభ్యాసము కలిగియున్నవారు ప్రయత్నపూర్వకంగా దూరయాత్రలను ఆశ్రయించటము ఉచితము కాదు. (అవసరమైనంతవరకే అవి నిర్వర్తించాలి).<br><br>ఉపనిషత్తులలో చెప్పబడే ఆత్మవిద్య యొక్క దైనందికమైన (రోజువారీ) అధ్యయనము - అది 'ముక్తి'కి కారణము కాగలదు. |
| **న తీర్థసేవీ నిత్యం స్యాత్।<br>న ఉపవాసపరో యతిః,**<br><br>**న చ అధ్యయన శీలః స్యాత్<br>న వ్యాఖ్యాన పరో భవేత్॥** | ఈ నాలుగు కూడదు.<br>1. ఎల్లప్పుడూ తీర్థయాత్రలను నిర్వర్తించటము,<br>2. సుదీర్ఘంగా ఆహారము తీసుకోకుండా 'ఉపవాసవ్రతములు' నిర్వర్తించటము,<br>3. అధికాధికంగా అనేక గ్రంథములను అధ్యయనము చేయటము,<br>4. అతిగా వ్యాఖ్యానిస్తూ రోజులన్నీ గడిపివేయటము,<br>ఇవి ఏకాగ్రతను పాడుచేయగలవు. |
| **అపాపం అశఠం వృత్తం<br>అజిహ్మం నిత్యం ఆచరేత్।** | **అపాపం:** పాప కర్మలు చేయకుండా, కపటమును విడచిపెట్టాలి.<br>**అశఠం వృత్తం** : మూర్ఖత్వము, మోస సంస్కారములను దగ్గిరకు రానీయరాదు.<br>**అజిహ్మం:** జిహ్మము (వంకర భావములు, సోమరితనము, కపటము, కుటిలబుద్ధి) దరిజేరనీయరాదు.<br>ఆచరణ "పాప, శఠవృత్తి, జిహ్మ" రహితంగా ఉండాలి. |

| | |
|---|---|
| ఇంద్రియాణి సమాహృత్య కూర్మో<br>అంగాని ఇవ సర్వశః।<br>క్షీణ ఇంద్రియ మనోవృత్తిః<br>నిరాశీః నిష్పరిగ్రహః॥ | తాబేలు ఆపద శంకించినప్పుడు తన అవయవములను లోనికి ఉపసంహరించుకొను విధంగా,<br>మోక్షము కోరుకొనే ముముక్షువు ఏ ఏ ఇంద్రియ విషయములపై మనో వృతులు వ్రాలుచున్నాయో, అక్కడినుండి వెనకకు మరలుచూ ఉండాలి. ఆశారహితుడై, దేనినీ పరిగ్రహించనివాడై ఉండు గాక! |
| నిర్ద్వంద్వో। నిర్ణమస్కారః।<br>నిస్స్వధాకార ఏవ చ, | ఎవ్వడైతే...,<br>❊ సమస్త ద్వంద్వములను దాటివేసి, "ఆత్మ అద్వితీయము" అని గమనిస్తూ అద్వితీయుడై ఉంటాడో,<br>❊ ఆత్మపురుషునకు మాత్రమే నమస్కరిస్తూ, అన్యముగా కనిపించే దేనికీ నమస్కరించనివాడై ఉంటాడో,<br>❊ పితృదేవతలను కూడా ఆత్మ భావనతో దర్శిస్తూ, ఆత్మకు వేరుగా స్వధాకారమును దాటివేస్తాడో, |
| నిర్మమో నిరహంకారో నిరపేక్షో, నిరాశిషః, | ❊ "నాది, నాకు చెందినది. నేను దీని దీనికి చెందినవాడిని" మొదలైన సమస్త మమకారములను జయించి 'నిర్మమ'ను ఆశ్రయిస్తాడో (పరమాత్మా! సమస్తము నీదయ్యా! నాది కాదు- అని భావిస్తూ ఉంటాడో),<br>❊ వ్యష్టి అహంకారమును దాటిపోయి కేవలాత్మను ఆశ్రయిస్తూ నిరహంకారుడై ఉంటాడో,<br>❊ సర్వ అపేక్షలు (Fascinations) వదలి ఉంటాడో,<br>❊ ఆమిషము (లాభము, భోగము, భేషజము(Show off), ఇతరులను జయించాలనే ఆవేశము) వదిలించుకుంటాడో, |
| వివిక్త దేశ సంసక్తో | ❊ పరమాత్మపట్ల ఏకాంతోపాసన (ఒంటరిగా ఉపాసన) నిర్వర్తిస్తూ ఉంటాడో, |
| ముచ్యతే, న అత్ర సంశయ ఇతి। | **అట్టివాడు ఇక్కడే తప్పక ముక్తిని సంపాదించుకోగలడు. ఏమాత్రము సందేహమే లేదు.** |
| **11.** అప్రమత్తః కర్మ భక్తి జ్ఞాన సంపన్నః<br>స్వతంత్రో వైరాగ్యం ఏత్య,<br>బ్రహ్మచారీ గృహీ వానప్రస్థో వా। | బ్రహ్మచారిగాని, గృహస్థుడుగాని, వానప్రస్థుడు గాని, ఎవ్వరైనా<br>- ముందుగా బద్ధకమును జయించి అప్రమత్తుడై,<br>- భక్తి జ్ఞాన సంపన్నుడై,<br>- సర్వ బాధ్యతలనుండి విడివడి, స్వతంత్రుడై,<br>సన్న్యసించవచ్చును. |
| ముఖ్య వృత్తికా విత్ బ్రహ్మచర్యం<br>సమాప్య గృహీ భవేత్। | బ్రహ్మచారి మార్గమును ప్రారంభించి, 'విత్ (జ్ఞాన) వృత్తి''ని అవలంబించి, ఆత్మజ్ఞాన సంపన్నుడు కావాలి. ఈవిధంగా బ్రహ్మచర్యమును సమాప్తం చేసి గృహస్థాశ్రమము స్వీకరించును గాక। |
| గృహాత్ వనీ భూత్వా, ప్రవ్రజేత్।<br>యది వేతరథా, బ్రహ్మచర్యాత్ ఏవ ప్రవ్రజేత్। | గృహస్థాశ్రమము సేవించి అటుపై ప్రవ్రజుడై వానప్రస్థము (ఏకాంత స్థానము) ఆశ్రయించు గాక। లేదా బ్రహ్మచర్యాశ్రమమునుండే వానప్రస్థుడుగా ఆశ్రమము స్వీకరించవచ్చు కూడా. |

గృహాత్ వా వనాత్ వా అథ పునరవ్రతీ వా వ్రతీ వా, స్నాతకో వా అస్నాతకో వా ఉత్పన్న అగ్నిః అనగ్నికో వా, యత్ అహరేవ విరజేత్ తత్ అహరేవ ప్రవ్రజేత్।

ఒకడు గృహస్థుడు అయినా, వనసంచారి అయినా, వ్రతములు చేయుచున్న వాడైనా, వ్రతములు ఆచరించనివాడైనా, స్నాతకవ్రతుడై స్నానము ఆచరించువాడైనా (లేక) స్నాతక వ్రతుడు కానివాడైనా, అగ్ని అవధానుడు అయి, దైనందికమైన అగ్నికార్యము నిర్వర్తించనివాడైనా సరే - ఏ రోజు అనురక్తిని త్యజించి విరక్తి పొందుతాడో ఆ రోజే ప్రవ్రజము (సన్న్యాసాశ్రమము) స్వీకరించును గాక!

తత్ హి ఏకే ప్రాజాపత్యామేవేష్టిం కుర్వంతి।

విరక్తుడు అయిన వెంటనే ఇక సన్న్యాసాశ్రమ స్వీకార - సంసిద్ధత కొరకై **"ప్రజాపతి యాగము"** - నిర్వర్తించును గాక।

అథవా స కుర్యాత్ ఆగ్నేయ్యాం ఏవ కుర్యాత్

ఒకవేళ శాస్త్రీయంగాను, మంత్ర-తంత్ర ముగ్ధంగాను (పూర్వకంగాను) ప్రజాపతివేష్టి చేయలేని సందర్భంలో అగ్నికార్యమైనా (అగ్ని దేవతా యాగమైనా) చేసి సన్న్యసించెదరు గాక!

అగ్నిః హి ప్రాణః। ప్రాణం ఏవ ఏతయా కరోతి।

ఎందుకంటే, అగ్నియే ప్రాణము అయి ఉన్నది. ప్రాణము చేతనే జీవుడు ప్రాణ సమన్వితుడు అగుచున్నాడు.

తస్మాత్ త్రైధా తదీయాం
ఏవ కుర్యాత్ ఏతయా ఏవ త్రయో,
ధాతవో యదుత 'సత్త్వం రజః తమ' ఇతి।।

అనగా త్రి-అగ్నులను (ఆహవనీయ, దక్షిణ, గార్హపత్యాగ్నులను) వెలిగిస్తూ త్రిధాతు సంబంధమైన యాగము చేయాలి. సత్త్వ రజో తమో గుణములే త్రి-ధాతువులు. ఈ మూడు గుణములను అగ్నిలో హోమము చేయుదురు గాక।

---

**12.** "అయం తే యోనిః ఋత్వియో యతో జాతో అరోచథాః।
తం జానన్ నగ్న అరోహ అథానో వర్ధయా రయిం।।"

"అయం తే యోనిః ఋత్విజో"..., మంత్రమును అనుష్ఠించెదరు గాక.

---

ఇతి అనేన మంత్రేణ అగ్నిం ఆజిఘ్రేత్।

ఏషవా వై అగ్నేః యోనిర్యః ప్రాణః
ప్రాణం గచ్ఛ స్వాం యోనిం గచ్ఛ స్వాహా।

ఇతి ఏవం ఏవ ఏతత్ ఆహవనీయాత్
అగ్నిం ఆహృత్య, పూర్వవత్ అగ్నిం ఆజిఘ్రేత్।

ఈవిధమైన అగ్ని మంత్రములను పలుకుచూ, అగ్ని దేవుని ఆహ్వానిస్తూ అగ్నిని ప్రజ్వలింపజేయాలి.

"ఏషావా వై అగ్నేః యోనిర్యః ప్రాణః...." మంత్రమును చదువుతూ ఆహవనీయాగ్నినుండి అగ్నిని తీసుకొని పైన చెప్పిన, "అయం తే యోనిః..." మంత్రముతో ముందులాగానే అగ్నిని ఉజ్జ్వలింపజేయాలి.

---

యత్ అగ్నిం న విందేత్। అప్సు జుహుయాత్।

అపో వై సర్వా దేవతాః సర్వాభ్యో దేవతాభ్యో
జుహోమి స్వాహా।

ఇతి హుత్వ ఉత్ ధృత్య (ఉద్ధృత్య)
తత్ ఉదకం ప్రాశ్నీయాత్
"సాజ్యం హవిః అనామయం మోదం - ఇతి"

సన్న్యసించే సందర్భములో ఒకవేళ అగ్ని లభించకపోతే - జలముతో (నీటితో) హోమము చేయవచ్చును.

మంత్రము - "ఆపో వై సర్వదేవతాః సర్వాభ్యో దేవతాభ్యో జుహోమి స్వాహా।" - అను మంత్రముతో జలమును హోమం చేయాలి. ఆ తరువాత "సాజ్యం హవిః అనామయం మోదం ఇతి"తో ప్రాశితము చేయాలి. జలమును త్రాగాలి.

---

శిఖాం యజ్ఞోపవీతం పితరం పుత్రం కళత్రం
కర్మ చ అధ్యయనం మంత్ర అంతరం విసృజ్య
ఏవ పరివ్రజతి। ఆత్మవిత్ మోక్ష, మంత్రైః
త్రైధా తదీయైః విధైః తత్ బ్రహ్మ
తత్ ఉపాసితవ్యం ఏవ ఏతత్ ఇతి।।

శిఖను (పిలకను), యజ్ఞోపవీతమును (జంధ్యమును, బ్రహ్మ సూత్రమును), తండ్రిని, కుమారుని, భార్యను, దైనిందిక కర్మలను, 'పురాణ' మొదలైన అధ్యయనమును, ఇతర మంత్రోపాసనలను సర్వ అంతరములను (భేదములను) విడచిపెట్టి పరివ్రజము (సన్న్యాసము) స్వీకరించును గాక।

ధాతు త్రయమునకు సంబంధించిన ఆత్మజ్ఞాన సంబంధమైన ('సోఽహం' అను) మోక్ష మంత్రముతో సన్న్యాసాశ్రమమును స్వీకరించును గాక। బ్రహ్మతత్త్వమును మాత్రమే ఉపాసించాలి.

**పితామహం పునః పప్రచ్ఛ నారదః :**
**కథం అయజ్ఞోపవీతీ బ్రాహ్మణ ఇతి?**

అప్పుడు నారదమహర్షి బ్రహ్మదేవ భగవానుని ఈవిధంగా అడుగసాగారు.

"బ్రహ్మమును ఆచరించువాడు బ్రాహ్మణుడు" అని శాస్త్రార్థము కదా! బ్రహ్మోపాసనగా 'యజ్ఞోపవీతము' ధరించబడుతోంది. మరి, అయజ్ఞోపవీతుడు బ్రాహ్మణుడు ఎట్లా అవుతాడు? బ్రహ్మయజ్ఞోపవీతము త్యజించినవాడు "సత్‌న్యాస" (లేక బ్రాహ్మీన్యాస) రూపమగు సన్యాసి. మరి, యజ్ఞోపవీతము వీడమని ఎట్లా చెప్పబడుతోంది?

---

**13. తం ఆహ పితామహః :**
**హృదిస్థా దేవతాః సర్వాః।**
**హృది ప్రాణః ప్రతిష్ఠితాః।**

**పితామహుడు (బ్రహ్మభగవానుడు)**: - బిడ్డా! నారదా! దేవతలు ఉన్నదెక్కడయ్యా? సర్వదేవతలు హృదయములోనే (హృదయాంతర్గతులై) ఉన్నారు. హృదయములోనే ప్రాణము స్థానము కలిగి ఉన్నది. ప్రాణతత్త్వమే సర్వ దేవతల రూపంగా వెలయుచున్నది. (Prana Energy is manifesting in the form of all Divinities and Divine forms).

**హృది ప్రాణశ్చ, జ్యోతిశ్చ।**
**త్రివృత్ సూత్రం విదుః బుధాః॥**

తత్త్వజ్ఞులగు బుద్ధిమంతులు 'ప్రాణశక్తి' అనే జ్యోతిస్వరూపమే త్రివృత్ సూత్రము (మూడు ధారముల యజ్ఞోపవీత సూత్రము) గా ఉన్నదని గమనిస్తున్నారు.

---

**స శిఖం వపనం కృత్వా,**
**బహిః సూత్రం త్యజేత్ బుధః।**

అందుచేత ఆత్మవిద్య తెలిసిన బుధుడు శిఖను వపనం చేసి (తొలగించి) బాహ్యసూత్రమును త్యజించి ఉంటున్నారు.

**యత్ అక్షరం పరం బ్రహ్మ**
**తత్ సూత్రం ఇతి ధారయేత్।**

బాహ్యమగు ప్రత్తితో తయారయిన సూత్రమును త్యజించి - ఏది అక్షరము (Changeless) అయి ఉన్నదో, - అట్టి పరబ్రహ్మతత్త్వమునే సూత్రముగా ధరించినవారై ఉంటున్నారు. "బ్రహ్మైవ ఇదగ్ం సర్వం" అనునదే వారికి యజ్ఞ సూత్రము.

**సూచనాత్ సూత్రం ఇతి ఆహుః।**
**'సూత్రం' నామ పరంపదమ్।**

భౌతికంగా ధరించే 'ప్రత్తి దారము' నిర్మితమైన సూత్రము 'పరబ్రహ్మము' యొక్క ధారణయే సూచిస్తోంది. పరమపదమే సూత్రము.

---

**తత్ సూత్రం విదితం యేన**
**స విప్రో వేదపారగః।**
**యేన సర్వం ఇదం ప్రోతం**
**సూత్రే మణి గణా ఇవ,**
**తత్ సూత్రం ధారయేత్ యోగీ**
**యోగవిత్ 'తత్త్వ దర్శనః'॥**

పూదండలో దారము (సూత్రము) వలె, ఏ సూత్రము (దారము)తో ఈ సమస్త లోకములు, లోకపాలకులు, సమస్త జీవులు గ్రుచ్చబడి ఉన్నారో, అట్టి బ్రహ్మసూత్రమును వేదపారగులైన విప్రులు దర్శిస్తూ ఉన్నారు.

యోగి యోగవేత్త అయి తత్త్వదర్శనము అనే బ్రహ్మసూత్రమునే ధారణ చేయుచున్నారు.

**బహిః సూత్రం త్యజేత్ విద్వాన్**
**యోగం ఉత్తమమ్ ఆస్థితః।**

ఆత్మశాస్త్రము అధ్యయనము చేసిన యోగాభ్యాసి "బాహ్యసూత్రమును దాటివేసి, ఆత్మదర్శనమే ధారణ చేయవలసినదిగా ఎరిగి, అదియే యోగముగా స్వానుభవం చేసి అట్టి యోగమునందు సంస్థితుడు అగుచున్నాడు.

**బ్రహ్మభావం ఇదం సూత్రం**
**ధారయేత్ యత్ స చేతనః॥**

సచేతనమగు బ్రహ్మ భావనయే సూత్రముగా ధరించాలి. అంతేగాని అచేతనమగు దారపు సూత్రము ధరించి, అంతటితో తృప్తి చెందరాదు.

**ధారణాత్ తస్య సూత్రస్య న**
**ఉచ్ఛిష్టః, న అశుచిః భవేత్।**

అట్టి బ్రహ్మజ్ఞానమును, సోఽహం బ్రహ్మానుభవమును సూత్రముగా ధరించినవానికి వదలవలసినది ఏదీ ఉండదు. అశుచి అయినది ఎక్కడా తారసపడదు.

---

**సూత్రం అంతర్గతం ఏషాం**
**జ్ఞాన యజ్ఞోపవీతినామ్**
**తేవై సూత్రవిదో లోకే।**
**తేచ యజ్ఞోపవీతినః।**

అంతరహృదయంలో ధరించే "జ్ఞాన యజ్ఞోపవీత ధారణ" గురించి తెలిసినవాడే యజ్ఞసూత్రమును ఎరిగినవాడు. ఆతడే యజ్ఞోపవీతుడు. అంతేగాని ప్రత్తిదారముచే నిర్మితమైన యజ్ఞోపవీతం ధరించినంత మాత్రంచేత, ఒకడు లోకంలో యజ్ఞోపవీతుడు కాడు.

**జ్ఞాన శిఖినో, జ్ఞాన నిష్ఠా, జ్ఞాన యజ్ఞోపవీతినః।**
**జ్ఞానం ఏవ పరం తేషాం, "పవిత్రం జ్ఞానం" ఉచ్యతే॥**

ఆత్మజ్ఞాన యజ్ఞోపవీతునికి ఆత్మజ్ఞానమే శిఖ. అదియే ఆతని నిష్ఠ. (తదితర ఆచార వ్యవహారములు అసలైన నిష్ఠ కాదు). జ్ఞానమే పరము. జ్ఞానమే పవిత్రము.

**అగ్నేః ఇవ శిఖా, న అన్యా, యస్య జ్ఞానమయీశిఖా,**
**స 'శిఖీ' ఇతి ఉచ్యతే విద్వాన్,**
**న ఇతరే కేశధారిణః॥**

జ్ఞానమయమైన శిఖయే శిఖగా ఎరిగి వానికి జ్ఞానాగ్నియే శిఖ (పిలక). అంతేగాని వెంట్రుకలతో నిర్మితమైన శిఖ అసలైన శిఖ కాదు.

---

**కర్మణి అధికృతాయేతు**
**వైదికే బ్రాహ్మణాదయః,**

**తేభిః ధార్యం ఇదం సూత్రం**
**క్రియాంగం తద్ధివై స్మృతమ్,**
**(తత్ హి వై స్మృతమ్)॥**

"ఎవ్వరైతే వైదిక కర్మలను మంత్రయుక్తంగా నిర్వర్తించవలసినవారో, అట్టి సాంఘిక సంబంధమైన వైదిక బ్రాహ్మణులు మొదలైన వారికి మాత్రమే 'క్రియాంగము' అయినట్టి ప్రత్తి దారముతో నిర్మించబడినది నియమించబడింది" - అని గ్రహించబడు గాక। అది వేద విహిత కార్యములలో ఒకానొక క్రియా విశేషము మాత్రమే!

**శిఖా జ్ఞానమయీ యస్య**
**ఉపవీతం చ తత్ మయమ్,**
**"బ్రాహ్మణ్యం" సకలం తస్య**
**ఇతి బ్రహ్మవిదో విదుః ఇతి।**

"ఎవనికి ఆత్మజ్ఞానమయత్వమే శిఖయో, తత్త్వజ్ఞానమే ఉపవీతమో అట్టి వారందరు బ్రాహ్మణులే" - అని తత్త్వ జ్ఞానులంతా ఎరిగియే ఉంటున్నారు.

బ్రహ్మజ్ఞానులనే వారు 'బ్రాహ్మణ్యులు'గా దర్శిస్తున్నారు.

| | |
|---|---|
| **14. తత్ ఏతత్ విజ్ఞాయ బ్రాహ్మణః పరివ్రాజ్య।** | ఆత్మతత్త్వ జ్ఞానము, ఆత్మతత్త్వ దర్శనము కలవాడే (పైన చెప్పిన బ్రాహ్మణుడే) పరివ్రాట్ అగుచున్నాడు. |
| **పరివ్రాట్ ఏకశాటీ। ముండో అపరిగ్రహః।**<br>**శరీర క్లేశ అసహిష్ణుః చేత్,** | **పరివ్రాట్ బాహ్య అంతర లక్షణములు**<br>సర్వజ్ఞుడు అగు విజ్ఞాని సన్న్యసించి ఈ క్రింది విశేషములు కలిగి ఉంటాడు. (పరివ్రాట్ అయి, కృతకృత్యుడు కాగలడు).<br>- సర్వజ్ఞుడగు విజ్ఞాని ఏక వస్త్రము కలిగి ఉంటాడు. శిరో ముండనము (జుట్టు తొలగించుకోవటము) ఆచరిస్తాడు.<br>- సర్వత్రా ఏదీ కోరుకోకపోవటము, స్వీకరించకుండటము అనే **అపరిగ్రహవ్రతుడై** ఉంటాడు.<br>- విరాగి అయి శరీర క్లేశములన్నిటినీ దాటివేసి ఉంటాడు. |
| **అథవా, యథావిధిః చేత్ జాతరూపధరో భూత్వా,**<br>**స్వ పుత్ర మిత్ర కళత్ర ఆప్తబంధు ఆదీన్,**<br>**స్వ అధ్యాయం, సర్వకర్మాణి చ,**<br>**సన్న్యస్య అయం బ్రహ్మాండం చ**<br>**సర్వం, కౌపీనం దండం ఆచ్ఛాదనం చ త్యక్త్వా,**<br>**ద్వంద్వ సహిష్ణుః, న శీతం, న చ ఉష్ణం,**<br>**న సుఖం, న దుఃఖం, న నిద్రాం, న మాన-అవమానే చ,**<br>**షడూర్మి (షట్ (6) ఊర్మి) వర్జితో** | (లేక) యథావిధిగా అప్పుడే పుట్టిన బిడ్డవలె జాతరూపధరత్వము ధరించి దేనికీ సంబంధించనివాడై ఉండును గాక।<br>- సమస్త బ్రహ్మాండ వ్యవహారమును 'మిథ్య' (Illusion)గా భావించినవాడై, ఇక్కడి పుత్ర - మిత్ర - భార్య - ఆప్తబంధు మొదలైన సంబంధములన్నీ వదలి ఉంటాడు.<br>- స్వాధ్యాయము (Reading Books etc) తో సహా సమస్త కర్మలతో కూడిన ఈ బ్రహ్మాండము దాటివేసి ఉంటాడు. సన్న్యాస బాహ్య లక్షణములైనట్టి గోచి, దారపు జందెము, పిలక కూడా వదలి ఉంటాడు.<br>- శీత - ఉష్ణములను, సుఖ-దుఃఖములను మాన-అవమానములను, (ఆకలి, దప్పిక, శోకము, మోహము, జర, మరణములు అనబడే)-షడూర్ములను వదలినవాడై, సహించువాడై ననిద్రాపరుడై (నిద్రను జయించినవాడై) ఉండును గాక! |
| **నింద అహంకార మత్సర గర్వ దంభ**<br>**ఈర్ష్యా అసూయా ఇచ్ఛా ద్వేష సుఖ దుఃఖ**<br>**కామ క్రోధ లోభ మోహ ఆదీన్ విసృజ్య,** | ఇతరులను నిందించటము, నిందకు క్రుంగిపోవటము, అహంకారము, మదము, గర్వము, ఈర్ష్య, అసూయ, ఇచ్ఛ, ద్వేషము, సుఖ-దుఃఖములు, కామము, క్రోధము, లోభము, మోహము మొదలైనవన్నీ మొదలంట్లా వదలి ఉండాలి. |
| **స్వ వపుః శవ ఆకారం ఇవ స్మృత్వా,** | తన భౌతిక శరీరమును ఒక శవమును చూచిన భావనతో చూచును గాక। |
| **స్వ వ్యతిరిక్తం సర్వం అంతః బహిః అమన్యమానః।** | సస్వస్వరూపమగు ఆత్మకు వ్యతిరిక్తమై, వేరేవలె కనిపించే అంతర-బహిర్ అంగములను లెక్కగొననివాడై ఉండును గాక! |
| **కస్య అపి వందనం అకృత్వా,** | ఆత్మ రూపమునకే నమస్కరిస్తూ తదితరమైన దేనికీ నమస్కరించకుండును గాక। |
| **న నమస్కారః న స్వాహాకారః న స్వధాకారః** | స్వాహా (పితృదేవతా) నమస్కారమును స్వధా (స్వర్గ దేవతా) నమస్కారము చేయకుండును గాక। |
| **న నిందాస్తుతిః యాదృచ్ఛికః భవేత్।** | నింద-స్తుతులను (Censure and Praise) - యాదృచ్ఛికము (No logic behind)గా భావించును గాక। |
| **యదృచ్ఛా లాభ సంతుష్టః।**<br>**సువర్ణ ఆదీన్ న పరిగ్రహేత్।** | యాదృచ్ఛికంగా (అప్రయత్నంగా) లభించే వాటితో సంతుష్టుడు (Satisfied) అగును గాక। బంగారము మొదలైన సంపదలను స్వీకరించనివాడై ఉండును గాక। |

న ఆవాహనం। న విసర్జనం। న మంత్రం।
న అమంత్రం। న ధ్యానం। న ఉపాసనం।
న లక్ష్యం। న అలక్ష్యం।
న పృథక్। న అపృథక్।

ఇక ఆతనిపట్ల కర్మ - ప్రతికర్మలు ఉండవు.
దేవతాహ్వానము - విసర్జనము,
మంత్రము - అమంత్రము,
ధ్యానము - ఉపాసన,
లక్ష్యము - అలక్ష్యము,
వేరైనది - వేరుకానిది
మొదలైనవన్నీ కలిగి ఉండకుండును గాక।

---

న తు అన్యత్ర సర్వత్ర అనికేతః స్థిరమతిః।
శూన్యాగార వృక్షమూల దేవగృహ తృణకూట
కులాలశాల అగ్నిహోత్రశాలాగ్ని।
దిగంతర నదీ తటాక పులిన
భూ గృహ కందర
నిర్ఝర స్థండిలేషు వనేవా।

నా చోటు - వారిచోటు లేనివాడై ఎక్కడ ఉన్నప్పటికీ అనికేతుడై (స్థిర నివాసము లేనివాడై), ఎక్కడ ఉన్నా కూడా స్థిరమతుడై (చంచల బుద్ధి త్యజించినవాడై) ఉండు గాక। జీర్ణమైన గృహము, వృక్షమూలము, దేవాలయము, గడ్డిపొదలు, పర్ణశాల, కుమ్మరి వారి ఇళ్లు, యాగశాల, అన్ని దిక్కులు, నదీ తటాకములు, ఇసుక తిన్నెలు, కొండగుహలు, నదీ స్థలములు, సమస్త భూ ప్రదేశములు ఆతనికి విహార స్థలములు (visiting places) అగు గాక!

---

శ్వేతకేతు, ఋభు, నిదాఘ, జడభరతర్షభ,
దుర్వాసః, సంవర్తక, దత్తాత్రేయ, రైవకత।

పదవ్యక్త లింగో వ్యక్తాచారో, బాల ఉన్మత్త
పిశాచవత్ అనున్మత్తోపి ఉన్మత్తవత్ ఆచరన్।

శ్వేతకేతువు, ఋభు, నిదాఘుడు, జడభరతుడు, దుర్వాసుడు, సంవర్తకుడు, దత్తాత్రేయుడు, రైవతకుడు (గో రక్షా అవధూత) మొదలైన అవధూత పరివ్రాజకులవలె తమ ఆత్మ ప్రజ్ఞను దాచుకొని ఉండెదరు గాక। వ్యక్తమైన లింగము (రూపము), అవ్యక్తమైన ఆచారుడై, ఉన్మత్తత లేనప్పటికీ బాలురు, పిచ్చివారు, పిశాచములవలె ప్రపంచంలో సంచారులై ఉండెదరు గాక!

త్రిదండం శిక్యం పాత్రం కమండలుం
కటిసూత్రం కౌపీనం దండం వస్త్రం-సర్వం అప్సు విసృజ్య
అథ జాతరూపధరః చరేత్।

త్రిదండము, శిక్యము (ఉట్టి, సంచి), పాత్రలు, కమండలువులు, మొలత్రాడు, కౌపీనము (గోచి), దండము (చేతికర్ర), వస్త్రము - ఇవన్నీ జలమునందు సమర్పించివేయుదురు గాక! అప్పుడే పుట్టిన బిడ్డవలె చరించెదరు గాక!

---

ఆత్మానం అన్విచ్ఛేత్ యథా జాతరూపధరో
నిర్ద్వంద్వో నిష్పరిగ్రహః

ఆత్మతత్త్వము కొరకు మాత్రమే అన్వేషణ కలిగి ఉండెదరు గాక। పసిబిడ్డ వలె, ద్వంద్వాతీతులై, ఆత్మజ్ఞానమునకు వేరైనదేదీ స్వీకరించనివారై ఉండెదరు గాక।

తత్త్వ బ్రహ్మామార్గే సమ్యక్ సంపన్నః శుద్ధ మానసః।
ప్రాణ సంధారణార్థం యథా ఉక్తకాలే కరపాత్రేణ,

తత్త్వమార్గములో యోగాభ్యాస సంపన్నులగుదురు గాక। సమస్త మార్గములలో బుద్ధిని శుద్ధి చేసుకొనుటలో ప్రయత్నశీలులగుదురు గాక।

అన్యేన వా యా చితాహారం ఆహరన్।

ప్రాణమును ధరించి ఉండటానికి మాత్రమే సరి అయిన (యుక్త) సమయంలో దోసిలియందుగాని లేక ఏదైనా ఒక పాత్రయందు గాని భిక్షము తెచ్చుకొని భుజించెదరు గాక।

---

లాభ – అలాభయోః సమో భూత్వా।
నిర్మమః శుక్ల ధ్యాన పరాయణో।

లాభ, అలాభములను ఒకే తీరుగా చూచుచుండెదరు గాక!

మమకారములన్నీ వదలి నిర్మలమగు ఆత్మధ్యానపరాయణులై కాలము గడపుచుండెదరు గాక!

అధ్యాత్మనిష్ఠః।

ఆధ్యాత్మజ్ఞాన సాధనయందే ధ్యాస, నిష్ఠ కలిగి ఉండెదరు గాక।

శుభ–అశుభ కర్మ నిర్మూలన పరః।

శుభ - అశుభ కర్మ - కర్మఫల ఆసక్తులన్నీ నిర్మూలనము చేసికొని ఉండెదరు గాక।

| | |
|---|---|
| సన్న్యస్య, "పూర్ణానందైక బోధః<br>తత్ బ్రహ్మ అహం అస్మి" - ఇతి<br>'బ్రహ్మ ప్రణవమ్' అనుస్మరన్। | సమస్తము సన్న్యసించివేసినవారై **"పూర్ణ-ఆనందైక బోధ రూపమగు ఆ బ్రహ్మము నేనే అయి ఉన్నాను"** అను రూపవ్వైనట్టి "బ్రహ్మప్రణవము"ను సర్వదా సర్వత్రా స్మరణ కలిగి ఉండెదరు గాక। |
| భ్రమర-కీట న్యాయేన | భ్రమరము (తుమ్మెద), ఒక కీటకమును (చిన్న పురుగును) తెచ్చి, దాని చుట్టూ "ఝుయ్-ఝుయ్"మని శబ్దం చేస్తూ ఉంటే, ఆ చిన్న కీటకము ఆ శబ్దమునకు స్పందిస్తూ చివరికి తానే పెద్ద-తుమ్మెదగా రూపుదిద్దుకుంటుంది కదా! |
| శరీర త్రయమ్ ఉత్సృజ్య<br>సన్న్యాసేనైవ దేహత్యాగం కరోతి -<br>స కృతకృత్యో భవతి॥<br>ఇతి ఉపనిషత్॥ | సన్న్యాసి అయి, సమస్తమునకు అతీతత్వము సముపార్జించుకొని, స్థూల-సూక్ష్మ-కారణ త్రిశరీరములను అధిగమించి సాక్షీ స్వరూపమునందు నిశ్చల - సుస్థిరత్వము సిద్ధించుకున్నవాడు **"కృతకృత్యుడు॥"** (పొందవలసినది పొందినవాడు) అగుచున్నాడు. |

**ఇత్యుపనిషత్ - నారద పరివ్రాజకోపనిషత్ - "తృతీయ ఉపదేశః"**

## చతుర్థోపదేశః (4వ ఉపదేశము)
## యతి నియమములు - ధర్మములు

| | |
|---|---|
| 1. త్యక్త్వా లోకాంశ్చ వేదాంశ్చ<br>విషయాన్, ఇంద్రియాణి చ,<br><br>ఆత్మని ఏవ స్థితో యస్తు<br>స యాతి పరమాం గతిమ్॥ | ఓ నారదా! ఈ సమస్త లోకములను, వేదములను (విధి, విధాన, కర్మ- ఉపాసనా, జ్ఞాన, వాఙ్మయ వ్యవహారములను), దృశ్య విషయములను, ఆ దృశ్యము వేటికి విషయములో అట్టి ఇంద్రియములను త్యజించివేసి, అతీతత్వము సిద్ధించుకొని - ఎవ్వడైతే ఆత్మతత్త్వానుభవమునందే సంస్థితుడు (wel-situated) అవుతాడో, అట్టివాడు మోక్షరూపమగు **"పరమాం గతి"**ని చేరగలడు. |
| నామ గోత్ర ఆది వరణం<br>దేశకాలం శ్రుతం కులమ్।<br>వయోవృత్తం, వ్రతం, శీలం<br>ఖ్యాపయేత్ నైవ సద్యతిః। | తమయొక్క నామమును, గోత్రమును, దేశ-కాల సంబంధమైనవిగాని, విన్న విశేషాలుగాని, కులమునుగాని, వయస్సునుగాని, వృత్తులుగాని, నిర్వర్తించిన వ్రతములనుగాని, తన శీలము యొక్క ఔన్నత్యముగాని నిజమైన యతి ప్రదర్శించుకోడు. గొప్పలు చెప్పుకోడు. |
| అసంభాషేత్ స్త్రియా, కాంచిత్<br>పూర్వ దృష్టాం చ న స్మరేత్।<br>కథాం చ వర్జయేత్ తాసాం<br>న పశ్యేత్ లిఖితాం అపి। | యతి అయినవాడు కామ వృత్తి - ప్రవృత్తి గల మాటలను సంభాషించడు. ఇతఃపూర్వము చూచిన స్త్రీల గురించి స్మరించనైనా కూడదు. స్త్రీలతో చేసిన కామ సంభాషణలన్నీ త్యజించివేయాలి. శృంగార స్త్రీల పఠములను (లిఖితములను) కూడా చూడరాదు. |
| ఏతత్ చతుష్టయం<br>మోహాత్ స్త్రీణాం ఆచరయతో యతేః।<br><br>చిత్తం విక్రియతే అవశ్యం<br>తత్ వికారాత్ ప్రణశ్యతి। | 1. మోహ బుద్ధితో స్త్రీలను చూడటము<br>2. స్త్రీలతో శృంగార సంబంధమైన సంభాషణ<br>3. స్త్రీల గురించిన కామ సంబంధమైన కథలను, కథనములను వినటము<br>4. స్త్రీలతో సంబంధములను స్మరించటము<br>ఈ నాలుగింటికి యతి అయినవాడు దూరంగా ఉండాలి. అట్లా కాకుండా, పై నాలిగింటిని ఆశ్రయిస్తూ ఉంటే, - చిత్త చాంచల్యము పొందగలరు. ఫలితంగా అట్టి వికారములు వినాశనమునకు దారి తీయగలదు. |

**తృష్ణా, క్రోధో, అనృతం, మాయా,**
**లోభ మోహౌ, ప్రియ అప్రియే,**
**శిల్పం వ్యాఖ్యాన, యోగః చ**
**కామో, రాగ పరిగ్రహః,**
**అహంకారో మమత్వం చ,**
**చికిత్సా, ధర్మసాహసమ్,**
**ప్రాయశ్చిత్తం, ప్రవాసః చ**
**మంత్ర – ఔషధ గత ఆశిషః।**
**ప్రతిషిద్ధాని చ ఏతాని**
**సేవమానో వ్రజేత్ అథః।**

**యతి నిషిద్ధములు**

యతులు (సన్న్యాసాశ్రమము వారు - కలిగి ఉండకూడనివి)

1. **తృష్ణ** : పేరాశ. ఇకా ఏదో లభించలేదా? లభించాల్సిందే - అనే అభినివేశము.

2. **క్రోధము** : ఒక సంఘటన, సందర్భము వలన వచ్చిన కోపము మరల మరల మననము చేయటము.

3. **అనృతము** : సత్యము కానిది. ఏది నిజమో తెలుసుకోకుండానే తెలిసినట్లు మరల మరల మాట్లాడటము, దూషించటము.

4. **మాయా** : ఏదైతే కల్పితమో, అది 'నిజమే' అని మననము చేయటము. తన్మయమవటము.

5. **లోభము** : పిశినారితనము, అత్యాశ, ఇతరులనుండి పొందుతూ కూడా ఇతరులకు ఇవ్వవలసినది ఇవ్వకుండటము.

6. **మోహము** : ఏది వాస్తవమో తెలుసుకోకుండా కనబడిన దానితో తన్మయమవటము, చిత్తవైకల్యము, బాహ్యరూపమునకు మురిసిపోవడము.

7. **ప్రియము** : కొన్నిటిని, కొందరిని అతిగా ఇష్టపడటము.

8. **అప్రియము** : మరి కొన్నిటి, మరి కొందరి పట్ల అయిష్టము కలిగి ఉండటము.

9. **శిల్పము - చిత్రలేఖనము** : ఊహ-అపోహలు కల్పించే బొమ్మలు గీయటము.

10. **వ్యాఖ్యానము** : "వారు అట్టివారు - వీరు ఇట్టివారు" అంటూ గుణగణములను వ్యాఖ్యానించటము.

11. **యోగము** : కొన్నిటితో సంయోగము, మరికొన్నిటితో వియోగము పొందు స్వభావము.

12. **కామము** : ఏదో ఇంకా పొందాలి - అనే తపన. లేనిది కావాలనుకోవటము.

13. **రాగము** : ఉన్నదాని పట్ల వదలలేకపోవటము. దూషణ-భూషణ-తిరస్కార - పురస్కారములపట్ల మనో స్పందనము.

14. **పరిగ్రహణము** : ప్రపంచంలో సందర్భమౌతున్న సంగతి, సందర్భ, సంబంధ-అనుబంధములను హృదయములోనికి ఆహ్వానించి, అట్టేబెట్టుకోవటము.

15. **అహంకారము** : "నేను వారి కంటె అంతటివాడిని. ఇంతటి వాడిని. ఇది నాది. నేను వేరు వారు వేరు" అను రూపము గల భావావేశములు.

16. **మమత్వం** : ప్రపంచంలో తారసబడే వస్తు జాలమును, బంధు-మిత్రులను "వీరు నా వారు, నాకే ఉండాలి" -అను సొంతము చేసుకొని ఉండే భావన.

17. **చికిత్స** : ఇతరులను ఇంకా ఏదో సరిచేయాలని, తాను ఇంకా ఏదో సరికావాలని - ఆవేశ పడటము. వైద్యము మొ॥వి.

18. **ధర్మ సాహసమ్** : ధర్మ-అధర్మముల ప్రసక్తి గురించి సంభాషించి ఆవేశపడటము. ఇతరుల ధర్మ-అధర్మముల గురించిన సుదీర్ఘమైన నిందాస్తుతులు.

**19. ప్రాయశ్చిత్తము :** "దానికి అది చేయండి. దీనికి ఇంత చెల్లించండి" అని దోషముల గురించిన ప్రాయశ్చిత్తమును పరిభాషణం చేయరాదు.

**20. ప్రవాసము :** దూరదేశములలో ప్రవేశించి, నివాసము కలిగి ఉండరాదు. (విదేశీ సంచారములు ఏకాగ్రతను చెదిరించగలవు).

**21. మంత్రములు :** ఆయా లౌకిక ప్రయోజనమైన మంత్రముల సముదాయమును (మాయమంత్రము మొ॥వాటిని) ఉపాసించరాదు.

**22. ఔషధములు :** ఔషధముల వ్యాపారములు నిర్వర్తించరాదు.

**23. ఆశీర్వాదములు :** ఆశీర్వాదములు చేసి ప్రతిఫలము స్వీకరించటము.

ఇవన్నీ యతులు నిర్వర్తించే మార్గమునకు నిషిద్ధములు (Dont's). వీటిని సేవించుటచే అధమ మార్గము అవగలదు. ఆతడు పతితుడు అయ్యే ప్రమాదము ఉండు అవకాశముంటుంది.

---

**ఆగచ్ఛ గచ్ఛ తిష్ఠేతి**
**స్వాగతం సుహృదో అపి వా,**
**సన్మానం చ న బ్రూయాత్**
**మునిః మోక్ష పరాయణః॥**

స్నేహితులు మొదలైన వారిని "రండి!" - అని, "వెళ్లిరండి" అని, "ఉండండి" అని స్వాగతము చెప్పటము, సన్మానించటము మొదలైనవి 'మౌనము' సిద్ధించుకొంటున్న మోక్ష పరాయణులైన మునులు నిర్వర్తించకుండెదరు గాక।

**ప్రతిగ్రహం న గృహ్ణీయాత్।**
**నైవ చ అన్యం ప్రదాపయేత్॥**

ఇతరులనుండి బహుమతులు, కృతజ్ఞతగా ఇచ్చే ధనము మొదలైనవి స్వీకరించరాదు. తాను ఇతరులకు ఇవ్వకూడదు.

---

**2. ప్రేరయేత్ వా తథా భిక్షుః**
**స్వప్నేపి న కదాచన।**

ఇతరులనుండి వస్తురూపంగా గాని ధనరూపంగా గాని తనకొరకై బహుమతులు తీసుకోవటము, లోక ప్రయోజనముల కొరకై బహుమతులు ఇవ్వడము - ఈ రెండిటినీ భిక్షకుడు (యతి, పరివ్రాజకుడు) ఏమాత్రము కలలో కూడా ప్రేరేపించకూడదు.

**జాయా భ్రాతృ సుత ఆదీనాం**
**బంధూనాం చ శుభ–అశుభమ్।**
**శృత్వా దృష్ట్వా న కంపేత**
**శోక హర్షౌ త్యజేత్ యతిః।**

యతి అగుచున్నవాడు - భార్య, సోదరులు, కొడుకులు మొదలైనవారితో ఏర్పడే శుభ-అశుభ సమాచారములను వినినప్పుడు, చూచినప్పుడు ఏమాత్రము కంపించడు. శోకముగాని, సంతోషముగాని దరికి రానీయడు. వాటిని త్యజించివేసి ఉంటాడు.

---

**అహింసా సత్యం అస్తేయం**
**బ్రహ్మచర్య అపరిగ్రహః।**

### "యతి యొక్క స్వధర్మములు"

**అహింస :** మనో వాక్ కాయములచే ఎవ్వరికీ 'బాధ' కలిగించకుండటము.

**సత్యము :** ఎల్లప్పుడు పరమ సత్యమగు 'అఖండాత్మ' గురించియే దృష్టి, ధ్యాస కలిగి ఉండటము.

**అస్తేయమ్ :** తనది కానిది దొంగిలించాలని దోష భావన కలిగి ఉండకపోవటము.

**బ్రహ్మచర్యము :** ఎల్లప్పుడు 'బ్రహ్మజ్ఞానము' కొరకై ఆచరణ, ఆచారము కలిగి ఉండటము.

**అపరిగ్రహః :** ఈ కల్పిత జగత్తు నుండి దేనినీ కూడా ఏమాత్రము స్వీకరించనివాడై ఉండటము.

**అనౌద్ధత్యం అదీనత్వం**
**ప్రసాద స్థైర్యం ఆర్జవమ్।**

**అనౌద్ధత్యం :** వారికంటే, వీరికంటే నేను 'గొప్పగలవాడిని'- అని భావించకపోవటము.

**అదీనత్వం** : దేనికీ దీనుడు కాకపోవటము. "అయ్యో! నేనెందుకు పనికివస్తాను?" - అని భావించకపోవటము.

**ప్రసాదం** : నిర్మలమైన భావాలు, అభిప్రాయాలు, ఆలోచనలు, ప్రవర్తనలు కలిగి ఉండటము.

**స్థైర్యం** : ఆత్మభావనతో ఆత్మ పరిపోషించుకోవటము స్థైర్యము.

**ఆర్జవం** : త్రికరణశుద్ధి (మనో వాక్ కాయములచే) శుద్ధమగు ప్రవర్తనము. కుటిల, దూషణభావాలు దరిచేరనీయకపోవటము.

**అస్నేహో గురుశుశ్రూషా**
**శ్రద్ధా క్షాంతిః దమః శమః।**

ప్రాపంచక విషయములతో స్నేహము (సంబంధము) కలిగి ఉండక పోవటము. గురుసేవ, శ్రద్ధ, ఓర్పు, బాహ్య-అంతర నిగ్రహము.

**ఉపేక్షా స్థైర్య మాధుర్యే**
**తితీక్షా కరుణా తథా।**

**ఉపేక్ష** : ప్రాపంచక సంగతి, సందర్భములపట్ల ఉపేక్ష కలిగి ఉండటము. అపేక్ష లేకపోవటము.

**స్థైర్య మాధుర్యే** : మధురముతో (సత్త్వ గుణముతో) కూడిన ధైర్యము, ఉత్సాహము కలిగి ఉండటము.

**తితిక్షా** : కష్ట-సుఖ సందర్భములను ఓర్చుకోవటము. ఓర్పు అనే శక్తి పెంపొందించుకోవటము.

**కరుణ** : సహజీవులపట్ల దయ, దాక్షిణ్యము, ఆప్యాయత కలిగి ఉండటము.

---

**హ్రీః తథా జ్ఞాన విజ్ఞానే**
**యోగో లఘు-అశనం ధృతిః।**

**హ్రీః** : "అనేకమంది మహనీయులు ఉన్నారు. నేనెంతటివాడిని?" - అని సిగ్గు భావన కలిగి ఉండటము.

**జ్ఞాన విజ్ఞానే** : ఆత్మతత్త్వము శ్రవణము చేయుటము, తెలుసుకోవటము. అట్టి ఆత్మజ్ఞాన భావనను దైనందిక జీవిత సందర్భములలో అభ్యాసముగా కలిగి ఉండటము.

**యోగః** : దృశ్యములోని సంయోగ, వియోగములను అధిగమించి, 'ఆత్మతో మమేకత్వము' అనే అభ్యాసయోగి అయి ఉండటము.

**లఘు అశనం** : అవసరము, ఆరోగ్యములను దృష్టిలో పెట్టుకొని అల్పముగా మాత్రమే భుజించటము. ఇంద్రియములను పరిమితముగా, అవసరమైనంత వరకు మాత్రమే ఉపయోగించటము.

**ధృతిః** : ఆత్మభావనతో "నేను అఖండము - పరము - నిర్మలము అగు ఆత్మనే కదా!" అనే ధైర్యము విడువకపోవటము. ఆత్మభావనను దృఢంగా ఆశ్రయించి ఉండటము.

---

**ఏష స్వధర్మో విఖ్యాతో**
**యతీనాం నియతాత్మనామ్।**

ఇవన్నీ యతులకు శాస్త్ర నియమము అయిన స్వధర్మములుగా చెప్పబడుచున్నాయి.

**నిర్ద్వంద్వో నిత్యసత్వస్థః**
**సర్వత్ర సమదర్శనః॥**

"యతి-పరివ్రాజకుడను కావాలి" అనుకున్నవాడు -

- శీత-ఉష్ణ, సుఖ-దుఃఖ, పాప-పుణ్య, శుభ-అశుభ ఇత్యాది సమస్త ద్వంద్వములను దాటివేసినవాడు అగును గాక!

- నిత్యము (ఎల్లప్పుడు) సాత్వికమైన స్థితిని, భావములను పరిరక్షించుకుంటూ ఉండాలి.

- సర్వత్రా సమదర్శనమును ప్రయత్నపూర్వకంగా కలిగి ఉండాలి.

**3.** **తురీయః పరమో హంసః**
**సాక్షాత్ నారాయణో యతిః।**

## భిక్షక (సన్యాసి) – నివాస నియమములు :

యతి (జాగ్రత్ స్వప్న సుషుప్తులకు ఆవల తేజో రూపుడై, ఆ మూడు అవస్థలు తనవై తురీయుడైన) పరమహంస సాక్షాత్ శ్రీమన్నారాయణ స్వరూపుడే.

**ఏకరాత్రం వసేత్ గ్రామే**
**నగరే పంచరాత్రకమ్।**

యతి యొక్క నివసించు విధులు ఈ విధంగా ఉండు గాక।

గ్రామములో ఒక రాత్రి. నగరములో ఐదు రాత్రులు.

**సర్వాభ్యో అన్యత్ర వర్షాసు**
**స మాసాంశ్చతురో వసేత్।**

వర్షాకాలము మాత్రము పై నియమము ఉండదు. 4 నెలలు ఒకే చోట ఉండవచ్చును.

**ద్వి రాత్రం న వసేత్ గ్రామే భిక్షుః యది వసేత్ తదా,**
**రాగ ఆదయః ప్రసజ్యేరన్ తేన అసౌ నారకీ భవేత్।**

భిక్షక సన్యాసి ఒకవేళ గ్రామములో రెండు రాత్రుల కాలము ఉంటేనో? అతనికి రాగము, ద్వేషము ప్రవృద్ధమవటం జరగవచ్చు. అది జరిగితే - అతడు నరకంలో నివాసము పొందువాడు కాగలడు.

---

**గ్రామాంతే నిర్జనే దేశే**
**నియతాత్మా అనికేతనః।**

అందుచేత గ్రామమునకు చివరగా (In the outskirts)
- జనులు ఉండని ప్రదేశములో
- 'ఇది నా ఇల్లు' అనునది లేనివాడై
- ఇంద్రియములను, మనస్సును ఆత్మజ్ఞాన - ఆత్మదర్శనమునందు నియమించినవాడై ఒక కీటకమువలె ఒకచోట నిలువక పర్యటనలు చేస్తూ ఉండాలి.

**పర్యటేత్ కీటవత్ భూమౌ।**
**వర్షాసు ఏకత్ర సంవసేత్।**

వర్షాకాలంలో మాత్రం 4 నెలల కాలము ఒకే చోట ఉండవచ్చు.

---

**ఏక వాసా, అవాసా వా,**
**ఏకదృష్టిః అలోలుపః**
**అదూషయన్ సతాం మార్గం**
**ధ్యానయుక్తో మహీం చరేత్।।**

పరివ్రాజకుడైనట్టి యతి ఒక వస్త్రము మాత్రమే ధరించవచ్చు గాక లేక దిగంబరుడుగా ఉండవచ్చు గాక. ఏది ఎట్లా ఉన్నా కూడా "సమస్తము బ్రహ్మమే" అనుభవమును పదిల పరచుకొంటూ సత్ మార్గమును దూషించక (ఎవరినీ కూడా "తక్కువ వారు" అని భావించక), ఆత్మభావనకు సంబంధించిన ధ్యాస - ధ్యానములతో ఈ భూమిపై చరించును గాక.

---

**శుచౌ దేశే సదా భిక్షుః**
**స్వధర్మం అనుపాలయన్।**
**పర్యటేత్ సదా యోగీ**
**వీక్షయన్ వసుధాతలమ్।**

'భిక్షువు' (యోగి, పరివ్రాజకుడు) అయినవాడు ఎల్లప్పుడూ శుచి అయిన (సాంసారిక భావములు తాండవించనట్టి) అదేశమును ఎన్నుకొంటూ, భిక్షు ధర్మములు శ్రద్ధగా ఆచరిస్తూ భూమిపై సంచరించును గాక.

**న రాత్రౌ న చ మధ్యాహ్నే**
**సంధ్యయోః నైవ పర్యటన్।**
**న శూన్యే న చ దుర్గే వా**
**ప్రాణి బాధకరే న చ।**

రాత్రి సమయమునందు గాని, మిట్టిమధ్యాహ్న సమయమునందు గాని, సాయం-ప్రాతః సమయములందు గాని పర్యటనలు (Wandering and moving from place to place) చేయకుండెదరు గాక.

అట్లాగే శూన్యప్రదేశాలలో గాని, (కొండలు - శిలలు - ముళ్ళపొదలు - యడారులు మొదలైన) దుర్గమ ప్రదేశములలోగాని, ప్రాణమునకు బాధగా అనిపించే ప్రదేశములందుగాని తిరగరాదు.

---

**ఏకరాత్రం వసేత్ గ్రామే,**
**పట్టణేతు దినత్రయమ్।**
**పురే దిన ద్వయం భిక్షుః**
**నగరే పంచరాత్రకమ్।**
**వర్షాసు ఏకత్ర తిష్ఠేత**
**స్థానే పుణ్య జలావృతే।।**

'గ్రామము'లో అయితే ఒక్క రాత్రి మాత్రమే నివాసము కలిగి ఉండాలి. పట్టణములో అయితే రెండు (2) రాత్రులు, పురములలో అయితే రెండు రోజులు, నగరములలో '5' రాత్రలు - మించి నివాసము కలిగి ఉండరాదు.

'వర్షాకాలంలో చాతుర్మాస్యము' అను వ్రతము నిర్వహిస్తూ, చుట్టూ జలముగల స్థానంలో '4' నెలలు స్థిరముగా ఉండవచ్చు అనునది సన్యాసులకు, యతులకు సూచించబడుతోంది.

**4. ఆత్మవత్ సర్వభూతాని**
**పశ్యన్ భిక్షుః చరేత్ మహీమ్।**

**అంధవత్ కుబ్జవత్ చ ఏవ**
**బధిర ఉన్మత్త మూకవత్॥**

త్రిగుణాత్మకంగాను, అనేక భేదములతోను కనిపించే ఈ దృశ్యజగత్తును, ఇందులో వివిధ మనస్తత్వములుగల జీవులను చూస్తున్నప్పుడు - భేదములన్నిటికీ గ్రుడ్డివాడివలెనే ఉండాలి (చూడకూడదు). కుబ్జునివలెను (మఱుగుజ్జువాడు తనకు అవసరమైనంత మాత్రమే చూచువిధంగాను), చెవిటివానివలెను, పిచ్చివాడువలెను, మూగవానివలెను చూస్తూ ఉండాలి. భిక్షకుడు సమస్త జీవులను తన యొక్క ఆత్మ స్వరూపంగా చూస్తూ, ఈ ప్రపంచములో సంచారము కలిగి ఉండును గాక.

---

**స్నానం త్రిషవణం ప్రోక్తం**
**బహూదక వనస్థయోః।**
**హంసే తు సకృత్ ఏవ స్యాత్।**
**పర హంసే న విద్యతే।**

బహూదకులకు, కుటీచకులకు మూడు పూటల స్నానము చెప్పబడుతోంది. హంసలకు రోజుకు ఒకసారి స్నానము నియమించ బడుతోంది. పరమహంసలకు స్నానము గురించిన ఏ నియము చెప్పబడటం లేదు. (పరమహంస = "సోఽహమ్ పరమమ్". సమస్తమునకు ఆవలగల కేవల ఉనికి ఎరుక రూపమగు పరబ్రహ్మమే నేను" అను స్వాభావిక స్వానుభవము సిద్ధించుకున్నవాడు).

---

**మౌనం, యోగ-ఆసనం,**
**యోగః తితిక్ష ఏకాంతశీలతా,**

**నిస్పృహత్వం సమత్వం చ**
**సప్త (7) ఏతాని ఏక దండినామ్।**

త్రిదండిల (సన్యాసుల) పరమ ధర్మములు **"సప్త పరివ్రాజ ధర్మములు"** - అని చెప్పబడుచున్నాయి. 1) జగద్విషయములపట్ల ఎట్లా ఉన్నా సరే "మౌనము" వహించి ఉండగలగటం 2) యోగాసనము (పద్మాసనము మొదలగునవి) ధరించటము 3) యోగాభ్యాసము 4) కష్ట-సుఖములు, సంపద-ఆపదలు, సంబంధ-అనుబంధముల రాకపోకలు మొదలైన సందర్భములలో 'ఓర్పు' వహించి ఉండు శక్తి - తితిక్ష 5) సమస్తము పరమాత్మకు అనన్యమని భావించి, అట్టి పరమాత్మతో ఏకాంతముతో కూడిన ప్రశాంతత కలిగి ఉండటము - ఏకాంతశీతలా. 6) నీళ్లు పడవలోనికి రానీయని విధంగా ప్రపంచంలో కనిపించే అనేకత్వమును అనేక భేదములను, ఆత్మ దృష్టిచే జయించాలి. అంతరంగంలో పట్టించుకోకపోవటము - నిస్పృహత్వము. 7) సర్వత్రా సమదృష్టి - సమత్వము ఇవియే సన్యాసి ధరించి ఉండవలసిన సప్త ఏక దండము.

---

**పరహంస ఆశ్రమస్థో హి,**
**స్నానాదేః అవిధానతః।**

**అశేష చిత్త వృత్తీనాం**
**త్యాగం కేవలం ఆచరేత్।**

పరమహంస (బ్రహ్మచారి - గృహస్థ - వానప్రస్థ - సన్యాస) ఏ ఆశ్రమములో ఉన్నప్పటికీ అతనికి స్నానము యొక్క నియమము ఏదీ చెప్పబడటం లేదు. ఎందుకంటే సర్వదా ఆత్మభావనచే నిత్యనిర్మలమైన వానికి శుభ్రపరచుకొనే స్నాననియమములతో పనేముంటుంది. భోజన నియమములతో పనేమున్నది. అయితే అతడు అంతులేని చిత్తవృత్తులను మొదలంట్లా విడచి ఉండటమనే "పరమహంస ధర్మము" ధర్మముగా కలిగి ఉండు గాక.

---

**త్వక్ మాంస రుధిర స్నాయు**
**మజ్జా మేదో అస్థి సంహతౌ**
**విణ్మూత్ర పూయే రమతాం**
**క్రిమీనాం కియత్ అంతరం?**

ఈ భౌతిక శరీరము ఎటువంటిది ? ఇది చర్మము, మాంసము, రక్తము, నరములు, మజ్జ (గుజ్జు), క్రొవ్వు, ఎముకలు మొదలైన తుచ్ఛపదార్థములతో తయారై లోన మలము, మూత్రము మొదలైన అనేక దోష పదార్థములు కలిగి ఉన్నది. ఇట్టి పాంచభౌతిక శరీరము చూచి రమించు మానవునికి, బల్లి, దోమ, ఈగ మొదలైన క్రిమికీటక జీవితములకు భేదమేమున్నది?

క్వ శరీరం అశేషాణాం
శ్లేష్మాదీనాం మహాశయః?

- రక్త శ్లేష్మ మాంస నిర్మిత భౌతిక శరీరము పట్ల "ఇదే మహత్తరము" అని మహదాశయముగా కలవాడు ఎక్కడ?

క్వ చ అంగ సౌరభీ శోభా
కమనీయ ఆదయో గుణాః?

- అఖండాత్మ శరీరముతో కూడిన మహదాశయుడగు పరివ్రాజకుడు ఎక్కడ ? ఎక్కడి కమనీయమైన ఆత్మజ్ఞాన సంపత్తిగల గుణ సంపన్నుడు ? - అనగా,

**ఈ ఇద్దరికి ఒకరితో మరొకరికి పోలికయే ఉండదు.**

---

5. మాంసా సృక్ పాయ విణ్మూత్ర
స్నాయు మజ్జా అస్థి సంహతౌ।
దేహే చేత్ ప్రీతిమాన్ మూఢో
భవితా నరకే అపి సః॥

మాంసము, చీము, నెత్తురులతో పూయబడినది, మలమూత్రములు, నరములు, మజ్జ, ఎముకలుతో ఒక గూడువలె ఏర్పడి పై పైన సున్నగా కనిపిస్తున్న ఈ భౌతిక శరీరముపై ప్రీతితో జీవితాశయములను మరచిపోతున్న మూఢుడు ముందుముందు అనేక నరక స్థానములలో ప్రవేశించటానికి సంసిద్ధుడు అగుచున్నాడు.

స్త్రీణాం అవాచ్య దేశస్య క్లిన్ననాడీ
వ్రణస్య చ అభేదే అపి,
మనో భేదాత్ జనః
ప్రాయేణ వంచ్యతే।

ఈ స్త్రీ, పురుషుల అవాచ్యప్రదేశములు (జననేంద్రియములు) అనేకమైన తడసిన (తడి) నాడులతో నిండి ఉండగా ఇది ఒక వ్రణమునకు (పుండు, కురుపుకు) ఆ అవాచ్యప్రదేశమునకు (జనేంద్రియములకు) భేదము లేకపోయినప్పటికీ - ఈ జనులు గొప్ప విశేషమేదో మనస్సుతో కల్పించుకొని రహస్యాంగములను మోహావేశంతో చూస్తున్నారు. ఏమి ఆశ్చర్యం ?

---

చర్మఖండం ద్విధా భిన్నం
అపాన ఉద్గార దూషితమ్,
యే రమంతి నమస్తేభ్యః।
సాహసం కిం అతః వరమ్?

రహస్యాంగములు (అవాచ్య అంగములు) ఎటువంటివి ? చర్మముతో నిర్మితమై రెండుగా చీలి ఉన్నట్టివి. అపాన వాయువు అనే దుర్గంధముచే దూషితమైయున్నవి. అట్టి రహస్యేంద్రియములలో లభించే సుఖమే జీవిత పరమావధిగా (As if main objective) రమించదలచే వారికి - ఓ నమస్కారం. ఇంతకన్నా సాహసం ఇంకేముంటుంది ?

న తస్య విద్యతే కార్యం
న లింగం వా విపశ్చితః।

ఆత్మజ్ఞానికి అటువంటి విశేషములతో స్వాభావికంగానే ఏ పనీ, ఏ ఉత్తమ ప్రయోజనము కనిపించదు.

బ్రహ్మజ్ఞానికి బాహ్య సన్యాస వేష ప్రదర్శనముతో పనిలేదు. అక్కరలేదు.

నిర్మమో నిర్భయః శాంతో
నిర్ద్వంద్వో అవర్ణ భోజనః।

ఆత్మతత్త్వము సర్వత్రా ఆస్వాదించు పరివ్రాజకుడు - సమస్త మమకారములు వదలినవాడై, భయమును మొదలంట్లా జయించి వేసి - నిర్భయుడై, ద్వంద్వములన్నిటికీ అతీతుడై, వర్ణాశ్రమ ధర్మములను విడచినవాడై ఉంటాడు.

---

మునిః కౌపీన వాసాః స్యాత్
నగ్నో వా ధ్యాన తత్పరః।

ఆ పరివ్రాజకుడు ముని అయి, గోచి ధరించియో (లేక) ధరించకయో ఏ ఆశ్రమంలో ఉండాలని అనుకొంటే ఆ రీతిగా (బ్రహ్మచారి - గృహస్థుడు - వానప్రస్థుడు- సన్యాసి అయి) - ఎల్లప్పుడు ఆత్మ ధ్యానమునందు తత్పరుడై ఉంటాడు.

ఏవం ధ్యానపరో యోగీ
బ్రహ్మభూయాయ కల్పతే।

అట్టి "ఆత్మ ధ్యాస - ధ్యాన" పరుడగు యోగి స్వయముగా బ్రహ్మమై బ్రహ్మానందమునకు అర్హుడు అగుచున్నాడు.

లింగే సత్యపి ఖలు అస్మిన్
జ్ఞానం ఏవ హి కారణమ్।

ముని యొక్క బాహ్యవర్తనములు, వస్త్రములు మొ॥వి సన్యాసమునకు కారణం కాదు. జ్ఞానము చేతనే ఒకడు "సన్యాసి" అగుచున్నాడు.

నిర్మోక్షాయ ఇహ భూతానాం
లింగ గ్రామో నిరర్థకః।

ఆత్మ జ్ఞానము ఆశయముకానప్పుడు బాహ్యమైన కాషాయ వస్త్రములు మొదలైనవన్నీ కూడా సన్యాసాశ్రమం పట్ల నిరర్థకములే అవుతాయి. ఆత్మజ్ఞాన - ఆత్మతత్త్వానుభవముల చేతనే ఒకడు 'సన్యాసి'గా అగుచున్నాడు.

---

**6.** యత్ న సంతం న చ అసంతం।
న అశ్రుతం న బహుశ్రుతమ్।

న సువృత్తం। న దుర్వృత్తం।
వేద కశ్చిత్ స బ్రాహ్మణః॥

**బ్రాహ్మణుడు :** బ్రహ్మ భావనను సిద్ధించుకొన్నవాడే బ్రాహ్మణుడు. ఎవడైతే - "ఇది సత్ - ఇది అసత్" అని గాని, "ఇది శాస్త్రము (శ్రుతము) - ఇది కాదు" అని కాని, ' ఇది సత్ వృత్తి - ఇది దుర్ - వృత్తి" అని గాని భేదము ఎంచటం నిలిపివేసి, ఏది ఏ విధంగా ఉన్నప్పటికీ సర్వత్రా బ్రాహ్మమునే దర్శిస్తాడో - అతడే బ్రాహ్మణుడు.

తస్మాత్ అలింగో ధర్మజ్ఞో
బ్రహ్మ వృత్తం అనువ్రతమ్।

గూఢ ధర్మ ఆశ్రితో విద్వాన్
అజ్ఞాత చరితం చరేత్॥

అందుచేత ఓ నారదా ! బాహ్యమైన చిహ్నములను (outward symbols) వదలి, ఆత్మ ధర్మము ఎరిగినవాడై "బ్రాహ్మీవృత్తి' యే నిత్య వ్రతముగా కలిగి ఉండి, - ఏ విద్వాంసుడైతే సమస్తము ఆత్మగా భావించటము అనే రహస్య ధర్మమును ఆశ్రయిస్తూ తన యొక్క ఆత్మానందమును ఎవ్వరికీ గొప్పకై ప్రదర్శించకుండానే ఈ లోకంలో సంచరిస్తూ ఉంటున్నాడు.

---

సందిగ్ధః సర్వభూతానాం వర్ణ ఆశ్రమ వివర్జితః,
అంధవత్ జడవత్ చ అపి మూకవత్ చ
మహీం చరేత్। తం దృష్ట్వా శాంత మన
సంస్పృహయన్తి దివౌకసః,

పరివ్రాజక సన్యాసి - బాహ్యంగా కనిపించే నేను - రూపాత్మకమైనదంతా "నిజము కాదు" - అను విషయంలో సందిగ్ధము వదలి, వర్ణాశ్రమ ధర్మములను విడచినవాడై బ్రాహ్మీధర్మము ఆశ్రయించి ఉంటాడు. బాహ్యమున కనిపించే అనేక భేదముల విషయంలో గ్రుడ్డివానివలె, జడుడులాగా (ఏదీ తెలియనివానివలె), మూగవానివలె ఈ భూమిపై చరించెదరు గాక.

లింగ భావాత్ తు కైవల్యం ఇతి।
బ్రహ్మ అనుశాసనం ఇతి॥

సమస్తము సశాంతించినట్టి అట్టి శాంతమనస్కుని చూచి దేవతలు కూడా అతని సామీప్యత కోరుకుంటూ ఉంటారు. సమస్త భేదములను అధిగమించి సర్వత్ర అఖండము, అమృతము అగు స్వస్వరూపాత్మగా దర్శించటమును స్వాభావికం చేసుకోవటమే కైవల్యము. ఇది బ్రహ్మము గురించిన అనుశాసనము.

---

**7.** అథ నారదః పితామహం,
"సన్యాసవిధిం నో బ్రూహి ఇతి" పప్రచ్ఛ
పితామహః తథే అంగీకృత్య
ఆతురే వా, క్రమే వా అపి తురీయ ఆశ్రమ స్వీకారార్థం
కృచ్ఛ్ర ప్రాయఃచిత్తపూర్వకం
అష్ట శ్రాద్ధం కుర్యాత్।
దేవ ఋషి దివ్య మనుష్య భూత
పితృ మాత్ర ఆత్మేతి అష్ట (8) శ్రాద్ధాని కుర్యాత్।
ప్రథమం సత్యవసు సంజ్ఞికాన్
విశ్వాన్ దేవాన్, దేవశ్రాద్ధే బ్రహ్మ విష్ణు మహేశ్వరాన్।
ఋషి శ్రాద్ధే దేవర్షి క్షత్రర్షి మనుష్యర్షీన్

**శ్రీ నారద మహర్షి :** హే బ్రహ్మ భగవాన్ సన్యాసమునకు సంబంధించిన విధి విధానముల గురించి మరికొన్ని విశేషాలు ప్రవచించ ప్రార్థన.

**పితామహ (బ్రహ్మ) భగవానుడు :**

సరే ! అట్లాగే. ఆతుర సన్యాసము గాని, క్రమ సన్యాసము గాని తురీయ ఆశ్రమరూపంగా స్వీకరించేటప్పుడు చిత్తము యొక్క శుద్ధి కొరకై ప్రాయశ్చిత్తంగా '8' విధములైన శ్రాద్ధములను నిర్వర్తించెదరుగాక. అవి దేవ, ఋషి, దివ్య, మనుష్య, భూత, పితృ, మాతృ, ఆత్మ, శ్రాద్ధములు అష్ట విధి శ్రాద్ధములు.

**1) దేవశ్రాద్ధము :** మొదటగా సత్యవసు సంజ్ఞార్థులగు విశ్వదేవునికి, బ్రహ్మ, విష్ణు మహేశ్వరులను ఉపాసించాలి.

**2) ఋషి శ్రాద్ధము :** దేవ ఋషులను, రాజర్షులను, మనుష్య ఋషులను పూజించాలి.

| | | |
|---|---|---|
| | దివ్య శ్రాద్ధే వసు – రుద్ర – ఆదిత్య రూపాన్ | **3) దివ్య శ్రాద్ధము :** దివ్య శ్రాద్ధము నందు వసు-రుద్ర-ఆదిత్య రూపాలను ఉపాసించాలి. |
| | మనుష్య శ్రాద్ధే సనక, సనందన<br>సనత్కుమార, సనత్సుజాతాన్। | **4) మనుష్య శ్రాద్ధము :** బ్రహ్మ మానస పుత్రులగు సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులను ఉపాసించబడెదరు గాక. |
| | భూత శ్రాద్ధే పృథివ్యాది పంచమహాభూతాని<br>చక్షురాది కరణాని చతుర్విధ భూతగ్రామాన్। | **5) భూత శ్రాద్ధము :** పృథివి (భూమి), జలము, అగ్ని, వాయువు, ఆకాశము అయినట్టి పంచ మహాభూతములు (Solid, Liquid, Heat, Vapour, Space), కళ్లు మొదలైన పంచ జ్ఞానేంద్రియములు, కాళ్లు, చేతులు మొదలైన పంచ కర్మేంద్రియ కరణములు, 4 విధములైన (మనో, బుద్ధి, చిత్త, అహంకార) అంతరంగ చతుష్టయ గ్రామము (Zone) వీటిని ఉపాసించటము భూతశ్రాద్ధము. |
| | పితృ శ్రాద్ధే పితృ పితామహ ప్రపితామహాన్। | **6) పితృ శ్రాద్ధము :** గతించిన తండ్రి - తాత - ముత్తాతలను వసు - రుద్ర - ఆదిత్య ధ్యానపూర్వకమైన ఉపాసనము (మూడు తరముల ఉపాసన) |
| | మాతృశ్రాద్ధే మాతృ పితామహీ ప్రపితామహీః। | **7) మాతృ శ్రాద్ధము :** తల్లి, తండ్రి యొక్క తల్లిని, తాత (తండ్రికి తండ్రి) యొక్క తల్లిని ఉపాసించటము. |
| | ఆత్మశ్రాద్ధే ఆత్మ పితృ పితామహాన్। | **8) ఆత్మ శ్రాద్ధము :** తనను, తండ్రిని, తాతను క్రమ రీతిగా శ్రాద్ధ మంత్రములతో ఉపాసించటము. |
| | జీవత్ పితృకః చేత్ పితరం త్యక్త్వా<br>ఆత్మ పితామహ ప్రపితామహాన్।<br>ఇతి సర్వత్ర యుగ్మ క్లప్త్యా బ్రాహ్మణాన్ అర్చయేత్। | ఒకవేళ తండ్రి జీవించియే ఉంటే, అప్పుడు సన్న్యాసము స్వీకరించువాడు తనను, తాతను, ముత్తాతను శ్రాద్ధ మంత్రముతో ఉపాసించాలి.<br>ప్రతి ఒక్క శ్రాద్ధమునకు ఇద్దరిద్దరు బ్రాహ్మణులను పిలిపించి అర్చించాలి. |
| **8.** | ఏకాధ్వర పక్షే, అష్టాధ్వర పక్షే వా<br>స్వ శాఖ అనుగత మంత్రైః<br>అష్ట శ్రాద్ధాని అష్ట (8) దినేషు వా<br>ఏక దినే వా పితృయాగ ఉక్త విధానేన<br>బ్రాహ్మణాన్ అభ్యర్చ్య, ముక్త్యంతం యథావిధి నిర్వర్త్య, | **ఏకధ్వర పక్షే :** ఒకే రోజు పూర్తి చేయు యజ్ఞము.<br>**అష్టాధ్వరపక్షే :** 8 రోజులు యజ్ఞము నిర్వర్తించి పూర్తి చేయుటము. శాస్త్రీయముగా ఏకధ్వర, అష్టాధ్వర ఉభయ పక్షములలోను చతుస్సాగర పర్యంతం... అను స్వరములో తన యొక్క శాఖా వేద మంత్రములతో తగిన విధంగా శ్రాద్ధమంత్రములతో యథావిధి కర్మకాండతో చివరి వరకు నిర్వర్తించాలి. |
| | పిండప్రదానాని నిర్వర్త్య, సదక్షిణా తాంబూలైః<br>తోషయిత్వా, బ్రాహ్మణాన్ ప్రేషయిత్వా,<br>శేషకర్మ సిధ్యర్థం సప్తకేశాన్ విసృజ్య<br>శేషకర్మ సిధ్యర్థం కేశాన్<br>సప్త అష్ట వా ద్విజః సంక్షిప్య వాపయేత్।<br>పూర్వం కేశ శ్మశ్రు నఖాని చేతి సప్తకేశాన్ సంరక్ష్య॥ | యథావిధిగా పిండ ప్రదానము నిర్వర్తించబడుగాక. బ్రాహ్మణులకు శ్రాద్ధ విధానానుసారం దక్షిణ తాంబూలములు సమర్పించాలి.<br>ఆ తరువాత శేషించిన కర్మలు నిర్వర్తించటానికై శిరస్సు నుండి 4 వెంట్రుకలు గాని, 8 వెంట్రుకలు గాని వదలి మిగిలిన శిరస్సుపై గల వెంట్రుకలను, గడ్డమును, మీసమును క్షౌరము చేయించుకోవాలి. గోళ్లు తీయించుకోవాలి. సప్త (7) కేశములను (వెంట్రుకలను) మాత్రం సంరక్షించుకోవాలి. |
| **9.** | కక్ష ఉపస్థవర్జం క్షౌర పూర్వకం స్నాత్వా,<br>సాయం సంధ్యావందనం నిర్వర్త్య,<br>సహస్ర గాయత్రీం జప్త్వా, బ్రహ్మయజ్ఞం నిర్వర్త్య, | చంకలోని వెంట్రుకలు తప్పించి, గడ్డము, మీసము, శిరో వెంట్రుకలు పైన చెప్పిన విధంగా క్షౌరం చేయించుకొని స్నానం చేయాలి.<br>❈ సాయంకాల సంధ్యావందనం నిర్వర్తించాలి.<br>❈ సహస్ర గాయత్రీ జపం చేయాలి.<br>❈ బ్రహ్మ యజ్ఞము నిర్వర్తించబడు గాక. సమస్తము బ్రాహ్మణం అను సర్వసమర్పణ మంత్రోపాసన నిర్వర్తించబడు గాక. |

స్వాధీన అగ్నిం ఉపస్థాప్య,
స్వశాఖ ఉపసంహరణం కృత్వా,

❋ తన ఆధీనములో గల అగ్నిని స్థాపింపచేసి తన యొక్క వేద సంబంధమైన శాఖలను ఉపసంహరణము (withdraw) చేయును గాక.

---

తదుక్త ప్రకారేణ ఆజ్య ఆహుతిం
ఆజ్యభాగాంతం హుత్వా, ఆహుతివిధిం సమాప్య,

తమ వేదశాఖోక్తము ప్రకారము ఆజ్యము (నెయ్యి) మిగిలి ఉన్నంత వరకు ఆజ్యమును హోమం చేసి ఆహుతి విధిని పూర్తి చేయాలి.

ఆత్మాదిభిః త్రివారం సక్తుప్రాశనం కృత్వా,

తాను తదితర సంబంధీకులు సక్తు (పేలపిండి) ప్రాశనము నిర్వర్తించాలి.

ఆచమన పూర్వకం అగ్నిం సంరక్ష్య, స్వయం అగ్నేః
ఉత్తరతః కృష్ణాజిన ఉపరి స్థిత్వా,
పురాణ శ్రవణ పూర్వకం జాగరణం కృత్వా,

ఆచమన విధిగా అగ్నిని సంరక్షిస్తూ, ఆ అగ్నికి ఉత్తర దిశగా 'జింక చర్మము' పరచి ఆశీనుడై పురాణ శ్రవణం చేస్తూ తెల్లవార్లు 'జాగరణ' (మెలకువతో ఉండటం) నిర్వర్తించాలి.

చతుర్థ యామ అంతే స్నాత్వా,
తత్ అగ్నౌ చరుం శ్రపయిత్వా,
పురుష సూక్తేన అన్నం షోడశ ఆహుతీః హుత్వా,

తెల్లవారుఝామున స్నానం చేసి, అక్కడి అగ్నితో చరుము (అన్నము) వండాలి. ఆ అన్నమును 'పురుషసూక్త మంత్రము' చదువుచూ షోడశ ఆహుతులుగా (16 ఆహుతులుగా) హోమం చేయాలి.

---

విరజా హోమం కృత్వా
అథ ఆచమ్య సదక్షిణం వస్త్రం
సువర్ణపాత్రం ధేనుం దత్వా,
సమాప్య బ్రహ్మ ఉద్వాసనం కృత్వా।

ఆ విధముగా 'విరజా హోమము' చేసి, ఆ తరువాత ఆచమనం చేయాలి. దక్షిణ పూర్వకంగా వస్త్రమును, బంగారమును, ఆవును దానములుగా ఇవ్వబడుగాక. కార్యమంతా పూర్తి చేసి బ్రహ్మోద్వాసన (బ్రహ్మవ్రత ఉద్వాసన) నిర్వర్తించాలి.

---

**10.** సం మా సించంతు మరుతః। సం ఇంద్రః। సం బృహస్పతిః।
సం మా అయమ్ అగ్నిః సించతు।
ఆయుషా చ, ధనేన చ, బలేన చ వా
ఆయుష్మంతం కరోతు మే। ఇతి।
యాతే అగ్నే యజ్ఞియా తనూః, తయే హి ఆరోహ,
ఆత్మా ఆత్మానం అచ్ఛావసూని కృణ్వన్।

వాయువు, ఇంద్ర భగవానుడు, బృహస్పతి, అగ్ని మొదలైన దివ్యులగు దేవతలు రక్షిస్తూ, మాకు ఆయుష్షు, సంపద, బలము అనుగ్రహించెదరు గాక అను అర్థము గల మంత్రము చదువుచూ అగ్నిని ఆత్మయందు ఆరోపించుకొని అగ్నిని ధ్యానించాలి.

అస్మైనర్యా పురూణి యజ్ఞో భూత్వా, యజ్ఞం ఆసీద
స్వాం యోనిం జాతవేదో భువ
ఆజాయమానః సక్షయ ఏధి ఇతి।

పురాణమగు ఆత్మ యజ్ఞమును యజ్ఞముగా అవధరించి 'ఆత్మ యజ్ఞము'చే ఆత్మాగ్నిని ఉపాసించాలి.

అనేన అగ్నిం ఆత్మని ఆరోప్య, ధ్యాత్వా, అగ్నిం
ప్రదక్షిణ నమస్కార పూర్వకం ఉద్వాస్య,

అగ్నిని యజ్ఞ మంత్రముద్గంగా ఆత్మయందు ఆరోపించి, ధ్యానము చేసి అగ్నికి దక్షిణం చేసి నమస్కార పూర్వకంగా ఉద్వాసన పలకాలి.

ప్రాతః సంధ్యాం ఉపాస్య,
సహస్ర గాయత్రీ పూర్వకం సూర్యోపస్థానం కృత్వా,

ఆ మరునాడు ఉదయము సంధ్యా వందనమునకు ఉపక్రమించి సహస్ర గాయత్రీ పూర్వకంగా సూర్యోపస్థానము నిర్వర్తించెదరుగాక.

నాభిదఘ్న ఉదకం ఉపవిశ్య,
అష్ట దిక్పాలక అర్ఘ్య పూర్వకం గాయత్రీ
ఉద్వాసనం కృత్వా, సావిత్రీం వ్యాహృతిషు ప్రవేశయిత్వా

జలములో నాభి వరకు (బొడ్డు వరకు) మునుగునట్లు కూర్చుని అష్టదిక్పాలకులకు అర్ఘ్య ప్రదానం చేయాలి (తూర్పున ఇంద్రునకు, ఆగ్నేయమున అగ్నికి, దక్షిణమున యమునికి, నైరుతమున నైరుతునికి, పడమర వరుణునికి, వాయువ్యమున వాయుదేవునికి, ఉత్తరమున కుబేరునికి, ఈశాన్యమున ఈశానునికి అర్ఘ్యము సమర్పించాలి). గాయత్రికి ఉద్వాసన చేసి, సావిత్రిని భూః భువః సువః వ్యాహృతులందు ప్రవేశింపజేయాలి.

---

**11.** అహం వృక్షస్య రేరివ।
కీర్తిః పృష్ఠం గిరేః ఇవ।
ఊర్ధ్వ పవిత్రో వాజిని ఇవ –
స్వమృతమ్ అస్మి।

ఈ సంసార వృక్షమునకు పరిపోషకుడను నేనే. సంసారంగా కనిపించేది నా యొక్క తేజో కిరణ ప్రసరణ విషయ విశేషమే. నా యొక్క ఆత్మస్వరూపము పర్వత శిఖరమువలె సమున్నతమై నిలచి ఉంటోంది. ఆకాశంలో సూర్యుని నిర్మల తేజస్సువలె, నేనే స్వయముగా అమృత స్వరూపుడనై సర్వత్రా వెలయుచున్నాను.

ద్రవిణగ్ం సువర్చసం, సుమేధా అమృతో క్షితః।
ఇతి త్రిశంకోః వేద అనువచనమ్॥

సమస్తము నా యొక్క సంపదయే అయి, గొప్ప వర్చసుతో నిర్మల బుద్ధి స్వరూపుడనై, అమృత స్వరూపుడనై వెలుగొందుచున్నాను. ఇది త్రివేదముల సారమగు వేదవచనము.

యః ఛందసాం వృషభో విశ్వరూపః,
ఛందోభ్యో అధ్యమృతాత్ సంబభూవ,
సమ ఇంద్రో, మేధయా స్పృణోతు।

- ఏ "ఆత్మ" అనే ఎద్దు (శ్రేష్ఠత్వము) విశ్వరూపంగా అగుపిస్తోందని వేదములచే సూచించబడుతోందో,

- వేదాధ్యయనముచే ఏది మార్పు చేర్పులకు అతీతంగా అమృత స్వరూపమై సిద్ధిస్తోందో,

అట్టి సమస్వరూపమగు ఆత్మను మేము మేధస్సు (బుద్ధి)తో ఇంద్రియములను ఉపయోగించి దర్శించెదము గాక.

అమృతస్య దేవ
ధారణో భూయాసమ్।

మేము బలవంతులమై మా పట్టుదలతో అట్టి అమృత స్వరూపమగు బ్రహ్మతత్త్వమునే (లేక) మా సహజ స్వాభావిక స్వస్వరూపమునే ధారణగా కలిగి ఉండెదము గాక.

---

శరీరం మే విచర్షణం। జిహ్వా మే మధుమత్తమా।
కర్ణాభ్యాం భూరి విశృవమ్।

మా యీ శరీరము (బుద్ధి) జడత్వము వీడి ఆత్మ భావనా సిద్ధికే గొప్పగా సచేతనమై ఉండు గాక. మా నాలుక పరమాత్మ గురించిన పలుకుచే మధురమగు గాక.

బ్రహ్మణః కోశో అసి మేధయా పిహితః
శృతం మే గోపాయ।

ఈ మా చెవులు విస్తారమగు పరమ సవ్యమును వినుటకై ఉత్తేజితమగు గాక. వేదముల హృదయము (కోశము) నుండి మహనీయుల మేధస్సు (ప్రజ్ఞ)చే స్వానుభవముగా జనించిన శృతులు రహస్యముగా ప్రకటించబడిన స్వస్వరూపాత్మ తత్త్వజ్ఞానము మా యందు వికసించి, మమ్ము ఆనందింపజేయును గాక.

---

'దార' ఈషణాయాః చ 'ధన' ఈషణాయాః చ
'లోక' ఈషణాయాః చ వ్యుత్థితో అహమ్।

అట్టి వేదహృదయము, ఉపనిషత్ వాణి, వేదజ్ఞుల స్వానుభవము అగు స్వస్వరూప జ్ఞానము "భార్య - ధనము - లోకము" అనే మూడు ఈషణములచే (కోరికలచే) కప్పబడి ఉండగా, ఇప్పుడు నేను వ్యుత్థనము (స్వాతంత్ర్యము) (get awakened) పొందుచున్నాను.

"ఓం భూః సన్న్యస్తం మయా।
ఓం భువః సన్న్యస్తం మయా।
ఓగ్ం సువః సన్న్యస్తం మయా।
ఓం భూర్భువః సువః సన్న్యస్తం మయా" – ఇతి॥

'భూ'' "భువః'' "సువః'' (Matter, Thought, (limited) Self) భూ-భువర్-సువర్- లోకముల భూ-భువర్-సువర్-వ్యాహృతులను దాటి సత్ స్థానమును చేరుతూ అసత్‌ను వీడుచు సత్-న్యస్తుడను అగుచున్నాను.

---

మంద్ర మధ్యమ తార ధ్వనిభిః
మనసా వాచా ఉచ్చార్యా,

పై "అహం వృక్షస్య రేరివ'' మంత్రమును "సన్న్యస్తం మయా'' మంత్రములను మంద్ర (నెమ్మది, గంభీర స్వరముతోను, మధ్యమ స్వరముతోను, తారాస్థాయి స్వరములతోను- (Low, Middle and High voices) మనస్సు - వాక్కులను ఏకం చేసి ఉచ్చారణ చేయాలి.

అభయం సర్వ భూతేభ్యో।
మత్తః సర్వం ప్రవర్తతే
ఇతి – అనేన।

"ఆత్మనగు నేనే ఈ సమస్తము అయి ఉన్నాను. అందుచేత దీనికి అంతటికీ అభయుడను. ఈ సమస్తము ఆత్మ స్వరూపుడగు నాచేతనే ప్రవర్తితము (Participative, getting activated) అగుచున్నది.

జలం ప్రాశ్య
"ప్రాచ్యాం దిశి పూర్ణాంజలిం ప్రక్షిప్యోం స్వాహా"
ఇతి శిఖాం ఉత్పాట్య।

ఈ విధంగా మంత్రము, మంత్రార్థము వాక్కుతోను, మనస్సుతోను చదువుతూ, జలమును మూడు సార్లు స్వీకరించి తూర్పు దిక్కున ప్రక్షిప్తమైన (Placed) ఓంకార అగ్ని తత్త్వమునకు పూర్ణాంజలి ఘటిస్తూ స్వాహా - అని పలుకుచు శిఖను (పిలక, జుట్టు) త్రెంచివేయాలి.

**12. యజ్ఞోపవీతం పరమం పవిత్రం**
**ప్రజాపతేః యత్ సహజం పురస్తాత్,**

**ఆయుష్యం అగ్ర్యం ప్రతిముంచ శుభ్రం**
**యజ్ఞోపవీతం బలమస్తు తేజః।**

సృష్టికి ముందే గల ప్రజాపతి 'సృష్టి' అనే ఈ సమస్తము ధారణ చేయుటచే రూపు దిద్దుకొన్నది. అట్టి ఈ సృష్టి యజ్ఞము నా పట్ల పరమ పవిత్రమై ఉండును గాక.

నన్ను ఆయుష్మంతుని గాను, అగ్రగామిగాను, మలినము తొలగించి పరిశుభ్రునిగాను, బలవంతునిగాను, తేజో సమన్వితునిగాను తీర్చిదిద్దును గాక।

**యజ్ఞోపవీతం బహిః న నివసేత్।**
**త్వం అంతః ప్రవిశ్య, మధ్యే హి**
**అజస్రం పరమం పవిత్రం**
**యశో బలం వైరాగ్యం మేధాం ప్రయచ్ఛ ఇతి।**

ఓ యజ్ఞోపవీత దేవతా ! ఇక మీరు బయట ఉండకండి. నా అంతరమున ప్రవేశించండి. హృదయ అంతర్గత మధ్యగా వేంచేసి నా యందు పరమపావనము అగు బుద్ధిని ప్రవిత్రమగు ఆచారములను, యశస్సును, జ్ఞానబలమును, వైరాగ్యమును, మేధస్సును ప్రసాదించెదరు గాక.

---

**యజ్ఞోపవీతం ఛిత్త్వా, ఉదక అంజలినా,**
**సహ "ఓం భూః సముద్రం గచ్ఛ స్వాహా"**
**ఇతి అప్సు జుహుయాత్॥**

**"ఓం భూః సముద్రం గచ్ఛ స్వాహా"** అను మంత్రము పలుకుచు "యజ్ఞోపవీతము"ను తెంచి అంజలి ఘటిస్తూ (రెండు చేతులతో నమస్కరిస్తూ) జలములో వదలి వేయాలి.

ఓం 'భూః' సన్న్యస్తం మయా।
ఓం 'భువః' సన్న్యస్తం మయా।
ఓగ్ం 'సువః' సన్న్యస్తం మయా।

**ఇతి త్రిః ఉక్త్వా, త్రివారం అభిమంత్ర్య**
**తత్ జలం ప్రాశ్య ఆచమ్య, ఓం భూః స్వాహా।**
**ఇతి అప్సు వస్త్రం కటి సూత్రం అపి విసృజ్య,**
**"సర్వ కర్మ నివర్తకోఽహమ్" ఇతి స్మృత్వా॥**

"ఓం భూః భువః సువః సన్న్యస్తం మయా" (భూర్ భూవర్ సువర్ లోకములను సన్యసిస్తున్నాము' అని 3 సార్లు పలుకుచు అభిమంత్రన పూర్వకంగా, జలముతో 3 సార్లు ఆచమనం చేసి మొలనూలును (కటి సూత్రమును) నీటిలో వదలుచు **"నేను ఇప్పుడు సమస్త కర్మలనుండి నివర్తకుడను (withdraw) అగుచున్నాను"** అని పలుకుచు భావించును గాక.

---

**13. జాతరూపధరో భూత్వా,**
**స్వరూప అనుసంధాన పూర్వకం**
**ఊర్ధ్వ బాహుః ఉదీచీం గచ్ఛేత్।**

ఆ తరువాత జాతరూపధారుడై (అప్పుడే పుట్టిన బిడ్డవలె అప్పటి వరకు వెంటవచ్చిన సమస్త సంబంధ బాంధవ్యములను మనస్సుతో త్యజించినవాడై).

తన సహజము, స్వాభావికము అగు "కేవలాత్మ స్వరూపము"తో అనుసంధానము పొందినవాడై చేతులు పైకి ఎత్తి ఉంచినవాడై, ఉదీచీ దిశగా (ఉత్తర దిశగా towards north) నడచివెళ్లును గాక.

**1. విద్వత్ సన్న్యాసి**

**పూర్వవత్ విద్వత్ సన్న్యాసీ చేత్ గురోః**
**ప్రణవ మహావాక్య ఉపదేశం ప్రాప్య,**
**యథా సుఖం విహరన్।**
**మత్తః కశ్చిత్ న అన్యో వ్యతిరిక్త ఇతి**
**ఫలపత్ర ఉదక ఆహారః।**
**పర్వత వన దేవత-ఆలయేషు సంచరేత్।**
**సన్న్యస్య అథ దిగంబరః**
**సకల సంచారకః, సర్వానంద**
**స్వానుభవైకపూర్ణ హృదయః।**

**1) విద్వత్ సన్న్యాసి :** ఒకవేళ గురుముఖతః బ్రహ్మజ్ఞానము శ్రవణము చేసియే ఉన్న "విద్వత్ సన్న్యాసి" (wel educated) అయి వుంటే తన గురువుగారిని సమీపించి, వారి వద్ద ప్రణవ మహావాక్యములను "ఓం", తత్త్వమ్, సోఽహమ్ మొ॥న మహర్థములను ఉపదేశము పొంది, ఇక ఆపై యథా సుఖముగా విహరించటము ప్రారంభించును గాక.

**"మత్తః కశ్చిత్ న అన్యో అస్తి"** ఆత్మస్వరూపుడనగు నాకు వేరుగా ఎక్కడా ఏది లేదు అను నిశ్చయబుద్ధి కలిగియే ఉండి, స్థలము, ఆకు జలము స్వీకరించును గాక. పర్వత, వన, దేవాలయములలో సంచారములు కలిగి ఉండును గాక.

అట్టి సన్న్యాసి "దేశ-కాల-శరీర-వస్తు" మొదలైనవన్నీ మనస్సుతో త్యజించి ఉన్నవాడై, ఇష్టానుసారం ఎక్కడెక్కడైనా సంచారములు కలవాడై సర్వానంద స్వానుభవ ఏకపూర్ణ సత్ హృదయుడు అగుచున్నాడు.

| | |
|---|---|
| **కర్మాతి దూరలాభః।** | కర్మ - కర్మ ఫలములతో సంబంధమే లేని లాభము పొందిన వాడగుచున్నాడు. |
| **ప్రాణధారణ పరాయణః।<br>ఫల రస త్వక్ పత్రమూల ఉదకైః<br>మోక్షార్థీ గిరికందరేషు<br>విసృజేత్ దేహం, స్మరన్ తారకమ్।** | తన యొక్క ప్రాణ శక్తి తాను దర్శించు వస్తువువలె, తన యొక్క శక్తి ప్రదర్శనమువలె అనుభవుడు, పరాయణుడు అగుచున్నాడు. ఆత్మ భావన అనే తరింపజేయు తారక మంత్రము భావనాత్మకంగా స్మరిస్తూ, ఎక్కడ ఏది దొరికితే ఆ ఫలములను, రసమును, తొక్కను, ఆకులను, చెట్ల వ్రేళ్లను, నీళ్లను కూడా భుజిస్తూ మోక్షము కోరువాడై ఈ శరీరమును "నాది కాదు, నేను కాదు" అను భావన అగాహనలతో వదలివేసుకున్నవాడు అగుచున్నాడు. |
| **<u>2. వివిదిషా సన్న్యాసి</u>**<br>**14. వివిదిషా సన్న్యాసీ చేత్, శతపథం గత్వా<br>ఆచార్య ఆధిభిః విప్రైః<br>"తిష్ఠ తిష్ఠ, మహాభాగ! దండం వస్త్రం<br>కమండలుం గృహాణ ప్రణవ మహావాక్య<br>గ్రహణార్థం గురు నికటం ఆగచ్ఛేత్ ఇతి।<br>ఆదిష్ట ఆచార్యైః దండం కటిసూత్రం<br>కౌపీనం శాటీం ఏకాం కమండలుం।** | **2) వివిదిషా సన్న్యాసి :** ఇక వివిదిషా సన్న్యాసి గురించి చెప్పుకుంటున్నాము. బ్రహ్మ జ్ఞానము సిద్ధించి సన్న్యసించువాడు విద్వత్ సన్న్యాసి. బ్రహ్మజ్ఞానము కొరకై సన్న్యసించువాడు వివిదిషా సన్న్యాసి. బ్రహ్మ జ్ఞాన సాధన కొరకై సన్న్యసించు వివిదిషా సన్న్యాసి అనేక మార్గములుగా మోక్షాశయము వైపు ప్రయత్నశీలుడు అగుచున్నాడు. అట్టి సన్న్యాస సందర్భములో ఆచార్యులు విప్రులు మొ॥వారు ఇట్లా పలుకుతారు "ఓ బ్రహ్మ జ్ఞాన సిద్ధి కొరకై సన్యసిస్తున్న మహాభాగా! ఆగండి! నిలవండి! దండమును, కాషాయ వస్త్రమును స్వీకరించండి. మహావాక్యముల పరమార్థము గ్రహించటానికై గురు - ఆశ్రమం ఆశ్రయించండి" అని ఆశీర్వాదం పలుకుచున్నారు.<br><br>ఆచార్యులను సమీపిస్తూ దండము, కటిసూత్రము, కౌపీనము, ఏకవస్త్రమును, కమండలును ధరించండి. |
| **పాద ఆది మస్తక ప్రమాణం అవ్రణం<br>సమం సౌమ్యం అకాక పృష్ఠం సలక్షణం<br>వైణవం దండం ఏకం ఆచమన పూర్వకం** | **వైణవ (వేణు) దండము :** పాదముల నుండి నుదిటి వరకు పొడవుగల వంకరలు లేని దండమును ఆచమన పూర్వకంగా స్వీకరించాలి. ఆ దండము సమంగా సౌమ్యంగా (అందంగా) వంకర టింకరలు లేనిదై ఉండుగాక. **"సఖాం ఆగోపాయ ... నివారయ"** మంత్రము పఠిస్తూ దండమును పరిగ్రహించాలి. |
| **సఖాం ఆగోపాయ ఓజః।<br>సఖాయో అసి ఇంద్రస్య వజ్రః అసి వార్త్రఘ్నః<br>శర్మ మే। భవ యత్ పాపం,<br>తత్ నివారయ - ఇతి దండం పరిగ్రహేత్।** | ఓ దండమా! నీవు నా మిత్రుడవు. నాకు ఓజస్సు (శక్తి) ప్రసాదించి కాపాడుము. నీవు ఇంద్రుని వజ్రాయుధమువంటిదానవు. నా పాపములు నాశనం చేయుము. |
| **"జగత్ జీవం జీవన ఆధారభూతం! మాతే।<br>మా మంత్రయస్వ సర్వదా సర్వసౌమ్య" - ఇతి<br>ప్రణవ పూర్వకం కమండలుం పరిగృహ్య।<br>కౌపీన ఆధారం కటిసూత్రం! ఓం! - ఇతి<br>గుహ్య ఆచ్ఛాదనం కౌపీనం! ఓం! - ఇతి<br>శీత వాత ఉష్ణ త్రాణకరం<br>దేహైక రక్షణం వస్త్రం 'ఓం' - ఇతి।<br>కటిసూత్రం కౌపీనం వస్త్రం - ఆచమన పూర్వకం,<br>"యోగ పట్టాభిషిక్తో భూత్వా కృతార్థో అహమ్" ఇతి<br>- మత్వా స్వ ఆశ్రమ ఆచారో భవేత్।** | ఈ మంత్రముతో పాటుగా "ఓం" ప్రణవమును ఉచ్చరిస్తూ కమండలువుని గ్రహించెదరు గాక.<br><br>కౌపీనము (గోచి)నకు కటి సూత్రము (మొలత్రాడు) 'ఓం' కారభావనా పూర్వకంగా ధరించబడుగాక.<br><br>**"శీతావాత...ఓం"** ఈ మంత్రము చదువుచు క్రమంగా కటిసూత్రం (మొలత్రాడు), కౌపీనము (గోచి), వస్త్రములను ఆచమన పూర్వకంగా స్వీకరించాలి.<br><br>"ఇప్పుడు ఈ సన్యాస యోగ స్వీకారముచే యోగ - పట్టాభిషిక్తుడును, కృతార్థుడను అగుచున్నాను" అని మంత్ర ఉచ్చారణలను పలుకుచు - తన ఆశ్రమమునందు నివసించును గాక. |

**ఇత్యుపనిషత్ - నారద పరివ్రాజకోపనిషత్ - "చతుర్థ ఉపదేశః"**

# పంచమోపదేశః (5వ ఉపదేశము)

# చతుర్విధ సన్న్యాస భేదములు

**1.** అథ హ ఏనం పితామహం నారదః పప్రచ్ఛ

భగవన్! "సర్వకర్మ నివర్తకః సన్న్యాస" – ఇతి త్వయ ఏవ ఉక్తః। పునః స్వ ఆశ్రమాచార పరః భవేత్ ఇతి ఉచ్యతే,

**శ్రీ నారదమహర్షి :** హే పితామహా ! భగవాన్! సమస్త కర్మల నుండి నివృత్తి (withdraw from all activites) యే "సన్న్యాసము" అని మీరు ఇంతవరకు చెప్పుచూ వస్తున్నారు. ఇంతలో "స్వ-ఆశ్రమ సంబంధమైన కర్మలను, తత్ - సంబంధమైన ఆచారములు సన్యాసి నిర్వర్తిస్తూ ఉండునుగాక" అంటున్నారు. అనగా, సన్యాసాశ్రమము అనగా గృహస్థ ధర్మములు, సాంఘికమైన సమస్త వ్యవహారిక ధర్మములు, కర్మలు వదలటము కాదా ?

---

తతః పితామహ ఉవాచ:-
శరీరస్య దేహినో, జాగ్రత్ స్వప్న సుషుప్తి తురీయ అవస్థాః సంతి।
తత్ అధీనాః కర్మ జ్ఞాన వైరాగ్య ప్రవర్తకాః పురుషా జంతవః – తత్ అనుకూల ఆచారాః సంతి।

**పితామహుడు బ్రహ్మదేవ భగవానుడు :** నారదా ! దేహి ఈ దేహము (శరీరము) స్వీకరించటం చేత 1) జాగ్రత్ 2) స్వప్నము 3) సుషుప్తి 4) తురీయము అను నాలుగు అవస్థలు స్వీకరించినవాడు అగుచున్నాడు.

అట్టి 4 అవస్థలకు అధీనుడై కర్మ - జ్ఞాన - వైరాగ్య వర్తనుడై ఈ పురుషుడు (జీవుడు) ఉండవలసి వస్తోంది. జాగ్రత్‌లో "నేను సన్న్యాసాశ్రమవాసిని" అని తలచినప్పటికీ, మిగిలిన స్వప్న - సుషుప్తి - తురీయ సంబంధమై కర్మ - జ్ఞాన - వైరాగ్యములు ఉండనే ఉంటాయి కదా.

శ్రీ నారదుడు: తథ ఏవ చేత్, భగవన్!
సన్న్యాసాః కతి భేదాః?
తత్ అనుష్ఠాన భేదాః కీదృశాః?
తత్త్వతో అస్మాకం వక్తుమ్ అర్హసి – ఇతి।

**శ్రీ నారదుడు :** అయితే పితృదేవా ! ఈ విషయం వివరించి చెప్పండి. సన్యాసులు ఒక్కటేనా ? లేక వారిలో వేరు వేరు తరగతులు ఉంటే వారి పట్ల అనుష్ఠాన భేదములుంటాయా ? వాటి తాత్త్విక విశేషాలతో సహా వివరించండి.

---

**2.** తథా ఇతి అంగీకృత్య తం పితామహేన సన్న్యాస భేదైః ఆచార భేదః కథితః
కథం ఇతి చేత్, తత్త్వతస్తి ఏక ఏవ సన్న్యాస అజ్ఞానేన, ఆసక్తివశాత్ కర్మ లోపశ్చ త్రైవిధ్యం ఏత్య।
వైరాగ్య సన్న్యాసో, జ్ఞాన సన్న్యాసో జ్ఞాన వైరాగ్య సన్న్యాసః, కర్మ సన్న్యాసశ్చ।
ఇతి చాతుర్విధ్యమ్ ఉపాగతః తథ్యథేతి।

**పితామహుడు :** బిడ్డా ! నారదా ! సరే ! అట్లాగే నీవు అడిగిన వివరాలు వివరించుకుందాము. "సన్న్యాసము" అనునది పరాకాష్ఠ తత్త్వముగా చూస్తే 'ఒక్కటే' అయినప్పటికీ ఆచార (Activity) భేదం చేతను, జ్ఞాన - అజ్ఞానములను అనుసరించియు జీవుల వారి వారి అనుక్తులను (Inquisitive attitudes) దృష్టియందుంచుకొని కర్మల పట్ల అభిరుచి, అభినివేశములను బట్టి ఆయా భేదముల దృష్ట్యా 4 విధములుగా వర్ణించబడుతోంది.

**అవి ఏమిటంటే 1) వైరాగ్య సన్న్యాసము 2) జ్ఞాన సన్న్యాసము 3) జ్ఞాన వైరాగ్య సన్న్యాసము 4) కర్మ సన్న్యాసము.** వాటి గురించి చెప్పుకుందాము.

---

దుష్ట మదన అభావాత్ చ ఇతి విషయ వైతృష్ణ్యం ఏత్య ప్రాక్ పుణ్యకర్మ వశాత్ సన్న్యస్తః, స వైరాగ్య సన్న్యాసీ।

**1) వైరాగ్య సన్న్యాసము :** అనేక భక్తి - సుకర్మ - అధ్యయనముల ఉత్తమ ప్రయోజనంగా ఒకానొకడు దుష్టమైన మదన (ఏదో కావాలి, పొందాలి అనే కామన) భావముల పట్ల తృష్ణారాహిత్యమును పొంది, అప్పుడిక సన్న్యసించుచున్నాడు. ఇట్టివాడు **"వైరాగ్య సన్న్యాసి"** అని చెప్పబడుచున్నాడు.

శాస్త్ర జ్ఞానాత్ పాప పుణ్యలోక అనుభవ శ్రవణాత్ ప్రపంచః

**2) జ్ఞాన సన్న్యాసము :** శాస్త్రములు అధ్యయనము చేస్తూ మహనీయుల ప్రవచనములు శ్రవణం చేస్తూ దుష్ట కర్మఫలములైన పాపపు లోకములను, సత్కర్మ ఫలములైనట్టి పుణ్య ఫలములను

**పరతః క్రోధ ఈర్ష్యా అసూయ**
**అహంకార అభిమాన ఆత్మక**
**సర్వసంసారం నివర్త్య,**

**దారైషణ, ధనైషణ, లోకైషణాత్మక దేహ వాసనాం,**
**శాస్త్రవాసనాం, లోకవాసనాం త్యక్త్వా,**

(సుఖ-దుఃఖ పర్యవసానములను), వాటి పరిమితులను పెద్దల నుండి విని తెలుసుకున్నవాడై "కర్మలు మోక్షము ప్రసాదించలేవు" అని తెలుసుకుంటాడు. క్రమంగా వాటి పట్ల అభినివేశమును (Emotional Attachment) ఉపసంహరించుకొని క్రమంగా క్రోధము, ఈర్ష్య, అసూయ, అహంకారము, అభిమానములను (Tendency of Anger, Disliking, Hatred, Individualistic sense of relatedness, liking for certain worldly matters)లతో కూడిన "సంసారము" అనే జాడ్యము నుండి నివర్తము (Coming out) పొందినవాడగుచున్నాడు. "ఈ భార్య, ధన సంపద, లోక సంబంధములు నాకు చెందినవి. నేను వీటికి చెందినవాడను" అనే త్రి - ఈషణములను (Tri-fondness) దేహమునకు, శాస్త్ర పాండిత్యమునకు లోక సంబంధములకు చెందిన త్రి-వాసనలను (Tri-Tendencies) మానసికంగా వదలి వేస్తూ, ఆధారపడనివాడై ఉండాలి.

---

**"వమన-అన్నం ఇవ ప్రాకృతికం సర్వం**
**ఇదం హేయం మత్వా,**
**సాధన చతుష్టయ సంపన్నః యః సన్న్యస్యతి**
**స ఏవ "జ్ఞాన సన్న్యాసీ"॥**

**క్రమేణ సర్వం అభ్యస్య, సర్వం అనుభూయ,**

ప్రకృతి ప్రాపంచక సమస్త సంబంధ అనుబంధ - బాంధవ్యములను "ఇవన్నీ కక్కిన కూడు (Vomited Food) లాగా మొదలంట్ల వదలవలసినవి అని గమనించినవాడై సాధన చతుష్టయము **(1) నిత్య-అనిత్య వస్తు వివకము 2) ఇప్పటి - మరొకప్పటి కర్మ ఫల భోగముల పట్ల విరాగము 3) శమము, దమము మొదలైన శమాది షట్కసంపత్తి 4) మోక్షము పొందాలి అనే ముముక్షుత్వము** అనే సంపదను అభ్యాసపూర్వకంగా సుసంపన్నము చేసుకొన్నవాడు **"జ్ఞాన సన్న్యాసి".**

---

**జ్ఞాన - వైరాగ్యాభ్యాం స్వరూప అనుసంధానేన**
**దేహమాత్ర అవశిష్టః,**
**సన్న్యస్య జాతరూపధరః భవతి।**
**స "జ్ఞానవైరాగ్య సన్న్యాసీ"॥**

**జ్ఞాన వైరాగ్య సన్న్యాసము :** పైన చెప్పిన జ్ఞాన సన్యాస విశేషాలు అభ్యాసం చేస్తూ, క్రమంగా వాటిని అనుభూతిపరంగా స్వాభావికం చేసుకొంటూ ఉండాలి.

- జ్ఞాన వైరాగ్య - అభ్యాసబలం చేత సహజము, అమృతము, పరము అగు కేవల స్వస్వరూపములో అనుసంధానము (Connected) పొందుచూ ఉండాలి.

- ఈ భౌతిక శరీరమును లేనిదిగా గమనిస్తూ లీలా వినోదంగా ధరిస్తూ ఉండాలి. సర్వమును ధరిస్తూ పుట్టుకకు ముందే గల ఆత్మశరీరము ధరించి ఉన్నవాడు **"జ్ఞానవైరాగ్య సన్న్యాసి"** అని పిలువ బడుచున్నాడు.

---

**బ్రహ్మచర్యం సమాప్య, గృహీభూత్వా**
**వానప్రస్థ ఆశ్రమం ఏత్య, వైరాగ్య ఆభావే**
**అపి ఆశ్రమ క్రమ అనుసారేణ యః**
**సన్న్యస్యతి "సకర్మ సన్న్యాసీ"॥**

**4) కర్మ సన్న్యాసి :** మొట్టమొదట బ్రహ్మచారి ఆశ్రమమును పొంది శాస్త్ర - ఆత్మ విద్యా అధ్యాయనుడై విద్యాభ్యాసము పూర్తి చేసుకుని, అటు తరువాత గురు - అనుజ్ఞ పొంది గృహస్థాశ్రమము స్వీకరించి, ఆ తరువాత వానప్రస్థమును ఆశ్రయించి, వైరాగ్యం పొంది, అటు తరువాత సన్యాస ఆశ్రమము పొందువాడు **"కర్మసన్న్యాసి"** అని పిలువబడుచున్నాడు.

---

**3.** **బ్రహ్మచర్యేణ సన్న్యస్య సన్న్యాసాత్**
**జాతరూపధరో, "వైరాగ్య సన్న్యాసీ"॥**

బ్రహ్మచర్యాశ్రమము నుండి నేరుగా సన్యసించువాడు "జాతరూపధరుడు అయినవాడు "వైరాగ్య సన్న్యాసి" అని అనబడుచున్నాడు.

**1. విద్వత్ సన్న్యాసీ, 2. జ్ఞాన సన్న్యాసీ**
**3. వివిదిషా సన్న్యాసీ, 4. కర్మసన్న్యాసీ**
**చ-ఇతి చతుర్ధా।**

**నాలుగు విధములైన సన్న్యాసులు** 1) విద్వత్ సన్న్యాసి 2) జ్ఞాన సన్న్యాసి 3) వివిదిషా సన్న్యాసి 4) కర్మ సన్న్యాసి అని మరల గుర్తు చేసుకుంటున్నాము.

| | |
|---|---|
| కర్మసన్న్యాసో అపి ద్వివిధః (2)।<br>1. నిమిత్త సన్న్యాసః 2. అనిమిత్త సన్న్యాసః చ ఇతి।।<br>నిమిత్తస్తు ఆతురః ।<br>అనిమిత్తః క్రమ సన్న్యాసః।<br><br>ఆతురః సర్వకర్మ లోపః।<br>ప్రాణస్య ఉత్క్రమణకాల సన్న్యాసః<br><u>"నిమిత్త సన్న్యాసః"</u>। | **కర్మ సన్న్యాసులు రెండు రకములు :**<br>1) నిమిత్త సన్న్యాసి 2) అనిమిత్త సన్న్యాసి.<br>1) నిమత్త కారణంగా సన్న్యసించువాడు (Timely, because of incident like nearing death etc) ఆతుర సన్న్యాసి.<br>2) అనిమిత్త సన్న్యాసి సన్న్యాస క్రమములు, సన్న్యాస ధర్మములు శాస్త్రీయంగా ముందుగా నిర్వర్తించువాడు.<br>ఆతుర సన్న్యాసికి సన్న్యాస కర్మకాండ విధి విధానము పరిమితంగాను సందర్భానుకూలంగాను ఉంటుంది. ప్రాణములు విడువటము సమీపిస్తున్నప్పుడు అట్టివానికి "ఆతుర సన్న్యాసము" చెప్పబడుతోంది. |
| ధృఢ అంగో భూత్వా సర్వం కృతకం నశ్వరం ఇతి - దేహాదికం సర్వం హేయం ప్రాప్య।<br><br>హగ్ంసః శుచిషత్। వసుః అంతరిక్ష సత్।<br>హోతా వేదిషత్ అతిథిః దురోణ సత్।<br>నృషద్ వర సత్ వ్యోమ సత్।<br>అబ్జా, గోజా, ఋతజా, అద్రిజా, <u>ఋతం బృహత్</u>।।<br><br>(గమనిక - "హగ్ంసః శుచిషత్" అను మంత్రము కఠ ఉపనిషత్ (అధ్యాయము 2 - వల్లీ 2) యందు మరియు త్రిపుర తాపినీ ఉపనిషత్ (అధ్యాయము 4) యందు కూడా కలదు) | **అనిమిత్త (క్రమ) సన్న్యాసము :** దృఢమైన అంగములు కలవాడే క్రమ సన్న్యాసము స్వీకరించును గాక. ఈయన "కర్మలు, కర్మ ఫలములు కాలముచే నశించిపోయేవే" అని గ్రహించి దేహము మొదలైనవి ప్రజ్ఞతో కూడిన మనస్సుచే వదలవలసినవిగా గమనిస్తున్నాడు. సోఽహమ్‌ను ఆశ్రయించి ఆత్మ స్వరూపమును సిద్ధించుకొనును గాక. అట్టి ఆత్మాహమ్ భావన ఎట్టిది? అనగా<br>- దివ్యలోకములో 'హంస' వలె విహరించువాడును<br>- ఆకాశంలో వాయువువలెను<br>- యజ్ఞ వేదికపై గల అగ్ని గుండము నందు గల అగ్నివలెను<br>- ద్రోణకలశములోని సోమరసము వలెను<br>- ఇంటిలో వేంచేసియున్న అతిథి వలెను<br>- సమస్త దేహములలో సంచరించే వాయువు (గాలి) వలెను<br>- ఆకాశములో, యజ్ఞములో ఉన్నది<br>- అబ్జమునందు (తామరపువ్వునందు), ధాన్యము (భూమి) యందు, ఋత్ వలెను (యజ్ఞాంగములందు), కొండపైన పరమ సత్యమై స్వస్వరూపమై వెలయుచున్నది అని ఆత్మతత్త్వజ్ఞుడు దర్శించుచున్నాడు. |
| బ్రహ్మ వ్యతిరిక్తం సర్వం నశ్వరం ఇతి।<br>నిశ్చిత్య క్రమేణ యః సన్న్యస్యతి,<br>స సన్న్యాసః - "అనిమిత్త సన్న్యాసః"। | "బ్రహ్మమునకు వేరై కనిపించేదంతా నశించబోవునదే" అని గమనించుచున్నాడు. ఇట్టి నిశ్చయముతో కూడినవాడై ఎవ్వడు సన్న్యాసిస్తాడో, అట్టివాడు "నిమిత్త సన్న్యాసి" అని చెప్పబడుచున్నాడు. |
| **4.** సన్న్యాసః షడ్విధో (6) భవతి।<br>(1) కుటీచకో (2) బహూదకో (3) హంసః।<br>(4) పరమహంసః (5) తురీయాతీతో<br>(6) అవధూతః చ ఇతి, | సన్న్యాసులు ఆరు (6) విధలములైనవారు 1) కుటీచకుడు 2) బహూదకుడు 3) హంస 4) పరమహంస 5) తురీయాతీతుడు 6) అవధూత |
| <u>కుటీచకః :</u> -<br>శిఖా యజ్ఞోపవీత దండ కమండలు ధరః, కౌపీనకంథాధరః, పితృ మాతృ గురు ఆరాధన పరః, పిఠరఖని త్రశిక్య ఆది మంత్ర సాధన పర। ఏకత్ర అన్నాదన పరః శ్వేత ఊర్ధ్వ పుండ్రధారీ। త్రిదండః। | **1) కుటీచక సన్న్యాసి :** శిఖ, యజ్ఞోపవీతము, చేతిలో దండము, కమండలు (నీటి చెంబు) ధరించి ఉంటారు. పిఠరఖము (కవ్వపు కోల) త్రశిక్యము (మూడు ముళ్లుగల కావడి ఉట్టి) కూడా ఉండును. అతనికి మనన రూపమై మంత్రసాధనలు అగుచున్నాయి. ఒకేచోట ఉండి భుజించువాడు, తెల్లటి ఊర్ధ్వపుండ్రములను (నుదుటి నామము) అలంకరించుకొనువాడు. త్రిదండము (మనోదండము, వాక్ దండము, కర్మ దండము) అనే త్రిదండములను ధరించువాడు. |

| | |
|---|---|
| <u>బహూదకః : –</u><br>శిఖా  కంథాదిధరః।<br>త్రిపుంద్రధారీ। కుటీచకవత్ సర్వ సమో।<br>మధుకర వృత్త్యా అష్ట కబళ అశీ। | **2) బహూదక సన్న్యాసి :** శిఖ, యజ్ఞోపవీతము మొదలైనవి ధరించువారు. త్రిపుండ్రము, మధూకర భిక్ష చేస్తూ '8' కబళములు (ముద్దలు) ఆహారము స్వీకరించు నియమములు పాటించువారు బహూదక సమానులు. |
| <u>హంసః : –</u><br>జటాధారీ। త్రిపుంద్ర ఊర్ధ్వ పుండ్రధారీ।<br>అసంక్లుప్త మధుకర అన్న అశీ।<br>కౌపీన ఖండతుండధారీ। | **3) హంస :** జటధారి (పెద్ద జడలు కలిగి ఉండువారు). ఊర్ధ్వ పుండ్రములను ధరించువారు. ఈ ఇల్లు - ఆ ఇల్లు అనే నియమము పాటించక జీవించువారు. మధుకరము (భిక్షాటన) చేసి, గోచీ ఖండము ధరించువారు. |
| <u>పరమహంసః : –</u><br>శిఖా యజ్ఞోపవీత రహితః।<br>పంచ గృహేషు ఏకరాత్ర అన్నాదానపరః।<br>కర పాత్రీ ఏక కౌపీనధారీ।<br>శాటీం ఏకాం ఏకం వైణవం దండం।<br>ఏక శాటీధరో వా।<br>భస్మోద్ధూళన పరః సర్వత్యాగీ। | **4) పరమహంస :** శిఖ (పిలక), యజ్ఞోపవీతము (జంధ్యము) వదలివేసి ఉంటారు. రోజుకు ఐదు (5) ఇళ్లలో మాత్రమే, రోజుకు ఒకసారి భిక్ష స్వీకరించువారు. చేతినే భిక్ష పాత్రగా ఉపయోగించువారు. ఒక్క గోచీమాత్రమే కలిగి ఉండువారు. ఒక్క 'వైణవం దండము (చెక్కదండము) ఉపయోగించువారు. **ఏకశాటి (ఏక వస్త్రము, ఒక్క దుప్పటి)** ధరిస్తూ శరీరమంతా విభూతిని పూసుకొని ఉండువారు. సమస్తమును త్యజించి పరబ్రహ్మముతో ఏకాంతము ఆస్వాదించువారు. |
| <u>తురీయాతీతః : –</u><br>గోముఖః ఫల ఆహారీ।<br>అన్నాహారీ చేత్, గృహత్రయే దేహమాత్ర అవశిష్టో।<br>దిగంబరః కుణపం ఇవ శరీర వృత్తికః। | **5) తురీయాతీతుడు :** గోవువలె లభించిన ఆహారమును తృప్తిగా స్వీకరించువారు. మూడు గృహములలో మాత్రమే లభించిన ఆహారము స్వీకరించువారు. దేహము ఉండి కూడా లేనివారై దిగంబరులై (వస్త్రములను ధరించనివారై) ఈ శరీరమును నశించినదానివలె (శవమువలె) దర్శించువారు. |
| <u>అవధూతస్తు : –</u><br>అనియమో అభిశస్త పతిత వర్జన పూర్వకం<br>సర్వవర్ణేషు అజగర వృత్త్య ఆహార పరః।<br>స్వరూప అనుసంధానపరః। | **6) అవధూత :** శిఖ, యజ్ఞోపవీతము, భిక్ష మొదలైన ఏ శాస్త్రీయ నియమములు లేనట్టివాడు. సర్వ శాస్త్ర నియమములు దాటి ఉన్నవారు. పతితుల, పాప భావములు కలవారి ఇళ్లను వదలి, తదితర సకలం వర్ణ-జాతి వారి ఇళ్లలో భిక్ష స్వీకరించువారు. కొండచిలువ వలె లభించిన ఆహారము తినువారు. అఖండాత్మ స్వరూపముతో అనునిత్యము, స్వాభావికము అయినట్టి అనుసంధానము సిద్ధించుకొన్నవారు. |

**5.** ఆతురః జీవతి చేత్, క్రమసన్న్యాసః కర్తవ్యః।

ఒకడు మరణ సమయము వచ్చినదని అనుమానిస్తూ ఆతుర సన్న్యాసము (యజ్ఞ-అగ్ని నియమములు పాటించకుండా) స్వీకరించవచ్చును. అయితే అతడు దైవవశంగా తిరిగి ఆరోగ్యము పుంజుకుంటే, అట్టివాడు క్రమ సన్న్యాస విధుల ప్రకారము శాస్త్ర ప్రక్రియలు తిరిగి నిర్వర్తించాలి.

కుటీచక బహూదక హంసానాం
బ్రహ్మచర్య ఆశ్రమాది తురీయ ఆశ్రమవత్,
కుటీచక ఆదీనాం సన్న్యాస విధిః।

ఒకడు బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ ఆశ్రమములో దేనినుంచైనా కుటీచక, బహూదక, హంస సన్న్యాసములను సిద్ధింపజేసుకోవచ్చు.

పరమహంస ఆది త్రయాణాం న కటిసూత్రం।
న కౌపీనం। న వస్త్రం। న కమండులుః। న దండః।
సార్వ వర్ణిక భిక్షాటన పరత్వం,
జాతరూపధరత్వం విధిః।

**పరమహంస, తురీయాతీతుడు, అవధూత – ఈ ముగ్గురు సన్న్యాసులు కూడా కటి సూత్రము, కౌపీనము, కమండలువు దండము వీటిని ధరించాలనే నియమము ఏది కలిగి ఉండరు.** వీరికి ఏ వర్ణము వారి ఇళ్లలోనైనా భిక్షాటనము, జాతరూప ధరత్వం (అప్పుడే పుట్టిన బిడ్డ వలె జగద్దృశ్యముతో ఎటువంటి సంబంధము కలిగి ఉండకపోవటము) ఇది విధి విధానం చెప్పబడుతోంది.

| | |
|---|---|
| సన్న్యాసకాలే అపి అలంబుద్ధి పర్యంతం అధీత్య, తదనంతరం కటిసూత్రం కౌపీనం దండం వస్త్రం కమండలుం సర్వం అప్సు విసృజ్య। | సన్న్యాస కాలములో కూడా ఆత్మ జ్ఞాన తృప్తి పొందని అల్పబుద్ధి తొలగనంతవరకు శాస్త్రములను అధ్యయనము చేయవలసిందే. అటు తరువాత మొలనూలు (మొలత్రాడు), కౌపీన వస్త్రము (గోచి) దండము, వస్త్రము, కమండలము మొదలైనవన్నీ జలమునకు సమర్పించి వదలి వేయవచ్చును. |
| అథ జాతరూపధరః చరేత్ న కంథాలేశో నాధ్యేతవ్యో, న వక్తవ్యో, న శ్రోతవ్యం అన్యత్ కించిత్ ప్రణవాత్ అన్యం న తర్కం పరేత్ న శబ్దం అపి బహూన్ శబ్దాన్ న అధ్యాయేత్। న మహత్ వాచో విగ్లాపనం। గిరా ప్రాణి ఆదీనాం సంభాషణం। న అన్య భాషా విశేషణం। న శూద్ర స్త్రీ పతిత ఉదక్యాది సంభాషణం। న యతేః దేవపూజా। న ఉత్సవదర్శనం, తీర్థయాత్రా వృత్తిః॥ | పై 'జాతరూపధరుడు' అగుచూ "స్వాభావికంగా తనదే" అయిన అఖండ - అప్రమేయ ఆత్మరూపము సందర్శించుకొనును గాక. అట్టివాడు ఇక అధ్యయన శీలుడు కాడు. (శాస్త్రములతో పని ఉండదు). శబ్ద - మంత్ర ఉపాసనలు దాటిపోతాడు. అతనికిక ఇతరులకు చెప్పవలసినదిగాని, తాను వినవలసినదిగానీ ఏదీ ఉండదు. ఆత్మకు వేరైన అధ్యయన, ఉపాసన, వక్తవ్య - శ్రోతవ్యములు ఏమీ ఆశ్రయించడు. ప్రణవోపాసనలతో తప్ప తర్క శాస్త్రము శబ్దములను కూడా ధ్యానించడు. దీర్ఘమైన శాస్త్ర శబ్దజాలము కూడా "ఆత్మానుభవమునకు (అడ్డు)యే" అని గమనిస్తాడు. ఇతర జీవులతో బోధ, వాదము మొదలైనవి కలిగి ఉండడు. ఇతరుల అభిప్రాయములను విశ్లేషణ చేయడు. శూద్ర, పతిత, స్త్రీ సంభాషనలు నిర్వర్తించడు. ఆత్మను సిద్ధించుకున్న సన్యాస శ్రేష్ఠుడగు అట్టి యతి ఉత్సవములు, తీర్థ యాత్రలు నిర్వర్తించువాడుగా ఉండడు. |
| **6.** పునః యతి విశేషః। | **బ్రహ్మ భగవానుడు :** ఓ నారద మహర్షి ఇంకా కూడా యతుల గురించిన మరికొన్ని విశేషములు చెప్పుకుంటున్నాము. అందరూ వినండి. |
| కుటీచకస్య ఏతి ఏకత్ర భిక్షా। | **1) కుటీచకునకు :** ఒకే చోట భిక్ష. |
| బహూదకస్య అసంక్లుప్తం మధూకరం। | **2) బహూదకునకు :** మధుకర బిక్ష. ఇళ్ల (గృహ) నియమములు ఉండవు |
| హంసస్య అష్ట గృహేషు అష్ట కబళం। | **3) హంస :** ఎనిమిది ఇళ్లు. ఎనిమది కబళములు. |
| పరమ హంసస్య పంచ గృహేషు | **4) పరమహంస :** 5 ఇళ్ళలో భిక్ష, చేతులే పాత్ర. గోవు (ఆవువలె) లభించినది స్వీకరించటం. |
| కరపాత్రం ఫలాహార గోముఖం। | |
| తురీయాతీతస్య అవధూతస్య అజగరవృత్తిః సార్వవర్ణికేషు। | **5) తురీయాతీతుడు, 6) అవధూతకు :** అజగర వృత్తి. కొండచిలువ వలె ఉన్న చోటే ఉండి లభించినది భుజించటము. అన్ని వర్ణముల వారి వద్ద భిక్ష స్వీకరించువారై ఉంటారు. |
| యతిః న ఏకరాత్రిః వసేత్। న కస్యాపి నమేత్। | యతీశ్వరుడు ఒక్క చోటనే ఒక్క రాత్రిమించి గడపకూడదు. ఎక్కడ నిద్రవస్తే అక్కడ నిద్రించుదురు గాక. యతీశ్వరుడు ఎవ్వరికీ నమస్కరించడు. |
| తురీయాతీత, అవధూతయోః న జ్యేష్ఠో | తురీయాతీతులు, అవధూతలు ఇరువురిలో ఎవరు ఎవరికంటే కూడా జ్యేష్ఠులు కారు, కనిష్ఠులు కారు. (ఎవరు ఎవరికంటే కూడా ఎక్కువ వారు, తక్కువ వారు కాదు). ఎందుకంటే ఇద్దరు స్వస్వరూప జ్ఞాన సంపన్నులే. |
| యో న స్వరూపజ్ఞో। జ్యేష్ఠోఽపి కనిష్ఠో। | ఒకానొకడు నామ - రూప - గుణాత్మకంగా జ్యేష్ఠుడు అయినప్పటికీ స్వస్వరూప జ్ఞాని అయి ఉండకపోతే కనిష్ఠుడే. |

| | |
|---|---|
| హస్తాభ్యాం నది ఉత్తరణం న కుర్యాత్।<br>న వృక్షం ఆరోహేత్। న యాన అధిరూఢో।<br>న క్రయ-విక్రయ పరో। న కించిత్ వినిమయ పరో।<br>న దాంభికో। న అనృతవాదీ। | యతి అయినవాడు నదులలో ఈతలు కొట్టకూడదు. చెట్లు ఎక్కకూడదు. వాహనములు అధిరోహించరాదు. క్రయ - విక్రయములు (అమ్మటం - కొనటం - వ్యాపారం) నిర్వహించ కూడదు. వ్యాపారములు కించిత్ కూడా చేయరాదు. దాంభికములు (తన గురించి గొప్పలు) పలుకరాదు. అబద్ధాలు ఆడరాదు. |
| న యతేః కించిత్ కర్తవ్యం అస్తి।<br>అస్తిచేత్ సాంకర్యం। | యతికి ఎటువంటి కర్తవ్యములు (Worldly duties) ఉండవు. ఒకవేళ ప్రాపంచక కర్తవ్యములు కలిగి ఉంటే అవి సాంకర్యమునకు (ఇంద్రియ చాపల్యమునకు) అవకాశాలు ఉంటాయి. |
| తస్మాత్ మనన ఆదౌ సన్న్యాసినామ్ అధికారః। | సన్న్యాసి యొక్క ఏకైక కర్తవ్యము? సమస్తమునకు ఆది (the begining) అయినట్టి ఆత్మోపాసన యందే సమస్త అధికారము, (Function) ఏకైక కర్తవ్యము కూడా. |
| **7.** ఆతుర కుటీచకయోః భూలోక భువర్లోకౌ।<br>బహూదకస్య స్వర్గలోకో।<br>హంసస్య తపోలోకః।<br>పరమహంసస్య సత్యలోకః।<br>తురీయాతీత అవధూతయోః<br>స్వాత్మన్యేవ (స్వ ఆత్మని ఏవ) కైవల్యం స్వరూప<br>అనుసంధానేన భ్రమర కీటక న్యాయవత్। | **<u>సన్న్యాస లోకప్రాప్తులు</u>**<br>అతుర, కుటీచక సన్న్యాసులకు : భూలోకము, భువర్లోకము,<br>బహూదకునకు – స్వర్గలోకము,<br>హంస (సన్న్యాసి) కి – తపోలోకము,<br>పరమ హంసకు – సత్యలోకము,<br>తురీయాతీత, అవధూతలకు – స్వాత్మానంద రూపము, కైవల్య స్వరూపము, కేవలమగు స్వస్వరూపానుభవము<br>- ఇవన్నీ భ్రమర కీటక న్యాయము వలె సిద్ధించినవగుచున్నాయి. |
| యం యం వా అపి స్మరన్ భావం<br>త్యజతి అంతే కళేబరం,<br>తం తం ఏవ సమాప్నోతి। న అన్యథా।<br>శ్రుతిశాసనమ్॥ | ఒకడు ఏ ఏ భావము స్మరిస్తూ దేహమును త్యజించటం జరుగుతోందో అతడి అట్టి భావమునకు తగియున్నట్టి మరొక జన్మమును పొందుచున్నాడు. అంతకుమించి వేరైనదేదీ లేదు. ఇతి శ్రుతిశాసనము. ఆతని స్వస్వరూపమేమో? జన్మ - కర్మలచే అంటజాలని అమృతరూపము. |
| తత్ ఏవం జ్ఞాత్వా, స్వరూప అనుసంధానం।<br>వినా అన్యథా ఆచార పరో న భవేత్।<br>తదా ఆచారవశాత్ తత్ తత్<br>లోక ప్రాప్తిః, జ్ఞాన వైరాగ్య సంపన్నస్య<br>స్వస్మిన్నేవ ముక్తిః – ఇతి।<br><br>న సర్వత్ర ఆచార ప్రసక్తిః సదాచారః। | అందుచేత సర్వకాల సర్వ అవస్థలందు సర్వాత్మకమగు పరమాత్మతత్త్వమును ఎరుగుచూ, సదా అనుసంధానము (Connected) అవాలి. ఇక అన్యమైన ఈ దృశ్య వ్యవహార సంబంధ అనుబంధముల పట్ల ప్రయత్నశీలుడు, అనుసరణశీలుడు కాకుందురు గాక.<br>ఆ విధంగా "ఇదంతా పరమాత్మ యొక్క (బ్రహ్మముయొక్క) ప్రదర్శనా చమత్కారమే. ఆత్మనగు నా యొక్క లీలా వినోద కల్పనయే" అను తత్ తత్ ఆచారములను అనుసరించి తత్‌తత్ ఊర్ధ్వ స్థితిగతులను సంపాదించుకుంటూ, జ్ఞాన-వైరాగ్య సంపన్నుడు అవటమే ముక్తికి మార్గము. అంతకుమించి సదాచార సంపన్నత మరొకటేదీ ముక్తి మార్గము కాదు. |
| **8.** జాగ్రత్ స్వప్న సుషుప్తిషు<br>ఏక శరీరస్య। జాగ్రత్ కాలే విశ్వః।<br>స్వప్నకాలే తైజసః।<br>సుషుప్తికాలే ప్రాజ్ఞ అవస్థా భేదాత్।<br>అవస్థా ఈశ్వర భేదః। | ఈ జీవుడు స్వంతంగా ఆత్మస్వరూపుడే. అట్టి ఈ జీవునికి జాగ్రత్ స్వప్నసుషుప్తులు ఏక శరీరము (త్రివిధ పురుషకారములు (లేక) త్రి-అవస్థలు '3' అవస్థలు తనవైన వాడు ఒక్కడే). అట్టి ఈ ఆత్మ పురుషుడు జాగ్రత్‌లో విశ్వుడుగాను, స్వప్నములో తేజసుడు గాను, సుషుప్తిలో ప్రాజ్ఞుడుగాను, త్రి-అవస్థలు ఆస్వాదిస్తున్నాడు. ఈ మూడు కూడా ఈశ్వరుని వివిధ అవస్థలు. |

| | |
|---|---|
| **తాసు చతుర్దశ (14) కరణానాం బాహ్య వృత్తయో అంతః వృత్తయః తేషాం ఉపాదానకారణం। వృత్తయః చత్వారః (4) "మనః" "బుద్ధిః" "అహంకారః" "చిత్తం" చ ఇతి।** | **ఈశ్వరుడు :** జాగ్రత్ - స్వప్న - సుషుప్తులు తనవై, ఆ మూడింటి యందు తానే భావనా పూర్వకంగా ఉన్న ఈ జీవుని విస్తారిత స్వరూపమే "ఈశ్వరుడు". అట్టి ఈశ్వరుడు తన కల్పన అగు జాగ్రత్ - స్వప్న - సుషుప్తులలో 4 విధములైన బాహ్య అభ్యంతర వృత్తులు కూడి 14 కరణాలు కలిగి ఉంటున్నాడు.<br>**బాహ్యవృత్తులు (ఉపాదాన కారణములు) :**<br>**1) పంచ జ్ఞానేంద్రియములు**<br>**2) పంచ కర్మేంద్రియములు**<br>**నాలుగు అంతర వృత్తులు :** మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము.<br>బాహ్య వృత్తులకు, ఆయా అనుభవ పరంపరలకు, వాటిలో ఇష్ట-అయిష్టములకు అసలు కారణం (నిమిత్త కారణం) అంతర వృత్తులే. |
| **తత్ తత్ వృత్తి వ్యాపార భేదేన పృథక్ ఆచార భేదః।** | ఈవిధంగా ఈశ్వరునిచే స్వయం కృతంగా కల్పించబడిన ఆయా 14 బాహ్య-అభ్యంతర కరణములు వృత్తి భేదమును అనుసరించే జీవుల చేష్టలలో అనుభవ - అనుభజ్ఞులలో భేదములు కనిపిస్తున్నాయి. 'ఏకము' అయి ఉన్న చోట అనేకముగా అనుభవమౌతోంది. |
| **నేత్రస్థం జాగరితం విద్యాత్। కంఠే స్వప్నం సమావిశత్।** | అట్టి 14 బాహ్య అభ్యంతర వృత్తులలో అభిమానముచే విషయములను పొందుచూ ఇష్ట-అయిష్టముల కారణంగా సుఖ దుఃఖ ద్వంద్వములను తనవిగా అనుభవించువాడు జీవుడు. అట్టి ఈ జీవుడు |
| **సుషుప్తం హృదయస్థం తు। తురీయం మూర్ధ్ని సంస్థితమ్।** | జాగ్రత్ అవస్థలో - కళ్ళయందు,<br>స్వప్నావస్థలో - కంఠమునందు<br>సుషుప్తి అవస్థలో - హృదయమునందు<br>తురీయావస్థలో - మూర్ధము (శిరము) యందు సహస్రారమున విశేషమైన 'ఉనికి' కలిగినవాడై ఉంటున్నాడు. |
| **తురీయం అక్షరం ఇతి జ్ఞాత్వా, జాగరితే సుషుప్తి అవస్థ ఆపన్న ఇవ యద్యత్ శృతం, యద్యత్ దృష్టం, తత్ తత్ సర్వం అవిజ్ఞాతం ఇవ యో వసేత్,** | **తురీయుడు :** "జాగ్రత్-స్వప్న సుషుప్తులు నావి" అను ఎరుక స్వరూపముగా కలవాడు.<br>❖ జాగ్రత్ స్వప్న సుషుప్తులు మార్పు చెందు అవస్థలు<br>❖ తురీయుడు ఏ మార్పు చెందని అక్షరుడు<br>❖ సుషుప్త్యవస్థ నుండి జాగ్రత్‌లో ప్రవేశించిన ఈ జీవుడు జాగ్రత్‌లో ఏదేది వింటున్నాడో చూస్తున్నాడో అవన్నీ ఇది వరకు తెలియనివి, ఇప్పుడు తెలుస్తున్నవి అను రూపంగా పొందుచున్నాడు. |
| **తస్య స్వప్న అవస్థాయాం అపి తాదృక్ అవస్థా భవతి। స జీవన్ముక్త ఇతి వదంతి। సర్వ శ్రుతి అర్థ ప్రతిపాదనం ఇతి, తస్య ఏవ ముక్తిః ఇతి॥** | స్వప్నావస్థ సప్న సమయంలో జాగ్రత్ వంటిదేనని, జాగ్రత్ అవస్థ స్వప్న జగత్ వంటిదేనని, తత్త్వజ్ఞులచే ప్రతిపాదించబడుతోంది.<br>ఈ విధంగా ప్రతిపాదితమగు జాగ్రత్ - స్వప్న - సుషుప్తుల సొంతదారు, సాక్షీ స్వరూపుడు అగు తురీయ - స్వస్వరూపమును ఎవడు గ్రహిస్తాడో అట్టివాడే 'ముక్తుడు' అగుచున్నాడు. |

**9.** **భిక్షుః న ఐహిక – ఆముష్మిక అపేక్షః**
**యది అపేక్షా అస్తి, తత్ అనురూపో భవతి।**
**స్వరూప అనుసంధాన వ్యతిరిక్త అన్యశాస్త్ర అభ్యాసైః**
**ఉష్ట్ర కుంకుమ భారవత్ వ్యర్థో।**

ఐహిక - ఆముష్మిక (ఇహ-పర ; Here and here after) అనుభవముల పట్ల 'ఆపేక్ష' (Desire) కలవాడు ముక్తుడు కాలేడు.

ఒకవేళ ఇహ-పరములలో కనిపించే (లేక) అనిపించే దేనిపట్లైన ఆపేక్ష కొనసాగుతూ ఉంటే, అట్టివాడు ఈ దేహము తరువాత అట్టి ఆపేక్ష సంబంధమైన అనుభవముల వెంట పరుగులు పెట్టువాడే అగుచున్నాడు. "సమస్తము అఖండము, అమృత రూపము" అగు స్వస్వరూపమును ఏమారిపింపజేస్తూ అనుసంధానమునకు వ్యతిరేకంగా (అన్య) శాస్త్ర పఠణము, శాస్త్ర విశేష జ్ఞానము వంటి కుంకుమ బస్తా మోస్తూ కుంకుమ వాసన ఆస్వాదించని విధంగా - వ్యర్థము (Mere waste).

---

**న యోగశాస్త్ర ప్రవృత్తిః న సాంఖ్యశాస్త్ర అభ్యాసో।**
**న మంత్ర తంత్ర వ్యాపార**
**ఇతర శాస్త్ర ప్రవృత్తిః యతేః అస్తి చేత్,**
**శవ అలంకారవత్ చర్మకారవత్,**
**అతి విదూరః కర్మ ఆచార విద్యా దూరో।**

'యతి' అయినవాడు యోగ శాస్త్ర ప్రవృత్తి (Avocation) గాని, సాంఖ్య శాస్త్ర అభ్యాసము (Practice) గాని, మంత్ర - తంత్ర వ్యాపారము (Investment) గాని కలిగి ఉండడు. ఒకవేళ ఎవరైనా అట్టి అధ్యాసలు కలిగి ఉంటే అవి యతి దృష్టిలో శవమునకు చేసే అలంకారముల వలె వ్యర్థములు గానే అనిపిస్తాయి. చర్మకారుని వలె (చర్మము కుట్టువానికి జంతుమాంసముతో పని లేనట్లు) కర్మ - కర్మ ఫల వ్యవహారములకు అతి దూరంగా ఉంటాడు. కర్మ - ఆచార - లోక సంబంధములైన విద్యలకు దూరంగా (will be at a distance) ఉంటాడు.

---

**న ప్రణవ కీర్తన పరో।**

ప్రణవమును (ఓంకారమును) కూడా కీర్తించువాడుగా (పొగడువాడుగా) ఉండడు.

---

**యత్ యత్ కర్మ కరోతి,**
**తత్ తత్ ఫలం అనుభవతి।**

ఎవ్వడెవ్వడు ఏ ఏ కర్మలను కర్తృత్వము వహించి నిర్వర్తిస్తాడో, ఆయా కర్మఫలములనే అనుభవముగా పొందుతాడు.

**ఏరండ తైల ఫేనవత్ అతః**
**సర్వం పరిత్యజ్య తత్ ప్రసక్తం।**

అందుచేత సమస్త దృశ్య ప్రసక్తములు, సమాచారములు ఆముదపు నూనె నురుగువలె వదలివేయాలి.

**మనోదండం కరపాత్రం దిగంబరం**
**దృష్ట్వా పరివ్రజేత్ భిక్షుః॥**

'మనస్సును దండము వలె తయారు చేసుకొని, చేతులను భిక్షక పాత్రగా ధరించి ఆత్మదృష్టితో పరివ్రాజము (జగత్తులో సంచారము) యతి నిర్వర్తించును గాక।

---

**బాల ఉన్మత్త పిశాచవత్ మరణం**
**జీవితం వా న కాంక్షేత।**
**కాలమేవ ప్రతీక్షేత నిర్దేశ**
**భృతకన్యాయేన పరివ్రాట్ ఇతి।**

ఒక పసిబాలుడు, ఉన్మత్తుడు (పిచ్చివాడు) పిశాచము ఆవహించినవాడు వలె - జీవించటమును గాని, మరణించటము గాని కోరుకోడు. "నాకు ఈ రెండు ఒక్కటే" అని నిశ్చయించుకొని ఎరిగి ఉంటాడు.

ఒక రాజు గారు ఇచ్చే ఆజ్ఞలను యథాతథంగా పాటించే రాజభక్తి గల భృత్యునివలె (As a servant) 'కాలము'ను అంగీకరిస్తూ పరివ్రాట్ కాలమునకే అన్నీ వదలి ఉంటారు.

**తితిక్షా జ్ఞాన వైరాగ్య**
**శమ ఆది గుణ వర్జితః,**
**భిక్షా మాత్రేణ జీవి స్యాత్**
**స యతిః యతివృత్తి హా॥**

తితిక్ష (ఓర్చుకోవటము, ఓర్పు భరించగలగటము, కష్ట-సుఖములను భగవత్ ప్రసాదంగా భావించి అంగీకార బుద్ధి కలిగి ఉండటము), **ఆత్మ జ్ఞానముతో కూడిన వైరాగ్యము, శమము (అంతరింద్రియ నిగ్రహము), దమము (బాహ్య ఇంద్రియ నియమము)** మొదలైనవి యతి గుణములు. అవి వదలి, కేవలము జీవించటానికై భిక్షాటనము చేయుటచే అట్టి యతి యతివృత్తిని పోగొట్టుకొనువాడు అగుచున్నాడు.

| శ్లోకము | అర్థము |
|---|---|
| **10. న దండ ధారణేన, న ముండనేన<br>వేషేణ, న దంభాచారేణ ముక్తిః।<br>జ్ఞానదండో ధృతోయేన,<br>'ఏకదండీ' – స ఉచ్యతే।** | కేవలము కర్రతో నిర్మితమైన దండము, ముండనము (జుట్టు తొలగించటము), కాషాయ వేషము మొదలైన దంభాచారములు ఆశ్రయించినంత మాత్రం చేత ఎవ్వరికి ముక్తి లభించదు.<br>ఎవడైతే జ్ఞాన దండము, ధృతి (పట్టుదలతో కూడిన ఆత్మ భావన) పర్యములను కలిగి ఉంటాడో అట్టి వానిని **'ఏకదండీ'** అని పిలుస్తారు. |
| **కాష్ఠ దండో ధృతో యేన<br>సర్వ ఆశీ జ్ఞాన వర్జితః,<br>స యాతి నరకాన్ ఘోరాన్,<br>మహారౌరవ సంజ్ఞితాన్।<br>ప్రతిష్ఠా సూకరీ విష్ఠా<br>సమాగీతా మహర్షిభిః।** | ఏ సన్న్యాసాశ్రమవాసి అయితే కొయ్య దండమును మోచేతితో అరచేతితో ధరించి, (కానీ) ప్రాపంచికమైన ఆశ-ఆవేశములు వదలక, ఆత్మ జ్ఞానమును విడచి ఉంటాడో అట్టివాటు రౌరవము మొదలైన సంజ్ఞలతో చెప్పబడే ఘోరమైన నరకముల ప్రవేశమును ఆహ్వానించిన వాడు అగుచున్నాడు. "నాయనలారా! సన్న్యాస వేషము ధరించి సంసారము విడవకపోవటము, పంది పెంటతో సమానమైన ప్రతిష్ఠా" అని మహర్షులు గానం చేస్తున్నారు. ఎలుగెత్తి హెచ్చరిస్తున్నారు. |
| **తస్మాత్ ఏనాం పరిత్రజ్య<br>కీటవత్ పర్యటేత్ యతిః।** | కనుక ఈ ప్రపంచ సంబంధమైన సమస్త ఆశలను, ఆపేక్షలను, సన్న్యాస సంబంధమైన వస్త్రము దండము మొదలైనవాటినన్నిటినీ బాహ్యమునందే త్యజించి శీతాకోకచిలకవలె ఈ ప్రపంచమునందు యతి అయి సంచరించును గాక. |
| **అయాచితం యథాలాభం<br>భోజన ఆచ్ఛాదనం భవేత్,** | అయాచితంగా (అడుగకుండానే) ఏ ఏ భోజన, అచ్ఛానము (వస్త్రము)లు లభించితే వాటితోనే సంతోషముగా కాలము గడుపును గాక. |
| **పర ఇచ్ఛయా చ దిక్ వాసాః<br>స్నానం కుర్యాత్ పర ఇచ్ఛయా।** | ఇతరుల సానుకూల్యత, ఇష్టములను అనుసరించి వస్త్రములను మార్చటము, స్నానము చేయుటము మొదలైనవి నిర్వర్తించును గాక. |
| **స్వప్నే అపి యో హి యుక్తః<br>స్యాత్ జాగ్రతి ఇవ విశేషతః।<br>ఈదృక్ చేష్టః స్మృతః శ్రేష్ఠో<br>వరిష్ఠో బ్రహ్మవాదినామ్।** | ఏ బ్రహ్మనిష్ఠుడైతే జాగ్రత్‌లో బ్రహ్మము గురించిన పూర్తి ధ్యాస కలిగి ఉన్నట్లే స్వప్న సమయములో కూడా బ్రహ్మమునే మననముగా కలిగి ఉండటం జరుగుతూ ఉంటే, అట్టివాడు **"బ్రహ్మవాదులలో శ్రేష్ఠుడు"** అని చెప్పబడుచున్నాడు. |
| **అలాభే న విషాదీ స్యాత్।<br>లాభే చ ఏవ న హర్షయేత్।** | యతి అయినవాడు లాభించనప్పుడు విషాదము పొందడు. లాభము పొందినప్పుడు సంతోషము పొందడు. ఉభయ సందర్భములలోను సమత్వము కోల్పోడు. |
| **ప్రాణయాత్రిక మాత్రః స్యాత్,<br>మాత్రా సంగాత్ వినిర్గతః।** | ప్రాణము ధరించి ఉండటానికి (శబ్ద / స్పర్శ / రూప / రస / గంధములు అనబడే) పంచ తన్మాత్రములతో సంబంధము కలిగి ఉన్నవాడై, అంతకు మించి సంబంధము లేనివాడై ఉంటాడు. |
| **అభి పూజిత లాభాంశ్చ<br>జుగుప్స ఏత ఏవ సర్వశః।<br>అభిపూజిత లాభైస్తు,<br>యతిః ముక్తో అపి బధ్యతే।** | ఇతరులు తనను పూజిస్తూ, స్తుతిస్తూ (అభిమానము) ప్రదర్శిస్తూ ఉన్నప్పుడు గొప్పవాడుగా చెప్పుచున్నప్పుడు ఎటువంటి అయిష్టము, ప్రీతి కలిగి ఉండకుండను గాక. పూజించబడుటము లాభముగా భావించు యతి ముక్తుడై కూడా తిరిగి బద్ధుడు కాగలడు. |
| **11. ప్రాణయాత్రా నిమిత్తం చేత్<br>వ్యంగారే భుక్తవత్ జనే।<br>కాలే ప్రశస్త వర్ణానాం<br>భిక్షార్థాం పర్యటేత్ గృహాన్।** | ఆహారము పట్ల రుచులు, ఇష్టాయిష్టములు పెత్తనం చెలాయించరాదు. ప్రాణము నిలుపుటకై మాత్రమే భిక్షాటనం చేయాలి. సరి అయిన సమయమును అనుసరించి శుభగుణములు, సాత్త్విక భావములు గల ఇళ్ళ వద్ద మాత్రమే భిక్ష కొరకై ఆశ్రయించెదరు గాక. |

**పాణి పాత్రః చరన్ యోగీ**
**న అసకృత్ భైక్షం ఆచరేత్।**

పాణి పాత్ర భిక్ష (లేక) కరతల భిక్ష (చేతికి పట్టినంత ఆహారము భిక్ష) స్వీకరించాలి. ఒకే ఇంటికి అనేకసార్లుగా వెళ్లరాదు.

**తిష్ఠన్ భుంజ్యాత్, చరన్ భుంజ్యాత్,**
**మధ్యే న ఆచమనం తథా।**

నిలుచున్నప్పుడు గాని, నడుస్తున్నప్పుడు గాని భిక్ష లభిస్తే అప్పటికప్పుడే భుజించాలి. మధ్య మధ్యలో ఆచమనము చేయరాదు.

**అబ్ధి ఇవ ధృత మర్యాదా భవంతి విశదాశయాః।**

సముద్రము వలె విశాలమైన ఆశయముతో అందరి పట్ల మర్యాదతో కూడిన ప్రవర్తన కలిగి ఉండు గాక.

**నియతిం న విముంచంతి**
**మహాంతః భాస్కరా ఇవ।**

ఆకాశములో సూర్యునివలె నియతి (సాంఘిక నియములు, విధులు) దాటకుండా యతి ఉండవలెను.

---

**ఆసి ఏనతు యదా ఆహారం**
**గోవన్ మృగయతే మునిః,**
**తదా సమః స్యాత్ సర్వేషు**
**సో అమృతత్వాయ కల్పతే।**

గోవు ముఖముతో ఆహారము ఎక్కడ దొరికితే అక్కడే తిని తృప్తి పడుచూ ఉండునట్లు ఆనందముగా, సర్వత్రా సమభావనతో ఈ భూమిపై చరించును గాక. అట్టివాడు క్రమంగా మృత్యు పరిధులను దాటిపోయి, తన అమృత స్వరూపమును ఆస్వాదించగలడు.

**అనింద్యం వై వ్రజన్ గేహం**
**నింద్యం గేహంతు వర్జయేత్।**

యతి అనింద్యము అయిన (సాత్త్విక భావములు, భక్తి, శాస్త్ర మర్యాదగల) ఇళ్లను భిక్షకై అడగాలి. గృహ యజమానులు ఎవరైనా ప్రార్థన చేస్తే ప్రార్థనను తిరస్కరించక వెళ్లెదరు గాక. నింద్యమైన (దుష్టగుణములు, ఆశయములుగల) ఇళ్ల వద్ద భిక్షకై వెళ్లరాదు.

---

**అనావృతే విశేత్ ద్వారి**
**గేహేన ఏవ ఆవృతే వ్రజేత్।**

ద్వారము (తలుపులు) తెరిచి ఉన్న ఇళ్ల వద్దనే భిక్ష కోరాలి. తలుపులు మూసికొని యున్న ఇళ్ల వద్ద భిక్షకై అడగరాదు.

**పాంసునా చ ప్రతిచ్ఛన్నః శూన్యాగార ప్రతిశ్రయః,**
**వృక్షమూల నికేతో వా త్యక్త సర్వ ప్రియ అప్రియః।**

చెరువు ఒడ్డులందు, శిథిల గృహములను, వృక్షముల మొదలు స్థానములను 'ఇల్లు'గా భావించి విశ్రమించాలి. 'ఇది ఇష్టము - అది కాదు' మొదలైన ఇష్టాయిష్ట, ప్రియాప్రియ భావ అభిప్రాయములు జయించి ఉండాలి.

---

**యత్ర అస్తమిత శాయీ స్యాత్**
**నిరగ్నిః అనికేతనః।**

యతి అయిన వారు తాను సూర్యుడు అస్తమించినప్పుడు ఏ ప్రదేశములో ఉంటే అక్కడే ఆ రాత్రి ఉంటూ ఉండును గాక. సన్యాసులకు అగ్నికార్యము, ఒకచోటనే స్థిరనివాసము ఉచితం కాదు.

**యథా లబ్ధ ఉపజీవీ స్యాత్**
**మునిః దాంతో జితేంద్రియః।**

దాంతుడై (ఇంద్రియ నిగ్రహము, ఓర్పు, ధైర్యము, సహనము కలవాడై), ఇంద్రియములను (విషయములను) జయించినవాడై, ప్రాపంచక సంగతి సందర్భములపట్ల మౌనము వహించిన ముని అయి, లభించిన దానితోనే తృప్తి చెందుచూ జీవించును గాక.

---

**12.** **నిష్క్రమ్య వనం ఆస్థాయ**
**జ్ఞానయజ్ఞో జితేంద్రియః**

**కాలకాంక్షీ చరన్ ఏవ**
**బ్రహ్మభూయాయ కల్పతే॥**

సన్యాసి (లేక) యతి వనము చేరి ఏకాంతంగా ఆత్మ జ్ఞానయజ్ఞము అనుక్షణికంగా నిర్వర్తిస్తూ, ఇంద్రియములను జయించుచూ కాలానుగతంగా నిర్వర్తించవలసినది నిర్వర్తిస్తూ ఉండగా క్రమంగా పరబ్రహ్మమును సిద్ధించుకోగలడు.

**అభయం సర్వ భూతేభ్యో**
**దత్వా చరతి యో మునిః,**

**న తస్య సర్వ భూతేభ్యో**
**భయం ఉత్పద్యతే క్వచిత్।**

"ఈ సమస్తము మమ ఆత్మ స్వరూపమే" అను స్వస్వరూపాత్మ తత్త్వము స్వాభావిక రూపంగా సిద్ధించుకొని సమస్త అనేకత్వములపట్ల మౌనము సంపాదించుకొన్న యతికి ఇక ఎవ్వరివలన ఎట్టి భయము జనించదు. (స్వప్న ద్రష్ట - స్వప్నము వలె) - సమస్తము ఆత్మగా తానే అయి ఉండగా ఇక భయము ఎందుకు శేషిస్తుంది ? అతడు అభయుడు అగుచున్నాడు.

**నిర్–మానః చ అనహంకారో**
**నిర్ద్వంద్వః ఛిన్న సంశయః।**
**నైవ కృధ్యతి, న ద్వేష్టి,**
**న అనృతం భాషతే గిరా।**

మాన - అవమానములను రహితం చేసుకొని ద్వంద్వ దృష్టిని జయించి, ఆత్మతత్త్వము గురించిన అధ్యయనముచే స్వస్వరూపమగు అఖండాత్మ గురించి సంశయములన్నీ తొలగించుకొన్నవాడు - ఇక ఆపై ఎవ్వరిపైనా కోపము కలిగి ఉండడు. ఏ ఒక్కరి పట్ల ద్వేషము కలిగి ఉండడు. **మొదలే అసత్యము, కల్పితమాత్రము అయినట్టి దాని గురించి అసలు మాటలకే ఉపక్రమించడు (మాట్లాడనే మాట్లాడడు).**

**పుణ్య ఆయతనచారీ చ భూతానాం అవిహింసకః।**
**కాలే ప్రాప్తే భవేత్ భైక్షం కల్ప్యతే బ్రహ్మభూయసే।**

జీవులందరి పట్ల స్వాభావికమైన ఆప్యాయత కలిగి ఉంటాడు. పుణ్యకార్యములందు అభిరుచిపరుడై ఉంటాడు. ఎవ్వరికీ ఎట్టి బాధ కలిగించకూడని 'ఆశయము' కలిగి ఉంటాడు. కాల చమత్కారమును యథాతథంగా అంగీకరిస్తూ ఉంటాడు. భిక్షవృత్తిచే లభించినది తృప్తిగా తింటూ సంతోషముగా కాలము గడుపువాడు బ్రహ్మము పొందగలడు.

---

**వానప్రస్థ–గృహస్థాభ్యాం న సంసృజేత్ కర్హిచిత్**

వానప్రస్థ గృహస్థులతో కలిసి తిరగరాదు.

**అజ్ఞాతచర్యాం లిప్సేత, న చ ఏనం హర్ష ఆవిశేత్।**

ఏవో రహస్యమైన పనులు చేస్తూ ఉండటం వాటి పట్ల లిప్స (ఇచ్ఛ) కలిగి ఉండటం మంచిది కాదు. ఇతరులకు భయమో, ఆశ్చర్యమో కలిగించే పెద్దగా నవ్వులు ఉచితంకాదు.

**అధ్వా సూర్యేణ నిర్దిష్టః కీటవత్ విచరేత్ మహీమ్।**

సూర్యుడు ఆకాశంలో ప్రకాశిస్తూ ఉన్నప్పుడే (పగలు కాలంలో మాత్రమే) ఒక కీటకమువలె దేనితోను ఏ బంధము లేకుండా సంచరిస్తూ ఉండును గాక.

---

**ఆశీః యుక్తాని కర్మాణి**
**హింస అయుక్తాని యాని చ।**

**లోక సంగ్రహయుక్తాని**
**నైవ (న ఏవ) కుర్యాత్, న కారయేత్।**

యతి అయిన వాడు (సన్యాసి) ప్రాపంచక ఆశలు సిద్ధించే కర్మవ్యవహారములందు గాని, సహజీవులను (జంతువులను గాని, మనుష్యులను కాని) హింసించే కార్యముల యందు గాని, లోకంలో ఏవేవో లౌకిక ప్రయోజనముల దృష్టితో -

- ఏ కర్మలు చేయరాదు.
- అట్టి ఏ కర్మలకు (సలహాల ద్వారా) కారణం కారాదు.

---

**13.** **న అసత్ శాస్త్రేషు సజ్జేత**
**న ఉపజీవేత జీవికామ్।**

ధర్మమునకు విరుద్ధంగాను ప్రాపంచిక విషయాలను ప్రోత్సహించేవి అగు శాస్త్రములలో రక్తి కలిగి ఉండకూడదు. జీవనోపాధి కొరకై ఆదాయము కొరకై వ్యవహారములు సలుపరాదు.

**అతివాదాన్ త్యజేత్ తర్కాన్**
**పక్షం కంచన న ఆశ్రయేత్।।**

వాదోపవాదముల గురించిన తర్క - వితర్కము, ఒక పక్షమున ఉండి, మరొక పక్షమును విధానమును తప్పుగా నిరూపించ యత్నించటము ఇటువంటివి కూడదు.

**న శిష్యాన్ అనుబధ్నీత,**
**గ్రంథాన్ న ఏవ అభ్యసేత్ బహూన్।**

**న వ్యాఖ్యాం ఉపయుంజీత**
**న ఆరంభా న ఆరభేత్ క్వచిత్।**

శిష్యగణమును పెద్ద పెద్దగా సమీకరించి జేర్చుకోకూడదు. అనేక గ్రంథాలు పెద్ద సంఖ్యలో అభ్యసించటము కూడా కూడదు. దాని వలన బుద్ధి వ్యాపకమును కొనసాగిస్తూనే ఉంటుంది. వ్యాఖ్యానమునందే మునిగి తేలుతూ ఉండరాదు. అధిక కార్యకలాపములు, అనేక విషయములలో వ్యవహారశీలమును యతి ధర్మమునకు శ్రేయము కాదు.

---

**అవ్యక్త లింగో। అవ్యక్త అర్థో – మునిః।**

**మునీశ్వరుల లక్షణములు :**

- తన యొక్క గణ విశేషములను ఇతరుల గుర్తింపుకై ప్రదర్శించక రహస్యముగా అవ్యక్తంగా ఉంటూ ఉంటారు.

- ఉత్తమార్థములగు శాస్త్ర విశేషములను రహస్యముగా అవ్యక్తముగా తనయందు కలిగి ఉంటూ, వ్యతిరేకార్థములు గలవారితో వాదించని వారై ఉండరు.

**ఉన్మత్త బాలవత్ కవిః మూకవత్,**

- కవి అయి (సమస్తము ఎరిగి కూడా) పిచ్చివానివలె, అమాయక బాలునివలె, మూగవానివలె ఈ దృశ్య జగత్తులో సంచరించువారు.

**ఆత్మానం తత్ దృష్ట్వా దర్శయేత్**

- ఆత్మగా సమస్తము దర్శిస్తూ, ఇతరులకు ఆత్మ దృష్టి గుర్తు చేస్తూ ఉంటారు.

**నృణామ్ న కుర్యాత్, న వదేత్ కించిత్,**
**న ధ్యాయేత్ సాధు అసాధు వా,**
**ఆత్మారామో అనయావృత్త్యా**
**విచరేత్ జడవత్ మునిః।**

ప్రాపంచక వ్యవహారములను నిర్వర్తించక వాటి గురించి మాట్లాడక, ధ్యాస కలిగి ఉండక, సాధు - అసాధు భేదము లేనివారై ఉంటారు. సర్వ విషయముల పట్ల వృత్తులను జయించి, వృత్తులన్నీ ఆత్మారామునిపై నిలిపి, జగత్తులో మాత్రం జడుని వలె సంచరించువారై ఉంటారు.

**ఏకః చరేత్ మహీం ఏతాం,**
**నిస్సంగః సంయతేంద్రియః,**
**ఆత్మరతిః ఆత్మక్రీడః**
**ఆత్మవాన్ సమదర్శనః॥**

తనయందు తానే వివశాత్మకుడై ప్రకాశిస్తూ, ఒంటరిగా, దేనితోను ఏ మాత్రమే సంగము లేనివారై, ఇంద్రియములను జయించి తను ఉపకరణములుగా చేసికొని ఆ మునివర్యులు భూమిపై విహరిస్తూ ఉంటారు. ఆత్మయందు ఆత్మ అయి క్రీడిస్తూ, ఆత్మవంతుడు, సర్వత్రా సమదర్శి అయి వినోదిస్తూ ఉంటారు.

---

**14. బుధో బాలకవత్ క్రీడః**
**కుశలో జడవత్ చరేత్॥**

ఉత్తమోత్తమమగు ఆత్మ బుద్ధి సిద్ధించుకొని కూడా ఆటలు ఆడుకొనే బాలునివలెను, సమస్తము ఎరిగి కుశలుడు (Expert) అయి ఉండి కూడా జడునివలెను చరిస్తూ ఉంటారు.

**వదేత్ ఉన్మత్తవత్ విద్వాన్।**
**గోచర్యాం నైగమః చరేత్।**

విద్వాంసుడు బ్రహ్మజ్ఞాని అయి ఉండి కూడా ఏమీ తెలియని ఉన్మత్తునివలె కనబడుతారు. వేదాంతవేత్త అయి ఉండికూడా గోవు వలె లభించిన భిక్షని లభించిన చోటనే స్వీకరించువారై ఉంటారు.

**క్షిప్తో అవమానితో అసద్భిః**
**ప్రబుద్ధో అసూయితోపి వా,**
**తాడితః సన్నిరుద్ధోవా**
**వృత్త్యావా పరితాపితః।**

త్రోయబడినప్పటికీ (క్షిప్తో), అవమానించబడినప్పటికీ, అసభ్య ప్రవర్తన ప్రాప్తించినప్పటికీ, ఈర్ష్య-అసూయలు పొందవలసి వచ్చినప్పటికీ, కొట్టబడినప్పటికీ, వారి వృత్తి అడ్డగించబడినప్పటికీ, పరితాపములు పొందినప్పటికీ - అవన్నీ యతి (సన్యాసి) క్షమాగుణము కలిగి ఉంటారు. సహనము (తితిక్ష) ఏ మాత్రము కోల్పోరు.

---

**విష్ఠితో మూత్రితో వా**
**అజ్ఞైః బహుధా ఏవం ప్రకంపితః,**
**శ్రేయః కామః కృచ్ఛ్రగత**
**ఆత్మనా ఆత్మానం ఉద్ధరేత్।**

ఉమ్మి వేయబడినప్పటికీ, మూత్రము చల్లబడినప్పటికీ, ఆత్మతత్త్వమునకు ప్రయత్నశీలురుగాని ఆయా అజ్ఞానులు అనేకములైన ప్రకంపనములు (Shakings) కలిగించినప్పటికీ కూడా శ్రేయస్సును కోరు యోగి అవన్నీ సహిస్తూ తితిక్ష - అనే యోగానికి అభ్యాసముగా భావిస్తారు. ఈ జరిగేదంతా నా మేలు కొరకే, యోగాభ్యాసము కొరకే అని తలచి, తనను తాను ఉద్ధరించుకొను ప్రయత్నమునందు మాత్రమే బుద్ధిని నిలపుకొని ఉంటారు.

---

**సమ్మాననం పరాంహానిం యోగర్ధేః**
**కురుతే యతః, జనేన అవమతో యోగీ,**
**యోగసిద్ధిం చ విందతి।**

"ఇతరులచే సన్మానములు, దానములు, గౌరవములు, స్తుతులు - ఇవన్నీ నా యొక్క పదమునకు హానికరము అవగలవు" అని భావించి, అట్టి వాటిని ఇవ్వజూపు జనులకు దూరంగా ఉంచు ప్రయత్నముగల యోగి యోగసిద్ధిచే ఆత్మానందుడై వెలయగలడు.

**తథా చరేత వై,**
**యోగీ సతాం వర్త్మన దూషయన్**
**జనా యథా అవమన్యేః**
**అంగచ్ఛేయుః నైవ సంగతిమ్।**

జనులు దూషించవచ్చుగాక. వారు ఈ అంగములనే (అవయవములను) ఖండించవచ్చుగాక. అవమానించవచ్చుగాక, యోగి వాటిని అసంగతులుగాను (అవిషయముగాను) ఆత్మ ఒక్కటే సంగతిగాను కలిగి ఉండగలరు.

**జరాయుజ, అండజ-ఆదీనాం**
**వాఙ్మనః కాయ కర్మభిః,**
**యుక్తం కుర్వీత న ద్రోహం।**
**సర్వ సంగాన్ చ వర్జయేత్।**

మానవులు, జంతువులు తదితరములు మొ॥వాటికి వాక్కుచేతగాని, శరీరము చేత గాని, కర్మకృతంగా గాని ఎట్టి ద్రోహము తలబెట్టరు. సమస్త సంగములు (All attachments / relations) వదలివేసి ఉంటారు.

**కామ క్రోధౌ తథా దర్ప లోభ మోహా ఆదయః చ యే,**
**తాంస్తు దోషాన్ పరిత్యజ్య పరివ్రాట్ భయవర్జితః॥**

కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనే అరిషట్ (ఆరు శత్రు) వర్గమును (Group) దోషములుగా గమనించి వాటిని పరిత్యజించి పరివ్రాట్ అయి సమస్త భయములు జయించివేయాలి.

---

**15. భైక్ష్య అశనం చ, మౌనత్వం,**
**తపో, ధ్యానం విశేషతః**
**సమ్యక్ జ్ఞానం చ వైరాగ్యం**
**ధర్మోయం భిక్షుకే మతః॥**

భిక్షక సన్యాసికి లోక సంబంధమైన మత, కుల జాతి భేదములేవీ ఉండవు.

1) భిక్షాన్నమును భుజించటము 2) మౌనము వహించి ఉండటము 3) "పరతత్త్వము కొరకై తపన" రూపమగు తపస్సు 4) "పరమాత్మ పట్ల ధ్యాస" అను రూపముగల ధ్యానము 5) "సర్వత్రా సమ దర్శనము" అనే సమ్యక్ జ్ఞానము 6) ప్రాపంచకమైన సమస్త విశేషముల పట్ల విరాగము.

**ఈ ఈ అభ్యాసములే, భిక్షక ధర్మ మతము, భిక్షక స్వాభావికములు.**

**కాషాయవాసాః సతతం**
**ధ్యానయోగ పరాయణః**
**గ్రామ అంతే వృక్షమూలే వా**
**వసేత్ దేవాలయే అపి వా।**

**భైక్షేణ వర్తయేత్ నిత్యం**

వైరాగ్యమునకు 'సంజ్ఞ'గా ఎల్లప్పుడు కాషాయ వస్త్రధారణము, ధ్యాన యోగ పరాయణుడై ఉండటము (Constant Avocation on the All Pervading one's own Self) గ్రామమునకు చివర వృక్షముల మొదట్లో నివాసము (లేక) దేవాలయ ప్రాంగణంలో నివాసము, భిక్షాటన జీవనము - ఇవియే యతి వర్తనములు. యతి ఎక్కడున్నా కూడా ఆ పరిసరములను మహద్భాగ్యంగా భావిస్తాడు.

**నైకాన్నాశీ (న ఏక అన్నాశీ) భవేత్ క్వచిత్**

ఏ పరిస్థితులలో కూడా ఒకే ఇంట్లో (ఆహారము, అన్నము) స్వీకరించువాడై ఉండకూడదు.

---

**చిత్తశుద్ధిః భవేత్ యావత్**
**తావత్ నిత్యం చరేత్ సుధీః।**
**తతః ప్రవ్రజ్య శుద్ధ ఆత్మా,**
**సంచరేత్ యత్ర కుత్ర చిత్।**

ఎప్పటివరకు జగత్‌దృష్టి, జగదాకర్షణ భావములు పూర్తిగా రూపుదిద్దుకుంటుందో, అప్పటి వరకు సంచారమును బుద్ధిమంతుడైన యోగి కొనసాగిస్తూనే ఉంటాడు. చిత్తశుద్ధి సిద్ధించుకొన్న తరువాత ఇక ఆ పరివ్రాజకుడు ఎక్కడైనా తనకు ఇష్టమైన రీతిగా ఉండనూ వచ్చు. సంచరించనూ వచ్చు.

**బహిః - అంతః చ సర్వత్ర సంపశ్యన్**
**హి జనార్దనమ్, సర్వత్ర విచరేత్ మౌనీ**
**వాయువత్ వీత కల్మషః॥**

ఏ విధంగా వాయువు తనయందు ఎట్టి వాసనలు లేకుండా నిర్మలంగా భూమిపై సంచారము కలిగి ఉంటుందో, ఆ విధంగా ఆ మునీశ్వరుడు జనార్దనుని (సమస్తము తన స్వరూపమే అయి ఉన్న పరమాత్మను) బాహ్య - అభ్యంతరములలో దోషరహితునిగా సందర్శించును గాక. నిర్మల బుద్ధితో ఆత్మ యొక్క సర్వేశ్వరత్వమును ఉపాసించును గాక.

---

## నిత్యముక్తుడు

**సమ దుఃఖ - సుఖః క్షాంతః**
**హస్త ప్రాప్తం చ భక్షయన్,**

- ❋ సుఖ - దుఃఖ సంగతి సందర్భములలో సమత్వము వీడడు.
- ❋ అరచేతికి పట్టినంత మాత్రమే భిక్ష స్వీకరించుచుండువాడు.

**నిర్వైరేణ సమం పశ్యన్**
**ద్విజ గో అశ్వ మృగ ఆదిషు।**

- ❋ ద్విజుల (వేదవిద్యా పరుల పట్ల) ఆవు - గుఱ్ఱము మొదలైన సమస్త జీవరాసుల పట్ల సమస్త వైర భావములు వీడి సమస్వరూపమగు ఆత్మగానే దర్శించువాడు.

**భావయన్ మనసా విష్ణుం పరమాత్మానం ఈశ్వరమ్।**

❈ మనస్సుతో "సర్వాంతర్యామి, పరమాత్మ, ఈశ్వరుడు అగు విష్ణు భగవానుడే ఇదంతా అయి ఉన్నారు" - అను భావనను ఆశ్రయించి ఉండువాడు.

**చిత్ మయం పరమానందం "బ్రహ్మ ఏవ అహం" ఇతి స్మరన్॥**

❈ ఏ చిన్మయ - పరమానంద పరబ్రహ్మమే ఇదంతా అయి ఉన్నదో, అట్టి పరతత్త్వమే నేను. నేను బ్రహ్మమే అయి ఉన్నాను అను అనుస్మరణము ఆశ్రయించి ఉండువాడు.

❈ ఆత్మతత్త్వమును బుద్ధితో ఎరుగుచున్నవాడై,

**జ్ఞాత్వా ఏవం, మనోదండం ధృత్వా,**

❈ మనస్సును దండముగా (దుడ్డు కర్ర నిర్మితమై సన్యాసుల చేత ఉపకరణముగా) ధరించి,

**ఆశా నివృత్తో భూత్వా, ఆశాంబర ధరో భూత్వా,**

❈ సమస్త ఆశలను హృదయము నుండి తొలగించి వేసుకొని, నివృత్తుడై దిక్కులనే (ఆశనే) వస్త్రముగా ధరించినవాడై

**సర్వదా మనో వాక్ కాయ కర్మభిః, సర్వసగ్ంసారం ఉత్ సృజ్య,**

❈ మనో - వాక్ - కాయ కర్మల పూర్వకంగా సంసార సమస్తమును వదలివేసి ప్రపంచము నుండి ఉపసంహారము (withdrawal) పొందినవాడై.

**ప్రపంచ అవాఙ్ముఖః (అవాఙ్ ముఖః)**

❈ తన యొక్క 'అఖండ - అమృత - ఆనంద" ఆత్మ స్వరూపముతో సర్వాత్మకంగా అనుసంధానము పొందినవాడై ఉంటున్నాడు.

**స్వరూప అనుసంధానేన భ్రమర కీటక న్యాయేన ముక్తః భవతి।**

❈ 'భ్రమర - కీటక న్యాయం'గా తానే సర్వాత్మకుడై, యతి ముక్తిని పొందుచున్నాడు.

**ఇత్యుపనిషత్ – నారద పరివ్రాజకోపనిషత్ – "పంచమ ఉపదేశః"**

---

# షష్ఠోపదేశః (6వ ఉపదేశము)

1. **అథ నారదః పితామహం ఉవాచ భగవన్! తత్ అభ్యాసవశాత్ భ్రమర కీట న్యాయవత్ తత్ అభ్యాసః కథం ఇతి?**

**అప్పుడు నారద మహర్షి బ్రహ్మ దేవుల వారితో ఇట్లు పలికారు.**

**నారదమహర్షి :** హే భవగాన్, మీరు చెప్పిన మార్గంలో "భ్రమర - కీటక న్యాయము"గా యతి యోగాభ్యాసి అయి ఆత్మ స్వరూపము స్వానుభవమై సంతరించుకోవటానికై అభ్యాసముల గురించి ఇంకా కూడా వివరించి చెప్పండి.

**తం ఆహ, పితామహః – సత్యవాక్ జ్ఞాన వైరాగ్యాభ్యాం విశిష్ట దేహ అవశిష్టో వసేత్।**

**పితామహుడు (బ్రహ్మ భగవానుడు) :** నాయనా ! నారదా ! ప్రియ శ్రోతలారా ! మరికొంతగా మరికొన్ని విశేషాలు చెప్పుకుంటున్నాము. వినండి.

- సత్య వాక్కును పరిపాలించువాడై,
- జ్ఞాన - వైరాగ్యములతో కూడిన సూక్ష్మ దేహి అయి, ఆత్మగా శేషించువాడై ఉండును గాక.

---

**జ్ఞానం శరీరం వైరాగ్యం జీవనం విద్ధి। శాంతి దాంతీ నేత్రే।**

జ్ఞానమే శరీరము, సమస్త రాగములను జయించిన వైరాగ్యమే జీవన విధానము.

**మనః ముఖం। బుద్ధిః కళ।**

శాంతము, (ఇంద్రియ నిగ్రహ రూపమగు) దాంతమే రెండు కళ్లు అగును గాక. మనస్సే ముఖము, బుద్ధియే (ప్రజ్ఞయే) కళ.

**పంచవింశతి తత్త్వాని అవయానాని। అవస్థా పంచమహాభూతాని,**

25 తత్త్వములు (పంచ కర్మేంద్రియ, పంచ జ్ఞానేంద్రియ, పంచప్రాణ, పంచ ఉపప్రాణ, పంచ తన్మాత్రలు - శబ్ద స్పర్శ రూప రస గంధములు) - ఆతనికి అవయవములు. పంచమహాభూతములు యతికి అవస్థలు.

**కర్మ భక్తి జ్ఞాన వైరాగ్యాని శాఖా।**
**జాగ్రత్ స్వప్న సుషుప్తి తురీయ అవస్థాః**
**చతుః దశ (14) కరణాని।**

కర్మ-భక్తి-జ్ఞాన-వైరాగ్యములు యతికి శిరస్సు (శిరో ఉపరిభాగము).

జాగ్రత్ స్వప్న సుషుప్తి తురీయములు, 14 కరణములు - జ్ఞానేంద్రియములు (5), కర్మేంద్రియములు (5), అంతరంగ చతుష్టయములు (4) (మనో-బుద్ధి-చిత్త-అహంకారములు) - అతనిని ఆశ్రయించిన స్వకీయ తత్త్వములు.

**పంక స్తంభా కారాణి ఇతి**
**ఏవమపి, నావమపి పంకం 'కర్ణధార' ఇవ,**
**'యంత' ఇవ గజం, స్వబుద్ధ్యా స్వవశీ కృత్యాత్।**

బురదలో ఇరుక్కొన్న నావ వలె ఈ జీవుని బుద్ధి పైన చెప్పిన 14 కరణ వ్యవహారములలో చిక్కుకొని ఉంటుంది. బురదలో ఇరుక్కొన్న నావను కర్ణధారుడు (నావికుడు నావను నడిపేవాడు) ఎంతో తెలివి, ఉపాయము, సామర్థ్యము, ప్రయత్నములతో బురద నుండి ఈవలకు తెస్తాడు కదా!

మావటి వాడు (యంత) ఎంతో నైపుణ్యముతో ఏనుగును వశం చేసుకొని ఉంటాడు కదా!

---

**మద్వ్యతిరిక్తం, సర్వం కృతకం నశ్వరం – ఇతి**
**మత్వా విరక్తః పురుషః సర్వదా**
**బ్రహ్మ అహం ఇతి వ్యాహరేత్।**

ఆ విధంగా ముముక్షువు ఇంద్రియములను, మనో బుద్ధి చిత్త, అహంకారములను స్వవశం చేసుకోవాలి. వాటికి, అవి వ్రాలుచున్న విషయములకు తాను వశుడు కాగూడదు.

**"అస్మత్ స్వస్వరూపమునకు వేరై కనిపించేదంతా కూడా నశించిపోయేదే"** - అని ఎరిగిన వాడై ఉండాలి. సమస్త దృశ్య వ్యవహారముల పట్ల, అనురక్తిని జయించి, విరక్తి కలవాడై ఉండాలి. "నేను సర్వదా బ్రహ్మమునే, బ్రహ్మాఽహమ్, సోఽహమ్" అను పరమ సత్యమును ఆశ్రయించినవాడై ఉండాలి. తదితరమైనదేదీ కించిత్ కూడా ఎరుక యందు కలిగి ఉండక కేవలమగు ఎరుక (The Absolute Knowing) ను ఆశ్రయించి, జీవన్ముక్తుడై ఈ జగత్తునందు వసించును గాక. అట్టివాడు పొందవలసినది పొందినవాడు అగుచున్నాడు.

**న అన్యత్ కించిత్ వేదితవ్యం**
**స వ్యతిరేకేణ, జీవన్ముక్తో వసేత్।**

**కృతకృత్యో భవతి।**
**న "నాహం బ్రహ్మేతి" – వ్యవహరేత్।**
**కింతు "బ్రహ్మాహమస్మి" ఇతి**
**అజస్రం జాగ్రత్, స్వప్న, సుషుప్తిషు**
**తుర్యావస్థాం ప్రాప్య తుర్యాతీతత్వం వ్రజేత్।**

**"బ్రహ్మమును నేను ఇప్పటికి కాదు. ఎప్పటికో సిద్ధించుకోవలసి ఉన్నది"** అను రూపముగా భావించరాదు. ఆ విధంగా వ్యవహరించరాదు.

**జాగ్రత్ స్వప్న సుషుప్తులయందు తురీయ స్వరూప పురుషుడను నేనే, తురీయ పురుషునికి (జాగ్రత్ స్వప్న సుషుప్తులు నా కల్పన అయిన నేనుకు) ఆవలివాడను. తురీయాతీతుడను అను అభ్యాసముచే** తురీయాతీతుడు అగును గాక. అభ్యాసముచే ఇదంతా సుసాధ్యమే.

---

**2.** **దివాం జాగ్రత్। నక్తం స్వప్నం।**
**సుషుప్తం అర్ధరాత్రం గతం – ఇతి।**

**ఏక అవస్థాయాం చతస్రో అవస్థాసు ఏకైక**
**కరణ ఆధీనానాం చతుర్దశ (14) కరణానాం వ్యాపారాః।**

పగలంతా జాగ్రత్‌లో గడిచిపోతోంది. రాత్రి ఈ జీవుడు స్వప్నములో ప్రవేశిస్తున్నాడు. అర్ధరాత్రి సుషుప్తి (గాఢనిద్ర) అనే మూడవ అవస్థ పొందుచున్నాడు. నాల్గవది జాగ్రత్ - స్వప్న - సుషుప్తులు అయినట్టి **తురీయడు.** 4 అవస్థలలోని ప్రతి ఒక్క అవస్థలో మిగిలిన మూడు అవస్థలు ఉండియే ఉన్నాయి.

14 కరణములలో ఒక్కొక్క కరణమునకు ఒకొక్క ఇంద్రియ వ్యాపారము కలదు.

| | |
|---|---|
| **చక్షురాదీనాం చక్షుషో రూపగ్రహణం।** | 1. కళ్లకు చూపు. ఆ చూపుతో రూపములు చూడబడుచున్నాయి. |
| **శ్రోత్రయోః శబ్ద గ్రహణం।** | 2. చెవులు వినికిడిచే శబ్దములు వినటానికి ఉపకరణములు. |
| **జిహ్వాయా రసాస్వాదనం।** | 3. నాలుక రుచి చూడటము నిర్వర్తిస్తోంది. |
| **ఘ్రాణస్య గంధ గ్రహణం।** | 4. ముక్కుచే వాసన గ్రహించబడుతోంది. |
| **వచసో వాక్ వ్యాపారః।** | 5. నోరు 'మాట్లాడటము' అనే వ్యాపారము నిర్వర్తిస్తోంది. |
| **పాణేః ఆదానం।** | 6. చేతులు వస్తువులను పట్టుకొను ప్రవర్తన కలిగి ఉంటున్నాయి. |
| **పాదయోః సంచారః।** | 7. పాదములు సంచారము (Walking, Wandering) నిర్వర్తిస్తున్నాయి. |
| **పాయోః ఉత్సర్గ।** | 8. పాయువు 'విజర్జించటము' అనే ధర్మము కలిగి ఉంటోంది. |
| **ఉపస్థస్య ఆనంద గ్రహణం।** | 9. ఉపస్థ శృంగారానంద ధర్మము ప్రదర్శిస్తోంది. |
| **త్వచః స్పర్శ గ్రహణం।** | 10. చర్మము స్పర్శను గ్రహించటము నిర్వర్తిస్తోంది. |

---

**తత్ అధీనా చ విషయ గ్రహణా బుద్ధిః**
**బుద్ధ్యా బుధ్యతి।**
**చిత్తేన చేతయతి।**
**అహంకారేణ అహం కరోతి।**
**విసృజ్య జీవ ఏతాం దేహ**
**అభిమానేన జీవో భవతి॥**

- పై 10 ఇంద్రియములు బుద్ధికి ఆధీనమై, బుద్ధి సమస్తము అనుభవముగా పొందటానికి అవి 'ఉపకరణములు'గా అగుచున్నాయి.
- చిత్తము చింతన చేయు స్వభావము కలిగి ఉంటోంది.
- అహంకారము "నేను-నాది, నా ప్రతిభతో చేస్తున్నాను" అనే ప్రదర్శనము కలిగి ఉంటోంది.

దశేంద్రియములకు, మనస్సు - బుద్ధి - చిత్త - అహంకారములకు (14 కరణములకు) వేరుగా ఈ జీవుడు విలక్షణుడై ఉన్నాడు. ఈ దేహము పట్ల అభిమానము (Identification) కలిగి ఉండటం చేత 'జీవుడు' అని (ఆత్మ పురుషుడే) పిలువబడుచున్నాడు.

---

3. **గృహ అభిమానేన గృహస్థ ఇవ శరీరే జీవః సంచరతి।**

ఒకడు తన ఇంట్లో ఉండి "ఇది నా ఇల్లు" అను అభిమానము కలిగి ఉంటున్నాడు కదా. అట్లాగే ఈ శరీరము పట్ల "ఇది నాకు చెందిన శరీరము, నేను దీనికి చెందినవాడను" అను అభిమానముతో జీవుడు జీవజగత్తులో సంచారములు నిర్వర్తిస్తున్నాడు. తనను తాను దేహమునకు పరిమితము చేసుకుంటున్నాడు.

**ప్రాక్ దళే పుణ్యావృత్తిః।**
**ఆగ్నేయ్యాం నిద్ర ఆలస్యే।**
**దక్షిణాయాం క్రౌర్య బుద్ధిః।**
**నైరుత్యాం పాప బుద్ధిః।**
**పశ్చిమే క్రీడా రతిః।**
**వాయవ్యాం గమనే బుద్ధిః।**




## <u>అష్టదళ హృదయ కమలము</u>

ఈ జీవుడు '8' దళములు గల (పుష్పపు రెక్కలు గల) హృదయము కలిగి ఉంటున్నాడు.

| | | |
|---|---|---|
| తూర్పు దళములో | - | **పుణ్యావృత్తులు (మంచి పనులు చేయాలనిపించటము)** |
| ఆగ్నేయ దళములో | - | **నిద్ర, ఆలస్యము (బద్ధకము)** |
| దక్షిణ దళములో | - | **క్రూరమైన ఆలోచనలు** |
| నైఋతి దళములో | - | **పాపబుద్ధి** |
| పశ్చిమ దళములో | - | **క్రీడా రతి, క్రీడాభిలాష** |
| వాయువ్య దళములో | - | **ఎక్కడెక్కడో సంచారములు చేయాలనే యోచనలు** |

**ఉత్తరే శాంతిః।**
**ఈశాన్యే జ్ఞానం।**
**కర్ణికాయాం వైరాగ్యం।**
**కేసరేషు ఆత్మ చింతా। ఇతి**

ఉత్తర దళములో -**శాంతి, స్వస్థత**

ఈశాన్య దళములో -**జ్ఞానము** (Logic)

పై విధంగా ఈ జీవుడు హృదయ పద్మము యొక్క ఏ దళములో ఉంటే ఆయా భావాలు కలుగుచున్నాయి. వాటివాటికి తాను బద్ధుడు అగుచున్నాడు.

తామరపువ్వు వంటి హృదయ పుష్ప కర్ణికలందు ఉన్నప్పుడు (రెక్కల చివరిగా ఉన్నప్పుడు) వైరాగ్యము, తామరపువ్వులోని కేసరము (పుష్పరాగము) నందు ఉన్నప్పుడు ఆత్మచింతన కలుగుచున్నాయి.

**ఏవం వక్త్రం జ్ఞాత్వా।**
**జీవదవస్థా ప్రథమం 'జాగ్రత్'।**
**ద్వితీయం 'స్వప్నం'।**
**తృతీయం 'సుషుప్తం'। చతుర్థం 'తురీయం'।**
**చతుర్భిః విరహితం 'తురీయ-అతీతం'।**

ఇదంతా జీవుని ముఖము - ఇవి కలిగిన జీవుని అవస్థల యొక్క మొదటిది జాగ్రత్, రెండవది స్వప్నము (కల). మూడవది సుషుప్తము (గాఢ నిద్రావస్థ), నాలుగవది తురీయము. జాగ్రత్-స్వప్న-సుషుప్తులు తన యొక్క పురుషకారముగా కలవాడు తురీయుడు. అటుతరువాత ఈ జీవుని రూపము **"తురీయాతీతము"** అని అనబడుతోంది.

---

**విశ్వ తైజస ప్రాజ్ఞ తటస్థ భేదైః**
**ఏక ఏవ। ఏకో దేవః సాక్షీ నిర్గుణః చ।**

అట్టి జాగ్రత్ - స్వప్న - సుషుప్తి - తురీయపురుషులు (పురుషకారములు) - **"విశ్వుడు, తేజసుడు, ప్రాజ్ఞుడు, తటస్థుడు"** గా చెప్పబడుచున్నప్పటికీ ఆ నాలుగు తనవైన ఆత్మ ఏకమే (ఒక్కటే), ఈ జీవుని ఏకస్వరూపమే సర్వసాక్షీ - నిర్గుణ స్వరూపము.

**"తత్ బ్రహ్మ అహమ్" ఇతి వ్యాహరేత్**
**నో చేత్ జాగ్రత్ అవస్థాయాం**
**'జాగ్రత్' – ఆది చతస్రో అవస్థాః।**
**స్వప్నే స్వప్నాది చతస్రో అవస్థాః।**
**సుషుప్తేః సుషుప్త్యాది చతస్రో అవస్థాః।**
**తురీయే తురీయాది చతస్రో అవస్థాః।**

"ఆ బ్రహ్మమే నేను. నా యొక్క కేవల - సహజ స్వరూపము బ్రహ్మమే" - అను నిశ్చయముతో ఈ దృశ్య జగత్తులో వ్యవహరించెదరు గాక. లేదా ఈ విధంగా గమనించెదరు గాక.

| జాగ్రత్‌లో | స్వప్నములో | సుషుప్తిలో | తురీయము |
|---|---|---|---|
| జాగ్రత్, జాగ్రత్ | స్వప్న జాగ్రత్ | సుషుప్తి జాగ్రత్ | తురీయ జాగ్రత్ |
| జాగ్రత్ - స్వప్నము | స్వప్న స్వప్నము | సుషుప్తి స్వప్నము | తురీయ స్వప్నము |
| జాగ్రత్ - సుషుప్తి | స్వప్న సుషుప్తి | సుషుప్తి - సుషుప్తి | తురీయ - సుషుప్తి |
| జాగ్రత్ - తురీయము | స్వప్న తురీయము | సుషుప్తి - తురీయము | తురీయ-తురీయము |

ఈ విధంగా ప్రతి అవస్థలోను నాలుగు అంతర్గత అవస్థలు ఏర్పడినవై ఉన్నాయి.

---

**న తు ఏవం తురీయ అతీతస్య నిర్గుణస్య,**
**స్థూల సూక్ష్మ కారణ రూపైః,**
**విశ్వ తైజస ప్రాజ్ఞేశ్వరైః,**
**సర్వ అవస్థాసు సాక్షిత్వ ఏవ**
**<u>ఏక ఏవ అవతిష్ఠతే।</u>**

అయితే పైన చెప్పబడిన 4×4=16 అవస్థలు కూడా **"తురీయాతీతము"**నందు ఉండవు. ఎందుకంటే వాటన్నిటికీ కేవలమగు సాక్షిమాత్రము అగుట చేత!

**<u>అట్టి తురీయాతీతము :</u>**

- గుణములకు ఆవల ఉన్న నిర్గుణ స్వరూపము.
- (దేహమునకు 'దేహి'వలె) స్థూల సూక్ష్మ కారణ దేహములకు, విశ్వ తైజస ప్రాజ్ఞ పురుషకారములకు ఆది కారణము. అవన్నీగా ప్రదర్శనమగుచున్న ఈశ్వర రూపము.
- జాగ్రత్ - స్వప్న - సుషుప్తి - తురీయములకు (నాటక దీపమువలె) కేవల సాక్షీ రూపము (Mere Witness like light emitting on stage in relation to inter - personal events of the Drama on stage).

తురీయాతీతము సర్వదా ఏకము, అఖండము, అద్వితీయము కూడా।

| | |
|---|---|
| **4. ఉత తటస్థో, ద్రష్టా తటస్థో।<br>న ద్రష్టా ద్రష్టృత్వాత్।<br>న ద్రష్ట ఏవ కర్తృత్వ భోక్తృత్వ అహంకార ఆదిభిః।<br>స్పృష్టో జీవో జీవేతరో న స్పృష్టః<br>జీవో అపి న స్పృష్ట – ఇతి చేత్<br>న జీవ అభిమానేన, క్షేత్ర అభిమానః।<br>శరీర అభిమానేన జీవత్వం।<br>జీవత్వం ఘట ఆకాశ<br>మహా ఆకాశవత్ వ్యవధానం అస్తి।** | **అట్టి తురీయాతీతము ఇంకా కూడా :**<br>- నిత్యోదితమగు తటస్థము (Blossoming in everything while being always beyond).<br>- ద్రష్టత్వమునకు కూడా సాక్షి - తటస్థము కాబట్టి ద్రష్ట స్వరూపము కాదు.<br>- ద్రష్టకు ఉండి ఉంటున్న కర్తృత్వ, భోక్తృత్వ, అహంకారములు మొదలైనవి తురీయాతీత స్వరూపమునకు లేవు.<br>- జీవ - జీవేతరములు రెండు ఆత్మను ఆశ్రయించియే ఉన్నాయి.<br>- అయితే కూడా ఆత్మ - జీవాత్మ ఇతరములచే స్పృశించబడేది కాదు కూడా. ఎందుకంటే జీవాభిమానము చేత గాని, క్షేత్ర అభిమానముచేత గాని, శరీరాభిమానంచేత గాని జీవత్వము పొందేది కాదు.<br>- జీవత్వము - పరమాత్మత్వము అనేవి కుండలోని ఆకాశము, సర్వత్రాగల మహాకాశము వలె ఒకదానితో మరొకటి మరుగు (Mutually hiding) కలిగి ఉన్నాయి. |
| **వ్యవధాన వశాత్ ఏవ హంసః।** | జీవాత్మ జగదనుభవములకు కర్తృత్వ - భోక్తృత్వములను వహిస్తూ ఉండగా అట్టి జీవాత్మకు వ్యవధానముగా (కప్పువలె, మఱుగు - Secret గా) ఉండి ఉంటున్నదే "హంస" (ఆత్మ) (సోఽహమ్). |
| **సోఽహం (హంసోఽహమ్) ఇతి<br>మంత్రేణ "ఉచ్ఛ్వాస – నిశ్వాస"<br>వ్యపదేశేన అనుసంధానం కరోతి।** | ఉచ్ఛ్వాస (గాలి పీల్చునప్పుడు) సహజమగు ఆత్మగా, గాలి వదలునప్పుడు సందర్భరూపము "సందర్భములోని ఆత్మ"గా భావిస్తూ ఉచ్ఛ్వాస - నిశ్వాసలను ఎరుకలో గమనించటమును అనుసంధానము చేయువారే పరమహంసలు. అట్టి సాధనకు ఉపక్రమించెదరు గాక. |
| **ఏవం విజ్ఞాయ శరీర అభిమానం<br>త్యజేత్, న శరీర అభిమానీ భవతి।<br>స ఏవ 'బ్రహ్మ' ఇతి ఉచ్యతే।** | ఈ విధంగా "సహజ-సందర్భము"లకు సంజ్ఞగా ఉచ్ఛ్వాస - నిశ్వాసలను గమనించటము నిర్వర్తించాలి. స్వస్వరూపాత్మ యొక్క అమృతస్వరూపమగు "సహజరూపము"ను సందర్భ మాత్రమగు "సందర్భ స్వరూపము"ను తన యొక్క పరమాత్మ-జీవాత్మల చమత్కారములుగా గమనించాలి. శరీరాభిమానమును త్యజించాలి. ఇక అట్టివాడు శరీరాభిమానిగా ఉండడు. పాంచభౌతిక శరీరము యొక్క రాక-పోకలను తన ఆత్మ స్వరూపముపై ఆపాదించుకోడు. "అట్టివాడు బ్రహ్మమే అయి ఉన్నాడు" అని ఆత్మజ్ఞుల చేతను, శాస్త్రముల చేతను సుస్పష్టము చేయబడుతోంది. |
| **త్యక్త సంగో, జితక్రోధో,<br>లఘు ఆహారో జితేంద్రియః,<br><br>పిధాయ బుద్ధ్యా ద్వారాణి<br>మనో ధ్యానే నివేశయేత్॥** | అందుచేత ఓ నారదా ! ముని శ్రేష్ఠులారా ! నా బిడ్డలే అయి ఉన్న సమస్త జీవులారా ! మీ యొక్క ఆత్మత్వమును ఎరుగుటకై ఉపాయములు చెప్పుచున్నాను. వినండి.<br>**త్యక్త సంగః :** బాహ్య - అంతర ఇంద్రియములకు తారసబడుచున్న సమస్త విషయ విశేషములను బాహ్యమునన్నే త్యజించినవారవండి.<br>**జిత క్రోధః :** "ఒక వ్యక్తి (లేక) సందర్భముపై కోపమును విడువక పోవటము" అనే 'క్రోధము'ను శత్రువుగా గమనించి జయించి వేయండి. |

**లఘు ఆహారః :** ఇంద్రియములను బాహ్యమున నియమించటము. ఎంతవరకు దేహ రక్షణ పోషణలకు అవసరమో, అంత వరకే పరిమితము చేయండి. అల్పముగా ఆహారము స్వీకరించువారుగా ఉండండి.

**జితేంద్రియః :** ఇంద్రియములు మీకు ఉపకరణములుగా ఉండుగాక. వాటి విషయములకు మీరు వశులు కాకండి. బుద్ధిని బంధించి ఇంద్రియ ద్వారముల నుండి వెనుకకు మరల్చి మనస్సుతో ఆత్మధ్యానపరులుగా ఉండండి.

---

**5.** **శూన్యేషు అవావకాశేషు**
**గుహాసు చ వనేషు చ**

**నిత్యయుక్తః సదాయోగీ**
**ధ్యానం సమ్యక్ ఉపక్రమేత్।**

## ధ్యాన విధి

బిడ్డా ! నారదా ! ధ్యాసను ఇంద్రియ విషయపరంపరల నుండి విరమింపజేసే సాధనయే ధ్యానము. ప్రాపంచకమైన ఇంద్రియ విషయములు చేరని శూన్యమైన ఆకాశ స్థానము (ప్రదేశము) నందు గాని, (సాంఘిక జీవనమునకు సుదూర ప్రదేశంలోగాని) లేక 'గుహ' యందు గాని 'వనము' (అరణ్యము) నందు గాని ఏ కొంచెముగా యోగి సదా నిత్యయుక్కుడై (యోగాభ్యాసి అయి) "సమత్రా / సమదర్శనము'' అనే "సమ్యక్ ధ్యానము''నకు ఉపక్రమించాలి.

---

**ఆతిథ్య శ్రాద్ధ యజ్ఞేషు**
**దేవయాత్ర ఉత్సవేషు చ,**

**మహాజనేషు సిద్ధ్యర్థీ**
**న గచ్ఛేత్ యోగవిత్ క్వచిత్।**

**యథా ఏనం అవమన్యంతే**
**జనాః పరిభవంతి చ,**

**తథా యుక్తః చరేత్ యోగీ**
**సతాం వర్త్మ, న దూషయేత్।**

అట్టి ధ్యాన యోగమునకు సంసిద్ధము అగుచున్న యోగి -

- అతిథి సత్కారములు అందజేయచోట్లకు, శ్రాద్ధ (పితృ) యజ్ఞము జరుగు స్థానములకు, దేవాలయములలో జరిగే ఉత్సవములకు, అనేక మంది ఒకచోట చేరే సమావేశములకు ఎప్పుడు కూడా వెళ్లి పాల్గొనకుండును గాక.

జన సమూహముల గౌరవ - మర్యాదలు, సన్మానములు మొదలైనవి యతి అయినవాడు కోరుకోరాదు. పైగా, జనసమూహము తనను లెక్కలోకి తీసుకోకుండాను, తనను పరిభవించు (తక్కువగా మాట్లాడుకొను) విధంగాను, సాంసారికాశయము గల జీవులు గౌరవించే విధంగాను ఉంటాడు. తన ఆత్మతత్త్వ జ్ఞానాశయములను దాచుకొని ఉండు గాక. దూషించువారియందు కూడా సత్‌భావము (ఆత్మభావన) ఆశ్రయించి - దూషించకుండును గాక.

---

**వాక్ దండః కర్మ దండః చ**
**మనోదండః చ తే త్రయః (3)।**

**యస్య ఏతే నియతా దండాః,**
**స త్రిదండీ మహాయతిః।**

**విధూమే చ ప్రశాంతే అగ్నౌ**
**యస్తు మధుకరీం చరేత్,**

**గృహే చ విప్రముఖ్యానాం**
**యతిః సర్వోత్తమః స్మృతః।**

**త్రి (3) దండములు :**

1) వాక్ దండము 2) కర్మ దండము 3) మనో దండము.

ఈ మూడు దండములను తాత్త్వికార్థ పూర్వకంగాను, ఆత్మజ్ఞాన యుక్తంగాను, నియతి పూర్వకంగాను (శాస్త్ర నిర్వచన నియమానుసారంగాను) ధరించువాడు "త్రిదండీ మహా యతి'' అని పిలువబడుచున్నాడు. ఒకరి ఇంటికి వెళ్లి భిక్ష అడగటానికి సరిఅయిన సమయం గమనించబడుగాక. అగ్ని ఆగిపోయి పొగ చల్లారిన తరువాత (వంట సమాప్తి అయిన తరువాత) ఆయా సంపద, దాన గుణము గల వారి ఇళ్లలో మధుకరము (భిక్ష) స్వీకరించును గాక. అట్టి భిక్షక సన్న్యాసి సర్వోత్తముడు అని చెప్పబడుచున్నారు.

**దండం భిక్షాం చ యః కుర్యాత్**
**స్వధర్మే వ్యసనం వినా**

**యః తిష్ఠతి న వైరాగ్యం యాతి**
**నీచ యతిః హి సః।**

ఎవ్వరైతే బాహ్యమున సన్న్యాసిరూపుడై దండము ధరించి భిక్షకుడై (భిక్షాటనము నిర్వర్తిస్తూ) యతి ధర్మములను (సన్న్యాస ధర్మములను) నిర్వర్తించడో, ప్రాపంచక (దృశ్య) విషయములపట్ల విరాగము (వైరాగ్యము) కలిగి ఉండడో అట్టివాడు నీచుడేగాని 'యతి' కాడు.

**యస్మిన్ గృహే విశేషేణ లభేత్ భిక్షాం చ వాసనాత్,**
**తత్ర నో యాతి నో భూయః। స యతిః న ఇతరః స్మృతః।**

అధికంగా భిక్ష లభించే ఇంటికి మరల మరల పోవటము చేయరాదు. ఎప్పుడూ వేరు వేరు గృహములకు వెళ్లుచూ ఉండాలి. అట్టివాడే యతీశ్వరుడు అనబడుచున్నాడు.

**యః శరీర ఇంద్రియ ఆదిభ్యో విహీనం సర్వసాక్షిణమ్,**
**పారమార్థిక విజ్ఞానం సుఖ ఆత్మానం స్వయం ప్రభమ్।**

ఏ జ్ఞాని అయితే శరీరము, ఇంద్రియములు మొదలైనవన్నిటికీ అతీతత్వము సంపాదించుకొని, సమస్తమునకు సాక్షిత్వము సిద్ధించుకొని పరమార్థకమగు ఆత్మత్వ జ్ఞానముచే స్వయం ప్రకాశము సిద్ధించుకుంటాడో అట్టివాడే పరతత్త్వజ్ఞాని.

**పరతత్త్వం విజానాతి సో అతివర్ణాశ్రమీ భవేత్।**
**సర్వ ఆశ్రమ ఆదయో**
**దేహే మాయయా పరికల్పితాః।**

పరతత్త్వము చక్కగా ఎరిగి యున్నవానికి నాలుగు వర్ణ ఆశ్రమ పరిధులు ఉండవు. ఎందుకంటే వర్ణాశ్రమ కర్మ విశేషములన్నీ 'మాయా' ఆధారముగా కల్పితమగుచున్నవే. పరబ్రహ్మమునకు లేవు. (పరబ్రహ్మము సిద్ధించుకోవటానికి "ముల్లును ముల్లుతోనే తీయాలి" అనే ఉపాయమును దృష్టిలో పెట్టుకొని - ఉపాయరూపంగా శాస్త్రములు 'మాయ'యే అయినట్టి 4 ఆశ్రమ ధర్మములు నియమించి సూచిస్తున్నాయి).

---

**6.** **న ఆత్మనో బోధ రూపస్య**
**మమత్వే సంతి సర్వదా।**

**ఇతి యో వేద వేదాంతైః**
**సో "అతివర్ణాశ్రమీ" భవేత్।**

## వర్ణాశ్రమాతీతుడు

**"నేను సర్వదా బోధరూపమగు ఆత్మను. అట్టి కేవల బోధరూపుడునగు నాకు ఇది నా ఆశ్రమము, అది నా ఆశ్రమం కాదు అని ఉండదు"** అని ఏ వేద - వేదాంతుడు తెలుసుకుంటాడో అతడే ఆవలగల ఆత్మరూపము ఎరిగినవాడు. **అట్టివాడు ఆశ్రమ పరిధులను దాటి 'అతివర్ణాశ్రమీ' అగుచున్నాడు.**

**యస్య వర్ణ ఆశ్రమ ఆచారో**
**గళితః స్వ ఆత్మ దర్శనాత్**
**స వర్ణాశ్రమాం తు సర్వాన్**
**అతీత్య స్వ ఆత్మని స్థితః।**

ఎవ్వడైతే వర్ణాశ్రమ ఆచారములను ఉపకరణములుగాను, సాధన కొరకు నియమింబడినవిగాను భావించి సర్వత్రా ఆత్మ దర్శనమే పరమాశయముగా కలిగి ఉండి, అందుకు ఆశ్రమ ధర్మములు శాస్త్రీయ సాధనా విధానముగా అనుసరించు అభ్యాసము కలవారు - **సమస్త వర్ణాశ్రమ ధర్మములకు ఆవలను దాటి వాని స్వస్వరూపాత్మయందు స్థితిని పొందుచున్నారు.**

**యో అతీత్య స్వ ఆశ్రమాన్ సర్వాన్**
**ఆత్మని ఏవ స్థితః పుమాన్**
**సో "అతివర్ణాశ్రమీ" ప్రోక్తః**
**సర్వ వేదార్థ వేదిభిః॥**

ఏ పురుషుడైతే తన యొక్క సమస్త ఆశ్రమ ధర్మములను క్రమంగా (సాధ్యము సిద్ధిస్తున్నప్పుడు సాధనలు దాటినట్లు) దాటివేసి "ఆత్మధ్యానము, ఆత్మభావన" యందు స్థితి పొందుతాడో, అట్టి వాడు సర్వ వేదార్థములను అర్థం చేసికొని, దాటి "అతివర్ణాశ్రమి" అగుచున్నాడు.

| | | |
|---|---|---|
| | **తస్మాత్ అన్యగతా వర్ణాశ్రమా అపి, నారదా! ఆత్మని ఆరోపితాన్ సర్వే భ్రాంత్యా తేన ఆత్మవేదినా।** | కాబట్టి నారదా ! **స్వగతమే కాకుండా అన్యగతమైన ఆశ్రమ ధర్మాలు అన్నీ కూడా ఆత్మయందు ఆరోపించి చెప్పబడేవేగాని, ఆశ్రమ ధర్మములే అంతిమ లక్ష్యము కాదు"** అని, అవి భ్రాంతి తొలగటానికి భ్రాంతి నిర్మితములేనని ఆత్మజ్ఞాని గ్రహిస్తున్నాడు. |
| | **న విధిః న నిషేధః చ న వర్జ్య అవర్జ్య కల్పనా బ్రహ్మ విజ్ఞానినాం అస్తి। తథా న అన్యత్ చ, నారద।** | ఆత్మ యొక్క స్వానుభవము సిద్ధించుచున్న సందర్భము సమక్షంలో విధి (Do's) ఉండవు. నిషేధములు (Dont's) ఉండవు. బ్రహ్మ విజ్ఞానమే అంతిమ అనుభవంగా శేషిస్తుంది. మరింకేమి ఉండవు. దేనితోనూ పని లేదు. |
| **7.** | **విరజ్య సర్వ భూతేభ్య ఆవిరించి పదాత్ అపి,** | కనుక ఓ నారదా ! ఈ జీవుడు సంసార దోషములు (Relatedness to worldly events and occasions) గ్రహించనివాడగును గాక. |
| | **ఘృణాం విపాట్య సర్వస్మిన్ పుత్రమిత్రాదికేషు అపి,** | బ్రహ్మ దేవుని పదము (Position) నుండి సర్వ పదములు (All positional possessions) పట్ల, కొడుకు - స్నేహితుడు- సంబంధీకుడు మొదలైన సర్వ సంబంధిత దృశ్య వ్యవహారముల పట్ల అనురక్తిని జయించి, 'విరక్తుడు' అగును గాక. |
| | **శ్రద్ధాలుః ముక్తి మార్గేషు వేదాంత జ్ఞాన లిప్సయా।** | "నాకు బంధముల భావన తొలగును గాక" అను రూపమగు ముక్తి మార్గము పట్ల ఆశయము కలిగి ఉండును గాక. అందుకొరకై వేదాంత జ్ఞానము పొందుటకు సంసిద్ధుడగును గాక. |
| | **ఉపాయనకరో భూత్వా గురుం బ్రహ్మవిదం వ్రజేత్। సేవాభిః పరితోషి ఏనం చిరకాలం సమాహితః।** | **అట్టి ముక్తికి త్రోవతీయగల వేదాంత జ్ఞానము లభించేది ఎట్లా?** అందుకొరకు తనయందు శ్రద్ధను నిదుర లేపి అందుకు ఉపాయముగా బ్రహ్మవిదుడగు గురువును ఆశ్రయించి, వారిని తన సేవా భావములతో సేవించి, దీర్ఘకాలము శ్రద్ధ - ఆసక్తులతో సేవిస్తూ ప్రయత్నశీలుడగును గాక. |
| | **సదా వేదాంత వాక్యార్థం శృణుయాత్ సు సమాహితః నిర్మమో నిరహంకారః సర్వ సంగ వివర్జితః।**<br><br>**సదా శాంతి-ఆది యుక్తః సన్ ఆత్మని ఆత్మానం ఈక్షతే।** | యోగసిద్ధుడైన యతి - ఎల్లప్పుడు సు-సమాహితుడై ఆత్మతత్త్వ జ్ఞానము పట్ల అంగీకారము కలవాడగును గాక. సమాధిని ఆశ్రయించినవాడై (వేదాంత వాక్యములైనట్టి 'సోఽహమ్', 'తత్త్వమ్' 'త్వమేవాహమ్', "జీవోబ్రహ్మేతి నాపరః" మొదలైన మహావాక్యములను) వినును గాక. మహదార్థమును గ్రహిస్తూ ఉండును గాక. మమకార, అహంకార రహితుడగును గాక. సర్వసంగములను వదలి వేయును గాక. శాంతి మొదలైన ఉత్తమగుణములను ఆశ్రయించిన తత్త్వజ్ఞుడు ఈ భూమిపై ప్రశాంతముగా సంచారము చేస్తున్నాడు. |
| | **సంసార దోష దృష్ట్యా ఏవ విరక్తిః జాయతే సదా, విరక్తస్య తు సంసారాత్ సన్న్యాసః స్యాత్ న సంశయః।** | **సన్న్యాసము :** సదా సంసార దృష్టులలో గల దోషములను గమనించి, సమస్త అనురక్తులను జయించి - విరక్తి సమన్వితుడై, ఆత్మయందు పూర్ణార్థమును ఆశ్రయించువాడు ఎల్లప్పుడు సన్న్యాసియే. జ్ఞేయస్య నిత్య సన్న్యాసి యో న ద్వేష్టి న కాంక్షతి. సంశయము లేదు. |
| | **ముముక్షుః పరమ హంసాఖ్యః సాక్షాత్ మోక్ష ఏక సాధనమ్, అభ్యసేత్ బ్రహ్మ విజ్ఞానం వేదాంత శ్రవణ ఆదినా।** | ముముక్షువు అయినవాడు సాక్షాత్ మోక్షమే ఏకైక సాధనముగా కలిగి ఉండాలి. వేదాంత శాస్త్రము శ్రవణము చేస్తూ బ్రహ్మ జ్ఞానము సంపాదించి పరమహంసత్వము సంతరించుకోవాలి. |

**8. బ్రహ్మ విజ్ఞాన లాభాయ**
**పరమహంస సమాహ్వయః,**
**శాంతి దాంతి ఆదిభిః సర్వైః**
**సాధనైః స హితో భవేత్।**

పరమహంస అయి బ్రహ్మ విజ్ఞాన సంపన్నుడై, (సోఽహమ్ పరమమ్ - సమస్తమునకు పరమైయున్న ఆత్మయే నా సహజ రూపము అను) ఆత్మ భావనను స్వాభావికం చేసుకుంటూ ప్రశాంతమైన బుద్ధి, ఇంద్రియ నిగ్రహములను ఎల్లప్పుడు ఉపకరణములుగా కలిగి ఉంటున్నారు.

**వేదాంత అభ్యాస నిరతః**
**శాంతో దాంతో జితేంద్రియః**

(వేద + అంతము = తెలుసుకోబడు సమస్తమును తెలుసుకొంటున్నవాడు - The Knower) యతి ఎల్లప్పుడు వేదాంత అభ్యాసము నందే నిరతుడగును గాక, శాంతుడై దాంతుడగును గాక. ఇంద్రియనిగ్రహము కలవాడగును గాక.

**నిర్భయో నిర్మమో నిత్యో**

- భయములన్నిటినీ జయించినవాడై,

**నిర్ద్వంద్వో నిష్పరిగ్రహః**

- మమకారము త్యజించివేయును గాక.

**జీర్ణ కౌపీన వాసాః స్యాత్**

- ద్వంద్వ మోహమును వదలి వేయును గాక.

**ముండీ, నగ్నః అథవా భవేత్।**

ఈ కల్పిత మాత్ర దృశ్యము నుండి ఏదీ పరిగ్రహించనివాడై ఉండునుగాక. జీర్ణ కౌపీనము (గోచి) ధరించి, ముడి (జుట్టు) తొలగించుకొన్నవాడై (లేదా) నగ్నముగా (బట్టలు వదలి) పరివ్రాజకుడు ఈ ప్రపంచమునందు ఆత్మానందముగా ఉంటున్నాడు.

---

**ఇంకా కూడా ఈ జీవుడు "సంసారము" అనే దృశ్యముతో ఏర్పరచుకొన్న మనో అనుబంధ జాడ్యము తొలగించుకొనే విషయాలను (పైన చెప్పుకొన్నవే కాకుండా) మరికొన్ని చెప్పుకొంటున్నాము.**

**ప్రాజ్ఞో వేదాంత విత్ యోగీ**
**నిర్మమో నిరహంకృతిః,**
**మిత్ర ఆదిషు సమః, మైత్రః**
**సమస్తేషు ఏవ జంతుషు**

**ఏకో జ్ఞానీ ప్రశాంత ఆత్మా**
**స సంతరతి న ఇతరః ।**

- శాస్త్రము, సద్గురువులు, "తత్ త్వమేవ" పూర్వకంగా చెప్పుచున్న సూక్ష్మ విషయములు గ్రహించగల ప్రజ్ఞను సునిశితం చేసుకొని ప్రాజ్ఞుడై ఉండాలి.

- వేదాంత శాస్త్రము చెప్పుచున్న స్వస్వరూపము గురించి విశేషములు తెలుసుకుంటూ వేదాంతవేత్త కావాలి.

- వ్యక్తిగత పరిమితులను అధిగమించి వ్యష్టిత్వమును సమిష్టిరూప సర్వాత్మకమునందు ఏకము చేయు యోగీశ్వరత్వము కొరకై మన్నించు 'యోగి' అయి ఉండుగాక.

- నాది-నేను అనే పరిమితమైన మమకార - అహంకారములను జయించి "నిర్మమ, నిరహంకారి" అగును గాక.

- శత్రు మిత్రుల యందు, సమస్త సహజీవుల యందు సమ బుద్ధి కలిగి ఉండును గాక.

**గురూణాం చ హితే యుక్తః**
**తత్ర సంవత్సరం వసేత్।**

**శిష్యత్వము** : సన్న్యాసి, యతి, పరివ్రాజకుడై మోక్షమును సిద్ధించుకోవటానికి మార్గము అయి ఉన్న కొన్ని విశేషాలు.

బిడ్డలారా !

"ఏకోజ్ఞానీ ప్రశాంతాత్మ" అగు స్థితి సిద్ధించటానికై ముందుగా తత్త్వజ్ఞాని అగు గురువును ఆశ్రయించి ఆయన సేవలో శ్రవణం చేస్తూ - ఒక సంవత్సర కాలము గడపటము ఉచితము.

| | |
|---|---|
| **నియమేషు అప్రమత్తస్తు**<br>**యమేషు చ సదా భవేత్।** | ఎల్లప్పుడు "నియమము" నందు (ఇంద్రియములను జ్ఞానార్జన కొరకై నియమించుటయందు), "యమము" నందు (ఇంద్రియములను విషయముల నుండి వెనుకకు మరల్చుట యందు) శ్రద్ధాళువు అయి ఉండాలి. |
| **ప్రాప్య చ అంతే తతః చ ఏవ**<br>**జ్ఞానయోగం అనుత్తమమ్।** | ఆ విధంగా అనుత్తమమైన (శ్రేష్ఠమైన) "ఆత్మజ్ఞానానుభవము" సంపాదించుకోవాలి. |
| **అవిరోధేన ధర్మస్య సంచరేత్**<br>**పృథివీం ఇమామ్।** | అట్టి ఆత్మ జ్ఞానానుభవి అయి మరొక (సంవత్సర కాలము) యతి ధర్మములను వీడకుండా జ్ఞాన యోగము ధారణ చేస్తూ భూమిపై సంచారములు నిర్వర్తించును గాక. |
| **తతః సంవత్సరస్య – అంతే జ్ఞానయోగమ్**<br>**అనుత్తమం ఆశ్రమ త్రయం ఉత్సృజ్య**<br>**ప్రాప్తశ్చ పరమ ఆశ్రమమ్।** | ఆ విధంగా సంవత్సర కాలము జ్ఞాన యోగ సమన్వితుడై సంచారము పూర్తి చేసుకొని, అటు తరువాత త్రి-ఆశ్రమములను (బ్రహ్మచర్య - గృహస్థ - వానప్రస్థ - '3' ఆశ్రమములను) వదలి వేసి వాటికి ఆవలిదగు పరమాశ్రమము (సన్యాసాశ్రమము) స్వీకరించును గాక. |
| **అనుజ్ఞాప్య గురూంశ్చైవ (గురూన్ చ ఏవ)**<br>**చరేద్ధి పృథివీం ఇమామ్।** | ఆ విధంగా నాలుగువదగు సన్న్యాసాశ్రమమును గురు అనుజ్ఞతో స్వీకరించి |
| **త్యక్త సంగో, జితక్రోధో,**<br>**లఘు ఆహారో జితేంద్రియః॥** | - సమస్త సంగములను (All kinds of Relationships / Relatedness) మనస్సుతో వదలి వేయాలి.<br>- క్రోధము (The tendency of anger) మొదలంట్లా జయించి వేయాలి.<br>- ఇంద్రియములను పరిమితముగా (జీవించుటకు అవసరమైనంత వరకే) ఉపయోగిస్తూ 'లఘు ఆహారి' అయి ఉండాలి.<br>- ఇంద్రియ విషయములను జయించి, ఇంద్రియములను తన వశం చేసుకొని లోకములో సంచరించును గాక. తాను ఇంద్రియములకు వశుడు కాకూడదు. అవే తనకు వశములో ఉండాలి. అవి తనచే పాలించబడాలి. |

---

| | |
|---|---|
| **9. ద్వావిమౌ న విరాజేతే**<br>**విపరీతేన కర్మణా,**<br>**నిరారంభో గృహస్థః చ**<br>**కార్యవాన్ చ ఏవ భిక్షుకః।**<br>**మాద్యతి ప్రమదాం దృష్ట్వా**<br>**సురాం పీత్వా చ మాద్యతి,** | గృహస్థునకు కర్మలు చేయుటము, భిక్షుకునకు కర్మలు లేకపోవటము విధి విధానంగా చెప్పబడుతోంది.<br>కర్మలు నిర్వర్తించని గృహస్థుడు, కార్యక్రమములను, కర్మ పరంపరలను నిర్వర్తించే భిక్షుకుడు - ఇద్దరు కూడా 'విపరీత కర్మ పరులు' అగుచున్నవారే. |
| **తస్మాత్ దృష్టివిషాం నారీం**<br>**దూరతః పరివర్జయేత్।** | ఈ జీవులు మద్యపానము చేసినప్పుడు, యౌవనవతి / యౌవనవంతుడు అయిన దేహము చూచినప్పుడు మాద్యము (మత్తు) పొందినవారగుచున్నారు. అందుచేత స్త్రీని శృంగార దృష్టితో చూడకూడదు. అట్టి (శృంగార) దృష్టిని దగ్గరకు ఏ మాత్రము రానీయకూడదు. మలము ఒంటికి రాసుకోవటముతో సమానంగా భావించాలి. |

| | |
|---|---|
| **సంభాషణం సహ స్త్రీభిః**<br>**ఆలాపః ప్రేక్షణం తథా,**<br><br>**నృత్తం గానం సహాసం చ**<br>**పరివాదాంశ్చ వర్జయేత్,** | కులుకు మొదలైన వాటితో శృంగారపు గుర్తులు ప్రదర్శించు స్త్రీలతో సరస-సల్లాప సంభాషణము, గీతములు, చూపులు నిలపటము, నృత్య - గానములు సలపటము, ప్రక్కనే కూర్చోవటము, ఎవరి గురించో నిందా వాక్యములు చెప్పుకోవటము (పరివాదము) - ఇవన్నీ యతి మార్గంలో వదలి ఉండవలసినవి. |
| **న స్నానం న జపః పూజా,**<br>**న హోమః న ఏవ సాధనమ్,**<br><br>**న అగ్నికార్యాది కార్యం చ**<br>**న ఏతస్య అస్తి ఇహ, నారద!** | ఓ నారదా ! ఎవ్వరైతే బ్రహ్మ భావమునందు అవిచ్ఛిన్నంగా ఓలలాడుచూ ఉంటారో - అట్టి వారికి స్నానము, జపము, పూజ, కోపము తదితర సాధనా క్రమములు, అగ్ని కార్యములు - ఇటువంటి నియమములేవీ ఇక శాస్త్రములు విధించవు. అట్టి సాధనములన్నిటి యొక్క సిద్ధి యగు ఆత్మానందము పొందినవానికి ఇక సాధనముల నియమములు ఉండవు. |
| **న అర్చనం పితృకార్యం చ**<br>**తీర్థయాత్రా వ్రతాని చ,**<br><br>**ధర్మా అధర్మ ఆదికం నాస్తి**<br>**న విధిః లౌకికీ క్రియా।** | అట్టి ఆత్మతత్త్వభావన స్వాభావికముగా పండించుకున్న తత్త్వార్థ జ్ఞానికి ఇక దేవతార్చనలు గాని, పితృకార్యములు గాని, తీర్థయాత్రలు గాని, తప్పక నిర్వర్తించలసిన వ్రతములు గాని, ధర్మ - అధర్మ నియమములు గాని, లౌకిక క్రియా విధులు గాని ఇక నియమించబడవు. |
| **సంత్యజేత్ సర్వకర్మాణి**<br>**లోకాచారం చ సర్వశః।** | అట్టి సమస్త కర్మలు, లోక సంబంధమైన ఆచారములను నియమించి చెప్పలేము. |
| **క్రిమి కీట పతంగాంశ్చ**<br>**తథా యోగీ వనస్పతీన్**<br>**న నాశయేత్ బుధో జీవాన్**<br>**పరమార్థ మతిః యతిః।** | పరమార్థమును ఎఱిగిన యతి క్రిమి కీటకములను, మిడతలు వంటి వాటినీ, పక్షులను, వృక్షములను, తదితర జీవులను నశింపజేయక, ఉత్తమ బుద్ధి కలవాడై ఉండు గాక. |
| **నిత్యం అంతర్ముఖః స్వచ్ఛః**<br>**ప్రశాంతాత్మా స్వ పూర్ణధీః,**<br><br>**అంతః సంగ పరిత్యాగీ**<br>**లోకే విహర, నారద!** | సహ జీవులలోను, తనయందు బాహ్యములైన విశేషములను ప్రక్కకు పెట్టి (లేక) దాటివేసి సమస్తమునకు ఆధారమైయున్న "ఆత్మనే దర్శించటము" అను అంతర్ముఖత్వము వహించును గాక. స్వచ్ఛమైన మనస్సుతో, ప్రశాంతమైన భావనతో తన యొక్క పూర్ణత్వమును బుద్ధికి స్పష్టపరచుకొని ఉండు గాక. ఓ నారదా! నీ యొక్క అంతరమున సమస్త సంగములు విడచినవాడవై, బాహ్యమున లోకములన్నీ విహరించెదవు గాక. |
| **న అరాజకే జనపదే చరతి**<br>**ఏక చరో మునిః।** | రాజు పరిపాలన లేని ప్రదేశములలో ముని తిరగకూడదు. కానీ, దేనితోనూ సంబంధము కలిగి ఉండక ఒంటరిగా చరించుచుండును గాక. |
| **నిస్తుతిః నిర్నమస్కారో**<br>**నిస్వధాకార ఏవ చ,**<br>**చల అచల నికేతశ్చ**<br>**యతిః యాదృచ్ఛికో భవేత్।।** | దేనినీ స్తుతించకుండా, నమస్కరించకుండా, స్వధాకారుడు (పితృతర్పణము చేయువాడు) కాకుండా, ఆశీర్వాదములు ప్రసాదించకుండా, యాదృచ్ఛికంగా (without pre-plan) తారసపడే స్థానములందు కొండగుహలలోను నివాసము కలిగి ఉండును గాక. |

**ఇత్యుపనిషత్ – నారద పరివ్రాజకోపనిషత్ – "షష్ఠ ఉపదేశః"**

## సప్తమోపదేశః (7వ ఉపదేశము)
# నిర్దుష్ట నియమ నిష్ఠలు

| | | |
|---|---|---|
| **1.** | **అథ "యతేః నియమః కథం ఇతి" –**<br>**పృష్టం నారదం, పితామహః పురస్కృత్య,** | **నారద మహర్షి :** హే జగత్ సృష్టికర్తా ! బ్రహ్మ భగవాన్ ! 'యతి' యొక్క నిర్దుష్టమైన నియమ - నిష్ఠలు దయతో విశదీకరించండి. ఇది విని పితామహులు ఇట్లు వివరించసాగారు. |
| | **విరక్తః సన్న్యాసీ వర్షాసు ధ్రువశీలో,**<br>**అష్టౌ మాసాన్ ఏకాకీ చరేత్।** | **పితామహుడు :** సన్యాసి సమస్త దృశ్య విషయములపట్ల అనురక్తిని జయించి, విరక్తుడై '8' మాసములు ఏకాంతముగా, ఒకచోట నిలువక చరించువాడై ఉంటారు. వర్షాకాలపు '4' మాసములు మాత్రము ధ్రువముగా ఒక చోటనే ఉంటారు (చాతుర్మాస్యము). భిక్షువు ఒకరాత్రి |
| | **న ఏకరాత్రం నివసేత్ భిక్షుః**<br>**భయాత్ సారంగవత్ ఏకత్ర న తిష్ఠేత్।**<br>**స్వగమన నిరోధ గ్రహణం న కుర్యాత్।** | మించి ఎక్కడా కూడా రెండవ రాత్రి ఉండరు. భయము పొందు జింక ఒక చోట నుండి మరొక చోటికి రోజురోజు సంచరిస్తూనే ఉంటుంది, అట్లాగే యతి తన యొక్క యాత్రా సంచారమును ఏ మాత్రము విరామము కల్పించుకోరు. |
| | **హస్తాభ్యాం నది ఉత్తరణం న కుర్యాత్।** | చేతులతో ఈత కొడుతూ నదులను యతి దాటకూడదు. |
| | **(న కుర్యాత్) న వృక్ష ఆరోహణం అపి।**<br>**న దేవ ఉత్సవ దర్శనం కుర్యాత్।**<br>**న ఏక రాత్రాశీ।**<br>**న బాహ్య దేవత అర్చనం కుర్యాత్।** | భిక్షుక యతి - చెట్లు ఎక్కకూడదు. దేవతా ఉత్సవములలో పాల్గొనరాదు. ఒక్క రాత్రి మించి ఎక్కడా నిలువ కూడదు. బాహ్య దేవతార్చనము నిర్వర్తించరు. సర్వదా సర్వాంతర్యామియగు పరమాత్మనే సర్వత్రా దర్శిస్తూ ఉపాసిస్తూ ఉంటారు. |
| | **స్వ వ్యతిరిక్తం సర్వం త్యక్త్వా,**<br>**మధుకర వృత్త్యా, ఆహారం**<br>**ఆహరన్ కృశో భూత్వా।** | ఆత్మకు అన్యమైనదంతా మనస్సుతో విడచి, "అనన్యచింతన"ను ఆశ్రయించి, మధుకర (భిక్షక వృత్తి) ఆశ్రయించి లభించినది స్వీకరిస్తూ తపోధ్యాన నిష్ఠలచే శరీర భావనను ఎప్పటికప్పుడు కృశింపజేసుకుంటూ ఉంటారు. |
| **2.** | **మేదో వృద్ధిం అకుర్వన్ న।**<br>**ఆజ్యం రుధిరం ఇవ త్యజేత్।**<br>**ఏకరాత్ర – అన్నం పలలం ఇవ।**<br>**గంధ లేపనం అశుద్ధ లేపనం ఇవ।**<br>**క్షారం అంత్యజం ఇవ।**<br>**వస్త్రం ఉచ్ఛిష్ఠ పాత్రం ఇవ।** | మేదో వృద్ధి (కండ, క్రొవ్వుల బలము వృద్ధి చేసుకొనే) వృత్తులు అవలంబించరాదు.<br>క్రొవ్వు పెంచే 'నెయ్యి' మొదలైన వాటిని రక్తపానముతో సమానంగా భావించి వదలి ఉండాలి. ఒకేచోట అన్నము మాంసాహారముగా భావించాలి, ఆశ్రయించరాదు.<br>సుగంధ లేపనమును అశుద్ధముగా భావించాలి.<br>క్షారమును (ఉప్పును) అంత్యజము వలె దుష్టాహారము వలె భావించాలి. ఖరీదైన వస్త్రధారణమును ఉమ్మి పాత్ర వలె అనుకోవాలి. |
| | **అభ్యంగం స్త్రీ సంగం ఇవ।**<br>**మిత్ర ఆహ్లాదకం మూత్రం ఇవ।** | అభ్యంగన స్నానము (కుంకుళ్లు, సుగంధములు మొదలైన వాటితో తలంటుకోవటం) స్త్రీ సంగముతో సమానంగా వదలి ఉండాలి. స్నేహితులతో ప్రాపంచక విషయాలు మాట్లాడటం మూత్రముతో సమానంగా అనుకొని వదలి ఉండాలి. |
| | **స్పృహాం గోమాంసం ఇవ।**<br>**జ్ఞాత చరదేశం చండాల వాటికాం ఇవ।** | స్పృహ (ఆసక్తిని) గోమాంసముతో సమానంగాను, జ్ఞాతులు (బంధువులు) నివసించే ప్రదేశాలకు, ఇళ్లకు వెళ్లటం చండాలవాటికలలోకి వెళ్లటంగా భావించాలి. |
| | **స్త్రియం అహిమ్ ఇవ।**<br>**సువర్ణం కాలకూటం ఇవ।**<br>**సభాస్థలం శ్మశానస్థలం ఇవ।** | స్త్రీలతో సరసములు మొదలైనవి త్రాచుపాములతో చలగాటంగాను, బంగారమును కాలకూట విషంతో సమానంగాను, అనేకమంది జనులతో కూడిన సభాస్థలము శ్మశానంతో సమానంగాను యతి (సన్యాసి) భావించును గాక. |

| | |
|---|---|
| **రాజధానీం కుంభీపాకం ఇవ।**<br>**శవ పిండవత్ ఏకరాత్ర అన్నం।**<br>**న దేహాంతర దర్శనం।** | రాజధాని (నగరము)లో నివాసము కుంభీపాక నరకంతో సమానంగా అనుకొనును గాక. ఒకే గృహములో మరల మరల భిక్ష తీసుకోవటం కూడదు. ఒకే ఇంటి వద్ద రెండవ సారి భిక్ష శవపిండముతో సమానంగా భావించాలి. భౌతికదేహము లోనికి చూడటం కూడదు. |
| **ప్రపంచ వృత్తిం పరిత్యజ్య,**<br>**స్వదేశం ఉత్సృజ్య, జ్ఞాత చర దేశం విహాయ,**<br>**విస్మృత్య పదార్థం పునః ప్రాప్త, హర్ష ఇవ।** | ప్రపంచము (దృశ్యము) నకు సంబంధించిన సమస్త ప్రవృత్తులను విడచివేయును గాక.<br>స్వదేశ పరిమితములను వదలి విశ్వప్రేమికుడు అగును గాక.<br>తన ప్రియ బంధువులు నివసించు ప్రదేశము వదలి ఉండును గాక.<br>ఏ పదార్థమైన 'మరల మరల పొందాలి' అని హర్షము, ఆకర్షణ, ఉబలాటము కలిగి ఉండరాదు. |
| **స్వమ్ ఆనందం అనుస్మరన్, స్వ శరీర**<br>**అభిమాన దేశ విస్మరణం మత్వా,**<br>**స్వశరీరం శవం ఇవ హేయం, ఉపగమ్య,** | - స్వస్వరూపానందమును ఎల్లప్పుడు స్మరిస్తూ జ్ఞాపకము ఉంచుకోవాలి.<br>- స్వకీయ శరీరాభిమానమును, స్వదేశాభిమానమును విడచి ఉండాలి.<br>తన యొక్క పాంచభౌతిక దేహమును 'శవము' వలె హేయమైన వస్తువుగా భావించి, దీనికి ఆవలి దగు "శరీరి" భావమునందు విశ్రమించాలి |
| **కారాగృహ వినిర్ముక్తః చోరవత్**<br>**పుత్ర ఆప్తబంధు భవస్థలం**<br>**విహాయ దూరతో వసేత్॥** | కారాగృహము (Jail) నుండి బయటపడిన దొంగ కారాగృహములోని తోటి దొంగల బంధనమును వదలి బయటకు హాయిగా వచ్చు విధంగా కొడుకుల - ఆప్త బంధువుల నివాస స్థలములను విడచిపెట్టి వాటికన్నింటికి మానసికంగా దూరంగా వసించును గాక. |

**3.** **అయత్నేన ప్రాప్తం ఆహరన్**
**బ్రహ్మ ప్రణవ ధ్యాన అనుసంధాన పరో భూత్వా,**
**సర్వకర్మ వినిర్ముక్తః,**

యతి (సన్యాసి) ఇంకా కూడా ఎట్లా ఉండాలి ? వినండి.

- ప్రయత్నము లేకుండానే (ఏదో కావాలి అని కోరుకొని, అందుకై పరుగులు పెట్టకుండానే) యథావిధంగా ఏది లభిస్తే అది స్వీకరిస్తూ 'తృప్తి'ని వీడకుండు గాక.
- ఎల్లప్పుడు కేవల సర్వాత్మక పరబ్రహ్మము గురించి ప్రణవ సంజ్ఞాపూర్వకంగా అనుసంధానపరుడై ఉండు గాక.
- 'కావాలి - చేయాలి' అనే కర్మ స్వభావమునుండి (రజో గుణము నుండి) వినిర్ముక్తుడగును గాక.

**కామ క్రోధ లోభ మోహ**
**మద మాత్సర్య ఆదికం దగ్ధ్వా,**

- కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములనే అరిషట్ (6) వర్గమును 'తృప్తి, అల్పసంతోషము' అనే ఆయుధములచే జయించి వేయును గాక.

**త్రిగుణ అతీతః షట్ ఊర్మి రహితః**

- త్రిగుణములకు అతీతమగు సాక్షిత్వము అభ్యాసము చేయును గాక.

**షట్ భావ వికార శూన్యః**

- షట్ ఊర్ములను (క్షుత్, తృష్ణ, శోక, మోహ, జరా, మరణములను) రహితము చేసుకొనును గాక. షట్భావ వికారములను (ఉత్పత్తి, స్థితి, పరిణామము, వృద్ధి, క్షయము, నాశనము) వదలును గాక,

**సత్యవాక్ శుచిః అద్రోహీ।**

- సత్యవాక్కుతో శుచి అయిన భావములతో అద్రోహి అయి ఉండును గాక.

- గ్రామే ఏక రాత్రం।
- పత్తనే పంచ రాత్రం।
- క్షేత్రే పంచ రాత్రం।
- తీర్థే పంచ రాత్రం।

యతి అయినవాడు గ్రామములో ఒక రాత్రి మాత్రమే, పట్టణములలోను తీర్థ ప్రదేశములలోను ఐదు రాత్రులు మాత్రమే నివాసము కలిగి ఉండాలి. ఎక్కడా స్థిరనివాసము కలిగి ఉండనివాడగును గాక. బుద్ధి నిశ్చలత (ఏకాగ్రత) కలిగి ఉండాలి.

అనికేతః। స్థిరమతిః। న-అనృతవాదీ।
గిరి కందరేషు వసేత్।

సత్యము కాని దాని గురించి వాదనకు దిగకూడదు. సత్యవ్రతుడై ఉండాలి. పర్వత గుహలను కూడా నివాసముగా కలిగి ఉండును గాక.

---

ఏక ఏవ, ద్వౌ వా చరేత్ గ్రామం।
త్రిభిః నగరం చతుః గ్రామం ఇతి।

గ్రామములో ఒకరితోగాని, ఇద్దరితో గాని ఉండవచ్చును. నగరములో ముగ్గురితో మాత్రమే ఉండవచ్చును.

ఏకః చరేత్ భిక్షుః। చతుర్దశ కరణానాం

ఎప్పుడూ భిక్షాటనము ఒంటరిగానే నిర్వర్తించాలి.

న తత్ర అవకాశం దద్యాత్।

(పంచకర్మేంద్రియ, పంచ (5) జ్ఞానేంద్రియ, మనో-బుద్ధి-చిత్త-అహంకారములనబడే) 14 కరణములను తనపై పెత్తనము చెలాయించనీయకూడదు. అవి తనకు వశమై ఉండాలేగాని, వాటికి తాను వశుడు కాకూడదు.

అచ్ఛిన్న జ్ఞానాత్ వైరాగ్య సంపత్తిం అనుభూయ,

నిరంతరము 'ఆత్మ' జ్ఞానమును పరిపోషించుకుంటూ, వైరాగ్య సంపత్తిని పరిపుష్టి చేసుకుంటూ ఉండాలి.

---

"మత్తో న కశ్చిత్ అన్యో అతిరిక్త"
- ఇతి ఆత్మని ఆలోచ్య,

**అఖండమగు బ్రహ్మమే ఈ సమస్తముగాను, "నాలోని నేనైన నేను"గాను ప్రదర్శనము అవుతోంది. కాబట్టి ఆత్మస్వరూపుడునగు నేనే ఇదంతా అయి ఉన్నాను. నాకు వేరై ఎక్కడా, ఏదీ లేదు" అని తన ఆత్మ స్వరూపము గురించి ఆలోచన కలవాడై ఉండును గాక.**

సర్వతః స్వస్వరూపమేవ పశ్యన్,
జీవన్ముక్తిం అవాప్య

"సమస్తము స్వస్వరూపమే'' - అను నిశ్చల - అవిచ్ఛిన భావమును స్వాభావికంగా పొందుచున్నాడు.

---

ప్రారబ్ధ ప్రతిభాస నాశ పర్యంతం
చతుర్విధం స్వరూపం జ్ఞాత్వా,

దేహపతన పర్యంతం
స్వరూప అనుసంధానేన వసేత్।।

ఇక ఈ వర్తమైన దేహముతో సాంఘికము, సహజీవులతో పరస్పరము అయిన వ్యవహారమంతా ప్రతిభాసగా (సూర్య కిరణమునకు - ఆ కిరణము పడే వస్తువునకు గల సందర్భమాత్ర సంబంధముగా, దర్పణములోని ప్రతిబింబ మాత్రంగా, అంశవంటిదిగా) భావిస్తూ చతుర్విధ స్వరూపంగా (జాగ్రత్ స్వప్న సుషుప్తి తురీయ స్వరూపముగా) భావిస్తూ, సర్వకాల సర్వ అవస్థలయందు "కేవలము, సమస్తమునకు పరము'' అయినట్టి స్వస్వరూపముతో నిత్యానుసంధానము కలిగి ఉండు గాక.

---

**4.** త్రిషవణ స్నానం కుటీచకస్య।
బహూదకస్య ద్వివారం।

హంసస్య ఏకవారం।
పరమహంసస్య మానసిక స్నానం।

తురీయ అతీతస్య భస్మ స్నానం।
అవధూతస్య వాయువ్య స్నానం।

<u>స్నాన నియమములు :</u>

| | |
|---|---|
| కుటీచక యతికి | : 3 వేళల స్నానం |
| బహుదక యతికి | : రెండు పూటల స్నానం |
| హంసకు | : రోజుకు ఒక్కసారే |
| పరమహంసకు | : మానసిక స్నానము |
| తురీయాతీతునికి | : భస్మస్నానము |
| అవధూతకు | : వాయువ్య స్నానము |

చెప్పబడుతోంది.

## పుండ్రము (నుదుటి నామము)

| | | |
|---|---|---|
| ఊర్ధ్వపుండ్రం కుటీచకస్య। | కుటీచకునికి | : ఊర్ధ్వ పుండ్రము |
| త్రిపుండ్రం బహూదకస్య। | బహూదకునికి | : త్రి-పుండ్రము |
| ఊర్ధ్వపుండ్రం త్రిపుండ్రం హంసస్య। | హంసకు | : ఊర్ధ్వపుండ్రము గాని, త్రిపుండ్రము గాని |
| భస్మోద్ధూళనం పరమహంసస్య। | పరమహంసకు | : భస్మలేపనము (ముఖముపై భస్మము పూసుకోవటము) |
| తురీయ అతీతస్య తిలకపుండ్రం। | తురీయాతీతునికి | : తిలకముచే పుండ్రము చెప్పబడుతోంది |
| అవధూతస్య న కించిత్। | | |

## క్షౌరము గురించిన నియమము

| | | |
|---|---|---|
| తురీయాతీత అవధూతయోః ఋతు క్షౌరం। | తురీయాతీతునికి, అవధూతకు: | ప్రతి ఋతువులోను (రెండు నెలలకొకసారి) |
| కుటీచకస్యర్తు ద్వయ క్షౌరం। | కుటీచకునికి | : రెండు ఋతువులకు ఒకసారి (నాలుగు నెలలకు ఒకసారి) |
| హంసస్య పరమహంసస్య న క్షౌరం। అస్తిచేత్ అయన క్షౌరం। | హంస, పరమహంసలకు | : క్షౌరము లేదు. లేదా ఆయనకు ఉత్తర - దక్షిణ ఆయనములకు, ఆరు నెలలకు ఒకసారి) క్షౌర నియమముగా సూచించ బడుతోంది. |
| తురీయాతీత అవధూతయోః - న క్షౌరం। | తురీయాతీత అవధూతలకు క్షౌర నియమము లేదని కూడా చెప్పవచ్చు. | |

## భిక్షా నియమము

| | | |
|---|---|---|
| కుటీచకస్య ఏకాన్నం। | కుటీచకునికి | : ఒక ఇంటిలో అన్నము |
| మధూకరం బహూదకస్య। | బహూదకునికి | : మధూకరము (భిక్షచేసి అన్నము) |
| హంస పరమహంసయోః కరపాత్రం। | హంస, పరమహంసలకు | : కరపాత్రము (చేతిలో పట్టినంత భిక్ష) |
| తురీయ అతీతస్య గోముఖం। | తురీయాతీతునికి | : గోముఖ భిక్ష (వెళ్లిన చోట లభించినది) |
| అవధూతస్య అజగరవృత్తిః। | అవధూతకు | : అజగర వృత్తి (ఉన్నచోటే లభించునది) |

## శాటీ (దుప్పటి) వస్త్రము నియమము

| | | |
|---|---|---|
| శాటీద్వయం కుటీచకస్య। | కుటీచకునికి | : రెండు వస్త్రములు / శాటీలు |
| బహూదకస్య ఏకశాటీ। | బహూదకునికి | : ఒక వస్త్రము |
| హంసస్య ఖండం దిగంబరం పరమహంసస్య। | హంసకు | : వస్త్ర ఖండము (Piece of cloth) |
| | పరమహంసకు | : దిగంబరము |
| ఏక కౌపీనం వా తురీయ అతీత | తురీయాతీతునికి | : కౌపీనము (గోచి) |
| అవధూతయోః జాతరూపధరత్వం। | అవధూతకు | : జాతరూప ధరత్వము (దిగంబరము) చెప్పబడింది. |
| హంస పరమహంసయోః అజినం నత్వని ఏషామ్। | హంస, పరమహంసలు జింక చర్మము ధరించవచ్చును. | |

## అర్చన చేయు విధులు

| | | |
|---|---|---|
| 5. కుటీచక బహూదకయోః దేవ అర్చనం। | కుటీచక, బహూదకులకు : | దేవతార్చనము |
| హంస పరమహంసయోః మానస అర్చనం। | హంస, పరమహంసలకు : | మానసికార్చనము |
| తురీయ అతీత, అవధూతయోః - సోఽహం భావనా। | తురీయాతీత, పరమ హంసలకు : | సోఽహం (అఖండాత్మయే నేను) అనునవి అర్చన విధానములని చెప్పబడుచున్నాయి. |

| | **మంత్రజప, ధ్యాన అధికారములు** |
|---|---|
| **కుటీచక బహూదకయోః మంత్ర జప అధికారో।** | కుటీచక, బహూదకులు : మంత్రజపం నిర్వర్తించు అధికారముగలవారు. |
| **హంస పరమహంసయోః ధ్యాన అధికారః।** | హంస, పరమహంసలు : ధ్యానము చేయటానికి అధికారులు |
| **తురీయాతీత అవధూతయోః న తు అన్యాధికారః।** | తురీయాతీత, అవధూతలు : అనన్యమగు స్వస్వరూప ధారణకు అధికారులు. వీరికి స్వస్వరూప అనుసంధానమునకు అధికారము. |

| | **ఇతరులకు ఉపదేశించు అధికారము** |
|---|---|
| **కింతు తురీయాతీత అవధూతయోః మహా వాక్య ఉపదేశ అధికారః, పరమహంసస్య అపి।** | తురీయాతీతులకు, అవధూతలకు, పరమహంస యతీశ్వరులకు - ఇతరులకు "తత్త్వమ్" (అదియే నీవు) అను మహావాక్యార్థము బోధించటానికి అధికారము. |
| **కుటీచక బహూదక హంసానాం న అన్యస్య ఉపదేశ అధికారః।** | కుటీచక, బహూదక, హంసలకు - ఇతరులకు "సోఽహమ్" ఉపదేశమునకు అధికారము లేదు. |

| | **ప్రణవోపాసన విధులు** |
|---|---|
| **కుటీచక బహూదకయోః మానుష ప్రణవో।** | కుటీచక, బహూదకులకు : మానుష ప్రణవోపాసన. |
| **హంస పరమహంసయోః అంతర ప్రణవః।** | హంస-పరమహంసలకు : అంతర ప్రణవోపాసన |
| **తురీయ అతీత అవధూతయోః బ్రహ్మప్రణవః।** | తురీయాతీత-అవధూతలకు : బ్రహ్మ భావనయే ప్రణవము (బ్రహ్మప్రణవము) |

| | **శ్రవణ – మనన – ధ్యానములు** |
|---|---|
| **కుటీచక బహూదకయోః శ్రవణం।** | కుటీచక, బహూదకులకు : శ్రవణము |
| **హంస పరమహంసయోః మననం।** | హంస - పరమహంసలకు : మననము |
| **తురీయాతీత అవధూతయోః నిదిధ్యాసః।** | తురీయాతీత - అవధూతలకు : నిదిధ్యాసనము (వినటము-అనుకోవటము-అనిపించటము) |

**సర్వేషాం ఆత్మా అనుసంధానవిధిః ఇతి**
**ఏవం ముముక్షుః।**
**సర్వదా సంసార తారకం అనుస్మరన్।**
**జీవన్ముక్తో వసేత్ అధికార**
**విశేషేణ కైవల్య ప్రాప్తి ఉపాయం**
**అన్విష్యేత్ యతిః॥**

**ఏకవాక్యం :**

ముముక్షువులందరికీ కూడా "మనోబుద్ధి చిత్త అహంకారములకు ఆవలదగు ఆత్మయే నేను" అనునదే శాస్త్రములు చెప్పుచున్న ఏకైక విధి. అట్టి ఆత్మతో అనుసంధానమే ఈ జీవుని తరింపజేయు అసలైన అంతిమ ఉపాయం. అట్టి "ఆత్మతో మమేకత్వము" అనే తారకము అనుస్మరించబడు గాక. అట్టివాడు క్రమంగా జీవన్ముక్తుడు కాగలడు. అధికార విశేషమును అనుసరించి ప్రతి ఒక్కరు కూడా "కేవలమగు ఆత్మానుభవము" అనబడే కైవల్యమునకు యతి అయి అన్వేషించాలి. మోక్షమునకు ఉపాయములను ఆశ్రయించాలి.

**ఇత్యుపనిషత్ – నారద పరివ్రాజకోపనిషత్ – "సప్తమ ఉపదేశః"**

# అష్టమోపదేశః (8వ ఉపదేశము)
# తురీయము

| | |
|---|---|
| **1. అథ హైనం (అథ హ ఏనం) భగవంతం పరమేష్ఠినం నారదః పప్రచ్ఛ** | అప్పుడు నారద మహర్షి పరమేష్ఠి శ్రీ భగవానుని ఈ విధంగా అడిగారు. |
| **సంసార తారకం ప్రసన్నో బ్రూహి ఇతి।** | **నారద మహర్షి :** హే పరమేష్ఠీ। ఈ జీవుని 'సంసార'ము అనే జాడ్యము నుండి ఏది తరింపజేయగలదు ? అద్దాని గురించి మాపై ప్రసన్నులై విశదీకరించండి. |
| **తథా ఇతి।**<br>**పరమేష్ఠీ వక్తుమ్ ఉపచక్రమే।** | **బ్రహ్మ భగవానుడు :** ఓ నారద మహర్షీ, తదితర మునీంద్రులారా సరేఁ! అట్లాగే వివరిస్తాను. శ్రద్ధగా వినండి (ఉపక్రమిస్తున్నాను. శ్రవణం చేయండి) |

| | |
|---|---|
| **'ఓం' ఇతి। 'బ్రహ్మ' ఇతి। వ్యష్టి – సమిష్టి ప్రకారేణ।** | **బ్రహ్మ భగవానుడు :** 'బ్రహ్మము' అనే సర్వాత్మకము, సృష్టికి ఆది అగు ఒక తత్త్వము ఉన్నది. అది 'ఓం' అనే సంజ్ఞాక్షరముగా చెప్పబడుతోంది. అది వ్యష్టి - సమిష్టి చమత్కారము కలిగి ఉన్నది. |
| **కా వ్యష్టిః? కా సమష్టిః?** | **నారదుడు :** ఈ వ్యష్టి ఎవరు ? సమష్టి అనగా ఏమి ? ఆ రెండింటి పరస్పర సంబంధము ఏమిటి ? |
| **సంహార ప్రణవః సృష్టి ప్రణవః చ అంతర్బహిశ్చ ఉభయాత్మకత్వాత్ త్రి (3) విధో** | **బ్రహ్మ భగవానుడు :** ఆత్మయే ప్రణవము. అట్టి ప్రణవము మూడు విధములుగా ప్రదర్శనమౌతోంది.<br>1) సంహార ప్రణవము 2) సృష్టి ప్రణవము 3) అంతర బాహ్య ఉభయాత్మక ప్రణవము. |

| | |
|---|---|
| **బ్రహ్మ ప్రణవః అంతః ప్రణవో। వ్యావహారిక ప్రణవో। బాహ్యప్రణవ ఆర్ష ప్రణవ ఉభయ ఆత్మకో, విరాట్ ప్రణవః।** | ఇంకా కూడా అట్టి ప్రణవము 1) అంతఃప్రణవము, వ్యవహారిక ప్రవణవము, బాహ్య ప్రణవముగా ఉన్నది. ఉభయాత్మకమైనది. ఆర్షప్రణవము అదియే బాహ్యమున విరాట్ ప్రణవము. |
| **సంహార ప్రణవో బ్రహ్మ ప్రణవో అర్ధమాత్ర ప్రణవః। 'ఓం' ఇతి బ్రహ్మ।** | అందులో సంహార ప్రణవము, బ్రహ్మ ప్రణవము ఈ రెండు అర్ధ మాత్ర ప్రణవ స్వరూపములు. |
| **ఓం ఇతి ఏకాక్షర మంత్రః ప్రణవం విద్ధి।** | 'ఓం' అనగా బ్రహ్మమే. 'ఓం'ను "ఏకాక్షర మంత్ర ప్రణవము" అని గ్రహించబడు గాక. |

| | |
|---|---|
| **స చ అష్టధా భిద్యతే। 'అ' కార, 'ఉ' కారో, 'మ'కార అర్ధమాత్రా నాద బిందు కలా శక్తిః – చ ఇతి। తత్ర చత్వార 'అ'కారశ్చ ఆయుతా అవయవాన్వితః। 'ఉ'కారః సహస్ర అవయవాన్వితో। 'మ'కారః శత అవయవోపేతో। అర్ధమాత్రా ప్రణవో అనంత అవయవ ఆకారః।** | అట్టి ఏకము, అక్షరము అగు బ్రహ్మము '8' రకములుగా విభాగ ప్రదర్శనము నిర్వర్తిస్తోంది. 1) 'అ'కారము 2) 'ఉ'కారము 3) 'మ'కారము 4) అర్ధమాత్రము 5) నాదము 6) బిందువు 7) కల 8) శక్తి. 'అ'కారము పదివేల అవయవములు కలిగి ఉన్నది. ఉకారము వేయి అవయవములు కలిగి ఉన్నది. 'మ'కారము నూరు (100) అవయవములు, 'అర్ధమాత్ర'యో అనంతమైన అవయవ ఆకార సమన్వితము. |
| **సగుణో విరాట్ ప్రణవః। సంహారో।** | విరాట్ ప్రణవము - సగుణ బ్రహ్మము |
| **నిర్గుణ ప్రణవ। ఉభయ ఆత్మక ఉత్పత్తి** | సంహారము - నిర్గుణ బ్రహ్మము |
| **ప్రణవో। యథా ప్లుతో విరాట్ ప్లుతః।** | ఉభయాత్మకము - ఉత్పత్తి |
| **ప్లుతః సంహారః విరాట్ ప్రణవః** | అంతమేర ప్లుతముగా ఉన్నది - ప్లుతో (Al occupying) బ్రహ్మము |
| **షోడశ (16) మాత్రాత్మకః। షట్ త్రింశత్ (36) తత్త్వాతీతః।** | సర్వత్రా విస్తరించియున్న విరాట్ బ్రహ్మము షోడశ మాత్రాత్మకము. 36 తత్త్వములకు ఆవల తత్త్వాతీతమై పరబ్రహ్మము వెలయుచున్నది. |

**2.** <u>నారద మహర్షి:</u>
**షోడశ మాత్రాత్మకత్వం కథం ఇతి ఉచ్యతే?**
<u>**బ్రహ్మదేవ పరమేష్ఠి:**</u>
**'అ'కారః ప్రథమ।**
**'ఉ'కారో ద్వితీయో। 'మ'కారః తృతీయ।**
**"అర్ధమాత్రః" చతుర్థో। "నాదః" పంచమీ।**
**బిందుః షష్ఠీ। కలా సప్తమీ। కలాతీత అష్టమీ।**
**శాంతిః నవమీ। శాంతి అతీతా దశమీ।**
**ఉన్మని ఏకాదశీ। మనోన్మనీ ద్వాదశీ।**
**వైఖరీ (పురీ) త్రయోదశీ। మధ్యమా చతుర్దశీ।**
**పశ్యంతీ పంచదశీ। పరా షోడశీ।**

**పునః చతుః షష్టి (64) మాత్రా,**
**ప్రకృతి పురుష ద్వైవిధ్యం ఆసాది అష్టావింశతి (128)।**
**ఉత్తర శతభేద మాత్రా స్వరూపమ్ ఆసాద్య**
**స గుణ నిర్గుణత్వం ఉప ఏతి,**
**ఏకోఽపి 'బ్రహ్మప్రణవః'।**

**నారద మహర్షి :** "విరాట్ బ్రహ్మము షోడశ మాత్రాత్మకము (16 మాత్రలతో కూడినది)" అని అన్నారు కదా. అట్టి 16 మాత్రలు ఏవై ఉన్నాయో దయచేసి వివరించండి.

**పితామహ భగవానుడు :** వినండి 1) 'అ' కారము 2) 'ఉ'కారము 3) 'మ'కారము 4) అర్ధమాత్ర 5) నాదము 6) బిందువు 7) కలా 8) కలాతీతము 9) శాంతి 10) శాంతి అతీతము 11) ఉన్మని 12) మనోన్మనీ 13) వైఖరీ (పురీ) 14) మధ్యమా 15) పశ్యంతీ 16) పరా - ఇవి షోడశ (16) మాత్రలుగా వర్ణించి చెప్పబడుచున్నాయి. అది నీ ఆత్మయే. ఇవన్నీ స్థూల, సూక్ష్మ, బీజ, తురీయములలో 64 మాత్రలుగా (4×16) కలవు.

అది నీవే ! నీ యొక్క సహజ స్వస్వరూపమే.

ప్రకృతి - పురుషుడు వైవిధ్యముతో వేరుగా ఒక్కొక్క మాత్రకు రెండు విధములుగా (2×64) మాత్రలుగా

మొత్తము 128 భేదములతో నిండిన మాత్రా స్వరూపము పొంది సగుణ-నిర్గుణత్వము దాల్చుచున్నది. బ్రహ్మ ప్రణవము ఏకమే అయి కూడా, పై తత్త్వములన్నీ దాల్చుచున్నది.

---

**సర్వాధారః పరంజ్యోతిః ఏష సర్వ**
**ఈశ్వరో విదుః సర్వ దేవమయః**
**సర్వ ప్రపంచ ఆధార గర్భితః॥**

అట్టి బ్రహ్మప్రణము పరంజ్యోతి స్వరూపమై సమస్తమును వెలిగించుచున్నది. సమస్త ప్రపంచముగా విస్తరించి, సమస్తమునకు ఈశ్వర స్వరూపము అయి ఉంటోంది. సమస్తము తానే ఎరుక రూపంగా ఎరుగుచున్నది. సమస్త దేవతల తత్త్వములు తనవే అయి ఉన్నట్టిది. సమస్తమునకు ఆధారమై, సమస్తం తన గర్భమున కలిగి ఉన్నట్టిది.

---

**3.** **సర్వాక్షరమయః కాలః।**
**సర్వ ఆగమ మయః శివః।**
**సర్వ శ్రుతి ఉక్తమో మృగ్యః**
**సకల ఉపనిషత్ మయః।**

**భూతం భవ్యం భవిష్యత్ యత్**
**త్రికాల ఉదితం అవ్యయమ్,**
**తత్ అపి 'ఓం'కారం ఏవ అస్య**
**విద్ధి మోక్ష ప్రదాయకమ్॥**

'ఓం'కారాక్షర సంజ్ఞార్థమగు "బ్రహ్మము" (లేక) సమస్త జీవుల "పరస్వరూపము" ఎట్టిదో గ్రహించాలి. అట్టి స్వానుభవమే మహదాశయమగు గాక.

- ఏది సమస్త జీవుల అక్షర స్వరూపమో, కాలముచే క్షరము (Decay) పొందనిదో,
- సమస్తము యొక్క రాకపోకలు తనకు చెందినవే అయి ఉన్నదో,
- సర్వ శ్రుతులచే (వేదములచే) (మృగ్యమై) వెతకబడి - చెప్పబడినదో (ఉక్తము) అదియే పరబ్రహ్మము.

భూత వర్తమాన భవిష్యత్తులతో ఏది నిత్యోదితమై అవ్యయమై ఉన్నదో, అట్టి 'ఓం'కారమే మోక్షప్రదాయకమని గమనించబడు గాక.

---

**తదేవ ఆత్మానం ఇతి ఏతత్,**
**బ్రహ్మ శబ్దేన వర్ణితమ్।**
**తత్ ఏకం అమృతం అజరం**
**అనుభూయ తథ 'ఓం' ఇతి॥**

**స శరీరం సమ్ ఆరోప్య తన్మయత్వం తథ 'ఓం' ఇతి,**
**త్రి శరీరం స్వమ్ ఆత్మానం పరంబ్రహ్మ వినిశ్చిను।**

అట్టి 'ఓం'కార అక్షరమే 'ఆత్మ' శబ్దముతోను, 'బ్రహ్మము' అని కూడా వర్ణించబడుతోంది. అట్టి (ఈ జీవుని సహజస్వరూపమగు) ఆత్మ - సర్వదా ఏకము, జరామరణరహితముగా 'ఓం' శబ్దార్థమై అనుభూతము అవగలదు. సహజమగు స్వస్వరూపమే అని తెలియబడగలదు.

"ఆత్మకు స్థూల - సూక్ష్మ - కారణ శరీరములు ఆరోపితములు మాత్రమే" అని గ్రహించి మూడు శరీరములకు (దేహములకు), ఆత్మయే 'దేహి', అట్టి 'దేహి'యే పరబ్రహ్మమని వినిశ్చయము కలిగి ఉండెదరు గాక.

| | |
|---|---|
| పరంబ్రహ్మ అనుసందధ్యాత్<br>విశ్వాదీనాం క్రమః క్రమాత్<br>స్థూలత్వాత్ స్థూల భుక్త్వాత్ చ<br>సూక్ష్మత్వాత్ సూక్ష్మ భుక్ పరమ్। | జాగ్రత్ పురుషుడగు విశ్వునకు, స్వప్న పురుషుడగు తేజసునకు, సుషుప్తి పురుషుడగు ప్రాజ్ఞునకు ఆవల గల పరమ పురుషుడు (లేక) పరం బ్రహ్మమును గమనించి అనుసంధానము సిద్ధించుకొనెదరు గాక. అట్టి పరబ్రహ్మమే తన యొక్క స్థూల విశేషముచే స్థూలమును, సూక్ష్మ విశేషముచే సూక్ష్మమును స్వయం కల్పితంగా ఆస్వాదించుచు, సమస్తమునకు 'పరము' (Beyond) అయి ఉన్నది. |
| ఐక్యత్వ ఆనంద భోగాత్ చ<br>సో అయమ్ ఆత్మా చతుర్విధః। | ఈ రీతిగా ఆత్మయే జాగ్రత్-స్వప్న-సుషుప్తి-తురీయములనే 4 విధముల దశలకు ఆధారమై ఏకస్వరూపముతో ఆనంద భోగము ఆస్వాదిస్తోంది. |
| చతుష్పాత్ జాగరితః స్థూలః<br>స్థూల ప్రజ్ఞో హి విశ్వభుక్। | ఆత్మ తన యొక్క నాలుగు పాదములలో ఒకటైన జాగ్రత్‌నందు స్థూలము గురించిన ఎరుక గలవాడై "విశ్వభుక్" విశ్వమును ఆస్వాదించువాడు అగుచున్నాడు. |
| **4.** ఏకోనవింశతి ముఖః<br>సాష్టాంగః సర్వగః ప్రభుః।<br>స్థూల భుక్ చతురాత్మా (4)<br>అథ విశ్వో వైశ్వానరః పుమాన్।<br><br>విశ్వజిత్ ప్రథమః పాదః<br>స్వప్న స్థానగతః ప్రభుః।<br>సూక్ష్మ ప్రజ్ఞః స్వతః అష్ట అంగ,<br>ఏకో న అన్యః పరంతప।<br><br>సూక్ష్మ భుక్ చతురాత్మ అథ తైజసో భూతః ఆదయమ్।<br>హిరణ్యగర్భః స్థూలో అంతః ద్వితీయః పాద ఉచ్యతే। | ఆత్మ పురుషుడగు వైశ్వానరాత్మకుడు 19 ముఖములు, 8 అంగములు కలిగి సర్వగతుడై ఉన్నారు.<br><br>అట్టి స్థూలభుక్ (స్థూలభోక్త) అగు వైశ్వానర పురుషుడు చతురాత్మ అయి వెలయచున్నారు.<br><br>**1) జాగ్రత్ :** ఆత్మ పురుషుని యొక్క మొదటి పాదము విశ్వజిత్ (విశ్వుడు), ఆత్మ యొక్క స్వప్న స్థానగతమై (ఆత్మకు కలవంటిదై) ఉన్నది. ఆత్మయే అష్టాంగములు ప్రదర్శిస్తూ ఏకమే అయి ఉన్నది. అన్నీ తానై, అనన్యమై వాటినన్నిటినీ తపింపజేయుచున్నది (స్థూలభుక్).<br><br>**2) స్వప్నము :** ఆత్మయే సూక్ష్మ భుక్ (సూక్ష్మానుభావి) భూత విరాట్ అయి, స్థూలము గర్భముగా ధరించినదై ఉన్నది. ఈ స్వప్న - తైజస పురుషాకారము ఆత్మ యొక్క రెండవ పాదము. |
| కామం కామయతే యావత్<br>అత్ర సుప్తో న కంచన,<br>స్వప్నం పశ్యతి న ఏవ అత్ర<br>తత్ 'సుషుప్తం' ఇతి స్ఫుటమ్।<br><br>ఏకీభూతః సుషుప్తస్థః<br>ప్రజ్ఞానఘనవాన్ సుఖీ।<br><br>నిత్య ఆనందమయో అపి ఆత్మా<br>సర్వ జీవ అంతర స్థితః।<br><br>తథా అపి ఆనంద భుక్<br>చేతో ముఖః సర్వగతో 'అవ్యయః'।<br><br>చతురాత్మా, ఈశ్వరః ప్రాజ్ఞః<br>తృతీయః పాద సంజ్ఞితః। | **3) సుషుప్తి :** ఆత్మ పురుషుని మూడవ పాదము ఈ సుషుప్తి (విషయరహిత) పురుషాకారము. అట్టి సుషుప్తి పురుషాకార విన్యాసము సందర్భము ఎట్టిది ?<br><br>- కించిత్ కూడా దృశ్య సంబంధమైన కోరికలు కోరటము ఉండదు (జాగ్రత్ అనుభవము ఉండదు).<br><br>- ఊహ నిర్మితమైన స్వప్నము కూడా దర్శించబడదు. సుషుప్త పురుషాకారము ప్రదర్శిస్తూ ఉన్న ఆత్మ - సుషుప్తమునందు ఉన్నదై, అనేకమంతా త్యజించి, 'ఏకీభూతము'అయి ఉంటుంది. కేవలమగు ప్రజ్ఞ (విషయరహితమగు తెలివి) మాత్రమే కలిగి ఉన్నది. ప్రజ్ఞానఘన (ఘనీభూతమైన ప్రజ్ఞ) సుఖము ఆస్వాదిస్తున్నది.<br><br>ఈ సుషుప్తి పురుషాకారుడు నిత్యానందమయుడై సమస్త జీవుల అంతరమున స్థితి కలిగి ఉన్నాడు.<br><br>'4' పాదములతో, 4 ముఖములతో సుషుప్తి పురుషుడు సర్వగతుడై (సమస్త స్వానుభవములయందు విస్తరించినవాడై) అవ్యయుడై (మార్పు-చేర్పులు లేనివాడై) నిర్విషయ ఏకాంతానందమును అనుభవించుచున్నాడు. చతురాత్మ స్వరూపుడై, జాగ్రత్ స్వప్నములలో తన 'అనుభవము' అనే విన్యాసమును విస్తరించు ఈశ్వర స్వరూపుడై, ఆత్మ పురుషుని మూడవ పాదముగా వెలుగొందుచున్నాడు. |

**ఏష సర్వేశ్వరః చ ఏష సర్వజ్ఞః సూక్ష్మ భావనః।**
**ఏషో అంతర్యాం। ఏష యోనిః।**
**సర్వస్య ప్రభవ అపి అయౌ॥**

అట్టి ప్రాజ్ఞ పురుషుడే సమస్తమునకు ఈశ్వరుడు, సర్వేశ్వరుడు. జాగ్రత్-స్వప్నములకు యజమాని. సమస్తము (జాగ్రత్ స్వప్నముల స్వభావమంతా) ఎరిగి ఉన్నవాడు. సర్వజ్ఞుడు. సమస్త భావముల సూక్ష్మ స్వరూపుడు. తన సూక్ష్మత్వము నుండి సర్వభావనలు ప్రదర్శించువాడు. ఈ సుషుప్త పురుషుడే సమస్త జీవుల 'అంతర్యామి'. ఆ రెండిటి జనన స్థానమగు యోని. అట్టి ఆత్మయే సర్వజీవుల ప్రభవ (జనన) స్థానము. మరియు, లయ స్థానము.

---

**5.** **భూతానాం త్రయం అపి ఏతత్**
**సర్వోపరమ బాధకమ్।**

**4) తురీయం :** జాగ్రత్ స్వప్న సుషుప్తులు ఒకదానికి మరిఒకటి బాధకములు (ఒకటి రెండవ దానిని తొలగించునవి) అయి ఉంటున్నాయి.

**తత్ సుషుప్తం హి యత్ స్వప్నం।**
**మాయా మాత్రం ప్రకీర్తితమ్॥**

**చతుర్థః చతురాత్మా అపి**
**సత్ చిత్ ఏకరసో అవ్యయమ్।**

**తురీయా వసితత్వాత్ చ ఏకైకత్వ అనుసారతః**
**జ్ఞాత అనుజ్ఞాత్ర సుజ్ఞత్వాత్ వికల్ప జ్ఞానసాధనమ్।**

ఏ జాగ్రత్ నుండి స్వప్న సుషుప్తులు అనుభవమగుచున్నాయో, అవన్నీ కూడా మాయా మాత్రము (కల్పిత మాత్రము). అవి దేనికి చెందినవై ప్రవర్తిస్తున్నాయో, అదియే 4వదగు తురీయము. అట్టి తురీయము సత్ (ఉనికి), చిత్ (ఎరుక)ల ఏకరస స్వరూపము. త్రి అవస్థల ఏక రససారము. జాగ్రత్-స్వప్న-సుషుప్తి త్రిఅవస్థలలో కూడా 1) జ్ఞాత (తెలుసుకొనువాడు) 2) అనుజ్ఞాత్ర (తెలుసుకొనువానిని తెలుసుకొనువాడు) 3) సుజ్ఞాత (విచక్షణా జ్ఞాని) అనే మూడు వికల్పములు ఏర్పడినవై ఉంటున్నాయి. సుజ్ఞానము జ్ఞాన సాధనము అగుచున్నది.

---

**వికల్ప త్రయం అత్ర అపి**
**సుషుప్తం స్వప్నమ్ అంతరమ్।**
**మాయామాత్రం విదిత్వ ఏవం**
**సత్ – చిత్ ఏకరసో హి అయమ్।**

ఈ విధంగా జాగ్రత్, స్వప్నములు ఆత్మ యొక్క వికల్పములే. అవి సుషుప్తిలో ఏకత్వము పొందుచున్నాయి. అవన్నీ మాయా మాత్రమేనని గమనించబడు గాక. అట్టి జాగ్రత్-స్వప్న-సుషుప్తులు తనవైయున్న తురీయమో? **సత్‌చిత్ ఏక స్వరూపమైయున్నది.**

**విభక్తో హి అయం ఆదేశో**
**న స్థూల ప్రజ్ఞం అన్వహమ్।**
**న సూక్ష్మ ప్రజ్ఞం అత్యంతం న।**
**ప్రజ్ఞం న క్వచిత్, మునే।**

ఓ మునీశ్వరా! తురీయమై జాగ్రత్ - స్వప్న-సుషుప్తులుగా ప్రదర్శనమగుచూ ఉన్నప్పటికీ, తురీయము సర్వదా యథాతథము. అట్టి తురీయము - జాగ్రత్‌లోని 'స్థూలప్రజ్ఞ' కాదు. స్వప్నములోని 'సూక్ష్మప్రజ్ఞ' కాదు. సుషుప్తిలోని **అత్యంత (కేవల) ప్రజ్ఞ** కూడా కాదు.

**న ఏవ అప్రజ్ఞం। న ఉభయతః ప్రజ్ఞం।**
**న ప్రజ్ఞం అంతరమ్।**

తురీయము అప్రజ్ఞ కూడా కాదు. ప్రజ్ఞ-అప్రజ్ఞల రూపము కాదు. ప్రజ్ఞ అద్దానికి వేరైనదీ కాదు.

**న అప్రజ్ఞం అపి ప్రజ్ఞానఘనం చ అదృష్టం ఏవ చ।**

తురీయరూపమగు ఆత్మ - అప్రజ్ఞ అయినప్పటికీ, అదృష్టమగు ప్రజ్ఞాన ఘనీభూత రూపము ఆత్మ రూపమే.

---

**తత్ అలక్షణం అగ్రాహ్యం అవ్యవహార్యం అచింత్యం।**

ఆత్మ లక్షణములన్నిటికీ విలక్షణము. లక్షణరహితము (Qualities cannot be attributed). ఎట్టి వ్యవహారములకు విషయము కాదు. చింతనకు విషయము కాదు.

**అవ్యపదేశ్యం। ఏకాత్మ ప్రత్యయసారం।**
**ప్రపంచ ఉపశమం। శివం। శాంతం। అద్వైతం।**

ఉపదేశించగలిగినది కాదు. అనేక ఆత్మలుగా కనిపిస్తూ ఈ సమస్తములో ఏకాత్మకమై ఉన్నది. శబ్దములతో చెప్పబడజాలదు. కేవలాత్మసారము అవటం చేత 'ప్రత్యయసారము'. ప్రపంచమంతా జనించి, చరించి, లయించు స్వస్వరూప స్థానము. సుఖప్రదమగు శివస్వరూపము. పరమ శాంతరూపము. జీవాత్మ-జగత్తులకు ద్వితీయము కాదు, కాబట్టి అద్వితీయము.

| | |
|---|---|
| **చతుర్థం మన్యంతే।**<br>**స బ్రహ్మప్రణవః।**<br>**స విజ్ఞేయో – న అపరః తురీయః।**<br>**సర్వత్ర భానువత్।**<br>**ముముక్షాణాం ఆధారః।** | జాగ్రత్ స్వప్న సుషుప్తులకు ఆవలిది కాబట్టి చతుర్థము (4వది) అనబడుతోంది. అట్టి ప్రతి ఒక్కరి యొక్క స్వస్వరూపమే బ్రహ్మ ప్రణవము.<br><br>అట్టి తురీయమగు ఆత్మ గురించి **"తురీయమునకు వేరుగా, ఎక్కడా–ఏదీ లేదు"** అని తెలుసుకోబడుగాక. అదియే సర్వత్రా సూర్యకాంతివలె ప్రకాశమానమై ఉన్నది. అట్టి తురీయాత్మయే ముముక్షువులందరికి ఆధారమై ఉన్నట్టిది. |
| **స్వయం జ్యోతిః బ్రహ్మ ఆకాశః**<br>**సర్వదా విరాజతే "పరంబ్రహ్మత్వాత్"।** | అట్టి తురీయము పరబ్రహ్మమే స్వాభావిక-సహజ స్వరూపమై యున్నది. బ్రహ్మాకాశమున ఆకాశంలో సూర్యునివలె విరాజమానమై ఉన్నది. |

**ఇత్యుపనిషత్ – నారద పరివ్రాజకోపనిషత్ – "అష్టమ ఉపదేశః"**

## నవమోపదేశః (9వ ఉపదేశము)
## ఆత్మ యొక్క మహిమ

| | |
|---|---|
| **1.** అథ పరబ్రహ్మ స్వరూపం కథం ఇతి?<br>నారదః పప్రచ్ఛ।<br><br><u>తగ్ం హ ఉవాచ పితామహః :</u><br>కిం (పర) బ్రహ్మ స్వరూపం ఇతి<br>"అన్యో అసావన్యో అహం అస్మి" ఇతి–యే విదుః,<br>తే పశవో। న స్వభావ పశవః<br>తం ఏవం జ్ఞాత్వా విద్వాన్ మృత్యు ముఖాత్ ప్రముచ్యతే।<br><br>న అన్యః పంథా విద్యతే అయనాయ। | **నారద మహర్షి :** మహాత్మా, పితామహదేవ, పరబ్రహ్మస్వరూపము ఎట్టిదై ఉన్నది ? అది ఉన్నదెక్కడ ?<br><br>**పితామహుడు (బ్రహ్మ భగవానుడు) :** ఓ నారద ! పరబ్రహ్మము గురించి ఎట్టిదో తెలుసుకోవాలి. అది ఎప్పుడో ఎక్కడో ఉన్నట్టిది అని ఎంత తలుస్తాడో, అట్టివాడు పశువుతో సమానుడే. నా యొక్క భావించువాని రూపమే పరబ్రహ్మము అని ఎరుగుటచే ఇక ఆతడు పశువు అయి ఉండడు.<br><br>సమస్తమునకు పరమై, జాగ్రత్ స్వప్న సుషుప్తులకు కూడా "సాక్షి" "స్థానము" అయి ఉన్న ఆత్మ గురించి తెలుసుకున్నవాడు జన్మ - మరణ పరిధుల నుండి విముక్తి పొందుచున్నాడు. 'ముక్తి' లేక 'మోక్షము'నకు ఆత్మజ్ఞానము తప్పితే వేరు త్రోవయే లేదు. |
| కాలః, స్వభావో నియతిః,<br>యదృచ్ఛా, భూతాని, యోనిః,<br>'పురుష' ఇతి చింత్యమ్।<br><br>సంయోగ ఏషాం న తు ఆత్మభావాత్।<br>ఆత్మా హి అనీశః సుఖ దుఃఖ హేతోః। | ఆత్మ యొక్క 'భావన'యే ఈ జగత్తు అనబడు దానికి కారణము. అఖండము, నిత్యము, అప్రమేయము అగు ఆత్మయే తన కల్పనయందు 'జగత్తు' అనబడేది కల్పించుకొంటోంది. అంతేగాని, **ఈ జగత్తుకు కారణము కాలముగాని, స్వభావముగాని, నియతి గాని, యాదృచ్ఛము** (Accidental) **గాని, పంచభూతములుగాని, స్త్రీ గర్భముగాని, పురుషుడు గాని, స్త్రీ-పురుషుల సంయోగముగాని కాదు. స్త్రీ-పురుషులు ఈ జగత్తును నియమించటము లేదు. ఆత్మయే సుఖదుఃఖములకు హేతువు** (One's own Self is the main cause by virtue of its attributions). |
| తే ధ్యాన యోగా అనుగతా అపశ్యన్<br>దేవ ఆత్మ శక్తిం స్వ గుణైః నిగూఢామ్। | "దివ్యమగు ఆత్మశక్తి యొక్క విశేష రహస్య రూపమగు స్వకీయ గుణముల నుండి ఈ 'జగత్తు' ఏర్పడినదై ఉంటోంది''. అను రూపముగల ఆత్మ యొక్క ఔన్నత్యమును ధ్యానయోగము చేతనే మహనీయులచే దర్శించబడుతోంది. |

**యః కారణాని నిఖిలాని,**
**తాని కాలాత్మ యుక్తాని అధి తిష్ఠతి।**
**ఏకః తం ఏకస్మిన్ త్రి వృతం, షోడశ అంతం,**
**శత అర్థారం వింశతి ప్రత్యరాభిః,**

బ్రహ్మము యొక్క (ఆత్మ యొక్క) త్రిగుణాత్మక శక్తియే సమస్తమునకు కారణము. కాలము కూడా కాలాత్మశక్తి నుండియే ప్రదర్శనమౌతోంది. ఏకమగు ఆత్మ శక్తి నుండి ఏకత్వము వీడకనే బండి చక్రములోని ఆకులవలె త్రివృతములు ఏర్పడుచున్నాయి.

**అష్టకైః షడ్భిః విశ్వరూప ఏకపాశం**
**త్రిమార్గ భేదం ద్వి నిమిత్త ఏక మోహమ్।**

త్రిగుణములు, 16 వికారములు '50' భేదరూపములగు ఆకులు, వాటిని పోషించు '20' కీలకములు, అష్ట (8) విశేషములతో కూడిన విశ్వరూపము, వాటినన్నిటినీ కలుపుచున్న ఏకపాశము, త్రిమార్గ భేదముల నిమిత్త కారణములు. రెండు నిమిత్త - ఉపాదానములు ఏకమోహము (సృష్టి అనే బండి చక్రము) కలిగి ఉన్నది. **(కారణ బ్రహ్మ చక్రములో పంచ (5) భూతములు, దశ (10) ఇంద్రియములు, అంతఃకరణము, ఆరు (6) అష్టకములు ఉన్నాయి).**

---

**2. పంచస్రోతో అంబుం పంచయోని**
**ఉగ్ర వక్రాం, పంచ ప్రాణ ఊర్మిం,**
**పంచబుద్ధి ఆది మూలామ్, పంచ ఆవర్తాం**
**పంచ దుఃఖౌఘ వేగాం పంచాశత్**
**భేదాం పంచ పర్వామధీమః।**

***ఈ సంసారము అనే సాగరము (లేక) నదీజలము***

- ఉగ్రమైన మెలికలు గల పంచయోనులు (శబ్ద స్పర్శ రూప రస గంధములనే పంచతన్మాత్రలు).
- పంచప్రాణములనే అలలు.
- పంచబుద్ధి మూలములు - పంచ జ్ఞానేంద్రియములు (చెవులు, చర్మము, కళ్లు, నాలుక, ముక్కు)
- పంచ విషయములనే ఆవర్తములు (సుడి గుండములు).
- పంచ దుఃఖములు అనే ప్రవాహ వేగములు కలది.
- 50 భేదములు కలది.
- పంచ క్లేశములతో మధ్య భాగము కలది.

- అయి ఉంటోంది.

**సర్వాజీవే సర్వ సంస్థే బృహంతే**
**తస్మిన్ హంసః భ్రామ్యతే బ్రహ్మచక్రే**

ఈ జీవుడు తనను అఖండాత్మ నుండి వేరు అయినట్లు భావిస్తూ సర్వుల జీవరూపము, సర్వమునకు జనన లయస్థానము, సువిశాలము అగు బ్రహ్మచక్రమునందు భ్రమలతో కూడి తిరుగాడుచున్నాడు. జనన-మరణ చక్రములో చిక్కి తిరుగాడుచున్నాడు.

---

**పృథక్ ఆత్మానం ప్రేరితారం చ మత్వా**
**జుష్టః తతః, తేన అమృతత్వం ఏతి।**

ఎప్పుడైతే ఈ జీవుడు "ఈ సమస్తమునకు వేరై (పరమై) యున్న ప్రేరణ రూపమగు అఖండాత్మను" అని ఎరుగుచున్నాడో అప్పుడిక అమృతత్వము సిద్ధించుకుంటున్నాడు.

**ఉద్గీథం ఏతత్ పరమం తు బ్రహ్మ**
**తస్మిన్ త్రయం స్వ ప్రతిష్ఠ అక్షరం చ,**

**అత్ర అంతరం వేదవిదో విదిత్వా**
**లీనా బ్రహ్మణి పరే తత్ పరాయణాః॥**

అట్టి ఉద్గీథము (ప్రణవ) అక్షర పరబ్రహ్మమును తెలుసుకోవాలి. త్రి-మహావాక్యములు 1) సర్వం ఖలు ఇదం బ్రహ్మ. ఈ జగత్తుగా కనిపిస్తున్నది బ్రహ్మమే 2) తత్త్వమ్ - అదే నీవు అను రూపంగా కనిపిస్తున్నది. తత్ బ్రహ్మమే 3) సోఽహమ్ - నేను సర్వదా ఆ బ్రహ్మమే అయి ఉన్నాను. మహా వాక్యములను ఉపాసించాలి. ముముక్షువు ఆ అక్షరమునందు స్వయముగా ప్రతిష్ఠితుడగుచున్నాడు. వేదవిదుని (తెలియబడేదానిని తెలుసుకొంటున్న అతనిని) తెలుసుకొని ఉపాసించి బ్రహ్మమమునందు లీనమగుచున్నాడు.

| | |
|---|---|
| **3. సంయుక్తం ఏతత్ క్షరం, అక్షరం చ వ్యక్త, అవ్యక్తం భరతే విశ్వం ఈశః,** | **జీవ - ఈశ్వర సమాగమము (పొందిక)**<br>1) జీవుడు 2) ఈశ్వరుడు. ఈ రెండింటి యొక్క కలయిక ఇక్కడే ఏర్పడి ఉంటోంది.<br>1) క్షరము (నశించు / మార్పు చెందు స్వభావము గల జీవుడు).<br>2) అక్షరము (సర్వదా యథాతథమై నశించని స్వభావము గల **ఈశ్వరుడు**. మరియు<br>1) వ్యక్తీకరణము అయిన **జీవుడు,**<br>2) వ్యక్తీకరణమునకు ఆధారమైయుండి, తాను వ్యక్తీకరణముకాని అవ్యక్తుడగు **ఈశ్వరుడు.** |
| **అనీశః చ ఆత్మా బధ్యతే భోక్తృభావాత్ జ్ఞాత్వాత్ ఏవం ముచ్యతే సర్వపాశైః॥** | జీవుడు భోక్తృభావముతో బద్ధుడై ఉంటున్నాడు. ఈశ్వరుడో? దేనికీ బద్ధుడుకాక, నిత్యముక్తుడై ఉంటున్నాడు. అట్టి అనీశ్వర - ఈశ్వర కలయిక తానే అనే చమత్కారమును ఎరిగినవాడు, సమస్త సంసార దోషముల నుండి విముక్తుడు కాగలడు. |
| **జ్ఞ - అజ్ఞౌ ద్వౌః అజౌ ఈశ అనీశౌ అజా హి ఏకా భోక్తృ-భోగార్థ యుక్తా** | **ఈశ్వరుడు** సర్వజ్ఞుడు (ఈ దేహములు వాటి రాకపోకలు, సంగతి సందర్భములు ఎరిగియున్నవాడు), సందర్భములకు ఆవలివాడు.<br>**అనీశ్వరుడు (జీవుడు)** : కించిజ్ఞుడు, వర్తమాన ఉపాధికి మాత్రమే తన ఎరుక (knowing) ను పరిమితము చేసుకొన్నవాడు. సందర్భములకు పరిమితుడు. |
| **అనంతశ్చ ఆత్మా విశ్వరూపో హి అకర్తా, త్రయం యదా విందతే బ్రహ్మం ఏతత్॥** | జంట అగు ఈ ఇరువురు జన్మరహితులే. జన్మరహితులై భోక్తృత్వ భోగార్థయుక్తులై ఉంటున్నారు. ఇక ఆత్మయో? అనంతమై, ఈ సమస్త విశ్వము తన రూపమై దేనికీ కర్త కాక, 'అకర్త' అయి వెలుగొందుచున్నది.<br>అట్టి 1) కర్త - ఈశ్వరుడు 2) భోక్త - జీవుడు 3) అకర్త - ఆత్మ. ఈ మూడింటి విభాగము తనయందు ఎరిగినవాడు బ్రహ్మమే తానగుచున్నాడు. |
| **క్షరం, ప్రధానం అమృత అక్షరం హరః క్షరాత్మనావ ఈశతేత్ ఏవ ఏకః॥** | ఇక్కడ కనబడేదంతా క్షరము (దృశ్యము). మరి ఆవలివాడు? అమృతుడు, అక్షరుడు. హరుడు. క్షరమును హరించువాడు. అట్టి అక్షరుడగు శివుడే క్షరమగు సమస్తముగా విస్తరించి ఈశ్వరుడుగా ఉన్నారు. |
| **తత్ అభి ధ్యానాత్ యో జనాత్ తత్త్వ భావాత్, భూయః చ అంతే విశ్వమాయా నివృత్తిః॥** | ఏ జనుడైతే "నాకు కనబడేదంతా పరమాత్మ స్వరూపమే" అను తత్త్వభావమును ఉపాసిస్తాడో, అట్టివాడు ఈ సమస్తమునకు కారణమగు పరమాత్మకు చెందిన 'విశ్వమాయ' నుండి విముక్తుడు అగుచున్నాడు. |
| **జ్ఞాత్వాత్ ఏవం ముచ్యతే సర్వ పాశైః క్షీణైః క్లేశైః జన్మ మృత్యు ప్రహాణిః॥** | ఈ విధంగా "i) 1) క్షరము 2) అక్షరము 3) కేవలము ii) 1) వ్యక్తము 2) అవ్యక్తము 3) సాక్షి iii) 1) కర్త 2) భోక్త 3) అకర్త ఆత్మ ప్రకాశము iv) 1) జగత్తు 2) అనుభవి 3) సర్వాత్మకుడు, ఈ త్రయీ విశేషములన్నీ కూడా పరమాత్మను, అవ్యయుడను ఏకస్వరూపుడను అగు నేనే" అని తెలుసుకొని ఈ జీవుడు సమస్త పాశముల నుండి వృద్ధి - క్షీణ, జన్మ-మృత్యు ప్రహారముల నుండి విడివడగలడు. సర్వక్లేశములు (All worries) జయించివేయగలడు. |

| | | |
|---|---|---|
| | **తస్య అభిధ్యానాత్ తృతీయం**<br>**దేహ భేదే విశ్వ ఐశ్వర్యం ఆత్మకామః॥** | అట్టి ఆత్మకాముడు జీవ-ఈశ్వర ద్వంద్వములకు ఆవలది, మూడవది అగు స్వస్వరూపమును, దేహమునకు ఆవలది అగు 'దేహి' స్వరూపముగా ఎరిగి ఈ విశ్వమంతా తన 'ఐశ్వర్యము'గా ఆస్వాదించుచున్నాడు. |
| **4.** | **ఏతత్ జ్ఞేయం నిత్యం ఏవ ఆత్మసంస్థం,**<br>**న అతః పరం వేదితవ్యం హి కించిత్।** | అట్టి సమస్త జీవుల స్వస్వరూపాత్మయే అయి ఉన్న పరబ్రహ్మ తత్త్వము యొక్క నిత్యత్వమును ఎరిగి, మనోబుద్ధులను అట్టి నిత్యాత్మయందు నిలుపువానికి ఇక అంతకుమించి ఎరుగవలసినది ఏదీ కొంచము కూడా శేషించదు (మిగలదు). |
| | **భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా**<br>**సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మం ఏతత్।** | 1) భోక్త అగు జీవుడు 2) భోగించబడు వస్తువు (భోగ్యము) 3) ప్రేరకుడు అగు ఈశ్వరుడు ఈ మూడు రూపములుగాను, ఈ విశ్వము రూపముగాను ఉన్న బ్రహ్మమే మనమంతా తెలుసుకోవలసినది, మమేకమవలసినది కూడా సుమా. |
| | **ఆత్మ విద్యా తపోమూలం**<br>**తత్ బ్రహ్మ ఉపనిషత్ పరమ్।** | తపస్సు చేతనే "తత్ పదము" అగు బ్రహ్మము యొక్క సామీప్యత పొందుట అనే ఆత్మవిద్య లభిస్తోంది. |
| | **య ఏవం విదిత్వా, 'స్వరూపం'**<br>**ఏవం అనుచింతయన్।**<br>**తత్ర కో మోహః? కః శోకః?**<br>**ఏకత్వం అనుపశ్యతః॥** | ఎవ్వడైతే ఆత్మ గురించి తెలుసుకొని ఆత్మ యొక్క స్వరూపమును ఎల్లప్పుడు చింతన చేస్తూ ఉంటాడో, అట్టి వానిని ఏది మోహింపజేయగలదు ? ఏది దుఃఖము కలిగించగలదు ? అట్టి వాడు సర్వదా సర్వత్రా ఏకత్వము, మమేకత్వము దర్శించి ఆస్వాదించగలడు. **ఏకత్వం అనుపశ్యతః.** |
| | **తస్మాత్ విరాట్ భూతం భవ్యం భవిష్యత్ భవతి**<br>**అనశ్వర స్వరూపమ్।** | ఆ ఆత్మ భగవానుడే - భూత, వర్తమాన, భవిష్యత్ (In the Past, Present and Future) త్రికాలములలో (అనశ్వర స్వరూపంతో సహా) సమస్తము అయి ఉంటున్నారు. |
| | **అణోః అణీయాన్,**<br>**మహతో మహీయాన్,**<br>**ఆత్మస్య జంతోః నిహితో గుహాయామ్** | ప్రతి ఒక్క జీవుని సహజ - స్వస్వరూపమే అయి ఉన్న ఆత్మ ఎట్టిదని చెప్పుకోగలం ?<br>- అణువుకంటే ఎంతో సూక్ష్మము.<br>- మహత్తరమై పెద్ద (స్థూల) వస్తువుల కంటే కూడా మహత్తరమైనది (పెద్దది).<br>అట్టి ఆత్మ సమస్త జీవుల హృదయగుహలలో వేంచేసినదై ఉన్నది. |
| | **తం అక్రతుః పశ్యతి వీతశోకో ధాతుః**<br>**ప్రసాదాత్ మహిమానం ఈశమ్।** | అట్టి ఆత్మేశ్వరుని స్వరూపము బంధరహితమై ఉన్నది. ఎవ్వడు బుద్ధిని శోకరహితంగా (Desireless for anything external) దైవీ సంపత్తితో పవిత్రము చేసుకుంటాడో అట్టివాడు ఆత్మయొక్క మహిమను (ఔన్నత్యమును), సమస్తముగా ఈశ్వరత్వమును తనయందే దర్శించగలడు. దర్శించి శోకరహితుడు కాగలడు. |
| | **అపాణిపాదో జవనో గ్రహీతా।**<br>**పశ్యతి అచక్షుః।**<br>**సశృణోతి అకర్ణః।** | అట్టి ఆత్మకు చేతులు, కాళ్లు లేవు. కానీ సర్వమును గ్రహిస్తున్నది. ఆత్మ కళ్లు లేకుండానే సమస్తమును దర్శించుచున్నది. చెవులు లేవు గాని, సమస్తము ఆత్మయే వినుచున్నది. |
| | **స వేత్తి వేద్యం। న చ తస్య అస్తి।**<br>**వేత్తా తం ఆహుః**<br>**అగ్ర్యం పురుషం మహాంతమ్॥** | అట్టి ఆత్మను తెలుసుకొనువాడు మరొకడు ఎవ్వడు లేడు. ఎందుకంటే ఆ తెలుసుకొనుచున్న వాడు ఆత్మస్వరూపుడే కాబట్టి. అట్టి ఆత్మను తెలుసుకొన్న ఆత్మవేత్తలు (ఆత్మతత్త్వ జ్ఞానులు) అది సమస్తముకు అగ్రము (The highest) గా స్థితి కలిగి ఉన్నదని, సమస్తము అద్దాని పురుషకారమే కాబట్టి **"మహాంతమ్ పురుషమ్"** అని ఎలుగెత్తి గానము చేయుచున్నారు. |

| | |
|---|---|
| **5. అశరీరం, శరీరేషు అనవస్థేషు అవస్థితమ్।** | నిర్మలము, సునిశితము, విస్తారము అగు బుద్ధిని సంపాదించుకొన్న ధీరులు అట్టి స్వస్వరూపాత్మను<br>- అశరీరము (శరీరము లేనిది) అని,<br>- 'ఇక్కడ ఉన్నది' అనునది లేనప్పటికీ అనిత్యమగు సమస్త శరీరములలో శాశ్వతమై వెలయుచున్నదని, |
| **మహాంతం విభుం ఆత్మానం<br>మత్వా ధీరః న శోచతి।** | - సమస్తముగా ప్రదర్శనమగుచు మహోన్నతమై వెలయుచున్నదని<br>- సమస్తమునకు విభుడు (The king) అని తెలుసుకొని ఇక దేనికీ శోకము పొందనివారై ఉంటున్నారు. |
| **సర్వస్య ధాతారం, అచింత్య శక్తిం<br>సర్వ ఆగమ అంత అర్థ విశేష వేద్యమ్।** | సర్వమునకు సృష్టికర్త అగు 'ధాత' ఆ పరమాత్మయే. ఆయన చింతనకు (బుద్ధికి) అందని శక్తిస్వరూపుడు, సర్వవేదముల సారము. అంతరార్థమును గ్రహించి ఆయన యొక్క విశేషత్వము తెలుసుకొనువాడు ధన్యుడు. |
| **పరాత్ పరం పరమం వేదితవ్యం<br>సర్వ అవసానే సకృత్ వేదితవ్యమ్।** | ఆ ఆత్మ పురుషుడు ఈ జీవుని పరస్వరూపమునకే పరమైనవాడు. సమస్త పరస్వరూపములు తానైనవాడు. సమస్తమునకు ఆవలివాడు. ఆయననే ప్రయత్నపూర్వకంగా తెలుసుకోవాలి. |
| **కవిం। పురాణం। పురుషోత్తమోత్తమం।<br>సర్వేశ్వరం। సర్వ దేవైః ఉపాస్యమ్।** | ఆ ఆత్మ భగవానుడు సర్వశ్రేష్ఠుడు. ఈ లోకములన్నిటి యొక్క రచయిత. మొదలే ఏర్పడి ఉన్న పురాణ పురుషుడు. సమస్త జీవులలో ఉత్తమ పురుష (The first person) గా ఉన్న పురుషోత్తముడు. సమస్తముగా తానే విస్తరించి ఉన్నవాడు, కాబట్టి సర్వేశ్వరుడు సమస్త దేవతలచే ఉపాసించబడువాడు. సమస్త దేవతారూపములుగా ఉపాసించబడువాడు కూడా. |
| **అనాది మధ్య అంతం। అనంతం।<br>అవ్యయం। శివ। అచ్యుత।<br>అంభోరుహ గర్భ భూరుహమ్।** | అట్టి ఆత్మ దేవాది దేవుడు ఆది-మధ్య-అంతము లేనివాడు, అనంతుడు. వ్యయము (Spend out) అనే ధర్మము లేని అవ్యయుడు. తన అనంతత్వము ఏక్షణములోను వీడనట్టి అచ్యుతుడు. చ్యుతియే లేనివాడు. (He never displaces from what he is ever) బ్రహ్మ, విష్ణు, మహేశ్వర సృష్టి స్థితి లయ స్వరూపుడు కూడా. |
| **స్వేన ఆవృతం సర్వం ఇదం ప్రపంచం<br>పంచ ఆత్మకం పంచసు వర్తమానమ్।** | పంచాత్మకము (దృశ్యాత్మకం, దేహాత్మకం, ఇంద్రియాత్మకం, ద్రష్టాత్మకం, సర్వాత్మకం) అయినవాడు. పాంచభౌతికము అయిన ఈ ప్రపంచమంతటికి తన స్వరూపముచేత ఆక్రమించుకొని ఉన్నవాడు. |
| **పంచీకృత అనంత భవ ప్రపంచం।<br>పంచీకృత స్వ అవయవైః అసంవృతమ్।** | ఈ పంచీకృత అనంత ప్రపంచంగా కనిపిస్తున్నది ఆత్మయే. దేనినీ చుట్టుకొని ఉండనిది (అసంవృత్తము). అయినప్పటికీ పంచీకృతమైనదంతా తన యొక్క అవయవ విశేషముగా కలిగి ఉన్నట్టిది. |
| **పరాత్పరం యత్ మహతః మహాంతం<br>స్వరూప తేజోమయ శాశ్వతం శివమ్॥** | ఆత్మ పరాత్పరము, మహామహిమాన్వితము.<br>తేజోమయమైన స్వరూపము. శాశ్వతమైనది. సర్వదా శుభప్రదమైనది. సుఖప్రదమైనది. |

6. న అవిరతో దుఃచరితాన్,
న అశాంతో, న అసమాహితః,

న అశాంత మానసః వా అపి
ప్రజ్ఞానేన ఏన ఆప్నుయాత్।

అట్టి స్వస్వరూపమగు ఆత్మ జీవులందరికీ అత్యంత సమీపమైనట్టిది అయి ఉండి కూడా, అనేకులకు స్వ-అనుభవముగా సిద్ధించటమే లేదు. ఎందుచేత ? ఎవరైతే దుష్ట ప్రవర్తనల నుండి విరమించరో, 'శాంతము'గా ఉండటమును అభ్యాసము చేసుకోరో, సర్వత్రా సమదృష్టిని ఆశ్రయించరో, అశాంతితో కూడిన మననము రూపమగు మనస్సును నిరోధించరో, అట్టివారు శాస్త్ర ప్రజ్ఞావంతులు అయి ఉండి కూడా "అఖండాత్మ భావన'ను సిద్ధించుకోలేరు.

---

న అంతః ప్రజ్ఞం। న బహిః ప్రజ్ఞం।
న స్థూలం। న అస్థూలం। న జ్ఞానం।
న అజ్ఞానం। న ఉభయతః ప్రజ్ఞం।
అగ్రాహ్యం। అవ్యవహార్యం।
స్వ అంతః స్థితం స్వయం ఏవ ఇతి।
య ఏవం వేద, స ముక్తో భవతి।
స ముక్తః భవతి।

**ఆత్మ గురించిన మరికొన్ని**

**"న-ఇతి" రూప వర్ణనలు చెప్పుచున్నాను వినండి.**

- ఆత్మ - అంతఃప్రజ్ఞ (మనోబుద్ధి చిత్త అహంకార రూపము) కాదు.
- బాహ్య ప్రజ్ఞ (బాహ్య ప్రాపంచక దృశ్య విశేషముల గురించిన తెలివితేటలు) కాదు.
- స్థూలము కాదు. అస్థూలము (సూక్ష్మము) కాదు.
- జ్ఞానము కాదు. అజ్ఞానము కాదు.
- జ్ఞాన - అజ్ఞాన ఉభయ ప్రజ్ఞ కాదు. అది గ్రహించబడేదేదీ కాదు (గ్రహిస్తూ ఉన్నదే అది కాబట్టి).
- ఏదో వ్యవహార సాధనా సంబంధమైనది కాదు. అట్టి ప్రతి ఒక్క జీవుని స్వ-అంతరంగమునందే స్థితి కలిగి ఉన్నట్టిది. ఈ జీవుని స్వస్వరూపమే అది.

ఇతి ఆహ భగవాన్ పితామహః।

**ఎవడు ఆత్మ గురించి ఈ విధంగా తెలుసుకుంటాడో అట్టివాడు ముక్తుడు అగుచున్నాడు అని పితామహ భగవానుడు చెప్పెను.**

---

స్వస్వరూపజ్ఞః పరివ్రాట్।
పరివ్రాట్ ఏకాకీ చరతి।
భయత్రస్త సారంగ ఇత తిష్ఠతి।

పరివ్రాట్ (పరివ్రాజకుడు) తన యొక్క, తదితర సమస్త జీవుల యొక్క 'స్వస్వరూపము' ఎరిగి అనువర్తిస్తున్నాడు. వాస్తవ స్వరూప - స్వభావములు ఎరిగినవాడై, భయము పొందిన జింకలాగా ఈ జగత్తులో ఒక చోట నిలువక ఏకాకి అయి సంచారములు చేస్తూ ఉంటాడు. (దేనికీ సంబంధించక, ఏదీ తనకు సంబంధించనివాడై, దిగులు లేనివాడై, ప్రశాంత ఆనందములతో చరిస్తూ ఉంటున్నాడు). ఎక్కడా ఒకచోట నిలువక గమనము ఆపనివాడై ఉంటారు.

గమన విరోధం న కరోతి।
స్వ శరీర వ్యతిరిక్తం సర్వం త్యక్త్వా
షట్ పద వృత్త్యా స్థిత్వా,
స్వరూప అనుసంధానం కుర్వన్,
సర్వం అనన్య బుద్ధ్యా
స్వస్మిన్ ఏవ ముక్తో భవతి।

తన యొక్క ఆత్మ దేహము తప్ప ఇక తదితరము అయినదంతా (వేరైనదంతా) త్యజించినవాడై, షట్పదవృత్తి (తుమ్మెద యొక్క) సంచారము వలె (తుమ్మెద పూరసము స్వీకరించునట్లు) సమస్త అనుభవములలో ఆత్మతత్త్వము మాత్రమే స్వీకరిస్తూ ఉంటాడు.

**స్వస్వరూపమును సర్వాత్మకంగా అనుసంధానము చేయుచున్నవాడై ఉంటాడు.**

అనన్యభావముతో (నేనే ఇదంతా అయి ఉన్నాను - అను భావనతో) దర్శించువాడు సర్వదా ముక్తుడే అగుచున్నాడు

| | |
|---|---|
| **స పరివ్రాట్ సర్వ క్రియాకారక నివర్తకో। గురుశిష్య శాస్త్రాది వినిర్ముక్తః। సర్వ సంసారం విసృజ్య చ, అమోహితః పరివ్రాట్।** | ఆ పరివ్రాట్<br>❑ సమస్త కర్మఫలరూప - క్రియా కారకముల నుండి విముక్తుడు అయి ఉంటాడు.<br>❑ గురువు, శిష్యుడు, శాస్త్రముల నుండి వినుర్ముక్తుడు (get relieved) అయి ఉంటాడు. చేరవలసిన చోటికి చక్కగా చేరినవాడు ఇక బాటలోని విశేషాల గురించి వినోద - విషాదములు పొందడు కదా.<br>❑ సమస్త సంసార వ్యవహారములను విడచిపెట్టి మోహమును జయించినవాడై 'సర్వాత్మకుడు' అయి ఉంటున్నాడు. |
| **కథం నిర్ధనికో సుఖీ? ధనవాన్ హి సుఖీ।** | ధనము లేనివాడు సుఖంగా ఉండలేడు కదా ? **అట్లాగే తత్త్వజ్ఞాన సంపన్నుడే సుఖముగా ఉండగలడు.** |
| **జ్ఞాన – అజ్ఞాన ఉభయాతీతః।** | "ఒకడు జ్ఞాని అయినా (లేక) అజ్ఞాని అయినా ఆత్మానంద స్వరూపుడే" అను అవగాహన కలవాడు ఆత్మ సుఖి అగుచున్నాడు. |
| **సుఖ–దుఃఖ–అతీతః।** | ఘనీభూతమైన "ఆత్మానంద స్వరూపుడనగు నాకు ప్రాపంచక సంబంధమైన సుఖముల వలన క్రొత్తగా వచ్చేదేమున్నది ? దుఃఖముల వలన పోయేదేమున్నది" అను సుఖదుఃఖాతీతుడే ఆత్మ సుఖమునకు అర్హుడగుచున్నాడు. |
| **స్వయంజ్యోతిః ప్రకాశః।** | "సూర్యుని చూపటానికి మరొక దీపముతో పనేమున్నది ? నేను స్వయం జ్యోతి స్వరూపుడనై ప్రకాశించువాడను" అను సంతృప్తిచే ఆత్మ తృప్తి లభించగలదు. |
| **సర్వ వేద్యః। సర్వజ్ఞః। సర్వ సిద్ధిదః। సర్వేశ్వరః। – సోఽహం ఇతి॥** | - తెలియబడేదంతా నా తెలివి యొక్క విస్తారమే కాబట్టి సర్వ వేద్యుడను.<br>- దేహముల రాకపోకలకు ఆవలిదగు పరాత్మ స్వరూపుడను.<br>- నా పట్ల ప్రవర్తిస్తున్న జాగ్రత్ స్వప్న సుషుప్తులను సిద్ధింపజేసుకొంటున్నది నేనే. అందుచేత సర్వసిద్ధుడను అని పరివ్రాట్ ఎరిగి, స్వానుభవుడై ఉంటాడు. |
| **తద్విష్ణోం పరమంపదం యత్ర, గత్వా న నివర్తంతే యోగినః।** | ఆత్మనగు నేనే ఈ సమస్తము అగుచు, ఈ సమస్తమునకు పరముగా మార్పు, చేర్పులు లేనివాడనై 'బ్రహ్మము' అను శబ్దార్థంగా పరాకాష్ట స్వరూపుడనై ఉన్నాను. "సోఽహం" అనబడు విష్ణు పదము సిద్ధించుకొన్న యోగి ఇక తిరిగి "నేను జీవుడను, పరిమితుడను" అను నివర్తము (Getting down again) పొందడు. |
| **సూర్యో న తత్ర భాతి। న శశాంకోఽపి। న స పునరావర్తతే। న స పునరావర్తతే।** | అట్టి స్వస్వరూపాత్మ స్థానమునందు ఈ సూర్య-చంద్రుల ప్రకాశము, కాలక్రమ స్థితిగతులు మొదలైన వాటికి ఇక చోటు ఉండదు. ఆ యోగి పునరావర్త దోషము పొందడు. |
| **తత్ కైవల్యమ్।** | అదియే 'కైవల్యము' అనబడుతోంది. **తన యొక్క కేవలీ స్వరూపము.** అన్యముగా కనిపించేదంతా ఆత్మకు (తనకు) అనన్యముగా (వేరుకానట్లు) స్వానుభవ స్థానమగుటచే 'కైవల్యము' అని చెప్పబడుతోంది. |

**ఇత్యుపనిషత్ – నారద పరివ్రాజకోపనిషత్ – "నవమోపదేశః"**

## నారద పరివ్రాజకోపనిషత్ సమాప్తా

అథర్వణ వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 24 నారద పరివ్రాజకోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన వచన పుష్పము

## ప్రథమోపదేశము

**"సన్న్యాసప్రాధాన్యము"** అయినట్టి ఈ క్రింది ఉపనిషత్తుల సారమే ఈ "నారద పరివ్రాజకోపనిషత్". ఈ క్రింది ఉపనిషత్తులు లోకములకు ప్రసాదించిన సత్యద్రష్టలగు తత్త్వజ్ఞులకు నమో నమో నమో నమః

| | | |
|---|---|---|
| 1) పరమహంస పరివ్రాజకోపనిషత్ | అథర్వణవేదాంతర్గత (15) | ఉపనిషత్ ఉద్యానవనం సంపుటి 5 |
| 2) త్రిశిఖ బ్రాహ్మణోపనిషత్ | శుక్లయజుర్వేదాంతర్గత (7) | ఉపనిషత్ ఉద్యానవనం సంపుటి 1 |
| 3) సీతోపనిషత్ | అథర్వణవేదాంతర్గత (20) | ఉపనిషత్ ఉద్యానవనం సంపుటి 5 |
| 4) యోగచూడామన్యుపనిషత్ | సామవేదాంతర్గత (11) | ఉపనిషత్ ఉద్యానవనం సంపుటి 4 |
| 5) నిర్వాణోపనిషత్ | ఋగ్వేదాంతర్గత (7) | ఉపనిషత్ ఉద్యానవనం సంపుటి 1 |
| 6) మండల బ్రాహ్మణోపనిషత్ | శుక్లయజుర్వేదాంతర్గత (12) | ఉపనిషత్ ఉద్యానవనం సంపుటి 1 |
| 7) దక్షిణామూర్త్యుపనిషత్ | కృష్ణయజుర్వేదాంతర్గత (14) | ఉపనిషత్ ఉద్యానవనం సంపుటి 2 |
| 8) శరభోపనిషత్ | అథర్వణవేదాంతర్గత (19) | ఉపనిషత్ ఉద్యానవనం సంపుటి 5 |
| 9) స్కందోపనిషత్ | కృష్ణయజుర్వేదాంతర్గత (30) | ఉపనిషత్ ఉద్యానవనం సంపుటి 3 |
| 10) త్రిపాద విభూతి మహానారాయణోపనిషత్ | అథర్వణవేదాంతర్గత (28) | ఉపనిషత్ ఉద్యానవనం సంపుటి 6 |
| 11) అద్వయతారకోపనిషత్ | శుక్లయజుర్వేదాంతర్గత (1) | ఉపనిషత్ ఉద్యానవనం సంపుటి 1 |

-----

బ్రహ్మమానస పుత్రులు, **'పరివ్రాజము'** అనే సన్న్యాసయోగ పరాకాష్ఠ స్థితిని ఆభరణముగా ధరించినవారు, లోక కళ్యాణము కొఱకై త్రిలోక సంచారి, భక్తజనులను స్వయముగా సమీపించి మార్గదర్శనము ప్రసాదించువారు, భక్తి సూత్రములు లోకములకు ప్రసాదించినవారు, ధర్మమునకు గ్లాని వాటిల్లినపుడు త్రిమూర్తులను ఆశ్రయించి అవతారమూర్తుల ఆగమనమునకు కారణభూతులగువారు అగు శ్రీ నారద దేవర్షి గురువరేణ్యుల పాదపద్మములకు సాష్టాంగదండ ప్రణామములు.

మహనీయులగు శ్రీ నారద మహర్షి త్రిలోక సంచారములు నిర్వర్తిస్తూ ఉంటారు. అట్టి ఒకానొక సందర్భములోని విశేషములు మనము ఇప్పుడు చెప్పుకుంటున్నాము.

శ్రీ నారద మహర్షి ఇచ్ఛానుసారంగా అనేక పుణ్యస్థలములను దర్శించసాగారు. ఆ స్వామి ఎక్కడ అడుగుపెడితే అక్కడ అవి గొప్ప పుణ్యతీర్థములుగా మారి, సందర్శకులకు వారి వారి భక్తి జ్ఞాన యోగ మార్గములలో ప్రోత్సాహము, సముద్ధరణ ప్రసాదించు దివ్య ప్రదేశములు అవసాగాయి.

**తీర్థీ కుర్వన్తి తీర్థాని, సుకర్మీ కుర్వన్తి కర్మాణి, సచ్ఛాస్త్రీ కుర్వన్తి శాస్త్రాణి** – నారదభక్తి సూత్రములు.

ఆ విధంగా మనోపవిత్రత కొఱకై శ్రీ నారద మహర్షి తీర్థయాత్రలు చేస్తూ, దేవాలయ సందర్శనము నిర్వర్తిస్తూ ఉండగా, వారు ఆత్యంతికమైన చిత్తశుద్ధి ప్రాప్తించుకోసాగారు. మనస్సు నిర్వైరము (దేనిపట్లా 'వైరము' యొక్క ఛాయ కూడా తొలగి పోవుటము) సిద్ధించసాగింది. ప్రశాంతత సంతరించుకోసాగింది. ఇంద్రియముల చాంచల్యము తొలగి సర్వత్రా దాంతము (Self control) పొందసాగాయి. సకల ఇంద్రియ నిగ్రహము ప్రాప్తించుకోసాగారు. బుద్ధి నిర్వేదము (వైరాగ్య భావము) ఆశ్రయించసాగింది. అందుకు ఫలితంగా వారు సమస్త దృశ్య విషయములనుండి ఉపసంహారము (withdrawal) పొంది, కేవలము – సమస్తము అయినట్టి **'స్వస్వరూపము'** తో అనుసంధానము పొందసాగారు.

ఆ విధంగా తీర్థయాత్రలు సేవిస్తూ శ్రీ నారద మహర్షి ఒకానొకరాజు

- నిగమ (వేద) నాద ఆనంద విశేష గణ్యము (విశేషములతో కూడినది),
- సత్రయాగము జరుగుచున్న పవిత్రస్థలము,
- అనేక మునిజనము సమావేశమై ఉన్నది,

అగు **'నైమిశారణ్యము'** చేరారు. అక్కడి వాతావరణమంతా వేదపారాయణము, 'స–రి–గ–మ–ప–ద–ని' స్వరములతో కూడిన వైరాగ్య బోధకములైన సంగీత గానమయము అయి ఉన్నది. భక్తి జ్ఞాన వైరాగ్యపూర్వకమైన సత్సంగ పురాణ ప్రవచనములు ఆ ప్రదేశంలో జరుగుచున్నాయి. సమస్త దృశ్యప్రపంచ సంబంధముల బంధము తొలగించగల అనేక దృష్టాంతములు, చరిత్రలు, పురాణములు, ఇతిహాసములు, కథానికలు శ్రవణం చేయబడుచున్నాయి. శుకుడు, శౌనకుడు మొదలైన వారిచే మహత్తరముగా సత్సంగపూర్వకంగా ముముక్షువులకు మోక్షసాధనములు బోధించబడుచున్నాయి. "నివృత్తి" (withdrawal from wordly tendencies)కి ఉపాయములు విశదీకరించు హరికథా ఆలాపనలతో అక్కడి స్థావరములు కూడా తేజోవికాసముతో ప్రకాశిస్తున్నాయి. అక్కడి జంగమ జీవులగు మృగములు, మానవులు, కిన్నెరులు, కింపురుషులు, అప్సరసలు మొదలైన మానవ దేవతాగణము ఆ ప్రదేశములో శ్రవణం (Listening) చేస్తూ పవిత్రత సంతరించుకుంటున్నారు.

బ్రహ్మాత్మజులు, భగవద్భక్త పరాయణులు అగు శ్రీ నారద మహర్షి, ఆ నైమిశారణ్య పవిత్ర తీర్థ ప్రదేశమునకు వేంచేయగానే, అక్కడి ద్వాదశ (12) సంవత్సరముల సత్రయాగములో పాల్గొనుచున్న శౌనకుడు మొదలైన శ్రుత అధ్యయన – శ్రవణములు చేస్తున్న అనేక మంది వైరాగ్య సంపన్నులగువారు వారికి ఎదురుగా వచ్చి సుస్వాగత వచనములతో శుభాకాంక్షలు పలికారు. సుఖాసీనులను చేసి నమస్కరించారు. ఆ తరువాత అక్కడి వారంతా వారివారి స్థానములలో చుట్టూ ఆసీనులైనారు.

**శౌనకుడు మొదలైన మహర్షులు :** హే భగవాన్, బ్రహ్మమానస పుత్రా । నారద మహర్షీ । **కథం ముక్తి ఉపాయో, అస్మాకం వక్తవ్యమ్ ।** ఏ విధానము మేము ముక్తి పొందటానికి ఉపాయము అయి ఉన్నదో, అది మాకు బోధించి అనుగ్రహించండి. భక్తిరసపారాయణులు, మహత్–పౌరాణికులు అగు మీ వాక్యామృతము గ్రోలటానికి మేమంతా ఉత్సాహవంతులమై ఉన్నాము.

**శ్రీ నారద మహర్షి :** ఓ శౌనకాది మునివర్యులారా, ముందుగా ముక్తికి సంబంధించిన ఒకానొక "శాస్త్రీయ క్రమ విధానం" చెప్పుకుందాము. వినండి (ఇది కొన్ని కులజుల నియమము).

- సన్మార్గమైన వాతావరణమునకు సంబంధించినవాడు, "సత్కులజుడు" గురించి శాస్త్రము కొన్ని విధానములు ఈ విధంగా చెప్పుతోంది.
- శాస్త్ర విధి – విధంగా ఉపనీతుడు అగును గాక. తద్వారా దినచర్యలు, గురుసేవనము, శ్రవణము, అధ్యయనము, స్నాన సంస్కారములు మొదలైన 44 సంస్కార సంపన్నుడు అవ్వాలి.
- స్వాభిమతంగా (తనకు ఇష్టమైన) గురుదేవులను సమీపించి ఋగ్వేద – శుక్లయజుర్వేద – కృష్ణయజుర్వేద – సామవేద మొదలుగాగల తనకు చెందిన వేదశాఖ యొక్క అధ్యయనము ప్రారంభించును గాక!
- ఆ విధంగా 12 సంవత్సరములు శుశ్రూష (గురుసేవా) పూర్వకంగా తన వంశమునకు (గోత్రమునకు) సంబంధించి వేదశాఖను ఆమూలాగ్రము అభ్యసించును గాక!
- 12 సంవత్సరముల విద్యాభ్యాసముతో కూడిన 25 సంవత్సరముల బ్రహ్మచర్యమును, అధ్యయనమును పూర్తి చేసుకొని ఇంటికి తిరిగివచ్చి, పెద్దలు నిర్ణయించిన 'కన్య'ను వివాహమాడి గార్హస్థ్యము (గృహస్థాశ్రమము)ను స్వీకరించును గాక!
- 25 సంవత్సరముల కాలము గృహస్థాశ్రమమును ఉపాసనా పూర్వకంగాను, సశాస్త్రీయంగాను గడుపును గాక!
- ఆ తరువాత గృహస్థాశ్రమమును వదలి 25 సంవత్సరములు వానప్రస్థాశ్రమము ఆశ్రయించును గాక!

  ఈ విధంగా విధివత్ క్రమంగా (As per laid down system)

  - చతుర్విధ (4) – బ్రహ్మచర్య ధర్మములను
  - షట్విధ (6) – గార్హస్థ్య (గృహస్థాశ్రమ) ధర్మములను
  - చతుర్విధ (4) – వానప్రస్థ ధర్మములను

  చక్కగా (సమ్యక్) అభ్యసించును గాక!

ఆయా మూడు ఆశ్రమములకు ఉచితమైన సమస్త కర్మలను నిర్వర్తించి **'సాధన చతుష్టయ సంపన్నుడు'** అవ్వాలి.

**సాధన చతుష్టయము :**

I.
1) నిత్య అనిత్య వస్తు – **'వివేకము'**
2) ఇహ అముత్ర (ఈ లోక సంబంధమైన – పరలోక సంబంధమైన) **'ఫల భోగ విరాగము'**
3) i) శమము : మనోనిగ్రహము ii) దమము : బాహ్యేంద్రియ నిగ్రహము iii) ఉపరమము : విషయముల నుండి వెనుకకు మరలటము iv) తితిక్ష : ఓర్చుకోవటము v) శ్రద్ధ vi) సమాధానము అనబడే **'శమాది షట్కసంపత్తి'**
4) ముముక్షుత్వము : మోక్షము పొందాలనే మహదాశయము, తపన
   (Ref. వివేక చూడామణి – శ్రీ శంకరాచార్య విరచితము)

II.
1) **శమము :** బాహ్య – అభ్యంతర ఇంద్రియ నిగ్రహము. చాంచల్యము వదలి 'శాంతి'ని ఆశ్రయించటము.
2) **విచారణ :** నిత్య – అనిత్యములను ఎఱిగి ఉండటము. శాస్త్ర అధ్యయనము మొ॥నవి
3) **సంతోషము :** కలిగిన దానితో, ప్రాప్తించినదానితో తృప్తి. ఉత్సాహ–సాహస–ధైర్య – బుద్ధి – శక్తి – పరాక్రమములను ఆశ్రయిస్తూ ఉండటము. హుషారుగా ఉండటం.
4) **సత్సంగము :** మహనీయులతో సమాశ్రయము. శ్రవణము – గురుసేవ.

పై విశేషములతో "సాధన చతుష్టయ సంపత్తి" ని వృద్ధి చేసుకోవాలి. అట్టి సాధన చతుష్టయము యొక్క అభ్యాసము చేస్తూ సంసార భోగాభిలాషలను మనో–వాక్ – కాయ పూర్వకంగా మొదలంట్లా పెకలించివేయాలి. సమస్త దృశ్య సంబంధమైన ఆశలను త్యజించాలి. వాసనలను (tendencies), (దారేషణ, ధనేషణ, పుత్రైషణలనబడే) ఈషణ త్రయములను (World related urges) నివృత్తి చేసుకోవాలి.

**నిర్వైరః సర్వభూతేషు :** వైరము (Enmity) అనేదంతా రహితము చేసుకొనునుగాక, సమత్వము సముపార్జించుకోవాలి.

శాంతుడు,దాంతుడు (ఇంద్రియ నిగ్రహము కలవాడు), ఇంద్రియ విషయములను చూచి మనోచాంచల్యము పొందనివాడు అగును గాక ।

**'సన్యాసి'** అయి, క్రమంగా పరమహంసాశ్రమమును స్వీకరించును గాక! పరమహంస స్థానము సిద్ధించుకొనును గాక।

అస్ఖచితము (చ్యుతి distraction లేనట్టి) స్వస్వరూపధ్యానముతో ఈ భౌతిక శరీరమును మానసికంగా 'త్యాగము' చేసినవాడు **'ముక్తుడు'** (బంధరహితుడు) అగుచున్నాడు. శరీరము ఉన్నప్పుడు, తొలగినప్పుడు కూడా అట్టివాడు ఆత్మవంతుడై ఉండగలడు. అదియే ముక్తి, మోక్షము, జన్మరాహిత్యము కూడా।

## 2వ ఉపదేశము – శాస్త్రోక్తముగా చతుః ఆశ్రమ పాలన

అప్పుడు శౌనకుడు మొదలైన మునీశ్వరులు నారదమహర్షితో **"హే భగవాన్ ! శాస్త్రీయంగాను, మహనీయుల స్వానుభవ బోధగాను చెప్పు 'సన్యాసము' గురించిన విధిని వివరించండి"** – అని అడిగారు. అది విని మహర్షి పలుకసాగారు.

**నారద మహర్షి :** జ్ఞానవేత్తలు, శాస్త్రవేత్తలు, తపోధనులు అగు ఓ శౌనకుడు మొదలైన మునీశ్వరులారా ! "సన్యాస విధి" గురించిన సమగ్రమైన విశేషాలన్నీ పితామహులగు బ్రహ్మదేవుల వారి ముఖతః మనమంతా శ్రవణం చేయటం ఉచితమని నాకు అనిపిస్తోంది. ఈ సత్రయాగము పూర్తి అయిన తరువాత మనము సత్యలోకము వెళ్లి పరమాత్మయగు బ్రహ్మ దేవుని నుండి సవివరంగా విందాము. ఎందుకంటే వేద ఉపనిషత్ మౌనులు, తత్వము ఎరిగిన మీకు సవిశేషంగా చెప్పగలిగినది పితృదేవులగు బ్రహ్మ భగవానుడే, నేను కాదు.

అక్కడ మునులు మొదలైనవారంతా "అలాగే! మనము పితామహుల వద్ద విందాము" అని తలచారు.

---

సత్రయాగము పూర్తి అయిన తరువాత నారదమహర్షి, శౌనకుడు మొదలైన వారంతా సత్యలోకములో ప్రవేశించారు. సృష్టికర్త అగు బ్రహ్మదేవుని దర్శించారు. విధివిధానంగా ఆ బ్రహ్మ నిష్ఠాపరులంతా పరిమేష్ఠి అగు బ్రహ్మదేవుల వారికి హృదయపూర్వక నమస్కారములు సమర్పించారు. జగత్ కర్తయగు పితామహులవారి అనుజ్ఞతో అందరూ ఉపవిష్టులైనారు.

**శ్రీనారద మహర్షి :** హే జగద్గురూ ! పితృదేవా ! మీరు సర్వజ్ఞులు. సర్వవిద్యా రహస్యములు ఎరిగినవారు. సృష్టి సంకల్ప సిద్ధులు. **త్వం అతో మదిష్టం రహస్యం ఏకం వక్తవ్యం । త్వత్ వినా మత్ అభిమత రహస్యం వక్తుం కః సమర్థః?** హే పితామహా ! ఒకానొక తాత్త్విక రహస్యం గురించి మీ వద్ద వినాలని మేమంతా అభిలాషపడుచున్నాము. మేము వినాలనుకొనే ఆ రహస్యార్థం మీరు తప్పితే మాకు తెలియజేయగల సమర్థులు మీకన్నా ఎవరుంటారు ? ఉండరు.

*ఆ తాత్త్విక రహస్యం గురించి మా ప్రశ్న ఏమంటే ...*

**పరివ్రాజ్య (పరివ్రాజకుని) స్వరూప – స్వభావ – ప్రవేశక ధర్మ విధుల గురించి దయచేసి మాకు బోధించండి.**

ఈ విధంగా ప్రార్థించబడి, ఆ విధాత ఒక్కసారి సభలోని వారినందరినీ చిరునవ్వు చిందుస్తూ ప్రేమాస్పదంగా పరికించి చూచారు. ముహూర్తకాలము (12 క్షణముల కాలము) సమాధి నిష్ఠను ధారణ చేసారు. **"వీరంతా ఏ ఉద్దేశ్యముతో ఈ వివరణను నన్ను అడుగుచున్నారు ?"** అని ప్రశ్నించుకున్నారు. **ఒహో ! ఈ నారదుడు సంసార – ఆర్తి యొక్క నివృత్తి కొరకై (To get rid of bondage formed with changing factors of the world scenario) అన్వేషిస్తూ అడుగుచున్నారు కదా! మంచిది" –** అని దివ్యదృష్టితో అక్కడివారి హృదయములలోని మహదాశయమును గమనించారు. అప్పుడు నారదుని వైపు చూచి పితామహుడు ఇట్లా పలుకసాగారు.

## శ్రీ ప్రజాపతి / పితామహుడు / బ్రహ్మదేవ భగవానుడు:

కుమారా! నారదా! ఒకప్పుడు (ఈ బ్రహ్మాండమంతా తన పురుషకారముగా కలిగి వుండి, ఇదంతా తన దేహమే అయి ఉన్న) విరాట్ పురుషుడు నిరతిశయమగు ఆత్మానందము ఆస్వాదిస్తూ **"పురుష సూక్తోపనిషత్ రహస్యార్థము"** ప్రకారముగా ఒక తత్త్వరహస్యము నాకు బోధించబడింది. అవన్నీ నాకు గుర్తుకొస్తున్నాయి. నీవు అడిగిన వివరణకు సమాధానంగా నిన్ను నిమిత్తంగా చేసుకొని సమస్త జనులకు చెప్పబోవుచున్నాను. మనము చెప్పుకోబోతున్న ఈ తత్త్వార్థ పూర్వకమైన క్రమము (The sequencial ideas we are talking about) – **అతి రహస్యమైనది.** దృఢమైనది (గట్టిది, అత్యధికమనది). కాబట్టి అవహితుడవై (అత్యంత శ్రద్ధావంతుడవై) వినెదవుగాక. నారదా ! విను.

### 1) ఉపనయనము – 12 సం॥ విద్యాభ్యాసము :

అనుపనీతుడు (ఉపనయన సంస్కారము / వడుగు కాని వటువు అనగా బాలుడు) – శాస్త్ర విధిని అనుసరించి ఉపనయన దీక్ష స్వీకరించును గాక! తాను జన్మించిన కులాచారములను అనుసరించి తల్లిదండ్రులకు విధేయుడై, ఆ తరువాత తన తండ్రి వద్ద కాకుండా **(పితృ సమీపాత్ అన్యత్ర)** తత్త్వశాస్త్ర అధ్యయనము చేయును గాక! సత్సంప్రదాయము ఎరిగియున్నవారు, శ్రద్ధావంతులు, సత్కులభూషణులు, వేదహృదయము ఎరిగిన శ్రోత్రియులు, శాస్త్ర విధులను ప్రేమించువారు, కుటిలత్వము లేని నిర్మల హృదయులు అగు సద్గురువును (సద్గురువరేణ్యులను) సమీపించాలి. వారికి నమస్కరించి బ్రహ్మ విద్య కొరకై అర్థించాలి. వారికి శుశ్రూష పూర్వకంగా (శిష్య భావన, సేవా భావనలతో) నమస్కరించాలి. **"గురుదేవా ! నేను ఆత్మ విద్య (లేక) బ్రహ్మ విద్య కొరకై శరణు వేడుచున్నాను"** అని విజ్ఞాపనను సమర్పించాలి. 12 సంవత్సరములు గురుసేవ చేస్తూ విద్యాభ్యాసమంతా పూర్తి చేసుకోవాలి.

### 2) వివాహం – గురుకులవాసం (25 సం॥లు) :

శుశ్రూషా పూర్వకంగా గురుసేవ చేస్తూ స్వాభిమతమైన వేద అధ్యయనము, తదితర సర్వసామాన్య విద్యాభ్యాసములను 12 సం॥ల కాలంలో పూర్తి చేసుకుని ఆ తరువాత బ్రహ్మచర్యము అవలంబించాలి. గురు అనుజ్ఞను పొంది, తన కుల పెద్దల అభిమతానుసారంగా వివాహం చేసుకొని 25 సం॥ కాలము గురుకులవాసము చేయాలి.

### 3) గృహస్థోచిత కర్మల ఆశ్రయము (25 సం॥లు) :

ఆ విధంగా 25 సం॥ల గురుకుల వాసం పూర్తి చేసుకొని గురు అనుజ్ఞను పొంది గృహస్థుడు సంఘ, లోక కళ్యాణార్థం నిర్వర్తించవలసిన కర్మల కొరకై గృహస్థాశ్రమము నిర్వర్తించును గాక! "దౌ బ్రాహ్మణ్య" – ద్విజ [(1) శాస్త్ర సేవ (2) సంఘ సేవ)] – వృత్తిని స్వీకరించాలి. వంశ వృద్ధి కొరకై 'కామము'ను ఆశ్రయించి, సంతానము పొందాలి. గార్హస్థ్యోచితమైన (గృహస్థాశ్రమమునకు ఉచితమైన) ధర్మములను 25 సంవత్సరములు నిర్వర్తించాలి. సంతానమును తీర్చిదిద్దాలి. సంఘ సేవ, వస్తు ఉత్పత్తి మొదలైన ధర్మములు ఆచరించాలి.

### 4) వానప్రస్థం :

గృహస్థాశ్రమ ధర్మములు 25 సం॥లు నిర్వర్తించిన తరువాత, 4వ కాలముగా వానప్రస్థము స్వీకరించును గాక. ఈ చతుర్థ కాలములో 1) ఏకవారమ్ ఆహారము (ఒంటిపూట భోజనము) 2) ఏకాకిగా అరణ్యము మొదలైన ఏకాంత ప్రదేశములలో సంచారములు చేయుటము నిర్వర్తించును గాక. పట్టణము, గ్రామముల జనసమ్మర్ద ప్రదేశములను విడచి ఉండునుగాక। జనావళికి దూరంగా ఉండే పర్ణశాలను నిర్మించుకొని వనస్థ (వానప్రస్థ) ఆశ్రమము సేవించాలి. ఇంద్రియములకు తారసపడే (కనిపించే – వినబడే) సమస్త విషయములపట్ల తృష్ణను జయించివేయాలి. క్రమంగా చత్వారి (శ్రవణ – మనన – నిదిధ్యాస– సమాధి) లను అభ్యసించి ఏతత్ – సంస్కార సంపన్నుడు అవ్వాలి. సమస్త జగత్ విషయముల పట్ల విరక్తితో కూడిన 'చిత్త శుద్ధి'ని సంపాదించుకొనాలి. హృదయములో జన్మజన్మలుగా గూడుకట్టుకొని ఉంటున్న **"ఆశ, అసూయ, ఈర్ష్య అహంకారము"**లను దగ్ధము (ఆత్మజ్ఞానాగ్నిచే భస్మము) చేసివేయును గాక।

సాధన చతుష్టయమును (శమము, విచారణ, సంతోషము, సాధుజన సంగము) లను ఆశ్రయించి సన్యస్తుడు అవటానికి అర్హత సంపాదించుకొనును గాక।

ఇత్యుపనిషత్ । ద్వితీయోపదేశమ్।

# 3వ ఉపదేశము - "సన్యాసము"నకు అధికారి

**శ్రీనారద మహర్షి :** హే ! పితామహ భగవాన్ ! దేనిచేత ఒకనికి సన్యాస ఆశ్రమాధికారం లభిస్తోంది ?

**పితామహుడు :** మొదట **"సన్యాసాధికారము"**ను నిరూపించి, ఆ తరువాత సన్యాసవిధుల గురించి (Do's and Dont's) చెప్పుకుందాము. ఓ నారదా ! ఏకాగ్రతగా విను.

**ఎవరు సన్యాసము స్వీకరించటానికి అనర్హులు ?**

నపుంసకుడు (షండుడు), వికలుడు (అంగలోపములు కలవాడు), అంధుడు (గ్రుడ్డివాడు), బాలకుడు (శాస్త్ర జ్ఞానము, విధి విధానములు ఏమాత్రము ఎరుగనివాడు, సన్యాసాశ్రమ ధర్మముల గురించి తెలుసుకొననివాడు), పాపదృష్టి, పరులకు ద్రోహము చేయు దోషపూరితమైన ఆశయములు (స్వభావము) కలవాడు, పతితుడు (తన యొక్క బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ ఆశ్రమముల నుండి పతనము చెందినవాడు), పరద్వారీ (తన ఆహారము, జీవనముల కొరకై ఇతరులను ఆశ్రయించి, ఆధారపడు స్వభావము కలవాడు), వైఖ్యాసుడు (వానప్రస్థులలో ఒక తెగవాడు. (విష్ణు) దేవాలయములలో అర్చక ధర్మము నిర్వర్తించువాడు), శివార్చకుడు (శివాలయములో అర్చన వృత్తి ధర్మము నిర్వహించువాడు), (హరిద్విజుడు), చక్రీ (శరీరముపై శ్రీచక్రము, శంఖము చిత్రించుకున్నవాడు), (చక్రాంకితుడు), పాషండుడు (వేదముల పట్ల, వేద పాఠ్యాంశముల పట్ల తిరస్కార బుద్ధి కలిగి ఉన్నవాడు), లింగీ (వట్టి వేషము వేసి జీవనాధారము కలిగి బ్రతుకువాడు), శిపివిష్టుడు (జుట్టు మొత్తము ఊడి బుఱ్ఱజుట్టు అనగా బట్టతల శేషించినవాడు), అగ్ని కార్యముల పట్ల గౌరవము లేనివాడు - అనగ్నికుడు, రెండుమూడు సార్లు సన్యసించి వదిలినవాడు **(ద్వి - త్రివారేణ సన్యస్తః)**, భృతకుడు (జీవనోపాధి కొరకు, ధనము సంపాదించటానికి సన్యసించు అభిప్రాయము కలవాడు),

**పైన చెప్పబడినవారు సన్న్యాసము స్వీకరించటానికి అర్హులు కారు.** వీరంతా ఆతురసన్న్యాసము స్వీకరించినప్పటికీ క్రమ సన్న్యాసాశ్రమము తీసుకోతగరు.

## ఆతుర సన్న్యాస స్వీకారము

**శ్రీ నారద మహర్షి :** ఆతుర (ఆత్రము, తొందరపడు) సన్న్యాసమునకు ఏది సరి అయిన కాలము ? ఏ విధానముచే ఆతుర సన్న్యాసము ఆర్యసమ్మతము?

**శ్రీ పితామహులవారు :** ఆతుర సన్న్యాసి కూడా సన్యాసాశ్రమ ఫలము పొందుటకు అర్హుడే. **ప్రాణస్య ఉత్క్రమణ ఆసన్న కాలస్తు 'ఆతుర' - సంజ్ఞికః ।** ఒకరకు ప్రాణములు పోవు సమయము సమీపిస్తున్న సమయమునందు స్వీకరించు సన్న్యాసమును **'ఆతుర సన్న్యాసము'** అని పిలుస్తారు. ప్రాణములు పోవు సమయము కానప్పుడు ఆతుర సన్న్యాసము ముక్తి మార్గము ప్రసాదించదు. ప్రాణ ఉత్క్రమణ సమయ - సందర్భములలో 'ఆతుర సన్న్యాసము' స్వీకరించువాడు కూడా మంత్రపురస్కరంగా (అట్టి సందర్భము గురించిన శాస్త్రీయ మంత్రములతో) నిర్వర్తించాలి.

**మం॥శ్లో॥** **మంత్ర - అవృత్తించ కృత్వైవ సన్యసేత్ విధివత్ బుధః ।**
**ఆతురేఽపి, క్రమేచాఽపి ప్రైషభేదో న కుత్ర చిత్ ।**

ఆతుర సన్యాసమైనా (లేక) క్రమ సన్యాసమైన కూడా కర్మరహితమైన మంత్రము ఉండదు. 'కర్మ, మంత్రము' రెండు సన్న్యాస విధికి అవస్యకం. కర్మ కూడా మంత్రమును ఆపేక్షిస్తుంది. కర్మ ఎంత గొప్పగా చేస్తున్నప్పటికీ మంత్రమును విడిచి ఉండరాదు. మంత్రమును వదలరాదు. **'మంత్రం వినా కర్మ కుర్యాత్ భస్మని అహుతివత్ భవేత్'** మంత్రము లేకుండా కర్మ నిర్వర్తించటమనేది బూడిదలో వదలిన హోమద్రవ్యము వంటిది.

**'ఆతుర సన్యాసము'** కొరకై విధి యుక్త (విధ్యుక్త) కర్మ కొంత సంక్షిప్తంగా శాస్త్రములచే విధించబడుతోంది. అందుచేత మునీంద్రా ! నారదా ! ఆతుర సన్యాసము కూడా 'మంత్రావృత్తి' చేతనే విధింపబడుతోంది సుమా.

అహితాగ్ని నిష్ఠుడు (ప్రతి రోజు అగ్నికార్యము నిర్వర్తించువాడు (లేక) నిత్యాగ్నిహోత్రావధానుడు) గృహస్థాశ్రమము పట్ల విరక్తి పొంది వేరే ఏదో దేశమునకు (సుదూర ప్రాంతమునకు వెళ్లి ఉండటం) జరిగితే కూడా, నివృత్తి – సర్వ సమర్పణ పూర్వకంగా **"ప్రాజాపత్యేష్టి"** నిర్వర్తించి సన్యసించును గాక।

మనస్సుతోగాని (లేదా) విధియుక్తియుక్తంగా గాని (అనగా) మంత్ర విధానార్థయుక్తంగా గాని (లేదా) జలములో గాని (లేదా) శ్రుతులలో (వేదములలో) చెప్పిన విధమైన కర్మానుష్ఠాన మార్గంగా గాని విద్వాంసుడు అయినవాడు సన్యసించును గాక. లేనిచో అట్టివాడు పతితుడు (one who meets downfall) అగు అవకాశము అధికము.

## సన్న్యసించటానికి సమయాసమయములు

**శ్లో॥ యదా మనసి సంజాతం వైతృష్ణ్యం సర్వ వస్తుషు**
**తదా సన్యాసం ఇచ్ఛంతి । పతితస్స్యాత్ విపర్యయే ।**

ఎప్పుడు మనస్సు సమస్త దృశ్య వస్తువుల పట్ల "కావాలి, పొందాలి, ఉండాలి" – అను రూపమగు తృష్ణ (Hunger) మొదలంట్లా తొలగుతుందో, అప్పుడే సన్యసించటానికి ఇచ్ఛగించాలి, ఇష్టపడాలి, సిద్ధమవ్వాలి. అట్లా కాకుండా తృష్ణ ఇంకా ఉండి ఉండగా ఎవడు సన్న్యసిస్తాడో అట్టివాడు పతితుడు కాగలడు. ధీమంతుడైన, ధైర్యవంతుడైన విరక్తుడు మాత్రమే సన్యసించును గాక. అనురక్తి గలవాడు గృహస్థాశ్రమములో ఉండి, తన సాధనలు కొనసాగించడమే ఉచితము. ఎవడు ఆయా వస్తువుల పట్ల, విషయముల పట్ల, సంబంధితుల పట్ల సరాగుడై ఉంటాడో (రాగము sense of attachment కలిగియే, కొనసాగిస్తూ ఉంటాడో), అట్టివాడు సన్యసిస్తే (ప్రవ్రజుడు అయితే), అతడు ద్విజాధముడై, ఘోరమైన నరకమునకు పాత్రుడు కాగలడు.

- ఎవ్వనికి జిహ్వ (నాలుక), ఉపస్థ (శృంగార ఇంద్రియము), ఉదరము, కరములు (రుచి, కామము, ఆకలి, వ్యవహారములు) తన వశములో ఉంటాయో, వాటికి తాను వశుడు (slave) కాడో,
- ఎవడు బ్రహ్మమును సిద్ధించుకోవటమనే మహదాశయము కలిగి ఉంటాడో,
- బ్రహ్మచర్య వ్రతమునకు సంసిద్ధమై ఉంటాడో

**అట్టివాడే సన్యాసము స్వీకరించవచ్చును. తదితరులు స్వీకరించకపోవటమే ఉచితము.**

"ఈ సంసారము సారరహితమైనది (నిస్సారమైనది) అను దృష్టిని పొంది "మరి సారమైనది ఏది?" అనే దిదృక్షువు (చూడాలనే ఇచ్ఛ గలవాడు) అట్టివాడు సమస్త కర్మలను, లోక సంబంధమైన లాభాలాభ వ్యవహారములను పరిత్యజించాలి. వైరాగ్యము ఆశ్రయించి, మోక్షార్థి అవగానే ఇక సన్యసించును గాక।

## కర్మ – జ్ఞాన లక్షణములు

**ప్రవృత్తి లక్షణం కర్మ । జ్ఞానం సన్యాస లక్షణం ।** 'కర్మ' అనేది ప్రవృత్తి (Avocation to do something in this world) అనే లక్షణము కలిగి ఉన్నది. **'జ్ఞానము'** అనేది నివృత్తి (Non avocation towards the doings) లక్షణముగా కలిగి ఉన్నది. అందుచేత బుద్ధిమంతుడైన వాడు ప్రవృత్తి లక్షణములను క్రమముగా ఉపసంహరించుకొని ఆత్మ తత్త్వ జ్ఞానము కొరకై (జ్ఞానమును పురస్కరించుకొని) – సన్యసించును గాక।

**యదా తు విదితం తత్త్వం పరంబ్రహ్మ సనాతనమ్, తదా 'ఏకదండం' సంగృహ్య, స ఉపవీతం, శిఖాం త్యజేత్ ।** ఎప్పుడైతే ముముక్షువు (మోక్షగామి) జన్మ – కర్మలకు మునుముందే ప్రకాశమానమైయున్న **"సనాతన పరబ్రహ్మము"** ను సుస్పష్టముగాను, నిర్దుష్టముగాను తెలుసుకుంటాడో, ఇక ఆపై అతడు బ్రహ్మమునకు, జగత్ధారణకు సంజ్ఞ అయినట్టి **ఉపవీతము** (నూలు పోగు యజ్ఞోపవీతమును), **శిఖను** (బ్రహ్మరంధ్ర–సహస్రార ద్వారములకు 'గుర్తు' అగు పిలకను) విడచివేసి సన్న్యసించును గాక।

## భిక్షుకాశ్రమము - కైవల్యాశ్రమము

**శ్రీ నారదుడు : కేవలమగు ఆత్మను ఆశ్రయించి ఉండటము** అనే **'కైవల్యాశ్రమ'** రూపమగు **'భిక్షుకాశ్రమము'**నకు ఎవడు అర్హుడు ?

**పితామహులవారు :** నారదా ! ఒకడు ఎప్పుడు 'భిక్షుకుడు' - అనబడతాడో చెప్పుచున్నాను, విను!

## తదా భవతి "భైక్షుకమ్"

⌘ **పరమాత్మని యోరక్తో, విరక్తో అపరమాత్మని ।** పరమాత్మకు అనురక్తుడై, అనాత్మవస్తువుల పట్ల (మార్పు చెందు దృశ్య వస్తు - విషయ - భౌతిక దేహములపట్ల) ఎవడైతే విరక్తుడు అయి ఉంటాడో,

⌘ **సర్వ ఈషణా వినిర్ముక్తః ।** ధనేషణ, పుత్రైషణ, భార్యేషణ మొదలైన సమస్త ఈషణముల (కోరికల) నుండి వినిర్ముక్తుడై (Mentally well relieved) అయి ఉంటాడో.

⌘ **పూజితో వందితశ్చైవ సుప్రసన్నో యథా భవేత్, తథా చేత్ తాడ్యమానస్తు ।** ఎవరైనా తనను పూజించినప్పుడు, తనకు నమస్కరించినప్పుడు ఏ విధంగా సుప్రసన్నుడై సంతోషము కలిగి ఉంటాడో, అదే రీతిగా ఎవరైనా తనను కొట్టడమో, బాధించటమో జరిగినప్పుడు కూడా అంతగానూ సుప్రసన్నుడై ఉంటాడో.

⌘ **"అహమేవ అక్షరం బ్రహ్మ వాసుదేవాఖ్యమ్ అద్వయమ్" - ఇతి భావోధ్రువో యస్య ।** "వాసుదేవము" అని చెప్పబడునది, తనకు ద్వితీయమనునదే ఏ మాత్రము ఎక్కడా (నవలా రచయితకు తను నవలలోని సంగతులవలె) ఏ మాత్రము లేదో అట్టి **అక్షర పరబ్రహ్మము నేనే అయి ఉన్నాను** - అనునది ఎవ్వని యొక్క దృఢభావము (చ్యుతి- Distraction లేని భావన) అయి ఉన్నదో.

⌘ **యస్మిన్ శాంతిః శమః శౌచం సత్యం సంతోష - ఆర్జవమ్ ఆకించిత్ అమదంభశ్చ - స కైవల్యాశ్రమే వసేత్ ।** ఎవనిపట్ల పరమ శాంతి, అంతరింద్రియాలు (మనోబుద్ధి చిత్త అహంకారాలు) సశాంతించిన స్థితి, శుచి అయిన ఆత్మభావన, పరమ సత్యము యొక్క సమాశ్రయము, సంతోషము - తృప్తి, ఆర్జవము (త్రికరణ శుద్ధి, మనసా వాచా కర్మణా ఆత్మైక్యభావన), దంభరాహిత్యము స్వాభావికమై, అతని బుద్ధి కేవలమగు ఆత్మని ఆశ్రయించి కైవల్యాశ్రమమున స్థితి పొంది ఉన్నదో, (ఆర్జవము = వంకర - టింకర అభిప్రాయాలు, భావాలు లేకుండటము)

⌘ **యదా న కురతే భావం సర్వభూతేషు పాపకమ్ ।** ఎవరైతే సమస్త జీవులలో ఆత్మనే దర్శిస్తూ, 'పాపి' అనే భావన ఎవరిపట్లా కూడా కలిగి ఉండరో,...

**కర్మణా మనసా వాచా తదా భవతి భైక్షుకమ్।** ఎవడైతే పై వర్ణనముల విధంగా కర్మణా మనసా వాచా ప్రవర్తన, భావన, ఎరుక కలిగి ఉంటాడో అప్పుడు అట్టివాడు **"భిక్షుకుడు"** అగుచున్నాడు.

ఏ ద్విజుడైతే (లౌకిక జీవనమును అధిగమించి ఆధ్యాత్మిక జీవనమును ఆశ్రయించి ఉత్తమాశయముగా కలిగి ఉంటాడో), సమాహితుడై (సర్వత్రా సమభావము కలిగి) ఉంటాడో,

వేదాంత శాస్త్రమును విధి విధానంగా వింటూ, దశ లక్షణ ధర్మములను అనుష్ఠిస్తాడో - అతడు (ఏ ఆశ్రమంలో ఉన్నా కూడా) నిత్య సన్యాసియే.

ఋణ చతుష్టయము అయినట్టి "దేవ", "ఋషి", "మానవ", "పితృ-మాతృ" ఋణములన్నీ తీర్చుకొని అనృణుడు సన్యాసమునకు అర్హుడు.

**శ్రీ నారద మహర్షి :** పితృదేవా ! అనుష్ఠించవలసిన "దశ లక్షణకం ధర్మము" గురించి వివరించి చెప్పండి.

**బ్రహ్మ భగవానుడు :** సమస్త జనులు బంధవిముక్తి కొరకై దశలక్షణక ధర్మము గురించి వినండి. ఇది అన్ని ఆశ్రమ వాసులకు అనుసరణీయము.

1) **ధృతి :** పట్టుదలతో కూడిన స్థిరత్వము కలిగియుండటం, చాంచల్యము లేకపోవటము, ఆత్మజ్ఞాన పాఠ్యాంశములను గట్టిగా పట్టుకోవటము.

2) **క్షమా :** ఓర్పు, సహనము, మన్నించటము, క్షమించు గుణము.

3) **దమము :** ఇంద్రియ నిగ్రహము. ఇంద్రియములను మహదాశయము కొరకై నియమించటము. ఇంద్రియములను ఉపకరణముల వలె తన అదుపులో ఉంచుకోగలగటము.

4) **అస్తేయము :** తనది కానిది "నాది" అను గుణము జయించి ఉండటము. దొంగిలించు స్వభావము లేకుండటము.

5) **శౌచము :** శుచి అయిన, నిర్మలమైన భావములు, అభిప్రాయములు ఆశ్రయించి ఉండటము. ఇతరులలో శుభ గుణములు, ఆత్మతత్త్వము దర్శించు అభ్యాసము.

6) **ఇంద్రియ నిగ్రహము :** ఇంద్రియ విషయములచే ఆకర్షించబడక, వాటిని నిగ్రహించి మనో-బుద్ధి బలములు కలిగి ఉండటము.

7) **ధీః :** ఉపాసనా పూర్వకము, నిర్మలము, సునిశితము, విస్తారము, ప్రశాంతము అయిన బుద్ధిని ప్రవృద్ధము చేసుకోవటము. (బుద్ధి = The feature of logic, intelligence and the ability of differentiation) .

8) **విద్యా :** ఆత్మతత్త్వము గురించిన శాస్త్రీయ విద్య. మనస్సు, బుద్ధి, చిత్తము మొదలైన వేదాంత శాస్త్ర శబ్దముల ఉత్తమార్థమును అధ్యయనము చేయటము. (విద్యా విహీనః పశుః).

9) **సత్యమ్ :** ఏది పరమ సత్యమో అద్దానిని ఆశ్రయించటము. సందర్భ సత్యములను అధిగమించి, సహజ సత్యమగు ఆత్మ స్వరూపమును యమ్ సత్ (Absolute Being) ను ఆశ్రయించటము.

10) **అక్రోధము :** వ్యవహారరీత్యా అనవసరమగు కోపమును సశాంతింపజేసుకుంటూ, కోపావేశమును జయించటము. కోపమును వెనువెంటనే ప్రేమ - శాంతములందు లయింపజేయు అభ్యాసము.

ఇవి సన్యాస ధర్మ దశ లక్షణములు. ఇవి ముముక్షువు సర్వదా అభ్యసించును గాక।

## కైవల్యాశ్రమము (కేవలీస్వరూపాశ్రయము)

మోక్ష రూపమగు కైవల్యమును ఈ జీవుడు సిద్ధించుకొనును గాక. అట్టి కైవల్యాశ్రమమే సంసార దుఃఖములన్నిటికీ ఏకైక ఉపాయము. అట్టి కైవల్య స్థితి (లేక) స్థానము ఈ జీవునికి సిద్ధించేది ఎట్లా ?

**న స్మరేత్ భోగాన్, న తథా అనాగతానపి ।** ఎవ్వడైతే ఇంద్రియభోగముల గురించి స్మరించక, అవన్నీ వచ్చినా, వచ్చిపోయినా, లభించకున్నా కూడా వాటి గురించి మననమే చేయడో, పట్టించుకోడో

**ప్రాప్తాంశ్చ నాభినందేత్ ।** ప్రాప్తించిన భోగముల గురించి ఆనందముతో తబ్బిబ్బు కాడో, వాటి రాక- పోకల స్వభావము ఎరిగి వాటిపట్ల అతీతము (Beyondness) వహించి ఉంటాడో.

**అంతస్థాని ఇంద్రియాణి అంతః । బహిస్థాన్ విషయాన్ బహిః ।** యోగ - సత్కర్మ అభ్యాస బలంచేత అంతరింద్రియములైనట్టి మనో బుద్ధి చిత్త అహంకారములను అంతరమున, బాహ్యేంద్రయములైనట్టి **చెవులు, చర్మము, కళ్లు, నోరు, ముక్కు** (శబ్ద స్పర్శ రూప రస గంధములను) బాహ్యముననే (బయటనే) విభాగించి విడివిడిగా ఉంచుతాడో, వాటిని ఎక్కడికక్కడ నిరోధించ గలుగుతాడో,

**ప్రాణే గతే యథా దేహః సుఖం, దుఃఖం న విందతి, తథాచేత్ ప్రాణయుక్తోఽపి ।** ఏవిధంగా అయితే ప్రాణములు తొలగిన తరువాత ఆ శవము ఎట్టి సుఖ దుఃఖములు పొందదో, అదే విధంగా, ప్రాణములు ఉన్నప్పుడు కూడా సుఖ - దుఃఖములు పొందడో ***అట్టివాడు కైవల్య - ఆశ్రమమునందు శాశ్వత నివాసము పొందుచున్నాడు. మోక్ష మార్గములో పయనించువాడగుచున్నాడు.***

**(కైవల్యము = సమస్త బాహ్య జగత్తుకు స్థానమే అయి ఉన్నట్టి కేవలమగు స్వస్వరూపమునందు ఆత్మానందముతో కూడిన విశ్రాంతి)**

## యతి సన్యాస వస్త్రధారణ - ఏకాకిగా సంచారము

సన్యాసాశ్రమము స్వీకరించినవాడు యతి అయి,

రెండు కౌపీనములను (2 గోచీ గుడ్డలను), ఒక కంబళిని, ఒక దండమును మాత్రమే కలిగి ఉండును గాక.

యతి పరమహంస అయిన వాడు అంతకుమించి ఏదీ కలిగి ఉండరు, ఉండరాదు.

సన్న్యాసి పరివ్రాజకుడై అంతకుమించిన వస్తుజాలమును సొంతము చేసుకొని ఉండరాదు. వస్తు జాలము, సంపద మొదలైనవి సంపాదించి, ప్రోగు చేసుకొను ఆసక్తి కలిగి ఉండు సన్యాసి 'రౌరవము' మొదలైన నరక స్థానములను, జంతు జన్మలను పొందువాడు అవగలడు. చిరిగిపోయిన వస్త్రములను ఉపయోగించి, వాటిని 'ముక్కలు'గా చేసి బొంతగా తయారు చేసుకొని ఉండునుగాక. అట్టి గుడ్డముక్కలకు కాషాయరంగు అద్ది ఏక వస్త్రముగా ధరించును గాక।

ఏక వస్త్రము ధరించిగాని, వస్త్రము ధరించక (దిగంబరుడుగా) గాని -

- ఏకాగ్రమైన దృష్టి కలవాడై,
- నిశ్చలమగు అభేదదృష్టి కలవాడై,
- ఆశలన్నీ జయించినవాడై,

సన్యాసి ఏకాకిగా అనేక చోట్ల సంచారములు చేస్తూ ఉండాలి. వర్షాకాలములో మాత్రమే చాతుర్మాస దీక్ష కలవాడై నాలుగు నెలల కాలము ఒకేచోట నివాసము కలిగి ఉండాలి.

## యతి (లేక) పరివ్రాజక రహస్య - ఏకాంత సంచారము - మోక్ష సిద్ధి

పరివ్రాజకుడు (లేక) యతి సమస్త సంసార బంధములను అధిగమించి మోక్షమే మహదాశయముగా కలిగి ఉంటాడు. **"త్యాగేన తు కైవల్యమ్"** అను వాక్యార్థమును ఆశ్రయించువాడగుచున్నాడు.

కుటుంబము, సంతానము, భార్య, బంధువులు, స్నేహితులు మొదలైన లోక సంబంధములను, లోక ప్రయోజనములను ఉద్దేశించే విధి విధానములను-నిషేధములను, అనేక శాస్త్రీయ పరిజ్ఞానములను చెప్పుచున్న **వేదాంగములను**, యజ్ఞ-యాగ - ఇష్టి - వ్రత విధానములను, వాటివాటి ఇహ-పర ప్రయోజనములను, యజ్ఞోపవీతము, శిఖ మొదలైన బాహ్య నియమ - నిష్ఠా విశేషములను-**ఇవన్నీ వదలి** ఉంటాడు. ఏకాంతమును ఆశ్రయించి రహస్యముగా (Having seperated himself from the relatedness to the worldly events, contexts and inter-personal belongings) సంచారము కలిగినవారై ఉంటారు.

దృశ్యముతో అనేక జన్మలుగా మమకార అహంకార పూర్వకంగా ఏర్పరచుకొంటూ వస్తున్న 'అవినాభావ' సంబంధము (Inter personal, Inter material relationship) వలన ఏర్పడుచున్న దోషములను గుర్తించి, వాటిని జయించటానికై మముక్షు యతి పరివ్రాజక మార్గము ఆశ్రయిస్తున్నాడు.

కాబట్టి **కామః క్రోధః తథా దర్పో లోభ మోహ ఆదయశ్చ, యేతాంస్తు దోషాన్ పరిత్యజ్య 'పరివ్రాట్' నిర్మమో భవేత్ ।** "ఏదో ఇంకా కావాలి" అనే **కామము,** కోప సందర్భములను సంస్కారములుగా మనస్సునందు పేర్చుకొన్నప్పటి రూపమగు క్రోధము, "నేను ఈ ప్రపంచంలో కనిపించే కొందరు జీవులకంటే గొప్పతనము కలవాడిని, ప్రత్యేకమైనవాడిని" - అను రూపముగా ఏర్పడుచూ ఉండే **దర్పము,** వ్యక్తిగత కుటుంబగత స్వార్థరూపమగు **లోభము,** సత్యముపై కల్పితమును ఆపాదించే మనోపరిమిత - మనో సంఘర్షణ రూపమగు **మోహము** మొదలైన దోషములను **జయించటానికై** 'యతి' (లేక) 'సన్యాస' (లేక) పరివాట్ మార్గమును ముముక్షువు ఆశ్రయిస్తున్నాడు.

రాగ ద్వేషములనే దోషములనుండి బుద్ధిని శుభ్రపరచుకొంటూ, మట్టి - రాయి - బంగారములను సమదృష్టితో చూడగలగు చిత్తమును సంపాదించుకుంటూ, సమస్త సహజీవులను ప్రేమ దృష్టితో చూచుచూ, హింసించు స్వభావమును విడచిపెట్టుచూ, జగత్తు విషయముల పట్ల మౌనము అభ్యసిస్తూ **'ముని'** అగుచున్నాడు.

సమస్త జగత్ – విశేషములపట్ల నిస్పృహుడు (Unconcerned) అగుచు, దంభము (Sense of praising one's own self in relation to others), అహంకారము (నేను – నాది అనే ఆవేశము) ల నుండి క్రమంగా విముక్తుడు (Relieved) అగుచున్నాడు. హింస, పైసునము (Voilence and sadism) లను మొదలంట్లా తొలగించి వేసుకొంటున్నాడు. క్రమంగా అట్టి ముముక్షువు (మోక్ష సాధకుడు) ముని అయి, యతి మార్గమును ఆశ్రయించి **"నేను నిత్యము, సత్యము, మధురము అఖండము అగు ఆత్మస్వరూపుడను"** అను ఆత్మజ్ఞాన గుణోపేతుడై ఆ యతి మోక్షమును సిద్ధించుకొంటున్నాడు.

## ఇంద్రియ దోషములు

పంచేంద్రియముల సామర్థ్యము దృష్ట్యా సృష్టిలో మానవ జన్మ ఉత్కృష్టమైనది. ఈ జీవుడు సమస్త దుఃఖములు తొలగించుకోవటానికై ఎంతో శ్రమలను అనుభవించి, చివరికి ఉపకరణములుగా జ్ఞానేంద్రియములను, కర్మేంద్రియములను సముపార్జించుకుంటున్నాడు. (తదితర జంతువులకు మాట్లాడే (మొదలైన) సామర్థ్యము ఉండుటలేదు.

అయితే ఇంద్రియములను ఉపకరణములుగా ఉపయోగిస్తూ ఈ జగత్తులో జీవిస్తూ ఉండగా, వాటివలన ఆత్మానందము సిద్ధించుకోవటానికి బదులుగా కామము, క్రోధము, మోహము, లోభము, మదము, మాత్సర్యము మొదలైన అనేక దుఃఖములకు కారణము కాగల మనోదోషములను తెచ్చిపెట్టుకుంటున్నాడు. **ఇంద్రియాణాం ప్రసంగేన దోషమృచ్ఛతి, అసంశయమ్।** ఇంద్రియ విషయములను అధికంగా మాట్లాడుకుంటూ, ప్రసంగించుకుంటూ ఉండగా, వాటివలన కొన్ని దోషములు వచ్చి పడతాయి. ఇందులో సందేహం లేదు.

అయితే, **సన్నియమ్య తు తాన్యేవ తతః సిద్ధిం నిగచ్ఛతి।** ఆయా దోషములను కలుగజేయగల అవే ఇంద్రియములు సరి అయిన మార్గములో నియమించబడ్డాయో... అవి ఈ జీవునికి సిద్ధిని ప్రసాదించగలవు కూడా.

మహాభారతంలో యయాతి చెప్పినట్లు

**శ్లో॥ న జాతు కామః కామానాం ఉపభోగేన శామ్యతి ।**
**హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవ అభివర్ధతే ॥**

ఒకాయన యజ్ఞము పూర్తి అయిన తరువాత యజ్ఞాగ్ని గుండములో భగ భగ మండుచున్న అగ్నిని ఆర్పటానికి హవిష్షుగా నేయిని తెచ్చిపోసాడు. అప్పుడు అగ్ని ఆరుతుందా? ఆరకపోగా, అగ్ని మరింత భగ్గుమంటుంది. అట్లాగే విషయములు అనుభవించటం కొనసాగిస్తున్నకొలది ఆ విషయముల కొరకై రూపుదిద్దుకొన్న కామము (Desire) తగ్గకపోగా, మరింతగా ప్రవృద్ధము అవుతూ ఉంటుంది.

**జితేంద్రియుడు :** ఎవడైతే ఇంద్రియములకు తాను వశము (Controlled, entangled) కాకుండా, తానే వాటిని తన వశము చేసుకొని ఉంటాడో, అట్టివాడు 'జితేంద్రియుడు'.

అటువంటి జితేంద్రియుడు

- అనేక భేద – చమత్కార విశేషములతో కూడిన దృశ్య విషయ పరంపరలు చూస్తున్నప్పుడు,
- ఆయా సంబంధ – అనుబంధ – బాంధవ్యముల విషయ విశేషములను వింటున్నప్పుడు,
- ఆయా వస్తుజాలమును స్పర్శిస్తూ ఉన్నప్పుడు,
- ఆయా పదార్థములను తింటూ ఉన్నప్పుడు,
- రుచికరమగు తిను బండారములను వాసన చూస్తున్నప్పుడు,

**న హృష్యతి । న గ్లాయతి ।** సంతోషము పొందదు. అరుచి, అసహ్యము, బాధ పొందదు. విజ్ఞుడై, ఇంద్రియ విషయములను జయించినవాడై ఉంటాడు.

యతి ఎల్లప్పుడు తనయందు రహస్యముగా సమ్యక్ దృష్టిని (సర్వత్రా సమదృష్టిని) సిద్ధించుకుంటాడు. వాక్కు, మనస్సులను, సర్వదా పరిశుద్ధము చేసుకొని ఉంటాడు. అప్పుడు వేదాంత శాస్త్రములో ఉపగతమై (అంతర్లీన గానమైయున్న) సమస్త ఆత్మానంద ఫలములను పొందగలడు.

## సన్మానము బంధము । అవమానము శ్రేయోదాయకము

ఎవరైనా సరే బ్రహ్మమును ఉపాసించు మార్గము ఎన్నుకొన్నవాడు బ్రాహ్మణుడు. అట్టి బ్రహ్మమార్గమును ఆశ్రయించుచున్నవాడు→

**సన్మానాత్ బ్రాహ్మణో నిత్యం ఉద్విజేత విషాదతః ।** తాను ఇతరులచే సన్మానించబడుచున్నప్పుడు **"ఇది నాకు విషాదము పొందు సందర్భము"** అని భావించి ఉద్విజేతము (ఉద్విగ్నత, వెఱపు, చింత, భయము, దుఃఖము) పొందినవాని వలె ఉంటాడు.

**అమృతస్య ఏవ ఆకాంక్షేత్ అవమానస్య సర్వదా ।** ఒకడు 'అమృతము'ను కోరుకొను విధంగా, బ్రహ్మ తత్త్వాభ్యాసి ఇతరుల నుండి అవమానమును అమృతప్రాయంగా భావిస్తాడు. తనకు అవమానమును, ఇతరులకు తన వలన సుఖము కలుగుటకు ఇష్టబడుతూ ఉంటాడు. **సుఖమ్ చరతి లోకేఽస్మిన్, అవమంతా వినశ్యతి ।** "సుఖము (గౌరవము) లోకములో బంధమే అవుతుందని, అవమానము లోక బంధములను నశింపజేస్తుందని ఎరిగి, భావించి ఉంటాడు. పైగా కష్టములు, అవమానములు వచ్చి పడుచున్నప్పుడు "నాకు తితిక్ష (సహించటము)" అనే యోగము (అష్టాంగ యోగములలో ఒకటి) అలవరుచుచున్నదని సంతోషము పొందుతాడు. సుఖములు, సన్మానములు తితక్ష యొక్క అభ్యాసమునకు వ్యతిరేకం అవుతాయని భావిస్తాడు.

**న చ ఇమం దేహం ఆశ్రిత్య వైరం కుర్వీత కేనచిత్ ।** ఈ దృశ్య జగత్తులో సంచరిస్తున్నప్పుడు 'దేహభావము' ఆశ్రయించి తద్వారా తదితరులతో వైరము కలిగి ఉండకూడదు. ఆత్మ భావమును ఆశ్రయించి మధురమగు స్నేహభావమనే కలిగి ఉండాలి. **కృధ్యంతం న ప్రతికృధ్యేదా । కృష్టః కుశలం వదేత్ ।** కోపగించువారి పట్ల కోపము ప్రదర్శించకూడదు. కోపగించువానిపట్ల కుశలమే (క్షేమమే) ప్రకటించాలి. క్షేమమే కోరుకోవాలి. కుశలమే అడగాలి.

సప్త (7) ద్వారముల నుండి (పంచేంద్రియముల నుండి, మనోబుద్ధుల నుండి జనించే వ్యావహారిక సందర్భములలో అబద్ధము పలుకరాదు. (శబ్దము 7 ద్వారముల నుండి జనిస్తుందని శాస్త్ర విశ్లేషణము).

ఆధ్యాత్మ జ్ఞాన నిష్ఠుడై ఆత్మ భావన యందు అసీనుడై ఉండాలి. దేనినీ ఆపేక్షించక, ఆశించక ఆత్మజ్ఞాన భావనతో ఆత్మ సుఖమునే ఆశ్రయిస్తూ, ఇక్కడి దృశ్యము నందు సంచరించుచుండును గాక।

ఎవడైతే పంచేంద్రియములను నియమించి, నిరోధించి, రాగ - ద్వేషములను (ఇష్టము - అయిష్టములను) క్షీణింపజేసుకుంటూ ఉంటాడో అట్టివాడు జన్మ-మృత్యు పరిధులను దాటి అమృతత్వము సిద్ధించుకోగలడు.

## ఈ భౌతిక శరీరము ఎటువంటిది ?

ఈ శరీరము బొమికలు, స్థూనము (వెన్నెముక స్థంభము), స్నాయువు (సన్నటి నరములు) లచే బద్ధమై పిచ్చుక గూడువలె అమరిక కలిగి ఉన్నట్టిది. మాంసము, శోణితము (రక్తము) లచే లేపితమై (అలకబడినదై) ఉన్నది. చర్మముచే కప్పబడి ఉన్నది. మూత్రము, పురీషము (ఉచ్చ, పెంట) మొదలైన దుర్వాసన పదార్థములతో కూడి ఉన్నట్టిది. ముసలితనము, ఆకలి బాధలు, శోకము (దుఃఖము) ఇందులో సమావేశమై ఉన్నాయి. ఇందులో ఎన్నో రోగములు ప్రదర్శనమవటానికి సంసిద్ధమై ఉన్నాయి. రజస్వలము (రక్త స్రావము) మొదలైన వాటితో కూడిన ఈ భూత శరీరము అనిత్యము. శాశ్వతమైన వస్తువే కాదు! ఇది వదలి ఉండవలసినదే గానీ, పట్టుకొని కులకవలసినది కానే కాదు! ఇటువంటి రక్తము, మాంసము, విసర్జనములు, కండరములు, మజ్జ (ఎముకలలో నూనె), ఇవన్నీ కలిసియుండి ప్రదర్శనమగుచున్న ఈ శరీరమును చూచి ఎవ్వడైనా ప్రీతి పొందుతూ ఉంటే - అట్టివాడు పర్యవసానంగా అనేక నరకములు రుచి చూడవలసి వస్తుంది.

ఎవ్వడైతే **"ఈ దేహమే నేను"** అని నమ్మి ఉంటాడో, అట్టి భావనలచే "కాలసూత్రము, మహావీచిక, అసిపత్రము" అనబడే నరక స్థానములకు రహదారిని ఆశ్రయించినవాడే అగుచున్నాడు. అందుచేత, సర్వనాశనము వైపుగా ఉపస్థితము (placed) అయినట్టి "నేను భౌతిక దేహభావమును - (శుచిగా ఉన్న ఒక వ్యక్తి కుక్క మాంసము తింటున్నట్టివానికి దూరముగా ఉండు విధంగా) - సర్వ ప్రయత్నములతో విసర్జించి ఉండాలి.

## ద్వంద్వమును వదలాలి । బ్రహ్మమును పట్టుకోవాలి

ఓ నారదా ! "బంధవిముక్తి పొందాలి" అను ఉత్తమ ఆశయము గల జీవుడు "సుకృతముల వలన కలిగే ప్రియము. దుష్కృతముల వలన కలిగే అప్రియము" (ప్రియా ప్రియముల) రెండిటినీ ప్రక్కకు పెట్టి (వదలివేసి) **ధ్యానయోగమునకు** ఉపక్రమించాలి.

అట్టి ధ్యాన యోగ అభ్యాసముచే సనాతనము (That which is there from the begining and is blossoming beyond all qualities) అయినట్టి స్వస్వరూపమగు పరబ్రహ్మమును ఆశ్రయించాలి. (భక్తి – జ్ఞాన – యోగ – సేవా – సమర్పణ – పూజ – ధ్యాన – తపో ఇత్యాది) ఆయా ఏదో మార్గములుగా భౌతిక శరీరముతోను దృశ్యముతోను ఏర్పడే సంగము (Attachment)ను నెమ్మది నెమ్మదిగా మానసికంగా త్యజించి వేయాలి. సమస్త ద్వంద్వముల నుండి విముక్తుడై ఈ జీవుడు 'బ్రహ్మము' నందు ఆసీనుడు, అవితష్ఠిడు అగును గాక।

## భిక్షు సన్యాస విశేష లక్షణములు

భిక్షువు ఆత్మసిద్ధి కొరకై ఏకాంతముగా (ఒంటరిగా), ఎవ్వరి సహాయము లేకుండా చరించుచుండను గాక. ఆ విధంగా ఒంటరిగా సంచరిస్తూ ఆత్మ ధ్యానము విడువక, హీనత్వము ఆశ్రయించక ఉంటాడు.

**చేతిలో కపాలము** (భిక్షుక పాత్రతోను, వృక్షముల మూలలో (మొదట్లో) నివాసము, ఆకులే వస్త్రములు గాను కలిగి ఉంటాడు. ఎవ్వరి సహాయము కోరకపోవటము, సర్వత్రా సమదర్శనము, సర్వత్రా ప్రేమ మొదలైనవి ముక్తుని స్వాభావిక లక్షణములు.

*భిక్షుక యతి ఇంకా కూడా,*

- సర్వదా సమస్త సహజీవులకు హితము, క్షేమము కలుగజేయు నడవడిక కలిగి ఉంటాడు.
- ఎల్లప్పుడు పరమ శాంత స్వభావుడై ఉంటాడు.
- త్రిదండి (మనో దండము, వాక్ దండము, కర్మ దండము అనే త్రి(3) దండములు) ధరించిన వాడై ఉంటాడు. మనో, వాక్ కర్మలను తన చేతిలోని ఉపకరణములుగా కలిగి ఉంటాడు. అంతేగాని వాటికి తాను దాసుడై ఉండడు.
- కమండలువు (సన్యాసులు జలము కలిగి ఉండు పాత్ర) మాత్రమే కలిగి ఉంటాడు. ఏకారాముడై (ఒంటరివాడై) సర్వదా ఏకమగు బ్రహ్మమునందు రమిస్తూ ఉన్నవాడై భిక్ష కొరకై గ్రామములో ప్రవేశిస్తూ ఉండును గాక।

  **ఏకో భిక్షుః యథోః ఉక్తస్వాత్ । ద్వా ఏవ మిథునం స్మృతం త్రయో గ్రామః సమాఖ్యాత ఊర్ధ్వంతు నగరాయతే॥**

  ఒక్కడు మాత్రమే (ఏకాంతుడై) ఒంటరిగా సంచారము కలిగి ఉంటే "భిక్షాటనము" అని పిలుస్తారు.

- ఎప్పుడూ **'ఏకో భిక్షువు'** అయి ఉండాలి (భిక్షాటనము).
- ఒకవేళ ఇద్దరు భిక్షువులు కలిసి ఉంటే **'మిథునము'** (జంట) అవుతారు.
- ముగ్గురు భిక్షువులు కలిసి ఉంటే **'గ్రామ సమాఖ్యాతము'** అంటారు.
- అంతకు మించి భిక్షువులు కలిగి ఉంటే **'నగర సమాఖ్యాతము'** అవుతుంది.

నగరముగా (ముగ్గురు మించి) గాని, గ్రామము (ముగ్గురు కలిసి) గాని మిథునముగా (జంటగా) గాని ఉచితము కాదు. భిక్షువుకు ఏకోభిక్షుత్వమే (ఒంటరిగా భిక్షువై ఉండటమే) ఉచితం. ఒక్కరి కంటే ఎక్కువ భిక్షువులు కలిగి ఉంటే పరస్పర సంబంధము కారణంగా రాజవార్తలు, పరస్పర పూర్వాశ్రమ వార్తలు, లోక సంభాషణలు మొదలైనవి అధికమై భిక్షకునికి సంబంధించిన స్వధర్మముల నుండి జారిపోవు అవకాశములు అధికంగా ఉంటాయి. ఇద్దరు, ముగ్గురు (లేక) ఎక్కువ మంది కలిసి ఒకచోట ఉండటం చేత పరస్పరము లోక సంబంధమైన విషయముల పట్ల సంభాషించుకొను వ్యసనము, స్నేహము, పైశున్యము (పరస్పరము కోపతాపాలు కలిగి ఉండటము, కొండెములు చెప్పుకోవటము), మాత్సర్యము (అసూయ, పగ, విద్వేషము) మొదలైనవి ఏర్పడగలవు. అందుచేత అధికాధికంగా 'ఏకాంతము'గా ఉంటూ ఉండాలి. ప్రపంచ విషయములను పరస్పరం ఆలాపనములు చేయరాదు. వాటి పట్ల నిస్పృహ (Unavocative and unconcern) కలిగి ఉండాలి.

**యతి అయినవాడు ఎవరితోనైనా ఏదైనా సంభాషించు సందర్భములో "ఇదంతా నారాయణమయం! నా ఎదురుగా ఉండి , కనబడేదంతా శ్రీమన్నారాయణుని ప్రత్యక్షరూపాలే. ఇదంతా నారాయణమే – అని ఉద్దేశిస్తూ "నారాయణ" శబ్దమును ప్రతి సందర్భములోను పలుకుచుండునుగాక. దద్యాత్ 'నారాయణ' ఇత్యేవం ప్రతివాక్యం సదా యతిః.**

యతి మముక్షువు ఇంకా కూడా ఈ ఈ లక్షణములు (లేక) స్వభావాలు ఆశ్రయిస్తూ ఉండాలి.

**ఏకాకీ చింతయేత్ 'బ్రహ్మ' మనోవాక్కాయ కర్మభిః ।** ఏకాకిగా (being alone) ఎక్కువ సేపు ఉంటూ ఉండాలి. మనస్సు చేతను, వాక్కు చేతను, కాయము చేతను కనబడే శరీరములన్నిటిలో 'శరీరి'గా ఉన్నది నారాయణుడే" – అను మననము ధరించాలి. బ్రహ్మము గురించియే అనునిత్యంగా చింతన (Chanting) చేయాలి. అనిపించే వరకు అనుకుంటూనే ఉండాలి.

**మృత్యుం చ న అభినందేత, జీవితం వా కథం చ న ।** ఎప్పుడూ కూడా చావాలని గాని, ఎంతో కాలం బ్రతకాలని గాని భావావేశము కలిగి ఉండక, 'వర్తమానము'ను సద్వినియోగ పరచుకోవాలి. సర్వాత్మకమగు పరబ్రహ్మము గురించే యోచన, ఉ సాసన కలిగి ఉండాలి.

**కాలమేవ ప్రతిక్షేత యావత్ ఆయుః సమాప్యతే ।** ఆయుష్షు ఉన్నంతవరకు సమస్తమును 'కాలగతి' కి వదలివేసి, తాను బ్రహ్మము గురించిన ధ్యాసయందు నియమితుడై ఉండాలి.

రాజు గారి ఆజ్ఞను అనుసరించి, మరింకేమీ (అవునా ? కాదా ? అని) ఆలోచించకుండా, రాజాజ్ఞను నిర్వర్తించే భృత్యువు (రాజసేవకుని వలె) కాలగతిని అంగీకరించు బుద్ధి కలిగి ఉండాలి. బ్రహ్మము గురించిన 'జ్ఞానము (తెలుసుకోవటము), బ్రహ్మమునే దర్శించటము, బ్రహ్మమునందు ప్రవేశము పొందటమునందే ధ్యాసనంతా నిలుపాలి. ఇక ఇక్కడి జీవన్ – మరణ విశేషములన్నీ కాలమునకు సంబంధించినవిగా భావించాలి. జీవన్మరణముల పట్ల కావాలని గాని, వద్దనిగాని అనుకోవలసిన పని ఏమీ యతికి స్వాభావికంగానే ఉండదు.

## యతి లక్షణములు – యతి స్వాభావికములు

***ఏ ఆశ్రమంలో ఉన్నాకూడా యతి లక్షణములు ఆశ్రయించువాడు యతియే అగుచున్నాడు.*** అట్టి యతి స్వాభావికముల గురించి వివరిస్తున్నాను. నారదాది ముని శ్రేష్ఠులారా! వినండి! ముఖ్యంగా యతి ఆరు(6) విశేష స్వాభావికాలు కలిగి ఉంటున్నాడు.

**శ్లో॥ అజిహ్వః షండకః పంగుః అంధో బధిర ఏవ చ**
**ముగ్ధశ్చ ముచ్యతే భిక్షుః షడ్భిః ఏతైః న సంశయః॥**

1) అజిహ్వుడు 2) షండకుడు 3) పంగు 4) అంధుడు 5) బధిరుడు 6) ముగ్ధుడు అయిన ఆరు లక్షణములు గల భిక్షువు (సన్యాసి) గానీ, ముముక్షువు గాని సమస్త సంసార (దృశ్య) బంధములనుండి తప్పక విడివడగలడు. ఈ ఆరు భిక్షుక – అభ్యాసముల గురించి మరికొంత వివరణగా చెప్పుకుందాము.

**1) అజిహ్వుడు (నాలుక లేనివాడు) :** రెండు అభ్యాసములు గలవానిని 'అజిహ్వయతి' అని పిలుస్తారు.

i) **ఇదం ఇష్టం,ఇదం నేతి అశ్నన్ అపి న సజ్జతి॥** ఆహారము తింటూ "ఇదంటే నాకు ఇష్టము, రుచికరము – ఇదంటే నాకు ఇష్టము ఉండదు" – అను భావన లేకుండా **"ఆహారములోని సమస్త రుచులు భగవత్ ప్రసాదితమే"** అని ఆస్వాదించటము అజిహ్వుని మొదట స్వాభావిక లక్షణము.

ii) **హితం, సత్యం, మితం వక్తితం 'అజిహ్వం' ప్రచక్షతే ।** నాలుక ఆహారం తీసుకోవటం, మాట్లాడటం అను రెండు ధర్మములు నిర్వర్తిస్తోంది. మాట్లాడేటప్పుడు అందరికీ ఇష్టమని అనిపించేటట్లు సంభాషించటము, సత్యమే పలుకటము (అబద్ధములు ఆడకపోవటము), మితముగా మాట్లాడటము (అతిగా మాట్లాడకపోవటము) ఈ లక్షణములు అజిహ్వునిలోని రెండవ స్వాభావికము. **కాబట్టి యతి లక్షణములు అజిహ్వుడై ఉండటము.**

**2) షండకుడు / షండుడు / నపుంసకుని వంటి యతి : అద్యజాతాం యథా నారీం, తథా షోడశ వార్షికమ్, శతవర్షాంచ యో దృష్ట్వా నిర్వికారః స షండకః ।** అప్పుడే పుట్టిన బిడ్డను 16 సం॥ల యౌవనవతిని, నూరు సంవత్సరముల వయసుగల అవ్వను ఒకే నిర్వికార (వికారరహిత బ్రాహ్మీ) దృష్టితో చూడగలవాడు "యతిషడంగ లక్షణుడు".

**3) పంగువు (కుంటివాడు వంటి యతి) : భిక్షార్థ మటనం యస్య విణ్మూత్ర కరణాయ చ, యోజనాత్ న పరం యాతి సర్వధా 'పంగు' ఏవ సః ।** భిక్ష కొరకు గాని, సంచారము కొరకు గాని యోజనము (ఆమడ, 4 క్రోసులు) దూరము మించి నడవక, మిగిలిన సమయమంతా ఒకచోట కూర్చుని ఆత్మోపాసన గురించిన అనుష్ఠానము నిర్వర్తించువాడు 'యతి పంగువు' (కుంటితనము ఉపాసించు యతి) అగుచున్నాడు.

**4) అంధుడు (అంధుడు వంటి యతి) : తిష్ఠతో వ్రజతో వాపి యస్య చక్షుః న దూరగమ్, చతుర్యుగాం భువం ముక్త్వా పరివ్రాటో 'అంధ' ఉచ్యతే ।** ఒకే చోట కూర్చుని ఉన్నప్పుడు గాని, మరొక చోట బాటలో నడుస్తూ ఉన్నప్పుడు గాని అతని చూపు నాలుగు బారలకు మించి వెళ్లుచూడదో అతని నేత్రేంద్రియము (దృష్టి) సందర్భావసరమునకు మించి ఎక్కడెక్కడికో వెళ్లక అదుపులో ఉండి ఉంటుందో, ఆత్మ దృష్టిని వదలకయే ఉంటుందో, అట్టివాడు **'యత్యాంధుడు'** అనబడుచున్నాడు.

**5) బధిరుడు (చెవిటివాడు వంటి యతి) : హిత – అహితం మనోరామం, వచః శోకావహం తు యత్, శృత్వాపి నశృణోతీవ, బధిరః స ప్రకీర్తితః॥** హితమైన, అహితమైన విశేషముల పట్ల శోకము పొందు మాటలు వింటున్నప్పుడు కూడా ఎవడు వింటూ కూడా విననివాని వలెనే ఉండగలడో, అట్టివాడు **'యతి–బధిరుడు'**.

**6) ముగ్ధుడు : సాన్నిధ్యే విషయాణాం యః సమర్థో వికలేంద్రియః, సుప్తవత్ వర్తతే నిత్యం స భిక్షుః – 'ముగ్ధ' ఉచ్యతే ।** ఎదురుగా అనేక ఇంద్రియ విషయములు ఏర్పడి ఉన్నప్పటికీ **ఇంద్రియములు జయించినవాడై,** విషయముల పట్ల సుప్తము (గాఢనిద్ర వహించినవాడై ఉన్నవాడు) "యతి–ముగ్ధుడు" అనబడుచున్నాడు.

- *రుచిని జయించి, మంచి వాక్కును కలిగియున్న నాలుక*
- *బాహ్య సౌందర్యమునకు వశముగాని ఇంద్రియ నిగ్రహము*
- *అనవసరమైన తిరుగులకు వ్యర్థము చేయని నడకలు*
- *చెడును చూడని, మంచిని మాత్రము చూచి గ్రహించే చూపులు*
- *చెడు విషయములు వినక, ఆత్మజ్ఞాన – ఆత్మోపాసన సమాచారము పట్ల మాత్రమే శ్రద్ధగల వినికిడి*
- *ఇంద్రియ విషయములచే ఆకర్షితము కానట్టి, మౌనము వహించు బుద్ధి*
- *ఇవి కలిగియున్నవాడు యతి ధర్మములను ఉపాసించువాడై, ఏ ఆశ్రమము వాడైనా యతీశ్వరుడు కాగలడు. అతడు సర్వజ్ఞుడై ఉండి కూడా సంసార జనులకు అందరి వలె సామాన్యుని వలెనే అగుపిస్తాడు.*

## యతి మార్గవర్తికి నిషేధములు (చేయకూడనివి)

**చూడకూడనివి (షట్ న పశ్యత్)**

1) ఇంద్రియములను ఆకర్షించే నాట్య విన్యాసములు.
2) ద్యూతము (డబ్బుతో పందెములు, పేకాట మొదలైనవి).
3) ప్రమోదము (ప్రమాదాం సుహృదం తథా): (కామదృష్టితో స్త్రీలతో సంభాషణము) ధన దృష్టి, కామ దృష్టి కలవారితో స్నేహము
4) భక్ష్యము : తినగూడనివి తినటము
5) భోజ్యము : మ్రింగకూడనివి, త్రాగకూడనివి (మత్తు పానీయాలు) సేవించటము
6) ముదక్యము : ముదము (ఆశ్చర్య సంతోషములు) కలిగించే వస్తువుల పట్ల, వ్యక్తుల పట్ల ఆకర్షితులవటము.

ఈ ఆరు – **షట్ న పశ్యేత్ కదాచన** – యతి అభ్యాసి చూడకూడనివి

## మనస్సుతో కూడా చింతన చేయకూడనివి

1) క్రియా విషయ – వస్తు – బంధజనముల పట్ల **రాగము.**

2) పై సందర్భముల పట్ల **ద్వేషము.**

3) **మదము** (గర్వము, మత్తు).

4) కల్పిత ఆపాదిత విషయముల పట్ల సత్యము అను భావము కలిగించు **మాయ.**

5) ఇతరులకు నష్టము, బాధ, అవమానము కలిగించాలనే **ద్రోహ బుద్ధి.**

6) **మోహము** (సాకారమగు వస్తువులు, విషయముల పట్ల ఊహ – అపోహలతో వశము కావటము - (Attraction and ownership towards inanimate objects).
ఈ ఆరు యతి మనస్సుతో కూడా సంకల్పించనైనాకూడదు.

## యతి వర్జించవలసిన షట్ పాతకములు

1) మంచము 2) తెల్ల వస్త్రములు 3) స్త్రీల సౌందర్యము గురించిన కథల శ్రవణము, మాట్లాడటము 4) చిత్త చాంచల్యము– క్షణమొక అభిప్రాయం కలిగి ఉండటము 5) పగటి నిద్ర 6) విలాసము ఆశయముగా దూరప్రయాణము. ఈ ఆరింటిని షట్ పాతకములుగా భావించాలి.

ఇంకా కూడా ...

- ఆత్మచింతన చేయువాడు అనేకసార్లు దూర దూర యాత్రలు సంకల్పించక, ఒక ప్రశాంత ప్రదేశము ఎన్నుకొని **'ఆత్మచింతన'** యందు నిమగ్నము అయి ఉండును గాక।
- ముక్తికి కారణము కాగల విచారణ కొరకై నిత్యము వేదములలో జ్ఞాన విభాగము అయి ఉన్న ఉపనిషత్ విద్యను అధ్యయనము, అభ్యాసము చేయుచుండును గాక।
- సుదీర్ఘముగా తీర్థయాత్రలను నిర్వర్తించకుండును గాక।
- ఎక్కువసార్లు స్నానములు, అధికంగా ఉపవాసము (ఆహారము రోజంతా తీసుకోక పోవటము) ఉచితం కాదు.
- ఎక్కువగా శాస్త్ర పఠన శీలుడై వుండరాదు. తెలుసుకొన్నది అభ్యాసముగా తీర్చిదిద్దుకోవాలి.
- అధికాధికంగా వ్యాఖ్యానపరుడై జీవితమంతా గడిపివేయరాదు. తాను ఆత్మ గురించి ఎరిగినది – ఎదురుగా దర్శించు అభ్యాసము, స్వానుభవముగా మరల్చుకోవాలి.

**అపాపమ్ అశఠంవృత్తం అజిహ్మం నిత్యమ్ ఆచరేత్ ।** యతి అయినవాడు పాపరహితమైన నిర్మల జీవితము కలిగి వుండాలి. కపట స్వభావము కలిగి ఉండరాదు. అశఠం – మూర్ఖత్వము వహించువాడై ఉండకూడదు.

తాబేలు ప్రమాదమును శంకించిన మరుక్షణం తన అంగములను ఉపసంహరిస్తుంది కదా! అట్లాగే యతి తన ఇంద్రియ ధ్యాసల దోషములను గుర్తించి ఇంద్రియములను (చూపును, వినికిడిని మొదలైనవాటిని) పాపపు ధ్యాసలు ఏర్పడకుండా వెనుకకు మరల్చి ఆత్మ ధర్మము అగు 'సమత్వము' నందు ప్రతిక్షేపించాలి.

యతి అయినవాడు –

- ఇంద్రియ మనో వృత్తులను (avocations) క్షీణింపజేసుకొనుచూ ఉండాలి.
- **'దృశ్యము నుండి ఏదో ఆశించటము'** అను దురభ్యాసము నుండి విరమించాలి.
- మమకారము, అహంకారములను దగ్గరకు చేరనీయకూడదు.

- దేనినీ 'సొంతము' అనే భావముతో పరిగ్రహించకూడదు. (పడవలోనికి నీరు రానివ్వని తీరుగా) వస్తువులను, విషయములను "నా సొంతము" అనే భావన రూపంగా హృదయమునందు ప్రవేశించనీయకూడదు.
- ఏదో పొందాలనే వృత్తితో ఎవరికీ నమస్కరించకుండు గాక।
- ఏదీ తనదిగా భావించక, స్వధాకారుడై ఉండకుండు గాక।
- మమకార రహితుడై, దేనినీ ఆపేక్షించనివాడై, ఆశను జయించినవాడై ఉండు గాక।
- పై సాధనలను ఆశ్రయిస్తూ ఏకాంతవాసి (alone) అయి ఎవడు ఉంటాడో ఆత్మతత్త్వమును, ఆత్మ ధర్మమును అనుష్ఠిస్తూ ఉంటాడో, అట్టివాడు ఏ ఆశ్రమంలో ఉన్నా కూడా ముక్తిని తప్పక సిద్ధించుకోగలడు.

ఇందులో సందేహము లేదు.

## సన్యసించు విధి విధానము

ఓ నారదా ! తదితర శౌనకుడు మొదలైన శ్రోతలారా ! ఈ జీవుడు దుఃఖ బంధములను తొలగించుకొను విధానము వినండి.

**"నేను దృశ్యముతో తన్మయుడనై అనేక దుఃఖములు కొనితెచ్చుకుంటున్నాను. అజ్ఞానమును తొలగించుకొని, బంధ విముక్తుడను కావాలి"** అను ఆవశ్యకతను ఎరిగినవాడు ఇక తాత్సారం చేయరాదు (Should not be lazy and delay from putting forth a programme). అప్రమత్తుడు (wel alert) అయి ఉండాలి.

- బుద్ధిని సంస్కరించి, నిర్మలము చేయు ఉత్తమ కర్మలు ఆశ్రయించాలి. విధ్యుక్త కర్మలను (One's own duties) పరమాత్మను ఉపాసిస్తున్న భావనతో **కర్మయోగ మార్గంగా నిర్వర్తించాలి.**
- సర్వత్రా **'పరాప్రేమ'** రూపమగు భక్తి (అద్వేష్టా సర్వభూతానాం, మైత్రః మొదలైన భక్తి గుణములను) అభ్యాసముగా కలిగి ఉండును గాక.
- ఆత్మ స్వాతంత్ర్యమును ఉపాసిస్తూ వైరాగ్యము (రాగరహితత్వము) ఆశ్రయించును గాక.

## క్రమము

బ్రహ్మచారి అయి, ఆ తరువాత గృహస్థుడై, ఆపై వానప్రస్థుడై, శాస్త్ర విహితమైన ఆయా ఆశ్రమ ధర్మములు నిర్వర్తించుచూ, కర్మ – జ్ఞాన యోగి అయి, **ఆత్మోపాసన సర్వదా, సర్వత్రా కొనసాగించును గాక.**

బ్రహ్మచర్యము తరువాత గృహస్థాశ్రమము స్వీకరించవచ్చు లేదా పూర్ణ నైరాశ్యము కలిగినవాడై ఉంటే బ్రహ్మచర్యము నుండియే సన్యాసాశ్రమము స్వీకరించి ప్రవ్రజుడు కావచ్చు కూడా।

సన్యాసమునకు ప్రవ్రజుడు కావటానికి తగిన సమయము ఏది ? విరాగి అయి, సమస్త దృశ్య విషయముల పట్ల వైరాగ్యము పొందటమే!

- వ్రతములు చేయుచున్నవాడైనా (లేక) 'అవ్రతుడు' అయినా సరే,
- స్నాతకుడు (బ్రహ్మచర్య వ్రతము స్వీకరించినవాడు) అయినా (లేక) అస్నాతకుడు అయినా సరే వైరాగ్యము పొందిన మరుక్షణం సన్యాసాశ్రమము ఆశ్రయించు గాక।

ఏ రోజు అయితే ఒకనికి సమస్త ప్రాపంచక సంగతి, సంబంధ, సందర్భములపట్ల మనస్సునందు అనురక్తి తొలగిపోయి, విరక్తి జనిస్తుందో, ఆ రోజే ప్రవ్రజము (సన్యాసము) స్వీకరించును గాక।

అందుకు గాను 'ప్రాజాపత్యము' అనే అగ్నికార్యము (వేష్టి) నిర్వర్తించునుగాక (లేదా) కనీసము అగ్నిదేవతాహ్వాన (లఘు) ఉపాసనలన్నా చేయాలి. ఎందుకంటే, **అగ్నియే ప్రాణస్వరూపమై ఉన్నది.** సృష్టిలో 'అగ్నేయ యజ్ఞము' వలననే ఈ జీవుడు ప్రాణము కలవాడు అవుతున్నాడు. అందుచేత త్రిధాతు సంబంధమైన త్రైతాగ్ని రూపమగు (గార్హపత్యాగ్ని, ఆహవనీయాగ్ని, దక్షిణాగ్నుల ఆహ్వానము చేసి) యాగము తప్పక చేయాలి. (పంచాగ్నులలో 4వది సభ్యము – అవసద్యము, ఐదవది సూర్యుడు).

త్రైతాగ్నులలో త్రిధాతువులు 1) సత్త్వగుణము 2) రజోగుణము 3) తమోగుణము అని కూడా గూఢార్థము. అందుచేత త్రైతాగ్ని వేష్ఠి నిర్వర్తించేటప్పుడు సత్త్వ, రజో, తమో గుణములను అగ్నియందు మానసికంగా మంత్ర శబ్దములతో హోమము చేయాలి. **ఎందుకంటే మహదాశయమగు ప్రవ్రజము (సన్యాసము) అనునది త్రిగుణాతీత / నిర్గుణ స్థానము అయి ఉండటం చేత.**

## అగ్నివేష్టి మంత్రము

**అయం తే యోనిః ఋత్విజో యతో జాతో అరోచథాః**
**తం జానన్ నగ్న అరోహథానో వర్ధయా రయిం ।**
**ఇతి అనేన మంత్రేణ అగ్నిం ఆజిఘ్రేత్ ఏషవా వై**
**అగ్నేర్యోనిర్యః ప్రాణః ప్రాణం గచ్ఛ స్వాం యోనిం గచ్ఛ స్వాహా ।**

*ఆత్మజ్ఞాన సంపన్నులగు ఋత్విజులు, – ఈ దృశ్య వ్యవహారమంతా రుచించనివారై – తత్త్వజ్ఞులై ఏ ఆత్మయోని యందు ప్రవేశిస్తున్నారో అట్టి స్వస్వరూపాత్మ తేజస్సును వేగముగా జేరుటకై నగ్నధారణకు సిద్ధపడుచున్నాము. బ్రాహ్మీస్థితికి ఆరోహణము కొరకై (For the purpose of stepping up) త్రైతాగ్నులను ప్రజ్వలింపజేయుచున్నాము, వర్ధింప జేయుచున్నాము.*

*శాస్త్రోక్తములైన ఆయా మంత్రములను పలుకుచు, దేవతలకు స్తుతులను పలుకుచు ఈ అగ్నికి ఆహుతులను సమర్పిస్తూ హోమము చేయుచున్నాము. మా ఆహుతులను స్వీకరిస్తూ అగ్ని భగవానుడు మా వ్యష్టి ప్రాణమును విశ్వగత ప్రాణమునందు ఏకము చేసి ఆహుతిగా పవిత్రము చేయును గాక.*

ఈ విధంగా మంత్రము చదువుచు, ఆహవనీయాగ్ని కూడా వెలిగించి అగ్నికి ఆహుతులు సమర్పించాలి.

సన్యసించు సందర్భములో ఒకవేళ అగ్నికార్యము నిర్వర్తించటానికి కావలసిన సమిధము, అగ్ని పరికములు (సరంజామా) లభించకపోతే **యత్ అగ్నిం నవిందేత్, అప్సుజుహోయాత్ – "ఆపోవై సర్వదేవతాః । సర్వాభ్యో దేవతాభ్యో జుహోమి స్వాహా"** అగ్ని లభించక పోయినప్పుడు జలము సకల దేవతా స్వరూపమే కాబట్టి, సమస్త దేవతలను ఉద్దేశించి ఈ చెప్పుకున్న మంత్రముతో హోమము చేయాలి.

ఆ తరువాత **సాజ్యం హవిః అనామయం మోదమ్ ఇతి ।** – ఈ సమర్పిస్తున్న జలహవిస్సుతో అనామయుడగు పరమాత్మ తృప్తి చెందునుగాక – అను మంత్ర – మంత్రార్థములను పలుకుచూ, స్మరిస్తూ ప్రాశ్నీయము నిర్వర్తించాలి (జలము స్వీకరించాలి).

1) శిఖను 2) యజ్ఞోపవీతమును 3) పితరుని (తండ్రిని) 4) కుమారుని 5) కళత్రమును (భార్యను) 6) కర్మలను 7) వేదములో మహావాక్యములకు వేరైన తదితర మంత్రోపాసనలను విడచివేయాలి.

**పరివ్రాజాత్మ విమోక్ష మంత్రము అయినట్టి అఖండ బ్రహ్మోపాసనా త్రైధా మంత్రమును 1) తత్త్వము 2) సోఽహమ్ 3) త్వమేవాహమ్ త్రివిధ రూప మహామంత్రమును** శబ్దార్థ పూర్వకంగా స్వీకరించి, సన్యాసము స్వీకరించాలి. సన్యాసి సాక్షాత్ పరబ్రహ్మమునే (తత్త్వమ్ – సోఽహమ్ – త్వమేవాహమ్ – పరమార్థమునే) నేరుగా ఉపాసించాలి. అందు కొరకై అప్పటి వరకు సాధనగా కలిగియున్న అన్యదేవతా భావనార్థ మంత్రములన్నీ సన్యాసి అగుచు తర్పణ పూర్వకంగా వదలి వేయాలి. బ్రహ్మమునే ఉపాసిస్తూ 'బ్రాహ్మణుడు'గా మాత్రమే అయి ఉండాలి.

## యజ్ఞోపవీత శూన్యుడు 'బ్రాహ్మణుడు' అవుతాడా ?

**శ్రీ నారదమహర్షి :** హే పరబ్రహ్మమూర్తీ ! పితృదేవా ! జగత్ పితామహా ! మీరు చెప్పుచున్న విధానము ప్రకారము సన్యసించేటప్పుడు యజ్ఞోపవీతమును కూడా సమర్పించి వేయాలా ?

**శ్రీ పితామహుడు (హిరణ్యగర్భుడు) :** అవును. సన్యసిస్తూ ఉన్నప్పుడు 'యజ్ఞోపవీతము' ను కూడా విడచివేయును గాక.

**శ్రీ నారద మహర్షి :** హే సృష్టి సంకల్ప ఆది స్వరూపా ! బ్రహ్మ భగవాన్ ! ఇప్పుడు నాలో ఒక సందేహము జనిస్తోంది.

'ఉపనయనము' సందర్భములో బ్రహ్మోపాసనా స్వీకారము చేస్తూ, అందుకు సంజ్ఞగా యజ్ఞోపవీతము ధరిస్తున్నారు కదా! ఇప్పుడు సన్యసిస్తూ ఆ యజ్ఞోపవీతము వదలి వేస్తూ ఉండగా, అట్టివాడు బ్రహ్మోపాసకుడగు బ్రాహ్మణుడు ఎట్లా శాస్త్రార్థానుసారంగా కాగలడు ?

## "బ్రహ్మసూత్ర ధారణ" అనగా ఈ విశ్వమంతా సూత్రముగా ధరించటమే!

**పితామహుల వారు :** 'త్రివృత్ సూత్రము' (మూడు వృత్త దారములు గల సూత్రము) అనగా ప్రత్తిదార నిర్మితము మాత్రమేనని అనుకుంటున్నారా ? కానే కాదు. అట్టి త్రివృత్ – యజ్ఞోపవీతము మనోబుద్ధులతో ధరించటానికై సంజ్ఞార్థము మాత్రమే. పైగా సంజ్ఞార్థముగా (సంజ్ఞా పూర్వకంగా) ధరించిన దారపు త్రిసూత్రమునకు పరిమితమై పరమార్థమును ఆశ్రయించకపోతే ప్రయోజనము ఏమంటుంది ? ఏమీ ఉండదు. అంతరార్థమేమిటో తెలుసుకొని, ఉపాసన పూర్వకంగా ధరించాలి సుమా.

బ్రహ్మమును ఉపాసించుచూ, దృష్టిని పవిత్రము, మహోన్నతము చేసుకోవటానికి యజ్ఞోపవీత ధారణ చెప్పబడుతుంది.

**పరమార్థము :**

**1) హృదిస్థా దేవతాః సర్వాః ।** సమస్త దేవతలు హృదయమునందే నివాసము కలిగి ఉన్నారు.

**2) హృది ప్రాణాః ప్రతిష్ఠితాః ।** ప్రాణశక్తి కూడా హృదయమునందే ప్రతిష్ఠితము అయి ఉన్నది.

**3) హృదిః ప్రాణశ్చ జ్యోతిశ్చ ।** ప్రాణము హృదయమునందు జ్యోతి (వెలుగు, Enlightenment) రూపంగా ప్రకాశమానమై ఉన్నది.

ఈ మూడు సూత్రములే యజ్ఞోపవీతములోని త్రి–దారముల యొక్క అంతరార్థమని వేదార్థము గ్రహించిన బుధులు (Persons having knowledge of main purpose) ఆ రీతిగానే ఉపాసన నిర్వర్తిస్తూ ఇతరులకు గుర్తు చేస్తున్నారు.

ఈ విధంగా ఎరుగుచూ ఆత్మోపాసన ఆశయముగా గల ముముక్షువు శిఖను క్షౌరముచే తీసివేసి, విజ్ఞాన బలిమితో బాహ్య – (ప్రత్తితో నిర్మితమైన) సూత్రము త్యజించెదరు గాక।

మరి ఆశ్రయించవలసినది దేనిని ?

**యత్ 'అక్షరం పరంబ్రహ్మ' తత్ సూత్రం – ఇతి ధారయేత్।** "అక్షరమగు (That which undergoes no change) పరంబ్రహ్మమే (That Self of myself beyond all and prior to all) నేను ధారణ చేయవలసినది. అందుకు ఈ నూలు ప్రోగు ఉపవీతము ఒక ఉపకరణము మాత్రమే" అని ఎరిగి అక్షర పరబ్రహ్మ యజ్ఞ సూత్రమే ధారణ కలిగియుండెదరు గాక।

**సూచనాత్ సూత్రం ఇతి ఆహుః, సూత్రం నామ పరంపదమ్ ।** సమస్త జీవులలోను, పదార్థములలోను అంతర్యామి అయి, అంతర సూత్రమైయున్నదే పరమపద సూత్రము. (కథలోని పాత్రల స్వరూప స్వభావములన్నిటికీ ఆ కథా రచయితయే అంతర్యామి, అంతరసూత్రము అయి ఉంటున్న తీరుగా).

**యేన సర్వం ఇదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ, తత్ సూత్రం విదితం యేన స విప్రో వేదపారగః ।** ఒకే దారములో అనేక రకములైన పుష్పములు గ్రుచ్చబడిన పూదండవలె, ఏ సూత్రమునకు అనేక జీవులు, వస్తుజాలము, పరస్పర సంబంధములు, సమస్త లోకములతో కూడిన ఈ విశ్వ విశేషాలన్నీ గ్రుచ్చబడినాయో, అట్టి సూత్రము గురించి ఎరిగినవాడే వేదపారగుడగు (వేదముల పాండిత్యము గల) **"విప్రుడు".**

యోగవేత్త అయిన తత్త్వ దర్శనుడు ధరించవలసినది సమస్తమునకు అంతార్యమి అగు ఏకసూత్రమేగానీ, కేవలము ప్రత్తిదారముతో నిర్మితమైన భౌతిక యజ్ఞసూత్రము కాదు. సూత్రార్థము (సంజ్ఞ) ఏమిటో తెలిసినవాడు బాహ్య సూత్రమును బయటనే వదలి, సర్వాంతర్యామి స్వరూపమగు, ఉత్తమ స్థితమగు, యోగసూత్రమును (యజ్ఞోపవీతమును) ధరించాలి.

**బ్రహ్మభావం ఇదం సూత్రం ధారయేత్ యః స చేతనః ।** అచేతనము, జడము అగు దారపు సూత్రమును త్రెంచి వేసి, ఏ సూత్రము సమస్తమునందు సచేతనమై ప్రదర్శనగుచున్నదో, అట్టి బ్రహ్మభావము అనే సూత్రమును (అట్టి అక్షరపరబ్రహ్మ సూత్రమును) ధరించి ఉండాలి.

ప్రత్తి నిర్మితమైన సూత్రము ధరించినప్పుడు "ఏదైనా (బంధువుల మరణము మొదలైన) అశుచి జరిగినప్పుడు ఆ యజ్ఞోపవీతమును త్యజిస్తూ నూతనమైన యజ్ఞోపవీతము ధరించాలి" అనే శాస్త్రీయ నియమము లోకంలో ప్రసిద్ధిమై ఉన్నది.

అయితే, –

సమస్త జీవుల అంతర్గతమైన ఆత్మతత్త్వమును నిర్వచించు జ్ఞాన యజ్ఞోపవీతము వదలవలసిన పనిలేదు. ఏ ఉచ్ఛిష్ఠము, ఏ అశుచి కూడా అట్టి **"సమం సర్వేషు భూతేషు"** రూపమగు జ్ఞాన యజ్ఞోపవీతము ఏ క్షణము, దేనిచేతను మైలపడదు. అది అనుక్షణము ధరించవలసినట్టిది. ధరించతగినట్టిది.

అట్టి యజ్ఞోపవీతము అఖండాత్మ స్వరూపంగా ఎరిగినవాడే "సూత్రవిదుడు". కేవలము జడమగు ఉపవీతము ధరించిన వాడు, ఆ మాత్రం చేతనే **సూత్ర విదుడు** కాలేదు.

**శ్లో ॥ జ్ఞాన శిఖినో । జ్ఞాన నిష్ఠా । జ్ఞాన యజ్ఞోపవీతినః ।**
**జ్ఞానమేవ పరం, తేషాం పవిత్రం జ్ఞానముచ్యతే ॥**

ఓ నారద మునీంద్రా! పైన మనము చెప్పుకున్న యజ్ఞసూత్ర పరమార్థము తెలుసుకొన్నవానికి –

జ్ఞానమే శిఖ । జ్ఞానమే నిష్ఠ । జ్ఞానమే యజ్ఞోపవీతము । జ్ఞానమే అతని యొక్క పరమ పవిత్రమగు పరస్వరూపము.

జ్ఞానమే ధర్భలతో ధరించే పవిత్రము.

వాటి అన్నిటి యొక్క ఆశయము జ్ఞానమే! పరతత్త్వ జ్ఞానమే!

జ్ఞానమే శిఖ, అంతేగాని కేశధారణ (పిలక) ఉన్నంతమాత్రం చేత ఒకానొకడు జ్ఞాని కాడు. కేశధారణచే తను, వేదములలో చెప్పిన వైదిక కర్మలచేతను **'వైదిక బ్రాహ్మణుడు'** అను పిలుస్తారు. వారికి మాత్రమే (వైదిక కర్మానుష్ఠానము) నిర్వర్తించే బ్రాహ్మణులకు మాత్రమే **'బాహ్యసూత్రము'** ఒక బాహ్యసంజ్ఞగా చెప్పబడింది. అది వైదిక క్రియా కలాపము మాత్రమే. జ్ఞాన సూత్రము అందరూ ధరించవలసిందే.

***"ఎవనికి ఆత్మజ్ఞానమే శిఖయో, ఆత్మతో తన్మయత్వమే నిశ్చలమో, ("ఆత్మయే నేను" అను భావన నిశ్చలమౌతుందో) అట్టి వానిదే బ్రాహ్మణ్యము యొక్క సంపూర్తి" అని బ్రహ్మవిదులు ఎరిగినవారై ఉంటున్నారు. ఈ విషయంలో బ్రహ్మజ్ఞులకు సందేహమే లేదు.***

## బ్రహ్మము గురించి ఎరిగిన విజ్ఞాని – పరివ్రాజక విధులు ।

**బ్రహ్మ భగవానుడు :** బ్రహ్మమును ఎరిగిన తరువాత, అట్టి బ్రహ్మజ్ఞుడు బ్రహ్మము గురించిన నిశ్చల భావన కొరకై బ్రహ్మము స్వాభావికము చేసుకొనుటకై సన్యసించుటచే పరివ్రాజి అగుచున్నాడు.

**అట్టి పరివ్రాజక లక్షణములు కొన్ని ఇక్కడ మరల చెప్పుకుంటున్నాము.** అంతా వినండి!

**పరివ్రాజకులు** ఏక వస్త్రము (ఒక్క వస్త్రము మాత్రమే కలిగి ఉంటున్నారు). శిరోముండనము (జుట్టు తొలగించటము) చేసుకుంటున్నారు. దేనినీ పరిగ్రహించనివారై (one who does not own anything in this world) సంచరిస్తున్నారు.

శరీర క్లేశములను సాధనగా భావిస్తూ 'సహించటము'ను వహిస్తున్నారు.

(లేక) తీవ్ర వైరాగ్య సంపన్నుడు అయి ఉంటే అప్పుడే పుట్టిన బిడ్డకు ప్రపంచముతోను, బంధువులతోను, ఏ సంబంధము ఏర్పడి ఉండని విధంగా **"నా పుత్రులు, నా స్నేహితులు, నా భార్య, నా ఆస్తులు, నా బంధువులు"** మొదలైనవన్నీ లేనివాడై ఉంటారు.

⌘ శాస్త్ర సంబంధమైన స్వాధ్యాయనము (అనేక పుస్తకముల పరిశీలనము), లోక వ్యవహార సంబంధమైన కర్మలన్నీ వదలివేసినవారై ఉంటారు.

⌘ సమస్త బ్రహ్మాండమును కలలోని వ్యవహారం వలె మిథ్యగా ఎరిగినవారై ఉంటారు.

⌘ కౌపీనము (గోచి) తదితర వస్త్ర అచ్ఛాదనములు, దండము మొదలైనవన్నీ వదలిన వారై ఉంటారు.

⌘ ద్వంద్వములన్నీ సహించువారై ఉంటారు. శీత–ఉష్ణములు (చలి – ఉక్కపోతలు), సుఖ–దుఃఖములు, నిద్రసుఖము–నిద్రలేకపోవటము, మాన – అవమానములు రహితము చేసుకొని ఉంటారు.

⌘ షదూర్మము (6 ప్రవాహ తరంగములు – ఆకలి, దప్పిక, శోకము, మోహము, జర, మరణములు–Hunger, Thirst, Worry, Illusion, Old Age and Death) నాకు లేవు– అను అతీత – ఆత్మ భావన ఆశ్రయించి ఉంటారు.

**నింద, అహంకారము, మత్సరము (ఈర్ష్య, ద్వేషము, లోభము, క్రోధముల కలయిక), గర్వము, దంభము (కపటము, ఆడంబరము), ఈర్ష్య (ఓర్వలేనితనము), అసూయ (మంచి గుణములందు దోషము ఆరోపించటము), ఇచ్ఛ – ద్వేషములు, సుఖ–దుఃఖ, కామ–క్రోధ – లోభ – మోహములు మొదలైనవన్నీ దగ్గరకు రానీయక, మొదలంట్లా విడచివేసి ఉంటారు.**

⌘ తన భౌతిక శరీరమును ఒక శవము యొక్క ఆకారము వలె స్మరణము (జ్ఞాపకము) కలిగి ఉంటారు.

⌘ "స్వస్వరూపము, సర్వస్వరూపము, సర్వాంతర్యామి" అగు ఆత్మకు వ్యతిరిక్తమైన సమస్త బాహ్య – అభ్యంతరములన్నీ లెక్కకొననివారై (అమన్యమానులై) ఉంటారు.

⌘ ఎవ్వరికి నమస్కరించనివారై ఉంటారు (అనగా ఎవరిపట్లా ఆధారపడి ఉన్నాము అని అనుకోరు).

⌘ స్వాహా (దేవతా సమర్పణ) కారులై ఉండరు. స్వధా (పితృదేవతా సమర్పణ) కారులై ఉండరు.

⌘ ఎవరిని నిందించక స్తుతించక, యాదృచ్ఛికంగా సందర్భములగుచున్న దేనినీ పట్టించుకోనివారై ఉంటారు.

⌘ యాదృచ్ఛికంగా (కావాలని కోరుకోకుండా) ఏది లభిస్తే దానికే తృప్తి, సంతోషము, సంతుష్టి కలిగి ఉంటారు.

⌘ 'బంగారము' మొదలైన లౌకిక విలువైన వస్తుజాలమును ఏ మాత్రము కూడా దగ్గరకు రానీయరు. పరిగ్రహించరు.

⌘ ఆహ్వానము, విసర్జనము (Either welcoming or getting rid off) రెండింటినీ నిర్వర్తించరు.

⌘ దేవతాహ్వాన – విసర్జనములుగాని, మంత్ర – అమంత్రములుగాని, ధ్యాన – ఉపాసనలుగాని, లక్ష్య–అలక్ష్యములుగాని, వేరు–వేరుకానిది గాని (పృథక్ – అపృథక్‌లుగాని) ఆశ్రయించి ఉండరు.

⌘ **"ఇక్కడ ఇప్పుడు ఇది నేను ఉండి ఉన్న, నాకు చెందినదైన చోటు"** అనునదేమీ ఉండనివారై ఉంటారు. అనికేతుడై ఉంటారు. స్వదేశము, విదేశము అనే తేడా ఏదీ లేనివారై ఉంటారు.

⌘ **స్థిరమతిః –** నిశ్చలమైన ఆత్మబుద్ధిని ఆశ్రయించి ఉంటారు.

## స్థిర నివాసమంటూ లేనివారై ...

శ్వేతకేతు, ఋబు, నిదాఘ, జడ భరత, దుర్వాస, సంవర్తక, వైదేహావట, సిద్ధ, శుక, వామదేవ, దత్తాత్రేయ, దైవతక – ఇత్యాది అవధూతలవలె పరివ్రాజకులై ...,

శూన్య (శిథిల), గృహములలోను, వృక్షముల మూలలయందు, దేవాలయములందు, గడ్డి దుబ్బుల ప్రదేశములందు, కులాల ప్రదేశములందు (పక్షి గూడులు ఉన్న చోట్ల పర్ణశాలల యందు), కుమ్మరి గృహముల యందు, యాగశాలల యందు, దిగంతరములందు (ఆకాశము – భూమి కలియుచున్న దిక్కుల చివరులయందు), నదీ తీరములందు, తటాకములు ఒడ్డు ప్రదేశములందు, భూగృహములందు (నేల మాళిగలందు), కందరములందు (గుహ, కనుమ ప్రదేశములలో), నిర్ఝరము (సెలయేళ్ల) ప్రదేశములందు, తండుల ప్రదేశములందు (పొలములందు), వనములందు – **సంచార నివాసములు కలిగి ఉంటారు.**

అవ్యక్త లింగము (ప్రదర్శించని గుణములు కలవారై), అవ్యక్తమైన ఆచారములు (ఇతరులకు తెలియజేయని ప్రవర్తనములు) కలవారై, బాలునివలె – పిచ్చివానివలె (ఉన్మత్తునివలె), (కానీ) అనున్మత్తుడుగా (ఏ పిచ్చిలేనివారుగా), అన్నీ ఎరిగినవారుగా ఆచారము (Behaviour) కలిగి ఉంటారు.

త్రిదండము (కర్రతో నిర్మితమైన హస్త ఉపకరణ ధారణ), శిక్యము (ఉట్టి సంచి), పాత్రలు, కమండులువు (మంచినీటి చంబు వంటిది), కటి సూత్రము (మొలత్రాడు), కౌపీనము (గోచి), దండము (చేతికర్ర), వస్త్రము – ఇవన్నీ కూడా జలమునందు

సమర్పించివేసి (విడచినవారై) ఉంటారు. **జాతరూపధరశ్చ –** అప్పుడే పుట్టిన బిడ్డవలె జగత్తుతో ఎట్టి మనో సాంఘిక సంబంధము లేనివారై ఉంటారు. (They maintain a stand that they have no kind of relatives).

**"బ్రహ్మమునకు ద్వితీయమే లేదు"** అను రూపంగా ద్వంద్వరహితులై ఉంటారు. దేనినీ పరిగ్రహించరు. దేనిపట్ల తిరస్కారము వహించరు. తత్త్వమార్గమును ఎల్లప్పుడు ఆశ్రయించినవారై, సమ్యక్ సంపన్నులు (సర్వత్రా సమదృష్టిని కలిగియున్నవారు) అయి ఉంటున్నారు.

**సదా నిర్మల మనస్కులై ఉంటున్నారు (శుద్ధమానసః).**

ప్రాణములు నిలుపుకొనటానికై రోజులో సరైన సమయములో చేయియే పాత్రగాగాని (లేదా) ఏదైనా మరొక పాత్రయందుగాని భిక్షకై వెళ్లి స్వీకరించి, భుజిస్తూ ఉంటారు.

సమస్త సమయములందు, లాభ–అలాభ సందర్భములందు – (ఏది లభించినా, లభించకపోయినా కూడా) – సమదృష్టిని వీడక ఉంటున్నారు. నిర్మల – శుక్ల (తెల్లటి) హృదయముతో ఆత్మపరాయణులై ఉంటున్నారు. ఆధ్యాత్మ నిష్ఠతో శుభ–అశుభ కర్మల పరిధులను నిర్మూలించుకొన్నవారై, కర్మఫలాతీతులై ఉంటున్నారు.

**పూర్ణ ఆనంద ఏకబోధః**
**తత్ "బ్రహ్మ" – అహమస్మి**

## బ్రహ్మము ఎట్టిది?

**పూర్ణము :** సర్వదా పూర్ణమై (Complete by itself at all times) అయి ఉన్నది. ఎప్పుడో అసంపూర్ణమై, ఇప్పుడు దేనిచేతనో ఇక 'పూర్ణము' కావలసి ఉన్నట్టిది కానే కాదు. **సదా పూర్ణము.**

**ఆనంద :** స్వయముగా ఆనంద స్వరూపము. ఏదో లభించి, ఆ తరువాత ఏదో దుఃఖము పోగొట్టుకొని, అటు తరువాత ఆనందము సిద్ధించుకోవలసినది కాదు. **నిత్యానంద స్వరూపము.**

**ఏకము :** ఈ అనేకముగా ప్రదర్శనము అగుచూ కూడా సర్వదా ఏకమే అయి ఉన్నట్టిది. **ఓం ఇతి ఏక అక్షరం బ్రహ్మ!**

**బోధ :** సమస్త దేహములలో **ఎరుగటము** (The Knowing) రూప అనుక్షణముగా నిత్యోదయము అగుచున్నట్టిది.

**తత్ :** లోకములకు, భావ – అనుభూతులకు, దృశ్య – మనో – బుద్ధి – చిత్త – వ్యష్ఠి అహంకారములకు ఆవలిదై వెలుగొందుచూ, దృశ్య మనోబుద్ధి చిత్త వ్యష్ట్యహంకారములు 'తానే' – అయి ఉన్నట్టిది.

**బ్రహ్మ :** సమస్త జీవులకు, ఈ సమస్త జగత్తులకు **'మహత్తరము'** (The highest and the finest) అయి ఉన్నట్టిది. (Superlative in all) (అందుచేతనే బ్రహ్మము అనబడుచన్నట్టిది).

## అహం బ్రహ్మోస్మి

**అహమ్ :** అట్టి బ్రహ్మము నేనే. సర్వదా నేనే అయి ఉన్నాను. జాగ్రత్ – స్వప్న – సుషుప్తులకు ఆధారము, కారణము అయి, సమస్తము తనయందు ప్రతిబింబింపజేస్తున్న **"నేనైన నేనే"** అయి ఉన్నట్టివాడను.

అట్టి బ్రహ్మమును 1) అనుస్మరణము గాను, 2) అనుక్షణము జ్ఞాపకముగాను 3) సర్వత్రా సందర్శనము చేయబడుచున్నట్టిదిగాను నిర్వర్తించాలి.

ఓ నారదా ! ఈ విధంగా **"సోఽహమ్ బ్రహ్మమ్"** ను ఉపాసిస్తూ, దర్శిస్తూ, ప్రవేశించు ప్రయత్నములో ఉండు "భ్రమర కీటక న్యాయము" (కీటకము తన చుట్టూ తిరుగుచున్న తుమ్మెద యొక్క 'ఘుయ్' శబ్దము విని, విని, భయము పొంది క్రమంగా ప్రియము పొంది, తానే తుమ్మెదగా అగుచున్నట్లుగా) తానై తానే **'బ్రహ్మము'** యొక్క స్వాభావికత సిద్ధించుకొంటున్నారు.

ముముక్షువు క్రమంగా ఈ దృశ్య భావములకు చెందిన సమస్త వ్యవహారములు మనస్సుతో సన్యసించినవాడై ఉంటున్నాడు. స్థూల – సూక్ష్మ – కారణ శరీరములను వదలి, వాటికి అతీతత్వము సిద్ధించుకొని, ఈ దేహము నాది కాదు, నేను కాదు" అను రూపంగా దేహత్యాజ్యం చేయువాడు కృతకృత్యుడు అగుచున్నాడు.

**//ఇత్యుపనిషత్ – తృతీయోపదేశః//**

---

# ఉపనిషత్ - చతుర్థోపదేశము

## యోగ ప్రతిబంధకములు

**శ్లో॥ త్యక్త్వా లోకాంశ్చ వేదాంశ్చ, విషయాన్ ఇంద్రియాణి చ**
**ఆత్మని ఏవ స్థితో యస్తు స యాతి పరమాం గతిమ్ ।**

సమస్త దుఃఖములకు ఏకైక ఉపాయముగా మోక్షము అయి ఉన్నది. ఇక్కడి జనుల పరస్పర సంబంధములతోను, లౌకికమైన ధన - జన వ్యవహారములతోను కూడిన లోకములన్నీ మోక్షము కొరకై మానసికంగా త్యజించివేయాలి. ఇంద్రియ విషయములన్నీ వదలివేసినవాడై ఉండాలి. ఆత్మ యందు మాత్రమే సంస్థితుడై ఉండాలి. అట్టివాడు సమస్తమునకు ఆవలిదగు **'పరమాంగతి'**ని సిద్ధించుకోగలడు.

నామము, గోత్రము మొదలైన సాంఘిక సంబంధమైన ఆవరణలను (Social Coverages) దేశ - కాలములకు మాత్రమే సంబంధించినట్టి కులము (Sub -Division) లను, బాల్య - కౌమార - యౌవన - వార్ధక్యముల (శారీరక) రూపమగు వయోవృత్తములను, నియమ - నిష్ఠల నిర్మితములైన **వ్రతశీలములను, - ఇవన్నీ సత్ స్వరూపము కాదు, పరమ సత్యము కాదు** అని గ్రహించి, 'అసత్' (Not originally there) అని భావించి, యతి మార్గాన్వేషి - సుస్పష్టపరచుకొని, తెలుసుకొని ఉండాలి.

పూర్వ లౌకిక సంబంధమైన సంపదల గురించి, సంబంధ - బాంధవ్యముల గురించి, **"వారు అట్టివారు, వీరు ఇట్టివారు"** మొదలైన దృష్టాంతముల గురించి, జనుల కథనములు - ప్రవర్తన శీలముల గురించి స్మరించనేకూడదు. ఇతరుల శీలము గురించి ప్రకటనలు, నిర్ణయములు చేయకూడదు. ఇతఃపూర్వం చూచిన స్త్రీల గురించి, వారి నామ- రూప - గుణ - శీల - చిత్రపటముల గురించి మననము, స్మరణము, ఆలోచనలు చేయరాదు.

**యతి మార్గములో ఉన్నవారు**

1) స్త్రీ-పురుషుల దేహ సంబంధముల గురించిన పూర్వ సంఘటన - దృష్టాంతములను సంభాషించటము.
2) సంఘటన - సందర్భములను జ్ఞాపకము చేసుకోవటము, స్మరించటము.
3) స్త్రీ - పురుష పరస్పర సంబంధమైన కథలు చెప్పుకోవటము.
4) స్త్రీ - పురుష సంబంధమైన చిత్ర పతములను చూడటము.

ఈ నాలుగు కూడా యతి మార్గమునకు నిషిద్ధములు (Don'ts). **"అవి మోహము వలన కలుగునవి"** అని గ్రహించి జాగరూకుడై ఉండాలి.

యతి చిత్ర పటముల విక్రయము (selling) నిర్వర్తించకూడదు. అవన్నీ వికారములుగా రూపుదిద్దుకొని, యతి యొక్క పతనమునకు కారణము కాగలవు (ప్రణశ్యతి).

**యతి నిషిద్ధములు :**

**తృష్ణ :** ఏదో సొంతము చేసుకోవాలనే ఆవేశము, దాహము (Thirst) కలిగి ఉండటము.

**క్రోధము :** కోపమును కొనసాగిస్తూ "వారి సంగతి చూడాలి" అనే భావనను వదలకపోవటము. ఇతరులను బాధించాలనే ఆవేశము. క్రోధ సంఘటనలను అనేక మందితో చెప్పుకోవటము.

**అనృతము :** అబద్ధములను పలకటము, అసత్యమైన వాటిని నమ్మి ఉండటము.

**మాయ :** మొదలే లేనిది ఉన్నట్లుగా భావించి ఆవేశ - కావేశములకు 'లోను' అగుచూ ఉండటము.

**లోభము :** తాను పొందలసినది పొందుతూ కూడా త్యాగ బుద్ధి లేకపోవటము. పిసినికోరుతనము. అత్యాశ.

**మోహము :** భ్రమను, కల్పితమును, ఆపాదిత మాత్రమును, లేని దానిని నమ్మి స్పందించటము. చిత్త వైకల్యము, కాలగతమైన కాలముచే వచ్చి పోయే దృశ్య విషయముల పట్ల "శాశ్వతమే" అనే పిచ్చి నమ్మకము.

**ప్రియ – అప్రియే :** కొందరి పట్ల ప్రియము, మరి కొందరి పట్ల అప్రియము కలిగి ఉండటము.

**శిల్పం :** సాకారముల పట్ల, రాతి బొమ్మల పట్ల ఆకర్షణ వికర్షణలు పొందటము.

**వ్యాఖ్యానం :** ఎవరి గురించైనా మంచి చెడుల గురించి వ్యాఖ్యానించటము.

**అయోగం :** యోగ – అభ్యాసముల పట్ల వ్యతిరేక పూర్వకమైన తిరస్కారభావము.

**కామో :** ఏదో పొందాలని కోరికలు కలిగి ఉండటము. అవేశముతో కూడిన ఇచ్ఛ. అనుభవించాలనే అభినివేశము.

**రాగము :** 'నా వారు, నాది" మొదలైన రాగ భావములు (Deep sense of belonging) కొనసాగించటము

**పరిగ్రహణము :** దానము అడిగి తీసుకోవటము, ఇవ్వాలని కోరుకోవటము.

**అహంకారం : "వారికంటే నేను అంతటి వాడిని, ఇంతటివాడిని"** అను తన గురించి ప్రత్యేకతగా భావించటము. జాగ్రత్ పరిమితమైన 'నేను' అను భావన.

**మమత్వము :** "నాది, నాకు చెందినది" అనే భావావేశము.

**చికిత్స :** వైద్యము, మంత్రము, తంత్రము సూచించటము, ఆశ్రయించటము

**ధర్మసాహసము :** ఆవేశపూర్వకమైన ధర్మాచరణము.

**ప్రాయశ్చిత్తము :** దోషములకు, కష్టములకు కర్మ విధులు బోధించటము.

**ప్రవాసము :** దూరదేశములకు ప్రయాణములు చేయటం.

**మంత్రములు :** మంత్రముల ఉపాసన.

**ఓషధములు :** ఔషధములు సూచించటం. సేవించటము.

**ప్రతిషిద్ధము :** "అది – ఇది చేయకండి" మొదలైనవి జనులకు సూచనలు ఇవ్వటము. నిషిద్ధ వాక్యములు.

పైవి సేవించువాడు యతి మార్గము నుండి చ్యుతి పొంది, అధమ మార్గము ఆశ్రయించువాడగుచున్నాడు.

మోక్షము ఆశయముగా గల ఇతర ముని స్నేహితులను, బంధువులను మొదలైనవారిని **"రావాలి, రండి, పోండి, స్వాగతము"** మొదలైనవి చెప్పరాదు. సన్మానముల గురించి సంభాషించరాదు. తాను ఏదీ స్వీకరించటము (ప్రతిగ్రహణము), ప్రదానము (ఇతరులకు ఇవ్వటము) – నిర్వర్తించరాదు. అవి యతి మార్గమునకు ప్రతి బంధకములు కాగలవు.

భిక్షువు (సన్యాసి, యతి మార్గము ఆశ్రయించువాడు) ధన – సత్కార – పేరు ప్రతిష్టల గురించి కలలో కూడా తలచుకోరాదు.

యతి అయినవాడు – భార్య, పుత్రులు, బంధువులు మొదలైన వారికి కలిగే శుభ – అశుభముల గురించి చూడటం జరిగినా, వినినా కూడా కంపనము పొందరాదు. వాటి పట్ల శోక – హర్షములు (Sorrow or happiness) పొందకూడదు.

## సన్యాసి / యతి – ఆచరణములు

**అహింస :** ఇతరులకు బాధ కలిగించకుండటము.

**సత్యము :** సత్యమును ఆశ్రయించి ఉండటము. పలకటము.

**అస్తేయము :** తనది కానిది దొంగిలించాలనే బుద్ధిని రానీయక పోవటము.

**బ్రహ్మచర్యము :** బ్రహ్మము గురించి జిజ్ఞాస, పఠనము, అధ్యయనము కలిగి ఉండటము.

**అపరిగ్రహణము :** ఇతరుల నుండి ఏదో పొందాలనే భావన కలిగి ఉండకపోవటము.

**అనౌద్ధత్యము :** "నేను ఉన్నతుడు. గొప్పవాడిని" అనే భావనను, అభిప్రాయమును దగ్గరకు రానీయకపోవటము.

**అదీనత్వము :** "నేను దీనున్ని, లేనివాడను" అనే దీనత్వము ఆశ్రయించకపోవటము (should not be dull, gloomy or morose)

**ప్రసాదము :** పవిత్రమైన భావాలు, ఆచరణలు, అభిప్రాయములు కలిగి ఉండటము.

**స్థైర్యము :** ధైర్యము, ఉత్సాహము, సాహసము, బుద్ధి ఉత్తేజితము (Inspired) చేసుకొని ఉండటము.

**ఆర్జవం :** వంకర – టింకరగా వ్యవహరించకపోవటము, త్రికరణ శుద్ధి, చెప్పినదే చేయటము, చేయునదే చెప్పటము.

**అస్నేహము :** దేశ – ప్రాంత – వ్యక్తిగత వ్యవహారములగు దేనితోనూ అతి స్నేహము కలిగి ఉండకపోవటము.

**గురు శుశ్రూష :** గురు (శ్రేష్ఠమైన) విషయము పట్ల శ్రద్ధ – గురుసేవ, గురు వాక్య మననము, శ్రద్ధ, భక్తితో కూడిన సేవా భావము కలిగి ఉండటము. (**శుశ్రూష –** వినాలనే ఇచ్ఛ, సేవ, లోబడిన వాడై ఉండటము, అచంచల మనస్సుతో వినటము)

**శ్రద్ధ :** ఆత్మతత్త్వ ధ్యాన – ఆత్మతత్త్వ స్తుతి – ఆత్మతత్త్వ దర్శనముల పట్ల అనుష్ఠానము వీడకపోవటము.

**క్షాంతి :** ఓర్పు. కష్ట సుఖముల పట్ల, లాభ నష్టముల పట్ల, తప్పు – ఒప్పుల పట్ల ఓర్పు వహించి ఉండటము. భరిస్తూ సమత్వము వీడకపోవటము. ఓర్చుకోగలిగే శక్తి, సహన శక్తి.

**దమము :** బాహ్య ఇంద్రియములను సరి అయిన కార్యక్రమములలో నియమించటము, ప్రాపంచక విషయముల నుండి, లౌకిక వ్యవహారముల నుండి ఇంద్రియ వ్యాపారములను వెనుకకు మరల్చటము, శాస్త్రీయ సాధనలగు యోగ సాధన, పూజ, ధ్యానములందు నియమించటము.

**శమము :** అంతరింద్రియములైనట్టి మనోబుద్ధి చిత్తములను, పవిత్ర కార్యములందు నియమించటము. బాహ్య విషయముల నుండి నిరోధించి ఉండటము. ఆత్మతత్త్వ దర్శనమునందు నియోగించటము. ధ్యానము, యోగాభ్యాసములందు మనోబుద్ధి చిత్తములను వినియోగించటము.

**ఉపేక్ష :** జన – ధన సంబంధమైన విశేషముల పట్ల ఉపేక్ష (Non - concentration, No-attraction) కలిగి ఉండటము. దృశ్య విషయముల పట్ల అపేక్షను వదలటము.

**స్థైర్యము :** ధైర్యము, ఆత్మ నమ్మకము, ఆత్మ భావన పట్ల స్థిరత్వము.

**మాధుర్యము :** మధురము అయిన సంభాషణ సహజనులకు ప్రియము కలిగించుచుండటము.

**తితిక్ష :** కష్ట – సుఖములు భరించగలుగు నిగ్రహముతో కూడిన యోగ స్థితి. క్షాంతి, ఓర్పు, శీతోష్ణ ద్వంద్వ సహనము.

**కరుణ :** సహజీవుల పట్ల కరుణ (Kindness), ప్రేమ, వాత్సల్యము కలిగి ఉండటము.

**హ్రీ (సిగ్గు) : "ఎందరో తత్త్వజ్ఞులు ఉన్నారు. వారి సమక్షంలో నేను ఎంతటి వాడిని ?"** అను సిగ్గు, అణకువ కలిగి ఉండటము – ఇది శిష్య లక్షణము.

**జ్ఞాన విజ్ఞాన యోగము :** తత్త్వ విషయాల పఠణ – అధ్యయనములు, ఆ విధంగా తెలుసుకొన్నవి సమస్త సందర్భములలో సమన్వయించుకొని ఆత్మ బుద్ధి ప్రవృద్ధము చేసుకోవటము.

**లఘ్వశనము (లఘు అశనము) :** పరమితముగా ఆహారము స్వీకరించటము. ఇంద్రియములను జీవనముకు అవసరమైనంత వరకు మాత్రమే నియోగించటము, అనవసర వినియోగముల నుండి విరమించటము.

**ఏష స్వధర్మో విఖ్యాతో యతీనాం నియతాత్మనామ్ ।** ఇవన్నీ నియతాత్ముడగు **యతి ధర్మములు.** ఇవి అన్ని ఆశ్రమములవారికి ముముక్షు మార్గంగా నియమించబడుచున్నాయి.

**ముఖ్యముగా మూడు యతి స్వభావములు :**

**1) నిర్ద్వంద్వో :** "పరమాత్మకు ద్వితీయమైనది ఎక్కడా ఏదీ లేనేలేదు" అను ద్వంద్వరాహిత్యము. అద్వితీయ ఆత్మభావన.

**2) నిత్య సత్త్వస్థ :** సాత్వికుడై ఆత్మ జ్ఞానమును సర్వదా వీడక ఉండటము.

సత్ – స్వస్థః । ఆత్మయొక్క 'సత్' స్వరూపమునందు స్వస్థుడై (Comfortably) ఉండి ఉండటము. (గమనిక : శ్రీ రమణ మహర్షులవారి ఉపదేశ సారముయందు చెప్పబడిన అభ్యాస స్థితి – "భావశూన్య సత్‌భావ సుస్థితిః")

**3) సర్వత్రా సమదర్శనః :** తరంగములన్నిటిలో ఒకే జలమున్నట్లు, కథలోని సమస్త పాత్రలు కథా రచయిత యొక్క కల్పనా చమత్కారమే అయినట్లు – ***సమ జీవులలో సమమగు ఆత్మనే దర్శించు దార్శనిక స్వభావము.***

## తురీయడగు పరమ హంస వర్తనములు / అభ్యాసములు

**తురీయడు :** తన యొక్క స్వస్వరూపమును 1) జాగ్రత్ 2) స్వప్న 3) సుషుప్తులకు ఆవలదిగాను, ఆ మూడింట తానై ఉన్న నాలుగవదిగాను దర్శించువాడు. సాక్షిత్వ – స్వానుభవుడు అయినవాడు.

**పరమహంస : సోఽహమ్ పరమమ్ । సమస్తమునకు ఆవల కేవలమై ప్రకాశించి ఆత్మ స్వరూపుడనే ('హంస' స్వరూపడనే) నేను" –** అను అనునిత్యానుభవము పుణికిపుచ్చుకున్నవాడు. గట్టిగా పట్టుకున్నవాడు (వ్రేళ్లచే పట్టుకొన్నవాడు) అట్టి తురీయడగు పరమహంస స్వయముగా శ్రీమన్నారాయణమూర్తియే. ఆ యతికి నారాయణ భగవానునికి భేదమే ఉండదు.

ఓ నారదా! పరివ్రాజకుడు అట్టి పరమహంసత్వము సిద్ధించుకోవటానికి ముఖ్యమైన మరికొన్ని అభ్యాసముల గురించి చెప్పుకుందాము.

**(ఇవి సన్యాస నియమములుగా చెప్పబడుచున్నాయి).**

**నివాసము :** గ్రామములో నివాసము – ఒక్క రాత్రి మాత్రమే, నగరములో – 5 రాత్రులు మించి ఉండరాదు. వర్షాకాలము – 4 మాసముల కాలము ఒక్క చోటనే నివాసము కలిగి ఉండవచ్చును (చాతుర్మాస్యము). గ్రామములో రెండు రాత్రుల కాలము ఉండరాదు. దాని వలన రాగము, ద్వేషము మొదలైనవి రూపుదిద్దుకోగలవు. వాటి వలన నరక మార్గము ఎదురుకాగలదు.

గ్రామము చివరిగా జనసమూహము ఉండని ప్రదేశంలో 'నా ఇల్లు / నా నివాసము' అనునది ఏదీ లేనివాడై ఉండును గాక.

'చాతుర్మాస్య 4 నెలల వానాకాలము' తప్ప, ఇక తక్కిన సమయములలో ఒక కీటకమువలె భూమిపై పర్యటించుచుండును గాక।

ఏక వస్త్రముగా ఉన్నప్పటికీ (లేక) దిగంబరుడై (వస్త్ర రహితుడై) ఉన్నప్పటికీ కూడా భేదరహితమైన ఏకదృష్టి (అఖండాత్మ దృష్టి)తో, దృశ్యంలో ఏదీ ఆపేక్షించనివాడై ఉండును గాక! **"అనేకమగు ఇదంతా ఒకదాని కంటే మరొకటి వేరు"** అనే అనేక దృష్టి పట్ల లోలుపుడు (తీవ్రమైన ఇచ్ఛగలవాడు) కాకుండును గాక! మహనీయులగు సంత పురుషుల మార్గమును తప్పు పట్టుకోకుండా తాను తనకు సాధ్యమైనట్టి సాధన మార్గము ఆశ్రయిస్తూ భూమిపై చరించుచుండును గాక! సాధ్యమైనదే సాధన. శుచి అయిన ప్రదేశములో ఉంటూ ఆ భిక్షకుడు సన్యాస ధర్మములు నిర్వర్తిస్తూ ఉండును గాక! **"ఇదంతా పరమాత్మ యొక్క మహత్యమే"** అని తలచుచు (మననము చేస్తూ) యోగి ఎల్లప్పుడు అట్టి భావనతో సంచరించుచుండును గాక!

**పర్యటనకు నిషిద్ధమైన సమయములు :** అర్ధరాత్రిపూట గాని, మిట్ట మధ్యాహ్న సమయమునందు గాని, ఉదయ – సాయంకాల సంధ్యా సమయములందుగాని యతి పర్యటనలు, దేశ సంచారములు ప్రారంభించరాదు. అత్యంత శూన్యము, దుర్గమము (జనులు అతికష్ట ప్రదేశములుగా భావించునవి) అగు ప్రదేశములలో ఒంటరి సంచారము కూడదు (క్షేమము కాదు).

ఎక్కడ ఉన్నా కూడా, ఇతర ప్రాణులకు హాని కలిగించే ఉద్దేశ్యము కలిగి ఉండరాదు. మరల చెప్పుచున్నాను. గ్రామములలో (In villages) ఒక్క రోజు, పురములలో (In towns) రెండు రోజులు, నగరములలో (In cities) 5 రోజులు మించి (అన్నన్ని రాత్రుల మించి) ఉండరాదు. వర్షాకాలంలో చతుర్మాస్య వ్రతంగా 4 నెలలు ఒక్కచోటే సత్సంగపూర్వకంగా ఉండవచ్చును.

**ఆత్మవత్ సర్వభూతాని :** 1) నేను దృశ్య – దేహ – మనో బుద్ధి – చిత్త – వ్యష్ట్యహంకార రూపుడను కాదు. **ఆత్మ రూపుడను.** 2) సమస్త జీవులు అట్టి ఆత్మ స్వరూపులే. 3) కనుక ఈ సమస్త జీవులు, లోకములు, బ్రహ్మాండములు నా యొక్క ఆత్మ స్వరూపమే, నేనే ! నాకు నా ఆత్మ ఎట్టిదో, ఎంత ప్రియమో, ఈ కనబడేవారంతా (నా యొక్క ఆత్మస్వరూపమే అయి ఉండటం చేత) అంతే ప్రియము. వీరంతా నా ఆత్మ యొక్క ఆనంద స్వరూప తరంగాలే" అను రూపంగా, ఆత్మగా దర్శిస్తూ, ఆత్మానందము ఆస్వాదిస్తూ భిక్షువు భూమిపై సంచరిస్తూ ఉండు గాక।

❖ ❖ ❖

ఇక భిక్షువు యొక్క సాంసారిక (భేద దృష్టి) సంబంధములు (దృశ్యముతో అనుబంధము) గురించిన విషయానికి వస్తే, అతడు–

**ఒక అంధునివలె –** ఆత్మకు అన్యముగా ఎట్టి భేదములు చూడనివానివలె, సర్వత్రా సమదృష్టి కలిగి ఉండును గాక!

**కుబ్జునివలె –** అంగ విహీనునివలె "ఆత్మనగు నేను అంగములు కలవాడను కాను! అంగములను సచేతనము చేయువాడను" అని భావించును గాక.

**బధిరో –** చెవిటివానివలె, ఆత్మకు వేరుగా (అన్యముగా) చెప్పు భేద సంబంధమైన వాక్యములు వినపడనివానివలె ఉండాలి.

**ఉన్మత్తవత్ –** పిచ్చివానివలె లౌకిక వ్యవహారాలు పట్టించుకోక, లౌకిక సంబంధమైన ఆస్తులు, అంతస్తులు మొదలైనవన్నీ దృష్టియందు లేనివానివలె ఉండును గాక.

**మూకవత్ –** మూగవానివలె. లోక సంబంధమైన భేద వ్యవహారములు పలుకలేనివానివలె ఉండాలి. ఈ విధంగా భిక్షువు (సన్యాసి) జీవన సరళి కలిగి ఉంటారు.

## స్నానం

**కుటీచక, బహూదక, భిక్షువులకు** మూడు పూటల స్నానం చెప్పబడుతోంది.

**హంసకు** రోజుకొకసారి స్నానము నియమించబడింది.

**పరమహంసకు** స్నాన విధి నియమములు ఉండవు.

## ఏకదండ సన్యాస నియమములు

**ఏకదండ సన్యాసులకు (సన్యాసాశ్రమం స్వీకరించినవారికి)** '7' నియమములు పాటిస్తూ ఉండవలసినదిగా చెప్పబడుతోంది.

**1) మౌనము :** భేద దృష్టిని పెంచు ఆయా లోక విశేషములు సంభాషించకపోవటము సిద్ధాంత వాద – ఉపపాదములు ప్రక్కకు పెట్టి సర్వాత్మకమగు ఆత్మ గురించిన సంభాషణము మాత్రమే ఆశ్రయించటము.

**2) యోగాసనము :** తన శరీరమునకు అనుకూలమైన సుఖాసనము ఎన్నుకొని, ధరించి ఉండటము.

**3) యోగము :** బుద్ధిని నిర్విషయ మార్గంగా ధ్యానము నందు నియమించటము.

**4) తితిక్ష :** సహించు శక్తి పెంపొందించుకోవటము. బుద్ధికి "ఓర్పు" అనే నేర్పును కలిగించుకోవటము.

**5) ఏకాంత శీలత :** తనకు పరమాత్మకు గల సంబంధము ఏకాంతముగా (ఒంటరిగా) ఉండి అధ్యయనము, ఉపాసన నిర్వర్తించటము. జగద్దృశ్యమును పరబ్రహ్మముగా భావించటమే ఏకాంత శీలత్వముగా చెప్పబడుతోంది.

**6) నిస్పృహత్వము :** ఏకమగు ఆత్మతత్త్వమునకు భేద కల్పము పట్ల పట్టించుకోక పోవటము, అనేకంగా కనిపిస్తున్న దానిలో ఏకత్వము దర్శించు అభ్యాసము. భిన్నత్వంలో ఏకత్వ దర్శనము.

**7) సమత్వము :** ఆత్మ యొక్క సమత్వమును ఉపాసించటము. (సమం సర్వేషు భూతేషు తిష్ఠతం పరమేశ్వరమ్।)

**ఈ ఏడు కూడా ఏకదండి (సన్యాసి) యొక్క అనవరత – అభ్యాసములు అయి ఉండు గాక ।**

## పరమహంస భావన

***సోఽహమ్ పరమమ్ : సమస్తమునకు ఆవలిదై, సమస్తముగా ప్రదర్శనమగు పరమవస్తువు (బ్రహ్మము) నేనే అయి ఉన్నాను–*** అను భావన. అట్టి 'పరమ భావన'ను సిద్ధించుకొన్న వానికి ఇక స్నానము, భోజనము మొదలైన తదితర శాస్త్రీయ విధి – విధానములతో ఆవశ్యకత ఉండదు. **పరమహంసాశ్రమస్థో హి స్నాన – ఆది అవిధానతః ।**

అయినప్పటికీ ఆయనకు ఒకే ఆచరణ – **అశేష చిత్తవృత్తీనాం త్యాగం కేవలమ్ ఆచరేత్ ।** అంతులేని చిత్తవృత్తులను త్యజించివేయు ప్రయత్నమే అతడు చేయు యత్నశీలత్వము. ఎందుకంటే చిత్తవృత్తులు ఆకారముల చుట్టూ వృత్తము చేస్తున్నాయి.

## దేహ మోహము

ఓ నారదా ! ఎందుకో ఈ జీవుడు భౌతికమైన దేహములను చూసి మోహము చెందుచున్నాడు. దీని గురించి విచారణ చేయకపోతే ఎట్లా ? ఈ దేహము ఎటువంటిది ? చర్మము, మాంసము, రక్తము, స్నాయువు (సన్నటి నరములు), మజ్జ (బొమికలలో గుజ్జు), మేదము (కొవ్వు), బొమికలు, మూత్రము, పురీషములతో కూడిన ఒక భౌతికమైన గూడు వంటి **"ఈ దేహమే నేను" "ఆ దేహమే నీవు"** అని నమ్మి కూర్చున్న వానికి ఒక కీటక జీవితమునకు తేడా ఏమున్నది? ఏమీ ఉండదు.

❋ శ్లేష్మము మొదలైన అనేక దోష పదార్థములతో కూడిన ఈ పాంచ భౌతిక శరీర భావన ఎక్కడ ? వాటికి సంబంధించి ఆశయములు ఎక్కడ?

❋ సౌరభము, సుందరము, శోభాయమానము, కమనీయము అగు "శరీరి" (లేక) – ఆత్మభావన ఎక్కడ?

ఆ రెండింటికి – హస్తి – మశకాంతరమంత తేడా (ఏనుగు – దోమల శరీరములంతటి భేదము). – "మాంస, రక్త, మూర్త, మల, నరము, మజ్జ, బొమికలు మొదలైన దోష పదార్థముల కలయిక" అగు ఈ దేహముపై మమకారము కలిగి ఉండు దేహి భవిష్యత్తులో అనేక నరకములకు ఆహ్వానము పలుకుచున్నవాడగుచున్నాడు. స్త్రీ, పురుషుల అవాచ్య (రహస్యాంగ) భాగములన్నీ అనేక నాడులతోను, వ్రణములతోను (పుళ్లతోను) నిండి ఉండగా అవన్నీ ఒకేరకములైన పదార్థములయినప్పటికీ భేదములు కల్పించుకొని తమను తామే ఒకరినొకరు మోసగించుకొనుచున్నారే. చర్మ ఖండముతో రెండుగా చీలి కనిపిస్తూ, అపానము (విసర్జనము) అనే దూషణముతో కూడుకొనియున్న అంగములను చూచి, వాటిలో రమించాలనుకోవాలనుకొనే జీవులకు – వారందరికీ ఒక నమస్కారము., ఆహాఁ। వారిది ఎంతటి సాహసం ? అంతకన్నా సాహసం ఏముంటుంది ? పర్యవసానముల (Eventualities) గురించి భయమే లేదే !

మునికి ఈ దేహ – దేహ భాగములతో సిద్ధించగల కార్యము ఏదీ అగుపించదు. అల్పదార్శకులకు మాత్రమే కనిపించే ప్రత్యేకత వారికేదీ అనిపించదు. వారు మమకార – భయరహితులై పరమ శాంతమును పూనినవారై ద్వంద్వరహితులై – అనేక వర్గ భేదములను చూడరు. ఆస్వాదించరు.

ముని గోచి ధరించిగాని, (లేక) ధరించనివారైగాని (బాహ్యాన ఎట్లా ఉండినాకూడా) – ఆత్మధ్యాన తత్పరులై ఉంటారు. అట్టి ధ్యానపరుడగు యోగి బ్రహ్మ భావనను సర్వత్రా మననము చేస్తూ బ్రహ్మమే తామగుచున్నారు. **(బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి).** లింగ – వర్ణాశ్రమ ధర్మములు, ఆశ్రమ భేదములు – ఇవన్నీ "సమదర్శన – జ్ఞానము" కొరకై, జ్ఞానమే అంతిమ ఆశయముగా కలిగి ఉన్నాయి. సమస్తము సన్యసించి ఆత్మజ్ఞానము సిద్ధించుకోవటమే సన్యాసాశ్రమము యొక్క అంతిమ – ఆశయము. **నిర్మోక్షాయ ఇహ భూతానాం లింగ గ్రామో నిరర్థకః।** మోక్షమే మహదాశయము. అట్టి ఆశయము వదలి ఉంటే, ఇక సన్యాస చిహ్నములు, నియమములు అన్ని కూడా నిరర్థకమే (They are purposeless if freedom of one's own self is not the main objective).

## బ్రహ్మజ్ఞానో హి బ్రాహ్మణః

"**ఉన్నది** ఏది? ఉన్నట్లే ఉండి కూడా **లేనిది** ఏది? వినకూడనిది ఏది? శ్రద్ధగా, అధికంగా వినవలసినది ఏది? వినవలసి కూడా, ఎక్కువగా వినబడకయే ఉన్నదేది? శుభప్రదమగు వృత్తి, ప్రవర్త ఏది? దుర్వృత్తము, వినటము వలన నష్టము కలిగించేదేది?" – ఇవి ఎవరు సవివరంగా సశాస్త్రీయంగా తెలుసుకొని ఉంటారో అట్టివాడే బ్రహ్మమును ఎరిగినట్టి **"బ్రాహ్మణుడు".**

*ఈ జీవుడు బ్రహ్మజ్ఞాని అయి "బ్రాహ్మణుడు" కావాలి.*

❋ ఎవడు బాహ్య చిహ్నములన్నీ (లింగములన్నీ) విడచి అలింగుడై, లింగాతీతత్వమును అత్యంత శ్రద్ధగా పాటించువాడై ఉంటాడో

❋ ఆత్మధర్మము తెలిసినవాడై బ్రహ్మభావమును అనుక్షణిక వ్రతముగా ఆశ్రయించి ఉంటాడో

❋ ఆత్మతత్త్వ ధ్యానమునందు నిష్ణాతుడు – విద్వాంసుడు అయి, రహస్యముగా ఇతరులకు తెలియరాని జ్ఞానచరితుడై ఉంటాడో

❋ "అనేకమంది జీవులుగా ఉన్నది ఏకస్వరూపుడగు ఆత్మభగవానుడే" అను అఖండాత్మ జ్ఞానమును బుద్ధితో నిర్ణయించుకొని అనేకము పట్ల సందిగ్ధుడై (అనేకత్వము నమ్మనివాడై) ఉంటాడో, ఆత్మ యొక్క ఏకత్వము పట్ల అసందిగ్ధుడై ఉంటాడో అనుమానము త్యజించనవాడై ఉంటాడో,

❋ బ్రహ్మచారి, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాస ధర్మములను, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర ధర్మములను 'ఆత్మదృష్టి' అనే బల సంపదచే దృష్టియందు వదలి ఉంటాడో,

❋ **అంధవత్, జడవత్ చ అపి, మూకవత్ చ మహీం చరేత్ ।** జగత్తులో కనిపించే ఏకాత్మకు అన్యమైన భేదములన్నిటి పట్ల గ్రుడ్డివానివలె, జడునివలె, మూగవానివలె చరిస్తూ అతీతత్వము వీడనివాడై ఉంటాడో –

> **అట్టి పరమశాంతుడగు యతీశ్వరుని చూచినప్పుడు దేవతలు కూడా అట్టివాని సమక్షమును, అట్టివానితో స్నేహమును కోరుకుంటారు.**

**లింగాభావాత్ (లింగ అభావత్) కైవల్యమ్ ఇతి బ్రహ్మానుశాసనమ్ ।** "ఆకారము, గుణములు, నామరూపములు" – మొదలైన విశేషములతో కూడిన లింగమును (గుణ విశేషములను) దాటి ఆవల అనుభవించటమే కైవల్యము. ఇది శాస్త్రీయ సిద్ధాంతము. ఇది బ్రహ్మానుశాసనము।

## సన్న్యాసము స్వీకరించే విధానము

**శ్రీ నారద మహర్షి :** లోక కళ్యాణమూర్తీ ! జగత్ పితామహా ! పితృదేవా ! ఇప్పుడు మాకు **సన్న్యాసాశ్రమము** స్వీకరించే విధానము ఎట్టిదో, ఏ విధమైనదో మరికొంత వివరించి చెప్పండి.

**శ్రీ పితామహుడు (బ్రహ్మ భగవానుడు) :** ఓ నారదా ! ఇప్పటి వరకు ఆయా కొన్ని విశేషాలు చెప్పుకున్నాము. ఈ విషయమై మరికొంత వివరించుకుందాము.

1) ఆతుర సన్న్యాసము 2) క్రమ సన్న్యాసము – ఇప్పటికే ఆ రెండు రీతుల గురించి చెప్పుకోవటం జరిగింది కదా!

**ఆతుర సన్న్యాసము** అనారోగ్యకర పరిస్థితులలోను, మరణము దగ్గరపడుచున్నట్లు అనుమానము వస్తున్నప్పుడు ఆతుర సన్న్యాసము శాస్త్రములలో సూచించబడుచూ ఉన్నది.

**క్రమసన్న్యాసము** : శరీరారోగ్యము ఉండగానే శాస్త్రీయంగా స్వీకరించబడేది. ఆతుర మార్గంగాని (లేక) క్రమసన్న్యాస విధి గాని తురీయాశ్రమము స్వీకరిస్తున్నప్పుడు కుచ్ఛ్రవ్రతము (సన్న్యాసపు సంజ్ఞలగు కాషాయ వస్త్రము, బొంత మొదలైనవి వ్రత విధిగా స్వీకరించటము) సంబంధమైన 'ప్రాయశ్చిత్తములు' అనబడే '8' శ్రాద్ధములు (శ్రద్ధతో కూడిన ఉపాసన / అర్చన) నిర్వర్తించాలి. అవి 1) దేవ 2) ఋషి 3) దివ్య 4) మనుష్య 5) భూత 6) పితృ 7) మాతృ 8) ఆత్మ శ్రాద్ధములు. వాటి ఉద్దేశ్యము ఏ విధమైనదో ముందుగా చెప్పుకుందాము.

1) **దేవశ్రాద్ధము (లేక) అర్చనము : సత్య వస్తు (వసు) సంజ్ఞికాన్, విశ్వేదేవాన్, బ్రహ్మ విష్ణు మహేశ్వరాన్ (అర్చనమ్ కుర్యాత్) ।** సత్య వస్తువుగా చెప్పబడు విశ్వదేవుని (The worker of the universe) సృష్టి – స్థితి – లయ స్వరూపంగా బ్రహ్మ విష్ణు మహేశ్వర త్రిమూర్తులను పూజించాలి.

2) **ఋషి శ్రాద్ధము (అర్చన) :** దేవర్షులను, క్షాత్ర ఋషులను (రాజర్షులను), మనుష్య ఋషులను ఉద్దేశ్యించి చేసే శ్రద్ధతో కూడిన కృతజ్ఞతాపూర్వకమైన అర్చనా విధానము నిర్వర్తించాలి.

3) **దివ్య శ్రాద్ధము :** అష్ట వసువులను, ఏకాదశ రుద్రులను, ద్వాదశ ఆదిత్యులను పూజించటము, శాంతిని అర్థించటము చేయాలి.

4) **మనుష్య శ్రాద్ధము :** మనస్సుకు అధి దేవతలు అగు సనకుడు, సనందనుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడు – ఈ నలుగురు బ్రహ్మ మానస పుత్రులు. లోక కళ్యాణమూర్తులు అగు వీరిని ఉపాసించటము, వారిని బుద్ధిని **(మనీషమును)** తీర్చి దిద్దు దివ్య స్వరూపులుగా సుత్తించి, శరణు వేడటము నిర్వర్తించాలి.

5) **భూత శ్రాద్ధము :** భూమి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశములను (పంచ మహాభూతములను – The solid, The liquid, The heat, The gas, The space లను),

**పంచ జ్ఞానేంద్రియ దేవతలను** [ శోత్రము – వినికిడి, శబ్దము, త్వక్కు (చర్మము) – స్పర్శ, చక్షువులు – చూపు / రూపము, జిహ్వా (నాలుక) – రుచి / రసము, ఘ్రాణము (ముక్కు) – గంధము] దాల్చి దేహములో ప్రదర్శనమగుచున్న జ్ఞానేంద్రియ దేవతలను,

**పంచకర్మేంద్రియ దేవతలను** 1) వాగింద్రియము/వాక్కు – పలకటము 2) హస్తేంద్రియము / చేతులు – పట్టుకోవటము / ఇవ్వటము, 3) పాదేంద్రియము / కాళ్లు – నడక 4) ఉపస్థ (లేక) గుహ్యాము – (మూత్ర) విసర్జకావయవము 5) గుదము – మల విసర్జకావయవము)

**చతుర్విధ (భూతగ్రామ శ్రాద్ధములు) :** 1) పంచ ప్రాణములు 2) పంచ ఉపప్రాణముల ఉపాసన 3) పంచ ఇంద్రియముల ఉపాసన 4) పంచ – ఇంద్రియ విషయముల ఉపాసన 5) మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అయి ఉన్న చతుర్విధ అంతరింద్రియముల ఉపాసన.

(వీటిని అన్నిటినీ ఉపాసించటము – భూత శ్రాద్ధము అని కూడా అంటారు).

6) **పితృశ్రాద్ధము : పితృ–పితామహ–ప్రపితామహ ఉపాసన** తండ్రి నుండి మూడు తరముల వరకు (1) తండ్రి 2) తాత 3) ముత్తాత. ఒకవేళ తండ్రి జీవించి ఉంటే (సన్యాసము స్వీకరించువాడు జీవ పుత్రుడైతే) తండ్రిని వదలి – తనను, తాతను, ముత్తాతను స్మరిస్తూ "శ్రాద్ధము" అనే శ్రద్ధతో కూడిన పరమార్థవాక్య ఉపాసన సమర్పించాలి.

7) **మాతృశ్రాద్ధము : మాత – పితామహి – ప్రపితామహి** (తల్లి, నానమ్మ, ముత్తమ్మ – నానమ్మ వారి తల్లి) కి శ్రాద్ధోపాసన చేయాలి. తల్లి బ్రతికి ఉంటే, తనను మొదటిగా జేర్చి శ్రాద్ధ మంత్రములు ఉపాసించాలి.

8) **ఆత్మ శ్రాద్ధము :** తనకు తానే నామరూపాత్మకమైన తన యొక్క జీవాత్మక ప్రాపంచక రూపము (పాత్ర)కు శ్రాద్ధ సంస్కారము నిర్వర్తించాలి.

పై అన్ని (8) శ్రాద్ధములలోను ఇద్దరిద్దరు బ్రాహ్మణులను ఆహ్వానించి విశ్వేదేవ – పితృదేవ పూర్వకంగా పూజించాలి. అట్టి శ్రాద్ధము 1) **ఏకాధ్వర పక్షము** (ఒక్క రోజులో పూర్తి చేసేది) 2) **అష్టాధ్వరపక్షము** – (8 రోజులలో అష్ట శ్రాద్ధములు నిర్వర్తించటము) అను రెండు విధములు చేయవచ్చునని చెప్పబడుతోంది.

*ఈ రెండు పద్ధతులలో కూడా :*

- **స్వశాఖానుగతమైన మంత్రము – (చతుస్సాగర పర్యంతం గో బ్రాహ్మణేభ్యః శుభం భవతు....... ఋషి** త్రయార్షేయ / ఋషిపంచార్షేయ / సప్తార్షేయ (వంశ గురువుల పేర్లు), ..... **వేదాధ్యాయీ** (ఋగ్వేద / శుక్లయజుర్వేద / కృష్ణ యజుర్వేద మొ॥న అధ్యాయీ – వంశ వేద విభాగము) ............. (పేరు) అష్టశ్రాద్ధములలో ప్రవర పూర్వకంగా పలకాలి.

- **'పితృయాగము'** చేయు విధానంగా బ్రాహ్మణులను అర్చించాలి. వారి భోజన విధి, పాదార్చన విధి మొదలైనవన్నీ పితృ యాగోక్త విధానంగా యథావిధిగా నిర్వర్తించాలి. పిండ ప్రదానము మొదలైనవన్నీ శాస్త్రీయంగా చేయాలి. బ్రాహ్మణులను సంతోషింపజేయాలి. బ్రాహ్మణ ప్రియంగా పూర్తి చేయాలి.

- ఆ తరువాత సన్న్యాస సంస్కారము నిమిత్తమై శేషించిన (మిగిలియున్న) కర్మ నిర్వర్తించటానికై **"కేశాంత సప్తాష్టవా"** – '7' లేక '8' వెంట్రుకలను వదలి, తల వెంట్రుకలను, ముఖ వెంట్రుకలను తొలగించుచూ క్షౌరము చేయించుకోవాలి. మంత్రముగ్ధంగా '7' లేక '8' కేశములను (వెంట్రుకలను) సంరక్షించుకోవాలి.
- కక్షోపస్థవర్జం – చంకలోని ఉపస్థయందలి వెంట్రుకలు వదలి శిరస్సు, ముఖము వెంట్రుకలు క్షౌరం చేయించుకోవాలి. ఆ తరువాత స్నానం చేయాలి. ఆ సాయంకాలం **"సాయం సంధ్యా వందనము"** సహస్ర గాయత్రీ పూర్వకంగా జపించి 'బ్రహ్మయజ్ఞము' నిర్వర్తించాలి. తనకు సమీపముగా 'స్వాధీనాగ్ని'ని స్థాపించాలి (ఉపస్థాపనం). తన యొక్క 'వేదశాఖ'ను ("...... శాఖాధ్యాయీ" – అనునది) విడచిపెట్టాలి.
- ఆ తరువాత వేదోక్త – వేదమంత్రోచ్చారణగా **"ఆజ్యభాగము"** వరకు చెప్పబడిన మంత్రములో ఆజ్యము (నేయి) ని హోమము చేయాలి. ఆహుతి విధిని పూర్తి చేయాలి. తదితరులతో కలసి తాను సక్తు ప్రాశనము (పేల పిండితో కలిపిన ఆహారము తినటము) 3 సార్లుగా నిర్వర్తించాలి.
- అటు తరువాత ఆచమనం చేసి అగ్నిని రక్షించుకోవాలి. అగ్ని కొనసాగునట్లు పుల్లలు (wood pieces) మొదలైనవి వేయాలి.
- అగ్నికి ఉత్తర దిశగా జింక చర్మము పరచుకొని ఆసీనుడు కావాలి. పురాణ కథలు శ్రవణం చేస్తూ (వింటూ) ఆ రాత్రి జాగరణ (రాత్రంతా మెలకువగా ఉండటము) నిర్వర్తించాలి.
- చతుర్థయామము (నాలుగవ జాము) చివరిలో (ఉదయం 6 గంటల) తరువాత స్నానం చేయాలి (యామము = జాము = 3 గంటల కాలము)
- ముందు రోజు నుండి వెలుగుచున్న అగ్నిని కట్టెపుల్లలతో ప్రజ్వలింపజేయాలి.
- ఆ అగ్నిలో అన్నము వండాలి. (అన్నమును 'చరువు' అని కూడా అంటారు. **చరువు** = దేవతల హోమము నిమిత్తమై వండిన అన్నము).
- ఆ అన్నము (చరువును) 'పురుష సూక్తము' చదువుచూ, 16 ఆహుతులుగా అగ్నికి హోమము చేస్తూ **'విరజా హోమము'** చేయాలి.
- ఆ తరువాత ఆచమనం చేసి, వస్త్ర దానము, సువర్ణ పాత్ర దానము, గో దానము – సదక్షిణంగా (కొంత ధనమును దక్షిణగా జేర్చి) నిర్వర్తించాలి.

**పై విధంగా నిర్వర్తించి, ఆ తదుపరి బ్రహ్మోద్వాసనము (విరజా హోమము మొదలైన అప్పటి దాకా నిర్వర్తించిన అగ్నికార్యము యొక్క ఉద్వాసన) పలుకుతూ సమాప్తి చేయాలి.**

**అగ్నికి ఉద్వాసన :**

> **సం మా సించంతు మరుతః, సమ్ ఇంద్ర, బృహస్పతిః**
> **స మాం అయాగ్నిః, సించంతు । ఆయుషా చ,**
> **ధనేన చ బలేన చ వా ఆయుష్మంతం కరోతు మేతి, యాతే అగ్నే యజ్ఞియా ।**
>
> ***నేను సన్న్యాసాశ్రమము స్వీకరిస్తూ అయాగ్నికుడిని (అగ్నికార్యము వదలుచున్నవాడిని) అగుచున్నాను. నన్ను వాయువు, ఇంద్రుడు, బృహస్పతి రక్షించుచు తత్త్వోపాసనాయుక్తమగు ఆయుష్షు, జ్ఞాన బలము ప్రసాదించి ఆయుష్మంతుని చేయు గాక।***

పై మంత్రమును చదువుచు, మంత్రార్థమును బుద్ధితో భావన చేస్తూ, అగ్నికి ప్రదక్షిణ చేస్తూ, ఆత్మ ప్రదక్షిణగా ఆపాదించును గాక. పాంచ భౌతికమగు అగ్నిని దాటి పురాణమగు **'ఆత్మయజ్ఞోపాసన'** ధారణ చేయును గాక।

ఆత్మయందు అగ్నిని ఆరోపించి ఆత్మాగ్నిని ధ్యానిస్తూ, యజ్ఞాగ్నికి ప్రదక్షిణము చేసి, నమస్కరించి యజ్ఞాగ్ని గుండములోని అగ్నికి **"ఉద్వాసన"** (send off) పలుకును గాక।

ఆ మరునాడు ప్రాతః సంధ్యను ఉపాసిస్తూ సహస్ర గాయత్రీ పూర్వకంగా (1000 సార్లు గాయత్రీ మంత్రమును నిర్వర్తించి), సూర్యోపస్థానము (సూర్యోపాసన) చేయాలి. **(సూర్యశ్చ మామన్యుశ్చ మన్యుపత యశ్చ మన్యుకృతేభ్యోః పాపేభ్యో రక్షన్తాం। యద్రాత్రియాత్ పాపమకార్షం, మనసా వాచా హస్తాభ్యాం పద్భ్యాం ఉదరేన శిశ్నా। రాత్రి స్తదవలుంపతు. యత్ కించిత్ దురితం మయి ఇదమహం మాం సూర్యేజ్యోతిషి జుహోమి స్వాహా – అని దోసిలితో జలము స్వీకరించాలి.**

**ఆ తరువాత–**

**నాభిదఘ్నా ఉదకమ్ ఉపవిశ్య, అష్టదిక్పాలక అర్ఘ్యపూర్వకం గాయత్రీ ఉద్వాసనం కృత్వా, సావిత్రీం వ్యాహృతిషు ప్రవేశయిత్వా...,** జలములో (తటాకములో) బొడ్డు వరకు మునిగి, జలస్వరూపడగు వరుణ దేవునికి నమస్కరించును గాక. అప్పుడు అష్టదిక్పాలకులకు అర్ఘ్యము సమర్పించును గాక।

**తూర్పున :** శచీదేవి సమేత **ఇంద్ర భగవానునికి,**

**తూర్పు – దక్షిణ మధ్యదగు – ఆగ్నేయమున :** స్వాహాదేవీ సమేత అగ్ని భగవానునికి,

**దక్షిణమున :** శ్యామలాదేవీ సమేత యమ భగవానుకి,

**దక్షిణ – పశ్చిమమగు నైరృతియందు:** దీర్ఘాదేవీ సమేత నైరృతి భగవానునికి,

**పడమరగా :** కాళికా దేవీ సమేత **వరుణునికి,**

**పశ్చిమోత్తరంగా (వాయువ్యముగా) :** అంజనాదేవీ సమేత **వాయుభగవానునికి,**

**ఉత్తర దిక్కుగా :** చిత్రా దేవీ సమేత **కుబేరునికి,**

**పూర్వోత్తర దిశగా (ఈశాన్యముగా) :** పార్వతీదేవీ సమేత ఈశాననుకి అర్ఘ్యములు సమర్పించును గాక.

ఆవిధంగా జలముతో అష్టదిక్పాలకులకు అర్ఘ్య ప్రదానము నిర్వర్తించి, **"గాయత్రీ ఉద్వాసనము"** నిర్వర్తించాలి.

అప్పుడు (**సత్–విత్–ఋత్** స్వరూపిణి అగు) సావిత్రీ దేవిని స్వకీయమగు ఉపాసనా విధానమునందు ప్రవేశింపజేసుకోవాలి. **"నేనే–సత్ ఉనికి, విత్ – ఎరుక స్వరూపుడగు సమస్తమునకు పరమైయున్న ఆత్మ పురుషుడను"** అను స్వస్వరూపాత్మోపాసనకు ఉపక్రమించు గాక. అందుకు చెప్పబడిన శాంతి పాఠక స్తుతి శ్లోకములు చెప్పుకుంటున్నాము.

## స్వస్వరూపాత్మస్థాన స్తుతి

**అహం వృక్షస్య రేః ఇవ।** ఈ సంసార వృక్షమును పోషించు చేతన స్వరూపడను నేనే.

**కీర్తిః పృష్ఠం గిరేః ఇవ।** స్వస్వరూపమగు ఆత్మ యొక్క కీర్తియే పర్వత శిఖరంలాగా ఎదురుగా సమున్నతంగా ఏర్పడి ఉన్నది.

**ఊర్ధ్వ పవిత్రో వాజినీవ స్వ అమృతమస్మి :** ఆకాశంలో సూర్యునియందు ప్రదర్శనమగుచున్నట్లే – ఆ ప్రకాశమానమగు పరబ్రహ్మతత్త్వము నా యందు కూడా అమృత స్వరూపమై – అస్మత్ స్వస్వరూపంగా వెలయుచున్నది.

**ద్రవిణగ్ం సువర్చసమ్ :** మమాత్మ స్వరూపమే ఈ సమస్తమును తన యొక్క సు–వర్చస స్వరూప సంపదగా కలిగియున్నది. ఇదంతా నా సు–వర్చస రూపమగు ద్రవిణం (ధనము)యే.

**సుమేధా అమృతో క్షితః :** నా ఆత్మయే సర్వదా అమృత స్వరూపమై, సర్వత్రా భూస్వరూపమై ఉత్తమ బుద్ధికి అనుభవమగుచు ఉన్నది.

**ఇది త్రిశంకోః వేదానువచనమ్ :** ఇది ఋక్ – యజుర్ – సామ్ త్రివేదములు ప్రకటించు శ్రేష్ఠ వచనము.

# పరబ్రహ్మ స్వరూపమగు ప్రణవ ధ్యానము

ఏ ఓంకార ప్రణవమైతే . . .

**యః ఛంద సా మృషభో విశ్వరూపః ।** ఈ విశ్వమంతా ఎవరి యొక్క కల్పిత రూపముగా వేదములచే చెప్పబడుచూ, ఎలుగెత్తి గానము చేయబడుతుందో (మృషము – కల్పిత ప్రతిబింబమాత్రము – మట్టికి బొమ్మ ఆకారమువలె)

**ఛందోభ్యో అధ్యమృతాత్ సంబభూవ ।** ఏ అమృత స్వరూపము నుండి వేదములు శబ్దరూపంగా బయల్వెడలుచున్నాయో.

**సమేంద్రో మేధయా స్పృణోతు ।** అట్టి సమగ్రాత్మ స్వరూపమగు ప్రణవము నా యొక్క ఇంద్రియములను ఉత్తమ మేధస్సుతో (బుద్ధితో) తీర్చిదిద్దును గాక।

**అమృతస్య దేవ ధారణో భూయాసమ్ ।** మేము అత్యధికమగు ఆత్మధ్యానామృతమునే ధారణ చేయచుండెదము గాక।

**శరీరం మే విచర్షణం ।** నా యొక్క ఆత్మ శరీరమే సర్వత్రా విస్తారము, సంచారము కలిగినదై మాకు అనుభవమగుచుండును గాక. నా ఈ శరీరము జ్ఞానము పొందుటకు ఉపయోగమగు ఉపకరణమగు గాక.

**జిహ్వా మే మధుమత్తమా ।** మధురమగు ఆత్మ గురించిన జ్ఞాన వాక్యములనే నా నాలుక ఆశ్రయించి ఉండును గాక. నా వాక్కు మధురముగా, శుభప్రదముగా, సర్వజన శ్రేయోదాయకముగా పలుకులు పలుకును గాక. నేను పలికే పలుకులు సహజీవులకు మధురముగా వినిపించును గాక.

**కర్ణాభ్యాం భూరి విశ్రువమ్ ।** నా చెవులు ఆత్మ భగవానుని స్తుతి – సమాచారములు వినుటకై అధికాధికంగా సువిస్తారమై ఉ ండును గాక.

**బ్రహ్మణః కోశోఽసి మేధయా పిహితః ।** మా మేధ (బుద్ధి) బ్రహ్మము గురించిన శాస్త్ర – స్వానుభవజ్ఞాన ధనాగారమై నిండియుండును గాక.

**శ్రుతం మే గోపాయ ।** రహస్యములగు వేదాంత వాక్యములు మా హృదయమునందు పరమార్థపూర్వకంగా పరిరక్షించబడు గాక.

## సముద్ధరణ – సన్న్యస్త మంత్రము

**దారైషణాయాశ్చ ధనైషణాయాశ్చ, లోకైషణాయాశ్చ వ్యుత్థితోఽహమ్ ।** : ఇప్పుడు ఈ యతి – పరివ్రాజక సన్యాస వ్రతము స్వీకరిస్తూ 1) భార్య, స్త్రీ, నామరూపములపట్ల ఏర్పడియున్న ఈషణము (ఇష్టము, అభిరుచి, కోరిక, ఆవేశము) 2) ధనము పట్ల, సంపద పట్ల ఈషణము 3) లోక సంబంధమైన ఈషణము – వీటి నుండి ఉద్ధరణము పొందుచున్నాను. బంధముల నుండి విడివడుచున్నాను. (ఈషణము = ఇచ్ఛ, కోరిక, ఆకర్షణ)

**1) ఓం 'భూః' సన్న్యస్తం మయా :** ఓంకార రూపుడగు పరమాత్మను ఆశ్రయిస్తూ భౌతికంగా కనిపించేదంతా (భూః) నాచే వదలివేయబడుచున్నది. (I am leaving all that is matter related).

**2) ఓం 'భువః' సన్న్యస్తం మయా :** మనస్సు యొక్క విషయములను (భువః) ఆశ్రయించు స్వభావము నాచే విడవబడుచున్నది.

**3) ఓగ్ం 'సువః' సన్న్యస్తం మయా :** సాత్త్వికగుణ ఫలమగు సుఖమయ స్వర్గ (సువః) లోకములను, అనుభవిని కూడా విడచిన వాడనగుచున్నాను.

పైన చెప్పుకున్న 1) "అహం వృక్షస్య రేరివ....", 2) "యః ఛందసా మృషభో విశ్వరూపః...", 3) "దారైషణాయాశ్చ...", 4) "ఓం భూః సన్న్యస్తమయా, ఓం భువః..." ఈ నాలుగు మంత్రములను అంతరార్థమును ఆస్వాదిస్తూ మంద, మధ్యమ, తార ధ్వనులతో (With low, medium and high sounding voice) పలకాలి. వాక్కుతోను, మనస్సుతోను ఒకేసారి ఉచ్చరించాలి.

---

ఆ తరువాత, **శిఖాముండనము**

> ***అభయం సర్వ భూతేభ్యో । మత్తః సర్వం ప్రవర్తతే । ఓం స్వాహా ।*** *ఈ సమస్త జీవులు నా యొక్క అభయమగు ఆత్మానంద స్వరూపమే । నా వలననే ఇదంతా కూడా ప్రవర్తమానము (Tend to behave) అగుచున్నది.*

అని జలమును ప్రాశ్యము చేయాలి (తాగాలి).

అప్పుడు తూర్పు దిశగా కూర్చుని రెండు చేతులతో పూర్ణాంజలి (దోసిలి) ధరించి, "ఓం అభయం...స్వాహా" అను పైన మంత్రము చదువుచూ శిఖను తీసివేయాలి.

## యజ్ఞోపవీత త్యాజ్య విధాన మంత్రము

| | |
|---|---|
| **యజ్ఞోపవీతం పరమం పవిత్రం ।** | పరమ పవిత్రమగు యజ్ఞోపవీతము (ధారణ చేయబడు సృష్టికి సంజ్ఞ) |
| **ప్రజాపతేః యత్ సహజం పురస్తాత్ ।** | మొట్ట మొదట ఇది సృష్టికర్తయగు ప్రజాపతి యొక్క సహజమగు (అసంకల్పిత) సంకల్పము రూపమున ఉన్నది. |
| **ఆయుష్యమ్ అగ్ర్యం ప్రతిముంచ శుభ్రం ।** | ఈ సూత్రము ఆత్మజ్ఞాన సంబంధమైన ఆయుష్షును అధికం చేయునదై పవిత్రతను ప్రసాదించునది. |
| **యజ్ఞోపవీతం బలమస్తు తేజః॥** | ఇట్టి ఈ యజ్ఞోపవీతము తేజో రూపమగు బలము. |
| **యజ్ఞోపవీత! బహిః న నివసేత్ త్వం ।** | అట్టి ఓ యజ్ఞాపవీతమా । ఇక మీరు శరీరమునకు బాహ్యముగా ఉండి ఉండకండి. |
| **అంతః ప్రవిశ్య మధ్యే హి అజస్రం ।** | ఇప్పటి నుండి (అజస్రము) ఎల్లప్పుడు నా హృదయ మధ్యగా ప్రవేశించిన వారై ఉండండి. |
| **పరమం పవిత్రం యశోబలం జ్ఞానం మేధాం ప్రయచ్ఛేతి ।** | నా హృదయమును పొందినవారై నాకు యశస్సు (ఉత్తమముగా కీర్తి), **వైరాగ్యం** జ్ఞాన బలము, జగత్ విషయముల పట్ల వైరాగ్యము, సూక్ష్మాతి సూక్ష్మమగు ఆత్మను తెలుసుకోగల మేధస్సు (ధారణ శక్తి గల మఱపు లేని బుద్ధి) ప్రసాదించువారై ఉండండి. |

పై యజ్ఞోపవీత ధారణ – హృదయాంతర్గతములోనికి యజ్ఞోపవీత దేవతాహ్వాన మంత్రమును పలుకుచు, నూలుచే నిర్మితమైన బాహ్య యజ్ఞోపవీతమును త్రెంచాలి. జలమునకు నమస్కరిస్తూ **"ఓం భూః సముద్రం గచ్ఛ స్వాహేతి"** అని పలుకుచూ నీటియందు బాహ్య జందెమును విడచివేయాలి. అప్పుడు

**ఓం భూః సన్న్యస్తం మయా । ఓం భువః సన్న్యస్తం మయా । ఓగ్ సువః సన్న్యస్తం మయా**

అని మూడు సార్లు అమంత్రము చేసి జలము మూడు (3) సార్లు లోనికి తీసుకోవాలి (త్రాగాలి).

పై మంత్రము చదువుచూ కటిసూత్రము (మొలత్రాడు) కూడా త్రెంచి నీటిలో వదలాలి. అప్పుడు **"సర్వకర్మ నివర్తకోఽహమ్ ।" "నేను సమస్త కర్మల నుండి నివర్తకుడను అగుచున్నాను. ముగింపు పలుకుచున్నాను"** అని మనోవాక్కులతో పలుకును గాక.

<u>ఆ తరువాత</u>

జాతరూపధరుడై (అప్పుడే పుట్టిన బిడ్డవలె), మనస్సులో జనులతో పరస్పర అనుబంధ – బాంధవ్యములేవీ ఏ మాత్రము లేనివాడై కేవలమగు స్వస్వరూపము (The Absolute "I" of one's own Self) తో అనుసంధానము కలవాడై,

– రెండు చేతులు ఊర్ధ్వముగా (Upwardly) ధరించి ఉత్తరము వైపుగా నడిచి వెళ్లును గాక!

-----

**ఇప్పుడిక మనము (1) విద్వత్ సన్న్యాసి 2) వివిదిషా సన్న్యాసిల గురించి చెప్పుకుందాము.**

## విద్వత్ సన్న్యాసి - సన్న్యాస స్వీకారము

**విద్వత్ సన్న్యాసి :** సమస్త దృశ్య విషయములపట్ల విరాగము పొంది మోక్షము సిద్ధించుకొను ఏకైక లక్ష్యశుద్ధి కలవాడు. విరాగము / విరక్తితో చక్కగా సన్న్యసిస్తూ ఉంటే అతడు అప్పటికే గురుముఖతః 'మహావాక్యోపదేశము' పొందినవాడై సుఖముగా భూమిపై తత్త్వజ్ఞానముతో సంచరించును గాక.

**జీవో బ్రహ్మేతి నా పరః ।** పరబ్రహ్మమే జీవుడుగా కనబడుచున్నది. జ్ఞాన దృష్టిచే జీవుడు బ్రహ్మమునకు వేరు కాదు అని తెలియవచ్చుచున్నది.

**తత్త్వమ్ అసి ।** 'నీవు' రూపముగా కనిపిస్తున్నవారంతా తత్ శబ్దార్థమగు పరమాత్మ స్వరూపులే అయి ఉన్నారు.

**సోఽ హమ్ ।** అఖండము, దివ్యము అగు ఆత్మయే నేనై ఉన్నాను. పరమాత్మ ఏకమై నా, నీ, ఆ, ఈ సమస్త స్వరూపుడు.

**త్వమేవాహమ్ ।** నీవుగా ఉన్నది, ఈ జగత్తు రూపముగా ఉన్నది నేనే. నా యొక్క స్వాభావిక ఆత్మ స్వరూపమే అజ్ఞాన దృష్టికి అనేకముతో కూడిన జగత్తుగాను, జ్ఞాన దృష్టికి ఏకము, సమస్తము గాను అయి ఉన్నది. ఇదంతా నా వలననే నేనే అయి ఉన్నాను.

**ఓం ఇతి ఏక అక్షరం బ్రహ్మ ।** ఏకము, అక్షరము అగు బ్రహ్మమే, సత్యమగు **సత్-చిత్-ఆనంద రూపమే - నేను - నీవు జగత్తుల 'ఓం' కారార్థ రూపముగా వెలుగొందుచున్నది.**

ఈ విధంగా విద్వత్ సన్న్యాసి ఆత్మను సమస్తముగా ఎరిగి, ఆత్మానంద సిద్ధ పురుషుడై, ఈ దృశ్యమునందు ఆత్మానంద భరితుడుగా విహరిస్తున్నాడు.

**ఈ సమస్తము నేనే అయి ఉండగా, నాకు అన్యముగా వ్యతిరేకమైనది ఏమున్నది ?**

**మత్తః కశ్చిత్ న అన్యో వ్యతిరిక్తః** అను అనుభవమును స్వాభావికము చేసుకున్నవాడై ఉంటున్నాడు. ఎక్కడ ఏ ఫలము (Fruit), పత్రము (Leaf), ఉదకము (Water) దొరికితే అవియే స్వీకరిస్తూ, పర్వతములందు, వనములందు, దేవాలయ ప్రాంగణములందు సంచారము కలిగి ఉండును గాక.

అట్టి సన్న్యాసి వస్త్రములను కూడా ధరించాలి అనే ధర్మము లేనివాడై (దిగంబరుడై), సర్వత్రా సంచారములు నిర్వర్తిస్తూ,

**- సర్వానంద స్వానుభవైక పూర్ణ హృదయుడై** (ఆత్మానందమును సర్వత్రా దర్శిస్తూ స్వస్వరూపముగా ఆనందించు హృదయముకలవాడై)

- కర్మ - కర్మఫలముల పరిధులను దాటిపోయి, కర్మ సాక్షిత్వము సిద్ధించుకొన్నవాడై ఉండును గాక.
- ప్రాణమునకే ఆధారము, ప్రాణ శక్తికి జనన స్థానము అగు ఆత్మను తనయందు, అఖిల భూతములందు దర్శించుచూ, ప్రాణాధార పరాయణుడై ఉండును గాక.

దేహము నిలచి ఉన్నంతవరకు ఫలములు, ఫలరసములు, ఆకులు, జలము స్వీకరిస్తూ ఏది ఆహారముగా లభిస్తే దానిని దేహమునకు సమర్పించువాడై ఉండును గాక।

**మోక్షమును మాత్రమే అభిలషించువాడై కాలము గడుపును గాక ।** దేహము త్యజించు సందర్భము వచ్చినప్పుడు పర్వత గుహలలోనో, మరెక్కడైనా సరే - తారక మంత్రము (సమస్త దృశ్యము నుండి స్వస్వరూపమును తరింపజేయు మననము కలవాడై) జపిస్తూ (భావిస్తూ) ఈ భౌతిక శరీరమును శిథిల వస్త్రము విడిచినట్లు త్యజించివేయును గాక.

# వివిదిషా సన్న్యాసి - సన్న్యాస స్వీకారము

"ఈ జగత్తుతో అనురక్తియే సంసారము" అని తెలుసుకొని అందుకు సాధనగా సన్న్యాసాశ్రమము స్వీకరించువాడు. సన్న్యాసమును విరక్తి కొరకై సాధనగా ఎన్నుకొనువాడు - "వివిదిషా సన్న్యాసి" అనబడుచున్నాడు.

ఈతడు సన్న్యాసము 'సాధన' కొరకై స్వీకరించువాడు. విద్వత్ సన్న్యాసి వలెనే సన్న్యాసవ్రత దీక్షా స్వీకార విధిని ముగిస్తారు. ఆ తరువాత ఉత్తర దిక్కుగా 100 అడుగులు నడచి వెళ్లుతారు.

అప్పుడు ఆచార్యులు మొదలైన అక్కడి విప్రులు, పండితులు అతనిని ఉద్దేశ్యించి : **తిష్ఠ, తిష్ఠ - మహాభాగా ! దండం వస్త్రం కమండలుం, గృహాణ । ప్రణవ మహావాక్య గ్రహణార్థం గురునికటం ఆగచ్ఛేత్ । -** ఓ సన్న్యాసాశ్రమము స్వీకరిస్తూ ఉన్న మహానుభావా ! ఆగండి ! ఆగండి ! ప్రణవ వాక్యార్థము బుద్ధికి సుస్పష్టము, నిర్దుష్టము చేసుకోవటానికై మీరు సద్గురు ఆశ్రమము ఆశ్రయించండి !" - అని పలుకుతారు. అప్పుడు ఆ వివిదా సన్న్యాసి అక్కడి వేదజ్ఞుల, విప్రుల సూచనానుసారంగా దండము (చేతికర్ర), కటిసూత్రము (మొలత్రాడు), కౌపీనము (గోచి), ఏకశాటి (ఒక శాలువ), కమండలువు (నీటి పాత్ర)ను స్వీకరించాలి.

**వైణవం దండం :** పాదముల నుండి మస్తకము (శిరస్సు) వరకు పొడవుగల వెదురు దండమును స్వీకరించాలి. ఎక్కడా వ్రణములు (కణుపులు) లేనిది, సౌమ్యము (నున్నగా)ను, వంకర టింకరలు - ఎత్తు పల్లాలు లేనిది, అందముగా ఉన్నది అగు దండమును పొంది ("ఓం కేశవాయ స్వాహా...." మొదలైన విధంగా) ఆచమనం చేసి (మూడుసార్లు జలము లోనికి తీసుకుని) - ఈ మంత్రము చదువుచూ చేతికి తీసుకోవాలి.

| | |
|---|---|
| **సఖా ! మా గోపాయ !** | మిత్రమా ! సఖా ! దండ భగవాన్ ! నన్ను సర్వదా కాపాడుతూ ఉండండి. |
| **ఓజః సఖా యో అసి ఇంద్రస్య వజ్రోసి।** | నా యందు ఓజో శక్తిని వృద్ధి చేయుదురు గాక. మీరు ఇంద్రుని వజ్రము వంటి వారు అయి వుండండి. |
| **వార్త్రఘ్నః శర్మ మే భవ ।** | నాకు సుఖాలు అవండి. |
| **యత్ పాపం, తత్ నివారయేతి ।** | ఓ దండ రాజమా ! పాప దృష్టుల నుండి కాపాడి నాకు ఆనందము కలుగజేయండి. పాప కార్యముల నుండి నివారించి నన్ను రక్షించెదరు గాక. |

**కమండలువు (జలపాత్ర) : "జగజ్జీవనం, జీవనాధార భూతం! మాతే! మా మంత్రయిస్వ, సర్వదా సర్వసౌమ్యేతి"** "జగత్తులో జీవించటానికి జీవనాధారమై ఉండగల ఓ కమండలువు మాతా! ఎల్లప్పుడు సమస్తము పట్ల సౌమ్య (Peaceful, Tolerable) స్వభావము కలిగిఉండుటకై ఆమంత్రిస్తూ (Please condition me) నన్ను రక్షించుటకై నన్ను వెంటనంటి ఉండండి" అని మంత్రము చదువుచూ, ప్రణవము (ఓం) ఉచ్చరిస్తూ కమండలువును స్వీకరించెదరు గాక!

**కటి సూత్రము : కౌపీనాధారం కటిసూత్రం 'ఓం' ఇతి ।** ఓంకార స్వరూపమగు కటి సూత్రమా (మొలత్రాడు దేవా)! మీరు వేంచేసి నా యొక్క కౌపీనమునకు (గోచి ధరించటానికి) ఆధారము అవండి అని ఆహ్వానిస్తున్నాను.

**కౌపీనము (గోచి) : గుహ్యాచ్ఛాదనం కౌపీనం ఓం ఇతి ।** నా యొక్క గుహ్యావయవమునకు ఆచ్ఛాదనగా (కప్పుకొని) ఉండటానికి ఓంకార స్వరూపముగా ఈ కౌపీన దేవతకు ఆహ్వానము" - అని చెప్పుచూ కౌపీనము ధరించాలి.

**వస్త్రము (శాటీ, దుప్పటి) : శీత - వాత - ఉష్ణ త్రాణకరం । దేహైక రక్షణం ఓం ఇతి ।** చలి, ఉక్కు - ఉష్ణముల నుండి దేహమును రక్షించుటకై ఈ వస్త్రమును స్వీకరించుచున్నాను.

ఈ విధంగా కటి సూత్రమును, కౌపీనమును, కప్పుకొనుటకు వస్త్రమును ఆచమనపూర్వకంగా స్వీకరించాలి.

పై విధంగా సన్న్యాసయోగ పట్టాభిషిక్తుడై **కృతార్థోఽహం - "నేను కృతార్థుడను. జీవితములో నిర్వర్తించవలసిన ముఖ్య కార్యము నిర్వర్తించినవాడను అగుచున్నాను"** అని నోటితో పలుకుచూ, మనస్సుతో మననము చేస్తూ బుద్ధితో అవగాహనను నిశ్చలము, నిర్మలము చేసుకొనును గాక. సన్న్యాసాశ్రమ స్వీకారి అగును గాక।

**ఇతి ఉపనిషత్ - చతుర్థోపదేశః**

# 5. నారద పరివ్రాజకోపనిషత్ – పంచమ ఉపదేశము

**శ్రీ నారదుడు :** హే భగవాన్ ! ఇప్పుడు నాదొక సందేహము. దయచేసి నివారించ ప్రార్థన.

**"సర్వకర్మ నివర్తకః సన్న్యాస" – ఇతి త్వయా ఉక్తః ।** మీరు మాకు సన్న్యాసయోగము గురించి బోధిస్తూ **"సర్వ కర్మల నుండి ఉపసంహారము** (Completely withdrawing from all functional duties) అని చెప్తూతూ వస్తున్నారా? లేక నాకు అట్లా అనిపిస్తోందేమో?

అలా చెప్పుచూనే **"స్వాశ్రమాచార పరో భవేత్ ।'** తను కూడా సన్న్యాసాశ్రమ ఆచారపరుడై ఉండాలి" – అని కొన్ని ఆచారములను (Doings) గురించి నియమములుగా చెప్పుచున్నారు కదా. "తప్పక నిర్వర్తించాలి" అని సూచిస్తున్నారు. 1) కర్మలు, విధులు ఆశ్రమానుసారంగా నిర్వర్తించటము 2) కర్మలన్నీ సన్న్యసించటము ఈ రెండు విషయముల గురించి మరికొంత వివరించి చెప్పండి.

**శ్రీ పితామహులవారు :** చైతన్యమూర్తి అగు ఆత్మ 'శరీరి' అయి దేహమును స్వీకరిస్తున్నదిగా అగుచున్నది. అట్టి శరీరి దేహముతో '4' అవస్థలు అనివార్యంగా కలిగి ఉంటున్నాడు.

1) జాగ్రత్ అవస్థ 2) స్వప్నావస్థ 3) సుషుప్త్యవస్థ 4) తురీయావస్థ.

ఈ నాలిగింటి యందు ప్రవర్తమానుడగుచున్న జీవితాభిమాని అగు జీవుడు, వాటికి అధీనమైనట్టి కర్మ – జ్ఞాన – వైరాగ్యములతో ప్రవర్తమానుడై ఉంటున్నాడు. అట్టి సందర్భానుచితంగా ప్రవర్తమానుడగు పురుషుడు (పురుషకారము ప్రదర్శించు జీవుడు) – తత్ తత్ అనుకూలమైన ఆచారములను (Situational as well as contextual acts / deeds) నిర్వర్తించటము అనివార్యము అగుచూ ఉంటుంది. కాబట్టి జీవుడు దేహమున్నంత వరకు ఆయా స్థితికి సంబంధించిన కర్మలు నిర్వర్తించక తప్పేది కాదు.

**శ్రీ నారదుడు :** ఓహోఁ ! అట్లాగా ! అయితే సన్న్యాసము అనేది అనేక రకములైనవి – అని మీరు చెప్పే వాక్యములను అనుసరించి నేను అర్థం చేసుకుంటూ భావిస్తున్నాను. తండ్రి ! ఈ విషయం మాకు బోధించండి. సన్న్యాసములు ఎన్నెన్ని రీతులుగా ఉంటాయి (How many varieties)? వాటి వాటి భేదాలు ఏ విధంగా ఉంటాయి (How they are all different from each other) ? వాటి అనుష్ఠాన భేదములు (Practising differences) ఏమేమి ? అవి ఏ ఏ విధములుగా కనబడుచూ ఉంటాయి ? వారి వారి కర్మనిర్వహణ భేదములేమేమిటి ? ఆయా వివరాలన్నీ బోధించటమును మేము అర్థిస్తున్నాము.

**పితామహ భగవానుడు :** సరేఁ ! "సన్న్యాస భేదములు, ఆచార భేదములు ఏవేవి ? ఏ రీతిగా ప్రసిద్ధమై ఉన్నాయి? అను నీ ప్రశ్నకు సమాధానము మనము చెప్పుకుందాము.

**తత్త్వతః అస్తి ఏక ఏవ సన్న్యాసః ।** వాస్తవానికి 'సన్న్యాస తత్త్వము' అనేది ఒక్కటే అయినప్పటికీ 1) జ్ఞాన–అజ్ఞానముల దృష్ట్యా 2) కర్మ విశేషముల వశంగా కొంత భేదముల చేత శాస్త్రములచే నాలుగు రకములుగా చెప్పబడుతోంది **(ఉపాగతః).**

**1) వైరాగ్య సన్న్యాసి 2) జ్ఞాన సన్న్యాసి 3) జ్ఞాన వైరాగ్య సన్న్యాసి 4) కర్మ సన్న్యాసి.**

**1) వైరాగ్య సన్న్యాసి – విధానము : "దుష్టమదన అభావాత్" చ ఇతి – విషయ వైతృష్ణ్యమ్ ఏత్య, ప్రాక్ – పుణ్య కర్మ వశాత్ సన్న్యస్తః – స వైరాగ్య సన్న్యాసీ ।**

ఒకడు దుష్టమైన, బంధము – దుఃఖముల పర్యవసానము కలిగిన అభ్యాసములలో చిక్కుకున్నానే ? ఈ జీవితావకాశమును వృథాపరచుకోకూడదు" – అను ఎరుక (Awareness) పొందుచున్నాడు. జగద్విషయముల పట్ల, ఇంద్రియ విషయముల పట్ల ఏర్పడుచున్న తనయొక్క తృష్ణ (urge) ని గమనించిన వాడగుచున్నాడు. పూర్వ పుణ్యకార్యముల ఫలముగా సన్న్యాస భావములతో సన్న్యసించుచున్నాడు. ఈతడు "వైరాగ్యసన్న్యాసి" అని పిలువబడుచున్నాడు.

**2) జ్ఞాన సన్న్యాసి: శాస్త్ర జ్ఞానాత్–పాప పుణ్య లోకానుభవ శ్రవణాత్, ప్రపంచ ఉపరతః, క్రోధ ఈర్ష్య అసూయ అహంకార అభిమానాత్మక సర్వ సంసారాం నివర్త్య, దారైషణ ధనైషణ లోకైషణాత్మక దేహ వాసనానాం శాస్త్ర వాసనానాం లోక వాసనానాం త్యక్త్వా, "వమనాన్నమ్ ఇవ ప్రాకృతికం సర్వమిదం" మత్వా, సాధన చతుష్టయ సంపన్నో యః సన్న్యస్యతి, స ఏవ "జ్ఞాన సన్న్యాసీ"**

మరొకడు వేదాంత శాస్త్రము (లేక) తత్త్వశాస్త్ర శాఖలైనట్టి వేద, ఉపనిషత్, పురాణ, చారిత్రాత్మక విషయముల జ్ఞానము సంపాదించుకొనుచున్నాడు.

- ఈ ఎదురుగా కనిపిస్తున్న పాంచ భౌతికమగు ప్రపంచమునకు ఆవల ప్రకాశిస్తూ సమస్తమునకు ఆధారమైయున్న ఆత్మతత్త్వము వైపుగా దృష్టిని సారించుచున్నాడు.
- దృశ్యము పట్ల అజ్ఞానపూర్వకంగా ఏర్పరచుకొన్న సంబంధ బాంధవ్యముల కారణంగా రూపుదిద్దుకొని, హృదయములో ప్రవేశించియున్న క్రోధము, ఈర్ష్య, అసూయ, అహంకార, అభిమానాత్మకమైన సర్వ సంసార వ్యవహారములను నివర్తము (ప్రవృత్తి లేనిదిగా, తొలగిపోవునదిగా) తీర్చిదిద్దుకుంటున్నాడు.
- దారైషణ, ధనైషణ, లోకైషణలను (భార్య – భర్త – బంధు సంబంధమైన కోరికను, ధనము సంపదల పట్ల, లోకములో పేరు ప్రతిష్టల పట్ల, వస్తు సమూహములపట్ల – సొంతము కావాలనే కోరికలను), ఈషణత్రయమును క్రమంగా వదలివేస్తూ ఉన్నాడు.
- "దేహ వాసన, శాస్త్ర వాసన, లోక వాసన" అనే త్రి–వాసనలను క్రమక్రమంగా పరిత్యజిస్తూ వస్తున్నాడు.
- ప్రకృతి పూర్వకంగా ఇంద్రియ విషయములపట్ల ఏర్పడే ప్రియత్వమును, ఆధారపడి ఉండటము మొ॥ వాటిని **"కక్కిన కూడు వంటిది"** అని భావించ సాగుచున్నాడు. సాధన చతుష్టయము (శమము (శాంతము), విచారణ, సంతోష – సంతృప్తి, సాధుసంగము)లను అనుష్టించి సుసంపన్నుడగుచున్నాడు. ***అట్టి సన్న్యసించువాడు "జ్ఞాన సన్న్యాసి" అనబడుచున్నాడు.***

**3) జ్ఞాన వైరాగ్య సన్న్యాసి : క్రమేణ సర్వమ్ అభ్యస్య, సర్వం అనుభూయ, జ్ఞాన వైరాగ్యాభ్యాం –**

**– స్వరూప అనుసంధానేన,**

**– దేహమాత్రావశిష్టః –**

**సన్న్యస్య "జాతరూపధరో" భవతి – స జ్ఞాన వైరాగ్య సన్న్యాసీ।**

పైన చెప్పుకున్న విధంగా శాస్త్ర జ్ఞాన తత్పరుడై, ప్రపంచాతీత చైతన్యము గురించి శ్రవణము చేసి, క్రోధ ఈర్ష్య, అసూయలచే నిర్మితము అగుచున్న సంసారము మొత్తము నుండి నివర్తించినవాడై, ఈషణ–వాసనా త్రయములను త్యజించి, ప్రాకృత సంబంధము యొక్క నిరుపయోగము ఎరిగినవాడై జ్ఞాన సన్న్యాసి సాధన చతుష్టపరుడగుచున్నాడు.

– అభ్యాస బలముచే పైన చెప్పినవన్నీ అనుభవముగా తెచ్చుకొని (అనుభవజ్ఞుడై) –

– కేవలమగు స్వస్వరూపముతో (with the Absolute "I" of one's own self) అనుసంధానము సిద్ధించుకొన్నవాడై

– అప్పుడే పుట్టిన బిడ్డవలె ప్రపంచముతో మానసిక సంబంధమే లేని దేహమాత్ర – అవశిష్టుడై,

కేవలమగు ఆత్మయందు సమస్తమును ఏకము చేయుచున్నవాడు **"జ్ఞాన వైరాగ్య సన్న్యాసి"** అగుచున్నాడు.

**కర్మ సన్న్యాసి / క్రమ సన్న్యాసి : బ్రహ్మచర్యం సమాప్య, గృహీ భూత్వా, వానప్రస్థాశ్రమం ఏత్య, వైరాగ్య అభావే ఆప్య, ఆశ్రమక్రమానుసారేణ యః సన్న్యస్యతి, స కర్మసన్న్యాసీ।** మొదట బ్రహ్మము గురించిన అధ్యయనము కొరకై విద్యార్థి అయి 'బ్రహ్మచర్యము' స్వీకరించి, అటు తరువాత విద్యను పూర్తి చేసుకొని, గురువు యొక్క అనుజ్ఞతో గృహస్థ ఆశ్రమము స్వీకరించి, ఆ తరువాత సరి అయిన సమయంలో గురు అనుజ్ఞతో, కుటుంబ సభ్యుల అంగీకారముతో గృహస్థాశ్రమ బాధ్యతలన్నీ అప్పగించివేసి, వానప్రస్థాశ్రమము స్వీకరించి, భక్తి జ్ఞాన వైరాగ్యములను నిశ్చలము, సుస్థిరము చేసుకొని, సరి అయిన సమయంలో శాస్త్రయుక్తంగా సన్న్యాసము స్వీకరించువాడు **'క్రమ సన్న్యాసి' (లేక) 'కర్మ సన్న్యాసి'** అని పిలువబడుచున్నాడు.

## బ్రహ్మచర్యాశ్రమము నుండియే సన్న్యసించువాడు

ఒకానొకడు బ్రహ్మచర్యాశ్రమము నుండియే నేరుగా (గృహస్థ, వానప్రస్థ ఆశ్రమములు ఆశ్రయించకుండా) సన్యసించువాడు అగుచున్నాడు. జాతరూపధరుడై అప్పుడే పుట్టిన బిడ్డవలె సమస్త సంబంధములు (వదలుటచే) లేనివాడై సన్న్యసించవచ్చు. అట్టివాడు వైరాగ్యముచే వైరాగ్య సన్న్యాసి కావచ్చు. శాస్త్ర జ్ఞానము సంపాదించుకొని విద్వత్ సన్న్యాసి అగుచున్నాడు. ఆత్మజ్ఞాని అయి ఉంటే 'జ్ఞాన సన్న్యాసి' అగుచున్నాడు. (లేదా) వైరాగ్యము, మోక్షము పొందు ఉద్దేశ్యము కలిగి ఉంటే **వివిదిషాసన్న్యాసి** గాని, లేక "కర్మ సన్న్యాసి" గాని అగుచున్నాడు.

నాలుగు విధములైన సన్న్యాసములలో కర్మ సన్న్యాసము రెండు విధములు **1) నిమిత్త సన్న్యాసి 2) అనిమిత్త సన్న్యాసి**

**1) నిమిత్త సన్న్యాసి :** 'మృత్యువు' అనే సందర్భముచే సన్న్యసించువాడు. ఈయనే 'ఆతురసన్న్యాసి' అని కూడా పిలువబడుచున్నాడు.

**2) అనిమిత్త సన్న్యాసి :** 'మరణము' వంటి నిమిత్త కారణములేవీ లేకుండా, కేవలము వైరాగ్య భావములు కారణంగా సన్యసించువాడు. ఈయనయే **"క్రమ సన్న్యాసి"** కూడా.

**ఆతుర సన్న్యాసమునకు నిమిత్త కారణము :** ప్రాణ ఉత్క్రమణ కాలమునకు (When about to leave the body as per one's health position) కొంచెము ముందుగా తీసుకొను సన్న్యాసము. అట్టి వాడు తిరిగి జీవించువాడు అయితే, మరల క్రమ సన్న్యాస విధానము నిర్వర్తించాలి.

**అనిమిత్త సన్న్యాసము (క్రమ సన్న్యాసము)** :

- అంగములు దృఢంగా ఉండగా,
- కర్మ – కర్మ ఫలములు నశ్వరమే (నశించి పోయేవే) అని గ్రహించి,
- సమస్తము హేయమే (వదలి వేయవలసినవే) అని నిశ్చయించుకొని, నిష్కళయుడై స్వీకరించు సన్న్యాసము.

-----

## పరబ్రహ్మ ఎట్టివాడు?

**హగ్ంస ః శుచిషత్ :** హంస సోఽహం రూపమున దివ్యమగు దైవీ స్వరూపుడు.

**అంతరిక్షసత్ :** అంతరిక్షమున సత్ (ఉనికి /Being) అయి ఉన్నవాడు. ఆకాశమంతా నిండి ఉన్నవాడు.

**హోతా వేదిసత్ :** యజ్ఞవేదికలో అగ్ని స్వరూపుడు, హోత (ఋత్విజుడు) అయినవాడు.

**అతిథిః దురోణ సత్ :** ద్రోణకలశములో సోమరస స్వరూపుడు, ఇంటిలో అతిథివలె వేంచేసి ఉన్నవాడు.

**నృషత్ వర సత్ :** మానవులలో దేవతలలో అంతర్యామిగా ఉన్నవాడు, సత్ – స్వరూపుడు.

**అబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్ :** సరస్సులలో తామరవలెను, చంద్రునిలో వెన్నెల తేజస్సు గాను, గోవులందు పాలరస స్వరూపుడు గాను, ఋగ్వేదములో ఋక్కు (భగవత్ స్తుతి) స్వరూపుడు గాను – కొండపై ఆకాశమువలెను, **పరమ – మహత్ సత్యమై వెలుగొందుచున్నాడు.** "అట్టి పరబ్రహ్మముకంటే వేరైనదంతా కూడా నశ్వరము (అశాశ్వతము త్వరలో నశించునది) అని నిశ్చయించుకొని క్రమమార్గంగా (శాస్త్ర విహిత మార్గంగా) సన్న్యసించువాడు **"అనిమిత్త సన్న్యాసి".**

## షట్ (6) విధ సన్న్యాస – ఆశ్రయములు

**1) కుటీచకుడు 2) బహూదకుడు 3) హంస 4) పరమహంస 5) తురీయాతీతుడు 6) అవధూత :** ఈ 6గురు సన్న్యాసులలో వివిధ తరగతివారు.

### 1) కుటీచక సన్న్యాసి :

- శిఖ, యజ్ఞోపవీతము, దండము, కమండలువు, కౌపీనము (గోచి), కందము (బొంత) ధరించువాడు.
- తల్లి, తండ్రి, గురువులను ఆరాధిస్తూ ఒకచోటనే ఉండువాడు.
- పిఠరకము (జోలె), త్రశిక్యము (కావడి ఉట్టి) ధరించి మంత్రోపాసన నిర్వర్తించువాడు.
- ఒక చోట భిక్ష, ఒకేచోట ఉండి, అక్కడనే భోజనము భుజించువాడు.
- తెల్లటి ఊర్ధ్వ పుండ్రములను (నుదిటిపై పైపైపుగా నామము) ధరించువాడు.

- త్రిదండమును (గూఢార్థము : 1) మనో దండము 2) వాక్ దండము 3) కర్మ దండము – మనోవాక్ కర్మలను ఉపకరణములుగా) ధరించినవాడు.
- కుటీచకులకు – బ్రహ్మచర్యము, గృహస్థ, వానప్రస్థ – ఆ తరువాత 4వది అగు సన్న్యాసవిధిగా చెప్పబడుతోంది.
- వీరు సన్న్యాసకాలములో ఉత్తమ బుద్ధి సిద్ధించేవరకు శాస్త్రములు అధ్యయనం చేస్తూ, ఆ తరువాత కటిసూత్రం, కౌపీనము, దండము, వస్త్రము, కమండలువు జలములో విడచివేస్తారు.
- వేదాంత శాస్త్రము లేని అధ్యయనము చేయకూడదు. ఆత్మ శాస్త్రము కాని విషయాలు అధ్యయనము గాని, మాట్లాడటము గాని, వినటముగాని, తర్కించటం గాని, వితర్కించటంగాని చేయరాదు.

కఠిన వాక్యములు పలుకరాదు. అధికంగా ప్రాపంచక విషయాలు మాట్లాడరాదు. అధికమైన అన్య సంభాషణలు, వాదములు గొప్ప విగ్లాపనమే (Distraction) అవుతాయి. ఇతరుల సంభాషణలను విశ్లేషించరాదు. స్త్రీలతో కామ ప్రసంగములు చేయరాదు.

వీరికి దేవతా పూజ, ఉత్సవ దర్శనము, తీర్థయాత్రలు స్వధర్మము కావు.

**ప్రాప్తించగల లోకము :** క్రమ, ఆతుర సన్న్యాసులకు మరణానంతరము మరల భూలోకమునకు అర్హుడగుచున్నాడు.

**2) బహూదక సన్న్యాసి :**

- ఒక చోట ఉండక సంచారులై ఉంటారు. మధుకర వృత్తి. గృహనియమములు లేవు.
- శిఖ, యజ్ఞోపవీతము, కౌపీనము, కందము (బొంత) మొదలైనవి ధరించుతారు.

  కుటీచకునివలెనే త్రిపుండ్రము ధరించువారై ఉంటారు.
- సర్వత్రా సమ దృష్టి అభ్యసిస్తూ ఉంటారు (సర్వసమో).
- మధుకర (భిక్షాటన) వృత్తిచే '8' కబళములు (8 ముద్దలు) మాత్రమే ఆహారముగా స్వీకరించువారై ఉంటారు.
- బహూదక సన్న్యాసికి – బ్రహ్మచర్యాశ్రమము నుండి గృహస్థ వానప్రస్థ, సన్యాస 'క్రమ సన్న్యాసము' చెప్పబడింది.
- వీరు కూడా కుటీచక సన్న్యాసివలెనే వేదాంత శాస్త్ర అధ్యయనము చేస్తూ, ఉత్తమ ఆత్మబుద్ధి సిద్ధించగానే, కటిసూత్ర కౌపీన దండ వస్త్రములు జలమునందు సమర్పించివేస్తారు. వీరు కూడా కుటీచకునివలెనే అన్య శాస్త్ర అధ్యయనము, పఠనము, చర్చ మొ॥ చేయరాదు.
- వీరికి కూడా కుటీచక సన్న్యాస నియమములు వర్తిస్తాయి.
- **ఈతడు మరణాంతరము భువర్లోకమునకు అర్హుడు.**

**3) హంస :**

- జటాధారి (అల్లిముడి వేయబడిన వెంట్రుకలముడి) ధరించువారు అయి ఉంటారు.
- త్రిపుండ్ర ఊర్ధ్వ పుండ్రము ధరిస్తారు.
- ఈ ఇల్లు – ఆ ఇల్లు – అను నియమము పాటించకుండా మధూకర భిక్షతో భిక్షాన్నము (ఆహారము) భుజించువారై ఉంటారు. '8'ఇళ్లలో '8' కబళములు మాత్రమే నియమము.
- కౌపీన ఖండము ధరిస్తారు. కపాలము (యాచక భిక్షపాత్ర) ధరించువారై ఉంటారు.
- వీరికి కూడా 'కర్మ సన్యాసము' లేక క్రమ సన్యాసమే విధిగా చెప్పబడుతోంది.
- ఆత్మతత్త్వము తప్పితే మరింకేమీ పలుకరు, చర్చించరు, అధ్యయనము చేయరు.
- **హంస దేహము త్యజించిన తరువాత స్వర్గలోక ప్రవేశమునకు అర్హుడు.**

**4. పరమహంస :**

- శిఖ, యజ్ఞోపవీతము ధరించనివారై ఉంటారు.
- రోజుకు ఐదు (5) ఇళ్లలో మాత్రమే భిక్షాన్నము స్వీకరించువారై ఉంటారు.
- హస్తమే (అఱచేయి) భిక్ష పాత్రగా కలిగి పట్టిడన్నము మాత్రమే ఒకొక్క ఇంట స్వీకరిస్తారు.
- ఒక కౌపీనము ధరిస్తారు. ఒక శాటీ (దుప్పటి), ఒక వైణ (వెదురు) దండము, ధారణ చేస్తారు.
- దేహమంతా విభూతి భస్మము పూసుకొని ఉంటారు.
- సమస్తము త్యజించి, 'సర్వత్యాగి' అయి ఉంటారు.
- వీరికి మొలసూత్రము, గోచి, కమండలు, దండము మొదలైన నియమములు ఉండవు.
- అన్ని వర్ణముల వారి వద్ద భిక్ష స్వీకరించవచ్చును.
- వీరు జాతరూపధరుడుగా (అప్పుడే పుట్టిన బిడ్డలాగా) జగత్– వ్యవహార సంబంధమేమీ లేనివారై ఉంటారు.
- **పరమహంస భౌతిక దేహము త్యజించినప్పుడు తపోలోకము ప్రవేశించుచున్నారు.**

**5. తురీయాతీతుడు :**

- వీరు సంపూర్ణ స్వస్వరూప జ్ఞానము కలవారు.
- గోవువలె నోటికి పట్టినంత ఆహారము దొరికిన చోట స్వీకరిస్తారు (గోముఖాహారము)
- ముందు ఇళ్లలో మాత్రమే భిక్షను స్వీకరించువారై ఉంటారు.
- ప్రపంచమునకు సంబంధించి ఒక దేహము కలిగి ఉండటము తప్పితే – మరింకే లోక సంబంధము మనస్సుందు కలిగి ఉండరు.
- దిగంబరుడై, కుణపము (పీనుగ, శవము) వలె ఇంద్రియ వృత్తులు (Avocations) ఏవీ కలిగి ఉండరు.
- వీరికి కూడా "మొలత్రాడు – గోచిధారణ – వస్త్ర – కమండలు" నియమాలు ఉండవు.
- ఏ వర్ణము వారి ఇళ్ల వద్దనైనా బిక్షాటన చేయవచ్చును.
- వీరు కూడా పరమహంస వలెనే జాతరూపధరులై ఉంటారు.
- తురీయాతీతుడు స్వస్వరూప జ్ఞాని అయి ఉంటాడు. కనుక ఈయన స్వస్వరూపాత్మ యందే ముక్తిని సిద్ధించుకుంటున్నారు. 'భ్రమర కీటక' న్యాయమువలె తామే అఖండాత్మ స్వరూపులగుచున్నారు.

**6) అవధూత :**

- వీరు సంపూర్ణ స్వస్వరూప జ్ఞానము కలవారు.
- అవధూతకు శాస్త్రీయ నియమములు ఏవీ విధించబడటంలేదు.
- అజగరము (కొండచిలువ) వలె తన దగ్గిరకు సమీపించిన ఆహారమును స్వీకరించువారై ఉంటారు.
- ఏకము, అఖండము, సర్వాత్మకము అగు స్వస్వరూపముతో సర్వదా అనుసంధానము కలిగి ఉంటారు.
- వీరికి కౌపీన – కటిసూత్ర – వస్త్ర – కమండలు నియమములు ఉండవు.
- ఏ వర్ణమువారి ఇంటి వద్ద అయినా భిక్ష స్వీకరించవచ్చును. భిక్షాటన నియమములు ఉండవు.
- వీరు కూడా పరమహంస, తురీయుల వలెనే జాతరూపధరులై (ప్రపంచముతో సంబంధము రహితము చేసుకొన్న వారై) ఉంటారు
- అవధూత కూడా తురీయాతీతుని వలెనే 'స్వస్వరూపము' నందే ముక్తి పొందినవాడగుచున్నారు. ఆత్మయే తానై ఆత్మానందమును అనుశ్రుతము, అనుక్షణికము చేసుకుంటున్నారు.

# షట్ విధ సన్న్యాసుల గురించి మరికొన్ని విశేషాలు

- సన్న్యాసులు వేదాంత (లేక) ఆత్మ శాస్త్ర సంబంధితమైన అధ్యయనము చేస్తూ ఉండాలి. వేదాంతము లేని శాస్త్రములను (అనగా) తర్క – వ్యాకరణ శాస్త్రముల వంటి వాటిని అభ్యసించరాదు.
- బ్రహ్మ భావనాశీలుడై మెల్లగా, శాంతముగా సంభాషించాలి. అంతేగాని కఠినముగాను, తదితరుల అభిప్రాయములను చర్చించటము, ఖండించటము చేయరాదు.
- విశేష భావములను సంజ్ఞలతో సంభాషించటము ఉచితము. వాక్యములు, భాష, వర్ణములు మొదలైనవి పరిమితముగా మాత్రమే ఉపయోగించాలి.
- కామ ప్రసంగము చేయు వారితో సంభాషించరాదు.
- యతికి దేవతా పూజ, ఉత్సవ దర్శనము, తీర్థ యాత్రలు స్వధర్మములు కావు.
- యతి ఒక్క రాత్రి మించి ఒక్క చోట గడపరాదు.
- ఏ చోట నిద్రవస్తే ఆచోటే నిదురించును గాక.
- **తురీయాతీత అవధూతయోః న జ్యేష్ఠో ।** తురీయాతీత, అవధూతలలో ఒకరు ఎక్కువవారని, మరొకరు తక్కువవారని అనలేము. ఎందుకంటే ఎవరు ఎంతటి శ్రేష్ఠుడైనా కూడా, "స్వస్వరూప జ్ఞానము" లేనప్పుడు – అట్టివాడు కనిష్ఠుడే.

**"సమస్తము సర్వదా స్వస్వరూప చమత్కృతియే" అని ఎరిగినవాడు ఏ ఆశ్రమవాసి అయినా శ్రేష్ఠుడే.**

- **యతి (సన్న్యాసి) చేయకూడనవి :**

– నదులలో ఈతకొట్టటము చేయరాదు.
– చెట్లు ఎక్కటము ఉచితము కాదు.
– గుర్రము మొదలైనవాటి పై ఆరోహణము / స్వారీ చేయరాదు.
– కొనుగోలు – అమ్మకము వ్యాపారములు – నిషిద్ధము.
– డబ్బు బాగా ఖర్చు చేయటము, అప్పులు ఇవ్వటము చేయరాదు.

***వీటిలో పాల్గొనరాదు :***

– దాంభికమై (నేను వారి కంటే గొప్పవంటి) కబుర్లు చెప్పటము ఏ మాత్రము యతికి శ్రేయము కాదు.
– అబద్ధమును కప్పిపుచ్చుకొనే వాదము చేయనేకూడదు.

**అస్తిచేత్ సాంకర్యం । తస్మాత్ మనన ఆదౌ సన్న్యాసినామ్ అధికారః ।**

ఇటువంటివన్నీ సాంకర్యము (దోష విషయములతో సంబంధము)నకు దారితీయగలదు. పై విషయములు, ఇతరుల గురించి కూడా మననము మొదలైనవి చేయరాదు.

# ఆత్మతో అనుసంధానము

**యం యం వాపి స్మరన్ భావం త్యజతి అంతే కళేబరం తం తమేవ సమాప్నోతి న–అన్యథా ఇతి శ్రుతిశాసనమ్ ।** యతి అయినా (లేక) అయతి అయినా సరే.... ఎవ్వడు ఏ ఏ భావము స్మరిస్తూ శరీరము విడుస్తాడో... ఆతడు అట్టి స్థితి – గతియే పొందటం జరుగుతోంది. వేరుగా కాదు. ఇది శ్రుతి చెప్పుచున్న సృష్టి యొక్క శాసనము.

**అందుచేత :**

**తదేవం జ్ఞాత్వా స్వరూప – అనుసంధానం ।**
**వినా, అన్యథా ఆచార పరో న భవేత్ । తదా**
**ఆచారవశాత్ తత్ తత్ లోక ప్రాప్తిః ।**

ఈ జీవుడు శ్రుతులు చెప్పు ఈ విషయము అర్థం చేసుకొని స్వస్వరూపమగు అఖండ పరమాత్మతో అనుసంధానము సిద్ధించుకోవాలి.

అట్లా ఈ జీవుడు ఆచరించక, ఆత్మ జ్ఞానము ఆశ్రయించని పక్షంలో, ఆత్మకు అన్యమగు విశేషముల పట్ల, విషయముల పట్ల ఆచారపరుడు కానేకూడదు సుమా! ఒకవేళ, ఆత్మకు వేరైన దృశ్య వ్యసనమునకు చెందిన ఆచారపరుడు అయితే, వాటికి సంబంధించిన ఆయా లోకములలో ప్రవేశ నిష్క్రమణములు ఈ జీవుని పట్ల అనివార్యము అవగలవు.

**ప్రాప్తిః జ్ఞాన వైరాగ్య సంపన్నస్య స్వస్మిన్ ఏవ ముక్తిః ఇతి ॥** ఆత్మ జ్ఞానము పొందిన వైరాగ్య సంపన్నుడు ఎవరైనా సరే, - అట్టివాడు తన యొక్క స్వస్వరూపాత్మ యందే 'ముక్తి' పొందినవాడు అగుచున్నాడు.

**న సర్వత్ర ఆచారప్రసక్తిః సదాచారః ।** స్వస్వరూపాత్మ యందు ప్రవేశించి, బాహ్య జగత్తు, అంతరంగ చతుష్టయము, సమస్త జీవాత్మలు తన యొక్క ఆత్మ సాగర తరంగాలుగా దర్శించువానికి, ఇక తానే సర్వత్రా ఆచార ప్రసక్తుడగుచున్నాడు. ఇక శాస్త్రములు మొదలైనవి అతనికి సదాచారముల గురించి చెప్పేదేముంటుంది? ఏమీ ఉండదు.

## ఏకాత్మ - చతుః (4) అవస్థలు

సర్వదా ఏకమే అయి ఉన్న ఆత్మ పురుషుడు (The person of one's own self) జాగ్రత్ స్వప్న సుషుప్త పురుషకారములు స్వయం కల్పితంగా కలిగి ఉంటున్నాడు. అట్టి అవస్థా భేదములను అనుసరించి

1) జాగ్రత్ = విశ్వపురుషుడు 2) స్వప్నము = తైజస పురుషుడు

3) సుషుప్తి = ప్రాజ్ఞ పురుషుడుగా (శాస్త్రములచే) విభజించి చెప్పబడుచున్నాడు.

ఈ మూడు తన ప్రదర్శనమై ఉన్నవాడు ఈశ్వర పురుషుడు అనబడుచున్నాడు.

కారణ రూప ఈశ్వరుడు → కార్యరూప జాగృత్ స్వప్న సుషుప్తిలను (విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు అనబడు పురుషకారములను) తనను తానే విస్తరితుడై ప్రదర్శనశీలుడు అగుచున్నాడు.

**బాహ్యవృత్తులు (జాగ్రత్) :** వృత్తులు 14 కరణములచే ప్రదర్శించబడుచున్నాయి. వీటిలో బాహ్యేంద్రియములు (10).

(A) **పంచ కర్మేంద్రియములు (5) :** 1) వాక్ ఇంద్రియము, 2) హస్త - ఇంద్రియము 3) పాద-ఇంద్రియము 4) ఉపస్థ (జనన) ఇంద్రియము 5) పాయు - ఇంద్రియము.

(B) **పంచ - జ్ఞానేంద్రియములు (5) :** 1) శ్రోత్ర (చెవి) ఇంద్రియము 2) త్వక్ (చర్మము - స్పర్శ) ఇంద్రియము 3) చక్షుః (చూపు) ఇంద్రియము 4) జిహ్వా - (రుచి / మాట) ఇంద్రియము 5) ఘ్రూణ (వాసన) ఇంద్రియము.

**(C) అంతరింద్రియ చతుష్టయము (4) :** 1) మనస్సు (ఆలోచన) 2) బుద్ధి (తెలివి, విచక్షణ) 3) చిత్తము (ఇష్ట - అయిష్టములు) 4) అహంకారము (సమిష్టి నుండి వేరైన వ్యక్తిగతమైన 'నేను' భావన)

**వృత్తులు :** పది బాహ్యేంద్రియముల నుండి, నాలుగు అంతరింద్రియముల నుండి జాగ్రత్‌లో బహిర్గతము అయి వస్తు - విషయ - తదితర శరీరధార సంబంధము కల్పించుకొని వృత్తులుగా ప్రదర్శనమగుచున్నాయి. వృత్తి వ్యాపార భేదం చేత ప్రవర్తనా భేదంగా 10 బాహేంద్రియములు, 4 అంతరింద్రియములు విడివిడిగా రూపుదిద్దుకుంటున్నాయి.

**ముఖ్యస్థానములు :** జాగ్రత్‌కు ముఖ్యస్థానం **కళ్లు.** స్వప్నము ముఖ్యస్థానంగా కంఠములో ప్రదర్శనమౌతోంది. సుషుప్తికి ముఖ్య స్థానము హృదయము. తురీయమునకు మూర్ధము (శిరో ఉపరిభాగము) స్థానము. అనగా ఈ జీవుడు నిత్యోదిత చేతన రూపుడై జాగ్రత్‌లో కళ్లలోను, స్వప్నమప్పుడు కంఠములోను, సుషుప్తి సమయములో హృదయములోను తురీయ సందర్భములో సహస్రారమునందు స్థానము (నివాసముగా) కలిగి ఉంటున్నాడు.

జాగ్రత్ స్వప్నములలో దృశ్య పరిమితమైన జ్ఞానము మాత్రమే కలిగి ఉంటున్నాడు.

**తురీయుడు :** జాగ్రత్ స్వప్న సుషుప్తులు తనకు చెందినట్టి సంచార విశేషములుగా కలిగియున్న జీవుని యొక్క పురుషకార స్వరూపుడు.

ఈ జీవుడు తురీయ స్వరూపుడుగా **అక్షరుడు** - అనగా **జరామరణములు, మార్పు-చేర్పులు, రాక-పోకలు లేనట్టి నిత్య చేతన స్వరూపుడు.**

ఎవ్వడైతే – జాగ్రత్ స్వప్న సుషుప్తులు (ఒకదాని తరువాత మరొకటిగా) మార్పు–చేర్పులు, రాక–పోకలు కలిగి ఉన్నదని, తురీయము 'సమాధి' రూపమని, ఏకరూపమని గమనిస్తాడో, గ్రహిస్తాడో –

– అట్టి వాడు – జాగ్రత్ స్వప్నములలో తత్–తత్ ప్రపంచాతీతత్వము సిద్ధించుకొని ఉండగలడు.

– మూడు అవస్థలలో స్వస్వరూప జ్ఞానము కలవాడు కాగలడు.

**'జీవన్ముక్తయో ఇతి వదంతి' "అట్టి తురీయ స్వరూప జ్ఞానము కలవాడు జీవన్ముక్తుడే"** అని చెప్పబడుచున్నాడు. ఇదియే సర్వ శ్రుతులచే (వేదములచే) స్మృతులచే ప్రతిపాదించబడుచున్న "ముక్తి" యొక్క సిద్ధి.

## భిక్షువు – స్వస్వరూప అనుసంధానము

**సహస్రారము నందు స్థానము కలిగి ఉన్న జీవాత్మ యొక్క నిశ్చల – అక్షర స్థానమగు 'తురీయము' ను ఉపాసించువాడే "భిక్షువు" – అనబడుచున్నాడు.**

ఎవ్వడైతే ఐహికమైన (ఇహ లోకమునకు సంబంధించిన), ఆముష్మికమైన (తదనంతర స్వర్గము మొదలైన లోకములకు సంబంధించిన) స్థితి–గతులందు అపేక్ష కలిగి ఉంటాడో, అట్టివాడు "తురీయ – స్వస్వరూప అనుసంధానము" నకు ప్రయాణించు భిక్షకుడు కాలేడు.

బ్రహ్మానుసంధానమునకు వేరైన శాస్త్ర – అభ్యాసములు, వాద –ఉపవాదములు, శాస్త్ర ప్రజ్ఞ మొదలైనవన్నీ కూడా **ఉష్ట్ర కుంకుమ భారము** (ఒంటె కస్తూరిని నడుము పై కలిగి ఉండి, మోస్తూ కూడా, కస్తూరి వాసనను ఆస్వాదించలేనిది) తో సమానమే! వ్యర్థమే! అట్టి **"స్వస్వరూపముతో అనుసంధానము"** అభ్యాసముగా కలుగనట్టి ఆ జీవుని యొక్క యోగశాస్త్ర ప్రవృత్తి సాంఖ్య (అంతరంగచతుష్టయ విశ్లేషణా) శాస్త్రాభ్యాసము, మంత్ర–తంత్ర వ్యాపారములు, తదితర శాస్త్ర ప్రవృత్తులు మొదలైనవన్నీ కూడా ఆ జీవుని పట్ల "శవమునకు చేసే అలంకారములు" వంటివై, వృథాయే అవుతాయి.

శాస్త్రములు తెలిసి, తురీయాత్మతో అనుసంధానము గురించిన ప్రయత్నము చేయనివాడు – చర్మకారుడు (చెప్పులు కుట్టువాడు) తాను ఆ చెప్పులను ధరించని విధంగా – అతనికి ఉపయోగము లేనివే అవుతాయి.

ఎవ్వడైతే కర్మ – ఆచారముల యొక్క ఉత్తమమగు అంతరార్థమునకు దూరంగా ఉంటాడో, ప్రణవ స్వరూపమగు 'స్వస్వరూప – సర్వస్వరూపాత్మ" గురించిన విచారణ కర్మల, ఆచారముల ఉద్దేశ్యముగా గ్రహించడో – అట్టివాడు నిర్వర్తించే కర్మ వ్యవహారములన్నీ శాశ్వత – ఆత్మానందము దృష్ట్యా – నిష్ప్రయోజనమే.

**యద్యత్ కర్మ కరోతి, తత్తత్ ఫలమ్ అనుభవతి ।** ఎవరు ఏ ఫలితము కోరి కర్మలు చేస్తాడో, అతడు ఆ విధంగానే కర్మ ఫలములను పొందుతాడు.

అందుచేత కుమారా ! నారద దేవర్షీ ! కుంకుడి (లేక) ఆముదపు రసములో పొంగును వదలి రసాన్ని ఉపయోగిస్తాము కదా. ఆ విధంగా ముముక్షువు దృశ్య పరిమిత దృష్టులన్నీ వదలి, ఆత్మదృష్టిని అవలంబించు "భిక్షువు" కావాలి.

– సమస్త కర్మ ఫలములను పరిత్యజించివేయాలి. వాటి వాటి ప్రసక్తులు (సమాచారములు) వదలి వేయాలి.

– ఆత్మ గురించిన ప్రసక్తినే మనస్సుతో ఆశ్రయించాలి.

– మనస్సును దండముగా (చేతి కర్రగా) చేసుకోవాలి. అరచేతులనే భిక్షక పాత్రగా ధరించాలి.

– దిగంబరుడై (సమస్త బాహ్య పటాటోపములన్నీ దూరంగా పారవేయాలి).

అట్టి పరివ్రాజక భిక్షువు ఒక అమాయక బాలుని వలె, ఉన్మత్తుని వలె (జగద్విషయముల పట్ల ఎరుక లేనట్టి అలౌకికుడై), పిశాచము వలె భౌతిక శరీరము మొదలే లేనివాడై ఉండును గాక. జీవించటమునుగాని, మరణించటమునుగాని 'కావాలి' అని కోరుకొననివాడై (కాంక్షించనివాడై) ఉండును గాక. కాలగతి చేత ఏది కలిగితే అది అట్లు కలుగును గాక. అతడు కాలమునకు సాక్షి, అతీతుడు అయి ఉంటాడు. భృత్యువు యజమాని ఏది చెప్పితే అది ఇష్ట – అయిష్ట ప్రసక్తి లేకుండా నిర్వర్తించు తీరుగా

(భృతక న్యాయముగా) నిష్కాముడై విధివశాత్ చేయవలసిన కర్మలు నిర్వర్తించును గాక. "తితిక్ష, జ్ఞానము, వైరాగ్యము, శమము, దమము" మొదలైన జ్ఞాన గుణములు కూడా వదలి ఎవ్వడైతే భిక్షచే లభించే అన్నమును మాత్రమే (ఆహారము) పొందు ఆశయము కలిగి ఉంటాడో అట్టి వాడు యతి లక్షణములు పాటించువాడు కాదు. పైగా యతి వృత్తిని పాడు చేసుకొని, సంసార లంపటమున మునుగువాడే అవుతాడు. యతి మార్గము నుండి 'చ్యుతి' పొందగలడు.

## కాష్ఠ (కొయ్య దండము కాదు – జ్ఞానదండము ధరించుట) (ఏకదండీ)

యతి (లేక) పరివ్రాజకుడు అయి కేవలము – కాష్ఠ (కర్ర) దండమును ధరించటము, ముండనము (క్షౌరము) చేయించుకోవటము, బాహ్య కాషాయ వస్త్రధారణము ఆశ్రయించినంత మాత్రముచేత ఏమాత్రము సరిపోదు. అవి మాత్రమే ధరించి ఉంటే, – అది దంభాచారము మాత్రమే అవుతుంది. అంతమాత్రంచేత ముక్తి లభించదు. మరి?

**జ్ఞాన దండో ధృతోయేన '<u>ఏకదండీ</u>' స ఉచ్యతే।** ఎవరైతే ఆత్మజ్ఞానమే చేతికర్ర (దండము)గా ధరించి, ఈ జగద్దృశ్యములో సంచరిస్తూ (పరివ్రాజకుడై) ఉంటాడో, అతడే **"ఏకదండి"** అనబడుచున్నారు.

ఎవ్వడైతే ఆత్మజ్ఞానము ఆశ్రయించకుండా ఒక కాష్ఠ (కొయ్య) దండమును ధృతము (గట్టిగా) పట్టుకొని, ఆశాపాశములు త్రెంచుకోడో, అట్టివాడు 'మహారౌరవము' సంజ్ఞతముగా చెప్పబడే ఘోర నరకములో ప్రవేశించగలడు. **"లోకములో ప్రతిష్ఠ గురించి తాపత్రయపడటము అనేది పంది పెంటను (నీచమును) కోరుకోవటము వంటిది"** – అని మహర్షులు గుర్తు చేస్తూ ఉన్నారు. అందుచేత యతి ప్రజల నుండి ప్రతిష్ఠను కోరక, ఒక కీటకమువలె (ఎవ్వరి మెప్పుకోసము వేచి ఉండక) ప్రపంచములో పర్యటిస్తూ ఉండును గాక!

**అయాచితం యథాలాభం భోజన ఆచ్ఛాదనం భవేత్।** – అయాచితంగా (కోరుకోకుండానే) ఏది లభిస్తే, ఆ భోజన, వస్త్ర ఆచ్ఛాదనములే (కప్పుకొనుటకు వస్త్రములు) స్వీకరించును గాక!

**పరేచ్ఛయా చ దిగ్వాసాః, స్నానం కుర్యాత్ పరేచ్ఛయా।** – ఇతరుల ఇష్టము, వసతిని అనుసరించి వస్త్రములు ధరించును గాక! ఇతరుల సానుకూల్యతను అనుసరించియే స్నానము, దైనందిక చర్యలు మొదలైనవి నిర్వర్తించును గాక!

ఎవ్వడైతే జాగ్రత్‌లో (మెలకువగా ఉన్నప్పుడు) ఏ విధంగా బ్రహ్మతత్త్వమును ఉపాసన, భావన, మమైక్యము అభ్యసిస్తున్నాడో...,

**శ్లో॥ స్వప్నేఽపి యో హి యుక్తః స్యాత్ జాగ్రతీవ విశేషతః ।**
**ఈదృక్ చేష్టః స్మృతః శ్రేష్ఠో వరిష్ఠో బ్రహ్మవాదినామ్ ॥**

అట్టి ఏ బ్రహ్మనిష్ఠుడైతే స్వప్న సమయములో కూడా "అహం బ్రహ్మాస్మి", "తత్త్వమసి" భావనను ఏమాత్రము చదరకుండా కలిగియే ఉంటాడో – అట్టివాడు బ్రహ్మతత్త్వజ్ఞులలో వరిష్ఠుడు (శ్రేష్ఠుడు) అగుచున్నాడు.

- ఎవ్వరైతే లభించవలసినది లభించకపోయినప్పటికీ ఏ మాత్రము విషాదము పొందడో,
- ఏదైనా లభించినప్పుడు హర్షము కూడా పొందడో,
- ప్రాణముతో జీవితయాత్ర నిర్వర్తించటానికి ఎంత వరకు కనీసావసరములో, అంతవరకు మాత్రమే సంబంధిత ప్రాపంచక కర్మలు నిర్వర్తించువారై ఉంటారో,
- ఇతరులు తనను పూజిస్తున్నప్పుడు, స్తుతించుచున్నప్పుడు ఏమాత్రము ప్రీతి కలిగి ఉండడో (ఇదంతా కాల మహిమ అనుకుంటాడో), సమస్త విషయ లాభములందు జుగుప్స (అయిష్టము) కలిగి ఉంటాడో, అట్టివాడు యతిధర్మము నిర్వర్తించుచున్నట్లే. ఎందుకంటే పూజ, సన్మానము, స్తుతి, గౌరవించబడటము మొదలైనవి ముక్తుడైన యతిని కూడా బంధితునిగా చేయగలవు. కనుక సమస్త ఆశ్రమ ఆశ్రయులు అటువంటి వాటి పట్ల జాగరూకులై ఉండాలేగాని, లోబడి ఉండకూడదు.

# భిక్షక యతి భిక్ష తీసుకొను విధి

ప్రాణయాత్ర కొనసాగు అవసరము వరకే భిక్ష గ్రహించాలి. అంతకు మించిన భిక్షను ఆకలి గొన్నవారికి ఇచ్చివేయవచ్చు. సరి అయిన సమయములో మాత్రమే భిక్షాటన చేయాలి. గృహస్థులు వంట చేసుకొని, భోజనము చేసిన తరువాత సమయము ఎన్నుకొని భిక్షకై వెళ్లాలి. అరచేతులకు పట్టినంతవరకే భిక్షాహారము స్వీకరించాలి. అనేకసార్లు ఒకే ఇంటికి వెళ్లి భిక్షను కోరరాదు. కూర్చుని తింటున్నా, నడుస్తూ తింటున్నా కూడా భోజన మధ్య కాలంలో పునః ఆచమనము చేయరాదు. కొందరు పుణ్యాత్ములగు గృహస్థులు సముద్రము వలె విశాల బుద్ధి, గొప్ప గౌరవ మర్యాదలు, త్యాగ నిరతి, భిక్ష సమర్పించటంలో విశాలమైన ఆశయశీలురు అయి ఉంటారు. అయినా కూడా ఎక్కువసార్లుగా వారి వద్ద భిక్షకై ఆశ్రయించరాదు. ఆకాశంలో సూర్య భగవానుని వలెనే మహనీయులగు యతులు నియతిని అతిక్రమించరు. ముని స్వభావుడగు యతి (సన్యాసి) గోవువలె లభించిన దానికి సంతోషించి ఆహారము స్వీకరించాలి. అంతేగాని, "అది కావాలి. ఇది ఇవ్వండి" అని భిక్ష ఇచ్చు ఇంటి యజమానులను ఇబ్బంది పెట్టరాదు. ఒకరు భిక్ష ఇచ్చినా, మరొకరు ఇవ్వకపోయినా కూడా అమృతమగు వాక్యములనే పలకాలి. అందరి క్షేమము కోరుకోవాలి. "శుభమగు గాక, శాంతమగు గాక, ఐశ్వర్యమగు గాక, ఆనందమగు గాక!" అని శుభములను మాత్రమే ప్రవచించాలి. కోపగించరాదు.

ఇతరులను బాధించు, మోసగించు, హింసించు స్వభావులగు వారి, నింద్యులగు వారి ఇళ్లవద్ద భిక్ష కోరరాదు. అనింద్యులగు శుభ+శ్రేయో అభ్యాసములు, సాత్విక భావములు గల ఇళ్ల వద్ద మాత్రమే భిక్ష స్వీకరించాలి. అయితే ఎవరు తమంతట తాముగా భిక్ష స్వీకరించమని అభ్యర్థిస్తే వారి కోరిక మన్నించాలి.

తలుపులు తెరచియున్న ఇళ్ల వద్ద మాత్రమే భిక్షను అడగాలి. తలుపులు మూసుకున్నవారి ఇళ్ల వద్ద భిక్షకై ఎలుగెత్తి అడుగరాదు. పరుష వాక్యములు పలుకరాదు.

ధూళితో శిథిలమైయున్న శూన్యాగారముల వద్ద గాని, వృక్షముల మూలమున గాని - ప్రియాప్రియములను విడచినవాడై విశ్రమించును గాక.

సూర్యుడు అస్తమించు వేళలో తాను ఏ ప్రదేశంలో ఉంటే అచ్చటనే విశ్రమించాలి (పడుకొనును గాక).

సన్యాసికి అగ్నికార్యము గాని, ఒకచోట స్థిర నివాసముగాని చెప్పబడటం లేదు. ఎవ్వడైతే లభించిన దానితో తృప్తి చెంది ఇంద్రియములను నియమించుచు, వాటిని జయించినవాడై ఉంటాడో, - అతడే మునీశ్వరుడు.

# వానప్రస్థ యతి

గృహస్థాశ్రమము నుండి బయల్వెడలి, వనము (అరణ్యము, ఏకాంత ప్రదేశము) చేరి, జ్ఞాన యజ్ఞము (ఆత్మతత్త్వోపాసన) చేస్తూ ఇంద్రియములను జయించే ప్రయత్నము చేయువాడు "వానప్రస్థుడు". ఏ ముని-సమస్త భూతజాలమునకు భయము కలిగించనివాడై, సమస్త సహజీవుల పట్ల ప్రేమాస్పదుడై చరిస్తూ ఉంటాడో, అట్టివానికి ఇక భయము కలుగదు.

**నియమములు :**

- **"నన్ను ప్రత్యేకముగా జనులు భావించాలి"** అనే మానమును, "నేను అంతటివాడిని" అనే అహంకారమును వదలి ఉండును గాక.
- "పరమాత్మయే ఈ అనేక రూప ప్రదర్శనము (కథా రచయిత పాత్రలు కల్పిస్తున్నట్లుగా) కల్పిస్తున్నారు"- అను ఎరుకను నిర్దుష్టము చేసుకుంటూ నిర్ద్వంద్వుడై ఉండును గాక. స్వస్వరూప ఆత్మతత్త్వము గురించిన సంశయములన్నీ తొలగించుకోవాలి.
- ఎవ్వరి పట్లా కూడా కోపముగా గాని, ద్వేషముగా గాని, అసత్యమును గాని భాషించకూడదు.
- సహజీవులను హింసించనివాడై వాత్సల్యము, ప్రేమ చూపుచూ పుణ్యచరితము (Behaviour) కలిగి ఉండునుగాక.
- ఆకలి కలిగినంతవరకే భిక్షను ఆశ్రయించును గాక. అట్టివాడు బ్రహ్మమును ఎరిగి, బ్రహ్మమే తానగుచున్నాడు.

# సన్న్యాసికి సంబంధించిన మరికొన్ని ధర్మములు

సన్న్యాసి వానప్రస్థులతోగాని, గృహస్థులతోగాని కలసి తిరగరాదు. ఏకాంతముగా, ఎవ్వరికీ తన గొప్పతనము ప్రదర్శించక, అజ్ఞాతుడై చరించునుగాక. దేనికీ ఆనందముతో తబ్బిబ్బు కారాదు.

పగలు సూర్యుడు ఉన్నంతవరకు ఒక చోట నిలువక, కీటకమువలె సంచరించును గాక.

- సహజీవులను హింసించటము, లోక సంబంధమైన కార్యక్రమములలో ఉత్సాహము, ప్రవేశము కలిగి ఉండటము, ఇతరులను ఆశీర్వదించటము, ఇతరులచే లౌకిక క్రియలను చేయించటము, మొదలైనవి ఇవన్నీ యతి చేయరానివి.
- ధర్మ విరుద్ధములైన శాస్త్రములు అభ్యసించటములో అనురక్తి కలిగి ఉండరాదు. ఇతరులకు సంబంధించిన స్నేహ – శత్రు సంబంధములపట్ల ఇష్ట–అయిష్టములు కలిగి ఉండరాదు.
- సన్యాసి ఆదాయము కొరకై ఏ వృత్తిని నిర్వర్తించరాదు.
- తర్కముతో కూడిన వాదోపవాదములు చేయరాదు.
- ఒకరి పక్షము ఆశ్రయించి, రెండవ పక్షముపై వ్యతిరేకత మొదలైనవి కలిగి ఉండరాదు.
- జనులను ఆకర్షించి తన శిష్య గణములో చేర్చుకొనే ప్రయత్నములు చేయరాదు.
- నిరంతరము అనేక గ్రంథములు చదువుచూ ఆత్మతత్త్వ భావన కొరకై ప్రయత్నించాలి. లభించిన కాలమును వృధా చేసుకోరాదు. ఆత్మజ్ఞానమునకు అన్యమైన గ్రంథముల వ్యాఖ్యానమునకు ఉపక్రమించరాదు.
- తన యొక్క మహిమలను, గొప్పతనమును, సిద్ధులను, గంభీరమైన అంతర్గతానుభవములను బయటపెట్టి ఆత్మస్తుతి – పరనిందలను చేయరాదు.
- ఇతరులకు తాను – ఒక ఉన్మత్త (అమాయక, పిచ్చి) బాలునివలె అనిపించుచు, అంతరంగ ఆత్మజ్ఞాన ఔన్నత్యమును ఇతరులకు తెలియజేయకుండునుగాక.
- తన అభిప్రాయములు పిలిచి చెప్పక, మూగవానివలె ఉండునుగాక.
- ప్రపంచవాసనలు తనను అంటకుండా చూచుకోవాలి.
- అధికముగా కార్యములు నిర్వర్తించు ఆవేశము కలిగి ఉండరాదు.
- ఇతరుల సాధు – అసాధు (మంచి – చెడు) గుణముల గురించి వారికి – వీరికి చెప్పటము చేయరాదు. ఇతరుల సద్గుణ – దుర్గుణముల గురించి ధ్యానము (ఆలోచనలు) చేయరాదు.
- ఎల్లప్పుడు ఆత్మయందే రమిస్తూ ఆత్మారాముడై ఉండాలి.
- దోషము లేని ప్రవర్తన (Behaviours), వృత్తి (Avocations) కలిగి ఉండాలి.
- ముని (సర్వత్రా మౌనము వహించినవాడై) జడునివలె సంచారము కలిగి ఉండును గాక.
- **ఏకశ్చరేత్ మునిం ఏతాం నిస్సంగః, సంయతేంద్రియః ।** సంగరహితుడై, ఇంద్రియములను వశము చేసుకొన్నవాడై ఒంటరివాడుగా భూమిపై సంచరించును గాక.
- **ఆత్మరతిక్రీదాత్మః, ఆత్మవాన్ సమదర్శనః ।** ఆత్మస్వరూపుడై, ఆత్మయందే రమిస్తూ సర్వత్రా ఆత్మనే దర్శిస్తూ సమదర్శి అయి ఉండాలి.

# ప్రబుద్ధుడగు యతి ఆచార నియమములు

ఉత్తమమగు ఆత్మ బుద్ధి సిద్ధించుకొన్న యతి కూడా ఈ దృశ్య జగత్తులో సంచరిస్తూ ఉన్నప్పుడు జాగరూకుడై ఉండాలి. లేదా, ఈ దృశ్యముతో ఏర్పడే సంసార దోషము తిరిగి ఆకర్షించి వశము చేసుకొను అవకాశము పొంచియే ఉండగలదు. అందుచేత దృశ్యములో పాల్గొనుచున్నప్పుడు ఆత్మజ్ఞాన సిద్ధుడు కూడా ఆచరించు కొన్ని నియమ – నిష్ఠలు మరొక్కసారి కూడా మరికొన్ని వివరిస్తున్నాను.

- ❋ ప్రబుద్ధుడై, ఆత్మగురించి సర్వజ్ఞుడు అయి కూడా ఒక బాలుని వలె (క్రీడా వినోదివలె) సంచరించాలి.
- ❋ అంతా తెలిసి, కుశలుడు (Wel-knowledgable and efficient) అయి ఉండి కూడా ఏమీ తెలియని జడునివలె (Like foolish - non active fellow) చరించును గాక.
- ❋ విద్వాంసుడు (Wel-informed) అయి కూడా ఉన్మత్తునివలె (ఏమీ తెలియని పిచ్చివానివలె) ఉంటూ ఉంటారు.
- ❋ వేద-వేదాంత తత్త్వ రహస్యము తెలిసికొని కూడా గోవృత్తివలె (ఆవు ఇంటింటికి వెళ్లి ఇచ్చిన అరటిపళ్లను తిను విధంగా) భిక్షాటనము చేయుగాక.
- ❋ అల్లరి, దురుసు, మాత్సర్యముతో కూడియున్న కొందరు జనులు ప్రబుద్ధుడగు తన పట్ల :
  - → **క్షిప్తో।** అలక్ష్యముగా త్రోయవచ్చు గాక.
  - → **అవమానితో।** తక్కువ చేసి అవమానించవచ్చు గాక.
  - → **అసద్భిః ప్రబుద్ధో।** అసభ్యముగా, అగౌరవముగా అవమానించవచ్చు గాక.
  - → **అసూయతోపి వా ।:** ఓర్వలేనితనము, మంచి గుణములపై కూడా దోషము ఆపాదించటము చేయవచ్చునుగాక
  - → **తాడితః ।** నిష్కారణంగా కొట్టవచ్చు గాక.
  - → **సన్నిరుద్ధో వా ।** తన ధ్యాన సాధనములకు అకారణంగా నిరోధము కలిగించవచ్చు గాక.
  - → **వృత్త్యా వా పరితాపితః ।** పరితాపము కలిగించు వృత్తులు ప్రదర్శించినప్పుడు.
  - → అనేక విధములుగా నిందించినప్పటికీ, ఆయా అటువంటి సందర్భములలో ఇతరుల శ్రేయమే (క్షేమమే) కోరుకొనును గాక. శ్రేయఃకాముడు (ఆత్మ శ్రేయస్సు, మోక్షము) కోరుకొనువాడు అట్టి కుచ్ఛ్రము (పాపము) సహిస్తూ తనను తాను ఆత్మ జ్ఞానముతో ఉద్ధరించుకొను ప్రయత్నము వీడకుండును గాక.

*అంతేకాకుండా (on the other hand) :*

**సమ్మాననం పరాం హానిం యోగర్ధేః కురుతేయతః ।** ఇతరులు తనను సమ్మానించటము (గౌరవించటము, గొప్పవాడని స్తుతించటము మొదలైనవి) తన యొక్క పరతత్త్వ ధ్యానమునకు హానికరములని తలచునుగాక. **అట్టి యోగాభ్యాసి త్వరగా యోగసిద్ధిని పొందగలడు.**

సత్త్వ స్వభావముగలవారిని, సాత్త్విక ప్రవర్తనము కలవారిని దూషించుచోట వర్తించరాదు. తాను ప్రాపంచక సంగతి - సందర్భముల గురించి, ఇతరుల చెడు గురించి చెప్పుకొనే చోట్లకు దూరంగా ఉండాలి.

జంతువులను, పక్షులను హింసించకూడదు.

సర్వదా కామము, క్రోధము, దర్పము, లోభము, మోహము మొదలైన దోష గుణములు లేనివాడై, సమస్త సంగములు విడచినవాడై, భయము లేనివాడై పరివ్రాట్ సంచరించుచుండును గాక.

## భిక్షుక -సన్యాస సత్ప్రవర్తనములు

మరికొన్ని సత్ప్రవర్తనముల గురించి చెప్పుకుందాము.

- సన్యాసి భిక్ష చేసి, భిక్షాన్నము స్వీకరించునుగాక.
- మౌనము వహించి అధికాధికంగా తపస్సు ధ్యానములందు కాలము గడపాలి.
- 1) సర్వాత్రా అఖండాత్మ దర్శన రూపమగు సమ్యక్ జ్ఞానము (2) వైరాగ్యము- ఈ రెండు ముఖ్యమైన భిక్షక ధర్మములు
- కాషాయ వస్త్రములు ధరించి ఎల్లప్పుడు ధ్యానయోగ పరాయణుడై ఉండాలి.

- గ్రామమునకు చివర జన సంచారము అధికంగా ఉండని చోట, వృక్షముల మూలము, దేవాలయ ప్రాంగణములలోను భిక్షకుడు ఉంటూ ధ్యానము నిర్వర్తించాలి.
- ఒకే ఇంట్లో అనేకసార్లు భిక్ష కోరరాదు. స్వీకరించరాదు.

పరివ్రాట్ (భిక్షకుడు, సన్న్యాసి) చిత్తశుద్ధి సిద్ధించుకొనేంతవరకు ఒకచోట అధిక కాలం నిలువరాదు. చిత్తశుద్ధి కలిగి, దోషరహితుడైతే ఎచ్చటనైనా సంచారము చేయవచ్చు.

బాహ్య జగత్తులోను, అంతరంగములోను ఎల్లప్పుడు జనార్ధనుని (ఆత్మ భగవానుని) దర్శించాలి. (అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః – మంత్రపుష్పం).

మౌని అయి, వాయువు వలె దృశ్య సంబంధములైన ఏ దోషము తనను అంటనివాడై, నిర్మల హృదయుడై సంచరించును గాక. సుఖ–దుఃఖములను సమముగా స్వీకరించాలి. ఓర్పు, సహనము కలిగి ఉండాలి. చేతికి దొరికినదే భుజించాలి. అంతేగాని ఏవేవో ఆహారములు అధికముగా కోరుకోరాదు.

ఎవ్వరిపట్ల ఏమాత్రము వైరము లేనివాడై, ఒక ద్విజునిలోని (వేదపండితునియందు), గోవునందు, అశ్వము మొదలైన మృగములనందు **సమ స్వరూపమగు ఆత్మనే దర్శించును గాక, "ఈ సమస్తము పరమాత్మ అగు విష్ణు స్వరూపమే"** అను భావము కలవాడై సర్వత్రా ఈశ్వరునే దర్శించాలి.

"చిన్మయము (Absolute Knowing) పరమానందము అగు బ్రహ్మము నేనే అయి ఉన్నాను", **"బ్రహ్మైవాహమ్"** అను స్మరణను ఎల్లప్పుడు కలిగి ఉండాలి. జ్ఞాపకము వీడరాదు (అనుస్మరణము)

> **బ్రహ్మైవాహమిదం జ్ఞాత్వా, ఏవం మనోదండం ధృత్వా, ఆశా నివృత్తో భూత్వా, ఆశాంబరధరో భూత్వా,**
> **మనో వాక్కాయ కర్మభిః సర్వ సంసారం ఉత్సృజ్య,**
> **ప్రపంచ అవాఙ్ముఖః స్వరూప అనుసంధానేన, భ్రమర –**
> **కీటక న్యాయేన ముక్తో భవతి – ఇతి ఉపనిషత్ ॥**

→ వేద వేదాంత శాస్త్రములలో స్తుతించబడుచున్న, వర్ణించబడుచున్న 'బ్రహ్మము' అనగా నేనే – అని శాస్త్ర అధ్యయన, గురువాక్య మననముల ద్వారా ముందుగా గ్రహిస్తూ ఉండాలి. అట్టి భావనను అచ్యుతము చేసుకుంటూ ఉండాలి.

→ **"నేను బ్రహ్మమే అయి ఉన్నాను"** అని (అహం బ్రహ్మాస్మి అని) తెలుసుకుంటున్నది మనకు నిర్ద్వంద్వముగా అనిపించాలి. ఎట్లా ? అందుకుగాను "మనస్సు"ను దండముగా (ఒక ఉపకరణంగా / చేతి కర్రవంటిదిగా) ధరించాలి.

→ దృశ్య ఆశ (ఆశించటము)ను త్యజించునుగాక. ఆశాంబరము (విరాగమునకు సూచనమగు కాషాయ వస్త్రము) ధరించుగాక.

→ ఈ దృశ్యమునకు సంబంధించి **"ఇది ఇట్లా ఉండాలి, అది నాకు లభించాలి, అది నానుండి తొలగాలి"** అను ఆయా రూపములుగా ఏర్పడుచున్న సమస్త సంసార సంబంధ బంధములను మనస్సు అనే దండము సహాయముతో త్రెంచుకొంటూ ఉండాలి. సమస్త ఉబలాటములను వదలుతూ రావాలి.

→ ప్రపంచము నుండి మనస్సును వెనుకకు మరల్చి అవాఙ్ముఖుడు (Withdrawn) అగుచూ ఉండాలి.

పై అభ్యాసములచే "భ్రమర కీటక న్యాయము" వలె (తుమ్మెద చేయు 'ఝుం' శబ్దముపై ధ్యాసచే చిన్న పురుగు తుమ్మెదగా అగుచున్నట్లుగా) ఈ జీవుడు జీవాత్మ పరిమితములను దాటివేసి స్వస్వరూప అనుసంధానముచే బ్రహ్మమే అగుచున్నాడు.

వ్యష్ట్యాత్మక భావము (Individual sense) ను అధిగమించి "సర్వాత్మకుడు, సర్వసాక్షి" అయి వెలుగొందుచున్నాడు

//ఇతి పంచమ ఉపదేశము//

# షష్ఠమ (6వ) ఉపదేశము

## బ్రహ్మమే తాను అగుట!

**శ్రీ నారద మహర్షి :** హే భగవాన్ ! తండ్రీ ! మీరు చెప్పుచూ వస్తున్న విధంగా అభ్యసిస్తూ 'భ్రమర – కీటక న్యాయం" ప్రకారంగా, 'ముక్తి' సిద్ధించుకోవటము ఎట్టిదో, ఎట్లాగో – మరికొంత వివరించ ప్రార్థన. "స్వస్వరూపానుసంధానరూప ముక్తి" గురించిన ఉపాయం మాకు బోధించండి.

**శ్రీ పితామహులవారు (బ్రహ్మ భగవాన్) :**

స్వస్వరూపానుసంధానముచే ముక్తి ఎట్లా లభిస్తుందో విను!

- అసత్యము, కల్పితము అగు దృశ్య వ్యవహారమును నెమ్మది, నెమ్మదిగా ప్రక్కకు పెట్టుచూ, సత్య (మహా) వాక్కులు అయినట్టి "సోఽ హమ్ । తత్త్వమ్" ఇత్యాది మహావాక్యములను ఆశ్రయించి "సత్యవాక్–పరిపాలకుడు" కావాలి.
- జ్ఞాన వైరాగ్య సహితుడు అగుచూ ఉండాలి.
- ఇంద్రియ దృశ్యమును దాటి, ఆపై కైవల్య శరీరమును (శరీరిని) ఆశ్రయిస్తూ "దేహమాత్ర–అవసిష్ఠుడు" అవ్వాలి. **జ్ఞానమే దేహముగా కలవాడు అగును గాక!** (అనగా) భౌతిక శరీరము వదలి జ్ఞాన శరీరము ఆశ్రయించునుగాక! అదియే 'వైరాగ్యము' అనబడుతోంది కూడా.

అట్టి జ్ఞాన దేహికి (ఆత్మ జ్ఞానికి) –

- శాంతము, దాంతములే (Peace and Control over Seeing, Hearing, etc) రెండు కళ్లు.
- మనస్సే అతనికి ముఖము, బుద్ధియే (ప్రజ్ఞయే) కళ.
- 5 తత్త్వములు (5–కర్మేంద్రియములు, 5– జ్ఞానేంద్రియములు, 5–ప్రాణములు, 5–ఉపప్రాణములు, 5–పంచభూతములు) – ఆతనికి శరీరాంగములు
- పంచమహాభూతములు, కర్మ–భక్తి – జ్ఞాన – వైరాగ్యములు అతనికి తన యొక్క శాఖావిస్తరణములు (Branch extensions).
- జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తురీయములు అతనికి నివాస స్థానములు. స్వయం కల్పిత లీలా – వినోద ఆట స్థల విశేషాలు.

14 ఇంద్రియములు (బాహ్య జ్ఞాన – కర్మేంద్రియములు, అంతరంగ చతుష్టయము) ఇంటిపై మట్టి స్థంభములవలె జడరూపమై మోక్షాశయము కలవానికి ఉపకరణములు అగుచున్నాయి. అవన్నీ ఉపకరణములు (As utility instruments) గా ఎరిగి, బురదలో ఇరుక్కొన పడవను కర్ణధారుడు (పడవ నడుపువాడు) బయటకులాగు విధంగా, మదపుటేనుగును మావటివాడు వశం చేసుకొను విధంగా 14 ఇంద్రియములను స్వవశం చేసుకోవాలి.

- ఇంద్రియ విషయములకు, ఇంద్రియములకు 'వేరు' అయినట్టి 'ఆత్మవస్తువు'ను ఎరిగి, మమేకము కావాలి.

ఆత్మకు వేరైనదంతా నశ్వరము (నశించిపోవు స్వభావముగలది)గా ఎరిగి, ఇంద్రియ విషయముల పట్ల జీవుడు (పురుషుడు) అనురక్తిని త్యజిస్తూ విరక్తిని పెంపొందించుకోవాలి.

**"బ్రహ్మాహమ్ (నేనే బ్రహ్మమును)"** – అని నిర్ణయించుకొని, ఆస్వాదించుచుండును గాక!

- ఈ సమస్తము బ్రహ్మమే.
- నేను బ్రహ్మమే అయి ఉన్నాను. కాబట్టి,
- ఈ సమస్తము నా యొక్క బ్రహ్మస్వరూపమే.

అని ఎరుగుచూ వేరుగా ఏదీ లేకుండియుండును గాక!

**న కించిత్ వేదితవ్యం – స్వవ్యతిరేకేణ – జీవన్ముక్తో వసేత్ – కృతకృత్యో భవతి ।** స్వస్వరూపమునకు వేరుగా ఏదీ లేదు – అను ఎరుకచే ఈ జీవుడు జీవన్ముక్తుడు అగుచున్నాడు. **న నాహం బ్రహ్మ వ్యవహరేత్** "నేను బ్రహ్మమును కాదు. అజ్ఞానిని, బలహీనుడను అగు జీవుడను మాత్రమే" – అని ఎన్నడూ ఎవ్వరూ అనుకోవలసిన పనిలేదు. "జాగ్రత్ స్వప్న సుషుప్తులు నేనే కల్పించుకొంటూ, వాటికి ఆవలగా తురీయుడవై ఉన్నాను. అట్టి కల్పించుకొను తురీయ పురుషకారమునకు కూడా ఆవల తురీయాతీతుడనై కేవలమగు ఆత్మ చైతన్య పురుషుడనై, తదితర సమస్తమునకు ఆది స్వరూపుడనై వెలుగొందుచున్నాను – అను నిశ్చయమును పదిలపర్చుకుంటూ, పరిపుష్టము చేసుకోవాలి. ఎందుకు ? అదియే సత్యము కాబట్టి!

## తురీయపురుషుని గుర్తు

ఈ జీవుడు పగలు జాగ్రత్‌లోను, రాత్రి స్వప్నములోను, గాఢనిద్రలో సుషుప్తిలోను, తిరిగి పగలు జాగ్రత్‌లోను (in a cycle) జీవితమును గడపివేస్తూ ఉన్నాడు. ఈ మూడు అవస్థలు తనవైయున్న 4వ అవస్థ 'తురీయము'. అట్టి జీవునికి చెందిన తురీయ పురుషకారమే జాగ్రత్, స్వప్న సుషుప్తులు. తురీయుడుగా జాగ్రత్ స్వప్న సుషుప్తుల సమస్వరూపుడై ఉన్నాడు. అట్టి తన యొక్క 4వదగు తురీయ స్వరూపమును గమనించటమే లేదు.

అట్టి '4'వ అవస్థలోని ప్రతి దానిలోను మిగిలిన '3' అవస్థలు ఏర్పడియే ఉంటాయి.

ఈ భౌతిక శరీరములో ఒక్కొక్క అవయవము ఒక్కొక్క కార్యమునకు సాధనగా అవుతోంది.

కళ్లలో చూచుశక్తి, చెవులలో శబ్దగ్రహణ రూపమగు వినికిడి శక్తి. నాలుకలో రుచు ఆస్వాదనశక్తి, ముక్కులో వాసన చూడగల శక్తి, నోటిలో వచన (మాట్లాడు) వ్యాపార శక్తి. కాళ్లలో నడుచుశక్తి. పాయువు విసర్జన శక్తి, ఉపస్థ – ఆనందించుశక్తి, చర్మము స్పర్శ శక్తి.

**ఇవన్నీ ఈ భౌతిక దేహములో సమావేశమై ఉన్నాయి.**

పై వాటిని ఉపయోగించి –

- 'బుద్ధి'తో తెలుసుకుంటూ ఉన్నాడు.
- చిత్తముతో చింతించుచూ ఉన్నాడు.
- అహంకారముతో 'నేను' రూపంగా అహంకరిస్తూ ఉన్నాడు.

ఈ జీవుడు పైన చెప్పుకున్న ఇంద్రియములకు వేరుగా ఉన్నాడు. అనేక ఇంద్రియములకు, ఇంద్రియ శక్తులకు ఆలవాలమైన ఈ శరీరముపై **అభిమానము** కలిగి ఉండటం చేత (శరీరాభిమానం చేత) "నేను ఒక జీవుడను" అను జీవత్వ భావము పొందుచున్నాడు. ఒక ఇంటికి యజమాని ఆ ఇంట్లో కూర్చుని "ఈ ఇల్లు నాది" అను అభిమానము కలిగి ఉంటున్నట్లే, శరీరధారి అగు జీవుడు "ఈ శరీరము నాది" అను అభిమానమును దేహమున్నంత వరకు కొనసాగిస్తున్నాడు.

## హృదయ సంచారము

ఈ జీవునికి బాహ్యమున ముఖము కనబడుచున్నట్లే ఈ శరీరమున అంతర్గతంగా ముఖము కలిగి ఉంటున్నాడు. అది "హృదయము" అని పిలవబడుతోంది. (అట్టి 'హృదయము' 'తామర పుష్పము'తో పోలుస్తూ "హృదయ కమలము" అంటూ ఉంటారు). ఈ జీవుడు తన హృదయములో యథేచ్ఛగా సంచారము చేయుచున్నాడు.

# దిక్ దళములు - జీవుని వృత్తులు

***ఈ జీవుడు హృదయ కమల దళములలో సంచరిస్తూ ...***

| | | |
|---|---|---|
| తూర్పు దిక్కు దళములో | - | పుణ్యవృత్తి |
| ఆగ్నేయ దళములో | - | నిద్ర, ఆలస్య వృత్తులు |
| దక్షిణ దళములో | - | క్రౌర్య బుద్ధి |
| నైరుతి దళములో | - | పాపబుద్ధి |
| పశ్చిమ దళములో | - | క్రీడా రతి బుద్ధి (Playfulness) |
| వాయువ్య దళములో | - | గమన (Move from place to place) బుద్ధి |
| ఉత్తర దళములో | - | శాంతము |
| ఈశాన్య దళములో | - | జ్ఞానము |
| హృదయమధ్యగా కర్ణిక యందు | - | వైరాగ్యము |
| కౌసరము (పుష్పరాగము) నందు | - | బ్రహ్మచింతన |

ఆయా స్థానములలో జీవుడు సంచరిస్తూ పై విశేషములన్నీ కల్పించుకొని అనుభవిస్తూ ఉన్నాడు.

అట్టి జీవుడు పై హృదయ కమలదళ సంచారముల నుండి విరామము పొంది, బయటకు వచ్చి, 'స్వస్వరూపము'తో మమేకమగు మార్గమును అన్వేషించాలి.

## ఏకోదేవః సాక్షీ

జీవత్ అవస్థలు - ఐదు. 1) జాగ్రత్ 2) స్వప్నం 3) సుషుప్తి 4) తురీయము 5) చ(తురీయ) విరహితమగు తురీయాతీతము.

**పై అవస్థల పురుషకారములు :** 1) విశ్వుడు 2) తైజసుడు 3) ప్రాజ్ఞుడు 4) తురీయుడు 5) ఏక స్వరూపుడు/తటస్థుడు. అవస్థలు, పురుషకారములు ఐదుగా చెప్పుకుంటున్నప్పటికీ, అవన్నీ తనవైన జీవుడు ఏకస్వరూపుడే గాని, అనేక రూపములుగా అవడు. ఐదుగా అవటమే లేదు. అట్టి జీవుని సహజమగు తురీయాతీతుడు 4 అవస్థలలో మిగిలిన మూడు కలిగి మొత్తం (4×4=16) షోడశ కళాస్వరూపుడై ఉంటున్నాడు.

| | జాగ్రత్ | స్వప్నము | సుషుప్తి | తురీయము |
|---|---|---|---|---|
| 1) | జాగ్రత్ జాగ్రత్ | స్వప్న జాగ్రత్ | సుషుప్తి జాగ్రత్ | తురీయ జాగ్రత్ |
| 2) | జాగ్రత్ స్వప్న | స్వప్న స్వప్న | సుషుప్తి స్వప్న | తురీయ స్వప్న |
| 3) | జాగ్రత్ సుషుప్తి | స్వప్న సుషుప్తి | సుషుప్తి సుషుప్తి | తురీయ సుషుప్తి |
| 4) | జాగ్రత్ తురీయ | స్వప్న తురీయ | సుషుప్తి తురీయ | తురీయ తురీయ |

అయితే పై 4×4=16 అవస్థలు కూడా తురీయాతీతుడగు 'నిర్గుణ–స్వస్వరూప–పరబ్రహ్మము'నకు లేవు. పై 16టికి తురీయాతీతుడు నాటక దీపమువలె సాక్షిత్వము వహిస్తూ, సర్వదా ఏకస్వరూపుడై ఉన్నాడు. **అట్టి తురీయాతీతము ఈ జీవుని సహజ – నిజ స్వరూపమే అయి ఉన్నది.**

# తురీయాతీతుని తటస్థ / మధ్యవర్తి రూపము

సమస్తమునకు "పరము" (Beyond) అయినట్టి, ఈ జీవుని యొక్క సమస్తమునకు అతీతమైన తటస్థ స్వరూపమే "మధ్యవర్తి" అనబడుతోంది.

తటస్థుడగు తురీయాతీతుడే సమస్తమునకు ద్రష్ట. అయితే ఆయనకు (ఆ స్వస్వరూపమునకు) "ద్రష్టత్వము" అనే ధర్మము లేదు కాబట్టి "అద్రష్ట" కూడా! కర్తృత్వము, భోక్తృత్వము, అహంకారములతో కూడిన జీవాత్మ వైనమంతా ఆయన యొక్క స్వయం కల్పిత చమత్కారమే. అందుచేత తురీయాతీత పురుషుడే జీవాత్మగా కనిపిస్తూ ఉన్నాడు. కానీ, జీవునికి ఆవలివాడు (సాక్షి) కాబట్టి జీవాత్మగా అవటం లేదు. ఆయన జీవాత్మగా కనబడుచూ కూడా తనకు అన్యమైన దేనిచేతను స్పర్శించబడడు. ఆయన జీవాభిమానము, క్షేత్రాభిమానము, శరీరాభిమానము పొందువాడు కాడు. కనుక జీవాత్మ ధర్మములు లేనివాడు. అయితే ఆయన సాక్షిగా ఏర్పడి ఉండటం చేతనే సమస్త అభిమానములు ఉనికిని పొందుచున్నాయి.

జీవునికి – ఈశ్వరునికి **ఘటాకాశము** (కుండలోని ఆకాశము) – **మహాకాశము** (Al present space) అనే బేధములు ఉన్నాయి. తురీయాతీత పురుషుడే జీవ – ఈశ్వరులు దృష్టిచే (ఆపాదనచే) ఆశ్రయించి ఉన్నప్పటికీ, తురీయాతీతునికి జీవ ఈశ్వర భేదము లేదు. ఉభయము తానై ఉభయమునకు వేరై తురీయాతీతుడు ప్రకాశించుచున్నాడు.

ఈ జీవుడు అట్టి తురీయాతీత స్వస్వరూపము ఆస్వాదించేది ఎట్లా ?

> **జీవుడు వాస్తవానికి తురీయాతీత స్వరూపుడే కాబట్టి – "సహజము" నుండి (సః) సందర్భములోనికి, సందర్భములో నుండి సహజములోనికి – అనుక్షణం "సోఽహం"అను అజపాగాయత్రి" నిర్వర్తిస్తూనే ఉన్నాడు.**

**ఉచ్ఛ్వాస : "సః"** = సహజరూపము
**నిశ్వాస : "అహమ్"** = సందర్భరూపము
(ఉచ్ఛ్వాస + నిశ్వాస) = అజపా గాయత్రి

ఈ విధంగా "సోఽహం" (సహజ – సందర్భ ఏకైక తత్త్వము)ను ఎరిగి, శరీరాభిమానం త్యజించాలి. ఎవరు శరీరాభిమానము త్యజిస్తూ వస్తారో 'అట్టి వాడు బ్రహ్మమే' అని చెప్పబడుతోంది.

**శరీరాభిమాన త్యాగము ఏ విధంగా ?**

సమస్త జగద్విశేషములు పట్ల సంగము వదలి, క్రోధమును జయించి, అల్పమైన ఆహారము (ఇంద్రియ సద్వినియోగము) అభ్యసిస్తూ ఇంద్రియములను జయించి తన వశము చేసుకొన్నవాడై బుద్ధితో నవద్వారములను (రెండు కళ్లు, రెండు చెవులు, రెండు ముక్కు రంధ్రములు, నోరు, గుదము, రహస్యావయవము) మూసి ఉంచి, (ధ్యాసలను బాహ్యానుభవముల నుండి, వెనుకకు మరల్చి) మనస్సును సర్వత్రా సమస్వరూపమైయున్న ఆత్మయందు నిలపాలి. సమస్తము ఆత్మ ప్రదర్శనముగా ఉపాసిస్తూ, సర్వమునందు స్వస్వరూపాత్మను, స్వస్వరూపాత్మయందే సమస్తమును దర్శిస్తూ, ఆత్మ గురించిన ధ్యాసను నిలపాలి. **అట్టి ధ్యాసయే ధ్యానము.**

## యతీశ్వర సిద్ధి

**ధ్యానము :** జన సంచారములేని శూన్య ప్రదేశములలోను, ప్రశాంత స్థలములందు, గుహలలోను, అడవులందు యోగి ఎల్లప్పుడు సమదృష్టి అభ్యసించువాడై సమ్యక్ ధ్యానము (ఆత్మయందే సమస్తము దర్శిస్తూ, ఆత్మయే సమస్తమైయున్నట్లు బుద్ధి నిశ్చలత పొందే ప్రయత్నము)నకు ఉపక్రమించాలి. బ్రహ్మాత్మైక్య భావనను మనస్సుతో అనుక్షణికంగా మననయుక్తము చేయాలి.

ఆతిథ్యము ఇచ్చే చోటులకు, శ్రాద్ధము – యజ్ఞము – దేవయాత్రోత్సవాలు జరిగే ప్రదేశాలకు, అనేక మంది జనము గుమికూడిన చోట్లకూ – సిద్ధిని కోరుకొనే యోగి (యోగవేత్త అయినవాడు) పోయి, పాల్గొనరాదు. అటువంటి చోట్ల యోగాభ్యాసము చేయు ప్రయత్నము చేయరాదు. యోగాభ్యాసి అయినవాడు ఎవ్వరినీ దూషించరాదు. యోగాభ్యాసములను ఎగతాళి చేసే, పరాభవించే స్వభావముగల జనుల మధ్యగా ఉండరాదు. ఇతరుల దోష–దురహంకారములు తన యొక్క తితిక్ష (ఓర్పు, సహనములకు) సహకారిక ఉపకరణ సందర్భములుగా భావించాలి.

## త్రిదండీ మహాయతి

శాస్త్ర విహిత "తత్త్వసాధన" కొరకై త్రిదండము ధరించుగాక. అట్టి త్రి–దండము యొక్క ఉత్తమార్థమును గ్రహించి ఉండాలి. 1) వాక్ దండము 2) కర్మ దండము 3) మనో దండము (వాక్–కర్మ–మనస్సులు) ఈ మూడు నియతి పూర్వకంగా (systematically engaged) ఉపయోగిస్తారో, అట్టివాడు **"త్రిదండీమహాయతి"** అని పిలువబడుతాడు.

## మధుకర (భిక్షాటన) సమయాసమయములు

- భిక్షకు ఒక ఇంటికి వెళ్లేటప్పుడు, అప్పటికే అగ్ని చల్లారి, పొగ తొలగిన తరువాత మాత్రమే (వంట పూర్తి అయిన సూచనను గమనించి) అట్టి సమయమున భిక్షకై వెళ్ళాలి.
- సంపద కలిగి, దానము చేయు స్వభావము, పుణ్యభావన కలవారి ఇళ్ల వద్ద మాత్రమే భిక్ష అడుగుదురు గాక.
- ఎవడు భిక్ష ధర్మము, నియమితములు ఆచరించకుండా, ఇతరులను బాధించి, పెత్తనము చెలాయిస్తూ భిక్ష అడుగుతాడే, వ్యసనములు కలిగిఉంటాడో (లేదా) అనురాగము కలిగి ఉన్నవాడై వైరాగ్యము ఆశ్రయించడో, అట్టివాడు నీచుడే అవుతాడుగానీ, 'యతి' కాలేడు.

ఒకరి ఇంట్లో భిక్ష అధికంగానూ, విశేష పదార్థములతోను లభిస్తోంది కాబట్టి, ఆ కారణంగా, అదే ఇంటి వద్ద మరల మరల భిక్ష కోరరాదు.

ఏ యతి (సన్యాసి) అయితే...,

శరీర – ఇంద్రియములకు ఆవలి, సర్వసాక్షి, పారమార్థిక విజ్ఞాన స్వరూపము, బ్రహ్మానందఘనము, స్వయం ప్రభ (తేజో) ప్రభాసితము, కేవల అసిధారా సుఖస్వరూపము అగు స్వస్వరూప – సర్వాంతర్యామియగు అఖండాత్మను గ్రహిస్తాడో, అట్టివాడు **"అతివర్ణాశ్రమి"** (చతుర్విధ ఆశ్రమముల పరిధులను, ఆశ్రమ నియమ వ్యవహారములను అధిగమించినవాడు) అగుచున్నాడు.

## ఆశ్రమ ధర్మములన్నీ మాయా కల్పితములే

ఓ నారదా ! ఒక ముఖ్య విషయం శాస్త్రములు, ఆశ్రమ ధర్మములు చెప్పుచున్నాయి. (బ్రహ్మచారి, గృహస్థ, వానప్రస్థ, సన్యాసి) విధులు, విధానములు, నిర్వర్తించవలసినవి, నిర్వర్తించకూడనివి చెప్పుచున్నాయి. నేను కూడా యతి, పరివ్రాజక, తురీయాతీత, పరమహంస ధర్మాలన్నీ చెప్తూతూ వస్తున్నాను కదా ! అయితే ...,

**"సర్వాశ్రమ ఆదయో దేహే మాయయా పరికల్పితాః"** సమస్త ఆశ్రమ ధర్మములు మాయా కల్పితమే. అటువంటప్పుడు నియమనిష్ఠలు, విధి–నిషేధములు శాస్త్రములు ఎందుకు చెప్పుచున్నాయి? ఒకనికి ముల్లు గుచ్చుకొన్నప్పుడు కాలిలో విరిగిన ముల్లును మరొక ముల్లుతో తీసి, అటు తరువాత రెండు ముల్లులను ఆవల పారవేస్తాము కదా. అట్లాగే 'బంధము' అనేది స్వయంకృత మాయాకల్పితమే.

ఆపాదితమగు "స్వస్వరూపము బంధము పొందుచున్నది" అను భ్రమ (లేక) సంసార బంధము తొలగటానికై, శాస్త్రములు మాయా కల్పితములగు విధి-నిషేధములు చెప్పుచున్నాయి.

స్వస్వరూపము యొక్క జ్ఞానముచే 1) ఆత్మగా అనుకోవటము 2) అనిపించటము 3) అదే తానవటము కొరకై నియమములు 4 వర్ణాశ్రమముల వారికి చెప్పబడుచున్నాయి. ఏ వర్ణాశ్రమవాసి అయినా సహజముగా స్వయముగా ఆత్మ స్వరూపుడే. పూర్ణమగు ఆత్మ భావనాసిద్ధికి అర్హుడు కానివాడెవడు ?

సర్వదా సిద్ధించియే ఉన్నదాని కొరకై సాధన ఎందుకు ? **"సర్వదా సిద్ధించియే ఉన్నది"** అను నిశ్చయానుభవము కొరకు మాత్రమే సాధన. సిద్ధి పొందిన తరువాత సాధనతో పనేముంటుంది ? చేరవలసిన చోటికి చేరిన తరువాత ఇంకా నడకతో పని ఉంటుందా ? ఉండదు కదా.

"బోధ రూపుడగు అత్మనే నేను" అను స్వానుభవము సిద్ధించుకొన్న వానికి ఇక మమకారము, అహంకారము మచ్చుకకైనా ఉండవు. అతడు వేద వేదాంత వేద్యుడు.

వేదము = తెలియబడునది.
వేదాంతుడు/ వేదాంతవేద్యుడు = తెలియబడేదానికి ఆవల గల తెలుసుకొనుచున్న వానిని తెలుసుకొన్నవాడు.

అట్టి వేదాంతవేద్యుడు **"అతివర్ణాశ్రమి"** (వర్ణాశ్రమ పరిధులను దాటినవాడు) అగుచున్నాడు.

ఎవడు స్వాత్మదర్శనం చేత **"వర్ణాశ్రమ భేదములు ఆత్మ దృష్ట్యా మొదలే లేవు"** అని అసంశయముగా గ్రహిస్తాడో, అట్టివాడు అతీతాశ్రమి అయి సర్వే సర్వాత్రా ఆత్మనే దర్శిస్తాడు. ఆత్మయే తానై సర్వాత్మకుడై వెలుగొందుతాడు. ఆ విధంగా సర్వవేదార్థముల సారము స్వయముగా పునికిపుచ్చుకోగలడు.

కాబట్టి నారదా ! ఆత్మను తెలిసినట్టి ఆత్మవేది "నా ఆశ్రమము, తదితర ఆశ్రమములు – ఇవన్నీ కూడా ఆత్మపై ఆరోపితమైనవే. అనగా భ్రాంతి మాత్రమే" – అని సుస్పష్టముగా ఎరిగి, "అతివర్ణాశ్రమి" అగుచున్నాడు.

ఓ పుత్రా ! నారదా ! బ్రహ్మవిజ్ఞాని అయినవానిపట్ల ఇక విధి-నిషేధములు గాని, వర్ణ-వర్ణాశ్రమ కల్పనలు గాని, మరింకే జీవాత్మ – పరమాత్మ భేద విశేషాలుగాని ఏ మాత్రము అగుపించవు. కనిపించవు.

## ముక్తి మార్గము

- బ్రహ్మదేవుని పదము నుండి మరే పదము పట్ల, సర్వజీవుల వ్యవహారముల పట్ల అనురక్తి లేనివాడై, విరక్తుడై ఉండాలి.
- పుత్ర – మిత్ర – కళత్ర – కుల – మత ఇత్యాదివన్నీ అల్పములుగా భావించి, పెల్లగించివేసి, వేదాంత జ్ఞానము పొందుచూ ముక్తిమార్గమునందు శ్రద్ధ కలిగినవాడై ఉండాలి.
- ముక్తి కొరకై ఉపాయములు ఆశ్రయిస్తూ బ్రహ్మతత్త్వము ఎరిగిన గురువును ఆశ్రయించాలి.

అట్టి గురువును సేవించి, వారికి సంతోషము కలుగజేస్తూ, సమాహితుడై (ఏకాగ్ర బుద్ధి కలవాడై) వేదాంత వాక్యార్థములను దీర్ఘకాలము శ్రవణము, మననము, హృదయస్థము చేసుకొను గాక.

**శ్లో॥ నిర్మమో నిరహంకారః సర్వసంగ వివర్జితః**
**సదా శాంత్యాది యుక్తస్సన్ ఆత్మని ఆత్మానమ్ ఈక్షతే ।**

ఆ విధంగా మహావాక్యముల 'అర్థార్థి" అయి, అర్థములను విచారణ చేస్తూ హృదయస్థము చేసుకొనును గాక। క్రమంగా మమకార – అహంకారరహితుడై సమస్త సంగములను (All Attachments) త్యజించినవాడై, ఎల్లవేళల శాంతి, సహనము, అమానిత్వము మొదలైన ఉత్తమ గుణములు సిద్ధించుకొన్నవాడై సర్వత్రా ఆత్మ దర్శనము ఆశ్రయించును గాక. దృశ్యముతో ఏర్పడే భేద సంబంధరూపమగు సంసార దోషములను దృష్టియందు ఉంచుకొని ఎల్లప్పుడు విరక్తుడై ఉండును గాక.

**విరక్తస్యతు సంసారాత్ సన్యాసః స్యాత్ న సంశయః ।** ఎవడు సమస్త సంసారము పట్ల విరక్తుడై ఉంటాడో, అతడు సన్యాసియే. ఇందులో సందేహము లేదు. అందుచేత ముముక్షువు (బంధము తొలగించుకోదలచినవాడు) సమస్తమునకు పరమైయున్న "సాక్షాత్ మోక్ష సాధన" అను ఏకైక మార్గము ఆశ్రయించువాడు 'పరమహంస" అగుచున్నాడు. అందుకు మార్గము? "వేదాంతార్థ శ్రవణము" అనే మార్గముగా బ్రహ్మ విజ్ఞానము సిద్ధించుకోవాలి.

# పరమహంస

యతి బ్రహ్మ జ్ఞాన లాభము పొంది "పరమహంస" (సోఽహమ్ పరమమ్) స్థానము సిద్ధించుకొనును గాక. అందుకు ఉపాయములు చెప్పుకుందాము.

- శాంతి, దాంతి (ఇంద్రియ నిగ్రహము) మొదలైన సాధనల యందు శ్రద్ధ కలిగి, ఆచరించువాడై ఉండాలి.
- శాంత, దాంత అభ్యాసములతో ఇంద్రియములను జయిస్తూ (జితేంద్రియుడై), వేదాంత శాస్త్రమును శ్రద్ధగా అభ్యసించువాడై ఉండు గాక.
- భయరహితుడై, అన్నిటిపట్ల మమకారము వదలినవాడై ద్వంద్వాతీతుడై, జగద్విషయములు ఏవీ స్వీకరించనివాడై ఉండును గాక.

**యతి :** జీర్ణమైన (వస్త్రము నుండి చించిన) కౌపీనము (గోచి) ధరించి, తలవెంట్రుకలు తొలగించుకొంటున్నాడు. (ముండీ) నగ్నముగా (Without clothes, Nude) ఉంటున్నాడు.

ప్రాజ్ఞుడై, నిత్యానిత్య వివేకి అయి, వేదాంతపరమార్థము ఎరిగిన యోగి అయి, నిర్మమ – నిరహంకారుడై, శత్రు–మిత్రుల యందు సమబుద్ధి కలిగి, సమస్త సహజీవుల పట్ల మిత్రభావము పవృద్ధపరచుకొనును గాక. ఎవ్వడైతే అనేకముగా కనిపించే ఈ దృశ్య జగత్తుపట్ల ఏకమగు ఆత్మజ్ఞానము సంపాదిస్తూ "ఏకజ్ఞాని" అవుతాడో, తన హృదయమునందు సమస్త భేదభావములను సశాంతింపజేసుకొని ప్రశాంతాత్ముడౌతాడో, అట్టి వాడు సంసారము నుండి తరించగలడు. అట్టి ఏకదృష్టిని సంపాదించుకోలేనివాడు "సోఽహమ్ పరమ్" రూపమగు పరమహంసత్వము సిద్ధించుకోలేడు. దృశ్యబంధముల నుండి తరించజాలడు. అందుకు కొన్ని ఉపాయములు.

### 1) గురు–ఆశ్రయము (ఒక సంవత్సరము) :

అట్టి "ఏకదర్శి" అయి ఆత్మత్వము సిద్ధించుకోవటానికై తత్త్వజ్ఞాని అగు సద్గురువును ఆశ్రయించాలి. గురువును సేవలచే సంతోషింపజేస్తూ, గుర్వాశ్రమంలో ఒక సంవత్సర కాలము గడుపును గాక. గురువు తెలియజేయు విధంగా ఇంద్రియములను అప్రమత్తముగా నియమిస్తూ 'నియమము"ను నిర్వర్తించాలి. క్రమంగా 'యమము' (ఇంద్రియములను విషయములపై వ్రాలటము అనే వ్యసనము నుండి ఎల్లప్పుడు వెనుకకు మరలిస్తూ ఉండాలి). **నియమేషు అప్రమత్తస్తు ।యమేషు సదా భవేత్॥**

**2) భూమిపై సంచారము – ఒక సంవత్సర కాలము :** గురు – ఆశ్రయముచే ఉత్తమమగు ఆత్మజ్ఞాన యోగమును అభ్యసించిన తరువాత, ధర్మాచరణము నుండి ఏ మాత్రము చ్యుతి పొందకుండా భూమిపై ఆయా ప్రదేశములను, మహనీయుల ఆశ్రమములను, తీర్థ స్థలములను సందర్శిస్తూ – ఒక సంవత్సరము గడుపును గాక.

**3) గృహస్థ – వాన ప్రస్థాశ్రమములు :** ఆత్మజ్ఞానము ప్రవృద్ధ పరచుకొనుచు భూమిపై సంచారము ఒక సంవత్సర కాలము చేసి ఆ తరువాత గృహస్థ ఆశ్రమము, అటు తరువాత వాన ప్రస్థాశ్రమము స్వీకరించి ఆయా ధర్మములు నిర్వర్తించును గాక.

**4) పరమాశ్రమము :** ఆ విధంగా విద్యార్థిత్వము, అధ్యయన సంపూర్తి, గురు ఆజ్ఞతో సంవత్సర దేశ సంచారము, గృహస్థాశ్రమము, వానప్రస్థాశ్రమము పూర్తి చేసుకొని (క్రమవిధిగా), (ఆ బ్రహ్మచారి– గృహస్థ – వానప్రస్థ ఆశ్రమములను ముగించుకొని) గురువుల, కుటుంబసభ్యుల అనుజ్ఞతో 'పరమాశ్రమము' స్వీకరించి అప్పుడిక లోక సంచారము చేయాలి. **సమస్త సంగములు వదలి, క్రోధమును జయించి, మితాహారము స్వీకరించువాడై,** ఇంద్రియములను జయించును గాక.

## విడచి ఉండవలసినవి

**శ్రీ బ్రహ్మదేవ భగవానుడు :** ప్రియ నారదా ! గృహస్థునికిగాని, భిక్షకునికి (పరివ్రాజకునికి) గాని విపరీత కర్మలు ఉచితము కాదు సుమా !

**శ్రీ నారద మహర్షి :** తండ్రీ ! ఏవేవి **"విపరీత కర్మలు"** అనబడుచున్నాయి ?

**శ్రీ బ్రహ్మభగవానుడు :** ద్వి (2) విధములైన కర్మలు **"విపరీత కర్మలు"** అనబడుచున్నాయి.

**1) గృహస్థుడు** ఏ ప్రయత్నము చేయకుండా, ఏ ఉపయుక్త కర్మ ఆరంభించకుండా నిరారంభుడై ఉండువాడు – విపరీత కర్మిష్ఠుడు.

**2) భిక్షకుడు** అనేక సాంఘిక సంబంధమైన కార్యాలాపములు నిర్వర్తిస్తూ ఉండటము చేత **"విపరీత కర్మిష్ఠుడు"** అనిపించుకుంటాడు. అట్టి వారు వైరాగ్యము సిద్ధించుకోలేరు.

ఆహా ! ఈ జీవుడు (స్త్రీ–పురుషులు) పరస్పర భౌతిక దేహములను చూచి సురాపానము త్రాగినవానివలె అగుచు మదమును (Sexual Thoughts) పొందుచున్నారే! ఇక సర్వత్రా ఆత్మ దృష్టి అలవడే అవకాశము ఎక్కడిది?

అందుచేత, చర్మ మాంస శరీర దృష్టిని ఆత్మానందము కోరువాడు దూరంగా వదలాలి. ఆత్మ జ్ఞానము కోరుకొనువాడు స్త్రీ, పురుష సంబంధముల గురించి సంభాషించనే కూడదు. అట్లాగే, స్త్రీలతో (అట్లాగే స్త్రీలు పురుషులతో) నృత్యము చేయటము, శృంగార గానములు, ఆనందముగా పరిహాసాలు, సరసాలు ఆడటము, ఇతరుల గురించి చెడు విషయములు సంభాషించటము మొదలైనవన్నీ కూడా ఆత్మ జ్ఞానమునకు తీవ్రమగు నిరోధకములు అవగలవు. అందుచేత ముముక్షువు అట్టివాటి పట్ల జాగరూకుడై ఉండాలి.

## ఆత్మతో అంతఃసంగము సిద్ధించుకొన్నవాని విధి – నిషేధములు

**శ్రీ నారదమహర్షి :** జగత్ సృష్టి చైతన్యరూపా ! జగత్ పితామహా ! బ్రహ్మదేవ భగవాన్ ! శాస్త్రములు ముముక్షువుల ఉద్ధారణ కొరకై బ్రహ్మచర్య –గృహస్థ – వానప్రస్థ – సన్యాస ధర్మములు చెప్పుకుంటూ వస్తున్నాయి కదా! మరి ఆత్మతో అనునిత్యము, మమేకత్వము సిద్ధించుకొన్న మహనీయుని విధి – నిషేధములు (Dos and Don'ts) ఏ తీరునవై ఉంటాయి ? ఎటువంటి స్నాన పూజా, అగ్నికార్య, తీర్థ యాత్రా, ధర్మాధర్మ నియమములు కలిగి ఉంటాడు ?

**శ్రీ బ్రహ్మ భగవానుడు :** ఆత్మ గురించి ఎరిగి, స్వస్వరూపాత్మను దర్శించినవాడై, సర్వత్రా ఆత్మానందము ఆస్వాదించుకొన్న ఆత్మ సిద్ధునికి ఎటువంటి స్నాన, పూజ, జప, హోమ సాధనలు ఉండవు. అగ్ని కార్యములు, అకార్యములు, పితృకార్య నియమములు, తీర్థయాత్రలు, వ్రతములు, ధర్మ–అధర్మ సూచనలు శాస్త్రములు చెప్పటం లేదు. సర్వసాధనల పరాకాష్ఠ అగు "సర్వత్రా ప్రేమాస్పద ఆత్మదర్శనము" స్వస్వభావ రూపంగా సిద్ధించుకొన్నవానికి సమస్త సాధనముల ప్రయోజనము సిద్ధించినట్లే. ఒకడు 'వెళ్లాలి' అనుకొన్న చోటికి వెళ్లిన తరువాత ఇక ప్రయాణ సాధనలతోను, ప్రయాణ సమయంలో జాగరూకతలు గురించి అగత్యము (Inevitability) ఏమి ఉంటుంది ? అట్టి స్థితిలో త్రి–ఆశ్రమముల (లేక) సన్యాసాశ్రమ సంబంధమైన యతి, పరివ్రాజ ధర్మములు ఏవీ విధి కాదు. నిషేధము కాదు.

అట్టి వానికి పరమాత్మ యందు రమించటమే ఏకైక నియమము. **"నేను సర్వదా అఖండమగు ఆత్మతో ఏకమై ఉన్నాను"** అను నిశ్చల భావనయే సాధన. అయితే పరమార్థబుద్ధిగల యతి – లోకాచారములన్నీ విడచినవాడై ఉండినప్పటికీ లోకమునకు క్షేమము కలిగించు కర్మలును స్వాభావికంగానే వీడడు. తనను ఆశ్రయించిన మముక్షువులకు స్థైర్యము కలిగించు విధులను స్వాభావికంగానే విడువడు. ఎందుకంటే అట్టివాడు సమస్త జీవుల పట్ల స్వాభావికంగా అత్యంత ప్రేమ, క్షమ, ఆప్యాయత కలిగి ఉంటాడు కాబట్టి!

అందుచేత :

పరమార్థబుద్ధి గల యతి క్రిమి కీటక పతంగములకు గాని, వనస్పతులకు (వృక్షములకు) గాని, సహజీవులకు గాని హింస కలిగించదు.

అట్టివాడు నిత్యము అంతర్ముఖుడై **"సమస్తమునందు నిర్మలమగు ఆత్మయే ఆధారమైయున్నది"** అని సమన్వయించుకుంటూ అందరిలో ఆత్మనే దర్శిస్తూ, ఆరాధించు భావన విడువక ఉంటాడు. నిర్మలము, ప్రశాంతము, స్వస్వరూప పూర్ణములతో కూడిన బుద్ధిని కలిగి ఉంటాడు. **"మమాత్మా సర్వభూతాత్మ" – భావనతో బ్రహ్మానందము ఆస్వాదిస్తూ ఉంటాడు.**

ఓ నారదా ! తదితర మునులారా ! సమస్త జనులారా ! మీరంతా కూడా బాహ్యమున 'సంగము' కలిగి ఉండి కూడా 'అంతస్సంగము' (Relatedness in the inner recess of heart) మొదలంట్లా విడచివేసినవారై ఉండండి. **ఇదియే ముఖ్యమైన యతి – సన్యాసి – పరివ్రాజ ధర్మము.** అంతఃసంగము విడచియే లోకములోను, సందర్భములలోను విహరించండి. ఆత్మ గురించిన మననమును అనుక్షణము ఆశ్రయించినవారై ఒంటరిగా ఈ జగత్తులలో (దేహముల మధ్యగాను, జన్మ – కర్మల తోడను) విహరించండి. అయినా కూడా, **నా రాజకే జనపదే చరతి ఏకచరో మునిః ।** ముని అయినవాడు రాజ్య–ప్రభుత్వ పరిపాలనలు లేని చోట విహరించకపోవటమే ఉచితము. దేనినీ స్తుతించక, నమస్కరించక, స్వధాకారుదు కాక, ఆశీర్వాదములు పరిత్యజించినవాడై, స్వేచ్ఛగా (యాదృచ్ఛికంగా) కొండగుహలలోగాని, వనములలోగాని, మరింకెక్కడైనా గాని ఆత్మదృష్టితో విహరించును గాక.

# సప్తమ (7వ) ఉపదేశము

**శ్రీ నారదమహర్షి :** హే పితామహా భగవాన్। "మహత్ పాఠ్యాంశములకు పునశ్చరణ దోషము ఉండదు" – అని ఆర్యవాక్యము కదా! అందుచేత యతి ధర్మముల గురించి, సమస్త జనులు పాటించవలసిన విధి–విధానముల గురించి మరల మరొక్కసారి సమీక్షించండి.

**బ్రహ్మ భగవానుడు :** నీవు కోరుచున్నట్లుగా మరల వివరిస్తున్నాను. విను.

అశాశ్వతమగు ఇంద్రియ – దృశ్య విషయములపట్ల **"ఇవి నిత్యము, సత్యము, దోష / దుఃఖ రహితము అగు ఆనందమును ఇవ్వలేవు"** అని సుస్పష్టముగా గుర్తించి "విరక్త సన్యాసి" అగుచున్నాడు. సమస్తము మానసికంగా సన్యసించినవాడై ఇక భౌతికంగా ఒక చోట ఉండక, పరివ్రాజకుడై ఆత్మయోగమును "అభ్యాసము" చేయును గాక.

- వర్షాకాలములో మాత్రము "చాతుర్మాస్యవ్రతము" రూపంగా సాధనకు సానుకూలమైన ఒకే ప్రదేశములో 4 నెలలు నివసించును గాక.
- ఏకాకిగా చరించును గాక.
- చాతుర్మాస్యము కాని సమయమంతా ఎక్కడైనా ఒక్క రాత్రి మాత్రమే ఉండును గాక. భిక్షు జీవితము గడపునుగాక.
- "ఒక చోటనే ఉంటే ప్రాపంచక విషయాలు నన్ను ఆకర్షిస్తాయేమో" అని భయపడుచూ సారంగము (తుమ్మెద) లాగా ఒక చోట ఉండక ప్రతి రోజు ప్రయాణము కొనసాగిస్తూనే ఉండాలి. "ఉండి పోదాములే" అని తన ప్రయాణమును నిరోధించరాదు.
- చేతులు ఉపయోగించి నదీజలంలో 'ఈత' కొట్టుచూ దాటటము చేయరాదు. చెట్లు ఎక్కటం చేయరాదు.
- దేవాలయ ఉత్సవాలలో దర్శనము, పాల్గొనుట చేయరాదు.
- ఒకేచోట అనేకసార్లు భుజించరాదు (న ఏకరాత్రాశి)

– బాహ్య దేవతార్చనలు నిర్వర్తించరాదు. సర్వాంతర్యామి, అంతర్హృదయుడు అయినట్టి పరమాత్మనే సర్వదా సేవించాలి. **స్వస్వరూపాత్మ** యొక్క నిర్మలత్వ – నిర్గుణత్వ – సర్వాతీతత్వమునకు వ్యతిరిక్తమైన సంభాషణగాని, పారాయణముగాని, అధ్యయనముగాని నిర్వర్తించ కూడదు.

మధుకర వృత్తితో ఆహారము స్వీకరిస్తూ క్రమంగా సంసార ధ్యాసలన్నీ కృశింపజేయును గాక.

***బలము, కండ, క్రొవ్వు, వృద్ధి చేసుకోవాలని ఆశయముతో నెయ్యి మొదలైనవి అభిలషించరాదు. నెయిని నెత్తురుకూటివలెను, ఒకే ఇంట్లో అనేక సార్లు భుజించుటమును మాంసాహారమువలెను, సుగంధ లేపనములను అశుద్ధమువలెను, క్షారములను (అధికంగా ఉప్పు, కారములను) నీచ వస్తు సేవనమువలెను, ఖరీదైన వస్త్రములను ఉమ్మిపాత్రవలెను, అభ్యంగన స్నానమును దుష్టస్త్రీ సంగమువలెను, సంసారదృష్టి గల స్నేహితులతో కాలము గడపటమును మూత్రముతో సమానముగాను, ప్రాపంచక విషయములను ఇతరుల దుర్గణములను మాట్లాడుకోవటమును గోమాంసముతో సమానముగాను, జ్ఞాతులతో (చుట్టములతో) కలసి ఉండటము మురికివాడలో నివాసమువలెను, స్త్రీలతో స్నేహము త్రాచుపామును సమీపించటమువలెను, బంగారమును కాలకూట విషముతో సమానముగాను, అనేక మనస్తత్వములతో కూడిన జనుల సమావేశమును శ్మశాన ప్రదేశమువలెను, రాజధానిలో జనుల వ్యవహారములు (లాభనష్ట వ్యవహారములు కుంభీపాక నరకముతో సమానముగాను, ఒక ఇంటిలో అనేక సార్లు భుజించటమును శవపిండమును స్వీకరించటమువలెను – విసర్జించి ఉండాలి.***

**దేహాంతర దర్శనము :** "ఆత్మగా నాకు ఈ జన్మయే లేదు. ఇక పునర్జన్మ లేదని వేరే చెప్పాలా ?" – అని భావిస్తూ పునర్జన్మ రాహిత్యమును బుద్ధియందు వికసితము చేసుకొనును గాక.

ప్రపంచ వృత్తులన్నీ పరిత్యజించి, 'స్వదేశము' అనే పరిమిత భావమును వదలివేసి, రక్తబంధువుల ప్రదేశములను వీడి, పదార్థములతో సంబంధమును విడచివేసి, స్వస్వరూపానందమును సర్వదా సిద్ధించియే ఉన్నదానిగా గమనిస్తూ, హాయిగా, ప్రశాంతముగా, ఉద్వేగరహితంగా, ఆనందముగా ఈ దృశ్యమునందు సంచరిస్తూ పాల్గొనును గాక.

**"ఇది నా శరీరము, నేను దీనికి చెందినవాడను"** అను శరీరాభిమానమును నెమ్మదిగా జయిస్తూ, దీనిని "శవము వలె హేయమైనది" అని భావించును గాక.

పుత్రులు, ఆప్తులు, బంధువు జనులు మొదలైనవారితో ఏర్పడే సంబంధమంతా కారాగము (Prison) అని తలచి బంధుస్థలమును విడిచి, సుదూరముగా సంచారము చేస్తూ, ***సర్వాత్మకమగు స్వస్వరూపాత్మను ఉపాసిస్తూ అనుష్ఠించును గాక.***

అప్రయత్నముగా లభించిన ఆహారమును సంతోషముగా, అందరినీ ఆశీర్వదిస్తూ స్వీకరించాలి. తృప్తిని ప్రకటించాలి. ఎల్లప్పుడు "బ్రహ్మప్రణవ ధ్యాన" అనుసంధానపరుడై ఉండాలి.

⌘ సమస్త లోక సంబంధమైన కర్మలను విడచివేయును గాక.

⌘ కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు మొదలైనవి దగ్ధము చేసివేయాలి.

⌘ సత్త్వ, రజో తమో గుణములను దాటివేసి "త్రిగుణాతీత దృష్టి"ని ఆశ్రయించి త్రిగుణాతీతుడగును గాక.

⌘ షడూర్మ్ములను (షట్(6) ప్రవాహ వేగములను), (ఆకలి, దప్పిక, శోకము, మోహము, జర మరణములను) అంతరమున రహితము చేసుకొనును గాక. అవి ఆత్మ ధర్మములు కానట్లుగా గమనించాలి.

⌘ షట్ భావ వికారములను ((1) పుట్టాను 2) అభిప్రాయముల రూపుడను 3) జ్ఞాపకములు కలవాడను 4) కాలముచే ఒకటి నుండి మరొకటిగా అగువాడను 5) తెలియబడేవాటికి నిబద్ధుడను 6) మరణము స్వభావముగా కలవాడను)

మొదలంట్ల తొలగించుకొనును గాక, ఆత్మదృష్టి కలవానికి ఈ షట్ (6) వికార స్వభావములు క్రమంగా వాటికవే తొలగిపోతూ ఉంటాయి.

⌘ సత్యవాక్కు పలుకువాడై, ద్రోహచింతన ఏ మాత్రము లేనివాడై (అద్రోహీ) అయి ఉండును గాక.

⌘ సర్వదా సంచారములు నిర్వర్తిస్తూ గ్రామములో ఒక్క రాత్రి మాత్రమే, పట్టణములో 5 రాత్రులు మాత్రమే, పుణ్యక్షేత్ర స్థలములలో 5 రాత్రులు మాత్రమే, అంతకుమించి ఉండనివాడై (అనికేతుడై) ఉండాలి.

బుద్ధిచాంచల్యమును జయించటానికై తపో–ధ్యాన–యోగాభ్యాసములను నిర్వర్తిస్తూ **'స్థిరబుద్ధి'**ని సంపాదించుకొనును గాక.

**న–అనృతవాదీ ।** నిజము కాని దానిని నిజమని నమ్మటము, నమ్మించటము నిర్వర్తించకుండును గాక.

పర్వతకందరములు (గుహలు) అతనికి నివాసయోగ్యమే అగు గాక.

గ్రామములో అయితే ఒకరిద్దరి (1 లేదా 2) వరకు, పట్టణములలో అయితే ముగ్గురి వరకు, నగరములో అయితే నలుగురితోను మాత్రమే కలసి ఉండటము శ్రేయస్కరము. అంతకుమించి ఎక్కువమందితో కలసి ఉండరాదు. (లేదా) గ్రామములో ఒంటరిగానే సంచారములు చేయటము మరింత శ్రేయస్కరము.

భిక్షువు అయినవాడు 14 కరణములకు (పంచ కర్మేంద్రియములకు, పంచ జ్ఞానేంద్రియములకు, అంతరంగ చతుష్టయమగు మనో బుద్ధి చిత్త అహంకారములకు) తనను వశము చేసుకోవటానికి చోటు ఇవ్వకూడదు. అవన్నీ తనకే వశమై ఉండునట్లుగా యోగాభ్యాస బలసమన్వితుడై ఉండుగాక. అందుకు గాను, వైరాగ్య సంపన్నుడు అగుచుండును గాక.

**"మత్తో న కశ్చిత్ అన్యో అతిరిక్త" – ఇతి ఆత్మని ఆలోచ్య, సర్వతః స్వరూపమేవ పశ్యన్, – జీవన్ముక్తిం అవాప్య। "నాకు అన్యముగా వేరై ఏదీ ఎక్కడా లేదు"** – అని స్వస్వరూపాత్మయొక్క ఔన్నత్యమును గమనించి, విచారించి, సమాలోచనతో సర్వత్రా స్వస్వరూపమే అని దర్శించువాడు **"జీవన్ముక్తుడు"** అగుచున్నాడు.

జీవన్ముక్తత్వముచే సర్వత్రా సర్వదా స్వస్వరూపమే అని అనుభవ పూర్వకంగా దర్శిస్తూ ఉండాలి. ఇక ఆపై దేహము ఉన్నంతవరకు ప్రారబ్ద – ప్రతిభాస (A reflection of present eventuality by virtue of past) గా దేహమున్నంతవరకు జాగ్రత్ – స్వప్న – సుషుప్తి – తురీయ దేహములను తెలుసుకొని ఉండును గాక.

**దేహపతన పర్యంతం స్వరూపానుసంధానేన వసేత్ ।** దేహము పతనము పొందు వరకు "నేను దివ్యము, నిర్మలము, అఖండము అగు ఆత్మస్వరూపుడను" అను రూపమగు **"స్వరూపానుసంధానము"** (తన సహజ స్వరూపమును సర్వాత్మకుడగు పరమాత్మతో ఏకం) చేస్తూ ఉండును గాక! ఈ విధంగా దేహమున్నంతవరకు కాలఃకాలుడై కాలమును గడుపును గాక.

**(కాలః కాలుడు = కాలము నా యొక్క కల్పనా చమత్కారములోనిదే । ఆత్మగా నేను కాలమునకు ఆవలివాడను"** అని గ్రహించి **ఉన్నవాడు).**

**శ్రీ నారద మహర్షి :** మీరు మహత్తరమగు **"సోఽహమ్ తత్త్వమార్గము"** చెప్పుచున్నందుకు కృతజ్ఞులం. మీకు వినమ్రులమై సాష్టాంగ దండ ప్రణామములు సమర్పిస్తున్నాము.

హే భగవన్ ! పితామహా ! జగదాధారా ! జగత్ శరణ్యా ! సద్గురు వరేణ్యా ! సృష్టి ప్రజ్ఞాభాషితా !

ఇప్పుడు మాకు 1) కుటీచక 2) బహూదక, 3) హంస 4) పరమహంస 5) తురీయాతీత 6) అవధూతల ఆచారములు, భోజనాది విశేషములు, భిక్షవృత్తులు, వస్త్రధారణలు, అర్చనలు, అనుసంధానములు మొదలైన విశేషాలు సమీక్షించి దయతో మరొక్కసారి చెప్పమని అర్థిస్తున్నాము.

**బ్రహ్మ భగవానుడు :** నారదా ! సరే ! మరొక్కసారి నీవు అడిగిన విధంగా సమీక్షించి చెప్పుచున్నాను. విను.

| | కుటీచక యతి (1) | బహూదక యతి (2) | హంస (3) | పరమహంస (4) | తురీయాతీతుడు (5) | అవధూత (6) |
|---|---|---|---|---|---|---|
| 1) స్నానము | ప్రతి రోజు 3 వేళల స్నానము | ప్రతి రోజు రెండు పూటలా స్నానము | రోజుకు ఒక్కసారి స్నానము | భౌతికస్నాన నియము ఏదీ లేదు, 'మానసస్నానము' | భస్మ స్నానము (చితాభస్మముతో స్నానము) | వాయువుతో స్నానము (వాయు స్నానము) |
| 2) పుండ్రము (నుదుటి నామము) | ఊర్ధ్వ పుండ్రము (నిలువు బొట్టు) | త్రిపుండ్రము (నొసలు నుండి మూడు రేఖలు) | ఊర్ధ్వ పుండ్రముగాని, త్రిపుండ్రము గాని | భస్మలేపనము. భస్మోద్ధూళనము (ముఖమంతా లేదా శరీరమంతా భస్మధారణ) | తిలక పుండ్రము (తిలకమువలె ధరించటము) | న కించిత్ – ఏ పుండ్రనియమము లేదు |
| 3) క్షౌరము (జుట్టు తొలగింపు) | ఋతు క్షౌరము (ఋతువుకు (లేక) రెండు మాసములకు ఒకసారి) | ఋతుద్వయ క్షౌరము 2×2=4 మాసములకు ఒకసారి | క్షౌర విధి ఏదీ లేదు. (లేక) ఆయన క్షౌరము (6 నెలలకు ఒకసారి) | క్షౌర విధి లేదు. (లేదా) ఆయన క్షౌరము | క్షౌర విధి లేదు (లేదా ఆయన క్షౌరము) | క్షౌర విధి లేదు (లేదా) ఆయన క్షౌరము |
| 4) భోజనము | ఏకాన్నము (ఒకే ఇంటిలో భోజనము చేయవచ్చు) | మధూకరము (భిక్షక పాత్ర లో భిక్ష స్వీకరించటము) | కరపాత్ర భిక్ష (రెండు అరచేతులకు పట్టినంత ఆహారము భిక్షగా పుచ్చుకోవటము) | కరపాత్ర భిక్ష (రెండు అరచేతులకు పట్టినంత ఆహారము భిక్షగా) | "గోముఖ వృత్తి" (గోవు గృహములకు వెళ్లి లభించినది ఆహారముగా పుచ్చుకోవటము వలె) | "అజగర వృత్తి" (కొండ చిలువవలె (ఉన్నచోటనే వుండి తనను సమీపించిన ఆహారము తీసుకొనుట) |
| 5) శాటీ (యతుల వస్త్ర / దుప్పటి) | శాటీ ద్వయము (రెండు వస్త్రములు మాత్రమే కలిగి ఉండటము) | ఏకశాటీ (ఒక్క వస్త్రము మాత్రమే) | వస్త్ర ఖండము (ఒక వస్త్రపు ముక్క) | దిగంబరము (లేక) ఏక కౌపీనము (ఒకే గోచీ) | జాతరూపధరత్వము (దిగంబరత్వము) (లేదా) జింక చర్మము, (ఇతరుల జింక చర్మము ధరించరాదు) | జాతరూపధరత్వము (దిగంబరత్వము) (లేదా) జింకచర్మము, (బహూదక, హంస, పరమహంసల జింక చర్మము ధరించరు) |
| 6) అర్చన విధి | దేవతలను అర్చించటము (దేవతార్చనము) | దేవతార్చనము | మనస్సుతో అర్చనము (మానసార్చనము) | మానసార్చనము | "సోఽ హమ్" భావనార్చన | "సోఽ హమ్" భావనార్చన |
| 7) జప విధి | 'మంత్రము' ఏదైనా జపించు అధికారము | మంత్రజపాధికారము | 'ధ్యానము'నకు అధికారము | 'ధ్యానము'నకు అధికారము | 'స్వస్వరూపానుసంధానము' (అనన్యోపాసన, ఆత్మోపాసన) అన్యమంత్రోపాసన ఉండదు | 'స్వస్వరూపానుసంధానము' (అనన్యోపాసన, ఆత్మోపాసన) అన్యమంత్రోపాసన ఉండదు |

| | కుటీచక యతి (1) | బహూదక యతి (2) | హంస (3) | పరమహంస (4) | తురీయాతీతుడు (5) | అవధూత (6) |
|---|---|---|---|---|---|---|
| 8) ఉపదేశ అధికారము (మహావాక్యోపదేశ అధికారము) | ఇతరులకు మంత్రోపదేశము చేసే అధికారం లేదు. (మహావాక్యోపదేశ అధికారము లేదు) | అనన్య ఉపదేశ అధికారః ఇతరులకు మంత్రోప దేశము చేసే అధికారము లేదు. (మహావాక్యోపదేశ అధికారము లేదు) | న అన్యస్య ఉపదేశ అధికారః (మహావాక్యో పదేశము చేయు అధికారము లేదు) | 'మహావాక్యోపదేశ అధికారము' కలిగి ఉంటారు | 'మహావాక్యోపదేశ అధికారము' కలిగి ఉంటారు. | 'మహావాక్యోపదేశ అధికారము కలదు |
| 9) ప్రణవము | మానుష ప్రణవము (బాహ్య ప్రణవము) (బాహ్యోపాసన) | మానుష ప్రణవము | అంతర ప్రణవము (అంతరాభ్యాసము) | అంతరప్రణవము (అంతరాభ్యాసము) | బ్రహ్మ ప్రణవము (స్వస్వరూపముతో సహా సమస్తము బ్రహ్మముగా భావించి ఉపాసించటము) | బ్రహ్మ ప్రణవము |
| 10)ముఖ్యసాధనము | శ్రవణము (వినటము) | శ్రవణము (వినటము) | మననము (అనుకోవటము) | మననము (అనుకోవటము) | నిది ధ్యాస (అనిపించటము) | నిది ధ్యాస (అనిపించటము) |

ఒకడు బ్రహ్మచారి అయినా, గృహస్థుడైనా, వానప్రస్థుడైనా, సన్న్యాసి అయినా కూడా, లేక మరెవరైనా కూడా అందరికి పరమాత్మతత్త్వము సిద్ధించుకోవటానికై రెండు ముఖ్యమైన సూత్రములు అనుసరించాలి. అవి అధ్యయనశీలురందరికీ ఉపాయములు.

1) **సర్వేషాం ఆత్మానుసంధానమ్ విధిః ఇత్యేవం ముముక్షుః ।** అందరికీ కూడా ఆత్మతో "అనుసంధానమే" ముఖ్యమైన విధి (తప్పక నిర్వర్తించవలసినట్టిది). (ఆత్మ అనగా ? జాగ్రత్ పరిమితమైన "నేను" కాదు. "జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు నా కల్పన" అయినట్టి, జన్మ – కర్మలకు కారణ భూతమగు ప్రతిఒక్కరిలోని **"సమస్తము నావైన నేనైన నేను".**

**2) సర్వదా సంసారతారకం। తారకం అనుస్మరన్– జీవన్ముక్తో వసేత్ । అధికార విశేషేణ ప్రాప్తుః ఉపాయమ్ అనిష్యేత్ – ఇతి।** **'**దృశ్యమునకు పరిమితమై ఉండటము' అనే వ్యసనము (లేక) సంసారము నుండి విముక్తికై, తరింపజేయు మననము (తారక మంత్రమును) ఆశ్రయించాలి.

ప్రతి ఒక్కరు కూడా, వారి వారి అభిరుచి – అభ్యాసములను సమర్థతా సాధ్యములను అనుసరించి ఏదో ఒక ఉపాయంతో (లేక) ఆయా కొన్ని ఉపాయముల సహాయముతో 'మోక్షము' అను 'ఆత్మ' గురించిన అవగాహనా రూపమగు జీవన్ముక్తిని సిద్ధించుకోవాలి. **(తారయత – ఇతి తారకమ్, తరింపజేయునది తారకము)**

**జీవన్ముక్తుడు :** జీవిస్తూనే ఆత్మతత్త్వము దృష్ట్యా ఈ జగద్వ్యవహారములన్నీ ఆత్మగా గ్రహిస్తూ, తనకు ఎందుకు స్వతఃగా బంధనలు కావో గ్రహిస్తూ, ఆలోచనా రూపమగు మనస్సు తనకు ఉపకరణము అగునట్లు అభ్యాసము చేసి సమస్తము తానే అను సిద్ధిని పొందుచున్నవాడు.

***ఇతి సప్తమ (7వ) ఉపదేశము.***

---

# అష్టమ (8వ) ఉపదేశము

**శ్రీ నారదుడు :** హే పరమేష్ఠీ! బ్రహ్మ భగవాన్! మాపై ప్రసన్న హృదయులై అమృత వాక్కులు కురిపిస్తున్నారు. "సంసారతారకము"ను ప్రస్తావిస్తూ ఉన్నారు.

స్వామీ ! ఇప్పుడు మాకు "సంసారతారకము" (సంసారము నుండి తరింపజేయనది) అగు విచారణ – ఉపాసనల గురించి చెప్పండి. మాపై అనుగ్రహముతో "మేము ఏ ఏ విషయాలు ఉపాయాలుగా స్వీకరించి సంసార శృంఖలముల నుండి విడివడగలమో – మార్గము చూపండి.

**శ్రీ బ్రహ్మ భగవానుడు :** కేవలుడు, సర్వాత్మకుడు అగు పరమాత్మ (లేక) పరబ్రహ్మ పురుషుడు 'ఓం' అను శబ్ద – మహార్థ "సంజ్ఞ" చే వేదవాఙ్మయము సూచిస్తోంది. అట్టి 'ఓం' ప్రణవము అ + **'ఉమ'** అను విధంగా రెండు విశేషాలుగా కలిపి ఉన్నట్టిది.

**ద్రష్ట** – దృశ్యము

**అనుభవి** – అనుభవములు

**కేవలుడు** – సందర్భములు

**పురుషుడు** – ప్రకృతి

ఈ ప్రకారంగా విభాగించి విశ్లేషించబడుతోంది. ఈ విధంగా వ్యష్టి సమష్టి ప్రకారముగా విభాగిస్తూ 'బ్రహ్మము' గురించిన అనుస్మరణము కొరకై శాస్త్రములచే బోధించబడుతోంది.

**శ్రీ నారద మహర్షి :** అట్టి శాస్త్ర బోధ హృదయమునకు సంబంధించిన **"వ్యష్టి" అనగా ఏమి ? "సమష్టి" అనగా ఏమి?**

**శ్రీ బ్రహ్మ భగవానుడు :** వివరిస్తున్నాను. శ్రద్ధగా అందరూ వినండి. ప్రణవము సర్వదా ఏకము అక్షరము అయి ఉన్నది. అయితే అది మొట్ట మొదటగా శిష్యుల (విద్యార్థుల అవగాహనను ఉద్దేశ్యించి) – "మూడు" విధములుగా కూడా విభజించి చెప్పబడుతోంది.

**1) సంహార ప్రణవము**
**2) సృష్టి ప్రణవము** — **బ్రహ్మప్రణవము**
**3) అంతర్బహిశ్చ ఉభయాత్మకాత్ ప్రణవము**

**సృష్టి ప్రణము :** — అంతర ప్రణవము / బహిర్ప్రణవము

**అంతఃప్రణవము –** బ్రహ్మప్రణవము

**బాహ్య ప్రణవము –** వ్యావహారిక ప్రణవము

**'ఓం' పంచవిధ ప్రణవము**

| అంతః ప్రణవము | వ్యావహారిక ప్రణవము | బాహ్య ప్రణవము | ఆర్ష ప్రణవము | ఉభయాత్మక ప్రణవము | → విరాట్ ప్రణవము |
|---|---|---|---|---|---|

**సంహార ప్రణవో**
**బ్రహ్మణ ప్రణవో** — *'ఓం' ప్రణవము – ఇతి ఏకాక్షరం మంత్రము*
**అర్ధమాత్ర ప్రణవో**

**'ఓం' అష్టవిధ ప్రణవము**

**ఓం (అష్ట దర్శనములు) :** 1) 'అ'కారము 2) 'ఉ'కారము 3) 'మ'కారము 4) అర్ధమాత్ర 5) నాదము 6) బిందువు 7) కలా 8) శక్తి

**సంహార ప్రణవ బ్రహ్మమాత్ర ప్రణవములు :** అర్ధమాత్రమై ఉంటాయి.

-----

**వ్యవహారిక ప్రణవము :** సాధారణముగా మానవులచే జపించబడేది. అందుచేత **'మానుష ప్రణవము'** అంటారు.

**బాహ్య ప్రణవము :** భేరీ, స్వరము, నినాదము మొదలైనవాటితో కూడిన శబ్ద రూపము.

**ఆర్ష ప్రణవము :** మాత్రా గణయుక్తంగా / విధిగా స్వరయుక్తంగా మహర్షులు చెప్పు ప్రణవము – 'ఆర్షప్రణవము'

-----

***అంతః ప్రణవము '8' విధములు***

1) 'అ'కారము – పదివేల అవయవములతో కలసి ఉన్నది.
2) 'ఉ' కారము – వెయ్యి అవయవములతో కూడి ఉన్నది.
3) 'మ'కారము – నూరు అవయవములతో ఏర్పడినదై ఉన్నది.
4) అర్ధమాత్ర – అనంతమగు అవయవములు.

**విరాట్ ప్రణవము :** సగుణమైనది, ప్లుతము (Mix up)

**సంహార ప్రణవము :** నిర్గుణమైనది, ప్లుతకాలీనము

**సృష్టి ప్రణవము :** సుగుణ నిర్గుణ స్వరూపము, ప్లుత (Mixed) రూపము

**(ప్లుతమునకు – 3 మాత్రలు. విరాట్ ప్రణవమునకు 14 మాత్రలు)**

## షోడశ మాత్రాత్మకత్వము

**శ్రీ నారదమహర్షి :** భగవాన్ ! ప్రజాపతీ ! 'షోడశ మాత్రాత్మకము' అని వేటిని అంటున్నారు.

**బ్రహ్మ భగవానుడు :** ఈ జీవుడు 'షోడశకళాత్మకుడు' అని చెప్పబడుచున్నాడు.

1) 'అ'కారము 2) 'ఉ'కారము 3) 'మ'కారము 4) అర్ధమాత్ర 5) నాదము 6) బిందు 7) కలా 8) కలాతీకము (సాక్షి) 9) శాంతి 10) శాంత్యతీతా 11) ఉన్మనీ 12) మనోన్మనీ 13) పురీ 14) మధ్యమా 15) పశ్యంతీ 16) పరా

ఈ 16 కూడా 'స్థూల – సూక్ష్మ – బీజ – తురీయములు' అనే నాలుగు భేదములతో 16×4=64 మాత్రలుగా అగుచున్నాయి.

ఇవి మరల 1) ప్రకృతి (Experiences) సంబంధమైన – 64 2) పురుష (Experiencer) సంబంధమైన–64, మొత్తము 128 బేధములతో నిండిన మాత్రా స్వరూపములు.

ఈ 128 భేదములు మాత్రాస్వరూపము పొందినవై 1) సగుణ 2) నిర్గుణ రూపములు దాల్చుచున్నాయి.

## బ్రహ్మ ప్రణవము

బ్రహ్మ ప్రణవము సర్వదా ఏక రూపమే. అట్టి బ్రహ్మమే సకల జగత్తుకు భూత – వర్తమాన – భవిష్యత్‌లో మార్పు చెందు 'జ' (జనించు), 'గత్' – గతించు దానికి ఆధారము అయి ఉన్నది.

అట్టి సర్వాధారము అయిన బ్రహ్మము →

– **పరంజ్యోతి** (Absolute Enlightenment) స్వరూపము.

– సర్వముగా విస్తరిస్తూ, సర్వమును పరిపాలిస్తూ **సర్వేశ్వర రూపముగా** ఎరుగబడుచున్నది.

– అదియే **సర్వదేవతలకు నిలయము.**

– అది ఈ **సమస్త ప్రపంచము తన యొక్క గర్భమున కలిగి ఉన్నట్టిది.**

పరబ్రహ్మము ఇంకా కూడా ....,

- సర్వ అక్షర (మార్పు చెందని) కాల స్వరూపము. (కాలములో మార్పులేదు. భూత – వర్తమాన – భవిష్యత్తులు కాలమునకు ప్రదర్శనా చమత్కారములు (Exhibitive features).
- సర్వ వేదములతో శివ (శుభ) స్వరూపమై వెలుగొందుచున్నది. తెలియబడేదంతా అదియే.
- సకల శ్రుతుల (ఉపనిషత్తుల) చే ఎలుగెత్తి ఉత్తమ స్థానముగా గానము చేయబడుచున్నది. (వివరించబడుతోంది). వెతకబడి గుర్తించబడుతోంది (మృగ్యం).
- త్రికాలములలో మార్పు చేర్పులు లేనిదై యున్నది. ('నేను' అనేది మారటము లేదు కదా!) అవ్యయము.

  అట్టి సమస్త జీవుల, సమస్త జగత్తుల స్వస్వరూపమే అయి ఉన్న ఆత్మయే (లేక) పరబ్రహ్మమే 'ఓం' కారముగా మోక్ష ప్రదాయకముగా విజ్ఞులు చెప్పుచూనే ఉన్నారు.
- అదియే 'ఆత్మ' అని ఏతత్ 'బ్రహ్మము' అని జాగ్రత్ స్వప్న సుషుప్తుల సాక్షి అగు 'నేను' అని అభివర్ణించబడుతోంది.

ఓ నారదా ! అట్టి నీ యొక్క, నా యొక్క, సమస్త జీవుల యొక్క ఆత్మ ఎటువంటిదంటే ...,

- **అమృతము** (మృత్ / మార్పు ధర్మము) లేనట్టిది.
- **అజరమ్** (శిథిలము కానట్టిది)
- అది అనుభూతిగా పొందినవాడు తానే అదిగా స్వానుభవమగుచున్నాడు. **తదేవాహమ్**
- **'ఓం'కారము** అనగా ఆత్మయే!

ఈ శరీరము ఉన్నప్పుడే అట్టి 'ఓం' కార సంజ్ఞార్థమగు ఆత్మతో తన్మయత్వము పొందాలి సుమా! ఇప్పటికిప్పుడే త్రిశరీరములకు (జాగ్రత్ – స్వప్న – సుషుప్తి రూపములకు) ఆవల గల అత్మయే పరబ్రహ్మమని, 'అట్టి ఆత్మయే నేను' అని ఈ జీవుడు వినిశ్చయుడు (సునిశ్చయుడు) కావాలి. అట్టి పరబ్రహ్మస్వరూపముతో ఈ విశ్వము, ఇందలి సమస్త విషయ – విశేషములను 'అనుసంధానము' (Wel-connected) చేసి వేయాలి.

1) స్థూలత్వము చేత స్థూల పురుషుడుగాను,
2) సూక్ష్మత్వముచే సూక్ష్మ పురుషుడుగాను,
3) ఐక్యత్వముచే ఐక్యతానంద భోగపురుషుడుగాను,
4) ఈ మూడింటికి సాక్షిగా తురీయ పురుషుడుగాను '4' విధములుగా అగుచున్న ఆత్మ పురుషుడను 'నేనే' అని సుస్పష్టముగా, నిర్దుష్టముగా గ్రహించబడు గాక.

'ఆత్మ భగవానుని నాలుగు పాదములే జాగ్రత్ – స్వప్న – సుషుప్తి – తురీయములు' విశ్వుడుగా, తేజసుడుగా, ప్రాజ్ఞుడుగా, తురీయుడుగా సమస్తమును ఆస్వాదించుచున్నది ఆత్మ పురుషుడే! ఆత్మ పురుషుని లీలా, క్రీడా, వినోద చమత్కారమే ఇదంతా.

**శ్రీ నారద మహర్షి :** హే పరంధామా ! పరబ్రహ్మము యొక్క నాలుగు పాదముల గురించి మరికొంత వివరించండి.

**శ్రీ బ్రహ్మ భగవానుడు :** ఈ విశ్వమంతా తన ప్రత్యక్ష రూపమై, సమస్త జీవులలోను, సమస్త లోకములలోను 'అంతర్యామి' అయి విస్తరించియున్న ఆత్మ భగవానునికి '4' పాదములు.

## నాలుగు పాదములు

**1) ప్రథమ పాదము : విశ్వజిత్ – స్థూలభుక్ – వైశ్వానరః** ఈ విశ్వమే వైశ్వానర పురుష రూపముగల ఆయనకు :

**19 ముఖములు :** 1) చర్మము (త్వక్) (స్పర్శ) 2) చక్షువులు (కళ్లు) (చూపు) 3) శ్రోత్ర (చెవులు) (వినికిడి) 4) జిహ్వా (నాలుక) (రుచి) 5) ఘ్రాణము (ముక్కు) (గాలి పీల్చుట) (వాసనానుభవము) 6) వాక్కు (పలుకుట) 7) పాణి (చేతులు) 8) పాదము (నడక) 9) పాయువు (విసర్జనము) 10) ఉపస్థ (స్త్రీ పురుషుల రహస్యావయములు)

**(ఇవి 5 కర్మేంద్రియములు + 5 జ్ఞానేంద్రియములు = 10)**

11) ప్రాణము 12) అపానము 13) వ్యానము 14) ఉదానము 15) సమానము – **(ఇవి పంచ (5) ప్రాణములు)** 16) మనస్సు 17) బుద్ధి 18) చిత్తము 19) అహంకారము **(అంతరంగ చతుష్టయము)**

**అష్టాంగములు :**1) విశ్వుడు (జాగ్రత్ పురుషుడు) 2) తైజసుడు (జాగ్రత్ స్వప్న పురుషుడు) 3) ప్రాజ్ఞుడు (జాగ్రత్ ప్రాజ్ఞ పురుషుడు) 4) తురీయ పురుషుడు (జాగ్రత్ తురీయుడు)

4×2 (అనుభవి + అనుభవమగునది) = 8

పై 19 ముఖములకు '8' అంగములకు ప్రభువు, స్థూలానుభవి, చతురాత్మా – విశ్వో వైశ్వానర పురుషుడు. ప్రథమ పాదము. ఈయన జాగ్రత్‌ను పాలిస్తున్న ప్రభువు.

**2) ద్వితీయ పాదము : తైజసో వైశ్వానర పురుషుడు**

ఈయన స్వప్న స్థానమును పరిపాలించు ప్రభువు. సూక్ష్మ ప్రజ్ఞాసమన్వితుడు. హిరణ్యగర్భుడు. స్థూలమునకు అంతుడు (ఆవలివాడు) ఈయన ద్వితీయ పరమ పురుషుని ద్వితీయపాదము.

**3) తృతీయ పాదము – సుషుప్తి వైశ్వానర పురుషుడు :**

ఎప్పుడైతే జీవుడు గాఢ నిద్రను ఆశ్రయించినవాడై,

- జాగ్రత్‌వలె ఏ కామము కామించక (కోరుకోక) ఉంటాడో (ఏ కోరికా కలిగి ఉండడో)
- స్వప్న దృశ్యము కూడా దర్శించడో

అదియే **'సుషుప్తి'** అనబడు మూడవ పాదము. అట్టి స్థితిలో ఈ జీవుడు దేనితోను ఏ భేదము దర్శించక సుషుప్త స్థితుడై, కేవలమగు ప్రజ్ఞ (ఘనీభూతమైన ప్రజ్ఞ, ప్రజ్ఞాన ఘనుడు) అయి ఉంటాడు. స్వాత్మతో కూడుకొని నిత్యానందమయుడై ఉంటాడు. అయితే ప్రజ్ఞచే సర్వ జీవ – అంతర స్థితుడై ఉంటాడు. చతురాత్మేశ్వరునికి ఇది మూడవ పాదము.

**ఈ సుషుప్తి ప్రాజ్ఞ పురుషుడు:**

- జాగ్రత్ – స్వప్నములు తన యొక్క విస్తరించిన రూపములు కాబట్టి **"సర్వేశ్వరుడు".**
- జాగ్రత్ స్వప్నముల తత్త్వము ఎరిగినట్టి **'సర్వజ్ఞుడు'** .
- సమస్త అంతరంగ సూక్ష్మ భావనలకు **'అంతర్యామి'.**
- సమస్తము ప్రభవించటానికి **'యోని స్థానము'.** (The zone where from all else emanates)

త్రయీ భూతములకు (జంతు – మానవ – దేవతా జీవులకు) జాగ్రత్ స్వప్న సుషుప్తులు సంచారము చేయు స్థానములు. ప్రతి ఒక్కటి మిగిలిన రెండింటిని బాధించునదై (వాటిని తొలగించుచు తాను ఆక్రమించునదై) ఉంటోంది.

**" జాగ్రత్ గాని, స్వప్నము గాని, సుషుప్తి గాని మాయామాత్రమే। ఆత్మకు స్వయం కల్పిత కల్పనా చమత్కారములే। ఊహలో ఏర్పడి లయించునవే"** అని ఆత్మతత్త్వ శాస్త్రజ్ఞులచే సిద్ధాంతీకరించబడుతోంది.

**4) చతుర్థ పాదము – తురీయ పురుషుడు :**

ఈ తురీయ పాదము "ప్రత్యగాత్మ' – అనబడుతోంది.

- (జాగ్రత్, స్వప్న, సుషుప్తులకు వేరై, ఆ మూడు తనవైనట్టి సాక్షీ ప్రజ్ఞ కాబట్టి).
- ఇది సత్ (ఉనికి) – చిత్ (ఏక) ఏకరస రూపము – అవ్యయమైనది (మార్పు – చేర్పుల దశలకు సంబంధించనది)
- అట్టి తురీయము ఏకము, అక్షరము, అఖండము, సర్వజీవులలో సమస్వరూపము.

-----

జాగ్రత్ స్వప్న సుషుప్తి (3) అవస్థలు పరిశీలించి అధ్యయనము చేస్తూ ఉన్నప్పుడు మూడు వికల్పములు జనిస్తూ ఉన్నట్లు గమనించబడుతోంది.

| | | |
|---|---|---|
| 1) జ్ఞాత | – | One who is knowing |
| 2) అనుజ్ఞాత | - | The knower of the knower |
| 3) అననుజ్ఞాత | – | The Non-knower of the knower |

ఇంతకుముందే మనము చెప్పుకొన్న తీరుగా విశ్వ – తైజస వ్యవహారములన్నీ కూడా సచ్చిదానందరూపుడగు తురీయ పురుషుని సమక్షంలో వికల్ప – అవిద్యా కల్పితములే.

**"జాగ్రత్ – స్వప్నములు మాయా కల్పితములు"** అని గమనిస్తూ **సచ్చిదానందరూపమగు 'తురీయ పురుషుడే నా నిజరూపము – నా సహజ రూపము'** – అని గమనించబడు గాక. ఓ మునీశ్వరా ! నారదా ! అట్టి తురీయ రూపము గొప్పదగు స్థూల ప్రజ్ఞ కాదు (జాగ్రత్‌గా అవటంలేదు). సూక్ష్మ ప్రజ్ఞ కూడా కాదు (స్వప్న దృశ్యము ప్రవేశించునదీ కాదు). అత్యంతమగు సుషుప్త ప్రజ్ఞా రూపము కూడా కాదు.

ఓ మునీశ్వరా ! నారదా ! అది 'ప్రజ్ఞరూపము' అని చెప్పవీలుకాదు. **'అప్రజ్ఞారూపము'** కూడా కాదు.

అట్టి తురీయము కళ్లకు కనిపించని (అదృష్టమగు) ప్రజ్ఞాన ఘనము అనబడుతోంది.

అట్టి తురీయము "ఇట్టి లక్షణములు కలది" అని చెప్పలేము. అందుచేత **అలక్షణము.**

**'తురీయము'** అనునది ఇంకా కూడా ...

- ఇంద్రియములకు విషయమై లభించేది కాదు. **'అగ్రాహ్యమ్'।**
- లౌకిక వ్యవహారము వంటిది కాదు. **'అవ్యవహార్యమ్'।**
- చింతన చేయటానికి చింతించే విషయం వంటిది కాదు. **'అచింత్యమ్'।**
- మాటలతో ఒకడు మరొకరికి ఒక 'వార్త' వలె చెప్పగలిగేది కాదు. **'అవ్యపదేశ్యమ్'।**
- అది అనేకముగా అవటమే లేదు. సర్వదా ఏకమే అయి ఉన్నది. **'ఏకాత్మమ్'।**
- ఏకమే అయి సర్వదా ప్రసిద్ధి అయిన సారము (The essence of all studies). **'ప్రత్యయసారమ్'।**
- ఈ కనబడే ప్రపంచమంతా ఉపశమము పొందు స్థానము. **'ప్రపంచోపశమమ్'।**
- పరమ శాంత స్వరూపమైనది. **'శాంతమ్'।**
- అద్దానికి ద్వితీయమైనదే ఏ మాత్రము ఎక్కడా లేనట్టిది. **'అద్వైతమ్'।**
- అది జాగ్రత్ స్వప్న సుషుప్తులకు ఆవలిది. నాలుగవది. **చతుర్థం మన్యంతే।**

**అదియే బ్రహ్మప్రణవము.** అట్టి బ్రహ్మమే ఎవ్వరికైనా సర్వదా తెలుసుకోవలసి ఉన్నట్టిది. అది మముక్షువులకు (ఆత్మ గురించి తెలుసుకొని, మోక్షము పొందాలనే ఆశయము కలవానికి) పరమం (అన్యము) అయినట్టిది కాదు. సూర్యకాంతివలె సర్వత్రా వెలుగొందుచున్నట్టిది. ముముక్షువులందరికి ఆధారమైనట్టిది. అట్టి బ్రహ్మకాశమే స్వయం జ్యోతి స్వరూపమై సర్వత్రా విరాజిల్లుచున్నది.

*అది 'పరబ్రహ్మము' అను శబ్దముచే స్తుతించబడుతోంది.*

***తదేవ పరబ్రహ్మస్వరూపమ్***

***ఇతి అష్టమోపదేశః***

# (9) నవమ - ఉపదేశము

**శ్రీ నారద మహర్షి :** తండ్రీ ! అట్టి పరబ్రహ్మస్వరూపము ఎటువంటిదో, మరికొంత వివరించి చెప్పండి. పరబ్రహ్మమును మేము ఎట్లా ఏఏ ప్రయత్నములచే సిద్ధించుకోవాలి ? అద్దాని స్థానము ఏది ? అది సులభమేనా ?

**శ్రీ బ్రహ్మ భగవానుడు :** ఓ నారదా ! సమస్త శ్రోతలారా ! బిడ్డలారా ! పరబ్రహ్మము గురించి ఒక ముఖ్యమైన విషయము ప్రస్తావిస్తున్నాను. ఉత్తమమైన, నిర్మలమైన, సునిశితమైన బుద్ధిశాలురై వినండి. విస్తారమైన బుద్ధితో అవగాహన చేసుకోండి.

**'కిం బ్రహ్మస్వరూపం' - ఇతి అన్యో అసావన్యో అహమస్మి - ఇతి యే విదుః తే పశవో ।** ఎవరైతే 'బ్రహ్మము ఎక్కడో ఉన్నది. నేనేమో మరెక్కడో ఉన్నాను. అది ఇంకా ఎప్పటికో నేను సిద్ధించుకోవలసి ఉన్నది" అని అనుకుంటూ "అద్దాని కొరకు ఎప్పటికో వెళ్ళాలి. ఏదో చేయాలి" అని భావిస్తూ ఉంటారో, వారు అజ్ఞాని అగు పశువుతో సమానము, మృగప్రాయులు, సత్యమును ఆశ్రయించువారు కారు.

**న స్వభావ పశవః – తమేవం జ్ఞాత్వా –విద్వాన్ మృత్యు ముఖాత్ ప్రముచ్యతే । న అన్యః అయనాయ విద్యతే।** ఎవ్వరైతే "నేను బ్రహ్మమే అయి ఉన్నాను. అయితే, అనేక జన్మల దురభ్యాసవశంగా నా బుద్ధి దోష భావములచే కప్పబడి ఉన్నది. ఇప్పుడు ధ్యాసను దృశ్య విషయముల నుండి వెనుకకు మరల్చి, బుద్ధిని నిర్మలము చేసుకొని ప్రయత్నములచే "నేనే బ్రహ్మమును" అను నిజస్వరూప సత్య భావనను ఉత్తమ బుద్ధితో తిరిగి సిద్ధించుకోవాలి ... అని తలచి, ప్రయత్నశీలుడైనవాడు – పశువు అవడు. మృగప్రాయుడు కాడు. "ఆత్మ అనగా సహజమగు స్వస్వరూపమే' అని ఎరుగుచూ, తత్ వ్యతిరిక్త భావములు జయిస్తూ ఉన్నవాడు – తప్పకుండా మృత్యుముఖము నుండి విముక్తుడు కాగలడు.

**"నాకు ఆత్మగా బంధమే లేదు"** అను నిశ్చల, నిర్మోహ, అసంశయ స్థితి రూపమగు మోక్షము సిద్ధించుకోవటానికి ఇంకా వేరే త్రోవ ఏదీ లేదు. (మోక్షము అనగా ఏదో లోకమునకు వెళ్లటము వంటిది కాదు).

**శ్రీ నారదమహర్షి :** పితృదేవా ! ఈ జీవుడు నిజ స్వరూపంగా పరమానందమగు బ్రహ్మమే అయి ఉన్నాడు కదా ?

**శ్రీ బ్రహ్మ భగవానుడు :** అవును. అందులో సందేహమే లేదు. ఈ జీవుడు స్వతఃగానే బ్రహ్మానంద స్వరూపుడు.

**శ్రీ నారద మహర్షి :** అట్టి బ్రాహ్మీ స్వరూపుడగు ఈ జీవునికి దుఃఖము అనేక భ్రమలతో కూడిన జన్మ–కర్మలు ఎక్కడి నుండి వచ్చిపడుచున్నాయి ? కాలము వలననా ? స్వభావమా ? నియతియా ? యాదృచ్ఛికమా ? యోని ప్రవేశము పొంది పాంచభౌతిక స్వీకారము చేయటము వలననా ? జీవాత్మత్వకారణంగానా ? మరింకేదైనా కారణము ఉన్నదా ? ఈ జగత్తే కారణమా ? జగత్తుకు కాలము మొదలైనవేవైనా కారణమా ?

**శ్రీ బ్రహ్మ భగవానుడు :** ఈ జగత్తుకు కాలము మొదైలనవి ఏవీ కారణము కానే కాదు.

**కాలము :** "భూతకాలము వర్తమానానికి, వర్తమానము భవిష్యత్తుకు కారణము అగుచున్నాయి" అనునదంతా అల్పకాలిక సందర్భ సత్యము కావచ్చునేమో గానీ, అసలైన పరమ సత్యము కాదు. (క్రితం జన్మల కాలవ్యవహారములు ఈ జన్మకు, ఈ జన్మలోని కాలవ్యవహారాలు కారణము... అనునదంతా కల్పనయే గానీ – అసలైన సత్యము కాదు). ఎందుకంటే ఈ జీవుడు కాలముచే మార్పు చెందని 'ఆత్మ' స్వరూపుడు కాబట్టి!

**స్వభావము :** ఈ జగత్తు, అనుభవి అగు జీవాత్మ – ఈ రెండూ స్వాభావికంగా (In its natural way) ఏర్పడుచున్నాయి. అనునది కూడా నిజము (సత్యము) కాదు. స్వభావము ఉండాలంటే ఆ స్వభావము తనదైనవాడు ఒకడు వుండాలి కదా ? స్వభావి లేకుండా స్వభావము ఎట్లా ఏర్పడుతుంది ? అందుచేత "ఇదంతా స్వాభావికము" అనునది కూడా సత్యము కాదు. "ఈ స్వభావము తనదైనవాడు ఎవడు ?" అనేది 'స్వభావ సిద్ధాంతము' ధృవీకరించటము లేదు.

**నియతి :** "ఇదందా ఒకానొక నియతి. (It is all destined to so happen). అంతేc! అంతకుమించి వేరే కారణము లేదు" అనునది కూడా సత్యము కాదు. "నియతి తానంతటి అదే ఎందుకు ఎట్లా నియమితము అవుతోంది ? ఈ జగత్ సంబంధములు, శరీర ధర్మములు ఎవరి కొరకు, ఏ ఉద్దేశ్యముతో నియతి నియమిస్తోంది ?" అనునది నియతి సిద్ధాంతము చెప్పటం లేదు. కనుక 'నియతి' అనుననది కూడా సత్యము కాదు (లేక) సమగ్రము కాదు.

**యాదృచ్ఛికము :** 'ఈ జగత్తుకు ఎవ్వరూ కర్త లేకుండానే యాదృచ్ఛికంగా (very accidentally without any cause or anybody's intention behind the same) ఏర్పడుచున్నది – అనునది కూడా సత్యము కాదు. ఈ కళ్లలో చూపు, కాళ్లలో నడిచే శక్తి, చెవులలో వినికిడి శక్తి, దృశ్య వ్యవహారాలలో కార్య – కారణాలు – ఇవన్నీ అకస్మాత్తుగా ఎట్లా ఏర్పడతాయి. దీని వెనుక ఒక తెలివి, నిర్మాణ విధానము, తెలివికలవాడు ఉండాలి కదా ? కనుక జగత్తుకు యాదృచ్ఛిక సిద్ధాంతము సరిపోదు. విచారణ సంపూర్తి అవజాలదు.

**భూత యోని :** ఇదంతా కూడా భూమి – జలము – అగ్ని – వాయు – ఆకాశముల సంయోగ వియోగములు మాత్రమే. (This is all the integration and Dis-integration of five factors called Solid, Liquid, Heat, Gas and Space) – అనునది కూడా పరాకాష్ట కాదు. పంచ భూతముల రకరకాల పాళ్ల కలయికచే పదార్థ ధర్మాలు ఎట్లా ఏర్పడుచున్నాయి ? శరీరంలో శబ్ద – స్పర్శ – రూప – రస – గంధ అనుభవాలు, వాటివలన ఇష్ట – అయిష్టాలు ఎట్లా ఏర్పడుచున్నాయి ? కనుక జగదనుభవ – అనుభవిలకు "భూతయోని" సిద్ధాంతము కూడా పూర్తిగా చెప్పలేకపోతుంది.

**పురుషుడు (జీవుడు) :** *"జీవుడు, అతని జీవన విధానము కొరకే జగత్తు ఏర్పరచబడుతోంది"* అనునది కూడా పూర్ణమగు సిద్ధాంతము కాదు. అప్పుడు *"ఈ జీవుడు శరీరము జనించటానికి మునుముందే ఉన్నాడా ? అతని దేహ ప్రదర్శనము ఎందుకు ఏర్పడియే ఉంటోంది ? జీవుడు ఎవరి అభిరుచి, అభిప్రాయము, ఉద్దేశ్యముల ప్రకారము జనిస్తున్నాడు?"* అనునది సమాధానము లభించటము లేదు.

**సంయోగ – వియోగములు :** జీవుడు – పదార్థముల (The experiences and matter) ల సంయోగము – వియోగము కారణంగా ఈ జగత్తు ఏర్పడుతోంది " – అను సిద్ధాంతము కూడా సమగ్రము కాదు. "ఎవరి తెలివిచే ఈ సంయోగ – వియోగములు ఏర్పడి, వాటి వలన జీవునికి సుఖ–దుఃఖములు రూపుదిద్దుకుంటున్నాయి?" అను ప్రశ్న మిగిలియే ఉంటోంది.

ఈ జీవుడు స్వయముగా సుఖ దుఃఖములకు హేతువు కాదు. మరి జీవ – జగత్తుల అనుభవ ప్రదర్శనమునకు కారణము ఎవరు ?

## అద్వితీయుడగు పరమాత్మ

ఈ జీవుని స్వస్వరూపమే అయినట్టి, (తనకు ద్వితీయమే లేనట్టి) 'అద్వితీయుడు' అగు 'పరమాత్మ' యొక్క లీలా, క్రీడా, వినోద కల్పనయే ఈ 'జగత్తు' అనబడు అనుభూతి స్వరూపము (Form of experience) కు కారణము, కార్యము కూడా. ఆయన యొక్క స్వకీయమైన నియతి (లేక) నియామకమే ఈ 'జగత్' భావనా అనుభవముగా అగుచున్నది. అట్టి పరమాత్మయే సమస్త సుఖ–దుఃఖములకు కూడా హేతువు.

**తే ధ్యానయోగాత్ – అనుగతా అపశ్యన్, దేవాత్మశక్తిం స్వగుణైః నిగూఢామ్।** "ఇదంతా కూడా 'స్వస్వరూపాత్మ' యొక్క నిగూఢమగు స్వగుణరూప శక్తి ప్రదర్శనమే" అని ధ్యానయోగము ఆశ్రయించిన తత్త్వజ్ఞులగు మహనీయులు సిద్ధాంతీకరించి చెప్పుచున్నారు.

అట్టి బ్రహ్మకి (బ్రహ్మశక్తి) యాదృచ్ఛికంగా త్రిగుణసహితము 'సత్త్వ – రజో – తమో' అగుచున్నది. అకారణమగు బ్రహ్మ శక్తియే సమస్తమునకు కారణమగుచు, కాలాత్మయుక్త రూపమున కూడా వెలయుచున్నది. అట్టి శక్తి నిర్మిత కాలచక్రము రూపంగా ఈ 'జగత్తు' అనే కథాకల్పన యొక్క సృష్టి, స్థితి, లయములను నిర్వర్తించుచున్నది.

**అట్టి కాలచక్రమునకు**

- సత్త్వ రజో తమో త్రిగుణములు,
- పంచభూత – పంచప్రాణ – పంచశరీర ధర్మ మనోరూపములగు షోడశ (16) చక్రములోని తీగలు,
- '56' భేదములతో కూడిన ఆకులు,
- ఆ ఆకులకు '20' కీలకములు, ఆరు అష్టకములు.

ఇవన్నీ ఏర్పడినవై కాలచక్రముతో బాటే పైకీ– క్రిందకీ తిరుగుచూ ఉన్నాయి.

– **"జీవాత్మ వేరు – పరమాత్మ వేరు"** అనే ద్వంద్వముల సంబంధమైన అజ్ఞానము ఆ కాలచక్రమునకు రెండు రంగుల చారల వలె పూయబడి ఉన్నాయి.

ఈ విధంగా **"అకారణమగు బ్రహ్మము (ఆత్మ) ఈ కారణ రూపమగు 'బ్రహ్మచక్రము'నకు ప్రేరక కారణము అగుచున్నది"** అని సత్యాన్వేషకులకు మహర్షులు (మహత్ – ఋత్ దర్శకులు) స్వ–అనుదర్శకులై ఎలుగెత్తి ఋక్కులుగా గానము చేయుచున్నారు.

**షోడశ వికారములు :** పంచ (5) భూతములు, దశ (10) ఇంద్రియములు. అంతఃకారణము (1) = 16.

**ఆరు అష్టకములు :** (6×8) = 1) ప్రకృతి – అష్టకము 2) ధాతు – అష్టకము 3) ఐశ్వర్య అష్టకము (అణిమ, గరిమ, మహిమ, లఘిమ, ఈశత్వ, వశిత్వ, ప్రాకామ్య, ఇచ్ఛా సిద్ధులు). 4) భావ – అష్టకము 5) దేవ – అష్టకము 6) ఆత్మ గుణ (ధర్మ) అష్టకము.

ఇదియే కార్యబ్రహ్మ నదీ చమత్కారము. ఇంకా విను!

# కార్య బ్రహ్మము యొక్క చమత్కారము

**'కార్యబ్రహ్మము' – అనే నది →**

- పంచజ్ఞానేంద్రియములు ప్రవాహముగా కలిగి ఉన్నది.
- పంచభూతములను ఉగ్రమగు వక్ర (వంకర–టింకర) తరంగ గమనములుగా ఏర్పడి ఉంటున్నాయి.
- పంచ ప్రాణములనే (మరియు) పంచకర్మేంద్రియములనే ఊర్మి (మెలిక తరగములు).
- పంచ జ్ఞానముల(బుద్ధుల) మూలస్థానములు.
- పంచేంద్రియ విషయములే ప్రవాహ వేగములు.

1) పంచజ్ఞానేంద్రియములు 2) పంచ కర్మేంద్రియములు, 3) పంచ భూతములు 4) పంచ ప్రజ్ఞలు (దృశ్య – దేహ – మనో – బుద్ధి – అహంకార ప్రజ్ఞలు) 5) పంచ ప్రాణములు 6) పంచ ఉపప్రాణములు 7) పంచ కోశములు (అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములు) 8) పంచేంద్రియ విషయములు (తన్మాత్రలు – శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు) 9) పంచాంగములు (తిథి – తార – నక్షత్ర – యోగ – కరణములు) 10) పంచ యజ్ఞములు (బ్రహ్మయజ్ఞము, పితృయజ్ఞము, దేవ యజ్ఞము, భూత యజ్ఞము, మనుష్య యజ్ఞము).

ఇవి మొత్తం "10×5=50"

ఈ విధంగా పంచదశ భేదములు ఈ 'జగత్తు' అనే 'నది' కలిగి ఉన్నది.

- పంచక్లేశములు దీని మధ్య భాగము.

ఓ నారదా ! అట్టి సర్వ జీవులు, వారి స్వభావములు గల ఈ 'జగత్తు' అనే నదిని మేము ఎల్లప్పుడు ఉపాసిస్తున్నాము.

అట్టి "బృహంతే తస్మిన్ హంసో భ్రామ్యతే బ్రహ్మ చక్రే" – భ్రమింపజేస్తూ జ (జనించు) గత (గతించు) జగత్తు జీవునికి భ్రమింపజేస్తూ ఆత్మ దృష్టిని ఏమరపింపజేస్తోంది. "నేను వేరు– ఈశ్వరుడు వేరు" అను ప్రేరణత్వము ఆశ్రయించిన ఈ జీవుడు – సర్వమునకు జీవరూపము, సర్వమునకు  జనన – జీవన – లయస్థానము అగు బ్రహ్మమును గమనించటము లేదు.

విశాలమగు బ్రహ్మ చక్రమునందే ఈ జీవుడు తిరుగాడటం జరుగుచూ ఉన్నది. జనన – మరణ చక్రములో పరిభ్రమిస్తూ ఒక దేహము తరువాత మరొక దేహమునకు ప్రయాణాలు చేస్తూ ఉండటము జరుగుతోంది.

## "ముక్తి"

**అందుకు ఉపాయము :** అట్టి ఈ జీవుడు సర్వాత్మకమగు "చిదానంద పరబ్రహ్మము" తో 'మమైకము' సిద్ధించుకుంటూ, "నేనే బ్రహ్మమును । అహం బ్రహ్మస్మి" అని తెలుసుకోగానే – శరీర – ఇంద్రియ రూపమగు సంసార పంజరమును భేదించి, బ్రహ్మమే తానై "ముక్తుడు" (Relieved) అగుచున్నాడు. దేహములు, కాలములు మొదలైనవన్నీ 'ఉపకరణ మాత్రములు' అగుచున్నాయి.

అట్టి స్వస్వరూపమగు పరమాత్మయందే "1) భోక్త (The Experiencer) 2) భోగ్యము (భోగించబడునది All that being experienced), 3) భోగము (ప్రేరణ) అనే మూడు ఆత్మకు అనన్యమై ప్రతిష్ఠించబడుచున్నాయి" అని దర్శించువాడు అగుచున్నాడు.

చంచలమగు 'జగత్తు' లేక 'ప్రపంచము' అని పిలువబడుచున్న – ఈ సమస్తమునకు (తరంగములు జలమునందువలె) బ్రహ్మమే సుస్థిరమగు స్థానము అయి ఉన్నది.

- ఈ జగత్తు భావనచే కల్పితము కాబట్టి (ఒక కల్పిత కథలోని సంఘటనలవలె) మిథ్య । క్షరము!
- బ్రహ్మమే సత్యము, **అక్షరము!**

**బ్రహ్మజ్ఞానులు :** (అన్నమయ, మనోమయ, ప్రాణమయ, విజ్ఞానమయ, ఆనందమయ) – **పంచకోశ వికారములతో కూడిన ఈ శరీరములోనే, సర్వశేష్యమగు 'ఆత్మ' ను తెలుసుకొని – విదిత్వాలీనా బ్రహ్మణిపరే తత్పరాయణా** – అట్టి పరబ్రహ్మము యొక్క సర్వత్రా దర్శనమునందు పరాయణులై, అట్టి బ్రహ్మము నందు లీనము అగుచున్నారు.

'మూల ప్రకృతి' నుండి (లేక) 'బ్రహ్మ చక్రము' నుండి సదా విముక్తులై ఆత్మధ్యాన – ఆత్మ భావనా పరాయణులై అఖండాత్మత్వమును స్వస్వరూపమగా పుణికిపుచ్చుకొనుచున్నారు.

## జీవ – ఈశ్వర – తత్త్వము / జీవేశ్వర న్యాయము

**శ్రీ నారద మహర్షి :** పితృదేవా ! సద్గురువరేణ్యా! ఈ జీవుడు ఎవడు ? ఈశ్వరుడు ఎవడు ? ఈ జగత్తు ఎట్టిది ? జీవ – ఈశ్వర సంబంధ – బాంధవ్యములు ఎట్టివి ? అనుగ్రహించి వివరించండి.

**శ్రీ బ్రహ్మ భగవానుడు :** ఇక్కడ (1) క్షరము (నశించు ధర్మమము గలది) 2) అక్షరము (నశించు ధర్మమే లేనట్టిది) – అగు రెండు విశేష తత్త్వములు ఒకదానితో మరొకటి సంయుక్తమై, కలసి పోయినుట్ల కనిపిస్తున్నాయి.

1) జగత్తు : వికార సహితము. నశించు ధర్మము గలది.

2) బ్రహ్మము : వికార రహితము. నశించు ధర్మమే లేనట్టిది.

అట్టి క్షర – అక్షరములు కలిసియున్న ఈ జగత్తును

= అస్వతంత్రుడగు 'జీవుడు' (Individual Self)

= స్వతంత్రుడడు 'ఈశ్వరుడు' (Universal Self) ఈ విశ్వమంతా తన ఐశ్వర్యముగా కలిగి ఉన్నవాడు.

ఈ ఇద్దరు ఏకమై భరించుచున్నారు.

**"నేనే దీనికి కర్తను"** అను కర్తృత్వము, నేనే దీనిని 'అనుభవించువాడను' అనే భోక్తృత్వముల కారణంగా ఈ జీవుడు బంధించబడుచున్నాడు. ఎప్పుడైతే ఈ జీవుడు **"నేను ఉపాధి రహితమగు (నిరుపాధికమగు) ఆత్మనే"** అని తనను గురించి గ్రహిస్తాడో – ఇక అట్టి పరమాత్మత్వ భావన చేత సమస్త పాశముల నుండి విడివడి ఈశ్వరత్వముచే "స్వతంత్రుడు" (Free of everything else) అగుచున్నాడు.

**శ్లో॥ జ్ఞ – అజ్ఞౌ ద్వాః అవజౌ ఈశ అనీశ అవజాహి ఏకా భోక్తృ భోగార్థయుక్తా ।**

**ఈశ్వరుడు సర్వజ్ఞుడు :** దేహిగా – దేహమునకు సంబంధించి (దేహము రాకముందటి – ఇప్పటి – దేహానంతర) భూత – వర్తమాన – భవిష్యత్ స్థితిగతులను ఎరిగినవాడు. భోక్తృత్వమును భోగించువాడు.

**జీవుడో – కించిజ్ఞుడు :** వర్తమాన దేహ సంబంధమైన విశేషాలచే పరిమితిడు. ఈశ్వరునికి భోగ్యవస్తువు అయినట్టివాడు. అయితే, జగద్విషయములకు భోక్త.

అయితే ఈ 1) ఈశ్వరుడు 2) జీవుడు 3) జగత్తు – ఈ మూడింటికి కూడా కర్త ఎవరు? విశ్వరూపుడు అనంతుడు అగు 'పరమాత్మ'యే! అనగా, అట్టి బ్రహ్మము యొక్క వినోదము కొరకే ఈ జీవ – ఈశ్వర – జగత్తులు కల్పనా రూపముగా ఏర్పడినవి అగుచున్నాయి. అట్టి జీవ – ఈశ్వర – జగత్తుల కల్పనయే 'మాయ' అనబడుతోంది. జీవ–ఈశ్వరులను కల్పించుచున్న మాయ పరమాత్మ యొక్క సన్నిధానమునందే ఉనికి కలిగి ఉన్నది. అట్టి మాయ అనిర్వచనీయము. ఎందుకంటే 'మాయ ఎందుకు రూపుదిద్దుకొంటోంది ?" అన్నదానికి కారణము లేదు కాబట్టి (యా, మా– మొదలే లేనిది). అనగా జీవ–ఈశ్వరులు ఇరువురు

- **ఆత్మకు "అనన్యము"**
- **మాయచే "ఆకారణులు"**

ఏకైక పరమాత్మయే క్షర - అక్షరములగు జీవ, ఈశ్వర రూపములు దాల్చుచున్నాడు. ఎవ్వరైతే - **జీవ, ఈశ్వర, మాయ** అనబడే మూడు కూడా బ్రహ్మస్వరూపమే - అని తెలుసుకుంటాడో, అట్టివాడు 'విశ్వరూపుడు' అగుచున్నాడు. ఈ విశ్వమంతా తనయొక్క రూపముగా దర్శిస్తున్నాడు. తాను సమస్తమునకు ద్రష్టగా కేవలత్వము ఆస్వాదిస్తూ ఉంటున్నాడు.

- మాయ క్షరము. ఒకప్పుడు ఉండి, మరొకప్పుడు ఉండదు.
- అవిద్య మొదలైనవి నశించగా, అనుభవమగు స్వస్వరూపమునకు అన్యము కానట్టి పరమేశ్వరుడు.

**అక్షరుడు :** దేహముల రాక - పోకలకు, జగత్తుకు సంబంధించిన మార్పు - చేర్పులకు సంబంధించనివాడు.

**అద్వితీయుడు :** తానే జీవ –ఈశ్వర –జగత్తులుగా ప్రదర్శనమగుచున్నవాడు. కాబట్టి, తనకు ద్వితీయమైనది ఏదీ లేనివాడు.

**స్వయం ప్రకాశకుడు :** జీవ - ఈశ్వర - జగత్తులు పరమాత్మ యొక్క ప్రకాశములే అయి ఉండి, తాను మాత్రము మరొక దేనిచేతను ప్రకాశింపజేయువాడు కాదు. (అగ్ని - సూర్యుల వలె) స్వయం ప్రకాశకుడు.

**సర్వ నియామకుడు :** జీవ - ఈశ్వర - మాయలను, కాల చమత్కారమును నియమించువాడు.

## పరమాత్మ ధ్యానము

ఈ జీవుని పట్ల మాయ ఎట్లా ప్రవృత్తమును విరమించి, నివృత్తము అవగలదు ? వినండి.

'అక్షరుడు, అద్వితీయుడు, స్వయం ప్రకాశకుడు, సర్వనియామకుడు" అగు పరమాత్మ యొక్క విశేషములను ఎరుగుచు, పరమాత్మను ధ్యానించువాడు ఈ విశ్వమాయ నుండి నివృత్తుడు కాగలడు.

**"అట్టి పరమాత్మయే నేను"** అను "సోఽహం పరమార్థము"ను తెలుసుకొన్నప్పుడు సమస్త సంసారపాశములు తెగిపోగలవు. అట్టివాడు"దృశ్య - దేహ - ఇంద్రియ –జీవ - ఈశ్వర" పంచ అవిద్యలను తొలగించుకొని పంచక్లేశముల నుండి ఈవల పడగలడు. అట్టివాని పట్ల జనన–మరణములు "మొదలే లేనివి" అగుచున్నాయి.

పరమాత్మ ధ్యానముచే జీవాత్మ - మాయలను అధిగమించి, ఈశ్వర తత్త్వములను తెలుసుకొని, "కేవల స్వరూపుడు" అయి, విశ్వమంతా తన ఐశ్వర్యముగా కలవాడై, ఆత్మకాముడై, **అమృతత్త్వమును స్వాభావికము చేసుకొనుచున్నాడు.** అట్టి నిత్యము, అంతరమున సర్వదా ఆత్మగా వేంచేసియున్నట్టిది అగు పరమాత్మయే అసలైన తెలుసుకోవలసి ఉన్నట్టిది. ఇక అంతకుమించి తెలుసుకొనవలసినదేదీ ఇక్కడ కించిత్ కూడా లేదు.

ఇక్కడ భోక్త (The Experiencer), భోక్తము (That being Experienced), బోధితత్వము / ప్రేరేపణ (The Act of Experiencing) ఈ మూడూ కూడా మూడు రకాలుగా కనబడుచూ ఉన్నప్పటికీ, అవన్నీ కూడా ఏకమగు బ్రహ్మమే అయి ఉన్నాయి - అని ఎరుగబడుగాక. ఆ బ్రహ్మము యొక్క ఉపనిషదమే (సామీప్యమే) ఆత్మ విద్యకు (ఆత్మ గురించిన అధ్యయనమునకు, జ్ఞానమునకు), అందుకు చేసే తపన రూపమగు తపస్సుకు కూడా మూలము, లక్ష్యము.

ఓ నారదా ! ఓ బిడ్డలారా ! ఈ విధంగా ఎవ్వరైతే ఆత్మగురించి తెలుసుకొన్నవారై, "జన్మ - కర్మలకు ఆవలిదగు స్వస్వరూపమే అయి ఉన్నాను" అని అనుచింతన (Memorising all times, always and under all circumstances) చేస్తూ ఉంటారో.

**తస్య కో మోహః ? కో శోకః ? ఏకత్వమ్ అనుపశ్యతః ।** అట్టి వానికి, సత్యమును ఏమర్చనప్పుడు ఏర్పడే "మోహము' ఇక ఏముంటుంది ? శోకము (Worry and Lament) ఏమి మిగులుతుంది ? అట్టివాడు సర్వదా సర్వత్రా ఏకత్వమును సాక్షాత్కరించుకొన్నవాడై ఉంటాడు. నేనే సర్వాత్మకుడను. ఈ సమస్తము నా యందే (దర్పణంలో ప్రతిబింబములాగా) ఏర్పడి ఉన్నది" - అని గ్రహిస్తాడు.

ఓ నారదా ! భూత - వర్తమాన - భవిష్యతులలో కనిపించేదంతా నశించబోయేదే సుమా । అయితే విరాట్ విశ్వముగా కనిపించేదంతా అవినాశి అగు ఆత్మ యొక్క తత్త్వమే! నీవు ఆత్మవే అయి ఉన్నావు. ఇక భయమెందుకు ? శోకమెందుకు ?

**శ్రీ నారద మహర్షి :** అట్టి మహత్తరుడైనట్టి పరమాత్మ యొక్క సర్వాంతర్యామి – సర్వతత్త్వ స్వరూప వైభవమును ఈ జీవుడు తన స్వస్వరూపమును గాంచలేకపోతున్నాడు. మరి అతడు తన ఆత్మ యొక్క మహిమను దర్శించేది ఎట్లా ?

**శ్రీ బ్రహ్మ భగవానుడు :** ఎవ్వడు ఆ పరమాత్మ గురించి వెతుకుచున్నాడో, అధ్యయనము చేస్తున్నాడో, తపోధ్యాన యోగాభ్యాసములు నిర్వర్తిస్తున్నాడో, – అట్టి ఆ సాధకుని స్వస్వరూపముగానే పరమాత్మ వేంచేసియే ఉన్నారు. సర్వదా సిద్ధించిన దాని కొరకై సాధన ఎందుకు ? వెతుకులాట ఎందుకు? దేనికి ? ఇక ఆయన ఎందుకు స్వానుభవము కావటము లోదో చెప్పుతాను విను. ఆత్మ ఎటువంటిదంటే ..

- అట్టి (స్వస్వరూప) ఆత్మ భగవానుని రూపము అణువుకంటే కూడా అణువు అయినట్టిది (Subtler than the subtle) - **అణోః అణీయాన్ ।**
- సమస్త మహత్తర వస్తువుల కంటే కూడా మహనీయమైనట్టిది (Bigger than the biggest. Broader than the broadest) **మహతో మహీయాన్।**

ఈ విధంగా అణువుకంటే అణువై, మహత్తరముకంటే మహత్తరమై ఆత్మ ప్రతి ఒక్క జీవుని హృదయములోనే (ఆతనికి అనన్యమై) అతని బుద్ధి గుహలోనే దాగి ఉన్నది. బాహ్యమున ఎక్కడో కాదు. ఏదో లోకములో కానే కాదు. **ఆత్మా అస్య జంతోః నిహితో గుహాయామ్।**

అయితే,–

**తమ హృదయములోనే దాగి ఉన్న అట్టి ఆత్మభగవానుని మహిమ ఎట్టిదో ఎవ్వరు చూడగలరు ?**

**మం॥ శ్లో॥ తమ్ అక్రతుః పశ్యతి వీతశోకో,**
**ధాతుః ప్రసాదాన్ మహిమానమ్ ఈశమ్ ॥**

ఎవ్వడైతే జగత్తుకు సంబంధించిన సమస్త కార్య వ్యవహారాలను అధిగమించి ధాతుడై (శోధన చేయువాడై) ఉంటాడో, జగత్తుకు సంబంధించి సమస్త దిగుళ్లను, శోకములను వదిలివేస్తాడో అట్టివాడు తన నిర్మలమగు హృదయంలోనే ఆ "సర్వాత్మకుడు, సర్వకర్త, సర్వాంతర్యామి" – అగు ఈశ్వరుని మహిమను దర్శించగలడు. (He can enjoy his own all pervading SELF of himself here and now with the purity of his own common sense).

**అట్టి (ఈ జీవుని స్వస్వరూపుడే అయినట్టి) ఆత్మ భగవానుని 'ఈశ్వర మహిమ' గురించి విను.**

**అపాణిపాదో – జవనోగ్రహీతా :** ఆ ఆత్మ భగవానుడు పాణి – పాద (చేతులు – కాళ్ళు) రహితులే అయి ఉండి కూడా, (స్వప్నద్రష్ట – బయటనే ఉండి – స్వప్నములో సంచారములు చేస్తున్నట్లుగా) – సర్వత్రా సంచారములు స్వీకరిస్తున్నారు.

**పశ్యతి అచక్షుః :** కళ్లు లేకపోయినప్పటికీ సర్వత్రా చూచుచునే ఉంటున్నారు.

**స శృణోతి అకర్ణః :** చెవులు లేకపోయినప్పటికీ సమస్తము వినుచూనే ఉంటున్నారు.

**న వేత్తి వేద్యం :** తెలుసుకొనే ధర్మము లేకపోయినప్పటికీ సమస్తము తెలుసుకొంటూనే ఉన్నారు.

**న తస్య అస్తి వేత్తా :** ఆ పరమపురుషుని ఎరుగుచున్న వారు ఎవ్వరూ లేరు. ఎందుకంటే, ఆ తెలుసుకొంటున్నవాడు పరమాత్మయే, ఆత్మయే కాబట్టి!

**తమాహుః అగ్ర్యం పురుషం మహాంతమ్ ।**

ఆయనయే మహాంతమగు అగ్ర పురుషుడుగా నీలోను, నాలోను వేంచేసి ఉన్నారు. ఆయనయే శ్రేష్ఠాతిశ్రేష్ఠ – శ్రేష్ఠ పురుషుడు. ఈ సమస్తము ఆయన యొక్క (లేక) మహాంత – పురుషుడవగు నీ యొక్క పురుషకారమే.

అట్టి సర్వాత్మకుడగు ఈశ్వరుని మహిమ గురించి ఇంకా విను!

**అశరీరం శరీరేషు అనవస్థేషు అవస్థితమ్ ।** ఆయనకు 'ఇది శరీరము' అనునదేదీ లేదు. శరీరములలో పరిమిత నివాసము కలవాడు కాదు. కానీ, సమస్త శరీరములలో ఆయనయే అవస్థితుడై ఉన్నారు.

**ఎవ్వడైతే అట్టి మహాంతుడు (సమస్త మహత్తులకు, మహత్తరమైన వాటన్నిటికీ) ఆవలివాడో, సమస్తము పరిపాలిస్తున్న విభువో, – అట్టి ఆత్మను తెలుసుకొన్న ధీరుడు మరింక దేనికీ ఎన్నడూ శోకము పొందడు.**

**ఆత్మ యొక్క ఈశ్వర ఐశ్వర్యం ఇంకా విను!**

**సర్వస్యధాతారం । అచింత్యశక్తిం । సర్వాగమ అంత అర్థ విశేష వేద్యమ్ । సర్వావసానే సకృత్ వేదితవ్యమ్ । కవిం । పురాణం । పురుషోత్తమోత్తమమ్ ।**

సమస్తమునకు ధాత (ధరించువాడు). మనస్సుకు అందని శక్తి గలవాడు. వేదాంతము (వేదముల చివరగా) ఏర్పడిన ఉపనిషత్ విశేషములచే తెలియబడగలవాడు. సమస్తము లయించిన తరువాత ఏర్పడి వుండి – అందరము తెలుసుకొని ఉండవలసినవాడు. సమస్తము కంటే శ్రేష్ఠుడు (కవి)। ఈ సమస్తము యొక్క కవీశ్వరుడు. సమస్తమునకు మునుముందే ఉండి ఉండటం చేత పురాణ పురుషుడు. ఈ సమస్తము ఆయన యొక్క పురషకారమే కాబట్టి పురాణ పురుషుడు. ప్రతి ఒక్క జీవునిలోను "నేను" (1st Person) రూపమున వేంచేసి ఉండటం చేత ఉత్తమ పురుష, పురుషోత్తముడు. జీవులలోని పరాకాష్ఠ వస్తువు – కాబట్టి పురుషోత్తమోత్తమము అయినవారు.

**సర్వేశ్వరం । సర్వదేవైః ఉపాస్యమ్ । అనాదిమధ్యాంతం । అనంతం । అవ్యయం । శివాచ్యుతాంభోరుహమ్। స్వేన ఆవృతం సర్వమిదం ప్రపంచం ।**

సమస్తముగా తానే విస్తరించి ఉండటం చేత **సర్వేశ్వరుడు.** సర్వదేవతా రూపములు 'తానే' అయినవాడు. ఆది – మధ్య – అంతము (మొదలు – మధ్య – చివర) లేనివాడు. అంతము (End of it) లేనివాడు. తరుగుదల లేనట్టి 'అన్యయుడు'. జీవాత్మమునకు ఆవల సర్వాత్మకుడగు స్వరూపుడు. శివ – అచ్యుత – బ్రహ్మలుగా రూపు దాల్చినవాడు. సృష్టి – స్థితి – లయములు తన యొక్క లీలగా ఒకప్పుడు కలిగియుండి, మరొకప్పుడు (తరంగములు జలములోవలె) తిరిగి లయము చేసుకొనువాడు. ఈ సమస్త ప్రపంచమును తనవైపు ఆవృతము (ఆకర్షణము) చేయువాడు. 'తనవైపుగా లాగటము' అనే ఆహరణము నిర్వర్తించువాడు.

**పంచాత్మకం । పంచమవర్తమానం । పంచీకృత అనంత భవ ప్రపంచం । పంచీకృత స్వ – అవయవైః అసంవృతమ్ । పరాత్పరమ్ యత్ । మహతో మహంతం । స్వరూప తేజోమయ శాశ్వతం శివమ్ ।**

దృశ్య – దేహ – మనో – బుద్ధి – చిత్తములకు ఆత్మేశ్వరుడు. (అన్నమయ – ప్రాణమయ – మనోమయ – విజ్ఞానమయ – ఆనందమయ కోశములు అనబడే) పంచ ఆవరణములు కలిగి వర్తించువాడు. (భూమి – జలము – అగ్ని – వాయువు – ఆకాశము అనబడే) పంచభూతముల కలయికచే అనంతముగా విస్తరించిన విరాట్ బ్రహ్మాండ స్వరూపుడు. ప్రపంచ స్వరూపుడు పంచ భూతములచే అసంవృతము (చుట్టుకొనబడనట్టి) – మనోబుద్ధి చిత్త అహంకార అసంవృత – అవయవుడు.

ఇహమునకు, పరమునకు (Outer Self and Inner Self) లకు ఆవల పరాత్పరుడై (పరమునకే పరమై) వేంచేసి ఉన్నవాడు.

మహత్తుకే (మహత్తరము, సమస్త గొప్పతనములకు) మహత్తు (గొప్పకే గొప్ప) అయి మహతో మహంతుడు. తేజోమయుడు, శాశ్వతుడు, శివానంద స్వరూపుడు.

ఓ నారాదా !అట్టి పరాత్మకుడగు పరమాత్మ అయి త్రిమూర్తులమగు మేము కూడా సర్వదా సేవించువారమై, ఉపాసించువారమై, ఆరాధించువారమై, భక్తితో ప్రణమిల్లు వారమై ఉంటాము.

ఓ సమస్త జీవులారా ! మీరంతా కూడా మీ స్వరూపమే అయి ఉన్న అట్టి ఆత్మ భగవానుని ఎరిగినవారై, అనన్యమగు ఆ ఆత్మ దేవునితో అనన్యత్వము సిద్ధించుకొని ఉండండి. ఇదియే సమస్త సంసార దుఃఖములకు పరమౌషధము. తెంపులేని పరమానంద స్థానము.

**శ్రీ నారద మహర్షి :** అయితే అట్టి అమృతమగు ఆత్మానంద మాధుర్యమును స్వాభావికమును ఈ జీవుడు సిద్ధించుకునేది ఎట్లా ? ప్రజ్ఞతోనా ? ముక్తి పొందేది ఎట్లా ? పునరావృత్తి లేని స్థానము పొందేది ఏ విధంగా ?

**శ్రీ బ్రహ్మ భగవానుడు :** ప్రియపుత్రా ! నారదా ! ప్రియ సమస్త శ్రోతలారా ! అధ్యయనులారా ! మన ఈ 'సత్సంగము'ను ముగించబోతూ కొన్ని విశేషాలు చెప్పుచున్నాను. వినండి.

ఒకడు ప్రజ్ఞతో ఆత్మ గురించి ఎంతగానో వినవచ్చు గాక, పఠించవచ్చు గాక, అధ్యయనము చేయవచ్చు గాక, అయినప్పటికీ కూడా –

> **న అవిరతో దుశ్చరితాన్, న అశాంతో న అసమాహితః**
> **న అశాంత మనసో వా అపి ప్రజ్ఞానేనైవ 'స ఆప్నుయాత్' ।**

- ఇతరులను బాధించటము, అల్పమైన అభిప్రాయములు కొనసాగించటము, మోసగించటము మొదలైన దుశ్చరితముల నుండి (Negative Behaviours) విరమించాలి. అమృతమగు ఆత్మ స్వరూపులుగా దర్శించాలి.
- మనస్సును యోగాభ్యాసములతో ప్రశాంతము, ఆనందమయముగా తీర్చిదిద్దుకోవాలి. అశాంతి (Restlessness, Peacelessness) కొనసాగించరాదు.
- సర్వసమదర్శన రూపమగు ఆత్మ బుద్ధిని పెంపొందించుకోవాలి. భేద దృష్టిని బుద్ధి నుండి తొలగించుకుంటూ సమాహితుడు, సమాధి (సమ–అధి–All Equal) నిష్ఠుడు కావాలి.
- విసుగు, కోపము, ఆవేశము, చిరాకు మొదలైన అశాంత గుణములను మనస్సు నుండి తొలగించుకొని శాంతమనస్కుడై ఉండాలి. అశాంత మనస్సుతో ఉండరాదు.

ఈ విధమైన ప్రయత్నశీలుడు కాకుంటే, ప్రజ్ఞ (తెలివి) కలిగి ఉండి కూడా తన యొక్క ఆత్మ ఔన్నత్యమును గమనించలేడు. ఆత్మ సౌందర్యమును ఆస్వాదించలేడు.

***ఆత్మ ఎట్టిదో మరొక్కసారి అందరికీ ప్రేమాస్పదుడనై గుర్తు చేస్తున్నాను... వినండి.***

అది అంతరంగ ప్రజ్ఞ కాదు (మనో బుద్ధి చిత్త అహంకారములకు సంబంధించిన తెలివి కాదు), బహిః ప్రజ్ఞ (ప్రపంచంలో అనేక విషయాలు తెలిసి ఉండటము) కాదు. ప్రజ్ఞ (తెలివి) రూపము కాదు.

స్థూలము కాదు. అస్థూలము (సూక్ష్మము) కాదు. జ్ఞానము కాదు. అజ్ఞానము కాదు. (జ్ఞాని, అజ్ఞాని కూడా సర్వదా ఆత్మానంద స్వరూపులే). జ్ఞానం జ్ఞాన రూపము కూడా కాదు. ఆత్మ ప్రజ్ఞచే గ్రహించబడగలిగేది కాదు.

బుద్ధికి విషయము కాదు. వ్యావహారికమైనది కాదు. మరి ఆత్మ అనగా ఎట్టిది?

**స్వాంతః స్థితమ్ స్వయమేవ ఏతి ।** ఆత్మ సర్వదా అంతరంగమున తేజో (Enlightening) రూపమై వేంచేసియున్నది. ఈ జీవుడు స్వయముగా ఆత్మ స్వరూపుడే అయి ఉన్నాడు.

**య ఏవం వేద, స ముక్తో భవతి ।** అట్టి స్వస్వరూపమును ఎవడు తెలుసుకొంటాడో, అతడు 'ముక్తుడు' కాగలడు.

**స ముక్తో భవతి । స ముక్తో భవతి ।**

ఈ విధంగా అమృతవాక్కులు కురిపించి భగవానుడు పితామహుడు, వాక్కులను ముగించారు.

----

**శ్రీ నారదమహర్షి :** ఓ సమస్త జనులారా ! ఎవ్వరైతే స్వస్వరూపము తెలుసుకుంటారో అట్టివాడు 'పరివాట్' అని చెప్పబడుచున్నాడు.

**అట్టి పరివ్రాట్ :**

ఏకాకి అయి సంచరిస్తూ ఉంటాడు. హృదయమునందు లోక సంబంధ – బాంధవ్యములేవీ కించిత్ కూడా కలిగి ఉండడు.

"ఈ సంసారము భయమును కల్పించునదే" – అని గమనించి, అద్దానితో 'జింక' లాగా దూరదూరముగా ఉంటాడు. లోక సంచారము వీడడు. **గమన నిరోధం న కరోతి ।**

స్వస్వరూపమునకు 'వేరు' అనిపించే ధ్యాసలు, సంభాషణలు వదలి ఉంటాడు. షట్పదవృత్తి కలిగి, (తుమ్మెదవలె ఎక్కడా నిలువనివారై) ఎల్లప్పుడు సమస్తమునకు ఆవలిదగు తన యొక్క 'స్వరూపము' దర్శిస్తూ 'స్వరూపానందము' ఆస్వాదిస్తూ ఉంటాడు. తుమ్మెద పుష్పముల యొక్క మాధుర్యమే కోరుకొను తీరుగా సర్వత్రా సర్వదా స్వస్వరూముతో అనుసంధానము కలిగి ఉంటాడు.

ఆ విధంగా 'ఆత్మయే ఇదంతా ! నేనే ఇదంతా" అను బుద్ధిని ఎవడు తీర్చిదిద్దుకుంటాడో, అట్టి వాడు ముక్తుడే అవుతాడు. అతడే పరివ్రాట్!

అట్టి పరివ్రాట్!

- సమస్త లోకసంబంధమైన కార్యకలాపముల నుండి విముక్తుడు అయి,
- గురువు, శాస్త్రములు మొదలైనవి కూడా విడచినవాడై
- సమస్త సంసారమును వదలి, మోహమును జయించి వేసి ఆత్మతో మమైకము సిద్ధించుకొని ప్రశాంతముగా, ప్రమోదముతో కూడి ఈ భూమిపై చరిస్తూ ఉంటాడు.

**దృష్టాంతంగా :** ధనహీనుడు సుఖపడలేడు, ధనవంతుడే సుఖముగా ఉండగలడు. **జ్ఞాన ధనుడు మాత్రమే సంసారము కల్పించే దుఃఖములను జయించి సుఖపడగలడు.**

- జ్ఞాన – అజ్ఞాన ఉభయములకు అతీతుడై
- సుఖ దుఃఖములను దాటవేసి

**జ్యోతిః ప్రకాశః సర్వ వేద్యః సర్వజ్ఞః సర్వసిద్ధిదః**
**సర్వేశ్వరః "సోఽహమ్" – ఇతి**
**తద్విష్ణోః పరమం పదం యత్ర గత్వా న నివర్తంతే ॥**

స్వయం జ్యోతి ప్రకాశము, (దేహము యొక్క భూత – వర్తమైన – భవిషత్ రూపమగు) సమస్తము ఎరిగినట్టిది, సర్వతత్త్వముల ఎరుక గలిగినది, జాగ్రత్ – స్వప్న – సుషుప్తులను తన కొరకై తానే సిద్ధింపజేసుకొనునది, సమస్తమును పాలించు ఈశ్వర తత్త్వము అగు "ఆత్మ" అనగా – **"నేనే"**

ఈ విధంగా అట్టి విష్ణు పరమపదమును ఎవరు చేరుతారో వారు తిరిగి జన్మ–కర్మ పరిధులలోనికి తిరిగి రారు.

అక్కడ ఈ సూర్య – చంద్రులు ప్రకాశించరు. ఆత్మ చైతన్యమే సూర్యచంద్రులను ప్రకాశింపజేయునది. వారికి పునరావర్త దోషము ఉండదు. **న పునరావర్తతే । న పునరావర్తతే।**

**ఇతి నవమోపదేశము**

## "నారద పరివ్రాజకోపనిషత్ సమాప్తమ్"